బమ్మెర పోతనామాత్య ప్రణీత

# శ్రీమహాభాగవతము

సరళ వ్యాఖ్యానసహితం

## రెండవ సంపుటము

3వ స్కంధము


వ్యాఖ్యాతలు

డా॥ కడిమిళ్ళ వరప్రసాద్

డా॥ కసిరెడ్డి వెంకటపతి రెడ్డి

డా॥ గల్లా చలపతి

ప్రధాన సంపాదకులు

విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు






తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

2017

**Bammera Potanamatya Praneeta**
**SRI MAHABHAGAVATAMU, with Commentary**
**Volume - II (Skandha - 3)**

*Author :* **Potana Mahakavi**

*Commentary by*
**Dr. Kadimilla Varaprasad**
**Dr. Kasireddy Venkatapathi Reddy**
**Dr. Galla Chalapathi**

*Edited by*
**Vidwan Mudivarthi Kondamacharyulu**



T.T.D. Religious Publications Series No. 1238

*First Edition :* 2017

*Copies :* 3000

*Published by*
**Dr. D. Sambasiva Rao, I.A.S.,**
Executive Officer
Tirumala Tirupati Devasthanams
Tirupati.

*D.T.P.*
Publications Division
T.T.D., Tirupati.

*Printed at*
Tirumala Tirupati Devasthanams Press
Tirupati - 517 507

# ముందుమాట

**భా**రతీయ సనాతన వాఙ్మయంలో అద్భుతమైన ఆధ్యాత్మిక గ్రంథాలు చాలా ఉన్నాయి. అందులో అమూల్యమైన రత్నాల్లాగా శ్రీమద్రామాయణ, శ్రీ మహాభారత, శ్రీమద్భాగవత గ్రంథాలు సంస్కృత వాఙ్మయ ప్రపంచంలో ప్రకాశిస్తున్నాయి.

వాటిల్లో శ్రీమద్రామాయణ మహాకావ్యం ఆదికవి వాల్మీకి మహర్షి ప్రణీతం. కాగా ఇక మిగిలిన భారత భాగవత గ్రంథాలు రెండూ కృష్ణద్వైపాయనుడైన శ్రీవ్యాసమహర్షి రచించినవి.

తి.తి.దేవస్థానం ధార్మిక సాహిత్య ప్రచురణలో భాగంగా ఇప్పటికే సంస్కృత శ్రీమద్రామాయణ కావ్యాన్నీ, తెలుగు కవిత్రయ మహాభారత కావ్యాన్నీ సవ్యాఖ్యానంగా ప్రచురించింది.

అదే వరుసలో పోతన మహాకవి తెలుగులో రచించిన భాగవతాన్ని కూడా తెలుగువారికి అందించాలన్న సదాశయంతో ప్రముఖ పండితులు డా॥ కరుణశ్రీ గారి ప్రధాన సంపాదకత్వంలో సరళమైన తాత్పర్యంతో పోతన భాగవతగ్రంథాన్ని ఐదుసంపుటాలుగా దేవస్థానం అందించింది. ఈ గ్రంథం పాఠకుల విశేషాదరణకు పాత్రమై పలు ముద్రణలను పొందింది.

ఆ తర్వాత కొందరు పండితుల సలహామేరకు, పాఠకుల అభ్యర్థనలమేరకు, 'కవిత్రయ భారతం' మాదిరిగానే పోతన మహాకవి భాగవతాన్ని కూడా అందరికీ సులభంగా అర్థం అయ్యేట్లు సరళమైనశైలిలో వ్యాఖ్యానాన్ని అందించాలనే లక్ష్యంతో దేవస్థానం ఆ కార్యక్రమాన్ని చేపట్టింది.

ప్రస్తుతం బమ్మెర పోతనగారి భాగవత గ్రంథం, ముప్పైమూడు మంది పండితులు సరళవ్యాఖ్యానాన్ని అందించగా ప్రముఖ సాహితీవేత్తలు విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు గారి ప్రధానసంపాదకత్వంలో తయారయ్యింది. ఈ వ్యాఖ్యానగ్రంథం తయారీలో కృషిచేసిన దేవస్థానం ప్రచురణల విభాగం అధికారి మరియు పోతన భాగవత వ్యాఖ్యాన పర్యవేక్షకులు, సమన్వయకర్త డా॥ సముద్రాల లక్ష్మణయ్య గారికీ, వారి సహాయకులు, ఉపసంపాదకులు డా॥ నొస్సం నరసింహాచార్య గారికీ, ఈ పోతన భాగవత వ్యాఖ్యానగ్రంథ ప్రధాన సంపాదకులు విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు గారికీ, వ్యాఖ్యాతలకూ, సంపాదకమండలి సభ్యులకూ, సహాయసహకారాలందించినవారికీ, కన్సల్టెంట్లందరికీ, ఈ గ్రంథాన్ని చక్కగా ముద్రింపజేసిన తి.తి.దేవస్థానం ప్రెస్సు వారందరికీ ప్రత్యేకంగా అభినందనలు తెలియజేస్తున్నాను. పోతన పద్యాలకు వ్యాఖ్యానాలనదగిన చక్కనైన బాపుగారి రేఖాచిత్రాలను ఈ గ్రంథ సంపుటాల్లో అక్కడక్కడా పొందుపరుచుటకు అనుమతించిన శ్రీ బాపుగారి కుటుంబ సభ్యులకు ప్రత్యేకంగా ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

ఈ సరళవ్యాఖ్యాన గ్రంథం ఎనిమిది సంపుటాలుగా, ఆ యా పుటల్లో అక్కడక్కడ ప్రముఖ చిత్రకారులు బాపుగారి బొమ్మల మెరుపులతో సర్వాంగసుందరంగా, శ్రీ హేమలంబి నామసంవత్సరం తెలుగు ఉగాదినాడు తెలుగువారందరికి శ్రీ తిరుమలేశుడు అనుగ్రహిస్తున్న ప్రసాదంగా స్వీకరించగలరని ఆకాంక్షిస్తూ...

*సదా శ్రీవారి సేవలో...*

**కార్యనిర్వహణాధికారి**

తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి

శ్రీరస్తు

# బమ్మెర పోతనామాత్య ప్రణీత శ్రీమహాభాగవత ప్రాజెక్టు పుట్టుపూర్వోత్తరాలు

**వేదకల్పవృక్షవిగళితమై శుక**
**ముఖసుధాద్రవమున మొనసియున్న,**
**భాగవతపురాణఫలరసాస్వాదన**
**పదవి గనుడు రసికభావవిదులు.**

అని భాగవత రచనకు ఉపక్రమించిన సహజకవి పోతనామాత్యుడు భాగవతప్రాశస్త్యాన్ని ఉగ్గడించాడు.

వాల్మీకి విరచితమైన ఆదికావ్యం రామాయణం. "వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా" అన్నట్లు వేదానికి మారురూపంగా అది ప్రసిద్ధి పొందింది. వ్యాసవిరచితమహాభారతాన్ని పంచమవేదంగా (భారతం పంచమో వేదః) భావిస్తారు. సనాతనధర్మానికి అనల్పమైన వ్యాప్తిని గావించిన ఈ మూడుగ్రంథాలు భారతీయ సాహిత్యంలో సాటిలేని మేటిరచనలుగా ప్రసిద్ధి పొందాయి.

తిరుమల తిరుపతి దేవస్థానం హిందూ ధర్మ ప్రచారంకోసం ఆధ్యాత్మికగ్రంథాలను పెద్ద ఎత్తున ప్రచురిస్తోంది. దేశంలో మరే ఇతరదేవస్థానం కూడా ధర్మప్రచారంకోసం గ్రంథముద్రణను ఇంత పెద్ద ఎత్తున చెయ్యడం లేదని చెప్పడం అతిశయోక్తి కాదు. వేదార్థాలను ప్రతిపాదించే వాఙ్మయాన్ని వివిధ భాషల్లో ప్రచురించి ప్రచారం చేయడం తిరుమల తిరుపతి దేవస్థానం తన బాధ్యతగా స్వీకరించింది. అనేకభాషల్లో దేవస్థానం ద్వారా వెలువడుతున్న ధార్మికగ్రంథాలలో రామాయణ, భారత, భాగవతాలు మిక్కిలి ప్రధానమైనవని ప్రత్యేకించి చెప్పనవసరం లేదు.

1982లో జరిగిన భక్తకవి పోతన పంచశతాబ్ది జయంతి ఉత్సవాలలో పోతన భాగవతాన్ని తాత్పర్యంతో ముద్రించాలని దేవస్థానం సంకల్పించింది. **కరుణశ్రీ జంధ్యాలపాపయ్యశాస్త్రి** గారి నేతృత్వంలో 15 మంది పండితులు పోతనభాగవతానికి తాత్పర్యాన్ని సమకూర్చారు. తొలిసారిగా 1987లో తాత్పర్యసహిత పోతన భాగవతాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం పాఠకలోకానికి అందించింది.

కవిత్రయవిరచితమహాభారతానికి ప్రసిద్ధపండితులచేత ప్రతిపదార్థతాత్పర్యవిశేషవివరణలు వ్రాయించి ప్రచురించాలన్న సంకల్పం 1983లో తిరుమల తిరుపతి దేవస్థానానికి కలిగింది. ముప్పైమంది పండితులు ఈ పద్ధతిలో భారతానికి వ్యాఖ్యానం రచించారు. 2005వ సంవత్సరంలో మహాభారతం సంపూర్ణంగా సవ్యాఖ్యానంగా వెలువడింది.

ప్రతిపదార్థ, తాత్పర్య, విశేషవ్యాఖ్యానాలతో కవిత్రయభారతం, తాత్పర్యసహితభాగవతం తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణలలో అగ్రశ్రేణికి చెందినవిగా రూపొంది అతివిస్తృతమైన ప్రజాదరణకు పాత్రమైనాయి. వేలకొలది ప్రతులు భక్తులకు, పాఠకులకు అందుతున్నాయి.

1981లో డా॥ పన్నాల రాధాకృష్ణశర్మగారి నేతృత్వంలో వ్యాసవిరచితసంస్కృతభాగవతాన్ని ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత సిద్ధాంతాలను సమన్వయించే మూడువ్యాఖ్యానాలతో పరిష్కరించి ప్రచురించాలని దేవస్థానం నిర్ణయించింది. ఆ నిర్ణయం మేరకు భాగవతం ప్రాజెక్టు ఏర్పాటైంది. **డా॥ రాధాకృష్ణశర్మ, డా॥ ఎన్.సి.వి.నరసింహాచార్యులు, శ్రీ మల్లంపల్లి శరభేశ్వరశర్మ, డా॥ సముద్రాల లక్ష్మణయ్య** గార్ల నేతృత్వంలో శ్రీధరీయం (అద్వైతం), వీరరాఘవీయం (విశిష్టాద్వైతం), విజయధ్వజీయం (ద్వైతం) అన్న మూడువ్యాఖ్యానాలతో సమగ్రంగా 14 బృహత్ సంపుటాలుగా 2006 నాటికి భాగవతం సిద్ధమయింది.

ఈ పరిష్కరణ కార్యక్రమం ముగియగానే పురాణ ఇతిహాస ప్రాజెక్టు ప్రత్యేకాధికారి **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** నాటి తితిదే శ్రీకార్యనిర్వహణాధికారి **శ్రీ ఎ.పి.వి.ఎన్. శర్మ** ఐ.ఏ.ఎస్., గారి వద్దకు వెళ్ళి వ్యాసభాగవత పరిష్కరణ పూర్తి అయిందని విన్నవించారు. అప్పుడు కార్యనిర్వహణాధికారిగారు ఎంతో సంతోషించి "పోతన భాగవతాన్ని తాత్పర్యంతో మాత్రమే ముద్రించగలిగాం. తెలుగు ప్రజలందరికీ ఎంతో ప్రియమైన భాగవతాన్ని కూడా అర్థ తాత్పర్య వివరణలతో సిద్ధం చేస్తే బాగుంటుంది. ఇందుకు తగిన ప్రతిపాదనలను సిద్ధం చెయ్యండి" అని నిర్దేశించారు.

ఈ బృహత్కార్యక్రమం భాగవతప్రాజెక్టుద్వారా కాకుండా కవిత్రయ మహాభారతానికి వ్యాఖ్యానం సమకూర్చడంలో అనుభవం గడించిన సప్తగిరి సంపాదక కార్యాలయం ద్వారానే నిర్వహించడం సముచితంగా ఉంటుందని తెలుపుతూ **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** వ్యాఖ్యాన రచనకు అవసరమైన ప్రతిపాదనలను సిద్ధం చేసి కార్యనిర్వహణాధికారివారికి పంపగా వారు ఆమోదించారు.

**డా॥ సముద్రాల లక్ష్మణయ్యగారి ప్రతిపాదనలో సారాంశం**

- వ్యాఖ్య సామాన్యులకు కూడా అర్థమయ్యే తీరులో ఉండాలి.
- శిష్టవ్యావహారికభాషను ప్రయోగించాలి.
- వ్యాకరణాదివిశేషాలకు ఎక్కువ ప్రాధాన్యం ఉండరాదు.
- ఆధ్యాత్మిక అంశాలను పరిమితంగా విశేషాంశాలలో చెప్పవచ్చు.
- కార్యనిర్వహణాధికారి వారి అధ్యక్షతన తితిదే ప్రజాసంబంధాధికారి, సప్తగిరి ప్రధాన సంపాదకులు, తితిదే స్థానిక పండితులతో ఒక సంఘాన్ని ఏర్పాటుచేసి వ్యాఖ్యాతలను, సంపాదకమండలిని ఎన్నుకోవాలి.

- వ్యాఖ్యాత లందరితో తిరుపతిలో ఒక కార్యశాలను నిర్వహించి అందరి వ్యాఖ్యానం ఒకే విధంగా ఉండేలా చూడాలి.
- ఇంతకు మునుపు తితిదే ముద్రించిన తాత్పర్యసహిత భాగవతానికి తాత్పర్యం వ్రాసిన పండితులలో సమర్థులైనవారిని ఈ కార్యక్రమంలో వినియోగించుకోవచ్చు.

2007లో కార్యనిర్వహణాధికారి **డా॥ కె.వి.రమణాచారి** ఐ.ఏ.ఎస్., గారి ఆమోదంమేరకు నాటి సప్తగిరి సంపాదకులు **డా॥ సి.శైలకుమార్**, భాగవత ప్రాజెక్టు ప్రధానసంపాదకులుగా **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు** గారిని నియమించారు. ఆ తరువాత ఈ బృహత్కార్యాచరణకు సలహాలు, సూచనలు చేసేందుకు కవిత్రయభారత వ్యాఖ్యాననిర్వహణలాగే తొమ్మిదిమందితో కూడిన సలహామండలిని ఏర్పాటు చేశారు. దీనికి తితిదే కార్యనిర్వహణాధికారి గౌరవ సంపాదకులుగా వ్యవహరించారు.

**సలహామండలి**

| | | |
|---|---|---|
| **శ్రీ కార్యనిర్వహణాధికారి** | **-** | **గౌరవ సంపాదకులు** |
| **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, తిరుపతి** | **-** | **ప్రధాన సంపాదకులు** |
| **డా॥ సముద్రాల లక్ష్మణయ్య, తిరుపతి** | **-** | **సభ్యులు** |
| **డా॥ దేవళ్ళ చిన్నికృష్ణయ్య, మద్రాసు** | **-** | **సభ్యులు** |
| **డా॥ శలాక రఘునాథశర్మ, రాజమండ్రి** | **-** | **సభ్యులు** |
| **ధర్మప్రచార పరిషత్ కార్యదర్శి** | **-** | **పదవీ నిమిత్త సభ్యులు** |
| **సప్తగిరి సంపాదకుడు** | **-** | **సి. శైలకుమార్, కన్వీనర్** |
| **తితిదే ప్రజాసంబంధాధికారి** | **-** | **విశేష ఆహ్వానితులు** |
| **తితిదే ప్రెస్ మేనేజర్** | **-** | **విశేష ఆహ్వానితులు** |

ఈ సంపాదక మండలిలోని పండితవర్గమైన **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, డా॥ సముద్రాల లక్ష్మణయ్య, డా॥ దేవళ్ళ చిన్నికృష్ణయ్య, డా॥ శలాక రఘునాథశర్మ** గార్లతో ప్రధాన సంపాదకమండలిని నెలకొల్పారు. ఆ తరువాత కారణాంతరాలవల్ల **డా॥ దేవళ్ళ చిన్నికృష్ణయ్య** గారి స్థానంలో **డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య** గారు సంపాదక మండలి సభ్యులుగా నియమితులయ్యారు. ఈ ప్రధాన సంపాదక మండలివారు భాగవత

వ్యాఖ్యాన రచనకు ముప్పైమంది పండితులను ఎంపికచేసి ఒక్కొక్కరికి 300 – 350 పద్యగద్యాలకు వ్యాఖ్యాన రచనా బాధ్యతలను అప్పగించారు.

ఆ తరువాత అనుకున్నంత వేగంగా ఈ కార్యక్రమం ముందుకు సాగలేదు.

తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణలను, సవ్యాఖ్యాన భాగవతాన్ని త్వరితగతిన వ్యాప్తిలోకి తేవాలన్న ఉద్దేశ్యంతో 2011లో ద్రవిడ విశ్వవిద్యాలయ విశ్రాంత ఉపకులపతి **ఆచార్య రవ్వా శ్రీహరి**గారిని ప్రచురణల విభాగానికి ఎడిటర్–ఇన్–చీఫ్‌గా నియమిస్తూ వీరికి సహాయకులుగా **డా॥ నొస్సం నరసింహాచార్య, శ్రీమతి మొలకా ఉత్తరఫల్గుణి** గార్లను ప్రచురణల విభాగానికి ఉపసంపాదకులుగా, **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం** గార్లు కన్సల్టెంట్‌లుగా నియమితులయ్యారు.

అప్పటిదాకా మందకొడిగా సాగుతున్న ప్రచురణ కార్యక్రమంతోపాటు వ్యాఖ్యాన రచనా కార్యక్రమం కూడా **ఆచార్య రవ్వా శ్రీహరి** గారి సారథ్యంలో వేగాన్ని పుంజుకున్నది. వ్యాఖ్యాన రచయితలతో నిరంతరం ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ రాయలేమని తెలిపిన వారి భాగాలను వేరే పండితులకు అప్పగిస్తూ 2013నాటికి దాదాపు పండితులందరినుండి భాగవత వ్యాఖ్యానాలను తెప్పించారు. వెనువెంటనే డి.టి.పి. వగైరా పనులుకూడా ముమ్మరంగా సాగాయి. పుటల సంఖ్య ఆధారంగా 12 స్కంధాల భాగవతాన్ని 8 సంపుటాలుగా ముద్రించేందుకు ప్రణాళికలు సిద్ధం చేశారు.

**ఆచార్య రవ్వా శ్రీహరి**గారి తదనంతరం 2014లో ఎడిటర్–ఇన్–చీఫ్‌గా బాధ్యతలు చేపట్టిన పురాణ ఇతిహాస ప్రాజక్టు ప్రత్యేకాధికారి **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** ఈ కార్యక్రమాన్ని మరింత వేగవంతం చేశారు. వ్యాఖ్యాన రచనలను పరిష్కరించడానికి, అక్షర దోషాలను తొలగించడానికి మరి కొందరు పండితులు అవసరం కావడంతో అప్పటికే భాగవతం కన్సల్టెంటుగా ఉన్న **డా॥ గల్లా చలపతి** గారితోపాటుగా **డా॥ ముదివేడు ప్రభాకరరావు, శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు, శ్రీ కట్టా నరసింహులు** గార్లు భాగవతం ప్రాజెక్టు కన్సల్టెంట్‌లుగా నియమితులయ్యారు. భాగవత స్కంధాలను సంపాదకమండలి పరిష్కరణ స్థాయికి వీరు తీసుకువచ్చారు. 2015 ఏప్రిల్ 15వ తేదీన తితిదే కార్యనిర్వహణాధికారి **డా॥ డి.సాంబశివరావు** ఐ.ఏ.ఎస్., మరియు సంయుక్త కార్యనిర్వహణాధికారి (తిరుపతి) **శ్రీ పోల భాస్కర్** ఐ.ఏ.ఎస్., గార్ల ఆధ్వర్యంలో

**విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు**

**డా॥ సముద్రాల లక్ష్మణయ్య**

**డా॥ శలాక రఘునాథశర్మ**

**డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**గార్లతో కూడిన పోతనభాగవత సంపాదకమండలి తొలి సమావేశం జరిగింది. త్వరితగతిన పరిష్కరణ పూర్తిచేసేందుకు గాను అనుసరించాల్సిన ప్రణాళికను ఈ సమావేశంలో సిద్ధం

చేశారు. ఆ తరువాత **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** గారి సంయోజకత్వంలో జరిగిన సంపాదక మండలి సమావేశాలలో మూడుస్కంధాల పరిష్కరణ పూర్తిచేసి ముద్రణార్హమైన ప్రతిని సిద్ధం చేశారు. అనివార్యకారణాలవల్ల సంపాదకమండలిలో కొందరు సభ్యులు తదుపరి సమావేశాలకు హాజరు కాలేకపోయారు.

2016లో ప్రచురణల విభాగానికి **శ్రీ ప్రయాగ రామకృష్ణ**గారు ప్రత్యేకాధికారిగా నియమితులయ్యారు. కార్యనిర్వహణాధికారి గారి అమోదం మేరకు వీరు భాగవత పరిష్కరణ కార్యక్రమం త్వరితగతిన పూర్తికావడానికి అంతకు మునుపున్న సంపాదకమండలి స్థానంలో

**డా॥ సముద్రాల లక్ష్మణయ్య (ప్రధాన సంపాదకులు)**

**శ్రీ గరిమెళ్ళ అచ్యుత సత్య శేషగిరి సోమయాజి శర్మ**

**డా॥ తిప్పాభట్ల రామకృష్ణమూర్తి**

**డా॥ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి**

**డా॥ ధూళిపాళ రామకృష్ణ**

**డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య**

**డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి**

**డా॥ కె.వి. సుందరాచార్యులు**

**డా॥ కొంపెల్ల రామసూర్యనారాయణ**గార్లతో కొత్త సంపాదకమండలిని ఏర్పాటు చేశారు. అప్పటినుంచి వ్యాఖ్యాన పరిష్కరణ కార్యక్రమం వేగవంతం అయింది. కాగా 2017 ఉగాదినాటికి సవ్యాఖ్యాన భాగవతం ముద్రించబడి ప్రజలకు అందుబాటులోకి రావాలన్న తితిదే సంకల్పాన్ని అనుసరించి పరిష్కరణ కార్యక్రమాన్ని మరింత త్వరగా పూర్తి చేసేందుకుగాను కార్యనిర్వహణాధికారి వారి ఆమోదంమేరకు

**డా॥ నిట్టల సుబ్రహ్మణ్యేశ్వర శాస్త్రి**

**డా॥ మరడాన శ్రీనివాసరావు**

**డా॥ గల్లా చలపతి** గార్లకు సంపాదకమండలిలో స్థానం కల్పించారు. 2016 సెప్టెంబరునుండి పండితులందరితో ప్రతినెలా దాదాపు 20 రోజులపాటు తిరుపతి శ్వేత సమావేశ మందిరంలో సమావేశాలు ఏర్పాటుచేసి పండితులందరి ఆమోదంమేరకు పరిష్కరణ కార్యక్రమాన్ని విజయవంతంగా ముగించి శుద్ధప్రతిని ముద్రణకు పంపేందుకు సిద్ధం చేశారు. ఇలా అనుకున్న సమయానికి శ్రీమహాభాగవతాన్ని ప్రకటించగలిగినందుకు సంతోషిస్తున్నాము.

సామాన్య పాఠకులను దృష్టిలో ఉంచుకుని వ్యాఖ్యానం సరళంగా ఉండాలన్న కార్యనిర్వహణాధికారి, సంయుక్త కార్యనిర్వహణాధికారిగార్ల సూచనలమేరకు వ్యాఖ్యాన రచనలో విస్తృతంగా విశేషాలను వ్రాసిన పండితుల రచనల్లోంచి సంపాదకమండలి సూచనల ప్రకారం అవసరమైన మేరకు మాత్రమే విశేషాలను స్వీకరించడమయింది.

**కృతజ్ఞతలు**

ఈ ప్రణాళిక ఫలప్రదం కావడానికి ఆధికారికమైన ఆమోదాన్ని అందజేసిన తిరుమల తిరుపతి దేవస్థానముల పాలకమండలి అధ్యక్షులకు మరియు పాలకమండలి సభ్యులందరికీ కృతజ్ఞతలు.

లోగడ తితిదేవస్థానం కార్యనిర్వహణాధికారిగా ఉండి భాగవత ప్రాజెక్టు ప్రారంభానికి కారకులైన **శ్రీ ఎ.పి.వి.ఎన్.శర్మ** ఐ.ఏ.ఎస్., గారికి హృదయపూర్వక ధన్యవాదాలు. అదే పరంపరలో తితిదే కార్యనిర్వహణాధికారులుగా బాధ్యతలు నిర్వహించి భాగవత ప్రాజెక్టుకు సంపూర్ణ సహకారాన్ని అందించిన **డా॥ కె.వి.రమణాచార్య** ఐ.ఏ.ఎస్., **శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావు** ఐ.ఏ.ఎస్., **శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యం** ఐ.ఏ.ఎస్., **శ్రీ ఎమ్.జి.గోపాల్** ఐ.ఏ.ఎస్., గార్లకు హృదయపూర్వక ధన్యవాదాలు.

పోతనభాగవతం ముద్రణదశకు చేరుకునేందుకు తగిన సూచనలు, సలహాలు ఇచ్చిన సలహామండలి సభ్యులందరికీ ప్రత్యేక ధన్యవాదాలు.

సవ్యాఖ్యాన భాగవత ప్రచురణలో ఆసక్తిని కనబరుస్తూ అన్నివిధాలా అందుకు తగిన ప్రోత్సాహాన్ని అందజేసిన గౌరవ శ్రీ కార్యనిర్వహణాధికారి **డా॥ డి.సాంబశివరావు** ఐ.ఏ.ఎస్., గారికి, సంయుక్త కార్యనిర్వహణాధికారి **శ్రీ పోల భాస్కర్** ఐ.ఏ.ఎస్., గారికి మా హృదయపూర్వక నమోవాకాలు.

భాగవత వ్యాఖ్యాన రచనకు అవసరమైన పండితులను ఎన్నుకొని వారికి వ్యాఖ్యాన బాధ్యతలను అప్పగించడంలో కృషిచేసిన నాటి సప్తగిరి ప్రధాన సంపాదకులు **డా॥ సి.శైలకుమార్** గారికి, సంపాదకులు **డా॥ కె.రాధారమణ** (ప్రస్తుత ప్రధాన సంపాదకులు) గార్లకు కృతజ్ఞతలు.

వ్యాఖ్యాతలందరినుండి వ్యాఖ్యాన భాగాలను రప్పించడంలో శ్రమించి, విశేష కృషిచేసిన నాటి ప్రచురణల విభాగం అధికారి **ఆచార్య రవ్వా శ్రీహరి** గారికి, పరిష్కరణ కార్యక్రమాన్ని వేగవంతంచేసిన తదుపరి అధికారి **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** గారికి, కృతజ్ఞతాపూర్వక నమస్కృతులు.

పోతన భాగవత పరిష్కరణలో తమ అమూల్య సహాయసహకారాలనందించి శుద్ధప్రతిని తయారు చేయడంలో సహకరించిన **పోతన భాగవత సంపాదకమండలి సభ్యులందరికీ** పేరుపేరునా ధన్యవాదాలు.

ఈ కార్యక్రమంలో చేదోడువాదోడుగా ఉంటూ అన్నివిధాలా సంపూర్ణ సహాయ సహకారాలందించిన ప్రచురణల విభాగ ఉపసంపాదకులు **డా॥ నొస్సం నరసింహాచార్య** గారికి, పరిష్కరణ, అక్షరదోష సవరణల్లో సహకరించిన కార్యాలయ పండితులు **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, డా॥ గల్లా చలపతి, డా॥ ముదివేడు ప్రభాకరరావు, శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు, శ్రీ కట్టా నరసింహులు**గార్లకు, ప్రచురణల విభాగంలో కొంతకాలం ఉపసంపాదకురాలుగా పనిచేసి భాగవత పరిశీలనా కార్యక్రమంలో సహకరించిన **శ్రీమతి మొలకా ఉత్తరఫల్గుణి** గారికి నా ప్రత్యేక ధన్యవాదాలు.

సవ్యాఖ్యాన పోతన భాగవత ముద్రణకు సంబంధించిన దస్త్రాలను నడపడంలోను, సంపాదకమండలి సమావేశాలను ఏర్పాటు చేయడంలోను సహకరించిన **ప్రచురణల విభాగ కార్యాలయ సిబ్బందికి** నా ధన్యవాదాలు.

సవ్యాఖ్యాన పోతన భాగవతం ఎనిమిది సంపుటాలలో చివరన ముద్రించిన అకారాదిక్రమ పద్యగద్య సూచికను తయారు చేయడంలో సహకరించిన **శ్రీ వాడపల్లి శేషతల్పశాయి** (ఆంధ్రభారతి.కామ్) గారికి మా కృతజ్ఞతలు.

ఈ పుస్తకాలను అందంగా డి.టి.పి. చేసి చక్కటి వర్ణచిత్రాలతో సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దడంలో సహకరించిన ప్రచురణల విభాగ కార్యాలయ డి.టి.పి. సిబ్బంది **శ్రీమతి ఎమ్.సుబ్బరత్నమ్మ, శ్రీమతి జె.కరుణ, కుమారి ఎమ్.మానస, శ్రీ ఎమ్.రెడ్డిప్రసాద్** గార్లకు ధన్యవాదాలు.

ఈ గ్రంథంలో ప్రసిద్ధ చిత్రకారులు బాపుగారి అద్భుత వర్ణచిత్రాలను ముద్రించేందుకు అనుమతించిన బాపుగారి కుటుంబసభ్యులకు మా ప్రత్యేకధన్యవాదాలు.

తక్కువ వ్యవధిలో గ్రంథ ముద్రణను పూర్తిచేసి పాఠకులకు అందించేందుకు తోడ్పడిన టిటిడి ముద్రణాలయ ఉపకార్యనిర్వహణాధికారి **శ్రీమతి ఎమ్.గౌతమి** గారికీ, వారి సిబ్బందికీ మా హృదయపూర్వక ధన్యవాదాలు.

***సదా శ్రీవారి సేవలో...***

**(ప్రయాగ రామకృష్ణ)**

కన్వీనర్

ప్రత్యేకాధికారి, ప్రచురణల విభాగం

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# సంపాదక మండలి

అధ్యక్షులు

**డా॥ డి.సాంబశివరావు,** ఐ.ఏ.ఎస్,

కార్యనిర్వహణాధికారి, తి.తి.దే., తిరుపతి

పర్యవేక్షకులు

**శ్రీ పోల భాస్కర్,** ఐ.ఏ.ఎస్,

సంయుక్త కార్యనిర్వహణాధికారి, తి.తి.దే., తిరుపతి

ప్రధాన సంపాదకులు : **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు**

## సభ్యులు

**డా॥ సముద్రాల లక్ష్మణయ్య**

**డా॥ శలాక రఘునాథశర్మ**

**డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**

కన్వీనర్ : డా॥ సముద్రాల లక్ష్మణయ్య, ఎడిటర్-ఇన్-చీఫ్, ప్రచురణల విభాగం

కో - కన్వీనర్ : డా॥ నొస్సం నరసింహాచార్య, ఉపసంపాదకులు, ప్రచురణల విభాగం

బమ్మెర పోతనామాత్య ప్రణీత

# శ్రీమహాభాగవతము

| వ్యాఖ్యాతలు | స్కంధాలు |
|---|---|
| 1) డా॥ కేసాప్రగడ సత్యనారాయణ | ప్రథమస్కంధము (1-275) |
| 2) డా॥ మల్లెల గురవయ్య | ప్రథమస్కంధము (276-529) |
| 3) డా॥ సముద్రాల లక్ష్మణయ్య | ద్వితీయస్కంధము (1-288) |
| 4) డా॥ కడిమిళ్ళ వరప్రసాద్ | తృతీయస్కంధము (1-388) |
| 5) డా॥ కసిరెడ్డి వెంకటపతిరెడ్డి | తృతీయస్కంధము (389-717) |
| 6) డా॥ గల్లా చలపతి | తృతీయస్కంధము (718-887) |
| 7) డా॥ కసిరెడ్డి వెంకటపతిరెడ్డి | తృతీయస్కంధము (888-1055) |
| 8) డా॥ దావులూరి కృష్ణకుమారి | చతుర్థస్కంధము (1-322) |
| 9) డా॥ ఆర్. అనంతపద్మనాభరావు | చతుర్థస్కంధము (323-636) |
| 10) డా॥ శలాక రఘునాథశర్మ | చతుర్థస్కంధము (637-977) |
| 11) డా॥ కె. సర్వోత్తమరావు | పంచమస్కంధము |
| | ప్రథమాశ్వాసము (1-183) |
| | ద్వితీయాశ్వాసము (1-167) |
| 12) డా॥ జోస్యుల సూర్యప్రకాశరావు | షష్ఠస్కంధము (1-251) |
| 13) డా॥ కొంపెల్ల రామసూర్యనారాయణ | షష్ఠస్కంధము (252-346) |
| 14) డా॥ ఆకురాతి పున్నారావు | షష్ఠస్కంధము (347-440) |
| 15) శ్రీ కోట వేంకట లక్ష్మీనరసింహం | షష్ఠస్కంధము (441-530) |
| 16) డా॥ ఆకెళ్ళ విభీషణశర్మ | సప్తమస్కంధము (1-186) |

17) డా॥ ఆకురాతి పున్నారావు — సప్తమస్కంధము (187-482)

18) డా॥ హెచ్.ఎస్. బ్రహ్మానంద — అష్టమస్కంధము (1-391)

19) శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు — అష్టమస్కంధము (392-744)

20) డా॥ డి. మీరాస్వామి — నవమస్కంధము (1-364)

21) శ్రీ కోట వేంకట లక్ష్మీనరసింహం — నవమస్కంధము (365-737)

22) డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య — దశమస్కంధము పూర్వభాగము (1-288)

23) డా॥ ఎ.ఎస్. గోపాలరావు — దశమస్కంధము పూర్వభాగము (289-610)

24) శ్రీ ప్రభల సుబ్రహ్మణ్యశర్మ — దశమస్కంధము పూర్వభాగము (611-912)

25) డా॥ పి. నరసింహారెడ్డి — దశమస్కంధము పూర్వభాగము (913-1188)

26) విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు — దశమస్కంధము పూర్వభాగము (1189-1485)

27) డా॥ పి.ఆర్. హరినాథ్ — దశమస్కంధము పూర్వభాగము (1486-1792)

28) డా॥ నాగళ్ళ గురుప్రసాదరావు — దశమస్కంధము ఉత్తరభాగము (1-245)

29) డా॥ ఎన్.వి.ఎస్. రామారావు — దశమస్కంధము ఉత్తరభాగము (246-537)

30) డా॥ కె. మలయవాసిని — దశమస్కంధము ఉత్తరభాగము (538-764)

31) డా॥ కె.జె. కృష్ణమూర్తి — దశమస్కంధము ఉత్తరభాగము (765-1033)

32) డా॥ సంగనభట్ల నరసయ్య — దశమస్కంధము ఉత్తరభాగము (1034-1343)

33) డా॥ గల్లా చలపతి — ఏకాదశస్కంధము (1-127)
ద్వాదశస్కంధము (1-54)

**పోతన భాగవతప్రాజెక్టు కన్సల్టెంట్స్**

శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం * డా॥ గల్లా చలపతి * డా॥ ముదివేడు ప్రభాకరరావు

శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు * శ్రీ కట్టా నరసింహులు

# సంకేతాక్షర సూచి

| | | | | | |
|---|---|---|---|---|---|
| క. | - | కందం | య. | - | యగణం |
| ఆ. | - | ఆటవెలది | మ. | - | మగణం |
| తే. | - | తేటగీతి | త. | - | తగణం |
| సీ. | - | సీసపద్యం | ర. | - | రగణం |
| ఉ. | - | ఉత్పలమాల | జ. | - | జగణం |
| చ. | - | చంపకమాల | భ. | - | భగణం |
| మత్త. | - | మత్తకోకిల | న. | - | నగణం |
| మ. | - | మత్తేభవిక్రీడితం | స. | - | సగణం |
| శా. | - | శార్దూలవిక్రీడితం | ల. | - | లఘువు |
| శ్లో. | - | శ్లోకం | గ. | - | గురువు |
| వ. | - | వచనం | వ. | - | వగణం |
| అలం. | - | అలంకారం | | | |

| | | |
|---|---|---|
| అవ. | - | అవతారిక |
| తా. | - | తాత్పర్యం |
| ప్రతి. | - | ప్రతిపదార్థం |
| విశే. | - | విశేషార్థం |
| ప్ర.ఆ. | - | ప్రథమాశ్వాసం |
| ద్వి.ఆ. | - | ద్వితీయాశ్వాసం |
| క్రీ.శ. | - | క్రీస్తుశకం |
| సం. | - | సంవత్సరం |
| మొ. | - | మొదలైన |
| ... | - | తరువాతి పద్యం / వచనంతో అన్వయం |



# తృతీయస్కంధ ప్రాశస్త్యం

**భా**గవతంలోని పూర్వార్థంలో మూడవస్కంధం చాల పెద్దది. విదురుని తీర్థయాత్రలు, విదుర – ఉద్ధవ సంవాదం, విదుర మైత్రేయ సంవాదం, శ్రీయజ్ఞవరాహస్వామి హిరణ్యాక్షుని సంహరించడం, కపిలుడు తన తల్లి దేవహూతికి వేదాంత బోధ చేయడం – ఈ స్కంధంలోని ప్రధాన విషయాలు.

శ్రీకృష్ణుడు రాయబారియై కౌరవసభకు వచ్చాడు. పాండవుల కర్ధరాజ్యమిమ్మని ధృతరాష్ట్రు నడిగినాడు. శ్రీకృష్ణుడు చెప్పిందే న్యాయమని, ఆయన పరమాత్ముడైన మహావిష్ణువని విదురుడు చెప్పాడు. అది విన్న దుర్యోధనుడు శకునిని, దుశ్శాసనుణ్ణి చూచి, “ఈ దాసీ పుత్రుణ్ణి ఎవరు పిలిచారు? వీడు పాండవ పక్షపాతిగా నోటికి వచ్చినట్లు పేలుతున్నాడు. వీడిని సభనుండి గెంటి వేయండి” అని ఈసడిస్తూ పలికాడు.

విదురుడు వెంటనే విల్లంబులు విసిరిపారవేసి, అడవులకు వెళ్ళి తీర్థయాత్రలు చేశాడు. పవిత్ర క్షేత్రాలను, పుణ్యనదుల్నీ సేవించి ప్రభాసతీర్థానికి వచ్చాడు. కురుక్షేత్రంలో కౌరవపాండవులకు యుద్ధం జరిగి కౌరవులంతా చచ్చారని తెలిసింది. సరస్వతీ నదిలో స్నానం చేసి యమునానది ఒడ్డున ఉన్న ఉద్ధవుణ్ణి చూశాడు. ఉద్ధవుడు శ్రీకృష్ణనిర్యాణాన్ని చెప్పాడు. శ్రీకృష్ణుని కథలు సంగ్రహంగా చెప్పాడు. శ్రీకృష్ణ లీలల్ని గానం చేశాడు. తన కథ చెప్పాడు, ఉద్ధవుడు శ్రీకృష్ణుని దర్శించి ఉప్పొంగిన హృదయంతో ఇలా స్తుతించాడు.

**మత్తకోకిల**

**కంటిఁ గంటి భవాబ్ధి దాఁటఁగ గంటి నాశ్రిత రక్షకుం**
**గంటి యోగి జనంబు డెందముఁ గంటిఁ జుట్టముఁ గంటి ము**
**క్కంటికిం గనరాని యెక్కటిఁ గంటిఁ దామరకంటిఁ జే**
**కొంటి ముక్తి నిధానముం దలకొంటి సౌఖ్యము లందఁగన్ – భాగవతం (3-146)**

ఇక్కడ మహాకవి పోతన గానానికి అనుకూలమైన **‘మత్తకోకిల’** అనే విశేష వృత్తాన్ని వాడి వృత్తౌచిత్యాన్ని పాటించాడు. పోతనకు సామాన్య వృత్తాలలో **మత్తేభం**, విశేషవృత్తాలలో **‘మత్తకోకిల’** ఎంతో ఇష్టం!

అదే సమయంలో, వ్యాసమహర్షి మైత్రేయ మునితో కలసివచ్చి శ్రీకృష్ణుని దర్శించాడు. శ్రీకృష్ణుడు ఉద్ధవునికి తన మాహాత్మ్యాన్ని తెలియజెప్పాడు. శ్రీకృష్ణుడెంత ఆత్మారాముడైనప్పటికీ, పదహారువేల గోపికలతో రమించడం ఒక లీల అని ఉద్ధవుడు స్తుతించి బదరీవనానికి వెళ్ళాడు. విదురుడు తీర్థయాత్రలు చేస్తూ, గంగలో స్నానం చేసి ఆ నది ఒడ్డున ఉన్న మైత్రేయుని చూశాడు. ఈ సన్నివేశంతోనే విదుర మైత్రేయ సంవాదం ఆరంభమైంది.

సత్త్వం, రజస్సు, తమస్సు, అనే మూడు గుణాలతో కూడిన మాయను తన అదుపులో పెట్టుకొనే భగవంతుడు ఏయే అవతారాలను ఎత్తాడు? ఏయే గొప్ప కార్యాలు చేశాడు? ఏ క్రియలూ చేయని ఈశ్వరుడు ఈ ప్రపంచాన్ని ఎలా సృష్టించాడు? ఈ జగత్తును ఆయన ఏ విధంగా భావించాడు? నివృత్తి మార్గంలో ఉన్న దేవుడు యోగమాయలో

ఎలా నివసించాడు? బ్రహ్మమొదలైన రూపాలను పొంది బ్రహ్మాండంలో ఎలా క్రీడించాడు? బ్రాహ్మణుల్ని, గోవుల్ని, దేవతల్ని, రక్షించడానికై మత్స్య, కూర్మ, వరాహాది అవతారాలను (రూపాలను) ధరించి, ఏ యే ప్రయోజనాలను సాధించాడు? లోకాలనూ, లోకపాలురనూ, లోకాలోక పర్వతాలనూ ఎలా సృజించాడు? వివిధ తత్త్వాలను ఎలా ఏర్పరచాడు? ఈ జీవకోటి ఎవరిని సేవించడం వల్ల బ్రతుకుతూ ఉంది? ఈ ప్రజలకు పనుల్నీ, పేర్లను, రూపాలను ఎలా నిర్దేశించాడు? యోగీశ్వరేశ్వరుడైన పుండరీకాక్షుని చరిత్ర విన్నగాని జన్మమరణాది దుఃఖాలు తొలగవు – అని విదురుడు మైత్రేయుణ్ణి అడిగాడు. ఈ ప్రశ్నలకన్నింటికీ మైత్రేయుడిచ్చిన సమాధానమే తృతీయస్కంధం.

"విదురా! నీవు మాండవ్య మహర్షి శాపంచే వ్యాసునికి శూద్రకాంత గర్భంలో పుట్టిన యమధర్మరాజువి. గొప్ప జ్ఞానివి. శ్రీవిష్ణువుకు ప్రియుడివి. నీ వడిగిన ప్రశ్నలకు సమాధానాలు చెబుతాను. విను. శ్రీమహావిష్ణుని యోగమాయచే ఈ సమస్తవిశ్వం పుట్టింది. మొదట విరాట్పురుషుడు పుట్టాడు. విష్ణుమూర్తి బొడ్డులో ఉన్న పద్మంనుండి బ్రహ్మదేవుడు జన్మించాడు. బ్రహ్మసృష్టి తొమ్మిది విధాలు. దీనినే నవసర్గాత్మక సృష్టి" అంటారు.

1. మహత్తత్త్వసృష్టి 2. అహంకారసృష్టి 3. సూక్ష్మ భూతాల సృష్టి 4. ఇంద్రియసృష్టి 5. దేవతాసృష్టి 6. జీవసృష్టి – ఇవి ఆరూ ప్రాకృతసృష్టులు

7. వృక్షసృష్టి 8. జంతు సృష్టి 9. మానుషసృష్టి – ఇవి మూడూ వైకృత సృష్టులు.

ఇలా, బ్రహ్మదేవుడు దేవతల్ని, మనువుల్ని, మునుల్ని, వేదాల్ని, శాస్త్రాల్ని, యజ్ఞాల్ని సృష్టించాడు. బ్రహ్మదేహం నుండి 'సరస్వతి' పుట్టింది. ఆ సరస్వతి అందాన్ని చూచి కూతురని భావించక బ్రహ్మయే మోహించాడు. బ్రహ్మ ఒక్కొక్క శరీరాన్ని విడిచిపెట్టి నప్పుడొక్కొక్క సృష్టి జరిగింది. స్వయంభువుని కుమారుడు స్వాయంభువ మనువు. అతని వలన ప్రజాసంతతి వృద్ధి పొందింది.

సనకుడు, సనందనుడనే బ్రహ్మమానసపుత్రులు శ్రీమహావిష్ణువును దర్శించడానికై వైకుంఠానికి పోయారు. ద్వారపాలకులైన జయ, విజయులు వారిని అడ్డగించారు. సనకాదులు కోపించి మీరు భూమిపై పుట్టండని శపించారు. కశ్యపప్రజాపతికి, దితికి జయవిజయులు కవల పిల్లలుగా హిరణ్యాక్ష – హిరణ్యకశిపులై జన్మించారు. వారు పెద్దవారై తపస్సు చేసి బ్రహ్మవలన వరాలు పొందారు. హిరణ్యాక్షుడు సముద్రాన్ని అల్లకల్లోలం గావించాడు. చాపగా చుట్టి భూచక్రాన్ని దొంగిలించాడు. భూదేవిని రక్షించడానికై విష్ణువు వరాహావతార మెత్తాడు. రసాతలంలో ఉన్న భూగోళాన్ని తన కోరపై నిలిపాడు. వరాహస్వామికి, హిరణ్యాక్షునికి భయంకరమైన యుద్ధం జరిగింది. హిరణ్యాక్షుడు మాయతో భూత–పిశాచ–శాకినీ సమూహాల్ని సృష్టించాడు. శ్రీహరి సుదర్శనచక్రంతో ఆ మాయా భూతాలనన్నిటిని పటాపంచలు చేశాడు. మల్ల యుద్ధంలో వరాహస్వామి రాక్షసుణ్ణి అరచేత కొట్టి, మొత్తి చంపాడు.

**క. దితిచెడి లోఁబడె దైత్యుఁడు, సటికిన్ దంష్ట్రావిభిన్న శత్రుమహోర**
**స్తటికిన్ ఖరఖుర పుటికిం, గటితట హతకమలజాండఘటికిం గిటికిన్.**

లోకంలో 'హిరణ్యాక్ష వరాల'ని సామెత ఉంది. 'హిరణ్యాక్షుడెటువంటి తపస్సు చేశాడో! బ్రహ్మనుండి ఎటువంటి వరాలు పొందాడో తదితర పురాణ పరిశీలనం చేతనే తెలుసుకోవాలి.

## ప్రప్రథమదర్శనమైన సాంఖ్యతత్త్వప్రవర్తకాచార్యుడు కపిలమహర్షి

ప్రజాపతుల్లో ప్రథముడు కర్దముడు. ఆయన ధర్మపత్ని దేవహూతి. కర్దముడు తన యోగప్రభావంతో ఒక దివ్యవిమానాన్ని సృష్టించి భార్యతో విహరిస్తూ, భోగాల్ని అనుభవించాడు. ఈ దంపతులకు విష్ణువు కపిలుడనే పేరుతో జన్మించాడు. అతడు తీవ్రమైన తపస్సు చేసి విష్ణుభక్తుడైనాడు. తల్లికి వేదాంత తత్త్వజ్ఞానం ఉపదేశించాడు. సాంఖ్యతత్త్వం వివరించాడు. యోగాభ్యాసం నేర్పాడు. భక్తియోగాన్ని విశదీకరించాడు. పాపాత్ముల్ని పట్టి యమకింకరులు పెట్టే యాతనల్ని ఇలా చెప్పాడు.

**క. పట్టుదురు కొలవులను వడిఁ, బెట్టుదు రసిపత్త్రికలను బెనుమంటలయం**
**దొట్టుదు రొదళ్ల నలియన్, ముట్టుదు రప్పాపచిత్తు మత్తున్ బెలుచన్**

**ఉ. ముంతురు తప్తతోయముల మొత్తుదు రుగ్ర గదాసిధారలన్**
**ద్రెంతురు పొట్టప్రేవులు, వధింతురు, మీఁద నిభేంద్రపంక్తి తొ**
**ప్పింతురు, ఘోరభంగిఁ గఱపింతురు పాములచేత, బిట్టు ద్రొ**
**బ్బింతురు మీఁద గుండ్లు, తినిపింతురు దేహము గోసి కండలన్ - భాగవతం (3-989)**

కాబట్టి, మానవుడు పాపాలు చేయడం మాని విష్ణుభక్తుడై ధర్మజీవనం గడిపి ముక్తుడు కావాలి. పోతనగారి మాటల్లో కపిలమహర్షి సాంఖ్య యోగదర్శన ప్రవర్తకాచార్యవర్యుడు.

## అలంకార యోజనం

తృతీయ స్కంధంలో వేదాంత విషయాలెక్కువగా ఉన్నాయి. విదురమైత్రేయ సంవాదంలో తాత్త్విక విషయాలు ఎక్కువగా ఉన్నాయి. కపిల దేవహూతి సంవాదమంతా వేదాంతమే. ఇటువంటి ఘట్టాలను చదివే పాఠకుల హృదయాలను రంజింపజేయడానికి పోతన ప్రబంధ పద్ధతిలో అర్థాలంకారాల్ని, శబ్దాలంకారాల్ని విరివిగా వాడాడు. అన్వయక్లేశంలేని పద్యాలను రచించాడు. ఇది వాల్మీకి పద్ధతి.

### త్రిప్రాసం

**క. ఆ చక్రభానుదీప్తి ధ, రా చక్రమునందు నిండి రయమున నమ్మా**
**యాచక్రము నడఁగించెను, నీ చక్రముఁడైన యామినీచరు నెదురన్ (3-694)**

ఈ త్రిప్రాసంలో మరోచమత్కారం కూడ పాటించాడు పోతన

1. ఆ-చక్ర 2. ధ-రాచక్ర 3. మా-యాచక్ర 4. నీచక్ర-ము(డు). ఇది హిరణ్యాక్షుడైన యామినీచరుడు పుట్టించిన మాయాకోటిని వరాహస్వామి సుదర్శన చక్రంతో అణచివేసిన విధాన్ని వర్ణిస్తోంది.

### రూపకాలంకారం

**సీ. వరపీతకౌశేయ పరిధానకాంతి సంధ్యాంబుద రుచినిచయంబుగాఁగఁ**
**గమనీయ నవహేమకలిత కిరీటంబు, రమణకాంచన శిఖరంబుగాఁగ (3-287)**

ఈ పద్యమంతా రూపకాలంకారం. బ్రహ్మ చూచిన శ్రీ మహావిష్ణువు మరకతపర్వతంలాగా ఉన్నాడని వర్ణింపబడ్డాడు. ఈ పద్యం కింద పెద్దవచనంలో మహావిష్ణువు దివ్యమంగళ విగ్రహం దండి దశకుమారచరిత్ర శైలిలో పదలాలిత్యంతో వర్ణింపబడి ఉంది.

**మ. వరవైకుంఠము సారసాకరము... భృంగాకృతిన్ (3-513)**

వైకుంఠం సరస్సు. దానిలోని బంగారు భవనం పద్మం. చుట్టచుట్టుకొని ఉన్న శేషుడు కర్ణిక (దుద్దు). దానిపై పడుకొన్న విష్ణువు తుమ్మెదవలె ఉన్నాడు. పద్యమంతా రూపకం. పద్మమెంతో సుందరం. అది చివరికి ఉపమాలంకారంలో పర్యవసించింది.

## విరోధాలంకారం

**తే.గీ. పుండరీకాక్షుఁడయ్యును భూరిరోషనిరతిఁ దరుణారుణాంభోజనేత్రుఁ డగుచు (3-672)**

తెల్లని పద్మాలవంటి కన్నులుండే వరాహమూర్తి కోపంతో ఎర్రని కన్నులు గలవాడైనాడని విరోధం స్ఫురిస్తూ ఉంది. సరిగ్గా, తిక్కన సోమయాజిగారు ఆంధ్రమహాభారతం ఉద్యోగపర్వంలో శ్రీకృష్ణరాయబారఘట్టంలో దుర్యోధనుడు సూదిమొననేలపై మోపిన భూమికూడ పాండవుల కివ్వనని, తనతో యుద్ధంచేసి గెలిచి తీసుకోవలసిందేనని తన నిశ్చయాన్ని తెలిపిన సందర్భంలో-

**"పుండరీకాక్షుఁడగుటెల్లఁ బోయి, యప్పుఁ**
**దరుణ కమలాక్షుఁడగుచు మురాంతకుండు" - తిక్కన ఉద్యోగపర్వం - (3-364)**

అనే పద్యంలోని భావాన్నే పోతన స్వీకరించినాడని చెప్పవచ్చు.

తిక్కన పద్యంలో 'మురాంతకుడనే సాభిప్రాయ విశేషణం కథాఘట్టాన్ని మరింతగా రక్తికట్టించేదిగా ఉంది. పోతనకు తిక్కనగారిపైగల గౌరవభావానికిది తార్కాణంగా గ్రహించాలి'.

## గౌడీరీతి

**సీ. కఠిన సటాచ్ఛటోత్కట జాతవాత నిర్ధూత జీమూత సంఘాతమగుచు...**
**పొరలుఁగెరలు నటించు నంబరము దెరల, రొప్పునుప్పర మెగయునం గొప్పరించు**
**ముట్టె బిగియించు ముసముస మూరుకొనును, నదరు సంరక్షిత క్షోణి యజ్ఞఘోణి (3-414)**

సీసపద్య పాదాలన్నీ గౌడీరీతిలో నడిచాయి. ఎత్తుగీతి తెలుగు పదాలతో, క్రియాసముచ్చయాలతో కూర్చబడ్డాయి. శ్రీయజ్ఞవరాహస్వామి విగ్రహం కన్నులయెదుట సాక్షాత్కరిస్తోంది.

## పునరావృత్తభావాలు - ఏకసమాసాలు

ఒక అందమైన చిన్ని కందపద్యంలో చెప్పి, దాన్నే మరల వృత్తపద్యంలో చెప్పి, ఆ భావాన్నే ఒక సుందర గద్యంలో చెప్పడం ఛందస్సు బాగా వశమైన మహాకవికి మాత్రమే సాధ్యం!

క. **అతుల తమాల మహీజ - ప్రతతిక్షణజాత జలద పరిశంకాంగీ**
**కృత తాండవ ఖేలన విల - సిత పింఛవిభాసి బాలశిఖి సేవ్యంబై (3-768)**

ఇది స్వాయంభువ మనువు చూసిన కర్దమ ప్రజాపతి ఆశ్రమం. నల్లని చీకటిచెట్ల గుంపుల్ని చూచి నల్లనిమేఘా లనుకొని అక్కడ చిన్న నెమళ్లు పింఛాలు విప్పి నాట్యం చేస్తున్నవట!

ఈ భావాన్నే ఉత్పలమాలలో ఇలా చెప్పాడు.

ఉ. **ఆయత వజ్రనీలమణి హాటక నిర్మిత హర్మ్యసౌధవా**
**తాయనరంధ్ర నిర్గత సితాభ్ర మహాగరు ధూపధూమముల్**
**తోయద పంక్తులో యనుచుఁ దుంగమహీరుహ రమ్యశాఖలన్**
**జేయుచునుండుఁ దాండవవిశేషము లప్పురిఁ గేకి సంఘముల్. (భాగవతం-దశమ-పూర్వ-1597)**

దీన్నే (1-255) (10-1-1529) రెండుమార్లు వచనంలో చెప్పాడు. పోతన తన పద్యాల్నీ, భావాల్నీ, మరల మరల తానే అనుకరిస్తాడు. పై కందపద్యం ఏకసమాసంలో సాగింది. ఇలాంటి పద్యాలు ఈ తృతీయస్కంధంలో మూడున్నాయి. (3-769), (3-812) (3-1044).

## శాస్త్రపరిచయం

## విశిష్టాద్వైతం - పాంచరాత్ర వైశిష్ట్యం

క. **దివ్యమగు 'వాసుదేవాది వ్యూహచతుష్టయంబు' త్రిజగములయందున్**
**సేవ్యంబని చెప్పంబడు, భవ్యగుణా! దాని నెఱుగఁబలికెద నీకున్ - (3-892)**

తే.గీ. **బాల శీతాంశురేఖా విభాసమాన, ధవళదంష్ట్రాగ్రమున నున్న ధరణియొప్పె**
**హరికి 'నిత్యానపాయిని' యైన లక్ష్మినెరయఁ బూసిన కస్తూరి నికరమనఁగ - (3-421)**

సీ. **నిత్య నైమిత్తిక నిజధర్మమున గురుశ్రద్ధా గరిష్ఠతఁ జతుర పాంచ**
**రాత్రోక్తహరి సమారాధన క్రియలను..." - (3-959)**

పాంచరాత్ర ఆగమవిధానం ద్వాపరయుగాంతంలోని మహాభారతకాలంలో ఏర్పడిందని ఆర్.జి.భాండార్కర్ వంటి మహాపండితులు తీర్మానించారు. శ్రీమహావిష్ణువు ఋషులకు ఐదురాత్రుల్లో ఈ ఆగమాన్ని ఉపదేశించడంవల్ల దీనికి **'పాంచరాత్ర'**మనే పేరు ఏర్పడింది. ఈ పాంచరాత్ర ఆగమంలో నాల్గువ్యూహాలుంటాయి. భగవంతుడు వ్యూహగతుడై ఉంటాడు. సాధనచేత ఆయన ఉనికిని సాధకుడు తెలుసుకోవాలి. అంచెలంచెలుగా మోక్షాన్ని సాధించాలని చెప్పేదే పాంచరాత్రం. ఈ ఆగమంలో వాసుదేవుడు షాడ్గుణ్య ప్రపూర్ణుడు. జ్ఞాన, శక్తి, బల, ఐశ్వర్య, వీర్య, తేజస్సులు అనే షడ్గుణాలు సంపూర్ణంగా గలవాడు వాసుదేవుడు. ఈయన వసుదేవుని కుమారుడు వాసుదేవుడా? అనే ప్రశ్న తలెత్తగా, శ్రీశంకరులపూర్వం శ్రీ వైకుంఠంలోని **'పరవాసుదేవమూర్తి'** అని నిర్ణయించారు. కాని, భాగవతపురాణకాలంలో విష్ణువుయొక్క సంపూర్ణశక్తి సామర్థ్యాలు వసుదేవుని పుత్రుడైన వాసుదేవ కృష్ణునిలో

ఉన్నాయని భాగవతపురాణం పలుమార్లు నిరూపించడంచేత వైకుంఠ వాసుదేవుడే, భాగవత వాసుదేవుడైన శ్రీకృష్ణుడని గుర్తింపబడింది. ఈయన 'షాడ్గుణ్య విగ్రహుడు'గా చెప్పబడినాడు. భాగవత వాసుదేవ శ్రీకృష్ణుణ్ణి, విష్ణువు సంపూర్ణావతారంగా వ్యాఖ్యాతలు నిరూపించారు.

వాసుదేవ వ్యూహం సర్వోత్కృష్టమైంది. ఇందులో పై చెప్పబడిన ఆరుగుణాలు ఉంటాయి. తక్కిన మూడు వ్యూహాలలో రెండేసి గుణాల చొప్పున ఉంటాయి. దీని తర్వాతిదే సంకర్షణవ్యూహం. సంకర్షణుడంటే బలరాముడు. "సం-కర్షయతీతి ఇతి సంకర్షణః" - బీడుభూమిగా ఉన్న మనస్సును దున్ని, పంటభూమిగా మార్చి, భక్తిబీజాలను నాటేవాడు - బలరాముడు. భగవంతునికి ఉన్ముఖంగా జీవుని మలిచేవాడని అర్థం. ముక్తికి మార్గం చూపేవాడు సంకర్షణుడు. **'నాగలి'** బలరాముని ఆయుధం. ఆయన ఆదిశేషుని అపరావతారం. దీక్షితవాదం ప్రకారం సృష్టిలో తొట్టతొలి జీవుడు. 'నిత్యుల'లో మొట్టమొదటివాడు. ఈ ఆదిశేషుని అవతారమే భగవద్రామానుజాచార్యులవారని శ్రీవైష్ణవ సంప్రదాయం చెబుతున్నది. ఈ సంకర్షణుడనే పేరుగల బలరాముడు శ్రీకృష్ణుని అన్న. ఈయనను గురించి భాగవతదశమస్కంధ ఉత్తరభాగంలో విపులంగా చెప్పబడింది.

ప్రద్యుమ్నవ్యూహం శ్రీకృష్ణుని కుమారుడైన ప్రద్యుమ్నుని పేరు మీదనే ఏర్పడింది. ఈయన క్రోధానికి ప్రతీక. దీని తర్వాతిదే అనిరుద్ధవ్యూహం. శ్రీకృష్ణుని మనుమడు, ప్రద్యుమ్నుని కుమారుడే అనిరుద్ధుడు. ఈయన అహంకారానికి ప్రతీక. ఒక దీపంనుండి మరోదీపం వెలిగేటట్లుగా ఒక వ్యూహం నుండి మరో వ్యూహానికి జీవుడు ఎదుగుతూ పైకి సాగాలి. అహంకార, క్రోధాలను జయించి, లయకారకుడైన సంకర్షణ వ్యూహంలో 'భక్తిచే హృదయాన్ని పవిత్రీకృతం చేసికొని వాసుదేవుని మెప్పించి **ముక్తి** పొందాలి. ఇది ఊర్ధ్వగమనం!

ఈ **'పాంచరాత్రం'**లోనే కాదు, శ్రీవైష్ణవ సంప్రదాయంలో, పురాణ సంప్రదాయం ప్రకారం లక్ష్మీదేవి విష్ణుదేవునికి **'నిత్యానపాయిని'** -

**"భగవతీం, శ్రియం, దేవీం, నిత్యానపాయినీం,**
**నిరవద్యాం, దేవదేవ దివ్యమహిషీమ్,**
**అఖిల జగన్మాతరమ్, అస్మన్మాతరమ్, అశరణశ్శరణ్యామ్**
**అనన్య శరణ శ్శరణమహం ప్రపద్యే" - శరణాగతి గద్య**

అని భగవద్రామానుజులు **'శరణాగతిగద్య'**లో చెప్పారు. దీని ననుసరించే వాదిభీకర మహాగురు అణ్ణన్ శ్రీవేంకటేశ ప్రపత్తిలో -

**"ఈశానాం జగతోఽస్య వేంకటపతే ర్విష్ణోఃపరాం ప్రేయసీమ్**
**తద్వక్షస్థల నిత్యవాసరసికాం తత్క్షాంతి సంవర్ధనీమ్"** అన్నారు.

ఉత్తర భారతదేశంలోని యమునా నదీతీరంలోగల వడమదురై (ఉత్తరమధుర) ప్రాంతంనుండి దక్షిణ భారతదేశానికి వలసగా వచ్చిన శ్రీనాథమునులు (క్రీ.శ.823-900) పాంచరాత్ర ఆగమాన్ని తమతో తెచ్చి ప్రచారం చేశారు. వీరే శ్రీవైష్ణవ సంప్రదాయంలోని తొట్టతొలి ఆచార్య పురుషులు. రెండవ ఆచార్యుడు ఈయన మనుమడైన

యామునాచార్యులు. ఈ పేరే వీరు ఔత్తరాహులని స్పష్టం చేస్తున్నది. (క్రీ.శ.918-1037) వీరి తర్వాత వచ్చిన మూడవ ఆచార్యపురుషుడే భగవద్రామానుజాచార్యులవారు (క్రీ.శ.1017-1137) వీరు తమ గురుతుల్యులు, పూర్వాచార్యులైన నాథ, యామునులచే ప్రవర్తితమైన పాంచరాత్రాన్ని ప్రధానీకరించుకొని 108 దివ్యదేశాల్లోని విష్ణుదేవాలయాల్లో ప్రవేశ పెట్టించారు. వీటికి కొన్ని అపవాదాలుండవచ్చు. తిరుమలలో అదివరకే వైఖానస ఆగమం ఉండగా అది అలాగే కొనసాగించారు. అనంతరకాలంలో తిరుచానూరులోని అమ్మవారి గుడిలోమాత్రం పాంచరాత్రాన్ని ప్రవేశపెట్టారు.

పాంచరాత్ర ఆగమంప్రకారం విష్ణువును రోజుకు ఐదుసార్లు పూజచేయాలి. దీనికే పంచకాలకృత్యాలు, పంచకాలవిధులు అంటారు. అవి -

1. **అభిగమనం** - మనోవాక్కాయకర్మలచే జపధ్యానాదుల ద్వారా భగవంతునికి అభిముఖుడుకావడం.
2. **ఉపాదానం** - పూజానిమిత్తం ఫలపుష్పాదులను సేకరించడం.
3. **ఇజ్యా** - విష్ణుప్రతిమను పూజించడం
4. **స్వాధ్యాయం** - పూజానంతరం ఆగమగ్రంథపఠనం చేయడం.
5. **యోగం** - సాయంకాలాల్లో కుండలినీ యోగానుష్ఠానం చేయడం.

ఈ విధంగా రోజుకైదు వేళల్లో శ్రీవిష్ణుదేవుని ఆరాధించే వైష్ణవుని **'పంచకాల పరాయణుడు', 'పంచకాలజ్ఞుడు'** అని పిలుస్తారు. (చూ॥ పాద్మసంహిత (136 అధ్యాయం), శ్రీప్రశ్నసంహిత (17వ అధ్యాయం))

ఈ చెప్పబడిన ఐదుక్రియలనే పోతనగారు **"పాంచరాత్రోక్త హరిసమారాధన క్రియలు"** అని చెప్పారు.

శ్రీ శంకర భగవత్పాదులవారు కూడ నారాయణుడు 'సర్వాత్మ' అని స్థాపించి, వాసుదేవాది పూజనం వలననే **'ముక్తి'** లభిస్తుందన్న విషయం అంగీకరించారు. విష్ణుసాలగ్రామార్చనను కూడ వారు చెప్పారు. వాసుదేవ, సంకర్షణాది వ్యూహాలలోనివారికి జన్మాదులు లేవని, వారు నిత్యులని చెప్పారు. శ్రీయామునాచార్యులవారు సిద్ధిత్రయమ్, ఆగమ 'ప్రామాణ్యమ్' వంటి గ్రంథాలు వ్రాశారు. 'ఆగమ' మంటే వారి తాతగారు నాథమునిచే ప్రవర్తితమైన 'పాంచరాత్ర ఆగమ ప్రామాణ్యమ్' అని అర్థం. శ్రీవేదాంతదేశికులవారు (క్రీ.శ.1269-1370) 'పాంచరాత్ర ఆగమరక్షా' అనే గ్రంథం వ్రాశారు.

### సాంఖ్యం

సీ. **'ధృతిఁ బూని కాలచోదితము నవ్యక్తంబుఁ బ్రకృతియు నను పేళ్లఁ బరఁగు మాయ'**(3-201)

**"అందుఁ బ్రకృతి చతుర్వింశతి తత్త్వాత్మకంబై యుండు** (3-891)

1. మూల ప్రకృతి+1మహత్తు (బుద్ధి)+1 అహంకారం (అభిమానం)+5 తన్మాత్రలు (సూక్ష్మభూతాలు)+5 మహాభూతాలు (భూమి మొ॥)+5 జ్ఞానేంద్రియాలు+5 కర్మేంద్రియాలు+1 పురుషుడు = 24 తత్త్వాలు.

ఇవి కపిలమహర్షి చెప్పిన 24 తత్త్వాలు. ప్రకృతికి వేరైనవాడు పురుషుడు. పతంజలి మహర్షి యోగశాస్త్రంలో భగవంతుని కూడా అంగీకరించాడు. అప్పుడివి 25 తత్త్వాలు.

భాగవతం 27 తత్త్వాలు చెప్పింది (3-204) కాలాన్ని 25వ తత్త్వంగా పేర్కొన్నది (3-891)

**శ్లో. సాంఖ్య, యోగౌ పృథక్, బాలాప్రవదంతి, న పండితాః ।**
**ఏకమప్యాస్థితః సమ్యక్ ఉభయోర్విన్దతే ఫలమ్ ॥ (భగవద్గీత - కర్మసన్యాసయోగం - 4)**

కర్మసన్న్యాస పూర్వకమైన జ్ఞానయోగం, కర్మయోగం వేర్వేరని అవివేకులు చెబుతారేగాని, వివేకులు ఆరెండింటిలో ఏ ఒక్కదాన్నైనా బాగా అనుష్ఠిస్తే రెండింటి ఫలాన్ని పొందుతారని చెబుతున్నారు. జ్ఞానయోగులు ఏ స్థానాన్ని (మోక్షాన్ని) పొందుతారో కర్మయోగులు కూడ ఆ స్థానాన్నే పొందుతారు (శ్లో. 5) జ్ఞానయోగ, కర్మయోగాలకు భక్తియోగాన్ని "భాగవతం" జోడించింది.

**వ. ఈ ప్రకారంబున సాంఖ్యంబునందు నిరూపింపఁబడునట్టి ప్రకారంబును, భక్తియోగ మాహాత్మ్యంబును, బురుషుండు భక్తి యోగంబునంజేసి సర్వలోక విరక్తుం డగు (భాగవతం-3-950).** ఇది భాగవత భక్తివైశిష్ట్యం.

## పంచవిధముక్తులు

పురాణాలన్నీ 'సాలోక్యం' మొదలైన నాల్గువిధాలైన ముక్తులనే పేర్కొన్నాయి. కాని, భాగవతం పంచవిధముక్తుల్ని పేర్కొంటున్నది. 1. సాలోక్యం 2. సార్ష్టి 3. సామీప్యం 4. సారూప్యం 5. సాయుజ్యం (3-958). అద్వైతులు సాయుజ్యాన్నే కోరుకొంటారు. సాయుజ్యమంటే జీవాత్మ తన ఉనికిని, వ్యక్తిత్వాన్ని పోగొట్టుకొని, పరమాత్మలో లీనమైపోవడం. ఉదాహరణకు ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యంలో శివుడు సాలెపురుగు, పాము, ఏనుగులకు సాయుజ్యాన్ని అనుగ్రహించాడు. **"శ్రీకాళహస్తి పురదైవంబిచ్చె సాయుజ్యమున్"** అని ధూర్జటి వాక్యం. కాని, విశిష్టాద్వైతులు ఈ విధమైన ముక్తిని కోరరు. వారుకోరేది సామీప్యముక్తి లేదా సాలోక్యముక్తి. భగవంతునికి సమీపంలోనే ఉంటూ తమ వ్యక్తిత్వాన్ని కోల్పోకుండా భగవద్వైభవ దర్శనంచేస్తూ ఉండే ముక్తిని కోరుకుంటారు. 'సారూప్యముక్తి' దీనిలో అంతర్భవిస్తుంది. జయవిజయులు సామీప్య, సారూప్య, సాలోక్యముక్తిని పొందినవారు. అయితే ఇటువంటి ముక్తిలో జీవునికి అహంకారం పొటమరించే అవకాశం ఉంది. అందుచేతనే జయవిజయులు సారూప్యదశనుండి పతనమై భూమిపై మరల జన్మించారు. సాయుజ్యంలో ఎటువంటి బెడదాలేదు. జీవాత్మ పరమాత్మలో ఐక్యమైపోతాడు. కులశేఖర ఆళ్వారాదులు సామీప్య, సాలోక్యముక్తినే కోరుకొన్నారు. క్షణక్షణమూ పొటమరించే అహంకారాన్ని భక్తుల పాదధూళిచే పోగొట్టుకుంటూ, స్వామి సౌందర్య వైభవాల్ని చూచి తన్మయత్వాన్ని పొందుతూ ఉంటారు. ప్రహ్లాదాది పరమభాగవతులు మోక్షాన్నికూడ వద్దన్నారు. వారెప్పుడూ ముక్తస్థితిలో ఉండే పరమైకాంతులు.

విశిష్టాద్వైతుల ఈ పంచవిధముక్తులను గురించిన సమగ్రవిషయాలు తెలియగోరేవారు శ్రీవేదాంతదేశికుల రహస్యత్రయసారం, శ్రీ శ్రీనివాసాచార్యుల యతీంద్రమత దీపిక; విలక్షణ మోక్షాధికారి నిర్ణయంవంటి గ్రంథాలు చూడవచ్చు.

## వృక్షశాస్త్రం

**వ. పుష్పోత్పత్తిరహితంబులై ఫలించెడు నశ్వత్థోదుంబర పనస న్యగ్రోధాదులైన వనస్పతులును, బుష్పితంబులై ఫలపాకాంతంబులైన వ్రీహి యవ ముద్గా ద్యోషధులును, నారోహణానపేక్షంబులైన మాలతీమల్లికాదిలతలును, ద్వక్సారంబులైన వేణ్వాదులును; గఠినీభూతమూలంబులును, శిఖావిస్తృతంబులు నగు లతా విశేషరూపంబులైన వీరుధంబులును; బుష్పవంతంబు లయి ఫలప్రాప్తంబులగు చూతాది ద్రుమంబులును (భాగవతం-3-344)**

ఇది భగవంతుని ఏడవసృష్టి. పువ్వులు పూయక కాయలు కాచేవి అశ్వత్థం, ఉదుంబరం (మేడిచెట్టు), పనసచెట్టు, న్యగ్రోధ (మర్రిచెట్టు), రావిచెట్టు, బిల్వవృక్షం మొదలైనవి. ఇటువంటి వృక్షాలకు వనస్పతులనిపేరు. పూలు పూచి ఫలించేవి మినుము, పెసర మొదలైనవి.

## జంతుశాస్త్రం

**వ. శ్వస్తనాది జ్ఞానశూన్యంబులయి యాహారాది జ్ఞానమాత్ర నిష్ఠంబులయి, ఘ్రాణంబువలన నెఱుంగం దగినవాని నెఱుంగుచు హృదయంబున దీర్ఘానుసంధాన రహితంబులై వర్తించు ద్విశఫంబులు గల వృషభ మహిషాజ కృష్ణ సూకరోష్ట్ర గవయ రురు మేష ముఖర నవకంబును, నేక శఫంబు గల ఖరాశ్వాశ్వతర గౌర శరభ చమర్యాది షట్కంబును, బంచనఖంబులు గల శునక సృగాల వృక వ్యాఘ్ర మార్జార శశ శల్యక సింహ కపి గజ కూర్మ గోధాముఖ భూచర ద్వాదశకంబును, మకరాది జలచరంబులును, గంక గృధ్ర బక శ్యేన భాస భల్లూక బర్హి హంస సారస చక్రవాక కాకోలూకాది ఖేచరంబులును మొదలుగా గలది తిర్యక్సర్గంబయ్యె" - (భాగవతం-3-344)**

1. గిట్టలు చీలి ఉండే జంతువులు - ఎద్దు, దున్న మొదలైనవి.
2. చీలని గిట్టలుండే జంతువులు - గాడిద, గుర్రం మొదలైనవి.
3. ఐదుగోళ్లు గలజంతువులు - కుక్క, నక్క మొదలైనవి.

ఇది భగవంతుని పశుపక్ష్యాది సృష్టి.

## వైశేషిక దర్శనం (తర్కశాస్త్రం)

**సీ. భువిఁ దనకార్యాంశమునకు నంతము నన్య వస్తుయోగంబు నేవలన లేక
ఘటపటాదిక జగత్కార్యంబునకు నిజ సమవాయకారణత్వమునఁ బరఁగి
జాలసూర్య మరీచి సంగతగగనస్థ మగు త్రసరేణు షడంశమరయఁ
బరమాణు వయ్యెఁ; దత్పరమాణువం దర్క గతి యెంత తడవు దత్కాల మగును**

**తే. సూక్ష్మకాలంబు; విను మది సూర్యమండ, లంబు ద్వాదశ రాశ్యాత్మకం బనంగఁ
గలుగు జగమున నొక యేఁడు గడచి చనినఁ, గాల మెంతగు నది మహత్కాల మనఘ! (3-345)**

**వ. అందుఁ బరమాణు ద్వయంబొక్క "యణు" వగు; నణుత్రితయం బొక్క "త్రసరేణు" వగు...(3-346)**

పరమాణువుల్ని గూర్చి మొట్టమొదట చెప్పినవాడు కణాదమహర్షి. ఈయన రచించిన సూత్రగ్రంథం పేరు– **'వైశేషికదర్శనమ్'**. ఇంటి కప్పు రంధ్రం నుండిగాని, కిటికీనుండిగాని వచ్చే సూర్యకిరణాలలోని సూక్ష్మరజఃకణం **త్రసరేణువు**. దానిలోని ఆరవభాగం **'పరమాణువు'**. రెండు పరమాణువులు కలిస్తే ఒక **'అణువు'**. ఈ పరమాణువులనుండి పంచభూతాలు పుదుతున్నాయి. పై సీసపద్యంలోని ఘటం, పటం, కార్యం, కారణం, సమవాయికారణం, మొదలైనవి తార్కికులు ఎక్కువగా వాడే పదాలు.

**వ. నభోఽసాధారణ శబ్ద విశేష గ్రాహకంబు శ్రోత్రంబును, వాయ్వసాధారణ గుణ విశేష గ్రాహకంబు స్పర్శంబును, దేజోఽసాధారణ గుణ విశేష గ్రాహకంబు చక్షురింద్రియంబును, నంభోఽసాధారణ గుణ విశేషగ్రాహకంబు రసనేంద్రియంబును, భూమ్యసాధారణ గుణ విశేషగ్రాహకంబు ఘ్రాణేంద్రియంబును." (3-896)**

శబ్దాన్ని మాత్రమే గ్రహించేది చెవి. స్పర్శాన్ని మాత్రమే గ్రహించేది చర్మం. తేజస్సును (రూపాన్ని) మాత్రమే గ్రహించేది కన్ను. రసాన్ని మాత్రమే (రుచిని) గ్రహించేది నాలుక. వాసనను మాత్రమే గ్రహించేది ముక్కు. ఇవి పంచేంద్రియాల అసాధారణ గుణాలు. 'అసాధారణ' మనే విశేషదళాన్ని తర్కశాస్త్రం బాగా చదివిన పండితులు మాత్రమే వాడుతారు.

అసాధారణమంటే ఏమిటి? అని ప్రశ్నించవచ్చు.

"స్నేహత్వ సామాన్యవాన్ ద్రవత్వత్వ శూన్యః । సంగ్రహాసాధారణ కారణం స్నేహః । ధర్మత్వ సామాన్యవాన్ సుఖా సాధారణ కారణం ధర్మః । అధర్మత్వ సామాన్యవాన్ దుఃఖాసాధారణకారణ మధర్మః ॥"

అని శివాదిత్యుని "సప్తపదార్థి". అసాధారణం= ప్రధానకారణం.

## కాలగణనం

**వ. "అవి (త్రసరేణువులు) మూఁడు గూడ నొక్కత్రుటియగు నా త్రుటి శతం బొక్క వేధయనం బరఁగు...వత్సర నామంబుల" (3-346)**

మూడుత్రసరేణువుల కాలం= ఒక త్రుటి

నూరుత్రుటులు= ఒకవేధ

మూడు వేధలు= ఒక లవము

మూడు లవాలు= ఒక నిమేషం (కనురెప్పపాటు)

మూడు నిమేషాలు= ఒక క్షణం

ఐదు క్షణాలు= ఒక కాష్ఠ

పది కాష్ఠలు= ఒక లఘువు

పదునైదు లఘువులు= ఒక నాడి

రెండు నాడులు= ఒక ముహూర్తం

మూడు ముహూర్తాలు= ఒక ప్రహరం (యామం)

నాల్గుయామాలు= ఒక పగలు లేదా ఒక రాత్రి

ఎనిమిదియామాలు= ఒక దినం

పదునైదు దినాలు= ఒక పక్షం (శుక్ల లేదా కృష్ణ)

రెండుపక్షాలు= ముప్పైదినాలు (ఒక నెల లేదా మాసం)

రెండునెలలు= ఒక ఋతువు

ఆరునెలలు= ఒక అయనం

పన్నెండు నెలలు= ఒక సంవత్సరం

నూరు సంవత్సరాలు= మానవుని పరమాయువు.

## సంవత్సర ప్రమాణాలు

1. సౌరం (సూర్యుని అనుసరించేది)
2. బార్హస్పత్యం (గురువు గతిని అనుసరించేది)
3. సావనం (30 దినాలుగల కాలం)
4. చాంద్రం (చంద్రుని అనుసరించేది)
5. నాక్షత్రం (నక్షత్రాన్ని అనుసరించేది)

అని సంవత్సర ప్రమాణం ఐదువిధాలు.

## భారతీయుల కాలమానం

1. సంవత్సరం 2. పరివత్సరం 3. ఇడావత్సరం (ఇద్వత్సరం) 4. అనువత్సరం 5. వత్సరం - అని సంవత్సరాలు ఐదు విధాలు. ఇది భారతీయుల కాలమానం.

## చతుర్యుగాల కాలపరిమితి

| క్రమసంఖ్య | యుగంపేరు | దివ్యసంవత్సరాలు | మానవసంవత్సరాలు |
|---|---|---|---|
| 1. | కృతయుగం | 4,000 దివ్యసంవత్సరాలు | 17,28,000 మానవ వర్షాలు |
| 2. | త్రేతాయుగం | 3,000 దివ్యసంవత్సరాలు | 12,96,000 మానవ వర్షాలు |
| 3. | ద్వాపరయుగం | 2,000 దివ్యసంవత్సరాలు | 8,64,000 మానవ వర్షాలు |
| 4. | కలియుగం | 1,000 దివ్యసంవత్సరాలు | 4,32,000 మానవ వర్షాలు |

పంచాంగ గణనాన్ని అనుసరించి కలియుగంలో 5116 సంవత్సరాలు గడిచాయి. ప్రస్తుతం 5117 కల్యబ్దం నడుస్తూ ఉంది. కలియుగ ప్రమాణమింకా 4,26,884 సంవత్సరాలు మిగిలి ఉన్నాయి.

## కాలాన్నికొలిచే నీటి గడియారం

**వ. షట్పల తామ్రంబునం బాత్రంబు రచియించి, చతుర్మాష సువర్ణంబునం జతురంగుళాయామశలాకంబుఁ గల్పించి, దానం దత్పాత్రమూలంబున ఛిద్రంబుఁ గల్పించి తచ్ఛిద్రంబునం బ్రస్థమాత్ర తోయంబు పరిపూర్ణంబు నొందునంత కాలం బొక్క "నాడిక" యగు (3-346)**

నాల్గుపలాలతో రాగిపాత్ర చేయాలి. నాల్గుమాషాల (మినుపగింజలు) బంగారంతో నాలుగు అంగుళాలపొడవు గలిగిన గొట్టంచేసి, దానితో రాగిపాత్ర కింద బెజ్జం చేయాలి. ఆ పాత్రను నీటితో నింపిన పెద్దపాత్రలో ఉంచాలి. ఆ కన్నం ద్వారా ప్రస్థమాత్రం నీటితో ఆ పాత్ర నిండటానికి పట్టే కాలం 'నాడిక' అనబడుతుంది. ఈ మానం (కొలత) సంస్కృత భాగవతంలో ఉన్నదే!

**శ్లో. ద్వాదశార్ధ వలోన్మానం చతుర్భి శ్చతురంగులైః।**
**స్వర్ణ మాషైః కృతచ్ఛిద్రం యావత్ ప్రస్థ జలప్లుతమ్ ॥" (3-11-9)**

ఈ తూకాలు, ఘటికాయంత్ర నిర్మాణ పద్ధతులు ఈనాడు తెలియవు. ఇది నీటి గడియారం. పోతన వీరభద్ర విజయంలో (3-124) కూడా నీటిగడియారాన్నే వర్ణించాడు.

## శ్రౌతం

**సీ. త్వక్కున నఖిలవేదములు, రోమంబుల యందును బర్హిస్సు లక్షులందు**
**నాజ్యంబు పాదంబులందుఁ జాతుర్హోత్ర కలితంబులగు యజ్ఞకర్మములును**
**స్రుక్కు తుండంబున స్రువము నాసికను... (3-425)**

**వ. వెండియు ముహుర్ముహుర్భగవ దావిర్భావంబు దీక్షణేష్టి యగు నీదు దంష్ట్రలు ప్రాయణీయంబను దీక్షనంతరేష్టియు నుదయనీయంబను సమాప్తేష్టియు యుష్మద్రేతంబు సోమంబును ద్వదీయావస్థానంబు ప్రాతస్సవనాదులు నీదు త్వఙ్మాంసాది సప్తధాతువులగ్ని ష్టోమోక్థ్య షోడశీ వాజపేయా తిరాత్రా ప్తోర్యామంబులను సంస్థాబేధంబులును ద్వాదశాహాది రూపంబులైన బహుయాగ సంఘాతరూపంబులునగు సర్వ సత్రంబులు భవదీయ శరీర సంధులు, ససోమాసోమంబులగు యజ్ఞ క్రతువులు నీవ మఱియును నీవు యజన బంధనంబులచే నొప్పుచుందు వదియునుంగాక!"**

**క. హవరూపివి, హవ నేతవు, హవ భోక్తవు, నిఖిల హవఫలాధారుఁడవున్**
**హవ రక్షకుఁడవు నగు నీ క వితతముగ నుతులొనర్తుమయ్య! ముకుందా!**

ఇది యజ్ఞవరాహస్వామి స్తుతి!

ఇక్కడ యజ్ఞపాత్రలు, దీక్షణీ యేష్టి, ప్రాయణీ యేష్టి, అగ్నిష్టోమం, ఉక్థ్యం, షోడశి, వాజపేయం, అతిరాత్రం, ఆప్తోర్యామం – మొదలైన యజ్ఞాలు, సవనాలు, చెప్పబడ్డాయి. భాగవతంలో యజ్ఞాలు వచ్చిన ఘట్టాలలో శ్రౌత సంప్రదాయాలను పోతన శ్రద్ధతో చూపారు.

## జ్యోతిశ్శాస్త్రం

**క. గుహలు రొదలిచ్చెఁ బాప, గ్రహమిత్రతఁ జెంది వక్రగతులను సౌమ్య**
**గ్రహములు వర్తించెను దుస్సహతేజోదితి తనూజ సంభవ వేళన్ (3-606)**

1. మేష 2. వృషభ 3. మిథున 4. కర్కాటక 5. సింహ 6. కన్యా 7. తులా 8. వృశ్చిక 9. ధనుః 10. మకర 11. కుంభ 12. మీనములు ద్వాదశ రాసులు.

1. సూర్య 2. చంద్ర 3. కుజ 4. బుధ 5. గురు 6. శుక్ర 7. శని 8. రాహు 9. కేతువులు నవగ్రహాలు. రాహుకేతువులు ఛాయాగ్రహాలు. రాహుకేతువులను విడిచి తక్కిన ఏడు గ్రహాలనుబట్టి వారాల పేర్లు వచ్చాయి. గురుడు, శుక్రుడు, శుద్ధ బుధుడు, పూర్ణచంద్రుడు, చరరాసులలో ఉన్న కేతువు శుభగ్రహాలు.

రవి, కుజుడు, పాపగ్రహాలతో ఉన్న బుధుడు, క్షీణచంద్రుడు, రాహువు, చర రాసుల కంటె, ఇతర రాసులలో ఉన్న కేతువు పాపగ్రహాలు.

మేషం నుండి వృషభరాశిలో ప్రవేశింపవలసిన గ్రహం మీనానికివస్తే వక్రగతి. సూర్య, చంద్ర, రాహు, కేతువులకు వక్రగతి లేదు. తక్కిన గ్రహాలు వక్రిస్తాయి. హిరణ్యాక్ష, హిరణ్యకశిపులు పుట్టినప్పుడు శుభగ్రహాలతో కూడి పాపగ్రహాలు వక్రించాయని భావం. ఇవి ఉత్పాతాలు.

**వ. శింశుమారచక్రంబునుం బోలె గురు మకరకుళీర మిథునంబై (8-108)**

**మ. రవి మధ్యాహ్నమునం జరింప గ్రహతారాచంద్ర భద్రస్థితిన్ (8-506)**

**వ. గ్రహశాస్త్రంబు పరిపాటిని గర్కట మీన మిథున మకరరాశి సుందరంబై (9-230); గ్రహమండలంబునుం బోలె గురు, బుధ, కవిరాజ మిత్ర విరాజితంబయి (10-2-601) మొదలైన చోట్ల జ్యోతిశ్శాస్త్ర ప్రశంస చేయబడింది.**

## ధర్మశాస్త్రం - కవలపిల్లల్లో ఎవరు పెద్ద?

కవలపిల్లల్లో ముందుపుట్టినవాడు పెద్దవాడా? లేక వెనుకపుట్టినవాడా? అనే సందేహం లోకంలో ఉంది. దానికి ధర్మశాస్త్రప్రమాణాన్ని చూద్దాం!

**"అథ యమలయోః సంస్కారక్రమార్థం జ్యేష్ఠ కనిష్ఠ భావ ఉచ్యతే -**

**దేవలః - యస్యజాతస్య యమయోః పశ్యంతి ప్రథమం ముఖమ్ ।**
**సంతానః పితరశ్చైవ తస్మిన్ జ్యైష్ఠ్యం ప్రతిష్ఠితమ్ ॥**

**భాగవతే తు – ద్వౌ తదా భవతో గర్భౌ సూతిర్వేశ విపర్యయాత్ ।**
**ఇత్యుక్తేః పశ్చాదుత్పన్నస్య జ్యైష్ఠ ముక్తమ్ ।**
**దేశాచారతో వ్యవస్థా పూర్వమేవ తు యుక్తమ్ ॥"**

కవలపిల్లల్లో ముందు పుట్టినవాడే పెద్దవాడని దేవలమహర్షి చెప్పారు. భాగవతంలో మాత్రం వెనుక పుట్టినవాడే పెద్దవాడని చెప్పబడింది. దేశాచారాన్ని బట్టి నామకరణాది సంస్కారాలు చేయాలి. దేవలమహర్షి అభిప్రాయమే సముచితమైందని **కమలాకరభట్టు 'నిర్ణయసింధువు'** లో చెప్పాడు.

**భాగవతంలోని వచనమిది**

**"ప్రజాపతిర్నామ తయో రకార్షీద్యః ప్రాక్ స్వదేహోద్యమయో రజాయిత । తం వై హిరణ్యకశిపుం విదుః ప్రజాయంతం హిరణ్యాక్ష మసూత సాగ్రతః ॥"**

హిరణ్యాక్ష, హిరణ్యకశిపులు కవలపిల్లలు. దితికి ముందు పుట్టినవాడు హిరణ్యాక్షుడు. వెనుక పుట్టినవాడు హిరణ్యకశిపుడు. కాని, కశ్యపప్రజాపతి హిరణ్యకశిపుడే పెద్దవాడని నిశ్చయించి నామకరణం చేశాడు.

**దీనికి శ్రీధరవ్యాఖ్య**

**"యమయోర్మధ్యే యః స్వదేహాత్ ప్రథమ మజాయత । తం తదా హిరణ్యకశిపుం విదుః సాదితిః ప్రథమం యమసూత తం హిరణ్యాక్షం యదా విదుస్తదానామ కృతవానిత్యర్థః । అయం భావః – యదా హి గర్భాధాన సమయే యోని పుష్పం విశే ద్వీర్యం ద్విధావిభక్త మాది పశ్చాద్భావేన ప్రవిశతి తదా యమౌ భవతః । త యోశ్చ పితృతః ప్రవేశక్రమ విపర్యయేణ మాతృతః ప్రసూతిః ॥**

**శ్లో. యదా విశేద్ ద్విధా భూతం బీజం పుష్పం పరిక్షరత్ ।**
**ద్వౌతరా భవతో గర్భౌ సూతిర్వేశ విపర్యయాత్ ॥**

**ఇతి పిండసిద్ధి స్మరణాత్ । అతః, స్వదేహాత్ పూర్వం యోజాతః తస్య హిరణ్యకశిపు రితి, దితిః ప్రథమం యమసూత తస్య హిరణ్యాక్ష ఇతి నామకృతవా నితి ॥**

**తాత్పర్యం :** గర్భాధాన సమయంలో స్త్రీ గర్భకోశం లోకి పురుషుని శుక్రకణాలు రెండు ప్రవేశించడం వలన కవలలు పుడతారు. గర్భకోశంలో ఉన్న శుక్రకణాలు శిశువులుగా వృద్ధి చెందిన తర్వాత ప్రసూతి (పురిటి) సమయంలో ముందు ప్రవేశించిన శిశువు వెనుకగా, వెనుక ప్రవేశించిన శిశువు ముందుగా పుడతారు. అందుచేత, ముందు పుట్టిన హిరణ్యాక్షుడు చిన్నవాడుగాను, వెనుకపుట్టిన హిరణ్యకశిపుడు పెద్దవాడు కావడం తటస్థించింది. ఈ విషయంలో స్మృతిని (ధర్మశాస్త్రం) ఉదాహరించి శ్రీధరాచార్యులు సమన్వయం చేశారు.

**పై సందర్భానికి పోతన చేసిన అనువాదం**

**వ. "కశ్యపుండు నిజతనూభవులం జూడం దలంచి దితి మందిరంబునకుం జనుదెంచి, సుతులం గనుంగొని వారలకు నామకరణంబు సేయం దలంచి"**

చ. దితి, జఠరంబునందుఁ దన తేజము మున్నిడి నట్టి పుత్త్రు న
ద్భుత చరితున్ హిరణ్యకశిపుండను పేరఁ, బ్రసూతివేళ, నా
దితి మును గన్నయట్టి రవితేజుని గాంచన లోచనుండు నా
హిత మతి పేరు పెట్టి చనియెన్ నిజనిర్మల పుణ్యభూమికిన్ – భాగవతం (3–611)

మూలంలోని క్లిష్టమైన శ్లోకాలను ఇంతముద్దుగా తెనిగించేశక్తి ఆంధ్రవాఙ్మయంలో ఒక్క పోతనకే చెల్లింది. పోతన ఈ రహస్యం ఇక్కడ వెల్లడించి – "నాకుం దమ్ముఁడు మీకు నెచ్చెలి" (7–30) క్రోడంబై పినతండ్రిఁ జంపెనని" (7–185) అనే హిరణ్యకశిపుని వాక్యాలలో ధ్వనింపజేశాడు. పోతన సర్వధర్మశాస్త్రరహస్యజ్ఞ మూర్ధన్యుడు అనడానికి ఇంతకంటె ప్రబల ప్రమాణం ఏం కావాలి?

## వేదాంతం - పిండోత్పత్తి

సీ. దొరకొని పురుషరేతోబిందు సంబంధియై వధూగర్భంబు నందుఁ జొచ్చి...

స్త్రీలు గర్భం ధరించినప్పుడు కడుపులోని పిండం ఏ విధంగా వృద్ధిపొందుతుందో, కపిల – దేవహూతిసంవాదంలో (1–991....1006) విపులంగా చెప్పబడింది. పురుషుని వీర్యం స్త్రీ గర్భంలో ప్రవేశిస్తుంది. మొదటి రాత్రి భర్త శుక్రకణం భార్య అండంతో కలుస్తుంది. అది ఐదు రాత్రులకు బుడగ అవుతుంది. పది రాత్రులకు రేగుపండంత అవుతుంది. తరువాత జిడ్డుతో గుడ్డుగా మారుతుంది. నెలరోజులకు తల ఏర్పడుతుంది. రెండు నెలలకు కాళ్లు, చేతులు ఏర్పడుతాయి. మూడు నెలలకు గోళ్లు, వెంట్రుకలు, ఎముకలు, చర్మం ఏర్పడుతాయి. ఆ నెలలోనే ఆడ, మగ భేదము ఏర్పడుతుంది. నాల్గవనెల సప్తధాతువులు, ఐదవనెల ఆకలిదప్పులు కల్గుతాయి. ఆరవనెల మావి (పిండం చుట్టూ సంచి)లో ఉంటుంది. తల్లి కడుపులో కుడి భాగంలో తిరుగుతూ బొడ్డులో ఉన్న గొట్టం (నాభీనాళం) తో తల్లి తిన్న అన్నపానాలు గ్రహిస్తుంది. ఏడవనెల జ్ఞానముదయిస్తుంది. కాళ్ళు చేతులు కదలుతాయి. 7–9 నెలల్లో గర్భనరక మనుభవిస్తూ బయటకు వచ్చే మార్గం తెలియక తలకిందై కాళ్లుమీదై మలమూత్రల మధ్య కొట్టుకొంటూ, "తనను గర్భనరకం నుండి విముక్తుణ్ణి చేయుమని భగవంతుని ప్రార్థిస్తుంది. "నెలలు నిండిన తర్వాత పదవనెలలో అధోముఖమై పుడుతుంది. భూమిమీద పడగానే మాయ కమ్ముతుంది. పెద్దవాడైన తర్వాత శారీరకసుఖాలు అనే మాయలోపడి పెండ్లాడి స్త్రీ సంగమం చేసి, కాముకుడై అహంకార మమకారాలతో శిశ్నోదరపరాయణుడై కాలం వెళ్లగడుపుతాడు. దీనికంతటికీ స్త్రీ సంగమం కారణం. కాబట్టి, ముక్తి కోరేవాడు స్త్రీ సంగమాన్ని విడిచి, సంసారంలో పడకుండా, నిత్యం సృష్టికర్తయైన భగవంతుణ్ణి తలచుకొంటూ, సేవాధర్మాన్ని అవలంబించి, సాధుజీవనాన్ని గడుపుతూ ఉండాలి.

భాగవతంలో ఈ పిండోత్పత్తి క్రమం శాస్త్రజ్ఞానం కోసం చెప్పబడలేదు. గర్భనరకయాతనల్ని తెలుసుకొని, పురుషుడు వైరాగ్యాన్ని పొంది, భక్తితో శ్రీమహావిష్ణువును ధ్యానిస్తూ ఉండాలి అనే నిరంతర భక్తిభావన కోసమే!

## జీవన్ముక్తి

**తే.గీ. తవిలి సుఖరూపమును మోక్షదాయకంబునైన యీ యోగమార్గంబు నంబ నీకు!**
**నెఱుఁగ వివరించి చెప్పితి నిది దృఢంబుగాఁగ భక్తి ననుష్ఠింపు కమలనయన!**

**క. 'జీవన్ముక్తి లభించున్..............................' (3-1041, 1042)**

కపిలమహర్షి తన తల్లియైన దేవహూతికి సాంఖ్యమార్గం, యోగమార్గం చెప్పి, వాటికి భక్తియోగాన్ని జోడించాడు. భగవంతుని భక్తితో కొలుస్తూ, యోగాభ్యాసం చేసినవానికే ముక్తి లభిస్తుంది. భక్తి లేకుండా యోగసనాలు వేయడం వట్టి వ్యాయామమే అవుతుంది. భాగవతం జీవన్ముక్తి నంగీకరించింది. శంకరుల వివేక చూడామణి, 'జీవన్ముక్తివివేక చూడామణి"యే! శంకరుల తర్వాత వచ్చిన విద్యారణ్యులవారు 'జీవన్ముక్తివివేకమ'నే గ్రంథం రాశారు. అద్వైతులు జీవన్ముక్త స్థితిని కోరుతారు. అవధూత అయిన శుకమహర్షి జీవన్ముక్తుడే కదా!

## ప్రయోగ విశేషాలు

**1. కలుషగహన దమునన్ యమునన్ (3-170)**

**'దమనః'** శబ్దం సకారాంతం కావడంచేత 'దమున సన్' అని ఉండాలి. అంగిరసుఁడు-అంగిరుఁడు; దుర్వాససుఁడు-దుర్వాసుఁడు-అని తెలుగుకవులు సకారాంత శబ్దాలను నకారాంతాలుగా వాడారు. కాబట్టి, దోషంలేదు. "పాపాలనే అడవులకు నిప్పులాంటిది యమున" అని భావం.

**2. బిందుసరము-బిందుసరస్సు**

**'బిందుసరంబు వినిర్గమించి'** (3-760), **బిందు సరంబున కేఁగి** (3-761) **సముదంచిత బిందు సరస్సరస్వతీ** (3-793) అని పోతన రెండు విధాలుగా ప్రయోగించాడు.

**సూ. సాంతంబుల తుది సకారంబునకు లోపంబు బహుళంబుగానగు"**
**(బాల-తత్సమ-80)**

ఉరము-ఉరస్సు... బహుళ గ్రహణంబునం జేసి పయః ప్రభృతుల సకారంబునకు లోపంబు లేదు. "పయస్సు-వయస్సు-సరస్సు" అని చిన్నయసూరి చెప్పడంవల్ల **'బిందుసరస్సు'** అని ఉండాలి.

**"అట్టి బిందు సరమునందున్న...."** (భార - సభా) (1-9)

**సీ. "బిందుసరంబులోఁ గుందనపుం దమ్మి** (ప్రభా-1-20)

అని నన్నయ, పింగళి సూరనలు ప్రయోగించడంచే 'బిందుసరంబన్న' ప్రయోగం సాధువు.

**చ. మును వృషవర్వుఁ డన్న సురముఖ్యునకై మయుఁడన్ సురారి శి**
**ల్పినిపుణతన్ రచించుటకు బిందుసరంబున నుండి.... - ఆంధ్రమాఘం (13-50)**

అని బుద్ధవరపు మహాదేవకవి కూడా ప్రయోగించాడు.

**3. దేహళి-గేహళి**

దండధర మందిర ద్వార **దేహళీ** (3-26)

విద్రుమ **దేహళీ** వీథు లమర (3-808)

**దేహళీ** గోపురముల నొప్పి (4-744)

చారుకవాట **గేహళీ** (3-45)

కుడ్యకవాట **గేహళీ** (3-513)

వలభీస్తంభార్గళా**గేహళీ** (దశమ-పూర్వ-1594)

అని పోతన రెండువిధాలుగా ప్రయోగించాడు.

సంస్కృత నిఘంటువుల్లో **'దేహళీ'** శబ్దం ఉంది కానీ, **'గేహళీ'** శబ్దం లేదు. **'గేహళి'** సం.వి.ఈ స్త్రీ (దీనిని 'దేహళీ' పర్యాయంగా వాడుతున్నారు) అని శబ్దరత్నాకరం స్వీకరించింది.

**ఛందస్సులు**

**వ. హృదయాకాశంబువలనఁ బ్రణవంబును, రోమంబులవలన నుష్ణిక్ఛందంబును, త్వగింద్రియంబు వలన గాయత్రీ ఛందంబును... (3-388)**

ఇక్కడ 1. ఉష్ణిక్కు 2. గాయత్రి 3. త్రిష్టుప్పు 4. అనుష్టుప్పు 5. జగతి 6. పంక్తి 7. బృహతి అనే ఛందస్సులు పేర్కొనబడ్డాయి. ఇవి 26 ఛందస్సులలోనివి. ఇవి ద్వితీయస్కంధంలో (2-88) విష్ణుమూర్తి వర్ణనలో కూడా ఉన్నాయి.

పోతన భాగవతంలో రెండు దండకాలు కూడా వాడాడు.

**శ్రీనాథ! నాథా! జగన్నాథ!......నమస్తే నమః** (3-203)

**శ్రీ మానినీ మానచోరా! శుభాకార!....నమః** (10-1-1233)

ఈ రెండూ 'త' గణ దండకాలే! ఇష్టమైనన్ని తగణాలు వాటి చివర ఒక గురువును నిల్పడం దండక లక్షణం!

**పూర్వకవుల అనుకరణాలు**

**భర్తృహరి - పోతన**

**శ్లో. న ధ్యాతం పదమీశ్వరస్య విధివత్ సంసార విచ్ఛిత్తయే.....**
**మాతుః కేవలమేవ యౌవన వనచ్ఛేదే కుఠారావయమ్ ॥ - వైరాగ్య శతకమ్**

"ఈ సంసారాన్ని ఛేదించడానికి భగవంతుని పాదాలు స్మరింపలేదు. స్వర్గ ద్వారానికి గల తలుపులు తెరుచుకోవడానికై ధర్మాలు ఆచరింపలేదు. సుందరులైన కాంతల బలిసిన వక్షోజాలను, తొడలను కలలోకూడా కౌగిలించుకోలేదు. కాని, తల్లి యౌవనమనే వనాన్ని ఛేదించడానికై గండ్రగొడ్డళ్లలాగా పుట్టాము" అని భర్తృహరి వాస్తవాన్ని చెప్పాడు.

**వ. ఎంతకాలంబునకుఁ బాప నివృత్తిఁ గానక "మాతృ యౌవనవనకుఠారులై" జనియించి... (3-181)**

పోతన భర్తృహరి శ్లోకపాదాన్ని యథాతథంగా గ్రహించాడు.

**మాఘుడు - పోతన**

**శ్లో. పతత్పతంగ ప్రతిమ స్తపోనిధిః (శిశు.1-12)**

కిందపడుతున్న సూర్యునివలె నారదుడు ఆకాశంనుండి కిందికి దిగినాడని మాఘుడు వర్ణించాడు.

**సీ. లలిత పల్లవ పాణితలమునఁ జెన్నొందు, చెండు పతత్పతంగుండు గాఁగ (3-734)**

సంధ్యాదేవి మెత్తని చేతిలో ఉండే పూలబంతి పడుతున్నసూర్యబింబంవలె ఉందని పోతన వర్ణించాడు. "ఇక్కడ సూర్యుడు కిందపడటం అనేది ఉండదు. ఇది అసంభవం, కాబట్టి, దీన్ని **'అభూతోపమ'** అని దండి మొదలైన ఆలంకారికులు చెప్పారు. **'ఉత్ప్రేక్ష'** అని ఆధునిక ఆలంకారికులు చెప్పారు అని మల్లినాథుని సర్వంకషావ్యాఖ్య. పోతన సీసపద్యంలో మాత్రం పూర్తిగా రూపకాలంకారముంది.

**తిక్కన - పోతన**

**క. కౌరవ పాండవు లిరువురు, నారయ నీకొక్కరూప యవనీవర! నీ**
**వేరీతినైనఁ బాండుకు, మారుల పాలొసఁగితేని మను నుభయంబున్ (3-21)**

ఈ పోతన పద్యాన్ని పరాకుగా చదివితే, ఇది తిక్కనదేమోనన్న భ్రాంతి కలుగుతుంది.

ఈ పీఠికలోనే తిక్కన వాడిన **'పుండరీకాక్ష, అరుణకమలాక్ష'** సమాసాలను విరోధాలంకారంలో పోతన యథాతథంగా గ్రహించడం చూశాం. కవిబ్రహ్మ తిక్కన సోమయాజిపై పోతనకు గల అత్యంత గౌరవానికి ఇది అభిజ్ఞ!

**పోతనను అనుకరించిన కవులు**

**పోతన - శ్రీకృష్ణదేవరాయలు**

**సీ. తలఁప బ్రాహ్మణులుత్తములు, వారికంటెను వేదవేత్తలు, వేదవిదులకంటె**
**విలసిత వేదార్థ విదులు, వారలకంటె... (3-969)**

సీ. ఉందు నప్రాణులం దొక్కించు కాశక్తి, స్థావరశ్రేణిఁ దజ్జాతి కంటె,
నెఱ్ఱరోకటిబండ జెట్టి మన్దిండిము, న్నగు సరీసృపములందంత కంటె -ఆముక్త (3-80)

**సంస్కృత వాక్యానుకరణాలు**

**1. 'అహమేవ మృతోఽస్మి' (3-367)**

**2. కామాంధోఽపి న పశ్యతి (3-382)**

**3. దేవజితం జితంతే పరమేశ్వర (3-423)**

**4. ఆత్మావై పుత్రః (3-456)**

**5. మా మా జక్షత రక్షత (3-723)**

అనే సంస్కృత సూక్తుల్ని పోతన ప్రయోగించాడు.

**పోతన్న పేర్కొన్న శాస్త్ర గ్రంథాలు**

1. రతిరహస్యము (3-807) కొక్కోకుడు రచించిన కామశాస్త్ర గ్రంథం

2. పాంచరాత్రము (3-959) శ్రీవైష్ణవులకు పరమ ప్రమాణమైన ఆగమ శాస్త్ర గ్రంథం.

తిరుమల తిరుపతి దేవస్థానంవారు ప్రాచీనఋషిప్రోక్తమైన ఆగమశాస్త్ర గ్రంథాలనేకం ప్రచురించారు. అందులో వైఖానస మతానికి చెందిన పండితమండలిచే పరిష్కృతమైన ఆగమశాస్త్ర గ్రంథాలేగాక టి.టి.డి. వారి ఆర్థిక సహాయంతో అనేక పాంచరాత్ర ఆగమశాస్త్రగ్రంథాలు వెలువడ్డాయి. వెలువడుతున్నాయి. ఈ విధంగా టి.టి.డి. వారు సాటిలేని సాహిత్య సరస్వతీసేవ చేస్తున్నారు.

**శ్రీమత్పరమేశ్వరార్పణ మస్తు**

విజయవాడ, ఇట్లు
04-01-2017 సకలసుకవిబుధజనవిధేయుడు

**గరిమెళ్ళ సోమయాజులు శర్మ**

# తృతీయస్కంధం - కథాసారం

**శు**కయోగి పరీక్షిత్తుతో ఇలా చెప్తున్నాడు. ఓ రాజేంద్రా! అంధుడైన ధృతరాష్ట్రుడు పుత్రవ్యామోహ మమకారాంధుడైన మూఢుడు. పాండురాజు మరణానంతరం పాండవులు దిక్కులేనివారై పెదతండ్రి ధృతరాష్ట్రుని పంచన చేరారు. కాని, దుర్యోధనాది కౌరవులు బాల్యంనుండి పాండవులపట్ల అసూయాగ్రస్తులై, వారికి అన్నివిధాలా కీడు తలపెట్టేవారు. విషాన్నంపెట్టి, తాళ్లతో కట్టి, నదిలోకి నెట్టి, లక్కయింటిలో ఉండగా నిప్పు పెట్టి, ఇలా ఎన్నో దుష్కృత్యాలకు పాల్పడ్డారు. నిండు కొలువులో పాంచాలిని కొప్పుపట్టి యీడ్చి, వివస్త్రను చేయడానికి ప్రయత్నించినా ఆ గుడ్డిరాజు కొడుకులను మందలించలేదు. చివరకు మాయాజూదంలో అన్యాయంగా పాండవులను ఓడించి, రాజ్యం లాక్కొని, వారిని అడవులకు వెళ్లగొడితే, వారు పదమూడేండ్లు అరణ్య, అజ్ఞాతవాసాలను పూర్తి చేసుకొని, తమ రాజ్యభాగాన్ని ఇమ్మని అడిగితే ఇవ్వ లేదు. చివరకు ధర్మరాజు కోరికపై సాక్షాత్తూ శ్రీకృష్ణభగవానుడే రాయబారిగా వెళ్లి ధృతరాష్ట్రునికి, కౌరవులకు అనేకవిధాలా హితబోధ చేసినా భీష్మద్రోణాదులూ రాజశ్రేష్ఠులూ అందరూ సంతోషించినా, శ్రీకృష్ణుని హితబోధలు ధృతరాష్ట్రునికి రుచించలేదు. అప్పుడు శ్రీకృష్ణుడు అశేషనీతి విశారదుడైన విదురుణ్ణి రప్పించగా, అతడు వచ్చి విషయాన్ని తెలుసుకొని అన్న అయిన ధృతరాష్ట్రునితో 'మహారాజా! కౌరవపాండవులిద్దరూ నీకు సమానులే. నీ తమ్ముడైన పాండురాజు యొక్క కుమారులను రక్షించడం మన ధర్మం. అందుచేత అందరూ అన్యోన్యంగా ఉంటే సుఖశాంతులతో వర్ధిల్లి, శత్రువిజయాలను పొందుతారు. నీ కొడుకుల ఆర్భాటాలూ, కర్ణాదుల ప్రగల్భాలూ విని అకారణంగా వంశనాశనం చేసుకోవద్దు. సాక్షాత్తూ భగవంతుడైన శ్రీకృష్ణుడే ధర్మపక్షం వహించి, పాండవులకు చెలికాడై, చుట్టమై, హితుడై, స్నేహితుడై, ప్రభువై, ప్రబోధకుడై, రక్షకుడై ఉండగా, వాళ్లను ఎవరూ ఏమీ చేయలేరు. పైగా వారికి హాని తలపెట్టిన వారికి హాని కలగడం తథ్యం.

కాబట్టి, అన్నయ్యా! నా మాటలాలకించి, బంధుమిత్రపుత్రులను, వంశాన్ని, దేశాన్ని కాపాడు. దుష్టచతుష్టయం యొక్క దుర్బోధలు విన్నావా సకల నాశనం తప్పదు' అని చెప్పిన విదురుని మాటలు విన్న దుర్యోధనుడు కోపోద్రిక్తుడై "ఈ దాసీపుత్రుని నిండు సభలోకి ఎందుకు రానిచ్చారు? ఉచితాసనం వేసి ఎందుకు గౌరవించారు? అనవసర అధిక ప్రసంగాలు చేస్తున్న ఈ తుంటరిని గెంటివేయండి" అని కేకలు వేయగా విదురుని మనసు చివుక్కుమంది. సభలోని పెద్దలందరూ మౌనంగా దుఃఖించారు. విదురుడు ప్రశాంతచిత్తుడై భగవంతుని స్మరించగా, అతనికి కర్తవ్యం బోధపడింది. మనసు దిటవు చేసుకొని నెమ్మదిగా లేచి, తన విల్లమ్ములను సభాద్వారం వద్ద విడిచిపెట్టి, వెనుదిరిగి చూడకుండా రాబోయే కురుపాండవ సంగ్రామానికి దూరంగా వెళ్లిపోయాడు.

విదురుడు రాగద్వేషరహితుడై, సన్న్యాసియై, దేశసంచారం చేస్తూ, పుణ్యక్షేత్రాలను, పవిత్ర నదీనదాలనూ, ఆశ్రమప్రదేశాలనూ, తపోవనాలనూ సంచరిస్తూ, కందమూలాదులను తింటూ కొన్ని సంవత్సరాలకు ప్రభాస తీర్థం చేరుకొన్నాడు. అప్పటికి కురుక్షేత్రయుద్ధం జరిగి కౌరవులు నశించి శ్రీకృష్ణుని అనుగ్రహంచే ధర్మరాజు హస్తినాపుర సామ్రాజ్యాన్ని పరిపాలిస్తున్నాడు. ఇవన్నీ తెలుసుకొన్న విదురుడు తన తీర్థయాత్ర ముగించుకొని

హస్తినాపురం వెళ్లే ఉద్దేశంతో ముందుకు సాగిపోతుండగా కొంతదూరం తర్వాత, యమునానదీతీరం చేరుకొన్నాడు. అక్కడ మహాభాగవతోత్తముడూ, శ్రీకృష్ణునికి ప్రియతమ భక్తుడూ అయిన ఉద్ధవుని చూసి, గాఢాలింగనం చేసుకొని యాదవవీరులనందరినీ పేరుపేరునా అడిగి కుశలప్రశ్నలు వేశాడు. బలరామకృష్ణుల గురించి అడిగేసరికి దుఃఖాన్ని ఆపుకోలేక ఉద్ధవుడు బిగ్గరగా రోదించసాగాడు. కొంతసేపటికి సత్తువ కూడ దీసుకొని – "ఓ విదుర మహాశయా! జగద్బంధువూ, మహాతేజస్వీ అయిన శ్రీకృష్ణుడు అవతారం చాలించాడు. ధర్మానికి చీకట్లు కమ్ముకొన్నాయి. భగవల్లీలాప్రభావంచే ఆ కృష్ణుని యాదవులు తమ సఖునిగా, చుట్టంగా నాయకుడుగానే భావించారు. కాని, లీలామానుషరూపుడైన పరమేశ్వరుడని తెలుసుకోలేకపోయారు. మదోన్మత్తులైన శిశుపాల జరాసంధాది దుష్టులుకూడా ఆయనను దేవదేవుడుగా తెలుసుకోలేక నానాదుర్భాషలాడారు.

కృష్ణపరమాత్మ వారి వారి స్వభావాలనుబట్టి కొందరికి శాంతుడుగా, కొందరికి భయంకరుడుగా, వారి వారి స్వభావాల్నిబట్టి వివిధరకాలుగా కనిపించినా, అందరినీ మన్నించి వాత్సల్యాన్నే ప్రదర్శించాడు. శత్రుత్వభావం వహించిన శిశుపాలాదులకు, విషపు చనుబాలిచ్చిన పూతనకు, కంసాది రాక్షసులకు, తనను చంపటానికి వచ్చిన క్రూరులకు కూడా మోక్షపదాన్ని ప్రసాదించిన శ్రీకృష్ణుడు ఇకలేడయ్యా! కురుక్షేత్రయుద్ధంలో ఆ దేవదేవుని ముఖారవిందాన్ని చూస్తూ ప్రాణాలు విడిచిన శత్రురాజులందరికీ పుణ్యలోకప్రాప్తిని కలిగించిన కరుణామూర్తి ఆ శ్రీకృష్ణుడు.

కంసుడు పంపిన రాక్షసులతోపాటు, ఆ కంసుని కూడా చంపి, ఆ రాజ్యాన్ని చేజిక్కించుకోకుండా, కంసుని తండ్రి అయిన ఉగ్రసేనుని సింహాసనం ఎక్కించి, "ఓ రాజా! నీ ఆజ్ఞలను శిరసావహించడానికి సిద్ధంగా ఉన్నాం" అని పలికిన మహాత్ముడు మన శ్రీకృష్ణుడు. అంతేకాదు, యమునానదిలో కాళింది మడుగులో కాళియసర్పంయొక్క మదాన్ని అణచి బృందావనాన్ని రక్షించాడు. ఇంద్రుడు కురిపించిన పిడుగుల, రాళ్ల వర్షంనుండి గోపాలురను రక్షించడానికి గోవర్ధనగిరిని ఎత్తి ఒక గొడుగులా పట్టుకొని ఆబాలగోపాలం దానికింద తలదాచుకొనేటట్లు ఏడురోజులు అందరినీ కాపాడాడు. తానే జగద్గురువు అయినా లోకాచారాన్నిబట్టి సాందీపని మహర్షివద్ద సమస్త వేదశాస్త్రాల్ని అభ్యసించాడు. పంచజనుడనే రాక్షసునిచే మృతుడైన గురుపుత్రుని బతికించి తెచ్చి గురుదక్షిణగా సమర్పించాడు. భీష్మక పుత్రిక అయిన రుక్మిణీదేవి స్వయంవరానికి వచ్చిన రాజులందరినీ జయించి, ఆమెను అపహరించి తీసుకుపోయి పెళ్లి చేసుకొన్నాడు. ఎవరికీ సాధ్యంకాని ఏడు పొగరుబోతు ఎద్దులను ఒకేసారి లొంగదీసుకొని, బంధించి నాగ్నజితిని చేపట్టాడు. దేవలోకం నుండి పారిజాత వృక్షాన్ని పెకలించి భూలోకానికి తెచ్చి సత్యభామకు బహుమతిగా ఇచ్చాడు. భూపుత్రుడైన నరకాసురుని చంపి, అతనిచేత బంధింపబడిన పదహారువేల రాజకాంతలను విడిపించి, వారి ప్రార్థన మన్నించి, వారినందరినీ భార్యలుగా స్వీకరించి, వారందరినీ పదహారువేల కృష్ణరూపాలతో ఆనందింపజేసిన అత్యద్భుత అనురాగమూర్తి శ్రీకృష్ణపరమాత్మ.

అలాగే మధురను చుట్టుముట్టిన జరాసంధాది దుష్టులను సైన్యసమేతంగా అంతం చేయించాడు. పాండవుల శత్రువులను నశింపజేశాడు. మహాభారతయుద్ధంలో ఇరుపక్షాలా ఉన్న పద్దెనిమిది అక్షౌహిణుల సైన్యాలు, వారితో

ఉన్న మదాంధులైన రాజులు అందరూ నశించిపోయినా, ఇంకా మరింత భూభారం నశింపవలసి ఉన్నదని గమనించి, సరైన అదనుకై వేచి ఉన్నాడు.

శ్రీకృష్ణపరమాత్మ రాజయోగియై, వైదిక లౌకికకర్మలన్నింటినీ నిర్వహిస్తూ, ఏ కర్మలచేత బంధింపబడనివాడై నిరంతరం బ్రహ్మానందభరితుడై, అందరినీ ఆనందింపజేసేవాడు. ఒకసారి ద్వారకకు కొందరు మహామునులు వచ్చారు. గర్వోన్మత్తులైన కొందరు యాదవయోధులు ఆ మహర్షులను సమీపించి పరిహాసాలాడగా, వారు కోపించి యాదవకులంలో ముసలం పుట్టి నశించిపోతారని శపించి వెళ్లిపోయారు. శ్రీకృష్ణుడు భూభారాన్ని తగ్గించే ప్రయత్నంలో భాగంగా పన్నిన వ్యూహమిది. కొన్ని మాసాల తరువాత యాదవులంతా ఒక మహోత్సవం చేసే నిమిత్తం ప్రభాసతీర్థం వెళ్లి, సుష్ఠుగా మృష్టాన్నాలను భుజించి, మితిమీరి మద్యం తాగి, మత్తెక్కి, పరస్పరం కలహించుకొని, పరిహాసాలతో పోరాడి చంపుకొన్నారు. అంతా గమనిస్తున్నప్పటికీ, శ్రీకృష్ణుడు నిర్వికారుడై యాదవులందరికీ ఉత్తరక్రియలు జరిపించాడు. బలరాముడు దేహత్యాగం చేసి వెళ్లిపోయాడు.

ఇంకా ఉద్ధవుడు విదురునితో ఇలా చెప్పసాగాడు. ఓ మహాశయా! శ్రీకృష్ణుని విడిచి ఉండలేక నేను పరిపరి విధాలా ఆయనను వెదుక్కొంటూ పోయి పోయి పరితపిస్తూ ఉన్న నాకు, ఒకచోట చతుర్బాహువులతో, అపార దివ్యతేజస్సుతో ప్రకాశిస్తూ, ఒక రావిచెట్టును ఆనుకొని కూర్చున్న దివ్యమంగళరూపుడైన వాసుదేవుని దర్శించి, అమందమైన ఆనందాన్ని అనుభవించాను. సరిగ్గా అదే సమయానికి వేదవ్యాసుని సహాధ్యాయుడు, భక్తాగ్రేసరుడు అయిన మైత్రేయమహర్షి తీర్థయాత్రలు చేస్తూ, మహాయోగీంద్రవందితుడూ, మహాతేజోరూపుడూ అయిన శ్రీకృష్ణభగవానుణ్ణి దర్శిస్తూ, కనులు మూసి ఆ దివ్యసుందరమూర్తిని పదే పదే హృదయపద్మంలో పదిలపరుచుకొంటూ, పులకాంకితుడై, పరవశిస్తూ అలాగే నిలబడిపోయాడు. పక్కనే ఉన్న మైత్రేయుడు వింటుండగా ఆ శ్రీకృష్ణప్రభువు నాతో ఇలా చెప్పాడు. ఓ ఉద్ధవా! నీవు పూర్వజన్మలో దేవపురోహితుడైన వసువువు. మీవారు అందరూ చేస్తున్న సత్త్రయాగంలో నీవు ఏ ఇతర వాంఛలూ లేనివాడవై, నిరంతరం నా పాదసేవనే అభిలషించావు. కనుకనే నేనెప్పుడూ నీ హృదయంలోనే ఉంటాను. నీకిదే చివరి జన్మ కనుక నేను పద్మకల్పసమయంలో బ్రహ్మకిచ్చిన దివ్యజ్ఞానాన్ని నీకు ఇస్తాను. తద్వారా నీకు సాంసారికబంధాలు తొలగి నా దివ్యమహత్త్వం అర్థమౌతుంది" అని వాసుదేవుడు చెప్పాడు. అది విన్న నా శరీరం సంతోషంతో పులకించి కండ్లనుండి ఆనందబాష్పాలు ధారలుగా వెలువడ్డాయి. స్వామిపాదాలపై ప్రణమిల్లాను. ఆ పరమేశ్వరుడు నాకు ఆ పరతత్త్వజ్ఞానాన్ని ప్రసాదించాడు. ఆ దేవదేవుని విడిచి ఉండలేక నేను తిరిగి తిరిగి బదరికాశ్రమానికి చేరుకున్నాను – అని చెప్పి ఉద్ధవుడు విదురునితో కొంతదూరం ప్రయాణం చేస్తూ ఇలా అన్నాడు.

"ఓ విదురా! సాక్షాత్తూ భగవత్సమానుడైన మైత్రేయుడు తన చిత్తంలో శ్రీహరినే నిలుపుకొని మరికొద్ది రోజుల్లో దేహత్యాగం చేసే తలంపులో ఉన్నాడు. పైగా, శ్రీకృష్ణుడు నీకు తత్త్వజ్ఞానాన్ని బోధించమని మైత్రేయునికి ఆదేశించాడు కనుక, నీవు ఆలస్యం చేయకుండా అక్కడికి వెళ్లి మైత్రేయుని అర్థిస్తే, అతడు నీకు పారమార్థిక తత్త్వజ్ఞానాన్ని అనుగ్రహిస్తాడు" అని చెప్పి ఉద్ధవుడు వెళ్లిపోయాడు.

ఆ తరువాత విదురుడు యమున దాటి గంగానదీతీరాన్ని చేరాడు. అక్కడ గంగ ఒడ్డున ఇసుకతిన్నెలమీద పద్మాసనస్థుడై శ్రీకృష్ణుని ధ్యానించే యోగిపుంగవుడూ, పరమపవిత్రుడూ అయిన మైత్రేయుణ్ణి దర్శించి, సాష్టాంగ దండప్రణామం చేసి మహాత్మా! లోకంలో మానవులు అనేకరకాల సుఖాల్ని వాంఛిస్తూ కర్మలను ఆచరిస్తున్నారు. కానీ, వారికి చివరికి మిగిలేది దుఃఖమే కదా. అటువంటి వారిని సత్క్రమమార్గంలో నడపడానికే తమబోటివారు లోకంలో అవతరించి పుణ్యాత్ములై లోకకళ్యాణకాంక్షతో జీవయాత్ర సాగిస్తారు. ఇప్పుడు మీద్వారా ఆ పురుషోత్తముని గాథలు వినాలని కుతూహలపడుతున్నాను. శ్రీమన్నారాయణ కథాసుధారసాన్ని ఆస్వాదించిన వారికి ఇతరాలన్నీ గరళప్రాయాలే కదా! కనుక తమరు నన్ను అనుగ్రహించి ఆ పరమపురుషునితత్త్వాన్ని ఉపదేశించండి. క్రియారహితుడైన భగవంతుడు తనను తాను ఎందుకు, ఏవిధంగా సృష్టించుకొన్నాడు? సృష్టి స్థితి లయకార్యాలను ఏవిధంగా నిర్వహిస్తున్నాడు? ఈ లోకంలో మానవులందరూ సౌఖ్యభోగాలకోసం ఏవేవో కర్మలు ఆచరిస్తూ, ఆశించిన ఫలితం లభించక దుఃఖాత్ములౌతున్నారు. పైగా ఈ కర్మలన్నీ బంధహేతువులు. బంధాలు దుఃఖానికి కారణాలు. అంతటితో ఆగకుండా చేసిన కర్మల ఫలాలను అనుభవించడానికి పుడుతూ చస్తూ ఈ చక్రంలో చిక్కుకొంటున్నారు. అందువల్ల అలాంటివాటినుండి విముక్తికై అనుసరించదగిన దారి చూపండి. నాకు భగవత్‌తత్త్వ జ్ఞానబోధ చేయండి – అని విదురుడు వేడుకోగా మైత్రేయ మహర్షి మిక్కిలి సంతోషించి ఇలా చెప్పసాగాడు. ఓ పుణ్యాత్మా! నీవు సాక్షాత్తూ యమధర్మరాజువు. మాండవ్యముని శాపంవలన శూద్రకాంతయందు మానవదేహంతో జన్మించావు. మీదు మిక్కిలి శ్రీమన్నారాయణునకు మిక్కిలి ఇష్టుడవు కనుక శ్రీకృష్ణుడు నన్ను చేరబిలిచి ఆయన నాకు బోధించిన గొప్ప తత్త్వజ్ఞానాన్ని నీకు బోధించుమని నన్ను ఆదేశించాడు. అందుచేత నేను నీకు అంతా బోధిస్తాను. నేను నీకు చెప్పబోయే ఈ పరమరహస్యాలను ఏకాగ్రచిత్తంతో ఆలకించు. వీటిని విన్నవారికి సమస్త శుభాలు కలుగుతాయి.

“భాగవత శిరోమణివైన ఓ విదురా! ఈ సృష్టికి ఆరంభంలో దేవాధిదేవుడు తన అంశతో మహాపురుషుణ్ణి సృష్టించి, అనంతరం మాయామయంగా మహత్తత్త్వం కల్పించాడు. దానినుండి కార్య, కారణ, కర్తలు, పంచభూతాలు, అందులోనుండి పంచేంద్రియాలు, మనస్సు ఏర్పడ్డాయి.

సత్త్వరజస్తమోమయమైన అహంకారం పుట్టింది. తర్వాత సాత్త్వికాహంకారం ఇంద్రియాధిష్ఠాన దేవతలయిన దేవగణాలు వచ్చాయి. ముందుగా శబ్దం ఉద్భవించింది. తరువాత జ్ఞానేంద్రియాలు (నేత్ర, నాసికా, జిహ్వా, కర్ణ, చర్మాలు), కర్మేంద్రియాలు (వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలు) వచ్చాయి.

తామసాహంకారం వలన శబ్ద, స్పర్శ, రూప రస, గంధాలూ; శబ్దంవలన ఆకాశం; అది స్పర్శతో కలిసి గాలి; ఈ రెండూ కలిసి తేజస్సు, తర్వాత జలం; అనంతరం గంధగుణంతో భూమి ఉద్భవించాయి. ఇందులో ఆకాశానికి శబ్దగుణం, వాయువుకు శబ్దస్పర్శగుణాలు; నీటికి శబ్దస్పర్శ రస రూపగుణాలు; భూమికి శబ్దస్పర్శ రసరూపగంధాలనే అయిదు గుణాలు వచ్చాయి. అయితే ఇవి ఒకదానితో ఒకటి కలిస్తేనే సృష్టి సాగుతుంది కనుక

ఆ సమ్మేళనంతో ప్రాణికోటిని సృష్టించాడు. అలాంటి వాసుదేవుని మహిమను తెలుసుకోవడం బ్రహ్మకు కూడా శక్యంకాదు. అందుచేతనే గోవింద పాదారవిందసేవ అందరికీ అవశ్య కర్తవ్యం.

అయితే అఖిలాండకోటి బ్రహ్మాండ భాండాలలో విస్తరించిన శ్రీహరికి కర్మబంధాలు లేవా? అని అనిపించవచ్చు. ఆకాశంలోని చంద్రుడు నీటిలో ప్రతిబింబిస్తూ ఉంటాడు. నీరు కదిలితే ప్రతిబింబం కూడా కదులుతూ ఉంటుంది. అంతమాత్రాన ఆకాశంలోని చంద్రుడు ఊగిసలాడటం లేదు కదా! అలాగే ఆదిదేవుని లీలలు కూడా ఇట్లాంటివే. అజ్ఞానంతో కొట్టుమిట్టులాడే జీవుణ్ణి పట్టుకొన్న ఈ కర్మబంధాలన్నీ తొలగిపోవాలంటే భగవన్నామస్మరణం ఒక్కటే శరణ్యం".

"ఓ విదుర మహాశయా! మరికొన్ని విశేషాలు చెప్తాను విను. వాసుదేవనామంతో ప్రకాశించే పురాణపురుషుడు వేదసారమైన భాగవతాన్ని చేతపట్టి, పాతాళలోకానికి వెళ్లి ధ్యానంలో ఉండగా, అక్కడికి సనకసందనాదులు వచ్చారు. శ్రీహరి వారిని అనుగ్రహించడానికి కన్నులు విప్పి చూశాడు. వారు ఆయనను పరిపరివిధాల ప్రస్తుతించారు. అప్పుడు ఆయన భాగవతగాథను సనత్కుమారునికి వివరించాడు. ఆ సనత్కుమారుడు దీనిని సాంఖ్యాయన మునికి, ఆయన పరాశరునికి, పరాశరుడు బృహస్పతికి, ఆయన నాకు ఉపదేశించగా దాన్ని నేను నీకు బోధిస్తున్నాను.

విశ్వమంతా జలమయమై ఉన్నప్పుడు వేయిపడగల శేషసర్పతల్పంపై లీలావిలాసంగా ఉన్నవేళ మాయావిదూరుడై ఆనందంతో ఉండే సమయంలో మరలా ప్రపంచాన్ని సృష్టించే కోరికతో ఆయన తన నాభినుండి ఒక పద్మాన్ని, దానినుండి వేదరూపుడైన చతుర్ముఖ బ్రహ్మను సృష్టించాడు. ఆ బ్రహ్మ నాలుగు ముఖాలతో నలుదిక్కులు చూస్తూ ఏమీ తెలియక ఆ తామరపూవు కింద ఉన్న తూడుద్వారా దాని మూలం కనుక్కొందామని ప్రయత్నించి, ఏమీ కనిపించకపోవడంచేత మళ్లీ తామరపువ్వు పైకి వచ్చి, సుఖాసీనుడై యోగవిద్యతో దర్శింపగా పద్మపత్రాలవంటి కన్నులు గలిగి, గరుడవాహనంతో, శేషతల్పంమీద ఉన్న శ్రీమన్నారాయణుని దివ్యరూపం గోచరించింది. ఆ విరాట్పురుషునికి అభివాదనం చేసి, ఆయన అనుమతితో సృష్టి చేయడానికి సంకల్పించి తపస్సమాధిలో కొన్ని సంవత్సరాలు గడిపి, అనంతరం మూడులోకాలూ సాక్షాత్కరించగా వాటికి రూపం ఇచ్చాడు.

ఈ సృష్టిలో ముందుగా వృక్షాలూ, అందులోనూ పూలతో నిమిత్తంలేని విత్తనాలు గల రావి, మర్రివంటి చెట్లూ (వనస్పతులు), అనంతరం పుష్పించి ఫలించి విత్తనాలయ్యే కాయధాన్యాలూ మొక్కలూ సృష్టింపబడ్డాయి. తరువాత కేవలం చర్మమే ఉండే వెదురూ, తర్వాత మామిడి మొదలైన ఫలవృక్షాలూ, పిమ్మట రెండుగిట్టలుండే పశుజాతులూ, ఒకేడెక్క గల జంతుజాతులూ, అనంతరం అయిదు మార్జాల, మర్కట, సింహ, గజ, కూర్మాదులూ, ఆ పిమ్మట జలపక్షులూ, జలచరాలూ, ఎగిరివెళ్లే పక్షులూ, అనంతరం మనిషీ బ్రహ్మసృష్టి నుండి ఉద్భవించాయి. ఆయన మళ్లీ విబుధులూ, పితృదేవతలూ, గరుడగంధర్వ, కిన్నర, కింపురుష, అప్సరస సమూహాలూ, యక్షరాక్షస వర్గమూ, భూతప్రేతపిశాచ కూటాలూ, సిద్ధ, సాధ్య, చారణ, విద్యాధర బృందమూ వివిధ దేవగణాలూ ఇలా క్రమేణా ఒక్కొక్కటిగా అన్నింటినీ సృష్టించాడు. అలాగే కాలస్వరూపం చెప్తాను. పరమాణువు, అణువు, త్రసరేణువు,

త్రుటి, వేధ, లవం, నిమేషం, క్షణం, కాష్ఠ, లఘువు, నాడి, ముహూర్తం, ప్రహరం, యామం, పూట (పగలు / రాత్రి), దినం, పక్షం, నెల, ఋతువు, అయనం, సంవత్సరం, దివ్యవర్షం, యుగం, మహాయుగం – ఈ రీతిగా కాలమానం ఏర్పరచబడింది. ధర్మం – కృతయుగంలో నాలుగు పాదాలతోనూ, త్రేతాయుగంలో మూడు పాదాలతోనూ, ద్వాపరయుగంలో రెండు పాదాలతోనూ, కలియుగంలో ఒకేపాదంతోనూ నడుస్తుంది. అందుచేతనే కలియుగంలో ధర్మబుద్ధి నశించి దుష్టచింతనలు, పాపకర్మలు అధికమౌతాయి. నాలుగుయుగాలు ఒక మహాయుగం. అటువంటి వేయిమహాయుగాలైతే బ్రహ్మకు ఒక పగలు. అప్పుడు ఆయన నిద్రకు ఉపక్రమిస్తాడు. అప్పుడు పదునాలుగు లోకాలూ పరమాణురూపుడైన పరమాత్మలోనే లీనమౌతాయి. నిద్ర లేచాక మళ్లీ బ్రహ్మసృష్టి ప్రారంభమౌతుంది".

ఇంకా మైత్రేయుడు ఇలా చెప్పసాగాడు. ఓ విదురమహాశయా! ప్రతికల్పారంభంలోనూ సృష్టి జరుగుతుంది. ఇప్పుడు బ్రహ్మ చేసిన సృష్టిక్రమాన్ని వివరిస్తాను. సావధానంగా విను. పూర్వం బ్రహ్మదేవుడు 'నేను సృష్టిస్తాను' అని సంకల్పించగానే దేహాభిమానంతో అహంకారపూరితమైన 'మోహం' పుట్టింది. భోగాసక్తితో కూడిన **'మహామోహం'** పుట్టింది. కోర్కెలకు విఘ్నం కలుగగానే కనులుగానని 'క్రోధం' పుట్టింది. మృత్యుభయంతోకూడిన **'తామిస్రం'**, **'అంధతామిస్రం'** పుట్టాయి. వీటివలన కలిగే చిత్తవిభ్రమాన్నే **'అవిద్యాపంచకం'** అంటారు. అవిద్యాపంచకంతో భూతకోటిని సృష్టించడం పాపకార్యమని గుర్తించి, పశ్చాత్తాపపడి, భగవద్ధ్యానం చేసి పవిత్రహృదయంతో సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులను సృష్టించి సదాచారతత్పరత కలిగిన ప్రజలను ఉత్పత్తి చేయండి అని బ్రహ్మ వారిని ఆదేశించగా 'మోక్షధర్ములమై శ్రీహరి పాదాలను సేవిస్తాము కాని సంసారులము కాలేము' అని వారు అతనిమాట తోసిపుచ్చారు.

అప్పుడు బ్రహ్మకు పట్టరానంత కోపంవచ్చి, ఆయన భ్రూమధ్యం నుండి క్రోధస్వరూపుడైన నీలలోహితుడు ఉద్భవించాడు. అతడు పుడుతూనే రౌద్రంగా రోదించడంచేత రుద్రుడయ్యాడు. 'నీవు ఆకాశంనిండా వ్యాపించి చంద్రసూర్యాగ్ని వాయుజలపృథివీ ప్రాణాలతో ఉంటావు' అని బ్రహ్మ ఆ పరమశివునికి సృష్టికార్యం అప్పగించాడు. ఆయన అన్ని విషయాలలో తననే పోలేవిధంగా గణాలను సృష్టించాడు. ఆ రుద్రగణాలు విశ్వాన్నే మింగగా బ్రహ్మ వారిని వారించి మీరు 'తపోదీక్ష వహించండి' అని పంపివేసి, తర్వాత పదిమందిని సృష్టించాడు. వారే దక్ష, నారద, పులహ, పులస్త్య, భృగు, క్రతు, అంగీరస, వశిష్ఠ, మరీచి, అత్రి మహర్షులు. అదే సమయంలో ధర్మదేవత, మృత్యుదేవతలు, మన్మథుడు పుట్టారు. అప్పుడే పుట్టిన సరస్వతీదేవిని బ్రహ్మ కామించగా అంతకుముందు పుట్టిన అత్రి మొదలైన మునులు నిందించారు.

అప్పుడు బ్రహ్మ తన దేహాన్ని త్యజించి, మరొక శరీరాన్ని ధరించి సృష్టికార్యం గురించి ఆలోచిస్తుండగా ఆయన నాలుగు ముఖాలనుండి చతుర్వేదాలు పుట్టాయి. క్రమేణా సర్వశాస్త్రాలు పుట్టాయి. బ్రహ్మ ప్రజాసృష్టి కోసం ఆలోచించగా స్వాయంభువమనువు, శతరూప ప్రభవించారు. ఈ దంపతులకు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే కొడుకులూ, ఆకూతి, దేవహూతి, ప్రసూతి అనే ఆడపిల్లలూ పుట్టారు. ఆ ఆకూతిని రుచికుడు, దేవహూతిని కర్దముడు, ప్రసూతిని దక్షుడు పెళ్లి చేసుకొని మానవ ప్రపంచాన్ని ప్రవృద్ధం చేశారు. స్వాయంభువుని కోరికపై

జలమయంగా ఉన్న ప్రదేశంలో నివాసయోగ్యమైన స్థలం కావాలి అని బ్రహ్మ శ్రీమన్నారాయణుని ప్రార్థించాడు – అని మైత్రేయ మహర్షి విదురునితో ఇలా చెప్పసాగాడు.

ఓ విదురా! కశ్యపప్రజాపతి భార్యలలో 'దితి' ఒకతె. ఆమె ఒకనాటి సాయంసంధ్యలో భర్తను చేరి 'ఓ నాథా! నా సవతులందరూ సంతానవతులై సుఖంగా ఉన్నారు. నాకుకూడా సంతానవతి అయ్యే భాగ్యాన్ని ఈ క్షణంలో అనుగ్రహించండి' అని కోరింది. సంధ్యాసమయం అందుకు సముచితం కాదని చెప్పినా ఆమె పట్టుబట్టడంవల్ల కాదనలేకపోయాడు. ఆమెగర్భంలో పుట్టే బిడ్డలు క్రూరస్వభావులైన రాక్షసులవుతారని, వారిని శ్రీహరి సంహరిస్తాడని చెప్పాడు. అప్పుడామె దీనంగా ప్రార్థించగా కశ్యపుడు వారికి కలిగే బిడ్డడు మాత్రం శాశ్వత సత్కీర్తికారకుడౌతాడని చెప్పాడు. దితికి నెలలు నిండుతున్నాయి. ఆమె గర్భస్థ శిశువులు సకల లోకాలకు దుస్సహం కాగా దేవతలందరూ శ్రీమన్నారాయణుణ్ణి వేడుకోగా ఆయన వారితో 'ఓ దేవతలారా! కొంతకాలం ఓపికపట్టండి. ఒకనాడు నా సందర్శనకై వచ్చిన సనకాదిమహర్షులను జయవిజయులు అడ్డగించి ఆగ్రహించి శపించారు. ఆ ద్వారపాలకులే దితి గర్భంలో జన్మిస్తున్నారు అని వివరించాడు. దితి గర్భంలో పుట్టినవారే హిరణ్యాక్షుడు, హిరణ్యకశిపుడు. వారిద్దరూ అపారపరాక్రమంతో సకల భువనాలను జయించి సర్వలోకాధీశులయ్యారు.

ఒకనాడు హిరణ్యాక్షుడు యుద్ధానికై వరుణుని ఆహ్వానించగా 'ఆయన దానవేంద్రా! నేను యుద్ధప్రీతిని విడిచి శాంతచిత్తుడనై ఉన్నాను. అంతేకాదు' నీవంటి మహావీరునికి తగినవాడు వైకుంఠంలో శ్రీమహావిష్ణువు ఉన్నాడు. నీవు ఆయనతో తలపడితే ఎవరి శక్తి ఎంతటితో సకల లోకాలకు తెలుస్తుంది. అంతేకాక, ఆయన రాక్షస సంహారదీక్షలో ఉన్నాడని విన్నాను' – అని చెప్పగా హిరణ్యాక్షుడు ఆవేశంతో వైకుంఠానికి బయలుదేరాడు. త్రోవలో ఎదురైన నారదునిద్వారా శ్రీమన్నారాయణుడు భూభారాన్ని వహిస్తూ రసాతలంలో వరాహరూపంలో ఉన్నాడని తెలుసుకొని గదాదండం తిప్పుతూ రసాతలం చేరుకొన్నాడు. వస్తున్న రాక్షసుణ్ణి చూస్తూ శ్రీహరి కోపంతో చూపులతోనే వాడి దేహకాంతిని హరించి, ఒక్కసారి తన ముట్టెతో కిందికి పొడిచి, కాలితో తవ్వి పైకెగిరి, తన కోర పైభాగంపై భూమిని నిల్పి, పరుగెత్తుతుండగా, ఆ దానవరాజు వెంట తరుముతూ, నిందిస్తూ రాగా, శ్రీహరి భూమిని సాగరంమీద ఉంచి యుద్ధసన్నద్ధుడయ్యాడు.

హిరణ్యాక్షుడు విసిరిన గదాదండాన్ని ముక్కలుగాచేసి కొంతసేపు పోరు సాగించి, హిరణ్యాక్షుని మాయలన్నింటిని నిరోధించాడు స్వామి. అపుడు హిరణ్యాక్షుడు మల్లయుద్ధానికి దిగాడు. ఆ పోరాటంలో మహావిష్ణువు తన అరచేతితో హిరణ్యాక్షుని రొమ్ము బద్దలుగొట్టి, వజ్రఘాతాల వంటి పిడిగుద్దులతో హిరణ్యాక్షుని నేలగూల్చాడు. అపుడు సకల దేవతాగణాలు, మహర్షులు, సాధుసజ్జనులందరూ ప్రార్థించగా శ్రీహరి శాంతించి వైకుంఠ లోకానికి చేరుకొన్నాడు.

ఓ విదురా! స్వాయంభువమనువు తన కుమార్తె అయిన దేవహూతిని వెంటబెట్టుకొని కర్దమప్రజాపతి వద్దకు వెళ్ళి ఆర్యా! ఈమె నా కూతురు. ఈమె శ్రీహరిని దర్శించినవారికి తప్ప ఇతరులకు గోచరించదు. ఈమెను కామదృష్టితో చూచినవారు మృత్యువాతపడతారు. అటువంటి పవిత్రగుణవతి అయిన నా కుమార్తె నిన్ను భర్తగా

వరిస్తున్నది అని చెప్పగా కర్దముడు సంతోషించి అంగీకారం తెలిపాడు. కాని, దాంపత్య జీవితఫల పరమావధి అయిన సంతానం కలుగగానే నేను యోగాభ్యాసంతో శ్రీహరి ధ్యానంలోనే గడుపుతాను. ఇది నా నియమమని చెప్పాడు. అపుడు స్వాయంభువప్రజాపతి భార్య శతరూపయొక్క, కుమార్తె దేవహూతియొక్క అంగీకారం తీసుకొని వివాహం జరిపించాడు. ఆమె తన భర్తయైన కర్దముని అత్యంత భక్తిశ్రద్ధలతో సేవిస్తుండగా ఆయన సంతోషించి నీవు చేసిన సేవలకు సంతుష్టి కలిగి నీకు దివ్యదృష్టిని ప్రసాదిస్తున్నాను అన్నాడు.

అప్పుడు ఆమె భర్తతో 'ఓ నాథా! మీ సేవలో నాకు సర్వశక్తులూ లభిస్తాయని తెలుసు. కాని, మన పెళ్లిలో మీరు వాగ్దానం చేసిన సంతాన విషయాన్ని విస్మరించరని నమ్ముతున్నాను' అని ప్రార్థించింది. అప్పుడు కర్దమప్రజాపతి తన తపోబలంతో శక్తియుక్తులతో నవరత్నఖచిత సౌధాల్ని, ఉద్యానవనాల్ని సృష్టించి నవయౌవనరూపంతో సాంసారిక భోగాలను అందించాడు. కొంతకాలానికి ఆయన అనుగ్రహంతో దేవహూతి తొమ్మిదిమంది ఆడపిల్లలను ప్రసవించింది. అప్పుడు కర్దముడు సన్యాసం పుచ్చుకుంటానన్నాడు. ఆమె 'స్వామీ! ఈ బాలికలకు వివాహంచేసి, నాకు తత్త్వోపదేశం చేయగల కుమారుణ్ణి ప్రసాదించి మీరు సన్యాసం తీసుకోండి' అని వినయంగా ప్రార్థించింది. ఆయన అంగీకరించి దైవనిర్ణయానుసారం ఆమెను పుత్రవతిని చేశాడు. ఆమె గర్భంలో కపిలుడు జన్మించాడు. ఈ కపిలుడు విష్ణుమూర్తి అవతారం. దేవహూతి తన కొడుకైననూ, కపిలుణ్ణి మహానుభావుడుగా గుర్తించి మోక్షమార్గాన్ని ప్రసాదించమని కోరింది. అప్పుడు కపిలమహర్షి దయామయుడై, తన తల్లికి సాంఖ్యమార్గాన్ని, యోగాభ్యాసాన్ని, వేదాంతసారాన్ని బోధించి, వీటిని భగవద్భక్తితో ఆచరించమని ఉపదేశించాడు. దేవహూతి భక్తియోగంతో ముక్తిని పొందింది. ఈ విధంగా కపిలుడు సాంఖ్యశాస్త్రాన్ని లోకంలో ప్రవర్తింపజేశాడు. సాక్షాత్తూ శ్రీమన్నారాయణావతార స్వరూపుడైన కపిలమహర్షి కూడా కర్మయోగంకంటె, జ్ఞానయోగంకంటె భక్తియోగానికి ఎక్కువ ప్రాధాన్యమిచ్చాడు.

– డా॥ మరడాన శ్రీనివాస ద్విశతావధాని

# విషయసూచిక

## తృతీయస్కంధము





శ్రీరస్తు

# శ్రీమహాభాగవతము

## తృతీయస్కంధము

**క. శ్రీమహిత వినుతదివిజ, స్తోమ! యశస్సీమ! రాజసోమ! సుమేరు**
**స్థేమ! వినిర్జితభార్గవ, రామ! దశానన విరామ! రఘుకులరామా!** 1

**ప్రతిపదార్థం :** శ్రీ మహిత= సంపదచేత గొప్పవాడా!; వినుత= కీర్తింపబడిన; దివిజ= దేవతలయొక్క; స్తోమ= సమూహం కలవాడా!; యశస్+సీమ= కీర్తి అంచులు ముట్టినవాడా!; రాజసోమ= రాజులలో శ్రేష్ఠుడా!; సుమేరుస్థేమ= మేరువువలె మిక్కిలి శక్తిగలవాడా!; వినిర్జిత భార్గవరామ= పరశురాముని జయించినవాడా! (జయించబడిన పరశురాముడు కలవాడా!); దశ+ఆననవిరామ= పదిముఖాలు గల రావణుని సంహరించినవాడా!; రఘుకులరామా= రఘువంశసంజాతుడవైన ఓ శ్రీరామా!

**తాత్పర్యం :** శ్రీమంతుడా! దేవతలచే కొనియాడబడువాడా! దిగంతాలు తాకిన కీర్తి గలవాడా! రాజులలో శ్రేష్ఠుడా! మేరుపర్వతంవలె మిక్కిలి శక్తికలవాడా! పరశురాముని జయించినవాడా! రావణుని తుదముట్టించినవాడా! రఘువంశసంజాతుడవైన ఓ శ్రీరామా!

**విశేషం :** ఇది ఆశ్వాసాది పద్యం. భాగవతకావ్యాన్ని శ్రీరామచంద్రునికి అంకితం చేశాడు పోతన మహాకవి. ఆశ్వాసంలోని ఆద్యంత పద్యాలు కృతిపతి సంబోధనాత్మకంగా ఉండటం సంప్రదాయం. 'మంగళాదీని' అనే సంప్రదాయానికి అనుగుణంగా పద్యం శ్రీకారంతో ఆరంభమయింది.

**వ. మహనీయగుణగరిష్ఠులగు నమ్ముని శ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యాన వైఖరీ సమేతుండైన సూతుం డిట్లనియె. అట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె.** 2

**ప్రతి :** మహనీయ గుణగరిష్ఠులు+అగు= విశేషమైన గుణాలచే గొప్పవారైన; ఆ+మునిశ్రేష్ఠులకున్= ఆ మహామునులైన శౌనకాదులకు; నిఖిల= సమస్తములైన; పురాణ= అష్టాదశ పురాణముల; వ్యాఖ్యాన= వివరణలతో కూడిన; వైఖరీ= విధానంతో; సమేతుండు+ఐన= కూడియున్న; సూతుండు= సూతమహర్షి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా (చెప్పబోవు విధంగా) పలికాడు; అట్లు= ఆ విధంగా; ప్రాయ+ఉపవిష్టుండు+ఐన= మరణానికి సిద్ధమై కూర్చున్నవాడైన; పరీక్షిత్+ నర+ఇంద్రునకున్= పరీక్షిన్మహారాజుతో; శుకయోగి+ఇంద్రుండు= శుకుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తా :** విశేషగుణాలతో గొప్పవారైన శౌనకాది మహామునులకు సమస్త పురాణాలను వ్యాఖ్యానించడంలో నేర్పరియైన సూతమహర్షి ఇలా చెపుతున్నాడు. ఆ విధంగా మరణానికి సిద్ధపడి ప్రాయోపవిష్టుడై ఉన్న పరీక్షిన్మహారాజుతో శుకయోగీంద్రుడు తదుపరి భాగవతాన్ని ఇలా వివరిస్తున్నాడు.

**విశే :** మునిశాపం వల్ల సర్పదష్టుడు కాబోయే పరీక్షిత్తు కోరికమేరకు వ్యాసమహర్షి కుమారుడైన శుకమహర్షి భాగవతం మొత్తం ఏడు రోజుల్లో వివరించాడు. ఆతడు చెప్పినట్లుగా సూతమహర్షి సత్రయాగం చేస్తున్న శౌనకాది మహామునులకు వివరించాడు.

## ✤ విదురుండు తీర్థయాత్ర సేయుట ✤

ఉ. పాండునృపాలనందనులు బాహుబలంబున ధార్తరాష్ట్రులన్
భండనభూమిలో గెలిచి పాండురశారదచంద్రచంద్రికా
ఖండయశఃప్రసూనకలికావళిఁ గౌరవరాజ్యలక్ష్మి నొం
డొండ యలంకరింపుచు జయోన్నతి రాజ్యము సేయుచుండఁగన్. 3

**ప్రతి :** పాండునృపాల నందనులు= పాండురాజు కుమారులు; బాహుబలంబునన్= భుజబలంతో; ధార్తరాష్ట్రులన్= ధృతరాష్ట్రుని కుమారులైన దుర్యోధనాదులను; భండనభూమిలోన్= యుద్ధభూమియందు; గెలిచి= జయించి; కౌరవరాజ్యలక్ష్మిన్= కురువంశీయుల సామ్రాజ్యలక్ష్మిని; పాండుర= స్వచ్ఛమైన (తెల్లనైన); శారద= శరత్కాలంనాటి; చంద్ర= చంద్రుని; చంద్రికా= వెన్నెలవంటి; అఖండ= అవిచ్ఛిన్నమైన (సార్వకాలికమైన); యశస్= కీర్తి అనెడి; ప్రసూనకలికా+ఆవళిన్= పూమొగ్గల గుత్తులతో; ఒందు+ఒండన్= ఒక్కొక్కరుగా; అలంకరింపుచున్= భూషిస్తూ; జయ+ఉన్నతిన్= విజయాత్మకమైన గొప్పతనంతో; రాజ్యము+చేయుచున్+ఉండఁగన్= రాజ్యపరిపాలనం చేస్తుండగా.

**తా :** పాండురాజకుమారులైన ధర్మరాజాదులు బాహువిక్రమంతో ధృతరాష్ట్రుని కొడుకులైన దుర్యోధనాదులను రణరంగంలో జయించారు. స్వచ్ఛమైన శరత్కాలపు పండు వెన్నెలలాంటి అఖండకీర్తిని ఆర్జించారు. అటువంటి యశస్సు అనే పూలమొగ్గలతో కౌరవరాజ్యలక్ష్మిని అలంకరించారు. ఈవిధంగా వారు విజయోల్లాసంతో రాజ్యపాలనం సాగించారు.

క. మనుజేంద్ర! విదురుఁ డంతకు, మును వనమున కేఁగి యచట మునిజనగేయున్
వినుతతపోధౌరేయున్, ఘను ననుపమగుణవిధేయుఁగనె మైత్రేయున్. 4

**ప్రతి :** మనుజ+ఇంద్ర!= పరీక్షిన్మహారాజా!; విదురుఁడు= ధృతరాష్ట్రుని తమ్ముడైన విదురుడు; అంతకు మును= యుద్ధానికి ముందే; వనమునకున్+ఏఁగి= అడవికి వెళ్ళి; అచటన్= అక్కడ; మునిజనగేయున్= మహర్షిగణంచే కీర్తింపబడేవాడును; వినుత= కొనియాడబడిన; తపస్= తపస్సుయొక్క; ధౌరేయున్= భారం వహించినవాడును; ఘనున్= గొప్పవాడును; న+ఉపమ= సాటిలేని; గుణవిధేయున్= గుణాలకు అనుకూలుడై ఉండేవాడును అయిన; మైత్రేయున్= మైత్రేయుడు అను పేరుగల మహర్షిని; కనెన్= చూశాడు.

**తా :** రాజా! యుద్ధానికి ముందే విదురుడు విరక్తితో అడవికి వెళ్ళిపోయాడు. అక్కడ మునులందరూ కీర్తించే విధంగా తపస్సు చేసేవాడు, మంచి గుణాలకు విధేయుడై ఉండేవాడు అయిన మైత్రేయమహర్షిని దర్శించాడు.

క. కనుఁగొని తత్పాదంబులు, దన ఫాలము సోక మ్రొక్కి తగ నిట్లనియెన్
మునివర! సకల జగత్పా, వన చరితుఁడు గృష్ణుఁ డఖిలవంద్యుండెలమిన్. 5

**ప్రతి :** తద్+పాదంబులు= ఆ మైత్రేయుని పాదాలు; కనుఁగొని= చూచి; తన ఫాలము సోకన్= తన నుదురు పాదాలకు తగులునట్లుగా; మ్రొక్కి= నమస్కరించి; తగన్= తగినవిధంగా; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు; మునివర!= మునులలో శ్రేష్ఠుడా!; సకల జగత్= సమస్త ప్రపంచమును; పావన చరితుఁడు= పవిత్రంగా చేసే నడవడిక కలవాడు; అఖిలవంద్యుండు= అందరిచే కొనియాడబడేవాడు అయిన; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; ఎలమిన్= సంతోషంతో...

**తా :** ఆ మైత్రేయుని దర్శించి, ఆయన పాదాలకు తన నుదురు తగిలే విధంగా నమస్కరించి అడుగుతున్నాడు. మహర్షీ! ప్రపంచాన్ని పవిత్రంచేసే ఆదర్శప్రాయమైన నడతతో అందరి ప్రశంసలు అందుకొనే శ్రీకృష్ణుడు సంతోషంగా,

**క. మండిత తేజోనిధి యై, పాండవ హితమతిని దూతభావంబున వే**
**దండపురి కేగి కురుకుల, మండనుఁడగు ధార్తరాష్ట్ర మందిరమునకున్. 6**

**ప్రతి :** మండిత= కొనియాడదగిన; తేజస్+నిధి+ఐ= కాంతికి నిలయమైనవాడైన శ్రీకృష్ణుడు; పాండవ హితమతిన్= పాండవుల మేలు కోరుకొన్నవాడై; దూతభావంబునన్= రాయబారితనంతో; వేదండపురికిన్ ఏగి= హస్తినాపురానికి చేరి (అక్కడ); కురుకుల మండనుఁడు+అగు= కౌరవవంశ శ్రేష్ఠుడైన; ధార్తరాష్ట్ర మందిరమునకున్= ధృతరాష్ట్రుని కుమారుడైన సుయోధనుని మందిరానికి...

**తా :** మైత్రేయుని విదురుడు అడుగుతున్నాడు. మహర్షీ! మహాతేజోవంతుడైన శ్రీకృష్ణుడు పాండవుల మేలు కోరుకొన్నవాడై హస్తినాపురం చేరుకొని, అక్కడ కురుకులశ్రేష్ఠుడైన దుర్యోధనుని మందిరానికి వెళ్లలేదు.

**తే. చనఁగ నొల్లక మద్గృహంబునకు భక్త, వత్సలుండగు కృష్ణుండు వచ్చుటేమి**
**కతము? నాకది యెఱిఁగింపు కరుణతోడ, ననుచు విదురుండు మైత్రేయు నడిగె ననిన. 7**

**ప్రతి :** చనఁగన్ ఒల్లక= వెళ్ళటానికి ఇష్టపడక; భక్తవత్సలుండు+అగు= భక్తులపై అమితమైన ప్రేమగల; కృష్ణుండు= వాసుదేవుడు; మత్+గృహంబునకున్= మా ఇంటికి; వచ్చుట= అతిథిగా రావటం; ఏమి కతము?= కారణం ఏమై ఉంటుంది?; కరుణతోడన్= దయతో; అది= ఆ కారణం; నాకున్+ఎఱిఁగింపు= నాకు తెలియజెయ్యి; అనుచున్= అంటూ; మైత్రేయున్= మైత్రేయ మహర్షిని; అడిగెన్+అనినన్= అడిగాడని శుకమహర్షి చెప్పగా...

**తా :** భక్తవత్సలుడైన కృష్ణుడు దుర్యోధనుని మందిరానికి వెళ్ళక మా ఇంటికి అతిథిగా రావటానికి గల కారణం దయచేసి నాకు చెప్పవలసిందని విదురుడు మైత్రేయుని అడిగాడని శుకమహర్షి పరీక్షిన్మహారాజుకు చెప్పాడు. అలా చెప్పగా

**విశే :** వత్స అంటే ఆవుదూడ. ఆవు ఈనినపుడు దూడ శరీరంపై గల మాలిన్యాన్ని తన నాలుకతో నాకి శుభ్రం చేస్తుంది. అటువంటి అసాధారణమైన ప్రేమను వాత్సల్యమంటారు.

**క. విని వెఱఁగంది పరీక్షి, న్మనుజవరేణ్యుండు విమలమతి నిస్తంద్రున్**
**మునికుల జలనిధి చంద్రున్, సునిశిత హరిభక్తిసాంద్రు శుకయోగీంద్రున్. 8**

**ప్రతి :** పరీక్షిత్+మనుజవరేణ్యుండు= మానవశ్రేష్ఠుడైన పరీక్షిత్తు; విని= విదురుడు మైత్రేయుని అడిగిన విషయం విని; వెఱఁగు+అంది= ఆశ్చర్యపడి; విమలమతిన్= స్వచ్ఛమైన మనస్సుచేత; నిస్+తంద్రున్= అలసత లేనివాడును; మునికుల= ఋషిసమాజమనే; జలనిధి= సముద్రానికి; చంద్రున్= చంద్రునివంటివాడును; సునిశిత= మిక్కిలి తీవ్రతతో కూడిన (అకుంఠిత దీక్షతో కూడిన); హరిభక్తిసాంద్రున్= విష్ణుభక్తి మిక్కిలిగా కలిగిన; శుకయోగి+ఇంద్రున్= శుకమహర్షిని...

**తా :** విదురుడు మైత్రేయుని అడిగిన విషయం విని పరీక్షిత్తు ఆశ్చర్యపోయాడు. అపుడా రాజు తనకు భాగవతకథను వినిపిస్తున్నవాడు, స్వచ్ఛమైన మనస్సు కలవాడు, అలసత ఎరుగనివాడు, సముద్రాన్ని చంద్రునివలె మునిజనుల మనస్సును పొంగించేవాడు, అసాధారణమైన హరిభక్తి కలవాడు అయిన శుకయోగీంద్రుని ఇలా అడిగాడు.

**క. కని యిట్లనె మైత్రేయుని, ననఘుండగు విదురుఁ డేరహస్యము లడిగెన్?**
**ముని యేమి చెప్పె? నే పగి, దిని దీర్థము లాడె? నెచటఁ దిరుగుచు నుండెన్? 9**

**ప్రతి :** కని= అట్టి శుకయోగీంద్రుని చూచి; ఇట్లు+అనెన్= పరీక్షిన్మహారాజు ఇలా పలికాడు; అనఘుండు+అగు= పాపరహితుడైన (పుణ్యాత్ముడైన); విదురుండు= విదురుడు; మైత్రేయునిన్= మైత్రేయమహర్షిని; ఏ రహస్యములు= రహస్యాలైన ఏ విశేషాలను; అడిగెన్= ప్రశ్నించాడు?; ముని= మైత్రేయుడు; ఏమి చెప్పెన్= ఏమని చెప్పాడు?; ఏ పగిదినిన్= ఏ విధంగా; తీర్థములు+ఆడెన్= పుణ్యనదీ స్నానాలు ఆచరించాడు?; ఎచటన్= ఎక్కడ; తిరుగుచున్+ఉండెన్= సంచరిస్తూ ఉండినాడు?

**తా :** అటువంటి శుకయోగీంద్రుణ్ణి చూచి, పరీక్షిత్తు పలుకుతున్నాడు. మహర్షీ! పుణ్యాత్ముడైన విదురుడు ఏయే రహస్య విషయాలను అడిగాడు? మైత్రేయముని ఏమని చెప్పాడు? ఇంకా విదురుడు ఏ విధంగా పుణ్యనదులలో స్నానాలు చేశాడు? ఎక్కడ తిరుగుతూ ఉండినాడు?

**తే. ఇన్ని దెలియంగ నానతి యిచ్చి నన్ను, నర్థి రక్షింపవే విమలాంతరంగ!**
**ఘన దయాపాంగ! హరిపాద కమలభృంగ!, మహిత గుణసంగ! పాపతమఃపతంగ! 10**

**ప్రతి :** విమల+అంతరంగ!= స్వచ్ఛమైన మనస్సు కలవాడా!; ఘనదయా+అపాంగ= గొప్ప కరుణతో కూడిన కడగంటి చూపులు కలవాడా!; హరి= శ్రీహరియొక్క; పాదకమల= పాదములనెడి పద్మములపై వ్రాలే; భృంగ!= తుమ్మెదవంటివాడా!; మహితగుణసంగ!= గొప్ప గుణములతో సాంగత్యం కలవాడా!; పాప= పాపమనే; తమస్= చీకటిని పోగొట్టే; పతంగ!= సూర్యుని వంటివాడా!; ఇన్ని తెలియంగన్= నేనడిగిన విషయాలన్నిటికీ నాకు తెలియునట్లుగా; ఆనతి+ఇచ్చి= అనుగ్రహ పూర్వకంగా చెప్పి; అర్థిన్+నన్నున్= జ్ఞానాన్ని పొందగోరే నన్ను; రక్షింపుము+ఏ!= కృతార్థుణ్ణి చెయ్యి.

**తా :** స్వచ్ఛమైన మనస్సు కలిగి, విశేషమైన దయతోకూడిన విష్ణుమూర్తి పాదపద్మాలపై వ్రాలే తుమ్మెదవంటివాడవినీవు. గొప్ప గుణాలతో పాపాలనే చీకట్లను పోగొట్టే సూర్యునివంటివాడవైన ఓ శుకమునీ! నేనడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పండి. జ్ఞానార్థినైన నన్ను కృతార్థుని చేయుమని పరీక్షిత్తు శుకమునిని ప్రార్థించాడు.

**చ. అనవుడు బాదరాయణి ధరాధిపుతో ననుఁ బూరువంశ వ**
**ర్ధన! విను కష్టుఁడైన ధృతరాష్ట్రనృపాలుఁడు పెంపుతో సుయో**
**ధన ముఖ పుత్రులం గడు ముదంబునఁ బెంపుచుఁ బాండురాజు ద**
**ప్పిన పిదపన్ దదాత్మజులు పెల్కుఱి తన్నని చేర వచ్చినన్. 11**

**ప్రతి :** అనవుడున్= ఆ విధంగా పరీక్షిత్తు పల్కగా; బాదరాయణి= వ్యాసుని కుమారుడైన శుకుడు; ధరా+అధిపుతోన్+అనున్= ఆ మహారాజుతో ఇలా అంటున్నాడు; పూరువంశవర్ధన!= పూరువంశానికి వృద్ధికరుడవైన ఓ రాజా!; విను= ఆలకించు; కష్టుఁడు+ఐన= గుణహీనుడైన; ధృతరాష్ట్రనృపాలుఁడు= ధృతరాష్ట్రమహారాజు; పెంపుతోన్= ఎంతో వైభవంగా; సుయోధనముఖ పుత్రులన్= దుర్యోధనుడు మొదలైన తన కొడుకులను; కడు ముదంబునన్= మిక్కిలి సంతోషంతో; పెంపుచున్= సాకుతూ, పోషిస్తూ; పాండురాజు= తమ్ముడైన పాండురాజు; తప్పిన పిదపన్= మరణించాక; తద్+ఆత్మజులు= అతని కుమారులైన

ధర్మజాదులు; పెల్కుఱి= భయవిహ్వలులై; తన్ను+అని= తననే (ధృతరాష్ట్రునే తండ్రిగా) భావించి; చేరవచ్చినన్= ఆశ్రయింపగా...

**తా :** పరీక్షిత్తు అలా అడగ్గానే, శుకయోగీంద్రుడు చెపుతున్నాడు. రాజా! ధృతరాష్ట్రుడు తన పిల్లలను గారాబంగా పెంచుతున్నాడు. ఇదిలా ఉండగా ఆకస్మికంగా పాండురాజు మరణించటంతో తన తమ్ముని పిల్లలుకూడా పెదతండ్రియైన ఆ ధృతరాష్ట్రునే ఆశ్రయించి, ఆయన పంచకు చేరారు.

**విశే :** బదరీవనంలో జన్మించాడు కనుక వ్యాసుడు బాదరాయణుడు. వాని కుమారుడు బాదరాయణి శుకుడు. కష్టం అస్య అస్తి ఇతి కష్టః. కష్టం కలవాడు కష్టుడు. ఇక్కడ కష్టుడు అనగా చెడుబుద్ధి కలవాడని అర్థం.

**వ. ఇట్లు వచ్చిన పాండవులయెడ నసూయానిమగ్నులై సుయోధనాదులు** **12**

**ప్రతి :** ఇట్లు వచ్చిన= ఇలా ధృతరాష్ట్రుని పెదతండ్రిగా భావించి వచ్చిన; పాండవుల యెడన్= పాండుకుమారుల యెడల; సుయోధన+ఆదులు= దుర్యోధనుడు మొదలైనవారు; అసూయానిమగ్నులై= అసూయాగ్రస్తులై.

**తా :** ఇలా వచ్చిన పాండవుల శౌర్యపరాక్రమాది విషయంలో అసూయాగ్రస్తులైన దుర్యోధనాదులు.

**క. పెట్టిరి విషాన్న, మంటం, గట్టిరి ఘనపాశములను, గంగానదిలో**
**నెట్టిరి, రాజ్యము వెడలం, గొట్టిరి, ధర్మంబు విడిచి కుటిలాత్మకులై.** **13**

**ప్రతి :** కుటిల+ఆత్మకులు+ఐ= వంకరబుద్ధి కలవారై; ధర్మంబు వదలి= ధర్మమార్గాన్ని విడిచిపెట్టి; విష+అన్నము= విషం కలిపిన తిండిని; పెట్టిరి= తినిపించారు; ఘనపాశములను= గట్టి త్రాళ్ళతో; అంటన్+కట్టిరి= బిగించి బంధించారు; గంగానదిలోన్= గంగానదిలో; నెట్టిరి= పడద్రోశారు; రాజ్యము= రాజ్యంనుండి; వెడలన్+కొట్టిరి= వెడలగొట్టారు.

**తా :** కౌరవులు వంకరబుద్ధి కలిగినవారై ధర్మమార్గం తప్పి పాండవులకు విషాన్నం పెట్టారు. త్రాళ్ళతో బంధించారు. గంగానదిలోకి నెట్టేశారు. రాజ్యంనుండి వెడలగొట్టారు.

**క. క్రూరాత్ములగుచు లాక్షా, గారంబున వారు నిద్ర గైకొని యుండన్**
**దారుణశిఖి దరికొలిపిరి, మారణకర్మముల కప్రమత్తులు నగుచున్.** **14**

**ప్రతి :** వారు= ఆ పాండవులు; లాక్షా+ఆగారంబునన్= లక్క ఇంటిలో; నిద్ర+కైకొని+ఉండన్= నిద్రపోతూ ఉండగా; క్రూర+ఆత్ములు+అగుచున్= కఠినమైన మనస్సులు గల వారగుచూ; మారణ కర్మములకున్= పాండవులను మట్టుపెట్టు పనులలో; అప్రమత్తులు అగుచున్= ఏమరపాటు లేకుండా; దారుణ శిఖిన్= భయంకరమైన అగ్నిని; దరికొలిపిరి= ప్రజ్వలింపజేశారు.

**తా :** లక్క ఇంటిలో పాండవులు నిద్రపోతుండగా వారిని చంపడమే పనిగా పెట్టుకొన్న దుర్మార్గులైన కౌరవులు ఆ ఇంటికి దారుణంగా నిప్పు పెట్టారు.

**విశే :** శిఖ= జ్వాల. శిఖి= జ్వాలలు కలది.

**తే. సూరిజనగేయ మగు రాజసూయ యజ్ఞ, విలస దవభృథస్నాన పవిత్రమైన**
**ద్రౌపదీచారువేణీభరంబు పట్టి, కొలువులోపల నీడ్చిరి కుత్సితమున.** **15**

**ప్రతి :** సూరిజన= పండితులచే; గేయము+అగు= కీర్తింపదగిన; రాజసూయ= రాజసూయం అనే పేరుగల; యజ్ఞ= యాగంలో; విలసత్= ప్రకాశమానమైన; అవభృథస్నాన= అవభృథం అనే పేరుగల యాగాంతస్నానంచేత; పవిత్రము+ఐన= పావనమైన; ద్రౌపదీ= ద్రుపదుని కొమార్తెయైన పాండవపత్నియొక్క; చారు= అందమైన; వేణీభరంబు= దట్టమైన జడను; పట్టి= పట్టుకొని; కుత్సితమునన్= పాడుబుద్ధితో; కొలువులోపలన్+ఈడ్చిరి= రాజసభలోనికి బలవంతంగా ఈడ్చుకొని వచ్చారు.

**తా :** వివేకం కలవారంతా ప్రశంసించిన రాజసూయయాగంలో అవభృథమనే యాగాంతస్నానం చేయడంచేత పరమపావనమైన ద్రౌపదీదేవియొక్క అందమైన, దట్టమైన జుట్టు పట్టుకొని దుర్మార్గంగా కౌరవులు ఆమెను రాజసభలోకి ఈడ్చుకు వచ్చారు.

**విశే :** ఏ యాగం చేసినా చివరన ఏదేని నదిలో మంగళస్నానం సమంత్రకంగా చేస్తారు. దానితో యాగదీక్ష పూర్తవుతుంది. ఆ స్నానానికే అవభృథస్నానమని పేరు.

**క. కావున వారల కపకృతిఁ, గావింపని దొక దినంబు గలుగదు, తమ జ**
**న్మావధి నిజనందనులను, వావిరి న య్యంధనృపతి వలదనఁడయ్యెన్. 16**

**ప్రతి :** కావునన్= అందుచేత; వారలకున్= పాండుకుమారులకు; అపకృతిన్= అపకారమును; కావింపనిది= చెయ్యనిది; ఒక దినంబును= ఒక్క రోజుకూడా; కలుగదు= లేదు; తమ= తమయొక్క (ధార్తరాష్ట్రులయొక్క); జన్మ+అవధి= పుట్టుక మొదలు; నిజనందనులను= తన కొడుకులను; ఆ+అంధనృపతి= ఆ గ్రుడ్డిరాజు (ధృతరాష్ట్రుడు); వావిరిన్= క్రమపద్ధతిలో; వలదు+ అనఁడు+అయ్యెన్= వారించని వాడయ్యెను.

**తా :** కౌరవులు పాండవులకు అపకారం చెయ్యని రోజంటూ లేదు. పుట్టినది మొదలు వారు అలా దురాగతాలను చేస్తున్నా ఏనాడూ ఇది తప్పని గ్రుడ్డివాడైన తమ తండ్రి వారిని మందలించలేదు.

**తే. మాయజూదంబు పన్ని దుర్మార్గవృత్తిఁ, బుడమిఁగొని యడవులకుఁబోనడువ నచటఁ**
**దిరిగి వారలు సమయంబు దీర్చి యేఁగు, దెంచి తమ యంశ మడిగినఁ బంచి యిడక. 17**

**ప్రతి :** మాయజూదంబు= మోసంతో కూడిన జూదమును; పన్ని= ఏర్పరచి; దుర్మార్గవృత్తిన్= అన్యాయంగా; పుడమిన్+కొని= వారి రాజ్యభాగమైన భూమిని గ్రహించి; అడవులకున్= అరణ్యములకు; పోన్+అడువన్= పంపగా; వారలు= ఆ పాండవులు; అచటన్= ఆ అరణ్యములయందు; తిరిగి= సంచరించి; సమయంబున్+తీర్చి= పదమూడు సంవత్సరముల గడువును పూర్తి చేసికొని; ఏఁగుదెంచి= తిరిగివచ్చి; తమ= వారియొక్క; అంశము+అడిగినన్= రాజ్యభాగమును తిరిగి యిమ్మని అడుగగా; పంచి+ఇడక= పంచిపెట్టకుండా...

**తా :** మోసంతో జూదంలో పాండవులను ఓడించారు. వారి రాజ్యభాగాన్ని అన్యాయంగా ఆక్రమించారు. అడవులకు పంపించేశారు. వారు అలాగే అడవులకు పోయి, పదమూడేండ్ల గడువును పూర్తి చేసికొని, తిరిగి వచ్చి వారి రాజ్యాన్ని తిరిగి ఇమ్మంటే అంగీకరించలేదు.

**వ. ఉన్న యెడ. 18**

**తా :** ఉండగా

**చ. సకలనియంతయైన హరి సర్వశరణ్యుఁడు మాధవుండు సే**
**వక నవకల్పకంబు భగవంతుఁ డనంతుఁ డనంతశక్తి నం**
**దకధరుఁ డబ్జలోచనుఁడు ధర్మతనూభవుచే నియుక్తుఁడై**
**యకుటిల భక్తియోగమహితాత్మకుఁడై ధృతరాష్ట్రుపాలికిన్. 19**

**ప్రతి :** సకల నియంత+ఐన= సమస్త సృష్టికి శాసకుడైన; హరి= శ్రీకృష్ణుడు; సర్వశరణ్యుఁడు= అందరికీ దిక్కైనవాడు; మాధవుండు= లక్ష్మీపతి; సేవక= సేవించువారి పాలిటి; నవకల్పకంబు= నూతన పారిజాతమువంటివాడయిన; భగవంతుడు= దైవము; అనంతుఁడు= అంతము లేనివాడు; అనంతశక్తి= అంతము లేని శక్తి కలవాడు; నందకధరుఁడు= నందకమనే పేరు గల ఖడ్గమును చేత ధరించినవాడు; అబ్జలోచనుఁడు= పద్మములవంటి కన్నులు కలవాడు (అయిన వాసుదేవుడు); ధర్మతనూభవుచేన్= ధర్మరాజుచేత; నియుక్తుఁడు+ఐ= నియోగింపబడినవాడై; అకుటిల= కపటము లేని; భక్తియోగ= భక్తి అనే యోగముచేత; మహితాత్మకుఁడు+ఐ= కొనియాడబడేవాడై; ధృతరాష్ట్రుపాలికిన్= ధృతరాష్ట్రుని వద్దకు...

**తా :** కౌరవులు రాజ్యభాగాన్ని ఇవ్వకపోవడంచేత ధర్మరాజు సకలసృష్టికి నియంత, అందరికీ దిక్కైనవాడు, ఆశ్రితులకు పారిజాతంవంటివాడు, అంతంలేనివాడు, అంతులేని శక్తి కలవాడు, నందకమనే ఖడ్గాన్ని ధరించినవాడు, పద్మాలవంటి కన్నులు కలవాడు అయిన శ్రీకృష్ణుని రాయబారిగా పంపించాడు. అకళంకమైన భక్తికి మాత్రమే వశమయ్యే మనసు కలవాడైన వాసుదేవుడు ధర్మజుని పంపున ధృతరాష్ట్రునివద్దకు

**విశే :** సకలనియంత అయిన శ్రీహరి సర్వశరణ్యుడు కనుక ధర్మరాజు తనముందు సామాన్యుడైనా వానిచే నియుక్తుడై రాయబారిగా హస్తినకు వెళ్లాడు.

**క. చని యచట భీష్మ గురు త, త్తనయ కృపాచార్య నిఖిల ధాత్రీపతులున్**
**విని యనుమోదింపఁగ ని, ట్లనియెన్ ధృతరాష్ట్రుతోడ నవనీనాథా! 20**

**ప్రతి :** అవనీనాథా!= పరీక్షిన్మహారాజా!; చని= ఆ విధంగా ధర్మజుని పంపున శ్రీకృష్ణుడు కౌరవసభకు వెళ్ళి; అచటన్= ఆ సభలో; భీష్మ= భీష్ముడు; గురు= ద్రోణుడు; తద్+తనయ= వాని కుమారుడైన అశ్వత్థామ; కృపాచార్య= కృపాచార్యుడు; నిఖిలధాత్రీపతులున్= అనేకులైన రాజులును; విని= తాను (శ్రీకృష్ణుడు) చెప్పే మాటలను విని; అనుమోదింపఁగన్= అంగీకరించే విధంగా; ధృతరాష్ట్రుతోడన్= ధృతరాష్ట్రమహారాజుతో; ఇట్లు= ఈ చెప్పబోవు విధంగా; అనియెన్= పలికెను.

**తా :** మహారాజా! అలా వెళ్ళిన వాసుదేవుడు అక్కడ భీష్ముడు, ద్రోణుడు, వాని కుమారుడైన అశ్వత్థామ, కృపాచార్యుడు, ఇంకా ఎందరో రాజులు విని అంగీకరించే విధంగా ధృతరాష్ట్రమహారాజుతో ఇలా పలికాడు.

**క. కౌరవపాండవు లిరువురు, నారయ నీ కొక్క రూప యవనీవర! నీ**
**వే రీతి నైనఁబాండు కు, మారుల పాలొసఁగితేని మను నుభయంబున్. 21**

**ప్రతి :** అవనీవర!= ధృతరాష్ట్రమహారాజా!; ఆరయన్= ఆలోచింపగా; కౌరవపాండవులు= నీ కుమారులు మరియు నీ తమ్ముని కొడుకులు; ఇరువురున్= ఇద్దరూ; నీకు+ఒక్కరూపు+అ= నీకు సమానమే కాని వేరుకాదు; నీవు+ఏ రీతిన్+ఐనన్= నీవు ఏ విధంగానైనా (నయాన్నో భయాన్నో ఒప్పించి); పాండుకుమారుల పాలు= పాండవులకు రావలసిన రాజ్యభాగాన్ని; ఒసఁగితి+ఏనిన్= ఇచ్చినట్లయితే; ఉభయంబున్= రెండు వంశములును; మనున్= బ్రతుకును.

**తా :** మహారాజా! (శ్రీకృష్ణుడు చెపుతున్నాడు) నీకు నీ కుమారులు, నీ తమ్ముని కొడుకులైన పాండవులు ఇరువురూ వేరు కాదు. ఒకలాంటివారే. అందువల్ల నీ కొడుకులను ఏదోవిధంగా ఒప్పించి, పాండవుల రాజ్యభాగాన్ని వారికి ఇచ్చినట్లయితే, రెండు పక్షములు హాయిగా బ్రతికి బట్టకట్టును.

**క. అని ధర్మబోధమునఁ బలి, కిన మాటలు చెవుల నిడమిఁగృష్ణుడు విదురున్**
**ఘన నీతిమంతుఁబిలువం, బనిచినఁ జనుదెంచెఁగురుసభాస్థలమునకున్. 22**

**ప్రతి :** అని= పైని చెప్పిన విధంగా; ధర్మబోధమునన్= ధర్మాన్ని బోధించే మార్గంలో; కృష్ణుఁడు= వాసుదేవుడు; పలికిన మాటలు= చెప్పిన పలుకులు; చెవులన్+ఇడమిన్= చెవుల బెట్టకపోవటంచేత; ఘన నీతిమంతున్= గొప్ప నీతికోవిదుడైన; విదురున్= విదురుని; కురుసభాస్థలమునకున్= కౌరవసభకు; పిలువన్+పనిచినన్= రప్పించుమని చెప్పగా; చనుదెంచెన్= ఆతడు ఆ సభకు వచ్చాడు.

**తా :** శ్రీకృష్ణుడు ధర్మమార్గంలో చెప్పిన మాటలు కౌరవులకు చెవికి ఎక్కలేదు. అందువల్ల నీతికోవిదుడైన విదురుణ్ణి ఆ సభకు రప్పించుమన్నాడు వాసుదేవుడు. అప్పుడు విదురుడు ఆ సభకు చేరుకొన్నాడు.

**వ. చనుదెంచి యచటి జనంబులచేత నుపస్థితంబైన కార్యంబు దెలుపఁబడినవాఁడై ధృతరాష్ట్రు నుద్దేశించి యిట్లనియె. 23**

**ప్రతి :** చనుదెంచి= విదురుడు ఆ కౌరవసభకు వచ్చి; అచటి జనంబులచేతన్= అక్కడ ఉన్న భీష్మాది ప్రముఖులవలన; ఉపస్థితంబు+ఐన కార్యంబు= జరుగుతున్న విషయం; తెలుపన్+పడినవాఁడు+ఐ= తెలిసికొన్నవాడై; ధృతరాష్ట్రున్ ఉద్దేశించి= ధృతరాష్ట్రునితో; ఇట్లు+అనియెన్= ఈ చెప్పబోవు విధంగా అన్నాడు.

**తా :** విదురుడు కౌరవసభకు వచ్చాడు. అంతవరకు ఏమి జరిగిందో భీష్మాదులద్వారా తెలిసికొన్నాడు. అప్పుడు కౌరవపతితో ఇలా అంటున్నాడు.

**మ. ధరణీనాయక! పాండుభూవిభుఁడు నీ తమ్ముండు; దత్పుత్రులన్**
**బరిరక్షించిన ధర్మముందగవునుంబాటిల్లు; వంశంబు సు**
**స్థిర సౌఖ్యోన్నతిఁ జెందు; శత్రుజయమున్ జేకూరు; గోపాల శే**
**ఖరు చిత్తంబును వచ్చు నట్లగుటయౌఁ గౌరవ్యవంశాగ్రణీ! 24**

**ప్రతి :** కౌరవ్యవంశ+అగ్రణీ!= కురువంశశ్రేష్ఠుడవైన ధృతరాష్ట్ర మహారాజా!; పాండుభూవిభుఁడు= పాండుమహారాజు; నీ తమ్ముండు= నీ తోడబుట్టినవాడు; తద్+పుత్రులన్= అతని కుమారులైన పాండవులను; పరిరక్షించినన్= జాగ్రత్తగా రక్షించినట్లయితే (న్యాయంగా వారి రాజ్యభాగాన్ని ఇచ్చినచో); ధర్మమున్= ధర్మమును; తగవునున్= న్యాయమున్నూ; పాటిల్లున్= నిలబడును; వంశంబు= నీ కురువంశము; సుస్థిర= మిక్కిలి స్థిరమైన; సౌఖ్య+ఉన్నతిన్= సుఖములతో ఔన్నత్యమును; చెందున్= పొందును; శత్రుజయమున్= శత్రువులపై విజయమూ; చేకూరున్= లభించును; గోపాలశేఖరు= గోపాలకులలో శ్రేష్ఠుడైన శ్రీకృష్ణుని; చిత్తంబును= మనస్సును; వచ్చునట్లు+అగుట+ఔన్= ఆనందపరచినట్లునూ అవుతుంది.

**తా :** కురుకుల శ్రేష్ఠుడవైన ఓ ధృతరాష్ట్రమహారాజా! పాండురాజు ఎవరో కాదు, నీ తమ్ముడు. అందువల్ల అతని కుమారులకు చెందిన రాజ్యభాగం పంచి ఇవ్వటం ధర్మమూ, న్యాయమూ కూడ. అలా చేస్తే నీ వంశం అచంచలమైన గొప్ప సుఖాన్ని పొందుతుంది. మీ ఉభయులు కలసి మెలసి ఉండటంవల్ల శత్రువులెవరూ మీవంక కన్నెత్తి చూడలేరు. అదీగాక అలా చేస్తే గోపాలచూడామణియైన శ్రీకృష్ణునికి ఆనందం కలిగించినవారౌతారు. అది చాలా క్షేమదాయకం.

**ఆ. వారి తండ్రి పాలు వారికి నొసఁగి నీ, పాలు సుతుల కెల్లఁబంచి యిచ్చి**
**చలము విడిచి ధర్మమలవడ నీ బుద్ధిఁ, జొనుపవయ్య! కులము మనుపవయ్య! 25**

**ప్రతి :** వారి తండ్రిపాలు= పాండు కుమారుల తండ్రికి చెందిన రాజ్యభాగాన్ని; వారికిన్= పాండవులకు; ఒసఁగి= ఇచ్చి; నీ పాలు= నీకు సంబంధించిన రాజ్యభాగాన్ని; సుతులకు+ఎల్లన్= నీ కొడుకులకు అందరికీ; పంచి ఇచ్చి= పంచిపెట్టి; చలమున్+విడిచి= మొండిపట్టు వదలి; ధర్మము+అలవడన్= ధర్మము నిలబడునట్లుగా; నీ బుద్ధిన్= నీ జ్ఞానమును; చొనుపుము+అయ్య= ప్రవర్తింపజేయుము; కులమున్= వంశమును; మనుపుము+అయ్య= నిలబెట్టుమయ్యా!.

**తా :** రాజా! నీ తమ్ముని కొడుకులకు వారి తండ్రి భాగాన్ని పంచి ఇయ్యి. నీ భాగాన్ని నీ కొడుకులందరికీ పంచిపెట్టు. పట్టుదలకు పోకుము. మంచిబుద్ధితో ప్రవర్తించి, వంశాన్ని నిలబెట్టుము.

**చ. వినుము నృపాల! నా పలుకు, వేయును నేల సమీరసూతి నీ**
**తనయుల పేరు విన్నఁ బదతాడిత దుష్టభుజంగమంబు చా**
**ద్పునఁ గనలొందు నింతయును మున్నునుఁ జెప్పితిఁగాదె వాని చే**
**తన భవదీయపుత్త్రులకుఁదప్పదు మృత్యు వదెన్ని భంగులన్. 26**

**ప్రతి :** నృపాల!= మహారాజా!; నా పలుకు వినుము= నా మాట విను; వేయునున్+ఏల= వేయి మాటలెందుకు; సమీరసూతి= వాయుపుత్రుడైన భీమసేనుడు; నీ తనయుల పేరు= నీ కుమారుల పేరు; విన్నన్= వినగానే; పద= కాలిచేత; తాడిత= త్రొక్కబడిన; దుష్ట= క్రోధంతో ఒళ్ళు తెలియని; భుజంగమంబు చాద్పునన్= పామువలె; కనలు+ఒందున్= కోపంతో మండిపోతున్నాడు; ఇంతయును= ఈ సంగతంతా; మున్నునున్= ఇంతకు ముందుకూడ; చెప్పితిన్+కాదె= చెప్పాను కదా!; వానిచేతను+అ= ఆ భీమసేనుని చేతిలోనే; భవదీయపుత్త్రులకున్= నీ కొడుకులకు; ఎన్ని భంగులన్= ఎన్ని విధాలుగానైనా సరే; మృత్యువు+అది= ఆ రానున్న చావు; తప్పదు= తప్పిపోదు.

**తా :** రాజా! నా మాట విను. వెయ్యిమాటలు చెప్పనవసరం లేదు. నీ కొడుకుల పేర్లు వింటేనే చాలు, భీముడు తోక త్రొక్కిన త్రాచువలె మండిపడుతున్నాడు. ఇదంతా ముందే నీకు చెప్పాను. ఎలాగైనా నీ కుమారులకు వాని చేతిలో చావు తప్పదు.

**వ. అదియునుంగాక 27**

**ప్రతి :** అదియునున్+కాక

**తా :** అంతే కాకుండగా

**క. నీ పుత్త్రుల శౌర్యంబును, చాపాచార్యాపగాత్మజాత కృపభుజా**
**టోపంబును గర్ణు దురా, లాపంబును నిజముగాఁదలంతె మనమునన్. 28**

**ప్రతి :** నీ పుత్త్రుల= నీ కుమారులయొక్క; శౌర్యంబును= వీరత్వమును; చాప+ఆచార్య= ద్రోణునియొక్క; ఆపగా+ఆత్మజాత= గంగాసుతుడైన భీష్మునియొక్క; కృప= కృపాచార్యునియొక్క; భుజ+ఆటోపంబును= భుజబలమును; కర్ణు= కర్ణునియొక్క; దుర్+ఆలాపంబునున్= అసందర్భ ప్రలాపాన్ని; మనమునన్= నీ మనస్సులో; నిజముగాన్= నిజమేనని; తలంతు+ఎ= భావిస్తున్నావా?

**తా :** రాజా! నీ కొడుకుల వీరత్వం, భీష్మద్రోణకృపుల భుజబలం, కర్ణుని ప్రేలాపనలు ఇవన్నీ నిజమే అనుకొంటున్నావా?

**వ. అట్లేని వినుము. 29**

**ప్రతి :** అట్లు+ఏనిన్= అలా అయినట్లయితే; వినుము= ఆలకించు.

**తా :** అలా అయితే నేను చెప్పేది విను.

**ఉ. ఏ పరమేశుచే జగము లీ సచరాచరకోటితో సము**
**ద్దీపిత మయ్యెఁ; నే విభుని దివ్యకళాంశజు లబ్జగర్భ గౌ**
**రీపతి ముఖ్యదేవ ముని బృందము; లెవ్వఁ డనంతుఁ డచ్యుతుం**
**డా పురుషోత్తముండు కరుణాంబుధి గృష్ణుఁడు వో నరేశ్వరా! 30**

**ప్రతి :** నర+ఈశ్వరా= మహారాజా!; ఏ పరమేశుచేన్= ఏ పరమేశ్వరునివలన; జగములు= లోకములు; ఈ సచర+అచర కోటితోన్= కోట్లకొలదిగా ఉన్న స్థావర జంగమములతో కలిసి; సమ్+ఉద్దీపితము+అయ్యెన్= ప్రస్ఫుటంగా ఏర్పడినవో!; అబ్జగర్భ= బ్రహ్మ; గౌరీపతి= ఈశ్వరుడు; ముఖ్య= మొదలైన; దేవ= దేవతలు; మునిబృందము= మహర్షుల సముదాయము; ఏ విభుని= ఏ ప్రభునియొక్క; దివ్యకళా+అంశజులు= దివ్యకళలనుండి అంశభూతంగా ఆవిర్భవించారో; అనంతుఁడు= అంతము లేనివాడు; ఎవ్వఁడు= ఎవడో; అచ్యుతుండు= జారుపాటు లేనివాడు; ఆ+పురుష+ఉత్తముండు= అటువంటి ఆ పురుషశ్రేష్ఠుడు; కరుణా+అంబుధి= దయాసముద్రుడు; కృష్ణుఁడు+పో= కృష్ణుడే కదా!

**తా :** మహారాజా! ఏ పరమేశ్వరుని అనుగ్రహంవల్ల ఈ లోకాలు స్థావరజంగమాలతో కూడి ప్రకాశిస్తున్నాయో; బ్రహ్మ, శంకరుడు మొదలైన దేవతలు, మహర్షులూ అందరూ ఏ ప్రభువు దివ్యకళలనుండి జన్మించారో; ఎవ్వడు అనంతుడో; ఎవ్వడు అచ్యుతుడో; ఆ పురుషోత్తముడే దయాపయోనిధి అయిన శ్రీకృష్ణుడు.

**ఉ. అట్టి జగన్నివాసుఁడు మురాసురభేది పరాపరుండు చే**
**పట్టి సఖుండు వియ్యమును బాంధవుఁడున్ గురుఁడున్ విభుండునై**
**యిట్టల మైన ప్రేమమున నెప్పుడుఁ దోడ్పడుచుండు వారలన్**
**జుట్టనవ్రేల నెవ్వరికిఁ జూపఁగ వచ్చును బార్థివోత్తమా! 31**

**ప్రతి :** పార్థివ+ఉత్తమా!= మహారాజా!; అట్టి= పైని చెప్పిన విధంగా; జగత్+నివాసుఁడు= ప్రపంచమంతయూ తన నివాసంగా కలవాడు; ముర+అసురభేది= మురుడనే రాక్షసుని చంపిన విష్ణుస్వరూపుడు; పర+అపరుండు=పరాపరములన్నియు

తానే అయినవాడు; సఖుండు= స్నేహితుడు; వియ్యమును= వియ్యంకుడు; బాంధవుఁడున్= బంధువు; గురుండున్= మార్గదర్శియు; విభుండున్+ఐ= ప్రభువును అయి; చేపట్టి= స్వీకరించి; ఇట్టలము+ఐన= అధికమైన; ప్రేమమునన్= అనురాగంతో; ఎప్పుడున్= ఎల్లప్పుడు; తోడ్పడుచుండున్= ఎవరికి సాయపడుతూ ఉంటాడో; వారలన్= అటువంటి పాండవుల; జుట్టనవ్రేలన్= చూపుడు వ్రేలితో; ఎవ్వరికిన్+చూపఁగవచ్చును= ఎవరు చూపించగలరు?

**తా :** అటువంటి జగన్నివాసుడు, మురాసురుని చంపినవాడు, పరాపరస్వరూపుడు (సర్వశ్రేష్ఠుడు) అయిన శ్రీకృష్ణుడు పాండవులకు స్నేహితుడై, వియ్యంకుడై, బంధువై, గురుడై, ప్రభువై ఎంతో ప్రేమతో ఎల్లపుడూ కాపాడుతుంటాడు కదా! అటువంటి పాండవులను కనీసం వ్రేలెత్తి చూపించేందుకు ఎవరికైనా సాధ్యమవుతుందా?

**విశే :** పరాపరుండు, ప్రకృతికంటె జీవునకంటె వేరయినవాడు.

**ఉ. కావునఁ బాండునందనులఁ గాఱియపెట్టక రాజ్యభాగమున్**
**వావిరి నిచ్చి రాజ్యమును వంశముఁ బుత్త్రుల బంధువర్గమున్**
**గావుము; కాక లోభియగు కష్టసుయోధను మాట వింటివే**
**భూవర! నీ యుపేక్ష నగుఁబో కులనాశము బంధునాశమున్. 32**

**ప్రతి :** భూవర!= మహారాజా!; కావునన్= అందుచేత; పాండునందనులన్= పాండురాజుకుమారులను; కాఱియపెట్టక= బాధపెట్టకుండా; రాజ్యభాగమున్= రాజ్యంలో వారి భాగాన్ని; వావిరిన్+ఇచ్చి= పద్ధతిగా పంచి ఇచ్చి; రాజ్యమును= రాజ్యాన్ని; వంశమున్= వంశాన్ని; పుత్త్రులన్= కొడుకులను; బంధువర్గమున్= చుట్టాలను; కావుము= రక్షించుము; కాక= అలా కాకుండా; లోభి+అగు= పరద్రవ్యాన్ని ఆశించే; కష్టసుయోధనుమాటన్= దుష్టుడైన దుర్యోధనుని మాటను; వింటివి+ఏన్= విన్నట్లయితే (లేదా); నీ+ఉపేక్షన్= నీవు అంటీ ముట్టకుండగా మౌనం వహించినా, ఆ తటస్థ వైఖరివలన; కులనాశమున్= వంశనాశనమును; బంధునాశమున్= బాంధవవినాశనమును; అగున్+పో= జరుగును సుమా!

**తా :** అందువల్ల పాండవులను బాధపెట్టకుండా వారి రాజ్యభాగాన్ని వారికి ఇచ్చి, దేశాన్ని, కులాన్ని, కుమారులను, మిగిలిన బంధువర్గాన్ని రక్షించు. అలా కాకుండా లోభియైన దుర్మార్గుడైన దుర్యోధనుని మాట విన్నా, ఉదాసీనంగా వ్యవహరించినా దానివల్ల కులనాశం, బంధునాశం కూడా జరుగుతుంది.

**తే. ఒకనికై యిట్లు కుల మెల్ల నుక్కడంప, నెత్తుకొనఁజూచె దిది నీతియే నృపాల!**
**వినుము నా మాట; నీ సుయోధనుని విడిచి, కులము రాజ్యంబుఁదేజంబు నిలుపవయ్య! 33**

**ప్రతి :** నృపాల!= మహారాజా!; ఒకనికి+ఐ= ఒక్కడికోసం; ఇట్లు= ఈ విధంగా; కులము+ఎల్లన్= వంశమంతటినీ; ఉక్కడంపన్= నశింపజేసికోవడానికి; ఎత్తుకొనన్+చూచెదు= ప్రయత్నిస్తున్నావు; ఇది నీతి+ఏ?= ఇది న్యాయమేనా?; నా మాటన్ వినుము= నా పలుకును ఆలకించు; ఈ సుయోధనునిన్ విడిచి= ఈ దుర్యోధనుని విడిచిపెట్టి; కులమున్= వంశాన్ని; రాజ్యంబున్= దేశాన్ని; తేజంబున్= ప్రతాపాన్ని; నిలుపుము+అయ్య!= కాపాడవయ్యా!

**తా :** మహారాజా! ఒక్కడికోసం మొత్తం వంశాన్ని పాడు చేసుకుంటావా? ఇది న్యాయమేనా? నా మాట విని, ఈ దుర్యోధనుణ్ణి విడిచిపెట్టి నీ కులాన్ని, ఈ దేశాన్ని, నీ పరువును, ప్రతిష్ఠను కాపాడుకో.

**క. అని యిట్లు దతిమి చెప్పిన, విని దుర్యోధనుఁడు రోషవివశుండై తా**
**నినతనయ శకుని దుశ్శా, సనుల నిరీక్షించి తామసంబునఁ బలికెన్. 34**

**ప్రతి :** అని ఇట్లు= అని ఈ విధంగా; తతిమి చెప్పినన్= వేగంగా (ఆవేశంగా) విదురుడు చెప్పగా; దుర్యోధనుఁడు= సుయోధనుడు; విని= ఆలకించి; రోషవివశుండు+ఐ= కోపంతో ఒళ్ళు తెలియనివాడై; తాను= అతడు; ఇనతనయ= కర్ణుడు; శకుని= శకుని; దుశ్శాసనులన్= దుశ్శాసనులను; నిరీక్షించి= చూచి; తామసంబునన్= అహంకారంతో; పలికెన్= మాట్లాడాడు.

**తా :** విదురుడు అలా చెప్పేసరికి దుర్యోధనుడు కోపంతో ఊగిపోయాడు. తనను తాను మరచిపోయాడు. వెంటనే కర్ణుణ్ణి, శకునిని, దుశ్శాసనుణ్ణి చూచి ఇలా అన్నాడు.

**క. దాసీపుత్త్రుని మీర లు, దాసీనుంజేయ కిటకుఁదగునె పిలువఁగా?**
**నాసీనుండై ప్రేలెడు, గాసిలి చెడిపోవ వెడలఁగా నడువుఁడిఁకన్. 35**

**ప్రతి :** మీరలు= మీరందరూ; దాసీపుత్త్రునిన్= దాసీపుత్రుడైన విదురుని; ఉదాసీనున్+చేయక= తటస్థంగా ఉండేలా చేయకుండా; ఇటకున్= ఈ సభకు; పిలువఁగాన్ తగునె?= పిలువవచ్చునా?; ఆసీనుండు+ఐ= అతడిక్కడ కూర్చున్నవాడై; ప్రేలెడున్= నోటికి వచ్చినట్లు మాట్లాడుతున్నాడు; గాసిలి చెడిపోవన్= బాధతో కుమిలిపోయే విధంగా; ఇఁకన్= వెంటనే; వెడలన్+కాన్= ఈ సభనుండి వెలుపలికి వెళ్ళునట్లు; నడువుఁడు= గెంటివేయండి.

**తా :** కర్ణశకుని దుశ్శాసనులారా! ఈ దాసీపుత్రుడు ఏదీ పట్టనట్లుగా ఒకమూల కూర్చోదగినవాడు. ఇతనిని ఇక్కడకు ఎందుకు రానిచ్చారు. వచ్చినవాడు మౌనంగా కూర్చోకుండా నోటికి వచ్చినట్లు ప్రేలుతున్నాడు. వెంటనే ఇతనిని బయటకు గెంటివేయండి అన్నాడు దుర్యోధనుడు.

**వ. అని యిట్లు దుర్యోధనుం డాడిన దురాలాపంబులు దనకు మనస్తాపంబుసేయం గార్యంబు విచారించి ధైర్యం బవలంబించి యొందు పలుక నొల్లక శరశరాసనంబులు విడిచి క్రోధంబు నడఁచి వనంబునకు జని యందు. 36**

**ప్రతి :** అని+ఇట్లు= అని ఆ విధంగా; దుర్యోధనుండు= సుయోధనుడు; ఆడిన= పలికిన; దుర్+ఆలాపంబులు= ప్రేలాపనలు; తనకున్= విదురునకు; మనస్+తాపంబు= మానసికవేదనను; చేయన్= కలిగింపగా; కార్యంబున్= కర్తవ్యాన్ని; విచారించి= ఆలోచించి; ధైర్యంబు= ధీరత్వాన్ని; అవలంబించి= పూని; ఒందు పలకన్ ఒల్లక= మరేదీ మాట్లాడేందుకిష్టపడక; శరశరాసనంబులు విడిచి= ధనుర్బాణాలను విడిచిపెట్టి; క్రోధంబున్= కోపాన్ని; అడఁచి= అణచిపెట్టి; వనంబునకున్+చని= అడవికిపోయి; అందున్= ఆ అరణ్యంలో...

**తా :** ఈ విధంగా దుర్యోధనుడు అహంకారంతో మాట్లాడిన మాటలకు ఎంతో మానసిక వ్యధను అనుభవించాడు విదురుడు. వెంటనే ఆలోచించాడు. ధైర్యం వహించాడు. మరొకమాట మాట్లాడకుండా, విల్లమ్ములు అక్కడే విడిచిపెట్టి, కోపాన్ని అణచిపెట్టుకుని, అడవికి వెళ్ళిపోయాడు.

**విశే :** దుర్యోధనుని మాటలకు విదురునికి కోపం వచ్చింది. కాని సమయము కాదని దానిని దిగమ్రింగాడు. 'తన కళ్లముందు తప్పు జరుగుతున్నా స్పందించకపోతే అది వారల చేటగు' అని భారతంలో కృష్ణుడన్నాడు. సమయాసమయాలు

గుర్తించకుండా తీవ్రంగా స్పందిస్తే 'తన కోపమె తన శత్రువు' అవుతుంది. అందుకని తగిన సమయంకోసం నిరీక్షిస్తూ, అంతవరకూ తన కోపాన్ని దిగమ్రింగగలిగే వారినే జితక్రోధులు అంటారు.

**సీ. విష్ణుస్వయంవ్యక్త విమలభూములను బవిత్రంబులగు హరిక్షేత్రములను**
**నెలకొని దేవతానిర్మితహరిదివ్యభూముల గంగాదిపుణ్యనదుల**
**సిద్ధపురాణప్రసిద్ధ పుణ్యాశ్రమ స్థలముల నుపవనస్థలములందు**
**గంధమాదనముఖక్ష్మాభృత్తటంబుల మంజులగిరికుంజపుంజములను**

**తే. వికచకైరవ పద్మ హల్లక మరంద, పాన పరవశ మధుకర గాన బుద్ధ**
**రాజహంస విలాస విరాజమాన, మగుచుఁ జెలువొందు పంకేరుహాకరముల. 37**

**ప్రతి :** విష్ణుస్వయంవ్యక్త= విష్ణువు స్వయంగా వెలసిన; విమల= స్వచ్ఛమైన; భూములను= ప్రదేశాలను; పవిత్రంబులు+అగు= పవిత్రములైన; హరిక్షేత్రములందు= వైష్ణవక్షేత్రములను; దేవతానిర్మిత= అమరులచే నిర్మించబడిన; హరి= హరియొక్క; దివ్యభూములన్= దివ్యస్థలాలలోను; గంగా+ఆది పుణ్యనదులన్= గంగ మొదలగు పుణ్యనదులలోను; సిద్ధ= సిద్ధులు నివసించిన; పురాణ= పురాతన; ప్రసిద్ధ= ఖ్యాతి చెందినటువంటి; పుణ్య+ఆశ్రమ స్థలములన్= పవిత్రమైన ఆశ్రమ ప్రదేశములలోను; ఉపవనస్థలములు+అందున్= వాటికి సమీపమందున్న వనములలోను; గంధమాదన ముఖ= గంధమాదనము మొదలైన; క్ష్మాభృత్+తటంబులన్= కొండచరియలలోను; మంజుల= అందమైన; గిరి= కొండలలోగల; కుంజపుంజములను= పొదరిండ్ల సముదాయములలోను; వికచ= వికసించిన; కైరవ= కలువల; పద్మ= తామరల; హల్లక= ఎఱ్ఱకలువలలోని; మరంద= తేనెను; పాన= త్రాగుటచే; పరవశ= పరవశించిన; మధుకర= తుమ్మెదలు చేయు; గాన= గానమునకు; బుద్ధ= మేలుకొనిన; రాజహంస= రాజహంసలయొక్క; విలాస= విలాసములచే; విరాజమానము+ అగుచున్= ప్రకాశిస్తూ; చెలువు+ఒందు= ఒప్పుచున్న; పంకేరుహ+ఆకరములన్= పద్మాకరములయందు (సరస్సమీపములయందు); నెలకొని= నిలిచి...

**తా :** అలా అన్నీ విడిచిపెట్టి వెళ్ళిన విదురుడు శ్రీహరి స్వయంగా వెలసిన పవిత్ర ప్రదేశాలను, వైష్ణవ క్షేత్రాలను, దేవతలు నిర్మించిన దివ్యస్థలాలను, గంగ మొదలైన పుణ్యనదులను, పురాణ ప్రసిద్ధములైన సిద్ధాశ్రమాలను, తపోవనాలను, ఇంకా గంధమాదనంవంటి కొండచరియలను, అక్కడి చక్కని పొదరిండ్లను, వికసించిన కలువలు, చెంగలువలు, పద్మాలలోని మకరందాన్ని త్రాగి పరవశించిన తుమ్మెదలు చేసే ఝుంకారాలకు మేలుకొన్న రాజహంసల విలాసాలతో అందగించుచున్న సరోవరాలను చూస్తూ ఉన్నాడు.

**క. మఱియును ఋష్యాశ్రమ వన, సరి దుపవన నద పుళింద జనపద గిరి గ**
**హ్వర గోష్ఠ యజ్ఞశాలా, పుర దేవాయతన పుణ్యభూములయందున్. 38**

**ప్రతి :** మఱియును= అంతేకాక; ఋషి+ఆశ్రమ= మునుల ఆశ్రమాలు; వన= తపోవనాలు; సరిత్= నదులు; ఉపవన= వాటికి సమీపమున ఉన్న చిన్న చిన్న వనాలు; నద= నదాలు; పుళింద జనపద= బోయవారు నివసించు ప్రదేశాలు; గిరిగహ్వర= పర్వత గుహలు; గోష్ఠ= గోశాలలు; యజ్ఞశాలా= యాగశాలలు; పురదేవాయతన= ఆయా జనపదాలలోని దేవాలయాలు; పుణ్యభూముల+అందున్= ఇంకా ఎన్నో పుణ్యభూములలో (సంచరించాడు).

**తా :** అంతేకాకుండగా మునుల ఆశ్రమాలను సందర్శించాడు విదురుడు. తపోవనాలు, నదులు, వాటికి దాపుననున్న చిన్న చిన్న వనాలు, నదాలు, బోయవారు నివసించే ప్రదేశాలు, కొండగుహలు, గోశాలలు, యజ్ఞవాటికలు, జనపదాలలోని దేవాలయాలు మరెన్నో పుణ్యభూములను చూస్తూ సంచరించాడు.

**విశే :** నదము అనగా తూర్పునుండి పడమరకు ప్రవహించే ఏరు.

**క. కూరలుఁ గాయలు నీ ళ్ళా, హారముగాఁ గొనుచు నియమ మలవడఁగ నసం**
**స్కార శరీరుం డగుచు ను, దారత నవధూతవేషధరుఁడై వరుసన్. 39**

**ప్రతి :** కూరలున్= ఆకుకూరలు; కాయలున్= కాయలును; నీళ్ళు= నీరు మాత్రమే; ఆహారముగాన్= భోజనంగా; కొనుచున్= స్వీకరిస్తూ; నియమము= ఆహారవిహారాలలో నియమాలు; అలవడఁగన్= అభ్యాసంలోకి రాగా; అసంస్కార శరీరుండు+అగుచున్= స్నానాదులు లేనివాడు; ఉదారతన్= ఔదార్యగుణం కలిగినవాడై; అవధూత వేషధరుఁడు+ఐ= పరివ్రాజకవేషాన్ని ధరించినవాడై; వరుసన్= క్రమంగా...

**తా :** విదురుడు ఆయా ప్రదేశాలు తిరుగుతున్నాడు. ఆకులు, కూరలు, నీళ్ళు తప్ప వేరే ఆహారమేదీ తీసుకోవడం లేదు. శరీరసంస్కారంకూడా చేసుకోవడం లేదు. అవధూతవేషంలో అడవులలో సంచరిస్తున్నాడు.

**విశే :** అవధూత అంటే దిగంబర సన్న్యాసి అని శబ్దరత్నాకరం. కేవల బ్రహ్మనిష్ఠతో వర్ణాశ్రమాలను విడిచిన సన్న్యాసి అని సూర్యరాయాంధ్ర నిఘంటువు. అవధూత అనడమే వాడుక.

**క. హర్షము గదురఁగ భారత, వర్షమునంగలుగు పుణ్యవరతీర్థము లు**
**త్కర్షంజూచుచు విగతా, మర్షుండై సంచరించె మనుజవరేణ్యా! 40**

**ప్రతి :** మనుజవరేణ్యా!= పరీక్షిన్మహారాజా!; హర్షము+కదురఁగన్= సంతోషం అతిశయించగా; భారతవర్షమునన్+కలుగు= భరతఖండంలో ఉన్న; పుణ్యవరతీర్థములు= మిక్కిలి పుణ్యప్రదాలైన నదీనదాలు; ఉత్కర్షన్+చూచుచున్= ఉత్సాహంతో చూస్తూ; విగత+అమర్షుండు+ఐ= కోపము లేనివాడై (ప్రశాంతచిత్తుడై); సంచరించెన్= విదురుడు సంచరించాడు.

**తా :** పరీక్షిన్మహారాజా! (శుకమహర్షి చెప్పుచున్నాడు) విదురుడు సంతోషంతో; కోపాది వికారాలు లేనివాడై, భరతఖండంలో ఉన్న పుణ్యనదీనదాలనన్నిటిని చూస్తూ సంచరించాడు.

**వ. ఇట్లు సంచరించుచుఁ బ్రభాసతీర్థమ్మునకు వచ్చునపుడు 41**

**ప్రతి :** ఇట్లు= ఇలా; సంచరించుచున్= తిరుగుతూ; ప్రభాసతీర్థమునకున్= ప్రభాసమనే తీర్థానికి; వచ్చునపుడు= వచ్చే సందర్భంలో

**తా :** విదురుడు అలా సంచరిస్తూ క్రమంగా ప్రభాసతీర్థానికి చేరుకొన్నాడు. అప్పుడు

**చ. అరుగుచు దైత్యభేదన దయాపరిలబ్ధ సమస్త మేదినీ**
**భరణధురంధరుండగుచుఁబాండుసుతాగ్రజుఁడొప్పుచుండ న**
**త్తఱి విదురుండుఁదత్సరిదుదంచిత సాల రసాల మాధవీ**
**కురవక మాలతీ వకుళ కుంజ లసత్తటమందు నున్నెడన్. 42**

**ప్రతి :** దైత్యభేదన= దైత్యులను మర్దించే శ్రీకృష్ణుని; దయా= అనుగ్రహంచేత; పరిలబ్ధ= సంప్రాప్తించిన; సమస్త= పూర్ణమైన; మేదినీ భరణ= భూమిని భరించడంలో; ధురంధరుండు+అగుచున్= సమర్థుడగుచు; పాండుసుత+ అగ్రజుఁడు= ధర్మరాజు; ఒప్పుచుండన్= ప్రకాశిస్తూ ఉండగా; ఆ+తఱిన్= ఆ సమయంలో; అరుగుచున్= సర్వపుణ్యక్షేత్రాలు సంచరిస్తున్నవాడై; తద్= ఆ ప్రభాసతీర్థ ప్రాంతమందున్న; సరిత్= నదులు; ఉదంచిత= గొప్పవైన; సాల= మద్దిచెట్లు; రసాల= మామిడిచెట్లు; మాధవీ= గురువెందలతలు; కురవక= ఎఱ్ఱ గోరంట చెట్లు; మాలతీ= జాజిలతలు; వకుళ= పొగడచెట్లు; కుంజ= పొదరిండ్లు; వీటితో; లసత్= ప్రకాశించుచున్న; తటము+అందున్= నది ఒడ్డున; విదురుండున్= విదురుడు; ఉన్న+ఎడన్= ఉండగా.

**తా :** విదురుడు అలా సంచరిస్తూ, శ్రీకృష్ణుని దయవల్ల సంప్రాప్తమైన రాజ్యాన్ని ధర్మరాజు పాలిస్తున్న ప్రదేశానికి చేరుకొన్నాడు. అక్కడి మద్ది, మామిడి, గురివెంద, ఎఱ్ఱగోరింట, మాలతి, పొగడ మొదలైన చెట్లు, తీగలతోకూడిన ఒక నది ఒడ్డున నివసించాడు.

**చ. నరవర! వేణుజానలవినష్ట మహాటవిమాడ్కిఁ బాండు భూ**
**వర! ధృతరాష్ట్ర సూను లనివార్య నిరూఢ విరోధ మెత్తి యొం**
**డొరుల జయింపఁగోరి కదనోర్విఁగురుక్షితిపాలముఖ్యు లం**
**దఱు మృతు లౌటయున్ విని ఘనంబుగ శోకనిమగ్నచిత్తుఁడై. 43**

**ప్రతి :** నరవర= పరీక్షిన్మహారాజా!; వేణుజ+అనల= వెదురులలో పుట్టిన అగ్నిచేత; వినష్ట= నశించిన; మహా+అటవి మాడ్కిన్= గొప్ప అరణ్యంవలె; పాండుభూవర ధృతరాష్ట్ర సూనులు= పాండురాజుయొక్క ధృతరాష్ట్రునియొక్క కుమారులు; అనివార్య= వారింపనలవికాని; నిరూఢ= ప్రసిద్ధమైన; విరోధము+ఎత్తి= కలహం పెట్టుకొని; ఒండొరులన్= ఒకరిని మరొకరు; జయింపన్+కోరి= గెలవాలని ఆశించి; కదన+ఉర్విన్= రణభూమిలో; కురుక్షితిపాలముఖ్యులు= దుర్యోధనుడు మొదలగు ప్రసిద్ధులు; అందఱున్= అందరూ; మృతులు+ఔటయున్= చనిపోవుటనుగూర్చి; విని= ఆలకించి; ఘనంబుగన్= మిక్కిలిగా; శోక నిమగ్నచిత్తుఁడు+ఐ= దుఃఖంలో మునిగిపోయిన మనస్సు కలవాడై...

**తా :** పరీక్షిన్మహారాజా! ధర్మరాజు పరిపాలిస్తున్న ప్రాంతానికి చేరువలోనున్న విదురుడు మహాభారత సంగ్రామం గురించి విన్నాడు. వెదుళ్లలో పుట్టిన అగ్ని మొత్తం అడవిని కాల్చివేసినట్లు, కౌరవపాండవుల మధ్య పుట్టిన కలహం దుర్యోధనుడాదిగా ఎందరో మహారాజులను పొట్టన బెట్టుకొన్నదని విని ఎంతో దుఃఖించాడు.

**ఉ. ఆ యెడఁ గాలు దన్నక రయంబున నేఁగి సరస్వతీనదీ**
**తోయములందుఁగ్రుంకి మునితుల్యుఁడు వే చనియెం దనూనపా**
**త్తోయరుహాప్తభార్గవ పృథుత్రిత సోమ సుదాస శక్తి భృ**
**ద్వాయు యమాభిధానయుత వాహినులందనురక్తిఁగ్రుంకుచున్. 44**

**ప్రతి :** మునితుల్యుఁడు= ఋషివంటివాడైన విదురుడు; ఆ యెడన్= ధర్మరాజు పరిపాలనలో ఉన్న ఆ ప్రాంతమందు; కాలు+తన్నక= కాలు నిలువక; రయంబునన్+ఏఁగి= వేగంగా బయలుదేరి; సరస్వతీనదీతోయముల+అందున్= సరస్వతీనది నీళ్లలో; క్రుంకి= మునిగి; తనూనపాత్= అగ్ని; తోయరుహ+ఆప్త= సూర్యుడు; భార్గవ= శుక్రుడు; పృథు= పృథువు; త్రిత=

త్రితుడు; సోమ= సోముడు; సుదాస= సుదాసుడు; శక్తిభృత్= శక్తి అను ఆయుధమును ధరించిన కుమారస్వామి; వాయు= వాయువు; యమ= యముడు; అభిధానయుత= అనువారి యొక్క పేర్లతో కూడి ప్రసిద్ధములైన; వాహినులు+ అందున్= నదులయందు; అనురక్తిన్= ఆసక్తితో; క్రుంకుచున్= స్నానంచేస్తూ; వే చనియెన్= వేగంగా వెళ్ళాడు.

**తా :** జ్ఞాతి (దాయాది) వర్గంలో పెక్కురు యుద్ధంలో మరణించారని తెలిసి, అక్కడ ఉండడానికి కాలు నిలువలేదు విదురునికి. ఋషికల్పుడైన అతడు అక్కడనుండి బయలుదేరి, సరస్వతీనదిలో స్నానం చేశాడు. అక్కడనుండి అగ్ని, సూర్య, శుక్ర, పృథు, త్రిత, సోమ, సుదాస, కుమార, వాయు, యమ నామధేయాలతో ప్రసిద్ధి పొందిన అన్ని నదులలోనూ స్నానం చేస్తూ వేగంగా ప్రయాణం సాగించాడు.

**ఉ. వెండియుఁ బుణ్యభూములఁ బవిత్రసరిత్తులఁ జూచుచున్ రమా**
**మందనుఁడుండు దివ్యరుచిమన్మణి చారుకవాట గేహళీ**
**మండిత సౌధగోపుర విమానము లున్నతభక్తిఁ జూచుచున్**
**నిండిన వేడ్కఁ గృష్ణపద నీరజచింతనుఁడై క్రమంబునన్. 45**

**ప్రతి :** వెండియున్= మరియు; పుణ్యభూములన్= పుణ్యభూములందున్న; పవిత్రసరిత్తులన్= పవిత్రములైన నదులను; చూచుచున్= దర్శిస్తూ; రమామందనుఁడు= లక్ష్మీవల్లభుడైన విష్ణుమూర్తి; ఉండు= నివసించు; దివ్య= శ్రేష్ఠమైన; రుచిమత్= కాంతితో నిండిన; మణి= మణులను పొదిగిన; చారు= అందమైన; కవాట= తలుపులు; గేహళీ= గడపలతో; మండిత= విరాజిల్లుచున్న; సౌధ= రాజగృహాలను; గోపుర= గోపురాలను; విమానముల్= విమానాలను; ఉన్నతభక్తిన్= మిక్కిలి భక్తితో; చూచుచున్= సందర్శిస్తూ; నిండిన వేడ్కన్= మిక్కిలి సంతోషంతో; కృష్ణ= కృష్ణునియొక్క; పదనీరజ= పాదపద్మముల; చింతనుఁడు+ఐ= స్మరణ కలవాడై; క్రమంబునన్= క్రమంగా...

**తా :** విదురుడు పుణ్యస్థలాలను చూస్తున్నాడు. పవిత్ర తీర్థాలను సేవిస్తున్నాడు. మాధవుడు కొలువుండే దేవాలయాలను, రకరకాల మణులను పొదిగిన ఆ మందిరాల తలుపులను, గడపలను, రాజగృహాలను, గోపురాలను, విమానాలను చూస్తూ, గోవిందుని పాదపద్మాలనే స్మరించుకొంటూ క్రమంగా ముందుకు సాగిపోయాడు.

## ❖ విదురుం డుద్ధవుంగని కృష్ణాదుల వృత్తాంతం బడుగుట ❖

**చ. చని చని తొంటి మత్స్య కురుజాంగలభూము లతిక్రమించి చ**
**య్యన యమునానదింగదిసి యచ్చట భాగవతున్ సరోజ లో**
**చన దృఢభక్తు సద్గుణవిశారదు శాంతుని దేవమంత్రి శి**
**ష్యుని మహితప్రసిద్ధుఁ బరిశోషితదోషుఁ బ్రబుద్ధు నుద్ధవున్. 46**

**ప్రతి :** చని చని= విదురుడు అలా వెళ్ళి వెళ్ళి; తొంటి= ముందుగా; మత్స్య కురు జాంగల భూములు= మత్స్య కురు జాంగల భూములను; అతిక్రమించి= దాటి; చయ్యన= వేగంగా; యమునానదిన్= యమునానదిని; కదిసి= సమీపించి; అచ్చటన్= అక్కడ; భాగవతున్= భగవంతునిపై అనురక్తి కలవాడు; సరోజలోచన= శ్రీహరియందు; దృఢభక్తున్= చెదరని భక్తి కలవాడు; సద్గుణ విశారదున్= ఉత్తమమైన గుణములు కలవాడు; శాంతునిన్= శాంతస్వభావం కలవాడు;

దేవమంత్రిశిష్యునిన్= రాజనీతిలో దేవతలమంత్రియైన బృహస్పతి శిష్యునివంటివాడు; మహితప్రసిద్ధున్= మిక్కిలి ప్రసిద్ధుడు; పరిశోషితదోషున్= పూర్తిగా శుష్కింపజేయబడిన దోషములు గలవాడు (దోషరహితుడు); ప్రబుద్ధున్= మిక్కిలి చైతన్యవంతుడును అయిన; ఉద్ధవున్= ఉద్ధవుని...

**తా :** అలా ముందుకు సాగి, మత్స్య కురు జాంగల భూములను దాటి, యమునానదిని చేరుకున్నాడు. ఆ సమీపంలో ఉన్న గొప్ప భాగవతుడు, విశేషించి విష్ణుభక్తుడు, మంచి గుణాలు కలవాడు, శాంతస్వభావుడు, రాజనీతిలో బృహస్పతి శిష్యునివంటివాడు, లోకమంతా తెలిసినవాడు, దోషాలు లేనివాడు, చైతన్యస్వరూపుడు అయిన ఉద్ధవుని దర్శించాడు.

**క. కని యనురాగవికాసము, దన మనమునఁ దొంగలింపఁ దగ గాఢాలిం**
**గన మాచరించి నెయ్యం, బునఁ గుశలప్రశ్న సేసి ముదమునఁ బలికెన్. 47**

**ప్రతి :** కని= ఆ ఉద్ధవుని చూచి; అనురాగ వికాసము= అధికమైన స్నేహం; తన మనమునన్= తన హృదయంలో; తొంగలింపన్= ప్రకాశించగా; తగన్= ఆ స్నేహానికి తగినట్లుగా; గాఢ+ఆలింగనము= బిగి కౌగిలిని; ఆచరించి= ఏర్పరచి, చేసి (గట్టిగా కౌగిలించుకొని); నెయ్యంబునన్= స్నేహపూర్వకంగా; కుశలప్రశ్న+చేసి= క్షేమసమాచారాలు అడిగి తెలిసికొని; ముదమునన్= ఆనందంతో; పలికెన్= మాట్లాడాడు.

**తా :** ఆ ఉద్ధవుని చూడగానే విదురుని మనసు ఆనందంతో పరవశించింది. గట్టిగా కౌగిలించుకొన్నాడు. కుశల ప్రశ్నలు వేశాడు. ఆనందంగా మాట్లాడసాగాడు.

**క. హరిభక్తులు పుణ్యాత్ములు, దురితవిదూరులు విరోధిదుర్దమబలులుం**
**గురుకులతిలకులు గుంతీ, వరసూనులు గుశలులే యవారితభక్తిన్. 48**

**ప్రతి :** హరిభక్తులు= కృష్ణునియందు భక్తిగలవారు; పుణ్య+ఆత్ములు= పవిత్రమైన చరిత్ర కలవారు; దురితవిదూరులు= పాపరహితులు; విరోధి దుర్దమబలులున్= శత్రువులు సాధింపలేని బలం కలవారు; కురుకులతిలకులు= కురువంశానికే అలంకారమైనవారు అయిన; కుంతీవరసూనులు= కుంతీదేవియొక్క కుమారశ్రేష్ఠులు; అవారితభక్తిన్= తిరుగులేని భక్తితో; కుశలులు+ఏ= క్షేమంగా ఉన్నారా?

**తా :** విదురుడు అడుగుతున్నాడు. ఉద్ధవా! కృష్ణభక్తులు, పవిత్ర చరిత్రులు, పాపరహితులు, శత్రువులకు అసాధ్యులు, కురుకులాలంకారులు అయిన కుంతీకుమారులు భక్తిప్రపత్తులతో క్షేమంగా ఉన్నారా?

**విశే :** మాద్రి చనిపోయిన తరువాత కుంతి నకులసహదేవులనుకూడ తన పిల్లలుగానే ప్రేమగా పెంచింది. కనుక కుంతీకుమారులు అంటే పాండవులు ఐదుగురు అని అర్థం. పూర్వం తనకు తెలిసినపుడు పాండవులందరూ కృష్ణునియందు మిక్కిలి భక్తితత్పరులు. ఇప్పుడు రణరంగంలో విజయం సాధించి, రాజ్యాధికారం పొందిన తరువాత కూడా అహంకారం పొందకుండగా కృష్ణునియందు మునుపటివలె భక్తితో ఉంటున్నారు కదా! అని 'అవారితభక్తిన్' అనే మాటకు అర్థం.

**చ. హరి దన నాభిపంకరుహమందు జనించిన యట్టి భారతీ**
**శ్వరుఁ దతిభక్తి వేఁడ యదువంశమునన్ బలకృష్ణమూర్తులై**
**పరఁగ జనించి భూభరముఁబాపిన భవ్యులు రేవతీందిరా**
**వరు లట శూరసేనుని నివాసమునన్ సుఖ మున్నవారలే? 49**

**ప్రతి :** హరి= విష్ణుమూర్తి; తన= తనయొక్క; నాభిపంకరుహము+అందున్= బొడ్డుతామరయందు; జనించిన+అట్టి= ఉద్భవించినట్టి; భారతీ+ఈశ్వరుఁడు= శారదాపతియైన బ్రహ్మ; అతిభక్తిన్= మిక్కిలి భక్తితో; వేఁడన్= ప్రార్థింపగా; యదువంశమునన్= యాదవకులమందు; బలకృష్ణమూర్తులు+ఐ= బలరాముడుగా, కృష్ణుడుగా; పరఁగన్= ఒప్పిదముగా; జనించి= అవతరించి; భూభరమున్= పుడమి బరువును; పాపిన= పోగొట్టిన; భవ్యులు= మహాత్ములు; రేవతీ+ఇందిరావరులు= రేవతికి మరియు లక్ష్మికి నాథులు; అటన్= అక్కడ; శూరసేనుని= తాతగారైన శూరసేనునియొక్క; నివాసమునన్= ఇంటిలో; సుఖమున్నవారలు+ఏ?= కుశలంగా ఉన్నారా?

**తా :** పూర్వం తన నాభికమలంలో పుట్టిన బ్రహ్మ వేడుకొనడంచేత బలరాముడుగా, కృష్ణుడుగా యదువంశంలో అవతరించి, భూభారాన్ని తగ్గించారు. వారు తాతగారైన శూరసేనుని ఇంట క్షేమంగా ఉన్నారా?

**చ. కురుకులు లాదరింపఁగ సఖుండును నాప్తుఁడునై తనర్చి సో**
**దర తరుణీజనంబులను దత్పతులంగడు గారవంబునం**
**గరుణ దలిర్ప నాత్మజులకంటెఁ బ్రియోన్నతిఁ బ్రోచువాఁడు సు**
**స్థిరమతి నున్నవాఁడె వసుదేవుఁడు వృష్ణికులప్రదీపకా! 50**

**ప్రతి :** వృష్ణికులప్రదీపకా!= వృష్ణి వంశమునకు దీపమువంటి ఉద్ధవుడా!; కురుకులులు+ఆదరింపఁగన్= కురువంశీయులందరు ఆదరిస్తూండగా; సఖుండునున్= వారికి స్నేహితుడును; ఆప్తుఁడును+ఐ= హితుడును అయి; తనర్చి= ప్రవర్తించి; సోదర= తోడబుట్టిన; తరుణీజనంబులను= స్త్రీలను; తత్పతులన్= వారి భర్తలను; కడు గారవంబునన్= మిక్కిలి గౌరవంతో; కరుణ తలిర్పన్= దయ అతిశయించగా; ఆత్మజులకంటెన్= తన కన్నబిడ్డలకంటె; ప్రియ+ఉన్నతిన్= ఎక్కువ ప్రేమతో; ప్రోచువాఁడు= కాచుకొనువాడు అయిన; వసుదేవుఁడు= బలరామకృష్ణుల తండ్రి అయిన వసుదేవుడు; సుస్థిరమతిన్= ప్రశాంతమైన మనస్సుతో (క్షేమంగా); ఉన్నవాఁడు+ఎ?= ఉన్నాడు కదా!

**తా :** కురువంశీయులందరూ ఎంతో ఆదరిస్తూండగా అందరికీ స్నేహితుడుగా, వియ్యంకుడుగా, చెల్లెళ్ళను, వారి భర్తలను ఎంతో ఆదరంగా, ఆప్యాయంగా అందరినీ కన్నబిడ్డలకంటె ఎక్కువ ప్రేమగా చూసుకొనే వసుదేవుడు కుశలంగా ఉన్నాడా?

**శా. కందర్పాంశమునం దనూజుఁబడయంగామించి భూదేవతా**
**బృందంబున్ భజియించి తత్కరుణ దీపింపం బ్రభావంబు పెం**
**పొందన్ రుక్మిణి గన్న నందనుఁడు ప్రద్యుమ్నుండు భాస్వచ్చమూ**
**సందోహంబులు దన్నుఁగొల్వ మహితోత్సాహంబునన్ మించునే. 51**

**ప్రతి :** కందర్ప+అంశమునన్= మన్మథుని అంశతో; తనూజున్= కుమారుని; పడయన్= పొందవలెనని; కామించి= కోరుకొని; భూదేవతాబృందంబున్= బ్రాహ్మణుల సమూహమును; భజియించి= సేవించి; తద్+కరుణ= వారి దయ; దీపింపన్= వెలుగొంద; ప్రభావంబు= ఆ ఆశీశ్శక్తి; పెంపు+ఒందన్= అతిశయించగా; రుక్మిణి+కన్న= రుక్మిణికి పుట్టిన; నందనుఁడు= కుమారుడైన; ప్రద్యుమ్నుండు= ప్రద్యుమ్నుడు అను పేరు గలవాడు; భాస్వత్+చమూ సందోహంబులు= ప్రకాశించే సేనాసమూహాలు; తన్నున్+కొల్వన్= తనను సేవిస్తుండగా; మహిత+ఉత్సాహంబునన్= మిక్కిలి ఉత్సాహంతో; మించును+ఏ= అతిశయించుచున్నాడు కదా!

**తా :** తనకు మన్మథుని అంశతో కొడుకు పుట్టాలని రుక్మిణి ఎందరో బ్రాహ్మణులను సేవించి, వారి సూచనలమేరకు నోములు, వ్రతాలు ఆచరించి, చివరకు వారి దీవనలమేరకు ప్రద్యుమ్నుడికి జన్మనిచ్చింది. అతడు వీరుడై సేనాసమూహాలు సేవిస్తుండగా వైభవంతో వెలుగొందుతున్నాడు కదా!

**క. సరసిజలోచను కరుణా, పరిలబ్ధ సమస్త ధరణిపాలన మహిమం**
**బరమప్రీతి సుఖించునె, చిరవిభవోదారుఁడుగ్రసేనుఁడు జగతిన్. 52**

**ప్రతి :** సరసిజలోచను= కృష్ణునియొక్క; కరుణా= దయవలన; పరిలబ్ధ= పొందబడిన; సమస్తధరణి= మొత్తం భూమియొక్క; పాలనమహిమన్= పరిపాలనయొక్క గొప్పతనంచేత; పరమప్రీతిన్= మిక్కిలి ఆనందంతో; చిరవిభవ+ఉదారుఁడు= శాశ్వతవైభవంతో కూడినవాడగు; ఉగ్రసేనుఁడు= ఉగ్రసేనుడు అనుపేరు కలవాడు; జగతిన్= ధరణియందు; సుఖించును+ఎ= సుఖంగా ఉన్నాడు కదా!

**తా :** శ్రీకృష్ణుని దయతో పొందిన సమస్తభూమిని పాలిస్తూ, మిక్కిలి ఆనందంతో, శాశ్వత వైభవంతో ఉగ్రసేనుడు సుఖంగా ఉన్నాడు కదా!

**విశే :** ఉగ్రసేనుడు కంసుని తండ్రి. ద్రమిళుడనే రాక్షసుడు ఉగ్రసేనుని రూపం ధరించి ఉగ్రసేనుని భార్యను వంచనతో కలిశాడు. అందువలన జన్మించినవాడు కంసుడు. కనుకనే అతనికి రాక్షసప్రవృత్తి ఏర్పడింది. అతడు తండ్రియైన ఉగ్రసేనుని బంధించి బలవంతంగా రాజ్యాధికారాన్ని చేజిక్కించుకొన్నాడు. తరువాత కృష్ణుడు కంసుని సంహరించి, వాని తండ్రియైన ఉగ్రసేనుని చెర విడిపించి, రాజ్యాభిషిక్తుని చేశాడు.

**చ. లలిత పతివ్రతామణి విలాసవతీ తిలకంబు పార్వతీ**
**లలన గుమారుఁగన్నటు సులక్షణ జాంబవతీలలామ ని**
**ర్మలగతిఁగన్న పట్టి సుకుమారతనుండు విరోధిభంజనో**
**త్కలిక సుఖించునే గుణకదంబుఁడు సాంబుడు వృష్ణిపుంగవా! 53**

**ప్రతి :** వృష్ణిపుంగవా= వృష్ణివంశ శ్రేష్ఠుడవైన ఉద్ధవా!; పార్వతీ లలన= పార్వతీదేవి; కుమారున్= కుమారస్వామిని; కన్న+అటు= ప్రసవించినట్లుగా; లలిత పతివ్రతామణి= సుకుమారంగా పాతివ్రత్యాన్ని పాటించుటలో శ్రేష్ఠురాలు; విలాసవతీ తిలకంబు= విలాసవతులలో శ్రేష్ఠురాలు; సులక్షణ= మంచి లక్షములు కలది అయిన; జాంబవతీ లలామ= జాంబవతి అను పేరుగల స్త్రీ; నిర్మలగతిన్= ప్రశాంత మనస్సుతో; కన్నపట్టి= కన్న కుమారుడు; సుకుమార తనుండు= కోమలమైన శరీరం కలవాడు; విరోధిభంజన+ఉత్కలికన్= శత్రువులను నశింపజేయుటలో ఉత్సాహంతో ఉంటూ; గుణకదంబుఁడు= సద్గుణముల సముదాయం గలవాడు అయిన; సాంబుఁడు= సాంబుడను పేరుగలవాడు; సుఖించును+ఏ= సుఖంగా ఉన్నాడు కదా!

**తా :** ఉద్ధవా! పతివ్రతాశిరోమణి, సౌందర్యవతి, సద్గుణవతి అయిన జాంబవతి, పార్వతి కుమారస్వామిని కన్నట్లుగా సాంబుని కన్నది. సుకుమారుడయ్యును శత్రువులను చీల్చి చెండాడే ఆ సాంబుడు కుశలంగా ఉన్నాడు కదా!

**క. హరిపదసేవకుఁ దరి భీ, కరుఁ దర్జునువలన మిగులఁగార్ముకవిద్యల్**
**దిరముగఁగఱచిన సాత్యకి, వరసుఖవిభవముల నున్నవాఁడె ధరిత్రిన్? 54**

**ప్రతి :** హరిపదసేవకుఁడు= కృష్ణుని పదాలను సేవించేవాడు; అరి భీకరుఁడు= శత్రుభయంకరుడు; అర్జునువలనన్= అర్జునునిద్వారా; మిగులన్= మిక్కిలిగా; కార్ముకవిద్యల్= ధనుర్విద్యలను; తిరముగన్= స్థిరంగా (శ్రద్ధగా); కఱచిన= నేర్చుకొన్న; సాత్యకి; ధరిత్రిన్= భూమిపై; వరసుఖవిభవములన్= గొప్ప సుఖాలతోను, వైభవములతోను; ఉన్నవాఁడు+ఎ= ఉన్నాడు కదా!

**తా :** కృష్ణపాదసేవకుడు, శత్రుభయంకరుడు, అర్జునునివద్ద క్షుణ్ణంగా విలువిద్య నభ్యసించినవాడు అయిన సాత్యకి సుఖాలతో, వైభవాలతో సుఖంగా ఉన్నాడు కదా!

**మ. జలజాతాంకుశ చక్ర చాప కులిశ చ్ఛత్రాది రేఖాంకితో**
**జ్జ్వల గోవింద పదాబ్జ లక్షిత విరాజన్మార్గ ధూళిచ్ఛటా**
**కలితాంగుండు విధూతకల్మషుఁడు నిష్కామైకధర్ముండు స**
**త్కులజాతుండన నొప్పునట్టి ఘనుఁడక్రూరుండు భద్రాత్ముఁడే? 55**

**ప్రతి :** జలజాత= పద్మము; అంకుశ= అంకుశము; చక్ర= చక్రము; చాప= ధనుస్సు; కులిశ= వజ్రాయుధము; ఛత్ర+ఆది= గొడుగు మొదలైన; రేఖా+అంకిత= శుభరేఖల గుర్తులు గల; ఉజ్జ్వల= ప్రకాశవంతమైన; గోవింద= కృష్ణునియొక్క; పద+అబ్జ= పాదపద్మములచే; లక్షిత= రూపింపబడుటచే (అడుగుజాడలు పడుటచే); విరాజత్= ప్రకాశించుచున్న; మార్గ= బాటయందలి; ధూళిచ్ఛటా= ధూళిరేణువులతో; ఆకలిత= వ్యాప్తమైన (కూడిన); అంగుండు= శరీరం కలవాడు; విధూత కల్మషుఁడు= ఎగురగొట్టబడిన మాలిన్యము కలవాడు; నిష్కామ+ఏకధర్ముండు= ఏ కోరికా లేకుండా కేవలం ధర్మాన్నే ఆచరించేవాడు; సత్కులజాతుండు+అనన్= మంచి వంశంలో జన్మించినవాడు అనగా; ఒప్పునట్టి ఘనుఁడు= ప్రవర్తించే గొప్పవాడు; అక్రూరుండు= అక్రూరుడు; భద్ర+ఆత్ముఁడు+ఏ= క్షేమంగానే ఉన్నాడు కదా!

**తా :** శ్రీకృష్ణుని పాదాలు పద్మం, అంకుశం, చక్రం, ధనుస్సు, వజ్రం, ఛత్రం వంటి శుభరేఖలతో ప్రకాశిస్తూ ఉంటాయి. అటువంటి పాదాలతో నడిచిన త్రోవలో ఏర్పడిన అడుగుజాడలు గమనించి ఆ దుమ్మును శరీరంపై అలదుకొని ఆనందించేవాడు, మనసులో కపటం లేనివాడు, ఏ కోరికలూ లేకుండా కేవల ధర్మాచరణం చేసేవాడు, సద్వంశసంజాతుడు అయిన అక్రూరుడు క్షేమంగా ఉన్నాడు కదా!

**క. శ్రుతులును గ్రతుజాతము స, మ్మతిఁ దాల్చినయట్టి వేదమాతగతిన్ శ్రీ**
**పతిఁ దన గర్భమ్మున ర, క్షితుఁ జేసిన గరిత దేవకీసతి సుఖమే. 56**

**ప్రతి :** శ్రుతులును= వేదాలును; క్రతుజాతము= యాగ సముదాయమును; సమ్మతిన్= ఆదరంగా; తాల్చిన+అట్టి= తనలో ధరించినటువంటి; వేదమాత గతిన్= వేదమాతవలె; శ్రీపతిన్= లక్ష్మీపతియైన విష్ణువును; తన గర్భమ్మునన్= తన ఉదరంలో; రక్షితున్+చేసిన= భద్రంగా కాపాడిన; గరిత= స్త్రీ అయిన; దేవకీసతి= దేవకీదేవి; సుఖము+ఏ!= కుశలమే కదా!

**తా :** వేదాలను, యజ్ఞయాగాలను తనలో ఇముడ్చుకొన్న వేదమాతలాగా సాక్షాత్తు లక్ష్మీపతినే తన గర్భంలో ధరించి కాపాడిన గొప్ప ఇల్లాలైన దేవకీదేవి సుఖంగానే ఉంది కదా!

**వ. మఱియు మహాత్మా! మహితోపాసకులగువారల కోర్కులు నిండింపంజాలిన భగవంతుండును, శబ్దశాస్త్రంబునకుం గారణంబని తన్ను నఖిలదేవతాజనంబు లగ్గింప గల మేటి యగుటంజేసి మనోమయుండును, సకలజీవ చతుర్విధాంతఃకరణంబులయిన చిత్తాహంకారబుద్ధిమనంబులకుం గ్రమంబున వాసుదేవ సంకర్షణ ప్రద్యు మ్నానిరుద్ధు లధిదైవతంబు లగుదు రట్టి చతుర్విధ తత్త్వంబులకుఁ దుర్యంబైన తత్త్వంబునునైన యనిరుద్ధకుమారుండు సంతోషచిత్తుం డగునే యని. 57**

**ప్రతి :** మహాత్మా!= మహనీయుడవైన ఉద్ధవా!; మఱియున్= ఇంకా; మహిత+ఉపాసకులు= గొప్ప ఉపాసనాపరులు; అగువారల= అయినవారియొక్క; కోర్కులు= ఇష్టాలను; నిండింపన్+చాలిన= తీర్చగలిగిన; భగవంతుండును= భగవానుడును; శబ్దశాస్త్రంబునకున్= వ్యాకరణ శాస్త్రానికి; కారణంబు+అని= హేతువు అని; తన్నున్= తనను; అఖిలదేవతాజనంబులు= సమస్త దేవతలు; అగ్గింపఁగల మేటి= ప్రశంసించే జాణ; అగుటన్+చేసి= అగుటచేత; మనోమయుండును= మనోమయస్వరూపంగా ఉండేవాడును; సకల= సమస్తమైన; జీవ= ప్రాణులయొక్క; చతుర్విధ= నాలుగువిధములైన; అంతఃకరణంబులు+అయిన= అంతఃకరణములుగా పేర్కొనబడే; చిత్త+అహంకార, బుద్ధి, మనంబులకున్= చిత్తము, అహంకారము, బుద్ధి, మనస్సులకు; క్రమంబునన్= వరుసగా; వాసుదేవ= వాసుదేవుడు; సంకర్షణ= సంకర్షణుడు; ప్రద్యుమ్న= ప్రద్యుమ్నుడు; అనిరుద్ధులు= అనిరుద్ధుడు అనువారు; అధిదైవతంబులు= అధిపతులైన దైవతములు; అగుదురు= అగుచుందురు; అట్టి= అటువంటి; చతుర్విధ తత్త్వంబులకున్= నాలుగు రకాలైన తత్త్వాలకు; తుర్యంబు+ఐన= నాల్గవదైన; తత్త్వంబునున్+ఐన= తత్త్వము అయిన; అనిరుద్ధ కుమారుండు= కుమారుడైన అనిరుద్ధుడు; సంతోషచిత్తుండు+అగునే= సంతోషంతో కూడిన మనస్సు కలవాడుగా ఉన్నాడు కదా!

**తా :** మహాత్మా! తనను భక్తితో సేవించేవారి కోర్కెలు తీర్చగల భగవంతుడు, శబ్దశాస్త్రానికి కారకుడని దేవతలంతా కొనియాడే మనోమయుడు, జీవులందరికీ చిత్త, అహంకార, బుద్ధి, మనస్సులనే నాలుగింటికీ అధిదేవతలైన వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులలో మనస్సునకు అధిపతియైన అనిరుద్ధుడు సంతోషంగానే ఉన్నాడు కదా! అని.

**మ. ఇతరారాధన మాని కృష్ణుఁగమలాధీశుం బయోజాసనా**
**ర్చితు భక్తిన్ నిజనాథుఁగా సతతమున్ సేవించు పుణ్యుల్ జగ**
**న్నుతు లధ్యాత్మవిదుల్ మహాభుజులు మాన్యుల్ ధర్మమార్గుల్ సము**
**న్నతి సత్యాత్మజచారుదేష్ణగదు లానందాత్ములే యుద్ధవా! 58**

**ప్రతి :** ఉద్ధవా!= ఉద్ధవుడా!; ఇతర+ఆరాధన మాని= వేరే ఎవరిని పూజించకుండా; కమలా+అధి+ఈశున్= లక్ష్మీపతిని; పయోజ+ఆసన+అర్చితున్= బ్రహ్మచేత అర్చింపబడేవాడు అయిన; కృష్ణున్= శ్రీకృష్ణుని; భక్తిన్= భక్తితో; నిజనాథున్+కాన్= తమకు రక్షకునిగా; సతతమున్= ఎల్లప్పుడూ; సేవించు పుణ్యుల్= ఆరాధించే పుణ్యాత్ములు; జగత్+నుతులు= లోకంచేత కొనియాడబడేవారు; అధ్యాత్మవిదుల్= వేదాంతజ్ఞానం కలవారు; మహాభుజులు= గొప్ప భుజబలం కలవారు; మాన్యుల్= అందరిచే గౌరవింపబడేవారు; ధర్మమార్గుల్= ధర్మమార్గంలో సంచరించేవారు అయిన; సత్యా+ఆత్మజ= సత్యభామాదేవి కుమారులైన; చారుదేష్ణ గదులు= చారుదేష్ణుడు, గదుడు; సమున్నతిన్= మిక్కిలి ఔన్నత్యంతో; ఆనంద+ఆత్ములు+ఏ= ఆనందంగానే ఉన్నారు కదా!

**తా :** ఓ ఉద్ధవుడా! ఇతరులను ఎవరిని ఆరాధించకుండా అనన్యభక్తితో బ్రహ్మదేవుడు కూడా ఆరాధించే మాధవుడైన శ్రీకృష్ణునే భక్తితో సేవించేవారు, లోకులందరిచే స్తుతింపబడేవారు, పుణ్యాత్ములు, వేదాంతజ్ఞానులు, భుజబలసంపన్నులు, గౌరవార్హులు, ధర్మమార్గంలో సంచరించేవారు అయిన సత్యభామా కుమారులైన చారుధేష్ణుడు, గదుడు ఔన్నత్యంతో ఆనందంగా ఉన్నారు కదా!

**తే. క్రోధమాత్సర్యధనుఁడు సుయోధనుండు, వొలుచు నెవ్వనిసభఁ జూచి కలుష మొదవి**
**మనములోన నసూయానిమగ్నుఁ డయ్యె, నట్టి ధర్మజుఁ డున్నాఁడె యనఘచరిత! 59**

**ప్రతి :** అనఘచరిత!= పాపరహితమైన నడవడిక గల ఉద్ధవా!; క్రోధమాత్సర్యధనుఁడు= కోపము, ఈర్ష్య మాత్రమే ధనంగా గల; సుయోధనుండు= దుర్యోధనుడు; పొలుచు= విరాజిల్లు; ఎవ్వని సభన్+చూచి= ఎవని మయసభను కనుగొని; కలుషము+ఒదవి= పాపభావం పుట్టి; మనములోనన్= హృదయంలో; అసూయా నిమగ్నుఁడు+అయ్యెన్= అసూయలో మునిగిపోయాడో; అట్టి= తన వైభవంతో మహైశ్వర్యవంతుడైన దుర్యోధనునకు కూడ అసూయ పుట్టించిన; ధర్మజుఁడు= ధర్మరాజు; ఉన్నాఁడు+ఎ!= క్షేమంగా ఉన్నాడు కదా!

**తా :** పాపరహితమైన నడవడిక గల ఉద్ధవా! ఎవరి మయసభా విశేషాలను చూచి, దుర్యోధనుడుకూడా అసూయకు లోనయ్యాడో అటువంటి ధర్మరాజు కుశలంగానే ఉన్నాడు కదా!

**తే. ఘనగదాభ్యాస చిత్రసంగతుల మెఱసి, కురుకుమారుల భూరిసంగరములోన**
**హతులఁ గావించి వెలసినయట్టి జెట్టి, వాయుతనయుండు గుశలియై వఱలునయ్య! 60**

**ప్రతి :** ఘన= గొప్పదైన; గదా+అభ్యాస= గదాయుద్ధముయొక్క అభ్యాసంవల్ల పట్టుబడిన; చిత్రసంగతుల= విచిత్రమైన విన్యాసాలతో; మెఱసి= శోభిల్లి; భూరి సంగరములోనన్= గొప్ప యుద్ధంలో; కురుకుమారులన్= ధార్తరాష్ట్రులను; హతులన్+కావించి= చంపి; వెలసిన+అట్టి జెట్టి= వీరుడుగా ప్రకాశించిన అలాంటి యోధుడు; వాయుతనయుండు= వాయుదేవుని కుమారుడైన భీముడు; కుశలి+ఐ= క్షేమము కలవాడై; వఱలును+అయ్య!= ప్రకాశిస్తున్నాడు కదా!

**తా :** గదాయుద్ధాన్ని గొప్పగా అభ్యసించి, విచిత్రవిన్యాసాలను సాధించి, భయంకర రణరంగంలో కౌరవులనందరినీ మట్టుపెట్టిన వీరుడు వాయుపుత్రుడైన భీమసేనుడు కుశలంగానే ఉన్నాడు కదా!

**చ. హరికరుణాతరంగిత కటాక్ష నిరీక్షణ లబ్ధ శౌర్య వి**
**స్ఫురణఁదనర్చి తన్ను నని బోయగతిన్ గిరిశుం డెదిర్చినన్**
**బరవస మొప్పఁగా గెలిచి పాశుపతాస్త్రముఁగొన్న శత్రు భీ**
**కరుఁడు ధనంజయుండు సుభగస్థితి మోదము నొందుచుండునే? 61**

**ప్రతి :** హరి= శ్రీకృష్ణుని; కరుణా= దయతో; తరంగిత= పొంగులువారిన; కటాక్ష నిరీక్షణ= కటాక్ష వీక్షణములచేత; లబ్ధ= పొందబడిన; శౌర్య విస్ఫురణన్= పరాక్రమప్రాభవంతో; తనర్చి= ఒప్పి; తన్నున్= తనను (అర్జునుని); అనిన్= యుద్ధమునందు; బోయగతిన్= కిరాతవేషంలో; గిరిశుండు= ఈశ్వరుడు; ఎదిర్చినన్= తలపడినా; బరవసము+ఒప్పఁగాన్= ధైర్యం వెలయగా; గెలిచి= విజయం పొంది; పాశుపతాస్త్రమున్+కొన్న= పాశుపతము అను అస్త్రాన్ని సంపాదించిన; శత్రుభీకరుఁడు=

శత్రువులకు భయంకరుడైన; ధనంజయుండు= అర్జునుడు; సుభగస్థితిన్= సుఖంగా; మోదమున్+ఒందుచుండును+ఏ= సంతోషంగా పొందుతున్నాడు గదా!

**తా :** శ్రీకృష్ణుని దయాతరంగాలతో కూడిన కడగంటి చూపులవలన పొందిన పరాక్రమ ప్రాభవంతో రణరంగంలో తనను కిరాతవేషంలో ఎదిరించిన పశుపతిని కూడా గెలిచి, పాశుపతాన్ని సంపాదించిన శత్రుభయంకరుడైన అర్జునుడు సుఖంగా ఆనందంగానే ఉన్నాడు కదా!

**మ. తెఱఁగొప్పన్ జననీవియోగమునఁ గుంతీస్తన్యపానంబు సో**
**దర సంరక్షయుఁగల్గి దేవవిభు వక్త్రస్థామృతంబుం ఖగే**
**శ్వరుఁ దర్థిం గయికొన్నమాడ్కిఁ గురువంశశ్రేణి నిర్జించి త**
**ద్ధరణీరాజ్యముఁగొన్న మాద్రికొడుకుల్ ధన్యాత్ములే? యుద్ధవా! 62**

**ప్రతి :** ఉద్ధవా!= ఉద్ధవుడా!; జననీ వియోగమునన్= తల్లిని కోల్పోవటంచేత; కుంతీ స్తన్యపానంబున్= కుంతి చనుబాలు త్రాగుట; తెఱఁగు+ఒప్పన్= అదే క్రమంలో; సోదర సంరక్షయున్= అన్నల లాలనమును; కల్గి= పొంది; దేవవిభు= ఇంద్రునియొక్క; వక్త్రస్థ+అమృతంబున్= నోటియందున్న (అధీనమందున్న) అమృతాన్ని; ఖగ+ఈశ్వరుఁడు= గరుత్మంతుడు; అర్థిన్= కోరికతో; కయికొన్న మాడ్కిన్= సంపాదించినట్లుగా; కురువంశశ్రేణిన్= కౌరవులనందరినీ; నిర్జించి= ఓడించి; తత్+ధరణీరాజ్యమున్= వారు ఆక్రమించిన భూభాగాన్ని; కొన్న= తిరిగి సంపాదించిన; మాద్రి కొడుకుల్= మాద్రి కుమారులైన నకులసహదేవులు; ధన్య+ఆత్ములు+ఏ= కుశలంగానే ఉన్నారు గదా!

**తా :** ఉద్ధవా! చిన్నతనంలోనే విధి విలాసంవల్ల తల్లిని కోల్పోయి, కుంతి ఇచ్చిన చనుబాలు త్రాగి, అన్నల అనురాగాన్ని పొంది, పెరిగి పెద్దవారై, దేవేంద్రుని అధీనంలో ఉన్న అమృతాన్ని గరుత్మంతుడు సంపాదించినట్లుగా, కౌరవులను నిర్జించి, వారి అధీనంలో ఉన్న రాజ్యాన్ని సంపాదించిన మాద్రికుమారులైన నకులసహదేవులు క్షేమంగా ఉన్నారు కదా!

**తే. పాండుభూమీశ్వరుండు సంప్రాప్తమరణుఁ, డైన శిశువులఁబ్రోచుటకై నిజేశుఁ**
**గూడి చనకున్న యట్టి యా కుంతిభోజ, తనయ జీవించునే నేఁడు? మనుచరిత్ర! 63**

**ప్రతి :** మనుచరిత్ర!= యుగధర్మప్రవర్తకుడైన మనువు యొక్క నడవడికవంటి నడవడిక గలవాడా!; పాండుభూమి+ఈశ్వరుండు= భూమికి అధిపతియైన పాండు మహారాజు; సంప్రాప్త మరణుఁడు+ఐనన్= మరణం పొందినవాడుకాగా (మరణించగా); శిశువులన్= పిల్లలను; ప్రోచుటకున్+ఐ= సాకుటకై; నిజేశున్+కూడి= తన భర్తతో కలిసి; చనకున్న+అట్టి= సహగమనము చేయకుండా ఆగినట్టి; ఆ కుంతిభోజ తనయ= ఆ కుంతిభోజుని కూతురు (కుంతీదేవి); నేఁడు జీవించును+ఏ= ఇప్పుడు బ్రతికియే ఉన్నది కదా!

**తా :** మనుచరిత్ర కల ఉద్ధవా! ఆనాడు పాండురాజు అకాలమరణం చెందినా భర్తతోపాటు సహగమనం చేయకుండా పిల్లలను సాకేందుకు బ్రతికి ఉన్న కుంతీదేవి కుశలంగానే ఉంది కదా!

**వ. అని వెండియు. 64**

**తా :** అని అడిగి ఇంకా ఇలా అంటున్నాడు విదురుడు.

**మ. అనుజాతుండగు పాండుభూవిభుఁడు నిర్యాణంబునంబొంద నా**
**తని పుత్రుల్ దనుఁజేర వచ్చినను మాధ్యస్థంబుఁబోఁదట్టి యె**
**గ్గొనరించెన్ ధృతరాష్ట్ర భూమివిభుఁ డట్లూహింపఁగా నెగ్గు సే**
**సిన వాఁడే యగుఁగాక మేలు గలదే చింతింపఁగా నుద్ధవా! 65**

**ప్రతి :** ఉద్ధవా!= ఉద్ధవుడా!; అనుజాతుండు+అగు= తమ్ముడైన; పాండుభూవిభుఁడు= పాండురాజు; నిర్యాణంబునన్+పొందన్= మరణించగా; ఆతని పుత్రుల్= అతనియొక్క కుమారులు; తనున్= తనను (ధృతరాష్ట్రుని); చేరన్+వచ్చినను= చేరరాగా; మాధ్యస్థంబున్+పోన్+తట్టి= మధ్యస్థుడు చేయవలసిన తీర్పును వదిలేసి; ఎగ్గు+ఒనరించెన్= కీడు చేశాడు; ధృతరాష్ట్ర భూమివిభుఁడు= భూభర్త అయిన ధృతరాష్ట్రులుడు; చింతింపన్+కాన్= ఆలోచించగా; ఎగ్గు+చేసినవాఁడు+ఏ= కీడు చేసినవాడే; అగున్+కాక= కావచ్చుగాక; మేలు కలదు+ఏ= అయినా ఆ ధృతరాష్ట్రుడు కుశలంగానే ఉన్నాడా?

**తా :** ఉద్ధవా! తమ్ముడైన పాండురాజు మరణించినపుడు పాండురాజు కొడుకులు ధృతరాష్ట్రుని దగ్గరకు వచ్చారు. కాని అతడు మధ్యస్థుడుగా చేయవలసిన న్యాయమైన తీర్పును వదిలేసి నిజానికి వారికి కీడే చేశాడు. సరే! కానీ. ఇంతకూ అతడు క్షేమంగానే ఉన్నాడు కదా!

**విశే :** మధ్యస్థుడు అనగా తగవు పరిష్కరించు తీర్పరి. న్యాయం చేయువాడు. మాధ్యస్థ్యం అంటే న్యాయం.

**క. అనుజుఁడు వీఁ డనకయ తన, తనయులు నను వెడల నడువఁదా నూరక యుం**
**డిన ధృతరాష్ట్రుఁడు నరకం, బునఁ బడు నాదైన దుఃఖమున ననఘాత్మా! 66**

**ప్రతి :** అనఘ+ఆత్మా!= పాపరహితమైన చరిత్ర కలవాడా!; వీఁడు= ఇతడు (విదురుడు); అనుజుఁడు= తమ్ముడు; అనక+అ= అని ఆలోచించకుండా; తన తనయులు= తన (ధృతరాష్ట్రుని) కుమారులు; ననున్= నన్ను (విదురుడు చెప్పుచున్నాడు); వెడలన్+అడువన్= వెళ్ళిపొమ్మని తరుమగా; తాన్+ఊరకయుండిన= తాను మౌనం వహించిన; ధృతరాష్ట్రుఁడు= ఆ ధృతరాష్ట్ర మహారాజు; నాది+ఐన దుఃఖమునన్= నాకు కలిగిన శోకం కారణంగా (నా ఉసురు తగిలి); నరకంబునన్+పడున్= నరకలోకంలో పడిపోతాడు.

**తా :** పుణ్యచరిత్రుడవైన ఉద్ధవా! నేను తమ్ముడననికూడా ఆలోచించకుండా, తన కొడుకులు నన్ను బయటకు పొమ్మన్నప్పుడు మౌనం వహించాడు ధృతరాష్ట్రుడు. అందువల్ల నాకు కలిగిన మానసిక క్షోభ ఊరికే పోదు. తప్పక అతడు నరకవాసాన్ని అనుభవిస్తాడు.

**వ. అదియునుంగాక పరమశాంతుండ వైన నీ మనంబున దుఃఖంబు గర్తవ్యంబు గాదంటేని. 67**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేగాక; పరమశాంతుండవు+ఐన= గొప్పశాంతికలవాడవైన; నీ మనంబునన్= నీ మనస్సులో; దుఃఖంబు= దుఃఖం; కర్తవ్యంబు= ఉండటం; కాదు+అంటేని= కూడదంటే;

**తా :** మహర్షీ! మునివృత్తితో శాంతస్వభావుడవై ఉన్న నీకు ఈ దుఃఖం తగదంటావేమో.

**క. నరలోకవిడంబనమున, హరి పరమపరుండు మానవాకృతితో ని**
**ద్ధరఁబుట్టి యాత్మమాయా, స్ఫురణన్ మోహింపఁజేయు భూజనకోటిన్. 68**

**ప్రతి :** నరలోక విడంబనమునన్= లోకంలోని నరులను అనుకరిస్తూ; పరమపరుండు= పరాత్పరుడైన; హరి= శ్రీమహావిష్ణువు; మానవ+ఆకృతితోన్= మనుష్యుని ఆకారంతో; ఈ+ధరన్= ఈ పుడమిపై; పుట్టి= జన్మించి; ఆత్మమాయాస్ఫురణన్= తన మాయావిశేషంతో; భూజనకోటిన్= పుడమిపై గల ప్రజలను; మోహింపన్+చేయున్= అజ్ఞానులుగా చేస్తుంటాడు.

**తా :** మహర్షీ! ఇంత మునివృత్తిలో ఉండికూడా ఎవరో ఎప్పుడో చేసిన అన్యాయాన్ని గూర్చి బాధపడాలా అంటే, పరమాత్మ ఈ లోకంలో లీలామానుష విగ్రహుడై సంచరిస్తూ ఎటువంటివారినైనా మోహానికి గురి చేస్తుంటాడు. ఆ మాయను దాటడం అంత తేలిక కాదుగదా!

**ఉ.** **కావున న మ్మహాత్ముని వికారవిదూరుని సర్వమోహ మా**
**యావిల మానసుండనగునప్పుడు సంసృతిదుఃఖి నౌదు న**
**ద్దేవుని సత్కృపామహిమఁ దేలిన వేళ సుఖింతు నేన కా**
**దా విధి శంకరప్రభృతు లవ్విభుమాయఁ దరింప నేర్తురే? 69**

**ప్రతి :** కావునన్= అందువలన; వికారవిదూరుని= నిర్వికారుడైన; ఆ+మహాత్ముని= ఆ శ్రీహరియొక్క; సర్వమోహ మాయా= అంతటా ఆవరించిన మాయచేత; ఆవిల= కలుషితమైన; మానసుండన్= మనస్సు కలవాడినిగా; అగునప్పుడు= ఐన వేళలో; సంసృతి దుఃఖిన్= సంసారసంబంధమైన శోకం కలవాడిని; ఔదున్= అగుచుందును; ఆ+దేవుని= ఆ పరాత్పరునియొక్క; సత్+కృపామహిమన్= గొప్ప దయావిశేషమునందు; తేలిన వేళన్= తేలియాడే సమయంలో; సుఖింతున్= ఏ చింతలూ లేకుండగా ఆనందిస్తుంటాను; నేను+అ కాదు= నేనే కాదు (విదురుడు); ఆ విధి= ఆ బ్రహ్మ; శంకరప్రభృతులు= ఈశ్వరుడు మొదలగువారుకూడ; ఆ+విభుమాయన్= ఆ శ్రీహరిమాయను; తరింపన్+నేర్తురు+ఏ= దాటగలరా?

**తా :** అందుచేత నిర్వికారుడైన మహాత్ముడు ఆ శ్రీహరిమాయలో పడినప్పుడు నేనుకూడా సామాన్య సంసారిలాగా శోకిస్తుంటాను. ఆ పరాత్పరుని దయ నాపై నిండినపుడు ఎంతో ఆనందంగా జీవిస్తుంటాను. నేనే కాదు బ్రహ్మ శివాది దేవతలుకూడా శ్రీహరి మాయనుండి బయటపడలేరు గదా!

**వ.** **అయిన నమ్మహాత్ముని కరుణాతరంగితాపాంగ పరిలబ్ధ విజ్ఞానదీపాంకుర నిరస్త సమస్త దోషాంధకారుండనగుటంజేసి మదీయచిత్తంబు హరిపదాయత్తంబయిన కారణంబునను దత్త్వంబు సతతంబు నిరీక్షించుచు నుండుదు; మఱియును. 70**

**ప్రతి :** అయినన్= అయినప్పటికిని; ఆ+మహాత్ముని= మహానుభావుడగు ఆ శ్రీహరియొక్క; కరుణా= దయతో; తరంగిత= పొరలెత్తిన (తరంగితమవుతున్న); అపాంగ= క్రీగంటి చూపులచేత; పరిలబ్ధ= బాగుగా పొందబడిన; విజ్ఞానదీప+అంకుర= విజ్ఞానమనే దీపపు మొలకచేత; నిరస్త= పోగొట్టబడిన; సమస్త= సమస్తములైన; దోష+అంధకారుండను= పాపములనే చీకట్లు కలవాడిని; అగుటన్+చేసి= అవుటచేత; మదీయ చిత్తంబు= నా మనస్సు; హరిపద+ఆయత్తంబు= శ్రీహరి పాదములయందు లగ్నమైనది; అయిన కారణంబునను= అయిన కారణంగా; సతతంబున్= ఎల్లపుడును; తత్త్వంబున్= ఆ పరతత్త్వాన్ని; నిరీక్షించుచున్+ఉండుదున్= ఎదురుచూస్తూ ఉంటాను; మఱియును= ఇంతేగాక.

**తా :** అయినా మహర్షీ! ఆ మహనీయుని దయారసంతో కూడిన కటాక్షవీక్షణాలు నా పై ప్రసరించి విజ్ఞానమనే దీపపు కళికద్వారా సమస్తదోషాంధకారం పోయింది. నా మనస్సు శ్రీహరి పాదాలయందే లగ్నమైపోయింది. అందువల్ల ఆ పరతత్త్వం కోసమే ఎల్లపుడూ ఎదురుచూస్తుంటాను.

**సీ. అట్టి సరోజాక్షుఁ డాత్మీయ పదభక్తు లడవుల నిడుమలఁ గుడుచుచుండ**
**దౌత్యంబుసేయఁ గొందఱు విరోధులు పట్టి బద్ధునిఁజేయ సన్నద్ధులైన**
**బలహీనుమాడ్కి మార్పడలేఁడ యసమర్థుఁడని తలంచెదవేని నచ్యుతుండు**
**పరుల జయింప నోపక కాదు విద్యాభిజన ధనమత్తులై జగతిఁ బెక్కు**

**తే. బాధల నలంచు దుష్టభూపతుల నెల్ల, సైన్య యుక్తంబుగా నని సంహరించు**
**కొఱకు సభలోన నప్పు డా కురుకుమారు, లాడు దుర్భాషణములకు నలుగఁడయ్యె. 71**

**ప్రతి :** అట్టి సరోజ+అక్షుఁడు= అటువంటి కమలనేత్రుడైన హరి; ఆత్మీయ పదభక్తులు= తన పాదాలను ఆశ్రయించిన భక్తులైన పాండవులు; అడవులన్= అరణ్యములలో; ఇడుమలన్= బాధలను; కుడుచుచుండన్= అనుభవిస్తుండగా; దౌత్యంబు+చేయన్= దూతగా తాను వెళ్ళినపుడు; కొందఱు విరోధులు= కొంతమంది శత్రువులు; పట్టి= శ్రీహరిని పట్టుకొని; బద్ధునిన్+చేయన్= బంధించుటకు; సన్నద్ధులు+ఐనన్= సిద్ధమైనవారుకాగా; బలహీను మాడ్కిన్= దుర్బలునివలె; మార్పడలేఁడు+అ= ఎదురుతిరుగలేదు; అసమర్థుఁడు+అని= సామర్థ్యము లేనివాడని; తలంచెదవు+ఏనిన్= భావిస్తావేమో; అచ్యుతుండు= శ్రీహరి; పరులన్= శత్రువులను; జయింపన్= నిర్జించుటకు; ఓపక కాదు= శక్తిలేక కాదు; విద్యా= పాండిత్యంచేతనో; అభిజన= వంశముచేతనో; ధన= ధనంచేతనో; మత్తులు+ఐ= అహంకారంలో కూరుకుపోయి; జగతిన్= లోకాన్ని; పెక్కు బాధలన్= రకరకాల బాధలతో; అలంచు= పీడించు; దుష్ట భూపతులన్+ఎల్లన్= చెడ్డ రాజులందరినీ; అనిన్= యుద్ధంలో; సైన్య యుక్తంబుగాన్= ససైన్యంగా; సంహరించుకొఱకున్= సంహరించేందుకు; అప్పుడు= రాయబార సమయంలో; సభలోనన్= కౌరవసభలో; ఆ కురుకుమారులు= ఆ కౌరవులు; ఆడు= పలికిన; దుర్+భాషణములకున్= పాడుమాటలకు; అలుగఁడు+అయ్యెన్= కోపగించుకోలేదు.

**తా :** శ్రీహరి తనకు ఎంతో ఆత్మీయులైన పాండవులు అడవులలో ఎన్నో బాధలు పడ్డారు. తరువాత వారి రాజ్యభాగాన్ని వారికి ఇప్పించేందుకు తానే స్వయంగా రాయబారిగా వెళ్ళాడు. అక్కడ దుర్మార్గులైన కౌరవులు ఎన్నో దుర్భాషలాడి స్వామినే బంధించేందుకు ప్రయత్నించారు. అయినా హరి బలహీనుడులాగ వారిని ఏమాత్రమూ ఎదిరించలేదు. అందుకు కారణం అసమర్థత కాదు. విద్యవల్ల, వంశంవల్ల, ధనంవల్ల మదించిపోయిన రాజులనందరినీ ససైన్యంగా రణరంగంలో సంహరింపజేయాలనే ఆలోచనవల్లనే ఆ సమయంలో ఆగ్రహానికి లోను కాలేదు.

**మ. జననంబందుట లేని యీశ్వరుఁడు దా జన్మించు టెల్లన్ విరో**
**ధి నిరాసార్థము; వీతకర్ముఁడగు న ద్దేవుండు గర్మప్రవ**
**ర్తనుఁడౌటెల్లఁ జరాచర ప్రకట భూత శ్రేణులం గర్మ వ**
**ర్తనులంజేయఁదలంచికాక కలవే దైత్యారికింగర్మముల్. 72**

**ప్రతి :** జననంబు= పుట్టుకను; అందుట= పొందుట; లేని= లేనట్టి; ఈశ్వరుఁడు= జగన్నాథుడు; తాన్= స్వయంగా; జన్మించుట+ఎల్లన్= పుట్టుట యన్నది; విరోధి నిరాస+అర్థము= శత్రువులను మట్టుపెట్టుటకొఱకే; వీతకర్ముఁడు+అగు= కర్మరహితుడైన; ఆ+దేవుండు= ఆ పరాత్పరుడు; కర్మప్రవర్తనుడు+ఔట= కర్మలను ఆచరించుట; ఎల్లన్= అదియంతయు; చర+అచర= స్థావర జంగమరూపంగా (కదిలేవి, కదలనివి); ప్రకట= వ్యక్తమయ్యే; భూత= జీవజాలముయొక్క; శ్రేణులన్=

సముదాయములను; కర్మవర్తనులన్+చేయన్= కర్మలయందు ప్రవర్తించునట్లు చేయుటకు; తలంచి కాక= ఆలోచన చేసియే కాని; దైత్య+అరికిన్= రాక్షసవిరోధియైన శ్రీకృష్ణునికి; కర్మముల్= జన్మించుటకు కారణమైన కర్మలు; కలవు+ఏ= ఉన్నవా? (లేవని అర్థము).

**తా :** జన్మరహితుడైన భగవంతుడు పుట్టేది దుర్మార్గులను అంతమొందించటానికే. కర్మలంటని దేవుడు కర్మలాచరించుట చరాచర జీవకోటికి కర్మపరత కలిగించుటకే తప్ప భగవంతునికి కర్మలుంటాయా!

**క. హరి నరుల కెల్లఁబూజ్యుఁడు, హరి లీలామనుజుఁడును గుణాతీతుఁడునై**
**పరఁగిన భవకర్మంబులఁ, బొరయండఁట; హరికిఁగర్మములు లీల లగున్. 73**

**ప్రతి :** హరి= విష్ణువు; నరులకున్+ఎల్లన్= మానవులకందరికీ; పూజ్యుఁడు= పూజింపదగినవాడు; హరి= మాధవుడు; లీలామనుజుఁడును= విలాసార్థముగా మానవశరీరాన్ని ధరించినవాడు; గుణ+అతీతుఁడును+ఐ= త్రిగుణములకు అందనివాడునై; పరఁగిన= పైకి కనిపించుచున్న; భవ కర్మంబులన్= సంసార సంబంధమైన కర్మలను; పొరయండు+ అఁట= పొందడట; హరికిన్= వాసుదేవునకు; కర్మములు= కనిపించే కర్మబంధాలు; లీలలు+అగున్= విలాసములు మాత్రమే.

**తా :** శ్రీహరి నరులందరికీ పూజ్యుడు. లీలగా మానవరూపాన్ని ధరించినవాడు. గుణాలకు అతీతుడు. సంసారసంబంధమైన కర్మలు ఆయనను అంటవు. కనిపించే కర్మబంధాలు విలాసాలు మాత్రమే.

**క. మదిఁదన శాసన మిడి నిజ, పదములు సేవించు లోకపాలాదుల పెం**
**పొదవింప యదుకులంబున, నుదయించెను భువిని బలసహోదరుఁ డగుచున్. 74**

**ప్రతి :** మదిన్= మానసమందు; తన శాసనము+ఇడి= తనయొక్క ఆజ్ఞను నిలిపి; నిజ పదములు సేవించు= తన పాదాలను కొలిచే; లోకపాల+ఆదుల= లోకపాలకులవంటివారి; పెంపు+ఒదవింపన్= అభ్యుదయాన్ని కలిగించటానికి; భువినిన్= భూలోకంలో; యదుకులంబునన్= యాదవవంశంలో; బల సహోదరుఁడు+అగుచున్= బలరాముని తమ్ముడుగా; ఉదయించెను= శ్రీహరి అవతరించెను.

**తా :** తన శాసనాన్ని తలదాల్చే భక్తులందరికీ అభ్యుదయాన్ని కలిగించేందుకై శ్రీహరి భూలోకంలో యాదవవంశంలో బలరాముని సోదరుడుగా అవతరించాడు.

**తే. చలన మందక భూరి సంసరణ తరణ, మైన సత్కీర్తి దిక్కుల నతిశయిల్లి**
**వఱల సమమతియై యున్నవాఁడె కృష్ణుఁ, డనుచు నుద్ధవుని విదురుఁడడుగుటయును. 75**

**ప్రతి :** చలనము+అందక= నిశ్చలతత్త్వంతో; భూరి= విస్తారమైన; సంసరణ= సంసారమును; తరణము+ఐన= తరింపజేయునదైన; సత్+కీర్తి= గొప్ప యశస్సు; దిక్కులన్= అన్నిదిక్కులయందును; అతిశయిల్లి= విస్తరించి; వఱలన్= ప్రకాశించునట్లుగా; కృష్ణుఁడు= వాసుదేవుడు; సమమతి+ఐ= రాగద్వేషములు లేనివాడై; ఉన్నవాఁడు+ఎ= ఉన్నాడు కదా!; అనుచున్= అని ఈ విధంగా; ఉద్ధవునిన్= ఉద్ధవమహర్షిని; విదురుఁడు= విదురుడు; అడుగుటయును= అడుగగా…

**తా :** నిశ్చలతత్త్వంతో సంసారసముద్రాన్ని తరింపజేయగలడనే కీర్తిని దశదిశల వ్యాపించునట్లు ప్రవర్తించే శ్రీకృష్ణుడు రాగద్వేషాలకు అతీతంగా ప్రశాంతచిత్తుడై ఉన్నాడు కదా! అని ఉద్ధవుని విదురుడు అడిగాడు. అలా అడుగగా

**వ. అట్టి యెడ నయ్యుద్ధవుండు. 76**

**ప్రతి :** అట్టియెడన్= అప్పుడు; ఆ+ఉద్ధవుండు= ఆ ఉద్ధవుడు.

**తా :** అప్పుడు ఆ ఉద్ధవుడు.

**క. యదుకులనిధి యగు కృష్ణుని, పదజలజ వియోగతాపభరమున మాటల్**
**ప్రిదులక హృదయం బెరియఁగఁ, బెదవులు దడుపుచును వగలఁ బెంపఱియుండెన్. 77**

**ప్రతి :** యదుకులనిధి+అగు= యాదవవంశానికే పెన్నిధివంటివాడైన; కృష్ణుని= వాసుదేవుని; పదజలజ= పాదపద్మములయొక్క; వియోగతాపభరమునన్= ఎడబాటువల్ల ఏర్పడిన తాపాతిశయంతో; మాటల్= పలుకులు; ప్రిదులక= బయలువెడలక; హృదయంబు= గుండె; ఎరియఁగన్= మండగా; పెదవులు+తడుపుచును= నోరు తడి ఆరిపోవటంచేత పెదవులు తడుపుకుంటూ; వగలన్= దుఃఖంతో; పెంపు+అఱి= వన్నెచెడి; ఉండెన్= ఉండిపోయెను.

**తా :** వాసుదేవుని పాదపద్మాలకు దూరమై ఆ వియోగతాపాన్ని భరించలేక, గుండె మండగా, నోరు తడియారిపోయి, ఏమీ మాట్లాడలేక మౌనంగా ఉండిపోయాడు.

**క. అని చెప్పి బాదరాయణి, మనుజేంద్రుని వలను సూచి మఱి యిట్లనియెన్**
**వినుమొకనాఁ డీ యుద్ధవుఁ, డనయము నైదేండ్ల బాలుఁడై యున్న తఱిన్. 78**

**ప్రతి :** బాదరాయణి= బాదరాయణుని కుమారుడైన శుకమహర్షి; అని చెప్పి= పై విధంగా చెప్పి; మనుజ+ఇంద్రుని వలను= రాజువైపు; చూచి= దృష్టి సారించి; మఱి ఇట్లు+అనియెన్= ఇంకా ఇలా చెపుతున్నాడు; వినుము= రాజా! ఆలకింపుము; ఒకనాఁడు= పూర్వం; ఈ ఉద్ధవుఁడు= ఈ ఉద్ధవుడనే మహానుభావుడు; ఐదు+ఏండ్ల బాలుఁడు+ఐ= ఐదేండ్ల ప్రాయమువాడై; ఉన్న తఱిన్= ఉన్న సమయంలో...

**తా :** శుకమహర్షి పరీక్షిన్మహారాజుకు ఈ కథాభాగం వివరిస్తూ, ఒక్క క్షణం ఆగి, రాజువైపు చూచి, ఆ ఉద్ధవునిగూర్చి చెపుతున్నాడు. రాజా! ఈ మహర్షి ఐదేండ్ల చిన్నవాడిగా ఉండినాడు.

**వ. మున్ను కృష్ణునిం గూడి యాదు బాలకులలో నొక్క బాలునిఁ గృష్ణునింగా భావించి పరిచర్య సేయుచుండ గుణవతీమతల్లియగు తల్లి సనుదెంచి "యాఁకొంటి; విదియేల రావన్న" యని పిలిచిన జననీ వాక్యంబులు గైకొనక యఖండతేజోనిధియైన పుండరీకాక్షు పాదారవింద మకరంద సేవానురక్తిం జేసి యున్న యుద్ధవుండు నేఁడు కృష్ణ వియోగతాపంబున హరివార్త విదురునకుఁ జెప్పజాలక యొప్పఱి యుండుట యేమి చిత్రంబని వెండియు నిట్లనియె; నంత నుద్ధవుండు సరోజాక్ష పాదారవింద మకరంద సుధాజలనిధి నిమగ్న మానసుండై సముత్కంఠం జింతించి యొక్క ముహూర్తమాత్రంబునకు బాష్పజల పూరితలోచనుండై గద్గదకంఠుండగుచు. 79**

**ప్రతి :** మున్ను= పూర్వం; కృష్ణునిన్+కూడి= వాసుదేవునితో కలిసి; ఆడు బాలకులలోన్= క్రీడిస్తున్న బాలురలో; ఒక్క బాలునిన్= ఒక బాలకుని; కృష్ణునిన్+కా= వాసుదేవునిగా; భావించి= తలంచి; పరిచర్య చేయుచుండన్= సేవ చేయుచుండగా; గుణవతీమతల్లి+అగు= గుణవంతురాండ్రలో శ్రేష్ఠురాలైన; తల్లి= ఉద్ధవుని తల్లి; చనుదెంచి= అక్కడకు వచ్చి; ఆఁకొంటివి=

ఆకలితో ఉన్నావు; ఇది+ఏల, రావన్న= ఇది యెందుకు? రా నాయనా!; అని పిలిచినన్= అంటూ పిలువగా; జననీవాక్యంబులు= తల్లిమాటలు; కైకొనక= స్వీకరించక; అఖండ తేజస్+నిధి+ఐన= మొక్కవోని కాంతికి నిలయుడై; పుండరీకాక్షు= శ్రీకృష్ణునియొక్క; పాద+అరవింద= పాదపద్మాలలోని; మకరంద= తేనెను; సేవా+అనురక్తిన్+చేసి= ఆస్వాదించుటయందు కోరికతో నిండి; ఉన్న+ఉద్ధవుండు= అక్కడే అలాగే ఉండిపోయిన ఉద్ధవుడు; నేఁడు= ఈనాడు; కృష్ణవియోగతాపంబునన్= కృష్ణవిరహంవలన ఏర్పడే బాధతో; హరివార్త= శ్రీకృష్ణనిర్యాణమునకు సంబంధించిన విషయాన్ని; విదురునకున్= విదురునికి; చెప్పన్+చాలక= చెప్పలేక; ఒప్పు+అఱి+ఉండుట= ఉదాసీనంగా ఉండిపోవుట; ఏమి చిత్రంబు+అని= ఆశ్చర్యమేమిటని; వెండియున్= మఱియును; ఇట్లు+అనియెన్= ఈ విధముగా పలికెను; అంతన్= అంతట; ఉద్ధవుండు= ఉద్ధవుడు; సరోజ+అక్ష= శ్రీకృష్ణుని; పాద+అరవింద= పాదపద్మములందలి; మకరంద= మధువనెడు; సుధాజలనిధి= అమృతసాగరంలో; నిమగ్న= మునిగిపోయిన; మానసుండు+ఐ= చిత్తము కలవాడై; సముత్కంఠన్= మిక్కిలి ఉద్విగ్నతతో; చింతించి= విచారించి; ఒక్క ముహూర్తమాత్రంబునకున్= ఒక్క క్షణకాలానికి; బాష్పజలపూరిత లోచనుండు+ఐ= కన్నీళ్లతో నిండిన కన్నులు కలవాడై; గద్గదకంఠుండు+అగుచున్= బొంగురుపోయిన కంఠం కలవాడగుచు...

**తా :** ఒకనాడు ఉద్ధవుడు కృష్ణునితో కలిసి ఆడుకొంటూ ఉండగా అతని తల్లి భోజనానికి రమ్మని పిలిచినా పట్టించుకోకుండా ఆ సేవలోనే నిమగ్నమైపోయాడు. అటువంటి ఆ ఉద్ధవుడు ఈనాడు కృష్ణుడు లేడన్న దిగులుతో, ఆ విషయాన్ని విదురునికి చెప్పలేక మౌనంగా ఉండిపోవడంలో వింత ఏముంది? అని శుకుడు పరీక్షిన్మహారాజుతో ఇంకా ఇలా అన్నాడు. అపుడు శ్రీకృష్ణపాదారవిందంలోని మకరందమనే అమృతసాగరంలో మునిగిపోయిన మనస్సుతో కాసేపు ఉద్విగ్నతకు లోనైన ఉద్ధవునికి ఒక క్షణంలో కళ్లలో నీళ్లు తిరిగి, కంఠంలో గాద్గద్యం ఏర్పడింది.

**క. ఘనముగ నెమ్మనమున మిం, చిన కృష్ణవియోగ జనిత శిఖి దరికొనఁగాఁ**
**గనుఁగవఁ బెడచే నొత్తుచుఁ, బెనుపొందిన దురితశిఖరిభిదురున్ విదురున్. 80**

**ప్రతి :** ఘనముగన్= పెద్దగా; నెఱ+మనమునన్= నిండైన మనస్సులో; మించిన= అతిశయించిన; కృష్ణవియోగ= కృష్ణుని ఎడబాటువలన; జనిత= పుట్టిన; శిఖి= అగ్ని; దరికొనఁగాన్= మండుచుండగా; కనుఁగవన్= కన్నుల జంటను; పెడచేన్= అరచేయి వెనుకభాగంతో; ఒత్తుచున్= తుడుచుకుంటూ (కన్నీటిని); పెనుపు+ఒందినన్= దుఃఖం పెరిగిపోగా; దురిత= పాపములనే; శిఖరి= పర్వతాలపాలిటి; భిదురున్= వజ్రాయుధమైన; విదురున్= విదురుని...

**తా :** కృష్ణవియోగంవల్ల ఏర్పడ్డ దుఃఖం అగ్నిలాగా తన గుండెలో మండుతుండగా, వస్తున్న కన్నీటిని తుడుచుకుంటూ, పాపపుపర్వతాల రెక్కలు నరికే వజ్రాయుధంవంటి విదురుని చూశాడు.

**వ. కనుంగొని యిట్లనియె. 81**

**ప్రతి :** కనుంగొని= చూచి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** చూచి, ఇలా అన్నాడు.

**క. యముఁడను ఘనకాలభుజం, గమ పుంగవుఁడెగచి పట్టఁగా యదువంశో**
**త్తముల చరిత్రలుఁ దత్కుశ, లము లేమని చెప్పుదుంగలంగెడి మనమున్. 82**

**ప్రతి :** యముఁడు+అను= యమధర్మరాజు అను పేరుగల; ఘన= గొప్పదైన; కాల= కాలస్వరూపమైన (నల్లని); భుజంగమ పుంగవుఁడు= సర్పశ్రేష్ఠము; ఎగచి పట్టఁగాన్= ఒడిసి పట్టగా (కాటువేయగా); యదువంశ+ఉత్తముల చరిత్రలు= యాదవవంశశ్రేష్ఠులయొక్క వృత్తాంతాలు; తద్+కుశలములు= వారి క్షేమసమాచారాలు; ఏమి+అని చెప్పుదున్= ఏ విధంగా చెప్పగలను?; మనమున్+కలంగెడిన్= మనసు కలత చెందుచున్నది.

**తా :** యముడనే పెద్దకాలసర్పం ఒడిసి పట్టి కాటువేసిన యాదవోత్తముల విశేషాలను వారి క్షేమసమాచారాలను ఏమని చెప్పగలను. మనసు కలతపడుతుంది అని ఉద్ధవుడు విదురునితో అన్నాడు.

**సీ. మునిజనముఖపద్మములు ముకుళింపంగ ఖలజనలోచనోత్పలము లలర**
**జారచోరుల కోర్కి సఫలత నొందంగ దానవదర్పాంధతమస మడర**
**వరయోగి జనచక్రవాకంబు లడలంగఁ గలుషజనానురాగంబు పర్వ**
**భూరిదోషానలస్ఫూర్తి వాటిల్లంగ నుదితధర్మక్రియ లుడిగి యడఁగ**

**తే. మానుషాకారరుచికోటి మందపఱిచి, యనఘ! యే మన నేర్తుఁ గృష్ణాభిధాన**
**లోకబాంధవుఁ డుత్తమశ్లోకమూర్తి, మించు తేజంబుతో నస్తమించెనయ్య! 83**

**ప్రతి :** అనఘ!= పాపరహితుడవైన విదురా!; మునిజన= మౌనులయొక్క; ముఖపద్మములు= పద్మములవంటి ముఖములు; ముకుళింపంగన్= ముడుచుకొనగా; ఖలజన= దుష్టులయొక్క; లోచన= కన్నులనెడి; ఉత్పలములు= కలువలు; అలరన్= వికసింపగా; జారచోరుల= విటులయొక్క, దొంగలయొక్క; కోర్కి= అభిలాష; సఫలతన్+ఒందంగన్= ఫలించగా; దానవ= రాక్షసులయొక్క; దర్ప అంధ తమసము= గర్వమనే కాఱుచీకటి; అడరన్= వ్యాపించగా; వరయోగిజన= పరమఋషులనే; చక్రవాకంబులు= చక్రవాక పక్షులు; అడలంగన్= దిగులు చెందగా; కలుషజన= దుర్మార్గుల; అనురాగంబు= ఆనందము; పర్వన్= అతిశయింపగా, వ్యాపించగా; భూరి= గొప్పదైన; దోష+అనల= పాపమనే అగ్నియొక్క; స్ఫూర్తి= ఉనికి; వాటిల్లంగన్= ఏర్పడగా; ఉదిత ధర్మక్రియలు= గొప్పవైన ధర్మాచరణాలు; ఉడిగి+అడఁగన్= నశించగా; మానుష+ఆకార= మానవ ఆకారంలో ఏర్పడిన; రుచికోటిన్= కాంతిపుంజాన్ని; మందపఱచి= హీనపరచి; ఉత్తమశ్లోకమూర్తి= గొప్ప కీర్తియే ఆకారంగా కలవాడు; కృష్ణ+అభిధాన= కృష్ణుడు అను పేరుగల; లోకబాంధవుఁడు= సూర్యుడు, జగద్బంధువు; మించు తేజంబుతోన్= తనదైన గొప్ప తేజస్సుతోపాటుగా; అస్తమించెను+అయ్య!= భౌతిక శరీరాన్ని విడిచిపెట్టాడయ్యా!; ఏమి+అనన్+నేర్తున్= ఇంక ఏమి చెప్పగలను?

**తా :** విదురా! ఏమి చెప్పమంటావు. మునుల ముఖపద్మాలు ముకుళించాయి. దుష్టుల కనుకలువలు వికసించాయి. జారులకు చోరులకు కోర్కెలు తీరాయి. దానవుల గర్వాంధకారాలు విజృంభించాయి. పరమఋషులనే చక్రవాకాలు అలమటించాయి. కల్మషచిత్తుల అనురాగాలు వ్యాపించాయి. పాపాగ్ని ప్రజ్వరిల్లింది. ధర్మవర్తనలు అడుగంటాయి. ఎందుకంటే మానవాకారంలో ఉన్న మహాతేజస్సు, లోకబాంధవుడు, కీర్తిమంతుడు అయిన శ్రీకృష్ణుడు తన తేజస్సుతోపాటుగా తనువు చాలించాడు.

**వ. మఱియును. 84**

**తా :** అంతేగాక

**క. హల కులిశ జలజరేఖా, లలిత శ్రీకృష్ణ పాదలక్షితయై ని**
**ర్మలగతి నొప్పెడు ధరణీ, లలనామణి నేఁ డభాగ్యలక్షణ యయ్యెన్. 85**

**ప్రతి :** హల= నాగలి; కులిశ= వజ్రాయుధం; జలజ= పద్మం; రేఖా= మొదలగు రేఖలతో; లలిత= సుకుమారమైన; శ్రీకృష్ణ= వాసుదేవునియొక్క; పాద= పాదములచేత (యొక్క); లక్షిత+ఐ= గుర్తులు పొందినదై (అడుగుజాడలు తాల్చినదై); నిర్మలగతిన్= స్వచ్ఛంగా; ఒప్పెడు= ప్రకాశించే; ధరణీ లలనామణి= భూదేవి అనే కాంత; నేఁడు= కృష్ణనిర్యాణం తరువాత; అభాగ్యలక్షణ+అయ్యెన్= సౌభాగ్యపు గుర్తులు లేనిదయింది.

**తా :** శ్రీకృష్ణుని పాదాలలో నాగలి, వజ్రాయుధం, పద్మంవంటి శుభరేఖలు ఉంటాయి. ఆయన నడవటంచేత భూమిపై ఆ పాదముద్రలు పడి భూదేవి శుభలక్షణాన్వితగా ప్రకాశించేది. ఇప్పుడాయన లేకపోవడంతో ఈ ధరిత్రి అశుభలక్షణాలతో కూడి నిస్తేజంగా ఉంది.

**క. యాదవులవలన రాజ్య, శ్రీ దొలఁగెను; ధర్మగతి నశించెను; భువి మ**
**ర్యాదలు దప్పె నధర్మో, త్పాదనమున; దైత్యభేది దప్పిన పిదపన్. 86**

**ప్రతి :** దైత్యభేది= దానవాంతకుడైన శ్రీకృష్ణుడు; తప్పిన పిదపన్= ఈ లోకం విడిచిపెట్టిన తరువాత; యాదవులవలనన్= యాదవుల క్రమశిక్షణలోని లోపంవల్ల; రాజ్యశ్రీ= రాజ్య సంపద; తొలఁగెను= వారివద్దనుండి వెళ్ళిపోయింది; ధర్మగతి= ధర్మమార్గం; నశించెను= పాడైపోయింది; అధర్మ+ఉత్పాదనమునన్= అధర్మం ఏర్పడటంతో; భువిన్= నేలమీద; మర్యాదలు+తప్పెన్= చిన్న పెద్ద అనే తారతమ్యం లేకుండా పోయింది.

**తా :** దానవాంతకుడైన శ్రీకృష్ణుడు దేహత్యాగం చేసిన తరువాత యాదవులను విడిచి రాజ్యలక్ష్మి వెడలిపోయింది. ధర్మమార్గం పాడైపోయింది. అధర్మం పెచ్చు మీరింది. అందువలన చిన్న పెద్ద తారతమ్యాలు నశించిపోయాయి.

**వ. మఱియు లలిత నికషణ విరాజమాన మణిగణ కిరణ సుషమా విశేష విడంబిత విమల సలిలంబులందుఁ బ్రతిఫలిత సంపూర్ణ చంద్రమండల రుచి నిరీక్షించి జలచర బుద్ధిం జేసి తజ్జల విలోలమీనంబులనూన స్నేహంబునం దలంచు చందంబునఁ గృష్ణానుచరులైన యదు వృష్ణికుమారు లమ్మహనీయ మూర్తిం దమకు నగ్రేసరుండని కాని లీలామానుష విగ్రహుండైన పరమాత్ముండని యెఱుంగక హరిమాయా జనితంబగు నసద్భావంబునంజేసి భోజనశయనాసనానుగమనంబులం జేరి సహోదరాదిభావంబులం గూడి చరియింతు; రద్దేవుని మాయా పయోనిధి నిమగ్నులు గాకుండ నబ్జభవాదులకైనం దీఱదు. సర్వగుణ గరిష్ఠులును, సత్పురుషశ్రేష్ఠులును నగు పరమభాగవతులకుం దక్కఁ దక్కినవారలకుం జెప్పనేల? అదియునుంగాక యభిజన విద్యాధన బలగర్వ మదాంధీభూత చేతస్కులైన శిశుపాలాది భూపాలకు లమ్మహాత్మునిం బరతత్త్వంబని యెఱుంగక నిందించు దుర్భాషలు దలంచి మనస్తాపంబు నొందుచుండుదు నని వెండియు. 87**

**ప్రతి :** మఱియున్= అదియునుగాక!; లలిత= సుకుమారమైన; నికషణ= ఒరపిడిచే; విరాజమాన= ప్రకాశించు; మణిగణ= రత్నాల సముదాయముయొక్క; కిరణ సుషమా= కిరణముల కాంతితో; విశేష= మిక్కిలిగా; విడంబిత= అనుకరించబడిన; విమల= స్వచ్ఛమైన; సలిలంబులందున్= నీళ్లలో; ప్రతిఫలిత= ప్రతిబింబించిన; సంపూర్ణ= పదునారు కళలతో నిండిన;

చంద్రమండలరుచిన్= చంద్రమండలముయొక్క కాంతిని; నిరీక్షించి= చూచి; జలచరబుద్ధిన్+చేసి= నీటిలో తిరిగే ప్రాణి అనుకొని; తద్+జల= ఆ నీటియందు; విలోల= తిరుగాడుచుండు; మీనంబులు= చేపలు; అనూన స్నేహంబునన్= అధికమైన మైత్రీభావంతో; తలంచు= భావించు; చందంబునన్= విధముగా; కృష్ణ+అనుచరులు+ఐన= వాసుదేవునితో కలిసి తిరిగినవారైన; యదు వృష్ణికుమారులు= యాదవులు, వృష్ణి వంశజులు; ఆ మహనీయమూర్తిన్= ఆ మహానుభావుడైన వాసుదేవుని; తమకున్= తమ వారందరికీ; అగ్రేసరుండు+అని కాని= నాయకునివంటివానిగానే తప్ప; లీలామానుష విగ్రహుండు+ఐన= వినోదార్థము మానవశరీరాన్ని ధరించిన; పరమాత్ముండు+అని= పరమాత్మయే అని; ఎఱుంగక= గ్రహించలేక; హరిమాయాజనితంబు+అగు= విష్ణుమాయవలన పుట్టిన; అసద్భావంబునన్+చేసి= మోహముతో; భోజన= భుజించుట; శయన= నిదురించుట; ఆసన= కూర్చుండుట; అనుగమనంబులన్= కూడా తిరుగుట వంటి విషయాలలో; చేరి= కృష్ణునితో కలసియుండి; సహోదర+ఆది భావంబులన్= సోదరుడు మొదలగు వావివరుసలతో; కూడి చరియింతురు= కలసి సంచరిస్తారు; ఆ+దేవుని= ఆ పరమాత్మయొక్క; మాయాపయోనిధిన్= మాయ అనెడి సాగరములో; నిమగ్నులు= మునిగినవారు; కాకుండన్= కాకుండుటకు; అబ్జభవ+ఆదులకైనన్+తీఱదు= బ్రహ్మాదులకు కూడ సాధ్యం కాదు; సర్వగుణగరిష్ఠులును= సకల సద్గుణాలతో గొప్పవారైనవారును; సత్పురుషశ్రేష్ఠులును= పురుషోత్తములైనవారును; అగు= అయిన; పరమ భాగవతులకున్= భాగవతశ్రేష్ఠులకు; తక్కన్= తప్ప; తక్కినవారలకున్+చెప్పనేల?= మిగిలినవారి విషయంలో చెప్పేదేముంటుంది?; అదియునున్+కాక= అంతియగాక; అభిజన= గొప్పవంశములో జన్మ; విద్యా= విద్య; ధన= ధనము; బల= బలము; వీటిచే కలుగు; గర్వ= అహంకారంచేత; మద= మదంచేత (వివేకం కోల్పోయిన మనస్సులు కలవారు); అంధీభూతచేతస్కులు+ఐన= గుడ్డితనాన్ని పొందిన మనస్సులు కలవారైన (వివేకం కోల్పోయిన మనస్సులు కలవారై); శిశుపాల+ఆది భూపాలకులు= శిశుపాలుడు మొదలగు రాజులు; ఆ+మహాత్మునిన్= మహనీయుడైన ఆ శ్రీకృష్ణుని; పరతత్త్వంబు+అని= పరమాత్మయే అని; ఎఱుంగక= గ్రహించలేక; నిందించు= దూషించే; దుర్భాషలు= చెడుమాటలు; తలంచి= గుర్తుకు తెచ్చుకొని; మనస్+తాపంబున్= మనోవిచారాన్ని; ఒందుచున్+ఉండుదును= పొందుతుంటాను; అని వెండియున్= అని చెప్పి మఱియు...

**తా :** అంతేకాక విదురా! సుకుమారంగా ఒరపిడి పెట్టబడిన మణుల కిరణకాంతితో నీటిలో ప్రతిబింబించిన చంద్రమండలాన్ని చూచి, ఆ నీటిలో తిరిగే చేపలు తమకు చెందినదే అనుకొని ఆ తారాచంద్ర ప్రతిబింబాలతో చనవుగా తిరిగినట్లుగా కృష్ణుని అనుసరించి తిరిగిన యాదవులు, వృష్ణివంశీయులు ఆయనను తమలో ఒక ప్రధానవ్యక్తిగా భావించారు. కాని, లీలగా మానవశరీరాన్ని ధరించిన పరమాత్మగా గ్రహించలేకపోయారు. విష్ణుమాయవల్ల ఏర్పడిన మోహంతో కృష్ణునితో కలిసి తినడం, పడుకోవడం, తిరగడంవంటివి చేసి, సోదరభావం వంటి భావాన్నే పొందారు. ఆ దేవుని మాయాసముద్రంలో మునిగిపోకుండటం బ్రహ్మాదులకే సాధ్యం కాదు. గొప్ప గుణవంతులు, సత్పురుషులలో శ్రేష్ఠులు అయిన పరమభాగవతులు తప్ప మిగిలినవారు ఆ మాయను దాటలేరు. అంతేగాక కులగర్వం, విద్యాగర్వం, ధనగర్వం, బలగర్వం వీటివల్ల ఏర్పడిన మదంతో గుడ్డిగా తయారైన మనసుగల శిశుపాలునివంటి రాజులు ఆ మహాత్ముని పరమదైవంగా గుర్తించలేక నిందిస్తూ ఆడిన దుర్భాషలు గుర్తుకు వచ్చినపుడెల్లా మనసెంతో పరితపిస్తూంటుంది అని చెప్పి ఉద్ధవుడు ఇంకా ఇలా అంటున్నాడు.

**మ. అవితృప్తేక్షణ ధీసమాహిత తపోవ్యాసంగు లైనట్టి భా**
**గవతశ్రేష్ఠుల కాత్మమూర్తి నిఖిలైక జ్యోతిమైఁ జూపి శో**

**క విశోకంబులు నిర్దహించి కమలాకాంతుండు శాంతుండు మా**
**నవరూపంబగు దేహమున్ వదలి యంతర్ధానుఁడయ్యెంజుమీ. 88**

**ప్రతి :** అవితృప్త= తనివితీరని; ఈక్షణ= చూపులతోను; ధీసమాహిత= జ్ఞానంతో కూడిన; తపస్= తపస్సుతోను; వ్యాసంగులు+ఐనట్టి= కూడి ప్రవర్తించువారైన; భాగవత శ్రేష్ఠులకున్= గొప్పవారైన భగవద్భక్తులకు; నిఖిల+ఏక జ్యోతిమైన్= అంతట ఆవరించిన ఒకే వెలుగురూపంగా; ఆత్మమూర్తిన్= నిజస్వరూపాన్ని; చూపి= కనబరచి; శోకవిశోకంబులు= చిన్న పెద్ద దుఃఖాలను; నిర్దహించి= బూది సేసి; శాంతుండు= శాంతస్వరూపుడైన; కమలాకాంతుండు= లక్ష్మీపతియైన శ్రీహరి; మానవరూపంబు+అగు= నరాకృతితో ఉన్న; దేహమున్= శరీరాన్ని; వదలి= విడిచిపెట్టి; అంతర్ధానుఁడు+అయ్యెన్+చుమీ!= అదృశ్యమైపోయాడు సుమా!

**తా :** ఎవరైతే తనను తనివితీరా చూడాలనుకుంటారో, ఎవరు జ్ఞానులై తపస్సు చేస్తారో అటువంటి మహాభాగవతులకు లోకమంతటా నిండిన ఒకేఒక వెలుగైన తన రూపాన్ని సందర్శించే అవకాశం కల్పించి, వారివారి రకరకాలైన శోకాలన్నీ దహించి, శాంతస్వరూపుడైన మాధవుడు తన మానవశరీరాన్ని విడిచిపెట్టి అదృశ్యమైపోయాడు సుమా!

**సీ. మానవైకవికాసమానమై తనకును విస్మయజనకమై వెలయునట్టి**
**యాత్మీయ యోగమాయాశక్తిఁ జేపట్టి చూపుచు నత్యంతసుభగ మగుచు**
**భూషణంబులకును భూషణంబై వివేకముల కెల్లను బరాకాష్ఠ యగుచు**
**సకలకల్యాణసంస్థానమై సత్యమై తేజరిల్లెడునట్టి దివ్యమూర్తి**

**తే. తాన తనమూర్తి నిజశక్తిఁ దగ ధరింప, యమతనూభవు రాజసూయాధ్వరంబు**
**నందు నెవ్వని శుభమూర్తి నర్థితోడ, నిండు వేడుకఁ జూచి వర్ణించి రెలమి. 89**

**ప్రతి :** మానవ+ఏక+వికాసమానము+ఐ= మానవుల అభ్యుదయానికి మూలమై; తనకును= తనకు కూడ; విస్మయ జనకము+ఐ= ఆశ్చర్యం కలిగించునదై; వెలయు+అట్టి= ప్రకాశిస్తున్నటువంటి; ఆత్మీయయోగమాయాశక్తిన్= తనదైన యోగమాయాశక్తిని; చేపట్టి= స్వీకరించి; చూపుచున్= ప్రదర్శించుచు; అత్యంత సుభగము+అగుచు= మిక్కిలి సుందరమవుతూ; భూషణంబులకును= అలంకారాలకే; భూషణంబు+ఐ= అలంకారమై; వివేకములకున్+ఎల్లను= విజ్ఞానములకన్నింటికి; పరాకాష్ఠ+అగుచున్= సర్వోన్నత స్థితి కలిగినదై; సకలకల్యాణసంస్థానము+ఐ= అన్ని శుభాలకు స్థానమై; సత్యము+ఐ= శాశ్వతమైనదై; తేజరిల్లెడు+అట్టి= ప్రకాశించునట్టి; దివ్యమూర్తి= మంగళమూర్తి; తాను+అ= స్వయంగా; తన మూర్తిన్= తన ఆకారాన్ని; నిజశక్తిన్= తన శక్తితో; తగన్= ఒప్పునట్లుగా; ధరింపన్= వహించగా; యమ తనూభవు= ధర్మరాజుయొక్క; రాజసూయ+అధ్వరంబునందున్= రాజసూయయాగంలో; ఎవ్వని శుభమూర్తిన్= ఎవని దివ్యమంగళ విగ్రహాన్ని; అర్థితోడన్= కోరికతో; నిండు వేడుకన్= మిక్కిలి ఆనందంగా; చూచి= సందర్శించి; ఎలమిన్= సంతోషంతో; వర్ణించిరి= వర్ణించారో! అతడే ఆ శ్రీకృష్ణరూపంలో ఉన్న పరమాత్మ!

**తా :** మానవుల ప్రగతికి కారణమై, తనకుకూడ ఆశ్చర్యాన్ని కలిగించి ప్రకాశిస్తున్నటువంటి తనదైన యోగమాయాబలాన్ని స్వీకరించి, ప్రదర్శించి, అందాలకే అందమై, అలంకారాలకే అలంకారమై, వివేకాలకు అతిశయరూపమై, సకల శుభాలకు

ఆశ్రయమై, సత్యమై తేజరిల్లే దివ్యమూర్తి తన శక్తితో తానే ధరించిన ఆ శ్రీకృష్ణుని దివ్యమంగళ విగ్రహాన్ని వేడుకతో చూచి, ఆనాడు ధర్మరాజు నిర్వహించిన రాజసూయయాగంలో అందరూ ఎంతో ఆనందంగా ప్రస్తుతించారు.

**క. ప్రకటముగఁ గమలభవ సృ, ష్టికిఁ గారణ మి మ్మహాత్ముఁడే యనుచును ను**
**త్సుకులై తన్మూర్తినిఁ ద, ప్పక చూచిరి గాదె తత్సభాజను లెల్లన్. 90**

**ప్రతి :** ప్రకటముగన్= స్పష్టంగా; కమలభవసృష్టికిన్= బ్రహ్మ సృష్టికి; కారణము= హేతువు; ఈ+మహాత్ముఁడు+ఏ= ఈ మహనీయుడే; అనుచునున్= అంటూ; ఉత్సుకులు+ఐ= ఎంతో కుతూహలం కలవారై; తద్+మూర్తినిన్= ఆ శ్రీకృష్ణుని; తద్+సభాజనులు+ఎల్లన్= ఆ రాజసూయయాగసభలోని వారంతా; తప్పక= దృష్టి మరల్చకుండా; చూచిరి+కాదు+ఎ= దర్శించారు కదా!

**తా :** ఆనాడు ఆ ధర్మజుని రాజసూయయాగంలో అగ్రపూజా సందర్భంలో జరిగిన సభలో ఈతడే కదా బ్రహ్మ సృష్టికి కూడా మూలమైనవాడు అనుకుంటూ ఎంతో కుతూహలంతో అందరూ కనురెప్ప ఆర్పకుండా శ్రీకృష్ణుని దర్శించారు కదా!

**వ. మఱియు శాంతోగ్రరూపధరుండైన సర్వేశ్వరుండు శాంతరూపుండు గావునఁ బరకృతాపరాధ నిపీడ్యమాన మానసుండయ్యు ననుకంపాయత్తచిత్తుండై వర్తించు పరాపరుండును బ్రకృతికార్యం బైన మహత్త్వరూపుండును జననవిరహితుం డయ్యును దారువులవలన ననలంబు దోఁచు చందంబున జననంబు నందుచుండు నట్టి సరోజనాభుని హాసరాస లీలానురాగ విలోకన ప్రతిలబ్ధమానలైన గోపకామినులు తన్మూర్తి దర్శనానుషక్తమనీషలంగలిగి వర్తించి రదియునుంగాక. 91**

**ప్రతి :** మఱియున్= అంతేకాక; శాంత+ఉగ్రరూపధరుండు+ఐన= శాంతము ఉగ్రరూపమూ కలవాడైన; సర్వేశ్వరుండు= పరమాత్మయైన శ్రీకృష్ణుడు; శాంతరూపుండు+కావునన్= శాంతమూర్తి కనుక; పరకృత= శత్రువులచే చేయబడిన; అపరాధ= దోషములచేత; నిపీడ్యమాన= పీడింపబడిన; మానసుండు+అయ్యును= మనసు కలవాడైనా; అనుకంపా+ఆయత్త చిత్తుండు+ఐ= దయతో కూడిన మనసు కలవాడై; వర్తించు= ప్రవర్తించు; పరాపరుండును= పరమాత్మయు; ప్రకృతికార్యంబు+ఐన= ప్రకృతికి కార్యరూపమైన; మహత్త్వరూపుండును= మహత్తురూపంలో ఉండేవాడును; జననవిరహితుండు+అయ్యును= పుట్టుక లేనివాడయ్యును; దారువుల వలనన్= కొయ్యలవలన; అనలంబు= అగ్ని; తోఁచు చందంబున= బయల్పడునట్లు; జననంబున్+అందుచుండున్= పుట్టుకను పొందుతుంటాడు; అట్టి= అటువంటి; సరోజనాభుని= నారాయణస్వరూపుడైన శ్రీకృష్ణుని; హాస= నగవులు; రాసలీలా= రాసక్రీడలు; అనురాగ విలోకన= ప్రేమతోకూడిన చూపులతో; ప్రతిలబ్ధమానలైన= ఆకర్షితలైన; గోపకామినులు= గోపకాంతలు; తద్+మూర్తి= ఆ శ్రీకృష్ణుని దివ్యమంగళవిగ్రహాన్ని; దర్శన= దర్శించుటయందు; అనురక్త మనీషలన్= ఆసక్తి కలిగిన బుద్ధులను; కలిగి= పొంది; వర్తించిరి= ప్రవర్తించారు; అదియునున్+కాక= అంతేకాకుండా...

**తా :** అంతేకాకుండా, అవసరాన్నిబట్టి శాంతరూపాన్ని, ఉగ్రరూపాన్ని కూడా ధరించే శ్రీకృష్ణుడు సహజంగా శాంతస్వరూపుడు. అందువల్ల శత్రువులు చేసే అపరాధాలకు మనస్సులో నొచ్చుకున్నా దయాచిత్తుడై ప్రవర్తించే పరమాత్మ. ఆయన ప్రకృతికి మూలమైన మహత్త్వమే తన రూపంగా కలవాడు. పుట్టుక లేనివాడే అయినా కొయ్యనుండి అగ్ని పుట్టినట్లుగా తాను జన్మిస్తుంటాడు. అటువంటి పద్మనాభుని చిరునవ్వులు, రాసలీలలు, అనురాగదృష్టులు గోపకామినులను ఆకర్షిస్తే, ఆయన దివ్యమంగళవిగ్రహాన్ని దర్శించేందుకు వారు ఎంతో ఆసక్తిని ప్రదర్శించారు.

చ. దివిజుల కోర్కిఁ దీర్ప వసుదేవుని యింట జనించి కంస దా
నవుఁడు వధించునన్ భయమునం జని నందుని యింట నుంటకున్
యవన జరాసుతాదులకు నాజి నెదుర్పడలేక సజ్జన
స్తవ మథురాపురిన్ విడిచి దాఁగుటకున్ మదిఁజింతనొందుదున్. **92**

**ప్రతి :** దివిజుల= దేవతల; కోర్కిన్= కోరికను; తీర్పన్= తీర్చుటకు; వసుదేవుని= వసుదేవునియొక్క; ఇంటన్= గృహంలో; జనించి= పుట్టుకనంది; కంసదానవుఁడు= కంసుడనే రాక్షసుడు; వధించును+అన్ భయమునన్= చంపుతాడు అనే భయంతో; చని= అక్కడనుండి వెళ్ళిపోయి; నందుని+ఇంటన్= నందుని గృహంలో; ఉంటకున్= నివసించటానికి; యవన= కాలయవనుడు; జరాసుత+ఆదులకున్= జరాసంధుడు మొదలగువారలకు; ఆజిన్= యుద్ధంలో; ఎదుర్పడన్ లేక= ఎదురుగా నిలబడలేక; సత్+జన స్తవ= మంచివారందరూ మెచ్చుకొనే; మథురాపురిన్= మథురానగరాన్ని; విడిచి= వదలిపెట్టి; దాఁగుటకున్= రహస్యంగా తలదాచుకున్నందుకు; మదిన్= మనసులో; చింతన్+ఒందుదున్= బాధపడుతుంటాను.

**తా :** అట్టి మహనీయుడు దేవతల కోర్కె తీర్చడంకోసం వసుదేవుని కుమారుడుగా జన్మించడం, రాక్షసుడైన కంసునికి భయపడి నందుని ఇంట్లో పెరగటం, కాలయవన జరాసంధాదులను రణరంగంలో ఎదిరించలేక అందరూ ఎంతో ఇష్టపడే మథురానగరాన్ని విడిచిపెట్టి, ఎక్కడో తలదాచుకోవటం ఇవన్నీ గుర్తుకు వచ్చి ఎంతో బాధపడుతుంటాను.

వ. అదియునుంగాక. **93**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేగాక.

సీ. కడఁగి పెక్కిడుమలఁగుడుచుచుఁ జిత్తముల్ గలఁగఁగ బంధనాగారములను
వనరిన దేవకీవసుదేవులను డాయఁజనుదెంచి భక్తి వందన మొనర్చి
తలిదండ్రులార! యేఁగలుగంగ మీరలు కంసుని నలజడి గ్రాఁగుచుండఁ
గడఁగి శత్రునిఁజంపఁగా లేక చూచుచు నున్న నా తప్పుఁ బ్రసన్ను లగుచుఁ

తే. గావుఁడని యానతిచ్చిన దేవదేవు, నద్భుతావహమధురవాక్యములఁ దలఁచి
తలఁచి నా చిత్తమునఁ బెద్ద గలఁగుచుందుఁ, బృథులపాతక భూమిభృద్భిదుర! విదుర! **94**

**ప్రతి :** పృథుల= గొప్పవైన; పాతక= పాపములనే; భూమిభృత్= పర్వతములపాలిటి; భిదుర!= వజ్రాయుధమువంటి; విదుర!= ఓ విదురా !; కడఁగి= పూనుకొని; పెక్కు+ఇడుమలన్= ఎన్నో కష్టాలను; కుడుచుచున్= అనుభవిస్తూ; చిత్తముల్= మనసులు; కలఁగఁగన్= కలతపడగా; బంధన+అగారములను= కారాగారాలలో; వనరిన= బాధపడిన; దేవకీవసుదేవులను; డాయన్+చనుదెంచి= సమీపించి; భక్తిన్= భక్తితో; వందనమున్+ఒనర్చి= నమస్కరించి; తలిదండ్రులార!= మాతాపితురులారా!; ఏన్+కలుగంగన్= నేను ఉండగా; మీరలు= మీరు ఇరువురు; కంసునిన్+అలజడిన్= కంసుడు పెట్టే బాధలకు; క్రాఁగుచుండన్= పీడింపబడుచుండగా; కడఁగి= ప్రయత్నించి; శత్రునిన్+చంపఁగాన్+లేక= విరోధియైన కంసుని చంపలేక; చూచుచున్+ఉన్న= ఉదాసీనంగా ఉండిపోయిన; నా తప్పున్= నా దోషాన్ని; ప్రసన్నులు+అగుచున్= దయ కలిగినవారై; కావుఁడు+అని= క్షమించండి అని; ఆనతి+ఇచ్చిన= విన్నవించుకొన్న; దేవదేవున్= శ్రీకృష్ణునియొక్క; అద్భుత+ఆవహ=

ఆశ్చర్యమును కల్గించు; మధుర వాక్యములన్= తియ్యనైన మాటలను; తలఁచి+తలఁచి= మరల మరల గుర్తు తెచ్చుకొని; నా= నాయొక్క; చిత్తమునన్= మనసునందు; పెద్ద= ఎంతగానో; కలఁగుచున్+ఉందున్= బాధపడుతుంటాను.

**తా :** పాపాలనే కొండలపాలిటి వజ్రాయుధంవంటి విదురా! శ్రీకృష్ణుడు తన తల్లిదండ్రులైన దేవకీవసుదేవులకు నమస్కరిస్తూ, కంసుడు మిమ్మల్ని చెరసాలలో పెట్టి బాధిస్తుంటే నేనుండికూడా ఇంతకాలం ఉపేక్ష వహించాను. అతనిని ఏమీ చేయకుండా, మిమ్మల్ని కారాగార విముక్తుల్ని చేయకుండా ఉన్నందుకు నన్ను మన్నించండని వేడుకొన్నాడు. ఆ మధురవాక్యాలు గుర్తుకు వచ్చినపుడల్లా ఇంత సంస్కారవంతుడు ఇప్పుడు భౌతికంగా మన కళ్ళ ఎదుట లేడే అని మనసెంతో కలత చెందుతుంటుంది.

**క. విమలమతిఁదలఁప నెవ్వని, బొమముడి మాత్రమున నిఖిల భూదేవీ భా**
**రము వాయు నట్టి హరిపద, కమలమరందంబు గ్రోలు ఘనుఁడెవ్వాఁడో? 95**

**ప్రతి :** విమలమతిన్= స్వచ్ఛమైన మనసుతో; తలఁపన్= ఆలోచింపగా; ఎవ్వని= ఎవనియొక్క; బొమముడిమాత్రమునన్= కోపంతో కనుబొమలు ముడిచినంతమాత్రమున; నిఖిల= సమస్తమైన; భూదేవీ= భూదేవికి ఏర్పడిన; భారము= పాపాత్ములు తనపై నివసిస్తున్నందున ఏర్పడిన బరువు; పాయును= పోవునో (దుష్టశిక్షణ జరుగునో); అట్టి= అటువంటి; హరి= శ్రీమహావిష్ణువుయొక్క; పదకమల= పాదపద్మములయొక్క; మరందంబు= మకరందము; క్రోలు= ఆస్వాదించు; ఘనుఁడు+ఎవ్వాఁడు+ఓ= భాగ్యవంతుడు ఎవడో కదా!

**తా :** వాస్తవంగా ఆలోచిస్తే ఎవరు కోపంతో ఒక్కమారు కనుబొమలు ముడువగానే దుష్టశిక్షణ జరిగి భూదేవికి భారం తొలగిపోతుందో అటువంటి శ్రీహరి పాదపద్మాలలోని మకరందాన్ని ఆస్వాదించగలిగే అదృష్టవంతుడు ఎవడో కదా!

**క. మందప్రజ్ఞుఁడనై గో, విందుని మురదైత్యహరుని విష్ణునిఁ బరమా**
**నందుని నందతనూజుని, మందరధరుఁ జిత్తమందు మఱతునె యెందున్. 96**

**ప్రతి :** గోవిందునిన్= గోపాలకుడు; మురదైత్యహరుని= మురుడనే రాక్షసుని మట్టుపెట్టినవాడు; పరమ+ఆనందునిన్= శాశ్వతానందస్వరూపుడు; నందతనూజునిన్= నందుని కుమారుడును; మందరధరున్= అమృతోత్పాదన సమయంలో కూర్మరూపం ధరించి మందరగిరిని మోసినవాడునయిన; విష్ణునిన్= శ్రీమహావిష్ణువును; మందప్రజ్ఞుఁడను+ఐ= బుద్ధి మందగించినవాడనై; ఎందున్= ఎక్కడైనా (ఎప్పుడైనా); చిత్తము+అందున్= మనసులో; మఱతును+ఎ= మరచిపోగలనా!

**తా :** ఉద్ధవుడు పలుకుచున్నాడు. విదురా! గోపాలకుడు మురుడనే రాక్షసుని చంపినవాడు, అంతటను వ్యాపించియున్నవాడు, మహానందస్వరూపుడు, నందనందనుడు, అమృతోత్పాదన సమయంలో పాలకడలిని చిలుకుతున్నప్పుడు మందరపర్వతాన్ని మోసేందుకు తాబేటి రూపాన్ని ధరించినవాడు అయిన శ్రీకృష్ణుని ఎక్కడైనా బుద్ధి మందగించి మఱచిపోవడం జరుగుతుందా?

**విశే :** మురుడు అనే రాక్షసుడు బ్రహ్మనుగూర్చి తపస్సుచేసి, తన అరచేతితో ఎవరిని తాకితే వారు భస్మమైపోవాలని వరం కోరుకొన్నాడు. బ్రహ్మ 'తథాస్తు' అన్నాడు. యముని తాకేందుకు ప్రయత్నించాడు. అతడు భయంతో పరుగున విష్ణువును ఆశ్రయించాడు. మురుడు విష్ణువును యుద్ధానికి ఆహ్వానించాడు. నాతో యుద్ధం చేసే ధైర్యమే నీకుంటే నీ గుండె ఎందుకు అలా దడదడ కొట్టుకొంటోందని అడిగాడు శ్రీహరి. లేదే అని తన అరచేతిని గుండెకు ఆనించి చూసుకున్నాడు. వెంటనే భస్మమైపోయాడు. నాటినుండి విష్ణుమూర్తికి మురారి అనే ప్రసిద్ధి ఏర్పడింది.

**చ. అదియునుగాక మీరు నృపులందఱుఁజూడఁగ ధర్మసూతి పెం**
**పొదవిన రాజసూయసవనోత్సవమందును జన్మమాదిగాఁ**
**బదపడి యెగ్గొనర్చు శిశుపాలుఁడు యోగిజనంబు లిట్టి ద**
**ట్టి దని యెఱుంగ నోపని కడింది పదంబును బొందెనే కదా! 97**

**ప్రతి :** అదియును+కాక= అంతే కాకుండా; ధర్మసూతి= ధర్మరాజుయొక్క; పెంపు+ఒదవిన= గొప్పగా జరిగిన; రాజసూయ= రాజసూయమను పేరుగల; సవన+ఉత్సవము+అందునున్= యాగమునకు సంబంధించిన వేడుకలో; జన్మము+ఆదిగాన్= పుట్టినది మొదలుకొని; పదపడి= ఆ వెనుక; ఎగ్గు+ఒనర్చు= కీడు చేయు(చేసిన); శిశుపాలుఁడు= శిశుపాలుడు; యోగిజనంబులు= మునిగణములుకూడ; ఇట్టిది+అట్టిది+అని= ఇటువంటిది, అటువంటిది అని; ఎఱుంగన్+ఓపని= తెలిసికొనలేని; కడింది పదంబునున్= పరమపదాన్ని; మీరు= మీ (విదురుని) కుటుంబసభ్యులు; నృపులు+అందఱున్= రాజులందరూ; చూడఁగన్= చూస్తూండగా; పొందెను+ఏ కదా!= పొందెను కదా!

**తా :** అంతే కాక, ధర్మరాజు రాజసూయయాగం చేస్తున్న సమయంలోను, అసలు పుట్టి బుద్ధి ఎరిగిననాటినుండి శ్రీకృష్ణునికి కీడే చేశాడు శిశుపాలుడు. అయినా మీరు, మిగిలిన రాజులందరూ చూస్తూండగా అతడు మహర్షిగణంకూడా ఇట్టిది అట్టిది అని తెలుసుకోలేని పరమపదాన్ని పొందాడు కదా!

**చ. కురునృప పాండునందను లకుంఠితకేళిఁజమూసమేతులై**
**యరిగి రణోర్వి నెవ్వని ముఖాంబురుహామృత మాత్మలోచనో**
**త్కరములఁగ్రోలి పార్థ విశిఖప్రకర క్షత పూతగాత్రులై**
**గురుతరమోక్షధామమునకుం జని సౌఖ్యము నొందిరో గదా! 98**

**ప్రతి :** కురునృప= కురురాజులు; పాండునందనులు= పాండవులు; అకుంఠితకేళిన్= మొక్కవోని రణక్రీడతో; చమూసమేతులు+ఐ= సైన్యసహితులై; అరిగి= వెళ్ళి; రణ+ఉర్విన్= యుద్ధభూమిలో; ఎవ్వని= ఏ శ్రీకృష్ణుని; ముఖ+అంబురుహ+అమృతము= ముఖపద్మమునుండి జాలువారే అమృతరూపమైన; ఆత్మలోచన+ఉత్కరములన్= ఆయన చూపుల గుంపులను; క్రోలి= ఆస్వాదించి; పార్థ= అర్జునుని; విశిఖ= బాణాలయొక్క; ప్రకర= సముదాయంచేత ఏర్పడిన; క్షత= గాయాలచే; పూత= పవిత్రమైన; గాత్రులు+ఐ= శరీరాలు కలవారై; గురుతర= గొప్పదైన; మోక్షధామమునకున్= పరమపదానికి; చని= వెళ్ళి; సౌఖ్యమున్+ఒందిరో+కదా!= సుఖపడ్డారో కదా!

**తా :** కౌరవపాండవులు ససైన్యంగా రణభూమికి వెళ్ళి ఎవరి ముఖపద్మాన్ని చూస్తూ, చూపులనే అమృతాన్ని త్రాగుతూ, అర్జునుని బాణాలచే ఏర్పడిన గాయాలవల్ల శరీరాలు పవిత్రం కాగా మోక్షపదానికి చేరుకొన్నారో అతడే శ్రీకృష్ణుడు.

**సీ. అట్టి సరోజాక్షుఁడాద్యంత శూన్యుండు సుభగుండు త్రైలోక్యసుందరుండు**
**కమనీయసాగరకన్యకా కుచకుంకుమాంకిత విపులబాహాంతరుండు**
**సకలదిక్పాలభాస్వత్కిరీటన్యస్తపద్మరాగారుణ పాదపీఠుఁ**
**డజుఁ డనంతుఁడు సమానాధికవిరహితుం డిద్ధమూర్తిత్రయాధీశ్వరుండు**

**తే. నైన హరి యుగ్రసేనుని నఖిలరాజ్య, రుచిరసింహాసనమునఁగూర్చుండఁబెట్టి**
**భృత్యభావంబు నొంది సంప్రీతి నతని, పనుపుసేయుట కెపుడు నా మనము గుందు. 99**

ప్రతి : అట్టి= అటువంటి; సరోజ+అక్షుఁడు= పద్మనేత్రుడు; ఆది+అంత శూన్యుండు= మొదలు, తుద అనునవి లేనివాడు; సుభగుండు= మనోహరుడు; త్రైలోక్యసుందరుండు= ముల్లోకాలకు అందమైనవాడు; కమనీయ= అందమైన; సాగరకన్యకా= సముద్రుని కూతురైన లక్ష్మీదేవియొక్క; కుచ= స్తనములకు పూసుకొన్న; కుంకుమ+అంకిత= కుంకుమయొక్క గుర్తులంటిన; విపుల= విశాలమైన; బాహా+అంతరుండు= బాహువుల మధ్యభాగం (వక్షోభాగం) కలవాడు; సకల దిక్పాల= సర్వ దిక్పాలకులయొక్క; భాస్వత్+కిరీట= ప్రకాశించే కిరీటాలయందు; న్యస్త= పొదిగిన; పద్మరాగ+అరుణ= పద్మరాగమణుల కాంతిచే ఎర్రబారిన; పాదపీఠుఁడు= పాదపీఠం కలవాడు; అజుఁడు= పుట్టుక లేనివాడు; అనంతుఁడు= అంతం లేనివాడు; సమాన= తనతో సమానులు కాని; అధిక= తనకంటె అధికులు కాని; విరహితుండు= లేనివాడు; ఇద్ధ= ప్రసిద్ధులైన; మూర్తిత్రయ= బ్రహ్మవిష్ణుమహేశ్వరులకు; అధి+ఈశ్వరుండున్= అధిపతియు; ఐన+హరి= అయిన శ్రీకృష్ణుడు; ఉగ్రసేనునిన్= కంసుని తండ్రియైన ఉగ్రసేనుని; అఖిల= సమస్తమైన; రాజ్య= రాజ్యభాగముచేత; రుచిర= శోభావంతమైన; సింహాసనమునన్= సింహాసనమునందు; కూర్చుండన్+పెట్టి= ఆసీనుని చేసి; భృత్యభావంబున్+ఒంది= సేవాభావమును పొంది; సంప్రీతిన్= మిక్కిలి ప్రీతితో; అతని పనుపు= ఆ ఉగ్రసేనుని ఆజ్ఞలను (రాజుగా); చేయుటకున్= నెరవేర్చు, పాటించు విషయంలో; ఎపుడు= ఎల్లపుడూ; నా మనము= నా మనస్సు; కుందున్= బాధ చెందుతుంటుంది.

తా : అటువంటి పద్మనేత్రుడు, ఆద్యంతరహితుడు, మనోహరుడు, ముల్లోకాలలో అందగాడు, సాగరకన్య లక్ష్మీదేవి స్తనద్వయానికి పూసుకున్న కుంకుమయొక్క గుర్తులంటిన ఉరము కలవాడు, దేవతలందరూ తలలు ఆన్చి పాదనమస్కారం చేయటంచేత వారి కిరీటాలలోని పద్మరాగాల కాంతిచే ఎర్రగా మారిన పాదపీఠం కలవాడు, పుట్టుక లేనివాడు, అంతం లేనివాడు, తనతో సమానులు కాని, అధికులు కాని లేనివాడు, త్రిమూర్తులకే అధీశ్వరుడు, అయిన శ్రీకృష్ణుడు కంసుని తండ్రియైన ఉగ్రసేనునికి రాజ్యాధికారం కల్పించి, తాను కేవలం సేవకునిగానే ఉండిపోవటం నా మనస్సుకు కలత కలిగిస్తుంటుంది.

**వ. అని వెండియు నిట్లనియె, 'ననఘా! పరాత్పరుండును యోగీశ్వరేశ్వరుండును నగు కృష్ణుండు భగవద్భక్తుండును బరమభాగవతోత్తముండును నైన యుగ్రసేనుని సేవించుట యాశ్చర్యంబు కాదు; తన్ను హరియింపఁదలంచి కుచంబుల విషంబు ధరియించి స్తన్యపానంబు సేయించిన దుష్టచేతన యైన పూతనకుం జన్నిచ్చి పెంచిన యశోదాదేవికి నైన నందరాని పదంబు గారుణ్యాయత్తచిత్తుండై యొసంగె' ననిన 'నిజపద ధ్యానపరాయణులగువారల ననుసరించి సేవించుట సెప్పనేల? యనిన నుద్ధవునికి విదురుం డిట్లనియె; భక్తవత్సలుండును గారుణ్యజలనిధియునై భాగవతజనుల ననుగ్రహించు పుండరీకాక్షుండు నిజదాస లోకంబున కొసంగు పరమపదంబు నుగ్రకర్ములైన రాక్షసుల కెట్లొసంగె న త్తెఱం గెఱింగింపు' మనిన విదురునకు నుద్ధవుం డిట్లనియె. 100**

ప్రతి : అని= ఆ విధంగా పలికిన ఉద్ధవుడు; వెండియున్= ఇంకా విదురునితో; ఇట్లు+అనియెన్= ఇలా పలికాడు; అనఘా!= పుణ్యాత్ముడవైన విదురా!; పరాత్పరుండును= పరమాత్మయును; యోగి+ఈశ్వర+ఈశ్వరుండును= మునీశ్వరులకే

ప్రభువువంటివాడును; అగు కృష్ణుండు= అయిన శ్రీకృష్ణుడు; భగవద్భక్తుండును= భగవంతునియందు భక్తి కలవాడును; పరమ భాగవత+ఉత్తముండును= గొప్ప భాగవతులలో శ్రేష్ఠుదును; ఐన+ఉగ్రసేనునిన్= అయిన ఉగ్రసేనుని; సేవించుట= కటాక్షించుట; ఆశ్చర్యంబు కాదు= అబ్బురపడాల్సిన విషయం కాదు; తన్నున్= తనను (కృష్ణుని); హరియింపన్+తలంచి= చంపనెంచి; కుచంబులన్= స్తనములందు; విషంబు ధరియించి= గరళాన్ని నింపుకొని; స్తన్యపానంబు+చేయించిన= చనుబాలు త్రావించిన; దుష్టచేతన+ఐన= చెడు మనసు కల; పూతనకున్= పూతన అను రాక్షసికి; చన్ను+ఇచ్చి= చనుబాలిచ్చి; పెంచిన= సాకిన; యశోదాదేవికిన్+ఐనన్= యశోదాదేవికికూడా; అందరాని పదంబున్= లభించని మోక్షపదవిని; కారుణ్య+ఆయత్త చిత్తుండు+ఐ= దయతోకూడిన మనసు కలవాడై; ఒసంగెన్+అనినన్= అనుగ్రహించాడంటే; నిజపద= తన (కృష్ణుని) పాదాలను; ధ్యాన పరాయణులు= ధ్యానించుటయే జీవితలక్ష్యంగా కలవారు; అగువారలన్= అయినవారిని; సేవించుట+చెప్పన్+ఏల= అనుగ్రహించే విషయంలో చెప్పేదేముంటుంది?; అనినన్= అని చెప్పగా; ఉద్ధవునికిన్= ఉద్ధవునితో; విదురుండు= విదురుడు; ఇట్లు+అనియెన్= ఇలా అడిగాడు; భక్తవత్సలుండును= భక్తులయందు వాత్సల్యం కలవాడును; కారుణ్యజలనిధియును+ఐ= దయాసముద్రుడునై; భాగవతజనులను= పరమభక్తులైనవారిని; అనుగ్రహించు= కటాక్షించు; పుండరీక+అక్షుండు= తెల్లదామరల వంటి కనులుగల వాసుదేవుడు; నిజదాసలోకంబునకున్= తనను సేవించువారికి; ఒసంగు= అనుగ్రహించు; పరమపదంబును= మోక్షధామాన్ని; ఉగ్రకర్ములు+ఐన= దారుణకృత్యాలను చేసే; రాక్షసులకున్= అసురులకు, రక్కసులకు; ఎట్లు+ఒసంగెన్= ఎలా అందించాడు?; ఆ+తెఱంగు= ఆ విషయాన్ని; ఎఱింగింపుము+అనినన్= తెలియజేయుమనగా; విదురునకున్= విదురునకు; ఉద్ధవుండు= ఉద్ధవుడు; ఇట్లు+అనియెన్= ఇలా తెలియజేశాడు.

**తా :** ఇంకా అంటున్నాడు ఉద్ధవుడు, 'పాపరహితుడవైన విదురా! పరమాత్మ స్వరూపుడు, యోగీశ్వరేశ్వరుడు అయిన శ్రీకృష్ణుడు భగవద్భక్తుడూ, మహాభాగవతోత్తముడూ అయిన ఉగ్రసేనుని సేవించటం వింత కాదు. తనను చంపటంకోసం స్తనాలకు విషం పూసుకుని పాలిచ్చిన దుష్టురాలైన పూతనకు, ప్రేమతో పాలిచ్చి పెంచిన యశోదకు కూడా అందని గొప్ప పరమపదాన్ని అందించిన దయాశాలి శ్రీహరి. అటువంటివాడు తనను సేవించినవారిని సేవించటంలో ఆశ్చర్యమేముంది?' అని అనగానే విదురుడు ఉద్ధవునితో అంటున్నాడు, 'స్వామీ! భక్తవత్సలుడు, దయాసముద్రుడునై భాగవతులను అనుగ్రహించి, తనదాసులకు ఇచ్చే పరమపదాన్ని శ్రీహరి తీవ్రకర్ములైన రాక్షసులకు ఎందుకిచ్చాడు. ఆ విషయం చెప్పు'మని అడిగిన విదురునికి ఉద్ధవుడు ఈ విధంగా సమాధానం చెపుతున్నాడు.

**మ. దనుజానీక మనేకవారములు దోర్దర్పంబు సంధిల్లఁగా**
**వినతాసూను భుజావరోహుఁడగు నవ్విష్ణున్ సునాభాస్త్రుఁ దా**
**రనిలో మార్కొని పోకు పోకు హరి! దైత్యారాతి యంచుం దదా**
**ననముంజూచుచుఁగూలి మోక్షపదమున్ బ్రాపింతు రత్యున్నతిన్. 101**

**ప్రతి :** వినతాసూను= వినత కుమారుడైన గరుత్మంతునియొక్క; భుజ+అవరోహుఁడు+అగు= భుజములపై అధిరోహించువాడైన (వాహనముగా గల); సునాభ+అస్త్రున్= చక్రము ఆయుధముగా గల; ఆ+విష్ణున్= ఆ శ్రీహరిని; దనుజ+అనీకము= రాక్షస సముదాయము; అనేకవారములు= పెక్కుమార్లు; దోర్ దర్పంబు (దోః+దర్పంబు) సంధిల్లగాన్= భుజపరాక్రమం ఏర్పడునట్లుగా; అనిలోన్= యుద్ధంలో; మార్కొని= ఎదుర్కొని; హరి!= ఓ నారాయణా; దైత్య+అరాతి= రాక్షస శత్రువా!;

పోకు పోకు= పోవద్దు పోవద్దు; అంచున్= అంటూ; తద్+ఆననమున్= ఆ శ్రీహరి మోమును; చూచుచున్= వీక్షిస్తూ; కూలి= యుద్ధరంగంలో మరణించి; అతి+ఉన్నతిన్= మిక్కిలి గొప్పగా; మోక్షపదమున్= పరంధామాన్ని; ప్రాపింతురు= పొందుచుందురు.

**తా :** గరుడవాహనుడూ, చక్రాయుధుడూ అయిన శ్రీహరిని రాక్షసులు ఎందరో ఎన్నోమార్లు ఎదిరించి, ఓయీ హరీ! రాక్షసశత్రువా! పారిపోకు, ఆగు అంటూ పోరాడి అతని ముఖాన్నే చూస్తూ అతనిచేతిలో మరణించి, అత్యున్నతమైన పరమపదాన్ని పొందుతుంటారు.

**క. ధీరజనోత్తమ! నవ సిత, సారసలోచనుఁడు కృష్ణ జననంబును ద**
**చ్చారిత్రము నెఱిఁగింతు ను, దారత నీ విపుడు వినుము తద్విధ మెల్లన్. 102**

**ప్రతి :** ధీరజన+ఉత్తమా!= పండితోత్తముడైన విదురా!; నవ= అప్పుడే వికసించిన; సితసారస= తెల్ల దామరలవంటి; లోచనుఁడు= కన్నులు కలవాడైన; కృష్ణ జననంబును= శ్రీకృష్ణుని పుట్టుకయు; తద్+చారిత్రమున్= అతని చరిత్రమును; తద్+విధమెల్లన్= ఆతని లీలావిశేషాలనన్నింటినీ; ఉదారతన్= నీపై గల ప్రేమతో; ఎఱిఁగింతును= తెలియజేస్తాను; నీవు+ఇపుడు, వినుము= ఇప్పుడు నీవు ఆ విశేషాలన్నీ విను.

**తా :** విద్వద్వరేణ్యుడవైన విదురా! తెల్లదామరలవంటి కన్నులు గల శ్రీకృష్ణుని జన్మవృత్తాంతాన్నీ, ఇంకా అతని చరిత్రనూ ప్రేమగా నీకు వినిపిస్తాను. సావధానంగా విను.

**చ. ధరణిభరంబుఁబాపుటకుఁదామరసాసను ప్రార్థనన్ రమా**
**వరుఁడల కంసబంధననివాసమునన్ వసుదేవదేవకీ**
**వరులకు నుద్భవింప బలవంతుఁడు కంసుఁడు హింస సేయు న**
**న్వెఱపున నర్ధరాత్రి సుతునింగొని య వ్వసుదేవుఁడిమ్ములన్. 103**

**ప్రతి :** తామరస+ఆసను= పద్మం ఆసనంగా గల బ్రహ్మయొక్క; ప్రార్థనన్= అభ్యర్థనతో; రమావరుఁడు= లక్ష్మీదేవి భర్తయైన విష్ణువు; అల= ప్రసిద్ధమైన; కంసబంధన= కంసుడు ఏర్పరచిన చెఱసాలరూపమైన; నివాసమునన్= గృహంలో (కారాగృహంలో); వసుదేవ= వసుదేవుడు; దేవకీవరులకున్= దేవకి అను పుణ్యదంపతులకు; ఉద్భవింపన్= జన్మించగా; బలవంతుఁడు= బలవంతుడైన; కంసుఁడు= కంసచక్రవర్తి; హింస+చేయున్= హింసిస్తాడు (హత మారుస్తాడు); అను+వెఱపునన్= అనే భయంతో; ఆ+వసుదేవుఁడు= కృష్ణునికి తండ్రియైన వసుదేవుడు; అర్ధరాత్రి= నడిరేయి; సుతునిన్+కొని= కుమారుని తీసికొని; ఇమ్ములన్= తగినవిధంగా...

**తా :** పాపులవల్ల భూమికి పెరిగిన బరువును తగ్గించుమని బ్రహ్మ విష్ణువును వేడుకొన్నాడు. అతని కోరికమేరకు హరి కంసుని చెరసాలలో బంధితులై ఉన్న దేవకీవసుదేవుల కుమారునిగా కారాగారంలోనే జన్మించాడు. దుర్మార్గుడైన కంసుడు తన కుమారునికి ఏ అపకారం చేస్తాడో అని వసుదేవుడు అర్ధరాత్రివేళ తన కొడుకును తీసుకొన్నాడు.

**క. నందుని మందకుఁ జని త, త్సుందరి తల్పమునఁబరులు సూడకయుండన్**
**నందనుని నునిచి యానక, దుందుభి మఱలంగ నేఁగెఁ దొల్లిటి పురికిన్. 104**

**ప్రతి :** నందుని= నందునియొక్క; మందకున్+చని= గోసముదాయములున్న వ్రేపల్లెకు వెళ్ళి; తద్+సుందరి= ఆతని భార్యయైన యశోదయొక్క; తల్పమునన్= ప్రక్కలో; పరులు= ఇతరులు; చూడకయుండన్= చూడకుండా; నందనునిన్= కుమారుడైన కృష్ణుని; ఉనిచి= ఉంచి; ఆనకదుందుభి= వసుదేవుడు; తొల్లిటి పురికిన్= తన గ్రామమైన మథురానగరానికి; మఱలంగన్ ఏఁగెన్= తిరిగి వెళ్ళాడు.

**తా :** వసుదేవుడు బిడ్డను తీసికొని వ్రేపల్లెకు వెళ్ళి, అక్కడ నందుని భార్యయైన యశోదపక్కలో రహస్యంగా పడుకోబెట్టి, ఎవరూ చూడకుండా తిరిగి తన ఊరు మథురానగరానికి వెళ్ళిపోయాడు.

**విశే :** ఆనకదుందుభి వసుదేవుడు. వసుదేవుడు జన్మించినపుడు దేవతలు ఆనకములు, దుందుభులు అనే వాద్యాలను మ్రోగించారట. అందువల్ల ఆతనికి 'ఆనకదుందుభి' అనే పేరు వచ్చింది.

**క. హరి యేకాదశ సంవ, త్సరములు నందవ్రజమునఁ దను హరి యని యె**
**వ్వరు నెఱుఁగకుండ నా హల, ధరుతోఁ గ్రీడించుచుండెఁదద్దయుఁబ్రీతిన్. 105**

**ప్రతి :** హరి= శ్రీకృష్ణుడు; ఏకాదశ సంవత్సరములు= పదునొకండు ఏండ్లు; నందవ్రజమునన్= వ్రేపల్లెలో; తను= తాను (శ్రీకృష్ణుడు); హరి+అని= శ్రీమహావిష్ణువని; ఎవ్వరున్= ఎవరూ; ఎఱుఁగకుండన్= గ్రహించకుండునట్లుగా; ఆ హలధరుతోన్= నాగలి ఆయుధముగా గల అన్న బలరామునితో; తద్దయున్= మిక్కిలి; ప్రీతిన్= సంతోషముతో; క్రీడించుచుండెన్= ఆడుకొనసాగెను.

**తా :** శ్రీకృష్ణుడు పదకొండేళ్ళపాటు వ్రేపల్లెలో తాను శ్రీహరి యనే విషయం ఎవ్వరికీ తెలియకుండా తన అన్నగారైన బలరామునితో కలిసి ఆడుకుంటూ గడిపేశాడు.

**క. గోపాల వరుల కైనను, నాపోవఁగఁ దన సమంచితాకార మొగిం**
**జూపని శ్రీపతి వేడుక, గోపాలురఁ గూడి కాచె గోవత్సములన్. 106**

**ప్రతి :** గోపాలవరులకున్+ఐననున్= ఇంద్రుడు మొదలగు దేవతలకుకూడ; ఆపోవఁగన్= తృప్తి కలుగునట్లుగా; తన= తనయొక్క; సమంచిత= కొనియాడదగిన; ఆకారము= దివ్యమంగళస్వరూపము; ఒగిన్= క్రమముగా; చూపని= దర్శించే అవకాశమొసంగని; శ్రీపతి= శ్రీమహావిష్ణువు; వేడుకన్= ఆనందముగా; గోపాలురన్= గోవులను కాచుకొనే గొల్లవారితో; కూడి= కలిసి; గోవత్సములన్= ఆవులను, దూడలను; కాచెన్= మేపెను.

**తా :** ఇంద్రాది దేవతలకు కూడా పూర్తిగా తృప్తి కలిగేలా తన దివ్యమంగళ విగ్రహాన్ని దర్శించే అవకాశమొసంగని శ్రీహరి ఆనందంగా గొల్లవారితో కలిసి ఆవులను, దూడలను మేపుతూ గడిపాడు.

**విశే :** గోవు అనే శబ్దం అనేక అర్థాలు కలిగినది. ఆవు అనేది ప్రసిద్ధమైన అర్థం కాగా స్వర్గం, వజ్రాయుధం అనే అర్థాలు ఉన్నందున గోపాలవరులు అన్నపుడు ఇంద్రాదిదేవతలు అని అర్థం. గోపాలురు అన్నపుడు ఆవులను మేపే గొల్లవారని అర్థం.

**వ. అయ్యవసరంబునంగృష్ణుండు లీలావినోదంబులు దోడి గోపాలబాలురకుంజూపందలంచి. 107**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; కృష్ణుండు= వాసుదేవుడు; లీలావినోదంబులు= అద్భుతాలను; తోడి= తన తోటివారైన; గోపబాలురకున్= గోవులను మేపే బాలురకు; చూపన్+తలంచి= ప్రదర్శించాలని భావించి...

**తా :** శ్రీహరి కృష్ణునిగా గోపకులంలో గడిపే కాలంలో తన లీలలను విశేషాలను గోపబాలురకు చూపించాలనుకొన్నాడు.

**చ. వరయమునానదీసలిల వర్ధిత సౌరభయుక్తపుష్ప మే**
**దుర మకరంద పాన పరితుష్ట మధువ్రతయూథ మాధవీ**
**కురవక కుంద చందన నికుంజములందు మయూర శారికా**
**పరభృత రాజకీరమృదుభాషలభంగిఁజెలంగి పల్కుచున్. 108**

**ప్రతి :** వర= గొప్పదైన; యమునానదీ= యమునానదియొక్క; సలిల= నీటిచేత; వర్ధిత= పుష్టినందిన; సౌరభయుక్త= మంచి సువాసనలతో కూడిన; మేదుర= మనోహరమైన; మకరంద= పూలనుండి స్రవించే తేనెను; పాన= త్రాగుటచేత; పరితుష్ట= మిక్కిలి తృప్తిపొందిన; మధువ్రతయూథ= తుమ్మెదల గుంపుతోకూడిన; మాధవీ= పువ్వుల గురివెంద; కురవక= ఎర్రగోరంట; కుంద= మొల్ల; చందన= గంధపుచెట్లతో కూడిన; నికుంజములందున్= పొదరిండ్లలో; మయూర= నెమళుల; శారికా= గోరువంకల; పరభృత= కోయిలల; రాజకీర= రాచిలుకల; మృదుభాషలభంగిన్= సుకుమారములైన కూతలవలె; చెలంగి= ఒప్పునట్లుగా; పల్కుచున్= ధ్వనులు చేస్తూ...

**తా :** బాలకృష్ణుడు యమునానది నీటితో పెరిగి పెద్దవగుతున్న చెట్ల, తీగెల చక్కని సువాసనలనీనే పుష్పాలలో ఉండే తేనెను తాగి ఆనందిస్తున్న తుమ్మెదలతో కూడిన గురివెంద, ఎర్రగోరంట, మొల్ల, చందనవృక్షాలతో కూడిన పొదరిళ్ళలో దూరి, నెమళ్ళలాగ, గోరువంకలలాగ, కోయిలలలాగ, రాచిలుకలలాగ వింత వింత ధ్వనులు చేస్తూ గోపబాలురనందరినీ ఆనందపరుస్తున్నాడు.

**విశే :** పూర్వకాలంనుండి ధ్వన్యనుకరణ అనే విద్య (మిమిక్రీ) ఉంది. రామాయణంలో మారీచుడు రాముని గొంతును అనుకరించాడు. ఇంద్రుడు కోడి గొంతును అనుకరించాడు. కృష్ణుడు రకరకాల పక్షుల గొంతులను అనుకరించాడు. అయితే మారీచుడు, ఇంద్రుడు వారి అనుకరణవిద్యను వంచనకు ఉపయోగించారు. కాని కృష్ణుడు కేవలం ఇతరుల వినోదానికే ఉపయోగించాడు. ఈ అనుకరణచేత సర్వభూతమయత్వం అభివ్యక్తమవుతున్నది.

**ఉ. శ్రీరమణీమనోవిభుఁడు సింహకిశోరముఁబోలి లీలఁ గౌ**
**మారదశన్ రమా విమల మందిరముంబురుడించు గోతతిన్**
**వారక మేపుచుండెఁ దన వంశ రవస్ఫుట మాధురీ సుధా**
**సారముచేత గోపజనసంఘములన్ ముదమందఁజేయుచున్. 109**

**ప్రతి :** శ్రీరమణీ మనోవిభుఁడు= లక్ష్మీదేవికి భర్తయైన శ్రీమహావిష్ణువు; సింహ కిశోరమున్+పోలి= సింగపు పిల్లవలె ఉండి (బాలకృష్ణుడుగా); లీలన్= విలాసంగా; కౌమారదశన్= కుమారప్రాయంలో; తన= తనయొక్క; వంశరవస్ఫుట= వేణునాదముచేత స్పష్టమైన; మాధురీ= తీయనైన (చెవులకు); సుధాసారముచేతన్= అమృతపు సారముతో; గోపజనసంఘములన్= గోపాలుర గుంపులకు; ముదము+అందన్+చేయుచున్= ఆనందాన్ని కలిగిస్తూ; రమా=

లక్ష్మీదేవియొక్క; విమల= స్వచ్ఛమైన; మందిరమున్= భవనాన్ని; పురుడించు= పోలి ఉండే; గోతతిన్= ఆలమందను; వారక మేపుచుండెన్= ఎల్లపుడూ పోషించుచున్నాడు.

**తా :** శ్రీపతి బాలకృష్ణుడుగా అవతరించి, సింగపు పిల్లలాగా ఉన్నాడు. అతని కౌమారదశలో తన వేణునాదామృత సారంతో గోపాలురనందరినీ ఆనందపరుస్తూ స్వచ్ఛమైన లక్ష్మీనివాసంలా ఉన్న ఆలమందను మేపుతున్నాడు.

**విశే :** గోవు లక్ష్మీస్వరూపంగా భావింపబడుతుంది. అందుకే గోమహాలక్ష్మి అంటారు. మరింకే జంతువునూ అలా లక్ష్మిపేరుతో పిలవరు. ముఖ్యంగా యాదవులకు గోవులే సంపద. అందువల్ల ఆలమంద సాక్షాత్తు లక్ష్మీదేవియొక్క భవనంలాగా భావింపబడింది.

**వ. మఱియును. 110**

**ప్రతి :** మఱియును= అంతే కాకుండా.

**తా :** ఇంకా

**మ. చిరకేళీరతి బాలకుల్ తృణములన్ సింహాదిరూపంబులం**
**గరమొప్పన్ విరచించి వాని మరలన్ ఖండించు చందంబునం**
**గరుణాతీతులఁ గామరూపులగు న క్కంసప్రయుక్తక్షపా**
**చరులం గృష్ణుఁడు సంగరస్థలములం జక్కాడె లీలాగతిన్. 111**

**ప్రతి :** చిరకేళీరతిన్= ఎక్కువ సమయం ఆటలయందు ఆసక్తితో; బాలకుల్= చిన్నపిల్లలు; తృణములన్= గడ్డిపరకలతో; సింహ+ఆది= సింహము మొదలైన; రూపంబులన్= బొమ్మలను; కరము+ఒప్పన్= చాల అందముగా; విరచించి= తయారుచేసి; వానిన్= ఆ బొమ్మలను; మరలన్= తిరిగి (ఆట అయిపోయిన తరువాత); ఖండించు= ముక్కలుగా చేయు; చందంబునన్= విధముగా; కరుణా+అతీతులన్= దయావిహీనులైన; కామరూపులు+అగు= కోరిన రూపం ధరించగలవారును అయిన; ఆ+కంస= ఆ కంసునిచేత; ప్రయుక్త= ప్రయోగింపబడిన (పంపబడిన); క్షపాచరులన్= నిశాచరులను (రాక్షసులను); కృష్ణుఁడు= వాసుదేవుడు; సంగరస్థలములన్= యుద్ధభూములలో; లీలాగతిన్= ఆటలాగ; చక్కాడెన్= చంపివైచెను.

**తా :** చిన్నపిల్లలు సరదాగా ఆడుకోవడానికి గడ్డిపరకలతో సింహం, పులివంటి బొమ్మలను తయారుచేసుకొంటారు. ఆడుకోవడం అయిపోయాక చాలా సులువుగా వాటిని చించి అవతల పారవేస్తారు. అలాగే కంసుడు పంపించిన దయావిహీనులైన ఎందరో రాక్షసులను బాలకృష్ణుడు పిల్లాటలాగ ఆయా యుద్ధభూములలో చీల్చి చెండాడినాడు.

**చ. వరయమునానదీజల నివాస మహోరగ విస్తృతాస్య వి**
**స్ఫురితవిషానలప్రభల సోఁకునఁ గ్రాఁగిన గోపగోధనో**
**త్కరముల నెల్లఁగాచి భుజగప్రవరున్ వెడలంగఁదోలి త**
**త్సరిదమలాంబుపానమున సంతసమందఁగఁజేసె గోతతిన్. 112**

**ప్రతి :** వర= గొప్పదైన; యమునానదీ= యమున అనుపేరుగల నదియొక్క; జల= నీటియందు; నివాస= నివాసముగల; మహా+ఉరగ= పెద్దపాముయొక్క (కాళియుడు అను పేరుగల మహాసర్పం యొక్క); విస్తృత+ఆస్య= విశాలమైన నోటినుండి;

విస్ఫురిత= వెలి(గక్కబడుచున్న; విష+అనల= విషమనెడి అగ్నికి సంబంధించిన; ప్రభల= జ్వాలలయొక్క; సోఁకునన్= తాకిడివలన; క్రాఁగిన= తపించిపోయిన; గోప= గోపాలకుల; గోధన= గోసంపదయొక్క; ఉత్కరముల= సముదాయములను; ఎల్లన్= సమస్తమును; కాచి= రక్షించి; భుజగప్రవరున్= ఆ మహాసర్పాన్ని; వెడలంగన్+తోలి= బయటకు గెంటి; తద్+సరిత్= ఆ యమునానదియొక్క; అమల= స్వచ్ఛమైన; అంబు= జలముల; పానమునన్= త్రాగుటద్వారా; గోతతిన్= ఆలమందను; సంతసము= ఆనందము; అందఁగన్+చేసెన్= పొందునట్లుగా చేశాడు.

**తా :** పవిత్రమైన ఆ యమునానదిలో కాళియుడనే ఒక భయంకర సర్పం ఉండేది. అది భయంకర విషాగ్ని జ్వాలలను కక్కుతుండడంతో గోపాలకులకు కాని, గోవులకు కాని ఆ నీరు తాగేందుకు పనికిరాకుండా పోయింది. అప్పుడు ఆ బాలకృష్ణుడు దానిని దూరంగా తరిమివేసి, గోప గోతతి ఆ నదీజలంద్వారా దప్పిక తీర్చుకొనే అవకాశం కల్పించాడు.

**మ. దివిజాధీశు గుఱించి వానకొఱకై దీపింప నందాది వ**
**ల్లవు లేఁ టేఁట ననూనసంపదల నుల్లాసంబునంజేయు ను**
**త్సవముం గృష్ణుఁడు మాన్పి గోపగణముల్ సంప్రీతినొందన్ శచీ**
**ధవు గర్వంబడఁపంగ నవ్యయముగాఁ దాఁజేసె గోయాగమున్. 113**

**ప్రతి :** దివిజ+అధీశు గుఱించి= దేవతలకు ప్రభువైన ఇంద్రుని ఉద్దేశించి; వానకొఱకై= వర్షంకోసమని; దీపింపన్= వైభవంతో; నంద+ఆది వల్లవులు= నందుడు మొదలైన గొల్లలు; ఏఁటన్+ఏఁటన్= ప్రతి సంవత్సరం; అనూన సంపదలన్= అధికమైన ద్రవ్యములతో (వ్యయంతో); ఉల్లాసంబునన్+చేయు= ఉత్సాహంగా నిర్వర్తించు; ఉత్సవమున్= పండుగను; కృష్ణుఁడు; మాన్పి= ఆపివైచి; గోపగణముల్= గోపాలకులందరూ; సంప్రీతిన్+ఒందన్= ఆనందించేటట్లుగా; శచీధవు= శచీదేవి భర్తయైన ఇంద్రునియొక్క; గర్వంబు= అహంకారం; అడఁపంగన్= అణచుటకోసమని; అవ్యయముగాన్= ఎడ తెగకుండా; తాన్= బాలకృష్ణుడు; గోయాగమున్= గోపూజాప్రధానమైన యాగాన్ని; చేసెన్= జరిపించాడు.

**తా :** మేఘాలకు అధిపతి ఇంద్రుడు. కనుక వానలు బాగా కురిస్తే, పంటలు బాగా పండుతాయి. గోవులకు మేతకూడా బాగా లభిస్తుందనే ఉద్దేశంతో ప్రతి సంవత్సరం నందుని యాజమాన్యంలో గోపాలకులంతా మహావైభవంగా ఇంద్రయాగం చేసేవారు. నా దయవల్లనే ఈ భూలోకవాసులు బ్రతుకుతున్నారనుకొంటున్న ఇంద్రుని గర్వం అణచాలన్న ఉద్దేశంతో కృష్ణుడు ఆ యాగాన్ని మానిపించి, అటుపై నిరంతరంగా సాగేట్లు నిరాడంబరంగా గోయాగాన్ని జరిపించాడు. గోవర్ధనగిరికి పూజ చేయించాడు. అందరికీ ఆనందాన్ని కలిగించాడు.

**చ. హరిహయుఁడంత రోషవివశావిలమానసుఁడై సరోరుహో**
**దరు మహిమంబెఱుంగక మదంబడరంగ వలాహకాది భీ**
**కరఘనపంక్తిఁబంపిన నఖండశిలామయభూరివర్షముల్**
**గురిసె ననూనగర్జనల గోకుల మాకుల మౌచుఁగుందఁగన్. 114**

**ప్రతి :** అంతన్= కృష్ణుడు ఇంద్రయాగాన్ని మాన్పించి, గోయాగాన్ని చేయగా; హరిహయుఁడు= పచ్చని గుర్రాలు వాహనాలుగా గల ఇంద్రుడు; రోషవివశ= ఆగ్రహానికి వశమైపోయి; ఆవిల= మలినమైన; మానసుఁడు+ఐ= మనస్సు కలవాడై; సరోరుహ+ఉదరు= పద్మనాభుడైన కృష్ణుని; మహిమంబు= శక్తిని; ఎఱుంగక= తెలిసికోలేక; మదంబు+అడరంగన్=

గర్వం అతిశయించగా; వలాహక+ఆది= వలాహకము మొదలైన; భీకర= భయంకరమైన; ఘనపంక్తిన్= మేఘసముదాయాన్ని; పంపినన్= పంపించగా; అఖండ= ఎడతెరిపి లేని; శిలామయ= రాళ్ళతో నిండిన; భూరివర్షముల్= పెనువానలను; అనూనగర్జనలన్= ఆ మేఘాలు చేసే పెద్ద పెద్ద పెళపెళార్భటులకు; గోకులము= గోపజనమంతా; ఆకులమౌచున్= కలత పొందుతూ, కకావికలమైపోతూ; కుందగన్= బాధ చెందగా; కురిసెన్= వర్షింపజేసెను.

**తా :** కృష్ణుడు పద్మనాభుడైన శ్రీమహావిష్ణువే అని గుర్తించలేక, వాని శక్తిని గ్రహించలేక యాగం మానివేశారన్న కోపంతో మనస్సు కలుషితమైపోయి, ఆగ్రహోదగ్రుడై వలాహకాది మేఘాలను శాసించి రాళ్ళ వర్షాన్ని కురిపించాడు ఇంద్రుడు. ఆ వానలకు, మేఘాలు చేసే భయంకరధ్వనులకు గోకులమంతా కకావికలమైపోయింది.

**ఉ. ఆ తతి మంద కొందలము నందఁగ వల్లవులెల్లఁ గృష్ణ యీ**
**చేతను లెల్ల నిట్టి జడిఁ జిందఱవందఱలై కలంగుచుం**
**గాతరులైరి నీవు కృపఁగావుము కావు మనాథనాథ! ని**
**ర్ధూతకళంక! భక్తపరితోషణ భూషణ! పాపశోషణా! 115**

**ప్రతి :** ఆ తతిన్= ఆ సమయంలో; మంద= ఆవులగుంపు; కొందలమున్+అందఁగన్= బాధపడగా; వల్లవులు+ఎల్లన్= గోపాలురందరూ; కృష్ణ!= ఓ కృష్ణుడా!; ఈ చేతనులు+ఎల్లన్= ఈ జీవులందరూ; ఇట్టి జడిన్= ఇటువంటి భయంకరమైన రాళ్ళవానలో; చిందఱవందఱలు+ఐ= కకావికలై; కలంగుచున్= బాధపడుతూ; కాతరులు+ఐరి= భయభ్రాంతులైపోయారు; అనాథనాథ!= దిక్కులేనివారికి దిక్కైనవాడా!; నిర్ధూతకళంక= ఎటువంటి కళంకమూ లేనివాడా!; భక్తపరితోషణ భూషణ!= భక్తులకు ఆనందాన్ని కలిగించుటయే అలంకారంగా కలవాడా!; పాపశోషణా!= పాపాలను ఎండగట్టేవాడా!; నీవు; కృపన్= దయతో; కావుము కావుము= రక్షింపుము రక్షింపుము...

**తా :** అలా భయంకరమైన రాళ్ళవాన పడుతుండడంతో గోవులు, గోపాలురు అందరూ కకావికలైపోయారు. అందరూ కృష్ణుణ్ణి శరణు వేడుతున్నారు. కృష్ణా! నీవే దిక్కు లేనివారికి దిక్కు. ఎటువంటి దోషమూ లేని జీవనం నీది. భక్తులను రక్షించడమే నీకు అలంకారం. పాపాలను ఎండగట్టి భక్తులను నిష్పాపులుగా చేస్తావు. ఇదిగో ఇక్కడ ఈ రాళ్ళవానకు ఆవులు, ఆలకాపరులు అందరూ భయభ్రాంతులై తలా ఒక దిక్కుకు పారిపోతున్నారు. మమ్మల్నందరినీ నీవే రక్షించాలి.

**మ. అని యిబ్భంగి విపన్నులై పలుకఁ గుయ్యాలించి కృష్ణుండు స**
**జ్జనవర్ధిష్ణుఁడు గోప గోనివహ రక్షాదక్షుఁడై దేవతా**
**జను లగ్గింపఁగరాంబుజాతమున సచ్ఛత్రంబుఁగాఁ దాల్చె బో**
**రన గోవర్ధనశైలముందటచరద్రమ్యామరీజాలమున్. 116**

**ప్రతి :** అని= అంటూ; ఈ+భంగిన్= ఈ విధంగా (పై పద్యంలో చెప్పిన విధంగా); విపన్నులై పలుకన్= గోపాలురందరూ దీనులై పలుకగా; కుయ్యి+ఆలించి= మొరనాలకించి; సజ్జనవర్ధిష్ణుఁడు= మంచివారికి మేలు కలిగించేవాడైన; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; గోప= గోపాలురను; గోనివహ= ఆలమందను; రక్షా= రక్షించుటయందు; దక్షుఁడై= సమర్థత కలవాడై; దేవతాజనులు= దేవతలందరూ; అగ్గింపన్= పొగడుచుండగా; బోరన= వెంటనే; తట= చరియలయందు, సానువులందు; చరత్= సంచరించుచున్న; రమ్య= అందమైన; అమరీజాలమున్= దేవతాస్త్రీ సముదాయం కలదియైన; గోవర్ధనశైలమున్=

గోవర్ధనమను పేరుగల పర్వతాన్ని; కర+అంబుజాతమునన్= పద్మమువంటి తన చేతిలో; సత్+ఛత్రంబున్+కాన్= గొప్ప గొడుగులాగ; తాల్చెన్= ధరించెను. (గొడుగును ఎత్తిపట్టినట్లు కొండను ఎత్తెను)

**తా :** అని గోపకులంతా దీనులై మొరపెట్టుకోగానే మంచివారికి మేలుచేసే శ్రీకృష్ణుడు గోవులను, గోపాలకులను కూడా రక్షించే సమర్థుడై, దేవతలంతా పొగడుతుండగా చరియలలో దేవతాస్త్రీలు విహరించే గోవర్ధనగిరిని పద్మంలాంటి తన చేతితో గొడుగును పైకెత్తినట్లు వేగంగా ఎత్తి పట్టుకొన్నాడు.

**వ. వెండియు. 117**

**తా :** మఱియు

**సీ. శరదాగమారంభ సంపూర్ణ పూర్ణిమాచంద్ర సాంద్రాతపోజ్జ్వలిత మగుచు**
**వెలయు బృందాటవీవీథియందొకనాఁడు రాసకేళీమహోల్లాసుఁడగుచు**
**రుచిరసౌభాగ్యతారుణ్య మనోరమస్ఫూర్తిఁజెన్నొందిన మూర్తి దనర**
**సలలిత ముఖచంద్రచంద్రికల్ గోపికా నయనోత్పలముల కానంద మొసఁగ**

**తే. భవ్యచాతుర్యభంగిఁ ద్రిభంగి యగుచు, నబ్జనాభుఁడు సమ్మోద మతిశయిల్ల**
**లీలఁ బూరించు వరమురళీ నినాద, మర్థి వీతేర విని మోహితాత్మ లగుచు. 118**

**ప్రతి :** శరద్+ఆగమ= శరత్కాలం రాకయొక్క; ఆరంభ= ఆరంభంవలన; సంపూర్ణ= పదునారు కళలతో నిండిన; పూర్ణిమాచంద్ర= పున్నమ చంద్రుని; సాంద్ర+ఆతప= నిండువెన్నెలచేత; ఉత్+జ్వలితము+అగుచున్= బాగుగా ప్రకాశించుచున్నదై; వెలయు= ఒప్పుచున్న; బృంద+అటవీ= బృందావనంయొక్క; వీథియందున్= మార్గంలో; ఒకనాడు= ఒకానొకనాడు; రాసకేళీ= రససంబంధమైన క్రీడయందు; మహా+ఉల్లాసుఁడు+అగుచున్= మిక్కిలి ఉత్సాహం కలవాడగుచు; రుచిర= మనోహరమైన; సౌభాగ్య= మంచిభాగ్యముతో కూడిన; తారుణ్య= పడుచుదనముతో; మనోరమస్ఫూర్తిన్= మనసులను రంజించేవిధంగా; చెన్ను+ఒందిన= అందగించిన; మూర్తి+తనరన్= శరీరాకృతి ఒప్పగా; సలలిత= సౌకుమార్యంతో కూడిన; ముఖచంద్ర= ముఖమనే చంద్రునియొక్క; చంద్రికల్= వెన్నెలలు; గోపికా= గోపకాంతలయొక్క; నయన= కన్నులనే; ఉత్పలములకున్= కలువపూవులకు; ఆనందము+ఒసఁగన్= సంతోషాన్ని కలిగిస్తుండగా; భవ్య చాతుర్యభంగిన్= గొప్ప చతురతతోకూడిన విధంగా; త్రిభంగి+అగుచున్= మూడు వంపులు కలవాడగుచు; అబ్జనాభుఁడు= పద్మము నాభియందు గల విష్ణువు (కృష్ణుడు); సమ్మోదము+అతిశయిల్లన్= ఆనందం అధికమగునట్లుగా; లీలన్= విలాసంగా; పూరించు= గాలిని నింపడంద్వారా ధ్వనింపజేయు; వరమురళీనినాదము= మేలైన పిల్లనగ్రోవి శబ్దం; వీతేరన్= రాగా (గాలిద్వారా చెవులకు చేరగా); అర్థిన్= కోరికతో; విని= ఆలకించి; మోహిత+ఆత్మలు+అగుచున్= గోపికలు పరవశమందిన మనసులు కలవారై...

**తా :** శరత్కాలం వచ్చింది. పూర్ణిమనాడు నిండుచంద్రుడు స్వచ్ఛంగా వెలుగుతున్నాడు. ఆ కాంతిలో సహజంగానే అందమైన బృందావనం మరింత శోభాయమానంగా కనువిందు చేస్తోంది. ఆ సమయంలో రాసకేళియందు ఆసక్తుడైన

శ్రీకృష్ణుడు అసలే అందమైన శరీరం, ఆపై ముఖచంద్రుడు వెన్నెలలు కురుస్తూ గోపికల కనుకలువలకు ఆనందాన్ని ఇస్తున్నాడు. మూడు వంపులతో నిలబడి, మురళి ఊదుతుంటే ఆ పాట వింటున్న గోపికలు పరవశలగుచున్నారు.

**చ. పతులు మఱందులున్ సుతులు బావలు నత్తలు మామలున్ సము**
**న్నతి వలదన్న మానక మనంబునఁగృష్ణపదాబ్జ సేవనా**
**న్వితరతి గోపకామినులు వే చనుదేర దయాపయోధి శో**
**భితగతి రాసకేళి సలిపెం దరుణీనవపుష్పచాపుఁడై. 119**

**ప్రతి :** పతులున్= భర్తలును; మఱందులున్= భర్తల తమ్ముళ్ళును; సుతులున్= కుమారులును; బావలున్= భర్తల అన్నలును; అత్తలున్= భర్తల తల్లులును; మామలున్= భర్తల తండ్రులును; సమున్నతిన్= పెద్దగా; వలదు+అన్నన్= వద్దని వారించినా; మానక= ఆగకుండా; మనంబునన్= చిత్తములో; కృష్ణ= శ్రీకృష్ణునియొక్క; పద+అబ్జ= పద్మములవంటి పాదాలను; సేవన= ఆరాధించుటయందు; అన్విత= లగ్నమైన; రతిన్= కోరికతో; గోపకామినులు= గోపకాంతలు; వే= వేగముగా; చనుదేరన్= వాసుదేవునివద్దకు రాగా; దయాపయోధి= కరుణాసముద్రుడైన కృష్ణుడు; శోభితగతిన్= అందము చిందునట్లుగా; తరుణీ= గొల్లపడుచుల పాలిట; నవ= నూతన (అభినవ); పుష్పచాపుఁడు+ఐ= మన్మథుడై; రాసకేళిన్= రాసమను పేరుగల క్రీడను; సలిపెన్= చేసెను (క్రీడించెను).

**తా :** గోపికలందరూ శ్రీకృష్ణుని పాదపద్మారాధనలో అనురక్తలయ్యారు. వారి వారి భర్తలూ, మరదులూ, పిల్లలూ, బావలూ, అత్తమామలూ ఎంతమంది వద్దని ఎంతగా వారించినా వినకుండా కృష్ణుని చూసేందుకు అదేపనిగా వెళ్ళిపోతున్నారు. వారి భక్తి, అనురాగాలకు ముగ్ధుడైన హరి వారిపాలిటి నవమన్మథుడై, కరుణాసముద్రుడై వారందరినీ రాసకేళి నాట్యంతో ఆనందపరిచాడు.

**ఉ. రాముఁడు దానుగూడి మధురాపురికిం జని యందు వైభవో**
**ద్దామనృపాసనంబున ముదంబున నున్న దురాత్ముఁ గంసు దు**
**ష్టామరశత్రుఁ ద్రుంచి ముదమారఁగఁ దల్లినిఁ దండ్రి నంచిత**
**శ్రీమహితాత్ములై తనరఁ జేసె సరోరుహనాభుఁ డున్నతిన్. 120**

**ప్రతి :** సరోరుహనాభుఁడు= పద్మము నాభియందు గల శ్రీహరి (కృష్ణుడు); ఉన్నతిన్= గొప్పగా; రాముఁడు= తన అన్నగారైన బలరాముడు; తాను+కూడి= తాను (కృష్ణుడు) కలిసి; మధురాపురికిన్= మధురానగరానికి; చని= వెళ్ళి; అందున్= అక్కడ; వైభవ+ఉద్దామ= వైభవంగా ప్రకాశిస్తున్న; నృప+ఆసనంబునన్= రాజసింహాసనం మీద; ముదంబునన్= సంతోషంగా; ఉన్న= కూర్చుని ఉన్న; దురాత్మున్= దుర్మార్గుడైన; దుష్ట+అమరశత్రున్= దుష్ట రాక్షసుడైన; కంసున్= కంసుని; త్రుంచి= సంహరించి; ముదము+ఆరఁగన్= ఆనందంగా; తల్లినిన్+తండ్రిన్= తల్లిదండ్రులిద్దరినీ; అంచిత= కొనియాడదగిన; శ్రీమహితాత్ములు+ఐ= సంపదతో విలసిల్లువారై; తనరన్+చేసెన్= ఉండునట్లు చేసెను.

**తా :** శ్రీకృష్ణుడు తన అన్నగారైన బలరామునితో కలిసి, మధురానగరానికి వెళ్ళి, అక్కడ మహావైభవంగా సింహాసనారూఢుడై రాజ్యపాలనం చేస్తున్న దుర్మార్గుడు, దుష్టరాక్షసుడూ అయిన కంసుని చంపి, కారాగారంలో మగ్గిపోతున్న తన తల్లిదండ్రులైన దేవకీవసుదేవుల చెర విడిపించి, వారిని మహావైభవంతో తులతూగేలా చేశాడు.

**మ. నలువొప్పంగ షడంగయుక్త మహితామ్నాయంబు చౌషష్టి వి**
**ద్యలు సాందీపనిచే నెఱింగెఁజెలువొందన్ విన్నమాత్రంబు లో**
**పలనే లోకగురుండు దాన తనకున్ భావింప నన్యుల్ గురు**
**ల్గలరే లోకవిడంబనార్థ మగు లీలల్ గావె యమ్మేటికిన్. 121**

**ప్రతి :** నలువు= సామర్థ్యము; ఒప్పంగన్= ప్రకాశించునట్లుగా; షడంగయుక్త= ఆరు అంగములతో కూడిన; మహిత= కొనియాడదగిన; ఆమ్నాయంబున్= వేదమును; చౌషష్టి విద్యలు= అరువది నాలుగు కళలు; సాందీపనిచేన్= సాందీపని అను గురువువద్ద; ఎఱింగెన్= అభ్యసించెను; లోకగురుండు= జగద్గురువైన శ్రీకృష్ణుడు; విన్నమాత్రంబు లోపలనే= విన్నంతమాత్రము చేతనే; చెలువు+ఒందన్= విషయమంతా అవగాహనమగునట్లుగా; తాన తనకున్ భావింపన్= తనకు తానుగా విషయాన్ని భావించగలుగుతుండగా; అన్యుల్= ఇతరులు; గురులు= గురుస్థానమును పొంది విద్యనేర్పగలవారు; కలరే= ఉన్నారా?; ఆ+మేటికిన్= ఆ జగద్గురునకు వేరొకరివద్ద; విద్య నేర్చుకొనుట అనునది; లోక విడంబన= లోకాన్ని అనుసరించుటయే; అర్థము+అగు= ప్రయోజనముగా గల; లీలల్+కావె!= చేష్టలు కాక మరేమి!

**తా :** శ్రీకృష్ణుడు బాల్యంలో సాందీపని అనే గురువు వద్ద చేరి, వేదం, దానికి సంబంధించిన ఆరు అంగాలు, వాటితోపాటుగా అరువది నాల్గు కళలు క్షుణ్ణంగా నేర్చుకొన్నాడు. ఏదైనా వినడమే తరువాయి వెంటనే ఆ విద్య స్వాధీనమవుతోంది. అయినా తనకు తానుగానే ప్రపంచాన్ని భావించగలవానికి వేరే గురువులు ఉంటారా? లోకాచారాన్ని తానుకూడా అనుసరించి, పదిమందికి ఆదర్శంగా నిలబడటానికే వాసుదేవుని విద్యాభ్యాసం.

**ఉ. మించి ప్రభాసతీర్థమున మృత్యువశంబునఁబొందిపోయి యా**
**పంచజనోదరస్థుఁడగు బాలకు దేశికనందనుం బ్రభో**
**దంచిత లీలఁదెచ్చి గురుదక్షిణగా నతిభక్తి యుక్తి న**
**ర్పించె గురుండు చిత్తమునఁబెంపెసలార మురారి వెండియున్. 122**

**ప్రతి :** మించి= లోకాచారముననుసరించి విద్యాభ్యాసం చేయడమేకాక; ప్రభాసతీర్థమునన్= ప్రభాసము అను పేరుగల జలాశయంలో; మృత్యువశంబునన్+పొంది= చావు సమీపించినవాడై; పోయి= ఆ నీటిలోపలికి పోయి; పంచజన ఉదరస్థుఁడు+అగు= పంచజనుడు అను పేరుగల రాక్షసుని కడుపులో ఉన్న; దేశికనందనున్= గురుపుత్రుడైన; బాలకున్= బాలకుని; ప్రభా+ఉదంచితలీలన్= పూర్వపు తేజస్సు తగ్గకుండగా సజీవంగా; తెచ్చి= తీసికొనివచ్చి; గురుదక్షిణగాన్= విద్యనేర్పినందుకు గురువుకు ప్రతిఫలంగా; అతిభక్తియుక్తిన్= మిక్కిలి గురుభక్తితో కూడినవాడై; గురుండు= గురువైన సాందీపని; చిత్తమునన్= మనసులో; పెంపు+ఎసలారన్= ఆనందం కలుగునట్లుగా; ముర+అరి= మురుడు అనువానికి శత్రువైన శ్రీకృష్ణుడు; అర్పించెన్= సమర్పించెను; వెండియున్= మరియు...

**తా :** విద్యాభ్యాసం పూర్తి అయ్యాక గురుదక్షిణ కోరుకొమ్మంటే అకాలమృత్యువును పొందిన తన బిడ్డను బ్రతికించి తీసుకువచ్చి, తనకిమ్మన్నాడు సాందీపని. ఆ గురుపుత్రుడు చావు సమీపించి ప్రభాసమనే జలాశయంలో క్రీడిస్తూండగా పంచజనుడనే రాక్షసుడు అతనిని మింగేశాడు. అది గ్రహించి, ఆ రాక్షసుని చంపి, ఆ బిడ్డను బ్రతికించి గురుదక్షిణగా సమర్పించాడు శ్రీకృష్ణుడు.

సీ. ఘనుఁడు విదర్భేశుఁడననొప్పు భీష్మకు వరసుతామణి నవవారిజాక్షిఁ
బద్మాసమానరూపశ్రీవిభాసితఁ గమనీయభూషణఁ గంబుకంఠిఁ
జతురస్వయంవరోత్సవ సమాగత చైద్య సాల్వ మాగధ ముఖ్య జనవరేణ్య
నికరసమావృతఁ బ్రకట సచ్చారిత్ర, రుక్మిణి నసమానరుక్మకాంతి

తే. నమరగుప్తామృతంబు విహంగవిభుఁడు, గొనిన కైవడి మనుజేంద్ర కోటిఁ దోలి
కమలనాభుండు నిజభుజాగర్వ మలరఁ, దెచ్చి వరియించె నతని నుతింప వశమె! 123

**ప్రతి :** ఘనుఁడు= గొప్పవాడైన; విదర్భా+ఈశుఁడు+అనన్= విదర్భ దేశమునకు రాజనగా; ఒప్పు= ప్రకాశించే, ప్రసిద్ధుడైన; భీష్మకు= భీష్మకునియొక్క; వరసుతామణిన్= పుత్రికారత్నమును; నవవారిజాక్షిన్= అప్పుడే వికసించిన పద్మములవంటి కన్నులు కలది; పద్మా= లక్ష్మీదేవితో; సమాన= సమానమైన; రూపశ్రీ= రూపకాంతితో; విభాసితన్= ప్రకాశించునదియు; కమనీయ భూషణన్= అందమైన నగలను ధరించునదియు; కంబుకంఠిన్= శంఖమువంటి కంఠము కలది; చతుర= చాతుర్యముతో ఏర్పరచిన; స్వయంవర+ఉత్సవ= వరుని స్వయముగా వరించుటకు ఏర్పరచిన ఉత్సవమునకు; సమాగత= వచ్చిన; చైద్య= చేదిభూపాలుడైన శిశుపాలుడు; సాల్వ= సాల్వుడు; మాగధ= మగధదేశాధీశుడైన జరాసంధుడు; ముఖ్య= మొదలైన; జనవరేణ్య నికర= రాజుల సముదాయంతో; సమావృతన్= కూడియున్నది; ప్రకట సత్+చారిత్రన్= లోకానికి తెలిసిన చక్కని నడవడి కలది; అసమాన రుక్మకాంతిన్= సాటిలేని మేలిమి బంగారుచాయ గలది; అయిన రుక్మిణిన్= రుక్మిణిని; కమలనాభుండు= పద్మము నాభియందుగల విష్ణువు అవతారమైన శ్రీకృష్ణుడు; నిజ భుజాగర్వము= తన భుజబలము; అలరన్= ప్రకాశించునట్లుగా; అమర= దేవతలచేత; గుప్త= కాపాడబడుచున్న; అమృతంబు= సుధను; విహంగవిభుఁడు= గరుత్మంతుడు; కొనిన కైవడిన్= తీసుకుపోయినట్లుగా; మనుజ+ఇంద్రకోటిన్= రాజసమూహాన్ని; తోలి= చెల్లాచెదరు చేసి; తెచ్చి వరియించెన్= ఎత్తుకుపోయి వివాహమాడెను; అతనిన్= ఆ వాసుదేవుని; నుతింపన్= ప్రశంసించుటకు; వశమె!= సాధ్యమా!

**తా :** విదర్భ మహారాజు చాల గొప్పవాడు. పేరు భీష్మకుడు. ఆతని ముద్దులకూతురు రుక్మిణి. ఆమె కన్నులు అప్పుడే వికసించిన పద్మాల్లాగా ఉంటాయి. రూపంలో సాక్షాత్తు లక్ష్మీదేవిలా ఉంటుంది. చక్కగా అలంకరించుకొంటుంది. ఆమె కంఠం శంఖంవలె ఉంటుంది. ఆమెకు స్వయంవరాన్ని ప్రకటించాడు మహారాజు. దేశం నలుచెరగులనుండి ఎందరో రాజులు వచ్చారు ఆమెను పెండ్లాడాలని. వారిలో శిశుపాలుడు, సాల్వుడు, జరాసంధుడువంటి ప్రముఖులు కూడా ఎందరో ఉన్నారు. వారినందరినీ తన భుజబలంతో ఎదిరించి చెల్లాచెదరు చేసి, గరుత్మంతుడు దేవలోకంనుండి అమృతాన్ని ఎత్తుకుపోయినట్లుగా రుక్మిణిని తీసుకుపోయి పెండ్లాడాడు శ్రీకృష్ణుడు. ఆ వాసుదేవుని పొగడడం ఎవరితరం!

చ. పరువడిఁబట్టి సప్తవృషభంబుల ముక్కులు గుట్టఁదద్భల
స్ఫురణ సహింపఁజాలక నృపుల్ దలపడ్డ జయించి నగ్నజి
ద్ధరణిపు నందనన్ వికచతామరసాక్షిఁబ్రమోదియై స్వయం
వరమునఁబెండ్లియాడె గుణవంతుఁ డనంతుఁ డనంతశక్తితోన్. 124

**ప్రతి :** పరువడిన్= క్రమముగా; సప్తవృషభంబులన్= ఏడు ఎద్దులను; పట్టి= పట్టుకొని; ముక్కులు+కుట్టన్= ముకుత్రాళ్ళు వేసి కుట్టగా; తద్+బలస్ఫురణన్= శ్రీకృష్ణుని బలాన్ని; సహింపన్+చాలక= ఓర్వలేక; నృపుల్= ఇతరరాజులు; తలపడ్డన్= ఎదిరింపగా; జయించి= వారిని ఓడించి; వికచ తామరస+అక్షిన్= వికసించిన పద్మములవంటి కన్నులు గల; నగ్నజిత్= నగ్నజిత్తు అను పేరుగల; ధరణిపు= మహారాజుయొక్క; నందనన్= కొమార్తెయైన నాగ్నజితిని; ప్రమోదియై= ఆనందము గలవాడై; గుణవంతుఁడు= సద్గుణములు కలవాడు; అనంతుఁడు= అంతము లేనివాడైన వాసుదేవుడు; అనంత శక్తితోన్= అంతులేని బలంతో; స్వయంవరమునన్= స్వయంవరవిధానముతో; పెండ్లి+ఆడెన్= వివాహము చేసికొనెను.

**తా :** మదించిన ఏడు ఆబోతులు కృష్ణుని చంపబోయాయి. వాటిని పట్టి, ముక్కుత్రాళ్ళు బిగించి, లొంగదీసుకున్నాడు. ఆయన బలపరాక్రమాలకు అసూయపడి ఎదిరించిన ఎందరో రాజులను ఓడించాడు. అంతము లేనివాడైన వాసుదేవుడు అనంతమైన బలంతో స్వయంవరంలో వికసించిన తామరలవంటి కన్నులు గల నగ్నజిత్తు మహారాజుగారి కొమార్తె నాగ్నజితిని ఆనందంగా వివాహమాడాడు.

**మ. ప్రతివీరక్షయకారినాఁ బరఁగి సత్రాజిత్తనూజా హృ దీ**
**ప్సితముం దీర్పఁదలంచి నాకమునకుం బెంపారఁగా నేఁగి వ**
**ర్ణిత శౌర్యోన్నతిఁ బారిజాత మిలకున్ లీలాగతిం దెచ్చె ను**
**ద్ధతి దేవేంద్రు జయించి కృష్ణుఁడన నేతన్మాత్రుఁడే చూడఁగన్. 125**

**ప్రతి :** ప్రతివీరక్షయకారినాన్= శత్రువీరులను నశింపజేయువానిగా; పరఁగి= ఒప్పి; సత్రాజిత్= సత్రాజిత్తు మహారాజుయొక్క;తనూజా= కొమార్తెయైన సత్యభామకు కలిగిన; హృద్+ఈప్సితమున్= మనోవాంఛను; తీర్పన్= నెరవేర్చవలెనని; తలంచి= భావించి; నాకమునకున్= స్వర్గమునకు; పెంపారఁగాన్= అతిశయించుచు; ఏఁగి= వెళ్ళి; వర్ణిత శౌర్య+ఉన్నతిన్= ప్రశంసాత్మకమైన పరాక్రమవైభవంతో; ఉద్ధతిన్= బలాధిక్యంతో; దేవేంద్రున్= మహేంద్రుని; జయించి= ఓడించి; పారిజాతము= పారిజాతవృక్షాన్ని; లీలాగతిన్= అవలీలగా; ఇలకున్= భూమికి; తెచ్చెన్= తీసుకువచ్చెను; చూడఁగన్= పరిశీలింపగా; కృష్ణుఁడు+అనన్= వాసుదేవుడంటే; ఏతత్+మాత్రుఁడే= సామాన్యుడా?

**తా :** శత్రువులను చీల్చిచెండాడడంలో ప్రసిద్ధి పొందిన కృష్ణుడు తన భార్య సత్యభామ కోరిక తీర్చేందుకు స్వర్గానికి వెళ్ళి, అక్కడ అసమాన పరాక్రమంతో దేవేంద్రుని ఎదిరించి, జయించి, నందనవనంలోని పారిజాతవృక్షాన్ని పెకలించి, సునాయాసంగా భూలోకానికి తెచ్చాడు. వాసుదేవుడంటే సామాన్యుడా?

**సీ. మానితాఖిలజగన్మయదేహమునఁబొల్చు ధరణిదేవికిఁబ్రియతనయుఁడైన**
**నరకదానవుని సునాభాఖ్యఁజెన్నొందు ఘనచక్రధారావిఖండితోత్త**
**మాంగునిఁజేయ న య్యవనీలలామంబు వేఁడినఁ దత్పుత్త్రు విపులరాజ్య**
**పదమున నిల్పి లోపలి మందిరంబులఁ జిరముగ నరకుండు సెఱలఁ బెట్టి**

**తే. నట్టి కన్యలు నూఱుఁబదాఱువేలు, నార్తబంధువుఁడైన పద్మాక్షుఁజూచి**
**హర్షబాష్పాంబుధారాప్రవర్ష మొదవఁ, బంచశరబాణనిర్భిన్నభావలగుచు. 126**

**ప్రతి :** మానిత= పొగడదగిన; అఖిల= సమస్తమైన; జగత్+మయ= ప్రపంచముతో కూడిన; దేహమునన్= శరీరముతో; పొల్చు= ఒప్పు; ధరణిదేవికిన్= భూదేవికి; ప్రియతనయుఁడు+ఐన= గారాల కొమరుడైన; నరకదానవునిన్= నరకుడు అను పేరుగల రాక్షసుని; సునాభ+ఆఖ్యన్= సునాభము అను పేరుతో; చెన్ను+ఒందు= ప్రసిద్ధి పొందిన; ఘన= గొప్పదైన; చక్ర= సుదర్శన చక్రముయొక్క; ధారా= వాదఱతో, వేటుతో; విఖండిత= ఖండింపబడిన; ఉత్తమ+అంగునిన్= తలగలవానిగా; చేయన్= చేయగా; ఆ+అవనీలలామంబు= ఆ భూదేవి; వేఁడినన్= ప్రార్థింపగా; తద్+పుత్రున్= ఆ నరకాసురుని కుమారుని; విపుల రాజ్యపదమునన్= సువిశాల రాజ్యమునకు రాజుగా; నిల్పి= పట్టాభిషిక్తుని చేసి; లోపలి మందిరంబులన్= అంతఃపురమందిరాలలో; చిరముగన్= చాలకాలముగా; నరకుండు= నరకుడు; చెఱలన్ పెట్టినట్టి= బంధించి ఉంచిన; కన్యలు= కన్నెలు; నూఱున్+పదాఱువేలున్= పదియారువేల వందమందియు; ఆర్తబంధువుఁడు+ఐన= చెఱ విడిపించి ఆర్తి బాపుటచే చుట్టమైన; పద్మాక్షున్+చూచి= శ్రీకృష్ణునిచూచి; హర్ష= ఆనందముచే పుట్టిన; బాష్ప+అంబు= కన్నీటియొక్క; ధారా= జాలురూపంలో ఉన్న; ప్రవర్షము= పెనువాన; ఒదవన్= ఏర్పడగా; పంచశర= మన్మథునియొక్క; బాణ= బాణములచేత; నిర్భిన్న= చీల్చబడిన; భావలు+అగుచున్= భావములు కలవారగుచు...

**తా :** జగమంతా తనరూపంగా కలిగిన భూదేవికి ప్రియసుతుడైన నరకాసురుని తలను కృష్ణుడు సునాభము అనే పేరుగల తన చక్రాయుధంతో ఖండించాడు. ధరణీదేవి కోరికమేరకు అతని కుమారుని రాజ్యపట్టాభిషిక్తుని చేశాడు. నరకునిచే ఎంతో కాలంగా బంధింపబడిన పదియారువేల వందమంది కన్నెలు వాసుదేవునిచే బంధవిముక్తలయ్యారు. వారందరికీ ఆయనయందు అనురాగం ఏర్పడింది.

**చ. లలితతదీయసుందరవిలాసవిమోహిత లైన వారి నిం**
**పొలసిన కోర్కెఁదీర్చుటకు నొక్క ముహూర్తమునన్ వరించి క**
**న్యల లలితావరోధభవనంబుల నందఱ కన్ని రూపులై**
**కలసి సుఖస్థితిం దనిపెఁ గాంతల భక్తినితాంతచిత్తలన్. 127**

**ప్రతి :** లలిత= లాలిత్యముతో గూడిన; తదీయ= శ్రీకృష్ణుని; సుందర= అందమైన; విలాస= చేష్టావిశేషములకు; విమోహితలు+ఐన= మిక్కిలి ఆకర్షితలైన; వారినిన్= ఆ కన్యలను; ఇంపు+ఒలసిన= ఇష్టము వ్యాపించునట్లుగా; కోర్కెన్= కోరికను; తీర్చుటకున్= నెరవేర్చుటకు; ఒక్క ముహూర్తమునన్= ఒకే ముహూర్తమందు; వరించి= పెండ్లాడి; కన్యల= ఆ కన్యలకు కేటాయింపబడిన; లలిత= అందమైన; అవరోధ భవనంబులన్= అంతఃపుర మందిరాలలో; అందఱకున్= పదియారువేల వందమందికిని; అన్నిరూపులు+ఐ= పదియారువేల వంద రూపాలను ధరించి; కలసి= వారందరినీ ఒకే సమయంలో కలిసి; భక్తి నితాంత చిత్తలన్= తనయందే భక్తితోకూడిన మనసులు గల; కాంతలన్= ఆ స్త్రీలను; సుఖస్థితిన్+తనిపెన్= తనివితీర సుఖపెట్టెను.

**తా :** ఆ పదియారువేల వందమంది కన్యలు తన సౌందర్యవిలాసాలను చూచి, అనురక్తలయ్యారని గమనించిన శ్రీకృష్ణుడు వారందరినీ ఒకే ముహూర్తంలో వివాహమాడాడు. అందరినీ వేరువేరు అంతఃపురమందిరాలలో ఉంచాడు. తానుకూడా అన్నిరూపాలు ధరించి, ఏకకాలంలో అందరితోనూ క్రీడించి, అందరికీ పరిపూర్ణమైన ఆనందాన్ని కలిగించాడు.

**విశే :** కృష్ణునికి భార్యలు ఎనమండుగురు. వారుగాక పదియారువేలమంది గోపికలతో సహవాసం చేసేవాడనే ప్రచారం లోకంలో ఉంది. ఆ ఎనమండుగురు పట్టమహిషులు. కాని అందరూ భార్యలే అనడానికి ఈ పద్యమే ప్రమాణం. పైగా పదారువేలమంది మాత్రమే కాదు, పైన ఒక వందమందికూడా ఉన్నారు.

క. చతురతతో నం దొక్కొక, యతివకుఁ బదురేసి సుతుల నాత్మసముల ను
న్నతభుజశక్తులఁగాంచెను, వితతంబై కీర్తి దిశల వినుతికి నెక్కన్. 128

ప్రతి : వితతంబు+ఐ= విస్తారమై; కీర్తి= యశస్సు; దిశలన్= నలుదెసల; వినుతికిన్+ఎక్కన్= పొగడ్త చెందగా; చతురతతోన్= చాతుర్యంతో; అందున్= ఆ పదియారువేల వందమందిలోను; ఒక్కొక్క+అతివకున్= ఒక్కొక్క స్త్రీకి; ఆత్మసములన్= తనతో సమానమైన; ఉన్నత భుజశక్తులన్= గొప్ప భుజబలం కలిగిన; సుతులన్= కుమారులను; పదురేసి= పదిమంది చొప్పున; కాంచెను= పొందెను.

**తా :** ఆ పదారువేల వందమందియందు ఒక్కొక్క స్త్రీద్వారా పదిమంది చొప్పున పుత్రసంతానాన్ని పొందాడు శ్రీకృష్ణుడు. వారందరూ భుజబలంలో తనకు ఏ మాత్రమూ తీసిపోనివారు. అందువల్ల ఆయన కీర్తి మరింతగా నలుదెసల వ్యాపించింది.

సీ. మధురాపురముఁ జతుర్విధబలౌఘములతో నావరించిన కాలయవన సాల్వ
మగధ భూపాలాది మనుజేంద్ర లోకంబు సైన్యయుక్తము గాఁగ సంహరించి
తన బాహుశక్తిఁ జిత్తముల నర్థించిన భీమపార్థులకు నుద్దామవిజయ
మొసఁగి తద్వైరుల నుక్కడంగఁగఁ ద్రుంచి బాణశంబరమురపల్వలాది

తే. దనుజనాయక సేనావితానములను హలధరాదిసమేతుఁడై హతులఁ జేసె
దంతవక్త్రాదిదైత్యులు దన్ను నెదుర భండనములోనఁద్రుంచె దోర్బలము మెఱసి. 129

ప్రతి : మధురాపురమునన్= మధుర అను పేరుగల పురమునందు; చతుర్విధ= నాలుగు విధములైన (రథములు, ఏనుగులు, గుర్రములు, కాల్బలములు); బల+ఓఘములతోన్= సేనా సముదాయములతో; ఆవరించిన= చుట్టుముట్టిన; కాలయవన= కాలయవనుడు; సాల్వ= సాల్వుడు; మగధ భూపాల+ఆది= మగధ మహారాజైన జరాసంధుడు మొదలైన; మనుజ+ఇంద్రలోకంబున్= రాజశ్రేష్ఠుల సమూహమును; సైన్యయుక్తము+కాఁగన్= సేనలతో పాటుగా; సంహరించి= వధించి; చిత్తములన్= మనసులలో; తన= తనయొక్క (శ్రీకృష్ణునియొక్క); బాహుశక్తిన్= భుజబలమును; అర్థించిన= కోరుకొన్న; భీమపార్థులకున్= భీమునకును, అర్జుననకును; ఉద్దామవిజయము+ఒసఁగి= శ్రేష్ఠమైన విజయాన్ని ఇచ్చి; తద్+వైరులన్= పాండవుల శత్రువులైన ధార్తరాష్ట్రులను; ఉక్కడంగఁగన్= వారి శౌర్యములు చెడునట్లుగా; త్రుంచి= సంహరించి; బాణ= బాణుడు; శంబర= శంబరుడు; ముర= మురుడు; పల్వల+ఆది= పల్వలుడు మొదలైన; దనుజనాయక= రాక్షసనాయకుల; సేనావితానములను= సేనల గుంపులను; హలధర+ఆదిసమేతుఁడై= బలరాముడు మొదలగువారితో కూడి; హతులన్+చేసెన్= సంహరించెను; దంతవక్త్ర+ఆది దైత్యులు= దంతవక్త్రుడు మొదలైన రాక్షసులు; తన్నున్+ఎదురన్= తనను ఎదిరింపగా (కయ్యమునకు కాలుదువ్వగా); భండనములోనన్= యుద్ధమునందు; దోర్బలము మెఱసి= బాహుబలము ప్రకాశించునట్లుగా; త్రుంచెన్= చంపెను.

**తా :** కొంతమంది రాజులు వారి సేనలతో మధురాపురాన్ని చుట్టుముట్టారు. వారిలో కాలయవనుడు, సాల్వుడు, జరాసంధుడు వంటి ప్రముఖులున్నారు. వారందరినీ ససైన్యంగా మట్టుపెట్టాడు శ్రీకృష్ణుడు. తన సాయం కోరిన భీమ, అర్జునులచేత శత్రుసంహారం చేయించి, వారికి విజయాన్ని చేకూర్చాడు. బలరామాదుల సాయంతో బాణ శంబర, ముర, పల్వలాది

రాక్షస నాయకులను సేనలతో కూడ తుదముట్టించాడు. సంగ్రామరంగంలో తనను ఎదిరించిన దంతవక్త్రుడు మొదలగు రాక్షసులను హతమార్చాడు. ఆ విధంగా తన బాహుబలాన్ని లోకానికి చాటాడు.

**వ. వెండియుం గృష్ణుండు కౌరవ పాండవ భండనంబునకుం దోడ్పడి రాజన్యు లన్యోన్య మాత్స ర్యోత్సాహసమేతులై సైనిక పాదఘట్టనంబుల ధరాచక్రంబు కంపింప ననన్య సామాన్యంబు లైన శంఖ భేరీ ప్రముఖ తూర్యఘోషంబుల నింగి ప్రింగఁ దురంగమ రింఖా సముద్ధూత ధూళి పటల పరిచ్ఛన్న భానుమండలంబుగాఁ జనుదెంచి కురుక్షేత్రంబున మోహరించిన నుభయపక్షబలంబులం దునుమాడి నిఖిలరాజ్యవైభవ మదోన్మత్తుం డయిన సుయోధనుండు నిఖిలరాజ సమక్షంబునఁ గర్ణశకుని దుశ్శాసనాదుల దుర్మంత్రంబున నిరంతరంబుఁ గుంతీనందనుల కెగ్గు చేసిన దోషంబునం జేసి సంగరరంగంబున భీమ గదాఘాతంబునం దొడలు విఱిగి పుడమింబడి గతాయుశ్శ్రీవిభవుండై యుండఁ జూచినంగదా పరితుష్ట చిత్తుండ నగుదు నని యపరిమిత బాహుబలోత్సాహులైన భీష్మ ద్రోణ భీమార్జునులచేత నిఖిలధరాపతుల నష్టాదశాక్షౌహిణీ బలంబులతోడం దునిమించి మఱియు స్వసమానబలులైన యదువీరుల జయింప నెంతవారల కైనం దీరదు; మధుపాన మదవిఘూర్ణితాతామ్ర విలోచనులై ప్రవర్తించు యాదవుల కన్యోన్య వైరంబులు గల్పించి పోరించి యితరేతర కరాఘాతంబుల హతులై తన్నుఁ గలసినంగాని భూభారం బుడుగదని చిత్తంబునం దలంచి యంత ధర్మనందనుచే నిస్సపత్నంబగు రాజ్యంబు పూజ్యంబుగాఁ జేయించుచు మర్త్యులకుం గర్తవ్యంబులైన ధర్మపథంబులు సూపుచు, బంధుమిత్రుల నెల్లఁ బరితోషంబు నొందించుచుం దత్పరోక్షంబున వారి వంశం బుద్ధరింపం దలంచి యభిమన్యువలన నుత్తర యందు గర్భంబు నిలిపి, గురుతనయ ప్రయుక్తమహిత బ్రహ్మాస్త్రపాతంబునం దద్గర్భదళనంబు గాకుండ నర్భకుని రక్షించి, నిజపదారవింద సేవారతుండైన ధర్మసుతుచేఁ గీర్తిప్రతాపంబులు నివ్వటిల్లం దురంగమేధంబులు మూఁడు సేయించి వెండియు. 130**

**ప్రతి :** వెండియున్= మరియును; కృష్ణుండు= వాసుదేవుడు; కౌరవపాండవ భండనంబునకున్= ధార్తరాష్ట్రులకు పాండుసుతులకు మధ్య జరిగిన సంగ్రామానికి; తోడ్పడి= సాయపడి; రాజన్యులు= రాజులు; అన్యోన్య= పరస్పరము; మాత్సర్య= మచ్చరము; ఉత్సాహసమేతులై= ఉత్సాహంతో కూడినవారై; సైనిక పాదఘట్టనంబులన్= సేనల కాలితాకిడులతో; ధరాచక్రంబు కంపింపన్= భూమి అనే గోళం అదరిపోగా; అనన్య సామాన్యంబులు+ఐన= ఇతరులకు సాధ్యములుకాని; శంఖ= శంఖములు; భేరీ= దుందుభులు; ప్రముఖ= మొదలుగా గల; తూర్యఘోషంబులన్= వాద్యముల ధ్వనులు; నింగిన్+ప్రింగన్= ఆకాశమంతట వ్యాపింపగా; తురంగమ= గుఱ్ఱములయొక్క; రింఖా= గిట్టలచేత; సముద్ధూత= ఎగురగొట్టబడిన; ధూళిపటల= మట్టికణముల సముదాయముతో; పరిచ్ఛన్న= కప్పబడిన; భానుమండలముగాన్= సూర్యమండలము కలిగినట్లుగా; చనుదెంచి= వచ్చి; కురుక్షేత్రంబునన్= కురుక్షేత్రమను పేరుగల యుద్ధభూమిలో; మోహరించిన= రణమునకు సిద్ధపడిన; ఉభయపక్ష బలంబులన్= రెండువైపులనున్న సైన్యాన్ని; తునుమాడి= సంహరించి; నిఖిల= సమస్తమైన; రాజ్యవైభవ= రాజ్యభోగముచేత; మద+ఉన్మత్తుండు= మదంచేత ఒడలు తెలియనివాడు; అయిన సుయోధనుండు= అయినటువంటి దుర్యోధనుడు; నిఖిలరాజసమక్షంబునన్= అందరు రాజుల ఎదుట; కర్ణశకునిదుశ్శాసన+ఆదుల= కర్ణుడు, శకుని, దుశ్శాసనుడు

మొదలగువారి; దుర్మంత్రంబునన్= చెడు ఆలోచనలతో; నిరంతరంబున్= ఎల్లప్పుడు; కుంతీనందనులకున్= పాండవులకు; ఎగ్గు చేసిన= కీడొనరించిన; దోషంబునన్+చేసి= పాపముచేత; సంగరరంగంబునన్= యుద్ధభూమిలో; భీమగదాఘాతంబునన్= భీముని గద తాకిడితో; తొడలు విఱిగి= ఊరుభంగము జరిగి; పుడమిన్+పడి= నేలపై కూలి; గతాయుస్+శ్రీవిభవుండు+ఐ= ఆయువు భాగ్యం నశించినవాడై (మరణించినవాడై); ఉండన్+చూచినన్+కదా= ఉండగా చూచినప్పుడు కదా; పరితుష్ట చిత్తుండన్= సంతోషముతోకూడిన మనసు కలవాడను; అగుదున్+అని= కాగలను అని; అపరిమిత= అధికమైన; బాహుబల= భుజబలంతో; ఉత్సాహులు+ఐన= ఉద్యమించగలిగిన; భీష్మద్రోణభీమ+అర్జునుల చేతన్= భీష్ముడు, ద్రోణుడు, భీముడు, అర్జునుడు అను వారిచేత; నిఖిల ధరా+అధిపతులన్= సకల భూపాలకులను; అష్టాదశ+అక్షౌహిణీ బలంబులతోడన్= పదునెనిమిది అక్షౌహిణుల బలాలతో; తునిమించి= చంపించి; మఱియున్= ఇంకను; స్వసమానబలులైన= తనతో సమానమైన బలము కలవారైన; యదువీరుల జయింపన్= యాదవవీరులను జయించుటకు; ఎంతవారలకు+ఐనన్= ఎట్టి వీరులకైనను; తీరదు= సాధ్యముకాదు; మధుపాన= మద్యాన్ని త్రాగటంచేత కలిగిన; మద= మదంతో; విఘూర్ణిత= తిరుగుడుపడిన; ఆతామ్ర= బాగా ఎఱ్ఱబడిన; విలోచనులు+ఐ= నేత్రములు కలవారై; ప్రవర్తించు= విహరించు; యాదవులకున్= యదువంశ్యులకు; అన్యోన్య వైరంబులు= పరస్పర కలహాలను; కల్పించి= పుట్టించి; పోరించి= కొట్టుకొనునట్లు చేసి; ఇతర+ఇతర కర+ఆఘాతంబులన్= ఒండొరులయొక్క చేతిదెబ్బలకు; హతులై= మరణించినవారై; తన్నున్+కలిసినన్+కాని= తనలో ఐక్యమయితే తప్ప; భూభారంబు+ఉడుగదు+అని= పుడమికి బరువు తగ్గదని; చిత్తంబునన్+తలంచి= మనసులో భావించి; అంతన్= అప్పుడు; ధర్మనందనునిచేన్= ధర్మరాజుచేత; నిస్సపత్నంబు+అగు= శత్రురహితమైన; రాజ్యంబు= రాజ్యపాలనము; పూజ్యంబుగాన్= గౌరవాస్పదముగా; చేయించుచున్= కావిస్తూ; మర్త్యులకున్= మానవులకు; కర్తవ్యంబులు+ఐన= చేయదగినవైన; ధర్మపథంబులు= ధర్మమార్గములు; చూపుచున్= దర్శింపజేస్తూ; బంధుమిత్రులన్+ఎల్లన్= చుట్టాలను పక్కాలను అందరినీ; పరితోషంబున్+ఒందించుచున్= మిక్కిలి సంతోషపరుస్తూ; తద్+పరోక్షంబునన్= వారికి తెలియకుండానే; వారి వంశంబు= వారి వంశాన్ని; ఉద్ధరింపన్+తలంచి= వృద్ధి కావింపదలచి; అభిమన్యువలనన్= అభిమన్యునిచేత; ఉత్తరయందున్= అతని భార్యయైన ఉత్తరయందు; గర్భంబున్+నిలిపి= వంశాంకురం ఏర్పడునట్లు చేసి; గురుతనయ= ద్రోణుని కుమారుడైన అశ్వత్థామచేత; ప్రయుక్త= ప్రయోగింపబడిన; మహిత= మహాశక్తిమంతమైన; బ్రహ్మాస్త్రపాతంబునన్= బ్రహ్మాస్త్రము పడుటవలన; తద్+గర్భదళనంబు= ఉత్తర గర్భమునకు విచ్ఛిత్తి; కాకుండన్= కలుగకుండా; అర్భకుని రక్షించి= గర్భస్థ శిశువును కాపాడి; నిజ= తనయొక్క (శ్రీకృష్ణునియొక్క); పద+అరవింద= పాదపద్మాల; సేవారతుండు+ఐన= సేవయందే ఆసక్తుడైన; ధర్మసుతుచేన్= ధర్మరాజుచేత; కీర్తిప్రతాపంబులు= యశస్సు మరియు పరాక్రమం; నివ్వటిల్లన్= వెల్లడియగునట్లు; తురంగమేధంబులు మూఁడు= మూడు అశ్వమేధయాగాలు; చేయించి; వెండియున్= మరియును...

**తా :** అంతేకాదు, కౌరవులకు పాండవులకు మధ్య ఏర్పడిన యుద్ధంలో సాయపడి రాజులందరూ పరస్పరం మాత్సర్యంతో సేనల పాదఘట్టనలచేత భూచక్రం వణకిపోయేలా అసామాన్యములైన శంఖాలు, భేరీలు మొదలైన వాద్యాల ధ్వని ఆకాశాన్ని అంటుతుండగా, గుర్రాల డెక్కలనుండి ఏర్పడిన దుమ్ము సూర్యమండలాన్ని కప్పేసేలా వచ్చి, కురుక్షేత్రంలో యుద్ధానికి సిద్ధపడిన రెండువైపులవారిని చంపి, రాజ్యగర్వంతో మదమెక్కిన ఉన్మాది దుర్యోధనుని రాజులందరూ చూస్తూండగా కర్ణుడు, శకుని, దుశ్శాసనుడు మొదలైనవారి తప్పుడు మాటలు విని, నిరంతరం పాండవులకు కష్టాలను కలిగించిన పాపానికి పరిహారంగా సంగ్రామరంగంలో భీముని గదవేటుతో తొడలు విఱిగి, నేలమీద పడి, ఆయువు, సంపద,

వైభవం అన్నీ పోగొట్టుకొని కదలలేక మెదలలేక పడి ఉండగా చూచినపుడుగాని తనకు సంతోషం కలుగదని భావించాడు శ్రీకృష్ణుడు. మహాబాహుబలసంపన్నులైన భీష్మద్రోణులను, భీమార్జునులను రెండుపక్షాలలోను నిలబెట్టి, వారిచేత పదునెన్మిది అక్షౌహిణుల సేనను చంపించాడు. తనతో సమానబలవంతులైన యదువీరులను జయించడం ఇతరులకు సాధ్యం కాదు కనుక తప్పత్రాగి వారిలో వారికే వైరం పుట్టి, ఒకరినొకరు కొట్టుకొని చచ్చి అంతా తనలో కలిసేలా చేస్తే తప్ప భూభారం తగ్గదని ఆలోచించాడు. ధర్మరాజుచే నిష్కంటకంగా పవిత్రంగా రాజ్యపాలన చేయించాడు. మానవులకు అవశ్యాచరణీయములైన ధర్మమార్గాలను చూపించాడు. బంధుమిత్రులకు ఆనందాన్ని కలిగించాడు. పరోక్షంగా వారి వంశాన్ని నిలబెట్టేందుకు అభిమన్యుని భార్యయైన ఉత్తర గర్భాన్ని అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రం వల్ల విచ్ఛిన్నం కాకుండా కాపాడాడు. తన పాదపద్మాలను సేవించుటయందే ఆసక్తుడైన ధర్మరాజుచేత అతని కీర్తిప్రతాపాలు ప్రకాశించేలా మూడు అశ్వమేధయాగాలు చేయించాడు.

**సీ. వలనొప్ప లౌకికవైదికమార్గముల్ నడపుచు ద్వారకానగరమందు**
**నవిదితాత్మీయ మాయా ప్రభావమున నిస్సంగుఁడై యుండి సంసారిపగిదిఁ**
**జెంది కామంబులచేత విమోహితుం డై సుఖించుచు ముదితాత్ముఁడగుచు**
**నంచితస్నిగ్ధస్మితావలోకముల సుధాపరిపూర్ణసల్లాపములను**

**తే. శ్రీనికేతనమైన శరీరమునను, బాండునందనయదుకులప్రకరములను**
**లీలఁ గారుణ్య మొలయఁ బాలించుచుండె, నార్తరక్షాచణుండు నారాయణుండు. 131**

**ప్రతి :** ఆర్త= దీనులయొక్క; రక్షా= రక్షణమునందు; చణుండు= సమర్థుడైన; నారాయణుండు= శ్రీమహావిష్ణువు; శ్రీనికేతనమైన= సౌందర్యలక్ష్మీనిలయమైన; శరీరమునను= దేహముతో (శ్రీకృష్ణునిగా); వలను+ఒప్పన్= పద్ధతిప్రకారము; లౌకిక= ఇహసంబంధమైన; వైదిక= ఆధ్యాత్మికమైన; మార్గముల్= ఆచారములను; నడపుచున్= నిర్వహిస్తూ; ద్వారకానగరమందున్= ద్వారకాపట్టణంలో; అవిదిత= తెలియబడని; ఆత్మీయ= తనదైన; మాయాప్రభావమునన్= మాయామహత్త్వంతో; నిస్సంగుఁ డు+ఐ+ఉండి= ఏ కర్మలూ అంటనివాడై ఉండి కూడా; సంసారిపగిదిన్+చెంది= సామాన్య గృహస్థునివలె ధర్మాన్ని పొంది; కామంబులచేతన్= కోరికలతో; విమోహితుండు+ఐ= మోహపెట్టబడినవాడై; సుఖించుచున్= సౌఖ్యములను పొందుతూ; ముదిత+ఆత్ముఁడు+అగుచున్= ఆనందిస్తున్నవాడై; అంచిత= గొప్పదైన; స్నిగ్ధ= మనోజ్ఞమైన; స్మిత= చిరునవ్వుతో కూడిన; అవలోకములన్= చూపులతోను; సుధా= అమృతముతో; పరిపూర్ణ= పూర్తిగా నిండిన; సల్లాపములను= సంభాషణలతోను; పాండునందన= పాండవులయొక్క మరియు; యదుకుల= యాదవులయొక్క; ప్రకరములను= సముదాయములను; లీలన్= విలాసముగా; కారుణ్యము+ఒలయన్= దయ ఒప్పునట్లుగా; పాలించుచు+ఉండెన్= రక్షించుచుండెను.

**తా :** శ్రీహరి లక్ష్మీనివాసమైన శరీరంతో ప్రకాశిస్తూ, భక్తరక్షాదక్షుడై, ద్వారకానగరంలో జాగ్రత్తగా లౌకిక వైదిక ధర్మాలను ఆచరిస్తూ, తన మాయ ఇతరులకు తెలియకుండా సామాన్య సంసారిలాగా నిస్సంగుడై కూడా కోరికలకు వశమైనవానివలె సుఖాలను అనుభవిస్తూ పాండుకుమారులు మరియు యాదవులందరినీ చక్కని స్నేహంతోను, ఆనందాన్ని కలిగించే మాటలతోను అలరిస్తూ దయావంతుడై రక్షిస్తున్నాడు.

**సీ.** **సంపూర్ణ పూర్ణిమాచంద్రచంద్రిక నొప్పు రమణీయశారదరాత్రులందు**
**సలలితకాంచన స్తంభసౌధోపరిచంద్రకాంతోపలస్థలములందు**
**మహిత కరేణుకా మధ్య దిగ్గజముల గతిని, సౌదామనీ లతల నడిమి**
**నీలమేఘంబుల లీల, ముక్తా మధ్య లాలిత శక్ర నీలములభాతి**

**తే.** **సతతయౌవనసుందరీయుతవిహారుఁ డగుచు సతు లెంద ఱందఱ కన్ని రూప**
**ములను గ్రీడించెఁ బెక్కబ్దములు సెలంగి, నందనందనుఁ డభినవానందలీల.** **132**

**ప్రతి :** సంపూర్ణ= పూర్తిరూపము గల; పూర్ణిమా= పున్నమనాటి; చంద్ర= చంద్రునియొక్క; చంద్రికన్= వెన్నెలతో; ఒప్పు= ప్రకాశించే; రమణీయ= అందమైన; శారద= శరత్కాలమునాటి; రాత్రులందున్= రాత్రులలో; సలలిత= లాలిత్యము గల; కాంచన= బంగారముతో నిర్మింపబడిన; స్తంభ= స్తంభములతో కూడిన; సౌధ+ఉపరి= భవనముల పైభాగములలో; చంద్రకాంత+ఉపల= చంద్రకాంత శిలలను అమర్చిన; స్థలములందున్= నేలలపై; మహిత= గొప్పవైన; కరేణుకా= ఆడు ఏనుగుల; మధ్య= నడుమ ఒప్పు; దిగ్గజములగతినిన్= ఎనిమిది దిక్కులలో భూమిని మోసే దిగ్గజములవలెను; సౌదామనీ లతల= మెఱుపుతీగల; నడిమిన్= మధ్యభాగమున; నీలమేఘంబుల లీలన్= నల్లని మబ్బులవలెను; ముక్తామధ్య= ముత్యముల నడుమ; లాలిత= అందగించు; శక్రనీలములభాతిన్= ఇంద్రనీలమణులవలెను; సతత= ఎల్లప్పుడూ; యౌవన= ప్రాయమునందున్న; సుందరీయుత= అందగత్తెలతో కూడిన; విహారుఁడు+అగుచున్= విహారం కలవాడౌతూ; సతులు+ ఎందఱు= ఎంతమంది స్త్రీలు ఉన్నారో; అందఱకున్= అంతమందికి; అన్ని రూపములన్= అన్ని రూపాలతో; నందనందనుఁడు= నందుని కుమారుడైన కృష్ణుడు; పెక్కు+అబ్దములు= ఎన్నో సంవత్సరాలు; అభినవ+ఆనందలీలన్= నిత్యనూతనమైన ఆనందంతో; చెలంగి= ప్రవర్తించి; క్రీడించెన్= విహరించెను.

**తా :** శరత్కాలంలోని పున్నమరాత్రులలో, నిండుగా జాబిల్లి వెలుగుతూ కురిపించే వెన్నెలలో, బంగారపు స్తంభాలతో నిర్మించిన మేడల పైభాగంలో, చంద్రకాంతశిలలతో తయారైన తిన్నెలపై పదియారువేలమంది స్త్రీలతో పదియారువేల రూపాలను ధరించి క్రీడించాడు శ్రీకృష్ణుడు. అప్పుడు ఆయన ఆడు ఏనుగుల మధ్యనగల దిగ్గజాలవలె, మెఱుపుతీగల నడుమగల మేఘాలవలె, ముత్యాలనడిమి ఇంద్రనీలమణులవలె కనిపించాడు. ఇలా ఎన్నో సంవత్సరాలు నిత్యనూతనమైన ఆనందంతో క్రీడించాడు వాసుదేవుడు.

**వ.** **అంత నొక్కనాఁడు** **133**

**ప్రతి :** అంతన్+ఒక్కనాఁడు= అంతలో ఒకనాడు

**తా :** అలా శ్రీకృష్ణుడు నిత్యనూతనక్రీడాపరాయణుడై ఉండగా ఒకనాడు

**చ.** **మునివరు లేఁగుదేర యదుభోజవరేణ్యులు గూడి ముట్టఁ బ**
**ల్కినఁగనలొంది వారు దమకించి శపించినఁగొన్ని మాసముల్**
**సనునెడ దైవయోగమున జాతరఁబో సమకట్టి వేడుకల్**
**మనములఁదొంగలింప గరిమన్ నిజయానము లెక్కి యాదవుల్.** **134**

**ప్రతి :** మునివరులు= మునీశ్వరులు; ఏఁగుదేరన్= ద్వారకానగరానికి రాగా; యదుభోజవరేణ్యులు= యదుభోజవంశాలకు చెందినవారు; కూడి ముట్టన్+పల్కినన్= చెంతచేరి నొప్పించే మాటలు మాట్లాడగా; వారు= ఆ మునులు; కనలు+ ఒంది= కోపగించి; తమకించి= తొందరపడి; శపించినన్= శాపం ఇవ్వగా; కొన్ని మాసముల్= కొన్ని నెలలు; చను+ఎడ= గతించగా; దైవయోగమునన్= విధివశమున; జాతరన్= ఉత్సవము పేరుతో; పోన్ సమకట్టి= బయలుదేర నిశ్చయించి; వేడుకల్= వినోదాలు; మనములన్= చిత్తములలో; తొంగలింపన్= అతిశయించగా; గరిమన్= గొప్పగా; యాదవుల్= యాదవులందరూ; నిజయానములు+ఎక్కి= తమ తమ వాహనాలను అధిరోహించి...

**తా :** ఒకనాడు ద్వారకానగరానికి మునివరులు వచ్చారు. అక్కడ యాదవపౌరులు కొందరు వారి దగ్గరకు వెళ్లి ఎత్తిపొడుపు మాటలతో ఆటపట్టించారు. వారు కోపించి శపించారు. ఆ శాపప్రభావంతో కొన్ని నెలల తరువాత యాదవులందరూ విధిప్రేరణవల్ల పెద్ద జాతర చేయడానికి ప్రయత్నించారు. వినోదాలు మనసులలో అతిశయించగా తమ తమ వాహనాలెక్కి జాతరకోసం ప్రయాణమైనారు.

**ఉ. కోరి ప్రభాసతీర్థమునకుం జని తన్నదిఁగ్రుంకి నిర్మలో**
**దారత నందు దేవమునితర్పణముల్ పితృతర్పణంబులున్**
**వారని భక్తిఁజేసి నవవత్సలతోఁబొలుపారు గోవులన్**
**భూరిసదక్షిణాకముగ భూసురకోటికి నిచ్చి వెండియున్. 135**

**ప్రతి :** కోరి= కోరికతో; ప్రభాసతీర్థమునకున్= ప్రభాసము అను పేరుగల తీర్థక్షేత్రానికి; చని= వెళ్లి; తద్+నదిన్= అక్కడి నదిలో; క్రుంకి= మునిగి; నిర్మల+ఉదారతన్= స్వచ్ఛమైన ఔదార్యంతో; అందున్= ఆ నదియందే; దేవ= దేవతలకోసం; ముని= మునులకోసం; తర్పణముల్= జలతర్పణములు; పితృతర్పణంబులున్= అలాగే పితృదేవతలకోసం తర్పణాలు; వారని భక్తిన్= మిక్కుటమైన భక్తితో; చేసి= నిర్వహించి; నవవత్సలతోన్= లేతదూడలతో; పొలుపారు= ఒప్పుచున్న; గోవులన్= ఆవులను; భూరిసదక్షిణాకముగన్= విశేషమైన దక్షిణలతో పాటుగా; భూసురకోటికిన్= ఎందరో బ్రాహ్మణులకు; ఇచ్చి= దానముచేసి; వెండియున్= మరియును...

**తా :** యాదవులంతా ప్రభాసతీర్థానికి వెళ్లారు. అక్కడ ఆ నదిలో స్నానం చేశారు. అరమరికలు లేని ఔదార్యంతో దేవతలకు, మునులకు తర్పణాలు విడిచిపెట్టారు. అపారమైన భక్తితో లేగదూడలతో కూడిన గోవులను విశేషమైన దక్షిణలతోపాటుగా ఎందరో బ్రాహ్మణులకు దానం చేశారు.

**క. అజినపటరత్నకంబళ, రజత మహారజతతిలధరావరకన్యా**
**గజతురగరథములను స, ద్ద్విజకోటికి నిచ్చి పెంపు దీపింపంగన్. 136**

**ప్రతి :** అజిన= జింక చర్మాలు; పట= వస్త్రాలు; రత్నకంబళ= రత్నములు పొదిగిన కంబళ్లు; రజత= వెండి; మహారజత= బంగారము; తిల= నువ్వులు; ధరా= భూములు; వరకన్యా= చక్కని కన్నెలు; గజ= ఏనుగులు; తురగ= గుర్రములు; రథములను= తేరులను; సత్+ద్విజకోటికిన్= శ్రోత్రియబ్రాహ్మణులకు; పెంపు దీపింపంగన్= తమ గొప్పతనానికి వెలుగు కలిగించేట్లుగా; ఇచ్చి= దానంచేసి...

**తా :** నదీస్నానం, దేవ ముని తర్పణాలు చేసి, గోదానం చేసి, ఇంకా జింకచర్మాలు, వస్త్రాలు, రత్నాలు పొదిగిన కంబళ్లు, వెండి, బంగారం, నువ్వులు, భూములు, కన్నెలు, ఏనుగులు, గుర్రాలు, రథాలవంటివాటిని తమ తమ శక్తికి ఏమాత్రం తగ్గకుండగా యాదవులు సద్బ్రాహ్మణులకు దానం చేశారు.

**విశే :** ఈ దానాలలో షోడశ మహాదానాలుగా ప్రసిద్ధి చెందినవానిలో అనేకం ఉన్నాయి. గోదానం, భూదానం, తిలదానం, హిరణ్యదానం, రత్నదానం, విద్యాదానం, కన్యాదానం, దాసీదానం, శయ్యాదానం, గృహదానం, అగ్రహారదానము, రథదానం, గజదానం, అశ్వదానం, ఛాగదానం, మహిషీదానం, ఇవి షోడశదానాలు.

**వ. ఇట్లు సఫలంబు లయిన భూదానంబు మొదలుగాఁ గల దానంబు లనూనంబులుగా భగవదర్పణబుద్ధిం జేసి యనంతరంబ. 137**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; సఫలంబులు+అయిన= పంటలతోకూడిన; భూదానంబు= భూమిదానం; మొదలుగాన్+కల= మొదలైనవాటితో కూడిన; దానంబులు= దానాలు; అనూనంబుగా= విరివిగా; భగవత్+అర్పణబుద్ధిన్= భగవంతునికే సమర్పిస్తున్నామనే భావంతో చేసి; అనంతరంబు+అ= తరువాత.

**తా :** ఈ విధంబుగా పంటలతోకూడిన భూమి మొదలైనవాటిని చాల ఎక్కువగా భగవంతునకు సమర్పిస్తున్నామన్న భావంతో దానాలు చేశారు.

**తే. ఎసఁగు మోదంబు సంధిల్ల నిష్టమైన, రసికమృదులాన్న మర్థిఁబారణలు సేసి**
**మంజులాసవరసపానమత్తు లగుచుఁ, గడఁగి యన్యోన్యహాస్యవాక్యములఁ గలఁగి. 138**

**ప్రతి :** ఎసఁగు మోదంబు= అతిశయించిన ఆనందం; సంధిల్లన్= ఏర్పడగా; ఇష్టమైన= నచ్చిన; రసికమృదుల+అన్నము= కమ్మని విందుభోజనము; అర్థిన్= కోరికతో; పారణలు+చేసి= ఆరగించి; మంజుల= మనోహరమైన; ఆసవరస= మద్యమును; పాన= త్రాగుటచే; మత్తులు+అగుచున్= ఒడలు తెలియనివారై; కడఁగి= పూనుకొని; అన్యోన్య= పరస్పరం; హాస్యవాక్యములన్= వెక్కిరింత మాటలతో; కలఁగి= కలతపడి (కలతపడ్డారు).

**తా :** అలా దానధర్మాలు చేసిన తరువాత హాయిగా విందుభోజనం చేశారు. ఇష్టమైన మద్యాన్ని కుత్తుకబంటిగా సేవించి మత్తుగలవారైనారు. సరదాగా ఒకరినొకరు ఆటపట్టించుకుంటూ ఛలోక్తులు విసరుకున్నారు. ఆయా మాటలచే కొందరు నొచ్చుకున్నారు.

**వ. ఇట్లు దమలోన మదిరాపాన మద విఘూర్ణిత తామ్రలోచనులై మత్సరంబుల నొండొరులం బొడిచి సమస్త యాదవులును వేణు జాతానలంబునఁ దద్వంశపరంపరలు దహనంబు నొందుచందంబునం బొలిసి; రది యంతయుంగనుంగొని శ్రీకృష్ణుం డప్పుడు. 139**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; తమలోనన్= వారిలోవారు; మదిరాపాన= మద్యపానముచేతనైన; మద= ఒడలెరుగని స్థితివలన; విఘూర్ణిత= తిరుగుడు పడిన; తామ్రలోచనులు+ఐ= ఎర్రబడిన కళ్లు కలవారై; మత్సరంబులన్= మాత్సర్యస్వభావాలతో; ఒండు+ఒరులన్= ఒకరినొకరు; పొడిచి= కొట్టుకొని; సమస్తయాదవులును= యదువంశం వారందరు; వేణుజాత+అనలంబునన్= వెదురుపొదలో పుట్టిన అగ్నిచేత; తద్+వంశపరంపరలు= మిగిలిన వెదురుపొదలన్నియు;

దహనంబున్+ఒందు= కాలిపోవు; చందంబునన్= విధముగా; పొలిసిరి= మరణించిరి; అది+అంతయున్= ఆ వ్యవహారమంతా; కనుంగొని= కన్నులార చూచి; అప్పుడు= ఆ సమయంలో; శ్రీకృష్ణుండు= వాసుదేవుడు...

**తా :** ఈ విధంగా మధుపానంవల్ల ఎఱ్ఱబడ్డ కళ్లతో ఒళ్లు తెలియని స్థితిలో ఒకరినొకరు కొట్టుకొన్నారు. వెదురు పొదలలో పుట్టిన అగ్నివల్ల ఆ వెదురుపొద దగ్ధమైపోయినట్లు వారిలో వారికే కలహం ఏర్పడి వారంతా నశించిపోయారు. ఆ వ్యవహారమంతా శ్రీకృష్ణుడు గమనించాడు.

**క. చతురతతో నిజమాయా, గతిఁ జూచి లసద్విలోలకల్లోలసమం**
**చితవిమలకమలసార, స్వత జలముల విహితవిధులు సలిపినవాఁడై. 140**

**ప్రతి :** చతురతతోన్= నేర్పుతో; నిజ= తనయొక్క; మాయాగతిన్= మాయావిలాసాన్ని; చూచి= గమనించి; లసత్= ప్రకాశించు; విలోల= చలనములతోకూడిన; కల్లోల= తరంగములతో; సమంచిత= ఒప్పిదమైన; విమల= స్వచ్ఛమైన; కమల= పద్మములు కలిగిన; సారస్వత= సరస్వతీ నదియొక్క; జలములన్= నీటితో; విహిత విధులు= ఉత్తరక్రియలు; సలిపినవాఁడు+ఐ= నిర్వహించినవాడై...

**తా :** యాదవులందరూ అలా పరస్పర కలహంతో చనిపోవడం చాతుర్యంతోకూడిన తన మాయావిలాసంగా గమనించి, తరువాత అందమైన తరంగాలతో, స్వచ్ఛమైన పద్మాలతో ప్రకాశించే సరస్వతీనదీ జలాలతో చనిపోయినవారందరికీ విధివిధానాన్ని అనుసరించి తర్పణాలు విడిచిపెట్టాడు శ్రీకృష్ణుడు.

**క. ఒక వృక్షమూలతలమున, నకలంక గుణాభిరాముఁ డాసీనుండై**
**యకుటిలమతి బదరీవన, ముకు ననుఁబొమ్మనుచు మొఱఁగి పోయిన నేనున్. 141**

**ప్రతి :** అకలంక గుణ+అభిరాముఁడు= మచ్చలేని గుణములచేత మనోహరుడైన శ్రీకృష్ణుడు; అకుటిలమతిన్= స్వచ్ఛమైన మనస్సు కలవాడై; ఒక వృక్షమూల తలమునన్= ఒకానొక చెట్టు మొదట; ఆసీనుండు+ఐ= కూర్చున్నవాడై; ననున్= నన్ను (ఉద్ధవుని); బదరీవనముకున్= బదరీవనానికి; పొమ్ము+అనుచున్= వెళ్లిపొమ్మని చెపుతూ; మొఱఁగిపోయినన్= తాను (శ్రీకృష్ణుడు) ఎటో వెళ్లిపోగా; నేనున్= నేనుకూడ (ఉద్ధవుడు)...

**తా :** మచ్చలేని గుణాలతో అందరి మనసులను ఆకర్షించే శ్రీకృష్ణుడు ప్రశాంతమనస్కుడై ఒకచెట్టుమొదట కూర్చుని, నన్ను బదరీవనానికి వెళ్లిపొమ్మని చెప్పి, నాకు తెలియకుండా ఎక్కడికో వెళ్లిపోయాడని ఉద్ధవుడు విదురునితో పలికాడు.

**క. క్రమమున నిజకుల సంహా, రము సేయఁగడంగు టెఱిఁగి రమణీయ శ్రీ**
**రమణు చరణాబ్జయుగ విర, హమునకు మది నోర్వలేక యనుగమనుఁడనై. 142**

**ప్రతి :** క్రమమునన్= నెమ్మదిగా; నిజకులసంహారము= తనవంశ నిర్మూలనం; చేయన్= చేయుటకు; కడంగుట= పూనుకొనుట (శ్రీకృష్ణుని పూనికను); ఎఱిఁగి= గ్రహించి; రమణీయ= సుందరమైన; శ్రీరమణు= శ్రీకృష్ణునియొక్క చరణ+అబ్జ= పాదపద్మముల; యుగ= జంటనుండి; విరహమునకున్= ఎడబాటునకు; మదిన్= మనస్సునందు; ఓర్వలేక= సహించలేక; అనుగమనుఁడను+ఐ= అడుగుజాడలను అనుసరించి పోయినవాడనై...

**తా :** ఉద్ధవుడు చెపుతున్నాడు. శ్రీకృష్ణుడు అలా నాకు తెలియకుండా ఎక్కడికో వెళ్లిపోయాడంటే నెమ్మదిగా తన వంశాన్ని సమాప్తం చేసే సంకల్పంలో ఉన్నాడని గ్రహించాను. ఆ స్వామి అందమైన పాదపద్మాలను విడిచి ఉండలేక నేనుకూడా ఆయన అడుగుజాడలను అనుసరించి బయలుదేరాను.

**క. హరి నరయుచుఁజని చని యొక, తరుమూలతలంబునందుఁదన దేహరుచుల్**
**పరఁగఁగ నున్న మహాత్మునిఁ, బరునిఁ బ్రపన్నార్తిహరుని భక్తవిధేయున్. 143**

**ప్రతి :** హరిన్= శ్రీకృష్ణుని; అరయుచున్= వెదుకుతూ; చని చని= వెళ్లి వెళ్లి; ఒక= ఒకానొక; తరుమూల తలంబునందున్= చెట్టు మొదలుండే ప్రదేశములో; తన= తనయొక్క; దేహరుచుల్= శరీరకాంతులు; పరఁగఁగన్= ప్రసరించుచుండగా; ఉన్న= ఒప్పుచున్న; మహాత్మునిన్= మహానుభావుడు; పరునిన్= పరమాత్మ స్వరూపుడు; ప్రపన్న= ఆశ్రయించినవారి; ఆర్తి= కష్టములను; హరునిన్= పోగొట్టెడివాడు; భక్తవిధేయున్= భక్తులకు వశమై ఉండెడివాడు ఐన శ్రీకృష్ణుని చూచితిని...

**తా :** ఉద్ధవుడు చెపుతున్నాడు. నేను స్వామిని వెదకుతూ వెళ్లి వెళ్లి ఎక్కడో దూరంలో తన శరీరకాంతులతో చుట్టుప్రక్కల ప్రదేశాన్ని తేజోమయం చేస్తున్నవాడు, మహానుభావుడు, పరమాత్మస్వరూపుడు, ఆశ్రయించినవారి కష్టాలను రూపుమాపేవాడు, భక్తులకు వశవర్తిగా ఉండేవాడు అయిన శ్రీకృష్ణుడు ఒకానొక చెట్టుమొదట కూర్చుని ఉండగా చూచాను.

**వ. మఱియును. 144**

**తా :** అంతే కాకుండా

**సీ. అస్మత్ప్రియస్వామి నచ్యుతుఁ బరు సత్త్వగుణగరిష్ఠుని రజోగుణవిహీను**
**సురుచిరద్వారకాపురసమాశ్రయు ననాశ్రయు నీలనీరదశ్యామవర్ణు**
**దళదరవిందసుందరపత్రనేత్రు లక్ష్మీయుతుఁబీత కౌశేయవాసు**
**విలసితవామాంకవిన్యస్తదక్షిణ చరణారవిందు శశ్వత్ప్రకాశు**

**తే. ఘనచతుర్బాహు సుందరాకారు ధీరుఁ, జెన్నుగల లేఁత రావిపై వెన్ను మోపి**
**యున్న వీరాసనాసీను నన్నుఁ గన్న, తండ్రి నానంద పరిపూర్ణు దనుజహరుని. 145**

**ప్రతి :** అస్మత్ ప్రియస్వామిన్= నాకు (ఉద్ధవునికి) ఇష్టుడైన ప్రభువు; అచ్యుతున్= జారుపాటు లేనివాడు; పరున్= పరమాత్మ స్వరూపుడు; సత్త్వగుణ గరిష్ఠునిన్= ప్రశాంతతనిచ్చు సత్త్వగుణముచేత గొప్పవాడైనవాడు; రజోగుణవిహీనున్= ఉద్రేకాన్ని కలిగించు రజోగుణము లేనివాడు; సురుచిర= అందమైన; ద్వారకాపుర= ద్వారకానగరమును; సమాశ్రయున్= ఆశ్రయించినవాడు; అనాశ్రయున్= ఎవరినీ ఆశ్రయింపనివాడు; నీల= నల్లనైన; నీరద= మేఘమువలె; శ్యామవర్ణున్= నల్లని శరీరకాంతి గలవాడు; దళత్= వికసించుచున్న; అరవింద= పద్మములయొక్క; సుందర= అందమైన; పత్రనేత్రున్= రేకులవంటి కన్నులు కలవాడు; లక్ష్మీయుతున్= తేజస్సుతో కూడినవాడు; పీత= పచ్చని; కౌశేయవాసున్= పట్టువస్త్రము గలవాడు; విలసిత= ప్రకాశించుచున్న; వామ+అంక= ఎడమతొడపై; విన్యస్త= ఉంచిన; దక్షిణ= కుడి; చరణ+అరవిందున్= పాదపద్మము కలవాడు; శశ్వత్ ప్రకాశున్= ఎల్లప్పుడూ ప్రకాశించేవాడు; ఘన చతుర్బాహున్= బలిష్ఠములైన నాలుగు భుజములు కలవాడు; సుందర+ఆకారున్= అందమైన రూపం కలవాడు; ధీరున్= గంభీరుడు; చెన్నుగల= అందమైన; లేఁ

త రావిపైన్= లేత రావిచెట్టునకు; వెన్నున్ మోపి+ఉన్న= తన వీపు ఆన్చి కూర్చున్న; వీర+ఆసన+ఆసీనున్= వీరాసనము వేసికొని ఉన్న; ఆనంద పరిపూర్ణున్= ఆనందముతో నిండియుండువాడు; దనుజహరునిన్= రాక్షసులను చంపువాడు; నన్నున్+కన్న తండ్రిన్= నా కన్న తండ్రియు; ఐన కృష్ణుని...

**తా :** ఉద్ధవుడు చెపుతున్నాడు. నాకు మిక్కిలి ఇష్టుడు, సత్యధర్మాలలో జారుపాటు లేనివాడు, పరమాత్మ స్వరూపుడు, సత్త్వగుణంతో ప్రశాంతంగా ఉండేవాడు, ఉద్రేకాన్నిచ్చే రజోగుణం లేనివాడు, అందమైన ద్వారకలో ఉండేవాడు, ఎవరైనా తనను ఆశ్రయించడమే తప్ప తానుగా ఎవరినీ ఆశ్రయించనివాడు, నీలమేఘచ్ఛాయగల దేహమువాడు, అప్పుడే వికసించిన తామర రేకులవలె అందమైన కన్నులు కలవాడు, తేజోవిరాజితుడు, పచ్చని పట్టువస్త్రం ధరించినవాడు, ఎడమతొడపై ఉంచిన కుడిపాదపద్మం గలవాడు, గంభీరుడు, వీరాసనంతో లేత రావిచెట్టును ఆనుకొని కూర్చున్నవాడు, ఆనందమే తప్ప విచారం తెలియనివాడు, రాక్షససంహారి అయిన నా కన్నతండ్రి (శ్రీకృష్ణుని చూచాను).

**మత్త. కంటిఁగంటి భవాబ్ధి దాఁటఁగఁగంటి నాశ్రితరక్షకుం**
**గంటి యోగిజనంబు డెందముఁగంటిఁ జుట్టముఁగంటి ము**
**క్కంటికింగనరాని యెక్కటిఁగంటి దామరకంటిఁ జే**
**కొంటి ముక్తినిధానముందలకొంటి సౌఖ్యము లందఁగన్. 146**

**ప్రతి :** కంటిన్+కంటిన్= చూచాను చూచాను శ్రీకృష్ణుని (ద్విరుక్తి ఆనందాతిశయ సూచకం); భవ+అబ్ధిన్= సంసారమనే సముద్రాన్ని; దాఁటఁగన్= తరించుటకు; కంటిన్= నోచుకొంటిని; ఆశ్రితరక్షకున్= శరణన్నవారిని కాపాడేవానిని; కంటిన్= దర్శించాను; యోగిజనంబు= మునిజనముయొక్క; డెందమున్= హృదయాన్ని (యోగిజనుల గుండెలలో కొలువుండేవానిని); కంటిన్= సందర్శించాను; చుట్టమున్+కంటిన్= ఆత్మబంధువును దర్శించాను; ముక్కంటికిన్= మూడుకన్నులు కల శివునికికూడా; కనరాని= దర్శింపశక్యము కాని; ఎక్కటిన్= ఒకే ఒక్కడైనవానిని; కంటిన్= తిలకించాను; తామరకంటిన్= పద్మములవంటి నేత్రములు కలవానిని; చేకొంటిన్= చేపట్టాను; సౌఖ్యములు+అందఁగన్= సుఖములు పొందునట్లుగా; ముక్తినిధానమున్= మోక్షనిధిని (ముక్తినందించువానిని); తలకొంటిన్= అందుకొన్నాను.

**తా :** చూచాను, చూచాను. సంసారసాగరాన్ని తరించే స్థితిని పొందాను. ఆశ్రితరక్షకుని, యోగిజనుల గుండెలలో కొలువుండేవానిని, పరమేశ్వరుడుకూడా దర్శించలేని మహానుభావుని, కమలాక్షుని, ముక్తిప్రదాతను సందర్శించగలిగాను.

**వ. అయ్యవసరంబునం బరమ భాగవతోత్తముండును, మునిజన సత్తముండును, ద్వైపాయన సఖుండును, మహాయోగిప్రముఖుండును, నఘశూన్యుండును, నఖిలజనమాన్యుండును, బుధజనవిధేయుండును నగు మైత్రేయుండు తీర్థాచరణంబు సేయుచుం జని చని. 147**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; పరమభాగవత+ఉత్తముండును= మహాభాగవతశ్రేష్ఠుడును; మునిజనసత్తముండును= మునిజనశ్రేష్ఠుడును; ద్వైపాయనసఖుండును= వ్యాసమహర్షి స్నేహితుడును; మహాయోగిప్రముఖుండును= మహాయోగులలో ముఖ్యుడును; అఘశూన్యుండును= పాపరహితుడును; అఖిలజన మాన్యుండు= అందరిచేత పూజింపబడువాడు; బుధజనవిధేయుండును= జ్ఞానులయెడ వినయంగా ఉండేవాడును; అగు మైత్రేయుండు= అయిన మైత్రేయమహర్షి; తీర్థ+ఆచరణంబు= తీర్థయాత్రా పర్యటనం; చేయుచున్+చని చని= చేస్తూ నడచి, నడచి...

**తా :** విదురా! నేను శ్రీకృష్ణుని దర్శించి ఆ ఆనందంలో ఉండగా అదే సమయంలో పరమ భాగవతోత్తముడు, మునిశ్రేష్ఠుడు, వ్యాసునికి మిత్రుడు, మహాయోగులలో ముఖ్యుడు, పాపరహితుడు, అందరిచేత గౌరవింపబడేవాడు, పండితులకు విధేయుడుగా ఉండేవాడు అయిన మైత్రేయుడు తీర్థయాత్రలు చేస్తూ అక్కడికి వచ్చాడు.

**మ. కనియెం దాపసపుంగవుం డఖిలలోకఖ్యాతవర్ధిష్ణు శో**
**భన భాస్వత్పరిపూర్ణ యౌవనకళాభ్రాజిష్ణు యోగీంద్ర హృ**
**ద్వనజాతైకచరిష్ణుఁ గౌస్తుభముఖోద్యద్భూషణాలంకరి**
**ష్ణు నిలింపాహితజిష్ణు విష్ణుఁ బ్రభవిష్ణుం గృష్ణు రోచిష్ణునిన్. 148**

**ప్రతి :** అఖిలలోక= ముల్లోకాలలోను; ఖ్యాత= ప్రఖ్యాతుడు; వర్ధిష్ణున్= అభ్యుదయాన్ని పొందేవాడు; శోభన= శోభతో; భాస్వత్= ప్రకాశించే; పరిపూర్ణ= నిండైన; యౌవనకళా= యౌవనవిస్ఫూర్తితో; భ్రాజిష్ణున్= ప్రకాశించువాడు; యోగి+ఇంద్ర= మునిశ్రేష్ఠులయొక్క; హృద్వనజాత+ఏక= హృదయపద్మములయందే; చరిష్ణున్= సంచరించువాడు; కౌస్తుభముఖ= కౌస్తుభము మొదలైన; ఉద్యద్ భూషణ= గొప్ప నగలను; అలంకరిష్ణున్= అలంకరించుకొనువాడు; నిలింప= దేవతలకు; అహిత= శత్రువులైన రాక్షసులను; జిష్ణున్= జయించువాడు; విష్ణున్= సర్వత్ర వ్యాపించి ఉండువాడు; ప్రభవిష్ణున్= అంతటా కాంతిని విరజిమ్మినవాడు; రోచిష్ణున్= ప్రకాశించువాడు అయిన; కృష్ణున్= శ్రీకృష్ణుని; తాపసపుంగవుండు= మునిశ్రేష్ఠుడైన మైత్రేయుడు; కనియెన్= దర్శించెను.

**తా :** తీర్థయాత్రలు చేస్తూ అక్కడికి వచ్చిన తపోగరిష్ఠుడైన మైత్రేయుడు కీర్తిమంతుడు, కాంతిమంతుడు, నిత్యయౌవనుడు, యోగిజనమానస పద్మాలలో విహరించేవాడు, కౌస్తుభాది దివ్యాభరణాలు ధరించేవాడు, రాక్షసశిక్షకుడు, సర్వాంతర్యామి, అంతటా కాంతిని వెదజల్లినవాడు, తేజోమూర్తి అయిన శ్రీకృష్ణుని దర్శించాడు.

**క. తదనంతరంబ హరిఁ దన, హృదయాబ్జమునందు ముకుళితేక్షణముల స**
**మ్మదమునఁజూచుచు నానత, వదనుండై యుండె ముదము వఱలఁగ ననఘా! 149**

**ప్రతి :** అనఘా= పాపరహితుడవైన విదురా!; తద్+అనంతరంబ= అటుతరువాత; హరిన్= శ్రీకృష్ణుని; ముకుళిత+ ఈక్షణములన్= మూసికొన్న కన్నులు గలవాడై; తన= తనయొక్క; హృదయ+అబ్జమునందున్= పద్మంవంటి హృదయంలో; సమ్మదమునన్= ఆనందంతో; చూచుచున్= దర్శిస్తూ; ముదము వఱలఁగన్= సంతోషము అతిశయించునట్లుగా; ఆనత వదనుండు+ఐ= వినయంతో తల వంచుకొనినవాడై; ఉండెన్= ఉండెను.

**తా :** శ్రీకృష్ణుని దర్శించిన మైత్రేయుడు అటుపైని కన్నులు మూసికొని తన హృదయంలోనే స్వామిని దర్శించగలిగాడు. అలా దర్శించుటవల్ల ఎనలేని ఆనందాన్ని పొంది, తలవంచుకొని ఉన్నాడు.

**వ. అంత డగ్గఱ నేతెంచి యున్న మైత్రేయుండు వినుచునుండ దరహాస చంద్రికా సుందర వదనార విందుండును, నానంద సుధానిష్యంద కందళిత హృదయుండును, భక్తానురక్త దయాసక్త విలోకనుండును నగు పుండరీకాక్షుండు నన్ను నిరీక్షించి యిట్లని యానతిచ్చె; పూర్వభవంబున వసుబ్రహ్మలు సేయు సత్త్రయాగంబున వసువై, భవదీయహృదయంబున నితర పదార్థంబులు గోరక మదీయపాదారవిందసేవం గాంక్షించితివి, కావునం**

**దన్నిమిత్తంబున నేను నీ హృదయంబున వసియించి సమస్తంబును గనుచుందుదు; నాత్మారాముండ నైన నన్ను నెవ్వరేని సదసద్వివేకులై యెఱుంగంజాలరు వారలకు నేను నగోచరుండనై యుండుదు; మత్పరిగ్రహంబు గల నీకు నీజన్మంబ కాని పునర్భవంబు నొంద కుండుటకు భవదీయ పూర్వజన్మకృత సుకృత విశేషంబు కతంబున నియ్యాశ్రమంబున మత్పాదారవింద సందర్శనంబు గలిగె; నదియునుంగాక పద్మకల్పంబునందు మన్నాభి పద్మ మధ్య నిషణ్ణుం డయిన పద్మసంభవునకు జన్మమరణాది సంసృతి నివర్తకంబును నవిరతానశ్వర సౌఖ్యప్రవర్తకంబును నగు మన్మహత్త్వంబుఁ దెలియం జేసితి నట్టి దివ్యజ్ఞానంబు నీకు నెఱింగింతు నని య మ్మహనీయ తేజోనిధి యానతిచ్చిన సుధాసమాన సరసాలాపంబులు కర్ణకలాపంబులై మనస్తాపంబులం బాపిన రోమాంచ కంచుకిత శరీరుండును, నానంద బాష్పధారా సిక్త కపోలుండును, బరితోష సాగరాంతర్నిమగ్న మానసుండును నయి యంజలిపుటంబు నిటలతటంబున ఘటియించి యిట్లంటి. 150**

**ప్రతి :** అంతన్= మైత్రేయుడు శ్రీకృష్ణుని దర్శించి ఆనంద పరవశుడై ఉండగా; దగ్గఱన్= సమీపానికి; ఏతెంచి+ఉన్న= చేరియున్న; మైత్రేయుండు= మైత్రేయమహర్షి; వినుచు+ఉండన్= వినుచుండగా; దరహాస= నగవులనెడి; చంద్రికా= వెన్నెలచేత; సుందర= అందగించిన; వదన+అరవిందుండును= ముఖపద్మం కలవాడును; ఆనంద= ఆనందమనెడి; సుధా= అమృతముయొక్క; నిష్యంద= స్రవించుటచేత; కందళిత= వికసించిన; హృదయుండును= హృదయము కలవాడును; భక్త= భక్తులయందు; అనురక్త= అనురాగముతోకూడిన; దయా= కరుణతో; ఆసక్త= కూడియున్న; విలోకనుండును= చూపులు కలవాడును; అగు పుండరీక+అక్షుండు= అయిన శ్రీకృష్ణుడు; నన్నున్+నిరీక్షించి= ఉద్ధవుడనగు నన్ను చూచి; ఇట్లని+ఆనతి+ఇచ్చెన్= ఈ విధముగా ఆదేశించెను; పూర్వభవంబునన్= పూర్వజన్మలో; వసుబ్రహ్మలు+చేయు= వసువులు బ్రహ్మ కలిసి చేయు; సత్త్రయాగంబునన్= సత్త్రము అనుపేరు గల యాగమునందు; వసువు+ఐ= నీవొక వసువువై; భవదీయ హృదయంబునన్= నీ మనస్సులో; ఇతర పదార్థంబులు= వేరు వేరు ద్రవ్యములను; కోరక= ఆశించక; మదీయ పాద+అరవిందసేవన్= నా పాదపద్మాల సేవను; కాంక్షించితివి= కోరుకొంటివి; కావునన్= అందువలన; తద్+ నిమిత్తంబునన్= ఆ కారణముగా; నేను= కృష్ణుడనైన నేను; నీ హృదయంబునన్= ఉద్ధవుడవైన నీ మనస్సులో; వసియించి= నివసించి; సమస్తంబునున్= సర్వమును; కనుచుండుదున్= చూస్తుంటాను; ఆత్మ+ఆరాముండను+ఐన= ఆత్మయే విహారవనంగా కలిగిన; నన్నున్= శ్రీహరినైన నన్ను; ఎవ్వరేనిన్= ఎవరైనా; సత్+అసత్+వివేకులు+ఐ= సత్తు అసత్తులకు సంబంధించిన జ్ఞానం కలిగికూడా; ఎఱుంగన్+చాలరు= తెలిసికోలేరు; వారలకున్= అట్టివారికి; నేనున్= నేను; అగోచరుండను+ఐ+ ఉండుదున్= దర్శింపశక్యము కానివాడుగా ఉందును; మత్+పరిగ్రహంబు+కల= నా ప్రియస్వీకరణము కల; నీకున్+ఈ జన్మంబు+అని= నీకు ఈ జన్మయే తప్ప; పునర్+భవంబున్= మరల పుట్టుకను; ఒందక+ఉండుటకున్= పొందకుండా ఉండేందుకు; భవదీయ= నీయొక్క; పూర్వజన్మ కృత= గతజన్మలో చేయబడిన; సుకృతవిశేషంబు= పుణ్యవిశేషముయొక్క; కతంబునన్= కారణముగా; ఈ+ఆశ్రమంబునన్= ఈ ఆశ్రమంలో; మత్+పాద+అరవింద సందర్శనంబు= నా పాదపద్మాలను దర్శించగలుగుట; కలిగెన్= ఏర్పడినది; అదియునున్+కాక= అంతేగాక; పద్మకల్పంబునందున్= పద్మమను పేరుగల కల్పంలో; మత్+నాభిపద్మమధ్యనిషణ్ణుండు= నా బొడ్డుతామరనడుమ ఆవిర్భవించినవాడైన; పద్మసంభవునకున్= బ్రహ్మకు; జన్మ= పుట్టుక; మరణ+ఆది= గిట్టుట మొదలగు; సంసృతి= సంసారమును; నివర్తకంబును= మరల్చునదియును; అవిరత= ఎడతెగని; అనశ్వర= నాశము లేని; సౌఖ్యప్రవర్తకంబును= సుఖమును కలిగించునదియును; అగు

మత్+మహత్త్వంబున్= అయిన నా మాహాత్మ్యాన్ని; తెలియన్+చేసితిని= ఎఱుకపరచితిని; అట్టి దివ్యజ్ఞానంబున్= అటువంటి దివ్యమైన జ్ఞానాన్ని; నీకున్+ఎఱింగింతున్= నీకు తెలియజేస్తాను; అని= అంటూ; ఆ+మహనీయ తేజస్+నిధి= గొప్పకాంతికి నిలయుడైన ఆ శ్రీహరి; ఆనతి+ఇచ్చినన్= తెలియజేయగా; సుధాసమాన సరస+ఆలాపంబులు= అమృతసమానములయిన రసవంతములైన పలుకులు; కర్ణకలాపంబులు+ఐ= చెవులకు అలంకారములై; మనస్+తాపంబులన్+పాపినన్= మానసిక తాపాలను పోగొట్టగా; రోమాంచ= వెంద్రుకలు నిక్కబొడుచుటచే; కంచుకిత= కవచము తొడిగినట్లయిన; శరీరుండును= శరీరము కలవాడును; ఆనందబాష్పధారా= సంతోషమువలన ఏర్పడిన కన్నీటిధారతో; సిక్త కపోలుండును= తడిసిన చెక్కిళ్లు కలవాడును; పరితోష= ఆనందమనెడి; సాగర= సముద్రముయొక్క; అంతర్+నిమగ్న= లోపల మునిగిన; మానసుండను+అయి= మనసు కలవాడనునై; అంజలిపుటంబు= దోయిలిని; నిటలతటంబునన్= నెన్నుదుట; ఘటియించి= చేర్చి; ఇట్లు+అంటిన్= ఈ విధంగా అన్నాను.

**తా :** ఆ విధంగా తనను చేరిన మైత్రేయ మహర్షి వింటూండగా చిరునవ్వుల వెన్నెలలు రువ్వే అందమైన మోము కలవాడు, ఆనందామృతంతో వికసించిన ముఖం కలవాడు, దయావీక్షణాలతో భక్తులను ఆదరించేవాడు అయిన పద్మనేత్రుడైన శ్రీకృష్ణుడు నా వైపు చూచి ఇలా అన్నాడు. "ఉద్ధవా! పూర్వజన్మలో వసుబ్రహ్మలు సత్రయాగం చేశారు. ఆ వసువులలో నీవొకడివి. నీవు వేరేమీ కోరుకోకుండా నా పాదాబ్జాలనే కోరుకొన్నావు. అందువల్ల నేను ఇకపై నీ హృదయంలోనే ఉండి అంతా చూస్తుంటాను. ఆత్మారాముడినైన నన్ను 'ఇది సత్తు, ఇది అసత్తు' అనే పాండిత్యపరమైన జ్ఞానంతో దర్శించలేరు. నీకిదే చివరి జన్మ. నీ పూర్వజన్మ పుణ్యంవల్ల నన్ను ఈ ప్రదేశంలో దర్శించగలిగావు. నా నాభికమలంలో సంభవించిన బ్రహ్మకు ఉపదేశించిన దివ్యజ్ఞానాన్ని నీకు ఉపదేశిస్తాను" అని చెప్పగా అమృతోపమానములైన స్వామి పల్కులు నాకు కర్ణాభరణాలయ్యాయి. నా మనస్తాపాన్ని తొలగించాయి. నా ఒడలు ఆనందంతో గగుర్పొడిచింది. ఆనందబాష్పాలతో చెక్కిళ్లు తడిశాయి. అంతరంగం ఆనందతరంగితమయింది. నేను దోసిలి నుదుటిపై పెట్టుకొని ఇలా విన్నవించాను.

**క. పురుషోత్తమ! నీ పద, సర సీరుహ ధ్యానామృతాభిషేక స్ఫురణం**
**గర మొప్పిన నా చిత్త మి, తరవస్తువులందు వాంఛఁ దగులునె యెందున్. 151**

**ప్రతి :** పురుషోత్తమ!= ఓ పురుషోత్తముడవైన శ్రీకృష్ణా!; నీ= నీయొక్క; పదసరసీరుహ= పదములనెడి పద్మములను; ధ్యాన= ధ్యానించుటయను; అమృత= అమృతముయొక్క; అభిషేక స్ఫురణన్= స్నానమాడిన స్ఫూర్తితో; కరము+ఒప్పిన= మిక్కిలి ఆనందించు; నా చిత్తము= నా మనస్సు; ఇతర వస్తువులందున్= వేరే విషయములందు; వాంఛన్= కోరికతో; ఎందున్= ఏ విధముగానైనా; తగులునె= చిక్కుకొనునా? చిక్కుకొనదని భావం.

**తా :** ఓ పురుషోత్తమా! నీ పాదపద్మ ధ్యానామృతంతో అభిషిక్తమవుతూ ఆనందించే నా మనస్సు వేరే విషయాలను ఎందుకు కోరుతుంది? (కోరదు)

**చ. జననము లేని నీవు భవసంగతి నొందుట కేమి కారణం**
**బనియును, గాలసంహరుఁడవై జగముల్ విలయించు నీవు పా**
**యని రిపుభీతికై సరిదుదంచితదుర్గము నాశ్రయించు టె**
**ట్లనియును దేవ! నామనమునందుఁదలంతు సరోజలోచనా! 152**

**ప్రతి :** సరోజలోచనా!= పద్మములవంటి నేత్రములు కల శ్రీకృష్ణా!; దేవ!= పరమాత్మస్వరూపా!; జననము లేని నీవు= పుట్టుక లేని నీవు; భవసంగతిన్= జన్మబంధమును; ఒందుటకున్= పొందుటకు; ఏమి కారణంబు+అనియును= కారణమేమై ఉండుననియు; కాలసంహరుఁడవు+ఐ= కాలమును నిలిపివేయువాడవై; జగముల్= లోకములను; విలయించు= లయముచేసెడి (లోగొనెడి); నీవు= పరమాత్మ స్వరూపుడవైన నీవు; పాయని= విడువని; రిపుభీతికై= శత్రుభయంతో; సరిత్+ఉదంచిత దుర్గమును= సముద్రమధ్యమునందలి కోటను; ఆశ్రయించుట= నివాసముగా చేసికొనుట; ఎట్లు+అనియును= ఎందుకు జరిగిందనియు; నా మనమునందున్= నా మనసులో; తలంతున్= ఆలోచిస్తుంటాను.

**తా :** దేవా! పద్మనేత్రా! పుట్టుకే లేని నీవు జన్మించడమేమిటో! కాలస్వరూపుడవై లోకాలను లయం చేసే నీవు శత్రుభయంతో ఎక్కడో సముద్రమధ్యంలో కోట కట్టుకొని అందులో తలదాచుకోవడమేమిటో అర్థం గాక దానినిగూర్చియే ఆలోచిస్తుంటాను.

**వ. అదియునుంగాక. 153**

**ప్రతి :** అదియునున్+కాక

**తా :** అంతేగాకుండా

**క. శ్రీ రమణీశ్వర! నీ వా, త్మారాముఁడవయ్యు లీలఁ దరుణీకోటిం**
**గోరి రమించితి వనియును, వారక యేఁదలఁతు భక్తవత్సల! కృష్ణా! 154**

**ప్రతి :** శ్రీరమణీ+ఈశ్వర!= లక్ష్మీవల్లభా!; భక్తవత్సల= భక్తులయందు వాత్సల్యము కలవాడా!; కృష్ణా!= శ్రీకృష్ణా!; నీవు= పరమాత్మస్వరూపుడవైన నీవు; ఆత్మారాముఁడవు+అయ్యున్= ఆత్మయే క్రీడాస్థలముగా గలవాడవయ్యును; తరుణీకోటిన్= ఎందరో స్త్రీలను; కోరి రమించితివి= కోరి క్రీడించితివి; అనియును= ఇదేమిటా అనికూడా; వారక= మానక; ఏన్= నేను; తలఁతున్= ఆలోచిస్తుంటాను.

**తా :** లక్ష్మీవల్లభా! భక్తవత్సలా! కృష్ణా! నీయందు నీవే ఆనందించగల ఆత్మారాముడవై కూడా ఎందరో స్త్రీలను చుట్టూ పెట్టుకొని వారితో క్రీడించి ఆనందించడమేమిటా అనికూడా నేను ఆలోచిస్తుంటాను.

**క. పరతత్త్వజ్ఞులు కరుణా, కర! నిను సంసారి వనుచుఁ గడఁకఁదలంప**
**న్నరసి ననుఁగాచు టెల్లను, గర మరుదు తలంచి చూడఁ గమలాధీశా! 155**

**ప్రతి :** కమలా+అధీశా= శ్రీనాథా!; పరతత్త్వజ్ఞులు= పరమాత్మతత్త్వమును తెలిసినవారుకూడా; నినున్= నిన్ను; సంసారివి+ అనుచున్= సామాన్య సంసారివే, గృహస్థుడవే అని; కడఁకన్+తలంపన్= ప్రయత్నపూర్వకముగా భావిస్తుండగా; ననున్= సామాన్యుడనైన నన్ను; అరసి= గమనించి; కాచుట+ఎల్లను= రక్షించుట అంతా; తలంచి చూడన్= ఆలోచించి చూడగా; కరము+అరుదు= మిక్కిలి ఆశ్చర్యకరమైన విషయము.

**తా :** శ్రీనాథా! వేదాంతులుకూడా నిన్ను తెలుసుకోలేక తర్కించుకొని సామాన్య సంసారివనుకొంటున్నారు. కాని నీవు మాత్రం ఏ పరతత్త్వజ్ఞానమూ లేని, పండితుడనుకాని నన్ను కటాక్షించావు. ఇది చాల వింతైన విషయం.

**వ. దేవా! నీ వఖండిత విజ్ఞాన రూపాంతఃకరణుండ వయ్యును ముగ్ధభావంబునఁ బ్రమత్తుని చందంబున విమోహికైవడిం బ్రవర్తించుచు నెందేని నొదిగి యుండుటం దలంచి నా డెందంబు గుందుచుండు;**

**నరవిందలోచన! సురవందిత! ముకుంద! యిందిరా సుందరీ రమణ! సరస్వతీరమణునకుం గరుణించిన సుజ్ఞానంబు ధరించు శక్తి నాకుం గలదేనిఁ గృపసేయుము! భవదీయశాసనంబు ధరియించి భూరిసంసార పారావారోత్తరణంబు సేయుదు నని విన్నవించి బహుభంగులం బ్రస్తుతించిన భగవంతుఁడును బ్రపన్నపారిజాతంబును నైన కృష్ణుండు పరతత్త్వనిర్ణయంబు నెఱింగించిన. 156**

**ప్రతి :** దేవా!= శ్రీకృష్ణా!; నీవు= భగవానుడవైన నీవు; అఖండిత= మొక్కవోని; విజ్ఞానరూప= విజ్ఞానము రూపుకట్టిన; అంతఃకరణుండవు+అయ్యున్= అంతరంగం కలవాడవయ్యును; ముగ్ధభావంబునన్= అమాయకునివలె; ప్రమత్తుని చందంబునన్= జాగరూకత లేనివానివలెను; విమోహి కైవడిన్= అజ్ఞానివలెను; ప్రవర్తించుచున్= మసలుచు; ఎందు+ఏనిన్= ఎక్కడైనా, ఏ విషయంలోనైనా; ఒదిగి+ఉండుటన్= ఇమిడిపోవుచుండుట; తలంచి= ఆలోచించి; నా డెందంబు= నా హృదయం; కుందుచు+ఉండున్= కుములుచుండును; అరవిందలోచన= పద్మాక్షా!; సురవందిత!= దేవతలచే నమస్కరింపబడువాడా!; ముకుంద!= మోక్షప్రదాయకా!; ఇందిరాసుందరీరమణ!= లక్ష్మీవల్లభా!; సరస్వతీరమణునకున్= సరస్వతి భర్తయైన బ్రహ్మకు; కరుణించిన= అనుగ్రహించి ఇచ్చిన; సుజ్ఞానంబు= వేదాంతజ్ఞానాన్ని; ధరించు శక్తి= అవగాహన చేసుకోగల సామర్థ్యం; నాకున్+కలదు+ఏనిన్= నాకు (ఉద్ధవునికి) ఉన్నట్లయితే; కృప+చేయుము= ప్రసాదింపుము; భవదీయ శాసనంబున్= నీ ఆజ్ఞను; ధరియించి= స్వీకరించి; భూరి= విశాలమైన; సంసార= జననమరణ రూపమైన; పారావార= సముద్రమును; ఉత్తరణంబు+చేయుదున్= దాటెదను; అని విన్నవించి= అని విజ్ఞాపనము చేసుకొని; బహుభంగులన్= అనేక విధములుగా; ప్రస్తుతించినన్= నుతి చేయగా; భగవంతుఁడును= జ్ఞానబలైశ్వర్య వీర్యశక్తి తేజస్సులనే షడ్గుణసంపన్నుడైన భగవానుడును; ప్రపన్నపారిజాతంబునున్= ఆశ్రయించినవారి పాలిటి కల్పవృక్షమైనవాడును; ఐన కృష్ణుండు= అయిన వాసుదేవుడు; పరతత్త్వనిర్ణయంబున్= వేదాంతవిజ్ఞానాన్ని; ఎఱింగించినన్= తెలియజేయగా...

**తా :** దేవా! నీ అంతరంగమే తిరుగులేని విజ్ఞానానికి మరోరూపు. అయినా ఏమీ తెలియనివాడిలా ప్రవర్తిస్తుంటావు. అది తలచుకొన్నప్పుడు నా మనసెంతో దిగులుపడుతుంది. దేవతలే నిన్ను కొనియాడుతారు. నీవు మోక్షప్రదాతవు. లక్ష్మీవల్లభుడవు. బ్రహ్మదేవునకు అనుగ్రహించిన తత్త్వజ్ఞానాన్ని అర్థం చేసుకోగల శక్తి నాకు ఉందని నీవు భావిస్తే అలాగే ప్రసాదించు. నీ శాసనాన్ని పాటించి విస్తారమైన సంసారసముద్రాన్ని దాటుతానని అనేకవిధాలుగా స్వామిని ప్రస్తుతించగా భగవంతుడు, ఆశ్రయించినవారిపాలిట కల్పవృక్షము అయిన కృష్ణుడు నాకు తత్త్వజ్ఞానాన్ని అనుగ్రహించాడు.

**క. సరసిజలోచన కరుణా, పరిలబ్ధ జ్ఞానకలితభావుఁడ నగుటం**
**బరతత్త్వవేత్తనై త, చ్చరణసరోజముల కెఱఁగి సమ్మతితోడన్. 157**

**ప్రతి :** సరసిజలోచన= పద్మములవంటి నేత్రములు గల కృష్ణునియొక్క; కరుణా= దయచేత; పరిలబ్ధ= పొందబడిన; జ్ఞానకలిత= జ్ఞానముతో కూడిన; భావుఁడను+అగుటన్= మనస్సు కలవాడనగుటచే; పరతత్త్వవేత్తను+ఐ= వేదాంతజ్ఞానినై; సమ్మతితోడన్= ఇష్టంగా; తద్= ఆ శ్రీకృష్ణుని; చరణ= పాదములనెడి; సరోజములకున్= పద్మములకు; ఎఱఁగి= నమస్కరించి...

**తా :** వారిజాక్షుడైన శ్రీకృష్ణుని కరుణవల్ల లభించిన వేదాంతజ్ఞానంతో నా మనసు నిండింది. ఎంతో భక్తితో ఆయన పాదపద్మాలకు నమస్కరించాను.

**క. హరిపద జలరుహ విరహా, తురతన్ దుర్దాంత దుఃఖతోయధిఁ గడవన్**
**వెరవేది తిరుగ వలసెను, సరసిజభవకల్ప విలయ సమయముదాఁకన్. 158**

**ప్రతి :** హరి= శ్రీకృష్ణుని; పాదజలరుహ= పాదపద్మములనుండి; విరహ= ఎడబాటువలన; ఆతురతన్= బాధతో; దుర్దాంత= అణగారని; దుఃఖతోయధిన్= శోకసముద్రమును; కడవన్= దాటుటకు; వెరవు+ఏది= ఉపాయమేమున్నది; సరసిజభవకల్ప= బ్రహ్మకల్పముయొక్క; విలయ సమయముదాఁకన్= అంతము ఏర్పడువరకు; తిరుగవలసెను= తిరుగుతుండవలసినదే.

**తా :** కృష్ణుని ఎడబాటు నాకు భరింపరాని వేదన కలిగించింది. ఆ శోకసముద్రాన్ని తరించే ఉపాయం కనబడటం లేదు. స్వామి కనబడేందుకు వెదకుతూ ప్రళయం వచ్చి బ్రహ్మాండం నశించిపోయేంతవరకు ఇలా తిరుగుతూ ఉండాల్సిందే.

**వ. ఇట్లు దిరుగుచు. 159**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; తిరుగుచున్= తిరుగుతూ.

**తా :** ఈ విధంగా తిరుగుతూ.

**మ. నరనారాయణతాపసాశ్రమపదౌన్నత్యంబునంబొల్చు భా**
**సురమందారరసాలసాలవకుళాశోకామ్లపున్నాగ కే**
**సరజంబీరకదంబనింబకుటజాశ్వత్థస్ఫురన్మల్లికా**
**కరవీరక్షితిజాభిరామబదరీకాంతారసేవారతిన్. 160**

**ప్రతి :** నరనారాయణ= నరుడు, నారాయణుడు అను మహర్షుల; తాపస+ఆశ్రమపద= తపస్సు చేసిన ప్రదేశముయొక్క; ఔన్నత్యంబునన్+పొల్చు= గొప్పతనంతో అలరారు; భాసుర= అందమైన; మందార= మందారములు; రసాల= మామిడి; సాల= మద్ది; వకుళ= పొగడ; అశోక= అశోకము (కంకేళి); ఆమ్ల= చింత; పున్నాగ= సురపొన్న; కేసర= పొన్న; జంబీర= నిమ్మ; కదంబ= కడిమి; నింబ= వేప; కుటజ= కొండమల్లె; అశ్వత్థ= రావి; స్ఫురత్+మల్లికా= ప్రకాశించే మల్లె; కరవీర= గన్నేరు మొదలైన; క్షితిజ= చెట్లచేత; అభిరామ= మనోహరమైన; బదరీకాంతార= బదరికారణ్యముయొక్క; సేవారతిన్= సేవించుటలోని ఆసక్తితో (ఆ అరణ్యమునందు ఉండాలనే ఆసక్తితో)...

**తా :** నరనారాయణులు అనే మహామునులు ఎక్కడ తపస్సు చేశారో ఆ బదరీవనానికి వెళ్లాలని బయలుదేరాను. ఆ వనం మందారవృక్షాలతో, తీయమామిడిచెట్లతో, మద్దిచెట్లతో, పొగడచెట్లతో, అశోకతరువులతో, చింతచెట్లతో, పున్నాగభూజములతో, సురపొన్న, పొన్న, నిమ్మ, కడిమి, వేప, కొండమల్లె, రావి, మల్లె, గన్నేరు చెట్లతో మనస్సును హరిస్తూంటుంది. ఆ వనాన్ని సేవించాలనే ఆసక్తి ఉంది అని చెప్పాడు ఉద్ధవుడు.

**క. చనుచున్నవాఁడ నని ప, ల్కిన పలుకుల కులికి కళవళించుచు విదురుం**
**డనుపమశోకార్ణవమున, మునిఁగియు నిజయోగసత్త్వమునఁ దరియించెన్. 161**

**ప్రతి :** చనుచున్+ఉన్నవాఁడను+అని= వెళ్లుచున్నాను అని; పల్కిన= ఉద్ధవుడు చెప్పిన; పలుకులకున్= మాటలకు; విదురుండు= విదురుడు; ఉలికి= కంపించి; కళవళించుచున్= కలతపడుతూ; అనుపమ= సాటిలేని (అధికమైన); శోక+

అర్ణవముననన్= దుఃఖసాగరములో; మునిఁగియున్= మునిగిపోయినా; నిజయోగ సత్త్వముననన్= తన యోగసాధనవల్ల లభించిన నిబ్బరమువలన; తరియించెన్= ఆ శోకమునుండి బయటపడగలిగాడు.

**తా :** తాను బదరికాశ్రమానికి వెళ్లిపోతున్నానని ఉద్ధవుడు చెప్పిన మాట వినేసరికి విదురుడు కలతపడ్డాడు. కంపించిపోయాడు. శోకసాగరంలో మునిగిపోయాడు. అయినా యోగసాధకుడు కనుక ఆ బలంతో తిరిగి గుండెను నిబ్బరం చేసుకొని తిరిగి మామూలు స్థితికి వచ్చాడు.

**వ. ఇట్లు విదురుండు శోకపావకునిం దన వివేకజలంబుల నార్చి యుద్ధవున కిట్లనియె. 162**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; విదురుండు; శోకపావకునిన్= శోకాగ్నిని; తన; వివేకజలంబులన్= విజ్ఞానమనే నీళ్లతో; ఆర్చి= చల్లార్చి; ఉద్ధవునకున్= ఉద్ధవునితో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఆ విధంగా విదురుడు దుఃఖమనే అగ్నిని తన విజ్ఞానమనే జలంతో చల్లార్చి, ఉద్ధవునితో ఇలా అంటున్నాడు.

**మ. అనఘా! యుద్ధవ! నీకుఁ గృష్ణుఁ డసురేంద్రారాతి మన్నించి చె**
**ప్పిన యధ్యాత్మరహస్యతత్త్వ విమలాభిజ్ఞానసారంబు బో**
**రన నన్నుం గరుణించి చెప్పినఁగృతార్థత్వంబునంబొందెదన్**
**విను పుణ్యాత్ములు శిష్యసంఘముల నుర్విం బ్రోవరే వెండియున్. 163**

**ప్రతి :** అనఘా!= పుణ్యాత్ముడా!; ఉద్ధవ!= ఉద్ధవుడా!; నీకున్= నీకు; అసుర+ఇంద్ర+అరాతి= రాక్షసశ్రేష్ఠుల శత్రువైన; కృష్ణుఁడు= వాసుదేవుడు; మన్నించి= ఆదరించి; చెప్పిన= ఉపదేశించిన; అధ్యాత్మ= వేదాంతరూపమైన; రహస్య= గురూపదేశముద్వారా సంపాదించవలసిన; తత్త్వ= ఆత్మవిద్యారూపమైన; విమల= స్వచ్ఛమైన; అభిజ్ఞాన= గొప్ప జ్ఞానముయొక్క; సారంబు= సారాంశమును; బోరనన్= వెంటనే; నన్నున్+కరుణించి= నాయందు దయఉంచి; చెప్పినన్= ఉపదేశించినచో; కృతార్థత్వంబునన్+పొందెదన్= చరితార్థతను పొందెదను; విను= ఈ విషయము వినుము; పుణ్య+ఆత్ములు= పుణ్యసంపాదనపరులు; వెండియున్= జ్ఞానార్జనము చేసినపిమ్మట; శిష్యసంఘములన్= విద్యార్థిసముదాయమును; ఉర్విన్= ఈ నేలపై; ప్రోవరు+ఏ= రక్షింపరే.

**తా :** ఉద్ధవుడు బదరీవనానికి వెళ్లిపోతున్న విషయం విని శోకాక్రాంతుడైన విదురుడు అంతలోనే తేరుకొని ఇలా అడుగుతున్నాడు. పుణ్యాత్ముడవైన, ఉద్ధవా! రాక్షసులకు శత్రువైన కృష్ణుడు దయతో నీకు అనుగ్రహించిన వేదాంతవిద్యాతత్త్వరహస్యాన్ని నాకు కూడా ఉపదేశించి పుణ్యం కట్టుకో. లోకంలో జ్ఞానులెవరైనా వారికి తెలిసిన విద్యను శిష్యులకు బోధించి వారిని కృతార్థులను చేస్తారు కదా!

**క. భగవద్భక్తులు సుజనులు, దగ వెతిఁగి పరోపకారతాత్పర్య వివే**
**క గరిష్ఠులై చరింతురు, జగతిం బొగడొంది వృష్ణిసత్తమ! యెందున్. 164**

**ప్రతి :** వృష్ణిసత్తమ!= వృష్ణివంశతిలకుడవైన ఉద్ధవా!; ఎందున్= ఎక్కడైనా; భగవద్భక్తులు= భగవంతునియందు భక్తిగలవారు; సుజనులు= మంచివారు; తగవు= న్యాయాన్ని; ఎతిఁగి= గ్రహించి; జగతిన్= ప్రపంచములో; పొగడు+ఒంది= కీర్తిపొంది; పర+ఉపకార= ఇతరులకు ఉపకారము చేయుటయే; తాత్పర్య= తత్పరత్వముగా గల; వివేక= జ్ఞానముచేత; గరిష్ఠులై= గొప్పవారై; చరింతురు= ప్రవర్తిస్తారు.

**తా :** వృష్ణివంశంలోనే గొప్పవాడవైన ఉద్ధవా! ఎక్కడైనా భగవద్భక్తులైన పుణ్యాత్ములు ధర్మాన్ని అనుసరించి పరోపకారపరాయణులై ప్రవర్తించి కీర్తిమంతులవుతారు గదా!

**క. అనవుడు నుద్ధవుఁ డవ్విదు, రున కిట్లను ననఘ! మునివరుఁడు సాక్షా ద్వి**
**ష్ణునిభుండగు మైత్రేయుఁడు, దన మనమున మనుజగతి వదలఁ దలఁచి తగన్. 165**

**ప్రతి :** అనవుడున్= విదురుడట్లు పలుకగా; ఉద్ధవుఁడు= ఉద్ధవుడు; ఆ+విదురునకున్= ఆ విదురునకు; ఇట్లు+అనున్= ఈ విధముగా చెప్పసాగెను; అనఘ!= పుణ్యాత్ముడా!; మునివరుఁడు= మునిశ్రేష్ఠుడును; సాక్షాత్+విష్ణునిభుండు+అగు= సాక్షాత్తుగా శ్రీహరితో సమానుడును అయినటువంటి; మైత్రేయుఁడు= మైత్రేయమహర్షి; తన మనమునన్= తన మనసులో; మనుజగతిన్= మనుష్యత్వమును; వదలన్+తలఁచి= విడిచిపెట్టాలనే తలంపునకు వచ్చి; తగన్= అందుకు తగినట్లుగా...

**తా :** విదురుని మాటలు విన్న ఉద్ధవుడు ఇలా అంటున్నాడు. విదురా! మైత్రేయమహర్షి సాక్షాత్తు విష్ణుసమానుడు. ఆ మహానుభావుడు మానవదేహాన్ని విడిచిపెట్టాలని ఆలోచించాడు.

**క. హరి మురభేదిఁ బరాత్పరుఁ, గరుణాకరుఁదలఁచునట్టి ఘనుఁ డమ్ముని కుం**
**జరు కడకేఁగిన నాతఁడు, గర మర్థిందెలుపు తాత్త్వికజ్ఞానంబున్. 166**

**ప్రతి :** మురభేదిన్= మురుడు అనే రాక్షసుని సంహరించినవాడు; పరాత్పరున్= పరమాత్మ; కరుణాకరున్= దయావంతుడు అయిన; హరిన్= శ్రీమహావిష్ణువును; తలఁచునట్టి= నిరంతరం ధ్యానించునట్టి; ఘనుఁడు= మహానుభావుడైన; ఆ+మునికుంజరు కడకున్= ఆ మైత్రేయ మునిసత్తమునివద్దకు; ఏఁగినన్= వెళ్లినచో; ఆతఁడు= ఆ మహర్షి; కరము+అర్థిన్= మిక్కిలి ప్రేమతో; తాత్త్వికజ్ఞానంబున్= పారమార్థిక జ్ఞానాన్ని; తెలుపున్= ఉపదేశిస్తాడు.

**తా :** ఉద్ధవుడు చెపుతున్నాడు. విదురా! నేను కాదు. త్వరలోనే భౌతికదేహాన్ని విడిచి పరమాత్మలో ఐక్యం కావాలని నిశ్చయించుకొని దానికి తగినవిధంగా పరాత్పరుడు, మురారి అయిన శ్రీహరిని తదేకంగా ధ్యానం చేస్తూ కాలం గడుపుతున్నాడు మైత్రేయుడు. ఆ మహర్షి వద్దకు వెళితే నీవు కోరిన పరమార్థజ్ఞానాన్ని నీకు ఉపదేశిస్తాడు.

**వ. అని యుద్ధవుండు విదురుం గూడి చని చని. 167**

**ప్రతి :** అని= అని చెప్పి; ఉద్ధవుండు; విదురున్+కూడి= విదురునితో కలసి; చని చని= వెళ్లి వెళ్లి.

**తా :** అలా పలికిన ఉద్ధవుడు విదురుని తీసికొని బయలుదేరాడు. చాలదూరం ప్రయాణం చేశారు.

**ఉ. ముందటఁగాంచె నంత బుధముఖ్యుఁడు హల్లకఫుల్లపద్మ ని**
**ష్యందమరందపానవిలసన్మదభృంగఁ, జలత్తరంగ, మా**
**కంద లవంగ లుంగ లతికాచయసంగ, సురాంగనాశ్రితా**
**నందితపుణ్యసంగ, యమునన్, భవభంగ, శుభాంగ నర్మిలిన్. 168**

**ప్రతి :** అంతన్= అలా ప్రయాణించగా; ముందటన్= చాలదూరం వెళ్లాక ఎదురుగా; బుధముఖ్యుఁడు= పండితవరేణ్యుడైన ఉద్ధవుడు; హల్లక= కలువ పూవులనుండి; ఫుల్లపద్మ= వికసించిన పద్మాలనుండి; నిష్యంద= జాలువారుచున్న; మరంద=

మకరందాన్ని; పాన= త్రాగుటచేత; విలసత్= ప్రకాశవంతంగా; మద= మదించి ఉన్న; భృంగన్= తుమ్మెదలతో కూడినది; చలత్+తరంగన్= కదలుచున్న అలలు కలది; మాకంద= మామిడిచెట్లు; లవంగ= లవంగముల; లుంగ= మాదీఫలముల; లతికాచయ= తీగలతో; సంగన్= కూడినది; సుర+అంగనా= దేవకాంతలచేత; ఆశ్రిత= ఆశ్రయింపబడి; ఆనందిత= ఆనందపెడుతున్న; పుణ్యసంగన్= పవిత్రమైన కలయిక కలది; భవభంగన్= స్నానమాత్రముచేత సంసారదుఃఖమును ఛేదించునది; శుభ+అంగన్= శుభాత్మకమైన స్వరూపము కలది; అయిన; యమునన్= యమునానదిని; అర్మిలిన్= ప్రేమతో; కాంచెన్= దర్శించెను.

**తా :** అలా విదురునితో ప్రయాణిస్తున్న ఉద్ధవుడు కొంతదూరం వెళ్లాక ఎదురుగా కలువలతో పద్మాలతో ప్రకాశిస్తున్న యమునానదిని దర్శించాడు. ఆ కలువలలోని, పద్మాలలోని మకరందాన్ని గ్రోలి మత్తెక్కి విహరిస్తున్న తుమ్మెదలు కనిపిస్తున్నాయి. అలలు కదులుతున్నాయి. ఒడ్డున మామిడి, లవంగ, మాదీఫల వృక్షాలు, లతలు కనువిందు చేస్తున్నాయి. అక్కడి పొదరిండ్లలో సురాంగనలు విహరిస్తున్నారు. సంసారవిచ్ఛేదం చేయగలది, శుభాకారం కలది, పుణ్యప్రదమైనది ఆ యమునానది.

**క. కని డాయ నేఁగి మోదం, బునఁ దత్సరిదమలపులినభూములఁ దగ నా**
**దిన శేషము నివసించెను, వనజోదరపాదపద్మవశమానసుఁడై. 169**

**ప్రతి :** కని= ఆ యమునా నదిని చూచి; డాయన్+ఏఁగి= సమీపించి; మోదంబునన్= సంతోషముతో; తద్+సరిత్= ఆ యమునానదియొక్క; అమల= స్వచ్ఛమైన; పులినభూములన్= ఇసుకతిన్నెలపై; తగన్= హాయిగా; ఆ దినశేషము= మిగిలిన ఆ రోజంతా; వనజ+ఉదర= పద్మనాభుని; పాదపద్మ= పద్మములవంటి పాదములయందే; వశ= లగ్నమైన; మానసుఁడు+ఐ= మనస్సు కలవాడై; నివసించెను= ఉండిపోయెను.

**తా :** అందమైన ఆ యమునానదిని చూచిన ఉద్ధవుడు అక్కడనుండి కదలలేక అక్కడగల ఇసుకతిన్నెలపై శ్రీహరి పాదపద్మాలనే ధ్యానిస్తూ ఆనాడంతా అక్కడే ఉండిపోయాడు.

**క. మఱునాఁడు రేపకడ భా, సురపుణ్యుఁడు ఘనుఁడు మధు నిషూదన చరణ**
**స్మరణ క్రీడాకలితుఁడు, దరియించెన్ గలుష గహనదమనన్ యమునన్. 170**

**ప్రతి :** భాసురపుణ్యుఁడు= ప్రకాశమానమైన పుణ్యము కలవాడు; ఘనుఁడు= మహనీయుడు; మధునిషూదన= మధువు అను పేరుగల రాక్షసుని తుదముట్టించిన శ్రీహరియొక్క; చరణ= పాదములను; స్మరణ= స్మరించుట అనెడి; క్రీడాకలితుఁడు= ఆటతో కూడినవాడు అయిన ఉద్ధవుడు; మఱునాఁడు= మరుసటిరోజు; రేపకడ= ఉదయమే; కలుష= పాపసంబంధమైన; గహన= దుఃఖమును; దమనన్= అణగార్చెడి; యమునన్= యమునానదిని; తరియించెన్= దాటెను.

**తా :** పుణ్యాత్ముకుడు, మహనీయుడు, శ్రీహరిపాదపద్మధ్యాన క్రీడాపరాయణుడు అయిన ఉద్ధవుడు మరునాడు ఉదయమే విదురునితో కలిసి కాలుష్యహారిణియైన యమునానదిని దాటాడు.

**వ. ఇట్లుద్ధవుండు యమునానది నుత్తరించి బదరికాశ్రమంబునకుం జనియె ననిన విని రాజేంద్రుండు యోగీంద్రున కిట్లనియె. 171**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; ఉద్ధవుండు; యమునానదిన్= యమునానదిని; ఉత్తరించి= దాటి; బదరికా+ఆశ్రమంబునకున్= బదరికాశ్రమానికి; చనియెన్= వెళ్లాడు; అనినన్= అని చెప్పగా, విని= ఆలకించి; రాజ+ఇంద్రుండు= రాజశ్రేష్ఠుడైన పరీక్షిత్తు; యోగి+ఇంద్రునకున్= శుకయోగితో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఇలా ఉద్ధవుడు యమునా నదిని దాటి బదరికాశ్రమానికి వెళ్లాడని శుకమహర్షి చెప్పగానే పరీక్షిన్మహారాజు ఆ యోగీంద్రునితో ఇలా అంటున్నాడు.

**క. శౌరియు నతిరథ వరులు మ, హారథ సమరథులు యదు బలాధిపు లెల్లం**
**బోరి మృతిఁబొంద నుద్ధవుఁ, డేరీతిన్ బ్రదికె నాకు నెఱిఁగింపు తగన్. 172**

**ప్రతి :** శౌరియున్= శ్రీకృష్ణుడును; అతిరథవరులున్= అతిరథశ్రేష్ఠులును; మహారథ సమరథులున్= మహారథులును, సమరథులును; యదుబల+అధిపులు+ఎల్లన్= యాదవ మహాబలురందరూ; పోరి= యుద్ధముచేసి; మృతిన్+పొందన్= మరణింపగా; ఉద్ధవుఁడు= ఉద్ధవుడు మాత్రము; ఏ రీతిన్= ఏ విధముగా; బ్రదికెన్= సజీవుడుగా ఉండగలిగెను; నాకున్= నాకు; తగన్= స్పష్టముగా; ఎఱిఁగింపు= తెలియజేయుము.

**తా :** యాదవకులంలో ముసలం పుట్టింది. వారిలో వారే కలహించుకొని మహామహావీరులందరూ ప్రాణాలు కోల్పోయారు. శ్రీకృష్ణుడు తనకు తానుగా అవతారం చాలించాడు. మరి ఈ ఉద్ధవుడు మాత్రం ఎలా బ్రతికి ఉన్నాడో స్పష్టంగా తెలియజేయుమని పరీక్షిన్మహారాజు శుకయోగీంద్రుని అభ్యర్థించాడు.

**విశే :** 1. అతిరథుడు – పెక్కండ్రు విలుకాండ్రతో ఒక్కడై పోరాడేవాడు.
2. సమరథుడు – తనకు సాటియైన ఒక్కవీరునితో పోరాడేవాడు.
3. మహారథుడు – పదునొకండు వేల యోధులతో పోరాడేవాడు.

**సీ. నావుడు రాజేంద్రునకు శుకయోగీంద్రుఁ డిట్లను మున్ను లోకేశుచేత**
**సంప్రార్థితుండైన జలరుహనాభుండు వసుమతిపై యదువంశమందు**
**నుదయించి తనుఁ దాన మదిలోనఁ జింతించి తెలివొంది యాత్మీయ కులవినాశ**
**మొనరించి తాను బంచోపనిషన్మయ మగు దివ్యదేహంబునందుఁ జెందఁ**

**తే. దలఁచి విజ్ఞానతత్త్వంబు ధరణిమీఁదఁ, దాల్చి జనకోటి కెఱిఁగింపఁదగిన ధీరుఁ**
**డుద్ధవుఁడు దక్క నితరులే నోప రితఁడు, నిర్జితేంద్రియుఁడాత్మసన్నిభుఁడటంచు. 173**

**ప్రతి :** నావుడున్= అనగా; రాజ+ఇంద్రునకున్= పరీక్షిన్మహారాజునకు; శుకయోగి+ఇంద్రుఁడు= శుకమహర్షి; ఇట్లు+అనున్= ఈ విధముగా చెప్పసాగెను; మున్ను= పూర్వకాలమునందు; లోక+ఈశుచేతన్= బ్రహ్మదేవునిచేత; సంప్రార్థితుండు+ఐన= ప్రార్థింపబడిన; జలరుహనాభుండు= పద్మనాభుడు; వసుమతిపైన్= భూమిపై; యదువంశమందున్= యాదవకులమున; ఉదయించి= (కృష్ణుడుగా) అవతరించి; తనున్+తాన= తనకుతానుగా; మదిలోనన్= ఆత్మలో; చింతించి= విచారణచేసి; తెలివి+ఒంది= ఆలోచనకు వచ్చి; ఆత్మీయకులవినాశము= తన వంశానికి సమాప్తిని; ఒనరించి= కలిగించి; తాను= శ్రీకృష్ణుడు; పంచ+ఉపనిషద్+మయము+అగు= పంచోపనిషత్తులతో కూడిన; దివ్యదేహంబునందున్= తేజోమయ శరీరాన్ని;

చెందన్+తలఁచి= పొందవలెనని భావించి; విజ్ఞానతత్త్వంబున్= పారమార్థికజ్ఞానాన్ని; ధరణిమీఁదన్= నేలపై; తాల్చి= వహించి; జనకోటికిన్= ప్రజలకు; ఎఱిఁగింపన్= తెలియజేయుటకు; ధీరుఁడు= విద్వాంసుడైన; ఉద్ధవుఁడు+తక్కన్= ఉద్ధవుడు తప్ప; ఇతరులు+ఏన్= వేరెవ్వరును; ఓపరు= సమర్థులు కారు; ఇతఁడు= ఈ ఉద్ధవుడు; నిర్జిత+ఇంద్రియుఁడు= ఇంద్రియాలను జయించినవాడు; ఆత్మసన్నిభుఁడు= నాతో సమానమైనవాడు; అటంచున్= అని భావించి...

**తా :** ఈ విధంగా అడిగిన పరీక్షిన్మహారాజునకు శుకయోగీంద్రుడు ఇలా చెపుతున్నాడు. మహారాజా! పూర్వకాలంలో బ్రహ్మదేవుడు శ్రీహరిని ప్రార్థించాడు. భూలోకంలో పాపం పెరిగి, భూభారం అధికమైపోయింది. అందువల్ల ధర్మాన్ని నిలబెట్టేందుకు ఆ హరి యదువంశంలో అవతరించాడు. ఇక ఆ వంశం అవసరం తీరిపోయిందని భావించి తానుగా ఆ వంశానికి భరతవాక్యం పలికాడు. పంచభూతాత్మకమైన దేహాన్ని విడిచిపెట్టి, పంచోపనిషద్రూపమైన తేజశ్శరీరాన్ని ధరించాలనుకొని, తన తర్వాత తత్త్వజ్ఞానాన్ని లోకానికి అందించగల సమర్థుడు, జితేంద్రియుడు, తనంతటివాడు ఉద్ధవుడే అని భావించాడు.

**క. క్షితిపై నిలిపిన కతమున, నతనికి మృతి దొరక దయ్యె నవనీశ! రమా**
**పతి యభిమానము గలిగిన, యతిపుణ్యుఁడు సనియె బదరికాశ్రమమునకున్. 174**

**ప్రతి :** అవనీ+ఈశ!= పరీక్షిన్మహారాజా!; క్షితిపైన్= భూమిపైన; నిలిపిన కతమునన్= ఉద్ధవుని నిలిపిన కారణంగా; అతనికిన్= అతనికి; మృతి దొరకదు+అయ్యెన్= మరణము లేకుండా పోయింది; రమాపతి= శ్రీహరియొక్క; అభిమానము= ప్రేమ; కలిగిన= పొందిన; అతిపుణ్యుఁడు= మహాపుణ్యాత్ముడైన ఉద్ధవుడు; బదరికా+ఆశ్రమమునకున్= బదరిక అను పేరుగల ఆశ్రమానికి; చనియెన్= వెళ్ళాడు.

**తా :** శ్రీకృష్ణుడు ఉద్ధవుని కావాలని భూమిపై నిలిపి ఉంచాడు కనుక ఆతనికి మృత్యువు లేదు. శ్రీహరి అభిమానాన్ని పొందిన మహాపుణ్యుడైన ఉద్ధవుడు బదరికాశ్రమానికి బయలుదేరి వెళ్ళాడు.

**వ. అంత. 175**

**ప్రతి :** అంతన్= అటుపైని.

**క. ఉద్ధవుఁడరిగిన పిదప స, మిద్ధ పరిజ్ఞాను, సుజనహితు, మైత్రేయున్**
**వృద్ధజనసేవ్యుఁ, దాపస, వృద్ధశ్రవుఁ జూడఁగోరి విదురుఁడు గడఁకన్. 176**

**ప్రతి :** ఉద్ధవుఁడు= ఉద్ధవుడు; అరిగిన పిదపన్= బదరికాశ్రమానికి వెళ్ళిపోయిన తరువాత; విదురుఁడు= విదురుడు; సమిద్ధపరిజ్ఞానున్= ప్రకాశించు పరిజ్ఞానము కలవాడును; సుజనహితున్= మంచివారి మేలుకోరువాడును; వృద్ధజన సేవ్యున్= పెద్దవారిచేతకూడ సేవింపబడదగినవాడును; తాపస వృద్ధశ్రవున్= మునీంద్రుడును అయిన; మైత్రేయున్= మైత్రేయ మహర్షిని; చూడన్+కోరి= దర్శించదలచి; కడఁకన్= ప్రయత్నపూర్వకముగా ముందుకు సాగెను...

**తా :** ఉద్ధవుడు బదరికాశ్రమానికి వెళ్లిపోయాడు. ఆతడు చెప్పినప్రకారం గొప్ప జ్ఞాని, సుజనహితుడు, తపస్వి అయిన మైత్రేయ మహర్షిని దర్శించేందుకు ముందుకు సాగాడు విదురుడు.

**వ. యమునానది దాఁటి కతిపయ ప్రయాణంబులఁ బుణ్యనదుల, హరిక్షేత్రంబులను దర్శించుచు నతిత్వరిత గమనంబున. 177**

**ప్రతి :** యమునానదిన్= యమునానదిని; దాఁటి= దాటుకొని; కతిపయ ప్రయాణంబులన్= కొన్ని రోజులు ప్రయాణంచేసి; పుణ్యనదులన్= పవిత్రమైన నదులను; హరిక్షేత్రంబులను= వైష్ణవక్షేత్రాలను; దర్శించుచున్= చూస్తూ; అతిత్వరిత గమనంబునన్= వేగంగా ప్రయాణిస్తూ.

**తా :** విదురుడు యమునానదిని దాటాడు. కొన్ని దినాలు ప్రయాణం చేశాడు. దారిలో తగిలిన పుణ్యనదులను, వైష్ణవ క్షేత్రాలను దర్శించాడు. వేగంగా ముందుకు సాగాడు.

**క. చని చని ముందటఁగనుఁగొనె, ఘనపాప తమఃపతంగఁ, గరుణాపాంగన్,**
**గనదుత్తుంగతరంగన్, జనవరనుత బహుళపుణ్యసంగన్, గంగన్. 178**

**ప్రతి :** చని చని= విదురుడు అలా ముందుకు సాగి; ముందటన్= చాలదూరం వెళ్లాక ఎదురుగా; ఘన= అధికమైన; పాప= పాపములనెడి; తమస్= చీకటిపాలిటి; పతంగన్= సూర్యునివంటిది; కరుణా+అపాంగన్= దయావీక్షణములు కలది; కనత్+ఉత్తుంగతరంగన్= అందమైన ఎత్తైన తరంగాలు కలది; జనవర= గొప్పవారిచేత; నుత= కొనియాడబడే; బహుళపుణ్య= విస్తారమైన పుణ్యముతో; సంగన్= కూడినది ఐన; గంగన్= గంగానదిని; కనుఁగొనెన్= దర్శించెను.

**తా :** విదురుడు చాలదూరం ప్రయాణం చేశాక పాపాలనే చీకట్లను పోగొట్టే సూర్యునివంటిది, దయార్ద్రమైన చూపులతో మనను చూస్తున్నట్లనిపించేది, ఎత్తైన తరంగాలతో కనువిందు చేసేది, మహాత్ముల ప్రశంసలు అందుకొనేది అయిన గంగానదిని దర్శించాడు.

**విశే :** పతంగము – పక్షి, సూర్యుడు, మిడుత.

**క. అందు నరవిందసౌరభ, నందితపవమానధూతనటదూర్మి పరి**
**స్పందితకందళశీకర, సందోహలసత్ప్రవాహజలమజ్జనుఁడై. 179**

**ప్రతి :** అందున్= ఆ గంగానదియందలి; అరవింద= పద్మములయొక్క; సౌరభ= సువాసనలచేత; నందిత= సంతోషపెట్టబడిన; పవమాన= గాలిచేత; ధూత= కదల్పబడుచు; నటత్= నృత్యము చేయుచున్నట్లుగా చలించుచున్న; ఊర్మి= తరంగాలతో; పరిస్పందిత= అంతట చిమ్మబడుచున్న; కందళ= అవ్యక్తమధురమైన ధ్వని చేయుచున్న; శీకర= తుంపురుల; సందోహ= సముదాయముతో; లసత్= ప్రకాశించుచున్న; ప్రవాహ= ప్రవాహరూపమైన; జల= నీటియందు; మజ్జనుఁడు+ఐ= మునిగినవాడై (స్నానం చేశాడు).

**తా :** గంగానదిలోని పద్మాల సువాసలను మోస్తూ గాలి దాని తరంగాలను కదుపుతుంటే అవి నాట్యం చేస్తూ, తుంపరలను అన్నివైపులకు చిమ్ముతున్నాయి. వినసొంపైన నాదంకూడా ఆ తరంగాలనుండి వస్తోంది. అందులో స్నానమాడాడు విదురుడు.

**సీ. ఘనసారరుచివాలుకాసముదంచిత సైకతవేదికాస్థలమునందు**
**యమనియమాదియోగాంగక్రియా నిష్ఠఁ బూని పద్మాసనాసీనుఁడగుచు**
**హరిపాదసరసీరుహ న్యస్తచిత్తుఁడై బాహ్యేంద్రియవ్యాప్తిఁబాఱఁదోలి**
**సకలవిద్వజ్జనస్తవనీయసముచితాచార వ్రతోపవాసములఁ గ్రుస్సి**

**తే.** **యున్న పుణ్యాత్ము, విగతవయోవికారు, వినుతసంచారు, భువనపావనవిహారు**
**యోగిజనగేయు, సత్తతి భాగధేయు, నాశ్రితవిధేయు, మైత్రేయు నచటఁగాంచె.** **180**

**ప్రతి :** ఘనసార= కర్పూరమువంటి; రుచి= కాంతితోకూడిన; వాలుకా= రేణువులతో; సముదంచిత= కొనియాడదగిన అందముతో ప్రకాశించుచున్న; సైకతవేదికా= ఇసుకతిన్నెల; స్థలమునందున్= ప్రదేశమునందు; యమనియమ+ఆది= యమము, నియమము మొదలగు; యోగ+అంగ= యోగశాస్త్రమునకు చెందిన; క్రియా= విధులయందు; నిష్ఠన్= శ్రద్ధను; పూని= వహించి; పద్మ+ఆసన+ఆసీనుఁడు+అగుచున్= పద్మాసనం వేసి కూర్చుని; హరి= శ్రీహరి; పాద= పాదములనెడి; సరసీరుహ= పద్మములయందు; న్యస్త= ఉంచబడిన; చిత్తుఁడు+ఐ= మనస్సు కలవాడై; బాహ్య+ ఇంద్రియవ్యాప్తిన్= ఇంద్రియములు బయటివిషములపై తగుల్కొనుటను; పాఱన్+తోలి= నివారించి; సకల= సమస్తమైన; విద్వత్+జన= పండితులచేత; స్తవనీయ= కీర్తింపబడదగిన; సముచిత+ఆచార= శిష్టాచారములతోను; వ్రత+ఉపవాసములన్= వ్రతములతోను, ఉపవాసములతోను; క్రుస్సియున్న= కృశించియున్న; పుణ్య+ఆత్మున్= పుణ్యాత్ముడు; విగత వయస్+వికారున్= వార్ధక్యలక్షణాలు శరీరమునందు కనిపించనివాడు; వినుత సంచారున్= స్తవనీయమైన నడవడిక కలిగినవాడు; భువన పావన విహారున్= నేలను పవిత్రం చేయగల సంచారము కలవాడు; యోగిజన గేయున్= యోగులచేత కీర్తింపబడువాడు; సత్+తతి భాగధేయున్= సాధుజనుల సముదాయమునకు భాగ్యమైనవాడు; ఆశ్రిత విధేయున్= తనను ఆశ్రయించినవారికి అనుకూలుడై ఉండేవాడును అయిన; మైత్రేయున్= మైత్రేయమహర్షిని; అచటన్= ఆ గంగానది ఒడ్డున; కాంచెన్= విదురుడు దర్శించాడు.

**తా :** కర్పూరంలా మిలమిలా మెరిసిపోతున్న ఇసుక తిన్నెపై యమ నియమాది అష్టాంగయోగ నిష్ఠను పూని పద్మాసనం వేసికొని కూర్చుని ఉన్నవాడు; శ్రీహరిపాదపద్మాలయందే మనస్సును లగ్నంచేసి, బాహ్యవిషయాలపై ఇంద్రియాలు ప్రసరించకుండా నియమించినవాడు; విద్వాంసులు మెచ్చుకొనే విధంగా శిష్టాచారపరాయణుడై వ్రతాలతో, ఉపవాసాలతో కృశించినవాడు; పుణ్యాత్ముడు; శరీరంపై వార్ధక్య లక్షణాలు కనిపించనివాడు; మెప్పును పొందే నడవడిక కలవాడు; అడుగుమోపినచోటును పవిత్రం చేయగలవాడు; యోగులచే కీర్తింపబడువాడు; సాధుజనులకు భాగ్యమైనవాడు; ఆశ్రయించిన వారిని కటాక్షించేవాడు అయిన మైత్రేయమహర్షిని విదురుడు దర్శించాడు.

**విశే :** యమము, నియమము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యానము, ధారణ, మననము, సమాధి అను ఈ ఎనిమిది అష్టాంగయోగములు.

**యమము –** సత్యము, దయ, క్షమ, ధృతి, మితాహారము, ఆర్జవము, బ్రహ్మచర్యము, అస్తేయము (చౌర్యము లేకుండుట), అహింస, శౌచము (పవిత్రముగా ఉండుట) అని పది విధములు.

**నియమము –** తపము, సంతోషము, ఆస్తికత్వము, దానము, భగవదర్చన, వేదాంతశ్రవణము, లజ్జ, మతి, జపము, వ్రతము అని పది విధములు.

**ప్రాణాయామము –** మంత్రసహితముగా ఊపిరిని బిగపట్టుట

**ప్రత్యాహారము –** కోరికలనుండి ఇంద్రియాలను మరలించుట

**ధ్యానము –** భగవంతునియందు మనసును లగ్నము చేయుట

**ధారణ –** భగవంతుడు తప్ప మరియొకటి తెలియకుండుట

**మననము –** భగవంతునిగూర్చిన చింతన

**సమాధి –** పరమాత్మయందు మనస్సును లయము చేయుట

## ✤ విదురమైత్రేయ సంవాదము ✤

**వ. ఇట్లు గనుంగొని యమ్మునీంద్రుని పాదంబులకుం బ్రణమిల్లి ముకుళితహస్తుండై యిట్లనియె 'మునీంద్రా! లోకంబున సకల జనంబులు మనంబులు ఘనంబులగు సౌఖ్యంబు లందం దలంచి తత్ఫలప్రాప్తి హేతువులైన కర్మంబు లాచరించి దైవోపహతులై తత్కర్మంబులచేత నిష్ఫలారంభు లగుదురు; కర్మంబులు బంధకంబులును దుఃఖహేతువులునుం గాని సౌఖ్యదాయకంబులై పాపనివృత్తి జేయనోప; వది యట్లుండె; భూరి దుఃఖానుసారంబైన సంసార చక్రంబు నందుఁ బరిభ్రమించుచుం గామవిమోహితులై పూర్వకర్మానుగతంబులైన శరీరంబులు దాల్చుచుం జచ్చుచు మరలం బుట్టుచు నెంత కాలంబునకుఁ బాపనివృత్తిఁ గానక మాతృయౌవన వన కుఠారులై జనియించి వర్తించు మూఢాత్ములం, బశుప్రాయుల రక్షించుకొఱకుఁగాదె నారాయణపరాయణులైన మీవంటి పుణ్యాత్ములు లోకంబునం జరియించుట; యదియునుం గాక. 181**

**ప్రతి :** ఇట్లు+కనుంగొని= అలా విదురుడు మైత్రేయమహర్షిని దర్శించి; ఆ+ముని+ఇంద్రుని= ఆ మైత్రేయునియొక్క; పాదంబులకున్= చరణాలకు; ప్రణమిల్లి= నమస్కరించి; ముకుళితహస్తుండు+ఐ= మోడ్చిన చేతులు గలవాడై, అంజలి ఘటించినవాడై; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; మునీంద్రా!= మునిశ్రేష్ఠుడా!; లోకంబునన్= ఈ లోకంలో; సకలజనంబులు= జనులందరూ; మనంబులు= వారి మనస్సులకు; ఘనంబులు+అగు= గొప్పవగు; సౌఖ్యంబులు= సుఖాలను; అందన్+తలంచి= పొందగోరి; తద్+ఫలప్రాప్తి= ఆ ఫలమును పొందుటకు; హేతువులు+ఐన= కారణములైన; కర్మంబులు= కృత్యములు; ఆచరించి= చేసి; దైవ+ఉపహతులు+ఐ= విధిచేత కొట్టబడినవారై; తద్+కర్మంబులచేతన్= ఆ యా కృత్యములచేత; నిష్ఫల+ఆరంభులు+అగుదురు= ఫలించని ప్రయత్నం కలవారగుదురు; కర్మంబులు= ఆచరించు కృత్యములు; బంధకంబులును= బంధించునవియు; దుఃఖహేతువులునున్= శోకకారణములును; కాని= తప్ప; సౌఖ్యదాయకంబులు+ఐ= సుఖాన్ని అందించునవై; పాపనివృత్తిన్= పాపరాహిత్యాన్ని; చేయన్+ఓపవు= చేయుటకు సమర్థములు కావు; అది+అట్లుండెన్= ఆ విషయం అలా ఉండగా; భూరిదుఃఖ+అనుసారంబు+ఐన= మిక్కిలి దుఃఖాన్ని అనుసరించేదైన; సంసారచక్రంబునందున్= జననమరణ రూప వలయమునందు; పరిభ్రమించుచున్= తిరుగుతూ; కామవిమోహితులు+ఐ= కోరికలతో అజ్ఞానులై; పూర్వకర్మ+అనుగతంబులు+ఐన= పూర్వజన్మలలో చేసిన కృత్యాలను అనుసరించేవైన (కర్మలకు తగిన); శరీరంబులు+తాల్చుచున్= దేహాలను ధరిస్తూ; చచ్చుచున్= తిరిగి మరణిస్తూ; మరలన్+పుట్టుచున్= మళ్లీ జన్మిస్తూ; ఎంత కాలంబునకున్= ఎంత కాలం గడచినా; పాప నివృత్తిన్+కానక= పాపాలు తొలగిపోవటం; మాతృ= తల్లియొక్క; యౌవన= జవ్వనమనెడి; వన= అరణ్యముపాలిటి; కుఠారులు+ఐ= గొడ్డలివంటివారై (బిడ్డకు జన్మనివ్వగానే స్త్రీ యౌవనము నశించుననుట); జనియించి= పుట్టి; వర్తించు= ప్రవర్తించు; మూఢ+ఆత్ములన్= మూర్ఖులను; పశుప్రాయులన్= పశువువలె వివేకం కోల్పోయి మసలువారిని; రక్షించుకొఱకున్+కాదె= రక్షించుటకే కదా;

నారాయణ పరాయణులు+ఐన= శ్రీహరిధ్యానంపై గొప్ప ఆసక్తిగల; మీవంటి పుణ్య+ఆత్ములు= మీబోటి పుణ్యచరిత్రులు; లోకంబునన్+చరియించుట= లోకంలో పుట్టి పెరుగుట; అదియునున్+కాక= అంతే కాకుండా...

**తా :** మైత్రేయుని పాదాలకు నమస్కరించాడు విదురుడు. చేతులు జోడించి ఇలా అంటున్నాడు. మహర్షీ! లోకంలో జనులందరూ సుఖాన్ని కోరుకొని దానికి తగిన ఏవో కర్మలు చేస్తారు. దైవం అనుకూలించక సత్ఫలితాన్ని పొందలేకపోతారు. ఇటువంటి కర్మలు దుఃఖాన్ని కలిగించేవే తప్ప పాపాన్ని పోగొట్టలేవు. అంతేగాదు, ఈ లోకులు సంసారచక్రభ్రమణం నుండి బయటపడలేక కామమోహితులై కర్మానుగుణమైన శరీరాలు ధరిస్తూ పుట్టుట చచ్చుటలు పొందుతూంటారు. తల్లి యౌవనమనే అడవిని నరికే గొడ్డలివంటివి అటువంటి వారి పుట్టుకలు. మనుజులుగా పుట్టినా పశువుల్లా ప్రవర్తించే అటువంటి బుద్ధిహీనులను రక్షించడానికే నిరంతరం విష్ణుధ్యానపరాయణులైన మీవంటి పుణ్యాత్ములు ఈ లోకంలో సంచరిస్తుంటారు.

**మ. అవివేకానుగత స్వకార్యజలవేలాకీర్ణమై మిత్ర బం**
**ధు వధూపుత్ర జలగ్రహోగ్రయుతమై దుర్దాంత మైనట్టి దు**
**ర్భవపాథోధిఁదరింపలేరు హరిసంబంధక్రియాలోల భా**
**గవతానుగ్రహనావ లేని యధముల్ కారుణ్యసంధాయకా! 182**

**ప్రతి :** కారుణ్యసంధాయకా!= దయను సమకూర్చే మైత్రేయా!; అవివేక= అవివేకమును; అనుగత= అనుసరించు; స్వకార్య= స్వార్థమనే; జల= నీటిని అనుసరించు; వేలా+ఆకీర్ణమై= ఒడ్డుచే వ్యాపించినదై; మిత్ర= స్నేహితులు; బంధు= చుట్టాలు; వధూపుత్ర= ఆలుబిడ్డలు అనెడి; జలగ్రహ+ఉగ్రయుతము+ఐ= భయంకరమైన జలచరములతో కూడినదైన; దుర్దాంతము+ఐనట్టి= అణపరాని; దుర్భవ పాథోధిన్= పాడు సంసారమనే సముద్రాన్ని; హరిసంబంధ= విష్ణుసంబంధమైన; క్రియాలోల= పనులయందే ఆసక్తులైయుండు; భాగవత= భగవద్భక్తుల; అనుగ్రహ= దయ అనెడి; నావ= పడవ; లేని అధముల్= లభించని నీచులు; తరింపలేరు= దాటలేరు.

**తా :** ఓ దయాశాలీ! అవివేకమనే జలంతోను, స్వార్థమనే చెలియలికట్టతోను విస్తరించి, బంధు, మిత్ర, కళత్ర, పుత్రులనే భయంకర జలచరాలతో నిండియుండే అంతులేని సంసార సముద్రాన్ని దాటాలంటే మీవంటి భగవద్భక్తుల అనుగ్రహమనే నావ ఉండాల్సిందే. దానిని పొందలేని అధములు ఎప్పటికీ ఈ చావుపుట్టుకలనే సముద్రాన్ని దాటలేరు.

**క. మునినాథచంద్ర! ననుఁ గై, కొని కాచు తలంపు బుద్ధిఁగూడిన యేనిన్**
**వినుము మదీప్సిత మది నా, చనవునఁగావింపవయ్య సజ్జనతిలకా! 183**

**ప్రతి :** మునినాథచంద్ర!= మునులలో శ్రేష్ఠుడా!; సజ్జనతిలకా!= సుజనులకే తిలకమువంటివాడవైన మైత్రేయా!; ననున్= నన్ను; కైకొని= ఆదరించి; కాచు= రక్షించే; తలంపు= ఆలోచన; బుద్ధిన్= మనసునందు; కూడిన+ఏనిన్= ఏర్పడినట్లయితే; మద్+ఈప్సితము+అది= నా ఈ విన్నపమును; వినుము= ఆలకించుము; నా చనవునన్= నాయందుండే అనురాగంతో; కావింపవయ్య= నా కోరిక తీర్చుము.

**తా :** మునిశ్రేష్ఠుడా! సుజనతిలకుడా! మైత్రేయా! నన్ను రక్షించే ఆలోచన మీ మనసులో ఉంటే నా విన్నపాన్ని ఆలకించి, నా కోరిక తీర్చండి.

**వ. అని వెండియు విదురుండు మైత్రేయుం జూచి మునీంద్రా! త్రిగుణాత్మకమాయానియంత యగు భగవంతుండు స్వంతంత్రుండయ్యు నవతరించి యే యే యవతారంబుల నే కర్మంబు లాచరించె? నదియు నిష్క్రియుండగు నీశుండు మొదలం బ్రపంచంబు నే విధంబునం గల్పించె? నే పగిదిం బాలించె? మఱియు నీ విశ్వంబు నాత్మీయ హృదయాకాశగతముం జేసి నివృత్తవృత్తి యగుచు యోగమాయయం దెట్లు వసియించె? బ్రహ్మాండంబునందు నే లీల వర్తించె? నందు బ్రహ్మాదిరూపంబులం బొంది బహుప్రకారంబుల నెట్లు క్రీడించె? భూసుర గోసురాదులఁ బరిరక్షించుటకై మత్స్యాద్యవతారంబులు ధరియించి యే యే ప్రయోజనంబులం దీర్చెఁ? బయోరుహ గర్భాండ కటాహాంతర్గతంబులై లోకపాలసహితంబులైన లోకంబులను లోకాలోక పర్యంతంబుల బహిర్భాగంబులను నే యే తత్త్వభేదంబులను నెత్తెఱంగునం బుట్టించె? నందు బ్రతీతంబగు జీవకోటి యెవ్వనిం గొల్చి బ్రదుకు? జనులకు గర్మ నామ రూప భేదంబు లెట్లు నిర్దేశించె? నింతయు సవిస్తరంబుగా వివరింపు; ముత్తమశ్లోకమౌళిమండనుండును, యోగీశ్వరుండును నైన పుండరీకాక్షుని చరిత్ర శ్రవణంబునం గాని జన్మమరణాది సకల దుఃఖాకరంబులును, దుష్కర్మప్రాప్తంబులును నగు భవబంధంబులు దెగవని వెండియు నిట్లనియె. 184**

**ప్రతి :** అని వెండియున్= అలా పలికి, మఱియును; విదురుండు= విదురుడు; మైత్రేయున్+చూచి= మైత్రేయమహర్షిని చూచి; మునీంద్రా!= మునిశ్రేష్ఠుడా!; త్రిగుణాత్మకమాయానియంత= సత్త్వరజస్తమోగుణాలను శాసించేవాడు; అగు= అయిన; భగవంతుండు= భగవానుడు; స్వతంత్రుండు+అయ్యును= స్వేచ్ఛగలవాడే అయినా; అవతరించి= క్రిందికి దిగివచ్చి; ఏయే అవతారంబులన్= ఏయే అవతారాలలో; ఏ కర్మంబులు+ఆచరించెన్= ఎటువంటి కృత్యాలను నిర్వహించాడు; అదియున్= అంతేకాకుండా; నిష్క్రియుండు+అగు= కర్మలు లేనివాడైన; ఈశుండు= భగవంతుడు; మొదలన్= ముందుగా; ప్రపంచంబును= విశ్వాన్ని; ఏ విధంబునన్+కల్పించెన్= ఎలా నిర్మించాడు; ఏ పగిదిన్+పాలించెన్= ఎలా పరిపాలించాడు; మఱియున్= ఆ పైన; ఈ విశ్వంబును= ఈ ప్రపంచాన్ని; ఆత్మీయ హృదయ+ఆకాశగతమున్= తన హృదయాకాశంలో కలియునట్లు; చేసి= లయము కావించి; నివృత్త వృత్తి+అగుచున్= తక్కిన జీవులవంటి ప్రవృత్తి కలవాడై; యోగమాయయందున్= యోగమనే మాయలో; ఎట్లు వసియించెన్= ఎలా నివసించాడు; బ్రహ్మాండంబునందున్= ఈ బ్రహ్మాండంలో; ఏ లీలన్ వర్తించెన్= ఏ విధంగా ప్రవర్తించాడు; అందున్+బ్రహ్మాదిరూపంబులన్= అందులో బ్రహ్మ మొదలగు రూపాలను; పొంది= ధరించి; బహుప్రకారంబులన్= అనేక విధాలుగా; ఎట్లు క్రీడించెన్= ఎలా విహరించాడు; భూసుర గోసుర+ఆదులన్= బ్రాహ్మణులను, గోవులను, దేవతలను మొదలైనవారిని; పరిరక్షించుటకున్+ఐ= సంరక్షించడంకోసం; మత్స్య+ఆది+ అవతారంబులు= చేప మొదలగు అవతారాలు; ధరియించి= స్వీకరించి (అవతారాలెత్తి); ఏయే ప్రయోజనంబులన్= ఎటువంటి ఫలితాలను; తీర్చెన్= సాధించెను; పయోరుహగర్భ+అండ= బ్రహ్మాండమనెడి; కటాహ= కడవయొక్క; అంతర్‌గతంబులు+ఐ= లోపల ఇమిడియున్నవై; లోకపాలసహితంబులు+ఐన= లోకాల పాలకులతో కూడిన; లోకంబులను= లోకాలను; లోకాలోక పర్యంతంబుల= లోకాలోక పర్యంతం; బహిర్+భాగంబులను= బాహ్యస్వరూపాలను; ఏయే తత్త్వభేదంబులను= తత్త్వములయొక్క ఏ యే భేదాలను; ఏ+తెఱంగునన్+పుట్టించెన్= ఎలా సృష్టించాడు; అందున్+ప్రతీతంబు+అగు= అందు తెలియవచ్చే; జీవకోటి= ప్రాణిసముదాయము; ఎవ్వనిన్+కొల్చి బ్రదుకున్=

ఎవరిని సేవించి జీవిస్తుంది; జనులకున్= ప్రజలకు; కర్మ నామరూపభేదంబులు= పనుల పేర్ల, ఆకృతుల వైవిధ్యాన్ని; ఎట్లు నిర్దేశించెన్= ఎలా ఏర్పరిచాడు; ఇంతయున్= ఈ విషయమంతా; సవిస్తరంబుగాన్= సవివరముగా; వివరింపుము= తెలియజేయుము; ఉత్తమ శ్లోకమౌళిమండనుండును= ఉత్తమోత్తములలో కిరీటంలా ప్రకాశించేవారు; యోగి+ఈశ్వరుండును= యోగులలో శ్రేష్ఠుడును; ఐన= అయినటువంటి; పుండరీక+అక్షుని= శ్రీహరియొక్క; చరిత్ర శ్రవణంబునన్+కాని= గాథను వింటేనే కాని; జన్మమరణ+ఆది= పుట్టుట, గిట్టుట మొదలగు; సకల దుఃఖ+ఆకరంబులును= సకల శోకాలకు నిలయాలును; దుష్కర్మప్రాప్తంబులును= చెడు కృత్యాలచే పొందబడినవియును; అగు భవబంధంబులు= అయిన సంసార బంధాలు; తెగవు= విడిపోవు; అని వెండియున్+ఇట్లు+అనియెన్= అని విదురుడు మైత్రేయునితో మరియు ఇలా అన్నాడు.

**తా :** విదురుడు మైత్రేయునితో ఇలా అంటున్నాడు. మహర్షీ! సత్త్వరజస్తమోగుణాలతోకూడిన మాయను నియంత్రించే భగవంతుడు సర్వస్వతంత్రుడుకదా! అయినా ఎందుకు అవతరించాడు? ఏ యే అవతారాలలో ఏ యే కర్మలాచరించాడు? నిష్క్రియుడైన ఈశ్వరుడు ఈ ప్రపంచాన్ని ముందు ఏ విధంగా సృష్టించాడు? ఎలా పాలించాడు? తిరిగి మళ్లీ ఎలా తనలో లయం చేసుకొన్నాడు? ఈ బ్రహ్మాండంలో తాను ఎలా ప్రవర్తించాడు? బ్రహ్మాదిరూపాలతో ఎలా క్రీడించాడు? బ్రాహ్మణులను, గోవులను, దేవతలను రక్షించేందుకు మత్స్యం మొదలైన అవతారాలు ధరించి, ఏ ప్రయోజనాలు సాధించాడు? బ్రహ్మాండంలో లోపలి భాగాలైన ఇంద్రాది లోకపాలురతో కూడిన లోకాలను, లోకాలోక పర్వత ప్రాంతాల బాహ్యరూపాలను ఏ తత్త్వభేదాలతో, ఎలా పుట్టించాడు? సృష్టిలోని జీవకోటి ఎవరిని సేవించి బ్రదుకుతుంది? ప్రజలకు కర్మలలో, పేర్లలో, రూపాలలో భేదాలను ఎలా ఏర్పరిచాడు? ఇదంతా నాకు సవిస్తరంగా వివరించు. ఉత్తమోత్తములకు శిరోభూషణం వంటివాడైన, యోగులకే అధిపతియైన శ్రీహరి చరిత్రను వింటే తప్ప జననమరణరూపాలైన సంసారబంధనాలు వీడవు.

**తర. సతతమున్ సరసీరుహోదరసత్కథామృతపూరమున్**
**శ్రుతిపుటాంజలిచేత నిమ్ముల జుఱ్ఱియుందనివోదు భా**
**రతకథామిషమూని విష్ణుఁబరాశరప్రియసూతి స**
**న్మతి నుతించిన చోట సన్మునినాథ! నా మది నుబ్బుదున్. 185**

**ప్రతి :** సత్+మునినాథ!= మునిశ్రేష్ఠుడా!; సతతమున్= ఎల్లపుడు; సరసీరుహ+ఉదర= పద్మనాభునియొక్క; సత్కథా= చక్కని కథలనెడి; అమృతపూరమున్= అమృతసారాన్ని; శ్రుతిపుట+అంజలిచేతన్= చెవులనే దోసిళ్ళతో; ఇమ్ములన్= ఎంతో ఆదరంగా; జుఱ్ఱియున్= పూర్తిగా ఆస్వాదించినా; తనివోదు= తృప్తి తీరదు; భారత కథామిషము+ఊని= భారత కథ చెపుతున్న వంకతో; పరాశరప్రియసూతి= పరాశరుని ముద్దుల కుమారుడైన వ్యాసుడు; విష్ణున్= శ్రీహరిని (సందర్భానుసారంగా); సన్మతిన్+నుతించిన చోటన్= భక్తితో కీర్తించినచోట; నా మదిన్+ఉబ్బుదున్= మనసులో నేనెంతో ఆనందపడిపోతాను.

**తా :** ఓ మునీంద్రా! విష్ణుకథామృతాన్ని నేను చెవులనే దోసిళ్లుగా చేసికొని ఎంత గ్రోలినా తనివితీరదు. భారతకథను చెపుతున్న వంకతో వ్యాసుడు సందర్భానుసారంగా విష్ణుకీర్తన చేసినపుడంతా నా మనసులో ఎంతో పొంగిపోతాను.

**క. ఇతర కథాకర్ణనముల, నతి హేయత నొందెఁ జిత్త మనఘాత్మ! రమా**
**పతి చరితామృతరతి సం, సృతి వేదనలెల్లఁ బాయఁ జేయు మునీంద్రా! 186**

**ప్రతి :** ముని+ఇంద్రా!= మహర్షీ!; ఇతర కథా+ఆకర్ణనములన్= ఏవో కాకమ్మ కథలను విని; చిత్తము= మనస్సు; అతి హేయతన్+ఒందెన్= వాటిని విడిచిపెట్టాలనే కోరికను పొందింది; రమాపతి= మాధవుని; చరిత+అమృత రతి= కథ అనే అమృతంపై కోరిక; సంసృతి వేదనలు+ఎల్లన్= సంసార సంబంధమైన బాధలనన్నిటిని; పాయన్+చేయున్= పోగొట్టును.

**తా :** మైత్రేయమహర్షీ! ఏవేవో పిచ్చికథలు చాలానే విన్నాను. వాటిమీద నా మనసులో రోత పుట్టింది. మాధవుని చరిత్రమనే అమృతం గ్రోలాలనే కోరికమాత్రమే సంసారలంపటాలను పోగొడుతుంది.

**తే. భూరివిజ్ఞాననిధులగు నారదాది, నిర్మలాత్ముల కయిన వర్ణింపరాని**
**హరికథామృతపానంబునందు, విసివి యొల్ల ననువాఁడెపో వెఱ్ఱిగొల్లఁ డనఘ! 187**

**ప్రతి :** అనఘ!= పుణ్యాత్ముడా!; భూరివిజ్ఞాననిధులు+అగు= గొప్ప విజ్ఞానమునకు నిధులవంటివారైన; నారద+ఆది నిర్మల+ఆత్ములకున్+అయినన్= నారదుడు మొదలగు నిర్మలమైన మనస్సు కలవారికయినా; వర్ణింపరాని= వర్ణింపశక్యముకాని; హరికథా+అమృతపానంబునందున్= విష్ణుకథ అనే అమృతాన్ని ఆస్వాదించడంలో; విసివి= విసుగుచెంది; ఒల్లను+ అనువాఁడెపో= తిరస్కరించువాడే; వెఱ్ఱిగొల్లఁడు= తెలివితక్కువవాడు.

**తా :** ఓ పుణ్యాత్ముడా! మహావిజ్ఞానసంపన్నులైన నారదాదులకుకూడా వర్ణింపశక్యంకాని విష్ణుకథలను వినడానికి ఆసక్తి చూపించనివాడు నిజంగా తెలివితక్కువవాడే.

**విశే :** గొల్ల శబ్దానికి గోవులను కాచువాడు, తెలివి తక్కువవాడు అని రెండు అర్థాలు.

**వ. అదియునుంగాక. 188**

**ప్రతి :** అదియునున్+కాక= అంతే కాకుండా.

**సీ. అరవిందనాభుని యపరావతారమై జనన మొందిన పరాశరసుతుండు**
**చతురవర్ణాశ్రమాచార ధర్మంబులు రవణింప లోకవిడంబనంబు**
**లగు గ్రామ్యకథలు పెక్కర్థిఁ గల్పించుచు హరికథావర్ణన మందులోన**
**నించుకించుక గాని యేర్పడఁ జెప్పమి నంచితవిజ్ఞానమాత్మ నిలుప**

**తే. కున్నఁజింతించి మఱి నారదోపదిష్టుఁ, డగుచు హరివర్ణనామృత మాత్మఁ గ్రోలి**
**విమలసుజ్ఞాననిధి యన వినుతి కెక్కి, ధన్యుఁడయ్యెను లోకైకమాన్యుఁడగుచు. 189**

**ప్రతి :** అరవిందనాభుని= పద్మనాభుని; అపర+అవతారమై= మరియొక అవతారము+ఐ; జననము+ఒందిన= జన్మించిన; పరాశరసుతుండు= పరాశరుని కుమారుడైన వ్యాసుడు; చతుర= యుక్తియుక్తముగా; వర్ణ= వర్ణముల, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర కులముల; ఆశ్రమ= బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాస ఆశ్రమాల; ఆచార ధర్మంబులు= విధివిధానములు; రవణింపన్= ప్రవర్తిల్లునట్లుగా; లోకవిడంబనంబులు+అగు= లోకులు అనుసరింపదగిన; గ్రామ్యకథలు= సామాన్య కథలు; పెక్కు= ఎన్నింటినో; అర్థిన్= కోరి; కల్పించుచున్= భారతకథలో ప్రస్తావించి చెప్పి; అందులోనన్= ఆ కథలో; హరికథావర్ణనము= విష్ణుమాహాత్మ్యమును తెలిపే విషయాన్ని; ఇంచుక+ఇంచుక+కాని= కొద్దికొద్దిగానే తప్ప; ఏర్పడన్+చెప్పమిన్= విశేషంగా చెప్పకపోవడంచేత; అంచిత విజ్ఞానము= గొప్పగా మన్నింపదగిన విజ్ఞానము; ఆత్మన్+

నిలుపక+ఉన్నన్= హృదయంలో నిలుపకపోవటంవలన; చింతించి= బాధపడి; మఱి= అటుపైన; నారద+ ఉపదిష్టుఁడు+అగుచున్= నారదునిచే ఉపదేశింపబడ్డవాడై; హరివర్ణన+అమృతము= శ్రీహరి కీర్తనమనే అమృతాన్ని; ఆత్మన్+క్రోలి= బుద్ధిచేత ఆస్వాదించి; విమలసుజ్ఞాననిధి+అనన్= స్వచ్ఛమైన మంచి జ్ఞానానికి నిధి అనునట్లుగా; వినుతికిన్+ఎక్కి= ప్రశస్తిని పొంది; లోక+ఏకమాన్యుఁడు+అగుచున్= లోకంలో ఒకే ఒక గౌరవాస్పదుడై; ధన్యుఁడు+అయ్యెను= చరితార్థుడు అయ్యెను.

**తా :** శ్రీహరి మరొక అవతారమే అయిన వ్యాసమహర్షి అన్ని వర్ణాల, ఆశ్రమాల ధర్మాలను అందంగా చెప్పదలచినవాడై తన భారతంలో ఎన్నో సామాన్య కథలను కల్పించాడు. కాని అందులో హరిలీలావిశేషాలను నామమాత్రంగానే తప్ప విశేషంగా చెప్పకపోవడంచేత మానసికంగా చింతిల్లుచున్నప్పుడు నారదుడు వచ్చి, విష్ణుకథాలీలలే ప్రధానంగా భాగవతాన్ని రచించుమనుటచే అది రచించి, మహాజ్ఞానిగా లోకంలో ఖ్యాతి పొందాడు.

**వ. కావున. 190**

**తా :** అందువలన

**క. సరసిరుహోదరు మంగళ, చరితామృత మాత్మఁగ్రోలు జనుఁడితరకథా**
**గరళముఁగ్రోలునె? హరి సం, స్మరణము జీవులకు నఖిలసౌఖ్యద మనఘా! 191**

**ప్రతి :** అనఘా!= పుణ్యాత్ముడా!; సరసిరుహ+ఉదరు= పద్మనాభుని; మంగళ= శుభకరమైన; చరిత= కథయనెడి; అమృతము= సుధను; ఆత్మన్+గ్రోలు= మనసారా ఆస్వాదించే; జనుఁడు= మానవుడు; ఇతరకథా గరళమున్= వేరు వేరు కథలరూపంలో ఉండే విషాన్ని; క్రోలునె?= త్రాగునా? (త్రాగడు); హరిసంస్మరణము= విష్ణువును ధ్యానించుట; జీవులకున్= ప్రాణులకు; అఖిలసౌఖ్యదము= సమస్త సుఖములను ప్రసాదిస్తుంది.

**తా :** పుణ్యాత్ముడా! శ్రీహరికథామృతం తాగడానికి అలవాటు పడ్డ మనుజుడు ఇతర కథలనే విషాన్ని క్రోలగలడా! హరినామస్మరణం మాత్రమే జీవులకు అన్నివిధాల సుఖదాయకం.

**క. శ్రీవనితాధిప! నామ క, థా విముఖుల కిహముఁబరము దవ్వై పిదపం**
**బోవుదురు నరకమునకున్, వావిరి నే వారిఁజూచి వగతు మునీంద్రా! 192**

**ప్రతి :** ముని+ఇంద్రా!= మహర్షీ!; శ్రీవనితా+అధిప= లక్ష్మీవల్లభుడైన హరియొక్క; కథా+విముఖులకున్= కథలయందు ఇష్టం లేనివారికి; ఇహమున్+పరమున్= లౌకిక పారలౌకిక సుఖ జీవనములు రెండూ; దవ్వు+ఐ= దూరమై; పిదపన్= అటుతరువాత; వావిరిన్= క్రమముగా; నరకమునకున్+పోవుదురు= నరకలోకానికి వెళతారు; నేన్= నేను (విదురుడు); వారిన్+చూచి= అటువంటివారిని కనుగొని, వీక్షించి; వగతున్= బాధపడుతుంటాను.

**తా :** మహర్షీ! శ్రీహరి కథలను వినుటయందాసక్తి లేనివారికి ఇహపరాలు రెండూ క్రమంగా చెడిపోతాయి. తరువాత నరకానికి చేరుకొంటారు. అటువంటివారిని చూచి నేను ఎంతో బాధపడుతుంటాను.

**క. ఏ నరుఁడే నొక నిమిషం, బైన వృథావాదగతిని హరిపదకమల**
**ధ్యానానందుఁడు గాఁడే, నా నరునకు నాయు వల్పమగు మునినాథా! 193**

**ప్రతి :** మునినాథా!= మునిశ్రేష్ఠా!; ఏ నరుఁడు+ఏనిన్= ఏ మానవుడైనా; వృథావాదగతినిన్= పనికిరాని వాదనలతో గడుపుచు; ఒక నిమిషంబు+ఐనన్= నిమిషకాలమైనా; హరి= శ్రీమన్నారాయణమూర్తియొక్క; పదకమల= పాదపద్మముల యొక్క; ధ్యాన= ధ్యానముచే; ఆనందుఁడు= ఆనందించువాడు; కాఁడు+ఏనిన్= కాకపోతే; ఆ నరునకున్= అట్టిమానవునికి; ఆయువు= ఆయుస్సు; అల్పమగున్= తగ్గిపోతుంది.

**తా :** మునినాథా! మైత్రేయా! ఎవడైతే వృథావిషయవాదనలతో కాలం గడుపుతూ, క్షణకాలమైనా శ్రీహరిపాదకమలాలను ధ్యానించుటచే కలిగే ఆనందాన్ని పొందడో అతనికి ఆయుర్దాయం తగ్గిపోతుంది.

**చ. మృదుగతిఁబువ్వుఁ దేనియ రమించుచుఁబానము సేయఁ బాఱు ష**
**ట్పదమునుబోలి యార్తజనబాంధవు విశ్వభవస్థితివ్యయా**
**స్పదమహితావతారుఁడగు పంకరుహోదరు నిత్యమంగళ**
**ప్రద గుణకీర్తనామృతముఁ బాయక గ్రోలెదఁ జెప్పవే దయన్. 194**

**ప్రతి :** మృదుగతిన్= సుకుమారముగా; పువ్వు+తేనియన్= పూవులోని మకరందాన్ని గ్రహించి; రమించుచున్= ఆనందిస్తూ; పానము+చేయన్+పాఱు= క్రోలుటకు వెళ్లే; షట్పదమును+పోలి= తుమ్మెదవలె; ఆర్తజనబాంధవున్= ఆపదలో ఉన్నవారిపాలిటి బంధువు; విశ్వ= సృష్టియొక్క; భవ= పుట్టుక; స్థితి= ఉనికి; వ్యయ+ఆస్పద= లయములకు కారణమైన; మహిత= స్తవనీయమైన; అవతారుఁడు+అగు= అవతారము పొందినవాడగు; పంకరుహ+ఉదరు= పద్మనాభునియొక్క; నిత్యమంగళప్రద= శాశ్వతమైన శుభాన్ని అందించే; గుణ= గుణములను గూర్చిన; కీర్తన+అమృతమున్= సంకీర్తనమనెడు అమృతాన్ని; పాయక= విడువక; క్రోలెదన్= ఆస్వాదించెదను; చెప్పవే+దయన్= నన్ను అనుగ్రహించి చెప్పుము.

**తా :** తుమ్మెద పువ్వు తేనియను ఆనందంగా ఆస్వాదించేందుకు ఎలా వెళుతుందో అలాగే నేనుకూడా ఆపదలో ఉన్నవారి పాలిటి బంధువు, ఈ ప్రపంచం సృష్టి స్థితిలయాలకు కారణభూతుడై అవతరించినవాడు అయిన శ్రీహరిగుణకీర్తనామృతాన్ని సంతోషంగా ఆస్వాదిస్తాను. దయచేసి నాకు చెప్పు మహర్షీ!

**క. అని విదురుఁడు మైత్రేయుం, దను మునినాయకుని నడిగె నని వేదవ్యా**
**సుని తనయుం డభిమన్యుని, తనయునకుంజెప్పి మఱియుఁ దగ నిట్లనియెన్. 195**

**ప్రతి :** అని= ఈ విధముగా; విదురుఁడు= విదురుడు; మైత్రేయుండు+అను= మైత్రేయుడను పేరుగల; ముని+నాయకునిన్= మహర్షిసత్తముని; అడిగెన్+అని= ప్రార్థించెనని; వేదవ్యాసుని తనయుండు= వేదవ్యాసుని కుమారుడైన శుకమహర్షి; అభిమన్యుని తనయునకున్= అభిమన్యుని సుతుడైన పరీక్షిత్తునకు; చెప్పి= వచించి; మఱియున్= ఇంకా; తగన్+ఇట్లు+అనియెన్= తగిన విధంగా ఇలా పలికాడు.

**తా :** అలా విదురుడు మైత్రేయుని ప్రార్థించాడని శుకుడు పరీక్షిత్తుతో చెప్పి, ఇంకా ఇలా చెప్పాడు.

**వ. ఇట్లు విదురుండు మైత్రేయు నడిగిన నతండతనిం గని యతిమృదుమధుర వచన రచనుండై యిట్లనియె: ననఘా! కృష్ణకథాశ్రవణ తత్పరుండవై నీవ నన్నడిగితివి గావున భద్రంబయ్యె: నీవు భగవద్భక్తుండవు గావున హరికథాసక్తుండవగుట విచిత్రంబు గా దదియును గాక మాండవ్య శాపంబున సాత్యవతేయువలన**

**భ్రాతృక్షేత్రంబున శూద్రయోనిం బుట్టినట్టి ప్రజాసంయమనుండవగు యముండవు: నారాయణునకుం బ్రియతముండవు గావునం గృష్ణుండు నిర్యాణకాలంబునం దన సన్నిధికిం జనిన నన్ను డాయం జీరి విజ్ఞానం బెల్ల నుపదేశించి నీకు నెఱింగింపు మని యానతిచ్చుటంజేసి యవశ్యంబును నీకు నెఱింగింతు; దత్తావధానుండవై వినుము. 196**

**ప్రతి :** ఇట్లు విదురుండు= ఈ విధంగా విదురుడు; మైత్రేయున్+అడిగినన్= మైత్రేయమహర్షిని అడుగగా; అతండు అతనిన్+కని= మైత్రేయుడు విదురుని చూచి; అతి మృదు= మిక్కిలి మెత్తనైన; మధుర= తియ్యనైన; వచన రచనుండు+ఐ= పలుకులను పలికేవాడై; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికెను; అనఘా!= పాపరహితుడవైన విదురా!; కృష్ణకథా శ్రవణతత్పరుండవు+ఐ= వాసుదేవుని కథలను వినుటయందు ఆసక్తుడవై; నీవు+అ= నీవే; నన్నున్+అడిగితివి= నన్ను అడిగావు; కావునన్+భద్రంబు+అయ్యెన్= కాబట్టి మంగళమయింది (హరికథ వక్తకు శ్రోతకుకూడా మంగళదాయకము); నీవు భగవత్+భక్తుండవు= నీవు భగవానునియందు భక్తి కలవాడవు; కావునన్= అందుచేత; హరికథా+ఆసక్తుండవు+అగుట= విష్ణుకథలయందు ఆసక్తి కలవాడవగుట; విచిత్రంబు+కాదు= ఆశ్చర్యకరము కాదు; అదియునున్+కాక= అంతేకాకుండా; మాండవ్య శాపంబునన్= మాండవ్యమహర్షి శాపంవలన; సాత్యవతేయువలనన్= సత్యవతి కుమారుడైన వ్యాసునివలన; భ్రాతృక్షేత్రంబునన్= వాని సోదరుని క్షేత్రంలో; శూద్రయోనిన్+పుట్టినట్టి= శూద్ర స్త్రీ గర్భమునుండి పుట్టిన; ప్రజాసంయమనుండవు+అగు= ప్రజలను నియంత్రించు; యముండవు= యమధర్మరాజువు; నారాయణునకున్= శ్రీహరికి; ప్రియతముండవు= మిక్కిలి ఇష్టుడవు; కావునన్= అందువలన; కృష్ణుండు= వాసుదేవుడు; నిర్యాణకాలంబునన్= అవసాన సమయంలో; తన సన్నిధికిన్= ఆయన సమీపమునకు; చనిన నన్నున్= వెళ్లిన నన్ను; డాయన్+చీరి= దగ్గరకు పిలిచి; విజ్ఞానంబు+ఎల్లన్= వేదాంతజ్ఞానమంతయు; ఉపదేశించి= బోధించి; నీకున్+ఎఱింగింపుము+అని= విదురుడవైన నీకు తెలియజేయుమని; ఆనతి+ఇచ్చుటన్+చేసి= ఆదేశించుటచేత; అవశ్యంబును= తప్పక; నీకున్+ఎఱింగింతున్= నీకు తెలియజేస్తాను; దత్త+అవధానుండవై వినుము= సావధానంగా వినుము.

**తా :** విదురుడు అడిగినమీదట మైత్రేయుడు అందుకొని సున్నితమైన, తియ్యనైన మాటలతో ఇలా అన్నాడు. పుణ్యాత్ముడా! శ్రీకృష్ణుని కథను వినుటయందు మిక్కిలి ఇష్టంతో నీవు నన్నడిగావు. చాలమంచిది. నీవు భగవంతునియందు భక్తిగలవాడవు కనుక శ్రీహరికథలను వినుటయందు ఆసక్తి కలిగియుండుట వింత కాదు. అదీగాక నీవు మాండవ్య మహర్షి శాపము కారణంగా వ్యాసమహర్షివలన శూద్రస్త్రీయందు జన్మించిన యమధర్మరాజువు. శ్రీమన్నారాయణునికి ప్రేమపాత్రుడవు. అందుకనే శ్రీకృష్ణుడు చివరి సమయంలో నాకు తత్త్వజ్ఞానాన్ని అనుగ్రహించి, దానిని నీకు చెప్పుమని ఆదేశించాడు కనుక తప్పనిసరిగా నీకు బోధిస్తాను. సావధానుడవై ఆలకించు.

**క. వనజాక్షయోగమాయా, జనితంబగు విశ్వజననసంస్థానవినా**
**శనముల తెఱఁగెఱిఁగింపుచు, ననఘా! విష్ణుని మహత్త్వ మభివర్ణింతున్. 197**

**ప్రతి :** అనఘా!= పుణ్యాత్ముడా!; వనజాక్ష= పద్మనేత్రుడైన విష్ణువుయొక్క; యోగమాయా= యోగమాయవల్ల; జనితంబు+అగు= ఏర్పడినటువంటి; విశ్వ= లోకముయొక్క; జనన= సృష్టి; సంస్థాన= స్థితి; వినాశనముల= లయముల; తెఱఁగు= విధానమును; ఎఱిఁగింపుచున్= తెలియజేస్తూ; విష్ణుని= శ్రీహరికి సంబంధించిన; మహత్త్వము= మాహాత్మ్యమును; అభివర్ణింతున్= తెలియజేస్తాను.

**తా :** పుణ్యాత్ముడా! శ్రీమన్నారాయణుని యోగమాయవల్ల ఏర్పడిన జగత్తుయొక్క సృష్టి స్థితిలయాల పద్ధతిని తెలియజేస్తూ ఆ శ్రీహరి మాహాత్మ్యంకూడ తెలియజేస్తాను.

**సీ. సకలజీవులకెల్లఁ బ్రకటదేహము నాత్మ నాథుండుఁబరుఁడు నానావిధైక**
**మత్యుపలక్షణ మహితుండు నగు భగవంతుండు సృష్టిపూర్వంబునందు**
**నాత్మీయమాయాలయంబు నొందిన విశ్వగర్భుఁడై తాన యొక్కటి వెలుంగు**
**పరమాత్ముఁ డభవుం డుపద్రష్ట యయ్యు వస్త్వంతరపరిశూన్యుఁడగుటఁజేసి**

**తే. ద్రష్ట గాకుండు మాయాప్రధానశక్తి, నతుల చిచ్ఛక్తి గలవాఁడు నగుచుఁదన్ను**
**లేనివానిఁగఁ జిత్తంబులోనఁదలఁచి, ద్రష్ట యగుఁదన భువననిర్మాణవాంఛ. 198**

**ప్రతి :** సకల జీవులకున్+ఎల్లన్= సమస్త జీవులకు; ప్రకటదేహమున్= ప్రకటమైన దేహమైనవాడు; ఆత్మనాథుండున్= తనకు తానే నాథుడైనవాడు; పరుఁడున్= సర్వజగత్తునకు నాథుడైనవాడు; నానావిధ+ఏక= అనేకవిధములుగా కనిపించే ఏకరూపమైన; మతి+ఉపలక్షణ మహితుండు= బుద్ధి మొదలగు వానిచేత తెలియదగిన మహిమగలవాడు; భగవంతుండు= భగవానుడు; సృష్టిపూర్వంబునందున్= సృష్టికి ముందు; ఆత్మీయమాయాలయంబున్= తన మాయయందు ఐక్యమును; ఒందిన= పొందిన; విశ్వగర్భుఁడు+ఐ= ప్రపంచము గర్భమునందు కలవాడై; తాన+ఒక్కటి వెలుంగు= తాను ఒకే ఒక్కడుగా వెలుగు; పరమాత్ముఁడు= పరబ్రహ్మ; అభవుండు= పుట్టుకలేనివాడు; ఉపద్రష్ట= కార్యవిచారణ చేయువాడు; అయ్యున్= అయికూడ; వస్తు+అంతర పరిశూన్యుఁడు= మరే వస్తువు లేక తానే సర్వస్వమైనవాడు; అగుటన్+చేసి= అగుటచేత; ద్రష్ట+కాకుండున్= వేరుగా దర్శించువాడు కాడు; మాయాప్రధానశక్తిన్= మాయాసంబంధమైన ముఖ్యశక్తివలన; అతుల, చిత్+శక్తి కలవాఁడున్= మిక్కిలి జ్ఞానశక్తి కలవాడును; అగుచున్= అవుతున్నవాడై; తన్నున్= తనను; లేనివానిఁగన్= కర్తకానివానిగా; చిత్తంబులోనన్= అంతరంగమునందు; తలఁచి= భావించి; తన= తనయొక్క; భువననిర్మాణవాంఛన్= జగన్నిర్మాణపు కోరికతో; ద్రష్ట+అగున్= గుణదోషములను దర్శించువాడగును.

**తా :** ఈ విశ్వంలోగల సమస్త జీవుల దేహాలూ భగవంతుని స్వరూపాలు. సమస్తమైన ఆత్మలూ ఆయనే. సర్వానికీ ప్రభువు ఆయనే. పరాత్పరుడు. అనేకవిధాలైన బుద్ధులకు ఉపలక్షణమైన మహానుభావుడు. అటువంటి భగవంతుడు తన మాయవల్ల తనలోనే లీనమైన ప్రపంచాన్ని, తనగర్భంలో ధరించి ఒక్కడుగా వెలుగుతూ ఉంటాడు. ఆ పరమాత్మ పుట్టుకలేనివాడు. సమస్తమూ పైనుండి చూచేవాడైనప్పటికీ వేరే మరేవస్తువూ లేకండా తానే సర్వమూ అయినప్పుడు ఇక ద్రష్టకాడు. కానీ మాయాప్రధాన శక్తి కలవాడై ప్రపంచాన్ని నిర్మించే కోరికతో గొప్ప చిచ్ఛక్తి గల్గి తనను తాను లేనివాడుగా మనస్సులో భావించుకొంటాడు. సృష్టికి ఉపక్రమించిన పిమ్మట ద్రష్ట అవుతాడు.

**తే. బుద్ధిఁదోఁచిన న మ్మహాపురుషవరుఁడు, కార్యకారణ రూపమై ఘనత కెక్కి**
**భూరిమాయాభిధాన విస్ఫురితశక్తి, వినుతి కెక్కిన యట్టి యవిద్యయందు. 199**

**ప్రతి :** బుద్ధిన్+తోఁచినన్= జగన్నిర్మాణము చేయాలని బుద్ధియందు తోచినపుడు; ఆ+మహాపురుషవరుఁడు= పురుషులలో ఉత్తమపురుషుడైన ఆ పరమాత్మ; కార్యకారణరూపమై= కార్యమూ కారణమూ తానే అయి; ఘనతకున్+ఎక్కి= ప్రశస్తి పొంది; భూరి= గొప్పదైన; మాయా+అభిధాన= మాయ అను పేరుతో; విస్ఫురితశక్తిన్= ప్రకటితమైన శక్తితో; వినుతికిన్+ఎక్కిన+అట్టి= పేరుగాంచినటువంటి; అవిద్యయందున్= అవిద్యయందు...

**తా :** ఆ జగన్నాథుడు జగన్నిర్మాణం చేపట్టాలనుకొన్నపుడు కార్యకారణరూపమైన మాయ అనే పేరుగల అవిద్య ఏర్పడుతుంది. దానిలో

**క. పురుషాకృతి నాత్మాంశ, స్ఫురణము గల శక్తి నిలిపి పురుషోత్తముఁ డీ**
**శ్వరుఁ డభవుం డజుఁడు, నిజో, దరసంస్థితవిశ్వ మపుడు దగఁ బుట్టించెన్. 200**

**ప్రతి :** పురుష+ఆకృతిన్= తాను పరమపురుషరూపంలో ఉండి; ఆత్మాంశ+స్ఫురణము+కల= తన అంశతో ప్రతిఫలించే; శక్తిన్+నిలిపి= శక్తిని ఆ అవిద్యయందు నిలిపి; పురుషోత్తముఁడు= పరమాత్మ; ఈశ్వరుఁడు= జగన్నాథుడు; అభవుండు= పుట్టుకలేనివాడు; అజుఁడు= బ్రహ్మ అయిన శ్రీమన్నారాయణుడు; నిజ= తనయొక్క; ఉదర= గర్భమునందు; సంస్థిత= ఉన్నటువంటి; విశ్వము= జగత్తును; అపుడు= ఆ సమయమున; తగన్= తగిన విధముగా; పుట్టించెన్= సృష్టించెను.

**తా :** జగన్నిర్మాణం చేయాలన్న ఆలోచన కలిగినపుడు తననుండి ఏర్పడిన మాయారూప అవిద్యయందు తన పురుషశక్తిని ప్రవేశపెట్టి పుట్టుకలేనివాడు, పురుషోత్తముడు, పరమేశ్వరుడు అయిన పరమాత్మ తనలో ఇమిడియున్న జగత్తును బాహిరంగా సృష్టించెను.

**సీ. ధృతిఁబూని కాలచోదితము నవ్యక్తంబుఁ బ్రకృతియు నను పేళ్లఁబరఁగు మాయ**
**వలన మహత్తత్త్వ మెలమిఁ బుట్టించె మాయాంశ కాలాదిగుణాత్మకంబు**
**నైన మహత్తత్త్వ మచ్యుత దృగ్గోచర మగుచు విశ్వనిర్మాణవాంఛ**
**నందుటఁజేసి రూపాంతరంబునఁ బొంది నట్టి మహత్తత్త్వమందు నోలిఁ**

**తే. గార్యకారణ కర్త్రాత్మకత్వమైన, మహిత భూతేంద్రియక మనోమయ మనంగఁ**
**దగు నహంకారతత్త్వ ముత్పన్న మయ్యెఁ, గోరి సత్త్వరజస్తమోగుణక మగుచు. 201**

**ప్రతి :** ధృతిన్+పూని= ధైర్యమును వహించిన; కాలచోదితమున్= కాలచోదితము; అవ్యక్తంబున్= అవ్యక్తము; ప్రకృతియున్= ప్రకృతి; అను పేళ్లన్= అనే పేర్లతో; పరఁగు= పిలువబడే; మాయవలనన్= మాయనుండి; ఎలమిన్= క్రమముగా; మహత్తత్త్వము+పుట్టించెన్= మహత్తత్త్వాన్ని పుట్టించాడు పరమాత్మ; మాయా+అంశ= మాయయొక్క అంశ కలది; కాల+ఆదిగుణ+ఆత్మకంబును+ఐన= కాలము మొదలైన గుణములతో కూడినటువంటి; మహత్తత్త్వము= మహత్‌తత్త్వము; అచ్యుత దృగ్గోచరము+అగుచున్= శ్రీహరి కంటికి మాత్రమే కనిపించునదై; విశ్వనిర్మాణవాంఛన్= ప్రపంచాన్ని నిర్మించాలనే కోరికను; అందుటన్+చేసి= పొందుటవలన; రూప+అంతరంబునన్= వేరు రూపాన్ని; పొందినట్టి= పొందినటువంటి; మహత్తత్త్వము+అందున్= మహత్తత్త్వమునందు; ఓలిన్= క్రమముగా; కార్యకారణకర్తృ+ఆత్మకత్వమైన= కార్యము, కారణము, కర్త అను పేర్లు గలదైన; మహిత= గొప్పతనంకల; భూత+ఇంద్రియక= పంచమహాభూతములు కల ఇంద్రియములు; మనోమయము+అనంగన్= మనస్సులో నిండినది అనగా; తగు= తగినట్టి; అహంకారతత్త్వము= అహంకారమను పేరుగల తత్త్వము; కోరి= భగవత్ సంకల్పము మేరకు; సత్త్వరజస్తమో గుణకము+అగుచున్= సత్త్వము, రజస్సు, తమస్సు అను గుణములు కలదిగా అవుతూ; ఉత్పన్నము+అయ్యెన్= ఏర్పడినది.

**తా :** మాయకు మూడు పేర్లున్నాయి. కాలచోదితం, అవ్యక్తం, ప్రకృతి అని. ఆ మాయనుండి మహత్తత్త్వం పుట్టింది. దానికి కాలం మొదలైన గుణాలున్నాయి. భగవంతునికి మాత్రమే గోచరమయ్యే ఆ మహత్తత్త్వంనుండి కార్యకారణ కర్తృత్వాలనే

గుణాలు ఏర్పడ్డాయి. వాటినుండి పంచభూతాలు, ఇంద్రియాలు, మనస్సు ఏర్పడ్డాయి. వాటినుండి సత్త్వరజస్తమోగుణాలతో కూడిన అహంకారం పుట్టింది.

**విశే :** పంచమహాభూతాలు అయిదు – నేల, నీరు, నిప్పు, గాలి, నింగి.

జ్ఞానేంద్రియాలు అయిదు – కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మం

కర్మేంద్రియాలు అయిదు – వాక్కు, పాణి, పాదం, మూత్రద్వారం, మలద్వారం.

**వ. వెండియు రూపాంతరంబులం బొందుచున్న సాత్త్వికాహంకారంబువలన మనంబును, వైకారిక కార్యభూతంబులైన దేవతా గణంబులును సంభవించె. ఇంద్రియాధిష్ఠాతలైన వానివలన శబ్దంబు పూర్వంబునఁ బ్రకాశం బగుటంజేసి జ్ఞానేంద్రియంబులైన త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులును, కర్మేంద్రియంబు లయిన వాక్పాణిపాద పాయూపస్థములును, తైజసాహంకారంబున నుత్పన్నంబు లయ్యెఁ; దామసాహంకారంబువలన శబ్దస్పర్శరూప రసగంధంబు లుదయించె; నందు శబ్దంబు నిజగుణంబైన శబ్దంబు వలన నాకాశంబుఁ బుట్టించె. గగనంబు కాల మాయాంశ యోగంబునం బుండరీకాక్షు నిరీక్షణంబున స్పర్శతన్మాత్రంబువలన వాయువుం గలిగించె; బవనుండు నభోబలంబున రూపతన్మాత్రంబువలన లోకలోచనంబైన తేజంబు నుత్పాదించెఁ; దేజంబు కాల మాయాంశ యోగంబున నుత్తమశ్లోకుని విలోకనంబునఁ బవమానయుక్తం బగుచు రసతన్మాత్రంబువలన నంబువులం బుట్టించె; సలిలంబు కాల మాయాంశయోగంబునం బరమేశ్వరానుగ్రహంబు గలిగి తేజోయుక్తంబైన గంధగుణంబువలనఁ బృథివిం గలిగించె; నందు గగనంబునకు శబ్దంబును, వాయువునకు శబ్దస్పర్శంబులును, దేజంబునకు శబ్దస్పర్శరూపంబులును, సలిలంబునకు శబ్దస్పర్శరూపరసంబులును, బృథివికి శబ్దస్పర్శరూపరస గంధంబులును గుణంబులై యుండుఁ; గాల మాయాంశ లింగంబులు గలిగి మహదాద్యభిమానంబును నొందిన దేవతలు విష్ణుకళాకలితు లగుదు; రట్టి మహదాదితత్త్వంబు లైక్యంబు సాలమిం బ్రపంచంబులు గల్పింప సమర్థంబులు గాక కృతాంజలులై యోగేశ్వరేశ్వరుండైన నారాయణు నిట్లని స్తుతియించె. 202**

**ప్రతి :** వెండియున్= మరియును; రూప+అంతరంబులన్+పొందుచున్న= వేర్వేరు రూపాలను పొందుచున్న; సాత్త్విక అహంకారంబువలనన్= సత్త్వరూపమైన అహంకారంవలన; మనంబును= మనస్సును; వైకారిక కార్యభూతంబులు+ఐన= మార్పునకు మూలకారణములైన; దేవతాగణంబులును= వేల్పుల సముదాయాలును; సంభవించెన్= ఏర్పడెను; ఇంద్రియ+ అధిష్ఠాతలు+ఐన= ఇంద్రియాలకు అధిపతులైన; వానివలనన్= ఆ దేవతలవలన; శబ్దంబు= శబ్దము; పూర్వంబునన్+ ప్రకాశంబు+అగుటన్+చేసి= ముందుగా అభివ్యక్తమగుటచేత; జ్ఞాన+ఇంద్రియంబులు+ఐన= జ్ఞానేంద్రియములనబడు; త్వక్+చక్షుస్+శ్రోత్ర జిహ్వా ఘ్రాణంబులును= చర్మము, కన్ను, చెవి, నాలుక, ముక్కు; కర్మ+ఇంద్రియంబులైన= కర్మేంద్రియములు అను పేరుగల; వాక్+పాణి పాద పాయు+ఉపస్థములును= నోరు, చేయి, కాలు, గుదము, జననేంద్రియము; తైజస+అహంకారంబువలనన్= తైజసము అను పేరుగల అహంకారమునుండి; ఉత్పన్నంబులు+అయ్యెన్= పుట్టినవి; తామస+అహంకారంబువలనన్= తామసము అను పేరుగల అహంకారమునుండి; శబ్దస్పర్శరూపరసగంధంబులు= శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము; ఉదయించెన్= పుట్టినవి; అందున్= వాటిలో; శబ్దంబు= శబ్దము; నిజగుణంబు+

ఐన= తన గుణమైన; శబ్దంబువలనన్= శబ్దమునుండి; ఆకాశంబున్+పుట్టించెన్= నింగిని పుట్టించెను; గగనంబు= ఆకాశము; కాల మాయ+అంశ యోగంబునన్= కాలమాయయొక్క అంశయోగముతో; పుండరీక+అక్షు= నారాయణుని; నిరీక్షణంబునన్= చూచుటచేత; స్పర్శతత్+మాత్రంబువలనన్= స్పర్శ అనెడి తన్మాత్రచేత; వాయువున్+ కలిగించెన్= గాలిని పుట్టించెను; పవనుండు= వాయువు; నభోబలంబునన్= ఆకాశబలంతో; రూపతన్మాత్రంబువలనన్= రూపము అనెడి తన్మాత్రవలన; లోకలోచనంబు+ఐన= ప్రపంచానికి కన్ను అయిన; తేజంబున్+ఉత్పాదించెన్= కాంతిని పుట్టించెను; తేజంబు= ఆ కాంతి; కాల మాయాంశ యోగంబునన్= కాలమాయయొక్క అంశచేత; ఉత్తమశ్లోకుని విలోకంబునన్= నారాయణుని దృష్టిచేత; పవమానయుక్తంబు+అగుచున్= వాయువుతో కూడినదై; రసతన్మాత్రంబువలనన్= రసము అనెడి తన్మాత్రవలన; అంబువులన్+పుట్టించెన్= నీటిని పుట్టించెను; సలిలంబు= ఆ నీరు; కాలమాయాంశయోగంబునన్= కాలమాయయొక్క అంశయోగంతో; పరమేశ్వర+అనుగ్రహంబు+కలిగి= నారాయణుని అనుగ్రహంతో; తేజోయుక్తంబైన= కాంతితో కూడిన; గంధగుణంబువలనన్= గంధమనెడి గుణముతో; పృథివిన్+కలిగించెన్= భూమిని పుట్టించెను; అందున్= ఆ పంచభూతాలలో; గగనంబునకున్+శబ్దంబును= ఆకాశానికి శబ్దము; వాయువునకున్+ శబ్దస్పర్శంబులును= గాలికి శబ్దస్పర్శలు; తేజంబునకున్= అగ్నికి; శబ్దస్పర్శరూపంబులును= శబ్దము, స్పర్శ, రూపము; సలిలంబునకున్= నీటికి; శబ్ద, స్పర్శ, రూప, రసంబులును= శబ్దము, స్పర్శ, రూపము, రసము అనేవి; పృథివికిన్= భూమికి; శబ్దస్పర్శరూపరసగంధంబులును= శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధమును; గుణంబులు+ఐ+ఉండున్= గుణములుగా ఉంటాయి; కాలమాయాంశ లింగంబులు+కలిగి= కాలమాయయొక్క అంశకు చెందిన గుర్తులు కలిగి; మహత్+ఆది+అభిమానంబును+ఒందిన= మహత్తు మొదలగు తత్త్వాలై అభిమానాన్ని పొందిన; దేవతలు= వేల్పులు; విష్ణుకళాకలితులు+అగుదురు= నారాయణుని అంశతో కూడినవారగుదురు; అట్టి= అటువంటి; మహత్+ఆది తత్త్వంబులు= మహత్తు మొదలగు తత్త్వాలు; ఐక్యంబు+చాలమిన్= ఒకటిగా కలియలేక; ప్రపంచంబులు+ కల్పింపన్= జగత్తులను సృష్టించుటకు; సమర్థంబులు+కాక= శక్తిలేక; కృత+అంజలులు+ఐ= నమస్కరించినవారై (దేవతలు); యోగ+ఈశ్వర+ఈశ్వరుండు+ఐన= యోగేశ్వరులకే ప్రభువైన; నారాయణున్= శ్రీహరిని; ఇట్లు+అని; స్తుతియించిరి= ఈ విధంగా స్తోత్రం చేశారు.

**తా :** సాత్త్వికాహంకారం రూపాంతరాన్ని పొంది మనస్సు, దేవతాగణాలు సంభవించాయి. ఇంద్రియాలకు అధిష్ఠాతలైన ఆ దేవతాగణాలనుండి శబ్దం పుట్టింది. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు తైజసాహంకారంనుండి పుట్టాయి. తామసాహంకారంనుండి శబ్దస్పర్శరూపరసగంధాలు పుట్టాయి. శబ్దంనుండి ఆకాశం పుట్టింది. కాలమాయాంశయోగంతో శ్రీహరి దృష్టితో స్పర్శ అనే తన్మాత్రనుండి వాయువు పుట్టింది. వాయువు ఆకాశబలంద్వారా తేజస్సును పుట్టించింది. తేజస్సు వాయువును కలుపుకొని నీటిని పుట్టించింది. నీరు భూమిని పుట్టించింది. ఆకాశానికి శబ్దం, వాయువునకు శబ్దస్పర్శలు, తేజస్సునకు శబ్దస్పర్శరూపాలు, జలానికి శబ్దస్పర్శరూపరసాలు, భూమికి శబ్దస్పర్శరూపరసగంధాలు గుణాలుగా ఉంటాయి. ఆ యా గుణాలకు అధిష్ఠానదేవతలందరూ విష్ణుదేవుని కళలే. అయినా వారంతా వేరువేరుగా ఉండడంచేత ప్రపంచాన్ని సృష్టించే శక్తి లేక శ్రీమహావిష్ణువును నమస్కరిస్తూ ఇలా స్తుతించారు.

### దండకము

**శ్రీనాథనాథా! జగన్నాథ! నమ్రైకరక్షా! విపక్షక్షమాభృత్సహస్రాక్ష! నీరేజపత్రేక్షణా! దేవదేవా! భవద్దాసవర్గోపతాపంబులం బాపఁగా నోపు దివ్యాతపత్రంబు నాఁబొల్చు యుష్మత్పదాంభోజ మూలంబు**

పుణ్యాలవాలంబుగాఁ బొంది యోగీంద్రు లుద్దామ సంసార తాపంబులం బోవఁగా మీటి వర్తింతురో తండ్రి! యీశా! సమస్తాఘ నిర్ణాశ! యీ విశ్వమందెల్ల జీవుల్ భవోదగ్ర దుర్వార తాపత్రయాభీల దావాగ్నిచేఁ గ్రాఁగి దుఃఖాబ్ధిలోఁ దోఁగి యే కర్మమున్ ధర్మముం బొందఁగా లేక సంసారచక్రంబునందుం బరిభ్రామ్యమాణాత్ములై యుందు ర మ్మూఢచేతస్కులం జెప్పఁగా నేల యో దేవ! విజ్ఞాన దీపాంకురంబైన నీ పాదపంకేరుహచ్ఛాయఁ బ్రాపింతు మబ్జాక్ష! సన్మౌనిసంఘంబు లైకాంతిక స్వాంతతం బేర్చి దుర్దాంత పాపౌఘనిర్ణాశకాంబుప్రవాహాభ్ర గంగా నివాసంబు గా నొప్పు నీ పాదయుగ్మంబు యుష్మన్ముఖాంభోజ నీడోద్గతం బైన వేదాండజ శ్రేణిచేతన్ గవేషించి సంప్రాప్తులై యుందు; రో నాథ! వైరాగ్యశక్తిస్ఫుట జ్ఞాన బోధాత్ము లైనట్టి ధీరోత్తముల్ నిత్య నైర్మల్య భవ్యాంతరంగంబులం దే పరంజ్యోతి పాదాబ్జ పీఠంబు గీలించి కైవల్య సంప్రాప్తులై రట్టి నిర్వాణమూర్తిం బ్రశంసింతు; మింద్రాది వంద్యా! ముకుందా! సమస్తంబుఁ గల్పింపఁ బాలింపఁ దూలింపఁగాఁ; బెక్కు దివ్యావతారంబులం బొందు నీ పాద పంకేరుహ ధ్యానపారీణ సుస్వాంతులై యొప్పు భక్తాళికిన్ మోక్షదం బైన మీ పాద కంజాతముల్ గొల్తు; మీశా! రమాధీశ! పుత్త్రాంగనా మిత్ర సంబంధ బంధంబులం జెంది నిత్యంబు దుష్ట క్రియా లోలురై దేహగేహంబుం దోలి వర్తించు దుర్మానవ శ్రేణులం దంతరాత్ముండవై యుండియున్ దూరమై తోఁచు నీ పాదపద్మంబు లర్చింతు; మో దేవ! బాహ్యేంద్రియ వ్యాప్తి నుద్వృత్తులైనట్టి మూఢాత్ము లధ్యాత్మ తత్త్వ ప్రభావాఢ్యులై నీ పదాబ్జాత విన్యాస లక్ష్మీ కళావాసముం గన్న యయ్యుత్తమశ్లోకులం గానఁగాఁ జాల; రప్పుణ్యులా దుష్టులం జూడఁగా నొల్ల రంభోధిరాట్కన్యకాకాంత! వేదాంత శుద్ధాంత సిద్ధాంతమై యొప్పు నీ సత్కథాపార చంచత్సుధాసారపూరంబులం గ్రోలి, సౌఖ్యోన్నతిన్ సోలి, ధీయుక్తులై వ్రాలి, తాపంబులం దోలి, మోదంబులం దేలి, సంపన్నులై మన్న నిత్యప్రపన్నుల్ మహోత్కంఠతం బేర్చి వైకుంఠ ధామంబు నల్పక్రియాలోలురై కాంతు; రద్దివ్యవాసైక సంప్రాప్తికిం గోరుచున్నార; మో దేవ! వైరాగ్యవిజ్ఞాన బోధాత్మ యోగక్రియారూఢి నంతర్బహిర్వ్యాప్తిఁ జాలించి శుద్ధాంతరంగంబు గావించి హృత్పద్మవాసుండవై చిన్మయాకారమై యున్న నీ యున్న తానంత తేజో విలాసోల్లసన్మూర్తిఁ జిత్తంబులం జేర్చి యానంద లోలాత్మతం బొల్చు యోగీశ్వర శ్రేణికిం దావకీనానుకంపానులబ్ధిస్ఫుటజ్ఞానముం గల్గుటం జేసి యాయాసముం జెంద; దో దేవతాచక్రవర్తీ! సదానందమూర్తీ! జగద్గీతకీర్తీ! లసద్భూతవర్తీ! భవద్దాసులైనట్టి మమ్మున్ జగత్కల్పనాసక్త చిత్తుండవై నీవు త్రైగుణ్యవిస్ఫూర్తిఁ బుట్టించినం బుట్టుటే కాక నీ భవ్యలీలానుమేయంబుగా సృష్టినిర్మాణముం జేయ నే మెంతవారౌదు? మీ శక్తి యుక్తిన్ భవత్పూజ గావింతు; మట్లుండె నీ సత్కళాజాతులై నట్టి మమ్మెన్నఁగా నేల? యధ్యాత్మతత్త్వంబ వన్నుం బరంజ్యోతి వన్నుం బ్రపంచంబ వన్న న్నధిష్ఠాతవన్నన్ సదాసాక్షి వన్నన్ గుణాతీత! నీవే కదా పద్మపత్రాక్ష! సత్త్వాదిత్రైగుణ్య మూలంబు నా నొప్పు మాయా గుణంబందు నుద్యన్మహా తత్త్వ మైనట్టి నీ వీర్యముం బెట్టుటం జేసి నీ వింతకుం గారణం బౌదు! వాయాయి కాలంబుల న్నీకు సౌఖ్యంబు లేమెట్లు గావింతు? మే రీతి నన్నంబు భక్షింతు? మెబ్భంగి వర్తింతు? మే నిల్కడన్నుందు? మీ

**జీవలోకంబె యాధారమై యుండి భోగంబులం బొందుచు న్నున్న యి క్కార్యసంధానులై నట్టి మాకుం జగత్కల్పనా శక్తికిన్ దేవ! నీ శక్తిఁ దోడ్పాటు గావించి, విజ్ఞానముం జూపి, కారుణ్య సంధాయివై మమ్ము రక్షింపు లక్ష్మీమనఃపల్వలక్రోడ! యోగీంద్ర చేతస్సరోహంస! దేవాదిదేవా! నమస్తే నమస్తే నమః. 203**

**ప్రతి :** శ్రీనాథనాథా!= ప్రభువైన లక్ష్మీపతీ!; జగన్నాథ!= విశ్వపతీ!; నమ్ర+ఏకరక్షా!= ఆశ్రితులను రక్షించేవాడా!; విపక్ష క్షమాభృత్+సహస్రాక్ష!= శత్రువులనే పర్వతాలపాలిటి ఇంద్రుడా!; నీరేజపత్ర+ఈక్షణా!= తామర రేకులవంటి కన్నులు కలవాడా!; దేవదేవా!= దేవతలకే దేవుడవైనవాడా!; భవత్+దాసవర్గ+ఉపతాపంబులన్= నీ దాసవర్గానికి చెందిన సంసారతాపాలను; పాపఁగాన్+ఓపు= పోగొట్టజాలిన; దివ్య+ఆతపత్రంబు నాన్= గొప్ప గొడుగనునట్లుగా; పొల్చు= ఒప్పు; యుష్మత్+పద+అంభోజ= నీ పాదపద్మాల; మూలంబు= మొదలు; పుణ్య+ఆలవాలంబుగాన్= పుణ్యములకు పాదుగా; పొంది= గ్రహించి; యోగి+ఇంద్రులు= మునిశ్రేష్ఠులు; ఉద్దామసంసారతాపంబులన్= ఘోరమైన సాంసారిక తాపాలను; పోవఁగాన్+మీటి= పోవునట్లుగా గెంటి; వర్తింతురు+ఓ తండ్రి!= మసలుకొంటారు తండ్రీ!; ఈశా= ప్రభూ!; సమస్త+అఘ నిర్ణాశ!= అన్ని పాపాలను నశింపజేయువాడా!; ఈ విశ్వమందున్+ఎల్లన్= ఈ ప్రపంచమందంతటను; జీవుల్= ప్రాణులు; భవ= సంసారసంబంధమైన; ఉదగ్ర= తీవ్రమైన; దుర్వార= వారింప శక్యముకాని; తాపత్రయ= ఆధిభౌతిక, ఆధ్యాత్మిక, ఆధిదైవికములను మూడు తాపాలనే; ఆభీల దావ+అగ్నిచేన్= భయంకరమైన అడవులను కూడా కాల్చే తీవ్రాగ్నితో; క్రాఁగి= తపించిపోయి; దుఃఖ+అబ్ధిలోన్+తోఁగి= శోకమనే సముద్రంలో మునిగి; ఏ కర్మమున్+ధర్మమున్= ఏ కర్మనుగాని, ధర్మాన్ని గాని; పొందఁగాన్‌లేక= సాధించలేక; సంసార చక్రంబునందున్= జనన మరణరూప చక్రములో; పరిభ్రామ్యమాణ+ఆత్ములై= తిరుగుచున్న మనస్సు కలవారై; ఉందురు= ప్రవర్తిస్తుంటారు; ఓ దేవ!= ఓ ప్రభూ!; ఆ+మూఢచేతస్కులన్= అటువంటి మూర్ఖమైన మనస్సు కలవారిని గూర్చి; చెప్పఁగాన్+ఏల= చెప్పేదేముంటుంది; విజ్ఞాన దీప+అంకురంబు+ఐన= విజ్ఞానమనే దీపపు మొలకైన; నీ పాదపంకేరుహ+ఛాయన్= నీ పాదపద్మాల నీడను; ప్రాపింతుము= పొందెదము; అబ్జ+అక్ష= పద్మనేత్రుడా!; సత్+మౌనిసంఘంబులు= గొప్పమునిబృందాలు; ఐకాంతిక స్వాంతతన్+పేర్చి= మనస్సును ఏకాగ్రపరచుకొని; దుర్దాంత= అణపనలవికాని; పాప+ఓఘ= పాపపరంపరను; నిర్ణాశక= నశింపజేయు; అంబుప్రవాహ= నీటి ప్రవాహము కల; అభ్రగంగా నివాసంబుగాన్+ఒప్పు= మిన్నేటికి నివాసముగానుండు; నీ పాదయుగ్మంబున్= నీ చరణ సరోజాలజంటను; యుష్మత్+ముఖ+అంభోజ, నీడ+ఉద్గతంబు+ఐన= నీ ముఖపద్మమనే పక్షిగూటిలో పుట్టిన; వేద+అండజ శ్రేణిచేతన్= వేదములనే పక్షులగుంపుతో; గవేషించి= వెదకి; సంప్రాప్తులై+ఉందురు= బాగుగా పొందుతుంటారు; ఓ నాథ!= ఓ ప్రభూ!; వైరాగ్యశక్తి స్ఫుటజ్ఞానబోధ+ఆత్ములు+ఐనట్టి= వైరాగ్యముచే, శక్తిచే ఏర్పడిన స్పష్టమైన జ్ఞానంతో వికసితాత్ములైన; ధీర+ఉత్తముల్= దేనికీ చలించనివారిలో శ్రేష్ఠులు; నిత్య నైర్మల్య భవ్య+ అంతరంగంబులందున్= నిత్యమూ స్వచ్ఛముగా ఉండే గొప్ప మనస్సులయందు; ఏ పరంజ్యోతి పాద+అబ్జపీఠంబున్+కీలించి= పరమాత్మవైన ఏ నీ పాదపద్మాల పీఠాన్ని ఏర్పరచి; కైవల్య సంప్రాప్తులు+ఐరి= మోక్షాన్ని పొందారో; అట్టి నిర్వాణమూర్తిన్= అలాంటి రూపుకట్టిన ముక్తిని; ప్రశంసింతుము= స్తుతించెదము; ఇంద్ర+ఆదివంద్యా!= ఇంద్రాది దేవతలచే నమస్కరింపబడేవాడా!; ముకుందా!= మోక్షప్రదాతా!; సమస్తంబున్= సర్వజగత్తును; కల్పింపన్+పాలింపన్+తూలింపన్+కాన్= పుట్టించి, పోషించి, నశింపజేయుటకు; పెక్కు దివ్య+అవతారంబులన్+పొందు= ఎన్నో దివ్యావతారాలను స్వీకరించు; నీ పాదపంకేరుహ= నీ పాదపద్మాలను; ధ్యానపారీణ సుస్వాంతులై= ధ్యానించుటలో లగ్నమైన మనస్సు కలవారై; ఒప్పు+భక్త+ ఆళికిన్= ప్రవర్తించు

భక్తసముదాయానికి; మోక్షదంబు+ఐన= ముక్తిని ప్రసాదించు; మీ పాదకంజాతముల్+కొల్తుము= మీ పాదపద్మాలను సేవిస్తాము; ఈశా! రమా+అధీశ!= ప్రభూ! లక్ష్మీపతీ!; పుత్త్ర+అంగనా మిత్ర సంబంధ బంధంబులన్= కుమారుల, స్త్రీల, స్నేహితుల సంబంధాలనే బంధాలను; చెంది= పొంది; నిత్యంబు దుష్టక్రియా లోలురు+ఐ= ఎల్లప్పుడూ పాడుపనులయందే ఆసక్తికలవారై; దేహగేహంబు+అందు= శరీరాలనే గృహాలలో; ఓలిన్+వర్తించు= క్రమముగా ప్రవర్తించే; దుర్మానవశ్రేణులందున్= కుత్సిత మానవుల బృందాలలో; అంతరాత్ముండవు+ఐ+ఉండియున్= అంతరాత్మగా ఉండి కూడా; దూరమై తోఁచు= దూరంగా కనుపట్టే; నీ పాదపద్మంబులు+అర్చింతుము= నీయొక్క చరణసరోజాలను సేవిస్తాము; ఓ దేవ!= ఓ భగవానుడా!; బాహ్య+ఇంద్రియవ్యాప్తిన్= వెలుపలి ఇంద్రియాల వ్యాప్తిలో; ఉద్వృత్తులు+ఐనట్టి= ఎక్కువగా ప్రవర్తించే; మూఢ+ఆత్ములు= అజ్ఞానులు; అధ్యాత్మతత్త్వ ప్రభావ+ఆఢ్యులు+ఐ= వేదాంతజ్ఞాన ప్రభావంతో ప్రకాశించేవారై; నీ పద+అబ్జాత, విన్యాస, లక్ష్మీకళా+ఆవాసమున్+కన్న= నీ పాదపద్మాల విన్యాసమనే లక్ష్మీకళానిలయాన్ని గాంచిన; ఆ+ఉత్తమశ్లోకులన్= ఆ పుణ్యమూర్తులను; కానన్+కాన్+చాలరు= చూడలేరు; ఆ+పుణ్యులు= నీ పాదపద్మాలను దర్శించగలిగిన పుణ్యమూర్తులు; ఆ దుష్టులన్= ఇంద్రియలోలురై ప్రవర్తించే చెడ్డవారిని; చూడఁగాన్+ఒల్లరు= చూచుటకేని ఇష్టపడరు; అంభోధిరాట్+కన్యకా కాంత!= సముద్రతనయయైన లక్ష్మికి నాథుడా!; వేదాంత శుద్ధాంత సిద్ధాంతము+ఐ+ఒప్పు= వేదాంతమనే అంతఃపురానికి స్థిరమైన పక్షమై ఉండు; నీ సత్కథా+అపార చంచత్+సుధాసారపూరంబులన్= నీ గొప్పకథలనే మిక్కిలి చలించే అమృతవర్ష ప్రవాహాలను; క్రోలి= ఆస్వాదించి; సౌఖ్య+ఉన్నతిన్, సోలి= ఉన్నతమైన సుఖంతో పరవశించి; ధీయుక్తులు+ఐ వ్రాలి= జ్ఞానంతో కూడినవారై అతిశయించి; తాపంబులన్+తోలి= తాపత్రయాన్ని ఆవలకు గెంటి; మోదంబులన్+తేలి= ఆనందాలలో తేలియాడి; సంపన్నులై మన్న= జ్ఞానసంపదతో బ్రతికిన; నిత్యప్రపన్నుల్= నిత్యమూ శరణాగతులుగా ఉండేవారు; మహా+ఉత్కంఠతన్+పేర్చి= మిక్కిలి ఉత్సుకతను పొంది; వైకుంఠధామంబును= వైకుంఠప్రదేశాన్ని; అల్పక్రియాలోలురు+ఐ= కొద్దిపాటి ప్రయత్నంలోనే ఆసక్తి కలవారై; కాంతురు= దర్శిస్తారో; ఆ+దివ్యవాస+ఏక, సంప్రాప్తికిన్= అటువంటి ఒకే ఒక దివ్యమైనచోట నివాసాన్ని పొందడం; కోరుచున్నారము= ఆశిస్తున్నాము; ఓ దేవ= ఓ భగవంతుడా!; వైరాగ్య= దేనియందును ఆసక్తిలేకయుండుట చేతను; విజ్ఞాన= వేదాంత జ్ఞానము చేతను; బోధ= ఏర్పడిన తెలివితో; ఆత్మయోగక్రియా+ఆరూఢిన్= ఆత్మయోగమనే కృత్యముయొక్క నైపుణ్యముచేత; అంతర్+బహిర్+వ్యాప్తిన్= లోపల బయట ఉండుటను; చాలించి= నిలిపి; శుద్ధ+అంతరంగంబు+కావించి= పవిత్రమైన మనస్సును ఏర్పరచి; హృద్+పద్మవాసుండవు+ఐ+ఉన్న= హృదయ పద్మంలో నివసించినవాడవై; చిత్+మయ+ఆకారమై+ఉన్న= జ్ఞానమయమైన ఆకారం కలిగి ఉన్న; నీ= నీయొక్క; ఉన్నత= మిక్కిలి గొప్పదైన; అనంత= అంతములేని; తేజస్= కాంతియొక్క; విలాస= క్రీడచేత; ఉల్లసత్+మూర్తిన్= ప్రకాశించు ఆకారముతోనున్న నిన్ను; చిత్తంబులన్+చేర్చి= మనసులలో నిలిపి; ఆనంద లోల+ఆత్మతన్+పొల్చు= ఆనందమునకు వశమైన ఆత్మ కలిగినవారుగా ఒప్పు; యోగి+ఈశ్వరశ్రేణికిన్= మునిశ్రేష్ఠుల బృందమునకు; తావకీన+అనుకంపా+అనులబ్ధిన్= నీ దయ లభించుటచేత; స్ఫుటజ్ఞానమున్= నిస్సంశయ జ్ఞానము; కల్గుటన్+చేసి= ఏర్పడుటచేత; ఆయాసమున్+చెందదు= (ఆ ముని బృందము) ఎటువంటి శ్రమను పొందదు; ఓ దేవతా చక్రవర్తీ!= దేవతలకే చక్రవర్తివైన ఓ శ్రీహరీ!; సదా+ ఆనందమూర్తీ= నిత్యానందస్వరూపా!; జగత్+గీతకీర్తీ!= ప్రపంచముచే గానము చేయబడే కీర్తికలవాడా!; లసత్+భూతవర్తీ= ప్రకాశించే అన్నిప్రాణులయందును ఉండువాడా!; భవత్+దాసులు+ఐనట్టి మమ్మున్= తమ సేవకులమైన మమ్ము; జగత్+కల్పనా+ఆసక్త చిత్తుండవు+ఐ= ప్రపంచాన్ని సృష్టించుటయందు లగ్నమైన మనసు కలవాడవై; నీవు= కేశవుడవైన నీవు; త్రైగుణ్యవిస్ఫూర్తిన్= సత్త్వరజస్తమోగుణాల స్ఫురణతో; పుట్టించినన్+పుట్టుటే కాక= పుట్టిస్తే పుట్టడమే తప్ప; నీ భవ్యలీలా+అనుమేయంబుగాన్= నీ గొప్ప లీలలచేత ఊహింపదగినదానినిగా; సృష్టి నిర్మాణమున్+

చేయన్= జగత్తును సృష్టించుటకు; ఏము+ఎంతవారు+ఔదుము= మేమెంతవారమవుతాము; ఈ శక్తియుక్తిన్= మాకున్న ఈ శక్తియుక్తులతో; భవత్+పూజ+కావింతుము= తమను సేవించుకొందుము; అట్లు+ఉండెన్= అది అలా ఉండగా; నీ సత్+కళాజాతులు+ఐనట్టి= నీ గొప్ప కళనుండి పుట్టినట్టి; మమ్ము+ఎన్నన్+కానేల= మమ్మల్ని గణించుట ఎందుకు; అధ్యాత్మతత్త్వంబవు+అన్నన్= ఆధ్యాత్మిక తత్త్వానివి అన్నా; పరంజ్యోతివి+అన్నన్= ఒకే ఒక్క వెలుగువు అన్నా; ప్రపంచంబవు+అన్నన్= నీవే ఈ జగత్తువు అన్నా; అధిష్ఠాతవు+అన్నన్= నీవే అధినాయకుడివి అన్నా; సదాసాక్షివి+అన్నన్= సర్వకార్యాలకు నీవే సాక్షివి అన్నా; గుణాతీత!= త్రిగుణాలకు అతీతుడవైన శ్రీహరీ!; నీవే కదా!= అన్నీ నీవే కదా!; పద్మపత్రాక్ష!= సరోజాక్షా!; సత్త్వాది త్రైగుణ్యమూలంబునాన్= సత్త్వరజస్తమోగుణాల మూలమనగా; ఒప్పు= ప్రకాశించు; మాయాగుణంబు+అందున్= మాయ అనే గుణంలో; ఉద్యత్+మహాతత్త్వము+ఐనట్టి= ప్రకాశించే మహాతత్త్వమైన; నీ వీర్యమున్+పెట్టుటన్+చేసి= నీ ఓజస్సును నింపుటచే; నీవు+ఇంతకున్+కారణంబు+ఔదువు= ఈ సమస్త జగత్తునకూ నీవే కారణమవుతావు; ఆయాయి కాలంబులన్= ఆయా కాలాలలో; నీకు; ఏము= మేము; సౌఖ్యంబులు= సుఖాలను; ఎట్లు= ఏ విధంగా; కావింతుము= చేయగలము; ఏ రీతిన్= ఏ విధంగా; అన్నంబు= ఆహారము; భక్షింతుము= తినగలము; ఏ+భంగిన్+వర్తింతుము= ఎలా ప్రవర్తిస్తాము; ఏ నిల్కడన్+ఉందుము= ఏ ఉనికితో ఉంటాము; ఈ జీవలోకంబు+ఎ= ఈ ప్రాణిలోకమే; ఆధారమై+ఉండి= మూలమై ఉండి; భోగంబులున్+పొందుచున్+ఉన్న= సుఖాలనుభవిస్తున్న; ఈ+కార్యసంధానులు+ఐనట్టి= సృష్టి పనికి పూనుకోవలసివచ్చిన; మాకున్= మా అందరికీ; జగత్+కల్పనా శక్తికిన్= విశ్వాన్ని సృష్టించే సామర్థ్యానికి; దేవ!= ప్రభూ!; నీ శక్తిన్+తోడ్పాటు+కావించి= నీ సామర్థ్యాన్ని జతకూర్చి; విజ్ఞానమున్+చూపి= వివేకాన్ని ప్రసాదించి; కారుణ్యసంధాయివి+ఐ= దయను ప్రసరించినవాడవై; మమ్ము రక్షింపు= మమ్మల్ని రక్షించు; లక్ష్మీమనస్+పల్వలక్రోడ!= శ్రీదేవి మనసనే నీటిపడియలో విహరించే వరాహస్వామీ!; యోగి+ఇంద్ర చేతస్+సరస్+హంస!= మునీంద్రుల మానస సరోవరంలో విహరించే హంసమా!; దేవ+ఆదిదేవా!= దేవతలకెల్ల ఆదిదేవుడవైనవాడా!; నమః+తే నమః+తే నమః= నీకు నమస్కారము, నీకు నమస్కారము, నమస్కారము.

**తా :** ఓ శ్రీవల్లభా! భువననాయకా! ఆశ్రితరక్షకా! శత్రుపర్వతాలను కూల్చే ఇంద్రా! పద్మనేత్రా! దేవదేవా! నీ దాసుల తాపాన్ని పోగొట్టే గొడుగువంటి నీ పాదపద్మాలను ఆశ్రయించి, యోగీంద్రులు సంసారతాపాలనుండి విముక్తులవుతారు. సమస్త పాపాలను నశింపజేసేవాడవు. ఈ ప్రపంచంలోని జీవులు సంసారమనే భయంకర దావాగ్నిలో పడి మాడిపోతూ మంచికర్మలుగాని, మంచి ధర్మాచరణంగాని లేక సంసారచక్రంలోనే పడి తిరుగుతుంటారు. జ్ఞానజ్యోతితో అజ్ఞానాంధకారాన్ని పారద్రోలే నీ పాదపద్మాలనే ఆశ్రయిస్తాం. సకలపాపాలను కడిగివేసే గంగకు నీ పాదాల జంట పుట్టినిల్లు. నీ ముఖమనే గూటినుండి బయలువెడలిన పక్షులవంటివి వేదాలు. సన్మునులు వేదాలద్వారా వెదకి నీ పాదాలను పట్టుకొంటారు. వైరాగ్యంతో జ్ఞానంతో ధీరులైనవారు నిర్మలమైన మనసులందు ఏ మహాజ్యోతిరూపాన్ని నిలుపుకొని కైవల్యాన్ని పొందారో అట్టి మోక్షమూర్తివైన నిన్ను ప్రశంసిస్తాం. సృష్టి స్థితి లయాలను గావించేందుకు ఎన్నో అవతారాలను ధరించి, ధ్యానించువారికి మోక్షాన్ని ప్రసాదించే నీ పాదాలనే ఆశ్రయిస్తాం. నిత్యం పుత్రమిత్రకళత్రాది బంధాలలోనే మునిగి, చెడ్డపనులు చేస్తూండేవారి అంతరంగాలలో ఉండికూడా దూరంగా తోచే నీ పాదపద్మాలను అర్చిస్తాము. ఇంద్రియలోలురు వేదాంతజ్ఞానులైన నీ పాదార్చకుల గొప్పతనాన్ని గ్రహించలేరు. అటువంటి దుష్టులను నీ భక్తులు చూచేందుకుకూడా ఇష్టపడరు. వేదాంతానికే అంతఃపురంవంటి నీ కథామృతాన్ని ఆస్వాదించినవారు ఎంతో సౌఖ్యాన్ని పొందుతారు. సులభంగా వైకుంఠాన్ని పొందుతారు. అటువంటి స్థితిని మేము కోరుకొంటున్నాము. నీ అనుగ్రహంవలన లభించిన ఆత్మజ్ఞానం కలవారు ఎటువంటి బాధలను పొందరు. నీవు పుట్టిస్తే ఈ ప్రపంచం పుడుతుంది తప్ప సృష్టినిర్మాణం చేయడానికి మేమెంతవారం? ఏదో నిన్ను అర్చించుకొంటూ

కాలం గడిపేవారమే తప్ప నీ కళయొక్క అంశనుండి పుట్టిన మేమేపాటివారం? అధ్యాత్మతత్త్వమన్నా, పరంజ్యోతివన్నా, ప్రపంచమన్నా, అధిష్ఠాతవన్నా, సదాసాక్షివన్నా, నీవే కదా. సత్త్వరజస్తమోగుణాలకు మూలమయిన మాయలో నీ తేజస్సును ప్రవేశపెట్టి, ఈ సృష్టికి మూలకారణమయ్యావు. నీకు మేము ఎలాంటి సుఖాలను కలిగించగలము? మా ఆహారమేమిటి? మేమెలా ప్రవర్తించాలి? ఎట్టి నిలుకడను కలిగి ఉండాలి. ఈ జీవలోకమే ఆధారంగా భోగాలను పొందుతూ ఇటువంటి సృష్టికార్యానికి పూనుకొన్న మాకు జగన్నిర్మాణ విషయంలో నీ తోడ్పాటు కావాలి. తగిన జ్ఞానాన్ని నీవే ప్రసాదించాలి. దయామయుడవై మమ్మల్ని రక్షించు. లక్ష్మీదేవి మనస్సనే జలాశయంలో విహరించే మహావరాహమూర్తీ! యోగుల మానస సరోవరాలలో సంచరించే హంసమా! దేవాదిదేవా! నీకు నమస్కారం.

**సీ. అనినఁ బ్రసన్నుఁడై హరి మహదాదుల కన్యోన్యమిత్రత్వ మందకున్న**
**కతమున నిఖిలజగత్కల్పనాశక్తి వొడమ కుండుటఁదన బుద్ధి నెఱిఁగి**
**కైకొని కాలవేగమున నుద్రేకంబు నొందిన ప్రకృతితోఁబొంది నిజ బ**
**లము నిల్పి తా నురుక్రముఁడన సప్తవింశతి తత్త్వములయందు సమత నొక్క**

**తే. పరి ప్రవేశించి యా తత్త్వభవ్యగుణము, నందు జ్యేష్ఠానురూపంబు లలరఁ జెంది**
**యొకటి నొకటిని గలయక యుండి విశ్వ, రచన మెఱుఁగని యా తత్త్వ నిచయమునకు. 204**

**ప్రతి :** అనినన్= ఈ విధంగా స్తోత్రం చేయగా; హరి= శ్రీమహావిష్ణువు; ప్రసన్నుఁడు+ఐ= దయకలవాడై; మహత్+ఆదులకున్= మహత్తు మొదలగు తత్త్వాలకు; అన్యోన్య మిత్రత్వము= పరస్పర స్నేహము; అందకున్న కతమునన్= ఏర్పడకపోవడంచేత; నిఖిలజగత్కల్పనాశక్తి= సమస్తప్రపంచ నిర్మాణ సామర్థ్యము; పొడమక+ఉండుటన్= ఏర్పడక ఉండటం; తనబుద్ధిన్+ ఎఱిఁగి= తన బుద్ధిశక్తితో గ్రహించి; కైకొని= పూనుకొని; కాలవేగమునన్= కాలముయొక్క వేగంతో; ఉద్రేకంబున్+ఒందిన= ఉద్రిక్తమైన; ప్రకృతితోన్= ప్రకృతిశక్తితో; పొంది= ఏకమై; నిజబలము నిల్పి= తన తేజస్సును ప్రకృతియందు నిక్షేపించి; తాను= శ్రీహరి; ఉరుక్రముఁడు+అనన్= మిక్కిలి వేగవంతమైన గమనము కలవాడై; సప్తవింశతి+తత్త్వములయందున్= ఇరువదియేడు తత్త్వములయందును; సమతన్= సమానముగా; ఒక్కపరి= ఒకేమారు; ప్రవేశించి= లీనమై; ఆ తత్త్వభవ్యగుణమునందున్= ఆ తత్త్వాల గొప్పగుణమునందు; జ్యేష్ఠ+అనురూపంబులు= పెద్ద, చిన్న రూపాలను; అలరన్+ చెంది= ఆనందముగా పొంది; ఒకటిన్+ఒకటిని= ఒకదానిని మఱియొకటి; కలయక+ఉండి= కలియకుండా ఉండి; విశ్వరచనము+ఎఱుఁగని= జగన్నిర్మాణము తెలియని; ఆ తత్త్వ+నిచయమునకున్= ఆ ఇరువది యేడు తత్త్వాలకును...

**తా :** మహత్తు మొదలైన శక్తులన్నీ అలా స్తోత్రం చేయగా శ్రీహరి ప్రసన్నుడయ్యాడు. ఆ శక్తులకు పరస్పర మేళనం లేకపోవడం వల్ల జగన్నిర్మాణం కుదరడం లేదని గ్రహించాడు. అపుడు ప్రకృతితో తాను ఒక్కటి అయ్యాడు. తన తేజస్సును ఇరువదియేడు తత్త్వాలలో నిక్షేపించాడు. విడిగా ఉన్న ఆ శక్తులకు ఏకత్వాన్ని కలిగించాడు.

**విశే :** పృథివి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం, గంధం, రసం, రూపం, స్పర్శ, శబ్దం, నేత్రం, నాసిక, శ్రోత్రం, రసన, చర్మము, వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ, మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం, కాలం, ప్రకృతి, మహత్తు, ఇవి ఇరవై ఏడు తత్త్వాలు. మొదటి ఐదు పంచభూతాలు. తరువాతి ఐదు పంచతన్మాత్రలు. తరువాతి ఐదు జ్ఞానేంద్రియాలు. తరువాతి ఐదు కర్మేంద్రియాలు. తరువాతి నాలుగు అంతఃకరణచతుష్టయం. కాలం, ప్రకృతి, మహత్తులతో కలిపి మొత్తం ఇరువదియేడు తత్త్వాలు.

**వ. ఇట్లు విశ్వనిర్మాణ నిపుణత్వంబు నెఱుంగం జూపుచు నన్నింటికి నన్యోన్యతం గల్పించి తన యనుగ్రహంబునం బ్రేరితంబై కానంబడి క్రియాసామర్థ్యంబునం జెన్నొందిన తత్త్వవితానంబు దేవప్రేరితం బయి స్వకీయంబు లగు నంశంబులచేతం బుట్టించిన విరాడ్విగ్రహంబై తత్త్వవితతి దమయందుఁ జెందిన పుండరీకాక్షుని కళాంశంబున నొకటి కొకటికి నైక్యంబు వాటిల్లి పరిణతంబై రూపాంతరంబును జెందు;నే తత్త్వంబునఁ జరాచరలోక పుంజంబులు నిండియుండు నా హిరణ్మయంబైన విరాడ్విగ్రహంబు నొందిన పురుషుండు సర్వజీవసమేతుండై యుండె నంత. 205**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; విశ్వనిర్మాణ నిపుణత్వంబున్= జగత్ సృష్టి నైపుణ్యాన్ని; ఎఱుంగన్+చూపుచున్= తెలిసేలా చూపిస్తూ; అన్నింటికిన్= మహదాది తత్త్వాలకన్నింటికిని; అన్యోన్యతన్+కల్పించి= ఒకదానితో మరొకటి కలియుటను నేర్పించి; తన+అనుగ్రహంబునన్= తన దయతో; ప్రేరితంబు+ఐ= ప్రేరేపింపబడినదై; కానన్+పడి= కనబడి; క్రియాసామర్థ్యంబునన్= జగన్నిర్మాణ నిపుణతలో; చెన్ను+ఒందిన= ప్రకాశించిన; తత్త్వవితానంబు= తత్త్వాల సముదాయము; దేవప్రేరితంబు+అయి= భగవంతునిచేత ప్రేరేపింపబడినదై; స్వకీయంబులు+అగు= తమకు సంబంధించిన; అంశంబులచేతన్= అంశలతో; పుట్టించిన= జనింపజేసిన; విరాట్+విగ్రహంబు+ఐ= విరాట్ స్వరూపమై; తత్త్వవితతి= మహదాది తత్త్వసముదాయము; తమయందున్+చెందిన= వాటియందు ప్రవేశించిన; పుండరీకాక్షుని కళాంశంబునన్= శ్రీహరి కళల అంశలో; ఒకటికిన్+ఒకటికిన్= ఒకదానికొకటి; ఐక్యంబు వాటిల్లి= ఏకత్వం సిద్ధించి; పరిణతంబు+ఐ= పరిపాకము పొందినదై; రూప+అంతరంబును+చెందున్= వేరొక రూపాన్ని పొందుతుంది; ఏ తత్త్వంబునన్= ఏ మహదాది తత్త్వంలో; చర+అచర లోక పుంజంబులు= స్థావరజంగమాత్మకమైన జగత్తు; నిండియుండున్= నిండి ఉంటుందో; ఆ హిరణ్మయంబైన= ఆ స్వర్ణమయమైన; విరాట్+విగ్రహంబున్= ఆ పరాత్పరుని; ఒందిన పురుషుండు= పొందిన పురుషుడు; సర్వజీవసమేతుండు+ఐ= సకలజీవరాసులతోకూడినవాడై; ఉండెన్= ఉన్నాడు; అంతన్= అటు పిమ్మట...

**తా :** అలా ప్రపంచాన్ని ఏర్పరచడంలో ఆ తత్త్వాలకు శక్తిని కలిగించాడు శ్రీమన్నారాయణుడు. స్వామి ప్రేరణతో తత్త్వాలన్నీ ఒకదానితో మరొకటి కలిసి మరొక రూపాన్ని ధరిస్తూ అలా విశాలవిశ్వం ఏర్పడింది. ఆ విధంగా ఏర్పడిన జగత్తులోని అన్ని జీవరాసులలోనూ తాను అంతర్యామిగా ఉన్నాడు స్వామి.

**క. జలములలోపల నిమ్ముల, జలరుహజాతాండమందు సాహస్రాబ్దం
బులు నిలిచెఁ గార్యరూపా, కలితంబగు నవ్విరాట్సుగర్భము వరుసన్. 206**

**ప్రతి :** జలములలోపలన్= నీళ్లల్లో ఉన్న; జలరుహజాత+అండమందున్= బ్రహ్మాండములో; ఇమ్ములన్= పొందికగా; కార్యరూప+ఆకలితంబు+అగు= సృష్టిరచనా క్రియాశీలుడైన; ఆ+విరాట్+సుగర్భము= ఆ విరాట్ పురుషుడు; వరుసన్= క్రమముగా; సాహస్ర+అబ్దంబులు= వేయి సంవత్సరాలు; నిలిచెన్= ఉండిపోయాడు.

**తా :** విశ్వమంతా జలమయంగా ఉంది. అందులోనే అంతర్లీనమై బ్రహ్మాండం ఉంది. అందులో వేయి సంవత్సరాలు శ్రీమన్నారాయణుడు ఉండి బాహ్యప్రపంచాన్ని సృష్టించాడు.

**తే. దైవకర్మాత్మ శక్తి వితానములను, దగిలి తనచేతఁదనుఁదాన దైవశక్తి
యగుచు వెలుఁగొందుచును బ్రకారాంతరమునఁ, దనువు వితతంబు గాని చైతన్య మొంది. 207**

**ప్రతి :** దైవ= దైవము; కర్మ= కర్మము; ఆత్మ= ఆత్మ; శక్తివితానములను= అనే శక్తిసముదాయములతో; తగిలి= కూడుకొని; తనచేతన్= తనవల్లనే; తనున్+తాను+అ= తనకు తానుగానే; దైవశక్తి+అగుచున్= దైవశక్తియై; వెలుఁగు+ఒందుచున్= ప్రకాశిస్తూ; ప్రకార+అంతరమునన్= కల్పాంతంలో; తనువు= శరీరము; వితతంబు+కాని= విస్తరించని; చైతన్యము+ఒంది= చేతనారూపాన్ని పొంది...

**తా :** పరమాత్మ దైవం, కర్మ, ఆత్మ అనే శక్తులతో కూడుకొని తనకు తానుగా దైవంగా వెలుగొందుతాడు. కల్పాంతంలో శరీరం లేని చేతనారూపంగా ఉంటాడు.

**తే.** **రూపసంసక్తిఁజేసి నిరూఢకర్మ, శక్తియును వృత్తిభేదసంసక్తి దశ వి**
**ధములు గలిగిన ప్రాణరూపమున నాత్మ, శక్తి బోధత్వ మగుచున్న శక్తి కలిగి.** **208**

**ప్రతి :** రూపసంసక్తిన్+చేసి= రూపములతో కలిసియుండుటచే; నిరూఢకర్మ+శక్తియును= స్పష్టమైన కర్మలు చేయగల శక్తికలదై; వృత్తిభేద+సంసక్తిన్= ప్రవృత్తి భేదములు కలుగుటచే; దశవిధములు+కలిగిన= పదిరకములైన; ప్రాణరూపమునన్= ప్రాణములుగా; ఆత్మశక్తి బోధత్వము= తనను తాను తెలిసికోగలుగుటగా; అగుచున్న= పరిణతిని పొందుచున్న; శక్తి కలిగి= సమర్థత కలిగి;

**తా :** ఆ చైతన్యశక్తికి రూపాలను ధరించే శక్తి ఏర్పడుతోంది. అందువల్ల కర్మలను చేసే శక్తి వస్తోంది. ప్రవృత్తి భేదంవల్ల పదిరకాలైన ప్రాణాలు స్పందించి తనను తాను గ్రహించే శక్తి ఏర్పడుతోంది.

**విశే :** పది విధములైన ప్రాణాలు. 1. ప్రాణం, అపానం, వ్యానం, ఉదానం, సమానం
2. నాగం, కూర్మం, కృకరం, దేవదత్తం, ధనంజయం – మొత్తం పది ప్రాణాలు.

**క.** **త్రివిధంబగుచును నాధ్యా, త్మ విభేదంబులను బాపి మఱి యధిభూతా**
**త్మ విరాడ్రూప మ్మగు నిది, వివిధప్రాణులకు నాత్మవిధమై మఱియున్.** **209**

**ప్రతి :** త్రివిధంబు+అగుచును= ఆధ్యాత్మ, ఆధిభూత, ఆధిదైవములనెడి మూడువిధములై; ఆధ్యాత్మవిభేదంబులును= ఆధ్యాత్మిక భేదాలను; పాపి= పోగొట్టి; మఱి= మరియు; అధిభూత= అధిభూతమను పేరుగల; ఆత్మ= ఆత్మస్వరూపమైన (చేతనారూపమైన); విరాట్+రూపమ్ము+అగు= విరాడ్రూపమైన; ఇది= పరబ్రహ్మతత్త్వము; వివిధ ప్రాణులకున్= అన్ని జీవరాశులకును; ఆత్మవిధమై= తానే ఆత్మస్వరూపమై; మఱియున్= ఇంకనూ...

**తా :** ఆ పరబ్రహ్మతత్త్వమే ఆధ్యాత్మ, ఆధిభౌతిక, ఆధిదైవికములనే రూపాలు కలిగి, ఆధ్యాత్మిక భేదాలను రూపుమాపి, అన్ని ప్రాణులకూ తానే ఆత్మస్వరూపంగా వెలుగొందుతుంటుంది.

**క.** **జీవంబై పరమాత్మకుఁ, దావలమై యాదిమావతారంబగు న**
**ద్దేవుని గర్భంబున భూ, తావలితోడం బ్రపంచ మర్థిం దోఁచెన్.** **210**

**ప్రతి :** జీవంబు+ఐ= జీవస్వరూపమై; పరమాత్మకున్= పరబ్రహ్మతత్త్వానికి; తావలము+ఐ= స్థానమై; ఆదిమ+అవతారంబు+ అగు= తొలియవతారమైన; ఆ+దేవుని= ఆ పరమాత్మయొక్క; గర్భంబునన్= గర్భమునుండి; భూత+ఆవలితోడన్= సమస్తభూతములతో కూడిన; ప్రపంచము= జగత్తు; అర్థిన్+తోఁచెన్= మహదాది శక్తుల కోరికమేరకు ఉదయించినది.

**తా :** జీవస్వరూపమై, పరమాత్మకు స్థానమై, ఆద్యవతారమూర్తియైన పరమాత్మ గర్భవాసంనుండి సకల జీవరాసులతోకూడిన ఈ ప్రపంచం ఉద్భవించింది.

**వ. ఇట్లు దోఁచిన విరాట్పురుషుం డాధ్యాత్మి కాధిదైవి కాధిభౌతికంబులను భేదంబులచేఁ బూర్వోక్త క్రమంబున వెలుఁగొందు ననుచు విదురునకు మైత్రేయుం డెఱింగించె నని చెప్పి వెండియు నిట్లనియె. 211**

**ప్రతి :** ఇట్లు= ఈ విధముగా; తోఁచిన= అభివ్యక్తమయిన; విరాట్+పురుషుండు= పరమాత్మ; ఆధ్యాత్మిక= దేహసంబంధమైనది; ఆధిదైవిక= దైవసంబంధమైనది; ఆధిభౌతికంబులను= భౌతికసంబంధమైనది అను; భేదంబులచేన్= భేదాలతో; పూర్వ+ ఉక్త క్రమంబునన్= ముందు చెప్పిన రీతిగా; వెలుఁగొందున్+అనుచున్= ప్రకాశించుచుండును అంటూ; విదురునకున్ మైత్రేయుండు= విదురునికి మైత్రేయ మహర్షి; ఎఱింగించెన్+అని= తెలియజేసెనని; చెప్పి= శుకమహర్షి పరీక్షిన్మహారాజునకు తెలియజేసి; వెండియున్+ఇట్లు+అనియెన్= మరియు ఇలా చెప్పనారంభించాడు.

**తా :** అలా స్ఫురించిన పరమాత్మ ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికాలనే భేదాలతో ప్రకాశిస్తూంటాడు అని మైత్రేయుడు విదురునకు తెలియజేశాడు అని చెప్పి మళ్లీ శుకమహర్షి పరీక్షిన్మహారాజుతో ఇలా చెపుతున్నాడు.

**చ. హరి పరమాత్ముఁ డీశుఁ డజుఁ డాద్యుఁ డనంతుఁ డనంతమూర్తి సా**
**గర తనయాహృదీశుఁడు వికారవిదూరుఁడు నిత్యమంగళా**
**కరుఁడు కృపాపయోనిధి యకల్మషచిత్తుఁడు సర్వశక్తి తా**
**మరసవిలోచనుండు బుధమాన్యచరిత్రపవిత్రుఁడిమ్ములన్. 212**

**ప్రతి :** హరి= విష్ణువు; పరమాత్ముఁడు= తానే పరబ్రహ్మ; ఈశుఁడు= పాలకుడు; అజుఁడు= పుట్టుక లేనివాడు; ఆద్యుఁడు= ప్రభువు; అనంతుఁడు= అంతము లేనివాడు; అనంతమూర్తి= అంతములేని శరీరము కలవాడు; సాగరతనయా= సముద్రుని కొమార్తెయైన లక్ష్మీదేవియొక్క; హృద్+ఈశుఁడు= హృదయానికి అధీశుడు (భర్త); వికార విదూరుఁడు= ఎటువంటి వికారములు లేనివాడు; నిత్యమంగళ+ఆకరుఁడు= సమస్త శుభములకు నిలయమైనవాడు; కృపాపయోనిధి= దయాసముద్రుడు; అకల్మషచిత్తుఁడు= కపటములేని మనసు కలవాడు; సర్వశక్తి= సకల శక్తిస్వరూపుడు; తామరస విలోచనుండు= కమలములవంటి నేత్రములు కలవాడు; బుధ= పండితులచేత; మాన్య= గౌరవింపదగిన; చరిత్ర= నడవడికచేత; పవిత్రుఁడు= పావనుడు; ఇమ్ములన్= ఈ విధముగా సుఖముగానుండువాడు.

**తా :** విష్ణువు, పరబ్రహ్మ, ప్రభువు, పుట్టుక లేనివాడు, సంపన్నుడు, అంతం లేనివాడు, అంతంలేని శరీరం కలవాడు, సముద్రుని పుత్రికయైన లక్ష్మీదేవి హృదయానికి అధీశుడు, ఎటువంటి మార్పులు లేనివాడు, ఎల్లవేళలయందును శుభాలకు నిలయమైనవాడు, దయాసముద్రుడు, కపటంలేని మనస్సు కలవాడు, సకల శక్తిస్వరూపుడు, పద్మాలవంటి కన్నులు కలవాడు, జ్ఞానులందరూ గౌరవించే పావనమైన నడవడిక కలవాడు, ఈ విధంగా సుఖంగా ఉండేవాడు శ్రీహరి.

**వ. ఇత్తెఱంగున నీశుండగు నధోక్షజుండు మహదాది తత్త్వంబుల మనంబుల ఘనంబులగు తలంపులు దానెఱిఁగి యట్టి తత్త్వంబుల వివిధవృత్తి లాభంబునకై స్వకీయ చిచ్ఛక్తిచే నిట్టు లొనర్తునని చింతించి నిజకళాకలితంబగు విరాడ్విగ్రహంబునందు నగ్ని ప్రముఖంబగు దేవతావళి కెల్ల నివాసం బగుచుఁ గానంబడిన వైరాజపురుషుని యాస్యాద్యవయవంబుల వినిపింతు; దత్తావధానుండవై వినుము. 213**

**ప్రతి :** ఈ+తెఱంగునన్= ఈ విధముగా; ఈశుండు+అగు= జగన్నాథుడైన; అధస్+అక్షజుండు= ఇంద్రియములను అధః కరించినవాడైన విష్ణుమూర్తి; మహత్+ఆది తత్త్వంబులన్= మహత్తు మొదలగు తత్త్వాలయొక్క; మనంబుల= మనస్సులలోని; ఘనంబులు+అగు= గొప్పవైన; తలంపులు= ఆలోచనలు; తాన్+ఎఱిఁగి= శ్రీహరి గ్రహించి; అట్టి తత్త్వంబుల= అటువంటి మహదాదుల; వివిధ వృత్తిలాభంబునకు+ఐ= రకరకాల ప్రవృత్తులను పొందేందుకు; స్వకీయ చిత్+శక్తిచేన్= తన జ్ఞానబలంతో; ఇట్టులు+ఒనర్తున్+అని= ఇలా చేస్తానని; చింతించి= ఆలోచించి; నిజకళాకలితంబు+అగు= తన కళలతో కూడిన; విరాట్+విగ్రహంబునందున్= విరాట్ స్వరూపంలో; అగ్నిప్రముఖంబు+అగు= అగ్ని మొదలైన; దేవతా+ఆవళికిన్+ ఎల్లన్= దేవతాబృందములన్నింటికిని; నివాసంబు+అగుచున్= వాసస్థానమగుచు; కానన్+పడిన= గోచరించిన; వైరాజపురుషుని= విరాట్ పురుషుని; ఆస్య+ఆది+అవయవంబులన్= ముఖము మొదలైన అవయవాలనుగూర్చి; వినిపింతున్= తెలియజేస్తాను; దత్త+అవధానుండవు+ఐ= ఏకాగ్రత కలవాడవై; వినుము= ఆలకించుము.

**తా :** ఈ విధంగా జగన్నాథుడైన విష్ణువు మహదాది తత్త్వాల మనస్సులోని ఆలోచనలను గ్రహించాడు. ఆ యా తత్త్వాలు వివిధములైన ప్రవృత్తులను పొందేందుకు తన శక్తితో ఇలా చేయాలని ఆలోచించి తన కళలతోకూడిన విరాట్ స్వరూపంలో అగ్ని మొదలైన దేవతలందరికీ నివాసం కల్పించాడు. ఆ విరాట్ పురుషుని ముఖము మొదలైన అవయవాల స్వరూపాలను వివరిస్తాను. ఏకాగ్రతతో ఆలకించు అని మైత్రేయుడు విదురునితో చెప్పుచున్నాడు.

**సీ.** **నరనుత! యా దివ్యపురుషోత్తముని పృథగ్భావంబు నొంది ముఖంబువలన**
**భువనపాలకుఁడైన పవమాన సఖుఁ డంత రాత్ముఁ డీశ్వరు నంశ మైన వాణి**
**కనయంబు ననుకూల మగుచు నిజస్థానమునఁ బ్రవేశించిన ముఖమునందుఁ**
**బరఁగు జీవుండు శబ్దము నుచ్చరించుఁ బృథగ్భావములను నేత్రముల నినుఁడు**

**తే.** **చక్షురింద్రియయుక్తుఁడై సరవిఁ జెంది, రూపవిజ్ఞానమహిమ నిరూఢి నొందు**
**మఱియుఁజర్మంబునను బవమానుఁ డీశ్వ, రాంశమై తత్త్వగింద్రియమందుఁగూడి.** **214**

**ప్రతి :** నరనుత!= నరులందరిచే కొనియాడబడే విదురా!; ఆ దివ్యపురుష+ఉత్తముని= ఆ పరమాత్మనుండి; పృథక్+ భావంబును+ఒంది= వేరుపడి; ముఖంబువలనన్= మోమునందు; భువనపాలకుఁడు+ఐన= లోకపాలకుడైన; పవమానసఖుఁ డు= వాయుసఖుడైన అగ్ని; అంతరాత్ముఁడు= సర్వాంతర్యామియైన; ఈశ్వరు= పరమాత్మయొక్క; అంశమైన= అంశరూపమైన; వాణికిన్= సరస్వతికి (వాక్కునకు); అనయంబున్= ఎల్లపుడు; అనుకూలము+అగుచున్= అనుకూలించువాడు అగుచు; నిజస్థానమునన్= తనకు పరమాత్మ కల్పించిన స్థానమైన మోమునందు; ప్రవేశించినన్= ప్రవేశించుటవలన; ముఖమునందున్= మోమునందు; పరఁగు= ఒప్పు; జీవుండు= జీవాత్మస్వరూపమైన ప్రాణి; శబ్దమున్= ధ్వనిని (వాక్కును); ఉచ్చరించున్= పలుకగలుగుచుండెను; పృథక్+భావములను= మరియొక వేరురూపాలైన; నేత్రములను= కళ్లను; ఇనుఁడు= సూర్యుడు; చక్షున్+ఇంద్రియయుక్తుఁడు+ఐ= నేత్రేంద్రియముతో కూడినవాడై; సరవిన్= క్రమముగా; చెంది= పొంది; రూపవిజ్ఞానమహిమన్= రూపాన్ని గ్రహించే శక్తిని; నిరూఢిన్= స్పష్టముగా; ఒందున్= పొందును; మఱియున్= అంతేగాక; చర్మంబునను= చర్మంబునందు; పవమానుఁడు= వాయువు; ఈశ్వరాంశము+ఐ= పరమాత్మ అంశమై; తద్+త్వక్+ ఇంద్రియమందున్= ఆ చర్మేంద్రియమందు; కూడి= కూడియుండి...

**తా :** విదురా! పరమాత్మలో కొంతభాగం అవయవాలుగా రూపొందాయి. అందులో ముఖభాగాన్ని వాయుసఖుడైన అగ్ని ఆశ్రయించి సరస్వతికి అనుకూలించుటచే జీవుడు నోటితో ధ్వనిని ఉచ్చరించగలుగుతున్నాడు. అలాగే సూర్యుడు చక్షురింద్రియరూపంగా నేత్రాలలో ప్రవేశించుటచేత జీవుడు రూపాలను గ్రహించగలుగుతున్నాడు. వాయువు త్వగింద్రియరూపంలో చర్మాన్ని ఆశ్రయించాడు. అందువలన జీవునకు స్పర్శజ్ఞానము కలుగుచున్నది.

**వ. నిజనివాసంబు నాశ్రయించిన జీవుండు స్పర్శేంద్రియ గతుండగు పృథగ్భావంబైన శ్రోత్రంబుల దిక్కు లచ్యుత కళాంశంబులగు, శ్రవణేంద్రియ యుక్తంబులై నిజస్థానంబునం బొందిన జీవుండు శబ్దజ్ఞాన గతుండగు; వెండియుఁ దాలువు నిర్భిన్నం బయిన లోకపాలుండగు వరుణుం డందుఁ బ్రవేశించి రసనేంద్రియంబుచేఁ బ్రకాశించినం బ్రాణి రసంబులం గ్రహించెఁ; బరమేశ్వరుని నాసికేంద్రియంబు పృథగ్భావంబు నొంది యాశ్వినేయాధిష్ఠానంబై ఘ్రాణాంశంబు నొందిన జంతువు గంధగ్రహణ సమర్థంబయ్యెఁ; వెండియు భిన్నంబయిన చర్మంబును నోషధులును బరమపురుషాంశంబు లయిన కేశంబులంగూడి నిజనివాసంబు నొందిన జీవుండు కండూయమానుండగు; భిన్న భూతంబైన మేఢ్రంబునం బ్రజాపతి రేతంబున నిజస్థానంబు నొందిన జీవుం డానందంబునం బొరయు; భిన్నభావంబైన గుదంబున మిత్రుం డచ్యుతాంశంబును బొంది వాయువుం గూడి నిజాధిష్ఠానంబు నొందిన జీవుండు విసర్గంబుఁ జెందు; వేఱు వేఱైన బాహువులం ద్రిదశాధీశ్వరుండయిన పురందరుండు క్రయవిక్రయాది శక్తియుక్తుం డగుచు నిజస్థానంబు నొందిన జీవుండు వానిచేత జీవికం బొందు; మఱియుఁ బాదంబులు నిర్భిన్నంబు లయిన విష్ణుండు స్వావాసంబు గైకొని గతిశక్తిం బొందిన జీవుండు గమనాగమ నార్హుండయ్యెఁ; వెండియు భిన్నభావంబయిన హృదయంబు మనంబుతోడం గలిసి నిజాధిష్ఠానంబునం జంద్రుండు ప్రవేశించిన జీవుండు శరీరసంకల్పాది రూపంబగు వికారంబునుం బొందు; భిన్నభావంబైన యహంకారంబున నహంకృతి యుక్తుండై రుద్రుండు నిజస్థానంబుగా వసియించు; నా యహంకృతిచే శరీరి కర్తవ్యంబులు నడపు; బుద్ధి వాగీశ్వరావాసంబై హృదయంబు తోడం గలిసి నిజాధిష్ఠానంబున బోధాంశంబుచే వెలింగిన శరీరి బోద్ధవ్యతం బొందు; భిన్నంబైన చిత్తంబు బ్రహ్మావాసంబై చేతనాంశంబు నొందినఁ బ్రాణి విజ్ఞానంబునుం బొందు; నట్టి విరాట్పురుషుని శీర్షంబున స్వర్గంబును, జరణంబుల వసుమతియు, నాభియందు గగనంబునుం గలిగె; సత్త్వాదిగుణ పరిణామంబుల నమరులైరి; ఊర్జిత సత్త్వగుణంబున న ద్దేవతలు త్రిదివంబునుం బొందిరి; రజోగుణంబున మనుజులును గవాదులును ధరణిం బొందిరి; తామసంబున భూతాదులైన రుద్రపారిషదులు ద్యావాపృథి వ్యంతరంబగు వియత్తలంబునుం బొందిరి; ముఖంబువలన నామ్నాయంబు లుత్పన్నంబులయ్యెఁ. వెండియు-**

**215**

**ప్రతి :** నిజనివాసంబున్= తన స్థానాన్ని; ఆశ్రయించిన జీవుండు= చేరిన జీవుడు (వాయువువలన); స్పర్శ ఇంద్రియగతుండు+అగున్= స్పర్శను గ్రహించగలవాడౌతాడు; పృథక్+భావంబు+ఐన= ప్రత్యేక భాగమైన; శ్రోత్రంబులన్= చెవులయందు; దిక్కులు= దిశలు; అచ్యుత కళా+అంశంబులు+అగు= శ్రీహరి కళాంశములైన; శ్రవణ+ఇంద్రియ యుక్తంబులు+ఐ= శ్రవణేంద్రియంతో కూడినవగుటచే; నిజస్థానంబునన్+పొందినజీవుండు= కర్మానుసారమైన శరీరాన్ని

పొందిన జీవుడు; శబ్దజ్ఞానగతుండు+అగున్= వినికిడి శక్తిని పొందుతాడు; వెండియున్= మరియును; తాలువు నిర్భిన్నంబు+అయిన= పరమాత్మ దౌడ విడివడిన; లోకపాలుండు+అగు వరుణుండు= దిక్పాలకుడైన వరుణుడు; అందున్+ప్రవేశించి= కపోల మధ్యభాగమున (నోటిలో) ప్రవేశించి; రసనా+ఇంద్రియంబుచేన్= నాలుక అనే ఇంద్రియంతో; ప్రకాశించినన్= వెలుగొందగా (కూడియుండగా); ప్రాణి= జీవుడు; రసంబులన్+గ్రహించెన్= రుచులను తెలిసికోగలుగుతున్నాడు; పరమ+ఈశ్వరుని నాసికా+ఇంద్రియంబు= పరమాత్మయొక్క ముక్కురూపమైన ఇంద్రియం; పృథక్+భావంబున్+ఒంది= ప్రత్యేక భాగమౌటచే; ఆశ్వినేయ+అధిష్ఠానంబు+ఐ= అశ్వినీదేవతలకు ఆవాసమై; ఘ్రాణ+అంశంబున్+ఒందిన జంతువు= ముక్కు అనే అవయవాన్ని పొందిన ప్రాణి; గంధగ్రహణ సమర్థంబు+అయ్యెన్= వాసనను గ్రహించటంలో సమర్థమైనది; వెండియున్= మరియును; భిన్నంబు+అయిన చర్మంబును= పరమాత్మనుండి వేరుపడిన చర్మమును; ఓషధులును; పరమపురుష+అంశంబులు+ఐన= విరాట్ పురుషుని అంశలైన; కేశంబులన్+కూడి= వెంద్రుకలను ఆశ్రయించి; నిజనివాసంబున్+ఒందిన= తన స్థానాన్ని చేరిన; జీవుండు= ప్రాణి; కండూయమానుండు+అగున్= దురద అనే లక్షణం కలవాడగును; భిన్నభూతంబు+ఐన= వేరుపడిన; మేఢ్రంబునన్= పురుషాంగమునుండి; ప్రజాపతి రేతంబునన్= పరమపురుషుని వీర్యమునుండి; నిజస్థానంబున్+ఒందిన= తన చోటికి జేరిన; జీవుండు= ప్రాణి; ఆనందంబునన్+పొరయున్= సంతోషంతో తేలియాడుచుండును; భిన్నభావంబు+ఐన= వేరుపడిన; గుదంబునన్= మలవిసర్జనావయవమునుండి; మిత్రుండు= సూర్యుడు; అచ్యుత+అంశంబును+పొంది= శ్రీహరి అంశను పొంది; వాయువున్+కూడి= వాయువుతో కూడి; నిజ+అధిష్ఠానంబున్+ఒందిన= స్వప్రదేశానికి చేరిన; జీవుండు= ప్రాణి; విసర్గంబున్+చెందున్= మలవిసర్జన శక్తి పొందును; వేఱువేఱు+ఐన బాహువులన్= విడివడిన భుజములయందు; త్రిదశ+అధీశ్వరుండు+అయిన= దేవతలకు అధిపతియైన; పురందరుండు= ఇంద్రుడు; క్రయవిక్రయ+ఆది= కొనుట అమ్ముట మొదలగు; శక్తియుక్తుండు+అగుచున్= సామర్థ్యము కలవాడగుచు; నిజస్థానంబున్+ఒందిన= స్వస్థానాన్ని చేరిన; జీవుండు= ప్రాణి; వానిచేతన్= ఆ ఇంద్రునిచేత; జీవికన్+పొందున్= బ్రతుకుతెరువు గాంచును; మఱియున్= మరల; పాదంబులు= చరణాలు; నిర్భిన్నంబులు+అయిన= విడివడిన; విష్ణుండు= శ్రీహరి; స్వ+ఆవాసంబున్+కైకొని= తన చోటికి చేరి; గతిశక్తిన్+పొందిన జీవుండు= కదలే శక్తిని పొందిన ప్రాణి; గమన+ఆగమన+అర్హుండు+అయ్యెన్= వెళ్లుట, వచ్చుటలకు సమర్థుడయ్యెను; వెండియున్= మరియును; భిన్నభావంబు+ఐన= వేరుపడిన; హృదయంబు= పరమాత్మ హృదయం; మనంబుతోడన్+కలిసి= మనస్సుతో కూడి; నిజ+అధిష్ఠానంబునన్= స్వస్థానంలో; చంద్రుండు ప్రవేశించినన్= చంద్రుడు ప్రవేశించగా; జీవుండు= ప్రాణి; శరీర సంకల్ప+ఆది రూపంబు+అగు= శరీరముయొక్క సంకల్పము మొదలైన రూపమైన; వికారంబునున్+పొందున్= మార్పును పొందును; భిన్నభావంబు+ఐన= వేరు రూపాన్ని పొందిన; అహంకారంబునన్= అహంకారతత్త్వంతో; అహంకృతియుక్తుండు+ఐ= అహంకారం కలిగినవాడై; రుద్రుండు= శివుడు; నిజస్థానంబుగా వసియించున్= తన స్థానంలో నివసించును; ఆ+అహంకృతిచేన్= ఆ అహంకారంతో; శరీరి= దేహి; కర్తవ్యంబులు నడపున్= చేయదగిన పనులను చేస్తుంటాడు; బుద్ధి= తెలివి; వాక్+ఈశ్వర+ఆవాసంబు+ఐ= వాగీశ్వరుడైన బ్రహ్మకు నివాసమై; హృదయంబుతోడన్+కలిసి= ఎడదతోకూడి; నిజ+అధిష్ఠానంబునన్= తన ఆవాసంలో; బోధ+అంశంబుచేన్= జ్ఞానాంశతో; వెలింగిన= ప్రకాశించిన; శరీరి= దేహి; బోద్ధవ్యతన్+పొందున్= ఆ యా విషయాల గ్రహణశక్తిని పొందును; భిన్నంబు+ఐన చిత్తంబు= వేరుపడిన మనస్సు; బ్రహ్మ+ఆవాసంబు+ఐ= బ్రహ్మకు నివాసమై; చేతనా+అంశంబున్+ఒందిన= చైతన్యశక్తిని పొందగా; ప్రాణి= జీవుడు; విజ్ఞానంబున్+పొందున్= విజ్ఞానియగును; అట్టి విరాట్+పురుషుని= అటువంటి పరమాత్మయొక్క; శీర్షంబునన్= తలలో; స్వర్గంబును= స్వర్గము; చరణంబులన్= పాదాలలో;

వసుమతియున్= భూలోకము; నాభియందున్= బొడ్డులో; గగనంబునున్= ఆకాశం; కలిగెన్= ఏర్పడ్డాయి; సత్త్వ+ఆది గుణంబుల పరిణామంబులన్= సత్త్వరజస్తమోగుణాల మార్పుచేత; అమరులు+ఐరి= కొందరు జీవులు దేవతలయ్యారు; ఊర్జిత సత్త్వగుణంబునన్= ప్రకాశించిన సత్త్వగుణంచేత; ఆ+దేవతలు= ఆ వేల్పులు; త్రిదివంబునున్+పొందిరి= స్వర్గాన్ని పొందారు; రజస్+గుణంబునన్= రజోగుణంచేత; మనుజులును= మానవులును; గవాదులును= గోవు మొదలగు రూపాలను; ధరణిన్+పొందిరి= భూమిపై ధరించారు; తామసంబునన్= తమోగుణంచేత; భూత+ఆదులు+ఐన= భూతములు మొదలైన; రుద్రపారిషదులు= శివుని ప్రమథగణాలు; ద్యావాపృథివీ+అంతరంబు+అగు= భూమి అంతరిక్షాల మధ్యభాగమైన; వియత్తలంబునున్= ఆకాశభాగాన్ని; పొందిరి= చేరిరి; ముఖంబువలనన్= పరమాత్మ ముఖమునుండి; ఆమ్నాయంబులు= వేదాలు; ఉత్పన్నంబులు+అయ్యెన్= ఆవిర్భవించాయి; వెండియున్= మరియును...

**తా :** చర్మంలో వాయువు ప్రవేశించి జీవునికి స్పర్శజ్ఞానాన్ని కలిగిస్తాడు. దిక్కులు చెవులను చేరి శబ్దజ్ఞానాన్ని కలిగిస్తున్నాయి. వరుణుడు నాలుకను ఆశ్రయించుటచే జీవుడు రుచులను తెలుసుకొంటున్నాడు. అశ్వినీదేవతల స్థానమైన ముక్కు వాసన చూడగలుగుతోంది. చర్మం, ఓషధులు పరమాత్ముని కేశాలను పొందుటచే దురద ఏర్పడుతోంది. పురుషాంగం ప్రజాపతి రేతస్సుతో సంయోగమందుటచే జీవునకు ఆనందం కలుగుతోంది. మలరంధ్రంలో సూర్యుడు, వాయువు చేరుటచేత మలవిసర్జన శక్తి కలుగుతోంది. ఇంద్రునివలన చేతులకు ఇచ్చిపుచ్చుకొనే శక్తి కలుగుతోంది. విష్ణువవలన పాదాలకు నడచే శక్తి కలుగుతోంది. మనస్సులో చంద్రుడు ప్రవేశించడంచేత సంకల్పవికల్పాలు కలుగుతున్నాయి. అహంకారంలో రుద్రుని ప్రవేశంవలన కర్తవ్యనిర్వహణ కలుగుతోంది. బుద్ధి వాగీశ్వరుని ఆవాసమై గ్రహణశక్తి కలుగుతోంది. చిత్తం బ్రహ్మావాసమై విజ్ఞానం ఏర్పడుతోంది.

విరాట్పురుషుని శిరస్సునుండి స్వర్గం, పాదాలనుండి భూమి, నాభినుండి ఆకాశం ఏర్పడ్డాయి. సత్త్వరజస్తమో గుణాల మార్పుచేత జీవులు అమరులయ్యారు. సత్త్వగుణం అధికంగా ఉన్నవారు అమరులై స్వర్గాన్ని పొందారు. రజోగుణం ఎక్కువగా ఉన్న జీవులు గోవులు, మానవులు మొదలైన రూపాలతో భూమిని చేరారు. తామసగుణం అధికమైనవారు భూతాదులైన ప్రమథగణాలై భూమ్యాకాశమధ్యభాగాన్ని పొందారు. విరాట్పురుషుని ముఖంనుండి వేదాలు పుట్టాయి.

**క. ధరణీదివిజులు శ్రుతులును, నరవర! యమ్మేటి ముఖమునంబొడముట భూ**
**సురుఁ డఖిలవర్ణములకున్, గురుఁడున్ ముఖ్యుండు నయ్యె గుణరత్ననిధీ! 216**

**ప్రతి :** గుణరత్ననిధీ!= సద్గుణనిలయుడైన; నరవర!= పరీక్షిన్మహారాజా!; ధరణీదివిజులు= బ్రాహ్మణులును; శ్రుతులును= వేదములును; ఆ+మేటి ముఖమునన్= ఆ పరమాత్మ ముఖమునుండి; పొడముటన్= ఉద్భవించుటచేత; భూసురుఁడు= విప్రుడు; అఖిలవర్ణములకున్= అన్ని వర్ణములవారికిని; గురుఁడున్= ఆచార్యుడును (సన్మార్గనిర్దేశకుడును); ముఖ్యుండున్= శ్రేష్ఠుడును; అయ్యెన్= ఆయెను.

**తా :** సద్గుణనిలయుడవైన పరీక్షిన్మహారాజా! విరాట్పురుషుని మోమునుండి వేదాలు పుట్టాయి. ఆదే మోమునుండి విప్రులు ఉద్భవించారు. అందువల్ల భూసురుడు అందరికీ గురువు, శ్రేష్ఠుడు అయ్యాడు.

**క. ధర బ్రాహ్మణాదికము ద, స్కర బాధలఁ బొందకుండఁ గైకొని కావం**
**బురుషోత్తము బాహువులన్, నరనాథకులంబు పుట్టె నయతత్త్వనిధీ! 217**

**ప్రతి :** నయతత్త్వనిధీ!= నీతివిద్యావిశారదా!; ధరన్= భూమియందు; బ్రాహ్మణ+ఆదికము= బ్రాహ్మణులు మొదలగు అన్ని జాతులవారును; తస్కరబాధలన్= దొంగలు మొదలగువారివల్ల ఏర్పడు బాధలను; పొందకుండన్= అనుభవించకుండా; కైకొని కావన్= ఆ భారాన్ని చేకొని రక్షించుటకు; పురుషోత్తము బాహువులన్= విరాట్పురుషుని భుజములనుండి నరనాథకులంబు= క్షత్రియజాతి; పుట్టెన్= ఉద్భవించినది.

**తా :** నీతివిచక్షణా! ఈ లోకంలో బ్రాహ్మణాది సర్వజాతులవారికి దొంగలవలన, దుర్మార్గులవలన భయంలేకుండా వారిని రక్షించేందుకు విరాట్పురుషుని భుజాలనుండి క్షత్రియజాతి ఏర్పడింది.

**క. గణుతింపఁగఁ గృషిగో ర, క్షణవాణిజ్యాది కర్మకలితంబుగ నా**
**గుణనిధి యూరువులందుం, బ్రణుతింపఁగ వైశ్యజాతి ప్రభవం బయ్యెన్. 218**

**ప్రతి :** గణుతింపఁగన్= ప్రశస్తికెక్కేవిధంగా; కృషి= వ్యవసాయము; గోరక్షణ= ఆవులను పోషించుట; వాణిజ్య+ఆది= వ్యాపారము మొదలైన; కర్మకలితంబుగన్= పనులతో కూడినదై; ప్రణుతింపఁగన్= స్తుతింపదగినదై; ఆ గుణనిధి= ఆ పరమాత్మయొక్క; ఊరువులందున్= తొడలనుండి; వైశ్యజాతి= వైశ్య నామంగల జాతి; ప్రభవంబు+అయ్యెన్= ఉద్భవించినది.

**తా :** వ్యవసాయం, గోపరిపాలనం, వ్యాపారం మొదలైన కార్యకలాపాలతో సమాజసేవ చేసేందుకుగాను పరమాత్మ తొడలనుండి వైశ్యజాతి ఆవిర్భవించింది.

**తే. తివిరి సేవక ధర్ములై దేవదేవు, పదములను శూద్రసంతతు లుదయమైరి**
**వీర లందఱుఁదమ తమ విహితకర్మ, మలరఁజేయుచు జనకుండు నాత్మగురుఁడు 219**

**ప్రతి :** తివిరి= ప్రయత్నపూర్వకముగా; సేవకధర్ములై= సమాజసేవకుల ధర్మం కలవారుగా; దేవదేవు= విరాట్పురుషుని; పదములను= పాదములనుండి; శూద్రసంతతులు= శూద్రులు అను పేరుగల జాతివారలు; ఉదయము+ఐరి= ప్రభవించిరి; వీరలు+అందఱున్= వీరందరు; తమ తమ విహితకర్మము= వారికి భగవానుడు ఏర్పరచిన పనిని; అలరన్+చేయుచున్= ఆనందంగా చేస్తున్నవారై; జనకుండున్= జగత్పితయును; ఆత్మగురుఁడున్= అందరికీ గురుడును...

**తా :** సమాజసేవాధర్మంతో విరాట్పురుషుని పాదాలనుండి శూద్రులు అనుపేరు గల జాతి ఉదయించింది. వారు భగవంతుడు నిర్దేశించిన విధంగా ఆ యా విధులను జగత్పిత, విశ్వగురుడు ఆచరించాడు.

**క. అగు సర్వేశుఁ బరాత్పరు, జగదేకప్రభుని పాదజలజాతంబుల్**
**దగిలి భజింతురు సతతము, నిగమోక్తిన్ భక్తియోగనిపుణాత్మకులై. 220**

**ప్రతి :** అగు= జగత్పిత, విశ్వగురుడును అయిన; సర్వ+ఈశున్= సర్వమునకును ప్రభువైన; పరాత్పరున్= పరమాత్మయైన; జగత్+ఏకప్రభుని= జగదేకనాథుని; పాదజలజాతంబుల్= ఆతని పాదపద్మాలను; తగిలి= ఆశ్రయించి; నిగమ+ఉక్తిన్= వేదము చెప్పినవిధముగా; భక్తియోగ నిపుణ+ఆత్మకులై= భక్తియోగమునందు పరాయణులై; సతతము భజింతురు= ఎల్లప్పుడూ సేవిస్తుంటారు.

**తా :** వారంతా జగన్నాథుడైన విరాట్పురుషుని పాదపద్మాలను ఆశ్రయించి, వేదోక్తవిధానంతో భక్తియోగనిపుణులై ఎల్లవేళల సేవిస్తుంటారు.

**తే. మహిమ దీపింపఁ గాలకర్మ స్వభావ, శక్తి సంయుక్తుఁడగు పరేశ్వరుని భూరి**
**యోగమాయా విజృంభణోద్యోగ మెవ్వఁ, డెఱిఁగి నుతియింపఁగా నోపు నిద్ధచరిత! 221**

**ప్రతి :** ఇద్ధచరిత!= గొప్ప చరిత్రకలవాడా!; మహిమ దీపింపన్= మహత్త్వము వ్యక్తమగునట్లుగా; కాల= కాలముయొక్క; కర్మ= కర్మముయొక్క; స్వభావ= స్వభావమునకు సంబంధించిన; శక్తిసంయుక్తుఁడు+అగు= శక్తితో కూడియున్న; పర+ఈశ్వరుని= సర్వేశ్వరుని; భూరి= గొప్పదైన; యోగమాయా= యోగసంబంధమైన మాయయొక్క; విజృంభణ= అతిశయముగా ప్రవర్తించే; ఉద్యోగము= ప్రవర్తనము; ఎవ్వఁడు= ఏ వ్యక్తి; ఎఱిఁగి= గ్రహించి; నుతియింపఁగాన్= కొనియాడుటకు; ఓపున్= సమర్థుడగును! (ఎవడును సమర్థుడు కాడనుట)

**తా :** మహనీయచరితుడా! భగవంతుడు తన మహిమ వ్యక్తమయ్యేలా కాలకర్మస్వభావాలే శక్తిగా చేసికొని యోగమాయతో విజృంభిస్తుంటాడు. వాని ప్రవర్తనను ఎవరు గ్రహించి స్తుతించగలరు? ఎవరూ గ్రహింపలేరు.

**ఉ. అన్యకథానులాపము లహర్నిశముంబఠియించి చాల మా**
**లిన్యము నాత్మశోభనవిలీనత నొందు మదీయజిహ్వా సౌ**
**జన్యము నొందె నేఁడు హరిసద్గుణ దివ్యకథామృతంబు స**
**న్మాన్యచరిత్రమై నెగడు మద్గురువాక్యపదంబుఁజెందఁగన్. 222**

**ప్రతి :** అన్యకథా+అనులాపములు= వేరే వేరే కథాప్రసంగాలను; అహస్+నిశమున్= పగలురాత్రి; పఠియించి= చదివి; చాల మాలిన్యమున్= ఎంతో మలినాన్ని; ఆత్మశోభనవిలీనతన్= స్వయంప్రకాశకత్వ నాశనమును; ఒందు= పొందే; మదీయ జిహ్వా= నా నాలుక; నేఁడు= ఈనాడు; సౌజన్యమున్+ఒందెన్= చరితార్థతను పొందినది; మద్గురువాక్యపదంబున్= మా గురువు నిర్దేశించిన మార్గాన్ని; చెందఁగన్= పొందుటకు తగినట్లుగా; హరి= శ్రీమహావిష్ణువుయొక్క; సత్+గుణ= మంచిగుణములతో కూడిన; కథా+అమృతంబున్= కథలనే అమృతము కలదియు; సత్+మాన్య చరిత్రము+ఐ= చక్కని చరిత్ర కలదియునై; నెగడున్= ఒప్పును.

**తా :** విదురా! ఇంతకాలం ఏవేవో కాకమ్మకథలతో నా నాలుక మలినమైపోయింది. ఆత్మశోభ అణగారిపోయింది. ఈనాడు శ్రీహరి దివ్యకథావిశేషాలను చెప్పి సౌజన్యాన్ని పొందింది. మా గురువు నిర్దేశించిన ముక్తిమార్గంలో ప్రయాణించుటకు తగినట్లుగా హరికథామృతంతో కూడి నా నాలుక చక్కని చరిత్ర కలదయ్యింది.

**మ. హరినామాంకిత సత్కథామృతరసవ్యాలోలుఁడైనట్టి స**
**త్పురుషశ్రేష్ఠుఁడసత్కథాలవణవాఃపూరంబుఁదాఁగ్రోలునే?**
**వరమందారమరందపానకుతుకస్వాంతద్విరేఫంబు స**
**త్వరమై పోవునె చేఁదు వేములకుఁదద్గంధానుమోదాత్మమై. 223**

**ప్రతి :** హరి= శ్రీమహావిష్ణువుయొక్క; నామ+అంకిత= నామముద్ర కలిగిన; సత్కథా+అమృతరస= సత్కథలనే అమృతరసమునందు; వ్యాలోలుఁడు+ఐనట్టి= మిక్కిలి ఆసక్తుడైనట్టి; సత్పురుషశ్రేష్ఠుఁడు= గొప్పపురుషుడు; అసత్ కథా= మంచిని అందించలేని చెడుకథలనెడి; లవణ వాఃపూరంబున్= ఉప్పునీటి ప్రవాహాన్ని; తాన్= ఆ సత్పురుషుడు; క్రోలునే?=

ఆస్వాదించునా?; వర= శ్రేష్ఠమైన; మందార= పారిజాతముయొక్క; మరంద= మకరందాన్ని; పాన= త్రాగుటయందు; కుతుక= మిక్కిలి ఆసక్తి కల; స్వాంత= మనస్సుతోకూడిన; ద్విరేఫంబు= తుమ్మెద; చేఁదు వేములకున్= చేదైన వేపచెట్లవైపు; తద్ గంధ+అనుమోద+ఆత్మమైన్= దానినుండి వచ్చే వాసనకు ఇష్టపడే మనస్సుతో; సత్వరము+ఐ= తొందరపడి; పోవునె?= వెళుతుందా?

**తా :** శ్రీమహావిష్ణువు మహిమను తెలియజేసే మంచి కథలనే అమృతాన్ని త్రాగేందుకు అలవాటుపడిన సజ్జనుడు పనికిమాలిన కథలనే ఉప్పునీటిని త్రాగడానికి ఇష్టపడతాడా? పారిజాతపుష్పాలలోని మకరందాన్ని ఆస్వాదించేందుకు అలవాటుపడిన తుమ్మెద వేపచెట్టునుండి వచ్చే చేదుగాలికి ఆకర్షింపబడి అటు పరుగెత్తుతుందా? (పరుగెత్తదనుట)

**క. హరిమహిమముఁ దన్నాభీ, సరసిజసంజాతుఁడైన చతురాననుఁడుం**
**బరికించి యెఱుఁగఁడన్న ని, తరమనుజులఁజెప్పనేల తత్త్వజ్ఞనిధీ! 224**

**ప్రతి :** తత్త్వజ్ఞనిధీ!= వేదాంతవేత్తవైన ఓ విదురా!; హరిమహిమము= శ్రీమహావిష్ణువు మహిమను; తద్= ఆ శ్రీహరియొక్క; నాభీ= బొడ్డునుండి; సంజాతుఁడు+ఐన= జన్మించిన; చతుర+ఆననుఁడున్= నాలుగు మోములు గల బ్రహ్మాయును; పరికించి= గమనించి; ఎఱుఁగడు+అన్నన్= తెలుసుకోలేడన్నచో; ఇతర మనుజులన్= ఇంక ఇతరులైన మానవులు ఎరుగలేరని; చెప్పన్+ఏల= ప్రత్యేకముగా చెప్పవలయునా?

**తా :** వేదాంతజ్ఞానవిశారదుడవైన విదురా! నారాయణుని మహిమలను ఆయన నాభికమలంనుండి పుట్టిన బ్రహ్మాయే పరిపూర్ణంగా తెలుసుకొనలేడన్నచో సాధారణమానవులకు హరిమహిమ తెలియసాధ్యంగాదని వేరే చెప్పవలెనా?

**తే. శ్రుతులు దమలోన వివరించి చూచి పుండ, రీకలోచను నుత్తమశ్లోకచరితు**
**నమరగుణవంద్యమానపాదాబ్జయుగళు, వెదకి కనుఁగొనలేవండ్రు విమలమతులు. 225**

**ప్రతి :** విమలమతులు= స్వచ్ఛమైన జ్ఞానంకల పండితులు; శ్రుతులు= వేదాలు; తమలోనన్= వాటిలో అవి; వివరించి చూచి= పరిశీలించి చూచి; పుండరీకలోచనున్= పద్మములవంటి నేత్రములు గలవాడు; ఉత్తమ శ్లోకచరితున్= ఉత్తములచే కొనియాడబడే చరిత్ర కలవాడును; అమరగణ= దేవతాసమూహముచే; వంద్యమాన= నమస్కరింపబడు; పాద+ అబ్జయుగళున్= పాదపద్మాలజంట కలవాడును; అయిన శ్రీహరిని; వెదకి= అన్వేషించికూడా; కనుఁగొనలేవు+అండ్రు= వీక్షింపలేవని చెప్పుదురు.

**తా :** ఉత్తములందరూ కీర్తించే చరిత్ర కలవాడు, పద్మంవంటి నేత్రాలు కలవాడు, దేవతలంతా మ్రొక్కే పాదాలు కలవాడు అయిన శ్రీమహావిష్ణువును వేదాలు వాటిలో అవి తర్కించుకొని వెదకినా కనుగొనలేవని పండితులు చెపుతారు.

**క. హరియుందన మాయాగతిఁ, బరికించియుఁ గానఁడయ్యేఁబరిమితి లేమిన్**
**మఱి మాయావిని మోహిని, చరితముఁగనుఁగొందు రెట్లు చతురాస్యాదుల్? 226**

**ప్రతి :** హరియున్= శ్రీమహావిష్ణువుకూడా; తన= తనయొక్క; మాయాగతిన్= మాయయొక్క వర్తనమును; పరికించియున్= గమనించికూడా; పరిమితి లేమిన్= దాని గమనానికి ఒక పరిమితి అంటూ లేకపోవడం చేత; కానఁడు+అయ్యేన్= కనుగొనలేకపోవుచున్నాడు; మఱి= అటువంటప్పుడు; మాయావిని= మాయావినియైన; మోహిని= మోహినియొక్క;

చరితమున్= ప్రవర్తనమును; చతుస్+ఆస్య+ఆదుల్= బ్రహ్మ మొదలగువారు; ఎట్లు= ఏ విధముగా; కనుఁగొందురు= గ్రహించగలుగుతారు?

**తా :** విదురా! శ్రీమహావిష్ణువు తన మాయయొక్క ప్రవర్తనను తానే గమనించలేడు. ఎందుకంటే అది పరిమితి లేనిది. అటువంటప్పుడు బ్రహ్మాదిదేవతలు ఎలా తెలిసికోగలుగుతారు?

**క. ఆ దివిజాధీశుఁడు, మహదాదులు, దిక్పతులుఁ, బంకజాసనుఁడున్, గౌ**
**రీ దయితుఁడు గనఁజాలని, శ్రీ దేవుని పదయుగంబుఁజింతింతు మదిన్. 227**

**ప్రతి :** ఆ= ప్రసిద్ధులైన; దివిజ+అధీశుఁడు= దేవతలకు ప్రభువైన ఇంద్రుడు; మహత్+ఆదులు= మహత్తు మొదలగు శక్తులు; దిక్+పతులు= ఎనిమిది దిక్కులను పాలించే దిక్పాలకులు; పంకజ+ఆసనుఁడున్= పద్మసంభవుడైన బ్రహ్మయు; గౌరీదయితుఁడు= పార్వతీపతియైన ఈశ్వరుడు; కనన్+చాలని= దర్శించలేని; శ్రీదేవుని= లక్ష్మీవల్లభుడైన మహావిష్ణువుయొక్క; పదయుగంబున్= పాదముల జంటను; మదిన్= మనసులో; చింతింతున్= ధ్యానింతును.

**తా :** దేవతలనేలే ఇంద్రుడు కాని, దిక్కులనేలే దిక్పాలకులుగాని, బ్రహ్మగాని, ఉమావల్లభుడు గాని దర్శింపలేని శ్రీవల్లభుడైన నారాయణుని పాదాలజంటను మనసులో ధ్యానిస్తాను.

**క. అని మైత్రేయుం డవ్విదు, రున కెఱిఁగించిన తెఱంగు రుచిరముగా న**
**ర్జునపౌత్రునకుఁ బరాశర, ముని మనుమం డెఱుఁగఁజెప్పి ముదము దలిర్పన్. 228**

**ప్రతి :** అని= ఈ విధంగా; మైత్రేయుండు= మైత్రేయమహర్షి; ఆ+విదురునకున్= ఆ విదురునకు; ఎఱిఁగించిన= తెలియజేసిన; తెఱంగున్= విధమును (విశేషాలను); రుచిరముగాన్= మనోహరముగా; అర్జున పౌత్రునకున్= అర్జునుని మనుమడైన పరీక్షిత్తునకు; పరాశరముని మనుమండు= పరాశరమహర్షి మనుమడైన శుకమహర్షి; ముదము+తలిర్పన్= ఆనందం కలిగేలా; ఎఱుఁగన్+చెప్పి= తెలియజేసి...

**తా :** ఈ విధంగా మైత్రేయుడు విదురునకు చెప్పిన విషయమంతా మనోహరంగా అర్జునుని మనుమడైన పరీక్షిన్మహారాజుకు పరాశరమహర్షి మనుమడైన శుకుడు చెప్పి.

**విశే :** అర్జునుని కుమారుడు అభిమన్యుడు. అతని కుమారుడు పరీక్షిత్తు. పరాశరుని కుమారుడు వ్యాసుడు. అతని కుమారుడు శుకమహర్షి. 'పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్' అని ప్రసిద్ధ శ్లోకం. వక్త శ్రోత ఇద్దరూ వంశగౌరవం కలవారైతే ఆ విషయం ప్రామాణికమవుతుంది. అందుకని తాతలను ప్రస్తావించడం.

**వ. వెండియు నిట్లనియె. 229**

**ప్రతి :** వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఇంకా ఇలా అంటున్నాడు శుకమహర్షి పరీక్షిత్తుతో.

**క. భూమీశ్వర! మైత్రేయ మ, హాముని విదురునకు నట్లు హరి శుభగుణ లీ**
**లా మాహాత్మ్యముఁజెప్పిన, నా మైత్రేయునకు విదురుఁడనియెన్ మఱియున్. 230**

**ప్రతి :** భూమి+ఈశ్వర!= పరీక్షిన్మహారాజా!; మైత్రేయమహాముని= మైత్రేయమహర్షి; విదురునకున్= విదురునికి; అట్లు= ఆ విధముగా; హరి= నారాయణునియొక్క; శుభగుణ= మంగళకరగుణముల; లీలా మాహాత్మ్యమున్= విశేషాలను వాటి గొప్పతనాన్ని; చెప్పినన్= చెప్పగా; మఱియున్= ఇంకా; ఆ మైత్రేయునకున్= ఆ మైత్రేయ మహర్షితో; విదురుఁడు+అనియెన్= విదురుడు ఇలా అంటున్నాడు.

**తా :** శుకమహర్షి పరీక్షిన్మహారాజుతో చెపుతున్నాడు. రాజా! మైత్రేయుడలా శ్రీహరి దివ్యగుణలీలామాహాత్మ్యాన్ని చెప్పగా విని విదురుడు ఇంకా ఇలా అడుగుతున్నాడు.

**క. అగుణుండగు నీశ్వరునకు, జగదవనోద్భవవినాశసత్కర్మములుం**
**దగులీల లెట్లు లాతఁడు, సగుణుండై యుండు టెట్లు సౌజన్యనిధీ! 231**

**ప్రతి :** సౌజన్యనిధీ!= సుజనత్వము నిండిన మైత్రేయా!; అగుణుండు+అగు= నిర్గుణస్వరూపుడైన; ఈశ్వరునకున్= పరమాత్మకు; జగత్= ఈ ప్రపంచముయొక్క; అవన= పోషణము (రక్షణము); ఉద్భవ= పుట్టించుట; వినాశ= లయము చేయుట అనెడి; సత్+కర్మములున్= గొప్ప కర్మలును; తగు లీలలు= దానికి సంబంధించిన లీలలు; ఎట్టులు= ఏ విధముగా కుదురుచున్నవి; ఆతఁడు= నిర్గుణుడైన ఆ పరమాత్మ; సగుణుండు+ఐ= గుణాలతో కూడిన స్వరూపము కలిగి; ఉండుట+ఎట్లు= ప్రవర్తించుట ఏ విధముగా పొసగుచున్నది?

**తా :** సౌజన్యమూర్తివైన మైత్రేయా! పరమాత్మ నిర్గుణుడు కదా! మరి సృష్టిస్థితిలయాలనే కర్మలు, లీలలు ఎలా వీలుపడుతున్నాయి? అసలు నిర్గుణ పరబ్రహ్మ సగుణమూర్తిగా ఉండడం ఎలా పొసగుతుంది చెప్పు అని విదురుడు అడిగాడు.

**సీ. అని యర్భకునిగతి యనుకొని మైత్రేయమునిఁజూచి విదురుఁడిట్లనియె మరల**
**బాలుఁడు క్రీడావిలోలమానసమున దీపించు లీలానురూపుఁడగుచుఁ**
**గానిచోఁగామానుగతుఁడై రమించును నర్భకుఁడర్థి వస్త్వంతరమున**
**నర్భకాంతరమున నైనను బాలకేళీసంగుఁ డగుచు నోలిని జరించు**

**తే. హరియు నెపుడు నివృత్తుఁడత్యంతతృప్తుఁ, దగుట వర్తించు టెట్లు క్రీడాదులందు?**
**మఱియుఁద్రిగుణాత్మకంబైన మాయఁగూడి, యఖిలజగములఁగల్పించె ననుట యెట్లు? 232**

**ప్రతి :** అని= ఆ విధముగా పలికి; అర్భకునిగతి= చిన్నపిల్లవాడులా జగత్తుతో ఆడుకొంటున్నాడేమో; అనుకొని= అని భావించి; మైత్రేయమునిన్+చూచి= మైత్రేయ మహర్షిని చూచి; మరలన్= మళ్లీ; విదురుఁడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు; బాలుఁడు= చిన్నపిల్లవాడు; క్రీడావిలోల మానసమునన్= ఆటలయందు లగ్నమైన మనసుతో; లీలా+ అనురూపుఁడు+అగుచున్= ఆ ఆటలకు తగినవాడై; దీపించున్= ఒప్పును; కానిచోన్= అలా కానిపక్షమున; కామ+ అనుగతుఁడు+ఐ= వానియందు కోరిక కలవాడై; రమించును= ఆనందాన్ని పొందును; అర్భకుఁడు= బాలుడు; అర్థిన్= కోరికతో; వస్తు+అంతరమునన్= వేరు వేరు వస్తువులతో; అర్భక+అంతరమునన్+ఐనను= వేరు వేరు బాలకులతోగాని; బాలకేళీసంగుఁడు+అగుచున్= పిల్లాటలయందు ఆసక్తి కలవాడౌతూ; ఓలిన్+చరించున్= క్రమముగా ప్రవర్తిస్తూ ఉంటాడు;

హరియున్= నారాయణుడు; ఎపుడు= ఎల్లపుడు; నివృత్తుఁడు= ఎటువంటి కోరికలూ లేనివాడు; అత్యంత తృప్తుఁడు= నిత్యమూ సంతృప్తితో ఉండేవాడును; అగుటన్= అగుటచేత; క్రీడా+ఆదులందున్= ఆటలు మొదలగువాటియందు; వర్తించుట+ఎట్లు?= ప్రవర్తించుట ఎట్లు జరుగుచున్నది?; మఱియున్= అంతే కాకుండగా; త్రిగుణ+ఆత్మకంబు+ఐన= సత్త్వరజస్తమోగుణాలతో కూడిన; మాయన్+కూడి= మాయతో కలిసి; అఖిల జగములన్= చతుర్దశభువనాలను; కల్పించెన్= సృష్టించెను; అనుట+ఎట్లు= అని పలుకుట ఎలా పొసగును?

**తా :** అలా అడిగిన విదురుడు ఒకవేళ పరమాత్మ ఒక బాలుడులాగ ఈ జగత్తుతో ఆడుకొంటున్నాడా? అనుకొని మళ్లీ మైత్రేయుని అడుగుతున్నాడు. మహర్షీ! నిజంగా భగవంతుడు పసివాడిలా ఈ ప్రపంచంతో ఆడుకొంటున్నాడనుకొంటే అపుడా ఆటలయందు ఆయనకు కోరిక ఉండాలి. భగవంతుడు కోరికలు లేనివాడు గదా! ఆ ఆటలవల్ల అతనికి ఆనందం కలగాలి. భగవంతుడు నిత్యసంతోషి కదా! ఆడుకోవాలంటే వేరు వేరు వస్తువులు కావాలి. ప్రపంచమంతా ఒకటే వస్తువైతే ఎలా ఆడుకొంటాడు? అయినా నిర్గుణుడైన పరమాత్మ త్రిగుణాత్మకమైన మాయతో కలిసి ప్రపంచాన్ని సృష్టించడమేమిటి? అని.

**సీ. అమ్మాయచేత నీ యఖిలంబు సృజియించి పాలించి పొలియించి పరమపురుషుఁ**
**దనఘాత్మ! దేశకాలావస్థలందును నితరులయందు నహీనమైన**
**జ్ఞానస్వభావంబుఁబూని యా ప్రకృతితో నెబ్భంగిఁగలసె దా నేకమయ్యుఁ**
**గోరి సమస్తశరీరంబులందును జీవరూపమున వసించి యున్న**

**తే. జీవునకు దుర్భగక్లేశసిద్ధి యెట్టి, కర్మమున సంభవించెను? గడఁగి నాదు**
**చిత్త మజ్ఞానదుర్గమస్థితిఁగలంగి, యధికఖేదంబు నొందెడు ననఘచరిత! 233**

**ప్రతి :** అనఘచరిత= పుణ్యాత్ముడా!; ఆ+మాయచేతన్= త్రిగుణాత్మకమైన ఆ యోగమాయచేత; ఈ+అఖిలంబున్= ఈ సమస్త ప్రపంచాన్ని; సృజియించి= సృష్టించి; పాలించి= పోషించి; పొలియించి= లయంచేసి; పరమపురుషుఁడు= పరమాత్మ; దేశకాల+అవస్థలందునున్= భిన్న ప్రదేశాలలో, కాలాలలో, సన్నివేశాలలోను; ఇతరులయందున్= ఇతర ప్రాణులయందును; న+హీనము+ఐన= అధికమైన; జ్ఞానస్వభావంబున్= విజ్ఞానతత్త్వాన్ని; పూని= వహించి; ఆ ప్రకృతితోన్= కనిపిస్తున్న ప్రకృతితో; ఏ+భంగిన్= ఏ విధముగా; కలసెన్= ఐక్యమై ఉండెను; తాన్= ఆ పరమాత్మ; ఏకము+అయ్యున్= ఒక్కడే అయ్యును; కోరి= తన సంకల్పంతోనే; సమస్త శరీరంబులందును= అన్ని ప్రాణుల శరీరాలలోను; జీవరూపమునన్= ఆత్మరూపంలో; వసించి+ఉన్న= నివసిస్తున్న; జీవునకున్= జీవాత్మ స్వరూపునికి; దుర్భగక్లేశసిద్ధి= భరింపరాని కష్టము; ఎట్టి+కర్మమునన్= ఏ కర్మమువలన; సంభవించెను= ఏర్పడినది; కడఁగి= పూని; నాదు చిత్తము= నా మనస్సు; అజ్ఞాన= గ్రహించే శక్తి లేకపోవుటచేత; దుర్గమస్థితిన్= జ్ఞానమనే గమ్యాన్ని పొందలేని పరిస్థితివల్ల; కలంగి= వికలమై; అధిక ఖేదంబున్= మిక్కిలి విచారాన్ని; ఒందెడున్= పొందుచున్నది.

**తా :** పుణ్యాత్మా! మైత్రేయా! తన మాయతో ఈ జగత్తును సృష్టించి, పోషించి, చివరకు లయం చేసే పరమాత్మ ఆ యా జీవులలో జ్ఞానస్వరూపంతో సర్వదేశకాలావస్థలలోనూ ఉంటాడు కదా! తాను జీవులలో ఏకమై ఉన్నపుడు ఆ యా జీవులకు దారుణమైన కష్టాలు ఎందుకు కలుగుతున్నాయి? ఏ కర్మమువల్ల సంభవిస్తున్నాయి? ఈ సందేహాలతో నా మనస్సు వ్యాకులపడుతోంది. అజ్ఞానావస్థనుండి బయటపడలేకపోతున్నాను అన్నాడు విదురుడు.

**వ. అది గావున సూరిజనోత్తముండవైన నీవు మదీయ మానసిక సంశయంబులం దొలఁగింప నర్హుండవని విదురుండు మైత్రేయమహామునీంద్రు నడిగె నని బాదరాయణతనూభవుఁడభిమన్యునందనున కిట్లనియె. 234**

**ప్రతి :** అది+కావునన్= నేను (విదురుడు) సందేహాలతో సతమతమవుతున్నాను కనుక; సూరిజన+ఉత్తముఁడవు+ఐన నీవు= పండితులలో అగ్రేసరుడవైన నీవు (మైత్రేయుడు); మదీయమానసికసంశయంబులన్= నా మనస్సులో ఏర్పడే సందేహాలను; తొలఁగింపన్= నివృత్తి చేయుటకు; అర్హుండవు+అని= సమర్థత కలవాడవని; విదురుండు= విదురుడు; మైత్రేయమహాముని+ఇంద్రున్= మైత్రేయమహర్షి శ్రేష్ఠుని; అడిగెన్+అని= కోరెనని; బాదరాయణ తనూభవుఁడు= వ్యాసుని కుమారుడైన శుకమహర్షి; అభిమన్యు నందనునకున్= అభిమన్యుని కుమారుడైన పరీక్షిన్మహారాజునకు; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తా :** కావున పండితాగ్రేసరుడవైన నీవు నా సందేహాలను తొలగించేందుకు సమర్థుడవు అని విదురుడు మైత్రేయుని అడిగాడని శుకమహర్షి పరీక్షిన్మహారాజుతో చెప్పి, ఇంకా ఇలా అంటున్నాడు.

**క. సరసిరుహోదరమంగళ, చరితామృతపానకుతుకసంగంబున ని**
**ర్భరుఁడగు విదురునకు మునీ, శ్వరుఁ డగు మైత్రేయుఁడనియె సజ్జనతిలకా! 235**

**ప్రతి :** సత్+జనతిలకా!= సుజనులకే తిలకాయమానుడవైన పరీక్షిన్మహారాజా!; సరసిరుహ+ఉదర= ఉదరమునందు పద్మము కల నారాయణునియొక్క; మంగళ= శుభాస్పదమైన; చరిత= కథ అనే; అమృతపాన= సుధాపానమునందలి; కుతుక= ఆసక్తితో; సంగంబునన్= కూడియుండుటయందు; నిర్భరుఁడు+అగు= మిక్కిలి ఆసక్తుడైన; విదురునకున్!= విదురునితో; మునీశ్వరుఁడు+అగు= మునిశ్రేష్ఠుడైన; మైత్రేయుఁడు= మైత్రేయమహర్షి; అనియెన్= ఈ విధముగా చెప్పనారంభించెను.

**తా :** సుజనతిలకుడవైన పరీక్షిన్మహారాజా! హరికథామృతపానలోలుడైన విదురునితో మైత్రేయుడు అప్పుడు ఇలా చెప్పనారంభించాడు అని శుకమహర్షి అన్నాడు.

**చ. వినుము వితర్కవాదములు విష్ణుని ఫుల్లసరోజపత్ర నే**
**త్రుని ఘనమాయ నెప్పుడు విరోధము సేయుఁ బరేశు నిత్య శో**
**భనయుతు బంధనాదికవిపద్దశలుం గృపణత్వ మెప్పుడే**
**ననయముఁబొందలేవు విభుఁడాద్యుఁడనంతుఁడు నిత్యుఁడౌటచేన్. 236**

**ప్రతి :** వినుము= విదురా! విను; వితర్కవాదములు= పిడివాదాలు; ఫుల్లసరోజపత్రనేత్రుని= వికసించిన పద్మములవంటి కన్నులు గల; విష్ణుని= నారాయణుని; ఘనమాయన్= గొప్పదైన మాయను; ఎప్పుడున్= ఎల్లపుడూ; విరోధము+చేయున్= వ్యతిరేకంగానే ఆలోచింపజేస్తాయి; విభుఁడు= జగన్నాథుడు; ఆద్యుఁడు= మొదటివాడు; అనంతుఁడు= తుది లేనివాడు; నిత్యుఁడు= శాశ్వతమైనవాడు; ఔటచేన్= కావడంచేత; నిత్యశోభనయుతున్= నిత్యమంగళ స్వరూపుడైన; పర+ఈశున్= ఆ పరమాత్మను; బంధన+ఆదిక= సంసారబంధనాలు మొదలైన; విపత్+దశలున్= కష్టాలు; కృపణత్వము= లోభము; ఎప్పుడేన్= ఎప్పుడైనాసరే; అనయమున్= ఎల్లప్పుడు; పొందలేవు= అంటవు.

**తా :** విదురా! పిడివాదాలతో భగవత్తత్త్వం తెలుసుకోవాలనుకోవడం వెర్రితనం. ఆ వాదాలకు పరమాత్మతత్త్వం అందదు. ఆయన ఆద్యంతరహితుడు, నిత్యమంగళస్వరూపుడు కనుక ఏ బంధాలు, ఏ బాధలు అతనిని అంటవు. స్వామి అన్నింటికీ అతీతుడు.

**వ. మఱియును. 237**

**ప్రతి :** మఱియును= అంతేకాక.

**చ. పురుషుఁడు నిద్రవోఁ గలలఁబొందు సమస్తసుఖంబు లాత్మ సం**
**హరణశిరోవిఖండనము లాదిగ జీవునికిం బ్రబోధమం**
**దరయఁగఁ దోఁచుచున్న గతి నాదిఁ బరేశుఁడు బంధనాదులం**
**బొరయక తక్కు టెట్లనుచు బుద్ధిని సంశయ మందె దేనియున్. 238**

**ప్రతి :** పురుషుఁడు= శరీరి; నిద్ర+పోన్= నిద్రపోయినపుడు; కలలన్= స్వప్నాలలో; పొందు= పొందునట్టి; సమస్త సుఖంబులు= సర్వసుఖాలు; ఆత్మసంహరణ= తనను ఎవరో చంపుట; శిరస్+విఖండనములు= తలలను నరకుటలు; ఆదిగ= మొదలైనవి; జీవునికిన్= మానవునకు; ప్రబోధమందు; మేలుకొన్న తరువాత; అరయఁగన్= ఆలోచించగా; తోఁచుచున్న గతిన్= ఇది కలయే కాని నిజముకాదని గ్రహించినట్లుగా; ఆదిన్= అనుభవించు ముందుకాలంలో; పర+ ఈశుఁడు= పరమాత్మకూడా; బంధనాదులన్= సంసారబంధములవంటి కష్టాలను; పొరయక= పొందకుండా; తక్కుట+ ఎట్లు+అనుచున్= తప్పించుకోవడం ఎలా అని; బుద్ధినిన్= నీ మనస్సులో; సంశయము+అందెదు+ఏనియున్= సందేహిస్తున్నట్లయితే (విను).

**తా :** విదురా! నిద్రపోవునపుడు కలలో మానవునికి ఎన్నో సుఖాలు కలుగుతాయి. అవి ఆనందంగా అనుభవిస్తాడు. కొన్ని మారులు తనను ఎవరో చంపినట్లు, తన తల నరికివేసినట్లు కలగంటాడు. అపుడు ఎంతో విచారిస్తాడు. మెలకువ వచ్చాక ఆ సుఖంగాని, కష్టంగాని అంతా కలయే తప్ప నిజం కాదని గ్రహిస్తాడు. భగవంతుని లీలకూడా అట్టిదే. ఆయన జీవుడుగా నటిస్తున్నాడు తప్ప నిజం కాదు గనుక ఆయనను ఏమీ అంటవు. మానవుడు మెలకువ వచ్చాక అసత్యమని తెలుసుకొన్నా కలగంటున్న సమయంలో సుఖమైతే ఆనందాన్ని, కష్టమైతే విచారాన్ని పొందుతాడు కదా! అలాగే భగవంతునికి కూడా జీవుడుగా నటించే సమయంలోనైనా వచ్చే కష్టసుఖాలు అంటకుండా ఎలా ఉంటాయని సందేహిస్తున్నావా! అయితే విను.

**వ. అవ్విధంబతనికింగలుగ నేర దది యెట్లంటేని- 239**

**ప్రతి :** ఆ+విధంబు= ఆ రకమైన సుఖదుఃఖ ద్వంద్వము; అతనికిన్= పరమాత్మకు; కలుగనేరదు= కలుగదు; అది= ఆ విషయం; ఎట్లు+అంటేని= ఎలాగంటే;

**తా :** ఆ రకమైన సుఖదుఃఖాలు పరమాత్మకు అంటవు. ఎందుకంటే.

**చ. లలితవిలోలనిర్మలజలప్రతిబింబిత పూర్ణచంద్ర మం**
**డలము దదంబుచాలనవిడంబన హేతువు నొందియున్ వియ**

**త్తలమునఁగంప మొందని విధంబున సర్వశరీరధర్మముల్**
**గలిగి రమించు నీశునకుఁగల్గఁగనేరవు కర్మబంధముల్. 240**

**ప్రతి :** లలిత= సుకుమారంగా; విలోల= చలించుచున్న; నిర్మల= స్వచ్ఛమైన; జల= నీటియందు; ప్రతిబింబిత= ప్రతిఫలించే; పూర్ణచంద్రమండలము= నిండు జాబిలి బింబము; తద్+అంబు= ఆ నీటియొక్క; చాలన= కదలికవల్ల; విడంబన+హేతువున్= అనుకరణ కారణాన్ని (తానూ కదలుతున్నట్లుగా కనిపించే హేతువును); ఒందియున్= పొందికూడా (తానూ కదలుతున్నట్లుగా భ్రాంతి కల్పించినా); వియత్+తలమునన్= స్వస్థానమైన ఆకాశంలో; కంపము= చలనమును; ఒందని విధంబునన్= పొందనట్లుగా; సర్వశరీర ధర్మముల్= శరీరానికి ఉండే అన్ని లక్షణాలను; కలిగి= పొంది; రమించు= ఆనందించే; ఈశునకున్= పరమాత్మకు; కర్మబంధముల్= కర్మబంధాలు; కల్గఁగన్+నేరవు= అంటవు.

**తా :** నిర్మలమైన నీటిలో నిండు జాబిల్లి ప్రతిబింబిస్తూ ఉంటుంది. నీటిలో అలలు నెమ్మదిగా కదలుతుంటే చంద్రుడు కూడా కదలుతున్నట్లనిపిస్తాడు. కాని నిజానికి ఆకాశంలోని చందమామ కదలదు కదా! అలాగే శరీరధర్మాలన్నీ కలిగి, ఒక శరీరిగా క్రీడారూపంగా సుఖాదులనుభవించే పరమాత్మకు కూడా ఏ కర్మబంధాలూ అంటవు.

**వ. కావున జీవునకు నవిద్యామహిమంజేసి కర్మబంధనాదికంబు సంప్రాప్తం బగుంగాని సర్వభూతాంతర్యామి యైన యీశ్వరునకుంబ్రాప్తంబు గానేరదని వెండియు 241**

**ప్రతి :** కావునన్= పరమాత్మకు ఏ కర్మబంధాలు అంటవు కనుక; జీవునకున్= ప్రాణికి; అవిద్యామహిమన్+చేసి= అజ్ఞానమువలన; కర్మబంధన+ఆదికంబు= కర్మబంధం మొదలైనది; సంప్రాప్తంబు+అగున్+కాని= ఏర్పడుతుంటుంది కాని; సర్వభూత+అంతర్యామి+ఐన= అన్ని ప్రాణులలోను నివసించే; ఈశ్వరునకున్= పరమాత్మకు; ప్రాప్తంబు+కానేరదు+అని= కర్మలు అంటవు అని చెప్పి; వెండియున్= మరియును...

**తా :** కాబట్టి జీవాత్మస్వరూపుడైన మానవునికి అజ్ఞానమనేది ఉంటుంది కనుక దానివల్ల కర్మలు చేయడం, వాటివల్లనే బంధనాలలో పడటం వంటివి ఉంటాయి. కాని అన్ని జీవులలో అంతర్యామిగా ఉండే పరమాత్మకు ఆ అజ్ఞానం ఉండదు. అందువల్ల ఆ సర్వజ్ఞునికి ఎటువంటి కర్మబంధాలు అంటవు.

**చ. నరునకు నాత్మదేహజగుణంబులఁబాపఁగ నోపుఁ బంకజో**
**దరచరణారవిందమహితస్ఫుటభక్తియ; యింద్రియంబు లీ**
**శ్వరవిషయంబులైన మది సంచితనిశ్చలతత్త్వ మైనచో**
**సరసిజనేత్రు కీర్తనమె చాలు విపద్దశలన్ జయింపఁగన్. 242**

**ప్రతి :** నరునకున్= మానవునకు; ఆత్మ= తనయొక్క; దేహజ= శరీరమునుండి పుట్టిన; గుణంబులన్= తొలగించుకోవలసిన గుణాలను; పాపఁగన్= పోగొట్టుటకు; పంకజ+ఉదర= పద్మనాభుని; చరణ+అరవింద= పాదపద్మములపై; మహిత= గొప్పదైన; భక్తి+అ= భక్తియే; ఓపున్= సమర్థమగును; ఇంద్రియంబులు= జ్ఞానకర్మేంద్రియాలు పది; ఈశ్వరవిషయంబులు+ఐనన్= పరమాత్మభావనలో లగ్నమైతే; మది= మనస్సు; సంచిత= కూడబెట్టబడిన; నిశ్చలతత్త్వము= ఏకాగ్రభావము కలిగినది; ఐనచోన్= అయినట్లయితే; విపద్+దశలన్= ఆపదలను కలిగించే పరిస్థితులను; జయింపఁగన్= దాటి బయటపడేందుకు; సరసిజనేత్రు= పద్మనేత్రుడైన నారాయణుని; కీర్తనమె చాలున్= కీర్తిస్తే సరిపోతుంది.

**తా :** మానవునికి తన దేహంనుండి పుట్టే అవాంఛనీయ గుణాలను పోగొట్టుకోవాలంటే నారాయణునిపై భక్తి ఉంటే చాలు. అలాగే సంసారంలో వచ్చే రకరకాల ఈతిబాధలనుండి బయటపడాలంటే ఇంద్రియచాపల్యం విడిచిపెట్టి, మనస్సును నిశ్చలం చేసి స్వామిసంకీర్తనం చేస్తే సరిపోతుంది.

**చ. హరిచరణారవిందయుగళార్చనసన్నుతి భక్తియోగముల్**
**నిరతముఁగల్గువారు భవ నీరజగర్భుల కందరాని భా**
**సురపదమందుఁజేరుదురు; సూరిజనస్తవనీయ! యట్టి స**
**త్పురుషుల పూర్వజన్మఫలమున్ గణుతింపఁ దరంబె యేరికిన్. 243**

**ప్రతి :** సూరిజనస్తవనీయ!= పండితకీర్తనీయుడైన విదురా!; హరి= శ్రీమన్నారాయణుని; చరణ+అరవింద= పాదపద్మముల; యుగళ= జంటయొక్క; అర్చన= పూజ; సత్+నుతి= శ్రీహరికీర్తన; భక్తియోగముల్= భక్తి అనే యోగము; నిరతమున్= ఎల్లప్పుడును; కల్గువారు= కలిగియుండేవారు; భవనీరజగర్భులకున్= శివ బ్రహ్మలకును; అందరాని= అందుకొన సాధ్యముకాని; భాసురపదమందున్= పరంధామంలోకి; చేరుదురు= చేరుకొంటారు; అట్టి= అటువంటి; సత్పురుషుల= సజ్జనుల; పూర్వజన్మఫలమున్= పూర్వజన్మ సుకృతాన్ని; గణుతింపన్= స్తుతించేందుకు; ఏరికిన్= ఎవరికైనా; తరంబు+ఎ= సాధ్యమా?

**తా :** పండితులుకూడా పొగడే విదురా! ఎవరైతే నారాయణ పాదపద్మాలను అర్చిస్తూ, స్తుతిస్తూ నిరంతరమైన భక్తియోగంతో ఉంటారో వారు శివబ్రహ్మలకు కూడా పొంద సాధ్యంకాని పరంధామాన్ని పొందుతారు. అటువంటి పుణ్యాత్ముల పూర్వజన్మ సుకృతం ఇట్టిది అట్టిది అని పొగడుట ఎవరికిని సాధ్యం కాదు.

**వ. అని చెప్పిన విదురుండు మైత్రేయుం గనుంగొని ముకుళిత హస్తుండును వినమిత మస్తకుండును నగుచుఁ దన మనంబున శ్రీహరిం దలంచుచు వినయ వచనరచనుండై యిట్లనియె. మునీంద్రా! భవదీయ వాక్యంబులచేత నా మనంబున నారాయణుండు లోకైకనాథుం డెట్లయ్యె ననియు, శరీరధారియైన జీవునికిఁ గర్మబంధంబు లేరీతి సంభవించె ననియునుం బొడమిన సంశయంబు నేఁడు నివృత్తం బయ్యె; నెట్లనిన లోకంబున కీశ్వరుండు హరి యనియు జీవుండు పరతంత్రుం డనియును దలంపుదు; నారాయణభక్తిప్రభావంబు ప్రాణిగోచరంబైన యవిద్యకు నాశనకారణం బనం దనరుచుండు; నారాయణుండు దనకు నాధారంబు లేక సమస్తంబునకుం దాన యాధారభూతుండై విశ్వంబుం బొదివి యందుఁ దా నుండు తెఱంగెట్లు? శరీరాభిమానంబును బొంది యెవ్వఁడు మూఢతముండై సంసారప్రవర్తకుం డగు? నెవ్వండు భక్తిమార్గంబునఁ బరమాత్ముండైన పుండరీకాక్షునిం జెందు? వీర లిద్దఱును సంశయ క్లేశంబులు లేమింజేసి సుఖానంద పరిపూర్ణులై యభివృద్ధి నొందువార లగుదు; రెవ్వండు సుఖదుఃఖానుసంధానంబుచే లోకానుగతుం డగుచుం బ్రమోద వేదనంబుల నొందు; నతండు దుఃఖాశ్రయుండగు; నారాయణ భజనంబున సమస్త దుఃఖనివారణం బగునని భవదీయచరణ సేవానిమిత్తంబునం గంటిఁ: బ్రపంచంబు ప్రతీతిమాత్రంబు గలిగి యున్న దయిన నందులకుఁ గారణంబు లేకుండుటంజేసి తెలియనివాఁడనై వర్తింతునని వెండియు. 244**

**ప్రతి :** అని చెప్పినన్= హరిభక్తుల సుకృతం గణుతింపరానిదని మైత్రేయుడు చెప్పగా; విదురుండు= విదురుడు; మైత్రేయున్+కనుంగొని= మైత్రేయమహర్షిని చూచి; ముకుళిత హస్తుండును= దోయిలించినవాడును; వినమిత మస్తకుండును= వినయముతో వంచిన శిరస్సు కలవాడును; అగుచున్= అవుతూ; తన మనంబునన్= తన మనస్సులో; శ్రీహరిన్+తలంచుచున్= శ్రీమన్నారాయణుని ధ్యానిస్తూ; వినయవచన రచనుండు+ఐ= వినయముతోకూడి పలుకుచున్నవాడై; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు; మునీంద్రా!= మైత్రేయమహర్షీ!; భవదీయవాక్యంబులచేతన్= నీ మాటలవలన; నా మనంబునన్= నా మనస్సులో; నారాయణుండు= శ్రీహరి; లోక+ఏకనాథుండు= లోకాలన్నింటికీ ఒకడే అయిన ప్రభువు; ఎట్లు+అయ్యెన్+ అనియున్= ఎలా కాగలిగాడనియు; శరీరధారి+ఐన జీవునికిన్= దేహాన్ని ధరించిన ప్రాణికి; కర్మబంధంబులు= కర్మసంబంధమైన బంధనాలు; ఏ రీతి సంభవించెన్+అనియున్= ఎలా సంప్రాప్తించాయనియు; పొడమిన సంశయంబు= ఏర్పడిన సందేహం; నేడు నివృత్తంబు+అయ్యెన్= ఈనాడు తొలగిపోయినది; ఎట్లు+అనినన్= ఎలా అంటే; లోకంబునకున్= జగత్తునకు; ఈశ్వరుండు= ప్రభువు; హరి+అనియున్= నారాయణుడనియు; జీవుండు= ప్రాణి; పరతంత్రుండు+అనియున్= పరమాత్మకు వశమై ఉండువాడనియు; తలంపుదున్= భావిస్తాను; నారాయణ భక్తిప్రభావంబు= విష్ణుభక్తియొక్క ప్రభావం; ప్రాణిగోచరంబైన+ అవిద్యకున్= జీవులకు గల అజ్ఞానము; నాశనకారణంబు+అనన్= నశించుటకు కారణము అనునట్లుగా; తనరుచుండున్= ఒప్పుచుండును; నారాయణుండు= శ్రీహరి; తనకున్+ఆధారంబు లేక= తనకెటువంటి ఆలంబనం లేకుండా; సమస్తంబునకున్= సర్వజగత్తునకు; తాన+ఆధారభూతుండు+ఐ= తానే ఆధారమవుతూ; విశ్వంబున్+పొదివి= ప్రపంచాన్ని ఆవరించి; అందున్+తాన్+ఉండు= అందులోనే తానుండే; తెఱంగు+ఎట్లు= పద్ధతి ఏమిటి; శరీర+ అభిమానంబును+పొంది= దేహాభిమానం పొంది; ఎవ్వఁడు మూఢతముండు+ఐ= ఏ మానవుడు అజ్ఞానియై; సంసారప్రవర్తకుండు+అగున్= సంసారచక్రంలో పడి తిరుగుతుంటాడో; ఎవ్వండు= ఏ మానవుడు; భక్తిమార్గంబునన్= భక్తిమార్గంలో; పరమాత్ముండు+ఐన= విరాట్ పురుషుడైన; పుండరీకాక్షునిన్+చెందున్= నారాయణుని చేరుకొంటాడో; వీరలు ఇద్దఱును= ఈ ఉభయులును; సంశయక్లేశంబులు+లేమిన్‌చేసి= సందేహాలనే కష్టాలు లేకపోవుటచే; సుఖ ఆనంద పరిపూర్ణులు+ఐ= సుఖాలతోను, ఆనందంతోను నిండినవారై; అభివృద్ధిన్+ఒందువారలు= ఉన్నతిని పొందేవారు; అగుదురు= అవుతుంటారు; ఎవ్వండు= ఏ మానవుడైతే; సుఖదుఃఖ+అనుసంధానంబుచేన్= సుఖాల దుఃఖాల కలయికచే; లోక+ అనుగతుండు+అగుచున్= లోకాన్ని అనుసరిస్తూ; ప్రమోద వేదనంబులన్+ఒందున్= సంతోష విచారాలను పొందుతుంటాడో; అతండు= ఆ మానవుడు; దుఃఖ+ఆశ్రయుండు+అగున్= కష్టాలకు నిలయుడౌతాడు; నారాయణ భజనంబున్= శ్రీహరి సేవతో; సమస్త దుఃఖ నివారణంబు+అగున్+అని= అన్నీ కష్టాలు కడతేరునని; భవదీయ చరణ సేవానిమిత్తంబునన్= నీ పాదాలను సేవించుటచేత (మైత్రేయుని); కంటిన్= గ్రహించితిని (విదురుడు); ప్రపంచంబు= జగత్తు; ప్రతీతిమాత్రంబు= ఉన్నట్లుగా అనిపించే లక్షణం; కలిగి+ఉన్నది+అయినన్= కలిగి ఉన్నట్లయితే; అందులకున్+ కారణంబు= దానికి తగిన హేతువు; లేక+ఉండుటన్+చేసి= లేకపోవుటచేత; తెలియనివాఁడన్+ఐ= అజ్ఞానినై; వర్తింతున్= ప్రవర్తిస్తుంటాను; అని వెండియున్= అని విదురుడు పలికి మరియును…

**తా :** మైత్రేయ మహర్షి అలా చెప్పగా విదురుడు రెండుచేతులూ జోడించి ఆ మునీంద్రుని చూస్తూ శ్రీహరిని ధ్యానిస్తూ ఇలా అంటున్నాడు. మునీంద్రా! నీ మాటలవల్ల నా సందేహాలు తొలగిపోయాయి. నారాయణుడు లోకనాథుడు ఎలా అయ్యాడో, శరీరధారులైన జీవులకు కర్మబంధాలు ఎలా అంటుతున్నాయో అన్న అనుమానాలు పటాపంచలయ్యాయి. నారాయణుడు సర్వస్వతంత్రుడనీ, ఆయనమీద భక్తిమాత్రమే అవిద్యానాశనానికి మూలమనీ తెలిసింది.

తనకు ఏ ఆధారం అవసరం లేకుండా తానే విశ్వమంతటికీ ఆధారమై ఎలా ఉంటున్నాడు నారాయణుడు, ఎటువంటి దేహాభిమాని సంసారంలోనే పడి కొట్టుకుంటుంటాడు, ఎటువంటివాడు భక్తిమార్గంతో పుండరీకాక్షుని పొందగలుగుతాడు, నిజానికి ఇద్దరూ సుఖాలు అనుభవిస్తుంటారు కాని ఎవడు సుఖదుఃఖాలవల్ల కలిగే సంతోషవిచారాలతో కూడుకొని ఉంటాడో, ఎవడు నారాయణ సేవతో సకల దుఃఖాలనుండి బయటపడతాడో, ఇదంతా నా సేవవల్ల నాకు బోధపడింది. కాని, లేని ప్రపంచం ఉన్నట్లుగా మనకు గోచరిస్తోందన్నావు. అందుకు కారణం నాకు తెలియడం లేదు.

**క. లలి నా మదిఁ దలఁపుదు సుమ, తులు గొనియాడంగఁదగిన తోయజనాభుం**
**డలవడఁ డల్పతపోనిరతుల, తలపోఁతలకు మిగుల దుర్లభుఁ డనియున్. 245**

**ప్రతి :** సుమతులు= ధీమంతులు; కొనియాడంగన్+తగిన= స్తుతింపదగిన; తోయజనాభుండు= పద్మనాభుడు; అల్ప తపస్+నిరతుల= అతంతమాత్రం తపస్సు చేసినవారి; తలపోఁతలకున్= భావనలకు; మిగులన్= మిక్కిలి; దుర్లభుఁడు+అనియున్= చిక్కేవాడు కాడని; లలిన్= క్రమముగా; నా మదిన్+తలఁపుదున్= నా మనస్సులో భావిస్తుంటాను.

**తా :** జ్ఞానులు ప్రశంసించే పద్మనాభుడు కొద్దిపాటి తపస్సు మాత్రమే కలవారి ఆలోచనలకు లభించడని క్రమంగా నేను నా మనస్సులో భావిస్తుంటాను అని విదురుడు అన్నాడు.

**సీ. ఇంద్రియంబులతోడ నెలమి నొప్పెడి మహదాదుల నితరేతరానుషంగ**
**ముగఁజేసి వానియందొగి విరాడ్దేహంబు పుట్టించి యందుఁజేపట్టి తాను**
**వసియించు నాతఁడు వరుస సహస్ర సంఖ్యాకంబులగు మస్తకాంఘ్రిబాహు**
**కలితసత్పురుషునిగా బ్రహ్మవాదులు పలుకుదు రా విరాట్ప్రభువునందు**

**తే. భువనజాలంబు లలజడిఁ బొరయకుండుఁ, బ్రాణదశకంబు నింద్రియార్థములు నింద్రి**
**యాధిదైవతములుఁగూడ ననఘ! త్రివిధ, మగుచు విప్రాదివర్ణము లయ్యె నందు. 246**

**ప్రతి :** అనఘ!= పుణ్యాత్ముడా!; ఎలమిన్= ప్రీతితో; ఇంద్రియంబులతోడన్= కర్మ, జ్ఞానేంద్రియాలతో; మహత్+ఆదులన్= మహత్తు మొదలగు శక్తులను; ఇతర+ఇతర+అనుషంగముగన్= ఒకదానితో మరొకదానికి సంబంధము కలుగునట్లుగా; చేసి= ఏర్పరచి; వానియందున్= ఆ శక్తుల ఇంద్రియముల సమ్మేళనమునందు; ఒగిన్= క్రమముగా; విరాట్+దేహంబున్= అన్ని అవయవాలతో కూడిన పూర్ణశరీరాన్ని; పుట్టించి= పుట్టునట్లు చేసి; చేపట్టి= దానిని స్వీకరించి; అందున్= ఆ శరీరములో; తాను= పరమాత్మ; వసియించున్= నివసించును; ఆతఁడు= ఆ పరంధాముడు; వరుసన్= క్రమముగా; సహస్ర సంఖ్యాకంబులు+అగు= వేయి వేయి చొప్పున సంఖ్యగల; మస్తక= తలలు; అంఘ్రి= పాదములు; బాహు= చేతులతో; కలిత= కూడిన; సత్‌పురుషునిగాన్= పరమపురుషునిగా; బ్రహ్మవాదులు= వేదాంతజ్ఞానులు; పలుకుదురు= పలుకుచుందురు; ఆ విరాట్ ప్రభువునందున్= ఆ పరమపురుషునియందు; భువన జాలంబులు= పదునాల్గు లోకాలు; అలజడిన్= ఆపదను; పొరయక+ఉండున్= కలుగక ఉండును; ప్రాణదశకంబున్= పది ప్రాణాలు; ఇంద్రియ+అర్థములన్= ఇంద్రియ గోచరములయ్యే విషయాలు; ఇంద్రియ+అధిదైవతములున్+కూడ= ఆ ఇంద్రియాలకు అధిష్ఠానదేవతలు కూడా; త్రివిధము+అగుచున్= గుణభేదముచే ముప్విధములగుచు; అందున్= ఆ వ్యవస్థనుండి; విప్ర+ఆది వర్ణములు+ అయ్యెన్= బ్రాహ్మణాదిజాతులు ఆవిర్భవించాయి.

**తా :** పుణ్యాత్ముడవైన మైత్రేయా! భగవంతుడు ఇంద్రియాలతో మహదాదులకు పరస్పర సంబంధం కలిగించి వాటినుండి విరాడ్దేహాన్ని పుట్టిస్తాడు. అందులో తాను కూడా ప్రవేశిస్తాడు. అతడు వేయి వేయి శిరస్సులు, పాదములు, హస్తములు కలవాడని జ్ఞానులు చెపుతుంటారు. ఈ లోకాలన్నీ ఆ విరాట్పురుషునిలో ఉండి, ఎటువంటి ఆపద లేకుండా హాయిగా ఉంటాయి. పది ప్రాణాలు, ఇంద్రియ విషయాలు, ఇంద్రియ అధిదేవతలు ముప్విధములుగా మారి అందులోనుండి బ్రాహ్మణాదిజాతులు ఆవిర్భవించాయి.

**క. ఇలఁ బుత్త్రపౌత్త్రసంపద, గలిగిన వంశములతోడఁ గడుఁ జోద్యముగా**
**లలిఁ బ్రజ లే గతిఁ గలిగిరి?, కలిగిన యాప్రజలచే జగము లెట్లుండెన్? 247**

**ప్రతి :** ఇలన్= ఈ భూమిపై; పుత్త్ర పౌత్త్ర సంపద= కొడుకులు, మనుమలు అనే సంపద; కలిగిన= ఏర్పడిన; వంశములతోడన్= వంగడములతో పాటుగా; కడున్+చోద్యముగాన్= మిక్కిలి వింతగా; లలిన్= క్రమముగా; ప్రజలు= మానవులు; ఏ గతిన్= ఏ విధముగా; కలిగిరి= ఏర్పడ్డారు; కలిగిన= సంభవించిన; ఆ ప్రజలచేన్= ఆ జనులతో; జగములు= లోకాలు; ఎట్లు+ఉండెన్= ఏ విధంగా ఉన్నాయి.

**తా :** ఈ లోకంలో కొడుకులు, వారి పిల్లలతోకూడిన వంశాలలో జనులు ఎలా ఏర్పడ్డారు? వారితో ఈ ప్రపంచం ఏ విధంగా ప్రవర్తిస్తోంది?

**క. చతురత దీపింపఁ బ్రజా, పతులకుఁ బతి యనఁగ వెలయు పద్మాపతి యే**
**గతిఁ బుట్టించెను స్రష్టృ, ప్రతతులచే నవవిధప్రపంచము మఱియున్. 248**

**ప్రతి :** ప్రజాపతులకున్= ప్రజాపతులకు; పతి+అనఁగన్= నాయకుడు అనగా; వెలయు= ఒప్పు; పద్మాపతి= మాధవుడు; చతురత= నేర్పరితనము; దీపింపన్= ప్రకాశించునట్లుగా; స్రష్టృప్రతతులచేన్= బ్రహ్మ మొదలగువారితో; నవవిధ ప్రపంచము= వినూతనమైన ఈ ప్రపంచాన్ని; ఏ గతిన్= ఏ విధముగా; పుట్టించెను= సృష్టింపజేసెను?; మఱియున్= అంతే కాకుండా...

**తా :** ప్రజాపతులకే పతియైన లక్ష్మీపతి చాతుర్యం మెరిసేటట్లుగా బ్రహ్మ మొదలగువారితో ఈ ప్రపంచాన్ని ఎలా సృష్టింపజేశాడు?

**తే. వాని భేదంబులును మనువంశములును, మనుకులాధీశ్వరులును దన్మనుకులాను**
**చరితములు నే విభూతి నే జాడ దీని, నింతయునుఁబుట్టఁజేసె? నా కెఱుఁగఁబలుకు. 249**

**ప్రతి :** వాని భేదంబులును= ఆ సృష్టి భేదాలు; మనువంశములును= పదునాలుగు మనువుల వంశాలు; మను కుల అధీశ్వరులును= ఆ మనువంశ అధిపతులు; తద్+మనుకుల+అనుచరితములున్= ఆ వంశాల క్రమచరిత్రములు; ఏ విభూతిన్= ఏ శక్తితో; ఏ జాడన్= ఏ పద్ధతిగా; పుట్టన్+చేసెన్= పరమాత్మ సృష్టించెనో; ఇంతయునున్= ఈ విషయమంతా; నాకున్= నాకు; ఎఱుఁగన్= బోధపడేటట్లుగా; పలుకు= వివరింపుము.

**తా :** సృష్టిభేదాలు, మనువంశాలు, వంశాధిపతులు, వంశానుచరితలు ఇవన్నీ భగవంతుడు ఎలా ఏర్పరిచాడో నాకు స్పష్టంగా తెలియజేయి.

**విశే :** మనువులు పదునలుగురు. స్వాయంభువుడు, స్వారోచిషుడు, ఉత్తముడు, తామసుడు, రైవతుడు, చాక్షుషుడు, వైవస్వతుడు, సూర్యసావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, రుద్రసావర్ణి, రౌచ్యుడు, భౌత్యుడు. వారి ఏలుబడిలోనివే ఆ యా మన్వంతరాలు. ప్రస్తుతం నడచుచున్నది వైవస్వత మన్వంతరం.

**క. సరవిం గ్రిందన్ మీఁదం, ధరణికిఁగల లోకములను దత్తత్స్థితులన్**
**వరుసంబరిణామంబుల, నెఱిఁగింపఁ గదయ్య నాకు నిద్ధచరిత్రా! 250**

**ప్రతి :** ఇద్ధచరిత్రా!= పవిత్ర చరిత్రుడవైన మైత్రేయా!; సరవిన్= క్రమముగా; ధరణికిన్= భూమికి; క్రిందన్= క్రింది భాగమున; మీఁదన్= పైభాగమున; కల= ఉన్నటువంటి; లోకములను= భువనాలను; తద్+తద్+స్థితులన్= వాటి వాటి పరిస్థితులనుగూర్చి; వరుసన్= వరుసగా; పరిణామంబులన్= వాటిలో వచ్చే మార్పులను గురించి; నాకున్= విదురుడనైన నాకు; ఎఱిఁగింపన్+కదయ్యా= తెలియజేయుము.

**తా :** జగమెరిగిన పవిత్రమైన నడత గల మైత్రేయా! భూలోకానికి క్రింద ఎన్ని లోకాలున్నాయి, పైన ఎన్ని లోకాలున్నాయి, వాటి వాటి సంగతులు, వాటిలో క్రమంగా వచ్చే మార్పులు నాకు తెలియజెయ్యి.

**క. సురతిర్యఙ్నరరాక్షస, గరుడోరగసిద్ధసాధ్యగంధర్వ నభ**
**శ్చరముఖభవములు మునికుం, జర! గర్భజస్వేదజాండజముల తెఱంగున్. 251**

**ప్రతి :** మునికుంజర!= మునిశ్రేష్ఠా! మైత్రేయా!; సుర= దేవతలు; తిర్యక్= పశుపక్ష్యాదులు; నర= మానవులు; రాక్షస= రక్కసులు; గరుడ= గరుడపక్షులు; ఉరగ= పాములు; సిద్ధ= సిద్ధులు; సాధ్య= సాధ్యులు; గంధర్వ= గంధర్వులు; నభస్+చర= ఖేచరులు; ముఖ= మొదలైన; భవములు= ప్రాణులు; గర్భజ= గర్భమునుండి పుట్టునవి; స్వేదజ= చెమటనుండి పుట్టునవి; అండజముల= గ్రుడ్డునుండి పుట్టునవి అయిన ప్రాణుల; తెఱంగున్= పుట్టుకకు సంబంధించిన వివరమును...

**తా :** మునిశ్రేష్ఠుడా! దేవతలు, పశుపక్ష్యాదులు, మనుజులు, రాక్షసులు, గరుడులు, ఉరగులు, సిద్ధులు, సాధ్యులు, గంధర్వులు, ఖేచరులు మొదలైన జన్మములను గురించి, అలాగే గర్భంనుండి పుట్టే ప్రాణులు, గుడ్డునుండి పుట్టే ప్రాణులు, చెమటనుండి పుట్టే ప్రాణులు వాటిని గురించి తెలియజేయి.

**క. త్రిగుణప్రధానకంబుగ, నగు నవతారములఁబూర్ణమై వెలసిన యా**
**జగదుత్పత్తి స్థితిలయ, నిగమముల విధంబు వాని నిలుకడలు దగన్. 252**

**ప్రతి :** త్రిగుణ ప్రధానకంబుగన్= సత్త్వరజస్తమోగుణాల ప్రాధాన్యంతో; అగు= సంభవించే; అవతారములన్= భగవదవతారములను గూర్చి; పూర్ణము+ఐ= పరిపూర్ణ స్థితితో; వెలసిన= ఏర్పడిన; ఆ= ప్రసిద్ధమైన; జగత్= ప్రపంచముయొక్క; ఉత్పత్తి= పుట్టుక; స్థితి= ఉనికి; లయ= నశించుట; నిగమముల= వేదములయొక్క; విధంబు= రీతి; వాటియొక్క; నిలుకడలు= స్థితులు ఎలాంటివో; తగన్= తగినవిధంగా (తెలియజేయుము).

**తా :** మునివర్యా! సత్త్వరజస్తమోగుణాల ఆధారంగా ఏర్పడే భగవదవతారాలు, సమగ్రరూపాన్ని సంతరించుకొన్న ఈ ప్రపంచంయొక్క పుట్టుక, మనుట, పోవుటలు గురించి, వేదాలగురించి, వాటి నిలుకడలను గురించి నాకు వివరంగా తెలియజెయ్యి.

**క. చక్రాయుధుసౌందర్య ప, రాక్రమముఖగుణములును, ధరామరముఖ వ**
**ర్ణ క్రమములు, నాశ్రమ ధ, ర్మక్రియలును, శీలవృత్తమతభావములున్. 253**

**ప్రతి :** చక్రాయుధు= చక్రధారియైన శ్రీహరియొక్క; సౌందర్య= అందము; పరాక్రమముఖ= శౌర్యము మొదలైన; గుణములను= లక్షణాలను; ధరా+అమరముఖ= బ్రాహ్మణులు మొదలైన; వర్ణక్రమములు= జాతుల పద్ధతులు; ఆశ్రమధర్మక్రియలును= బ్రహ్మచర్యాది ఆశ్రమాల ధర్మాలు; శీల= ఆ యా ఆశ్రమవాసులకు ఉండవలసిన స్వభావం; వృత్త= నడవడిక; మతభావములున్= అభిప్రాయాలు, భావాలు (తెలియజేయుము).

**తా :** మైత్రేయ మహర్షీ! చక్రియొక్క అందచందాలు, వీరత్వం మొదలైన గుణాలు, బ్రాహ్మణులు మొదలగు నాలుగు వర్ణాలవారి విధానాలు, బ్రహ్మచర్యం మొదలైన నాలుగు ఆశ్రమాలు, వారి వారి ధర్మాచరణములు, స్వభావాలు, నడతలు, అభిప్రాయాలు ఇవన్నీ సవివరంగా తెలియజేయవలసింది.

**తే. యోగవిస్తారమహిమలు యాగములును, జ్ఞానమార్గములును బరిజ్ఞానసాధ**
**నములునై యొప్పు సాంఖ్యయోగములు వికచ, జలజనయన స్మృతంబులౌ శాస్త్రములును. 254**

**ప్రతి :** యోగ= యోగవిద్యయొక్క; విస్తార= విపులమైన; మహిమలు= విశేష లక్షణాలు; యాగములును= యజ్ఞములు, యాగములవంటి కర్మకాండలు; జ్ఞానమార్గములును= జ్ఞానముద్వారా మోక్షము పొందు విధానము; పరిజ్ఞానసాధనములునై= పరమాత్మజ్ఞానాన్ని సంపాదించేందుకు ఉపకరణములుగా; ఒప్పు= ఉపయోగపడు; సాంఖ్యయోగములు= సాంఖ్యము, యోగము అను దర్శనములు; వికచ= వికసించిన; జలజ= పద్మమువంటి; నయన= నేత్రములు కల శ్రీమహావిష్ణువుచేత; స్మృతంబులు+ఔ= స్మరింపబడిన; శాస్త్రములును= శాస్త్రములను గురించియు నాకు తెలియజేయుము.

**తా :** మహర్షీ! యోగవిద్య, దాని మహిమలు, యాగాదికర్మకాండలు, జ్ఞానమార్గాలు, విజ్ఞానసాధనాలైన సాంఖ్యయోగాలు, శ్రీమన్నారాయణుని స్మరణమాత్రంచేత పుట్టిన శాస్త్రాలు వీటన్నిటిని గురించి తెలియజేయి.

**సీ. పాషండమార్గంబుఁ బ్రతిలోమకుల విభాగములు జీవులు గుణకర్మములును**
**బలుకులు గతులును గలిగెడి ధర్మమోక్షములయందలి పరస్పరవిరోధ**
**ములు లేని సాధనములు భూమిపాలక నీతివార్తలు దండనీతి జాడ**
**యును బృథగ్భావంబులును విధానములును బితృమేధములును దత్పితృవిసర్గ**

**తే. గతులుఁ దారాగ్రహంబులుఁ గాలచక్ర, మున వసించిన నిలుకడలును దపములు**
**దానములుఁ దత్ఫలంబులుఁ దనరు ప్రబల, ధర్మములు బ్రజ లొనరించు కర్మములును. 255**

**ప్రతి :** పాషండమార్గంబున్= నాస్తికమతమును; ప్రతిలోమకుల విభాగములు= అశాస్త్రీయ వివాహంవలన పుట్టినవారి విభాగములు; జీవులు= ప్రాణులు; గుణకర్మములును= వారి వారి గుణాలు కర్మలు; పలుకులు= మాటలతీరు; గతులును= వాటి విధానములు; కలిగెడి= ఏర్పడే; ధర్మమోక్షములయందలి= ధర్మమోక్షాలకు సంబంధించి; పరస్పరవిరోధములు= ఒకదానికొకటి పొసగకపోవటాలు; లేని= ఉండని; సాధనములు= ఉపకరణాలు; భూమిపాలకనీతి= రాజనీతి; వార్తలు= రాజ్యవిశేషాలు; దండనీతి= రాజదండనకు సంబంధించిన నీతి; జాడయును= వాటి విధానమును; పృథక్+భావంబులును=

వేరుపాటు విధానములును; పితృమేధములును= పితృయజ్ఞాలు; తద్+పితృవిసర్గగతులు= ఆ పితృతర్పణాలు; తారాగ్రహంబులున్= నక్షత్రాలు, గ్రహాలు; కాలచక్రమునన్= కాలమనే చక్రంలో; వసించిన నిలుకడలును= నిలిచియుండే వాటి ఉనికి; తపములు= తపస్సులు; దానములున్= దానములు; తద్+ఫలంబులున్= వాటివల్ల కలిగే ఫలితాలు; తనరు= ఒప్పుచున్న; ప్రబల ధర్మములు= గొప్పవైన ధర్మాలు; ప్రజలు+ఒనరించు= మానవులు నిర్వర్తించు; కర్మములును= కర్మకాండలను గూర్చి (తెలియజేయుము).

**తా :** మహర్షీ! నాస్తికవాదమంటే ఏమిటో, అశాస్త్రీయ వివాహంవల్ల కలిగే సంతానం ఏ విభాగంలోకి వస్తుందో, జీవుల గుణకర్మాలు ఏమిటో, పలుకుల గతులేమిటో, ధర్మమోక్షాలకు పరస్పర వైరుధ్యం లేని సాధనాలేమిటో, రాజనీతి, దండనీతి వాటి విధానమేమిటో, వేర్పాటువిధానమేమిటో, పితృయజ్ఞాలు, తర్పణాల విధానమేమిటో, తారాగ్రహాలు కాలచక్రంలో ఎలా నిలుకడను పొందగలుగుతున్నాయో, తపోదానఫలాలు ఎటువంటివో, విశేషధర్మాలేమిటో, ప్రజలు చేసే కర్మలు వాటి ఫలితాలు ఏమిటో అవన్నీ నాకు తెలియజెప్పు.

**చ. వదలక భూజనావళికి వచ్చు విపద్దశధర్మముల్, సరో**
**జదళనిభాక్షుఁడేగతిని సంతస మందెడు? నెట్టివారి మేల్**
**వదలక కానవచ్చు, గురులం బ్రియశిష్యులు గొల్వ వారు స**
**మ్మదమునఁగోరు నర్థములు మానుగ నెట్లెఱిఁగింతు రిమ్ములన్. 256**

**ప్రతి :** వదలక= విడువకుండా; భూజన+ఆవళికిన్= భూలోకనివాసులైన మానవులకు; వచ్చు= ఏర్పడు (సంబంధించిన); విపద్+దశ, ధర్మముల్= ఆపద్ధర్మములు ఏమిటో; సరోజదళనిభ+అక్షుఁడు= పద్మపత్రములవంటి కన్నులు కల శ్రీహరి; ఏ గతినిన్= ఏ విధముగా; సంతసము+అందెడున్= సంతోషిస్తాడో; ఎట్టివారి= ఎటువంటివారి; మేల్= చేసిన ఉపకారం; వదలక= ఎల్లపుడూ; కానవచ్చున్= లోకంలో కనిపిస్తూ ఉంటుందో; ప్రియశిష్యులు= అభిమానశిష్యులు; గురులన్+కొల్వన్= తమ తమ గురువులను సేవించగా; వారు= ఆ గురువులు; సమ్మదమునన్= మిక్కిలి సంతోషంతో; కోరు+అర్థములు= ఆ శిష్యులు అభిలషించే ప్రయోజనములను; మానుగన్= చక్కగా; ఇమ్ములన్= చక్కగా; ఎట్లు= ఏ విధంగా; ఎఱిఁగింతురు= తెలియజేస్తారు? (అవి నాకు తెలియజేయుము).

**తా :** మహర్షీ! మానవులకు వచ్చే ఆపద్ధర్మాలు ఏమిటి, ఎలా ఉంటే శ్రీహరి సంతోషిస్తాడు, ఎవరి మేలు ఎల్లపుడూ కనపడుతుంది, గురుసేవ చేయడంవల్ల వారు శిష్యులకు ప్రయోజనం కలిగించే అంశాలను ఎలా బోధిస్తారు అవన్నీ నాకు చెప్పు.

**క. విలయాదిభేదముల న, య్యలఘునిఁబరమేశు నెవ్వ రంచితభక్తిం**
**గొలుతు రదెవ్వరిలో ను, త్కలికన్ సుఖియించు జీవతత్త్వము? మఱియున్. 257**

**ప్రతి :** విలయ+ఆది+భేదములన్= ప్రళయం మొదలైన భేదాలు ఏమిటో; ఆ+అలఘునిన్= ఆ శ్రేష్ఠుడైన; పరమేశున్= సర్వేశ్వరుడైన శ్రీహరిని; ఎవ్వరు= ఎటువంటివారు; అంచితభక్తిన్= గొప్పదైన భక్తితో; కొలుతురు= సేవిస్తుంటారో; జీవతత్త్వము+అది= జీవలక్షణం; ఎవ్వరిలోన్= ఎటువంటి వారియందు; ఉత్కలికన్= మిక్కిలి వికాసంతో; సుఖియించున్= ప్రకాశిస్తుందో; మఱియున్= ఇంకా...

**తా :** మునీశ్వరా! ప్రళయం మొదలైన భేదాలు ఏమిటో, అలాగే ఎటువంటివారు పురుషోత్తముడైన శ్రీహరిని అచంచల భక్తితో అర్చిస్తారో, ఎవరిలో జీవతత్త్వం నిత్యవికాసంతో ఉంటుందో అదంతా విపులంగా తెలియజెయ్యి.

**క. గోవిందుని రూపంబును, జీవబ్రహ్మలకు నైక్యసిద్ధియు నెటులొ?**
**భావన నుపనిషదర్థం, బై వెలసెడి జ్ఞాన మెట్టి దార్యస్తుత్యా! 258**

**ప్రతి :** ఆర్యస్తుత్యా!= గొప్పవారిచే స్తుతింపబడే మైత్రేయా!; గోవిందుని= శ్రీహరియొక్క; రూపంబును= స్వరూపాన్ని తెలియజేయుము; జీవబ్రహ్మలకున్= జీవాత్మకు, పరమాత్మకు; ఐక్యసిద్ధియున్= ఏకత్వము కలుగుట; ఎటులౌన్= ఏ విధంగా కలుగుతుందో తెలియజెయ్యి; ఉపనిషద్+అర్థంబు+ఐ= ఉపనిషత్తుల సారాంశంగా; వెలసెడి= ప్రకాశించు; జ్ఞానము+ఎట్టిది?= విజ్ఞానము ఎటువంటిదో తెలియజేయుము.

**తా :** ఆర్యస్తవనీయుడవైన మైత్రేయా! గోవిందుని రూపం ఎటువంటిదో, జీవాత్మ పరమాత్మలకు ఐక్యభావం ఎలా కలుగుతుందో, ఉపనిషత్తుల సారాంశరూపమైన పారమార్థికజ్ఞానం ఎటువంటిదో నాకు తెలియజెయ్యి.

**తే. ఉచితమగునట్టి శిష్యప్రయోజనములు, సజ్జనులచేత విజ్ఞానసాధనములు**
**నేమి పలుకంగఁబడు, వాని నెల్ల మఱియుఁ, బొలుచు వైరాగ్యమునఁదగు పురుషభక్తి. 259**

**ప్రతి :** ఉచితమగునట్టి= యుక్తమైన; శిష్యప్రయోజనములు= శిష్యులకు కలిగే ప్రయోజనాలు; సత్+జనులచేతన్= సజ్జనులవలన లభించు; విజ్ఞానసాధనములు= విజ్ఞానానికి ఉపకరణాలు; ఏమి+పలుకంగన్+పడున్= ఏవిగా చెప్పబడుతున్నాయో; వానిన్+ఎల్లన్= వాటినన్నింటినీ; మఱియున్= అంతే కాకుండా; వైరాగ్యమునన్= వైరాగ్య లక్షణంవలన; పొలుచు= ఒప్పునట్టి; తగు= తగినదైన; పురుషభక్తి= మానవుల భక్తి ఎటువంటిదో (తెలియజేయుము).

**తా :** మైత్రేయా! గురువులను సేవించే ఉత్తమ శిష్యులకు కలిగే ప్రయోజనాలు ఏమిటో, సజ్జనులవలన లభించే విజ్ఞాన సాధనాలు ఏమిటో, వైరాగ్యంవల్ల వచ్చే భక్తి ఎటువంటిదో తెలియజేయి.

**తే. ఇన్నియుఁదెలియ నానతి యిచ్చి నన్ను, నర్థి రక్షింపు; యజ్ఞదానాదిపుణ్య**
**ఫలము, వేదంబు సదివిన ఫలము, నార్త, జనులఁగాచిన ఫలముతో సమము గావు. 260**

**ప్రతి :** ఇన్నియున్= నా అడిగినవి అన్నియును; తెలియన్= నాకు బోధపడేటట్లుగా; ఆనతి+ఇచ్చి= తెలియజేసి; అర్థిన్+నన్నున్= వేడుకొంటున్న నన్ను; రక్షింపుము= రక్షించుము; యజ్ఞ= యజ్ఞములు చేయుటవలన; దాన+ఆది= దానములు చేయుట మొదలగు వాటివలన; పుణ్యఫలము= లభించే పుణ్యఫలం; వేదంబు= వేదమును; చదివిన= అధ్యయనము చేయుటవలన; ఫలము= లభించిన పుణ్యఫలం; ఆర్తజనులన్= దీనులను; కాచిన= రక్షించిన; ఫలముతోన్= పుణ్యఫలంతో; సమము కావు= సమానము కానేకావు (అంతకంటె ఎక్కువనుట).

**తా :** మహర్షీ! ఇంతవరకు నేను అడిగినవాటినన్నిటినీ వివరంగా తెలియజేసి జ్ఞానార్తితో ఉన్న నన్ను జ్ఞానభిక్షద్వారా రక్షించు. యజ్ఞాలు, దానాలు చేయడం వలన వచ్చే పుణ్యఫలంగాని, వేదం చదవడంవలన వచ్చే పుణ్యఫలంగాని దీనులను రక్షించడంవలన వచ్చే పుణ్యఫలంతో సమానం కానేకావు.

**క. అని విదురుఁడు మైత్రేయుని, వినయంబునఁదెలియ నడుగు విధమెల్లను వ్యా**
**సుని సుతుఁ డభిమన్యుని నం, దనున కెఱింగించి మఱియుఁదగ నిట్లనియెన్. 261**

ప్రతి : అని= ఆ విధముగా; విదురుఁడు= విదురుడు; మైత్రేయునిన్= మైత్రేయమహర్షిని; వినయంబునన్= వినయసహితముగా; తెలియన్= తెలిసికొనుటకై; అడుగు= ప్రశ్నించు; విధము+ఎల్లను= విధానమంతా; వ్యాసుని సుతుఁడు= వ్యాసమహర్షి కుమారుడైన శుకుడు; అభిమన్యుని= అభిమన్యునియొక్క; నందనునకున్= కుమారుడైన పరీక్షిత్తునకు; ఎఱింగించి= తెలియజేసి; మఱియున్= ఇంకా; తగన్= తగినట్లుగా; ఇట్లు+అనియెన్= ఈ విధముగా చెప్పసాగెను.

**తా :** ఆ విధంగా మైత్రేయమహర్షిని విదురుడు వినయంగా తెలిసికోవాలనే కోరికతో అడిగిన విధానమంతా వ్యాసుని కుమారుడైన శుకమహర్షి అభిమన్యుని కుమారుడైన పరీక్షిత్తునకు తెలియజేసి ఇంకా ఇలా చెపుతున్నాడు.

**చ. ఇలఁగల మానవావళికి నెల్ల నుతింప భజింప యోగ్యమై**
**వెలసిన పూరువంశము పవిత్రము సేయఁగఁబుట్టి సద్గుణా**
**కలితయశఃప్రసూనలతికాతతికిం బ్రతివాసరంబుఁ బెం**
**పలరఁగఁ బ్రోదివెట్టుదు గదయ్య! ముకుందకథామృతంబునన్. 262**

ప్రతి : ఇలన్+కల= ఈ భూమిపై ఉన్న; మానవ+ఆవళికిన్+ఎల్లన్= నరకోటికంతటికి; నుతింపన్= స్తుతించుటకును; భజింపన్= సేవించుటకును; యోగ్యము+ఐ= తగినదై; వెలసిన= ఆవిర్భవించిన; పూరువంశము= పరీక్షిన్మహారాజునకు చాల పూర్వుడైన పూరువుయొక్క వంశమును; పవిత్రము+చేయఁగన్= శుద్ధమైనదానినిగా చేయుటకు; పుట్టి= జన్మించి; సద్గుణ= మంచి లక్షణములతో; ఆకలిత= కూడిన; యశస్+ప్రసూన= కీర్తి అనెడి పుష్పాలతో కూడిన; లతికా+తతికిన్= లతల సముదాయానికి; ప్రతివాసరంబున్= నిత్యమును; పెంపు+అలరఁగన్= అతిశయము ఏర్పడునట్లుగా; ముకుంద+కథా+అమృతంబునన్= విష్ణుకథలనెడి అమృతముతో; ప్రోది+పెట్టుదు+కదయ్య= పోషణ చేయుచుందువు కదా!

**తా :** పరీక్షిన్మహారాజా! పూరువంశమంటేనే లోకులందరూ కొనియాడే వంశం. అటువంటిదానిని మరింత పవిత్రం చేయడంకోసమే నీవు జన్మించావు. నిత్యం సద్గుణాలతోకూడి కీర్తిపుష్పాలతోకూడిన లతలకు విష్ణుకథామృతాన్ని పోసి మరింత వృద్ధిని కలిగిస్తూ పోషిస్తున్నావు అని శుకమహర్షి ప్రస్తుతించాడు.

**తే. అల్పతరమైన సుఖముల నందుచున్న, జనుల దుఃఖంబు మాన్పంగఁజాలునట్టి**
**పుండరీకాక్షగుణకథాప్రోతమైన, వితతనిగమార్థమగు భాగవతము నీకు. 263**

ప్రతి : అల్పతరమైన= మిక్కిలి స్వల్పమైన; సుఖములన్= సౌఖ్యములను; అందుచున్న= పొందుచున్న; జనుల= ప్రజలయొక్క; దుఃఖంబున్= బాధను; మాన్పంగన్+చాలునట్టి= పోగొట్టగలిగిన; పుండరీక+అక్ష= శ్రీమన్నారాయణుని; గుణకథా= గుణములను వివరించు కథల; ప్రోతమైన= అల్లబడిన వస్త్రమువంటిదైన; వితత= విస్తారమైన; నిగమ= వేదములయొక్క; అర్థము+అగు= సారాంశమైన; భాగవతమున్= శ్రీమహాభాగవతమును; నీకున్= నీకు (తెలియజేసెదను).

**తా :** అల్పసుఖాలకోసం వెంపర్లాడే జనాల దుఃఖాన్ని పోగొట్టగలిగినదీ, శ్రీమన్నారాయణుని గుణకథలనే దారాలతో అల్లబడిన వస్త్రంవంటిదీ, వేదసారమైనదీ అయిన భాగవతాన్ని నీకు తెలియజేస్తాను.

**వ. ఎఱింగింతు విను మని యిట్లనియె. 264**

**ప్రతి :** ఎఱింగింతున్= తెలియజేస్తాను; వినుము= ఆలకించుము; అని ఇట్లు+అనియెన్= అని ఈ విధంగా పలికాడు.

**తా :** ఆ భాగవతాన్ని నీకు తెలియజేస్తానని శుకమహర్షి పరీక్షిన్మహారాజుతో ఇంకా ఇలా అంటున్నాడు.

**సీ. అమ్మహాభాగవతామ్నాయ మొకనాఁడు గైకొని పాతాళలోకమందు**
**నప్రతిహతబుద్ధియై వాసుదేవాఖ్యఁబొలుచు సంకర్షణమూర్తి దివ్య**
**పురుషుండు దనుఁ దాన బుద్ధిలోఁ జూచుచు సలలితధ్యానముకుళితనేత్రుఁ**
**డై సనందాభ్యుదయార్థంబు గను విచ్చి చూచినవారు సంస్తుతు లొనర్ప**

**తే. నమరగంగావగాహనులై యహీంద్ర, కన్య లార్ద్రజటాబంధకలిత లగుచు**
**భర్తృవాంఛానుబుద్ధి నప్పరమపురుషుఁ, గదియ నేతెంచి తత్పాదకమలయుగము. 265**

**ప్రతి :** వాసుదేవ+ఆఖ్యన్+పొలుచు= వసుదేవసుతుడుగా ఒప్పుచున్న; దివ్యపురుషుండు= దివ్యపురుషుడైన; సంకర్షణమూర్తి= శ్రీమన్నారాయణుడు; అప్రతిహతబుద్ధియై= తిరుగులేని భావన కలవాడై; ఒకనాఁడు= ఒకానొకనాడు; ఆ+మహాభాగవత+ ఆమ్నాయము= వేదమువంటి ఆ మహాభాగవతాన్ని; కైకొని= స్వీకరించి; పాతాళలోకమందున్= పాతాళలోకమునందు; తనున్+తాన= తనను తానే; బుద్ధిలోన్+చూచుచున్= అంతరంగమునందు దర్శిస్తూ; సలలిత= లాలిత్యముతో కూడిన; ధ్యాన= ధ్యానముతో; ముకుళిత నేత్రుఁడు+ఐ= అరమోడ్పు కన్నులు గలవాడైయుండి; సనంద+అభ్యుదయ+అర్థంబు= సనందాది మునులకు మేలు సేయుటకై; కను విచ్చి= కన్నులు తెరిచి; చూచినన్= చూడగా; వారు= ఆ మునీశ్వరులందరూ; సంస్తుతులు+ఒనర్పన్= ప్రస్తుతి చేయగా; అహి+ఇంద్రకన్యలు= నాగరాజ పుత్రికలు; అమర గంగా+అవగాహనులై= ఆకాశగంగలో స్నానమాడినవారై; ఆర్ద్రజటాబంధకలితలు+అగుచున్= తడిసిన జడముడులు కలవారై; ఆ+పరమపురుషున్= ఆ శ్రీమన్నారాయణుని; భర్తృవాంఛా+అనుబుద్ధిన్= భర్తగా చేసుకోవాలనే కోరికతో; కదియన్+ఏతెంచి= సమీపించి; తద్+పాదకమలయుగమున్= ఆ దేవదేవుని పాదపద్మాలజంటను...

**తా :** ఈనాడు వాసుదేవుడుగా కనబడుతున్న ఆ పరమాత్మ ఒకనాడు వేదరూపమైన మహాభాగవతాన్ని తీసికొని పాతాళానికి వెళ్ళిపోయి, అక్కడ తదేకదీక్షతో ధ్యానమగ్నుడై ఉన్నాడు. ఆ సమయంలో అక్కడికి సనందాది మహర్షులు వచ్చారు. వారికి మేలు చేయడానికి కళ్ళు తెరిచాడు పరమాత్మ. వెంటనే వారందరూ స్వామిని ప్రస్తుతించసాగారు. అంతలో నాగకన్యలు ఆకాశగంగలో స్నానంచేసి, తడిసిన జటాబంధాలతో స్వామిని భర్తగా చేసుకోవాలనే కోరికతో అక్కడికి వచ్చి ఆయన పాదపద్మాలకు నమస్కరించారు.

**క. సేవించి భక్తితో నా, నావిధ పూజోపహారనతినుతులను నా**
**దేవుని హృదయము వడసిరి, యావేళ సనందనాదు లమ్మహితాత్మున్. 266**

**ప్రతి :** భక్తితోన్= భక్తి కలిగినవారై; సేవించి= పరిచర్యలు చేసి; నానా= అనేకవిధములైన; పూజా= అర్చనలతోను; ఉపహార= కానుకలతోను; నతి= వినయప్రకటనలతోను; నుతులనున్= స్తుతులతోను; ఆ దేవుని= ఆ పరమాత్ముని; హృదయమున్= మనస్సును; పడసిరి= పొందిరి; ఆ వేళన్= ఆ సమయంలో; సనందన+ఆదులు= సనందుడు మొదలగువారు; ఆ+మహితాత్మున్= ఆ పరమపురుషుని...

**తా :** ఆ నాగకన్యలు భక్తితో శ్రీహరిని సేవించారు. అనేకవిధాలైన పూజలతో, కానుకలతో, వినయప్రకటనలతో, స్తుతులతో ఆ స్వామి మనస్సులో స్థానాన్ని పొందారు. అదే సమయంలో సనందనుడు మొదలగువారు ఆ మహనీయుని స్తుతించారు.

**మ. ఘనసాహస్రకిరీటరత్నవిలసత్కాంతప్రసిద్ధప్రభా**
**జనితోదగ్రరుచి ప్రకాశితఫణాసాహస్రుఁడౌ దేవతా**
**వనదీక్షాచణు రూపకృత్యము లొగిన్ వాంఛం బ్రశంసించి వా**
**రనురాగస్థలితోక్తు లొప్ప నడుగన్ హర్షించి యా దేవుఁడున్. 267**

**ప్రతి :** ఘన= గొప్పవైన; సాహస్ర= వేలసంఖ్యగల; కిరీట= కిరీటములయందలి; రత్న= వజ్రములతో; విలసత్= ప్రకాశించు; కాంత= మనోహరమైన; ప్రసిద్ధప్రభా= విఖ్యాతమైన తేజస్సునుండి; జనిత= పుట్టిన; ఉదగ్రరుచి= గొప్పవైన కాంతులతో; ప్రకాశిత= ప్రకాశించుచున్న; ఫణాసాహస్రుఁడౌ= వేయిపడగలు గల; దేవతా= దేవతలను; అవన= రక్షించుటయందు; చణు= సమర్థుడైన దేవదేవునియొక్క; రూపకృత్యములు= అవతారాలు చేసిన గొప్ప పనులు; ఒగిన్= క్రమముగా; వాంఛన్= కోరికతో; ప్రశంసించి= స్తుతించి; వారు= ఆ సనందనాది ఋషులు; అనురాగ= అతిశయించిన ప్రేమవలన; స్థలిత= తడబడుతున్న; ఉక్తులు= పదబంధములు; ఒప్పన్= వెలువడుచుండగా; అడుగన్= ప్రార్థించగా; ఆ+దేవుఁడున్= ఆ పరమపురుషుడు; హర్షించి= ఆనందించి...

**తా :** ఆ పరమాత్ముడు సహస్రశీర్షుడు. వేయితలలకు వేయి కిరీటాలున్నాయి. వాటిలో నవరత్నాలు పొదగబడి ఉన్నాయి. వాటినుండి వెలువడుతున్న కాంతులతో స్వామికి గొడుగులాగ అమరి ఉన్న ఆదిశేషుని పడగలు మరింత ప్రకాశిస్తున్నాయి. ఆ మహనీయుని అవతారాలను, ఆ యా అవతారాలలో స్వామి చేసిన ఘనకార్యాలను సనందనాదులు ఎంతో భక్తిగా ప్రస్తుతించారు. అతిశయించిన అనురాగంతో వారు అలా ప్రస్తుతిస్తున్నపుడు వారి మాటలు తడబడుతున్నాయి. వారి అచంచల భక్తిప్రపత్తులకు స్వామి ఎంతగానో సంతోషించాడు.

**తే. భూరి నిగమార్థసార విచార మగుచుఁ, దనరు నీ భాగవతము సాదరతఁ బలికె**
**నలినభవసూతి యైన సనత్కుమార, కునకు నెఱిఁగించె సాంఖ్యాయనునకు నతఁడు. 268**

**ప్రతి :** నలినభవసూతియైన= పద్మసంభవుడైన బ్రహ్మదేవుని కుమారుడైన; సనత్కుమారకునకున్= సనత్కుమారుడను మహర్షికి; భూరి= గొప్పదైన; నిగమ+అర్థ= వేదార్థముయొక్క; సార= సారాంశమును; విచారము= విచారణ చేయునది; అగుచున్= అయి ఒప్పునట్టి; ఈ భాగవతము= ఈ భగవల్లీలావిశేషమును; స+ఆదరతన్= ఆదరముతో కూడినట్లుగా; పలికెన్= దేవదేవుడు ఉపదేశించెను; అతఁడు= ఆ సనత్కుమారుడు; సాంఖ్యాయనునకున్= సాంఖ్యాయన మహర్షికి; ఎఱిఁగించెన్= తిరిగి ఉపదేశించెను.

**తా :** పరమాత్మ బ్రహ్మదేవుని కుమారుడైన సనత్కుమారునికి వేదార్థసారమైన భాగవతాన్ని ఉపదేశించాడు. దానిని అతడు సాంఖ్యాయనమహర్షికి ఉపదేశించాడు.

**విశే :** భాగవతమనునది కేవలమొక గ్రంథం కాదు. అది భగవత్తత్త్వం. అది ఉపదేశరూపంలో ఒకరినుండి ఒకరికి పరంపరగా రావలసినది. కనుక ఇది చదవడంకంటె పండితులద్వారా వినుటవలననే ఆధ్యాత్మిక ప్రయోజనం సాధింపబడుతుంది.

**క. పరఁగ నతండంతఁ బరా, శరునకు నుపదేశ మిచ్చె సమ్మతి; నతఁడున్**
**సురగురున కొసఁగె; నాతఁడు, గర మరుదుగ నాకుఁజెప్పెఁగైకొని యేనున్. 269**

**ప్రతి :** పరఁగన్= ఒప్పునట్లుగా; అతండు= ఆ సాంఖ్యాయన మహర్షి; అంతన్= సనత్కుమారుడు భాగవతము ఉపదేశించిన పిమ్మట; పరాశరునకున్= దానిని పరాశరమహర్షికి; ఉపదేశము+ఇచ్చెన్= ఉపదేశించెను; అతఁడున్= ఆ పరాశరమహర్షి; సమ్మతిన్= సంతోషముగా; సురగురునకున్= దేవతల గురువైన బృహస్పతికి; ఒసఁగెన్= అందించెను; ఆతఁడు= ఆ బృహస్పతి; కరము+అరుదుగన్= మిక్కిలి ఆశ్చర్యకరముగా; నాకున్= నాకు (మైత్రేయునకు); చెప్పెన్= ఉపదేశించెను; కైకొని= దానిని స్వీకరించి; ఏనున్= నేనును...

**తా :** సనత్కుమారుడు ఉపదేశించిన భాగవతాన్ని సాంఖ్యాయనుడు పరాశరునకు ఉపదేశించాడు. అతడు దానిని దేవతల గురువైన బృహస్పతికి ఉపదేశించాడు. దేవగురువు నాకు (మైత్రేయునికి) ఉపదేశించాడు. నేను దానిని స్వీకరించి నీకు చెపుతున్నాను అని విదురునితో పలికాడు.

**క. నీ కిప్పుడు వివరించెద, నాకర్ణింపుము సరోరుహాక్షుండగు సు**
**శ్లోకుని చరితామృత పరి, షేకుఁడవై ముదము గదురఁజెలఁగుము విదురా! 270**

**ప్రతి :** విదురా!= విదురుడా!; ఇప్పుడు= ఈ సమయంలో; నీకున్= నీకు; వివరించెదన్= భాగవతాన్ని వివరిస్తాను; ఆకర్ణింపుము= ఆలకించుము; సరోరుహ+అక్షుండు+అగు= పద్మాక్షుడైన; సుశ్లోకుని= మిక్కిలి కీర్తనీయుడైన విష్ణువుయొక్క; చరిత= చారిత్రమనెడి; అమృత= అమృతవర్షంలో; పరిషేకుఁడవు+ఐ= తడిసినవాడవై; ముదము+కదురన్= ఆనందము కలుగగా; చెలఁగుము= జీవించుము.

**తా :** విదురా! అలా బృహస్పతిద్వారా నాకు లభించిన భాగవతాన్ని నీకు ఉపదేశిస్తాను విను. వారిజాక్షుడూ, కీర్తనీయుడూ అయిన శ్రీహరి చరితామృతవర్షంలో తడిసిపోయి ఆనందంగా జీవించు.

**వ. ఇట్లు భగవత్ప్రోక్తంబును, ఋషి సంప్రదాయానుగతంబును, పురుషోత్తమస్తోత్రంబును, పరమ పవిత్రంబును, భవలతాలవిత్రంబును నయిన భాగవత కథా ప్రపంచంబు శ్రద్ధాళుండవు భక్తుండవు నగు నీకు నుపన్యసించెద, వినుము. 271**

**ప్రతి :** ఇట్లు= ఈ విధముగా; భగవత్ ప్రోక్తంబును= భగవానునిచే చెప్పబడినదియు; ఋషి సంప్రదాయ+అనుగతంబును= మునిపరంపరనుండి క్రమముగా వచ్చినదియు; పురుషోత్తమ స్తోత్రంబును= పరమపురుషుని స్తుతించునదియు; పరమపవిత్రంబును= మిక్కిలి పవిత్రమైనదియు; భవలతా లవిత్రంబును= సంసారబంధమనెడి తీగను ఛేదించు కొడవలివంటిదియు; అయిన= అయినటువంటి; భాగవత కథా ప్రపంచంబు= భాగవత కథల సర్వస్వాన్ని; శ్రద్ధాళుండవు= శ్రద్ధతో కూడినవాడవును; భక్తుండవును= దైవభక్తి కలిగినవాడవును; అగు నీకున్= అయిన నీకు; ఉపన్యసించెదన్+వినుము= వివరిస్తాను ఆలకించు.

**తా :** ఈ విధంగా భగవంతునిచే చెప్పబడినది, మునీశ్వరులనుండి సంప్రదాయసిద్ధంగా పరంపరగా వచ్చినది, పరమపురుషుని కీర్తించేది, మిక్కిలి పవిత్రమైనది, సంసారబంధమనే లతను ఛేదించే కొడవలివంటిది అయిన భాగవత కథాసర్వస్వాన్ని శ్రద్ధాభక్తులు గల నీకు వివరిస్తాను విను అని మైత్రేయమహర్షి విదురునితో పలుకుచున్నాడు.

**సీ. అనఘ! యేకోదకమై యున్న వేళ నంతర్నిరుద్ధానల దారువితతి**
**భాతిఁ జిచ్ఛక్తి సమేతుఁడై కపట నిద్రాలోలుఁ డగుచు నిమీలితాక్షుఁ**
**డైన నారాయణుండంబుమధ్యమున భాసురసుధాఫేనపాండురశరీర**
**రుచులు సహస్రశిరోరత్నరుచులతోఁ జెలిమి సేయఁగ నొప్పు శేష భోగ**

**తే. తల్పమునఁబవ్వళించి యనల్పతత్త్వ, దీప్తిఁ జెన్నొందఁగా నద్వితీయుఁడగుచు**
**నభిరతుండయ్యుఁగోర్కులయందుఁ బాసి, ప్రవిమలాకృతి నానందభరితుఁ డగుచు. 272**

**ప్రతి :** అనఘ!= పుణ్యాత్ముడా!; ఏక+ఉదకమై= ఈ ప్రపంచమంతా జలమయంగా; ఉన్నవేళన్= ఉన్న సమయంలో; అంతస్= లోపల; నిరుద్ధ= దాగియున్న; అనల= అగ్ని గల; దారువితతి భాతిన్= కొయ్యల సముదాయంలా; చిత్+ శక్తిసమేతుఁడు+ఐ= లోపల జ్ఞానశక్తి కలిగియుండి; కపట నిద్రాలోలుఁడు+అగుచున్= నిద్రపోతున్నవానివలె నటిస్తూ; నిమీలిత+అక్షుఁడైన= కన్నులు మూసికొనియున్న; నారాయణుండు= శ్రీమన్నారాయణమూర్తి; అంబుమధ్యమునన్= జలమధ్యమునందు; భాసుర= ప్రకాశించు; సుధా= అమృతముయొక్క; ఫేన= నురుగుచేత; పాండుర= తెల్లనైన; శరీర= దేహముయొక్క; రుచులు= కాంతులు; సహస్ర శిరస్= ఆదిశేషుని వేయిపడగలపై గల; రత్న రుచులతోన్= రత్నముల కాంతులతో; చెలిమి= స్నేహమును; చేయఁగన్= చేయుచున్నట్లుగా; ఒప్పు= కనిపిస్తున్న; శేషభోగ తల్పమునన్= తల్పముగా ఏర్పడిన వేయిపడగల ఆదిశేషునిపై; పవ్వళించి= పరుండి; అనల్ప తత్త్వదీప్తిన్= అధికజ్ఞాన కాంతితో; చెన్ను+ఒందఁ గాన్= ప్రకాశింపగా; అద్వితీయుఁడు+అగుచున్= రెండవవాడు లేనివాడై; కోర్కులయందున్= కోరికలయందు; అభిరతుండు+ అయ్యున్= ఆసక్తి గలవాడయ్యును; పాసి= వాటిని విడిచిపెట్టి; ప్రవిమల+ఆకృతిన్= స్వచ్ఛమైన ఆకారముతో; ఆనందభరితుఁడు+అగుచున్= ఆనందస్వరూపుడై (ఉండెను).

**తా :** పుణ్యాత్ముడవైన విదురా! సృష్టికి ముందు విశ్వమంతా కేవలం జలమయంగా ఉంది. ఆ కడలి నడుమ వేయిపడగల ఆదిశేషువు పరమాత్మకు శయ్యగా ఏర్పాటై ఉన్నాడు. దానిపై స్వామి పవ్వళించి ఉన్నాడు. సముద్రజలంగా ఉన్న అమృతంనుండి నురుగులు వస్తున్నాయి. అది స్వామి శరీరంపై పడి శ్రీహరి తెల్లని కాంతితో ప్రకాశిస్తున్నాడు. ఆదిశేషుని వేయి తలలపై ఉన్న వేయి రత్నాలుకూడా తెల్లని కాంతులను ప్రసరిస్తున్నాయి. ఆ కాంతులు పరస్పరం స్నేహం చేసుకొంటున్నట్లున్నాయి. స్వామి కోరికలయందు అనురక్తుడై ఉండికూడా ఏమీ ఎరుగనట్లు, అగ్నిని కడుపులో దాచుకొన్న కొయ్యలాగా జ్ఞానకాంతితో ప్రకాశిస్తూ, రాని నిద్రను నటిస్తూ కన్నులు మూసుకొని ప్రశాంతమైన ఆకారంతో ఆనందభరితుడై ఉన్నాడు.

**తే. యోగమాయా విదూరుఁడై యుగసహస్ర, కాలపర్యంత మఖిలలోకములు మ్రింగి**
**పేర్చి మఱి కాలశక్త్యుపబృంహితమున, సమత సృష్టిక్రియాకలాపములఁదగిలి. 273**

**ప్రతి :** యోగమాయా విదూరుఁడు+ఐ= యోగమాయకు దూరమైనవాడై; యుగసహస్ర కాలపర్యంతము= వేయి యుగాల కాలము; అఖిలలోకములు= లోకాలన్నిటిని; మ్రింగి= తనలో ఇముడ్చుకొని; పేర్చి= అతిశయించి; మఱి= అటుపిమ్మట; కాలశక్తి+ఉపబృంహితమునన్= తగిన కాలము శక్తి – వీటి అభివ్యక్తిచే; సమతన్= రాగద్వేషరహితంగా; సృష్టి క్రియాకలాపములన్= విశ్వసృష్టికి సంబంధించిన కార్యక్రమాలలో; తగిలి= నిమగ్నమై...

**తా :** పరాత్పరుడు యోగామాయా ప్రభావానికి దూరంగా వేయి యుగాలు లోకాలన్నిటినీ తన ఉదరకోశంలో ఇమిడ్చి అతిశయించి తగిన కాలం, శక్తి – వీటి పెంపొందించటంలో సృష్టి కార్యక్రమానికి సిద్ధపడ్డాడు.

**క. తన జఠరములోపలఁదాఁ, చిన లోకనికాయముల సృజించుటకును సా**
**ధనమగు సూక్ష్మార్థము మన, సునఁగని కాలానుగతరజోగుణ మంతన్. 274**

**ప్రతి :** తన= తనయొక్క (పరమాత్మయొక్క); జఠరములోపలన్= కడుపులోపల; దాఁచిన= నిక్షిప్తము గావించుకొన్న; లోకనికాయములన్= లోకముల సముదాయములను; సృజించుటకున్= సృష్టించుటకు (బహిర్గతము కావించుటకు); సాధనమగు= ఉపకరణమైన; సూక్ష్మ+అర్థమున్= అణురూపంలో ఉన్న విశ్వాన్ని; మనసునన్= మనస్సుద్వారా; కని= గ్రహించి; అంతన్= అంతట; కాల+అనుగత= సరియైన కాలానికి సంక్రమించే; రజస్+గుణము= సత్త్వరజస్తమో గుణాలలో ఒకటైన రజోగుణాన్ని; అంతన్= పిమ్మట...

**తా :** పరమాత్మ తన గర్భంనందు సూక్ష్మరూపంలో ఉన్న విశ్వాన్ని మనస్సుద్వారా గమనించాడు. దానిని బయటకు తీసుకొనివచ్చి భౌతికమైన జగత్తును సృష్టించాలనుకొన్నాడు. అందుకు తగినట్లుగా సకాలానికి ప్రవర్తించాల్సిన రజోగుణాన్ని పుట్టించాడు.

**సీ. పుట్టించెఁదద్గుణంబునఁబరమేశ్వరు నాభిదేశమునందు నలిననాళ**
**ముదయించె మఱి యప్పయోరుహ ముకుళంబు గర్మబోధితమైన కాలమందుఁ**
**దన తేజమునఁబ్రవృద్ధంబైన జలముచే జలజాప్తుగతిఁ బ్రకాశంబు నొందఁ**
**జేసి లోకాశ్రయస్థితి సర్వగుణ విభాసితగతి నొప్పు రాజీవమందు**

**తే. నిజకళా కలితాంశంబు నిలిపె, దానివలన నామ్నాయమయుఁడును వరగుణుండు**
**నాత్మయోనియు నైన తోయజభవుండు, సరవిఁజతురాననుండు నా జనన మయ్యె. 275**

**ప్రతి :** పుట్టించెన్= పరమాత్మ రజోగుణాన్ని పుట్టించాడు; తద్+గుణంబునన్= ఆ రజోగుణంవల్ల; పరమ+ఈశ్వరు= పరమాత్మయొక్క; నాభిదేశమునందున్= బొడ్డునుండి; నలిన+నాళము= మొగ్గతోకూడిన తామర తూడు; ఉదయించెన్= పుట్టినది; మఱి= ఆ పిమ్మట; ఆ పయోరుహముకుళంబు= ఆ తామర మొగ్గ; కర్మబోధితమైన= సృష్టికార్యానికి అనుకూలమైన; కాలమందున్= సమయంలో; తన తేజమునన్= తన తేజస్సుతో; ప్రవృద్ధంబు+ఐన= అతిశయాన్ని పొందిన; జలముచేన్= నీటితో; జలజ+ఆప్తుగతిన్= కమలాప్తుడైన సూర్యునివలె; ప్రకాశంబును+ఒందన్+చేసి= ప్రకాశించే విధంగాచేసి; లోక+ఆశ్రయ స్థితిన్= లోకాలన్నిటికి ఆశ్రయమైన విధానమును; సర్వగుణవిభాసితగతిన్= సకలగుణాలతో ప్రకాశించే విధంగా; ఒప్పు= ప్రవర్తిల్లు; రాజీవమందున్= నాభికమలమునందు; నిజకళా కలిత+అంశంబున్= తన కళతో కూడిన అంశమును; నిలిపెన్= ఉంచినాడు; దానివలనన్= అలా తన తేజమును నాభికమలంలో నింపుటచే; ఆమ్నాయమయుఁ డును= వేదపూర్ణుడును; వరగుణుండున్= శ్రేష్ఠమైన గుణములు కలవాడును; ఆత్మయోనియున్+ఐన= స్వయంభువుడును అయిన; తోయజభవుండు= పద్మభవుడైన బ్రహ్మ; సరవిన్= క్రమముగా; చతుస్+ఆననుండునాన్= నాలుగు మోములు కలవాడుగా; జననము+అయ్యెన్= ప్రభవించెను.

**తా :** శ్రీమన్నారాయణుడు రజోగుణాన్ని పుట్టించాడు. దానివల్ల తన బొడ్డునుండి ఒక తామర మొగ్గ ఉదయించింది. సృష్టికి అనుకూలమైన కాలంలో స్వామి తన తేజస్సుతో సూర్యుడు కమలాన్ని వికసింపజేసినట్లు ఆ మొగ్గను వికసింపజేశాడు. లోకాలకు ఆశ్రయమైన అన్ని గుణాలతో కూడిన ఆ పద్మంలో తన కళను నిక్షిప్తం చేశాడు. దానివలన వేదమయుడైనవాడు, స్వయంభువుడు అయిన బ్రహ్మ నాలుగు మోములతో ఆ పద్మంనందు ఉదయించాడు.

**తే. అతఁడు తత్పద్మకర్ణికయందు నిలిచి, వికచలోచనుఁడై లోకవితతి దిశలు**
**నంబరంబును నిజచతురాననములఁ, గలయఁబరికించి చూచుచుఁగమలభవుఁడు. 276**

**ప్రతి :** అతఁడు= ఆ బ్రహ్మదేవుడు; తద్+పద్మకర్ణికయందున్= ఆ నాభికమలపు దుద్దునందు; నిలిచి= ఉండి; వికచలోచనుఁడు+ఐ= విప్పారిన కన్నులు కలవాడై; లోకవితతిన్= సర్వలోకాలను; దిశలున్= సకల దిక్కులను; అంబరంబును= ఆకాశాన్ని; నిజ చతుర్+ఆననములన్= తన నాలుగు మోములతో (ఎనిమిది కన్నులతో); కలయన్= అంతట; పరికించి= పరిశీలించి; చూచుచున్= పరికిస్తూ; కమలభవుఁడు= అప్పుడా పద్మభవుడు...

**తా :** బ్రహ్మదేవుడు శ్రీమన్నారాయణుని బొడ్డుతామరదుద్దునందే ఉండి, కన్నులు విప్పార్చి, లోకాలనన్నిటినీ గమనించాడు. అలాగే దిక్కులను, ఆకాశాన్ని తన ఎనిమిది కళ్లతో బాగా పరికించాడు.

**చ. అలఘుయుగాంతకాలపవనాహతసంచలదూర్మిజాల సం**
**కలితజలప్రభూత మగు కంజముఁదద్వనజాత కర్ణికా**
**తలమున నున్న తన్ను విశదక్రియఁగల్గిన లోకతత్త్వమున్**
**నలిఁదెలియంగ నోపక మనంబునఁజాల విచార మొందుచున్. 277**

**ప్రతి :** అలఘు= విస్తారమైన; యుగ+అంతకాల= ప్రళయకాలమునకు సంబంధించిన; పవన= పెనుగాలిచేత; ఆహత= కొట్టబడి; సంచలత్= ఎగసిపడుచున్న; ఊర్మిజాల= తరంగ సముదాయాలతో; సంకలిత= కూడిన; జల= నీటియందు; ప్రభూతము+అగు= పుట్టిన; కంజమున్= పద్మమును; తద్+వనజాత= ఆ పద్మమునందలి; కర్ణికా+తలమునన్= దుద్దు భాగమున; ఉన్న= వసించియున్న; తన్నున్= తనను (బ్రహ్మ తనను తాను); విశదక్రియన్+కల్గిన= స్పష్టతతో కలిగిన; లోక తత్త్వమున్= జగత్స్వరూపమును; నలిన్= క్రమముగా; తెలియంగన్+ఓపక= అర్థం చేసుకోలేక; మనంబునన్= చిత్తమునందు; చాల= మిక్కిలి; విచారము+ఒందుచున్= బాధపడుతున్నవాడై.

**తా :** విస్తారమైన ప్రళయకాలపు పెనుగాలుల తాకిడికి అంతులేని నీటిలోని అలలు ఎగసిపడుతున్నాయి. అటువంటి నీటిలో ఒక పద్మం ఉంది. దాని కర్ణికాస్థానంలో ఉన్న బ్రహ్మ తనను తాను దర్శించాడు. లోకతత్త్వాన్ని గమనించాడు. ఏమి చేయాలో పాలుబోక విచారపడ్డాడు.

**వ. ఇట్లని వితర్కించె. 278**

**ప్రతి :** ఇట్లు+అని= ఈ విధముగా; వితర్కించెన్= బ్రహ్మ ఆలోచించెను.

**తా :** అప్పుడు బ్రహ్మ ఈ విధంగా ఆలోచించాడు.

**ఉ. ఈ జలమందు నీ కమల మే గతి నుద్భవ మయ్యె? నొంటి యే**
**నీ జలజాతపీఠమున నే గతి నుంటి? మదాఖ్య యెద్ది? నా**
**కీ జననంబు నొందుటకు నెయ్యది హేతువు? బుద్ధిఁజూడ నే**
**యోజ నెఱుంగలేనని పయోరుహగర్భుఁడు విస్మితాత్ముఁడై. 279**

**ప్రతి :** ఈ జలమందున్= ఈ నీటిలో; ఈ కమలము= ఈ పద్మము; ఏ గతిన్= ఏ విధముగా; ఉద్భవము+అయ్యెన్= పుట్టెను; ఒంటి= ఒంటరిగా; ఏన్= నేను; ఈ+జలజాతపీఠమునన్= ఈ పద్మాసనముపై; ఏ+గతిన్+ఉంటిన్= ఏవిధంగా ఉన్నాను; మత్+ఆఖ్య+ఎద్ది= నా పేరు ఏమిటి; నాకున్= నాకు; ఈ+జననంబున్= ఈ పుట్టుక; ఒందుటకున్= ఏర్పడుటకు; ఏ+అది+హేతువు= కారణమేమిటి; బుద్ధిన్+చూడన్= ఆలోచించి చూడగా; ఏ+ఓజన్= ఏ క్రమంలోను; ఎఱుంగన్+లేను+అని= తెలియలేకున్నానని; పయస్+రుహ గర్భుఁడు= పద్మభవుడైన బ్రహ్మ; విస్మిత+ఆత్ముఁడై= ఆశ్చర్యముతో కూడుకొన్నవాడై.

**తా :** బ్రహ్మ తనలో తాను తర్కించుకోసాగాడు. ఈ నీరేమిటి! నీటిలోకి ఈ పద్మం ఎలా వచ్చింది. దీనిలోకి ఒంటరిగా నేనెలా వచ్చాను. అసలు నా పేరేమిటి. నేనిలా పుట్టడానికి కారణమేమిటి. ఎన్ని రకాలుగా ఆలోచించినా నాకేదీ అంతుపట్టడం లేదనుకొని ఆశ్చర్యంలో మునిగిపోయాడు.

**క. ఆ వనజనాళమూలం బా, వనములలోన నర్థి నరయుటకొఱకై**
**యా వనజాతప్రభవుం, డా వనరుహనాళవివరమందభిముఖుఁడై. 280**

**ప్రతి :** ఆ వనజాత ప్రభవుండు= పద్మమునందు పుట్టిన ఆ బ్రహ్మ; ఆ వనజనాళమూలంబు= ఆ తామరతూడు మొదలును; ఆ వనములలోనన్= ఆ నీళ్లలోనే; అర్థిన్= ఉత్సుకతతో; అరయుటకొఱకై= వెదుకుటకై; ఆ వనరుహనాళ వివరమందున్= ఆ తామరతూడు రంధ్రముద్వారా; అభిముఖుఁడై= మూలమునకు ఎదురుగా (ప్రయాణించెను).

**తా :** బ్రహ్మదేవుడు తానున్న పద్మానికి గల తూడు ఎంత ఉంది? అసలు దాని మొదలు ఎక్కడో చూడాలనుకొన్నాడు. అనుకోవడమే తరువాయి, ఆ తూడులోని రంధ్రంద్వారా మొదలువైపు ప్రయాణించాడు.

**విశే :** 'వన' శబ్దానికి నీరు అని అర్థం. 'వనజము' అంటే పద్మం. 'వనజాతభవుడు' అంటే బ్రహ్మ.

**మ. అతిగంభీరవిశాలవారినిధితోయాంతర్నిమగ్నాంగుఁడై**
**చతురాస్యుండొగి దివ్యవత్సరసహస్రంబబ్జమూలంబు స**
**న్మతి నీక్షించియుఁ గానలేక భగవన్మాయామహత్త్వంబు వి**
**స్మృతిఁగావింప విభీతుఁడై మరలఁజేరెందత్సరోజాతమున్. 281**

**ప్రతి :** చతుర్+ఆస్యుండు= నలుమోములు కల బ్రహ్మ; ఒగిన్= క్రమముగా; అతిగంభీర= మిక్కిలి లోతైన; విశాల= విస్తారమైన; వారినిధి= సముద్రముయొక్క; తోయ+అంతర్+నిమగ్న+అంగుఁడు+ఐ= నీటి లోలోపల మునిగిన శరీరము కలవాడై; దివ్య వత్సర సహస్రంబు= వేయి దివ్యసంవత్సరాలు; అబ్జమూలంబున్= పద్మంయొక్క మొదటిభాగాన్ని; సత్+మతిన్= మంచిబుద్ధితో; ఈక్షించియున్= వెదకియు; కానలేక= ఆ మూలాన్ని దర్శించలేక; భగవత్+మాయామహత్త్వంబు= పరమాత్మ మాయాశక్తి; విస్మృతిన్+కావింపన్= మూలసందర్శనశక్తి లేకుండా చేయుటచే; విభీతుఁడై= భయపడినవాడై; తద్+సరోజాతమున్= ఆ పద్మంవద్దకు; మరలన్+చేరెన్= తిరిగి చేరుకొనెను.

**తా :** బ్రహ్మ తనకు జన్మనిచ్చిన పద్మపు నాళం మొదలు ఎక్కడుందో చూడాలని నీటి లోలోపలకి ప్రయాణించాడు. అలా వేయి దివ్యసంవత్సరాలు గడచిపోయాయి కాని తామరతూడు మొదలుమాత్రం కానరాలేదు. భగవంతుని మాయ వాని బుద్ధిని కమ్మేసింది. భయపడ్డాడు. తిరిగి తన నివాసస్థానమైన పద్మాన్ని చేరుకొన్నాడు.

**తే. అట్లు గ్రమ్మఱంజేరి యయ్యబ్జపీఠ, మందు నష్టాంగయోగక్రియానురక్తిఁ**
**బవను బంధించి మహితతపస్సమాధి, నుండి శతవర్షములు సనుచుండ నంత. 282**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; క్రమ్మఱన్+చేరి= తిరిగి వెళ్లి; ఆ+అబ్జపీఠమందున్= ఆ పద్మాసనముపై; అష్టాంగ యోగక్రియా+ అనురక్తిన్= అష్టాంగరూపమైన యోగసాధనమునందు ఆసక్తితో; పవనున్+బంధించి= ఊపిరి బిగబట్టి; మహిత తపస్+ సమాధిన్= గొప్ప తపోరూపమైన సమాధియందు; ఉండి= ఉండిపోయి; శతవర్షములు= నూరు సంవత్సరాలు; చనుచుండన్= దాటుచుండగా; అంతన్= అప్పుడు.

**తా :** బ్రహ్మదేవుడు తిరిగి తన జన్మస్థానమైన పద్మపీఠాన్ని చేరుకొన్నాడు. అక్కడ అష్టాంగయోగసమ్మతమైన యోగవిద్యతో ఊపిరి బిగబట్టి తపస్సు చేయనారంభించాడు. అలా వంద సంవత్సరాలు గడచిపోయాయి.

**విశే :** యమం, నియమం, ఆసనం, ప్రాణాయామం, ప్రత్యాహారం, ధారణ, ధ్యానం అనునవి యోగానికి సంబంధించిన ఎనిమిది అంగాలు.

**ఆ. అట్టి యోగజనితమైన విజ్ఞానంబు, గలిగియుండి దానఁ గమలనయనుఁ**
**గానలేక హృదయకమలకర్ణికయందు, నున్నవానిఁదన్నుఁగన్నవాని. 283**

**ప్రతి :** అట్టి= అటువంటి; యోగజనితమైన= అష్టాంగయోగంవలన లభించిన; విజ్ఞానంబు= తత్త్వజ్ఞానము; కలిగియుండి= పొందియుండి; దానన్= ఆ జ్ఞానంతో; కమలనయనున్= పద్మములవంటి కన్నులు కల శ్రీమన్నారాయణుని; కానలేక= దర్శించలేక; హృదయకమలకర్ణికయందున్= తన హృదయమనే పద్మం మధ్యలో; ఉన్నవానిన్= నిలిచినవానిని; తన్నున్+కన్నవానిన్= తనకు జన్మనిచ్చిన వానిని...

**తా :** అష్టాంగయోగంతో తపస్సు చేయడంవలన గొప్ప తత్త్వజ్ఞానం లభించింది బ్రహ్మకు. అయినా నారాయణ దర్శనం కలుగలేదు. అప్పుడు దృష్టిని తన హృదయంలోకి మరల్చాడు. ఆ హృదయకమలంలో తనను కన్న తండ్రి శ్రీమన్నారాయణమూర్తిని దర్శించగలిగాడు.

**మ. కనియెన్ నిశ్చలభక్తి యోగమహిమం గంజాతగర్భుండు శో**
**భనచారిత్రు జగత్పవిత్రు విలసత్పద్మాకళత్రున్ సుధా**
**శనముఖ్యస్తుతిపాత్రు దానవచమూజైత్రున్ దళత్పద్మ నే**
**త్రు నవీనోజ్జ్వలనీలమేఘనిభగాత్రుం బక్షిరాట్పత్త్రునిన్. 284**

**ప్రతి :** కంజాతగర్భుండు= బ్రహ్మదేవుడు; నిశ్చలభక్తియోగమహిమన్= అచంచల భక్తియోగ శక్తితో; శోభనచారిత్రున్= పవిత్రమైన చరిత్ర కలవాడు; జగత్+పవిత్రున్= ప్రపంచాన్ని పవిత్రం చేయగలవాడు; విలసత్+పద్మాకళత్రున్= ప్రకాశించే లక్ష్మీదేవి భార్యగా కలవాడు; సుధా+అశనముఖ్య= అమృతాన్ని భుజించే దేవతాముఖ్యులయొక్క; స్తుతిపాత్రున్= స్తవములకు యోగ్యుడైనవాడు; దానవచమూ జైత్రున్= రాక్షససేనను జయించేవాడు; దళత్+పద్మనేత్రున్= వికసించిన పద్మములవంటి కన్నులు కలవాడు; నవీన= అప్పుడే ఏర్పడిన; ఉత్+జ్వల= కాంతిమంతమైన; నీలమేఘ= నల్లనిమబ్బుతో; నిభ, గాత్రున్= సమానమైన కాంతి గలవాడు; పక్షిరాట్+పత్త్రునిన్= పక్షిరాజైన గరుత్మంతుడు వాహనముగా గలవాడునైన శ్రీహరిని; కనియెన్= దర్శించెను.

**తా :** బ్రహ్మదేవుడు తన హృదయంలోనికి దృష్టిని సారించాడు. అక్కడ పవిత్ర చరిత్రుడు, జగత్తును పవిత్రం చేయువాడు, కాంతిమతియైన లక్ష్మీదేవి భార్యగా గలవాడు. దేవతాసంస్తవాలకు యోగ్యమైనవాడు, రాక్షససేనను జయించేవాడు, వికసించిన పద్మంవలె ఉన్న అందమైన కన్నులు కలవాడు, అప్పుడే ఏర్పడిన అందమైన నల్లని మబ్బువంటి శరీరపు రంగు కలవాడు, గరుత్మంతుడు వాహనముగా కలవాడునైన శ్రీమన్నారాయణమూర్తిని దర్శించాడు.

**వ. మఱియును. 285**

**తా :** అంతేగాకుండా

**చ. అలఘుఫణాతపత్ర నిచయాగ్ర సమంచిత నూత్నరత్న ని**
**ర్మలరుచిచే యుగాంతతిమిరంబు నడంచి యకల్మషోల్లస**
**జ్జలములఁజేసి యందు నవసారసనాళసితైక భోగముం**
**గలిగిన శేషతల్పమును గైకొని యున్న మహాత్ము నొక్కనిన్. 286**

**ప్రతి :** న+లఘు= గొప్పవైన; ఫణా+ఆతపత్ర= గొడుగులవంటి పడగల; నిచయ+అగ్ర= సముదాయము పైని; సమంచిత= కొనియాడదగిన; నూత్న రత్న= క్రొంగొత్త రత్నముల; నిర్మలరుచిచేన్= స్వచ్ఛమైన కాంతితో; యుగ+అంత తిమిరంబున్= ప్రళయకాలపు చీకటిని; అడంచి= పోగొట్టి; అందున్= అక్కడ; అకల్మష= నిర్మలముగా; ఉల్లసత్= ప్రకాశించుచున్న; జలములన్+చేసి= నీరగుటచే; నవసారస= అప్పుడే వికసించిన పద్మముయొక్క; నాళ= తూడువలె; సిత+ఏక= తెల్లని, విశిష్టమైన; భోగమున్+కలిగిన= దేహము కలిగిన; శేషతల్పమును= ఆదిశేషుని పానుపుగా; కైకొనియున్న= స్వీకరించిన; ఒక్కనిన్, మహాత్మున్= ఒక మహానుభావుని (శ్రీహరిని దర్శించెను).

**తా :** బ్రహ్మదేవుడు తన హృదయపద్మంలోకి దృష్టిని సారించి శ్రీమన్నారాయణుని దర్శించాడు. ఆయన కడలి నడుమ ఆదిశేషువును పానుపుగా చేసుకొని పరుండి కనిపించాడు. ఆ నీళ్లు నిర్మలంగా ప్రకాశిస్తున్నాయి. ఆ ఆదిశేషుడు కొత్త తామరతూడులాగ తెల్లని దేహకాంతితో ఉన్నాడు. తన పడగలపైనున్న రత్నాల కాంతులతో ప్రళయకాలపు చీకట్లను పోగొట్టి ఆ ప్రదేశమంతా వెలుగులతో నింపుతున్నాడు.

**సీ. వరపీతకౌశేయపరిధానకాంతి సంధ్యాంబుదరుచినిచయంబు గాఁగఁ**
**గమనీయనవహేమకలితకిరీటంబు రమణఁ గాంచనశిఖరంబు గాఁగ**
**మానితమౌక్తికమాలికారుచి సాను పతితనిర్ఝరపరంపరలు గాఁగఁ**
**జెలువొందు నవతులసీదామకములు లాలితతటౌషధీలతలు గాఁగ**

**తే. వరభుజంబులు నికటస్థవంశములుగఁ, బదము లంగణపాదపప్రచయములుగ**
**లలితగతి నొప్పు మరకతాచలవిడంబి, తాత్మ దేహంబు గలుగు మహాత్ము హరిని. 287**

**ప్రతి :** వరపీత= మేలైన పచ్చని; కౌశేయ పరిధాన= పట్టుపంచెయొక్క; కాంతి= మెరుపు; సంధ్యా= సంధ్యాకాలమునందలి; అంబుద= మేఘముల; రుచి నిచయంబు= కాంతుల సముదాయము; కాఁగన్= కాగా; కమనీయ= అందమైన; నవహేమ= కొత్త బంగారముతో; కలిత= కూడిన; కిరీటంబు= మకుటము; రమణన్= ఒప్పిదముగా; కాంచన శిఖరంబు+కాఁగన్=

బంగారు శిఖరము కాగా; మానిత= గొప్పవైన; మౌక్తిక మాలికారుచి= ముత్యాలహారాల కాంతి; సాను= కొండచరియల నుండి; పతిత= పడుచున్న; నిర్ఝర= సెలయేళ్లయొక్క; పరంపరలు+కాఁగన్= వరుసలు కాగా; చెలువు+ఒందు= ప్రకాశించు; నవతులసీ దామకములు= కొత్త తులసీమాలలు; లాలిత= సున్నితములైన; తటజ= ఒడ్డులందు పుట్టిన; ఔషధీలతలు+కాఁగన్= ఓషధులకు సంబంధించిన తీగలు కాగా; వరభుజంబులు= బలమైన భుజాలు; నికటస్థ వంశములుగన్= సమీపముననున్న వెదురుబొంగులు కాగా; పదములు= పాదాలు; అంగణ= ముంగిలియందలి; పాదప= చెట్లయొక్క; ప్రచయములుగన్= సముదాయములుగను; లలితగతిన్+ఒప్పు= అందంగా కనిపించే; మరకత+అచల= మరకత పర్వతముచే; విడంబిత= అనుకరింపబడుచున్న; ఆత్మదేహంబు+కలుగు= తన శరీరము కలిగిన; మహాత్మున్= మహానుభావుడైన; హరినిన్= శ్రీమన్నారాయణుని (బ్రహ్మ దర్శించాడు).

**తా :** ఆదిశేషుడు పానుపుగా పవ్వళించిన శ్రీహరి కట్టిన పచ్చని పట్టుపంచె సాయంకాలపు మబ్బుల కాంతిలా ఉంది. కిరీటం బంగారు పర్వత శిఖరంలాగా ఉంది. గుండెపై వేలాడే ముత్యాలహారాలు కొండచరియలనుండి జాలువారే సెలయేరుల్లా ఉన్నాయి. తులసిమాలలు ఓషధీలతలవలె ప్రకాశిస్తున్నాయి. ఉన్నతమైన భుజాలు వెదురుబొంగులులాగా ఉన్నాయి. పాదాలు ఏటి ఒడ్డున మొలిచిన చెట్లలాగా ఉన్నాయి. వెరసి ఆతడు మరకత పర్వతంలా ఉన్నాడు. అటువంటి మహానుభావుడైన శ్రీహరిని దర్శించాడు బ్రహ్మ.

**వ. మఱియు నపరిచ్ఛిన్నంబును నిరుపమానంబును నిఖిలలోక సంగ్రహంబును నతివిస్తార వర్తులాయామం బును నై వివిధ విచిత్ర దివ్యమణి విభూషణంబుల నాత్మీయనిర్మల ద్యుతిచేతం బ్రకాశంబు నొందంజేయు దివ్య దేహంబు దనర వివిధంబులగు కామంబు లభిలషించి విశుద్ధంబైన వేదోక్తమార్గంబున భజియించు పురుషశ్రేష్ఠులకుఁ గామధేను వనం దగిన పాదపద్మ యుగంబును, నలిక ఫలక లలితరుచి నిచయంబులకు నోటువడి కృపాపాత్రుండై చంద్రుండు బహురూపంబులఁ బదసరోజంబుల నాశ్రయించె నన నొప్పు పదనఖంబులును, కమలాభూకాంతలకు నుపధానరూపంబు లనందగి నీలకదళికాస్తంభంబుల దంబు విడంబించు నూరు యుగళంబును, కనకమణిమయ మేఖలాకలాపాభిరామంబును, గదంబ కింజల్క శోభిత పీతాంబరాలంకృతంబునునై విలసిల్లు కటిమండలంబును, శృంగారవాహినీ జలావర్తంబు నాఁ బొలుపొందు నాభివివరంబును, జఠరస్థనిఖిల బ్రహ్మాండ ముహుర్ముహు రుద్భవకృశీభూతం బనం దగు మధ్యభాగంబును, మహిత ముక్తాఫలమాలికా విరచితరంగవల్లీ విరాజితంబు, నవతులసీదామ కిసలయతల్పంబుఁ, గుసుమ మాలికాలంకృతంబు, ఘనసార కస్తూరికా చందనవిలిప్తంబుఁ, గౌస్తుభరత్న దీప్తప్రదీప్తంబు, శ్రీవత్సలక్షణలక్షితంబు నై యిందిరారమణికిఁ గేళీమందిరం బనం బొల్చు వక్షస్థలంబును, సుఖకేళీ సమారంభ పరిరంభణాంభోధిరాట్కన్యకా కరాంభోజ కీలిత కనక మణికంకణ నికషంబులనం బొలుపారు రేఖాత్రయ విరాజమానంబైన కంబుకంధరంబును, సుమహితానర్ఘ దివ్యమణి ప్రభావిభాసిత కేయూర కంకణ ముద్రికాలంకృతంబు లయిన బాహువులును, సకలలోకార్తి నివారక దరహాసచంద్రికా ధవళితంబులై కర్ణకుండల మండన మణిమరీచులు నర్తనంబులు సలుపం దనరి నిద్దంబులగు చెక్కుటద్దంబులును, బరిపక్వ బింబఫల ప్రవాళపల్లవారుణాధరంబును, నఖిలభువన పరిపాలనంబునకు నేన చాలుదు నని వివాదించు**

**నయనయుగళంబునకు సీమాస్తంభంబును, చంపక ప్రసూనరుచి విభాసంబును నగు నాసాదండంబును, గమలకుముదంబులకుం బెంపు సంపాదించుచుఁ గరుణామృత తరంగి తాపాంగంబులై కర్ణాంత విశ్రాంతంబులై చెలువొందు నేత్రంబులును, సలలితశ్రీకారంబునకు నక్షరత్వంబు సార్థకంబయ్యె ననందగు కర్ణంబులును, నిక్షుచాప చాప ద్వయంబునాఁ జూపట్టు భ్రూయుగళంబును, నపరపక్షాష్టమీ శశాంకశంకాస్పద ఫాలఫలకంబును, నీలగిరీంద్ర శృంగసంగత బాలమార్తాండ మండల విడంబిత పద్మరాగ మణిఖచిత కాంచన కిరీటంబునం బొలుపారి సూర్యేందు పవనానల ప్రకాశంబులకు నవకాశంబు సూపక త్రిలోక వ్యాపక సమర్థంబులగు తేజోవిశేషంబులఁ జెలువొంది సంగర రంగంబుల దానవానీకంబుల హరింపంజాలు సుదర్శనాదిదివ్యసాధనంబులచే దురాసదంబగు దివ్యరూపంబునుంగలిగి మఱియును. 288**

**ప్రతి :** మఱియున్= అంతేగాక; న+పరిచ్ఛిన్నంబును= ఎట్టి విభాగములు లేనిదియు; నిర్+ఉపమానంబును= సాటి లేనిదియు; నిఖిలలోక సంగ్రహంబును= లోకాలన్నిటిని తనలో ఇముడ్చుకొన్నదియు; అతివిస్తార వర్తుల ఆయామంబునున్+ఐ= మిక్కిలి విస్తారమైనదియు, గుండ్రనిదియు, వైశాల్యం కలదియు; వివిధ విచిత్ర దివ్యమణి విభూషణంబులన్= అనేకవిధములైన వింతైన గొప్ప రత్నాలంకారాలతో; ఆత్మీయ నిర్మల ద్యుతిచేతన్= తన స్వచ్ఛమైన కాంతితో; ప్రకాశంబున్+ఒందన్+చేయు= ప్రకాశింపజేయు; దివ్యదేహంబు+తనరన్= గొప్ప దేహం ఒప్పగా; వివిధంబులు+అగు= అనేకవిధములైన; కామంబులు= కోరికలు; అభిలషించి= కోరి; విశుద్ధంబు+ఐన= స్వచ్ఛమైన; వేద+ఉక్త మార్గంబునన్= వేదముచే నిర్దేశింపబడిన బాటలో; భజియించు= సేవించు; పురుషశ్రేష్ఠులకున్= ఉత్తములైన పురుషులకు; కామధేనువు+అనన్+ తగిన= కోరికలను తీర్చునదైన దేవగోవుగా చెప్పదగిన; పాదపద్మయుగంబును= చరణాల జంటయును; అలికఫలక లలితరుచి నిచయంబులకున్= ఫలకమువంటి ఫాలభాగపు సున్నితమైన కాంతిసముదాయాలకు; ఓటు+పడి= ఓడిపోయి; కృపాపాత్రుండై= శ్రీహరి దయకు పాత్రుడై; చంద్రుండు= జాబిల్లి; బహురూపంబులన్= ఎన్నో రూపాలతో; పదసరోజంబులన్= హరి పాదాలజంటను; ఆశ్రయించెన్+అనన్+ఒప్పు= ఆశ్రయించెనా అనునట్లు కనుపట్టు; పదనఖంబులును= కాలిగోళ్లును (కాలిగోళ్లు చంద్రునిలా ప్రకాశిస్తున్నవని భావం); కమలా భూకాంతలకున్= శ్రీదేవికి, భూదేవికి; ఉపధానరూపంబులనన్+ తగి= తలగడలవలెనున్న; నీలకదళికాస్తంభంబుల= నల్లని అరటిస్తంభాల; డంబున్= అందాన్ని; విడంబించు= అనుకరించు; ఊరుయుగళంబును= తొడలజంటయు; కనకమణిమయ= బంగారముతోను, రత్నాలతోను నిండిన; మేఖలా కలాప= ఇరువదియైదు పేటలు గల ఒడ్డాణముచేత; అభిరామంబును= మనోహరమైనదియు; కదంబ కింజల్క= కడిమిపూల కేసరములచేత; శోభిత= ప్రకాశించుచున్న; పీత+అంబర+అలంకృతంబును+ఐ= పచ్చని వస్త్రముచే అలంకరింపబడినదియునై; విలసిల్లు కటిమండలంబును= ప్రకాశించు నడుము భాగమును; శృంగారవాహినీ జల+ఆవర్తనంబునాన్= శృంగారరసప్రవాహజలముయొక్క సుడిగుండమువలె; పొలుపు+ఒందు= అందగించు; నాభివివరంబును= లోతైన బొడ్డును; జఠరస్థ= గర్భమునందున్న; నిఖిల బ్రహ్మాండ= సమస్త బ్రహ్మాండములు; ముహుస్+ముహుస్+ఉద్భవ= మాటిమాటికి పుట్టుటచేత; కృశీభూతంబు+ అనన్+తగు= చిక్కిపోయినదన్నట్లున్న; మధ్యభాగంబును= నడుమును; మహిత= కొనియాడదగిన; ముక్తాఫలమాలికా= ముత్యాలదండలచే; విరచిత= రచింపబడిన; రంగవల్లీ విరాజితంబును= ముగ్గులచే శోభించునదియు; నవతులసీ= లేత తులసియాకులతో చేసిన; దామ= దండయే; కిసలయతల్పంబున్= చిగురుటాకుల పానుపుగా కలదియు;

కుసుమమాలికా+అలంకృతంబును= పూలదండలతో అలంకరింపబడినదియు; ఘనసార కస్తూరికా చందన విలిప్తంబును= కర్పూర, కస్తూరి, గంధముల పూత కలదియు; కౌస్తుభరత్న దీప్త ప్రదీపంబు= కౌస్తుభమణియే ప్రకాశించు దీపముగా కలదియు; శ్రీవత్సలక్షణలక్షితంబును+ఐ= శ్రీవత్సమను పేరు గల పుట్టుమచ్చ గుర్తుగా కలదియునై; ఇందిరారమణికిన్= లక్ష్మీదేవికి; కేళీమందిరంబు+అనన్+పొల్చు= క్రీడాగృహమువలె ఒప్పు; వక్షస్+స్థలంబును= ఉరఃప్రదేశమును; సుఖకేళీ= ఆనందక్రీడయగు; సమారంభ= ప్రారంభించబడిన; పరిరంభణ= కౌగిలిలోని; అంభోధిరాట్+కన్యకా= శ్రీమహాలక్ష్మియొక్క; కర+అంభోజ= హస్తపద్మాలకు; కీలిత= తొడిగిన; మణికంకణ= రత్నాలగాజుల; నికషంబులనన్= ఒరిపిడులనగా; పొలుపారు= ప్రకాశించు; రేఖాత్రయవిరాజమానంబైన= మూడు రేఖలతో అందగించు; కంబుకంధరంబును= శంఖమువంటి మెడయును; సుమహిత= మిక్కిలి గొప్పదైన; అనర్ఘ= అమూల్యములైన; దివ్యమణి= గొప్ప రత్నముల; ప్రభావిభాసిత= కాంతులతో ప్రకాశించు; కేయూర కంకణ ముద్రికా= భుజకీర్తులు, వలయములు, ఉంగరములతో; అలంకృతంబులు+అయిన బాహువులును= అలంకరింపబడిన చేతులు; సకల లోక+ఆర్తి నివారక= అన్నిలోకాల బాధలను పోగొట్టగల; దరహాసచంద్రికా= చిరునగవుల వెన్నెలతో; ధవళితంబులు+ఐ= తెల్లబడినవై; కర్ణకుండల మండన మణిమరీచులు= చెవిపోగులకున్న రత్నాల కాంతులు; నర్తనంబులు సలుపన్= నాట్యమాడుతుండగా; తనరి= ఒప్పి; నిద్దంబులు+అగు= నున్ననైన; చెక్కు+అద్దంబులును= అద్దములవంటి చెక్కిళ్లును; పరిపక్వ= మగ్గిన; బింబఫల= దొండపండువలెను; ప్రవాళ= కెంపువలెను; పల్లవ= చిగురుటాకువలెను ఉన్న; అరుణ+అధరంబును= ఎఱ్ఱని పెదవియు; అఖిల భువన పరిపాలనంబునకున్= సమస్త జగత్తును పాలించుటకు; నేన చాలుదున్+అని= నేనే సమర్థత గలదానను అని; వివాదించు= వాదించుకొనే; నయనయుగళంబునకున్= రెండు కళ్లకు; సీమాస్తంభంబును= సరిహద్దు కంబమైనదియు; చంపక ప్రసూనరుచి విభాసంబును+అగు= సంపెంగ పూవుయొక్క కాంతితో ప్రకాశించేదియునగు; నాసాదండంబును= దండమువంటి ముక్కును; కమల కుముదంబులకున్= పద్మాలకు, కలువలకు; పెంపు సంపాదించుచున్= అతిశయాన్ని చేకూరుస్తూ; కరుణ+అమృత తరంగిత+అపాంగంబులు+ఐ= దయ అనే అమృతంతో తరగలెత్తు క్రీగంటిచూపులు కలవై; కర్ణ+అంత విశ్రాంతంబులు+ఐ= చెవులవరకు వ్యాపించినవై; చెలువు+ఒందు నేత్రంబులును= అందగించు కన్నులును; సలలిత శ్రీకారంబునకున్= అందమైన శ్రీకారానికి; అక్షరత్వంబు= నాశములేనితనము (వర్ణరూపము); సార్థకంబు+అయ్యెన్+అనన్+తగు= అర్థవంతమైనదనునట్లున్న; కర్ణంబులును= చెవులును (చెవులు శ్రీకారమువలె ఉన్నవనుట); ఇక్షుచాపద్వయంబునాన్= చెరుకువిండ్ల జంటయా అనునట్లు; చూపట్టు= కనుపట్టు; భ్రూయుగళంబును= కనుబొమల జంటయును; అపర= బహుళపక్షమునాటి; అష్టమీ= అష్టమి తిథినాటి; శశాంక శంకా+ఆస్పద ఫాలఫలకంబును= చంద్రుడను శంక కలిగించు ఫలకమువంటి నుదురుభాగమును; నీలగిరి+ఇంద్ర= గొప్పదైన నీలపర్వతముయొక్క; శృంగసంగత= శిఖరముతో కూడిన; బాలమార్తాండ మండల= ఉదయకాలపు సూర్యబింబముచేత; విడంబిత= అనుకరింపబడిన; పద్మరాగ మణిఖచిత= పద్మరాగమణులు తాపించిన; కాంచనకిరీటంబునన్= బంగారు కిరీటముతో; పొలుపారి= అందగించు; సూర్య+ఇందు= సూర్యచంద్రుల; పవన+అనల= వాయు, అగ్నుల; ప్రకాశంబులకున్= తేజస్సులకు; అవకాశంబు+చూపక= అవకాశమివ్వకుండా; త్రిలోకవ్యాపక సమర్థంబులు+అగు= ముజ్జగాలు వ్యాపించే శక్తి కలిగిన; తేజస్+విశేషంబులన్= కాంతి విశేషములతో; చెలువు+ఒంది= అందగించి; సంగరరంగంబులన్= యుద్ధభూములలో; దానవ+అనీకంబులన్= రాక్షసుల గుంపులను; హరింపన్+చాలు= సంహరింప సమర్థమైన; సుదర్శన+ఆది దివ్యసాధనంబులచేన్= సుదర్శనచక్రము మొదలగు గొప్ప రణోపకరణములతో; దురాసదంబు+అగు= పట్టువడని; దివ్యరూపంబునున్+కలిగి= అద్భుతమైన రూపాన్ని కలిగియుండి, మఱియును= ఇంకా...

**తా :** బ్రహ్మ దర్శించిన శ్రీమన్నారాయణమూర్తి దేహం విశ్వానికి వేరు కానిది, సాటిలేనిది, మొత్తం జగత్తును తనలో ఇముడ్చుకొన్నది, విశాలంగా గుండ్రంగా ఉన్నది, విచిత్రమైన అందమైన ఆభరణాల కాంతుల చిందుతున్నది, పుణ్యపురుషుల కోరికలు తీర్చే కామధేనువువంటి పాదద్వయం కలిగినది, నుదుటి అందానికి ఓడిన చంద్రుడు ఆశ్రయించినట్లనిపించే కాలిగోళ్లు కలిగినదిగా ఉంది.

ఆయన తొడలు శ్రీదేవీభూదేవులకు తలగడలా అన్నట్లు నల్లని అరటిస్తంభాలను పోలి ఉన్నాయి. కటిప్రదేశం బంగారపు మొలనూలుతో అందంగా ఉంది. కడిమిపూవుల కేసరాలతో అందగిస్తున్న పట్టుపీతాంబరం కట్టిన నడుము శోభాయమానంగా ఉంది. నాభి ప్రదేశం శృంగార ప్రవాహంలో ఏర్పడ్డ సుడిగుండంవలె ఉంది. లోపలి భువనాలు మళ్లీ మళ్లీ పుడుతుండడంతో కృశించినట్లుగా ఉంది నడుము.

గుండె లక్ష్మీదేవి విలాసమందిరంలా ఉంది. ముత్యాలమాలలు ఆ మందిరం ముంగిట తీర్చిన రంగవల్లులులా ఉన్నాయి. తులసీమాలలు చిగురుపాన్పులా ఉన్నాయి. పూలదండలతో, పచ్చకర్పూరంతో, కస్తూరి గంధలేపనాలతో కౌస్తుభరత్న కాంతులతో శ్రీవత్సశోభితమై ఉంది. కౌగిలింత సమయంలో లక్ష్మీదేవి చేతులకున్న మణిస్థగితమైన బంగారు గాజులు ఒత్తుకొన్నట్లుగా కంఠంపై రేఖలు కనిపిస్తున్నాయి.

రత్నాలు పొదిగిన బంగారపు భుజకీర్తులతో, కంకణాలతో చేతులు శోభిస్తున్నాయి. అద్దాలవంటి చెక్కిళ్లు లోకుల బాధలను బాపే చిరునవ్వు వెన్నెలలతో, చెవులకున్న కుండలాలు మణికాంతుల నర్తనాలతో ముచ్చట గొలుపుతున్నాయి. పెదవి దొండపండులా, పగడంలా, చిగురుటాకులా ఎర్రగా ఉంది. లోకపాలనకు సమర్థత నాకుందంటే నాకుందని కలహించే కన్నులకు మధ్యలో పెట్టిన సరిహద్దు స్తంభంలా ఆయన ముక్కు ఉంది. కన్నులు కలువలలాగా, కమలాలలాగా, ఉన్నాయి. వాటినుండి కరుణామృతం పొంగి పొర్లుతోంది. కడగంటి చూపులు చెవులదాకా వ్యాపిస్తున్నాయి. శ్రీకారాలలాగా ఉన్నాయి. కనుబొమలు మన్మథుని ధనుస్సులాగా ఉన్నాయి. నొసటిభాగం అష్టమినాటి చంద్రరేఖలా ఉంది.

తలపై ఉన్న పద్మరాగమణులు పొదిగిన బంగారు కిరీటం నీలాద్రిపైనున్న బాలసూర్యుని తిరస్కరిస్తున్నది. సూర్యుడు, చంద్రుడు, వాయువు, అగ్నుల కాంతులకు అవకాశమివ్వకుండా ముల్లోకాలకూ వ్యాపించే కాంతితో చెలువొందుతూ, యుద్ధంలో రాక్షససమూహాన్ని చీల్చిచెండాడే సుదర్శనాది దివ్యాయుధాలను ధరించి, దివ్యరూపంతో ప్రకాశిస్తున్నాడు శ్రీహరి.

**ఉ. హారకలాపపుష్పనిచయంబులఁజంచదనర్ఘ రత్న కే**
**యూరకరాంగుళీయకమహోజ్జ్వలబాహుసహస్రశాఖ లొ**
**ప్పారఁగఁజూడ నొప్పి భువనాత్మకలీల నదృష్ట మూల వి**
**స్ఫారితభోగివేష్టితవిభాసితచందనభూరుహాకృతిన్. 289**

**ప్రతి :** హారకలాప= ఇరువది అయిదు పేటలు గల హారములు అను అలంకారాలతోను; పుష్పనిచయంబులన్= పూవుల సముదాయాలతోను; చంచత్= కదలుచున్న; అనర్ఘ= అమూల్యమైన; రత్న= రత్నములతోకూడిన; కేయూర= భుజకీర్తులతోను; కర+అంగుళీయక= ఉంగరములతోను; మహా+ఉజ్జ్వల= మిక్కిలి ప్రకాశించే; బాహుసహస్ర= వేయి చేతులు అనెడి; శాఖలు= కొమ్మలు; ఒప్పారఁగన్= ఒప్పుచుండగా; చూడన్+ఒప్పి= దర్శనీయమై; భువన+ఆత్మకలీలన్= విశ్వమే బీజంగా

కలిగి; అదృష్టమూల= కనబడని మూలముతో; విస్ఫారిత= ఒప్పుతూ; భోగివేష్టిత= పాముచే చుట్టబడి; విభాసిత= ప్రకాశిస్తున్న; చందనభూరుహ+ఆకృతిన్= శ్రీగంధపు చెట్టువలె (శ్రీహరి ప్రకాశిస్తున్నాడు).

**తా :** బ్రహ్మ శ్రీహరిని దర్శించాడు. ఆ స్వామి హారాలు అలంకారంగా ధరించాడు. పూలదండలు ధరించాడు. వేయి చేతులు కలిగియున్నాడు. అన్ని చేతులకూ రత్నాలు పొదిగిన బంగారు ఉంగరాలూ, భుజకీర్తులూ ఉన్నాయి. భువనమే బీజంగా కలిగి, మూలం కనబడని, పాము చుట్టుకొన్న శ్రీచందనవృక్షంలాగా స్వామి ప్రకాశిస్తున్నాడు.

**మ. విలసత్కుండలిరాజసఖ్యమున నుర్వీభృత్సమాఖ్యన్ సము**
**జ్జ్వలితోదారశిరోవిభూషణసహస్రస్వర్ణకూటంబులన్**
**సలిలావాసతఁ జారుకౌస్తుభవిరాజద్రత్నగర్భంబునన్**
**నలినాక్షుండు గనుంగొనంగఁదగె మైనాకావనీభృద్గతిన్. 290**

**ప్రతి :** విలసత్= ప్రకాశించుచున్న; కుండలిరాజ= ఆదిశేషునితో; సఖ్యమునన్= కలసి ఉండుటచేతను; ఉర్వీభృత్+సమాఖ్యన్= భూభారమును మోయువాడగుటచేతను; సముజ్జ్వలిత= శోభాయమానమైన; ఉదార= గొప్పవైన; శిరోవిభూషణ= కిరీటాలనే; సహస్ర= వేయి; స్వర్ణకూటంబులన్= బంగారు శిఖరాలు కలిగియుండుటచేతను; సలిల+ఆవాసతన్= నీటిలో ఉండుటచేతను; చారు= అందమైన; కౌస్తుభ= కౌస్తుభమనే మణిచేత; విరాజత్= అందగించుచున్న; రత్నగర్భంబునన్= రత్నము కలిగి ఉండుటచేతను; నలిన+అక్షుండు= వారిజాక్షుడైన విష్ణువు; మైనాక= మైనాకము అను పేరుగల; అవనీభృత్+గతిన్= పర్వతమువలె; కనుంగొనంగన్+తగెన్= చూడనొప్పెను.

**తా :** శ్రీమహావిష్ణువు మైనాకపర్వతంలాగా కనిపిస్తున్నాడు. పర్వతంపై పాములుంటాయి. ఆదిశేషుడు శ్రీహరికి తన పడగను గొడుగులా పట్టి ఉన్నాడు. పర్వతం భూభారాన్ని మోస్తుంది కనుక భూధరమంటారు. స్వామికూడా భూభారాన్ని వహిస్తున్నాడు. వేయి శిరస్సులపై వేయి బంగారు కిరీటాలున్నాయి స్వామికి. పర్వతంపై బంగారంలా మెరిసే ఎన్నో శిఖరాలున్నాయి. మైనాకపర్వతం సముద్రమధ్యంలో ఉంది. స్వామికూడా సముద్రమధ్యంలోనే ఉన్నాడు. స్వామి కౌస్తుభమణితో ప్రకాశిస్తున్నాడు. మైనాకపర్వతం రత్ననిలయమై ఉంది. అటువంటి మైనాకపర్వత సదృశుడైన చూడదగిన శ్రీహరిని దర్శించాడు బ్రహ్మ.

**క. వితతార్థజ్ఞాన జప, స్తుతి మకరందప్రహృష్టశ్రుతిజాతమధు**
**వ్రతగణపరివృతశోభా, గతకీర్తిప్రసవమాలికలు గలవానిన్. 291**

**ప్రతి :** వితత= విస్తారమైన; అర్థ= అర్థము కలిగిన; జ్ఞాన= విజ్ఞానము; జప= ధ్యానము; స్తుతి= స్తోత్రము అనెడి; మకరంద= తేనెవలన; ప్రహృష్ట= మిక్కిలి ఆనందించిన; శ్రుతిజాత= వేదసముదాయము అనెడి; మధువ్రతగణ= తుమ్మెదల సమూహముచేత; పరివృత= చుట్టబడిన; శోభాగత= కాంతిని పొందిన; కీర్తి= యశస్సు అనెడి; ప్రసవమాలికలు= పూలదండలు; కలవానిన్= కలిగిన శ్రీమహావిష్ణువును...

**తా :** విపులార్థవంతమైన జ్ఞానజపస్తుతులనెడి మకరందాన్ని తాగి సంతోషించిన వేదాలనే తుమ్మెదలతో చుట్టబడిన కాంతిమంతమైన కీర్తి అనే పూలదండలు కల విష్ణువును బ్రహ్మదేవుడు కనుగొన్నాడు.

**వ. కనుంగొని చతురాననుండు. 292**

**ప్రతి :** కనుంగొని= దర్శించి; చతుస్+ఆననుండు= నాలుగుమోములు కల బ్రహ్మ.

**తా :** అలా కనుగొన్న బ్రహ్మ.

**సీ. అనఘు సర్వేశ్వరు నాద్యంతశూన్యుని ధన్యుని జగదేకమాన్యచరితుఁ**
**దన్నాభిసరసిజోద్భవసరోజంబును నప్పుల ననిలుని నంబరమును**
**మానితభువననిర్మాణదృష్టిని బొడఁగనెఁ; గాని యితరముఁగానలేక**
**యాత్మీయకర్మ బీజాంకురంబును రజోగుణయుక్తుఁడగుచు నకుంఠిత ప్ర**

**తే. జాభిసర్గాభిముఖత నవ్యక్తమార్గుఁ, డైన హరియందుఁ దన హృదయంబుఁజేర్చి**
**యమ్మహాత్మునిఁబరము ననంతు నభవు, నజు నమేయుని నిట్లని యభినుతించె. 293**

**ప్రతి :** అనఘున్= పుణ్యాత్ముని; సర్వేశ్వరున్= సర్వమునకు ప్రభువైనవానిని; ఆది+అంతశూన్యునిన్= మొదలు తుది లేనివానిని; ధన్యునిన్= ధన్యత కలవానిని; జగత్+ఏకమాన్యచరితున్= విశ్వమంతటిలో గౌరవింపదగిన చరిత్ర కలవానిని; తద్= ఆ శ్రీహరియొక్క; నాభిసరసిజ= పద్మమువంటి బొడ్డునుండి; ఉద్భవ= ప్రభవించిన; సరోజంబును= పద్మాన్ని; అప్పులన్= నీళ్లను; అనిలునిన్= గాలిని; అంబరమును= ఆకాశాన్ని; మానిత= కొనియాడదగిన; భువన నిర్మాణ= జగత్ సృష్టికి సంబంధించిన; దృష్టినిన్= ఆలోచనతో; పొడఁగనెన్= పరికించెను; కాని= అయినా; ఇతరమున్+కానలేక= అవి తప్ప వేరేదీ కానరాక; ఆత్మీయ= తనదైన; కర్మ= కర్తవ్యానికి చెందిన; బీజ+అంకురంబును= సూక్ష్మరూపమైన జ్ఞానముగా ఉన్న; రజస్+గుణయుక్తుఁడు+అగుచున్= రజోగుణంతో కూడినవాడై; అకుంఠిత= మొక్కవోని; ప్రజా= ప్రజలయొక్క; అభిసర్గ= సృష్టించుటయందు; అభిముఖతన్= సంసిద్ధతతో; అవ్యక్తమార్గుఁడు+ఐన= తెలియబడని మార్గము కల; హరియందున్= నారాయణునియందు; తన హృదయంబున్+చేర్చి= తన మనస్సును లగ్నంచేసి; ఆ+మహాత్మునిన్= ఆ మహనీయుడును; పరమున్= పురుషోత్తముడును; అనంతున్= అంతము లేనివాడును; అభవున్= సంసార లంపటాలు లేనివాడు; అజున్= పుట్టుక; అమేయునిన్= పరిమితి లేనివాడు అయిన శ్రీహరిని; ఇట్లు+అని= చెప్పబోవు విధంగా; అభినుతించెన్= ప్రస్తుతించెను.

**తా :** పుణ్యాత్ముడు, సృష్టికి ప్రభువు, ఆద్యంతాలు లేనివాడు, ధన్యుడు, సకలలోక మాన్యుడు అయిన శ్రీహరిని బ్రహ్మ దర్శించాడు. అంతే కాదు, ఆయన పద్మంవంటి నాభినుండి పుట్టిన పద్మాన్ని, నీళ్లను, గాలిని, ఆకాశాన్ని భువన నిర్మాణదృష్టితో పరికించాడు. కాని అవి తప్ప ఇంకేమీ కనబడలేదు. అప్పుడు తనలో బీజరూపంలో ఉన్న సృష్టినిర్మాణ జ్ఞానాన్ని, రజోగుణంతో గమనించాడు. అప్పుడు మొక్కవోని విధంగా సృష్టి కార్యక్రమంలోకి దిగాలనుకొన్నాడు. వెంటనే అస్పష్టగోచరుడైన హరియందు తన హృదయాన్ని చేర్చాడు. ఆ మహాత్ముడు, పరుడు, అనంతుడు, అభవుడు, అప్రమేయుడు అయిన హరిని ఇలా స్తుతించసాగాడు.

**సీ. నలినాక్ష! మాయాగుణవ్యతికరమునఁ జేసి కార్యంబైన సృష్టిరూప**
**మునఁబ్రకాశించు నీఘనరూపవిభవంబు రూపింప దేహధారులకు దుర్వి**

**భావ్యంబు దలపోయ భగవంతుఁడవునైన పద్మాక్ష! నీ స్వరూపంబుకంటె**
**నన్య మొక్కటి సత్యమై బోధకంబైన యది లేదు గాన నీ యతుల దివ్య**

**తే. మైన రూపంబు నాకుఁబ్రత్యక్షమయ్యె, నదియుఁ గాక వివేకోదయమునఁజేసి**
**వరద! నీ రూప మజ్ఞానగురుతమో ని, వారకంబయ్యె నాకు శశ్వత్ప్రదీప! 294**

**ప్రతి :** నలిన+అక్ష!= పద్మములవంటి కన్నులు కలవాడా!; మాయాగుణవ్యతికరమునన్+చేసి= మాయాగుణాల పరస్పర సమ్మేళనంవల్ల; కార్యంబు+ఐన= చేయదగిన పనియైన; సృష్టిరూపమునన్= జగన్నిర్మాణరూపంలో; ప్రకాశించు= వెలుగొందు; నీ ఘనరూపవిభవంబున్= గొప్పదైన నీ రూపవైభవాన్ని; రూపింపన్= ఇది ఈ విధమైనదని స్పష్టంగా నిరూపించుటకు; దేహధారులకున్= శరీరులకు; దుర్విభావ్యంబు= ఊహకు అందని విషయం; తలపోయన్= ఆలోచించగా; పద్మ+అక్ష!= ఓ పద్మనేత్రుడా!; భగవంతుఁడవున్+ఐన= దేవుడవైన; నీ స్వరూపంబుకంటెన్= నీ రూపంకంటె; అన్యము= ఇతరము; ఒక్కటి= వేరొకటి; సత్యము+ఐ= శాశ్వతమైనదై; బోధకంబు+ఐన+అది= తెలియదగినది; లేదు+కానన్= లేదు కాబట్టి; అతుల దివ్యమైన= సాటిలేని దైవత్వం కలిగిన; నీ రూపంబు= నీ ఆకారం; నాకున్= నాకు (బ్రహ్మకు); ప్రత్యక్షము+అయ్యెన్= నేత్రగోచరమయింది; అదియున్+కాక= అంతే కాకుండా; వివేక+ఉదయమునన్+చేసి= జ్ఞానముయొక్క ఆవిర్భావముచేత; వరద!= వరములను ఇచ్చువాడా!; శశ్వత్+ప్రదీప= నిరంతరం వెలుగొందేవాడా!; నీ రూపము= నీ స్వరూపము; నాకున్= నాకు (బ్రహ్మకు); అజ్ఞాన= అవిద్య అనెడి; గురు= గాఢమైన; తమస్= చీకటిని; నివారకంబు+అయ్యెన్= పోగొట్టేది అయింది.

**తా :** వారిజాక్షా! మాయాగుణసంపర్కంతో చేయాల్సిన సృష్టికార్యక్రమంలో ప్రకాశించే నీ రూపవైభవం ఇట్టిదని నిరూపించడం శరీరధారులకు సాధ్యం కాదు. నీ స్వరూపంకంటె ఇతరమైనది ఏదీ లేదు. అటువంటి నీ దివ్యరూపం నా కన్నులకు గోచరించింది. అంతే గాక, నాకు జ్ఞానోదయంకూడా కలిగింది. ఎందువల్లనంటే నీవు నిరంతరాయంగా వెలుగొందేవాడవు కనుక నీ రూపం అజ్ఞానమనే గాఢాంధకారాన్ని పటాపంచలు చేస్తుంది.

**క. ఘన సత్పురుషానుగ్రహ, మునకై యమితావతారమూలంబగుచుం**
**దనరెడి నీరూపము శో, భనమగు భవదీయనాభిపద్మమువలనన్. 295**

**ప్రతి :** ఘన= గొప్పవారైన; సత్పురుష= సజ్జనులను; అనుగ్రహమునకై= అనుగ్రహించుటకై; అమిత= అపరిమితమైన; అవతార= అవతారములకు; మూలంబు+అగుచున్= బీజరూపమగుచు; తనరెడి= ఒప్పెడి; నీ రూపము= నీ స్వరూపం; శోభనము+అగున్= శుభంకరమైనది అవుతుంది; భవదీయ= నీయొక్క; నాభి= బొడ్డునందలి; పద్మమువలనన్= సరోజమునుండి...

**తా :** శ్రీహరీ! సజ్జనులను అనుగ్రహించేందుకు ఎత్తే ఎన్నో అవతారాలకు మూలరూపమైనది నీ స్వరూపం. అది శుభంకరం. నీ నాభికమలంనుండి.

**క. జననం బందిన నాచే, ననయము మొదలనె గృహీత మయ్యె; జగత్పా**
**వన! నీదు సుస్వరూపము, ఘనరుచిరంబై స్వయంప్రకాశక మగుటన్. 296**

**ప్రతి :** జగత్పావన= లోకపావనుడా!; నీదు సుస్వరూపము= నీ గొప్పరూపము; ఘనరుచిరంబు+ఐ= మిక్కిలి మనోజ్ఞమై; స్వయంప్రకాశకము+అగుటన్= తనకు తానుగా వెలుగొందేదగుటచే; జననంబు+అందిన= నీ నాభికమలంనుండి జన్మించిన; నాచేన్= నాచేత; అనయము= మరి మరి; మొదలనె= ఆరంభంలోనే; గృహీతము+అయ్యెన్= గ్రహింపబడింది.

**తా :** జగత్తును పవిత్రం చేయు జనార్దనా! మిక్కిలి మనోజ్ఞమై, స్వయంప్రకాశకమైన నీ రూపం నాకు జన్మించడానికి ముందుగానే పూర్తిగా దర్శించే అవకాశం లభించింది.

**వ.** **మఱియు జ్ఞానానందపరిపూర్ణ మాత్రంబును, ననావృతప్రకాశంబును, భేదరహితంబును, బ్రపంచ జనకంబును, బ్రపంచ విలక్షణంబును, భూతేంద్రియాత్మకంబును, నేకంబును, నైన రూపంబు నొందియు నెందును బొడగాన నట్టి నిన్ను నాశ్రయించెద; నదియునుంగాక జగన్మంగళ స్వరూపధరుండవై నీ యుపాసకులమైన మా మంగళంబులకొఱకు నిరంతర ధ్యానంబుచేత నీ దివ్యరూపంబునం గానంబడితి, విట్టి నీవు నిరయభాక్కులై నిరీశ్వరవాదంబునం జేసి కుతర్కంబులు ప్రసంగించు భాగ్యరహితులచే నాదృతుండవు గావు; మఱియు కొందఱు కృతార్థులైన మహాత్ములు భవదీయ శ్రీచరణారవిందకోశగంధంబు వేదమారుతానీతం బగుటంజేసి తమ తమ కర్ణకుహరంబులచేత గ్రహించుదురు; వారల హృదయకమలంబులయందు భక్తిపారతంత్ర్యంబున గృహీతపాదారవిందంబులు గలిగి ప్రకాశింతు; వదియునుంగాక ప్రాణులకు ద్రవ్యాగార సుహృన్నిమిత్తం బయిన భయంబును దన్నాశనిమిత్తం బయిన శోకంబును, ద్రవ్యాది స్పృహయును దననిమిత్తం బయిన పరిభవంబును, మఱియు నందుఁ దృష్ణయు నది ప్రయాసంబున లబ్ధంబైన నార్తియు, తదీయంబైన వృథాగ్రహంబును నీ శ్రీపాదారవిందంబు లందు వైముఖ్యం బెంత కాలంబు గలుగు నంతకాలంబును బ్రాప్తంబు లగుంగాని మానవాత్మనాయకుండవగు నిన్ను నాశ్రయించిన భయనివృత్తి హేతువైన మోక్షంబు గలుగు; మఱియునుం గొందఱు సకలపాప నివర్తకంబయిన త్వదీయనామస్మరణ కీర్తనంబులందు విముఖులై కామ్యకర్మ ప్రావీణ్యంబునం జేసి నష్టమతులై యింద్రియ పరతంత్రులై యమంగళంబులైన కార్యంబులు సేయుచుందురు; దానంజేసి వాతాదిత్రిధాతు మూలంబైన క్షుత్తృడాదులచేతను, శీతోష్ణవర్ష వాతాది దుఃఖంబులచేతను, నతిదీర్ఘంబైన కామాగ్నిచేతను, నవిచ్ఛిన్నంబగు క్రోధంబుచేతనుం దప్యమాను లగుదురు; వారలం గనిన నా చిత్తంబు గలంకం బొందు; జీవుండు భవదీయమాయా పరిభ్రామ్యమాణుండై యాత్మ వేఱని యెప్పుడు దెలియు, నంత కాలంబు నిరర్థకంబై దుస్తరంబైన సంసారసాగరంబు తరియింపంజాలకుండు; సన్మునీంద్రులైనను భవదీయ నామస్మరణంబు మఱచి యితరవిషయాసక్తులైరేని వారలు దివంబులందు వృథాప్రయత్నులై సంచరించుచు, రాత్రులయందు నిద్రాసక్తులై స్వప్నగోచరంబు లయిన బహువిధసంపదకు నానందించుచు, శరీరపరిణామాది పీడలకు దుఃఖించుచుం బ్రతిహతంబులైన యుద్యోగంబుల భూలోకంబున సంసారులై వర్తింతురు; నిష్కామధర్ములై నిన్ను భజియించు సత్పురుషుల కర్ణమార్గంబులం బ్రవేశించి భవదీయ భక్తియోగ పరిశోధితంబైన హృత్సరోజ కర్ణికాపీఠంబున వసియింతు వదియునుంగాక.** **297**

**ప్రతి :** మఱియున్= అంతే కాక; జ్ఞాన+ఆనంద పరిపూర్ణమాత్రంబును= జ్ఞానమువలన లభించే ఆనందముచేతనే పరిపూర్ణత కలిగేది; అనావృత ప్రకాశంబును= ఏ కలయిక లేని తేజస్సుతో నిండినది; భేదరహితంబును= ఎటువంటి భేదము లేనిది; ప్రపంచజనకంబును= జగత్తును సృష్టించేది; ప్రపంచ విలక్షణంబును= ప్రపంచముకంటె వేరైన లక్షణాలు కలది; భూత+ఇంద్రియ+ఆత్మకంబును= పంచభూతాలు, వాటి ఇంద్రియాలైన శబ్దాదులు కలది; ఏకంబును= ఒక్కటియైనదియు; ఐన రూపంబును+ఒందియున్= అయిన రూపాన్ని పొందియును; ఎందునున్+పొడన్+కాననట్టి= ఎక్కడా కనిపించని; నిన్నున్+ఆశ్రయించెదను= నిన్నే ఆశ్రయిస్తాను; అదియునున్+కాక= అంతే కాకుండా; జగత్+మంగళ స్వరూపధరుండవై= ప్రపంచానికి శుభాలనుకూర్చే రూపాన్ని ధరించినవాడవై; నీ+ఉపాసకులము+ఐన= నిన్నే సేవించే; మా మంగళంబులకొఱకున్= మాకు శుభములు కలుగుటకొరకు; నిరంతర ధ్యానంబుచేతన్= ఎల్లపుడూ స్మరించుటచేత; ఈ దివ్యరూపంబునన్= ఈ పవిత్రమైన ఆకారంతో; కానన్+పడితివి= సాక్షాత్కరించావు; ఇట్టి నీవు= ఇటువంటి నీవు; నిరయభాక్కులు+ఐ= దుర్గతిని అనుభవించేవారై; నిర్+ఈశ్వరవాదంబునన్+చేసి= దేవుడు లేడనే భావంతో; కుతర్కంబులు ప్రసంగించు= పిడివాదములు చేయు; భాగ్యరహితులచేన్= అదృష్టం లేనివారిచే; ఆదృతుండవు కావు= ఆదరించబడవు, సాక్షాత్కరించవు; మఱియున్ కొందఱు= ఇంకా కొంతమంది; కృతార్థులైన మహాత్ములు= చరితార్థులైన మహానుభావులు; భవదీయ= నీయొక్క; శ్రీచరణ+అరవింద= పవిత్ర పాదపద్మాల; కోశగంధంబు= పూమొగ్గయొక్క సువాసన; వేద మారుత+ఆనీతంబు= వేదమనే గాలిచేత తీసుకురాబడినది; అగుటన్+చేసి= అగుటచేత; తమ తమ కర్ణకుహరంబులచేతన్= వారి వారి చెవిరంధ్రములచే; గ్రహించుదురు= ఆస్వాదిస్తారు; వారల= అట్టి పుణ్యాత్ముల; హృదయకమలములయందున్= ఎదతామరలయందు; భక్తిపారతంత్ర్యంబునన్= భక్తిపారవశ్యముచేత; గృహీత పాద+అరవిందంబులు+కలిగి=స్వీకరింపబడిన అడుగుతామరలు కలిగి; ప్రకాశింతువు= వెలుగొందుదువు; అదియునున్+కాక= అంతే కాకుండా; ప్రాణులకున్= మానవులకు; ద్రవ్య+ఆగార సుహృత్+నిమిత్తంబు+అయిన= ధనము, ఇల్లు, స్నేహితులు కారణంగా ఏర్పడు; భయంబును= భయాన్ని; తద్+నాశనిమిత్తంబు+అయిన= అవి నశించుటచే ఏర్పడిన; శోకంబును= దుఃఖమును; ద్రవ్యాది స్పృహయున్= ధనాదులపై కోరికయు; తన నిమిత్తంబు+అయిన పరిభవంబును= అందువలన ఏర్పడే అవమానము; మఱియున్+అందున్+తృష్ణయున్= ఇంకను దానిపై ఆశయు; అది ప్రయాసంబున లబ్ధంబు+ఐనన్= అది చాల కష్టముతో లభించినచో; ఆర్తియున్= దుః ఖమును; తదీయంబు+ఐన వృథా+ఆగ్రహంబును= దానినుండి వచ్చే అకారణ కోపమును; నీ శ్రీపాదారవిందంబులు+ అందున్= నీ దివ్యపాదారవిందాలపై; వైముఖ్యంబు= విముఖత; ఎంత కాలంబు+కలుగున్= ఎంత కాలం ఉంటుందో; అంత కాలంబునున్= అంతవరకును; ప్రాప్తంబులు+అగున్+కాని= అంతవరకూ ఆ వేదనలు ఏర్పడతాయి కాని; మానవ+ ఆత్మనాయకుండవు+అగు= మానవులకు నిజనాయకుడవైన; నిన్నున్+ఆశ్రయించినన్= నిన్ను శరణన్నచో; భయనివృత్తి హేతువు+ఐన= సంసారభయాన్ని పోగొట్టే కారణమైన; మోక్షంబు+కలుగున్= ముక్తి ఏర్పడును; మఱియునున్= అంతే కాక; కొందఱు= కొంతమంది; సకల పాప నివర్తకంబు+అయిన= అన్ని పాపాలను పోగొట్టగలిగిన; త్వదీయ నామస్మరణ కీర్తనంబులందున్= నీ నామాన్ని స్మరించుట, కీర్తించుటలయందు; విముఖులు+ఐ= ఆసక్తి లేనివారై; కామ్యకర్మ ప్రావీణ్యంబునన్+చేసి= కోరికలతో చేసే పనులలో నేర్పరితనం కలిగి; నష్టమతులు+ఐ= బుద్ధి చెడినవారై; ఇంద్రియపరతంత్రులై= ఇంద్రియాలకు వశులై; అమంగళంబులైన కార్యంబులు= అపవిత్రములైన పనులు; చేయుచుందురు= చేస్తుంటారు; దానన్+చేసి= అందువలన; వాత+ఆది త్రిధాతుమూలంబు+ఐన= వాత పిత్త శ్లేష్మములకు మూలమైన; క్షుత్+తృట్+ఆదులచేతను= ఆకలి దప్పికలతోను; శీత+ఉష్ణవర్షవాత+ఆది దుఃఖంబులచేతను= చలి, వేడి, వాన వంటి

బాధలతోను; అతిదీర్ఘంబు+ఐన= ఎక్కువకాలం నిలబడే; కామ+అగ్ని చేతను= కామమనే అగ్నిచేతను; అవిచ్ఛిన్నంబగు క్రోధంబుచేతనున్= ఎడతెగని కోపముచేతను; తప్యమానులు+అగుదురు= తపించిపోవుదురు; వారలన్+కనినన్= అటువంటివారిని చూచినచో; నా చిత్తంబు= నా మనస్సు; కలంకన్+పొందున్= కలత పడుతుంది; జీవుండు= మానవుడు; భవదీయ మాయా పరిభ్రామ్యమాణుండై= నీ మాయలోపడి తిరుగుతున్నవాడై; ఆత్మ వేఱు+అని= శరీరముకంటె ఆత్మ భిన్నమని; ఎప్పుడు తెలియున్= ఎన్నడు తెలుసుకొంటాడో; అంత కాలంబున్= అంతవరకును; నిర్+అర్థకంబు+ఐ= నిష్ప్రయోజనమై; దుస్తరంబు+ఐన= దాటశక్యము కాని; సంసార సాగరంబు= సంసారసముద్రాన్ని; తరియింపన్+ చాలకుండున్= దాటలేడు; సత్+ముని+ఇంద్రులు+ఐనను= గొప్ప మునులైనను; భవదీయ నామస్మరణంబున్ మఱచి= నీ నామాన్ని స్మరించడం మఱచి; ఇతర విషయ+ఆసక్తులు+ఐరి+ఏనిన్= ఇతర విషయాలపై ఆసక్తిని పొందినచో; వారలు దివంబులందున్= వారు పగటి వేళలలో; వృథాప్రయత్నులు+సంచరించుచున్= నిరుపయోగంగా గడుపుతూ; రాత్రులయందున్= రాత్రులలో; నిద్రా+ఆసక్తులు+ఐ= నిద్రయందాసక్తి గలవారై; స్వప్నగోచరంబులు+అయిన= కలలో తోచిన; బహువిధ సంపదకున్= అనేక విధములైన సంపదకు; ఆనందించుచున్= సంతోషపడుతూ; శరీర పరిణామ+ఆది పీడలకున్= శరీరంలో జరిగే మార్పుల వలన కలిగే కష్టాలకు; దుఃఖించుచున్= బాధపడుతూ; ప్రతిహతంబులు+ఐన= కొట్టబడిన; ఉద్యోగంబులన్= ప్రయత్నాలతో; భూలోకంబునన్= మానవలోకంలో; సంసారులు+ఐవర్తింతురు= భవబంధాలలో చిక్కుకొని ప్రవర్తిస్తుంటారు; నిష్కామధర్ములు+ఐ= ఏ కోరికలూ లేకుండా ధర్మాన్ని ఆచరించేవారై; నిన్ను భజియించు= నిన్ను సేవించు; సత్+పురుషుల= ఉత్తముల; కర్ణమార్గంబులన్+ప్రవేశించి= చెవి రంధ్రములద్వారా ప్రవేశించి; భవదీయ భక్తియోగ పరిశోధితంబు+ఐన= నీ భక్తియోగంచేత పరిశోధింపబడిన; హృద్+సరోజ కర్ణికాపీఠంబునన్= హృదయపద్మం దుద్దుభాగంపై; వసియింతువు= నివసించెదవు; అదియునున్+కాక= అంతే కాకుండా...

**తా :** అంతేకాక, నీ రూపం జ్ఞానం, ఆనందం పరిపూర్ణంగా కలిగినది. ఎల్లపుడూ (శాశ్వతంగా) ప్రకాశించేది. ఎటువంటి భేదం లేనిది. విశ్వసృష్టికి కారణమైనది. ప్రపంచంకంటె భిన్నమైన లక్షణం కలది. పంచభూతాలైన పృథివ్యప్తేజోవాయ్వాకాశాలు, వాటి విషయాలైన గంధ, రస, రూప, స్పర్శ, శబ్దాలు కలిగినది. అయినా పొడగానలేనిది. అటువంటి శరీరాన్ని ధరించిన నిన్ను ఆశ్రయిస్తాను.

అంతే కాదు, పుట్టుకతోటే మంగళస్వరూపుడవు నీవు. నిన్ను ఆరాధించే మాకు శుభాలు కలుగుటకై మేము ధ్యానం చేయగా నీ దివ్యమంగళరూప దర్శనాన్ని మాకు అనుగ్రహించావు. ఎవరైతే నరకానికి పోదలంచి, దేవుడు లేడంటూ వాదించి, కువిమర్శలు చేస్తుంటారో అటువంటి భాగ్యహీనులను నీవు ఆదరించవు.

అంతే కాక, సార్థకజన్ములైన కొంతమంది మహనీయులు వేదమనే గాలిచేత తీసుకురాబడిన నీ పాదపద్మాల సుగంధాన్ని వారి వారి చెవిగోళాలద్వారా గ్రహిస్తారు. వారి హృదయపద్మాలలో ఉన్న భక్తిపారవశ్యంచేత వారిచే స్వీకరించబడిన పాదారవిందాలు కలిగినవాడవై సాక్షాత్కరిస్తావు. శరీరులకు ధనం, ఇల్లు, స్నేహితులు మొదలైనవాటివల్ల ఏర్పడే భయం, అవి దూరం కావడంవల్ల ఏర్పడే దుఃఖం, వస్తువులపై కోరిక, వాటివలన ఏర్పడే పరాభవం, ధనాదులయందు ఆశ, వాటిని సంపాదించుటలో ఏర్పడే కష్టంవలన కలిగే ఆర్తి, అందువల్ల అనవసరమైన కోపం, నీ దివ్యపాదాలపై అనురక్తి లేకపోవుట ఎంత కాలమో అంత కాలం ధనాదులు మాత్రమే లభ్యమవుతాయి. కాని సర్వేశ్వరుడవైన నిన్ను ఆశ్రయిస్తే భయరహితమైన మోక్షం లభిస్తుంది.

ఇంకా కొంత మంది సమస్తపాపాలనూ పోగొట్టే నీ నామస్మరణ, నీ గుణకీర్తనం వంటి వాటియందు వైముఖ్యంతో, కోరికలు తీర్చే కర్మలయందు ప్రావీణ్యం పొంది, మందబుద్ధులై ఇంద్రియచాపల్యంతో చెయ్యకూడని పనులు చేస్తుంటారు. అందువల్ల వాతపిత్తకఫాదులకు మూలమైన ఆకలి దప్పికలతోను; చలి, వేడి, వాన, గాలి మొదలైన వాటివలన ఏర్పడే దుఃఖాలతో అతిదీర్ఘమైన కోరికలనే అగ్నితోను, ఎడతెగని కోపంతోను తపించిపోతుంటారు.

అటువంటి మందబుద్ధులను చూస్తే నా మనస్సు వికలమవుతుంది. జీవుడు నీ మాయచేత భ్రాంతచిత్తుడై శరీరం వేరు, ఆత్మ వేరని తెలిసేంతవరకూ నిష్ప్రయోజనమూ, తరింపశక్యంకానిదీ అయిన సంసారసాగరాన్ని దాటలేకపోతాడు. గొప్ప మునీశ్వరులైనా నీ నామస్మరణ మరచిపోయి ఇతర విషయాలలో ఆసక్తిని చూపిస్తే అటువంటివారు పగటివేళ పనికిరాని పనులలో నిమగ్నమై, రాత్రులు నిద్రావశులై కలలో కనిపించే రకరకాల సంపదతో ఆనందిస్తూ, శరీరంలో వచ్చే మార్పులకు, పీడలకు బాధపడుతుంటారు. వారు చేసే అన్ని ప్రయత్నాలూ వ్యర్థమై, భూలోకంలో సంసారులుగా జీవిస్తారు. ఎటువంటి కోరికలూ లేకుండా కేవల ధర్మపరాయణులై నిన్ను సేవిస్తూ ఉండే సజ్జనుల చెవులద్వారా ప్రవేశించి నీ భక్తియోగంచేత పరిశోధింపబడిన హృదయపద్మం దుద్దుపై నీవు నివాసముంటావు. అంతే కాక.

**మ. వరయోగీంద్రులు యోగమార్గముల భావంబందు నే నీ మనో**
**హరరూపంబుఁదలంచి యే గుణగణధ్యానంబు గావింతు, ర**
**ప్పురుషశ్రేష్ఠపరిగ్రహంబునకునై పొల్పారఁదద్ధ్యాన గో**
**చరమూర్తిన్ ధరియింతు గాదె పరమోత్సాహుండవై మాధవా! 298**

**ప్రతి :** మాధవా!= ఓ లక్ష్మీవల్లభా!; వరయోగీంద్రులు= గొప్ప యోగులు; యోగమార్గములన్= అష్టాంగయోగాలతో; భావంబందున్= వారి అంతరంగాలలో; ఏ= ఎటువంటి; నీ= నీయొక్క; మనోహరరూపంబున్= మనోజ్ఞమైన ఆకారాన్ని; తలంచి= భావించి; ఏ= ఎటువంటి; గుణగణధ్యానంబున్= గుణసముదాయముయొక్క ధ్యానాన్ని; కావింతురు= చేస్తుంటారో; ఆ+పురుషశ్రేష్ఠ= అటువంటి పురుషోత్తములను; పరిగ్రహంబునకున్+ఐ= దరిచేర్చుకొనుటకు; పొల్పారన్= ఒప్పునట్లుగా; పరమ+ఉత్సాహుండవై= మిక్కిలి ఉత్సాహం కలవాడవై; తద్+ధ్యాన గోచరమూర్తిన్= వారి ధ్యానంలో గోచరించే ఆకారాన్నే; ధరియింతు+కాదె= ధరిస్తావు కదా!

**తా :** శ్రీహరీ! యోగీంద్రులు యోగమార్గంలో ఏ రకమైన నీ మనోహర రూపాన్ని, నీ గుణగణాలను ధ్యానిస్తారో వారిని అనుగ్రహించేందుకు పరమోత్సాహంతో అటువంటి రూపాన్నే ధరించి వారికి సాక్షాత్కరిస్తావు కదా!

**తే. అరయ నిష్కామధర్ములై నట్టి భక్తు, లందు నీవు ప్రసన్నుండ వైనరీతి**
**హృదయముల బద్ధకాములై యెనయు దేవ, గణములందుఁబ్రసన్నత గలుగ వీవు. 299**

**ప్రతి :** దేవ!= భగవానుడా!; అరయన్= పరికింపగా; నిష్కామధర్ములు+ఐనట్టి= ఏ కోరికలూ లేకుండా ధర్మపరులైన; భక్తులందున్= భక్తజనములయందు; నీవు= నీవు; ప్రసన్నుండవు+ఐన రీతిన్= అనుకూలుడవైనట్లుగా; హృదయములన్= మనస్సులలో; బద్ధకాములు+ఐ= కోరికలతో కట్టబడినవారై; ఎనయు= ప్రవర్తించు; దేవగణములందున్= దేవతాగణముల విషయంలోకూడ; ఈవు= నీవు; ప్రసన్నతన్+కలుగవు= అనుగ్రహాన్ని చూపించవు.

**తా :** దేవా! పరికించి చూస్తే నిష్కాములైన భక్తులను అనుగ్రహించినట్లుగా సకాములైన దేవతలను కూడా నీవు అనుగ్రహించవు.

చ. అరయ సమస్తభూతహృదయంబులయందు వసించి యేకమై
పరcగి సుహృత్క్రియానుగుణభాసితధర్ముcడవుంబరాపరే
శ్వరుcడవునై తనర్చుచు నసజ్జనదుర్లభ మైన యట్టి సు
స్థిరమగు సర్వభూతదయచేcబొడcగానcగ వత్తు వచ్యుతా! **300**

**ప్రతి :** అచ్యుతా!= శ్రీహరీ! (జారుపాటు లేనివాడా!); సమస్తభూత= అన్ని జీవరాశులయొక్క; హృదయంబులయందున్= అంతరంగాలలో; వసించి= నివసించి; ఏకమై పరcగి= అందరిలో ఒకే రూపమై ఒప్పి; సుహృద్+క్రియా= నీయందు స్నేహభావం గలవారి పనులకు; అనుగుణ భాసిత= అనుకూలంగా ఒప్పే; ధర్ముcడవున్= స్వభావం కలవాడవు; పరాపర+ఈశ్వరుcడవును+ఐ= పరమాత్మవును అయి; తనర్చుచున్= ప్రవర్తిస్తూ; అసత్+జన దుర్లభమైన+అట్టి= చెడ్డవారికి లభించనట్టి; సుస్థిరమగు= శాశ్వతమైన; సర్వభూత+దయచేన్= అన్నిభూతములయందు ప్రేమగలవారికి; పొడగానcగన్+వత్తువు= సాక్షాత్కరిస్తావు.

**తా :** దేవదేవా! అన్ని జీవరాసులలోనూ ఒకేరూపంతో ప్రకాశిస్తావు. అయినా నీయందు అనురాగం కలవారికే నీవూ అనుకూలంగా వ్యవహరిస్తావు. చెడ్డవారికి నీ దర్శనం సాధ్యం కాదు. సర్వభూతదయ కలవారికే నీవు సాక్షాత్కరిస్తావు.

మ. క్రతుదానోగ్రతపస్సమాధిజపసత్కర్మాగ్నిహోత్రాఖిల
వ్రతచర్యాదుల నాదరింప; వఖిలవ్యాపారపారాయణ
స్థితి నొప్పారెడి నీ పదాబ్జయుగళీసేవాభిపూజాసమ
ర్పితధర్ముండగువాని భంగి నసురారీ! దేవచూడామణీ! **301**

**ప్రతి :** అసుర+అరీ!= రాక్షసవైరీ!; దేవచూడామణీ!= దేవతలకు శిరోభూషణమువంటివాడా!; క్రతు= యాగాలు; దాన= దానాలు; ఉగ్రతపస్= తీవ్రమైన తపస్సు; సమాధి= నిశ్చలధ్యానం; జప= మంత్రజపం; సత్కర్మ= శాస్త్రీయమైన కర్మకాండలు; అగ్నిహోత్ర= త్రికాలములు అగ్నిహోత్రము చేయుట; అఖిల వ్రతచర్యా+ఆదులన్= అనేకములైన వ్రతాలు ఆచరించుట మొదలగు వాటిని; అఖిలవ్యాపారపారాయణస్థితిన్= తాము చేసే ప్రతికార్యాన్ని నీకే సమర్పించే స్థితితో; నీ= నీయొక్క; పద+అబ్జయుగళీ= పాదపద్మద్వంద్వమును; సేవా= సేవించుట అనెడి; అభిపూజా= ప్రశస్తమైన పూజయందు; సమర్పిత= సమర్పింపబడిన; ధర్ముండు+అగువాని భంగిన్= సకల ధర్మములూ కలవానిని ఆదరించినట్లుగా; ఆదరింపవు= గణింపవు.

**తా :** రాక్షసవైరీ! దేవగణశిరోభూషణమా! శ్రీహరీ! మనస్సును పూర్తిగా నీ పాదపద్మయుగళిపై ఉంచి సకల కార్యాలూ నీ సేవగానే భావించే భక్తుని ఆదరించినట్లుగా యాగాలు, తీవ్రతపస్సులు, సమాధ్యవస్థలు, జపాలు, కర్మకాండలు, అగ్నికార్యాలు, రకరకాల వ్రతాలు చేసేవారిని కూడా ఆదరింపవు.

తే. తవిలి శశ్వత్స్వరూపచైతన్యభూరి, మహిమచేత నపాస్తసమస్తభేద
మోహుcడ వఖిలవిజ్ఞానమునకు నాశ్ర, యుండవగు నీకు మ్రొక్కెద నో రమేశ! **302**

**ప్రతి :** ఓ రమేశ!= ఓ మాధవా!; శశ్వత్+స్వరూప= శాశ్వతమైన రూపంయొక్క; చైతన్య= చేతనాశక్తియొక్క; భూరి= గొప్పదైన; మహిమచేతన్= ప్రభావముచేత; అపాస్త= పోగొట్టబడిన; సమస్త= సకల; భేదమోహుcడవు= రాగద్వేషాది

భేదములు, భ్రాంతి కలిగినవాడవు; అఖిల విజ్ఞానమునకున్= సమస్త జ్ఞానానికి; ఆశ్రయుండవు+అగు= ఆధారమైన; నీకున్+తవిలి= నీకు చిక్కినవాడనై; మ్రొక్కెదన్= నమస్కరించెదను.

**తా :** శ్రీహరీ! నీ రూపం శాశ్వతమైనది. దానికి గల చేతనాశక్తితో అందరి రాగద్వేషాది భేదభావాలు, అసత్తును సత్తుగాను, సత్తును అసత్తుగాను భావించే భ్రాంతి పోతుంది. సంపూర్ణజ్ఞానానికి ఆధారమైన నీకు ఇష్టంతో నమస్కరిస్తున్నాను.

**క. జననస్థితివిలయంబుల, కనయంబును హేతుభూతమగు మాయా లీ**
**లను జెంది నటన సలిపెదు, ననఘాత్మక! నీ కొనర్తు నభివందనముల్. 303**

**ప్రతి :** అనఘ+ఆత్మక!= పుణ్యాత్ముడా!; జనన= పుట్టుక; స్థితి= జీవించుట; విలయంబులకు= మరణించుటలకు; అనయంబును= ఎల్లపుడు; హేతుభూతమగు= మూలకారణమైన; మాయాలీలను= మాయావిలాసాన్ని; చెంది= పొంది; నటన సలిపెదు= నటించెడి; నీకున్= శ్రీమన్నారాయణుడవైన నీకు; అభివందనముల్= నమస్కారములను; ఒనర్తున్= చేస్తున్నాను.

**తా :** పుణ్యాత్ముడవైన శ్రీహరీ! సృష్టిస్థితిలయాలు మూడింటికీ మూలకారణం మాయ. దానిని నీ అధీనంలో ఉంచుకొని జగన్నాటకమాడే నీకు నేను నమస్కారాలర్పిస్తున్నాను.

**సీ. అనఘాత్మ! మఱి భవదవతార గుణకర్మ ఘనవిడంబనహేతుకంబు లయిన**
**రమణీయమగు దాశరథి వసుదేవ కుమారాది దివ్యనామంబు లోలి**
**వెలయంగ మనుజులు వివశాత్ములై యవసానకాలంబున సంస్మరించి**
**జన్మ జన్మాంతర సంచిత దురితంబుఁ బాసి కైవల్యసంప్రాప్తు లగుదు**

**తే. రట్టి దివ్యావతారంబు లవధరించు, నజుఁడవగు నీకు మ్రొక్కెద ననఘచరిత!**
**చిరశుభాకార! నిత్యలక్ష్మీవిహార! భక్తమందార! దుర్భవ భయవిదూర! 304**

**ప్రతి :** అనఘ+ఆత్మ!= పుణ్యాత్ముడా!; అనఘచరిత!= పుణ్యచరిత్ర కలవాడా!; చిరశుభాకర!= ఎల్లప్పుడూ మంగళాత్మకమైన స్వరూపం కలవాడా!; నిత్యలక్ష్మీవిహార!= ఎల్లవేళల లక్ష్మీదేవితో విహరించేవాడా; భక్తమందార!= భక్తులపాలిటి కల్పవృక్షమువంటివాడా; దుర్భవ భయవిదూర!= చెడ్డదైన సంసారభయాన్ని దూరం చేసేవాడా; మఱి= అంతే కాక; భవత్= నీ; అవతార= అవతారముల; గుణ= గుణముల; కర్మ= కర్మల; ఘనవిడంబన= గొప్ప అనుకరణమునకు; హేతుకంబులు+ అయిన= మూలకారణములైన; రమణీయమగు= మానసిక ఆనందాన్ని కలిగించునవైన; దాశరథి= దశరథుని కుమారుడైన రాముడు; వసుదేవకుమార+ఆది= వసుదేవుని కుమారుడైన కృష్ణుడు మొదలైనవారి; దివ్యనామంబులు= పవిత్ర నామాలను; ఓలిన్= క్రమంగా; వెలయంగన్= ఒప్పునట్లుగా; మనుజులు= మానవులు; వివశ+ఆత్ములై= పరవశులై; అవసానకాలంబునన్= అంత్యకాలంలో; సంస్మరించి= స్మరణచేసి; జన్మజన్మ+అంతర= ఈ జన్మము మరియు పూర్వ జన్మలనుండి; సంచితదురితంబున్= పోగుచేసుకొన్న పాపాన్ని; పాసి= పోగొట్టుకొని; కైవల్యసంప్రాప్తులు+అగుదురు= మోక్షాన్ని పొందుతారో; అట్టి= అటువంటి; దివ్య+అవతారంబులు= పవిత్ర అవతారాలను; అవధరించు= ధరించెడి; అజుఁడవగు నీకున్= జన్మరహితుడవైన నీకు; మ్రొక్కెదన్= నమస్కరించెదను.

**తా :** పుణ్యాత్ముడవు, సచ్చరిత్ర కలవాడవు, దివ్యమంగళ విగ్రహుడవు, నిత్యలక్ష్మీ విహారుడవు, భక్తులపాలిటి కల్పవృక్షంవంటివాడవు, దుస్తరమైన సంసారభయాన్ని పోగొట్టేవాడవు, జననరహితుడవు అయిన శ్రీహరీ! ఏ నీ అవతారాల గుణకర్మల అనుకరణకు మూలహేతువులైన రామకృష్ణాది నామాలను అంత్యకాలంలో సంస్మరించిన మనుజులు జన్మజన్మాంతరాలలో చేసిన పాపాలను పోగొట్టుకొని కైవల్యాన్ని పొందుతుంటారో అటువంటి నీకు నమస్కరించుచున్నాను.

**విశే :** కర్మలు మూడు రకాలుగా ఉంటాయి. ఒకటి ప్రారబ్ధం. అనగా శరీరాన్ని పొందేందుకు ఉపకరించేది. రెండు సంచితం. అనగా ప్రోగుచేసికొని ఉంచుకొన్న కర్మ. మూడు ఆగామి. రానున్న కాలంలో లేదా జన్మలలో అనుభవించుటకు దాచి ఉంచబడింది.

**త. జననవృద్ధివినాశహేతుక సంగతింగల యేను నీ**
**వును హరుండుఁద్రిశాఖలై, మనువుల్ మరీచిముఖామరుల్**
**దనర నందుపశాఖలై, భవదాత్మ దీనికి మూలమై**
**యనయమున్ భువనద్రుమాకృతివైన నీ కిదె మ్రొక్కెదన్. 305**

**ప్రతి :** జనన= సృష్టి; వృద్ధి= స్థితి; వినాశ= లయములకు; హేతుకసంగతిన్= కారణాలతో కూడి; కల= ఉన్న; ఏను= నేను; నీవును= శ్రీహరివైన నీవును; హరుండున్= ఈశ్వరుదును; త్రిశాఖలు+ఐ= మూడు కొమ్మలై; మనువుల్= పదునాలుగురు మనువులు; మరీచిముఖ+అమరుల్= మరీచి మొదలైన దేవతలు; తనరన్= ఒప్పునట్లుగా; అందున్= ఆ వృక్షానికి; ఉపశాఖలు+ఐ= చిరుకొమ్మలై; భవత్+ఆత్మ= నీ ఆత్మ; దీనికిన్= ఈ చెట్టునకు; మూలము+ఐ= మొదలై; అనయమున్= ఎల్లపుడు; భువనద్రుమ+ఆకృతివి+ఐన= విశ్వవృక్షరూపంలో ఉన్న; నీకున్= నీకు; ఇదె+మ్రొక్కెదన్= ఇదిగో నమస్కరించుచున్నాను.

**తా :** శ్రీహరీ! విశ్వమనే మహావృక్షానికి నేను, నీవు, శివుడు మూడు ప్రధానమైన కొమ్మలు. పదునలుగురు మనువులు, మరీచి మొదలైన దేవతలు దానికి చిరుకొమ్మలు. నీ ఆత్మయే దానికి మూలం. ఈ విధంగా జగద్వృక్షాకృతిని ధరించిన నీకు ఇదే నా నమస్కారం.

**మ. పురుషాధీశ! భవత్పదాబ్జయుగళీ పూజాదికర్మక్రియా**
**పరతం జెందని మూఢచిత్తునిఁ బశుప్రాయున్ మనుష్యాధమున్**
**జరయున్ నాశము నొందఁజేయు నతిదక్షంబైన కాలంబు; త**
**ద్గురు కాలాత్ముఁడవైన నీకు మది సంతోషంబునన్ మ్రొక్కెదన్. 306**

**ప్రతి :** పురుష+అధీశ!= పురుషోత్తముడవైన శ్రీహరీ!; భవత్= నీయొక్క; పద+అబ్జయుగళీ= పాదపద్మాల జంటనుగూర్చిన; పూజా+ఆది= అర్చన మొదలైన; కర్మక్రియాపరతన్= కార్యకలాపములయందు ఆసక్తిని; చెందని= పొందని; మూఢచిత్తునిన్= మూర్ఖుని; పశుప్రాయున్= పశువులా ప్రవర్తించేవానిని; మనుష్య+అధమున్= అధముడైన మనుజుని; అతిదక్షంబు+ఐన కాలంబు= మిక్కిలి సమర్థత కల కాలం; జరయున్= వార్ధక్యాన్ని; నాశమున్= నాశనాన్ని; ఒందన్+చేయున్= పొందేలా చేస్తుంది; తద్+గురుకాలాత్ముఁడవు+ఐన= అటువంటి గొప్పదైన కాలమే ఆత్మగా కల; నీకున్= నీకు; మదిన్= చిత్తములో; సంతోషంబునన్= ఆనందంతో; మ్రొక్కెదన్= నమస్కరించెదను.

**తా :** పురుషోత్తమా! ఎవరైతే నీ పాదాలను సేవించుటలో ఆసక్తిని కనబరచరో అటువంటి మూఢులు జంతుసమానులు. మనుష్యులలో అధములు. తిరుగులేని కాలం వారిని ముదుసలితనంతోను, మరణంతోను నశింపజేస్తుంది. అటువంటి కాలమే స్వరూపంగా కల నీకు ఆనందంగా మనస్సులో నమస్కరిస్తాను.

**సీ. సర్వేశ! కల్పాంతసంస్థితమగు జలజాతమం దేను సంజనన మంది**
**భవదీయ సుస్వరూపముఁ జూడ నర్థించి బహువత్సరములు దపంబు సేసి**
**క్రతుకర్మములు పెక్కు గావించియును నినుఁ బొడగానఁగా లేక బుద్ధి భీతిఁ**
**బొందిన నాకు నిప్పుడును నిర్హేతుక కరుణచే నఖిలలోకైకవంద్య**

**తే. మాన సతత ప్రసన్న కోమల ముఖాబ్జ, కలిత భవదీయ దివ్యమంగళ విలాస**
**మూర్తి దర్శింపఁ గలిగె భక్తార్తిహరణ, కరణ! తుభ్యం నమో విశ్వభరణ! దేవ! 307**

**ప్రతి :** సర్వేశ!= పరమేశ్వరుడా!; కల్ప+అంతసంస్థితము+అగు= ప్రళయకాలమందుకూడ నిలిచెడి; జలజాతమందున్= పద్మమునందు; ఏను= నేను; సంజననము+అంది= జన్మించి; భవదీయ సుస్వరూపమున్= నీ గొప్పరూపాన్ని; చూడన్+అర్థించి= చూడగోరి; బహువత్సరములు= ఎన్నో ఏండ్లు; తపంబు+చేసి= తపస్సు చేసి; క్రతుకర్మములు= యజ్ఞయాగాది కర్మలను; పెక్కు+కావించియును= ఎన్నో చేసియును; నినున్= సర్వేశ్వరుడవైన నిన్ను; పొడగానఁగాన్+లేక= దర్శింపలేక; బుద్ధిన్+భీతిన్= బుద్ధియందు భయాన్ని; పొందిన నాకున్= పొందిన నాకు; ఇప్పుడును= ఈ సమయంలో; నిర్హేతుక కరుణచేన్= అవ్యాజమైన నీ దయవలన; అఖిల= సమస్తమైన; లోక+ఏక, వంద్యమాన= లోకములచేత ప్రధానంగా స్తుతింపదగిన; సతతప్రసన్న= ఎల్లపుడూ ప్రసన్నంగా ఉండే; కోమల= సుకుమారమైన; ముఖ+అబ్జకలిత= తామరవంటి మోముతో కూడిన; భవదీయ= నీయొక్క; దివ్యమంగళ= పవిత్రతతో శుభంకరమైన; విలాసమూర్తిన్= విలాసముగా కనబడే శరీరాకృతిని; దర్శింపన్+కలిగెన్= సందర్శించే అవకాశం కలిగింది; భక్త+ఆర్తి హరణకరణ!= భక్తుల కష్టములను పోగొట్టేవాడా!; విశ్వభరణ!= ప్రపంచభారమును మోయువాడా!; దేవ!= భగవానుడా!; తుభ్యం నమః= నీ కొరకు నమస్కారము.

**తా :** సర్వేశ్వరుడా! ప్రళయకాలంలో కూడా చెక్కు చెదరక నిలిచే పద్మంలో జన్మించిన నేను నా జన్మకు కారకుడవైన నిన్ను దర్శించాలని ఎన్నో ఏళ్లు తపస్సు చేశాను. యజ్ఞాలూ, యాగాలూ చేశాను. అయినా నిన్ను దర్శించలేక భయపడిన నేను బుద్ధితో ఆలోచించి హృదయపద్మంలోకి దృష్టి సారించాను. అక్కడ అవ్యాజమైన దయతో నాకు నీ దర్శనాన్ని అనుగ్రహించావు. ప్రసన్నమైన, సుకుమారమైన మోముతామరతో కూడిన నీ దివ్యమంగళ విగ్రహాన్ని దర్శించగలిగాను. భక్తుల ఆర్తిని పోగొట్టే దేవా! విశ్వంభరుడా! నీకు నమస్కారం.

**సీ. అమర తిర్యఙ్మనుష్యాది చేతనయోను లందు నాత్మేచ్ఛచేఁ జెందినట్టి**
**కమనీయశుభమూర్తి గలవాఁడవై ధర్మసేతువనంగఁ బ్రఖ్యాతి నొంది**
**విషయసుఖంబుల విడిచి సంతత నిజానందానుభవసమున్నతిఁదనర్తు;**
**వది గాన పురుషోత్తమాఖ్యఁజెన్నొందుదు వట్టి ని న్నెప్పుడు నభినుతింతు;**

**తే. నర్థి భవదీయపాదంబు లాశ్రయింతు; మహితభక్తిని నీకు నమస్కరింతు;**
**భక్తజనపోషపరితోష! పరమపురుష! ప్రవిమలాకార! సంసారభయవిదూర! 308**

**ప్రతి :** భక్తజనపోష పరితోష!= భక్తజనులను పోషించుటలో సంతోషపడువాడా; పరమపురుష!= పరమపురుషుడా!; ప్రవిమలాకార!= మంగళస్వరూపుడా!; సంసారభయవిదూర!= సంసార భయాన్ని పోగొట్టువాడా!; అమరన్= తగినట్లుగా; తిర్యక్= పశుపక్ష్యాదులు; మనుష్య+ఆది= మానవులు మొదలైన; చేతనయోనులందున్= జీవకోటి గర్భములందు; ఆత్మ+ఇచ్ఛచేన్= నీ సంకల్పంతోనే; చెందినట్టి= జన్మించినట్టి; కమనీయ శుభమూర్తి= దివ్యమంగళాకారము; కలవాఁడవై= కలిగినవాడవై; ధర్మసేతువు+అనంగన్= ధర్మానికి వంతెనవని; ప్రఖ్యాతిన్+ఒంది= ప్రశస్తిని ఆర్జించి; విషయసుఖంబులన్= ఇంద్రియ సుఖాలను; విడిచి= పరిత్యజించి; సంతత= ఎల్లకాలం; నిజ+ఆనంద= సత్యమైన ఆనందముయొక్క; అనుభవసమున్నతిన్= అనుభవించుటలోని ఔన్నత్యముతో; తనర్తువు= ప్రవర్తించెదవు; అదిగాన= అందువలన; పురుషోత్తమ+ఆఖ్యన్= పురుషోత్తముడనే పేరుతో; చెన్ను+ఒందుదువు= ప్రకాశించెదవు; అట్టి నిన్నున్= అటువంటి నిన్ను; ఎప్పుడున్= ఎల్లవేళల; అభినుతింతున్= కొనియాడెదను; అర్థిన్= కోరికతో; భవదీయ పాదంబులు= నీ పాదాలను; ఆశ్రయింతున్= ఆశ్రయిస్తాను; మహితభక్తిని= గొప్ప భక్తితో; నీకున్= నీకు; నమస్కరింతున్= నమస్కరిస్తాను.

**తా :** శ్రీహరీ! నీవు భక్తులను పోషించి ఆనందిస్తావు. పురుషోత్తముడవు. దివ్యమంగళాకారుడవు. సంసారభయాన్ని పోగొట్టేవాడవు. పశువులు, పక్షులు, మనుష్యులు అని లేకుండా స్వీయసంకల్పంతో ఏ రూపాన్నైనా ధరిస్తావు. దివ్యమంగళాకారుడవై ధర్మానికి వంతెనగా ప్రశస్తిని పొందావు. ఇంద్రియలోలుడవుకాక శాశ్వతానందానుభవంతో ఉంటూ పురుషోత్తముడనే పేరు తెచ్చుకొన్నావు. అటువంటి నిన్ను కొనియాడుతుంటాను. కోరికతో నీ పాదాలను ఆశ్రయిస్తాను. పూర్ణభక్తితో నీకు నమస్కరిస్తాను.

**సీ. తలకొని పంచభూతప్రవర్తక మైన భూరిమాయాగుణస్ఫురణఁజిక్కు**
**వడక, లోకంబులు భవదీయ జఠరంబులో నిల్పి ఘనసమాలోలచటుల**
**సర్వంకషోర్మిభీషణవార్ధి నడుమను ఫణిరాజభోగతల్పంబునందు**
**యోగనిద్రారతి నుండంగ నొక కొంత కాలంబు సనఁగ మేల్కనిన వేళ**

**తే. నలఘుభవదీయ నాభితోయజమువలన, గడఁగి ముల్లోకములు సోపకరణములుగఁ**
**బుట్టఁజేసితి వతులవిభూతి మెఱసి, పుండరీకాక్ష! సంతతభువనరక్ష! 309**

**ప్రతి :** పుండరీక+అక్ష!= తెల్లదామరలవంటి కన్నులు కలవాడా!; పంచభూతప్రవర్తకము+ఐన= పంచభూతాలతో ఒప్పుచున్న; భూరిమాయాగుణ స్ఫురణన్= గొప్పదైన మాయా ప్రభావానికి; చిక్కు+పడక= లోనుగాకుండ; లోకంబులు= లోకాలను; భవదీయ జఠరంబులో నిల్పి= నీ గర్భంలో దాచి; ఘన= ఎక్కువగా; సమాలోల= చలించుచున్న; చటుల= వేగముగా; సర్వంకష+ఊర్మి= ఒడ్డును ఒరసికొనే తరంగాలతో; భీషణ= భయంకరమైన; వార్ధినడుమను= సముద్రమధ్యంలో; ఫణిరాజభోగతల్పంబునందున్= ఆదిశేషుని పడగలశయ్యపై; యోగనిద్రారతిన్+ఉండంగన్= యోగనిద్రాసక్తుడవై ఉండగా; ఒక కొంతకాలంబు చనఁగన్= కొంతకాలం గడువగా; మేల్కనిన+వేళన్= మేలుకొన్నపుడు; అతుల విభూతిన్ మెఱసి= మహావైభవంతో ప్రకాశిస్తూ; అలఘు= గొప్పదైన; భవదీయ= నీయొక్క; నాభితోయజమువలనన్= బొడ్డు తామరనుండి;

కడఁగి= పూని; ముల్లోకములు= జగత్ త్రయాన్ని; స+ఉపకరణములుగన్= జీవసాధనములతోపాటుగా; పుట్టన్+చేసితివి= సృష్టించావు.

**తా :** తెల్లదామరలవంటి కన్నులు కల శ్రీహరీ! పంచభూతాలతో కూడిన ఈ ప్రపంచాన్ని మాయకు లోనుకానీకుండా నీ గర్భంలో దాచుకొని భయంకరమైన తరంగాలతో కూడిన సముద్రమధ్యంలో శేషశయ్యపై యోగనిద్రలోనికి జారుకొని; కొంతకాలం తరువాత మహావైభవంతో ప్రకాశిస్తూ అసాధారణమైన నీ నాభికమలంనుండి ముల్లోకాలను, అందులోని జీవులు బ్రతికేందుకు కావలసిన ప్రకృతి సాధనాలతోపాటుగా తిరిగి సృష్టిస్తావు.

**విశే :** ఆషాఢ శుద్ధ ఏకాదశినాడు శ్రీమహావిష్ణువు యోగనిద్రలోనికి జారుకొంటాడు. తిరిగి కార్తిక శుద్ధ ఏకాదశినాడు మేలుకొంటాడు. నిద్రలోనికి వెళ్లే ఏకాదశిని 'శయన ఏకాదశి' అని, మేల్కొనే ఏకాదశిని 'ఉత్థాన ఏకాదశి' అని వ్యవహరిస్తారు. ఈ నాలుగు మాసాలకాలం సన్న్యాసాశ్రమవాసులు చాతుర్మాస్యదీక్షలో ఉంటారు.

**క. నిగమస్తుత! లక్ష్మీపతి!, జగదంతర్యామి వగుచు సర్గము నెల్లం**
**దగు భవదైశ్వర్యంబున, నగణితసౌఖ్యానుభవము నందింతు గదే! 310**

**ప్రతి :** నిగమస్తుత!= వేదములచే కొనియాడబడేవాడా!; లక్ష్మీపతి= శ్రీనాథా!; జగత్+అంతర్యామివి+అగుచున్= ప్రపంచమంతటను ఉన్నవాడవై; సర్గమునెల్లన్= సృష్టినంతటినీ; తగు భవత్+ఐశ్వర్యంబునన్= తగిన నీ సంపదలతో; అగణిత సౌఖ్య+అనుభవమున్= సాటిలేని సుఖాల అనుభవాన్ని; అందింతు+కదే= అందిస్తావు కదా!

**తా :** వేదాలచే కొనియాడబడే శ్రీపతీ! సర్వాంతర్యామివై తగిన విధంగా నీ ప్రభుత్వాన్ని చూపుతూ అన్ని జీవులకూ సాటిలేని సుఖాల అనుభవాలను అందిస్తావు కదా!

**సీ. జలజాక్ష! యెట్టి విజ్ఞానబలంబునఁ గల్పింతు వఖిలలోకంబు లోలి**
**నతజన ప్రియుఁడవు నాకట్టి సుజ్ఞాన మర్థిమైఁ గృపసేయుమయ్య వరద!**
**సృష్టినిర్మాణేచ్ఛఁ జెంది నా చిత్తంబు దత్కర్మకౌశలిఁ దగిలియుండి**
**యును గర్మవైషమ్యమును బొందు కతమున దురితంబుఁ బొరయక తొలఁగునట్టి**

**తే. వెరవు నా కెట్లు గలుగు న వ్విధముఁ దలఁచి, కర్మవర్తను నను భవత్కరుణ మెఱసి**
**తగఁ గృతార్థునిఁ జేయవే నిగమవినుత! సత్కృపామూర్తి! యో దేవచక్రవర్తి! 311**

**ప్రతి :** జలజ+అక్ష!= పద్మములవంటి కన్నులు కలవాడా!; నిగమ వినుత!= వేదాలచే కొనియాడబడేవాడా!; సత్కృపామూర్తి!= మిక్కిలి దయగలవాడా!; ఓ దేవచక్రవర్తి!= ఓ దేవతా సార్వభౌమా!; వరద!= వరములను ఇచ్చువాడా!; ఎట్టి విజ్ఞాన బలంబునన్= ఎటువంటి విశేషజ్ఞాన బలంతో; ఓలిన్= క్రమముగా; అఖిలలోకంబులు= లోకాలన్నిటిని; కల్పింతువు= సృష్టిస్తుంటావు; నతజనప్రియుఁడవు= నమస్కరించే జనులకు ప్రీతిపాత్రుడవు గనుక; అర్థిమైన్= ప్రేమతో; నాకున్+అట్టి సుజ్ఞానము= బ్రహ్మనైన నాకును అట్టి విశేషజ్ఞానాన్ని; కృప+చేయుము+అయ్య= అనుగ్రహించవయ్య; నా చిత్తంబు= నా మనస్సు; సృష్టినిర్మాణ ఇచ్ఛన్+చెంది= జగన్నిర్మాణమునందు కోరిక కలిగి; తత్కర్మ కౌశలిన్= ఆ క్రియను సాధించే నేర్పరితనంలో; తగిలియుండియును= మనసును లగ్నంచేసినా; కర్మవైషమ్యమును= పనులలో ఎక్కువ తక్కువలు; పొందు

కతమునన్= ఏర్పడుటచే; దురితంబున్= పాపాన్ని; పొరయక= పొందకుండా; తొలఁగునట్టి= తప్పించుకొనే; వెరవు= ఉపాయము; నాకున్+ఎట్లు కలుగున్= నాకు ఏ విధంగా ఏర్పడుతుంది; ఆ+విధమున్+తలఁచి= ఆ విషయమై ఆలోచించి; కర్మవర్తనున్+ననున్= కర్మపరతంత్రుడనైన నన్ను; భవత్+కరుణన్+మెఱసి= నీ దయను చూపించి; తగన్= తగినవిధంగా; కృతార్థునిన్+చేయవే= ప్రయోజనసిద్ధి కలిగినవానినిగా చేయుము.

**తా :** తామరలవంటి కన్నులు కలిగి, వేదాలచే పొగడబడుతూ, మిక్కిలి దయగలవాడవై, దేవతలకు చక్రవర్తివై, వరదుడవైన శ్రీహరీ! ఎటువంటి విశేష జ్ఞానబలంతో నీవు ఈ లోకాలను సృష్టిస్తున్నావో అటువంటి జ్ఞానాన్ని నాకు ప్రసాదించు. నేను సృష్టికార్యక్రమం చేసేందుకు ఉత్సాహపడుతున్నాను. అయితే జగన్నిర్మాణ విషయంలో చేసే పనులలో ఏవో ఎక్కువ తక్కువలు ఉంటాయి. దానివలన ఎటువంటి పాపమూ నన్నంటకుండా ఉండే ఉపాయాన్ని కూడా నాకు అనుగ్రహించాలి. ఆ విధంగా సంకల్పసిద్ధిని నాకు ప్రసాదించు.

**చ. భవదుదరప్రభూతమగు పద్మమునందు వసించి యున్న నే**
**నవిరళతావకీనకలితాంశమునం దనరార విశ్వముం**
**దవిలి రచించుచున్ బహువిధంబులఁబల్కెడి వేదజాలముల్**
**శివతరమై ఫలింపఁగృపసేయుము భక్తఫలప్రదాయకా! 312**

**ప్రతి :** భక్తఫలప్రదాయకా!= భక్తులు కోరిన ఫలాలను అనుగ్రహించేవాడా!; భవత్+ఉదర ప్రభూతము+అగు= నీయొక్క గర్భమునుండి పుట్టినదైన; పద్మమునందున్= కమలంలో; వసించి+ఉన్న= నివసిస్తున్న; నేన్= (బ్రహ్మనైన) నేను; అవిరళ= ఎడబాటులేని; తావకీన= నీదైన; కలిత= కలిసియున్న; అంశమునన్= అంశతో; తనరారన్= ఒప్పునట్లుగా; విశ్వమున్= జగత్తును; తవిలి= పూనుకొని; రచించుచున్= నిర్మిస్తూ; బహువిధంబులన్= అనేక ప్రకారములుగా; పల్కెడి= ఉచ్చరించే; వేదజాలముల్= వేదసముదాయాలు; శివతరమై= మిక్కిలి మంగళకరములై; ఫలింపన్= సిద్ధి పొందేటట్లుగా; కృప+చేయుము= దయ చూపుము.

**తా :** భక్తుల కోరికలను తీర్చే స్వామీ! నీ గర్భంనుండి కమలం జనించింది. అందులో ఉంటున్న నేను నీ అంశతో ఒప్పే జగత్తును పూనికతో నిర్మించాలనుకొంటున్నాను. అలా నిర్మించే సమయంలో నేను బహువిధాలుగా చేసే వేదనాదాలు మంగళకరాలై ఫలించేవిధంగా నన్ను అనుగ్రహించు.

**చ. అని యనుకంప దోఁప వినయంబునఁజాఁగిలి మ్రొక్కి చారు లో**
**చన సరసీరుహుండగుచు సర్వజగత్పరికల్పనారతిం**
**దనరిన నన్ను బ్రోచుటకుఁదా నిటు సన్నిధియైన యీశ్వరుం**
**డనయము నాదు దుఃఖము దయామతిఁబాపెడు నంచు నమ్రుఁడై. 313**

**ప్రతి :** అని= ఈ విధంగా; అనుకంప+తోఁపన్= కరుణ ఉట్టిపడునట్లుగా; వినయంబునన్= విధేయతతో; చాఁగిలిమ్రొక్కి= సాష్టాంగముగా నమస్కరించి; చారు= అందమైన; లోచనసరసీరుహుండు= నేత్రపద్మాలు కలవాడు; అగుచున్= అవుతూ; సర్వ= సమస్తమైన; జగత్= విశ్వముయొక్క; పరికల్పనారతిన్= నిర్మాణమునందలి ఆసక్తితో; తనరిన= ఒప్పిన; నన్నున్= (బ్రహ్మనైన) నన్ను; బ్రోచుటకున్= కాపాడుటకు; ఇటు సన్నిధియైన= ఈ విధంగా సాక్షాత్కరించిన; తాన్ ఈశ్వరుండు=

శ్రీమహావిష్ణువు; నాదు దుఃఖము= నా దుఃఖాన్ని; దయామతిన్= కృపతో కూడిన బుద్ధి కలవాడై; అనయము= ఎల్లప్పుడు; పాపెడున్+అంచున్= పోగొట్టుగాక అని; నమ్రుఁడై= వినయవంతుడై...

**తా :** జగన్నిర్మాణం చెయ్యాలన్న ఆసక్తితో ఉన్న నన్ను కాపాడటానికి, పద్మాలవంటి అందమైన కన్నులతో ప్రత్యక్షమైన శ్రీమహావిష్ణువు దయతో ఎల్లప్పుడు నా దుఃఖాన్ని పోగొట్టుగాక అని బ్రహ్మ కరుణ ఉట్టిపడేటట్లుగా, సవినయంగా సాగిలపడి నమస్కారం చేశాడు.

**క. వనరుహసంజాతుఁడు నె, మ్మనమున హర్షించె ననుచు మైత్రేయ మహా**
**ముని ఘనుఁడగు విదురునకున్, వినయంబున నెఱుఁగ జెప్పి వెండియుఁ బలికెన్. 314**

**ప్రతి :** వనరుహసంజాతుఁడు= పద్మసంభవుడైన బ్రహ్మ; నెఱ+మనమునన్= తన నిండు మనస్సులో; హర్షించెన్= ఆనందించెను; అనుచున్= అంటూ; మైత్రేయమహాముని= మైత్రేయమహర్షి; ఘనుఁడు+అగు= శ్రేష్ఠుడైన; విదురునకున్= విదురునికి; వినయంబునన్= నమ్రతతో; ఎఱుఁగన్+చెప్పి= స్పష్టంగా చెప్పి; వెండియున్= మరియు; పలికెన్= ఈ విధంగా పలికెను.

**తా :** శ్రీహరికి వినయంతో నమస్కరించి బ్రహ్మ ఎంతో ఆనందించాడని మైత్రేయ మహర్షి విదురునికి స్పష్టంగా, వినయంగా వివరించి, ఇంకా ఇలా చెపుతున్నాడు.

**మ. వనజాతప్రభవుండు కేవలతపోవ్యాసంగుఁడై పద్మ లో**
**చను గోవిందు ననంతు నాఢ్యుఁ దన వాక్ఛక్తిన్ నుతింపన్ సుధా**
**శనవంద్యుండు ప్రసన్నుఁడై నిఖిలవిశ్వస్థాపనాలోకనం**
**బునఁ జూచెన్ విలయప్రభూత బహువాఃపూరంబులన్ వ్రేల్మిడిన్. 315**

**ప్రతి :** వనజాత ప్రభవుండు= పద్మసంభవుడైన బ్రహ్మ; కేవల తపః+వ్యాసంగుఁడై= కేవలం తపస్సునందే ఆసక్తి కలవాడై; పద్మలోచనున్= పద్మములవంటి కన్నులు కలవాడు; గోవిందున్= గోపాలకుడును; అనంతున్= అంతము లేనివాడును; ఆఢ్యున్= గొప్పవాడును (ఐన శ్రీహరిని); తన= తనయొక్క (బ్రహ్మయొక్క); వాక్+శక్తిన్= మాటల పాటవంతో; నుతింపన్= కొనియాడగా; సుధా+అశన వంద్యుఁడు= అమృతాన్ని ఆహారంగా స్వీకరించే దేవతలచే స్తుతింపబడేవాడైన హరి; ప్రసన్నుఁడు+ఐ= అనుగ్రహము కలవాడై; నిఖిల= సమస్తమైన; విశ్వ= జగత్తుయొక్క; స్థాపన= నిర్మాణమునకు సంబంధించిన; ఆలోకనంబునన్= దృష్టితో; విలయ= ప్రళయంలో; ప్రభూత= పుట్టిన; బహువాః+పూరంబులన్= మహాజల ప్రవాహాన్ని; వ్రేల్మిడిన్= త్రుటిలో; చూచెన్= చూచాడు.

**తా :** పద్మసంభవుడైన బ్రహ్మ కేవలం తపస్సునందే ఆసక్తి కలవాడై వారిజాక్షుడు, గోపాలుడు, అనంతుడు, గొప్పవాడు అయిన శ్రీహరిని తన మాటల పాటవంతో స్తుతించాడు. దేవతాస్తుతులందుకొనే హరి అప్పుడు అనుగ్రహించి, సకల జగన్నిర్మాణ దృష్టితో మహాప్రళయహేతువైన జలరాశిని క్షణంలో చూచాడు.

**విశే :** గోవిందుడు అంటే ఆవులను కాచేవాడు అనే కాదు. గోశబ్దానికి వాక్కు అని కూడా అర్థం. ఆదివాక్కులైన వేదాలను రక్షించే శ్రీహరి అని అర్థం.

**తే. అట్లు వొడగని యార్తుఁడై నట్టి పద్మ, భవునివాంఛిత మాత్మఁదీర్పంగఁదలఁచి**
**యతని మోహనివారక మైనయట్టి, యమృతరసతుల్యమధురవాక్యముల ననియె. 316**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; పొడగని= చూచి; ఆర్తుఁడు+ఐనట్టి= పరితాపంతో ఉన్న; పద్మభవుని= బ్రహ్మయొక్క; వాంఛితము= కోరికను; తీర్పంగన్= తీర్చాలని; ఆత్మన్= మనసులో; తలఁచి= భావించి; అతని= బ్రహ్మయొక్క; మోహనివారకమైన+అట్టి= వ్యామోహాన్ని పోగొట్టే; అమృత, రస, తుల్య, మధుర, వాక్యములన్= అమృతరసంతో సమానమైన తీయని మాటలను; అనియెన్= పలికెను.

**తా :** అలా మహాజలరాశిని చూచి, ఆ తరువాత సృష్టి నిర్మాణం ఎలా చేయాలా అని పరితపిస్తున్న బ్రహ్మదేవుని కోర్కె తీర్చాలని భావించి, అతని మోహం పోయేవిధంగా అమృతంవంటి తియ్యని మాటలను పలికాడు శ్రీహరి.

**చ తలకొని నీ యొనర్చు పని తప్పి మదిందలపోయు దుఃఖముం**
**దలఁగుము; నాదులీలకుఁబ్రధానగుణంబగు సృష్టికల్పనం**
**బలవడఁజేయు బుద్ధి హృదయంబునఁజొన్పి తపస్సమాధి ని**
**ష్ఠల నుతిభక్తులన్ ననుఁబ్రసన్నునిఁజేయుము చెందుఁగోరికల్. 317**

**ప్రతి :** తలకొని= పూనుకొని; నీ+ఒనర్చు= నీవు చేసే; పని తప్పి= పనిని విడిచిపెట్టి; మదిన్+తలపోయు= మనసులో ఆలోచించే; దుఃఖమున్= విచారాన్ని; తలఁగుము= విడిచిపెట్టుము; నాదు లీలకున్= నా విలాసానికి; ప్రధానగుణంబు+ అగు= ముఖ్యగుణమైన; సృష్టికల్పనంబు= జగన్నిర్మాణము; అలవడన్+చేయు= అలవాటు చేయు; బుద్ధిన్= ఆలోచనను; హృదయంబునన్= చిత్తమునందు; చొన్పి= ప్రవేశపెట్టి; తపస్+సమాధి నిష్ఠలన్= తపస్సుతోను, సమాధితోను, నిష్ఠతోను; నుతి భక్తులన్= స్తుతులతోను, భక్తితోను; ననున్= నన్ను (శ్రీహరిని); ప్రసన్నునిన్+చేయుము= అనుగ్రహము కలవానినిగా చేసుకొమ్ము; కోరికల్= నీ కోరికలు; చెందున్= నెరవేరుతాయి.

**తా :** పద్మసంభవా! నీవు చేయాల్సిన పని మాని విచారంలో మునిగిపోకు. నా లీలలో ప్రధానమైనది జగన్నిర్మాణం. అందుకోసం నీవు సృష్టి చేయటానికి సంబంధించిన ఆలోచనను హృదయంలో స్థిరంగా నిలుపుకో. నీ తపస్సుతో, సమాధితో, నిష్ఠతో, సంకీర్తనంతో, భక్తితో నన్ను ప్రసన్నుని చేసుకో. నీ జగన్నిర్మాణవాంఛ నెరవేరుతుంది.

**క. నీ వొనరించు తపో వి, ద్యావిభవవిలోకనీయమగు నీ సృష్టిం**
**గావింపుము లోకంబుల, లోవెలిఁగెడి నన్నుఁగందు లోకస్తుత్యా! 318**

**ప్రతి :** లోకస్తుత్యా!= లోకులందరిచే కొనియాడబడతగిన బ్రహ్మా!; నీవు+ఒనరించు= నీవుచేసే; తపః= తపస్సుచేతను; విద్యావిభవ= విద్యావైభవముచేతను; విలోకనీయము+అగు= దర్శింపతగిన; నీ సృష్టిన్= నీ జగన్నిర్మాణకార్యక్రమాన్ని; కావింపుము= చేయుము; లోకంబులలోన్= లోకములందు; వెలిఁగెడి= ప్రకాశించే; నన్నున్= శ్రీహరినైన నన్ను; కందువు= దర్శించెదవు.

**తా :** లోకులందరిచే కొనియాడదగిన పద్మసంభవా! తపస్సుతోను, విద్యావైభవంతోను మాత్రమే చేయగలిగిన జగన్నిర్మాణాన్ని ప్రారంభించు. నీవు సృష్టించిన అన్ని లోకాలలోను నన్ను దర్శింపగలవు.

**క. నాలోని జీవకోటులు, వాలాయము నీకుఁ గానవచ్చు నిపుడు, నీ**
**వాలోకింపుము దారు వి, లోలహుతాశనుని కరణి లోకస్తుత్యా! 319**

**ప్రతి :** లోకస్తుత్యా!= లోకులచే కొనియాడదగిన బ్రహ్మదేవా!; నాలోని జీవకోటులు= నాలో ఉన్న ప్రాణిసమూహాలన్నీ; వాలాయము= తప్పనిసరిగా; నీకున్+కానవచ్చున్= నీకు గోచరిస్తాయి; ఇపుడు= ఈ సమయంలో; దారు, విలోల, హుతాశనుని కరణిన్= కొయ్యలో దాగియున్న అగ్నివలె; ఆలోకింపుము= వీక్షించుము.

**తా :** లోకస్తుత్యుడవైన బ్రహ్మదేవా! నాలో బీజరూపంగా ఉండే జీవకోటులన్నిటినీ తప్పకుండ నీవు దర్శింపగలవు. కొయ్యలో దాగియున్న అగ్నివలె నాలో దాగియున్న జీవకోటిని ఇదిగో ఇప్పుడు వీక్షించు.

**సీ. నలు వొంద నఖిలజీవులయందుఁ గల నన్నుఁదెలిసి సేవింపుము నలినగర్భ!**
**భవదీయదోషముల్ వాయును భూతేంద్రియాశ్రయవిరహితమై విశుద్ధ**
**మైన జీవుని విమలాంతరాత్ముఁడనై నను నేకముగఁజూచు నరుఁడు మోక్ష**
**పదమార్గవర్తియై భాసిల్లు, బ్రహ్మాండ మందున వివిధకర్మానురూప**

**తే. పద్ధతులఁ జేసి పెక్కు రూపముల నొందు, జీవతతి రచియించు నీ చిత్త మెపుడు**
**మత్పదాంబుజయుగళంబు మరగియున్న, కతన రాజసగుణమునఁగలుగ దఘము. 320**

**ప్రతి :** నలినగర్భ!= పద్మసంభవా!; నలువు+ఒందన్= సామర్థ్యము ఉట్టిపడునట్లుగా; అఖిలజీవుల+అందున్= సమస్త జీవకోటియందును; కల= ఉన్నటువంటి; నన్నున్= నన్ను (శ్రీమహావిష్ణువును); తెలిసి+సేవింపుము= గుర్తించి సేవించు; భవదీయ దోషముల్= నీ దోషాలు; పాయును= పోవును; భూత+ఇంద్రియ= ప్రాణికోటి ఇంద్రియాల; ఆశ్రయవిరహితమై= ఆశ్రయము లేనిదై; విశుద్ధమైన= పవిత్రమైన; జీవునిన్= జీవాత్మను; విమల+అంతరాత్ముఁడను+ఐన= స్వచ్ఛమైన అంతరాత్మ కలవాడనైన; ననున్= నన్ను (పరమాత్మ స్వరూపుని); ఏకముగన్+చూచు= ఒకేరీతిగా దర్శించే; నరుఁడు= మానవుడు; మోక్షపదమార్గవర్తియై= మోక్షపద మార్గంలో ఉండేవాడై; భాసిల్లున్= ప్రకాశించును; బ్రహ్మాండమందున= జగత్తులో; వివిధ కర్మ= అనేకములైన కర్మలకు; అనురూప= అనుగుణమైన; పద్ధతులన్+చేసి= విధానాలవలన; పెక్కు రూపములన్= ఎన్నో రూపాలను; ఒందు= పొందే; జీవతతిన్= ప్రాణికోటిని; రచియించు= సృష్టించే; నీ చిత్తము= నీ మనస్సు; ఎపుడున్= ఎల్లవేళల; మత్+పద+అంబుజ= నా పాదపద్మముల; యుగళంబున్= జంటను; మరగియున్న కతనన్= తగులుకొనియున్న కారణముచేత (సేవించుచున్నందున); రాజసగుణమునన్= రజోగుణ సంసర్గమువలన; అఘము+కలుగదు= పాపమంటదు.

**తా :** పద్మసంభవా! ప్రాణికోటి సమస్తంలోను నేనుంటాను. ఆ విషయం గుర్తెరిగి నన్ను సేవించు. అందువలన సృష్టికార్యంలో అనుకోకుండగా ఏర్పడే దోషాలు పోతాయి. ఇంద్రియ వశమై ఉన్న శరీరాలలో ఉన్నా పరిశుద్ధంగానే ఉండే జీవాత్మనూ, స్వచ్ఛమైన అంతరాత్మ గల నన్ను (పరమాత్మను) ఒకే రీతిగా చూచేవాడు మోక్షాన్ని పొందుతాడు. ఈ బ్రహ్మాండంలో ప్రాణులుచేసే కర్మలు పెక్కు గతులుగా ఉంటాయి. వాటికి తగినట్లుగా రకరకాల శరీరాలతో ప్రాణులు పుడుతుంటాయి. ఆ విధంగా కర్మానుగుణంగా నీవు సృష్టిస్తున్నపుడు నా పాదపద్మాలయందే దృష్టిని నిలుపుతావు కనుక రజోగుణసంబంధమయిన పాపము నిన్నంటదు.

**క. వినుమదియుఁగాక ప్రాణుల, కనయము నెఱుఁగంగరాని యనఘుఁడఁ దేజో**
**ధనుఁడఁబరేశుఁడ నీ చే, తను గానంబడితి నిదె పితామహ! కంటే. 321**

**ప్రతి :** పితామహ!= బ్రహ్మా!; వినుము= నేను చెప్పేది విను; అదియున్+కాక= ఇంతకుమున్ను నే చెప్పినది మాత్రమే కాక; ప్రాణులకున్= జీవులకు; అనయమున్= ఎప్పుడుకూడ; ఎఱుఁగంగన్+రాని= గ్రహింపశక్యము కాని; అనఘుఁడన్= పాపరహితుడను; తేజస్+ధనుఁడన్= తేజస్సంపద కలవాడిని (మిక్కిలి తేజోవంతుడను); పర+ఈశుఁడన్= సర్వేశ్వరుడను (అటువంటి నేను); నీ చేతను= నీకు; ఇదె= ఇదిగో; కానన్+పడితిన్= సాక్షాత్కరించాను; కంటే!= దర్శిస్తున్నావు గదా!

**తా :** సృష్టికర్తవగుటచే లోకంలోని తండ్రులందరికీ తండ్రివైన పితామహా! ఇంకా చెపుతున్నాను విను. నేను జీవులకు అగోచరుడను. ఏ పాపమూ అంటనివాడను. మిక్కిలి తేజోవంతుడను. సర్వేశ్వరుడను. అటువంటి నేను నీకు సాక్షాత్కరించాను. దర్శిస్తున్నావు గదా!

**వ. మఱియు భూతేంద్రియ గుణాత్ముండనియు జగన్మయుండనియు నన్ను నీ చిత్తంబునందుఁ దలంపుము; తామరసనాళవివరపథంబు వెంటంజని జలంబులలోనం జూడంగోరినట్టి మదీయస్వరూపంబ 322**

**ప్రతి :** మఱియున్= అంతే కాకుండా; భూత= నేల, నీరు, నిప్పు, గాలి, నింగి అనే పంచభూతాలకు; ఇంద్రియ= జ్ఞానకర్మేంద్రియాలు పదింటికి; గుణ= సత్త్వరజస్తమోగుణాలు మూడింటికి; ఆత్ముండు+అనియున్= నేనే ఆత్మస్వరూపుడననియును; నన్నున్= (శ్రీహరినైన) నన్ను; నీ చిత్తంబునందున్= (బ్రహ్మవైన) నీ మనస్సునందు; తలంపుము= భావింపుము; తామరసనాళ= తామరతూడుయొక్క; వివరపథంబు+వెంటన్= రంధ్రమార్గముగుండా; చని= వెళ్లి; జలంబులలోనన్= నీళ్లలో; చూడన్+కోరినట్టి= దర్శించదలచిన; మదీయ స్వరూపంబు+అ= నా రూపాన్నే (ఇప్పుడు నీకు సాక్షాత్కరింపజేస్తున్నాను).

**తా :** అంతే కాదు. పంచభూతాలకు, పది ఇంద్రియాలకు, సత్త్వరజస్తమోగుణాలకు నేనే ఆత్మనని, విశ్వమయుడనని, నన్నుగూర్చి నీ మనస్సులో భావించు. ఏ రూపం చూడాలని ఆనాడు ఈ తామరపద్మం తూడుగుండా కిందికి వెళ్లి, అక్కడి నీళ్లల్లో వెదికావో (ఆ నా రూపాన్ని నీవిప్పుడు దర్శిస్తున్నావు).

**క. నీ కిప్పుడు గానంబడె, నాకులకును నురగపతి పినాకులకైనన్**
**వాకొనఁగం దలపోయను, రాకుండు మదీయరూపరమ్యత్వంబుల్. 323**

**ప్రతి :** నాకులకును= దేవతలకు; ఉరగపతి, పినాకులకైనన్= ఆదిశేషునికి, పరమశివునికి కూడా; వాకొనఁగన్= మాటలతో వర్ణించుటకు; తలపోయను= మనస్సులో భావించడానికి; రాకుండు= సాధ్యంకాని; మదీయ రూపరమ్యత్వంబుల్= నాయొక్క రూపు, దాని సొగసులు; నీకున్+ఇప్పుడు+కానన్+పడెన్= ఇప్పుడు నీకు ప్రత్యక్షమయ్యాయి.

**తా :** నా రూపరమ్యత్వం దేవతలకు గాని, వేయి తలలున్న ఆదిశేషునికి గాని, సర్వజ్ఞుడైన పరమేశ్వరునికి గాని మాటలకందనిది. మనస్సుకు తోచనిది. అటువంటి రూపాన్ని నీవిప్పుడు దర్శించావు.

**క. కావున మచ్చారిత్ర క, థావిలసితమైన సుమహితస్తవము జగ**
**త్పావనము విగతసంశయ, భావుఁడవై బుద్ధి నిలుపు పంకజజన్మా! 324**

**ప్రతి :** పంకజజన్మా!= పద్మమునుండి పుట్టినవాడా!; మత్+చారిత్ర= నా చరిత్ర; కథా= (దానికి సంబంధించిన) కథతో; విలసితమైన= ప్రకాశించిన; సుమహిత= కొనియాడదగిన; స్తవము= కీర్తనము; జగత్+పావనము= లోకాన్ని పవిత్రము చేయునది; విగత, సంశయభావుఁడవు+ఐ= తొలగిపోయిన సందేహభావాలు కలవాడవై; బుద్ధి నిలుపు= ఈ నా తత్త్వాన్ని బుద్ధియందు నిలుపుకో.

**తా :** పద్మసంభవా! నా చరిత్ర కథతో వెలుగొందే నీవు చేసిన గొప్ప స్తుతి పరమ పవిత్రమైనదై లోకాన్ని పవిత్రం చేస్తుంది. అన్ని సందేహాలనూ విడిచిపెట్టి ఈ స్తుతిని బుద్ధియందు జాగ్రత్తగా నిలుపుకో.

**క. అగుణుఁడ నై లీలార్థము, జగములఁగల్పింపఁదలఁచు చతురుని నన్నున్**
**సగుణునిఁగా నుతియించితి, తగ సంతసమయ్యె నాకుఁదామరసభవా! 325**

**ప్రతి :** తామరసభవా!= తామరనుండి జన్మించినవాడా!; అగుణుఁడనై= గుణాలకు అతీతుడనై; లీలా+అర్థము= వినోదంకోసం; జగములన్= లోకాలను; కల్పింపన్= సృష్టించేందుకు; తలఁచు= ఆలోచించే; చతురునిన్+నన్నున్= నైపుణ్యం గల నన్ను; సగుణునిన్+కా= గుణములతోకూడిన వానినిగా (సగుణ పరబ్రహ్మగా); తగన్= తగిన విధంగా; నుతియించితి= సంస్తుతి చేశావు; నాకున్ సంతసము+అయ్యెన్= నాకు ఆనందం కలిగింది.

**తా :** సరోజసంభవా! నేను గుణాతీతుడనై ఏదో వినోదం కొరకు లోకాలను నిర్మించేందుకు ఆలోచించే నైపుణ్యం కలవాడను. అటువంటి నన్ను సగుణపరబ్రహ్మగా తగిన విధంగా కీర్తించావు. నాకు చాల సంతోషం కలిగింది.

**క. ఈ మంజుస్తవరాజము, నీ మనమునఁ జింతఁ దక్కి నిలుపుము భక్తిన్**
**ధీమహిత! నీ మనంబునఁ, గామించిన కోర్కు లెల్లఁ గలుగుం జుమ్మీ. 326**

**ప్రతి :** ధీమహిత!= బుద్ధి విశేషంతో ప్రశస్తిని పొందేవాడా!; ఈ మంజుస్తవరాజమున్= ఈ మనోహరమైన స్తోత్రాన్ని; చింతన్+తక్కి= విచారాన్ని విడిచిపెట్టి; నీ మనమునన్= నీ చిత్తమునందు; భక్తిన్+నిలుపుము= భక్తితో పదిలపరచుకో; నీ మనంబునన్+కామించిన= నీ మనసులో కోరుకొన్న; కోర్కులు+ఎల్లన్= అన్ని కోరికలు; కలుగున్+చుమ్మీ= ఫలిస్తాయి సుమా!

**తా :** విశేషమైన బుద్ధికలవాడా! నీవు చేసిన ఈ మనోహరమహాస్తోత్రాన్ని చింతలన్నిటినీ పక్కన పెట్టి, భక్తితో హృదయంలో నిలుపుకో. దానివలన నీ మనస్సులో కోరుకొన్న కోరికలన్నీ తీరుతాయి సుమా.

**క. అనుదినమును త్రిజగత్పా, వనమగు నీ మంగళస్తవంబుఁబఠింపన్**
**విని నను జనులకు నేఁ బొడ, గనఁ బడుదు నవాప్తసకలకాముఁడ నగుచున్. 327**

**ప్రతి :** అనుదినమును= ప్రతిదినము; త్రిజగత్+పావనము+అగు= ముల్లోకాలను పవిత్రంచేసే; ఈ+మంగళస్తవంబున్= ఈ శుభస్తోత్రాన్ని; పఠింపన్= చదివినా; వినినను= ఆలకించినా; జనులకున్= మానవులకు; ఏన్= నేను (శ్రీమన్నారాయణుడు); అవాప్త= పొందింపబడిన; సకల కాముఁడన్+అగుచున్= సమస్తమైన కోరికలు కలవాడనవుతూ (అన్ని కోరికలూ తీర్చేవాడినై); పొడ+కనన్+పడుదున్= సాక్షాత్కరిస్తాను.

**తా :** ఈ త్రిభువనపావనమైన మంగళస్తోత్రాన్ని ఎవరైతే నిత్యం చదవడం కాని, ఆలకించడం కాని చేస్తారో, అటువంటి భక్తులకు కోరికలు తీరుస్తూ నేను దర్శనమిస్తాను.

**తే. వన తటాకోపనయన వివాహ దేవ భవన, నిర్మాణ భూమ్యాది వివిధ దాన**
**జప తపో వ్రత యోగ యజ్ఞముల ఫలము, మామక స్తవఫలము సమంబు గాదు. 328**

**ప్రతి :** వన= తోటలను నిర్మించుట; తటాక= చెరువులను తవ్వించుట; ఉపనయన= ఉపనయనము చేయించుట; వివాహ= పెండ్లి చేయించుట; దేవభవననిర్మాణ= దేవాలయములు కట్టించుట; భూమి+ఆది వివిధదాన= భూదానము మొ॥ అనేక దానములు చేయుట; జప= జపము చేయుట; తపస్= తపస్సు చేయుట; వ్రత= నోములు నోచుట; యోగ= అష్టాంగ యోగాభ్యాసము చేయుట; యజ్ఞముల= యజ్ఞములను చేయుటవంటివాటి వలన కలిగిన; ఫలము= ప్రయోజనము; మామక స్తవఫలము= నా ఈ స్తోత్రము చదువుట, వినుటద్వారా ఏర్పడిన ఫలముతో; సమంబు+కాదు= సమానము కాదు.

**తా :** గ్రామాలలో తోటలు నిర్మించినా, చెరువులు తవ్వించినా, పేద బ్రాహ్మణులకు వడుగు చేయించినా, పేదవారికి పెండ్లి జరిపించినా, దేవాలయాలు కట్టించినా, భూదానంవంటి వివిధ దానాలు చేసినా, జపం, తపస్సు, వ్రతం, యోగం, యాగం వంటివి చేసినా ఎటువంటి ఫలితం కలుగుతుందో అది నా స్తవం (బ్రహ్మకృత నారాయణస్తవం) వినుట, చదువుట వలన కలిగే ఫలానికి సమానం కాదు.

**క. జీవావలిఁగల్పించుచు, జీవావలిలోనఁదగ వసించుచుఁ బ్రియ వ**
**స్త్వావలిలోపలఁబ్రియ వ, స్త్వావలినై యుండు నన్ను ననిశముఁబ్రీతిన్. 329**

**ప్రతి :** జీవ+ఆవలిన్= ప్రాణుల సముదాయాన్ని; కల్పించుచున్= సృష్టిస్తూ; జీవ+ఆవలిలోనన్= ఆ ప్రాణికోటిలో; తగన్= తగిన విధంగా; వసించుచున్= నివసిస్తూ; ప్రియ, వస్తు+ఆవలిలోపలన్= ఇష్టమైన వస్తువుల సమూహం లోపల; ప్రియవస్తు+ఆవలినై= మిక్కిలి ఇష్టవస్తు సముదాయాన్నై; ఉండు= వర్తించే; నన్నున్= శ్రీహరినైన నన్ను; అనిశమున్= ఎల్లపుడు; ప్రీతిన్= ఇష్టంగా...

**తా :** బ్రహ్మదేవా! నేను అన్ని జీవరాసులను సృష్టిస్తుంటాను. వాటిలో దాగి ఉంటాను. ప్రాణులకు ఇష్టమైన వస్తుసమూహంలో నేను ఇష్టమైన వస్తుసమూహంగా ఉంటాను. అటువంటి నన్ను ఇష్టంగా తలచుకో.

**క. తలఁపుము మత్ప్రీతికినై, కలిగించితి నిన్ను భువనకారణ! నా లో**
**పల నడఁగి యేకమై ని, శ్చలగతి వసియించి యున్న జగముల నెల్లన్. 330**

**ప్రతి :** భువనకారణ!= జగన్నిర్మాణమునకు కారణమైనవాడా!; తలఁపుము= నన్ను సర్వాంతర్యామిగా తలంపుము (వెనుకటి పద్యంనుండి అన్వయం); నిన్నున్= నిన్ను; మత్+ప్రీతికినై= నా సంతోషంకోసం (శ్రీహరియొక్క); కలిగించితిన్= జన్మింపజేశాను; నా లోపలన్= నా గర్భంలో; అడఁగి= అణగి; ఏకమై= ఒకే ముద్దగా కలిసి; నిశ్చలగతిన్= కదలికలు లేకుండా; వసియించి+ఉన్న= బ్రతుకుతున్న; ఎల్లన్+జగములన్= లోకాలన్నిటినీ పుట్టింపుము...

**తా :** జగన్నిర్మాణకారణుడవైన బ్రహ్మదేవా! నన్ను సర్వాంతర్యామిగా భావించు. నా ఆనందంకోసం నీకు జన్మనిచ్చాను. నా గర్భంలో లోకాలున్నాయి. కాని అణగి, ఒకే ముద్దగా ఎటువంటి చైతన్యమూ లేకుండా పడి ఉన్నాయి. వాటికి నీవు బాహిరమైన జన్మనివ్వాలి.

**తే. తగ నహంకారమూలతత్త్వంబు నొంది, నీవు పుట్టింపు మనుచు రాజీవభవుఁడు**
**వినఁగ నానతి యిచ్చి యవ్విష్ణుఁ డభవుఁ, డంత నంతర్హితుండయ్యె ననఘచరిత! 331**

**ప్రతి :** అనఘచరిత!= పుణ్యాత్ముడవైన విదురా!; తగన్= తగిన విధంగా; అహంకార మూలతత్త్వంబున్= అహంకారరూపమైన మొదటి స్థితిని; ఒంది= పొంది; నీవు= నీవు (బ్రహ్మ); పుట్టింపుము= ప్రాణికోటిని సృష్టించుము; అనుచున్= అని ఈ విధంగా పలుకుతూ; రాజీవభవుఁడు= పద్మసంభవుడైన బ్రహ్మ; వినఁగన్= వినునట్లుగా; ఆనతి+ఇచ్చి= ఆదేశాన్ని ఇచ్చి; అభవుఁడు= జన్మము లేనివాడైన; ఆ+విష్ణుఁడు= ఆ శ్రీమన్నారాయణుడు; అంతన్= అంతలో; అంతర్హితుండు+అయ్యెన్= అదృశ్యమాయెను.

**తా :** పుణ్యాత్ముడవైన విదురా! తగిన విధంగా అహంకార రూపమైన మొదటి స్థితిని పొంది ప్రాణికోటిని సృజించుమని బ్రహ్మకు ఆదేశాన్నిచ్చి, పుట్టుకయే లేని ఆ శ్రీమన్నారాయణుడు అంతలో అదృశ్యమయ్యాడని మైత్రేయమహర్షి చెప్పాడు.

**విశే :** అహంకారం అనగా మనం అనుకొనే గర్వం కాదు. మనోబుద్ధి చిత్తాహంకారాలలోనిది. మహత్తత్త్వంవల్ల పుట్టి పంచతన్మాత్రలకు కారణభూతమైన తత్త్వభేదం.

**క. అని చెప్పిన మైత్రేయునిఁ, గనుఁగొని విదురుండు వలికెఁగడు ముద మొప్పన్**
**జననుత; నలినదళాక్షుఁడు, సనినం బద్మజుఁడు దేహసంబంధమునన్. 332**

**ప్రతి :** అని చెప్పిన= ఆ విధంగా వివరించిన; మైత్రేయునిన్= మైత్రేయమహర్షిని; కనుఁగొని= చూచి; విదురుండు= విదురుడు; కడు, ముదము+ఒప్పన్+పలికెన్= మిక్కిలి ఆనందంతో (చెప్పబోవు విధంగా) పలుకుతున్నాడు; జననుత!= ప్రజలందరిచే స్తుతింపబడే మహర్షీ!; నలినదళ+అక్షుఁడు= పద్మపత్రములవంటి కన్నులు కలవాడైన శ్రీమహావిష్ణువు; చనినన్= అదృశ్యుడు కాగా; పద్మజుఁడు= పద్మమునుండి జన్మించిన బ్రహ్మ; దేహసంబంధమునన్= శరీర సంబంధంతో...

**తా :** మైత్రేయ మహర్షి ఆ విధంగా విషయాన్ని విస్తరించగా విదురుడు చాల ఆనందపడి, ఇంకా ఇలా అడుగుతున్నాడు. జనవందనీయా! శ్రీమన్నారాయణుడు సృష్టికార్యానికి పూనుకొమ్మని బ్రహ్మను ఆదేశించి, ఆ పద్మభవుడు అంతర్హితుడయ్యాడు.

**క. మానవసంబంధంబును, బూనిన యీసర్గ మెట్లు పుట్టించె? దయాం**
**భోనిధివై నా కింతయు, మానుగ నెఱిఁగింపవయ్య మహితవిచారా! 333**

**ప్రతి :** మహితవిచారా!= చక్కని ఆలోచన కలవాడా; మానవ సంబంధంబును= (శరీర సంబంధంతో కూడిన) మానవ సంబంధాన్ని; పూనిన= ముడిపెట్టుకొన్న; ఈ సర్గము= ఈ సృష్టిని; ఎట్లు+పుట్టించెన్= ఎలా పుట్టించాడు; దయా+అంభోనిధివి+ఐ= కరుణాసముద్రుడవై; నాకున్+ఇంతయున్= నాకు ఈ విషయమంతా; మానుగన్= ఆహ్లాదకరంగా; ఎఱిగింపవయ్య!= తెలియజేయవయ్యా!

**తా :** శరీరసంబంధంతో ముడిపడిన మానవసంబంధం కల ఈ సృష్టిని బ్రహ్మ ఎలా చేశాడో చక్కని ఆలోచనా శక్తిగల మహర్షీ! కరుణాసముద్రుడవై అదంతా ఆహ్లాదకరంగా నాకు తెలియజేయుమని విదురుడు మైత్రేయుని ప్రార్థించాడు.

**వ. అనవుడు నమ్మునివరేణ్యుండు విదురున కిట్లనియెఁ బుండరీకాక్షవరదాన ప్రభావంబునం బంకజాసనుండు శతదివ్యవత్సరంబులు భగవత్పరంబుగాఁ దపంబు గావించి తత్కాలవాయువుచేఁ**

**గంపితంబగు నిజనివాసంబయిన పద్మంబును వాయువును జలంబులను గనుంగొని యాత్మీయ తపశ్శక్తిచేత నభివృద్ధిం బొందిన విద్యాబలంబున వాయువు బంధించి, తోయంబులతోడ నొక్క తోయంబ సమస్తంబునుం గ్రోలి, యంత గగనవ్యాపి యగు జలంబును గనుంగొని. 334**

**ప్రతి :** అనవుడున్= అని విదురుడు పలుకగా; ఆ+మునివరేణ్యుండు= ఆ మైత్రేయమహర్షి; విదురునకున్= విదురునికి; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పనారంభించాడు; పుండరీకాక్ష వరదాన ప్రభావంబుననన్= శ్రీహరి అనుగ్రహించిన వర ప్రభావంతో; పంకజ+ఆసనుండు= పద్మం పీఠంగాకల బ్రహ్మ; శతదివ్యవత్సరంబులు= నూరు దివ్యసంవత్సరాలు; భగవత్పరంబుగాన్= దైవపరంగా; తపంబున్+కావించి= తపస్సు చేసి; తద్+కాలవాయువుచేన్= ఆ సమయంలో పుట్టిన గాలిచే; కంపితంబు+అగు= చలించిపోయిన; నిజనివాసంబు+అయిన= తన వాసస్థానమైన; పద్మంబును= సరోజాన్ని; వాయువును= గాలిని; జలంబులను= నీళ్లను; కనుంగొని= వీక్షించి; ఆత్మీయ తపస్+శక్తిచేతన్= తన తపోబలంతో; అభివృద్ధిన్+పొందిన= పెంపు చెందిన; విద్యాబలంబుననన్= జ్ఞానశక్తిచేత; వాయువున్+బంధించి= గాలిని కట్టడిచేసి; తోయంబులతోడన్= నీటినంతటిని వెంటనే; ఒక్క తోయంబ= ఒక్కమారుగా; సమస్తంబునున్+క్రోలి= మొత్తం పుక్కిటబట్టి; అంతన్= అంతలో; గగనవ్యాపి+అగు= ఆకాశంలో వ్యాపించిన; జలంబును కనుంగొని= నీటిని చూచి...

**తా :** విదురుని ప్రార్థనమేరకు మైత్రేయమహర్షి ఇలా చెపుతున్నాడు. విదురా! శ్రీమన్నారాయణుని వరదాన ప్రభావంతో బ్రహ్మ నూరు దివ్యసంవత్సరాలు భగవంతునిగూర్చి తపస్సు చేశాడు. ఆ సమయంలో వాయువు గట్టిగా వీచింది. దానివలన తన నివాసస్థానమైన పద్మం కదిలిపోయింది. తన చుట్టూ ఉన్న నీళ్లుకూడా కదిలిపోతున్నాయి. వెంటనే తన తపశ్శక్తివల్ల తనకు లభించిన విద్యాబలంతో పద్మసంభవుడు వాయువును వీచకుండా చేశాడు. మొత్తం నీరంతా ఒక్క గుక్కలో తాగేశాడు. కాని అంతలోనే ఆకాశంలో వ్యాపించే నీటిని చూచాడు.

**ఉ. వారిజసంభవుండు బుధవంద్యుఁడు చిత్తమునం దలంచె దై**
**త్యారిఁబయోవిహారి సముదంచితహారి నతాఖిలామృతా**
**హారి రమాసతీహృదయహారి నుదారి విదూరభూరి సం**
**సారి భవప్రహారి విలసన్నుతసూరి నఘారి నయ్యెడన్. 335**

**ప్రతి :** వారిజ సంభవుండు= పద్మమునుండి పుట్టినవాడు; బుధవంద్యుఁడు= పండితుల నమస్కృతులందుకొనేవాడు (అయిన బ్రహ్మ); చిత్తముననన్= మనసులో; దైత్య+అరిన్= రాక్షసులకు శత్రువైనవానిని; పయస్+విహారిన్= నీటిలో విహరించేవానిని (పాలసముద్రములో); సమ్+ఉదంచితహారిన్= అందమైన హారాలను ధరించేవానిని; నత+అఖిల+అమృత+ఆహారిన్= నమస్కరించిన సమస్త దేవతలు గలవానిని – సమస్త దేవతలచే నమస్కరింపబడేవానిని; రమాసతీ, హృదయ, హారిన్= లక్ష్మీదేవి హృదయాన్ని హరించినవానిని; ఉదారిన్= ఔదార్యగుణం కలవానిని; విదూర+భూరిసంసారిన్= ఎంతపెద్ద సంసార దుఃఖాన్నైనా దూరం చేసేవానిని; భవప్రహారిన్= సంసారబంధాన్ని తెంచేవానిని; విలసత్+నుత సూరిన్= గొప్పగా పొగడ్తలు చేసే పండితులు కలవానిని – అనగా పండితులచే ప్రకాశమానముగా పొగడబడేవానిని; అఘ+అరిన్= పాపాలకు శత్రువైన – పాపములను పోగొట్టేవాడు అయిన శ్రీహరిని; ఆ+ఎడన్= అప్పుడు (అక్కడ); తలంచెన్= ధ్యానించెను.

**తా :** మొత్తం నీటిని తాగేసినా మళ్లీ ఆకాశంలో నీరు కనిపించే సరికి విషయం అర్థంకాని బ్రహ్మ మళ్లీ వెంటనే మనసులో– రాక్షసులను సంహరించేవాడు, నీటిలో విహరించేవాడు, అందమైన హారాలు ధరించేవాడు, దేవతల నమస్కారాలు అందుకొనేవాడు, లక్ష్మీమానసచోరుడు, ఉదారగుణసంపన్నుడు, సంసారదుఃఖాన్ని దూరం చేసేవాడు, సంసారబంధాన్ని తెంచేవాడు, పండితులచే నిత్యనూతనంగా స్తుతింపబడేవాడు, పాపాలను పటాపంచలు చేసేవాడు అయిన శ్రీహరిని ధ్యానం చేశాడు.

**తే. అట్లు దలఁచి సరోజజుఁ డంబుజమును, గగనతలమునఁ జూచి యా కమలకోశ**
**లీనమై యున్న లోకవితానములను, నొయ్యఁ బొడగని హరిచే నియుక్తుఁడైన. 336**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; తలఁచి= శ్రీహరిని స్మరించి; సరోజజుఁడు= పద్మమునుండి పుట్టినవాడు – బ్రహ్మ; అంబుజమును= పద్మాన్ని; గగనతలమునన్= ఆకాశంలో; చూచి= ఆలోకించి; ఆ కమలకోశ= గగనంలోని ఆ కమలగర్భంలో; లీనమై+ఉన్న= దాగియున్న; లోకవితానములను= అన్ని లోకాలను; ఒయ్యన్= క్రమంగా; పొడగని= గుర్తించి; హరిచేన్= శ్రీమన్నారాయణునిచే; నియుక్తుఁడు+ఐన= నియమింపబడిన...

**తా :** బ్రహ్మ శ్రీహరిని ఆ విధంగా స్తుతించాడు. ఆ తరువాత పద్మంలో పుట్టిన తాను ఆకాశంలో మరొక పద్మాన్ని దర్శించాడు. ఆ పద్మంలో దాగివున్న అన్ని లోకాలనూ గమనించాడు. తాను హరిచే సృష్టిని బహిర్గతం చేసేందుకు నియమింపబడినవానిగా గ్రహించాడు.

**తే. వానిఁగాఁ దన్నుఁ దలఁచి య వ్వనరుహంబు, లోపలికిఁ బోయి మున్నందులోన నున్న**
**ముజ్జగంబులఁ జూచి యిమ్ముల సృజించె, మఱి చతుర్దశభువనముల్ మహిమఁ జేసి. 337**

**ప్రతి :** వానిన్+కాన్= హరిచే నియుక్తుడైనవానినిగా; తన్నున్= తనను; తలఁచి= భావించి; ఆ+వనరుహంబులోపలికిన్= (గగనంలోని) ఆ పద్మంలోనికి; పోయి= ప్రవేశించి; మున్ను= ముందుగా; అందులోనన్+ఉన్న= ఆ పద్మంలో ఉన్న; మూడు+జగంబులన్= ముల్లోకాలను; చూచి= సందర్శించి; మఱి= ఆ పైని; మహిమన్+చేసి= తపోమహిమతో; ఇమ్ములన్= చక్కగా; చతుర్దశ భువనములన్= పదునాల్గు లోకాలను; సృజించెన్= సృష్టించెను.

**తా :** తాను శ్రీహరిచే ఏ కార్యానికి నియమితుడయ్యాడో అర్థం చేసుకొన్నాడు బ్రహ్మ. ముందుగా ఆకాశంలోని పద్మంలోనికి ప్రవేశించి, అందులో గూఢంగా ఉన్న ముల్లోకాలనూ దర్శించాడు. తరువాత తపస్సువలన తనకు ఏర్పడిన మహిమతో చక్కగా పదునాలుగు లోకాలను సృష్టించాడు.

**క. పరఁగ సుధాశన తిర్య, జ్నర వివిధస్థావరాది నానాసృష్టి**
**స్ఫురణ నజుండొనరించెం, బరువడి నిష్కామధర్మ ఫలరూపమునన్. 338**

**ప్రతి :** అజుండు= బ్రహ్మ; పరఁగన్= ఒప్పునట్లుగా; సుధా+అశన= అమృతాన్ని ఆహారంగా గ్రహించువారైన దేవతలు; తిర్యక్= పశుపక్ష్యాదులు; నర= మానవులు; వివిధ స్థావర= అనేకమైన తరు గిరులు; ఆది= మొదలైన; నానా సృష్టిస్ఫురణన్= బహురూపమైన సృష్టివిశేషాన్ని; పరువడి= క్రమముగా; నిష్కామ= ప్రతిఫలం ఆశించని; ధర్మ= ధర్మకృత్యానికి; ఫలరూపమునన్= ఫలించిన రూపంగా; ఒనరించెన్= నిర్మించెను.

**తా :** బ్రహ్మ తన ప్రతిఫలాపేక్షరహితమైన ధర్మకృత్యానికి సిద్ధించిన ఫలరూపంగా దేవతలు, పశుపక్ష్యాదులు, మానవులు, చెట్లు, కొండలు, నదులు మొదలైన అనేకమైన స్థావరాలతో కూడిన గొప్ప జగత్తును నిర్మించాడు.

**వ. ఇట్లు భువనంబులం బద్మజుండు గల్పించెనని మైత్రేయుండు విదురున కెఱింగించిన. 339**

**ప్రతి :** ఇట్లు= ఈ విధముగా; భువనంబులన్= లోకాలను; పద్మజుండు= బ్రహ్మ; కల్పించెన్+అని= సృష్టించాడని; మైత్రేయుండు= మైత్రేయమహర్షి; విదురునకున్= విదురునికి; ఎఱింగించినన్= తెలియజేయగా...

**తా :** ఈ విధంగా చతుర్దశభువనాలను బ్రహ్మ సృష్టించాడని మైత్రేయుడు విదురునకు తెలియజేశాడు.

**క. విదురుఁడు దురితావనిభృ, ద్భిదురుఁడు మునివరునిఁజూచి ప్రియము మనమునం**
**గదురఁగ నిట్లని పలికె న, తి దురంతంబయిన విష్ణుదేవుని మహిమన్. 340**

**ప్రతి :** దురిత= పాపాలనే; అవనిభృత్= కొండలపాలిటి (వాటిని ఛేదించే); భిదురుఁడు= వజ్రమైనవాడైన; విదురుఁడు= విదురుడు; మునివరునిన్+చూచి= మైత్రేయమహర్షిని చూచి; మనమునన్= చిత్తములో; ప్రియము+కదురఁగన్= ఆనందమేర్పడగా; అతిదురంతంబు+అయిన= ఏ మాత్రమూ అంతుచిక్కని; విష్ణుదేవుని మహిమన్= శ్రీమన్నారాయణుని మహిమవలన...

**తా :** పాపాలనే కొండలను చీల్చివేయడంలో వజ్రాయుధం అయినవాడైన విదురుడు మైత్రేయమహర్షిని చూచి, మనసులో ఎంతో ఆనందం కలిగి ఏ మాత్రమూ అంతుచిక్కని శ్రీమహావిష్ణువు మహిమవల్లనే గదా చతుర్దశ భువనాలూ ఏర్పడ్డాయి అని అన్నాడు.

**తే. అమరె భువనంబు లతని కాలాఖ్యతయును, గణుతిసేయు తదీయలక్షణము లర్థి**
**నాకు నెఱిఁగింపుమయ్య వివేకచరిత!, యనిన మైత్రేయుఁ డ వ్విదురునకు ననియె. 341**

**ప్రతి :** వివేకచరిత!= విజ్ఞానంతో కూడిన నడవడిక కల మహర్షీ!; భువనంబులు= (శ్రీమహావిష్ణువు మహిమవల్లనే) పదునాల్గు లోకాలు; అమరెన్= ఏర్పడినవి; అతని= ఆ శ్రీహరియొక్క; కాల+ఆఖ్యతయును= కాలస్వరూపాన్ని; గణుతి+చేయు= లెక్కించు; తదీయలక్షణములు= వాని పద్ధతులు; అర్థిన్= ప్రీతితో; నాకున్= నాకు; ఎఱిఁగింపుము+అయ్య= తెలియజేయుము తండ్రీ!; అనిన= అన్నటువంటి; విదురునకున్= విదురునితో; మైత్రేయుఁడు+అనియెన్= మైత్రేయమహర్షి ఇలా అన్నాడు.

**తా :** వివేకవంతమైన నడివడిక గల మహర్షీ! శ్రీమన్నారాయణుని మహిమవల్లనే ఈ పదునాలుగు లోకాలూ ఏర్పడ్డాయి కదా! వాని కాలస్వరూపం ఎలా ఉంటుందో, ముఖ్యమైన వాని గుణగణాలు ఏమిటో వాత్సల్యంతో నాకు తెలియజేయుమనగా మైత్రేయమహర్షి విదురునితో ఇలా అన్నాడు.

**సీ. ఆద్యంతశూన్యంబు నవ్యయంబై తగు తత్త్వమింతకు నుపాదాన మగుట**
**గుణవిషయములు గైకొని కాలమును మహదాదిభూతములు దన్నాశ్రయింప**
**గాలానురూపంబుఁగైకొని యీశుండు దన లీలకై తనుఁ దా సృజించెఁ**
**గరమొప్ప నఖిలలోకములందుఁదా నుండుఁ దనలోన నఖిలంబుఁదనరుచుండుఁ**

**తే. గాన విశ్వమ్మునకుఁగార్యకారణములు దాన; యమ్మహాపురుషుని తనువువలనఁ**
**బాసి విశ్వంబు వెలియై ప్రభాస మొందె, మానితాచార! యీ వర్తమానసృష్టి. 342**

**ప్రతి :** మానిత+ఆచార!= సదాచారముతోకూడిన నడవడిక కల విదురా!; ఆది+అంతశూన్యంబు= మొదలు, తుది లేనిది; అవ్యయంబు+ఐ= ఎటువంటి మార్పులు లేనిదై; తగు= ఒప్పి ఉండు; తత్త్వము+ఇంతకున్= మూలబీజమే ఈ సృష్టికి; ఉపాదానము+అగుటన్= ప్రధానకారణమగుటచేత; గుణవిషయములు= ఇరువదినాలుగు గుణాలు, పది ఇంద్రియాలు; కైకొని= స్వీకరించి; కాలమును= కాలము; మహత్+ఆది భూతములు= మహత్తు మొదలైన పంచభూతాలు; తన్నున్= శ్రీహరిని; ఆశ్రయింపన్= ఆశ్రయించగా; కాల+అనురూపంబున్= ఏ సమయంలో దేనిని స్వీకరించాలో ఆ విధంగా; కైకొని= వాటిని గ్రహించి; ఈశుండు= నారాయణుడు; తన లీలకు+ఐ= తన వినోదంకోసమన్నట్లుగా; తనున్+తాన్+ సృజించెన్= తనను తానే ఆవిర్భవింపజేసుకొనెను; కరము+ఒప్పన్= మిక్కిలి తగినట్లుగా; అఖిలలోకములందున్= లోకాలన్నిటిలోను; తాన్+ఉండున్= నారాయణుడుంటాడు; తనలోనన్= ఆ నారాయణునిలో; అఖిలంబున్= విశ్వమంతా; తనరుచు+ఉండున్= ప్రవర్తిస్తుంటుంది; కానన్= అందుచేత; విశ్వమ్మునకున్= జగత్తునకు; కార్యకారణములు= కార్యము, కారణమూ కూడ; తాన్+అ= శ్రీమహావిష్ణువే; ఆ+మహాపురుషుని= ఆ మహాత్ముని; తనువువలనన్= శరీరమునుండి; పాసి= విడివడి; వెలియై= బయటపడి; ఈ వర్తమానసృష్టి= ఇప్పుడు కనిపిస్తున్న సృష్టిరూపమైన; విశ్వంబు= ప్రపంచం; ప్రభాసము+ఒందెన్= వెలుగొందింది.

**తా :** సదాచారసంపన్నుడవైన విదురా! మొదలు, తుది అంటూ లేని ప్రపంచ తత్త్వం ఒకటుంది. అదే సృష్టికి మూలకారణం. 24 గుణాలు, 10 ఇంద్రియాలు, మహత్తు, పంచభూతాలు, పరమాత్మను ఆశ్రయించాయి. ఆయన సమయానుకూలంగా వాటిని స్వీకరించి, తనను తానే సృష్టించుకొన్నాడు. లోకాలన్నిటిలో పరమాత్మ ఉంటాడు. పరమాత్మలో విశ్వమంతా అంతర్లీనంగా ఉంటుంది. కాబట్టి ప్రపంచానికి కారణమూ, కార్యమూ రెండూ నారాయణుడే. ఆ పరమపురుషుని తనువునుండి విడివడి ప్రత్యేకంగా ఈ జగత్తు ఏర్పడింది. ఇది ఇప్పుడు మనం చూస్తున్న ఈ ప్రపంచమని మైత్రేయుడు చెప్పాడు.

**విశే :** రూపం, రసం, గంధం, స్పర్శ, సంఖ్య, పరిణామం, పృథక్త్వం (విడివడుట), సంయోగం (కలియుట), విభాగం, పరత్వం, అపరత్వం, గురుత్వం, ద్రవత్వం, స్నేహం, శబ్దం, బుద్ధి, సుఖం, దుఃఖం, ఇచ్ఛ (కోరిక), ద్వేషం, ప్రయత్నం, ధర్మం, అధర్మం, సంస్కారం అనేవి 24 గుణాలని తర్కశాస్త్రం.

**క. తెఱఁగొప్ప నఖిలవిశ్వముఁ, బురుషోత్తము మాయచేతఁబుట్టుం బెరుఁగున్**
**విరతిం బొందుచు నుండుం, గర మర్థిన్ భూతభావికాలములందున్. 343**

**ప్రతి :** తెఱఁగు+ఒప్పన్= పద్ధతిప్రకారంగా; అఖిల విశ్వమున్= ప్రపంచమంతా; కరము+అర్థిన్= మిక్కిలి కోరికతో; పురుషోత్తము మాయచేతన్= జగన్నాథుని లీలవలన; భూతభావికాలములందున్= అంతకుముందు, ఆ పైన (వర్తమానంలో ఎలాగూ ఉంది); పుట్టున్= ఏర్పడుతుంది; పెరుఁగున్= పెరిగి పెద్దదౌతుంటుంది; విరతిన్+పొందుచున్= తిరిగి నశించిపోతూ; ఉండున్= ఉంటుంది.

**తా :** విదురా! ఆ నారాయణుని మాయవలన ఈ ప్రపంచమంతా అలా ఏర్పడింది. ఇంతకుముందు కూడా అలాగే ఏర్పడింది. ఇక పైన కూడా అలాగే ఏర్పడుతుంది. ఎప్పటికప్పుడు పరమాత్మ మాయతోనే ఈ జగత్తు పుడుతుంటుంది. పెరుగుతుంటుంది, తిరిగి నశించిపోతుంటుంది.

వ. అట్టి సర్గంబు నవవిధం; బందుఁ బ్రాకృతవైకృతంబులు గాల ద్రవ్య గుణంబులను త్రివిధంబగు భేదంబులచేఁ బ్రతిసంక్రమంబు లగుచు నుండు; నందు మహత్తత్త్వంబు ప్రథమసర్గం; బాది నారాయణసకాశంబున గుణవైషమ్యంబునం బొందు. ద్రవ్యజ్ఞాన క్రియాత్మకంబైన యహంకార తత్త్వంబు ద్వితీయసర్గంబు; శబ్దస్పర్శరూప రసగంధంబు లను పంచతన్మాత్ర ద్రవ్య శక్తియుక్తంబైన పృథివ్యాది భూతసర్గంబు మూఁడవదియై యుండు; జ్ఞానేంద్రియంబులైన త్వక్చక్షు శ్రోత్ర జిహ్వాఘ్రాణంబులుఁ గర్మేంద్రియంబులైన వాక్పాణిపాదపాయూపస్థలు నను దశవిధేంద్రియ జననంబు చతుర్థ సర్గంబు; సాత్త్వికాహంకార జనితంబైన సుమనోగణసర్గం బైదవసర్గంబై యొప్పు; నది మనోమయంబై యుండు; జీవలోకంబునకు నబుద్ధికృతంబులైన యావరణ విక్షేపంబులం జేయు తామససర్గం బాఱవదై యుండు; నియ్యాఱు నీశ్వరునకు లీలార్థంబు లయిన ప్రాకృతసర్గంబు లయ్యె; నింక వైకృతసర్గంబు నేడవది మొదలుగాఁ గలుగునవి వినిపింతు, వినుము; పుష్పోత్పత్తిరహితంబులై ఫలించెడు నశ్వత్థోదుంబర పనస న్యగ్రోధాదులైన వనస్పతులును, బుష్పితంబులై ఫలపాకాంతంబులైన వ్రీహి యవ ముద్గా ద్యోషధులును, నారోహణానపేక్షంబులైన మాలతీమల్లికాది లతలును, ద్వక్సారంబులైన వేణ్వాదులును; గఠినీభూతమూలంబులును, శిఖావిస్తృతంబులు నగు లతా విశేషరూపంబులైన వీరుధంబులును; బుష్పవంతంబు లయి ఫలప్రాప్తంబులగు చూతాది ద్రుమంబులును నవ్యక్తచైతన్యంబులు నూర్ధ్వస్రోతంబులు నంతస్స్పర్శంబులుఁ దమఃప్రాయంబులునై స్థావరంబు లయిన యీ యాఱు నేడవ సర్గంబయ్యె; నెనిమిదవ సర్గంబు తిర్యక్సర్గంబు. ఇది యిరువది యెనిమిది భేదంబులు గలిగి శ్వస్తనాది జ్ఞానశూన్యంబులయి యాహారాది జ్ఞానమాత్ర నిష్ఠంబులయి, ఘ్రాణంబువలన నెఱుంగం దగినవాని నెఱుంగుచు హృదయంబున దీర్ఘానుసంధాన రహితంబులై వర్తించు ద్విశఫంబులు గల వృషభ మహిషాజ కృష్ణ సూక రోష్ట్ర గవయ రురు మేష ముఖర నవకంబును, నేక శఫంబు గల ఖరాశ్వాశ్వతర గౌర శరభ చమర్యాది షట్కంబును, బంచనఖంబులు గల శునక సృగాల వృక వ్యాఘ్ర మార్జార శశ శల్యక సింహ కపి గజ కూర్మ గోధాముఖ భూచర ద్వాదశకంబును, మకరాది జలచరంబులును, గంక గృధ్ర బక శ్యేన భాస భల్లూక బర్హి హంస సారస చక్రవాక కాకోలూకాది ఖేచరంబులు నయ్యె, నర్వాక్స్రోతంబై యేకవిధంబగు మానుష సర్గంబు రజోగుణప్రేరితంబై కర్మకరణదక్షంబై దుఃఖంబందును సుఖంబు గోరు; నిది తొమ్మిదవ సర్గం బనందగు; నీ త్రివిధసర్గంబులు వైకృతసర్గంబు లనంబడు; నింక దేవసర్గంబు విను మదియు నెనిమిది తెఱంగులు గలిగి యుండు; నందు విబుధ పితృసురాదులు మూఁడును, గంధర్వాప్సరసలొకటియు, యక్షరక్షస్సు లేకంబును, భూతప్రేతపిశాచంబు లొకటియు, సిద్ధచారణ విద్యాధరు లేకంబును, గిన్నర కింపురుష లొకటియునుంగా దేవసర్గం బయ్యె; నిట్టి బ్రహ్మ నిర్మితంబులైన దశవిధసర్గంబులు నెఱింగించితి; నింక మనువులం దదంతరంబుల నెఱింగించెదఁ; గల్పాదులయందు నీ ప్రకారంబున స్వయంభూతుండును, నమోఘ సంకల్పుండును నగు నప్పుండరీకాక్షుండు రజోగుణయుక్తుండై స్రష్ట యగుచు స్వస్వరూపంబయిన విశ్వంబు నాత్మీయ సామర్థ్యంబునం గల్పించె; నయ్యీశ్వరుని మాయావ్యాపారంబులచే నీ సృష్టియందు నద్యావర్తంబులంబడి భ్రమించుచున్న

**మహీరుహంబులంబోలె బూర్వాపరభావంబు లెఱుంగంబడకుండు; నీ కల్పంబునం దుండు దేవాసురాదులు ప్రతిమన్వంతరంబు నందును నిట్లు నామ రూపంబులచే నిర్దేశింపంబడుదురు; మఱియు నిం దొక్కవిశేషం బెఱింగించెదఁ. గౌమారసర్గం బనునది దేవ సర్గాంతర్భూతం బయ్యును బ్రాకృత వైకృతోభయాత్మకంబై దేవత్వ మనుష్యత్వ రూపంబైన సనత్కుమారాది సర్గం బనంబడె; నమోఘసంకల్పుండైన పుండరీకాక్షుండు దనుఁ దాన యిట్లు విశ్వభేదంబును గల్పించెనని మైత్రేయుండు విదురునకుంజెప్పి కాలలక్షణంబెఱింగించువాఁడై యిట్లనియె. 344**

**ప్రతి :** అట్టి సర్గంబు= ఆ విధంగా పరమాత్మ మాయచే పుట్టి, పెరిగి, నశించే సృష్టి; నవవిధంబు= తొమ్మిది రకాలుగా ఉంటుంది; అందున్= వాటిలో; ప్రాకృత వైకృతంబులు= ప్రాకృతము, వైకృతము; కాలద్రవ్యగుణంబులు+అను= కాలము, ద్రవ్యము, గుణము అనే; త్రివిధంబు+అగు భేదములచేన్= మూడు రకాలైన భేదాలచే; ప్రతిసంక్రమంబులు+అగుచున్= పరస్పరం కలయిక గలవై; ఉండున్= ఉంటాయి; అందున్= వాటిలో; మహత్తత్త్వంబు ప్రథమసర్గంబు= మహత్ తత్త్వము అనునది మొదటి సృష్టి; ఆదినారాయణ సకాశంబునన్= శ్రీహరి సన్నిధానంలో; గుణవైషమ్యంబునన్+పొందున్= గుణభేదాన్ని పొందుతుంది; ద్రవ్యజ్ఞానక్రియా+ఆత్మకంబు+ఐన= ద్రవ్యము, జ్ఞానము, క్రియల రూపంలో ఉన్న; అహంకార తత్త్వంబు= అహంకారమనే తత్త్వం; ద్వితీయసర్గంబు= రెండవ సృష్టి; శబ్ద, స్పర్శ, రూప, రస, గంధంబులను= శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధములనే; పంచతత్+మాత్ర, ద్రవ్య, శక్తియుక్తంబు+ఐన= పంచతన్మాత్రలనే ద్రవ్యశక్తులతో కూడిన; పృథివీ+ఆది భూతసర్గంబు= భూమి మొదలగు పంచభూతాల సృష్టి; మూఁడవది+ఐ+ఉండున్= మూడవ సృష్టిగా ఉంటుంది; జ్ఞాన+ఇంద్రియంబులు+ఐన= జ్ఞానేంద్రియాలనే పేరుగల; త్వక్= చర్మము; చక్షుస్= కన్ను; శ్రోత్ర= చెవి; జిహ్వా= నాలుక; ఘ్రాణంబులున్= ముక్కు అనునవియును; కర్మ+ఇంద్రియంబులు+ఐన= కర్మేంద్రియాలనే పేరుగల; వాక్= మాట; పాణి= చేయి; పాద= కాలు; పాయు= మలవిసర్జనావయవము; ఉపస్థలున్+అను= మూత్రవిసర్జనావయవములను; దశవిధ+ఇంద్రియ జననంబు= పదిరకాలైన ఇంద్రియాలు పుట్టుట; చతుర్థ సర్గంబు= నాలుగవ సృష్టి; సాత్త్విక+అహంకారజనితంబు+ఐన= సత్త్వరూప అహంకారంనుండి పుట్టిన; సుమనస్+గణ సర్గంబు= దేవతాసృష్టి; ఐదవ సర్గంబు+ఐ+ఒప్పున్= ఐదవ సృష్టిగా ఒప్పును; అది మనోమయంబు+ఐ+ఉండున్= ఆ దేవతాసృష్టి మనస్సే స్వరూపమైనదై ఉంటుంది; జీవలోకంబునకున్= ప్రాణిలోకానికి; అబుద్ధికృతంబులు+ఐన= బుద్ధిహీనతలవలన ఏర్పడిన; ఆవరణ విక్షేపంబులన్+చేయు= మాయ పొరలను పోగొట్టు; తామస సర్గంబు= తమోరూపమైన సృష్టి; ఆఱవది+ఐ+ ఉండున్= ఆరవదిగా ఉండును; ఈ+ఆఱును= ఆ ఆరు సృష్టులు; ఈశ్వరునకున్= పరమాత్మకు; లీలా+అర్థంబులు+ఐన= వినోదములకొరకైన; ప్రాకృత సర్గంబులు+అయ్యెన్= ప్రాకృతము అను పేరుగల సృష్టులు అవుతాయి; ఇంకన్ వైకృతసర్గంబును= ఇక వైకృతము అను పేరుగల సృష్టిని; ఏడవది మొదలుగాన్= ఏడవ సృష్టి మొదలుగా; కలుగునవి= ఏర్పడేవి; వినిపింతున్+వినుము= తెలియజేస్తాను విను; పుష్ప+ఉత్పత్తి రహితంబులు+ఐ= పువ్వులేకుండా; ఫలించెడు= కాయలు కాసే; అశ్వత్థ+ఉదుంబర, పనస, న్యగ్రోధ+ఆదులైన= రావి, మేడి, పనస, మఱ్ఱి మొదలగు; వనస్పతులును= (పూయక కాచే) చెట్లును; పుష్పితంబులు+ఐ= పుష్పించి; ఫలపాక+అంతంబులు+ఐన= ఫలించి, పండి రాలిపోవునవైన; వ్రీహి యవ, ముద్గ+ఆది+ఓషధులును= వరి, యవ, పెసర మొదలగు ఓషధులును; ఆరోహణ+అనపేక్షంబులు+ఐన= పైకి పోవటానికి ఆధారం అక్కరలేని; మాలతీమల్లికా+ఆది, లతలును= మాలతి, మల్లిక మొదలగు పూతీగలును;

త్వక్+సారంబులు+ఐన= గట్టి బెరడు కలిగిన; వేణు+ఆదులును= వెదురు మొదలైనవియును; కఠినీభూత మూలంబులును= గట్టి వేళ్లు కలిగి; శిఖావిస్తృతంబులున్+అగు= కొసలు విస్తారంగా వ్యాపించే; లతావిశేషరూపంబులు+ఐన= ప్రత్యేక లతారూపాలైన; వీరుధంబులును= పూపొదలును; పుష్పవంతంబులు+అయి= పూవులు కలిగి; ఫలప్రాప్తంబులు+అగు= పండ్లను అందించునట్టి; చూత+ఆది ద్రుమంబులును= మామిడి మొదలగు చెట్లును; అవ్యక్త చైతన్యంబులును= తెలియబడని చేతనత్వం కలవియును; ఊర్ధ్వస్రోతంబులును= పైకి ప్రవహించు జలతత్త్వం కలవియును; అంతస్+స్పర్శంబులును= లోపల స్పర్శజ్ఞానము కలవియును; తమస్+ప్రాయంబులును+ఐ= తమోగుణము కలవియునై; స్థావరంబులు+అయిన= ఉన్నచోటునుండి కదలనివై; ఈ+ఆఱును= ఈ ఆరును; ఏడవ సర్గంబు+అయ్యెన్= ఏడవ సృష్టి ఆయెను; ఎనిమిదవ సర్గంబు= ఎనిమిదవ సృష్టి; తిర్యక్+సర్గంబు= పశుపక్ష్యాదులకు చెందిన సృష్టి; ఇది ఇరువది ఎనిమిది భేదంబులు కలిగి= ఇది ఇరవై ఎనిమిది భేదాలు కలిగి; శ్వస్తనాది జ్ఞానశూన్యంబులు+అయి= మరునాటి ఆలోచన లేక; ఆహార+ఆది జ్ఞానమాత్ర నిష్ఠంబులు+అయి= తిండిమీదనే ధ్యాస కలిగి; ఘ్రాణంబువలనన్= ముక్కుద్వారా; ఎఱుంగన్+తగినవానిన్= తెలియదగినవానిని; ఎఱుంగుచున్= గ్రహిస్తూ; హృదయంబునన్= మనస్సులో; దీర్ఘ+అనుసంధాన రహితంబులు+ఐ= భావికి చెందిన ఆలోచన లేనివై; వర్తించు= ప్రవర్తించు; ద్విశఫంబులు+కల= రెండుగా చీలిన గిట్టలు కల; వృషభ= ఆవులు, ఎద్దులు; మహిష= గేదెలు, దున్నపోతులు; అజ= మేకలు; కృష్ణ= జింకలు; సూకర= పందులు; ఉష్ట్ర= ఒంటెలు; గవయ= గురుపోతులు; రురు= నల్లచారల దుప్పులు; మేష= పొట్టేళ్లు; ముఖర= ధ్వనిచేయు; నవకంబును= తొమ్మిదియు; ఏక శఫంబు+కల= ఒకటే గిట్ట కలిగిన; ఖర= గాడిదలు; అశ్వ= గుఱ్ఱములు; అశ్వతర= కంచరగాడిదలు; గౌర= గౌరము అను పేరుగల మృగములు; శరభ= శరభ మృగములు; చమరీ+ఆది షట్కంబును= సవరపు జంతువు మొదలగు ఆరును; పంచ నఖంబులు+కల= ఐదు గోళ్లు కల; శునక= కుక్కలు; సృగాల= నక్కలు; వృక= తోడేళ్లు; వ్యాఘ్ర= పులులు; మార్జార= పిల్లులు; శశ= కుందేళ్లు; శల్యక= ఒకరకమైన పందులు; సింహ= సింహములు; కపి= కోతులు; గజ= ఏనుగులు; కూర్మ= తాబేళ్లు; గోధాముఖ= ఉడుములు మొదలగు; భూచరద్వాదశకంబును= నేలపై తిరిగే పదిరెండు రకాల జంతువులును; మకర+ఆది జలచరంబులును= మొసళ్లవంటి నీటిలో తిరిగే ప్రాణులును; కంక= రాబందులు; గృధ్ర= గ్రద్దలు; బక= కొంగలు; శ్యేన= డేగలు; భాస= జెముడుకాకులు; భల్లూక= ఎలుగుబంట్లు; బర్హి= నెమళ్లు; హంస= అంచలు; సారస= బెగ్గురు పక్షులు; చక్రవాక= జక్కవలు; కాక= కాకులు; ఉలూక= గుడ్లగూబలు; ఆది+ఖేచరంబులున్+అయ్యెన్= మొదలగు ఆకాశంలో తిరిగే పక్షులయ్యాయి; అర్వాక్+స్రోతంబు+ఐ= అధోరేతస్కత కలిగినదై; ఏకవిధంబు+అగు= ఒకేవిధమైన; మానుష సర్గంబు= మానవసృష్టి; రజస్+గుణప్రేరితంబు+ఐ= రజోగుణంతో ప్రేరేపించబడినదై; కర్మకరణదక్షంబు+ఐ= వివిధ కృత్యాలు చేయుటకు సమర్థమైనదై; దుఃఖంబందును= కష్టంలో కూడా; సుఖంబున్+కోరు= సౌఖ్యాన్ని కోరుకొంటుంది; ఇది= ఈ మానవసృష్టి; తొమ్మిదవ సర్గంబు+అనన్+తగున్= తొమ్మిదవ సృష్టి అనతగును; ఈ త్రివిధసర్గంబులు= ఈ మూడు విధాలైన సృష్టులు; వైకృతసర్గంబులు= వికృతికి సంబంధించిన సృష్టులు; అనంబడున్= అనబడతాయి; ఇంక దేవసర్గంబు వినుము= ఇటుపై దేవసృష్టినిగూర్చి వినుము; అదియున్= ఆ దేవసృష్టియు; ఎనిమిది తెఱంగులు= ఎనిమిది విధాలు; కలిగి+ఉండున్= కలిగి ఉంటుంది; అందున్= వాటిలో; విబుధ పితృ సుర+ఆదులు= జ్ఞానులు, పితృదేవతలు, దేవతలు మొదలగువారు; మూఁడును= మూడు తెగలు; గంధర్వ+అప్సరసలు+ ఒకటియున్= గంధర్వ అప్సరోజాతి ఒకటి; యక్ష రక్షస్సులు+ఏకంబును= జక్కులు, రాక్షసులు ఒకటి; భూత, ప్రేత, పిశాచంబులు+ఒకటియు= భూతాలు, ప్రేతాలు, పిశాచాలు కలిపి ఒకటి; సిద్ధ, చారణ విద్యాధరులు+ఏకంబును=

సిద్ధులు, చారణులు, విద్యాధరులు కలిపి ఒకటి; కిన్నర కింపురుషులు+ఒకటియున్+కాన్= కిన్నరులు, కింపురుషులు కలిపి ఒకటిగా; దేవసర్గంబు+అయ్యెన్= దేవతాసృష్టి అయింది; ఇట్టి బ్రహ్మనిర్మితంబులు+ఐన= ఈ విధంగా బ్రహ్మచే నిర్మింపబడిన; దశవిధ సర్గంబులును= పదిరకాల సృష్టులను; ఎఱింగించితిన్= తెలియజేశాను; ఇంకన్= ఇక; మనువులందున్= మనువులలో ఉన్న; తద్+అంతరంబులన్= ఆ భేదాలను; ఎఱింగించెదన్= తెలియజేస్తాను; కల్ప+ఆదులయందున్= కల్ప ఆరంభాలలో; ఈ ప్రకారంబునన్= ఈ విధంగా; స్వయంభూతుండును= స్వయముగా ఆవిర్భవించినవాడును; అమోఘ సంకల్పుండును+అగు= వ్యర్థముకాని తలంపు కలవాడునైన; ఆ+పుండరీక+అక్షుండు= తెల్లతామరవంటి కన్నులు కల ఆ శ్రీహరి; రజస్+గుణయుక్తుండు+ఐ= రజోగుణంతో కూడినవాడై; స్రష్ట+అగుచున్= సృష్టికర్త అవుతూ; స్వస్వరూపంబు+అయిన= తన రూపమే అయిన; విశ్వంబును= ప్రపంచాన్ని; ఆత్మీయ సామర్థ్యంబునన్= తన శక్తితో; కల్పించెన్= నిర్మించెను; ఆ+ఈశ్వరుని= ఆ జగన్నాథుని; మాయావ్యాపారంబులచేన్= మాయావిలాసాలతో; ఈ సృష్టియందున్= ఈ ప్రపంచంలో; నదీ+ఆవర్తంబులన్+పడి= నదులలోని సుడిగుండాలలో పడి; భ్రమించుచున్న= తిరుగుచున్న; మహీరుహంబులన్+పోలెన్= చెట్లవలె; పూర్వ+అపర భావంబులు= ముందు వెనుకలు; ఎఱుంగన్+పడక+ఉండున్= తెలియబడక ఉండును; ఈ కల్పంబునందున్+ఉండు= ఈ కల్పంలో ఉండే; దేవ+అసుర+ఆదులు= దేవతలు రాక్షసులు మొదలగువారు; ప్రతి మన్వంతరంబునందునున్= ప్రతిమన్వంతరంలోను; ఇట్లు+అ= ఈ విధంగానే; నామరూపంబులచేన్= పేర్లతోను, ఆకారాలతోను; నిర్దేశింపబడుదురు= ఏర్పరచబడతారు; మఱియున్= అంతేకాక; ఇందున్+ఒక్క విశేషంబును= దీనిలో ఒక విశేషాన్ని; ఎఱింగించెదన్= తెలియజేస్తాను; కౌమార సర్గంబు+అనునది= కౌమార సృష్టి అనేది; దేవ సర్గ+అంతర్భూతంబు+అయ్యును= దేవసృష్టిలో అంతర్భాగమే అయినా; ప్రాకృత వైకృత+ఉభయాత్మకంబు+ఐ= ప్రాకృతము, వైకృతము అని రెండురకాలై; దేవత్వ మనుష్యత్వ రూపంబు+ఐన= దేవతల మనుజుల రూపంగా; సనత్కుమారాది సర్గంబు= సనత్కుమారాది సృష్టి; అనంబడెన్= అని పిలువబడింది; అమోఘసంకల్పుండు+ఐన= వ్యర్థంకాని తలంపు కలిగిన; పుండరీక+అక్షుండు= శ్రీహరి; తనున్+తాన= తనను తానే; ఇట్లు= ఈ విధంగా; విశ్వభేదంబును= ప్రపంచరూపంగా; కల్పించెను+అని= ఏర్పరచుకొన్నాడు అని; మైత్రేయుండు= మైత్రేయమహర్షి; విదురునకున్= విదురునికి; చెప్పి= తెలియజేసి; కాలలక్షణంబు= కాలముయొక్క లక్షణాలను; ఎఱింగించువాఁడు+ఐ= తెలియజేయ నిశ్చయించుకొన్నవాడై; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అటువంటి సృష్టి తొమ్మిది రకాలుగా ఉంటుంది. వాటిలో ప్రాకృత వైకృతాలు, కాలద్రవ్యగుణాలనే మూడు రకాల భేదంతో పరస్పరం కలుస్తుంటాయి. వాటిలో మహత్తత్త్వం మొదటి సృష్టి. అది నారాయణుని సన్నిధానంలో గుణవైషమ్యాన్ని పొందుతుంటుంది. ద్రవ్యం జ్ఞానం క్రియ అనే మూడింటితోకూడిన అహంకార తత్త్వం రెండవ సృష్టి. శబ్దం, స్పర్శ, రూపం, రసం, గంధం అనే పంచతన్మాత్రల శక్తితో కూడిన నింగి, గాలి, నిప్పు, నీరు, నేల అనే పంచభూతాలు మూడవ సృష్టి. జ్ఞానేంద్రియాలైన కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మం అనేవి, అలాగే కర్మేంద్రియాలైన నోరు, చేతులు, కాళ్లు, మలవిసర్జనావయవం, మూత్రవిసర్జనావయవం అనే పది ఇంద్రియాలు నాల్గవసృష్టి. సాత్త్వికాహంకారంవల్ల పుట్టే దేవతాగణం ఐదవసృష్టి. అది మనోమయంగా ఉంటుంది. ప్రాణుల బుద్ధిని మందగింపజేసే ఆవరణవిక్షేపాలతోకూడిన తామసం ఆరవది. ఈ ఆరును భగవంతుని లీలావిశేషాలతోకూడిన ప్రాకృతసృష్టులు.

ఏడునుండి వైకృత సృష్టులు. పూలు లేకుండా ఫలాలనిచ్చే రావి, మేడి, పనస, మఱ్ఱి మొదలైన వనస్పతులూ; పూయడం, ఫలించడం, వెంటనే నశించిపోవడం జరిగే వడ్లు, యవలు, పెసలు మొ॥ ఓషధులూ; పైకి నిలబడి ఎదగలేని

మాలతి, మల్లి మొ॥ తీగలు; గట్టి బెరడు కలిగిన వెదుళ్లు, నేలలో గట్టి వేళ్లు కలిగి, నేలపై విస్తరించే దుబ్బులు, పొదలు; పుష్పించి ఫలాలనిచ్చే మామిడివంటి చెట్లు; ఇవన్నీ చైతన్యంతో పైకి ఎదుగుతూ తమోమయాలై లోపల స్పర్శజ్ఞానం కలిగికూడా కదలిపోలేనివి; ఈ ఆరునూ ఏడవ సృష్టి.

ఎనిమిదవ సృష్టి 28 భేదాలతో ఉంటుంది. మరునాటి ఆలోచన లేక తిండివంటివాటిపైనే దృష్టి కలిగి వాసనద్వారా అన్నిటినీ తెలిసికొంటూ ఏ ఆలోచనలూ లేకుండా చీలిన గిట్టలతో ఉండే ఎద్దు, ఎనుము, మేక, జింక, పంది, ఒంటె, గురుపోతు, దుప్పి, పొట్టేలు, ఈ తొమ్మిది; చీలని గిట్టలు గల గాడిద, గుఱ్ఱం, కంచరగాడిద, గౌరమృగం, శరభమృగం, చమరీమృగం, ఈ ఆరు; ఐదుగోళ్లుండే కుక్క, నక్క, తోడేలు, పులి, పిల్లి, కుందేలు, ఏదుపంది, సింహం, కోతి, ఏనుగు, తాబేలు, ఉడుము ఈ పన్నెండు; ఇవన్నీ నేలమీద తిరిగేవి. ఇవికాక మొసలివంటి జలచరాలు, రాబందు, గద్ద, కొంగ, డేగ, తెల్లపిట్ట, గబ్బిలం, నెమలి, హంస, బెగ్గురుపక్షి, జక్కవపిట్ట, కాకి, గుడ్లగూబ మొ॥ గగనచరాలైన పక్షిజాతి ఇదంతా ఎనిమిదవ సృష్టి.

తొమ్మిదవదే మానవసృష్టి. ఈ జాతి రజోగుణప్రేరితమై కర్మనైపుణ్యంతో దుఃఖంలో కూడా సుఖాన్ని కోరుతుంది. ఈ మూడు వైకృతసృష్టులు.

దేవసర్గం ఎనిమిది రకాలుగా ఉంటుంది. విబుధులు, పితృదేవతలు, సురలు అని మూడు తెగలూ; గంధర్వులూ, అప్సరసలూ ఒక తెగ; యక్షులూ, రాక్షసులూ ఒక తెగ; భూతప్రేతపిశాచాలు ఒక తెగ; సిద్ధచారణవిద్యాధరులు ఒక తెగ; కిన్నర, కింపురుషులు ఒకటి; ఈ ఎనిమిదీ కలిస్తే దేవసర్గం అవుతుంది. ఇలా బ్రహ్మ పదిరకాలైన సృష్టులను నిర్మించాడు.

ఇక మనువులూ, మన్వంతరాల విషయానికి వస్తే, కల్పారంభాలలో ఇదే విధంగా పరమాత్మ తనను తాను సృజించుకొంటూ, మొక్కవోని సంకల్పంతో రజోగుణంతో కూడినవాడై సృష్టికర్తయై తన స్వరూపమే అయిన జగత్తును కల్పించాడు. వాని మాయవలన ప్రాణులన్నీ నదులలో నదిసుడులలో పడి తిరిగే చెట్లలాగ భ్రమిస్తూ ఉంటాయి. ఇప్పుడున్నట్లే ప్రతి కల్పంలోను దేవతలు, రాక్షసులు, మానవులు మొదలైనవారు ఉంటారు.

కౌమారసర్గం దేవసర్గంలో ఒక భాగమే అయినా ప్రాకృత వైకృతముల రెండింటి స్వభావం కలిగి ఉంటుంది. అందులో దైవత్వ మనుష్యత్వాలు రెండూ కలిసి ఉంటాయి. అదే సనత్కుమారాది సర్గం. సంకల్పబలం కల పురుషోత్తముడు ఈ విధమైన భేదాలతో ఈ జగత్తును కల్పించాడు అని చెప్పి మైత్రేయుడు కాల లక్షణం తెలియజేయాలనుకొన్నవాడై ఈ విధంగా చెపుతున్నాడు.

**సీ. భువిఁదన కార్యాంశమునకు నంతము నన్య వస్తుయోగంబు నేవలన లేక**
**ఘటపటాదికజగత్కార్యంబునకు నిజ సమవాయకారణత్వమునఁబరఁగి**
**జాలసూర్యమరీచి సంగతగగనస్థ మగు త్రసరేణుషడంశమరయఁ**
**బరమాణు వయ్యెఁ; దత్పరమాణువం దర్క గతి యెంత తడవు దత్కాల మగును**

**తే. సూక్ష్మకాలంబు; విను మది సూర్యమండ, లంబు ద్వాదశరాశ్యాత్మకంబనంగఁ**
**గలుగు జగమున నొక యేఁడు గడచి చనినఁ, గాల మెంతగు నది మహత్కాల మనఘ! 345**

**ప్రతి :** అనఘ!= పుణ్యాత్ముడవైన విదురా!; భువిన్= ఈ నేలపై; తన కార్యాంశమునకున్= భగవంతుని సృష్టినిర్మాణరూప కార్యాంశకు; అంతమున్= తుది; అన్యవస్తు+యోగంబున్= వేరే వస్తువులతో కలయిక; ఏవలనన్= ఏ విధంగాను; లేక; ఘట= కుండ; పట+ఆదిక= వస్త్రము మొదలగు; జగత్కార్యంబునకున్= సృష్టినిర్మాణమునకు; నిజసమవాయ కారణత్వమునన్= తాను సమవాయకారణమై (నిత్య సంబంధం కలవాడై); పరఁగి= ఒప్పి; జాల= కిటికీగుండా వచ్చే; సూర్యమరీచి= సూర్యుని కిరణాలతో; సంగత= కూడినది; గగనస్థము+అగు= ఆకాశంలో ఉన్నదియు నగు; త్రసరేణు షడంశము= దుమ్ము కణంలో ఆరవభాగం; అరయన్= గమనింపగా; పరమాణువు+అయ్యెన్= పరమాణువు అనబడుతుంది; తద్+పరమాణువు+అందున్= ఆ పరమాణువులో; అర్కగతి= సూర్యగమనం; ఎంత తడవు= ఎంత సమయం తీసుకొంటుందో; తద్+కాలము= ఆ సమయం; సూక్ష్మకాలంబు= సూక్ష్మకాలం అనే పేరుగలది; అగును= అవుతుంది; వినుము= శ్రద్ధగా ఆలకించు; అది= ఆ సూక్ష్మకాలమనే కాంతికిరణం; సూర్యమండలంబు= సూర్యమండలంతోను; ద్వాదశరాశి+ఆత్మకంబు= మేషమునుండి మీనమువరకు గల 12 రాసులతోను కూడినది; అనంగన్= అనునట్లు; జగమునన్= ప్రపంచంలో (ఖగోళంలో); ఒక+ఏఁడు+కడచి+చనినన్= ఒక సంవత్సరకాలం దాటి నడచినచో; కాలము+ఎంత+అగున్= ఎంత సమయం పడుతుందో; అది+మహత్కాలము= అది మహత్కాలమౌతుంది.

**తా :** పుణ్యాత్ముడవైన విదురా! భగవంతుడు చేసే సృష్టికార్యానికి అంతు లేదు. మరొక వస్తువుతో పనిలేదు. కుండ చేయాలంటే మన్ను, కుమ్మరి, అలాగే బట్ట నేయాలంటే ప్రత్తి, నేతగాడు కావలసినట్లుగా జగన్నిర్మాణానికి పరమాత్మకు ఉపాదానకారణమో, నిమిత్తకారణమో అక్కరలేదు. తానే సమవాయకారణమై అనగా నిత్యసంబంధం కలవాడుగా ఉంటాడు. ఒక కిటికీగుండా సూర్యకాంతి పడుతుంటే అందులో ఎగురుతూ కనిపించే మట్టికణం ఎంత ఉంటుందో అందులో ఆరవ వంతును పరమాణువు అంటారు. ఆ పరమాణువును దాటేందుకు కాంతికి ఎంత సమయం పడుతుందో దానిని సూక్ష్మకాలం అంటారు. అది పన్నెండు రాసులు, సూర్యమండలంతో కూడిన జగత్తులో ప్రయాణించే ఏడాది కాలాన్ని మహత్కాలం అంటారు.

**వ. అందుఁ బరమాణు ద్వయంబొక్క "యణు" వగు; నణుత్రితయం బొక్క "త్రసరేణు" వగు; నవి మూఁడు గూడ నొక్క "త్రుటి" యగు; నాత్రుటిశతం బొక్క "వేధ" యనంబరఁగు; నట్టి వేధలు మూఁడు గూడ నొక్క "లవం" బనందగు; నవి మూఁడైన నొక్క "నిమేషం" బనంజను; నిమేషత్రయం బొక్క "క్షణం బగు; తత్క్షణ పంచకం బొక్క "కాష్ఠ" యనం దగు; నవి పదియైన నొక్క "లఘు" వన నొప్పు; నట్టి లఘుపంచ దశకంబొక్క "నాడి" యనంబరఁగు; నట్టి నాడికాద్వయం బొక్క "ముహూర్తం" బయ్యె; నట్టి నాడిక లార్నైన-నేడైన-మనుష్యులకు నొక "ప్రహరం" బగు; నదియ "యామం" బనంజను; దివసపరిమాణ విజ్ఞేయంబగు నాడికోన్మాన లక్షణం బెఱింగింతు వినుము; షట్పల తామ్రంబునం బాత్రంబు రచియించి చతుర్మాష సువర్ణంబునం జతురంగుళాయామశలాకంబుఁ గల్పించి దానం దత్పాత్రమూలంబున ఛిద్రంబుఁ గల్పించి తచ్ఛిద్రంబునం బ్రస్థమాత్ర తోయంబు పరిపూర్ణంబు నొందునంత కాలం బొక్క "నాడిక" యగు; యామంబులు నాలుగు సన నొక్క "పగ" లగు; రాత్రియు నిప్పగిది జరగు;నట్టి యహర్నిశంబులు గూడ మర్త్యుల కొక "దివసం" బగు; నవి పదునేనైన నొక్క "పక్షం" బగు; శుక్ల కృష్ణ నామంబులం బరఁగిన యప్పక్షంబులు రెండుగూడ నొక్క 'మాసం' బగు; నది పితృదేవతలకు నొక్క "దివసం" బగు; నట్టి మాసంబులు**

**రెండైన నొక్క "ఋతు" వగు; షణ్మాసంబు లరిగిన నొక్క 'యయనం' బగు; దక్షిణోత్తర నామంబులం బరఁగినట్టి యయనంబులు రెండుగూడి ద్వాదశ మాసంబులైన నొక్క "సంవత్సరం" బగు; నట్టి సంవత్సరశతంబు నరులకుం బరమాయు వైయుండుఁ; గాలాత్ముండును నీశ్వరుండునునైన సూర్యుండు గ్రహ నక్షత్ర తారా చక్రస్థుండై పరమాణ్వాది సంవత్సరాంతంబైన కాలంబునం జేసి ద్వాదశ రాశ్యాత్మకంబైన జగంబున సౌర బార్హస్పత్య సావన చాంద్ర నాక్షత్ర మాన భేదంబులం గానంబడు చున్నవాఁడై సంవత్సర పరీవత్స రేడావత్స రానువత్సర వత్సర నామంబుల సృజ్యంబైన బీజాంకురంబుల శక్తిం గాలరూపంబైన స్వశక్తిచేత నభిముఖంబుగాఁ జేయుచుఁ బురుషులకు నాయురాది వ్యయంబులం జేసి విషయాసక్తి నివర్తింపం జేయుచుం గోరికలు గల వారికి యజ్ఞ ముఖంబులం జేసి గుణమయంబులైన స్వర్గాది ఫలంబుల విస్తరింపంజేయుచు, గగనంబునఁ బరువువెట్టు వత్సరపంచక ప్రవర్తకుండగు మార్తాండునకుం బూజ గావింపు మని మైత్రేయుండు పలికిన విదురుండిట్లనియె. 346**

**ప్రతి :** అందున్= ఆ మహత్కాలంలో; పరమ+అణుద్వయంబు= రెండు పరమాణువులు కలిసి; ఒక్క+అణువు+అగున్= ఒక అణువు అవుతుంది; అణు+త్రితయంబు= మూడు అణువులు కలిసి; ఒక్క త్రసరేణువు+అగును= ఒక త్రసరేణువు అవుతుంది; అవి మూఁడు+కూడన్= త్రసరేణువులు మూడు కలిస్తే; ఒక్క త్రుటి+అగున్= ఒక త్రుటి అవుతుంది; ఆ త్రుటిశతంబు= వంద త్రుటులు; ఒక్క వేధ+అనన్+పరఁగున్= ఒక వేధ అనబడుతుంది; అట్టి వేధలు మూఁడు+కూడన్= అటువంటి మూడు వేధలు కలిసి; ఒక్క లవంబు+అనన్+తగున్= ఒక లవము అవుతుంది; అవి మూఁడు+ఐనన్= ఆ లవాలు మూడైతే; ఒక్క నిమేషంబు+అనన్+చనున్= ఒక నిమేషమనబడుతుంది; నిమేష త్రయంబు= మూడు నిముషాలు; ఒక్క క్షణంబు+అగున్= ఒక క్షణమవుతుంది; తద్+క్షణపంచకంబు= అటువంటి క్షణాలు ఐదు కలిస్తే; ఒక్క కాష్ఠ అనన్+తగున్= ఒక కాష్ఠ అని పిలువబడుతుంది; అవి= ఆ కాష్ఠలు; పది+ఐనన్= పది కాష్ఠలు కలిస్తే; ఒక్క లఘువు+అనన్+ఒప్పున్= ఒక లఘువు అవుతుంది; అట్టి లఘుపంచదశకంబు= అలాంటి పదునైదు లఘువులు; నాడి+అనన్+పరఁగున్= నాడి అనబడుతుంది; అట్టి నాడికా ద్వయంబు= అటువంటి రెండు నాడులు; ఒక్క ముహూర్తంబు+అయ్యెన్= ఒక ముహూర్తమవుతుంది; అట్టి నాడికలు= అటువంటి నాడికలు; ఆఱు+ఐనన్+ఏడు+ఐనన్= ఆరుకాని ఏడు కాని అయితే; మనుష్యులకున్= మానవులకు; ఒక ప్రహరంబు+అగున్= ఒక ప్రహరము అవుతుంది; అదియ యామంబు+అనన్+చనున్= దానినే యామము (జాము) అంటారు; దివసపరిమాణ విజ్ఞేయంబు+అగు= దినముయొక్క పరిమాణంచే తెలియదగిన; నాడికా+ఉన్మాన లక్షణంబు= నాడికను కొలిచే పద్ధతిని; ఎఱింగింతున్= తెలియజేస్తాను; వినుము= విను; షట్+ఫల తామ్రంబునన్= అరువదినాలుగు మినపగింజల ఎత్తుగల రాగితో; పాత్రంబు రచియించి= ఒక గిన్నెను తయారుచేసి; చతుర్మాష సువర్ణంబునన్= నాలుగు మినపగింజల ఎత్తు బంగారంతో; చతుర్+అంగుళ+ఆయామ శలాకంబున్= నాలుగు అంగుళాల పొడవు కల కమ్మిని; కల్పించి= తయారుచేసి; దానన్= ఆ కమ్మితో; తద్+పాత్రమూలంబునన్= ఆ గిన్నె మొదలులో; ఛిద్రంబున్+కల్పించి= రంధ్రము చేసి; తద్+ఛిద్రంబునన్= ఆ రంధ్రంద్వారా; ప్రస్థమాత్ర తోయంబు= నాలుగు శేర్ల నీరు; పరిపూర్ణంబున్+ఒందునంత కాలంబు= నిండేందుకు పట్టేకాలం; ఒక నాడిక+అగున్= ఒక నాడిక అవుతుంది; యామంబులు నాలుగు+చనన్= నాలుగు జాములు గడిస్తే; ఒక్క పగలు+అగున్= ఒక పగటి భాగమవుతుంది; రాత్రియు ఈ+పగిదిన్+జరుగున్= మరొక నాలుగు జాములు గడిస్తే రాత్రి అవుతుంది; అట్టి+అహస్+నిశంబులు+కూడన్=

అటువంటి ఒక పగలు ఒక రాత్రి కలిసి; మర్త్యులకున్= మనుష్యులకు; ఒక దివసంబు+అగున్= ఒక దినము అవుతుంది; అవి పదునేను+ఐనన్= ఆ దినములు పదునైదు గడిస్తే; ఒక్క పక్షంబు+అగున్= ఒక పక్షము అవుతుంది; శుక్ల కృష్ణ నామంబులన్+పరఁగిన= శుక్లము, కృష్ణము అను పేర్లతో వ్యవహరింపబడే; ఆ+పక్షంబులు రెండు+కూడన్= రెండు కలిస్తే; ఒక్క మాసంబు+అగున్= ఒక నెల అవుతుంది; అది= ఆ నెల; పితృదేవతలకున్= ఆ నెల పితృదేవతలకు; ఒక్క దివసంబు+అగున్= ఒక్క రోజు అవుతుంది; అట్టి మాసంబులు రెండు+అయినన్= అటువంటి రెండు నెలలు గడిస్తే; ఒక్క ఋతువు+అగున్= ఒక ఋతువు అవుతుంది; షట్+మాసంబులు+అరిగినన్= ఆరు నెలలు గడిస్తే; ఒక్క+అయనంబు+అగున్= ఒక అయనము అవుతుంది; దక్షిణ+ఉత్తర నామంబులన్+పరఁగినట్టి= దక్షిణాయన ఉత్తరాయణములనే పేర్లతోనుండు; అయనంబులు రెండు+కూడి= రెండు అయనాలు కలిసి; ద్వాదశమాసంబులు+ఐనన్= పదిరెండు నెలలు జరిగిన; ఒక్క సంవత్సరంబు+అగున్= ఒక ఏడాది కాలమవుతుంది; అట్టి సంవత్సర శతంబు= అట్టి నూరు ఏండ్లు; నరులకున్+ పరమాయువు+ఐ+ఉండున్= మానవులకు పూర్ణాయువు అగును; కాల+ఆత్ముండును= కాలస్వరూపుడును; ఈశ్వరుండును+ ఐన= కాలస్వరూపుడు, ప్రభువునైన; సూర్యుండు= ఆదిత్యుడు; గ్రహ, నక్షత్ర, తారా, చక్రస్థుండు+ఐ= గ్రహాల, నక్షత్రాల, చుక్కల చక్రమునందున్నవాడై; పరమ+అణు+ఆది సంవత్సర+అంతంబు+ఐన= పరమాణువునుండి సంవత్సరం వరకు; కాలంబునన్+చేసి= కాలంతో; ద్వాదశరాశి+ఆత్మకంబు+ఐన= పదిరెండు రాసులతో కూడిన; జగంబునన్= ప్రపంచంలో; సౌర= సూర్యమానము; బార్హస్పత్య= బృహస్పతిమానము; సావన= యజ్ఞమానము; చాంద్ర= చంద్రమానము; నాక్షత్రమానభేదంబులన్= నక్షత్రమానములనే భేదాలతో; కానన్+పడుచున్నవాఁడై= గోచరించుచున్నవాడై; సంవత్సర= సంవత్సరము; పరీవత్సర= పరీవత్సరము; ఇడావత్సర= ఇడావత్సరము; అనువత్సర= అనువత్సరము; వత్సర నామంబులన్= వత్సరము అను పేర్లతో; సృజ్యంబైన బీజ+అంకురంబుల శక్తిన్= సృజింపదగిన విత్తనాలు మొలకలైన శక్తిని పోలిన; కాలరూపంబు+ఐన= కాలరూపంతో ఉన్న; స్వశక్తిచేతన్= తన శక్తితో; అభిముఖంబుగాన్+చేయుచున్= సృష్టిని తనకు అనుకూలంగా చేసికొంటూ; పురుషులకున్= మానవులకు; ఆయుస్+ఆది వ్యయంబులన్+చేసి= ఆయువు మొదలగునవి తరిగిపోవుచుండుటచే; విషయ+ఆసక్తిన్ నివర్తింపన్+చేయుచున్= భోగేచ్ఛను తగ్గిస్తూ; కోరికలు+కలవారికిన్= కోరికలున్నవారికి; యజ్ఞముఖంబులన్+చేసి= జన్నములు మొదలగువానిని చేసి; గుణమయంబులు+ఐన= గుణములతో కూడిన; స్వర్గ+ఆది ఫలంబులన్= స్వర్గావాసము మొదలగు ఫలితాలను; విస్తరింపన్+చేయుచున్= వ్యాప్తి పొందిస్తూ; గగనంబునన్= ఆకాశంలో; పరువు+పెట్టు= పరుగెత్తే; వత్సర, పంచక, ప్రవర్తకుండు+అగు= ఐదు వత్సరాలను నడపు; మార్తాండునకున్= సూర్యభగవానునికి; పూజ+కావింపుము+అని= పూజ చెయ్యి అని; మైత్రేయుండు పలికినన్= మైత్రేయమహర్షి పలుకగా; విదురుండు+ఇట్లు+అనియెన్= విదురుడు ఇలా అన్నాడు.

**తా :** రెండు పరమాణువులు ఒక అణువు. అణువులు మూడు కలిస్తే త్రసరేణువు. అవి మూడైతే త్రుటి. నూరు త్రుటులు వేధ. వేధలు మూడైతే లవం. మూడు లవాలు నిమేషం. మూడు నిమేషాలు క్షణం. ఐదు క్షణాలు కాష్ఠ. పది కాష్ఠలు లఘువు. పదునైదు లఘువులు నాడి. రెండు నాడులు ముహూర్తం. నాడులు ఆరు లేదా ఏడైతే మానవునకు ప్రహరం. దానినే యామం అంటారు. దినపరిమాణాన్ని తెలియజేసే నాడిని ఎలా కొలవాలో చెపుతాను విను. ఆరు పలాల రాగితో పాత్రను సిద్ధం చేసి, నాలుగు మినపగింజల బరువు గల బంగారంతో నాలుగు అంగుళాల పొడవైన కాడను తయారుచేసి, దానితో ఆ పాత్ర కింద రంధ్రం చేస్తే దానిగుండా తూమెడు నీరు పూర్తిగా కిందికి కారేందుకు ఎంతకాలం పడుతుందో ఆ కాలాన్ని నాడి అంటారు.

నాలుగు యామములైతే ఒక పగలు. అంతే కాలం ఒక రాత్రి. ఆ రెండూ కలిస్తే ఒక దినం. అవి పదునైదు కలిస్తే పక్షం. శుక్ల, కృష్ణ అనే రెండు పక్షాలు కలిస్తే మాసం. రెండు నెలలు ఒక ఋతువు. ఆరు నెలలు ఒక అయనం. ఉత్తర దక్షిణ అయనాలు రెండు కలిస్తే అనగా పన్నెండు నెలలు జరిగితే ఒక సంవత్సరం. ఆ సంవత్సరం దేవతలకు ఒక దినం. నూరు సంవత్సరాలు మానవులకు పరమాయువు.

కాలాత్ముడైన సూర్యుడు గ్రహ నక్షత్రాలతో తారలతోకూడినవాడై పరమాణువునుండి సంవత్సరంవరకూ పట్టే కాలంలో పన్నెండు రాసులనూ చుట్టివస్తాడు. సూర్యగమనంవల్ల సౌరమానం, చాంద్రమానం, నక్షత్రమానం అనే భేదాలతో ఏడాది కాలం ఏర్పడుతుంది. ఇది సంవత్సరం, పరీవత్సరం, ఇడావత్సరం, అనువత్సరం, వత్సరం అనే భేదాలు కలిగి ఉంటుంది. ఈ ఐదు వత్సరాలను ప్రవర్తింపజేసే సూర్యుడు విత్తనాలనుండి మొలకలు వచ్చినట్లు కాలరూపమైన స్వీయశక్తితో జీవసృష్టిని అనుకూలం చేసికొంటూ మానవులకు ఆయువు తరిగిపోతుంటుంది కనుక భోగాలపై కోరికలు తగ్గిస్తూ, కోరికలు కలవారికి యజ్ఞాలద్వారా స్వర్గాది ఫలాలను అందిస్తూ ఆకాశంలో సంచరిస్తుంటాడు. ఈ విధంగా ఐదు రకాలైన వత్సరాలను ప్రవర్తింపజేసే ఆదిత్యునకు నమస్కరించు అని మైత్రేయుడు విదురునకు చెప్పాడు.

**క. నరపితృసుర పరమాయుః, పరిమాణము లెఱుఁగ నాకుఁబలికితివి, మునీ**
**శ్వర! యెఱిఁగింపు త్రిలోకో, పరిలోక విలోకనైకపరులగు వారిన్. 347**

**ప్రతి :** మునీశ్వర!= మైత్రేయమహర్షీ!; నర= మానవులయొక్క; పితృ= పితృదేవతలయొక్క; సుర= దేవతలయొక్క; పరమాయుస్= పూర్తి ఆయువుయొక్క; పరిమాణములు= అవధులను; ఎఱుఁగన్= తెలిసికొనుటకు; నాకున్= నా కోసమై; పలికితివి= వివరించావు; త్రిలోక= ముల్లోకములను; ఉపరిలోక= వాటిపైనుండే లోకాలను; విలోకన+ఏకపరులగు= దర్శించుటయే ప్రధానముగా గల; వారిన్= వారినిగురించి; ఎఱిఁగింపుము= తెలియజేయుము.

**తా :** మైత్రేయమహర్షీ! నీవు నాకు మానవులు, పితృదేవతలు, దేవతలు వారి వారి ఆయుర్దాయ వివరాలను తెలియజేశావు. అలాగే ముల్లోకాలను, వాటి పైనుండే లోకాలను సందర్శించే భాగ్యవంతుల వివరాలనుకూడా తెలియజేయుమని విదురుడు అడిగాడు.

**ఉ. పూనిన యోగసిద్ధి దగఁబొందిన నేత్రయుగంబునన్ బహిర్**
**జ్ఞానము గల్గి యుండి భువనంబులఁజూచుచు నుండువారికిన్**
**మానుగఁగల్గు కాలగతి నా కెఱిఁగింపు మునీంద్ర! నావుడు**
**న్నా నయశాలి యవ్విదురు నాదర మొప్పఁగఁజూచి యిట్లనున్. 348**

**ప్రతి :** మునీంద్ర!= మైత్రేయమహర్షీ!; పూనిన యోగసిద్ధి= పూనుకొన్న యోగసిద్ధితో; తగన్= తగినట్లుగా; పొందిన= సాధించిన; నేత్రయుగంబునన్= రెండు కళ్లతో; బహిర్+జ్ఞానము= బాహ్యదృష్టి; కల్గియుండి= పొందియుండి; భువనంబులన్= లోకాలను; చూచుచున్= దర్శిస్తూ; ఉండువారికిన్= ప్రవర్తించేవారికి; కల్గు= ఏర్పడు; కాలగతిన్= కాలం ఎలా ఉంటుందో; మానుగన్= చక్కగా; నాకున్+ఎఱిగింపు= నాకు తెలియజేయుము; నావుడున్= అని పల్కగా; ఆ+నయశాలి= ఆ జ్ఞానియైన మైత్రేయుడు; ఆ+విదురున్= ఆ విదురుని; ఆదరము+ఒప్పఁగన్= వాత్సల్యభావంతో; చూచి= వీక్షించి; ఇట్లు+అనున్= ఈ విధంగా పలుకసాగాడు.

**తా :** మహర్షీ! యోగసిద్ధిద్వారా విశేష నేత్రశక్తి కలిగి అన్ని లోకాలను దర్శించగలిగిన మహానుభావుల కాలవిశేషాలనుగూర్చి నాకు తెలియజేయవలసిందని అడిగిన విదురుని వాత్సల్యపూర్వకంగా చూచి జ్ఞానియైన మైత్రేయుడు ఇలా పలుకసాగాడు.

**సీ. జననుత! కృతయుగసంఖ్య నాలుగువేల దివ్యవర్షములు; దదీయసంధ్య**
**లెనిమిది నూఱేండ్లు; విను త్రేతవత్సర త్రిసహస్రము లగుఁదదీయసంధ్య**
**లాఱునూఱేఁడులు నగు; ద్వాపరము రెండు వేల వత్సరముల వెలయు సంధ్య**
**లోలి నన్నూఱేఁడు; లొగిఁ గలియుగము సహస్రవర్షములు సంధ్యాంశ మరయ**

**తే. రెండు నూఱేఁడులును నిల్చి యుండుఁ జువ్వె?, యనఘ! సంధ్యాంశ మధ్యంబునందు ధర్మ**
**మతిశయించును; సంధ్యాంశమందు ధర్మ, మల్పమై కానఁబడుచుండు ననఘచరిత! 349**

**ప్రతి :** జననుత!= జనులచే కొనియాడబడే విదురా!; విను= ఆలకించు; కృతయుగసంఖ్య= కృతయుగముయొక్క పరిమాణము; నాలుగువేల= నాలుగువేలు సంఖ్యగల; దివ్యవర్షములు= దివ్య సంవత్సరాలు; తదీయ సంధ్యలు= కృతయుగం దాటి త్రేతాయుగం వచ్చే మధ్యకాలం; ఎనిమిది నూఱు+ఏండ్లు= ఎనిమిది వందల సంవత్సరాలు; త్రేత= త్రేతాయుగము; వత్సరత్రిసహస్రములు+అగున్= మూడువేల సంవత్సరాలు కలదగును; తదీయసంధ్యలు= త్రేతకు ద్వాపరమునకు మధ్యకాలం; ఆఱు+నూఱేఁడులున్+అగున్= ఆరువందల సంవత్సరాలు ఉంటుంది; ద్వాపరము= ద్వాపరయుగం; రెండువేల వత్సరముల= రెండువేల సంవత్సరాలతో; వెలయున్= ఉండును; ఓలిన్= క్రమముగా; సంధ్యలు= ద్వాపర కలియుగాల మధ్యకాలం; నన్నూఱేఁడులు= నాలుగు వందల సంవత్సరాలు; ఒగిన్= ఆ క్రమంలో; కలియుగము= కలియుగం; సహస్రవర్షములు= వేయి దివ్యసంవత్సరాలు; సంధ్యాంశము+అరయన్= కలి కృత మధ్యభాగము పరిశీలించగా; రెండునూఱేఁడులును= రెండువందల ఏండ్లు; నిల్చియుండున్+చువ్వె= నిలిచి ఉంటుంది సుమా; అనఘ!= పుణ్యాత్ముడవైన విదురా!; సంధ్యా+అంశమధ్యంబునందున్= సంధ్యల మధ్యకాలంలో (అసలైన యుగాలలో); ధర్మము+అతిశయించును= ధర్మం విస్తారంగా ఉంటుంది; అనఘచరిత!= పుణ్యచరిత్ర కలవాడా!; సంధ్యాంశమందున్= యుగానికి యుగానికి మధ్యకాలంలో; ధర్మము= ధర్మం (మంచితనం); అల్పమై= స్వల్పంగా; కానన్+పడుచుండున్= కనబడుతుంటుంది.

**తా :** పుణ్యాత్ముడా విదురా! చెపుతున్నాను విను. కృతయుగం పరిమాణం నాలుగువేల దివ్యసంవత్సరాలు. అది గడిచాక త్రేతాయుగం రావడానికి ఎనిమిది వందల ఏండ్లు పడుతుంది. త్రేతాయుగం మూడువేల దివ్యసంవత్సరాలు. తరువాత ద్వాపరం రావడానికి ఆరువందల ఏండ్లు పడుతుంది. ద్వాపరం రెండువేల దివ్యసంవత్సరాలుంటుంది. తరువాత కలియుగం వచ్చేందుకు నాలుగు వందల ఏండ్లు పడుతుంది. కలియుగం వేయి దివ్యసంవత్సరాలుంటుంది. మళ్లీ కృతయుగం వచ్చేందుకు రెండువందల ఏండ్లు పడుతుంది. యుగానికి యుగానికి మధ్యకాలాన్ని సంధ్యాకాలం అంటారు. యుగాలు నడిచేకాలంలో ధర్మం విస్తారంగా ఉంటుంది. యుగానికి యుగానికి మధ్యనున్న సంధ్యాకాలంలో ధర్మం స్వల్పంగా కనిపిస్తుంది.

**వ. మఱియు ధర్మదేవత కృతయుగంబున నాలుగు పాదంబులును, ద్రేతయందు మూఁడు పాదంబులును, ద్వాపరంబునం బాదద్వయంబును, గలియుగంబున నేకపాదంబును, గలిగి సంచరించు నట్టగుటం జేసి. 350**

**ప్రతి :** మఱియున్= అంతే కాక; ధర్మదేవత= ధర్మస్వరూపమైన దేవత; కృతయుగంబునన్= కృతయుగంలో; నాలుగు పాదంబులును= నాలుగు కాళ్ళు; త్రేతయందున్= త్రేతాయుగంలో; మూఁడు పాదంబులును= మూడు కాళ్ళు; ద్వాపరంబునన్= ద్వాపరయుగంలో; పాదద్వయంబునున్= రెండు కాళ్ళు; కలియుగంబునన్= కలియుగంలో; ఏకపాదంబును= ఒకే కాలు; కలిగి సంచరించున్= కలిగి నడుస్తుంటుంది; అట్టు+అగుటన్+చేసి= అలా కావడంచేత...

**తా :** ధర్మదేవత కృతయుగంలో నాలుగు పాదాలతో నడుస్తుంది. త్రేతాయుగంలో మూడు పాదాలతో నడుస్తుంది. ద్వాపరయుగంలో రెండు పాదాలతో నడుస్తుంది. కలియుగంలో ఒకే పాదంతో నడుస్తుంది. అందువలన

**క. పాదవిభేదంబున మ, ర్యాదలును దఱుఁగు, నధర్మ మాకొలఁదినె యు**
**త్పాదిల్లి వృద్ధిఁ బొందు ధ, రాదివిజులు పాపబుద్ధిరతు లగుదు రిలన్. 351**

**ప్రతి :** పాదవిభేదంబునన్= ధర్మదేవత పాదాలు తగ్గిపోవడం చేత (కలిలో ఒంటిపాదమగుటచే); మర్యాదలును= కట్టుబాట్లు; తఱుఁగున్= తగ్గిపోతాయి (మానవులు వారి వారి హద్దులు మరచి ప్రవర్తిస్తారు); అధర్మము= చెడునడత; ఆ+కొలఁదినె= ధర్మము తరిగినంత స్థాయిలోనే; ఉత్పాదిల్లి= పుట్టి; వృద్ధిన్+పొందున్= అధికమవుతుంది; ఇలన్= భూమిపై; ధరాదివిజులు= బ్రాహ్మణులు; పాపబుద్ధిరతులగుదురు= పాపములు చేయుటయందు ఆసక్తి కలవారగుదురు.

**తా :** కలియుగంలో ధర్మదేవత ఒకేపాదంతో ఉంటుంది. అందువలన మానవులు కట్టుబాటులను అతిక్రమించి ప్రవర్తిస్తుంటారు. ధర్మం తగ్గినంత మేరకు అధర్మం పుట్టి పెరుగుతుంటుంది. ఈ నేలపై బ్రాహ్మణులు పాపకర్మాచరణాలందు ఆసక్తులవుతుంటారు.

**సీ. భూర్భువస్స్వర్లోకములకంటెఁ బొడువునఁ గడు నొప్పు సత్యలోకంబునందు**
**నుండు బ్రహ్మకుఁజతుర్యుగసహస్రము లేఁగ దివ మొక్కటి యగు రాత్రియును నిట్ల**
**చన ధాత నిద్రవో జగము లడంగు, మేల్కని చూడ మరల లోకములు పుట్టుఁ;**
**దద్దినమ్మునఁజతుర్దశమను లగుదు; రందొక్కొక్క మనువున కొనర దివ్య**

**తే. యుగము లోలిని డెబ్బదియొక్క మాఱు సనిన, మనుకాలమయ్యె; నమ్మను కులంబు**
**సురలు మునులును సప్తర్షు లరయ భగవదంశమునఁబుట్టి పాలింతు రఖిలజగము. 352**

**ప్రతి :** భూర్+భువస్+స్వర్+లోకముల కంటెన్= భూలోక భువర్లోక స్వర్గలోకాలకంటె; పొడవునన్= పైభాగమున; సత్యలోకంబు= సత్యము అను పేరుగల లోకం; కడున్+ఒప్పున్= మిక్కిలి ప్రకాశిస్తుంటుంది; అందున్+ఉండు= ఆ లోకంలో నివసించు; బ్రహ్మకున్= బ్రహ్మదేవునకు; చతుర్యుగ సహస్రములు= వేయి మహాయుగాలు (కృతాది నాలుగు యుగాలు ఒక మహాయుగం); ఏఁగన్= గడువగా; దివము+ఒక్కటి+అగున్= ఒక పగటి భాగమవుతుంది; రాత్రియునున్+ఇట్ల చనన్= అంతే పరిమాణంలో రాత్రికూడా గడువగా; ధాత నిద్రపోన్= రాత్రిభాగంలో బ్రహ్మ నిద్రకు ఉపక్రమించినపుడు; జగములు+అడంగున్= లోకాలన్నీ నశించిపోతాయి; మేల్కని చూడన్= మెలకువ వచ్చి కన్నుతెరిచి చూడగానే; మరల లోకములు పుట్టున్= తిరిగి లోకాలన్నీ ఏర్పడతాయి; తద్+దినమ్మునన్= ఆ పగటిభాగంలో; చతుర్దశ మనులు+అగుదురు= పదునలుగురు మనువులు ఏర్పడతారు; అందున్= అందులో; ఒక్కొక్క మనువునకున్= ఒక్కొక్క మనువునకు; ఒనరన్= తగినట్లుగా; దివ్యయుగములు= దివ్యయుగాలు; ఓలినిన్= క్రమముగా; డెబ్బది+ఒక్కమాఱు= డెబ్బదియొక్క తడవలు; చనినన్= గడువగా; మనుకాలము+అయ్యెన్= ఒక మన్వంతరమవుతుంది; ఆ+మనుకులంబు=

ఆ మన్వంతర కాలంలో; సురలు= దేవతలు; మునులును= మహర్షులు; సప్తర్షులు= సప్తమహాఋషులు; అరయన్= పరికింపగా; భగవత్+అంశమునన్= భగవంతుని అంశతో; పుట్టి= మనువులుగా జన్మించి; అఖిల జగమున్= సమస్త ప్రపంచాన్ని; పాలింతురు= పరిపాలిస్తారు.

**తా :** భూలోక, భువర్లోక, స్వర్గలోకాలకంటె పైన సత్యలోకం ఉంటుంది. ఆ లోకంలో బ్రహ్మదేవుడుంటాడు. నాలుగు మహాయుగాలు గడిస్తే ఆయనకు ఒక పగటిభాగం. మరో నాలుగు మహాయుగాలు గడిస్తే రాత్రిభాగం. బ్రహ్మ రాత్రివేళ నిద్రలోనికి జారుకొంటే అదే లయం. లోకాలన్నీ నశించిపోతాయి. తిరిగి మేలుకొని కన్ను తెరవగానే అవే లోకాలు మళ్లీ పుడుతుంటాయి. బ్రహ్మయొక్క పగటిభాగంలో ఏర్పడే లోకాలన్నిటినీ పరిపాలించేందుకు మనువులు పుడుతుంటారు. వారు పదునలుగురు. వారి వారి పరిపాలన కాలాన్ని మన్వంతరం అంటారు. ఒక్కొక్క మన్వంతరం డెబ్బదియొక్క మహాయుగాల కాలం ఉంటుంది. దేవతలు, మునులు, సప్తమహర్షులు భగవదంశతో జన్మించి మనువులై లోకాలను పరిపాలిస్తుంటారు.

**క. హరి పితృ సుపర్వ తిర్యఙ్న, ర రూపములన్ జనించి నయమున మన్వం**
**తరముల నిజసత్త్వంబునఁ, బరిపాలించును జగంబుఁబౌరుష మొప్పన్. 353**

**ప్రతి :** హరి= శ్రీమన్నారాయణుడు; పితృ= పితృదేవతల; సుపర్వ= దేవతల; తిర్యక్= పశుపక్ష్యాదుల; నరరూపములన్= మానవుల రూపాలతో; జనించి= పుట్టి; నయమునన్= నీతిమార్గంలో; మన్వంతరములన్= పదునాలుగు మన్వంతరాలలో; జగంబున్= ప్రపంచాన్ని; పౌరుషము+ఒప్పన్= పురుషకారంతో; నిజ సత్త్వంబునన్= తన సామర్థ్యంతో; పరిపాలించును= ఏలును.

**తా :** శ్రీమహావిష్ణువు పదునాలుగు మన్వంతరాలలోనూ పితృదేవతలుగా, దేవతలుగా, పశుపక్ష్యాదులుగా, మానవులుగా తానే జన్మిస్తుంటాడు. తన ఆత్మశక్తితో ఈ లోకాలను నీతిమార్గంలో పరిపాలిస్తుంటాడు.

**క. క్రమమునఁద్రైవర్గిక స, ర్గము సెప్పంబడె, సరోజగర్భుఁడు దివసాం**
**తమునఁదమఃపిహిత పరా, క్రముఁడై శయనించు నిద్రఁగైకొని యంతన్. 354**

**ప్రతి :** క్రమమునన్= వరుసగా; త్రైవర్గిక సర్గము= పశుపక్ష్యాదుల, నరుల, పితృదేవతల సృష్టినిగూర్చి; చెప్పంబడెన్= చెప్పబడినది; సరోజగర్భుఁడు= బ్రహ్మ; దివస+అంతమునన్= పగలుపూర్తికాగానే (రాత్రి); తమస్+పిహిత పరాక్రముఁడు+ఐ= చీకటిచేత కప్పబడిన సామర్థ్యము కలవాడై; అంతన్= అప్పుడు; నిద్రన్= నిద్రను; కైకొని= స్వీకరించి; శయనించున్= పండుకొనును.

**తా :** విదురా! తిర్యక్కుల, నరుల, పితృదేవతలకు సంబంధించిన సృష్టిని గురించి నీకు క్రమంగా చెప్పాను. పగటిభాగం పూర్తి కాగానే బ్రహ్మకున్న సృష్టినిర్మాణశక్తి అంతరించిపోతుంది. ఆ రాత్రి అతడు నిద్రలోకి జారుకొంటాడు.

**సీ. ఆ రాత్రి భువనత్రయము దమఃపిహితమై భానుచంద్రులతో విలీనమైన**
**సర్వాత్ముఁడగు హరి శక్తి రూపంబయి కడఁగి వెలుంగు సంకర్షణాగ్ని**
**భువనత్రయంబును దవిలి దహింప న య్యనలకీలలఁబొడమిన మహోష్మ**
**మలమినఁగమలి మహర్లోకవాసులు జనలోకమునకును జనుదు రపుడు**

**తే. విలయసమయసముత్కటవిపులచండ, వాతధూతోర్మిజాలదుర్వారవార్ధి**
**భువనములు ముంచు నమ్మూఁడు భువనములను, దత్పయోరాశిమీఁదఁబద్మావిభుండు. 355**

**ప్రతి :** ఆ రాత్రి= బ్రహ్మ నిద్రించిన ఆ రాత్రి; భువనత్రయము= ముల్లోకాలు; తమస్+పిహితమై= చీకటితో కప్పబడి; భానుచంద్రులతోన్= సూర్యచంద్రులతో; విలీనమైనన్= కలిసిపోగా; సర్వ+ఆత్ముఁడు+అగు హరి= సర్వము తానయైన శ్రీహరియొక్క; శక్తిరూపంబు+అయి= శక్తిరూపమై; కడఁగి వెలుంగు= పూని ప్రకాశించే; సంకర్షణ+అగ్ని= సంకర్షణము అను పేరుగల అగ్ని; తవిలి= పూనికతో; భువనత్రయంబును= ముల్లోకాలను; దహింపన్= కాల్చివేయగా; ఆ+అనలకీలలన్= ఆ అగ్నిజ్వాలలలో; పొడమిన= ఏర్పడిన; మహా+ఊష్మము= తీవ్రమైన వేడి; అలమినన్= వ్యాపించగా; కమలి= తపించిపోయి; మహర్లోకవాసులు= మహర్లోకానికి చెందినవారు; జనలోకమునకున్= జనలోకానికి; చనుదురు= పోవుదురు; అపుడు= అటు పిమ్మట; విలయసమయ= ప్రళయకాలపు వేళ; సముత్కట= అతిశయించిన; విపుల= విస్తారమైన; చండ= తీవ్రమైన; వాత= గాలిచేత; ధూత= ఎగురగొట్టబడిన (కంపించబడిన); ఊర్మిజాల= తరంగసముదాయం కల; దుర్వార= వారింప శక్యముకాని; వార్ధి భువనములు= సముద్రపు నీళ్లు; ఆ+మూఁడు భువనములను= ఆ ముల్లోకాలను; ముంచున్= ముంచివైచును; తద్+పయః+రాశిమీదన్= ఆ ప్రళయకాల సముద్రంపై; పద్మావిభుండు= లక్ష్మీనాథుడైన విష్ణువు...

**తా :** బ్రహ్మ నిదురించిన రాత్రి సూర్యచంద్రులతో పాటుగా లోకాలన్నీ చీకటిలో కూరుకుపోతాయి. సర్వాత్ముడైన శ్రీహరియొక్క సంకర్షణమనే అగ్ని బయలుదేరి ముల్లోకాలనూ తపింపజేస్తుంది. ఆ వేడికి తట్టుకోలేక మహర్లోకవాసులంతా జనలోకానికి వెళ్లిపోతారు. అపుడు భయంకరమైన గాలులతో ఉవ్వెత్తున ఎగసిపడే అలలతో సముద్రం అన్ని లోకాలనూ ముంచివేస్తుంది. ఆ సముద్రమధ్యంలో శ్రీమహావిష్ణువు శయనించి ఉంటాడు.

**ఉ. చారుపటీరహీరఘనసారతుషారమరాళచంద్రికా**
**పూర మృణాళహారపరిపూర్ణసుధాకరకాశమల్లికా**
**సార నిభాంగశోభితభుజంగమతల్పమునందు యోగ ని**
**ద్రారతిఁజెంది యుండు జఠరస్థితభూర్భువరాదిలోకుఁడై. 356**

**ప్రతి :** చారు= అందమైన; పటీర= మంచిగంధం; హీర= వజ్రం; ఘనసార= కర్పూరం; తుషార= మంచు; మరాళ= హంస; చంద్రికాపూర= పండు వెన్నెల; మృణాలహార= తామరతూండ్ల హారము; పరిపూర్ణ సుధాకర= నిండు చంద్రుడు; కాశ= రెల్లుపూవు; మల్లికాసార= మల్లెపూవుల సారములతో; నిభ+అంగ= సమానమైన శరీరంతో; శోభిత= ప్రకాశించుచున్న; భుజంగమ= ఆదిశేషునిరూపమైన; తల్పమునందు= శయ్యపై; జఠరస్థిత= కడుపులో నిక్షిప్తమైయున్న; భూః+భువర్+ఆది= భూలోకము మొదలగు; లోకుఁడై= లోకాలు కలవాడై; నిద్రారతిన్= నిద్రయందు ఆసక్తిని; చెంది+ఉండున్= కలిగియుంటాడు శ్రీహరి.

**తా :** అందమైన మంచిగంధం, వజ్రం, కర్పూరం, మంచు, హంస, పండువెన్నెల, తామరతూండ్ల హారం, నిండు చంద్రుడు, రెల్లుపూవు, మల్లెపూలచెండు – వీటిలాగ తెల్లని శరీరంతో సొగసులు చిందుతున్న ఆదిశేషునిపై సమస్త భువనాలు కడుపులో దాచుకొన్న హరి ప్రళయకాలంలో సముద్రంలో శయనించి ఉంటాడు.

**క. జనలోకనివాసకు లర్థిని, వినుతింపంగ నతుల దివ్యప్రభచేఁ**
**దనరుచు మీలితనిజ లో, చనుఁడై వసియించు నతఁడు సముచితలీలన్. 357**

**ప్రతి :** జనలోక నివాసకులు= జనలోకంలో నివసించేవారు; అర్థిని= కోరికతో; వినుతింపంగన్= ప్రస్తుతించుచుండగా; అతులదివ్యప్రభచేన్= సాటిలేని గొప్పకాంతితో; తనరుచున్= ప్రకాశిస్తూ; మీలిత, నిజలోచనుఁడై= మూసుకొన్న తన కనులు కలవాడై; సముచితలీలన్= తగినవిధంగా; అతఁడు= శ్రీహరి; వసియించున్= శేషతల్పంపై శయనించి ఉంటాడు.

**తా :** జనలోకంలోనివారందరూ భక్తిగా ప్రార్థిస్తుండగా సాటిలేని తేజస్సుతో కన్నులు మూసుకొని శేషశయ్యపై యోగనిద్రలో ఉంటాడు శ్రీమహావిష్ణువు.

**వ. ఇవ్విధంబున. 358**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ పద్ధతిగా.

**తా :** ఈ ప్రకారంగా.

**సీ. కైకొని బహువిధకాలగత్యుపలక్షితములై యహోరాత్రతతులు జరుగ**
**శతవత్సరంబులు జనులకుఁబరమాయు వైనరీతిని బంకజాసనునకుఁ**
**బరమాయువగు శతాబ్దంబు; లందుల సగ మరిగిన నదియుఁ బరార్థ మండ్రు;**
**గాన పూర్వార్ధంబు గడచుటఁ జేసి ద్వితీయపరార్ధంబు దీని పేరు;**

**తే. గడఁగి పూర్వపరార్ధాదికాలమందు, బ్రహ్మకల్పాఖ్య నెంతయు బరఁగు; నందు**
**బ్రహ్మ యుదయించుటంజేసి బ్రహ్మకల్ప, మనియు శబ్దాత్మకబ్రహ్మ మనియు నెగడు. 359**

**ప్రతి :** అహోరాత్ర తతులు= రేయింబవళ్ల సముదాయాలు; కైకొని= ఈ పద్ధతిని అనుసరించి; బహువిధకాలగతి+ ఉపలక్షితములై= బహుప్రకారమైన కాలగమనానికి లోబడినవై; జరుగన్= సాగుచుండగా; జనులకున్= మానవులకు; శతవత్సరంబులు= నూరేండ్లు; పరమాయువు+ఐన రీతినిన్= పూర్ణాయువైనట్లుగా; పంకజ+ఆసనునకున్= బ్రహ్మకుకూడ; శత+అబ్దంబులు= నూరు దివ్యసంవత్సరాలు; పరమాయువు+అగు= పూర్ణాయువగును; అందుల, సగము+అరిగినన్= దానిలో సగము (50 దివ్య సంవత్సరాలు) గడువగా; అదియున్= ఆ కాలాన్ని; పర+అర్ధమండ్రు= పరార్ధమందురు; కానన్= అందువలన; పూర్వ+అర్ధంబు గడచుటన్+చేసి= మొదటి పరార్ధము గడిచిపోయినది కనుక; దీని పేరు= ఇప్పుడు నడుస్తున్న కాలం పేరు; ద్వితీయ పరార్ధంబు= ద్వితీయపరార్ధము (రెండవ పరార్ధము); కడఁగి= పూనుకొని; పూర్వపరార్ధాది కాలమందున్= రెండు పరార్ధ కాలాలలోను; బ్రహ్మకల్ప+అఖ్యన్= బ్రహ్మకల్పమనే పేరుతో; ఎంతయున్+పరఁగున్= ఈ సృష్టి నడుస్తుంటుంది; అందున్= ఈ కాలంలో; బ్రహ్మ+ఉదయించుటన్+చేసి= బ్రహ్మ ఉదయించుటచేత; బ్రహ్మకల్పము+ అనియున్= బ్రహ్మకల్పమనే పేరుతోను; శబ్దాత్మకబ్రహ్మము+అనియున్= శబ్దబ్రహ్మకల్పమనే పేరుతోను; నెగడున్= ప్రవర్తించును.

**తా :** ఈ విధంగా ఎన్నో రీతులుగా సాగే కాలగమనంలో రేయింబవళ్లు సాగిపోతుంటాయి. మానవునకు వందేళ్లు పూర్ణాయువైనట్లే బ్రహ్మకు నూరు దివ్యసంవత్సరాలు పూర్ణాయువు. అందులో మొదటి సగానికి పూర్వ పరార్ధమని, రెండవ సగానికి ద్వితీయ పరార్ధమని పేరు. ఇప్పుడు మనం ద్వితీయ పరార్ధంలో ఉన్నాం. పూర్వపరార్ధకాలంలోనే బ్రహ్మ ఉదయిస్తాడు కనుక దానిని బ్రహ్మకల్పమని, శబ్దబ్రహ్మకల్పమని వ్యవహరిస్తారు.

**క. విను మెన్నఁడు పంకజనా, భుని నాభీసరసియందు భువనాశ్రయమై**
**తనరిన పద్మము వొడమును, ననఘా! యది "పద్మకల్ప" మన విలసిల్లున్. 360**

**ప్రతి :** అనఘా!= పుణ్యాత్ముడవైన విదురా!; వినుము; ఎన్నఁడు= ఏనాడైతే; పంకజనాభుని= పద్మమును బొడ్డుగా గల శ్రీమహావిష్ణువుయొక్క; నాభీసరసియందున్= నాభియనే సరస్సునందు; భువన+ఆశ్రయమై= లోకాలకు ఆధారమై; తనరిన= ఒప్పిన; పద్మము= మహాకమలము; పొడమును= పుడుతుందో; అది= ఆ కాలం; పద్మకల్పము+అనన్= పద్మకల్పమనే పేరుతో; విలసిల్లున్= ఒప్పును.

**తా :** పుణ్యాత్ముడవైన విదురా! విను. ఏనాడైతే శ్రీమహావిష్ణువుయొక్క నాభి అనే సరస్సునుండి లోకాశ్రయమైన మహాపద్మం ఆవిర్భవిస్తుందో, ఆ కాలం పద్మకల్పమనే పేరు కలిగి ఉంటుంది.

**వ. పూర్వపరార్ధాదినిం గలిగిన బ్రహ్మకల్పంబుఁ జెప్పితి; నింక ద్వితీయ పరార్ధంబు మొదలు నెన్నఁడేని హరి సూకరాకారంబు దాల్చు నది వరాహకల్పం బనందగు, నట్టి వరాహకల్పం బిపుడు వర్తమానం బగుచున్నది; వెండియు. 361**

**ప్రతి :** పూర్వపరార్ధ+ఆదినిన్+కలిగిన= పూర్వపరార్ధం మొదటిలో ఉన్న; బ్రహ్మకల్పంబున్+చెప్పితిన్= బ్రహ్మ కల్పమును గూర్చి చెప్పాను; ఇంకన్= ఇటుపైని; ద్వితీయ పరార్ధంబు మొదలున్= ద్వితీయ పరార్ధం మొదటిలో; ఎన్నఁడేనిన్= ఎప్పుడు; సూకర+ఆకారంబున్+తాల్చున్= వరాహావతారాన్ని ధరిస్తాడో; అది వరాహ కల్పంబు+అనన్+తగున్= దానికి వరాహకల్పమని పేరు; అట్టి వరాహకల్పంబు= అటువంటి వరాహకల్పం; ఇపుడు వర్తమానంబు+అగుచున్నది= ఇపుడు నడచుచున్నది; వెండియున్= మరియును.

**తా :** విదురా! పూర్వపరార్ధం మొదటిదైన బ్రహ్మకల్పాన్ని గూర్చి విన్నావు గదా! ఇక ద్వితీయపరార్ధంగురించి విను. ఈ పరార్ధంలో శ్రీహరి ఎప్పుడైతే వరాహరూపాన్ని ధరిస్తాడో అది వరాహకల్పం అవుతుంది. ఇప్పుడు ఆ కల్పమే జరుగుతోంది.

**సీ. దీపింపఁగాలస్వరూపుఁడై నట్టి పద్మాక్షుఁ డనంతుఁడనాదిపురుషుఁ**
**డఖిలవిశ్వాత్మకుఁడగు నీశునకుఁ బరమాణ్వాది యుగపరార్ధాంత మగుచు**
**జరుగు నీకాలంబు చర్చింప నొక్కనిమేషకాలంబయి మెలఁగుచుండుఁ**
**గాని యీశ్వరునకుఁ గర్తగాఁజాల; ది క్కాలంబు విను మదిగాక దేహ**

**తే. మందిరార్థాదికర్మాభిమానశీలు, రైనవారికి నాశ్రయంబగుటఁజేసి**
**యరయ హరి తద్గుణవ్యతికరుఁడు, గానఁకాల మమ్మేటి కెన్నఁడు గర్త గాదు. 362**

**ప్రతి :** దీపింపన్= ప్రకాశించే; కాలస్వరూపుఁడు+ఐనట్టి= కాలమే రూపంగా కల; పద్మాక్షుఁడు= పద్మములవంటి కన్నులు కలవాడైన హరి; అనంతుఁడు= అంతము లేనివాడు; న+ఆదిపురుషుఁడు= మొదలులేని పురుషుడు; అఖిల విశ్వాత్మకుఁడు+అగున్= సమస్త విశ్వము తన ఆత్మగా గలవాడైన; ఈశునకున్= పరమాత్మకు; పరమాణు+ఆది= పరమాణువు మొదలుకొని; యుగపరార్ధ+అంతము+అగుచున్= యుగముల పరార్ధముల చివరివరకు; జరుగు= ప్రవర్తించే; ఈ కాలంబు= ఈ మొత్తం కాలమంతా; చర్చింపన్= విచారింపగా; ఒక్క నిమేష కాలంబు+అయి= ఒక్క నిమిషముగా;

మెలఁగుచుండున్= ఉండును; కాని= అయినా; ఈ+కాలంబు= ఈ కాలం; ఈశ్వరునకున్= పరమాత్మకు; కర్త+కాఁ జాలదు= కర్త కాలేదు (భగవంతుని నడిపించేది కాదు); వినుము= ఆలకించు; అదిగాక= అంతే గాక; దేహ= శరీరము; మందిర= గృహము; అర్థాది= ధనము మొదలైన వాటినిగూర్చిన; కర్మ= పనులయందు; అభిమాన శీలురు+ఐనవారికిన్= అభిమానం కలిగి ఉండే స్వభావం కలవారికి; ఆశ్రయంబు+అగుటన్+చేసి= ఆధారమైయున్న కారణంగా; అరయన్= ఆలోచింపగా; హరి= నారాయణుడు; తద్+గుణవ్యతికరుఁడు+కానన్= ఆ గుణాలకు అతీతుడు కనుక; కాలము= కాలము; ఆ+మేటికిన్= ఆ ఘనుడగు నారాయణునకు; ఎన్నఁడున్= ఎప్పటికిని; కర్త కాదు= కర్త కానేరదు.

**తా :** నారాయణుడే కాలస్వరూపుడు. ఆయనకు ఆద్యంతాలు లేవు. లోకాలన్నిటికీ ఆయనే ఆత్మ. పరమాణువును దాటే కాలంనుండి యుగాల పరార్ధాలు పూర్తయ్యేంతవరకూ పట్టే సమయం ఆ పరమాత్మకు ఒక్క నిమేషం. కాబట్టి భగవంతుడు కాలానికి కర్త అవుతాడు కాని కాలం ఆయనకు కర్త కాలేదు. అంతే కాదు. శరీరం, గృహం, సంపద ఇటువంటివాటియందు ఆసక్తి కలవారికి కాలం ఆశ్రయమై ఉంటుంది. భగవంతుడు అటువంటి కోరికలు లేనివాడు కనుక ఆయనే కర్తయై కాలాన్ని నడిపిస్తుంటాడు.

**వ. మఱియు షోడశ వికారయుక్తంబై, పృథివ్యాది పంచభూత పరివృతంబయి, దశావరణంబులు గలిగి పంచాశత్కోటివిస్తీర్ణంబై బ్రహ్మాండకోశంబు దనరుచుండు. 363**

**ప్రతి :** మఱియున్= అంతేకాక; షోడశవికారయుక్తంబు+ఐ= పదియారు రకాలైన రూపాలతో; పృథివీ+ఆది పంచభూతపరివృతంబు+అయి= భూమి మొదలగు పంచమహాభూతాలతో చుట్టబడినదై; దశ+ఆవరణంబులు+కలిగి= పది ఆచ్ఛాదనలు కలిగి; పంచాశత్+కోటి విస్తీర్ణంబు+ఐ= ఏబదికోట్ల యోజనాల వైశాల్యం కలిగినదై; తనరుచుండున్= ఒప్పుచుండును.

**తా :** అంతే గాక ఈ బ్రహ్మాండమనే కోశం పదహారు రకాలైన రూపాలు కలిగి, నేల, నీరు, నిప్పు, గాలి, నింగి అనే పంచభూతాలతో కూడి, పది ఆవరణములు కలిగి ఏబదికోట్ల యోజనాల వైశాల్యం కలిగియుంటుంది.

**విశే :** షోడశ వికారాలు : జ్ఞానేంద్రియాలు 5, కర్మేంద్రియాలు 5, ప్రాణాది వాయువులు 5, చిత్తం 1.

**చ. హరి పరమాణురూపమున నందు వసించి విరాజమానుఁడై**
**సరి వెలుఁగొందు, నిమ్ముల నసంఖ్యములైన మహాండకోశముల్**
**నెఱిఁదనయందు డింద, నవనీరజనేత్రుఁడనంతుఁడాద్యుఁ డ**
**క్షరుఁడు పరాపరుండఖిలకారణకారణుఁడప్రమేయుఁడై. 364**

**ప్రతి :** హరి= నారాయణుడు; పరమాణురూపమునన్= పరమాణు స్వరూపంతో; అందున్+వసించి= ఆ బ్రహ్మాండంలో నివసించి; విరాజమానుఁడై= ప్రకాశమానుడై; ఇమ్ములన్= చక్కగా; అసంఖ్యములు+ఐన= లెక్కలేనన్ని; మహాండకోశముల్= బ్రహ్మాండాలు; నెఱిన్= క్రమపద్ధతిలో; తనయందున్= తనలోనే; డిందన్= లీనమైయుండగా; నవనీరజనేత్రుఁడు= అప్పుడే వికసించిన కమలములవంటి కన్నులు గలవాడు; అనంతుఁడు= అంతము లేనివాడు; ఆద్యుఁడు= తానే మొదలైనవాడు; అక్షరుఁడు= నాశము లేనివాడు; పరాపరుండు= పరాత్పరుడు; అఖిలకారణకారణుఁడు= అన్ని కారణాలకూ తానే కారణమైనవాడు; అప్రమేయుఁడు+ఐ= పరిమితులకు లోబడనివాడై; సరి+వెలుఁగొందున్= చక్కగా వెలుగులీనుతుంటాడు.

**తా :** శ్రీహరి పరమాణుస్వరూపంతో ఆ బ్రహ్మాండంలో విరాజిల్లుతుంటాడు. లెక్కలేనన్ని బ్రహ్మాండాలన్నీ ఆయన గర్భంలోనే లీనమై ఉంటాయి. నవకమలదళాక్షుడైన నారాయణునికి అంతం లేదు. అన్నిటికీ తానే మొదలు. నాశంలేనివాడు. కారణాలన్నింటికి కారణమైనవాడు. పరిమితులు లేనివాడు.

**క. నిరతిశయోజ్జ్వల తేజః, స్ఫురణం దనరారు పరమపురుషుని విష్ణుం**
**బురుషోత్తము వర్ణింపను, సరసిజభవభవులకైన శక్యమె చెపుమా! 365**

**ప్రతి :** నిరతిశయ= మిక్కిలి అతిశయించే; ఉజ్జ్వల= గొప్పదైన; తేజస్+స్ఫురణన్= తేజస్సుచేతనే తెలియబడుతూ, తేజస్సుయొక్క స్ఫూర్తితో; తనరారు= ప్రవర్తించు; పరమ పురుషునిన్= పరమాత్మను; విష్ణున్= విష్ణుమూర్తిని; పురుషోత్తమున్= పురుషోత్తముని; వర్ణింపను= ఇట్టివాడు, అట్టివాడని వర్ణించుటకు; సరసిజభవ= పద్మసంభవుడైన బ్రహ్మకుగాని; భవులకైనన్= ఈశ్వరునికి గాని; శక్యము+ఎ+చెపుమా= సాధ్యమవుతుందంటావా చెప్పు.

**తా :** విదురా! విశేషమైన తేజస్సుతో వెలుగులీనే నారాయణుడు పరమపురుషుడు. పురుషోత్తముడు. ఆ నారాయణుడు ఇట్టివాడు, అట్టివాడని వర్ణించడానికి బ్రహ్మకైనా, ఈశ్వరునికైనా సాధ్యమంటావా చెప్పు. (సాధ్యం కాదని అర్థం)

**క. అని మైత్రేయుఁడు విదురుం, గనుఁగొని వెండియును బలికెఁ; గాలాహ్వయుఁడై**
**తనరిన హరి మహిమల నే, వినిపించితి సృష్టిమహిమ విను మెఱిఁగింతున్. 366**

**ప్రతి :** అని= ఆ విధంగా పలికి; మైత్రేయుఁడు= మైత్రేయమహర్షి; విదురున్+కనున్+కొని= విదురుని చూచి; వెండియును+ పలికెన్= మరల చెప్పినాడు; కాల+ఆహ్వయుఁడై= కాలము నామముగా కలవాడై; తనరిన= ఒప్పిన; హరి మహిమలన్= నారాయణుని మహిమలను; ఏన్= నేను; వినిపించితిన్= (ఇంతవరకు) వినిపించాను; సృష్టిమహిమన్= సృష్టియొక్క మహిమను; వినుము= ఆలకించు; ఎఱిఁగింతున్= తెలియజేస్తాను.

**తా :** అలా పలికిన మైత్రేయుడు విదురుని చూచి మళ్లీ చెపుతున్నాడు. ఇంతవరకూ కాలస్వరూపుడైన నారాయణుని మహిమలను తెలియజేశాను. ఇక సృష్టియొక్క మహిమలను తెలియజేస్తాను విను.

**వ. పరమేష్ఠి యీ సృష్ట్యాది నహమ్మను దేహాభిమానబుద్ధి గల మోహంబును, నంగనాసంగమ ప్రక్చందనాది గ్రామ్య భోగేచ్ఛలు గల మహామోహంబును, దత్ప్రతిఘాతజాతంబైన క్రోధంబునందుఁ గలుగు తామిస్రంబును, దన్నాశంబునం "దహ మేవ మృతోఽస్మి" యను నంధతామిస్రంబును, జిత్తవిభ్రమంబును నను నవిద్యా పంచక మిశ్రంబుగా సర్వభూతావలిం బుట్టించి యాత్మీయ చిత్తంబునం బాపసృష్టిఁ గల్పించుటకుఁ బశ్చాత్తాపంబు నొంది భగవద్ధ్యానామృత పూతమానసుండై యూర్ధ్వరేతస్కులును, బరమ పవిత్రులునునైన సనక సనందన సనత్కుమార సనత్సుజాతులను మునుల నతిసత్త్వగరిష్ఠుల ధీరజనోత్తముల నార్యుల హరిప్రపన్నులనుంగా దివ్యదృష్టిం గల్పించి వారలం జూచి మీ మీ యంశంబులం బ్రజలం బుట్టించి ప్రపంచంబు వృద్ధిఁ బొందింపుం డనిన; వారలు తద్వచనంబు లపహసించుచుఁ బద్మజుం గని మోక్షధర్ములును నారాయణపరాయణులునై ప్రపంచ నిర్మాణంబునకుఁ బ్రతికూల వాక్యంబులు పలికిన నుదయించిన క్రోధంబు**

**బుద్ధిచే నిగ్రహింపఁబడినను నరవిందసంభవుని భ్రూమధ్యంబువలనం గ్రోధస్వరూపంబున నీలలోహితుండు నిఖిలసురాగ్రజుండై యుదయించుచు నాక్రందనంబొనరించె నంత.** **367**

**ప్రతి :** పరమేష్ఠి= బ్రహ్మ; ఈ సృష్టి+ఆదిన్= ఈ సృష్టి మొదటిలో; అహమ్ము+అను= అహమను పేరుగల; దేహ+అభిమాన బుద్ధి+కల= శరీరంపై ఎక్కువ ప్రేమతోకూడిన బుద్ధి కలిగిన; మోహంబును= అజ్ఞానం; అంగనాసంగమ= స్త్రీసాంగత్యము; స్రక్+చందన+ఆది= పూలదండలు, గంధము మొదలగు; గ్రామ్య భోగ+ఇచ్ఛలు= అసభ్యమైన సుఖాలపై కోరికలు; కల మహామోహంబును= కలిగిన మహామోహమును; తద్+ప్రతిఘాత, జాతంబు+ఐన= ఆ కోరికలు తీరకపోవడంవలన పుట్టిన; క్రోధంబునందున్+కలుగు తామిస్రంబును= కోపంనుండి పుట్టే తామిస్రమనే నరకం; తద్+నాశంబునందున్= అది నశించగా; అహమ్+ఏవ మృతః+అస్మి= నేనే చనిపోయాను; అను అంధతామిస్రంబును= అనే భావంకల అంధతామిస్రమనే నరకం; చిత్తవిభ్రమంబును= మనోవైకల్యం; అను+అవిద్యాపంచక మిశ్రంబుగాన్= అనే ఐదు అవివేకాల కలయికగా; సర్వభూత+ఆవలిన్+పుట్టించి= ప్రాణులనందరినీ సృష్టించి; ఆత్మీయ చిత్తంబునన్= తన మనస్సులో; పాప సృష్టిన్+కల్పించుటకున్= పాపభూయిష్ఠమైన సృష్టిని ఏర్పరచినందుకు; పశ్చాత్తాపంబున్+ఒంది= బాధపడినవాడై; భగవత్+ధ్యాన+ అమృతపూతమానసుండు+ఐ= భగవానుని ధ్యానించుటచే పవిత్రమైన చిత్తము కలవాడై; ఊర్ధ్వరేతస్కులును= వీర్యము అధఃపతనము చెందక పైకి పంపగలిగినవారును; పరమ పవిత్రులును+ఐన= మిక్కిలి పవిత్రమైన నడవడి కలవారు అయిన; సనక= సనకుడు; సనందన= సనందనుడు; సనత్కుమార= సనత్కుమారుడు; సనత్సుజాతులు+అను= సనత్సుజాతుడు అను; మునులన్= యోగులను; అతిసత్త్వగరిష్ఠులన్= మిక్కిలి సత్త్వగుణంచేత గొప్పవారైన వారిని; ధీరజన ఉత్తములన్= గంభీరులలో శ్రేష్ఠులైనవారిని; ఆర్యులన్= పూజ్యులగును; హరిప్రపన్నులనున్+కాన్= హరిభక్తి కలిగినవారగునట్లుగా; దివ్యదృష్టిన్+కల్పించి= (బ్రహ్మ తన) దివ్యదృష్టితో సృష్టించి; వారలన్+చూచి= ఆ నలుగురిని చూచి; మీ మీ అంశంబులన్= మీయొక్క అంశలతో; ప్రజలన్+పుట్టించి= మానవులను జన్మింపజేసి; ప్రపంచంబున్= జగత్తును; వృద్ధిన్+పొందింపుండు+అనినన్= పెంపు చేయండి అనగా; వారలు= ఆ సనకాదులు నలుగురు; తద్+వచనంబులు= ఆ పలుకులను; అపహసించుచున్= పరిహసిస్తూ; పద్మజున్+కని= పద్మమునుండి పుట్టిన బ్రహ్మను చూచి; మోక్షధర్ములును= ముక్తియే ధర్మంగా కలవారును; నారాయణపరాయణులును+ఐ= శ్రీహరియే సమస్తముగా కలవారునై; ప్రపంచ నిర్మాణంబునకున్= మానవసృష్టికి; ప్రతికూలవాక్యంబులు+పలికినన్= వ్యతిరేకముగా మాట్లాడగా; ఉదయించిన క్రోధంబు= పుట్టిన కోపము; బుద్ధిచేన్+నిగ్రహింపన్+పడినను= తన బుద్ధిచేత దిగమ్రింగినా; అరవిందసంభవుని= బ్రహ్మయొక్క; భ్రూమధ్యంబువలనన్= కనుబొమల నడిమినుండి; క్రోధస్వరూపంబునన్= రూపుకట్టిన కోపంగా; నీలలోహితుండు= శివుడు; నిఖిల సుర+అగ్రజుండు+ఐ= దేవతలకందరికీ అన్నగా; ఉదయించుచున్= పుట్టుచు; ఆక్రందనంబు+ఒనరించెన్= రోదించాడు; అంతన్= అప్పుడు.

**తా :** బ్రహ్మ సృష్టికార్యానికి పూనుకొన్నాడు. వెంటనే నేను సృష్టిస్తున్నాను అనే అహంకారరూపంలో దేహాభిమానం కల మోహం పుట్టింది. అలాగే స్త్రీ సంగమం, మాలలు ధరించడం, చందనాదులు పూసుకోవడం మొదలైన గ్రామ్యభోగాలపై కోరికలు కల మహామోహం పుట్టింది. వీటితో మనోవ్యాకులత ఏర్పడింది. ఈ విధంగా అవిద్యాపంచకంతోకూడిన జీవులు ఏర్పడ్డారు. అటువంటివారిని పుట్టించి పాపం చేశాననే పశ్చాత్తాపం కలిగింది బ్రహ్మకు. వెంటనే భగవంతుని ధ్యానించాడు. ఆ ధ్యానమనే అమృతంతో పవిత్రం చేయబడ్డ మనసుకలవాడై మరికొందరిని సృష్టించాడు. వారే ఊర్ధ్వరేతస్కులు, పరమపవిత్రులు అయిన సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులు. వారు మహాసత్త్వగుణ సంపన్నులు, ధీరజనశ్రేష్ఠులు, మాన్యులు. వారికి దివ్యదృష్టిని కూడా కల్పించాడు. మీ మీ అంశలతో ప్రజలను పుట్టించి ప్రపంచాన్ని వృద్ధి చేయండని అన్నాడు.

బ్రహ్మ పలుకులాలించిన సనకసనందనాది మునులు పరిహసించారు. మోక్షమే కోరుకొంటూ, నారాయణ పరాయణులైన వారు సృష్టికి ప్రతికూలంగా మాట్లాడారు. తన మాటను కాదన్నందుకు బ్రహ్మకు క్రోధం ఏర్పడింది. ఎంతో బలంగా తన కోపాన్ని నిగ్రహించుకొన్నాడు. అయినా ఆ సమయంలో ఆయన కనుబొమల నడుమనుండి క్రోధస్వరూపుడై సర్వదేవతలకు అన్నగారిగా నీలలోహితుడు జన్మించాడు. పుడుతూనే పెద్దగా ఆక్రందనం చేశాడు.

**విశే :** నీలలోహితుడనగా శివుడు. బ్రహ్మ లలాటంనుండి రాలిన చెమటబిందువు అగ్నిలో పడి ముందు నీలంగా మారి తరువాత ఎఱ్ఱబడింది. అందుండి పుట్టినవాడు కనుక నీలలోహితుడు.

**అవిద్యాపంచకం :** మోహం, మహామోహం, తామిస్రం, అంధతామిస్రం, చిత్తవిభ్రమం. ఇవి యీ వచనంలో వివరణకు వచ్చాయి.

**మ. జననంబందిన నీలలోహితుఁడు గంజాతాసనుంజూచి యి**
**ట్లను "నో దేవ! మదాఖ్య లెట్టివి? మదీయావాసముల్ వీఁక నా**
**కనయంబు న్నెఱిఁగింపవే" యనుడు నయ్యంభోజగర్భుండు లా**
**లనముందోఁపఁగుమార! నీ జననవేళన్ రోదనంబిచ్చుటన్. 368**

**ప్రతి :** జననంబు+అందిన= జన్మించిన; నీలలోహితుఁడు= ఆ నీలలోహితుడు; కంజాత+ఆసనున్+చూచి= పద్మాసనంపై ఉన్న బ్రహ్మను చూచి; ఇట్లు+అనున్= ఇలా పలుకుతున్నాడు; ఓ దేవ!= ఓ పూజ్యుడా!; మత్+ఆఖ్యలు+ఎట్టివి= నాయొక్క పేర్లేమిటి?; మదీయ+ఆవాసముల్= నాయొక్క నివాసస్థానాలు; వీఁకన్= ఉత్సాహంతో; నాకున్= నాకు; అనయంబున్= అవశ్యముగా; ఎఱిఁగింపవే= తెలియజేయుము; అనుడున్= అని కోరగా; ఆ+అంభోజగర్భుండు= నీటినుండి పుట్టిన పద్మమును పుట్టుక స్థానముగా కలవాడు – బ్రహ్మ; లాలనమున్+తోఁపన్= వాత్సల్యం ఉట్టిపడునట్లుగా; కుమార!= నాయనా!; నీ జనన వేళన్= నీవు జన్మిస్తూనే; రోదనంబు+ఇచ్చుటన్= ఆక్రందనం చేయుటచే...

**తా :** అప్పుడే పుట్టిన నీలలోహితుడు బ్రహ్మను చూచి, నా పేర్లేమిటి? నా నివాసస్థలాలేమిటి? దేవా! వెంటనే అవి నాకు తెలియచేయుము అని కోరాడు. అపుడు బ్రహ్మ వాత్సల్యంతో నాయనా! నీవు పుడుతూనే ఏడ్చావు.

**తే. రుద్రనామంబు నీకు నిరూఢ మయ్యెఁ, జంద్రసూర్యానలానిలసలిలగగన**
**పృథివిప్రాణతపోహృదింద్రియము లనఁగఁ, గలుగు నేకాదశస్థానములు వసింప. 369**

**ప్రతి :** నీకున్= నీకు; రుద్రనామంబు= రుద్రుడనే పేరు; నిరూఢము+అయ్యెన్= ప్రసిద్ధమయింది; చంద్ర సూర్య= చంద్రుడు, సూర్యుడు; అనల+అనిల= అగ్ని, వాయువు; సలిల గగన= జలము, ఆకాశము; పృథివి ప్రాణ= భూమి, ప్రాణములు; తపస్+హృద్+ఇంద్రియములు+అనఁగన్= తపస్సు, హృదయం, ఇంద్రియాలు అనగా; వసింపన్= నీవు నివసించుటకు; ఏకాదశ స్థానములు= పదునొకండు ప్రదేశాలు; కలుగున్= ఏర్పడును (ఆ ప్రదేశాలలో నివసించుము).

**తా :** రోదనం చేస్తూ పుట్టావు కనుక నీకు రుద్రుడనే పేరు వస్తుంది. ఇక నీవు నివాసముండేందుకు పదునొకండు స్థానాలను కల్పిస్తున్నాను. అవి చంద్రుడు, సూర్యుడు, అగ్ని, వాయువు, జలం, ఆకాశం, భూమి, ప్రాణాలు, తపస్సు, హృదయం, ఇంద్రియాలు.

**వ. అని వెండియు మన్యు మను మహాకాల మహచ్ఛివ ఋతధ్వజోరురేతో భవ కాల వామదేవ ధృతవ్రతులను నేకాదశనామంబులు గలిగి ధీవృత్త్యశనోమానియు త్సర్పి రిలాంబి కేలావతీ సుధా దీక్షా నామ పత్నీసమేతుండవై పూర్వ నియుక్తంబు లయిన నామంబులం దత్తన్నివాసంబుల వసియించి ప్రజలం గల్పింపుమని నిర్దేశించిన భగవంతుఁడగు నీలలోహితుండు విశ్వగురుండైన పితామహునిచే నియుక్తుండై సత్త్వాకృతి స్వభావంబుల నాత్మసములైన ప్రజలంగల్పించె. 370**

**ప్రతి :** అని; వెండియున్= (బ్రహ్మ శివుని నివాసస్థానాలు పదునొకండును చెప్పి) ఇంకా; మన్యు= మన్యువు; మను= మనువు; మహాకాల= మహాకాలుడు; మహత్= మహత్తు; శివ= శివుడు; ఋతధ్వజ= ఋతధ్వజుడు; ఉరురేతస్= ఉరురేతసుడు; భవ= భవుడు; కాల= కాలుడు; వామదేవ= వామదేవుడు; ధృతవ్రతులు+అను= ధృతవ్రతుడు అను; ఏకాదశనామంబులు+ కలిగి= పదునొకండు పేర్లు కలిగి; ధీ= ధీ; వృత్తి= వృత్తి; అశనా= అశన; ఉమా= ఉమ; నియుత్= నియుత్తు; సర్పిస్= సర్పిస్సు; ఇలా= ఇల; అంబికా= అంబిక; ఇలావతీ= ఇలావతి; సుధా= సుధ; దీక్షా= దీక్ష; నామ పత్నీసమేతుండవు+ఐ= అనే పేర్లుగల భార్యలతో కూడినవాడవై; పూర్వనియుక్తంబులు+అయిన= ముందు నిర్దేశించిన పేర్లతో; తద్+తద్+ నివాసంబులన్= ఆ యా ప్రదేశాలలో; వసియించి= నివసిస్తూ; ప్రజలన్+కల్పింపుము+అని= మానవులను సృజించుమని; నిర్దేశించినన్= బ్రహ్మ ఆజ్ఞాపించగా; భగవంతుఁడు+అగు= భగవానుడైన; నీలలోహితుండు= శివుడు; విశ్వగురుండు+ఐన= జగత్‌శాసకుడైన; పితామహునిచేన్= బ్రహ్మచే; నియుక్తుండు+ఐ= నియమింపబడినవాడై; సత్త్వ+ఆకృతి స్వభావంబులన్= సాత్త్వికమైన ఆకారము, ప్రవర్తనలతో; ఆత్మసములు+ఐన= తనతో సమానులైన; ప్రజలన్= మానవులను; కల్పించెన్= జన్మింపజేసెను.

**తా :** ఇంకా మన్యువు, మనువు, మహాకాలుడు, మహత్తు, శివుడు, ఋతధ్వజుడు, ఉరురేతసుడు, భవుడు, కాలుడు, వామదేవుడు, ధృతవ్రతుడు, అని నీకు పదునొకండు పేర్లు ఉంటాయి. ధీ, వృత్తి, అశన, ఉమ, నియుత్, సర్పిస్సు, ఇల, అంబిక, ఇలావతి, సుధ, దీక్ష అనే పదకొండుమంది భార్యలుగా ఉంటారు. ఆ యా పేర్లతో ఆ యా భార్యలతో నివసిస్తూ, ప్రజలను సృష్టించుమని ఆజ్ఞాపించగా, భగవంతుడైన నీలలోహితుడు విశ్వగురుడైన బ్రహ్మచేత నియమింపబడినవాడై సాత్త్వికమైన రూపం, స్వభావాలలో తనతో సమానులైన ప్రజలను పుట్టించాడు.

**ఉ. రుద్రునిచేత నీ గతి నిరూఢమతిన్ సృజియింపఁబడ్డ యా**
**రుద్రగణంబు లోలి నవరుద్ధత విశ్వము మ్రింగె; నమ్మహో**
**పద్రవశాంతికై యజుఁడు భర్గులఁజూచి కుమారులార! మీ**
**రౌద్రవిలోకనానలభరంబునఁగ్రాఁగె సమస్తలోకముల్. 371**

**ప్రతి :** రుద్రునిచేతన్= నీలలోహితునిచేత; ఈ గతిన్= ఈ విధంగా; నిరూఢమతిన్= లోకప్రసిద్ధంగా; సృజియింపన్+పడ్డ= సృష్టింపబడిన; ఆ రుద్రగణంబులు= ఆ రుద్రగణాలు; ఓలిన్= క్రమంగా; అవరుద్ధతన్= అడ్డులేని విధంగా; విశ్వమున్+ మ్రింగెన్= ప్రపంచాన్ని కబళించివేశాయి; ఆ+మహా+ఉపద్రవ శాంతికి+ఐ= ఆ భయంకర ప్రమాదాన్ని నిలువరించేందుకు; అజుఁడు= బ్రహ్మ; భర్గులన్+చూచి= రుద్రగణాలను చూచి; కుమారులార!= నాయనలారా!; మీ రౌద్ర= మీ భయంకరమైన; విలోకన= దృష్టియనెడి; అనల భరంబునన్= అగ్ని వేడిమివలన; సమస్తలోకముల్= లోకాలన్నీ; క్రాఁగెన్= తపించిపోయాయి.

**తా :** అలా నీలలోహితుడు లోకప్రసిద్ధంగా పుట్టించిన రుద్రగణాలు అడ్డూ అదుపూ లేకుండా వేడివేడి చూపుల నిప్పులతో లోకాలను మాడ్చేస్తుంటే, ఆ భయంకరమైన ప్రమాదాన్ని గమనించి బ్రహ్మ వారిని పిలిచి, 'నాయనలారా! మీ తీవ్రమైన చూపుల నిప్పుల వేడికి లోకాలన్నీ మాడిపోతున్నాయి' అన్నాడు.

**క. మీ సృష్టి చాలు; నింకన్, ధీసత్తములార! వినుఁడు ధృతి మీరు తపో**
**వ్యాసంగచిత్తులై చనుఁ, డా సన్మంగళము లగు దృఢంబుగ మీకున్. 372**

**ప్రతి :** ధీసత్తములారా!= ధీమంతులారా!; వినుఁడు= వినండి; మీ సృష్టి చాలున్= మీరు చేసిన ప్రజాసృష్టి చాలు; ఇంకన్= ఇటుపైన; ధృతిన్= ధీరతతో; మీరు= మీరందరు; తపస్+వ్యాసంగచిత్తులు+ఐ= తపస్సునందే లగ్నమైన మనస్సు కలవారై; చనుఁడా!= ప్రవర్తించండి; మీకున్= మీ అందరికీ; దృఢంబుగన్= నిశ్చయంగా; సత్+మంగళములు+అగున్= చక్కని శుభాలు కలుగుతాయి.

**తా :** బుద్ధిమంతులైన రుద్రగణములారా! వినండి. ఇంతవరకు మీరు చేసిన ప్రజాసృష్టి చాలు. ఇంక ధీరతతో మీ మనస్సును తపస్సుపై లగ్నం చేయండి. మీ అందరికీ నిశ్చయంగా చక్కని శుభాలు కలుగుతాయి.

**మ. భగవంతుం బురుషోత్తమున్ హరిఁగృపాపాథోధి లక్ష్మీశ్వరున్**
**సుగుణభ్రాజితు నచ్యుతుం బరుఁ బరంజ్యోతిం బ్రభున్ సర్వ భూ**
**త గుహావాసు నధోక్షజున్ శ్రితజనత్రాణైకపారీణు నా**
**జగదాత్ముం గనుచుందు రార్యులు దపశ్శక్తిన్ స్ఫుటజ్ఞానులై. 373**

**ప్రతి :** ఆర్యులు= సజ్జనులు; తపస్+శక్తిన్= తపస్సువలన లభించిన శక్తితో; స్ఫుటజ్ఞానులై= స్పష్టమైన జ్ఞానం కలవారై; భగవంతున్= షడ్గుణైశ్వర్యసంపన్నుని; పురుష+ఉత్తమున్= పరమపురుషుని; కృపా+పాథస్+ధిన్= దయాసముద్రుని; లక్ష్మీశ్వరున్= లక్ష్మీవల్లభుని; సుగుణభ్రాజితున్= సద్గుణాలతో ప్రకాశించేవానిని; అచ్యుతున్= చ్యుతి లేనివానిని; పరున్= పరాత్పరుని; పరంజ్యోతిన్= ఒకే ఒక్క వెలుగైనవానిని; ప్రభున్= జగన్నాథుని; సర్వభూతగుహా+ఆవాసున్=సర్వాంతర్యామిని; అధోక్షజున్= ఇంద్రియనిగ్రహం కలవానిని; శ్రితజన త్రాణ+ఏక పారీణున్= ఆశ్రయించినవారిని రక్షించడమే ఆసక్తిగా కలవానిని; ఆ జగత్+ఆత్మున్= విశ్వానికి ఆత్మ అయినవానిని ఆ; హరిన్= శ్రీమన్నారాయణుని; కనుచుందురు= దర్శిస్తూ ఉంటారు.

**తా :** సత్పురుషులు తపస్సుచేసి జ్ఞానం పొంది, ఆ జ్ఞానంతో భగవంతుడు, పురుషోత్తముడు, దయాసముద్రుడు, లక్ష్మీవల్లభుడు, మంచిగుణాలతో ప్రకాశించేవాడు, చ్యుతి లేనివాడు, పరాత్పరుడు, పరంజ్యోతిస్స్వరూపుడు, జగన్నాథుడు, సర్వాంతర్యామి, ఇంద్రియనిగ్రహం కలవాడు, ఆశ్రయించినవారిని రక్షించేవాడు, విశ్వాత్ముడు అయిన శ్రీమన్నారాయణుని దర్శిస్తారు.

**వ. అనిన విని. 374**

**తా :** అని చెప్పగా విని

**ఉ. కైకొని యిట్లు పంకరుహగర్భనియంత్రితులైన రుద్రు లు**
**ద్రేకము దక్కి కానలకు ధీయుతులై తపమాచరింప న**

**స్తోకచరిత్రు లేఁగిరి; చతుర్ముఖుఁడంతఁ బ్రపంచకల్పనా**
**లోకనుఁడై సృజించె జనలోకశరణ్యుల ధీవరేణ్యులన్. 375**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; పంకరుహగర్భ నియంత్రితులు+ఐన= బ్రహ్మచే అదుపు చేయబడిన; రుద్రులు= రుద్రగణాలు; కైకొని= వానిమాటను అంగీకరించి; ఉద్రేకము+తక్కి= రౌద్రాన్ని విడిచి; ధీయుతులు+ఐ= బుద్ధిమంతులై; తపము+ఆచరింపన్= తపస్సు చేసేందుకు; అస్తోక చరిత్రులు= అతిశయించిన చరిత్ర కలవారై; కానలకున్+ఏఁగిరి= అడవులకు వెళ్లారు; అంతన్= అటు పిమ్మట; చతుర్ముఖుఁడు= బ్రహ్మ; ప్రపంచ కల్పనా+ఆలోకనుఁడై= జగన్నిర్మాణమునందు దృష్టి కలవాడై; ధీవరేణ్యులన్= బుద్ధిమంతులను; జనలోక శరణ్యులన్= జనలోకంలో నివసించేవారికి ఆశ్రయులును అగువారిని; సృజించెన్= సృష్టించెను.

**తా :** ఆ రుద్రగణాలు బ్రహ్మదేవుని ఆదేశాన్ని శిరసావహించి, రౌద్రాన్ని విడిచిపెట్టి, ధీరులై, అతిశయించిన చరిత్ర కలవారై తపస్సు చేసేందుకు అడవులకు వెళ్లారు. అప్పుడు బ్రహ్మ ప్రపంచ నిర్మాణముపై దృష్టి పెట్టి, బుద్ధిమంతులను, జనలోకంలో నివసించేవారికి ఆశ్రయులు కాగలవారిని సృష్టించాడు.

**తే. వినుము! భగవద్బలాన్విత వినుతగుణులు, భువనసంతానహేతువిస్ఫురణకరులు**
**పద్మసంభవతుల్యప్రభావయుతులు, పదురు గొడుకులు పుట్టిరి భవ్యయశులు. 376**

**ప్రతి :** వినుము= విదురా! విను; భగవత్+బల+అన్విత= దైవబలంతో కూడిన; వినుతగుణులు= కొనియాడదగిన గుణములు కలవారును; భువనసంతాన= లోకసంతానమునకు; హేతువిస్ఫురణకరులు= కారణమైనవారు; పద్మసంభవ తుల్య= బ్రహ్మతో సమానమైన; ప్రభావయుతులు= శక్తి కలవారు; భవ్యయశులు= గొప్ప కీర్తి కలవారు ఐన; పదురు కొడుకులు= పదిమంది కుమారులు; పుట్టిరి= జన్మించిరి.

**తా :** విదురా! విను. భగవద్బలంతో కూడిన సద్గుణులు, లోకంలో సంతానం కలిగేందుకు హేతువులైనవారు, బ్రహ్మతో సమానమైన శక్తియుక్తులు కలవారు, గొప్ప యశోవంతులునైన పదిమంది కుమారులు పుట్టారు.

**సీ. అరవిందసంభవు నంగుష్ఠమున దక్షుఁడూరువువలనను నారదుండు**
**నాభిఁబులహుఁడు గర్ణములఁబులస్త్యుండు త్వక్కున భృగువు హస్తమునఁ గ్రతువు**
**నాస్యంబువలన నయ్యంగిరసుఁడు ప్రాణమున వసిష్ఠుఁడు మనమున మరీచి**
**గన్నుల నత్రియుఁగాఁబుత్త్రదశకంబు గలిగిరి; వెండియు నలినగర్భు**

**తే. దక్షిణస్తనమువలన ధర్మమొదవె, వెన్నువలనను నుదయించె విశ్వభయద**
**మైన మృత్యు వధర్మంబు నంద కలిగె, నాత్మఁగాముండు జననము నందె; మఱియు. 377**

**ప్రతి :** అరవిందసంభవు+అంగుష్ఠమునన్= బ్రహ్మయొక్క బొటనవ్రేలినుండి; దక్షుఁడు= దక్షుడు; ఊరువువలనను నారదుండు= తొడనుండి నారదుడు; నాభిన్+పులహుఁడు= బొడ్డునుండి పులహుడు; కర్ణములన్= చెవులనుండి; పులస్త్యుఁడు= పులస్త్యుడు; త్వక్కునన్ భృగువు= చర్మంనుండి భృగువు; హస్తమునన్+క్రతువున్= చేతినుండి క్రతువును; ఆస్యంబువలనన్= మోమునుండి; ఆ+అంగిరసుఁడు= ప్రసిద్ధుడైన అంగిరసుడు; ప్రాణమునన్ వసిష్ఠుఁడు= ప్రాణమునుండి వసిష్ఠుడు; మనమునన్ మరీచి=

మనస్సునుండి మరీచి; కన్నులన్ అత్రియున్+కాన్= కన్నులనుండి అత్రియు కాగా; పుత్త్రదశకంబు+కలిగిరి= పదిమంది కుమారులు ఉదయించారు; వెండియు= మరియు; నలిన గర్భు= బ్రహ్మయొక్క; దక్షిణస్తనమువలనన్= కుడి స్తనమునుండి; ధర్మము+ఒదవెన్= ధర్మం జనించింది; వెన్నువలననున్= వెన్నునుండి; విశ్వభయదమైన మృత్యువు= జగద్భయంకరమైన మృత్యువు; ఉదయించెన్= పుట్టెను; అంద అధర్మంబు+కలిగెన్= అక్కడనుండియే అధర్మమూ పుట్టింది; ఆత్మన్+కాముండు= ఆత్మనుండి మన్మథుడు; జననమున్+అందెన్= పుట్టాడు; మఱియున్= అంతే కాక.

**తా :** బ్రహ్మ బొటనవ్రేలినుండి దక్షుడు, తొడనుండి నారదుడు, బొడ్డునుండి పులహుడు, చెవులనుండి పులస్త్యుడు, చర్మంనుండి భృగువు, చేతినుండి క్రతువు, ముఖంనుండి అంగిరసుడు, ప్రాణంనుండి వసిష్ఠుడు, మనస్సునుండి మరీచి, కన్నులనుండి అత్రి ఇలా పదిమంది కుమారులు ఉదయించారు. ఇంకా కుడిస్తనంనుండి ధర్మం, వెన్నునుండి లోకభయంకరమైన మృత్యువూ, అధర్మమూ జన్మించాయి. ఆత్మనుండి మన్మథుడు పుట్టాడు. అంతే కాక.

**సీ. భ్రూయుగళంబునఁగ్రోధంబు, నధరంబునందు లోభంబు, నాస్యమున వాణి**
**యును, మేఢ్రమందుఁబయోధు, లపానంబునందు నఘాశ్రయుఁడైన నిరృతి,**
**లాలితచ్ఛాయవలన దేవహూతి విభుండు గర్దముఁడును, బుట్టి రంత**
**నబ్జజుఁడాత్మ దేహమున జనించిన భారతిఁజూచి విభ్రాంతిఁబొరసి**

**తే. పంచశరబాణనిర్భిన్నభావుఁడగుచుఁ, గూఁతు రని పాపమునకు సంకోచపడక**
**కవయఁగోరిన జనకునిఁగని మరీచి, మొదలుగాఁగల య మ్మునిముఖ్యు లెఱిఁగి. 378**

**ప్రతి :** భ్రూయుగళంబునన్= బ్రహ్మ కనుబొమలనుండి; క్రోధంబున్= క్రోధము; అధరంబునందున్ లోభంబున్= క్రింది పెదవినుండి లోభము; ఆస్యమునన్= మోమునుండి; వాణియును= సరస్వతి; మేఢ్రమందున్= పురుషాంగమునుండి; పయోధులు= సముద్రాలు; అపానంబునందున్= అపానమునుండి; అఘ+ఆశ్రయుఁడైన నిరృతి= పాపాలకు ఆశ్రయుడైన నిరృతి; లాలితఛాయవలనన్= సుకుమారమైన నీడనుండి; దేవహూతి= దేవహూతి; విభుండు+కర్దముఁడును= ఆమె భర్తయైన కర్దముడును; పుట్టిరి= జన్మించారు, అంతన్= అటు తరువాత; అబ్జజుఁడు= పద్మమునుండి పుట్టిన బ్రహ్మ; ఆత్మదేహమునన్+ జనించిన= తన దేహమునుండి పుట్టిన; భారతిన్+చూచి= సరస్వతిని చూచి; విభ్రాంతిన్+పొరసి= మోహము పొంది; పంచశర, బాణ నిర్భిన్న, భావుఁడు+అగుచున్= మన్మథునిచే చీల్చబడిన భావం కలవాడై; కూఁతురు+అని= కుమార్తె అని; పాపమునకున్= పాపానికి; సంకోచపడక= సందేహించకుండా; కవయన్+కోరిన= జతగూడేందుకు సిద్ధమైన; జనకునిన్+కని= తండ్రిని చూచి; మరీచి మొదలుగాన్+కల= మరీచి మొదలైన; ఆ+మునిముఖ్యులు+ఎఱిఁగి= మునిశ్రేష్ఠులు గమనించి; (ఇట్లు+అనిరి= ఈ విధంగా పలికారు.)

**తా :** బ్రహ్మదేవుని కనుబొమలనుండి క్రోధం పుట్టింది. క్రింది పెదవినుండి లోభం పుట్టింది. ముఖంనుండి సరస్వతి ఆవిర్భవించింది. పురుషాంగంనుండి సముద్రాలు పుట్టాయి. అపానంనుండి పాపాశ్రయుడైన నిరృతి, నీడనుండి దేవహూతి, ఆమె భర్తయైన కర్దముడు ప్రభవించారు. తరువాత బ్రహ్మ తన దేహంనుండి పుట్టిన సరస్వతిపై మరులుగొన్నాడు. మన్మథభావాలకు లోనై ఆమెను జతగూడాలనుకొన్నాడు. ఆ పరిస్థితిని గమనించిన మరీచి మొదలైన మునిముఖ్యులు తమ తండ్రియైన బ్రహ్మను చూచి, ఇలా అన్నారు.

వ. ఇట్లనిరి. 379

ప్రతి : ఇట్లు+అనిరి= ఇట్లు పలికిరి.

ఉ. చాలుఁ! బురే! సరోజభవ! సత్పథవృత్తిఁ దొఱంగి కూఁతు ని
ట్లాలరివై రమింప హృదయంబునఁ గోరుట ధర్మరీతియే?
బేలరి వైతి, నీ తగవుఁ, బెద్దతనంబును, నేలపాలుగా
శీలము వోవఁ దట్టి యిటు సేసినవారలు మున్ను గల్గిరే? 380

ప్రతి : చాలున్+పురే! సరోజభవ!= ఓయీ! బ్రహ్మదేవా! చాలు చాలు; సత్పథవృత్తిన్+తొఱంగి= సన్మార్గాన్ని విడిచిపెట్టి; ఇట్లు+ఆలరివి+ఐ= ఇలా దుశ్శీలుడవై; కూఁతున్+రమింపన్= కుమార్తెతో జతగూడేందుకు; హృదయంబునన్+కోరుట= మనసులో కోరుకోవడం; ధర్మరీతియే?= ధర్మపద్ధతియేనా?; బేలరివి+ఐతి= తెలివిమాలినవాడవయ్యావు; నీ తగవున్= నీ న్యాయమును; పెద్దతనంబును= పెద్దరికము; నేలపాలుగాన్= నేలపాలగునట్లుగా; శీలము+పోవన్+తట్టి= శీలము పోవునట్లుగా; ఇటు+చేసినవారలు= ఇలా ప్రవర్తించినవారు; మున్ను+కల్గిరే?= పూర్వమెవరైనా ఉన్నారా?

**తా :** చాలు చాలు బ్రహ్మదేవా! మంచిమార్గాన్ని విడిచిపెట్టి, దుశ్శీలుడవై కుమార్తెతోనే జత గూడేందుకు ప్రయత్నించడం ధర్మపద్ధతియేనా? మూఢుడవైపోయావు. నీ న్యాయం, పెద్దరికం నేలపాలై శీలం పోయేలా ప్రవర్తిస్తున్నావు. ఇంతకుముందు ఎవరైనా ఇంతటి పాపానికి ఒడిగట్టినవారున్నారా?

ఉ. నీవు మహానుభావుఁడ వనింద్యచరిత్రుఁడ; విట్టిచోట "రా
జీవభవుండు దా విధినిషేధము లాత్మ నెఱుంగఁడయ్యె; నీ
భావభవప్రసూనశరబాధితుఁడై తన కూఁతుఁబొందెఁ బో
వావి దలంప లే" కనుచు వారక లోకులు ప్రువ్వఁదిట్టరే! 381

ప్రతి : నీవు మహానుభావుఁడవు= ఓ బ్రహ్మదేవా! నీవు మహనీయుడవు; న+నింద్యచరిత్రుడవు= ఎవరూ వేలుపెట్టి చూపించలేని చరిత్ర కలవాడవు; ఇట్టిచోటన్= ఇటువంటి విషయాలలో; లోకులు= ప్రజలు; రాజీవభవుండు= బ్రహ్మదేవుడంతటివాడే; తాన్= తాను; విధినిషేధములు= చేయదగిన, చేయరాని పనులు; ఆత్మన్+ఎఱుంగఁడు+అయ్యెన్= తాను తెలియలేకపోయాడు; ఈ, భావభవ= ఈ మన్మథుని; ప్రసూనశర= పూవుటమ్ములచే; బాధితుఁడు+ఐ= బాధింపబడ్డవాడై; వావిన్+తలంపలేక= వావివరుసలను గణింపకుండగా; తన కూఁతున్+పొందెన్+పో= తన కుమార్తెనే పొందాడే; అనుచున్= అంటూ; ప్రువ్వన్+తిట్టరే= చెడదిట్టరా!

**తా :** బ్రహ్మదేవా! నీవు మహానుభావుడవు, ఎవరూ వేలెత్తి చూపలేని గొప్ప చరిత్ర కలవాడవు. కాని ఇటువంటి విషయాలలో బ్రహ్మదేవుడంతటివాడే కృత్యాకృత్యాలు తెలియక మన్మథబాధకు తట్టుకోలేక వావివరుసలుకూడా గణించకుండా తన కుమార్తెతోనే జతకట్టాడని లోకులు చెడదిట్టరా!

క. పాపము దలఁపక, నిమిషము, లోపలఁజెడు సౌఖ్యమునకు లోనైతివె? యిం
తే పో ధారుణిఁ 'గామా, న్ధోఽపి న పశ్యతి' యనంగఁదొల్లియు వినమే. 382

**ప్రతి :** పాపము+తలఁపక= పాపమని ఆలోచించకుండా; నిమిషములోపలన్= ఒక క్షణంలో; చెడు సౌఖ్యమునకున్= పాడయ్యే సుఖానికి; లోన్+ఐతివి+ఎ= వశమైపోయావే; ఇంతేపో= ఇది ఇంతే గదా; ధారుణిన్= అవనిలో; కామాన్ధో౽పి న పశ్యతి= కామాంధుడు కళ్లుండీ చూడలేడు; అనంగన్= అన్నమాటను; తొల్లియున్= పూర్వమే; వినమే= వినలేదా!

**తా :** పాపకార్యమని ఆలోచించకుండా క్షణికసౌఖ్యానికి లొంగిపోయావు. అవును. కామాంధుడు కళ్లున్నా చూడలేడనే ఆర్యోక్తి ఉండనే ఉన్నది కదా!

**మ. అని యిబ్భంగి మునీంద్రు లాడిన కఠోరాలాపముల్ వీనుల**
**న్విని లజ్జావనతాననుండగుచు నా నీరేజగర్భుండు స**
**య్యన దేహంబు విసర్జనీయముగఁ జేయన్ దిక్కు లేతెంచి త**
**త్తనువుంగైకొనఁబుట్టె దిక్కలితమై తామిస్రనీహారముల్. 383**

**ప్రతి :** అని+ఈ+భంగిన్= అని ఈ విధంగా; ముని+ఇంద్రులు+ఆడిన= మునీశ్వరులు పలికిన; కఠోర+ఆలాపముల్= కఠినములైన మాటలు; వీనులన్+విని= చెవులారా విని; లజ్జా+అవనత+ఆననుండు+అగుచున్= సిగ్గుచేత తల దించుకొన్నవాడై; ఆ+నీరేజగర్భుండు= ఆ పద్మసంభవుడైన బ్రహ్మ; చయ్యనన్= వెంటనే; దేహంబు= శరీరము; విసర్జనీయముగన్+చేయన్= విడిచిపెట్టగా; దిక్కులు+ఏతెంచి= దిక్కులు వచ్చి; తద్+తనువున్+కైకొనన్= ఆ శరీరాన్ని తీసికోగా; దిక్+కలితమై= దిక్కులతోకూడి; తామిస్రనీహారముల్= చీకటి, మంచు; పుట్టెన్= ఉద్భవించాయి.

**తా :** అలా మునీంద్రులు పలికిన నిష్ఠురాలు చెవులలో పడేసరికి బ్రహ్మ సిగ్గుతో తలదించుకొన్నాడు. ఇంక బ్రతుకెందుకని వెంటనే శరీరాన్ని విడిచిపెట్టేశాడు. అపుడా శరీరాన్ని దిక్కులు స్వీకరించాయి. అప్పుడు ఆ దిక్కులనుండి చీకటి, మంచు పుట్టాయి.

**వ. అంత. 384**

**తా :** అటు పిమ్మట.

**చ. ఉడుగక పంకజాతభవుఁడొండొక దేహముఁదాల్చి ధైర్యమున్**
**విడువక సృష్టిపూర్వసమవేతముగన్ సృజియించు నేర్పు దాఁ**
**బొడమమి కాత్మలోనఁదలపోయుచు నుండఁజతుర్ముఖంబులన్**
**వెడలె ననూనరూపముల వేదములంచిత ధర్మయుక్తితోన్. 385**

**ప్రతి :** ఉడుగక= మానక; పంకజాతభవుఁడు= పద్మభవుడు; ఒండొక దేహమున్= మరొక శరీరాన్ని; తాల్చి= ధరించి; ధైర్యమున్ విడువక= ధైర్యాన్ని విడిచిపెట్టకుండా; సృష్టిపూర్వ సమవేతముగన్= సృష్టితో పూర్వము కూడియున్న సంబంధముతో; సృజియించు నేర్పు= జగన్నిర్మాణ నైపుణ్యం; తాన్+పొడమమికి= తాను పొందలేకపోవుటకు; ఆత్మలోనన్= తనలో; తలపోయుచున్+ఉండన్= ఆలోచిస్తూ ఉండగా; చతుర్ముఖంబులన్= (బ్రహ్మ) నాలుగు మోములనుండి; అంచిత ధర్మయుక్తితోన్= గొప్ప ధర్మంతో కూడినవై; అనూన (న+ఊన) రూపములన్= సమగ్రరూపాలతో; వేదములు+వెడలెన్= వేదాలు ఆవిర్భవించాయి.

**తా :** బ్రహ్మ అంతటితో మానుకోకుండా మళ్లీ మరొక శరీరాన్ని ధరించాడు. తిరిగి సృష్టి చేయాలనుకొన్నాడు. కానీ వెనుకటి సృష్టినిర్మాణ నైపుణ్యం లేకుండా పోయింది. ఇలా ఎందుకు జరిగిందా అని ఆలోచిస్తున్న సమయంలో బ్రహ్మ నాలుగు మోములనుండి నాలుగు వేదాలు ధర్మంతో కూడినవై సమగ్రరూపాలతో ఆవిర్భవించాయి.

**తే. మఱియు మఖములు, మహితకర్మములుఁ దంత్ర**
**ములును, నడవళ్ళు, నాశ్రమములుఁ, దదీయ**
**ముఖచతుష్కమునందునఁ బొడమె ననిన**
**విని మునీంద్రునిఁ జూచి య వ్విదురుఁడనియె. 386**

**ప్రతి :** మఱియున్= అటుపైన; మఖములున్= యజ్ఞాలు; మహితకర్మములున్= వైదిక కర్మలు; తంత్రములును= ఉభయార్థసాధకములైన ఉపాయాలు; నడవళ్ళున్= ఆచారాలు; ఆశ్రమములున్= బ్రహ్మచర్యాది ఆశ్రమములును; తదీయ, ముఖ, చతుష్కము నందునన్= ఆ బ్రహ్మదేవుని నాలుగు ముఖాలనుండి; పొడమెన్+అనినన్+విని= ఆవిర్భవించాయని చెప్పగా విని; ముని+ఇంద్రున్+చూచి= మైత్రేయమహర్షిని చూచి; ఆ+విదురుఁడు+అనియెన్= ఆ విదురుడు ఇలా అంటున్నాడు.

**తా :** ఇంకా ఆ నాలుగు మోములనుండి యజ్ఞాలు, వైదికకర్మలు, ఉభయార్థసాధకాలైన ఉపాయాలు, ఆచారాలు, బ్రహ్మచర్యాది ఆశ్రమాలు ఆవిర్భవించాయని చెప్పగా విని విదురుడు మైత్రేయమహర్షితో ఇలా అంటున్నాడు.

**క. తోయజసంభవుఁడత్తఱి, నే యే ముఖమండలమున నే యే సృష్టిన్**
**ధీయుతుఁడై సృజియించెను, బాయక యత్తెఱఁగుఁదెలియఁబలుకుము నాకున్. 387**

**ప్రతి :** తోయజసంభవుఁడు= పద్మసంభవుడైన బ్రహ్మ; ఆ+తఱిన్= అప్పుడు; ఏ యే ముఖమండలమున్= ఏ యే ముఖభాగములనుండి; ఏ+ఏ సృష్టిన్= వేటి వేటి సృష్టిని; ధీయుతుఁడై= బుద్ధిమంతుడై; సృజియించెను= సృష్టించెనో; పాయక= విడువకుండా; ఆ+తెఱఁగున్= ఆ విధానమును; నాకున్= నాకు; తెలియన్+పలుకుము= తెలిసేట్టుగా చెప్పు.

**తా :** మహర్షీ! అప్పుడు బ్రహ్మ బుద్ధిమంతుడై తన నాలుగు మోములలో ఏ యే మోమునుండి ఏమేమి సృష్టించాడో ఆ విధానమంతా నాకు తెలిసేట్టుగా చెప్పు అని విదురుడు అడిగాడు.

**వ. అని యిట్లు విదురుం డడిగిన మైత్రేయుం డతనితో నిట్లనియె; ఋగ్యజుస్సామాథర్వంబులను వేదంబులును, హోతృకర్మంబు లయిన యప్రగీతమంత్రస్తోత్రంబులగు శస్త్రంబులును, నధ్వర్యు కర్మం బైన యిజ్యయు, సంప్రగీత స్తోత్రంబయిన స్తుతియును, నుద్గాతృప్రయోజ్యంబైన ఋక్సముదాయ రూపం బగు స్తోమంబును, బ్రాయశ్చిత్తంబగు బ్రహ్మకర్మంబును, నాయుర్వేద ధనుర్వేద గాంధర్వ వేదంబులను నుపవేదంబులును, విశ్వకర్మ శాస్త్రం బగు స్థాపత్యంబును, బ్రాగాది ముఖంబుల నుత్పన్నంబు లయ్యెన్; బంచమ వేదంబగు నితిహాస పురాణంబులు సర్వముఖంబులం గలిగె; మఱియుఁ గర్మ తంత్రంబు లయిన షోడశ్యుక్థ్యములును, జయనాగ్నిష్టోమంబులును, నాప్తోర్యామాతిరాత్రంబులును, వాజపేయగోసవంబులును, ధర్మపాదంబులైన విద్యాదాన తపస్సత్యంబులును, బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ యత్యాశ్రమంబులును**

గలిగె; వీనికి నొక్కొక్కటికి జతుర్విధంబులైన వృత్తులును గలిగియుండు; నందు సావిత్రంబను బ్రహ్మచర్యంబును, ఉపనయనం బాదిగా దివసత్రయంబు గాయత్రి జపించుటయను ప్రాజాపత్యంబును, వేదవ్రత చతుష్టయంబందు బ్రతివ్రతంబును, వ్రతులు సంవత్సర పర్యంతంబుగా నాచరింపనగు బ్రాహ్మంబును, వేదగ్రహణాంతంబు నాచరింపం దగు నైష్ఠికంబును నను బ్రహ్మచారి వృత్తిచతుష్టయంబును; ననిషిద్ధకృష్యాది వృత్తియగు వార్తయు, యజనాది కర్మోపయుక్తంబైన యాచ్ఞాది రూపధన సంచయంబును, బరుల యాచింపకుండు నయాచితంబను శాలీనంబును, క్షేత్రపతిత కణిశ కణ సంగ్రహణ రూపంబగు శిలోంఛంబును నను గృహస్థవృత్తులు నాలుగును; నకృష్ట పచ్యాహారులగు వైఖానసులును, నూతనఫలంబు లబ్ధంబైనఁ బూర్వసంచిత పదార్థత్యాగంబు గల వాలఖిల్యులును, బ్రాతఃకాలంబున నే దిక్కు విలోకింతు రద్దిక్కునకు జని యచ్చట లభించు పదార్థంబుల భుజించి జీవించు నౌదుంబరులును, దమంత ఫలించి తరు పతితంబు లగు ఫలంబులఁ దినుచుండు ఫేనపులును నను చతుర్విధ వృత్తులు గల వానప్రస్థులును; స్వాశ్రమ విహితకర్మంబులం బ్రధానుం దగు కుటీచకుండును, గర్మం బుపసర్జనంబు సేసి జ్ఞాన ప్రధానుం డయిన బహూదుండును, గేవలజ్ఞానాభ్యాసనిష్ఠుం దగు హంసుండును, బ్రాప్తంబైన పరబ్రహ్మ తత్త్వంబుగ నిష్క్రియుండును నను సన్యాసిచతుర్విధవృత్తులును, మోక్షఫలప్రదంబై యాత్మానాత్మ వివేక విద్యారూపంబగు నాన్వీక్షకియు, స్వర్గాది ఫలప్రదంబై కర్మవిద్యారూప మగు త్రయియు, జీవనఫలప్రదానంబై కృష్యాదిరూపంబగు వార్తయు, నర్థసంపాదనైక ప్రయోజనంబగు దండనీతియు నను మోక్షధర్మ కామార్థంబులైన న్యాయవిద్యా చతుష్టయంబును, “భూర్భువస్సువః” యను వ్యాహృతులును, బూర్వాది ముఖంబులవలన నుదయించె.

మఱియు నతని హృదయాకాశంబువలనం బ్రణవంబును, రోమంబులవలన నుష్ణిక్ఛందంబును, త్వగింద్రియము వలన గాయత్రీ ఛందంబును, మాంసంబువలనం ద్రిష్టుప్ఛందంబును, స్నాయువువలన ననుష్టుప్ఛందంబును, నస్థివలన జగతీఛందంబును, మజ్జవలన పంక్తిచ్ఛందంబును, బ్రాణంబువలన బృహతీ ఛందంబును, కకారాది పంచవర్గాత్మకంబు లయిన స్పర్శంబుల వలన జీవుండును, అకారాది స్వరాత్మకంబైన దేహంబును, నూష్మంబులను శషసహవర్ణ చతుష్టయ రూపంబులగు నింద్రియంబులును, నంతస్థంబులగు యరలవ లను వర్ణంబులును, షడ్జాదిసప్త స్వరరూపంబు నాత్మబలంబయిన శబ్దబ్రహ్మంబును, చతుర్ముఖుని లీలావిశేషంబున నుత్పన్నంబయ్యె.

వ్యక్తావ్యక్తంబై వైఖరీ ప్రణవాత్మకంబైన శబ్దబ్రహ్మంబువలనం బరమాత్మ యవ్యక్తాత్మకుం దగుటంజేసి పరిపూర్ణుండును, వ్యక్తాత్మకుం దగుటంజేసి యింద్రాది శక్త్యుపబృంహితుండునై కానంబడుఁ; బదంపడి యజుండు భూరివీర్యవంతు లయిన ఋషిగణంబుల సంతతి యవిస్తృతంబని తలంచి పూర్వతను పరిగ్రహంబు సాలించి యనిషిద్ధ కామాసక్తంబైన దేహాంతర పరిగ్రహంబు సేసి నిత్యంబుఁ బ్రజాసృష్టియందు వ్యాసక్తుండనైనను బ్రజ లభివృద్ధి నొందక యుండుట కేమి కారణం బగునని యచ్చెరువొంది తద్వృద్ధి యగు విధం బాలోచించుచు దైవం బిచ్చట విఘాతుకంబు గాన తదానుకూల్యం బావశ్యకం బని దాని

**నెదురు చూచుచు యథోచితకృత్య కరణదక్షుం డగుచుండ చతుర్ముఖుని దేహంబు ద్వివిధం బయిన నట్టి రూపద్వయవిభాగంబు స్వరాట్టగు "స్వాయంభువ" మనువును, దన్మహిషి యగు "శతరూప" యను కన్యకయుంగా మిథునంబయి జనియించె; నమ్మిథునంబువలనం బ్రియవ్రతోత్తానపాదులను పుత్రద్వయంబు, నాకూతి దేవహూతి ప్రసూతులను కన్యకాత్రయంబును గలిగి; రందు నాకూతిని రుచికునకును, దేవహూతిం గర్దమునకును, బ్రసూతిని దక్షునకును నిచ్చె; వీరలవలనఁ గలుగు ప్రజాసంతతులచేత జగంబులు పరిపూర్ణంబు లయ్యె. 388**

**ప్రతి :** అని+ఇట్లు= అని ఈ విధంగా; విదురుండు+అడిగినన్= (బ్రహ్మ ఏ ముఖమునుండి ఏమేమి సృష్టించాడని) విదురుడు అడుగగా; మైత్రేయుండు= మైత్రేయమహర్షి; అతనితోన్+ఇట్లు+అనియెన్= విదురునితో ఇలా చెప్పనారంభించాడు; ఋక్+యజుస్+సామ+అథర్వంబులు+అను= ఋక్కు, యజుస్సు, సామము, అథర్వము అను; వేదంబులును= శ్రుతులును; హోతృకర్మంబులు+అయిన= యజ్ఞంలో హోత నిర్వహించవలసిన; అప్రగీతమంత్రస్తోత్రంబులు+అగు= అప్రగీతమంత్రములు స్తుతులు అయిన (సామధోరణితో రాగయుక్తముగా గానంచేసే ఋక్కులను సంప్రగీతములని, కేవలం మంత్రముగానే అలపించే ఋక్కులను అప్రగీతములని యాజ్ఞికవ్యవహారము); శస్త్రంబులును= శస్త్రములును (హోతయొక్క కర్మకములైన అప్రగీతాలకు శస్త్రములని పేరు); అధ్వర్యు కర్మంబు+ఐన+ఇజ్యయు= అధ్వర్యుడు నిర్వహించాల్సిన ఇజ్య అను కృత్యము; సంప్రగీతస్తోత్రంబు+అయిన= సంప్రగీతము అను పేరుగల స్తోత్రమయిన; స్తుతియును= స్తుతియు; ఉద్గాతృ ప్రయోజ్యంబు+ఐన= ఉద్గాత ప్రయోగించవలసిన; ఋక్+సముదాయరూపంబు+అగు= ఋక్కుల సముదాయరూపమైన; స్తోమంబును= స్తోమమును; ప్రాయశ్చిత్తంబు+అగు= ప్రాయశ్చిత్తరూపమైన; బ్రహ్మకర్మంబును= బ్రహ్మత్వం వహించే వ్యక్తి చేసే పనియు; ఆయుస్+వేద= వైద్య సంబంధమైన ఆయుర్వేదము; ధనుస్+వేద= యుద్ధసంబంధమైన ధనుర్వేదము; గాంధర్వవేదంబులు+అను= సంగీతసంబంధమైన గాంధర్వవేదము అనబడు; ఉపవేదంబులును= ఉపవేదాలు; విశ్వకర్మ శాస్త్రంబు+అగు= విశ్వకర్మకు సంబంధించిన శాస్త్రమైన; స్థాపత్యంబును= శిల్పశాస్త్రము; ప్రాక్+ఆది ముఖంబులన్= తూర్పు మొదలుగా గల ముఖములందు; ఉత్పన్నంబులు+అయ్యెన్= ఉద్భవించాయి; పంచమవేదంబు+అగు= ఐదవ వేదమైన; ఇతిహాస పురాణంబులు= ఇతిహాసాలు, పురాణాలు; సర్వముఖంబులన్+కలిగెన్= నాలుగు మోములనుండి ఏర్పడ్డాయి. మఱియున్= అంతేకాక; కర్మతంత్రంబులు+అయిన= యజ్ఞకృత్య తంత్రాలైన; షోడశీ= అగ్నిష్టోమయాగ మంత్రభాగమును; ఉక్థములును= సామవేద విశేషమును; చయన అగ్నిష్టోమంబులును= చయనము, అగ్నిష్టోమములను యాగములును; ఆప్తోర్యామ+అతిరాత్రంబులును= ఆప్తోర్యామము, అతిరాత్రము అను యాగములును; వాజపేయ గోసవంబులును= వాజపేయము, గోసవము అను యాగములును; ధర్మపాదంబులు+ఐన= ధర్మదేవత చరణములవంటి; విద్యాదాన తపస్+సత్యంబులును= విద్య, దానము, తపస్సు, సత్యములును; బ్రహ్మచర్య= బ్రహ్మచర్యాశ్రమం; గృహస్థ= గృహస్థాశ్రమం; వానప్రస్థ= వానప్రస్థాశ్రమం; యతి+ఆశ్రమంబులును= సన్న్యాసాశ్రమం అను నాలుగు ఆశ్రమాలును; కలిగెన్= ఏర్పడ్డాయి. వీనికిన్+ఒక్కొక్కటికిన్= వీనిలో ఒక్కొక్కదానికి; చతుః+విధంబులు+ఐన= నాలుగురకాలైన; వృత్తులును+ కలిగియుండున్= అనుష్ఠాన విధానాలుంటాయి; అందున్= వాటిలో; సావిత్రంబు+అను బ్రహ్మచర్యంబును= సావిత్రము అను పేరుగల బ్రహ్మచారి విధి; ఉపనయనంబు+ఆదిగాన్= వడుగు జరిగినది మొదలు; దివసత్రయంబు= మూడురోజులు; గాయత్రి జపించుట+అను= గాయత్రీమంత్రాన్ని జపించుట అనే; ప్రాజాపత్యంబును= ప్రాజాపత్యము అను పేరుగల విధి; వేదవ్రత చతుష్టయంబు+అందున్= నాలుగురకాలైన వేదవ్రతాలలో; ప్రతివ్రతంబును= ఒక్కొక్క వ్రతమును; వ్రతులు=

వ్రతదీక్షాధరులు; సంవత్సరపర్యంతంబు+కాన్= ఏడాదిపాటు; ఆచరింపన్+అగు= ఆచరించవలసిన; బ్రాహ్మంబును= బ్రాహ్మము అను విధియు; వేదగ్రహణ+అంతంబున్= వేదాభ్యాసము పూర్తియగువరకును; ఆచరింపన్+తగు= ఆచరించవలసిన; నైష్ఠికంబును= నైష్ఠికము అను విధియు; అను= అనే; బ్రహ్మచారి వృత్తిచతుష్టయంబును= బ్రహ్మచారి పాటించాల్సిన నాలుగు అనుష్ఠానాలు; అనిషిద్ధ కృషి+ఆది= వేదనిషిద్ధము కాని వ్యవసాయము మొదలగు; వృత్తి+అగు వార్తయు= వృత్తులతో కూడిన జీవనోపాయము; యజనాది కర్మ+ఉపయుక్తంబు+ఐన= యజ్ఞమువంటి కృత్యాలకు ఉపయోగపడుటకై; యాచ్ఞాదిరూప ధనసంచయంబును= యాచించుటద్వారా ధనసంపాదనము చేయుట; పరులన్+ యాచింపకుండు= ఎవరినీ అర్థించకుండా; అయాచితంబు+అను= అయాచితము అనబడే; శాలీనంబును= నీవారధాన్యము ఆహారమగుటను; క్షేత్రపతిత= పొలములలో రాలిపడిన; కణిశ కణ= ఎన్ను అను ధాన్యపు గింజలను; సంగ్రహణరూపంబు+ అగు= ప్రోగుచేయుట అను; శిలోంఛంబును= శిలోంఛము అను పేరుగల జీవనోపాయమును; అను గృహస్థవృత్తులు నాలుగును= అనే గృహస్థుల నాలుగు రకాలైన జీవికలును; అకృష్ట పచ్య+ఆహారులు+అగు= నేల దున్నకుండా పండే పంటను భుజించు; వైఖానసులును= విఖనసముని సంప్రదాయానికి సంబంధించిన వైష్ణవులును; నూతన ఫలంబు లబ్ధంబు+ఐనన్= కొత్తగా ఆహారం లభించగానే; పూర్వసంచిత పదార్థ త్యాగంబు+కల= ముందున్న ఆహారాన్ని విడిచిపెట్టే; వాలఖిల్యులును= వాలఖిల్య సంప్రదాయానికి చెందినవారును; ప్రాతఃకాలంబునన్= ఉదయము నిద్రలేవగానే; ఏ దిక్కు విలోకింతురు= ఏ దెసను చూస్తారో; ఆ+దిక్కునకున్+చని= ఆ దిక్కుగావెళ్లి; అచ్చటన్+లభించు= ఆ దిక్కున దొరికిన; పదార్థంబులన్+భుజించి= ఆహారాన్ని స్వీకరించి; జీవించు+ఔదుంబరులును= జీవించే ఉదుంబర సంప్రదాయానికి చెందినవారును; తమంతన్+ఫలించి= సహజముగా పండి; తరుపతితంబులు+అగు= చెట్టునుండి రాలిపడిన; ఫలంబులన్+ తినుచుండు= పండ్లను మాత్రమే తిను; ఫేనపలును= ఫేనప సంప్రదాయానుసారులును; అను చతుర్విధవృత్తులు+కల= అను నాలుగు రకాలైన జీవనోపాయములు కల; వానప్రస్థులును= వార్ధక్యమున వనమునకేగి జీవించువారును; స్వాశ్రమవిహితకర్మంబులన్= తమ ఆశ్రమానికి తగిన కర్మలను ఆచరించుటయే; ప్రధానుండు+అగు= ముఖ్య లక్షణంగా ప్రవర్తించు; కుటీచకుండును= కుటీచక సంప్రదాయానికి చెందినవాడును; కర్మంబు+ఉపసర్జనంబు+చేసి= కర్మకు ప్రాధాన్యమీయక; జ్ఞానప్రధానుండు+అయిన= జ్ఞానానికే ప్రాధాన్యమిచ్చే; బహూదుండును= బహూద సంప్రదాయానికి చెందినవాడును; కేవల జ్ఞాన+అభ్యాసనిష్ఠుండు+అగు= కేవలము జ్ఞానసముపార్జనయందే మునిగియుండు; హంసుండును= హంస సంప్రదాయానికి చెందినవాడును; ప్రాప్తంబు+ఐన= లభించిన; పరబ్రహ్మ తత్త్వంబుగన్= పరబ్రహ్మతత్త్వజ్ఞానంతో ఆనందిస్తూ; నిష్క్రియుండును= కర్మ రాహిత్యంతో మసలుకొనువాడును; అను సన్న్యాసిచతుర్విధవృత్తులును= అనే నాలుగు రకాలైన సన్న్యాసిధర్మాలును; మోక్ష ఫలప్రదంబు+ఐ= మోక్షమనే ఫలాన్ని ఇచ్చేదైన; ఆత్మ+అనాత్మవివేక విద్యారూపంబు+అగు= ఆత్మకు అనాత్మకు భేదాన్ని గ్రహించగలిగే విద్యయైన; ఆన్వీక్షకియున్= ఆన్వీక్షకి అను విద్యయు; స్వర్గాది ఫలప్రదంబు+ఐన= స్వర్గము మొదలైన ఫలాలనిచ్చేదైన; కర్మవిద్యారూపము+అగు+త్రయియున్= కర్మాచరణానికి చెందిన మూడు వేదములును; జీవన ఫలప్రదానంబు+ఐ= బ్రతుకుతెరువునిచ్చునదై; కృషి+ఆదిరూపంబు+అగు= వ్యవసాయము మొదలైన; వార్తయున్= వార్త; అర్థసంపాదన+ఏక ప్రయోజనంబు+అగు= ధనసంపాదనమే ప్రధానమైన; దండనీతియున్= శాసనాధికారమును; అను మోక్షధర్మకామ+అర్థంబులు+ ఐన= అనే మోక్షం, ధర్మం, కామం, అర్థము అనబడే; న్యాయవిద్యా చతుష్టయంబును= నాలుగు రకాలైన న్యాయవిద్యలు; 'భూర్భువస్సువః' అను వ్యాహృతులును= భూః, భువః, సువః అను వ్యాహృతులును; పూర్వ+ఆది ముఖంబుల వలనన్= తూర్పు మొదలుగా ఉన్న బ్రహ్మముఖాలనుండి; ఉదయించెన్= ఏర్పడినవి.

మఱియున్= ఇంకా; అతని హృదయ+ఆకాశంబువలనన్= శ్రీహరి హృదయాకాశమునుండి; ప్రణవంబును= ఓంకారమును; రోమంబులవలనన్= వెంట్రుకలనుండి; ఉష్ణిక్+ఛందంబును= ఉష్ణిక్ అను పేరుగల ఛందస్సును; త్వక్+ఇంద్రియమువలనన్= చర్మేంద్రియమునుండి; గాయత్రీ ఛందంబును= గాయత్రి అను పేరుగల ఛందస్సును; మాంసంబువలనన్= మాంసమునుండి; త్రిష్టుప్ ఛందంబును= త్రిష్టుప్ అను పేరుగల ఛందస్సును; స్నాయువువలనన్= స్నాయువు అను పేరుగల సన్నని నరమునుండి; అనుష్టుప్ ఛందంబును= అనుష్టుప్ అను పేరుగల ఛందస్సును; అస్థివలనన్= ఎముకలనుండి; జగతీఛందంబును= జగతి అను పేరుగల ఛందస్సును; మజ్జవలనన్= ఎముకలయందలి నేయినుండి; పంక్తిచ్ఛందంబును= పంక్తి అను పేరుగల ఛందస్సును; ప్రాణంబువలనన్= ప్రాణమునుండి; బృహతీ ఛందంబును= బృహతి అను పేరుగల ఛందస్సును; కకార+ఆది పంచవర్గాత్మకంబులు+అయిన= క నుండి మ వరకు గల; స్పర్శంబుల వలనన్= స్పర్శలు అను పేరుగల 25 అక్షరాలనుండి; జీవుండును= జీవాత్మస్వరూపుడును (**విశే :** 'కాదయో మావసానాః' స్పర్శాః అని సిద్ధాన్త కౌముది); అకార+ఆది స్వరాత్మకంబు+ఐన= అ నుండి ఔ వరకు గల అచ్చులనుండి; దేహంబును= శరీరమును (**విశే :** 'అచః స్వరాః' అని సిద్ధాన్తకౌముది); ఊష్మంబులు+అను= ఊష్మములు అను పేరుగల; శషసహ వర్ణ చతుష్టయ రూపంబులు+అగు= శ ష స హ అనే నాలుగు అక్షరాలుగా ఉన్న; ఇంద్రియంబులును= ఇంద్రియాలును; (**విశే:** 'శషసహా ఊష్మాణః' అని సిద్ధాన్తకౌముది); అంతస్థంబులు+అగు= అంతస్థములు అను పేరుగల; యరలవ లను వర్ణంబులును= య ర ల వ అను నాలుగు అక్షరాలును; (**విశే :** 'యరలవా అన్తస్థాః' అని సిద్ధాన్తకౌముది); షడ్జ+ఆది సప్తస్వరరూపంబును= షడ్జము మొదలగు ఏడు స్వరాలరూపమును; ఆత్మబలంబు+అయిన= ఆత్మబలమైన; శబ్దబ్రహ్మంబును= బ్రహ్మస్వరూపమైన శబ్దమును; చతుర్ముఖుని లీలావిశేషంబున్= బ్రహ్మదేవుని లీలావిశేషముతో; ఉత్పన్నంబు+అయ్యెన్= సంభవించినవి.

వ్యక్త+అవ్యక్తంబు+ఐ= తెలిసియు తెలియనట్లుండునదై; వైఖరీ ప్రణవ+ఆత్మకంబు+ఐన= వైఖరి అను పేరుగల వాక్కులో ఓంకారస్వరూపంతోనున్న; శబ్దబ్రహ్మంబువలనన్= శబ్దబ్రహ్మమునుండి; పరమాత్మ= పరంధాముడు; అవ్యక్త+ఆత్మకుండు+అగుటన్+చేసి= తెలియబడని రూపము కలవాడౌటచే; పరిపూర్ణుండును= పరిపూర్ణత్వము కలవాడును; వ్యక్త+ఆత్మకుండు+అగుటన్+చేసి= తెలిసేరూపం కలవాడౌటచేత; ఇంద్రాది శక్తి+ఉపబృంహితుండును+ఐ= ఇంద్రుడు మొదలగువారి శక్తులచే వ్యాఖ్యానింపబడువాడునై; కానన్+పడున్= కనిపిస్తాడు; పదంపడి= అటుపైన; అజుండు= బ్రహ్మ; భూరివీర్యవంతులు+అయిన= మిక్కిలి శక్తిమంతులైన; ఋషిగణంబుల సంతతి= మహర్షులవలన కలిగిన సంతానం; న+విస్తృతంబు+అని తలంచి= చాలినంతగా లేదని భావించి; పూర్వతనుపరిగ్రహంబు+చాలించి= మొదటి శరీరాన్ని విడిచిపెట్టి; అనిషిద్ధ కామ+ఆసక్తంబు+ఐన= ధర్మవిరుద్ధము కాని కామమునందు అపేక్షకల; దేహ+అంతర పరిగ్రహంబు+చేసి= వేరొక శరీరాన్ని స్వీకరించి; నిత్యంబున్+ప్రజాసృష్టియందున్= ఎల్లపుడూ సంతానోత్పత్తియందే; వ్యాసక్తుండను+ఐనను= ఆసక్తి కలవాడినయినా; ప్రజలు= సంతతులు; అభివృద్ధిన్+ఒందక+ఉండుటకున్= విస్తృతిని పొందకుండుటకు; ఏమి కారణంబు+అగును+అని= హేతువు ఏమైయుండునా అని; అచ్చెరువు+ఒంది= ఆశ్చర్యపడి; తద్+వృద్ధి+అగు విధంబు= ప్రజావృద్ధి జరిగే విధానాన్ని గురించి; ఆలోచించుచున్= ఆలోచన చేస్తూ; దైవంబు+ఇచ్చట= ఈ విషయంలో దైవం; విఘాతుకంబు+కానన్= ప్రతికూలముగా ఉన్నది కనుక; తద్+ఆనుకూల్యంబు+ఆవశ్యకంబు+అని= దైవము అనుకూలపడుట తప్పనిసరి యని; దానినిన్+ఎదురుచూచుచున్= దైవానుగ్రహంకోసం నిరీక్షిస్తూ; యథా+ఉచిత కృత్యకరణ దక్షుండు= తగిన పనులు చేయుటలో సమర్థుడు; అగుచుండన్= అగుచుండగా; చతుర్ముఖుని దేహంబు=

బ్రహ్మదేవుని శరీరం; ద్వివిధంబు+అయిన= రెండు భాగాలు కాగా; అట్టి రూపద్వయవిభాగంబు= ఆ రెండు భాగాలు; స్వరాట్టు+అగు= పరబ్రహ్మస్వరూపుడైన; స్వాయంభువ మనువును= స్వాయంభువుడు అను పేరుగల మనువునుగాను; తద్+మహిషి+అగు= అతని పట్టపురాణియైన; శతరూప+అను కన్యకయున్+కా= శతరూప అను పేరుగల స్త్రీగాను; మిథునంబు+అయి+జనియించెన్= ఆలుమగల జంటగా ఆవిర్భవించారు; ఆ మిథునంబువలనన్= ఆ జంటనుండి; ప్రియవ్రత+ఉత్తానపాదులు+అను= ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అను; పుత్రద్వయంబును= ఇద్దరు మగపిల్లలును; ఆకూతి దేవహూతి ప్రసూతులు+అను= ఆకూతి, దేవహూతి, ప్రసూతి అను పేర్లుగల; కన్యకాత్రయంబును= ముగ్గురు కన్యలును; కలిగిరి= సంభవించారు; అందున్= ఆ ముగ్గురిలో; ఆకూతిని రుచికునకును= ఆకూతి అనే అమ్మాయిని రుచికుడు అనువానికి; దేవహూతిన్ కర్దమునకును= దేవహూతి అనే పుత్రికను కర్దముడు అనువానికిని; ప్రసూతినిన్ దక్షునకును= ప్రసూతి అను కుమార్తెను దక్షుడు అనువానికిని; ఇచ్చెన్= ఇచ్చి వివాహము కావించెను; వీరలవలనన్= ఆ మూడు జంటలవలన; కలుగు ప్రజాసంతతులచేతన్= ఏర్పడిన సంతాన సముదాయములచేత; జగంబులు= లోకాలు; పరిపూర్ణంబులు+అయ్యెన్= సమృద్ధి కలిగినవిగా అయినవి.

**తా :** విదురుడు అడిగినదానికి మైత్రేయుడు చెపుతున్నాడు. బ్రహ్మ నాలుగు మోములనుండి యజ్ఞానికి సంబంధించిన హోత, అధ్వర్యుడు, ఉద్గాత, బ్రహ్మ అనబడే ఋత్విక్కు వీరు పఠించాల్సిన, గానం చేయాల్సిన ప్రశంసాత్మక మంత్ర స్తోత్రాలు, ఇజ్య, స్తోమాలు, ప్రాయశ్చిత్తకాండ ఉద్భవించాయి. ఉపవేదాలలో ఆయుర్వేదం, ధనుర్వేదం, గాంధర్వవేదం, విశ్వకర్మకు సంబంధించిన స్థాపత్యం (శిల్పవేదం) సంభవించాయి. పంచమవేదమయిన ఇతిహాసపురాణసముచ్చయం బ్రహ్మ నాలుగుమోములనుండి ఉత్పన్నమయింది. ఇంకా షోడశి, ఉక్థ్యం – చయనం, అగ్నిష్టోమం – ఆప్తోర్యామం, అతిరాత్రం, వాజపేయం, గోసవం అనే కర్మతంత్రాలు, ధర్మపాదాలైన విద్య, దానం, తపస్సు, సత్యం, బ్రహ్మచర్యం, గృహస్థాశ్రమం, వానప్రస్థాశ్రమం, సన్న్యాసాశ్రమం ఏర్పడ్డాయి. వీటికి ఒక్కొక్కదానికి నాలుగు రకాలైన వృత్తులుంటాయి. వాటిలో బ్రహ్మచర్యాన్ని పాటించడం సావిత్రం. ఉపనయనమైన నాటినుండి మూడు రోజులు గాయత్రి జపించటం ప్రాజాపత్యం. వేదవ్రతాలు అన్నీ ఏడాదిపాటు ఆచరించటం బ్రాహ్మం. వేదాభ్యాసానంతరం ఆచరించేది నైష్ఠికం. ఇలా బ్రహ్మచారి వృత్తులు నాలుగు రకాలు. అలాగే గృహస్థవృత్తులు నాలుగుంటాయి. వ్యవసాయం చేసి జీవించడాన్ని వార్త అంటారు. యజ్ఞయాగాలు చేసేందుకు కావలసిన సాధనాలను సంపాదించి కూడబెట్టడం సంచయం. ఎవరినీ నోరు తెరిచి అడుగకుండగా అయాచితంగా లభించినదానిని తినడం శాలీనం. పొలాలలో రాలిన ధాన్యపు గింజలను ఏరుకొని వాటిని రాళ్లపై నూరుకొని తినడం శిలోంఛం. ఈ నాలుగూ గృహస్థవృత్తులు. అలాగే వానప్రస్థులుకూడా నాలుగు రకాలు. దుంపలు త్రవ్వుకొని తినేవారు వైఖానసులు. కొత్తపంట వచ్చినపుడు పాతవాటిని తినకుండగా ఇతరులకు పంచిపెట్టేవారు వాలఖిల్యులు. ఉదయం నిద్రలేస్తూనే ఏ దిక్కును చూస్తారో అటే వెళ్లి అక్కడ లభించే పదార్థాలను తినేవారు ఔదుంబరులు. పండి నేలపై రాలినవాటిని మాత్రమే తినువారు ఫేనపులు. సన్న్యాసులు కూడా నాలుగు రకాలు. తన ఆశ్రమకర్మలను ఆచరించడమే ప్రధానంగా కలవాడు కుటీచకుడు. కర్మకంటె జ్ఞానానికి ప్రాధాన్యం ఇచ్చేవాడు బహూదుడు. కేవలం జ్ఞానసముపార్జనయందే నిష్ఠ కలిగి ఉండేవాడు హంసుడు. కర్మాచరణం, జ్ఞానసముపార్జన రెండిటినీ విడిచిపెట్టి కేవలం పరమాత్మధ్యానంనందే నిమగ్నమయ్యేవాడు నిష్క్రియుడు.

ఆత్మానాత్మ వివేకాన్ని కలిగించే అన్వీక్షకి, స్వర్గాది ఫలాలనిచ్చే కర్మవిద్యారూపమయిన త్రయి, జీవనోపకరణమై వ్యవసాయాధిరూపమైన వార్త, అర్థసంపాదనమే ముఖ్యప్రయోజనమైన దండనీతి ఇవి వరుసగా మోక్షానికి, ధర్మానికి,

కామానికి, అర్థానికి ఉపయోగపడే నాలుగు న్యాయాలు. 'భూః, భువః, సువః' అనే వ్యాహృతులు బ్రహ్మ తూర్పు మొదలుగా గల మోములనుండి ఆవిర్భవించాయి.

ఇంకా బ్రహ్మ హృదయాకాశంనుండి ప్రణవం పుట్టింది. వెంట్రుకలనుండి ఉష్ణిక్ ఛందస్సు, చర్మంనుండి గాయత్రీ ఛందస్సు, మాంసంనుండి త్రిష్టుప్ ఛందస్సు, స్నాయువునుండి అనుష్టుప్ ఛందస్సు, ఎముకనుండి జగతీ ఛందస్సు, మజ్జనుండి (ఎముకలనుండి ఏర్పడే నేయివంటి పదార్థం) పంక్తి ఛ్ఛందస్సు, ప్రాణంనుండి బృహతీ ఛందస్సు, కకారంనుండి మకారం వరకూ గల స్పర్శలు అనే పేరుగల అక్షరాలనుండి జీవుడు, అకారాది అచ్చులనుండి శరీరం, ఊష్మములనబడే శషసహ అనే అక్షరాలనుండి ఇంద్రియాలు, అంతస్థాలనబడే యరలవ అనే అక్షరాలనుండి షడ్జం మొదలైన సప్తస్వరాలు, ఆత్మబలంతో శబ్దబ్రహ్మం బ్రహ్మయొక్క లీలావిశేషంతో ఉత్పన్నమయ్యాయి.

పరమాత్మ వ్యక్త, అవ్యక్తరూపుడుగా ఉంటాడు. వాక్కు పర, పశ్యంతి, మధ్యమ, వైఖరి అని నాలుగు రకాలు. అందులో చివరిదైన వైఖరి వ్యక్తం. మొదటి మూడు అవ్యక్తం. వ్యక్తరూపవైఖరి వాక్కుగా ఉండే ఓంకారస్వరూపమైన శబ్దబ్రహ్మంవల్ల పరమాత్మ అవ్యక్తుడు (నాదరూపమే కాని శరీరరూపం లేకపోవుటచేత). వ్యక్తరూపుడుగా ఇంద్రాది శక్తిసంయుతుడై కనిపిస్తాడు.

వీర్యవంతులైన ఋషుల సంతానం తగినంత విస్తారం కాలేదని భావించి, పూర్వశరీరాన్ని విడిచిపెట్టి, నిషిద్ధం కాని కామంనందు ఆసక్తమైన వేరే శరీరాన్ని స్వీకరించి, నిత్యం సంతానసృష్టియందే లగ్నమైనా, ప్రజాభివృద్ధి జరుగకపోవడానికి కారణం ఏమై ఉంటుందా అని ఆశ్చర్యపడి, ప్రజావృద్ధికోసం ఆలోచించి, దైవం అనుకూలం కాకపోవడమే కారణమని భావించి, దైవానుకూల్యం తప్పనిసరియని తలచి, దానికోసం ఎదురుచూస్తూ, ఉచిత కార్యకలాపాలతో సాగుచుండగా బ్రహ్మదేవుని శరీరం రెండు భాగాలయింది. అందులో ఒకటి స్వరాట్టు అయిన స్వాయంభువ మనువైతే రెండవది అతని భార్యయైన శతరూప అయింది. ఆ దంపతులకు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే ఇద్దరు కుమారులు, ఆకూతి, దేవహూతి, ప్రసూతి అనే ముగ్గురు కుమార్తెలూ ఉద్భవించారు. ఆకూతిని రుచిప్రజాపతికి, దేవహూతిని కర్దమప్రజాపతికి, ప్రసూతిని దక్షప్రజాపతికి ఇచ్చి వివాహం చేశారు. వీరివలన కలిగిన సంతానంతో లోకాలు పరిపూర్ణమయ్యాయి.

## ✤ స్వాయంభువమనువు ప్రజావృద్ధి సేయుట ✤

**క. అని మైత్రేయుఁడు పలికిన, విని మనమున హర్ష మొదవ విదురుఁడు ముని నా**
**థునిఁజూచి పలికెఁ గ్రమ్మఱ, వనజోదరపాదభక్తివశమానసుఁడై. 389**

**ప్రతి :** అని= పైన చెప్పినట్లు; మైత్రేయుఁడు= ఈ పేరుగల మహర్షి; పలికినన్= చెప్పగా; విదురుఁడు= విదురుడు; విని= విన్నతరువాత; మనమునన్= మదియందు; హర్షము+ఒదవన్= సంతోషంకలుగగా; మునినాథునిన్= మునులలో శ్రేష్ఠుడైన మైత్రేయుని; చూచి; వనజ+ఉదర= పద్మం గర్భమందుగల శ్రీహరి; పాదభక్తి= పాదసేవకు; వశమానసుఁడు+ఐ= చిక్కిన మనస్సు గలవాడై; క్రమ్మఱన్= మరల; పలికెన్= ఇట్లనెను.

**తా :** మైత్రేయుడు ప్రజోత్పత్తిని గూర్చి వివరించగా విదురుడు విని సంతోషంతో పరవశించాడు. మనసులో విష్ణుపాదభక్తి అంకురించింది. మళ్ళీ మైత్రేయునితో ఇలా అన్నాడు.

**విశే :** 'మిత్ర' అనే స్త్రీకి కొడుకు కనుక మైత్రేయుడు అనే పేరు కలిగింది. 'మిత్ర' భర్త పేరు అంటే మైత్రేయుని తండ్రి పేరు కుషారవి.

**క. ఘనుఁడు స్వయంభువునకుఁ బ్రియ, తనయుఁడు స్వాయంభువుండు దైతేయవిభే**
**దన సేవాచతురుండును, జనవినుతుండాదిరాజసత్తముఁడౌటన్. 390**

**ప్రతి :** స్వయంభువునకున్= స్వయంభువుడు అను నతనికి; ప్రియ తనయుఁడు= నచ్చిన కుమారుడగు; స్వాయంభువుండు= స్వాయంభువమనువు; ఘనుఁడున్= గొప్ప పేరుగలవాడును; దైతేయవిభేదన= రాక్షసులమట్టుపెట్టిన శ్రీహరి; సేవా చతురుండును= ఊడిగమునందు సమర్థుడును; జనవినుతుండు= ప్రజలచే కొనియాడబడినవాడును; ఆది రాజసత్తముఁడు+ఔటన్= పూర్వరాజులలో శ్రేష్ఠుడైనందు వల్ల.

**తా :** స్వాయంభువుడు స్వయంభువరాజన్యునికి ప్రియమైనకుమారుడు. సాటిలేనివాడు. విష్ణుసేవలో దిట్ట. లోకమంతా ఆయన్ని కొనియాడుతుంది. ఆయన పూర్వరాజుల్లో శ్రేష్ఠుడు కూడ.

**విశే :** తల్లితండ్రుల సాంగత్యం లేకుండా తనంత తాను జన్మించిన వ్యక్తిని స్వయంభువు అంటారు. బ్రహ్మసృష్టిలో 'స్వయంభువు' మొదటి రాజన్యుడు. "స్వయంభువః అపత్యం పుమాన్ స్వాయంభువః" అపత్యార్థక తద్ధితం. స్వయంభువుని సంతానమే స్వాయంభువుడు. వీరిని మనుసంతతిలో ఆద్యులుగా గుర్తించారు. వీరివల్లనే ప్రపంచంలో మానవజాతి అభివృద్ధి చెందిందని ధర్మశాస్త్రాలంటాయి. స్వయంభువు అంటే విష్ణువు, బ్రహ్మ, శివుడు, మన్మథుడు అనే అర్థాలున్నాయి.

**క. అతని చరిత్రం బవ్యా, హతసుఖదము, నిఖిలమంగళావహము, సమం**
**చితముంగావున బుధ సే, విత! నా కెఱుఁగంగఁ బలుకవే మునితిలకా! 391**

**ప్రతి :** బుధసేవిత= పండితులచే కొనియాడబడినవాడా!; మునితిలకా!= మునులయందు శ్రేష్ఠుడా!; అతనిచరిత్రంబు= ఆ స్వాయంభువుని నడవడిక; అవ్యాహత= వ్యర్థం కానట్టి; సుఖదము= సుఖము నిచ్చేది; నిఖిల= సమస్తమైన; మంగళ= శుభములకు; ఆవహము= నెలవైంది; సమ్+అంచితమున్= మిక్కిలిఒప్పిదమైంది; కావునన్= ఆ కారణంచేత; నాకున్= (విదురునికి); ఎఱుఁగంగన్= తెలిసేటట్లు; పలుకవే= చెప్పుమా! (ప్రార్థన)

**తా :** ప్రాజ్ఞులచే పూజింపబడుతున్న ఓ మునీంద్రా! ఆ స్వాయంభువుని చరిత్ర ఎల్లప్పుడు సుఖప్రదమైంది. శుభదాయకమైంది. ప్రియమైంది. అందువల్ల దాన్ని నాకు బాగా తెలిసేటట్లు చెప్పుమా. అని విదురుడు ప్రార్థించాడు.

**క. అదియును గాక ముకుందుని, పదకమలమరందపానపరవశులై పెం**
**పొదవిన వారిచరిత్రము, సదమలమతి వినిన భవము సఫలము గాదే? 392**

**ప్రతి :** అదియును+కాక= విష్ణుకథ కేవలం సుఖదాయకమే గాక; ముకుందుని= నారాయణుని; పదకమల= పాదపద్మాల; మరందపాన= తేనెను సేవించుటచే; పరవశులు+ఐ= తన్మయులై; పెంపు+ఒదవిన= అతిశయించినట్టి; వారిచరిత్రము= అలాంటివారికథ; సత్+అమల మతిన్= మంచి పరిశుద్ధమైన మనస్సుతో; వినినన్= వింటే; భవము= పుట్టుక; సఫలము+కాదే= పండిన పంట గలది కాదా (సార్థకమని అర్థం).

**తా :** శ్రీమన్నారాయణుని కథను గూర్చి తెలుసుకోవటమే కాదు– ఆ స్వామి పాదపద్మసేవామృతాన్ని గ్రోలి తరించినవారి చరిత్రను సైతం మంచిబుద్ధితో వింటే కూడ జన్మ తరిస్తుంది.

**చ. అని విదురుండు పల్కిన దయాన్వితుఁడై మునినాథచంద్రుఁ డి**
**ట్లను శ్రుతిశాస్త్రపాఠకలితాత్మకుఁడైన నరుండు పద్మ లో**
**చన చరణారవిందయుగసంగము గల్గిన సజ్జనుండు వొం**
**దిన ఫల మొందు భాగవతదివ్యకథాశ్రవణానురక్తిచేన్. 393**

**ప్రతి :** అని= భక్తులచరిత్ర వింటే జన్మతరిస్తుందని; విదురుండు+పల్కినన్= విదురుడు చెప్పగా; మునినాథచంద్రుఁడు= మునీంద్రులలో శ్రేష్ఠుడైన మైత్రేయుడు; దయా+అన్వితుఁడు+ఐ= కనికరం గలవాఁడై; శ్రుతిశాస్త్రపాఠ= వేదాలు, శాస్త్రగ్రంథాల విజ్ఞానంచేత; కలిత= కూడిన; ఆత్మకుఁడు+ఐన= బుద్ధిగలవాఁడైన; నరుండు= మానవుడు; పద్మలోచన= తామరలవంటి కన్నులుగల శ్రీహరియొక్క; చరణ+అరవిందయుగ= పాదపద్మాల జంటతో; సంగము= కూడిక (నిత్యసాంగత్యం) కల్గిన; సత్+జనుండు= ఉత్తముడు; పొందినఫలము= విష్ణుపాదసేవచే గడించిన ఫలితాన్ని; భాగవత= భాగవతమనే పేరుగల గ్రంథంలోని, లేక భాగవతుల; దివ్యకథా= పవిత్రమైన కథల; శ్రవణ+అనురక్తిచేన్= వినికిడియందలి అపేక్షచేత; ఒందున్= పొందుతాడు (అని); ఇట్లు+అనున్= ఈ విధంగా ఆ ముని అన్నాడు.

**తా :** విష్ణుసేవామృతాన్ని ఆస్వాదించినవారి కథల్ని వింటే జన్మ ఫలిస్తుందని విదురుడన్నాడు. అప్పుడా మైత్రేయముని 'అయ్యా! వేదశాస్త్రాల విజ్ఞానంకల మానవుడు, శ్రీహరిపాదపద్మసేవ గల్గిన ఉత్తముడు ఏ ఫలితాన్ని పొందుతాడో అలాంటి ఫలితాన్ని శ్రీమద్భాగవతంలోని పవిత్రగాథల వినికిడి వల్ల కూడ కైవసం చేసుకొంటాడు' అని అన్నాడు.

**క. అని చెప్పి మునికులాగ్రణి, దనుజారికథాసుధాప్లుతస్వాంతుండై**
**తనువునఁబులకాంకురములు, మొనయఁగ నానందబాష్పములు జడి గురియన్. 394**

**ప్రతి :** అని చెప్పి= భాగవతకథా శ్రవణంవల్ల నరుడుపొందే ఫలితాన్ని వివరించి; మునికుల+అగ్రణి= యతీశ్వరుల్లో శ్రేష్ఠుడైన మైత్రేయుడు; దనుజ+అరి= రక్కసుల విరోధియైన విష్ణువుయొక్క; కథా= కథలనెడి; సుధా= అమృతంచే; ప్లుత= తడిసిన; స్వాంతుండు+ఐ= మనస్సుగలవాడై; తనువునన్= శరీరంనిండ; పులక+అంకురములు= గగుర్పాటులనే మొగ్గలు; మొనయఁగన్= మోసులెత్తగా; ఆనందబాష్పములు= సంతోషంవల్ల కల్గిన కన్నీళ్ళు; జడి+కురియన్= కుండపోతకాగా...

**తా :** భాగవతకథా శ్రవణంవల్ల కల్గే ఫలితాన్ని చెప్పిన తర్వాత ఋషిపుంగవుడైన మైత్రేయుని మనస్సు- రక్కసుల్ని మట్టుపెట్టే శ్రీమహావిష్ణువుకు సంబంధించిన కథామృతంలో తడియగానే అతని మేను పులకించింది. కళ్ళు ఆనందబాష్పాలను వర్షించాయి.

**సీ. వినిపింపఁదొడఁగె నా ఘనుఁడు స్వాయంభువుఁ, డంగనాయుక్తుఁడై యబ్జగర్భు**
**నకు మ్రొక్కి వినయవినమితోత్తమాంగుఁడై, హస్తముల్ మొగిచి యిట్లనియెఁ బ్రీతి**
**జీవరాసులకు రాజీవసంభవ! నీవ, జననరక్షణ వినాశముల కరయ**
**హేతుభూతుఁడవు; మా కెద్ది యాచరణీయ, మైన కర్మము దాని నానతిమ్ము!**

**తే. ఎట్టి కర్మంబు సేసిన? నెసఁగు నీకు, నవహితంబైన సంతోష మాత్మజుండు**
**జనకునకు భక్తిఁ బరిచర్య సలిపి కీర్తి, నంది నుతి కెక్కి వర్తించు నందు నిందు. 395**

**ప్రతి :** వినిపింపన్+తొడఁగెన్= మైత్రేయముని కథను చెప్పటానికి పూనుకొన్నాడు; ఆ ఘనుఁడు= ఆ మహానుభావుడైన; స్వాయంభువుఁడు= స్వయంభువునికొడుకు; అంగనాయుక్తుఁడు+ఐ= తనయిల్లాలితో కూడినవాడై; వినయ= అణకువచే; వినమిత= వంచినట్టి; ఉత్తమ+అంగుఁడు+ఐ= తలగలవాఁడై (శిరసువంచి); హస్తముల్= రెండుచేతులు; మొగిచి= ముడిచి; అబ్జగర్భునకున్= శ్రీహరిబొడ్డుదామరలో పుట్టిన బ్రహ్మకు; మ్రొక్కి= నమస్కరించి; ప్రీతిన్= ఆప్యాయతతో; రాజీవసంభవ!= తమ్మిపూవున బుట్టిన బ్రహ్మదేవా!; (ఓ తండ్రీ) అరయన్= ఆలోచింపగా; నీవు+అ= నీవే; జీవరాసులకున్= ప్రాణికోట్లకు; జనన= పుట్టుకకు; రక్షణవినాశములకున్= రక్షించుటకు, నశింపచేయుటకు; హేతుభూతుఁడవు= కారణమైన వాడవు; మాకున్= మాబోటివీరులకు (మీ బిడ్డలకు); ఎద్ది= ఏది; ఆచరణీయము+ఐనకర్మము= చేయదగ్గ పనియో; దానిన్= అలాంటి పనిని; ఆనతి+ఇమ్ము= ఆజ్ఞాపించు; నీకున్= (బ్రహ్మకు); ఎట్టికర్మంబు= ఎలాంటి పని; చేసినన్= చేస్తే; అవహితంబు+ఐన= తదేకమైన; (అంతులేని) సంతోషము= ఆనందం; ఎసఁగున్= ఒప్పును? (ప్రశ్నార్థకం); ఆత్మజుండు= తనకొడుకు; అందున్+ఇందున్= అక్కడ, ఇక్కడ; జనకునకున్= తండ్రికి; భక్తిన్= భక్తితో; పరిచర్య= సేవ; సలిపి= చేసి; కీర్తిన్+అంది= పేరుప్రతిష్ఠలు పొంది; నుతికిన్+ఎక్కి= స్తుతికెక్కి; వర్తించున్= నడుచుకొంటాడు.

**తా :** వేదనిధియైన మైత్రేయుడు విదురునికి స్వాయంభువమనువును గూర్చి వివరిస్తున్నాడు.

"స్వాయంభువమనువు తన భార్యామణి శతరూపాదేవితో కలిసి బ్రహ్మచెంతకు వెళ్లి వినయంగా తలవంచి, ఆయనకు నమస్కరించి" పద్మసంభవా! ఈ లోకంలోని ప్రాణికోటి పుట్టుకకు, రక్షణకు మరియు వినాశనానికి నీవే మూలకారకుడవు. మేము చేయవలసిన పని ఏదో నీవే చెప్పు. ఏ పని మేము చేస్తే నీకు ఎడతెగని పరమానందం కలుగుతుందో ఆనతిమ్ము. ఇహ పరాలలో కొడుకు తండ్రికి సేవచేసి కీర్తి గడిస్తాడని, స్తుతిపాత్రు డవుతాడు కదా.

**వ. కావున నెఱింగింపు మట్టి సత్కర్మంబు. 396**

**ప్రతి :** కావునన్= ఆ కారణంచేత; అట్టి= మేము నీకు చేయదగినట్టి; సత్కర్మంబు= మంచిపనిని; ఎఱిగింపుము= తెల్పుము.

**తా :** ఓ మహాత్మా! మేము నీకు ఏ పని చేస్తే సంతోషం కల్గుతుందో సెలవిమ్మని స్వాయంభువమనువు బ్రహ్మదేవుని ప్రార్థించాడు.

**క. అని పలికిన స్వాయంభువ, మను మృదుభాషలకు నలరి మనమునఁగమలా**
**సనుఁ డనురాగము ముప్పిరి, గొనఁబ్రియతముఁడైన సుతునకును నిట్లనియెన్. 397**

**ప్రతి :** అని పలికిన= అని అనగా; స్వాయంభువమనువు, మృదు, భాషలకున్= స్వాయంభువమనువుయొక్క మెత్తని పల్కులకు; అలరి= ఒప్పారి; కమల+ఆసనుఁడు= కమలం ఆసనంగా కల్గిన బ్రహ్మ; మనమునన్= మనసునందు; అనురాగము= ప్రీతి; ముప్పిరి+కొనన్= పెనవేయగా; ప్రియతముఁడు+ఐన సుతునకున్= మిక్కిలి ఇష్టుడైన కుమారుడు స్వాయంభువునితో; ఇట్లు+ అనియెన్= ఈ విధంగా అన్నాడు...

**తా :** తాను చేయదగిన సత్కర్మ యేదో చెప్పమని కోరిన స్వాయంభువమనువుయొక్క సుతిమెత్తని పల్కులు విని ఆనందించిన బ్రహ్మ, ప్రేమభావం ఉట్టిపడేవిధంగా ఇలా అన్నాడు.

**చ. మునుకొని తండ్రియాజ్ఞఁదలమోచి నిజోచితకృత్యమేమి పం**
**చినఁదన శక్తియుక్తి నెడసేయక చేయుట పుండరీక లో**
**చనపదసేవ సేయుట ప్రజాపరిపాలనశాలి యౌటయున్**
**జనకునకున్ సుతుండు పరిచర్య లొనర్చుట సువ్వె పుత్రకా! 398**

**ప్రతి :** పుత్రకా!= కుమారా!; మునుకొని= ముందుకు వచ్చి; తండ్రి+ ఆజ్ఞన్= తండ్రి ఆదేశాన్ని; తలమోచి= శిరసావహించి; నిజ+ఉచిత= తనకుమంచిదని తోచిన; కృత్యము= పని; ఏమి పంచినన్= ఏది చేయమని ఆజ్ఞాపించినా; తన శక్తియుక్తిన్= తన సామర్థ్యానికి తగినట్లు; ఎడ+చేయక= నిరాకరింపకుండా; చేయుట= కావించుట; పుండరీకలోచన= తెల్లతామరల వంటి కన్నులుగల విష్ణువు; పదసేవ+చేయుట= అడుగులకుమడుగులొత్తుట; ప్రజాపరిపాలనశాలి+ఔటయున్= ప్రజలను కాపాడు బుద్ధిగల వాడగుటయు; సుతుండు= కుమారుడు; జనకునకున్= తండ్రికి; పరిచర్యలు+ఒనర్చుట= సేవలుచేయుటయే; చువ్వె= సుమా!

**తా :** ముందుకు వచ్చి తండ్రి ఆజ్ఞను తలదాల్చి తనకు మంచిదనిపించిన పనిని చెపితే, ఆ పనిని శక్తికొలది చేయటం, విష్ణుదేవుని పాదసేవనం చేయటం, ప్రజాపరిపాలనం చేయటం తండ్రికి కొడుకు సేవలు చేయుటంవంటివే సుమా!

**వ. కావున. 399**

**ప్రతి :** కావునన్= అందువలన...

**తా :** కనుక (ఇక్కడ బ్రహ్మ స్వాయంభువునికి దిశానిర్దేశం చేయబోతున్నాడు.)

**మ. వివరింపన్ హరి యజ్ఞమూర్తిఁ బరమున్ విష్ణున్ హృషీకేశుఁ గే**
**శవుఁబద్మాక్షుగుఱించి జన్మమును శశ్వద్భక్తిఁ గావింప మా**
**ధవుఁడాత్మంబరితోషమొందు; నతఁ డుద్యత్ప్రీతిఁ గైకొన్న లో**
**కవితానంబులు దుష్టి నొందు ననఘా; కావింపుమా యజ్ఞముల్. 400**

**ప్రతి :** అనఘా!= ఓ పాపరహితుడా!; వివరింపన్= వివరంగా చెప్పాలనుకుంటే; యజ్ఞమూర్తిన్= యజ్ఞరూపాన్ని తాల్చినవాడును; పరమున్= లోకాతీతుడును; హృషీకేశున్= ఇంద్రియాల్ని జయించిన వాడును; కేశవున్= మంచి వెంట్రుకలు కలవాడును; పద్మ+అక్షున్= తామరల వంటి కన్నులగలవాడును; హరిన్= హరిని; విష్ణున్= శ్రీమన్నారాయణుని; గుఱించి= ఉద్దేశించి; జన్మమును= తమ పుట్టుకను; శశ్వత్+భక్తిన్= నిరంతరం భక్తిభావం కల్గి ఉండేటట్లు; కావింపన్= చేయగా; మాధవుఁడు= లక్ష్మీదేవిభర్తయైన ఆ హరి; ఆత్మన్= హృదయమందు; పరితోషము+ఒందున్= సంతోషం పొందుతాడు; అతఁడు= ఆ హరి; ఉద్యత్+ప్రీతిన్= మిక్కిలిప్రేమతో; కైకొన్న= స్వీకరించిన; లోకవితానంబులు= భువనసముదాయాలు; తుష్టిన్= తృప్తిని; ఒందున్= పొందును; (కావున అనే ముందటి వచనానికి ఇక్కడ సమన్వయం) అందువల్ల; యజ్ఞముల్= యజ్ఞాలు; కావింపుమా!= చేయుమా!

**తా :** "యజ్ఞావతారుడునూ, సర్వోత్తముడునూ, ఇంద్రియాల్ని జయించిన వాడునూ, నిగనిగలాడే తలనీలాలు గలవాడునూ, తామరల బోలిన కన్నులు కలవాడునూ అయిన శ్రీమహావిష్ణువునకు తమ జీవితాల్ని నిరంతర భక్తిభావంతో సమర్పిస్తే, ఆ

లక్ష్మీవల్లభుడు చాలా ఆనందిస్తాడు. అంతేకాదు. ఆయన రక్షణలో నున్న ఏడేడు భువనాలు సైతం సంతృప్తి చెందుతాయి. అందుచేత ఓ పాపరహితుడవైన కుమారా! యజ్ఞాలు చేయి" అని బ్రహ్మ స్వాయంభువుని కోరాడు.

**చ. అకుటిలభక్తిఁ గేశవసమర్పణబుద్ధిఁ గ్రతుక్రియల్ వొన**
**ర్పక విపరీతులై యుముకరాసులు దంచి ఫలంబు నందఁ గా**
**నక చెడురీతి నూరక ధనవ్యయ మౌటయ కాని మోక్ష దా**
**యక మగుచున్న తత్ఫలము నందరు విష్ణుపరాఙ్ముఖక్రియుల్. 401**

**ప్రతి :** విష్ణు= విష్ణుదేవునిపట్ల; పరాక్+ముఖ= పెడమొగంపెట్టి; క్రియుల్= పనులు చేసేవారు (అంటే హరికి వ్యతిరేకంగా పనులు చేసేవారు); న+కుటిలభక్తిన్= వక్రతలేని స్వచ్ఛమైన భక్తితో; కేశవ= శ్రీహరికి; సమర్పణ= అర్పించే; బుద్ధిన్= మనసుతో; క్రతుక్రియల్= యజ్ఞవిధులు; ఒనర్పక= చేయకుండా; విపరీతులు+ఐ= వ్యతిరేకులై; ఉముకరాసులు= పొట్టుగుట్టల్ని; దంచి= నలుగగొట్టి; ఫలంబున్= ఫలితాన్ని; అందన్+కానక= పొందలేక; చెడురీతిన్= చెడిపోవునట్లే; ఊరక= వ్యర్థంగా; ధనవ్యయము= సొమ్ము ఖర్చు; ఔటయ కాని= కావటమే తప్ప; మోక్షదాయకము+అగుచు+ఉన్న= మోక్షమునిచ్చేదైన; తద్+ఫలమున్= ఆ ఫలితాన్ని (మోక్షఫలితం); అందరు= పొందజాలరు.

**తా :** విష్ణుమూర్తిపట్ల విముఖులై పనులు చేసేవాళ్ళు– వక్రతలేని స్వచ్ఛమైన భక్తితో శ్రీహరికి సమర్పించే మనస్సుతో యజ్ఞవిధులు చేయకుండా విపరీతమతులైతే– పొట్టును దంచి ఫలితం పొందలేక చెడిపోయినట్లే, ధనాన్ని వ్యర్థంగా ఖర్చు చేసుకోవటం తప్ప యజ్ఞఫలమైన మోక్షాన్ని పొందలేరు.

**ఉ. కావున యజ్ఞముల్ హరి వికారవిదూరు గుఱించి చేయు నీ**
**భావము సూనృతవ్రత! శుభస్థితిఁజెందెడు, నీ కుమారులున్**
**నీవును నీ ధరాభరము నెమ్మి వహింపుము; సజ్జనావలిం**
**బ్రోవుము ధర్మమార్గమునఁబుత్త్రక! దోషలతాలవిత్రకా! 402**

**ప్రతి :** సూనృతవ్రత= సత్యమే వ్రతంగా గలవాడా!; దోష= పాపాలనెడి; లతా= తీగెలకు; లవిత్రకా!= కొడవలివంటివాడా!; పుత్త్రక!= కుమారుడా (ఓ స్వాయంభువా!); కావునన్= విష్ణుసమర్పణకాని యజ్ఞకార్యాలు మోక్షాన్ని ఇవ్వవు కాబట్టి; వికారవిదూరున్= వికృత చేష్టలకు మిక్కిలి దూరంగా ఉండే; హరిన్+గుఱించి= మాధవుని ఉద్దేశించి; యజ్ఞముల్= సత్కార్యాలను; చేయు= చేసే; నీ భావము= నీ (స్వాయంభువుని) ఆశయం; శుభస్థితిన్= మంగళకరమైన ఉనికిని; చెందెడున్= పొందుతుంది; నీ కుమారులును= నీ కొడుకులును; నీవున్= నీవుకూడా; ఈ ధరాభరమున్= ఈ భూభారాన్ని; నెమ్మిన్= ప్రీతితో; వహింపుము= భరించండి; ధర్మమార్గమునన్= పాడి తప్పని దారిలో (మంచిదారిలో); సత్+జన+ఆవలిన్= ఉత్తములైన ప్రజలసమూహాలను; ప్రోవుము= రక్షింపుము;

**తా :** 'సత్యమే వ్రతంగా భావించేవాడా!, పాపాలనే తీగెలను నరికే కొడవలివంటివాడా! ఓ కుమారా! ఎట్టివికారాలకు లోను గానట్టి ఆ శ్రీహరిని ఉద్దేశించి నీవు చేసే సత్కర్మలు తప్పక ఫలిస్తాయి. నీ బిడ్డలు, నీవు కలిసి ఈ భూమిని చక్కగా పాలించండి. ధర్మబద్ధంగా మంచివారిని కాపాడండి' అని బ్రహ్మ స్వాయంభువునికి హితం ఉపదేశించాడు.

**క. అనవుడు నతనికి నతఁ డి, ట్లనియెన్ భవదీయమైన యానతి యె ట్ల**
**ట్లొనరించెద నాకును నా, తనయులకు వసించి యుండఁదగు నెల వెందున్. 403**

**ప్రతి :** అనవుడు= అని ఇట్లు బ్రహ్మ ఆదేశింపగా; అతఁడు= స్వాయంభువు; అతనికిన్= బ్రహ్మదేవునికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు; భవదీయము+ఐన= మీది అయిన; ఆనతి= ఆజ్ఞ; ఎట్లు= ఏవిధమైందో; అట్లు= ఆ విధంగానే; ఒనరించెదన్= చేస్తాను; నాకును= (స్వాయంభువునకు); నా తనయులకున్= నా కుమారులకు; వసించి+ఉండన్= నివసించి ఉండటానికి; తగు నెలవు= తగిన చోటు; ఎందున్= ఎక్కడ కూడ...

**తా :** అని బ్రహ్మదేవుడనగా స్వాయంభువమనువు "తండ్రీ! మీ ఆజ్ఞానుసారంగా యజ్ఞ కార్యాలు చేస్తాము. నాకూ, నా కుమారులకూ నివాసయోగ్యమైన స్థలం ఎక్కడకూడా లేదు" అన్నాడు.

**తే. అరయ లేదు విధాత! యీ యఖిల జంతు, జాతముల కెల్ల నాధారభూతమైన**
**ధరణి యిప్పుడు ఘనజలాంతర్నిమగ్న, మైన కతమునఁజోటు లేదంటిఁదండ్రి! 404**

**ప్రతి :** అరయన్+లేదు= ఆలోచింపగా లేదు; విధాత!= ఓ బ్రహ్మదేవుడా!; తండ్రీ= నాన్నా; ఈ; అఖిలజంతు జాలములకున్+ఎల్లన్= ఈ సమస్తమైన ప్రాణిసమూహాల కన్నింటికి; ఆధారభూతము+ఐన= ఉనికిపట్టైన; ధరణి= భూమి; ఇప్పుడు; ఘనజల= గొప్పనీటి; అంతః= లోపల; నిమగ్నము+ఐన, కతమునన్= మునిగియున్న కారణంచేత; చోటులేదు= నివసించేస్థలం లేదు; (అని) అంటిన్= అన్నాను.

**తా :** ఓ తండ్రీ! అన్ని జీవరాసులకు ఆధారమైన భూమి ఇప్పుడు నీట మునిగిపోయింది. అందువల్ల నాకూ, నా కుమారులకు నిలువనీడ లేదన్నాను.

**క. కావున భూమ్యుద్ధరణము, గావించు నుపాయ మిపుడు గైకొని నాకున్**
**దేవా! నీ వెఱిఁగింపుము, నావుడుఁ బద్మజుఁడు దన మనంబునఁదలఁచెన్. 405**

**ప్రతి :** కావునన్= భూమి నీటిలో మునిగినందువల్ల; దేవా!= ప్రభూ!; భూమి+ఉద్ధరణము= నేలనుపైకి తేల్చుటకు; కావించు+ఉపాయము= చేసేయుక్తిని; ఇపుడు; కైకొని= పూనుకొని; నాకున్= స్వాయంభువుడనైన నాకు; నీవు; ఎఱింగింపుము= తెల్పుము; నావుడున్= అని అనగా; పద్మజుఁడు= తామరనుండి పుట్టిన బ్రహ్మ; తన మనంబునన్= తన మదిలో; తలంచెన్= ఇలా అనుకొన్నాడు...

**తా :** "మహాత్మా! భూమి నీటిలోనికి క్రుంగింది. కావున దాన్ని ఉద్ధరించే ఉపాయమేదో ఆలోచించి నాకు చెప్పండి" అని స్వాయంభువుడు ప్రార్థింపగా బ్రహ్మ తన మనస్సులో ఇలా అనుకొన్నాడు.

**మ. జలమధ్యంబున లీనమైన ధరణీచక్రంబు నే నేర్పునన్**
**నిలుపన్ వచ్చును? బూర్వమందు జగముల్ నిర్మించు నాఁడాది న**
**ప్పులఁబుట్టించిన మీఁద న వ్వసుమతింబుట్టించితి న్నట్టి య**
**ప్పులలోఁ గ్రుంకి రసాతలాంతరమునుం బొందెంగదా పృథ్వియున్. 406**

**ప్రతి :** జలమధ్యంబునన్= నీటినడుమ; లీనము+ఐన= మునిగిపోయిన; ధరణీచక్రంబున్= గుండ్రనిభూమిని; ఏ నేర్పునన్= ఎలాంటి ఉపాయంతో; నిలుపన్ వచ్చును= పైకి లేపవచ్చు? (ప్రశ్నార్థకం); పూర్వము+అందున్= మొదట; జగముల్= లోకాల్ని; నిర్మించునాఁడు= సృష్టిచేసేటప్పుడు; ఆదిన్= తొలుత; అప్పులన్= నీటిని; పుట్టించినమీఁదన్= సృష్టించిన తర్వాతనే; ఆ+వసుమతిన్= భూమిని; పుట్టించితిన్= సృష్టించాను; పృథ్వియున్= భూమికూడ; అట్టి+అప్పులలోన్= తొల్త అలా సృష్టింపబడిన నీటియందే; క్రుంకి= మునిగి; రసాతల+అంతరమునున్= పాతాళం మధ్యభాగాన్ని; పొందెన్+కదా!= చేరింది కదా! (నిర్ధారణార్థకం).

**తా :** నీటిలో మునిగిన ఈ భూమిని ఎలా ఉద్ధరించగలను? ముందు సృష్ట్యారంభంలో నేను అన్నింటికంటె కూడ మొదట నీటిని సృజించి, తర్వాత భూమిని సృజించాను. ఆ భూమాత నీటిలో మునిగి పాతాళగుహను చేరింది.

## ✤ శ్రీ యజ్ఞ వరాహావతార వర్ణనము ✤

**సీ. అఖిలజగత్కల్పనాటోపమునకుఁ బాల్పడిన నాచేత నె ట్భంగి నిపుడు**
**దగిలి విశ్వంభరోద్ధరణంబు గావింప నగు నని సర్వభూతాంతరాత్ముఁ**
**బురుషోత్తముని నవపుండరీకాక్షు లక్ష్మీపతిఁ దన మనస్థితునిఁ జేసి**
**తలపోయుచున్నఁబద్మజు నాసికా వివరమ్మున యజ్ఞవరాహమూర్తి**

**తే. యర్థి నంగుష్ఠమాత్రదేహంబుతోడ, జననమంది వియత్తలస్థాయి యగుచు**
**క్షణములోపల భూరి గజప్రమాణ, మయ్యె నచ్చటి జనముల కద్భుతముగ. 407**

**ప్రతి :** అఖిల= సమస్తమైన; జగత్+కల్పన= లోకాల్ని సృష్టించుట అనే; ఆటోపమునకున్= వేగిరపాటుకు; పాల్పడిన= లోనైన; నాచేతన్= నాచేత (బ్రహ్మచే); ఏ+భంగిన్= ఏవిధంగా; ఇపుడు; తగిలి= పూని; విశ్వంభరా= భూమియొక్క; ఉద్ధరణంబు= పైకిలాగుట; కావింపన్+అగున్= చేయదగును; అని; సర్వభూత= సమస్త ప్రాణులయొక్క; అంతర+ఆత్మున్= లోపల ఆత్మగా నున్న వాడును; పురుష+ఉత్తమునిన్= ఉత్తమ పురుషుడైన భగవంతుని; నవపుండరీక= కొంగొత్త తామరలవంటి; అక్షున్= కన్నులుగలవాడును (అయిన); లక్ష్మీపతిన్= లక్ష్మీదేవి భర్తను; తన= తనయొక్క; మనస్+స్థితునిన్= మదిలోనున్న వానినిగా; చేసి= కావించి; తలపోయుచు+ఉన్నన్= స్మరించుకొనుచుండగా; అర్థిన్= కోరికతో; యజ్ఞవరాహమూర్తి= (సత్కార్యమొనర్పనెంచిన)– పందిరూపాన్ని ధరించిన శ్రీహరి; పద్మజు= కమలం నుండి పుట్టిన బ్రహ్మదేవునియొక్క; నాసికావివరమ్మునన్= ముక్కురంధ్రం నుండి; అంగుష్ఠమాత్ర= బొటనవ్రేలంతటి; దేహంబుతోడన్= శరీరంతో; జననము+అంది= పుట్టి; వియత్+తలస్థాయి+అగుచున్= ఆకాశభాగంలో నిలుచున్నవాడగుచు; క్షణములోపలన్= చిటికెలో; అచ్చటి జనములకున్= అక్కడ మూగిన ప్రజలకు; అద్భుతముగన్= ఆశ్చర్యం గొల్పునట్లు; భూరిగజప్రమాణము= గొప్ప ఏనుగంత ఆకృతిగ; అయ్యెన్= ఏర్పడ్డాడు.

**తా :** బ్రహ్మ తన మదిలో "ఈ లోకాలన్నింటిని సృష్టించాలని ఆరాట పడుతున్నాను. మరి ఇప్పుడు పాతాళగుహ చొచ్చిన ఈ భూమిని ఎలా ఉద్ధరించాలి?" అని అనుకొంటూ చరాచరప్రాణికోటిలో ఆత్మస్వరూపుడుగా ఉన్నవాడునూ, పురుషశ్రేష్ఠుడునూ, అప్పుడే విచ్చిన తామరలవంటి కన్నులు కలవాఁడునూ, అయిన రమాపతిని స్మరించుకొనుచుండగా, అంతలోనే ఆయన ముక్కురంధ్రం నుండి 'యజ్ఞవరాహరూపు'డైన మాధవుఁడు బొటనవేలంతరూపంతో పుట్టి, చూపరులకు ఆశ్చర్యం గొల్పేటట్లు నింగి కెగబాకి, వెంటనే ఒకపెద్ద ఏనుగంత ఆకృతిని తాల్చాడు.

**సీ.** **అంతఁ బ్రజాసర్గమందు నియుక్తులై నట్టి మరీచ్యాదులైన మునులు**
**మనుకుమారకులు న మ్మనుసహితంబుగ యజ్ఞవరాహంబు నర్థిఁ జూచి**
**"యిట్టి యాశ్చర్య మిట్లెందేనిఁ గలదె నాసారంధ్ర నిర్గత స్తబ్ధరోమ**
**తోకంబు మనము విలోకింప నంగుష్ఠ మాత్రమై యా క్షణమాత్రలోన**

**తే.** **మహిమ దీపింప దంతి ప్రమాణమును మ, హోన్నతంబైన గండశైలోపమంబు**
**నయ్యె" ననుచు వితర్కించి; రబ్జభవుఁడు, హర్ష మిగురొత్త నిట్లని యపుడు దలఁచె.** **408**

**ప్రతి :** అంతన్= (యజ్ఞవరాహమవతరించిన)తర్వాత; ప్రజాసర్గము+అందున్= ప్రజలనుత్పత్తిచేయు కార్యమందు; నియుక్తులు+ఐన+అట్టి= నియమింపబడినవారైన; మరీచి+ఆదులు+ఐనమునులు= మరీచి మొదలైన మునులు; మను కుమారకులు= స్వాయంభువుయొక్క పుత్రులు; ఆ+మనుసహితంబుగన్= ఆ స్వాయంభువునితోకూడ; అర్థిన్= కోరికతో; యజ్ఞవరాహంబున్= ఆ పేరుతో అవతరించిన హరిని; చూచి=చూస్తూ; ఇట్టి+ఆశ్చర్యము= ఇలాంటి వింత; ఇట్లు+ఎందు+ ఏనిన్= ఇలాగ ఎక్కడైనా; కలదె= ఉన్నదా?; నాసారంధ్ర= ముక్కురంధ్రంనుండి; నిర్గత= వెడలిన; స్తబ్ధరోమతోకంబు= పందిపిల్ల; మనము= ఇచ్చటి వారెల్లరము; విలోకింపన్= చూస్తుండగానే; అంగుష్ఠమాత్రము+ఐ= బొటనవ్రేలంతగా నై; ఆ క్షణమాత్రలోనన్= ఒక్కచిటికెలోపల (వెంటనే); మహిమ= దాని గొప్పదనం; దీపింపన్= వెలుగొందునట్లు; దంతిప్రమాణమును= ఏనుగంతనిడివియు; మహా+ఉన్నతంబు+ఐన= మిక్కిలి ఎత్తైన; గండశైల+ఉపమంబు= పెద్దబండతో పోల్చదగినంతయు; అయ్యెన్= అయినది; అనుచున్= అంటూ; వితర్కించిరి= తమలోతాము చర్చించుకొనిరి; అబ్జభవుఁ డు= పద్మంలో పుట్టినబ్రహ్మ; అపుడు= ఆ సమయంలో; ఇట్లు+అని= ఈ విధంగా; తలంచెన్= అనుకొన్నాడు...

**తా :** బ్రహ్మదేవునిచే ప్రజోత్పత్తి యందు నియమితులైన మరీచిమొదలైన నవబ్రహ్మలును, స్వాయంభువమనువుతో కూడిన ఆయన కుమారులును బ్రహ్మనాసారంధ్రంనుండి పుట్టిన యజ్ఞవరాహరూపాన్ని తిలకించారు. "అహో! ఎక్కడైన ఇంతటి వింత ఉందా? మనం చూస్తుండగానే ఈ 'పందిపిల్ల' బొటనవ్రేలంత కన్పించి అంతలోనే ఏనుగంతగా, పెద్దబండ అంతగా మారిపోయింది ఆశ్చర్యం" అనుకొన్నారు. అపుడు బ్రహ్మ పులకించిపోయి ఇలా అన్నాడు.

**విశే :** ఈ పద్యంలో 'ప్రజాసర్గం' అనే పదముంది. సర్గం అంటె సృష్టి, ఈ సృష్టి తొమ్మిది రకాలు. 1) మహత్సర్గం 2) అహంకారసర్గం 3) భూతసర్గం 4) ఇంద్రియసర్గం 5) దేవసర్గం 6) తమస్సర్గం 7) వనస్పత్యాదిసర్గం 8) తిర్యక్సర్గం 9) మనుష్యసర్గం. కుమారసర్గమనేది కూడ ఉంది. అయితే ఇది మనుష్యసర్గం లోనిదే. విడిగా గ్రహిస్తే 'దశవిధసర్గాలు' అవుతాయి.

మరీచ్యాదులను నవబ్రహ్మలంటారు. వారు – 1) మరీచి 2) భరద్వాజుడు 3) అంగీరసుడు 4) పులస్త్యుడు 5) పులహుడు 6) క్రతువు 7) దక్షుడు 8) వసిష్ఠుడు 9) వామదేవుడు

భరద్వాజ వామదేవులకు బదులుగా 'అత్రి, భృగువు'లను కొందరు గ్రహిస్తారు.

**క.** **నా మనమునఁగల దుఃఖ వి, రామముఁగావించుకొఱకు రాజీవాక్షుం**
**డీ మేర "యజ్ఞపోత్రి, శ్రీమూర్తి" వహించె నిది విచిత్రము దలఁపన్.** **409**

**ప్రతి :** రాజీవ+అక్షుండు= కమలాలను బోలిన కన్నులుగలవాడగు విష్ణుమూర్తి; నామనమునన్= నా మనస్సులో; కల= ఉన్నట్టి; దుఃఖ= వ్యధకు; విరామమున్= ఉపశాంతి; కావించుకొఱకు= కల్గించటానికి; ఈ మేరన్= ఇచ్చోట; శ్రీమూర్తి= మంగళకరమైన విగ్రహంగల; యజ్ఞపోత్రి= యజ్ఞవరాహరూపాన్ని; వహించెన్= తాల్చాడు; తలఁపన్= ఆలోచింపగా; ఇది= ఈ అవతారం; విచిత్రము= ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది.

**తా :** భూదేవిని పాతాళంనుండి ఎట్లా ఉద్ధరించగలనా? అని ఎంతో చింతతో ఉన్న నాకు మనశ్శాంతి కల్గించే ఉద్దేశంతో విష్ణుమూర్తి 'యజ్ఞవరాహావతారం'తో ప్రత్యక్షమయ్యాడు. ఇది చాలా ఆశ్చర్యాన్ని గొల్పే సంఘటన.

**వ. అని వితర్కించు సమయంబున సూకరాకారుండయిన భగవంతుండు. 410**

**ప్రతి :** అని= (శ్రీహరి యజ్ఞవరాహోతారమెత్తటం ఆశ్చర్యకరం) అని; వితర్కించు= తలంచు; సమయంబునన్= కాలంలో; సూకర+ఆకారుండు+అయిన= పందిరూపమెత్తినట్టి; భగవంతుండు= దేవదేవుడైన నారాయణుడు...

**తా :** 'స్వాయంభువు' యజ్ఞవరాహమూర్తిని చూచి సంభ్రమాశ్చర్యం పొందాడు.

**తే. ప్రళయజీమూతసంఘాత భయదభూరి, గర్జనాటోపభిన్నదిగ్ఘనగభీర**
**రావ మడరింప నపుడు రాజీవభవుఁడు, మునులు నానందమును బొంది రనఘచరిత! 411**

**ప్రతి :** అనఘచరిత= పాపరహితమైన నడవడికగల ఓ విదురా!; ప్రళయజీమూత= ప్రలయకాలమందలి మేఘాలయొక్క; సంఘాత= సమూహంచేనైన; భయద= భీతినిగొల్పు; భూరి= గొప్ప; గర్జన+ఆటోప= ఘుర్ఘురారావముయొక్క రాపిడిచేత; భిన్న= పగిలినట్టి; దిక్= దిక్కులుగల; ఘన= గొప్పదైన; గభీర= లోతైన లేక గంభీరమైన; రావము= ధ్వని; అడరింపన్= చేయగా; అపుడు= ఆ సమయాన; రాజీవభవుఁడు= పద్మం నుండి పుట్టిన బ్రహ్మ; మునులు= అచ్చట చేరిన ఋషులు; ఆనందమును= హర్షాన్ని; పొందిరి= పొందారు.

**తా :** యజ్ఞవరాహస్వామి చేసిన 'గుర–గుర' మనే గర్జన ప్రళయకాలం నాటి మేఘసమూహం చేసే ఉరుములాగ దిక్కుల్ని పిక్కటిల్లేటట్లు చేసింది. ఆ శబ్దం విని బ్రహ్మ మరియు అక్కడ మూగిన యతీశ్వరులు ఆనందించారు.

**వ. అంత మాయామయవరాహ ఘుర్ఘురారావంబు బ్రహ్మాండకోటర పరిస్ఫోటనంబుఁగావింప విని జనస్తపస్సత్య లోక నివాసులయిన మునులు ఋగ్యజుస్సామ మంత్రంబుల వినుతించిరి; యజ్ఞవరాహరూప ధరుండయిన సర్వేశ్వరుండు సత్పురుష పాలన దయాపరుండు గావున దిగ్గజేంద్రలీలావిలోలుండై. 412**

**ప్రతి :** అంతన్= (ఎల్లరు ఆనందించిన) తర్వాత; మాయామయ= మాయారూపమెత్తిన; వరాహ= పందియొక్క; ఘుర్+ఘుర+ ఆరావంబు= 'ఘుర, ఘుర' అనే శబ్దం; బ్రహ్మాండకోటర= బ్రహ్మాండలోకంలోని నడిమి భాగం (తొర్ర); పరిస్ఫోటనంబున్= బద్దలగునట్లు; కావింపన్= చేయగా; విని= ధ్వనిని విని; జనస్+తపస్+సత్యలోక= జన, తపోలోక, సత్యలోకాలందు; నివాసులు+అయిన= నివసిస్తున్న వారైన; మునులు= యతులు; ఋగ్+యజుస్+సామవేద= ఋగ్వేద, యజుర్వేద, సామవేదసంబంధాలైన; మంత్రంబులన్= మంత్రాలతో; వినుతించిరి= స్తుతించారు; యజ్ఞవరాహ రూపధరుండు+అయిన= యజ్ఞవరాహరూపాన్ని తాల్చినట్టి; సర్వ+ఈశ్వరుండు= జగత్ప్రభువగు విష్ణుమూర్తి; సత్+పురుష= సజ్జనులయొక్క; పాలన= రక్షణయందు; దయాపరుండు= కనికరం గలవాడు; కావునన్= కాబట్టి; దిక్+గజ+ఇంద్ర= శ్రేష్ఠమైన దిగ్గజాల; లీలా= విలాసంతో; విలోలుండు+ఐ= మిక్కిలి చలించినవాడై.

**తా :** స్వామి మాయామయమైన యజ్ఞవరాహరూపమెత్తి, 'ఘుర ఘుర' మని పెడబొబ్బపెట్టినపుడు బ్రహ్మాండలోకపు మధ్యభాగం బ్రద్దలైంది. భూలోకం, తపోలోకం మరియు సత్య (బ్రహ్మాండ) లోకం అనే మూడులోకాల్లో నివసిస్తున్న ఋషులు ఆ రూపాన్ని ఋగ్వేద, యజుర్వేద, సామవేద మంత్రాలతో స్తుతించారు. యజ్ఞవరాహరూపమెత్తిన ఆ లోకేశ్వరుడు మంచివారిపట్ల దయగలవాడు. అప్పుడాయన ప్రదర్శించిన విలాసక్రీడ దిగ్గజాల వినోదాన్ని తలపించింది.

**సీ.** **కఠినసటాచ్ఛటోత్కటజాతవాత నిర్ధూత జీమూతసంఘాతమగుచు**
**క్షురనిభ సునిశితఖురపుటాహతచలత్ఫణిరాజ దిగ్గజప్రచయ మగుచుఁ**
**జండదంష్ట్రోత్థ వైశ్వానరార్చిస్స్రవద్రజత హేమాద్రివిస్రంభమగుచు**
**ఘోరగంభీరఘుర్ఘురభూరి నిస్వనపంకిలాఖిలవార్ధిసంకులముగఁ**

**తే.** **బొరలుఁ గెరలు నటించు నంబరము దెరల, రొప్పు నుప్పర మెగయును గొప్పరించు**
**ముట్టె బిగియించు ముసముస మూరుకొనుచు, నడరు సంరక్షితక్షోణి యజ్ఞఘోణి.** **413**

**ప్రతి :** సంరక్షితక్షోణి= కాపాడబడనున్న భూమిగల; యజ్ఞఘోణి= యజ్ఞవరాహరూపం; (శ్రీహరి) కఠిన= కటువైన; సటా+ఛటా= జూలుసమూహంనుండి; ఉత్+కట= భీకరంగా; జాత= పుట్టినట్టి; వాత= గాలిచేత; నిర్ధూత= చెదరగొట్టబడిన; జీమూత సంఘాతము= మేఘాలగుంపు కలది; అగుచున్= అవుతూ; క్షురనిభ= చురకత్తుల్ని పోలిన; సునిశిత= మిక్కిలి వాడియైన; ఖురపుట= దొప్పలవంటి కాలిగిట్టలచే; ఆహత= కొట్టబడిన; చలత్= కదలుతున్న; ఫణిరాజ= ఆదిశేషునియొక్క; దిక్+గజ= దిక్కులనెడి ఏనుగుల యొక్క; ప్రచయము= సమూహంగలది; అగుచున్= అగుచు; చండ= మిక్కిలి వాడియైన; దంష్ట్రా= కోరలనుండి; ఉత్థ= పైకెగసిన; వైశ్వానర+అర్చిస్= అగ్నిదేవుని మంటలచే; స్రవత్= ద్రవమై దిగ జారుతున్న; రజతహేమాద్రి= వెండికొండ, బంగారుకొండల యొక్క; విస్రంభము= వినాశంగలది; అగుచున్= అగుచు; ఘోర= మిక్కిలి భయంకరమైన; గంభీర= లోతైన; ఘుర్+ఘుర= ఘురఘురమనెడి; భూరి= గొప్పదైన; నిస్వన= ధ్వనిచేత; పంకిల= బురదగా చేయబడ్డ; అఖిలవార్ధి= అన్నిసముద్రాలయొక్క; సంకులముగన్= వ్యాపకం గలది అగునట్లు; పొరలున్= ఇటునటు పొర్లును; కెరలున్= విజృంభించును; నటించున్= నాట్యమాడును; అంబరము= నింగి; తెరలన్= కలతచెందునట్లు; రొప్పున్= కూత వేయును; ఉప్పరము= ఆకాశాన్ని; ఎగయును= ప్రాకుటకు; గొప్పరించున్= విజృంభిస్తుంది; ముట్టె బిగియించును= కోపంతో మూతిని బిగిస్తుంది; ముసముస= చిరచిరలాడుతూ; మూరుకొనుచున్= వాసనచూస్తూ; అడరున్= అతిశయిస్తుంది.

**తా :** భూమిని ఉద్ధరించటానికి అవతరించిన యజ్ఞవరాహంయొక్క సంరంభం ఇలా ఉంది. అది తన జూలుని విదిల్చినప్పుడు ఏర్పడ్డ పెద్దగాలికి మబ్బులన్నీ చెల్లాచెదరయ్యాయి. చురకత్తుల్లాగ మిక్కిలి వాడియైన దాని కాలి గిట్టల్ని సోకి ఆదిశేషుడు మరియు దిగ్గజాలు వణికిపోయాయి. దాని తీక్ష్ణమైన కోరలనుండి ఎగిసిన మంటలకు వెండికొండ, బంగారుకొండ కరిగిపోయాయి. అతి భయంకరమైన దాని 'ఘురఘుర' అరపులకు సప్తసముద్రాలనీరింకి బురద అయింది. అది ఇటునటు భూమిపై పొర్లుతూ, ఎగిసి చిందులేస్తూ, నింగి బద్దలయ్యేట్లు శబ్దిస్తూ, ఆకాశమంత ఎత్తు ఎగిరి దూకుతూ, కోపంతో మూతి బిగిస్తూ, చిరచిరలాడుతూ వాసనచూస్తూ అతిశయించింది.

**వ.** **మఱియు న య్యజ్ఞవరాహంబు.** **414**

**ప్రతి :** మఱియున్= అంతేగాక (అనగా దాని పోకడలేగాక); ఆ+యజ్ఞవరాహంబు= ఆ యజ్ఞవరాహం;

**తా :** ఇంకా ఆ వరాహం చేసిన చేష్టలు ఎలా ఉన్నాయంటే.

**సీ. తివిరి చతుర్దశభువనంబులను దొంతు లొరగఁ గొమ్ములఁజిమ్ము నొక్కమాటు**
**పుత్తడికొండ మూఁపురమను నొరగంట నొరకు రారాపాడు నొక్కమాటు**
**ఖురముల సప్తసాగరముల రొంపిగా నుక్కించి మట్టాడు నొక్కమాటు**
**నాభీలవాలవాతాహతిచే మింటి నొరసి బ్రద్దలు సేయు నొక్కమాటు**

**తే. కన్నుఁగొనలను విస్ఫులింగములు సెదర, నురుభయంకరగతిఁ దోఁచు నొక్కమాటు**
**పరమయోగీంద్రజనసేవ్య భవ్యవిభవ, యోగ్యమై కానఁగా నగు నొక్కమాటు. 415**

**ప్రతి :** ఆ యజ్ఞవరాహం; ఒక్కమాటు= ఒకమారు; తివిరి= ప్రయత్నించి; చతుర్+దశ= పదునాల్గు; భువనంబులను= లోకాలను; దొంతులు+ఒరగన్= వరుసలు కూలునట్లు; కొమ్ములన్= కొమ్ములతో (కోరలతో); చిమ్మున్= చెదరగొట్టును; ఒక్కమాటు= మరోమాటు; పుత్తడికొండ= బంగారు కొండను; మూపురము+అను ఒరగంటన్= తలపై భాగం అనే ఒరగల్లుతో; ఒరకు, రాన్= చూర్ణం అయ్యేట్లుగా; రాపాడున్= రుద్దుకొంటుంది; ఒక్కమాటు= ఇంకొకపర్యాయం; ఖురములన్= గిట్టలచేత; సప్తసాగరములన్= ఏడుసముద్రాలను; రొంపి+కాన్= బురద అగునట్లు; ఉక్కించి= విజృంభించి; మట్టాడున్= త్రొక్కింది; ఒక్కమాటు= ఒక్కతరి; ఆభీల= భయంకరమైన; వాల= తోకయొక్క; వాత+ఆహతిచేన్= గాలితాకిడిచేత; మింటిన్+ఒరసి= ఆకాశాన్ని అంటి; బ్రద్దలు+చేయును= ముక్కలుచేస్తుంది; ఒక్కమాటు= ఒకమారు; కన్నున్+కొనలను= కంటి కొసలందు; విస్ఫులింగములు= అగ్గిరవ్వలు; చెదరన్= ఎగిసిపడగా; ఉరుభయంకరగతిన్= మిక్కిలి వెరపుగొల్పుతీరున; తోఁచున్= కన్పిస్తుంది; ఒక్కమాటు= ఇంకొక పర్యాయం; పరమయోగీంద్రజన= ఉత్తములైన ఋషిజనంచే; సేవ్య= సేవింపదగిన; భవ్యవిభవ= యోగ్యమైన వైభవానికి; యోగ్యము+ఐ= తగినదై; కానన్+కాన్+అగున్= కన్పిస్తుంది.

**తా :** ఆ పందియొక్క విలాసచేష్టల్ని ఈ పద్యంలో కూడ కవి వర్ణించాడు.

ఆ వరాహం తన కొమ్ములతో పదునాల్గులోకాలను వరుసగా కుప్పకూలిపడునట్లు చిమ్ముతుంది. కనకాద్రిని తన రొమ్ముతో కుమ్ముతుంది. ఏడుసముద్రాల్ని తనగిట్టలచే రొంపిచేసి దానిపై విజృంభించి తిరిగింది. తన తోకతో విసిరిన గాలితాకిడిచేత ఆకాశాన్ని బద్దలు చేస్తుంది. కన్నుల్లో నిప్పులు గురిసి భీకరంగా కన్పిస్తుంది. ఒక్కొక్క పర్యాయం మహర్షులు భక్తితో సేవలందించటానికి తగిన ఆకారంతో సాక్షాత్కరిస్తుంది.

**విశే :** చతుర్దశభువనాలు: ఇవి ఏడు ఊర్ధ్వలోకాలు, ఏడు అధోలోకాలు.

ఊర్ధ్వలోకాలు 7: 1) భూలోకం 2) భువర్లోకం 3) సువర్లోకం 4) మహర్లోకం 5) జనలోకం 6) తపోలోకం 7) సత్యలోకం.

అధోలోకాలు 7 : 1) అతలం 2) వితలం 3) సుతలం 4) రసాతలం 5) మహాతలం 6) తలాతలం 7) పాతాళం.

సప్తసాగరాలు : 1) లవణ 2) ఇక్షు 3) దధి 4) క్షీర 5) సురా 6) సర్పి 7) జల.

**వ. ఇట్లు విహరించుచుఁ బ్రాతర్మధ్యందినతృతీయ సవనరూపుండయిన యజ్ఞవరాహమూర్తి యగు సర్వేశ్వరుండు మహాప్రళయంబునందు యోగ నిద్రావశుండై యుండు నవసరంబున నుదకస్థంబైన భూమి**

**రసాతల గతంబైన దాని నుద్ధరించుటకు సముద్రోదరంబుఁ దతియం జొచ్చు వేగంబు సైరింపఁజాలక సముద్రుం డూర్ములను భుజంబు లెత్తి విశీర్ణ హృదయుండై యార్తుని పగిది "యజ్ఞవరాహ! నన్ను రక్షింపు, రక్షింపు" మని యాక్రోశింప నిశిత కరాళక్షుర తీక్ష్ణంబులైనఖురాగ్రంబుల జలంబులు విచ్ఛిన్నంబులు గావించి యపారంబయిన రసాతలంబుం బ్రవేశించి భూమింబొడగను నవసరంబున. 416**

**ప్రతి :** ఇట్లు= పైన వివరించిన విధంగా; విహరించుచున్= విహరిస్తూ; ప్రాతర్= ఉదయకాలం; మధ్యందిన= మిట్టమధ్యాహ్నం; తృతీయ= మూడవదైన సాయంకాలం(ఈ మూడువేళలకు సంబంధించిన); సవనరూపుండు+అయిన యజ్ఞవరాహమూర్తి= యజ్ఞరూపం దాల్చినట్టి యజ్ఞవరాహమూర్తి; అగు= అయినట్టి; సర్వ+ఈశ్వరుండు= సమస్తవిశ్వానికి ప్రభువైన శ్రీహరి; మహాప్రళయంబునందున్= గొప్ప ప్రళయకాలంలో; యోగనిద్రావశుండు+ఐ= యోగనిద్రగూడినవాడై; ఉండున్+అవసరంబునన్= ఉన్నట్టి సమయంలో; ఉదకస్థంబు+ఐన= నీటిలోనున్నట్టిదైన; భూమి= నేల; రసాతలగతంబు+ ఐనన్= పాతాళలోకం చేరిన; దానిన్= ఆ భూమిని; ఉద్ధరించుటకున్= పైకి లేపుటకు; సముద్ర+ఉదరంబున్= సంద్రంయొక్క నడిమిభాగాన్ని; తఱియన్+చొచ్చువేగంబున్= సమీపించినప్పటి త్వరను; సైరింపన్+చాలక= సహించలేక; సముద్రుండు= కడలి; ఊర్ములు+అను= అలలనెడి; భుజంబులు+ఎత్తి= చేతులెత్తి; విశీర్ణహృదయుండు+ఐ= పగిలిన గుండెగలవాడై (గుండెగలదై); ఆర్తునిపగిదిన్= దుఃఖితునివలె; యజ్ఞవరాహ!= యజ్ఞవరాహరూపా!; నన్నున్= (సముద్రుని); రక్షింపు రక్షింపుము= కాపాడు, కాపాడు; అని; ఆక్రోశింపన్= బిగ్గరగా అరవగా; నిశిత= వాడియైనట్టియు; కరాళ= భయంకరమైనట్టియు; క్షుర= చురకత్తివలె; తీక్ష్ణంబులు+ఐన= పదునైనట్టియునగు; ఖుర+అగ్రంబులన్= గిట్టల అంచులచేత; జలంబులు= నీరు; విచ్ఛిన్నంబులు= చెల్లాచెదరగునట్లు; కావించి= చేసి; అపారంబు+అయిన= హద్దులేని; రసాతలంబున్= పాతాళలోకాన్ని; ప్రవేశించి= చొచ్చి; భూమిన్= నేలను; పొడ+కనున్+అవసరంబునన్= చూచు సమయంలో...

**తా :** ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలం అనే మూడువేళల్లో యజ్ఞరూపాన్నే ధరించి ఉన్న యజ్ఞవరాహాకారుడైన ఆ జగత్ప్రభువు ప్రళయకాలంలో యోగనిద్రలో ఉన్నాడు. ఆ సమయంలో భూమి నీటిలో మునిగి పాతాళం చొచ్చింది. దాన్ని ఉద్ధరించాలని తలంచి ఆ స్వామి సముద్రమధ్యభాగంలో ప్రవేశించాడు. సముద్రుడు వరాహమూర్తియొక్క వేగానికి తట్టుకోలేక పైకెగిసిన అలలనే చేతులెత్తి. "యజ్ఞవరాహస్వామీ! నన్ను కాపాడవయ్యా!" అని దీనంగా అర్థించాడు. అప్పుడాయన చురకత్తులలాగ మిక్కిలి వాడియైన తన గిట్టలచేత సముద్రపునీటిని ఎగమీటి, పాతాళమధ్యభాగంలో ఉన్న భూమిని చూశాడు.

**క. శరనిధిలోని మహోగ్రా, మరకంటకుఁ డెదురఁ గాంచె మఖమయగాత్రిన్**
**ఖురవిదళితకులగోత్రిన్, ధరణి కళత్రిన్ గవేష ధాత్రిన్ పోత్రిన్. 417**

**ప్రతి :** శరనిధిలోని= నీటికి నిధానమైన సముద్రంలోనున్న; మహా+ఉగ్ర= మిక్కిలి భయంకరమైన; అమరకంటకుఁడు= దేవతలకు మింగుడుపడని రక్కసుఁడు; ఎదురన్= తన ఎదుట; ఖుర= గిట్టలచే; విదళిత= మిక్కిలి చీల్చబడిన; కులగోత్రిన్= కులపర్వతాలు గలవాడును; ధరణికళత్రిన్= మహీకాంత భార్యగా గలవాడును; గవేషధాత్రిన్= వెదకబడుతున్న భూమిగలవాడును; మఖమయగాత్రిన్= యజ్ఞమయమైన శరీరం గలవాడును అగు; పోత్రిన్= వరాహరూపుణ్ణి; కాంచెన్= చూచాడు.

**తా :** ఆ స్వామి పాతాళం చొచ్చి భూమికొరకు అన్వేషిస్తున్నాడు. అంతలో సముద్రపు అడుగున దాగిన దేవతల వైరియగు రక్కసుడు (హిరణ్యాక్షుడు), భూమికొరకు గాలిస్తున్నవాడూ, తన గొరిజల తాకిడిచే కులపర్వతాల్ని ముక్కలు చేయజాలినవాడూ, ధరాకాంతకు భర్తా, యజ్ఞ స్వరూపుడూ అయిన వరాహస్వామిని చూశాడు.

**వ. ఇట్లు పొడగని దైత్యుండు రోషభీషణాకారుండై. 418**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా, దైత్యుండు= రాక్షసుడు, పొడ+కని= స్వామి ఉనికిని పసికట్టి, రోషభీషణ+ఆకారుండు+ఐ= కోపావేశంతో భయంకరమైన ఆకృతి దాల్చినవాడై...

**తా :** ఆ రాక్షసుడు సముద్రమధ్యభాగంలో వరాహరూపమెత్తిన స్వామి ఉనికిని గమనించి కోపావేశంతో భయంకరమైన రూపుదాల్చినాడు.

**మ. గద సారించి యసహ్యవిక్రమసమగ్రస్ఫూర్తితో వ్రేయఁగా**
**నది దప్పించి వరాహమూర్తి నిజదంష్ట్రాగ్రాహతిం ద్రుంచెఁ బెం**
**పొదవంగ్రోధమదాతిరేకబలశౌర్యోదారవిస్తార సం**
**పదఁ బంచాస్యము సామజేంద్రుఁజలమొప్పంద్రుంచు చందంబునన్. 419**

**ప్రతి :** (దైత్యుడు) గదన్= తన గదను; సారించి= చాపి; న+సహ్య (అసహ్య)= సహింపరాని; విక్రమ= పరాక్రమంయొక్క; సమగ్రస్ఫూర్తితోన్= అతిశయించిన ఆటోపంతో; వ్రేయఁగాన్= విసరగా; వరాహమూర్తి= కిటిరూపధారియైనస్వామి; పంచ+ఆస్యము= వెడల్పైన మోముగలసింహం; చలము+ఒప్పన్= పట్టుదల బయల్పడురీతి; సామజ+ఇంద్రున్= గజరాజును; త్రుంచు చందంబునన్= విరగబొడుచునట్లు; క్రోధ= కోపంతో; మద+అతిరేక= పెచ్చరిల్లినగర్వంతో; బల= బలంతో; శౌర్య+ఉదార= గొప్పవిజృంభణంతో; విస్తార= అతిశయించిన; సంపదన్= గుణసంపదచేత; పెంపు+ఒదవన్= ఊపుకలుగగా; నిజ= తనయొక్క; దంష్ట్రా+అగ్ర= కోరచివరిభాగంయొక్క; ఆహతిన్= దెబ్బతో; అది= రక్కసుడు విసిరిన గదను; తప్పించి= పక్కకునెట్టి; త్రుంచెన్= వధించాడు (రక్కసుని చంపాడు).

**తా :** ఆ రాక్షసుడు మహాభయంకరాకృతి దాల్చి స్వామిపైకి తన గదను విసిరాడు. క్రోధం, గర్వం, బలం, ప్రతాపం ఇత్యాది గుణాలు మూర్తీభవించిన యజ్ఞవరాహుడు విజృంభించి 'సింహం చెలరేగి ఏనుగును మట్టుపెట్టు' నట్లు ఆ రక్కసుణ్ణి తన కోరతో ఒక్కపోటు పొడిచి చంపాడు.

**మ. దితిజాధీశుని నీ గతిందునిమి యుద్వృత్తిందదీయాంగ శో**
**ణిత పంకాంకితగండభాగుఁడగుచు న్విష్ణుండు దా నొప్పె వి**
**స్తృత సంధ్యాంబుదధాతుచిత్రితసముద్దీప్తక్షమాభృద్గతిన్**
**క్షితి దంష్ట్రాగ్రమునన్ ధరించి జలరాశింబాసి యేతేరఁగన్. 420**

**ప్రతి :** విష్ణుండు= విష్ణుమూర్తి; ఈగతిన్= ఈ విధంగ; ఉత్+వృత్తిన్= గర్వంతో విజృంభించి; దితిజ+అధి+ఈశునిన్= దితికుమారుడైన రాక్షసరాజును (హిరణ్యాక్షుని); తునిమి= చంపి; తదీయ= ఆ దైత్యునియొక్క; అంగ= శరీరంయొక్క; శోణిత= రక్తమనే; పంక+అంకిత= బురద అంటినట్టి; గండభాగుఁడు= చెక్కిలి గలవాడు; అగుచున్= అవుతూ; విస్తృత=

విశాలమైన; సంధ్యా+అంబుదధాతు= సంజ అనే మబ్బు కెంజాయ ద్రవ్యంచేత; చిత్రిత= రంగరింపబడిన; సమ్+ఉత్+దీప్త= మిక్కిలివెలుగొందుచున్న; క్షమాభృత్+గతిన్= కొండవలె; క్షితిన్= భూమిని; దంష్ట్రా+అగ్రమునన్= కోరచివరిభాగాన; ధరించి= తాల్చి (ఎత్తుకొని); జలరాశిన్= సముద్రాన్ని; పాసి= వదలి; ఏతేరఁగన్= పైకిరాగా; తాన్= ఆ దేవదేవుడు; ఒప్పెన్= ప్రకాశించాడు.

**తా :** శ్రీహరి దితికుమారుడైన హిరణ్యాక్షుణ్ణి భయంకరంగా చంపి వాని రక్తం అనే బురద చెక్కిళ్ళకు అంటుకోగా, సముద్ర మధ్యభాగంనుండి భూమిని పైకెత్తి కోరపైన నిల్పాడు. కోరపైన భూమిని నిల్పిన ఆ చిత్రం సంధ్యారాగం పులుముకొన్న కొండవలె దేదీప్యమానంగా వెల్గింది.

**తే. బాలశీతాంశురేఖా విభాసమాన, ధవళదంష్ట్రాగ్రమున నున్న ధరణి యొప్పె**
**హరికి నిత్యానపాయిని యైన లక్ష్మి, నెరయఁబూసిన కస్తూరినికర మనఁగ. 421**

**ప్రతి :** బాలశీత+అంశు= చల్లని కిరణాల బాలచంద్రునియొక్క, రేఖా= ఒకభాగంచేత, విభాసమాన= ప్రకాశిస్తున్న, ధవళ= తెల్లని, దంష్ట్రా+అగ్రమునన్+ఉన్న= (వరాహం) కోరచివరనున్నట్టి, ధరణి= భూదేవి, హరికిన్= శ్రీవిష్ణుమూర్తికి, నిత్య+అనపాయిని+అయిన= ఎల్లప్పుడు ఎడబాయని, లక్ష్మి= శ్రీదేవి, నెరయన్= దట్టంగా, పూసిన= అలదినట్టి, కస్తూరినికరము= (మృగమదం) కస్తూరిముద్ద, అనఁగన్= అన్నట్లు, ఒప్పెన్= ప్రకాశించింది.

**తా :** లేతనెలవంకరేఖలాంటి తెల్లని కోరపై కూర్చున్న భూదేవి, ఎల్లప్పుడు భర్తను ఎడబాయని శ్రీదేవి విష్ణుమూర్తికి దట్టంగా అద్దిన కస్తూరిముద్దలాగ ఉందట!

## ❖ శ్రీ యజ్ఞవరాహమూర్తిని బ్రహ్మాదులు స్తుతియించుట ❖

**వ. అట్టి యజ్ఞపోత్రిమూర్తిం జూచి కమలాసనప్రముఖు లిట్లని స్తుతియించిరి. 422**

**ప్రతి :** అట్టి= పైనవర్ణింపబడినటువంటి; యజ్ఞపోత్రిమూర్తిన్= యజ్ఞ వరాహరూపం దాల్చిన విష్ణుదేవుణ్ణి; చూచి= కాంచి; కమల+ఆసన ప్రముఖులు+ఐన= పద్మం ఆసనంగాగల బ్రహ్మమొదలైన గొప్పవారు; ఇట్లు+అని= ఈ దిగువరీతిగా; స్తుతియించిరి= స్తోత్రం చేశారు.

**తా :** తర్వాత ఆ యజ్ఞవరాహరూపధారియైన శ్రీహరిని బ్రహ్మాదులు ఇలా పొగిడారు.

**సీ. "దేవ! జితం జితం తే పరమేశ్వర! జితయజ్ఞభావన! శ్రుతిశరీర!"**
**యనుచుఁ గారణసూకరాకారుఁడగు నీకు నతిభక్తి మ్రొక్కెదమయ్య వరద!**
**భవదీయరోమకూపములందు లీనంబు లై యుండు నంబుధు లట్టి యధ్వ**
**రాత్మకమై తనరారు నీ రూపంబు గానంగరాదు దుష్కర్మపరుల**

**తే. కట్టి నీకుఁబ్రణామంబు లాచరింతు, మఖిలజగదేకకీర్తి! దయానువర్తి!**
**భవ్యచారిత్ర! పంకజపత్రనేత్ర!, చిరశుభాకార! యిందిరాచిత్తచోర! 423**

**ప్రతి :** పరమ+ఈశ్వర= మహానుభావుడవైన ఓ ప్రభూ!; జిత= స్వాధీనమైన; యజ్ఞభావన= సత్కర్మను చేయవలెనను భావం గలవాడా; శ్రుతిశరీర= వేదస్వరూపా; దేవ!=స్వామీ; తే= నీకు లేక నీవల్ల; జితం= జయింపబడింది; జితం=

జయింపబడింది; అనుచున్= అని అంటూ; వరద= కోరిన కోర్కెలదీర్చువాడా!; కారణ= ఒక కార్యాన్ని తీర్చడానికి; సూకర+ఆకారుఁడు+అగు= వరాహావతారమెత్తినవాడవగు; నీకున్= నీకు (శ్రీ హరికి); అతిభక్తిన్= మిక్కిలిభక్తితో; మ్రొక్కెదము+అయ్య!= నమస్కరిస్తాంస్వామీ!; భవదీయ= నీ యొక్క; రోమకూపములందున్= వెంట్రుకల మొదళ్ళలో ఉండే గుంతల్లో; అంబుధులు= నీటికినిధానమైన సముద్రాలు; లీనంబులు+ఐ+ఉండును= దాగియుండును; అధ్వర+ఆత్మకము+ఐ= యజ్ఞస్వరూపమై; తనరారు= ఒప్పారుచున్న; నీ రూపంబు= నీ ఆకారం; దుస్+కర్మపరులకున్= చెడ్డపనులుచేసే వారికి; కానంగన్ రాదు= కన్పించదు; అట్టినీకున్= అలాంటిమహిమగలనీకు; అఖిలజగత్+ఏకకీర్తి!= సమస్త లోకాలలో ప్రసిద్ధమైనకీర్తిగలవాడా!; దయా+అనువర్తి= దయాస్వభావంగలవాడా; భవ్యచరిత్ర= పవిత్రమైన చరిత్రకలవాడా!; పంకజపత్రనేత్ర!= తామరరేకులవంటి కన్నులుగలవాఁడా!; చిరశుభ+ఆకార!= ఎల్లప్పుడు మంగళకరమైన ఆకారంగలవాడా; ఇందిరాచిత్తచోర!= శ్రీదేవి హృదయాన్ని దోచుకొన్నవాడా!; ప్రణామంబులు= నమస్కారాలు; ఆచరింతుము= చేస్తాము.

**తా :** అక్కడి మునులు స్వామిని ప్రస్తుతించి, నమస్కరించారు.

దేవా! నీవు జయించావు-జయించావు. నీవు నిరంతరం సత్కర్మ పరాయణుడవు. నీవు వేదమయుడవు. కోరిన వరాలనిచ్చే స్వామీ! ఈ విశ్వంభరను ఉద్ధరించటానికి నీవు వరాహాకృతిని తాల్చావు. నీ వెంట్రుకల మొదళ్ళలో ఉన్న గుంతల్లో మహాసముద్రాలే దాగి ఉన్నాయి. దుష్టులకు నీ యజ్ఞస్వరూప మహిమ అంతుబట్టదు. స్వామీ! నీ కివే మా నమస్కారాలు. ఈ విశ్వమంతటికి నీకీర్తి వ్యాపించింది. నీవు దయాపరుడవు. నీ చరిత్ర పవిత్రమైంది. నీ కన్నులు తామరరేకుల్లాంటివి. నీది మంగళకరమైన ఆకారం. నీవు శ్రీదేవి హృదయాన్ని ఆకర్షించిన మహానుభావుడవు.

**వ. అని వెండియు నిట్లు స్తుతియించిరి. 424**

**ప్రతి :** అని= పైపద్యంలో పొగడి; వెండియున్= మరియు; ఇట్లు= ఈ విధంగా; స్తుతియించిరి= పొగిడారు.

**తా :** అంతటితో ఆగక ఆ మునులు ఇంకా స్తోత్రం చేశారు.

**సీ. త్వక్కున నఖిలవేదములు, రోమంబులయందును బర్హిస్సు, లక్షులందు**
**నాజ్యంబు, పాదంబులందుఁ జాతుర్హోత్ర కలితంబులగు యజ్ఞకర్మములును,**
**స్రుక్కు తుండంబున, స్రువము నాసికను, నిడాపాత్ర ముదరకోటరమునందు,**
**శ్రవణాస్యబిలములఁజమసప్రాశిత్రముల్, గళమున నిష్టిత్రికంబు, జిహ్వఁ**

**తే. దగుఁబ్రవర్గ్యము, నగ్నిహోత్రమును నీదు, చర్వణంబును, సభ్యావసథ్య లుత్త**
**మాంగ మసువులు చయనము లగుఁ గిటీశ! యనుచు నుతియించి రత్తతి యజ్ఞవిభుని. 425**

**ప్రతి :** కిటి+ఈశ= వరాహస్వామీ!; అఖిలవేదములు= అన్నివేదాలు, మరియు షడంగాలును; త్వక్కునన్= నీ శరీరమందును; బర్హిస్సులు= అగ్నులు; రోమంబులయందును= వెంట్రుకల యందును; ఆజ్యంబు= యజ్ఞగుండంలోపోసే నెయ్యి; అక్షులందున్= కన్నుల్లోను; చాతుర్+హోత్ర= నల్గురు ముఖ్య యజ్ఞకర్తలచేత; కలితంబులు+అగు= చేయబడినవైన; యజ్ఞకర్మములును= యజ్ఞసంబంధమైన కార్యకలాపాలు; పాదంబుల+అందున్= అడుగులయందును; స్రుక్కు= ఆజ్యమును కుండంలో పోసే గరిట; తుండంబునన్= ముట్టెయందును; స్రువము= నేతికర్ర; నాసికను= ముక్కునందును; ఇడా పాత్రము= యజ్ఞపాత్ర;

ఉదరకోటరమునందు= పొట్టయందును; శ్రవణ+ఆస్యబిలములన్= చెవులు మరియు నోటియందు; చమసప్రాశితముల్= భోజనపాత్ర మరియు నీరుత్రాగే గిన్నెయు; గళమునన్= గొంతులో; ఇష్టిత్రికంబు= మూడు యజ్ఞాలునూ; జిహ్వన్= నాలుకయందును; ప్రవర్గ్యము= అగ్నిష్టోమాదులును (చలనం, ఆసనం, నిలకడ, ఈ మూడింటిని ప్రవర్గ్యమంటారు); తగున్= అమరినది; నీదు చర్వణంబును= నీ ఆరగింపు (భోజనం); అగ్నిహోత్రమును= వ్రేల్చబడిన అగ్నియగును; సభ్య+అవసథ్యులు= హోమరహిత అగ్నిగృహాలు; ఉత్తమాంగము= నీ శిరస్సు; అసువులు= నీ ప్రాణాలు; చయనములు+ అగున్= నిర్వహింపబడుతున్న హోమాలు; అనుచున్= ఇట్లని; ఆ+తరిన్= ఆ సమయాన; యజ్ఞవిభునిన్= యజ్ఞ వరాహస్వామిని; నుతియించిరి= కొనియాడారు.

**తా :** 'వరాహస్వామీ! నీ చర్మమే సమస్తవేదవేదాంగాలసమూహం. నీ వెంట్రుకల్లో యజ్ఞాగ్నులు దాగి ఉన్నాయి. కన్నుల్లో ఆజ్యం (నేయి), పాదాల్లో యాజకులచే నిర్వహింపబడుతున్న యాజ్ఞికక్రియలు ఉన్నాయి. నీ తుండమే నేతి గరిట (స్రుక్కు), ఘ్రాణేంద్రియమే స్రువం, నీ కడుపే యజ్ఞపాత్ర. చెవి భోజనపాత్ర, నోరు నీరుత్రాగేగిన్నె. నీ గొంతు మూడు యజ్ఞాలకు నిలయం. నాలుక అగ్నిహోమాదులకు అంగభూతం, నీ వారగించే ఆహారం సాక్షాత్తు వ్రేల్చబడిన అగ్నియే. నీ శిరోభాగం హోమరహిత అగ్నిగృహం, నీ ప్రాణాలు చయనాలు' అని అక్కడచేరిన బ్రహ్మేంద్రాది మునిపుంగవులు స్వామిని ప్రస్తుతించారు.

**వ. వెండియు ముహుర్ముహు ర్భగవదావిర్భావంబు దీక్షణీయేష్టి యగు. నీదు దంష్ట్రలు ప్రాయణీయంబను దీక్షానంతరేష్టియు, నుదయనీయంబను సమాప్తేష్టియు, యుష్మద్రేతంబు సోమంబును, త్వదీయావస్థానంబు ప్రాతస్సవనాదులు, నీదు త్వఙ్మాంసాది సప్తధాతువు లగ్నిష్టోమోక్థ్యషోడశీ వాజపేయాతిరాత్రాప్తోర్యామంబు లను సంస్థాభేదంబులును ద్వాదశాహాదిరూపంబులైన బహు యాగ సంఘాతరూపంబులు నగు; సర్వ సత్త్రంబులు భవదీయశరీర సంధులు; ససోమాసోమంబులగు యజ్ఞక్రతువులు నీవ; మఱియును నీవు యజనబంధనంబులచే నొప్పుచుందు వదియునుం గాక. 426**

**ప్రతి :** వెండియున్= మరియును; ముహుస్+ముహుస్= మాటిమాటికి; భగవత్+ఆవిర్భావంబు= స్వామియొక్క యజ్ఞవరాహాద్యవతారం; దీక్షణీయ+ఇష్టి+అగున్= ధగధగమండుతున్న యజ్ఞగుండమౌతుంది; నీదు దంష్ట్రలు= నీ యొక్క (వరాహరూపుని) కోరలు; ప్రాయణీయంబు+అను= నిలకడగా జ్వలిస్తున్న; దీక్షా+అనంతర= దీక్ష తర్వాతి; ఇష్టియున్= యాగాగ్ని; ఉదయనీయంబు+అను= ఉదయనీయమనబడే; సమాప్త+ఇష్టియన్= యజ్ఞాంతమందలి అగ్నియు (అగును); యుష్మద్= నీ యొక్క; రేతంబు= ఇంద్రియం; సోమంబును= యజ్ఞసోమ రసమౌతుంది; త్వదీయ= నీయొక్క; అవస్థానంబు= ఉనికి లేక మనుగడ; ప్రాతర్+సవన+ఆదులు= ప్రభాత కాలంలో జరిగే యాజ్ఞికక్రియలు (స్నానసంధ్యానుష్ఠానాదులు); నీదు= నీయొక్క; త్వక్+మాంస+ఆది= చర్మం, మాంసం, శుక్లం, శోణితం, చీము, ఎముక, మెదడు అనే; సప్తధాతువులు= ఏడుశారీరక ద్రవ్యాలు; అగ్నిష్టోమ= అయిదురోజులు వసంతకాలంలో చేసి ముగించే యాగవిధానంలో; ఉక్థ్య= ఉక్థ్యం; షోడశీవాజపేయ+అతిరాత్ర+ఆప్తోర్యామంబులు+అను= షోడశి, వాజపేయం, అతిరాత్రం, ఆప్తోర్యామం అనబడే; సంస్థా భేదంబులును= యాజ్ఞికవిధులును; ద్వాదశ+అహ= పన్నెండు పగటిపూటలు చేసే యాగం; ఆది= మొదలైన; రూపంబులు+ఐన= స్వరూపాలైన; బహుయాగ= పెక్కు యజ్ఞాల యొక్క; సంఘాతరూపంబులున్+అగున్= సామూహికరూపాలవుతాయి; సర్వసత్త్రంబులు= సమస్తమైన రాజసూయాదియాగాలన్నీకూడ; భవదీయ= నీయొక్క;

శరీరసంధులు= దైహికమైనకీళ్ళు; ససోమ+అసోమంబులు+అగున్= సోమరసపానంతోనూ; సోమరసపానరహితంగాను చేసేటటువంటి; యజ్ఞక్రతువులు= యాగాలు; నీవు+అ= నీవే; మఱియును= అంతేగాక; నీవు= (వరాహస్వామిని); యజనబంధనంబులచేన్= యజ్ఞబంధాలచేత; ఒప్పుచున్+ఉందువు= ప్రకాశిస్తుంటావు; అదియునున్+కాక= అంతేగాదు.

**తా :** బ్రహ్మాదులు యజ్ఞవరాహావతారాన్ని మరింతగా అభివర్ణిస్తూ స్తుతిస్తున్నారు. "దేవా! మాటిమాటికి పెచ్చరిల్లిన నీ అవతారం" దీక్షణీయేష్టి (సలసల మండుతున్న యాగాగ్ని). నీ కోరలు ప్రాయణీయేష్టి (నిలకడగామండుతున్నఅగ్ని). చివరి యజ్ఞాంతరూపం 'ఉదయనీయేష్టి (ఉపశమించిన యజ్ఞాగ్ని). నీ ఇంద్రియమే సోమరసం. నీ ఉనికి ఉదయకాలపు ధ్యానసంధ్యానుష్ఠానాదులు. శుక్లం, రక్తం, మాంసం, ఎముక, తోలు, చీము, మెదడులతో కూడిన నీ సప్తధాతువులు అగ్నిష్టోమం, ఉక్థ్యం, షోడశి, వాజపేయం, అతిరాత్రం, ఆప్తోర్యామం అనే ఏడు యాజ్ఞిక విధులూ, ద్వాదశాహం మొదలైన అనేక యాగవిధులూ అవుతాయి. సమస్తయాగాలు నీ శరీరసంధులే. అంతేగాక సోమపానంతోడి యజ్ఞాలు, సోమపాన రహిత యజ్ఞాలు నీవే అయివున్నావు. నీవు ఎల్లప్పుడు యజ్ఞబంధితుడవై వెలుగొందుతావు అని మునులు దేవాదిదేవుణ్ణి స్తుతించారు.

**క. హవరూపివి! హవనేతవు!, హవభోక్తవు! నిఖిలహవఫలాధారుఁడవున్!**
**హవరక్షకుఁడవు నగు నీ కవితథముగ నుతు లొనర్తుమయ్య ముకుందా! 427**

**ప్రతి :** ముకుందా!= శ్రీమన్నారాయణా!; (నీవు) హవరూపివి= యజ్ఞస్వరూపుడవు; హవనేతవు= యజ్ఞాలకు అధిపతివి; హవభోక్తవు= యజ్ఞఫలాన్ని భుజించేవాడవు; నిఖిల= సమస్తమైన; హవఫల+ఆధారుఁడవున్= యజ్ఞఫలప్రదానానికి మూలపురుషుడవు కూడ; హవరక్షకుఁడవు= యజ్ఞమును కాపాడువాడవు; అగున్= అయినట్టి; నీకున్= నీకు (యజ్ఞవరాహమూర్తికి); అవితథముగన్= పొల్లుపోకుండ (సత్యముగా); నుతులు= కొనియాడుటలు; ఒనర్తుము+అయ్య!= చేస్తాము స్వామీ!

**తా :** "స్వామీ! నీవు యజ్ఞస్వరూపుడివి. యజ్ఞాధిపతివి. యజ్ఞఫలాన్ని భుజించేవాడివి. సమస్తయజ్ఞఫలాలకు నీవే ఆధారం. యజ్ఞరక్షకుడవు కూడ నీవే. ముకుందా! మచ్చలేని హృదయంతో నిన్ను పూజిస్తాము.

అక్కడచేరిన మునులు ఫలాకాంక్ష లేనివారై యజ్ఞవరాహస్వామిని వేనోళ్ల ప్రస్తుతించారు. వారి స్తుతివాక్యాల్లో ఏ విధమైన ఫలాసక్తి లేదు.

**తే. సత్త్వగుణమున సద్భక్తి సంభవించు, భక్తియుతముగఁ జిత్తంబు భవ్య మగును**
**హృదయపద్మంబునందోలి నెఱుఁగఁబడిన, యట్టి నీకు నమస్కారమయ్య వరద! 428**

**ప్రతి :** వరద= వరాలనిచ్చే దేవా!; సత్త్వగుణమునన్= సాత్త్విక గుణంచేత; సత్+భక్తి= స్వచ్ఛమైన భక్తి; సంభవించున్= కల్గుతుంది; భక్తియుతముగన్= భక్తిభావంతోకూడి; చిత్తంబు= మనస్సు; భవ్యము+అగున్= యోగ్యమైనది అవుతుంది; ఓలిన్= క్రమపద్ధతిలో; హృదయపద్మంబునందున్= హృదయమనే పద్మంలో; ఎఱుఁగఁబడిన= తెలియబడిన; నీకున్= (వరాహస్వామికి); నమస్కారము+అయ్య!= వందనం దేవా!

**తా :** కోరినకోర్కెల నెరవేర్చే ప్రభూ! సత్త్వగుణంవల్లనే ఉత్తమమైన భక్తి కల్గుతుంది. భక్తి గల్గినచో మనస్సు యోగ్యమౌతుంది. గుండెనిండుగ స్మరించుకోదగ్గ నీకు ఇవే మా నమస్కారాలు.

**మ. అరవిందోదర! తావకీనసితదంష్ట్రాగ్రావలగ్నక్షమా**
**ధరనద్యబ్ధినదాటవీయుతసమిద్ధక్ష్మాతలంబొప్పె భా**
**సురకాసారజలావతీర్ణమదవచ్ఛుండాలరాడ్దంత శే**
**ఖరసంసక్త సపత్రపంకజము రేఖంబొల్పు దీపింపఁగన్. 429**

**ప్రతి :** అరవింద+ఉదర= పద్మం గర్భమునందు గలవాడా!; తావకీన= నీయొక్క; సితదంష్ట్రా+అగ్ర= తెల్లని కోరచివర; అవలగ్న= తగుల్కొన్న; క్షమాధర= పర్వతాలు; నది+అబ్ధి= నదులు మరియు సముద్రాలు; నద+అటవీయుత= నదాలు మరియు అడవులతో కూడిన; సమ్+ఇద్ధ= మిక్కిలివెలుగొందుచున్న; క్ష్మాతలంబు= భూభాగం; భాసుర= ప్రకాశవంతమైన; కాసారజల+అవతీర్ణ= సరోవరపు నీటియందు దిగినట్టి; మదవత్+శుండాలరాట్= మదించిన గజేంద్రంయొక్క; దంతశేఖర= పంటికొసలయందు; సంసక్త= తగుల్కొన్న; సపత్ర= రేకులతోడి; పంకజమురేఖన్= పద్మంవలె; పొల్పు= సొంపు; దీపింపఁ గన్= వెల్గునట్లు; ఒప్పెన్= (భూమి) ప్రకాశించింది.

**తా :** పద్మనాభా! పర్వతాలు, నదీనదాలు, సముద్రాలు, అడవులు మొదలైన వాటితో కూడిన ఆ భూమి, నీ తెల్లని కోరపైన విశ్రమించటం ఎలా ఉందంటే, ఒక మదపుటేనుగు సరోవరంలో ప్రవేశించి పత్రభరితమైన తామరని తన దంతాలపై పొదువుకొన్నట్లు దేదీప్యమానంగా ప్రకాశిస్తూ ఉంది.

**మ. మఱియును. 430**

**ప్రతి :** మఱియును= ఇంకా, దిగువ పద్యాలలో స్తోత్రం కొనసాగుతోందని సూచన.

**మ. చతురామ్నాయవపుర్విశేషధర! చంచత్సూకరాకార! నీ**
**సితదంష్ట్రాగ్ర విలగ్నమైన ధర రాజిల్లెం గులాద్రీంద్ర రా**
**జితశృంగోపరిలగ్నమేఘముగతిం జెల్వారి, విద్వజ్జనాం**
**చితహృత్పల్వలలోల! భూరమణ! లక్ష్మీనాథ! దేవోత్తమా! 431**

**ప్రతి :** చతుస్+ఆమ్నాయ= ఋక్, యజుస్, సామ, అధర్వములనే నాల్గువేదాలను; వపుస్+విశేషధర= విశిష్టమైన శరీరంగా ధరించినవాడా!; చంచత్+సూకర+ఆకార!= చలించుచున్న వరాహాకృతిగల వాడా!; విద్వత్+జన+అంచిత= విద్వాంసులయొక్క ఒప్పిదమైన; హృత్+పల్వలలోల= హృదయములనే మడుగుల్లో చలించువాడా!; భూరమణ= భూదేవికి ప్రియమైనవాడా!; లక్ష్మీనాథ= సిరిమగడా; దేవ+ఉత్తమా=దేవతలలో ఉత్తముడా!; నీ= నీయొక్క; సిత= తెల్లని; దంష్ట్రా+అగ్ర= పంటికొనపైన; విలగ్నము+ఐన= తగుల్కొన్న; ధర= భూమి; కుల+అద్రి+ఇంద్ర= కులపర్వతరాజంయొక్క; రాజిత= ఒప్పిదమైన; శృంగ+ఉపరి= శిఖరాగ్రపు పైభాగాన; లగ్న, మేఘముగతిన్= తగుల్కొన్న మబ్బులాగ; చెల్వారి= ఒప్పి; రాజిల్లెన్= ప్రకాశించింది.

**తా :** దేవా! నీవు నాల్గువేదాలు శరీరంగా కలవాడవు. నీది దేదీప్యమానంగా వెల్గుతున్న వరాహరూపుడవు! నీవు విద్వాంసుల హృదయాలనే పడియల్లో దాగినవాడవు. భూదేవికి ప్రియుడవు. ఉత్తమదైవమవు. ఇందిరభర్తవు. నీ కోరపై ఒదిగిన భూదేవి కులపర్వతశిఖరంపై తగుల్కొన్న మేఘంలాగా ఉంది.

సీ. సమధికస్థావరజంగమాత్మకమైన వసుమతీచక్ర మవక్రలీల
నుద్ధరింపుము; కరుణోపేతచిత్తుండ వగుచు నస్మన్మాత యయ్యె ధరణి;
మాతయౌ టెట్లని మదిఁదలంచెదవేనిఁ జర్చింప మాకు విశ్వమున కీవు
జనకుండ వగుట యుష్మత్పత్ని భూదేవి యగుట మాకును దల్లి యయ్యె; నిపుడు

తే. ధరకు నీతోడఁగూడ వందన మొనర్తు, మరణియందును యాజ్ఞికుఁ డగ్ని నిలుపు
కరణి మీ తేజ మీ ధరాకాంతయందు, నిలుప ధరణి పవిత్రయై నెగడుఁ గాన. 432

**ప్రతి :** దేవా= స్వామీ!; సమ్+అధిక= విశేషంగా; స్థావరజంగమ+ఆత్మకము+ఐన= స్థిరమైనదియు, చలనంగలదియునైన; వసుమతీ చక్రము= భూవలయాన్ని; అవక్రలీలన్= మొక్కవోని విలాసంతో; కరుణా+ఉపేత= దయతోకూడిన; చిత్తుండవు+అగుచున్= మనస్సు గలవాడవై; ఉద్ధరింపుము= పైకి లేపు; ధరణి= భూదేవి; అస్మద్+మాత= మాతల్లి; అయ్యెన్= అయింది; మాత+ఔట+ఎట్లు+అని= తల్లి మీకెట్లయిందని; మదిన్= మనస్సులో; తలంచెదవు+ఏనిన్= భావిస్తావేమో; చర్చింపన్= చర్చ చేస్తే; మాకున్= (మునులకు); విశ్వమునకున్= లోకానికి; ఈవు= నీవు(విష్ణువు); జనకుండవు+అగుటన్= తండ్రివి అయినందువల్ల; యుష్మద్+పత్ని= మీ యిల్లాలు; భూదేవి+అగుట= భూకాంత అయినందువల్ల (కారణంగా); మాకునున్= మాకుకూడ; తల్లి+అయ్యెన్= తల్లి అయింది; ఇపుడు= ఈ సమయంలో; ధరకున్= భూదేవికి; నీతోడన్+కూడ= నీతో చేర్చి; వందనము= నమస్కారం; ఒనర్తుము= చేస్తాం; యాజ్ఞికుఁడు= యజ్ఞకర్త; అరణియందున్= అరణి (ఒకరకమైన కఱ్ఱ)యందు; అగ్నిన్= అగ్గిని; నిలుపుకరణిన్= పుట్టించినట్లే; మీ తేజము= మీ వెలుగును; ఈ ధరాకాంతయందున్= ఈ భూదేవియందు; నిలుపన్= ఉంచగా; ధరణి= భూదేవి; పవిత్ర+ఐ= పుణ్యవతియై; నెగడున్+కాన= ఒప్పారుతుంది కాబట్టి.

**తా :** "ఓ యజ్ఞవరాహమూర్తీ! దేవా! ఈ చరాచరాత్మకమైన భూచక్రాన్ని దయతో అవలీలగా పైకెత్తు. ఈమె మా తల్లి. 'మీకు తల్లి ఎట్లయింద'ను కొంటావేమో! చూడు. మాకు మరియు ఈ విశ్వానికంతటికి నీవే తండ్రివి. ఈ భూదేవి నీ భార్య. కాబట్టి ఆమె మాకు తల్లి అయింది. అందువల్ల ఇప్పుడు నీతోపాటు ధరిత్రీమాతకు కూడ నమస్కరిస్తాం. యజ్ఞకర్త 'అరణి' యందు అగ్నిని వ్రేల్చునట్లు, మీ దివ్యతేజస్సును ఈమె యందు నిల్పినట్లయితే ఈమె మహాపవిత్రురాలవుతుంది" అని మునీంద్రులు వరాహరూపుణ్ణి కొనియాడారు.

**విశే :** అరణి: ఇది ఒక కఱ్ఱ-యజ్ఞంచేసే యాజకుడు రెండు అరణుల్ని రాచి అగ్నిని రగుల్కొల్పుతాడు. ఆ అగ్నిమూలంగా యజ్ఞకుండం ధగద్ధగాయమానమౌతుంది. అలా పుట్టించిన అగ్నిని 'ఆహవనీయం' అని పేర్కొంటారు.

చ. తలఁప రసాతలాంతరగతక్షితిఁగ్రమ్మఱ నిల్పినట్టి నీ
కలితన మెన్న విస్మయము గాదు; సమస్తజగత్తు లోలిమైఁ
గలుఁగఁగఁ జేయు టద్భుతము గాక, మహోన్నతి నీ వొనర్చు పెం
పలరిన కార్యముల్ నడప నన్యులకుం దరమే రమేశ్వరా? 433

**ప్రతి :** రమా+ఈశ్వరా= లక్ష్మీపతీ!; తలఁపన్= ఆలోచిస్తే; రసాతల+అంతర= పాతాళపు మధ్యభాగాన్ని; గత= పొందినట్టి; క్షితిన్= భూమిని; క్రమ్మఱన్= తిరిగి; నిల్పిన+అట్టి= పైకి లేవనెత్తిన; నీ కలితనము= నీ చాతుర్యం; ఎన్నన్= లెక్కింపగా;

విస్మయము+కాదు= ఆశ్చర్యమేమిగాదు; ఓలిమైన్= క్రమంగా; సమస్తజగత్తులు= లోకాలన్నింటిని; కలుఁగఁగన్+చేయుట= సృజించుట; అద్భుతము+కాక= ఆశ్చర్యకరమేగాక; నీవు+ఒనర్చు= నీవు చేసేటటువంటి; పెంపు+అలరిన= మహిమతో కూడిన; కార్యముల్= పనులు; నడపన్= సాగించుటకు; అన్యులకున్= ఇతరులకు; తరము+ఏ= సాధ్యమగునా? (కాదనిభావం)

**తా :** ఓ లక్ష్మీపతీ! పాతాళం చేరిన భూదేవిని తిరిగి పైకి లేపటంలో నీవు చూపిన చొరవ ఏమంత ఆశ్చర్యకరం కాదు. నీవు లోకాలన్నింటిని సృజించటం చాల గొప్పవిషయం. అంతేకాదు నీవు చేసే ఘనకార్యాలు మరి ఇతరులెవ్వరైనా చేయగలరా? (అసంభవమని భావం).

**చ. సకలజగన్నియామకవిచక్షణలీలఁ దనర్చునట్టి నం**
**దకధర! తావకస్ఫురదుదారత మంత్రసమర్థుఁడైన యా**
**జ్ఞికుఁడరణిన్ హుతాశనుని నిల్పిన కైవడి మన్నివాస మౌ**
**టకుఁదలపోసి యీ క్షితి దృఢంబుగ నిల్పితివయ్య యీశ్వరా! 434**

**ప్రతి :** ఈశ్వరా= దేవా!; నందకధర= నందకమనుఖడ్గాన్ని చేతధరించినస్వామీ!; సకల= సమస్తమైన; జగత్+నియామక= లోకాలన్నింటిని శాసింపగల; విచక్షణలీలన్= నేర్పరితనంతో; తనర్చు+అట్టి= ఒప్పారునటువంటి; తావక= నీయొక్క; స్ఫురత్= ప్రకాశిస్తున్న; ఉదారతన్= ఔదార్యంతో; మంత్రసమర్థుఁడు+ఐన= వేదమంత్రోచ్చారణలో దిట్టఅయిన; యాజ్ఞికుఁడు= యజ్ఞనిర్వాహకుఁడు; అరణిన్= అరణి అను కఱ్ఱయందు; హుత+అశనునిన్= అగ్నిదేవుని; నిల్పినకైవడిన్= వ్రేల్చినట్లు; మత్+నివాసము+ఔటకున్= మావంటివారి విడిదికొరకు; తలపోసి= ఆలోచించి; ఈ క్షితిన్= ఈ భూమిని; దృఢంబుగన్= పదిలంగా; నిల్పితివి+అయ్య= నిలబెట్టినావు తండ్రీ!

**తా :** "నందకమనుపేరుగల ఖడ్గాన్ని చేత ధరించిన ఓ ప్రభూ! నీవు ఈ పదునాల్గు లోకాలను నియమించగల సమర్థుడవు. వేదమంత్రోచ్చారణలో నిష్ణాతుడైన యాజకుడు అరణిలో అగ్నిని నిల్పినరీతిగా ఈ భూమిని నీవు మాకు శాశ్వతనివాస యోగ్యంగా నిల్పావు" – అని మునులు కృతజ్ఞతతో పల్కారు.

**చ. సలలితవేదశాస్త్రమయసౌకరమూర్తిఁ దనర్చుచున్ రసా**
**తలముననుండి వెల్వడు నుదారత మేను విదుర్పఁ దత్సటో**
**చ్చలితములైన బిందువుల సాధుతపోజనసత్యలోకవా**
**సులమగు మేము దోఁగి పరిశుద్ధి వహించితిమయ్య మాధవా! 435**

**ప్రతి :** మాధవా= లక్ష్మీనాథా!; సలలిత= మనోజ్ఞమైన; వేదశాస్త్రమయ= నాల్గువేదాలు, ఆరుశాస్త్రాలతోకూడిన; సౌకరమూర్తిన్= వరాహరూపం; తనర్చుచున్= ఒప్పారుచు; రసాతలముననుండి= పాతాళలోకంనుండి; వెల్వడు+ఉదారతన్= బయటపడే ఔదార్యంతో; మేను= శరీరాన్ని; విదుర్పన్= విదిలింపగా; తత్= ఆ (వరాహముయొక్క); సటా+ఉత్+చలితములు+ఐన= జూలునుండి పైకెగిసినట్టి; బిందువులన్= నీటి తుంపుళ్ళచేత; సాధు= సత్పురుషులైన; తపోజనలోక= తపోలోకం, జనలోకం; సత్యలోక= సత్యలోకాలందు; వాసులు+అగున్= నివసిస్తున్నవారమైన; మేము; (మునులు); దోఁగి= ఆ నీటియందు మునిగి (ఈదులాడి); పరిశుద్ధి= మిక్కిలి శుద్ధిని; వహించితిమి+అయ్య= పొందాము, స్వామీ.

**తా :** "ఓ మాధవా! వేదశాస్త్రమయమైన యజ్ఞవరాహరూపుడవు నీవు. పాతాళలోకం నుండి భూమిని ఉద్ధరిస్తూ, ఒక్కపెట్టున ఉదారబుద్ధితో నీ మేనును విదిల్చినపుడు నీ జూలు కంటిన నీటి బిందువుల్లో మునిగి తపోలోక, జనలోక, సత్యలోక వాసులమైన మేమెల్లరం పరిశుద్ధులమయ్యాము" అని మునులు కృతజ్ఞతను చాటారు.

**విశే : సౌకరమూర్తి :** సూకరసంబంధమూర్తియే సౌకరమూర్తి, సూకర మనగా వరాహమని అర్థం. తత్సంబంధమైన విగ్రహం 'సౌకరమూర్తి' అవుతుంది.

**ఉ. విశ్వభవస్థితిప్రళయవేళలయం దవికారసత్త్వమున్**
**విశ్వము నీవ యీ నిఖిలవిశ్వము లోలి సృజింతు విందిరా**
**ధీశ్వర! యీశ! కేశవ! త్రయీమయ! దివ్యశరీర! దేవ! నీ**
**శాశ్వతలీల లిట్టి వని సన్నుతి సేయఁగ మాకు శక్యమే? 436**

**ప్రతి :** ఇందిరా+అధి+ఈశ్వర= లక్ష్మీదేవికి నాథుడా!; ఈశ= ప్రభూ; కేశవ= అందమైన కేశాలు కలవాఁడా!; త్రయీమయ= ఋగ్యజుస్సామాలనే వేదత్రయస్వరూపుడా!; దివ్యశరీర= వెలుగొందుతున్నదేహం గలవాడా!; దేవ= ప్రభూ; విశ్వ= లోకాలయొక్క; భవ= సృష్టి; స్థితి= రక్షణ; ప్రళయ= వినాశం అనే మూడింటికి సంబంధంగల; వేళల+అందున్= సమయాలలో; అవికార సత్త్వమున్= ఏ వికారాన్ని పొందని శాంతస్వరూపం; (మరియు) విశ్వము= సమస్తజగత్తు; నీవు+అ= నీవే సుమా!; ఓలిన్= క్రమంగా; ఈ నిఖిలవిశ్వమున్= ఈ సమస్త విశ్వాన్ని; సృజింతువు= సృష్టిస్తావు; నీ శాశ్వతలీలలు= ఎప్పటికి మార్పు చెందని నీ విలాసక్రియలు; ఇట్టివి+అని= ఈ విధమైనవని; సన్నుతి+ చేయఁగన్= పొగడుటకు; మాకున్= (మునులమైన) మాకు; శక్యము+ఏ= సాధ్యమా?(కాదని భావం).

**తా :** ఓ శ్రీనాథా!, ఈశ్వరా! సుందరమైన శిరోజాలు గలవాడా! ఋక్, యజుస్, సామవేదాలు స్వరూపంగా వెలసిన ప్రభూ! దేదీప్యమానమైన దేహంతో ప్రకాశించువాడా! యజ్ఞవరాహస్వామీ! ఈ విశ్వసంబంధమైన త్రిమూర్తులు చేసే సృష్టిస్థితిలయాల్లో నీవు ఏవికారాలు లేని శాంతస్వరూపుడవుగా ఉంటావు. సమస్తవిశ్వాన్ని వ్యాపించి ఉంటావు. ఈ లోకాలన్నింటిని ఒకక్రమపద్ధతిలో సృష్టించే వాడివి నీవే. నీవి శాశ్వతమైన చర్యలు. వాటి స్వరూపాన్ని ఇదమిత్థమని మేము స్తుతింపగలమా?

**సీ. పంకజోదర నీ వపారకర్ముండవు భవదీయకర్మాబ్ధిపార మేద**
**నెఱిఁగెద నని మది నిచ్చగించిన వాఁడు పరికింపఁగా మతిభ్రష్టు గాక**
**విజ్ఞానియే? చూడ విశ్వంబు నీ యోగ మాయాపయోనిధి మగ్న మౌటఁ**
**దెలిసియుఁ దమ బుద్ధిఁ దెలియని మూఢుల నేమన నఖిలలోకేశ్వరేశ!**

**తే. దాసజనకోటి కతిసౌఖ్యదాయకములు, వితతకరుణాసుధాతరంగితములైన**
**నీ కటాక్షేక్షణములచే నెఱయ మమ్ముఁ, జూచి సుఖులను జేయవే సుభగచరిత! 437**

**ప్రతి :** పంకజ+ఉదర!= బురదలో పుట్టిన కమలం బొడ్డునందుగల స్వామీ!; నీవు; (విష్ణుదేవుడు); అపారకర్ముండవు= లెక్కకు మిక్కిలియైన కర్మలుగల వాడవు; భవదీయ= నీయొక్క; కర్మ+అబ్ధి= కర్మలనే మహాసముద్రముయొక్క; పారము+ఏదన్=

గట్టును పొందుటకు; ఎఱిఁగెదన్+అని= తెలిసివాడినని; మదిన్= ఎదయందు; ఇచ్చగించినవాఁడు= కోర్కెగలవ్యక్తి; పరికింపఁగాన్= చూడగా; మతిభ్రష్టు+కాక= తెలివిలేనివాడుగాక; విజ్ఞాని+ఏ= అనుభవజ్ఞానం కలవాడా? (కాడనిభావం); అఖిలలోక+ఈశ్వర+ఈశ= సమస్తభువనాధిపతులైన దిక్పాలురకు ప్రభువైన యజ్ఞస్వరూపా!; చూడన్= ఆలోచిస్తే; విశ్వంబు= సమస్తజగత్తు; నీ= నీయొక్క; యోగమాయా= యోగమాయయనెడి; పయస్+నిధి= సముద్రమునందు; మగ్నము+ఔటన్= మునిగినదికావున; తమబుద్ధిన్= తమమనసులో; తెలిసియున్= ఎరుకకల్గికూడ; తెలియని= తెలిసికోలేని; మూఢులన్= అజ్ఞానులను; ఏమి+అనన్= ఏమనాలి?; సుభగచరిత= మనోహరమైన నడవడికగల దేవా!; దాసజనకోటికిన్= భక్తజనులబృందానికి; అతిసౌఖ్యదాయకములు= మిక్కిలి సుఖాన్ని కల్గించేవి; వితత= అతిశయమైన; కరుణా= కారుణ్యమనే; సుధా తరంగితములు+ఐన= అమృతంచేత ఓలలాడించేవైన; నీ కటాక్ష+ ఈక్షణములచేన్= నీ కడగంటి చూపులచేత; నెఱయన్= ప్రీతితో; మమ్మున్= (మునులను); చూచి= కాంచి; సుఖులను= సౌఖ్యంగా జీవించే వారినిగా, చేయుము+ఏ= కావించుమా! (ప్రార్థనార్థకం).

**తా :** ఓ పద్మనాభా! నీవు చేసే పనులకు అంతు లేదు. ఈ కర్మరూప సముద్రాన్ని తరించగలనని ఏ మతిహీనుడైనా అనుకొంటే వాడు అజ్ఞానియే. ఈ విశ్వమంతా నీ యోగమాయ అనే సముద్రంలో మునిగివుంది. ఓ దిక్పాలాధిపతీ! ఈ వాస్తవం తెలిసికూడ తెలియనట్లు వ్యవహరించే అవివేకుల్ని ఏమని పిలవాలి? స్వామీ! సుందరాకారా! నీ కడగంటి చూపులు భక్తులకు అనంతసుఖాన్ని ఇస్తాయి. అంతేగాదు కరుణామృతరసంలో ఓలలాడిస్తాయి. అలాంటి చల్లని చూపుల్ని మాపై పరపి సుఖంగా జీవించేలా చేయవా? (చేయగలడనే విశ్వాసం).

**క. అని బ్రహ్మవాదు లగు స, న్మునివర్యులు భక్తియోగమున వినమితులై**
**మనమున మోదము ముప్పిరి, గొనఁ బొగడిరి ఖురవిదళితగోత్రిం బోత్రిన్. 438**

**ప్రతి :** అని= పైన ప్రార్థించినరీతిగా; బ్రహ్మవాదులు+అగు= బ్రహ్మతత్త్వజ్ఞులైన; సత్+మునివర్యులు= శ్రేష్ఠులైన మునులు; భక్తియోగమునన్= భక్తిభావంతో; వినమితులు+ఐ= తలలు వంచినవారై; మనమునన్= మదియందు; మోదము= ఆనందం; ముప్పిరి+కొనన్= ముడివడగా; ఖుర= తన గిట్టలచే; విదళిత= చెదరగొట్టబడిన; గోత్రిన్= భూమిగలదైన; పోత్రిన్= యజ్ఞవరాహాన్ని; పొగడిరి= స్తుతించారు.

**తా :** బ్రహ్మజ్ఞులైన అక్కడి మునీంద్రులందరు భక్తిభావంతో తలలువంచి మహానందభరితులై గిట్టలతాకిడిచేత భూమిని పాతాళం నుండి పైకి లేవనెత్తిన ఆ యజ్ఞవరాహస్వామిని వేనోళ్ళ కొనియాడారు.

**ఉ. అంతట లీలఁబోలె జగదాత్ముఁడు యజ్ఞవరాహమూర్తి య**
**త్యంతగభీరభీషణమహార్ణవతోయసమూహమున్ ఖురా**
**క్రాంతముఁజేసి క్రమ్మఱ ధరాతల మంబులమీఁద నిల్పి వి**
**శ్రాంతి వహింపఁజేసి గుణశాలి తిరోహితుఁడయ్యె నయ్యెడన్. 439**

**ప్రతి :** అంతటన్= తర్వాత (మునులస్తోత్రపాఠం ముగిన తర్వాత) జగత్+ఆత్ముఁడు= విశ్వమే ఆత్మగా గలవాడును; గుణశాలి= గుణములచే గొప్పవాడును (అగు); యజ్ఞవరాహమూర్తి= సత్కర్మకై వరాహావతారమెత్తిన ఆ విష్ణువు; లీలన్+పోలెన్= విలాసక్రీడమాదిరిగా; అతి+అంత= మిక్కిలి; గభీర= లోతైనట్టియు; భీషణ= భయంకరమైనట్టియునగు; మహా+అర్ణవ=

మహాసముద్రపు; తోయసమూహమున్= నీటిమొత్తాన్ని; ఖుర+ఆక్రాంతమున్= గిట్టలచే ఆక్రమింపబడిన దానినిగా; చేసి= కావించి; ఆ+ఎడన్= ఆ సమయంలో; క్రమ్మఱన్= తిరిగి; ధరాతలము= భూమిని; అంబులమీఁదన్= నీటిపైన; నిల్పి= నిలబెట్టి; విశ్రాంతి వహింపన్= నిలకడపొందునట్లు; చేసి; తిరోహితుఁడు+అయ్యెన్= అదృశ్యుడయ్యాడు-(కనుమరుగైనాడు)

**తా :** లోకాల్ని ఆత్మగా తాల్చినవాడును, సత్త్వరజస్తమోగుణాలకు నెలవైనవాడును అగు ఆ యజ్ఞవరాహమూర్తి సవిలాసంగా లోతైన సముద్రపు నీటిని తన గిట్టలచే ఎగమీటి, ఆ తర్వాత దాన్ని నీటిపై నిల్పి అంతర్ధానం చెందాడు.

**ఉ. మంగళమైన యీ కథ సమంచితభక్తిఁబఠింప విన్నవా**
**రింగరుణార్ద్రదృష్టిఁగని శ్రీహరి సాలఁబ్రసన్నుఁడౌను, స**
**త్సంగతుఁడైన విష్ణుఁడు ప్రసన్నుఁడు దా నగునేని వారికిన్**
**మంగళముల్ లభించు; ననుమానము లే దదిగాక వెండియున్. 440**

**ప్రతి :** మంగళము+ఐన= శుభప్రదమైనట్టి; ఈ కథన్= ఈ అవతారగాథను; సమ్+అంచితభక్తిన్= మిక్కిలి భక్తిభావంతో; పఠింపన్= చదువగా; విన్నవారిన్= శ్రవణం చేసినవారిని; శ్రీహరి= శ్రీనారాయణుడు; కరుణా+ఆర్ద్రదృష్టిన్= దయారసంతో తడిసిన చూపుతో; కని= చూచి; చాలన్= మిక్కిలి; ప్రసన్నుఁడు+ఔను= అనుగ్రహించినవాడగును; సత్+సంగతుఁడు+ఐన= సజ్జనులతో కూడినవాడైనట్టి; విష్ణుఁడు= మాధవుఁడు; తాన్= తానే (స్వయంగా); ప్రసన్నుఁడు= అనుగ్రహించినవాడు; అగున్+ఏనిన్= అయినట్లయితే; వారికిన్= ఆయనదయకు పాత్రులైన వారికి, (భక్తులకు); మంగళముల్= శుభములు; లభించున్= దొరుకును; అనుమానము లేదు= సందేహం లేదు; అది+కాక= ప్రసన్నతయేగాక; వెండియున్= మరియూ

**తా :** ఈ యజ్ఞవరాహస్వామి కథ చాల శుభప్రదమైంది. దీన్ని ఎవరైనా మహాభక్తితో చదువుతూ ఉంటే, విన్నవారికి (శ్రోతలకు) ఆ శ్రీమన్నారాయణుని అనుగ్రహం కల్గుతుంది. ఆ విధంగా ఆ స్వామియొక్క దయకు పాత్రులైన భక్తులకు సమస్త శుభాలు ఒనగూడుతాయి. ఏ మాత్రం సందేహం లేదు అని మైత్రేయుడు విదురునితో చెప్పాడు. అనుగ్రహఫలమే కాదు-మరేదోకూడ ఉన్నాయంటున్నాడు.

**చ. హరి నిజదాసకోటికి గుహాశయుఁడై రమియించు; నట్టి స**
**త్పురుషుల కిష్టవస్తుపరిపూర్ణమనోరథసిద్ధి గల్గు; సు**
**స్థిర మగుచున్న మోక్ష మఱచేతిదియై చెలువారు నన్న న**
**స్థిరతరతుచ్ఛసౌఖ్యములు సేకుఱుటల్ మఱి చెప్ప నేటికిన్. 441**

**ప్రతి :** హరి= విష్ణువు; నిజదాసకోటికిన్= తన భక్తబృందానికి; గుహా+ఆశయుఁడు+ఐ= హృదయమే నివాసంగా కలవాడై; రమియించున్= క్రీడిస్తాడు; అట్టి= అలాంటి; సత్+పురుషులకున్= ఉత్తములైన భక్తులకు; ఇష్టవస్తు= కోరిన వస్తువులతోడి; పరిపూర్ణ= నిండైన; మనోరథసిద్ధి= కోర్కెల ప్రాప్తి; కల్గున్= ఒనగూరుతుంది; సుస్థిరము+అగుచు+ఉన్న= మిక్కిలి దృఢమైనట్టి; మోక్షము= కైవల్యం; అఱచేతిది+ఐ= అరచేతిలోనిదిగా; చెలువారున్+అన్నన్= ఒప్పారునన్నచో; అస్థిరతర= అశాశ్వతమైన; తుచ్ఛ= కొరగాని; సౌఖ్యములు= సుఖాలు; చేకుఱటల్= పొందటం గూర్చి; మఱి= ఇంకా; చెప్పన్+ఏటికిన్= చెప్పటం ఎందుకు? (అవసరంలేదు)

**తా :** విష్ణుమూర్తి ప్రసన్నుడైతే సర్వశుభాలు చేకూరటమే కాదు. మరిన్ని లాభాలున్నాయి. ఆ స్వామి తన భక్తుల హృదయాల్లో పదిలంగా నివాసముంటాడు. సజ్జనులకు తాము కోరిన వస్తువులు లభిస్తాయి. వారికి శాశ్వతమైన మోక్షపదవి కైవసమౌతుంది. ఇక ఇన్ని ఉత్తమ ఫలితాలు చేకూరుతాయన్నప్పుడు అస్థిరమైన తాత్కాలిక సుఖభోగాల గూర్చి చింతించటం దండుగ సుమా!

**ఉ. కాన సరోజలోచను జగత్స్తవనీయకథాసుధారసం**
**బానిన యట్టి జిహ్వ యసదన్యకథాలవణోదకంబులం**
**బానము సేయఁజూచునె; సుపర్వమహీజమరందపాన లా**
**భానుభవంబు నొందు మధుపప్రభు వేగునె వేఁపచెట్లకున్? 442**

**ప్రతి :** కానన్= కావున; సరోజలోచను= తామరలవంటికన్నులుగల శ్రీమహావిష్ణువుయొక్క; జగత్= లోకంచేత; స్తవనీయ= కొనియాడదగిన; కథా= కథలనెడి; సుధారసంబు= అమృతరసాన్ని; ఆనిన+అట్టిజిహ్వ= పానంచేసినటువంటి నాలుక; అసత్= అనుచితమైన (సత్ కానిది అసత్); అన్యకథా= ఇతరకథలనెడి; లవణ+ఉదకంబులన్= ఉప్పునీటిని; పానము+చేయన్= త్రాగుటకు; చూచునె= ఆలోచిస్తుందా? (కాదని భావం); సుపర్వమహీజ= దేవతలచెట్టుగా ప్రసిద్ధమైన కల్పతరువుయొక్క; మరందపాన= తేనెని గ్రోలుట అనే; లాభ+అనుభవంబున్= లాభానుభూతిని; ఒందు= పొందెదు; మధుపప్రభువు= తేనెటీగల రేడు, వేఁపచెట్లకున్; ఏగునె?= వెళ్ళునా? (వెళ్ళదు).

**తా :** శ్రీహరి కథలు లోకవిఖ్యాతి గాంచినట్టివి. అట్టి కథామృతాన్ని చవి చూచిన భక్తులనాలుక అనుచితమైన అన్యకథలనే ఉప్పునీటిని రుచిచూడ నొల్లదు. కల్పతరువుయొక్క తేనెలోని తియ్యదనాన్ని ఆస్వాదించే జుంటీగ వేపచెట్ల దరికి చేరుతుందా?

**క. అని మైత్రేయ మునీంద్రుం, డనఘుఁడు విదురునకుఁ జెప్పినట్టి తెఱం గ**
**ర్జున పౌత్త్రునకున్ వ్యాసుని, తనయుఁడు వినిపించి మఱియుఁ దగ నిట్లనియెన్. 443**

**ప్రతి :** అని= పైవిధంగాపేర్కొని; అనఘుఁడు= పాపరహితుడైన; మైత్రేయముని+ఇంద్రుండు= మైత్రేయుడనే ముని శ్రేష్ఠుడు; విదురునకున్= విదురునికి; చెప్పిన+అట్టి తెఱంగు= బోధించిన తీరు; వ్యాసునితనయుఁడు= వేదవ్యాసుని కుమారుడైన శ్రీశుకుడు; అర్జున పౌత్రునకున్= అర్జునుని మనుమడైన పరీక్షిత్తుకు; వినిపించి= చెప్పి; మఱియున్= ఇంకా; తగన్= తగునట్లు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** మైత్రేయముని విదురునికి చెప్పిన ఈ కథ శ్రీశుకుడు పరీక్షిన్నరేంద్రునికి వివరించి, ఇంకా ఈ విధంగా అన్నాడు.

**క. అని చెప్పిన మైత్రేయునిఁ, గనుఁగొని విదురుండు పల్కు ఘనతరమగు నా**
**దనుజకులాంతకు చరితము, విని తనియదు నా మనంబు విమలచరిత్రా! 444**

**ప్రతి :** అని చెప్పిన= పైవిధంగా యజ్ఞవరాహావతారచరిత్రను గూర్చి వివరించినట్టి; మైత్రేయునిన్= మైత్రేయమునిని; కనుఁగొని= చూచి; విదురుండు= విదురుడు; విమలచరిత్రా= స్వచ్ఛమైన నడవడికగల మహాత్మా!; ఘనతరము+అగు= గొప్పదైన; ఆ; దనుజకుల+అంతకు చరితము= రాక్షస జాతిని మట్టుపెట్టు శ్రీహరియొక్క కథ; విని= విన్నతర్వాత కూడా; నా మనంబు= నా మనస్సు; తనియదు= తృప్తిపడలేదని; పల్కున్= చెప్పాడు.

**తా :** యజ్ఞవరాహుణ్ణి గూర్చి వివరించిన మైత్రేయునితో విదురుఁడు "ఓ మహానుభావా! రాక్షసజాతిని తుదముట్టించిన ఆ విష్ణుమూర్తి గొప్పచరిత్ర విన్నా నా మనస్సుకు సంతృప్తి కలుగలేదు" అని అన్నాడు.

**చ. సవనవరాహమూర్తి కథ సర్వము నీ దయ వింటి; వెండియున్**
**వివరముగా వినంబలుకవే గుణసాంద్ర! మునీంద్రచంద్ర! మా**
**ధవగుణకీర్తనామృతవితానముఁ గర్ణపుటాంజలిన్ వెసం**
**జవిఁగొన కేల మాను జనసంతతికిన్ భవతాపవేదనల్. 445**

**ప్రతి :** గుణసాంద్ర!= గొప్పగుణములుగలవాడా!; ముని+ఇంద్రచంద్ర!= మహామునులందు శ్రేష్ఠుడవైనవాడా!; నీదయన్= నీ కృపవల్ల; సవనవరాహమూర్తికథ= యజ్ఞవరాహస్వామిచరిత్ర; సర్వమున్= అంతటిని; వింటిన్= విన్నాను; వెండియున్= మరియు; వివరము+కాన్= మరింతలోతుగా; వినన్= వినునట్లు; పలుకుము+ఏ= చెప్పవయ్యా!; మాధవ= లక్ష్మీదేవిభర్తయైన హరియొక్క; గుణ= గుణాలను; కీర్తన+అమృత= స్తోత్రముచేయుట అనే అమృతం యొక్క; వితానమున్= మొత్తాన్ని; కర్ణపుట+అంజలిన్= చెవి సందులనే దోసిళ్ళతో; వెసన్= త్వరగా; చవిన్+కొనక= రుచిచూడకుండా; భవతాపవేదనల్= జన్మవల్ల కల్గిన బాధ మరియు దుఃఖం; జనసంతతికిన్= ప్రజాసమూహానికి; ఏల మానున్= ఏ విధంగా పోతాయి? (సమసిపోవని తాత్పర్యం).

**తా :** "మునులలో మేటివాడవైన మైత్రేయా! నీ దయవల్ల ఆ యజ్ఞవరాహస్వామి వృత్తాంతం అంతా విన్నాను. అయినా మరింత వివరంగా వినాలని ఉంది. ఆ శ్రీహరియొక్క అమృతాయమానమైన కీర్తనల్ని చెవికింపుగా వింటేగాని ప్రజల జన్మసంబంధులైన బాధలు తీరవు" అని విదురుడు మైత్రేయునితో అన్నాడు.

**వ. కావున 446**

**ప్రతి :** కావునన్= అందుచేత

**తా :** వివరంగా శ్రీహరికథల్ని వినాలని ఉంది కాబట్టి వాటిని సమగ్రంగా విన్పించమని విదురుడు మైత్రేయుణ్ణి అర్థించాడు.

**సీ. శ్రీహరి యజ్ఞవరాహరూపముఁ దాల్చి మించి హిరణ్యాక్షుఁద్రుంచె ననుచు**
**నప్పుడు మునినాథ! చెప్పితి నాతోడ న వ్వరాహంబు దంష్ట్రాగ్రమునను**
**ధరణి నెబ్భంగిని ధరియించె? హరికి హిరణ్యాక్షుతోడ వైరమున కేమి**
**కారణ? మసుర నే గతి సంహరించెఁదా? నింతయు నెఱిఁగింపు మిద్ధచరిత!**

**తే. యనిన మైత్రేయముని విదురునకు ననియె, హరికథాకర్ణనమునఁబెంపారు నీకు**
**జన్మఫలసిద్ధి యగుటకు సందియంబు, వలదు; హరిమాయ విధికైన వశమె తెలియ? 447**

**ప్రతి :** మునినాథ= మునీశ్వరా!; ఇద్ధచరిత= ప్రశస్తమైన నడవడికగల వాడా!; శ్రీహరి= విష్ణువు; యజ్ఞవరాహరూపమున్= యజ్ఞవరాహాకృతిని; తాల్చి= ధరించి; అప్పుడు= ఆ సమయంలో; మించి= అతిశయించి; హిరణ్య+అక్షున్= బంగారువన్నెతోడి కన్నులుగల రక్కసుణ్ణి; త్రుంచెన్+అనుచున్= చంపాడని; నాతోడన్= నాతో; చెప్పితి= చెప్పావు; ఆ+వరాహంబు= ఆ పంది; దంష్ట్రా+అగ్రమునను= పంటికొసయందు; ధరణిన్= భూమిని; ఏ+భంగిన్= ఏ విధంగా; ధరియించెన్= తాల్చింది?

(ప్రశ్న); హరికిన్= శ్రీహరికి; హిరణ్య+అక్షుతోడన్= ఆ పేరుగల రక్కసునితో; వైరమునకున్= కయ్యానికి; ఏమికారణము?= హేతువేది? (ప్రశ్న); తాన్= ఆ పంది; అసురన్= రాక్షసుణ్ణి; ఏ గతిన్= ఏ రీతి; సంహరించెన్= చంపింది (ప్రశ్న); ఇంతయున్= ఈ కథనంతటిని; ఎఱిఁగింపుము= తెలియజేయుము; (ప్రార్థన); అనినన్= అని అడుగగా; మైత్రేయముని= మైత్రేయమహర్షి; విదురునకున్= విదురునితో; హరికథా+ఆకర్ణనమునన్= విష్ణుకథలను వినుటవల్ల; పెంపారు= అతిశయించిన; నీకున్= (విదురునకు); జన్మఫలసిద్ధి= జన్మసార్థక్యం; అగుటకున్= కావటానికి; సందియంబు= సందేహం; వలదు= తగదు; హరిమాయ= విష్ణుమాయ; తెలియన్= తెలిసికోవటానికి; విధికిన్+ఐన, వశమె= ఆ బ్రహ్మకైనా సాధ్యమా? (కాదని అభిప్రాయం)

**తా :** విదురుడు మైత్రేయుణ్ణి "మునీంద్రా! దామోదరుడు యజ్ఞవరాహరూప మెత్తి హిరణ్యాక్షుడనే రాక్షసుణ్ణి మట్టుపెట్టాడని ఇంతకు ముందే నీవు నాతో అన్నావు. ఆ వరాహం తనకోరపైన భూమిని ఎలా ధరించింది? నారాయణునికి హిరణ్యాక్షునితో విరోధమెందుకు కల్గింది? ఆయన వాణ్ణి ఎలా సంహరించాడు? ఈ కథను నాకు సవిస్తరంగా చెప్పు" అని కోరాడు. అప్పుడామైత్రేయుడు "అయ్యా! హరికథలను వినాలని ఉత్సాహంతో ఉన్న నీకు జన్మఫలం తప్పక సిద్ధిస్తుంది. అనుమానం లేదు. విష్ణుమాయని తెలిసికోవటం ఆ బ్రహ్మకు కూడ అసాధ్యమే" అని విదురునితో అన్నాడు.

**క. అనఘాత్మ! నన్ను నీ వడి, గిన యీ కథ ధ్రువుఁడు విష్ణుకీర్తనపరతం**
**దనరిన నారదు నడుగ న, తని కతఁడెఱిఁగింప హరికథాశ్రవణమునన్. 448**

**ప్రతి :** అనఘ+ఆత్మ= పాపరహితమైన హృదయంగల వాడా!, (ఓ విదురా!); నన్నున్= (మైత్రేయుని); నీవు= (విదురుడు); అడిగిన+ఈ+కథ= చెప్పుమని కోరినకథ; ధ్రువుఁడు= ఉత్తానపాదునికుమారుడు; విష్ణుకీర్తనపరతన్= విష్ణుమూర్తిని స్తుతించుటలో పరవశుడై; తనరిన= ఒప్పినట్టి; నారదున్= దేవఋషిని; అడుగన్= అడుగగా; అతనికిన్= ధ్రువునకు; అతఁడు= ఆ నారదుడు; ఎఱిఁగింపన్= తెలుపగా; హరికథాశ్రవణమునన్= హరికథయొక్క వినికిడిచే...

**తా :** ఓ అనఘాత్మా! నీవు అడిగిన విధంగానే పూర్వం ఇదే కథను ధ్రువుడు విష్ణుకీర్తన తత్పరుడైన నారదమునీంద్రుణ్ణి అడిగాడు. ఆ మహర్షి తెలిపిన ఆ శ్రీహరికథలను చెవులారా విని, ఆ రాజు తరించాడు.

**తే. దండధరుఁబెల్చ డాకాలఁ దన్ని ధ్రువుఁడు, నిందు నందును వాసికి నెక్కె; నట్టి**
**విష్ణుసంకీర్తనంబరవిందభవుఁడు, దివిజులకుఁ జెప్పె నది నీకుఁదేటపఱుతు. 449**

**ప్రతి :** ధ్రువుఁడున్= సునీతి ఉత్తానపాదుల కుమారుడును; పెల్చన్= అవలీలగా; డాకాలన్= ఎడమకాలితో; దండధరున్= యముణ్ణి (మృత్యుదేవత); తన్ని= తాడించి; ఇందున్+అందునున్= ఇహలోక పరలోకాలందు; వాసికిన్+ఎక్కెన్= పేరు గడించాడు; అట్టి= అలాంటి (ధ్రువునికి కీర్తి దెచ్చిన); విష్ణుసంకీర్తనంబు= విష్ణుదేవుని ఆలాపనను; అరవింద భవుఁడు= కమలజుడైన బ్రహ్మ; దివిజులకున్= దేవతలకు; చెప్పెన్= చెప్పాడు; అది= ఆ కథను; నీకున్= నీకూ (విదురునకు); తేటపఱుతున్= తెలియజేస్తాను.

**తా :** "అయ్యా విదురా! ధ్రువుడు శ్రీహరి పంపిన విమాన మెక్కబోతూ తన్ను సమీపించిన మృత్యుదేవత తలపై అవలీలగా ఎడమకాలు మోపి ఇహపరలోకాలలో కీర్తిగడించాడు. బ్రహ్మ విష్ణుసంకీర్తన మహిమను దేవతలకు చెప్పాడు. దాన్ని నీ కిప్పుడు విన్పిస్తా" నని మైత్రేయుడన్నాడు.

**వ. ఆకర్ణింపుము. 450**

**ప్రతి :** ఆకర్ణింపుము

**తా :** ఆ తర్వాతి కథను శ్రద్ధగా విను.

## ❖ మైత్రేయ మహాముని విదురునకు హిరణ్యాక్ష హిరణ్య కశిపుల వృత్తాంతం బెఱింగించుట ❖

**సీ. బలిసి దక్షప్రజాపతి తనూభవ దితి సంతానరుచి మానసమునఁబొడమ**
**నొకనాఁడు పుష్పసాయకశరనిర్భిన్న భావయై విరహతాపమున వచ్చి**
**పతి సమాగమవాంఛ ప్రభవింప నిజనాథు సన్నిధి నిలిచి యస్ఖలితనియతి**
**నగ్నిజిహ్వుండును యజురధీశుండును నగు విష్ణుఁదన చిత్తమందు నిలిపి**

**తే. తగఁబయస్సున నగ్నిహోత్రంబు సేసి, కమలహితుఁ దస్తశైలసంగతుఁడు గాఁగ**
**హోమశాలాంగణమునఁ గూర్చున్న విభునిఁ, గశ్యపునిఁగాంచి వినయవాక్యముల ననియె. 451**

**ప్రతి :** దక్షప్రజాపతి తనూభవ దితి= దక్షుడనే ప్రజాపతికూతురు దితి; బలిసి= అతిశయించి; మానసమునన్= తన మనస్సులో; సంతానరుచి= పిల్లలు కల్గాలనే కోరిక (సంతానాపేక్ష); పొడమన్= ఏర్పడగా; ఒకనాఁడు= ఒకరోజు; పుష్పసాయక= పూవింటివాడైన మన్మథునియొక్క; శర= బాణంచేత; నిర్భిన్నభావ+ఐ= మిక్కిలి భేదింపబడ్డ మనస్సుగలదై; విరహతాపమునన్= ఎడబాటు వలన కల్గిన వేడిమితో; వచ్చి= ఏ తెంచి; పతిసమాగమవాంఛ= భర్తతో కూడాలనే కోర్కె; ప్రభవింపన్= పుట్టగా; నిజనాథు= తన పెనిమిటియొక్క (కశ్యపుడు); సన్నిధిన్= ఎదుట; నిలిచి= నిలబడి; అగ్నిజిహ్వుండును= అగ్నిని జిహ్వగా (నాలుకగా) కలవాడును; యజుస్+అధి+ఈశుండును= యజ్ఞకర్తయు; అగు= అయినట్టి; విష్ణున్= హరిని; న+స్ఖలిత= మొక్కవోని; నియతిన్= నియమంతో; తనచిత్తమునందున్= తన యెదలో; నిలిపి= కుదురుపరచి (కశ్యపుడు తన మనస్సులో శ్రీహరిని స్మరిస్తున్నాడని భావం); తగన్= యథోచితంగా; పయస్సునన్= పాలతో; అగ్నిహోత్రంబు= హోమం; చేసి= కావించి; కమలహితుఁడు= పద్మమిత్రుడైన సూర్యుడు; అస్తశైల సంగతుఁడు+కాఁగన్= పడమటి కొండలో చేరిపోగా; హోమశాలా+అంగణమునన్= యజ్ఞశాలయొక్క ముంగిట; కూర్చున్న= విశ్రమించిన; విభునిన్= భర్తయైన; కశ్యపునిన్= ఆ పేరుగల ప్రజాపతిని; కాంచి= చూచి; వినయవాక్యములన్= మిక్కిలి నమ్రతతో కూడిన పల్కులతో; అనియెన్= చెప్పెను.

**తా :** 'విదురా! విను' దక్షునిబిడ్డ దితి అనే సాధ్వికి సంతానకాంక్ష కల్గింది. ఆమె ఒకరోజు తన మనస్సులో రేగిన మదనతాపానికి తట్టుకోలేక కామాతురయై భర్తకశ్యపుని చెంతకు వచ్చింది. కశ్యపుడు అప్పుడే యజ్ఞనాథుడైన శ్రీమన్నారాయణుని స్మరించి, సాయం సంధ్యానుష్ఠానం ముగించుకొని యజ్ఞశాలముంగిట విశ్రమించి ఉన్నాడు. అది సూర్యాస్తమయ సమయం. దితి భర్త చెంగట నిల్చి వినయంగా ఇట్లన్నది.

**చ. గజవిభుఁడుద్ధతి న్ననఁటికంబములన్ విదళించు లీలఁ జి**
**త్తజుఁడు ప్రసూనసాయకవితానముచేత మదీయచిత్తమున్**

**గజిబిజిసేసి పెన్వగలఁ గాఁతియవెట్టఁగ నాథ! నీ పదాం**
**బుజములఁగాన వచ్చితిఁ, బ్రభుత్వ మెలర్పఁగ నన్నుఁగావవే!** 452

**ప్రతి :** నాథ= స్వామీ!; గజవిభుఁడు= ఏనుగులరేడు; ఉద్ధతిన్= విజృంభణతో; అనఁటికంబములన్= అరటిబోదెలను; విదళించులీలన్= చెల్లాచెదరు చేయునట్లు; చిత్తజుఁడు= మన్మథుడు; ప్రసూనసాయక= పూలబాణాలయొక్క; వితానముచేతన్= సమూహంతో; మదీయచిత్తమున్= నా మనస్సును; గజిబిజి+చేసి= గందరగోళపరచి; పెన్+వగలన్= మిక్కిలి సంతాపముతో; కాఁతియ+పెట్టఁగన్= బాధపెట్టగా; నీ పద+అంబుజములన్= నీ పాదపద్మాలను; కానన్+వచ్చితిన్= చూడాలని వచ్చాను; ప్రభుత్వము+ఎలర్పఁగన్= నీ అధికారం ఒప్పునట్లుగా; నన్నున్= నన్ను; (దితిని); కావుము+ఎ= రక్షింపుమా? (ప్రార్థనార్థకం)

**తా :** "ప్రాణేశ్వరా! మదోద్రేకంతో ఏనుగు అరటిబోదెల్ని ఊపునట్లు మన్మథుడు పూలబాణాలతో నా మనస్సును కకావికలు చేస్తున్నాడు. ఈ బాధ భరించలేను. అందుకే నీ పాదపద్మాల చెంతకు వచ్చాను. ఇక నీ సామర్థ్యాన్ని ప్రదర్శించి నన్ను కాపాడవా?" అని దితి కశ్యపుని అర్థించింది.

**వ. అదియునుం గాక నాతోడి సవతు లెల్లను భవత్కృపా విశేషంబున గర్భాధానంబులు వడసి నిర్భరానందంబున నుండం జూచి శోకవ్యాకులితచిత్త నై యున్న నన్ను రక్షించుట పరమధర్మంబు; నీవు విద్వాంసుండవు; నీ యెఱుంగని యర్థంబు గలదే? నీ వంటి మహానుభావు లయిన సత్పురుషు లార్తులైన వారి కోర్కులు వ్యర్థంబులు గాకుండఁ దీర్చుట ధర్మం బని వెండియు నిట్లనియె.** 453

**ప్రతి :** అదియునున్+కాక= అంతేకాక; నాతోడి సవతులు+ఎల్లను= నా తోడి నీ భార్యలందరు; భవత్= మీ యొక్క; కృపావిశేషంబునన్= దయాతిశయంతో; గర్భ+ఆధానంబులు= గర్భమును దాల్చుటలు; పడసి= పొంది; నిర్భర+ఆనందంబునన్+ఉండన్= అతిశయమైన సంతోషంతో ఉండగా; చూచి; శోకవ్యాకులితచిత్తన్+ఐ= దుఃఖంచేత కలత చెందిన మనస్సుగలదాననై; ఉన్ననన్నున్= ఉన్నట్టి నన్ను (దితి); రక్షించుట= కాపాడుట; పరమధర్మంబు= గొప్పధర్మం; నీవు= నీవు (కశ్యపుడు); విద్వాంసుండవు= గొప్పపండితుడవు; నీ+ఎఱుంగని= నీకు తెలియనట్టి; అర్థంబు= జ్ఞానం లేదా ప్రయోజనం; కలదు+ఏ= ఉందా? (లేదని భావం); నీ వంటి= నిన్ను పోలినటువంటి; మహా+అనుభావులు+అయిన= గొప్ప ప్రభావముకలవారు; సత్+పురుషులు= ఉత్తమపురుషులు; ఆర్తులు+ఐనవారి= దీనులైనవారియొక్క; కోర్కులు= కోర్కెలు; వ్యర్థంబులు+కాక+ఉండన్= వృథా కాకుండ; తీర్చుట= నెరవేర్చుట; ధర్మంబు= పాడి; అని; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తా :** దితి భర్తయైన కశ్యపునితో మహాత్మా! నా సవతులెల్లరు నీ అనుగ్రహంవల్ల గర్భవతులై మహానందంతో ఉన్నారు. ఆ విషయం అనుకుంటే నా మనస్సు కలత చెందుతున్నది. నా బాధను మాన్పి నన్ను రక్షించండి. అది మీ ధర్మం. మీరు గొప్ప జ్ఞానులు. మీకు తెలియని దేముంది? మీ వంటి ఉత్తమపురుషులు దుఃఖభాగుల కోర్కెలు వ్యర్థం కాకుండ తీర్చటం ధర్మం' అని ఇంకా ఈ విధంగా అన్నది.

**క. పతిసమ్మానము వడసిన, సతులకు నభిమతపదార్థసంసిద్ధియు నూ**
**ర్జితయశముఁగలిగి లోక, స్తుతమై చెలువారుచుండుఁజువ్వె మహాత్మా!** 454

**ప్రతి :** మహా+ఆత్మా= గొప్పహృదయంగల స్వామీ!; పతిసమ్మానము= భర్త యొక్క ఆదరం; పడసిన= పొందినట్టి; సతులకున్= భార్యలకు; అభిమత= కోరినట్టి; పద+అర్థసంసిద్ధియున్= వస్తువులు లభించుటయు; ఊర్జితయశమున్= స్థిరమైనకీర్తి కలిగి; లోకస్తుతము+ఐ= ప్రజలందరిచే కొనియాడబడినదై; చెలువారుచున్+ఉండున్= ఒప్పారుతూ ఉంటుంది; చూవె= చూడుమా!

**తా :** ఓ మహానుభావా! లోకంలో భర్తయొక్క ఆదరాన్ని చూరగొన్న భార్యకు ఇష్టవస్తు ప్రాప్తి మరియు శాశ్వతమైన కీర్తి చేకూరుతాయి. ఇవి లోకమంతా మెచ్చుకోదగ్గ విషయాలు గదా!

**క. తన ధర్మపత్నివలనను, మునుకొని తాఁ బుత్త్రరూపమున నుదయించున్**
**విను దీపమందు ముట్టిం, చిన దీపము రెండు గావె? శిఖి యొకటయ్యున్. 455**

**ప్రతి :** తాన్= తాను అనగా భర్త; తన ధర్మపత్నివలనను= తన అర్ధాంగి వల్లనే; మునుకొని= ముందుకువచ్చి; పుత్రరూపమునన్= కుమారునిరూపంతో; ఉదయించున్= జన్మిస్తాడు; విను= ఆలకించుము (దితి భర్తనుద్దేశించి); శిఖి= అగ్ని; ఒకటి+అయ్యున్= ఒక్కటే అయినప్పటికి (ఏకాకృతి); దీపము+అందున్= దివ్వెతో అంటించిన; దీపము= దివ్వె; రెండు+కావు+ఎ= రెండు అవుతాయి గదా!

**తా :** భర్త తన ఇల్లాలి గర్భాన కొడుకయి పుడతాడు. ఎట్టన ఒక దీపం వల్ల వేరొక దీపం వెల్గుతుంది– అయినా అగ్ని ఒక్కటే గదా!

**క. కావున నీ యర్థమ "యా, త్మా వై పుత్త్ర" యని వేదతతులం దోలిన్**
**వావిరిఁబలుకఁగ వినవే, ధీవర! ననుఁ గావు మధికదీనం గరుణన్. 456**

**ప్రతి :** ధీవర= బుద్ధిమంతుడా!; కావునన్= అందువల్ల; ఈ+అర్థము+అ= ఈ విషయమే; ఆత్మా వై పుత్రః= తన ఆత్మయే పుత్రుడవును; అని; వేదతతులందున్= వేదాల సముదాయంలో; ఓలిన్= వరుసగా; వావిరిన్= క్రమం తప్పకుండా; పలుకఁగన్= చెప్పబడి ఉండగా; వినవు+ఏ= వినలేదా?; అధికదీనన్= మిక్కిలి దీనురాలనైన; ననున్= నన్ను (దితిని); కరుణన్= కనికరంతో; కావుము= రక్షింపుము.

**తా :** 'ధీమంతుడవైన స్వామీ! నేను పైన చెప్పిన అంశమే' ఆత్మా వై పుత్రః అని వేదాలు కంఠోక్తిగా వాకొంటున్నాయి. ఇది మీకు తెలియనిదేమీ గాదు. ఈ దీనురాల్ని దయతో కాపాడండి.

**చ. వరకరుణామతిన్ దుహితృవత్సలతందనరారునట్టి మ**
**ద్గురుఁడొకనాఁడు మమ్ముఁదన కూఁతుల నందఱఁబిల్చి మీ మనో**
**హరు నెఱిఁగింపుఁడిత్తుఁగమలాననలార! య టన్న నందులోఁ**
**బురుషవరేణ్య! యేము పదుముప్వుర మర్మిలి నిన్ వరింపమే! 457**

**ప్రతి :** పురుషవరేణ్య= పురుషులలో శ్రేష్ఠుడవైన ఓనాథా!; (దితిసంబోధన) వర= ఉత్కృష్టమైన; కరుణామతిన్= దయగల బుద్ధితో; దుహితృవత్సలతన్= కూతుళ్ళమీది వాత్సల్యంతో; తనరారున్+అట్టి= ఒప్పారు నట్టి; మత్+గురుఁడు= మా తండ్రి (దక్షుడు); ఒకనాఁడు= ఒకరోజు; తన కూఁతులన్+అందఱన్, మమ్మున్= తన కుమార్తెలైన మా అందరిని పిలిచి;

కమల+ఆననలార!= తామరలవంటి ముఖాలు కలిగిన బిడ్డలారా!; మీ మనోహరున్= మీ మనస్సుకు నచ్చిన వరుణ్ణి; ఎఱిగింపుఁడు= తెల్పండి; ఇత్తున్= అతనికే ఇస్తాను; అట+అన్నన్= అని చెప్పగా (దక్షుడనగా); అందులోన్= ఆయన కన్నబిడ్డల్లో; అర్మిలిన్= ప్రీతితో; ఏము పదమువ్వురము= మేము పదమూడుమందిమి; నిన్= నిన్ను (కశ్యపుని మారీచుని); వరింపము+ఏ= చేపట్టలేదా! (చేపట్టాము అని భావం)

**తా :** మహానుభావా! పురుషశ్రేష్ఠుడా! మా తండ్రికి కూతుళ్ళమీద వాత్సల్యమెక్కువ ఎంతో దయార్ద్రబుద్ధి గల ఆయన ఒకరోజు మా అందర్ని పిలిచి "తామరసాక్షులారా! మీకు ఎవరిపైన మక్కువ ఉందో చెప్పండి. ఆయనకే ఇస్తా"నని చెప్పాడు. మా అక్కచెల్లెళ్ళలో మేము పదముగ్గురం నిన్నే ఇష్టపడ్డాం గదా!" అని దితి కశ్యపునితో అంది.

**క. దితి యీ గతిఁ గామవిమో, హితమతి బహువచనముల హృదీశునిఁబలుకన్**
**ధృతిఁగృపణఁబతివ్రత నిజ, సతిఁగని కశ్యపుఁడు పలికె సల్లాపమునన్. 458**

**ప్రతి :** ఈ గతిన్= ఈ విధంగా; దితి; కామవిమోహిత= సంగమేచ్ఛచే మిక్కిలిగా చలించిన; మతిన్= మనస్సుతో; హృద్+ఈశునిన్= తన హృదయేశ్వరుడైన కశ్యపుణ్ణి; బహువచనములన్= పెక్కుమాటలతో; పలుకన్= చెప్పగా; కశ్యపుఁడు (మరీచిమహర్షి పుత్రుడు); ధృతిన్= దిట్టతనంతో; కృపణన్= దీనురాలునూ; పతివ్రతన్= పెనిమిటియే వ్రతంగా కల్గినదియు అగు; నిజసతిన్= తన భార్యయైన దితిని; కని= చూచి; సత్+లాపమునన్= ఉల్లాసంతో; పలికెన్= అన్నాడు...

**తా :** ఇలాగా దితి కామేచ్ఛతో పరవశించి అనేకవిధాల భర్తృసాంగత్యం కోరింది. ఆయన మనసు కరిగింది. దయనీయురాలు, పతివ్రత అయిన తన ఇల్లాలు దితితో కశ్యపుడు ఉల్లాసంగా ఇలా అన్నాడు.

**వ. నీవు సెప్పినయట్ల పురుషులకు నంగనలవలన ధర్మార్థ కామంబులు సిద్ధించుఁ; గర్ణధారుండు నావచేతం బయోధిఁ గడచు చందంబున గృహమేధి సర్వాశ్రమవాసుల నరసి రక్షించుచు నిజాశ్రమంబున వ్యసనార్ణవంబుఁ దరియించు; భార్య పురుషునందు నర్ధంబు; భార్యయందు సకల గృహకార్య భారంబునుం జేర్చి పురుషుండు నిశ్చింతుండై సుఖియించుచుండు; మఱియు నితరాశ్రమ దుర్జయంబులైన యింద్రియశత్రు వర్గంబుల భార్యాసమేతుండైన గృహస్థుండు దుర్గాధిపతియైన రాజు శత్రుసంఘంబుల జయించు చందంబున లీలామాత్రంబునం జయించు; నిట్టి కళత్రంబునకుం బ్రత్యుపకారంబు సేయ సకల గుణాభిరాములగు సత్పురుషులు నూఱేండ్లకును జన్మాంతరంబులకునైన సమర్థులు గారనిన మముబోఁటివారలు సేయనోపుదురే? అయిన నీ మనంబునం గల దుఃఖంబు దక్కుమని యిట్లనియె. 459**

**ప్రతి :** నీవు+చెప్పిన+అట్లు+అ= (దితి) నీవన్నట్లే; పురుషులకున్= మగవారికి; అంగనలవలనన్= స్త్రీలవల్లనే (భార్యలవల్లనే); ధర్మ+అర్థ, కామంబులు= ధర్మం, అర్థం, కామం అనే మూడు; సిద్ధించున్= సమకూరును; కర్ణధారుండు= నావికుడు; పయోధిన్= నీటికినెలవైన సంద్రాన్ని; నావచేతన్= పడవవల్లనే; కడచుచందంబునన్= దాటునట్లు; గృహమేధి= యజమాని; సర్వ+ఆశ్రమవాసులన్= బ్రహ్మచర్యం, వానప్రస్థం, సన్యాసమనే అన్ని ఆశ్రమాల్లో ఉన్నవారిని; అరసి= విచారించి; రక్షించుచున్= కాపాడుచు; నిజ+ఆశ్రమంబునన్= తనదైన గృహస్థాశ్రమంలో; వ్యసన+అర్ణవంబున్= కష్టాల సముద్రాన్ని; తరియించున్= దాటగల్గును; భార్య= ఇల్లాలు; పురుషునందున్= పతియందు; అర్ధంబు= సగభాగం అయినది; పురుషుండు= మగడు; భార్యయందున్= పత్ని యందు; సకల= సమస్తమైన; గృహకార్య= ఇంటిపనులకు సంబంధించిన; భారంబునున్=

బరువును; చేర్చి= వశపరచి; నిస్+చింతుండు+ఐ= చీకుచింతలేనివాడై; సుఖియించుచున్+ఉండున్= సుఖపడుతూ ఉంటాడు; మఱియున్= ఇంకా; భార్యాసమేతుండు+ఐన= ఇల్లాలితోకూడిన; గృహస్థుండు= వివాహితుడు; ఇతర+ఆశ్రమ= బ్రహ్మచర్య వానప్రస్థ సన్న్యాసాశ్రమాలకు; దుర్+జయంబులు+ఐన= జయింపవీలుకానట్టి; ఇంద్రియశత్రువర్గంబులన్= ఇంద్రియాలు అనే అరివర్గాన్ని; దుర్గ+అధిపతి+ఐన= దుర్గానికి ప్రభువైనట్టి, రాజు; శత్రుసంఘంబులన్= విరోధుల సమూహాన్ని; జయించు చందంబునన్= జయించునట్లు; లీలామాత్రంబునన్= అవలీలగా; జయించున్= (గృహమేధి) జయిస్తాడు; ఇట్టి= ఇటువంటి; కళత్రంబునకున్= భార్యకు; ప్రతి+ఉపకారంబు+చేయన్= తిరిగిమేలుచేయటానికి; సకల+గుణ+ అభిరాములు= అన్ని మంచి గుణాలచే నొప్పెడువారు; అగుసత్+పురుషులు= అయినట్టి మంచివారు; నూఱు+ఏండ్లకును= నూరుసంవత్సరాలకైననూ; జన్మ+అంతరంబులకున్= ఇతరములైన పెక్కు జన్మలకునూ; ఐనన్= అయినప్పటికి; సమర్థులు గారు= యోగ్యులు కాలేరు; అనినన్= అన్నచో (నానుడి); మముబోఁటివారలు= మాలాంటివారు; చేయన్+ఓపుదురు+ఏ= చేయటానికి సమర్థులా? (కారని భావం); అయినన్= ఏదియేమైనా; నీ= నీయొక్క (దితి నుద్దేశించి); మనంబునన్= మనస్సులో; కల దుఃఖంబు= ఉన్న దుఃఖాన్ని; తక్కుము= వదలుము; అని ఇట్లు+అనియెన్= అని యీక్రింది విధంగా చెప్ప బూనినాడు.

**తా :** కశ్యపుడు దితితో అంటున్నాడు.

"మానినీ! నీవు ముందన్నట్లే మగవారికి తమ భార్యలవల్లనే ధర్మం, అర్థం, కామం అనే మూడు పురుషార్థాలు సమకూరుతాయి. నావికుడు తన నావచేతనే సముద్రాన్ని తరిస్తున్నట్లు, గృహస్థాశ్రమవాసి, తక్కిన బ్రహ్మచర్య వానప్రస్థ సన్న్యాసాశ్రమవాసులకు ఆశ్రయమిచ్చి కాపాడుతాడు. గృహస్థాశ్రమసంబంధియైన కష్టాల కడలిని తరిస్తాడు. భార్య భర్తలో అర్ధభాగస్వామిని. భర్త తన ఇంటి బాధ్యతలన్నింటిని తన ఇల్లాలిపై మోపి నిశ్చింతగా సుఖిస్తాడు. దుర్గాన్ని ఏలే రాజు విరోధులను మట్టుపెడుతున్నట్లే భార్యతోకూడిన భర్త తక్కిన ఆశ్రమాలకు అసాధ్యమైన ఇంద్రియశత్రువర్గాన్ని అవలీలగా జయిస్తాడు. ఈ విజయం పురుషులకు తమ భార్యలవల్లనే సాధ్యం. అలాంటి భార్యకు ఎంత గొప్ప సత్పురుషులైనా ఎన్ని జన్మలెత్తినా తిరిగి ఉపకారం చేయలేరు. మరి మాలాంటివారు చేయగలరా? (చేయజాలరనుట) సరే–నీవేమీ ఏడ్వవద్దు" అని అనునయించాడు.

**తే. తరళలోచన! నీవు సంతానవాంఛఁ, జేసి వచ్చితి వౌఁ గులశీలవర్త**
**నములు గల భార్య మనమున నమరు కోర్కిఁ, దవిలి తీర్చుట పతికిఁ గర్తవ్య మరయ. 460**

**ప్రతి :** తరళలోచన= చలించుకన్నులుగలదానా!; (దితి); నీవు; సంతానవాంఛన్+చేసి= బిడ్డలు కావాలనే కోర్కెతో; వచ్చితివి= సమీపించావు; ఔన్= ఇది నిజము; అరయన్= విచారించగా; కులశీల వర్తనములు= వంశం; గుణం, నడవడికలు; కల= కల్గిన; భార్యమనమునన్= ఇల్లాలి ఎదయందు; అమరుకోర్కిన్= కల్గిన కాంక్షను; తవిలి తీర్చుట= ప్రయత్నంతో నెరవేర్చటం; పతికిన్= మగనికి; కర్తవ్యము= విధి.

**తా :** కశ్యపుడు 'చంచలాక్షీ! నీవు బిడ్డలు గల్గాలనే కోరికతో నా సాంగత్యాన్ని కోరి వచ్చావనటం నిజం. మంచివంశంలో పుట్టి చక్కని శీలం, నడవడిక గల ఇల్లాలి కోర్కెల్ని నెరవేర్చటం మగని బాధ్యత' అని దితిని అనునయించాడు.

**మ. తరుణీ! యొక్క ముహూర్తముండు; మిది సంధ్యాకాల మిక్కాలమం**
**దరయన్ భూతగణావృతుండగుచుఁగామారాతి లీలన్ వృషే**

**శ్వరయానంబున సంచరించుట, నభావ్యంబయ్యె; నీ యుగ్ర వే**
**ళ రమింపంగ నిషిద్ధకర్మ మగు; నేలా ధర్మమున్ వీడఁగన్.** **461**

**ప్రతి :** తరుణీ!= ఓ యౌవనవతీ!; (దితి) ఒక్క ముహూర్తము= పన్నెండు క్షణాలకాలం; ఉండుము= వేచి ఉండు; ఇది= ఈ మూర్తం; సంధ్యాకాలము= సంజవేళ; అరయన్= ఆలోచిస్తే; ఈ+కాలమందు= ఈ సమయంలో; కామ+అరాతి= మన్మథునికి శత్రువైన పరమేశ్వరుడు; భూతగణ+ఆవృతుండు+అగుచున్= ప్రమథగణంచే కూడినవాడై; లీలన్= విలాసంగా; వృష+ఈశ్వరయానంబునన్= గొప్ప ఎద్దునెక్కి; సంచరించుటన్= సంచరించుట వల్ల; అభావ్యంబు+అయ్యెన్= అనుచితం అయినది; ఈ+ఉగ్రవేళన్= ఈ భయంకరమైన కాలంలో; రమింపంగన్= సంగమించుట; నిషిద్ధకర్మము+అగున్= తగనిచర్య అవుతుంది; ధర్మమున్= ధర్మాన్ని; వీడఁగన్+ఏలా= వదలట మెందుకు? (ధర్మ పద్ధతిని వ్యతిరేకించరాదని తాత్పర్యం).

**తా :** "జవ్వనీ! కొన్ని క్షణాలు ఓపికపట్టు. ఇది సంజవేళ. ఈ సమయంలో మన్మథుని మట్టుపెట్టిన పరమేశ్వరుడు ప్రమథులు వెంటరాగా ఎద్దునెక్కి ఇక్కడ సంచరిస్తాడు. ఇది తగిన సమయం కాదు. భయంకరమైన సమయంలో కామక్రీడ నిషిద్ధం. మనం ధర్మాన్ని అతిక్రమించటం ఎందుకు?

**మ. అరవిందానన! వీఁడె నీ మఱఁది; లీలాటోపరుద్రక్షమా**
**చర ఝుంఝానిలధూతపాంసు పటలచ్ఛన్నుండు, ధూమ్రైక దు**
**ర్భరవిద్యోతితకీర్ణ భీషణజటాబద్ధుండు, భస్మావలి**
**ప్తరుచిస్ఫారసువర్ణవర్ణుఁడగుచున్ భాసిల్లు నత్యుగ్రుఁడై.** **462**

**ప్రతి :** అరవింద+ఆనన= పద్మంవంటి మొగముగలదానా! దితీ!; వీఁడు+ఎ= ఈ కన్పించే వ్యక్తియే (రుద్రుడు); నీ మఱఁది= నీకు (సోదరియైన సతీదేవిమగడు); లీలా+ఆటోప= మెలికలు తిరిగే వేగిర పాటుగల; రుద్రక్షమా= శ్మశానభూమియందు; చర= వీచుచున్న; ఝుంఝా+అనిల= సుడిగాలిచేత; ధూత= ఎగురగొట్టబడిన; పాంశుపటల= దుమ్ముధూళిరేణువులచేత; ఛన్నుండు= కప్పబడినవాడు; ధూమ్ర+ఏక= నలుపుమించిన ఎరుపువన్నెముఖ్యంగా ఉన్నట్టి; దుర్+భర= సహింపశక్యంగాని; విద్యోతిత= విశేషంగా వెలుగుతున్న; కీర్ణ= చెదిరిన; భీషణ= భయంకరమైన; జటాబద్ధుండు= జడలు తాల్చినవాడు; భస్మ+అవలిప్త= పూయబడిన బూడిదయొక్క; రుచి= కాంతిచేత; స్ఫార= అధికమైన; సువర్ణవర్ణుఁడు= బంగారువన్నెగలవాడు; అగుచున్= ఐ; అతి+ఉగ్రుఁడు+ఐ= మిక్కిలి భయంకరుడై; భాసిల్లున్= ప్రకాశించుచున్నాడు.

**తా :** పద్మముఖీ! అదిగో అతడే నీ మరది రుద్రుడు. శ్మశానవాటికలో వీచే సుడిగాలికి లేచిన దుమ్ము ఆయన ఒంటిని కప్పేసింది. నలుపు ఎరుపు కలిసిన రంగుతో విశేషంగా వెలుగుతూ చెదరి ఉన్న జడలతో, నిలువెల్ల పులుముకొన్న బూడిదవల్ల బంగారుకాంతితో భయంకరుడుగా ప్రకాశిస్తున్నాడు.

**క. అనలసుధాకరరవి లో, చనముల వికసింపఁజేసి సమధికరోషం**
**బునఁజూచుచున్న వాఁడదె, వనితా! బంధుత్వ మరయ వలవదె సుమ్మీ!** **463**

**ప్రతి :** వనితా= ఓ కాంతా!; అనల= అగ్ని; సుధాకర= అమృతకిరణుడైన చంద్రుడు; రవి= సూర్యుడు–ఈ ముగ్గురి; లోచనములన్= కన్నులను; వికసింపన్+చేసి= వెల్గేటట్లుకావించి; అదె= అదుగో; సమ్+అధికరోషంబునన్= మిక్కిలి కోపావేశంతో; చూచుచున్+ఉన్నవాఁడు= గమనిస్తున్నాడు; బంధుత్వము= చుట్టరికాన్ని; అరయన్ వలవదె= చూడవద్దా?

**తా :** ఓ కాంతా! తన సూర్యచంద్రాగ్ని నేత్రాలను వికసింపచేసి, మిక్కిలి కోపావేశంతో చూస్తున్నాడు. ఇప్పుడు మన బంధుత్వాన్ని గూర్చి ఆలోచించవద్దా?

**క. అతనికిఁ దలపోయ హితా, హితులును సన్మాన్యులును విహీనులు నతి గ**
**ర్హితులును లే; రీశుఁడు సమ, మతియును నిఖిలైకభూతమయుఁడై యుంటన్. 464**

**ప్రతి :** ఈశుఁడు= పరమశివుడు; సమమతియును= అందరి యెడ భేదబుద్ధిలేక ఒకే భావం కలవాడును; నిఖిల= సమస్తమైన; ఏక= ముఖ్యమైన; భూతమయుఁడు= మట్టి, నీరు, అగ్గి, గాలి, ఆకాశమనే అయిదు భూతాలు స్వరూపంగా కలవాడును; ఐ+ఉంటన్= అయినందు వల్ల; తలపోయన్= ఆలోచిస్తే; అతనికిన్= ఆ స్వామికి; హిత+అహితులును= మిత్రులు గాని శత్రువులు గాని; సత్+మాన్యులును= గౌరవింప తగినవారు గాని; విహీనులు= తిరస్కరింపతగినవారు గాని; అతిగర్హితులు= మిక్కిలి నిందింపదగినవారుగాని; లేరు= లేనేలేరు.

**తా :** ఆ పరమశివుడు సమదృష్టిగలవాడు. పంచభూత స్వరూపుడు. ఆయనకు శత్రువులు లేరు. మిత్రులు లేరు. పూజ్యులుగాని తిరస్కరింప దగినవారు గాని లేరు.

**క. కావున మద్భ్రాత భవ, ద్దేవరుఁడని తరుణి! నీ మదిం జూడకు; మా**
**దేవాదిదేవుఁ ద్రిజగ, త్పావను నిఖిలైకనేత భగవంతు హరున్. 465**

**ప్రతి :** కావునన్= అందువల్ల; తరుణి= ఓ జవ్వనీ!; ఆ దేవ+ఆదిదేవున్= ఆ దేవతలందరికి మొదటివాడైన దేవుని; త్రిజగత్+పావనున్= ముల్లోకాలను పవిత్రం చేయువానిని; నిఖిల+ఏకనేతన్= సమస్త విశ్వానికి ప్రభువైనవానిని; భగవంతున్= ఐశ్వర్యం గలవానిని; మత్+భ్రాతన్= నాకు సోదరుడైనవానిని (అగు); హరున్= పరమశివుణ్ణి; భవత్= నీయొక్క; దేవరుడు+అని= మరదియే కదా అని; నీ మదిన్= నీ మనస్సులో; చూడకుము= చులకనగా భావించవద్దు.

**తా :** "ఓ తరుణీ! ఆయన దేవతల్లో మూలపురుషుడు. ముల్లోకాలను పవిత్రం చేయగల మహాత్ముడు. విశ్వానికే ప్రభువు. సంపదలకు నెలవు. నా సోదరుడు. అంతటి మహిమలుగల ఆ ఈశ్వరుణ్ణి 'నా మరదే గదా' అని చూడకు, అని కశ్యపుడు దితిని హెచ్చరించాడు.

**వ. ఏమును సత్పురుషులైన విజ్ఞానవంతులును భుక్తభోగంబై దూరతోన్యస్తంబైన పుష్పమాలికయుంబోలె న మ్మహాత్ముని చరణారవిందవందనాభిలాషిణియైన యవిద్యాదేవి ననుసరించి వర్తింతుము. అదియునుంగాక. 466**

**ప్రతి :** ఏమును= మేముకూడ (మారీచాదులు); సత్+పురుషులు+ఐన= ఉత్తమపురుషులైన; విజ్ఞానవంతులును= విశిష్ట జ్ఞానంతో కూడుకొన్నవారు; భుక్తభోగంబు+ఐ= అనుభవింపబడిన సుఖముగలదై; దూరతః+న్యస్తంబు+ఐన= దూరంగా విసరివేయబడ్డ; పుష్పమాలికయున్+పోలెన్= పూలమాలవలె; ఆ+మహాత్ముని= ఆ గొప్పహృదయం గలవాని; చరణ+అరవింద= పాదపద్మాలు; వందన+అభిలాషిణి+ఐన= నమస్కారమందు కోరికగలదైన; అవిద్యాదేవిన్= మాయాదేవిని; అనుసరించి= ఆసరగా గొని; వర్తింతుము= నడుచుకొంటాము; అదియునున్+కాక= అంతేగాదు.

**తా :** నా వంటివారూ, మరియు మహానుభావులైన విజ్ఞానవంతులు – మెడలో వేసుకొని తీసి, దూరంగా విసిరివేయబడిన పూలహారంవంటి మాయాదేవిని అనుసరించి జీవిస్తాం. ఆ మాయకూడా ఆ పరమేశ్వరుని పాదసేవకు తహతహలాడుతూ ఉంటుంది.

సీ. ఎవ్వని కరుణ బ్రహ్మేంద్రాది దిక్పాలవరు లాత్మపదవైభవములఁ దనరి
రెవ్వని యాజ్ఞ వహించి వర్తించును విశ్వనేత్రి యగు నవిద్య యెపుడు
నెవ్వని మహిమంబు లిట్టి వట్టివి యని తర్కింపలేవు వేదంబు లయిన
నెవ్వని సేవింతు రెల్లవారును సమానాధికరహితుఁడై యలరు నెవ్వఁ

తే. డట్టి దేవునిఁ ద్రిపురసంహారకరుని, నస్థిమాలాధరుండు భిక్షాశనుండు
భూతిలిప్తాంగుఁడుగ్రపరేతభూమి, వాసుఁడని హాస్య మొనరించువారు మఱియు. **467**

**ప్రతి :** బ్రహ్మ+ఇంద్ర+ఆది= బ్రహ్మదేవుడు, ఇంద్రుడు మొదలైన; దిక్+పాలవరులు= దిక్కుల నేలే దేవతలు; ఎవ్వనికరుణన్= ఏ మహాత్ముని దయచే; ఆత్మపదవైభవములన్= తమ పదవులవైభవాలలో; తనరిరి= ఒప్పారిరో; విశ్వనేత్రి+అగు= విశ్వమంతటికి వ్యాపించిన చూపుగల; అవిద్య= మాయ; ఎపుడు= ఎల్లప్పుడు; ఎవ్వని+ఆజ్ఞ= ఏ దేవుని ఆనతిని; వహించి= తాల్చి; వర్తించును= మసలుతుందో; వేదంబులు+అయినన్= నాల్గువేదాలు కూడ; ఎవ్వనిమహిమంబులు= ఏ దేవదేవుని విభూతులు; ఇట్టివి+అట్టివి+అని= ఇలాంటివి అలాంటివని; తర్కింపలేవు= విచారించజాలవో; ఎల్లవారు= అందరూ; ఎవ్వనిన్= ఏ స్వామిని; సేవింతురు= కొలుస్తారో; ఎవ్వఁడు= ఏ మహామహుడు; సమాన+అధిక రహితుఁడు+ఐ= (తనతో) సమానత్వం, (తనకంటె) ఆధిక్యం లేనివాడై; అలరున్= ఒప్పారునో; అట్టిదేవునిన్= ఆలాంటి భగవంతుని– శివుణ్ణి; త్రిపురసంహారకరునిన్=మూడు పురాలను ధ్వంసం చేసినవాణ్ణి; అస్థిమాలాధరుండు= ఎముకలపేరు తాల్చేవాడు; భిక్షా+అశనుండు= భిక్షాన్నం తినేవాడు; భూతిలిప్త+అంగుఁడు= బూడిదచే అంటిన దేహంగలవాడు; ఉగ్ర= భయంకరమైన; పరేతభూమివాసుఁడు= శ్మశానం నివాసంగా కలవాడు; అని= అంటూ; హాస్యము= ఎగతాళి; ఒనరించువారు= చేసేవారు (ఉన్నారు); మరియును= అంతే గాదు

**తా :** బ్రహ్మ, ఇంద్రుడు మరియు తక్కిన దిక్పాలురు తమ పదవుల్లో స్థిరంగా ఉండటానికి ఆ పరమేశ్వరుని దయే మూలకారణం. విశ్వమంతటిని ఒక కంట చూచే మాయ ఆయన ఆజ్ఞకు లోబడి ఉంటుంది. ఆయన మహిమలను చతుర్వేదాలు సైతం వివరించలేవు. ఈ సమస్తలోకాలు ఆయన్ని సేవిస్తున్నాయి. ఆయనతో సమానమైనది, సమానమైనవాడు, ఆయనకంటె అధికమైనది, అధికమైనవాడు లేడు. ఆలాంటి త్రిపురసంహారకుణ్ణి దేవ దేవుణ్ణి లోకులు ఎముకలపేరు ధరిస్తాడని, భిక్షాటన చేసి బ్రతుకుతాడని బూడిద అంటుకుంటాడని శ్మశానంలో నివసిస్తాడని గేలి చేస్తారు.

క. ధర శునకభోగ్యమును నిహ, పరదూరము నైన తను వుపాదేయముగా
నెఱి నమ్మి వస్త్రమాల్యా, భరణంబు లలంకరించు పామరజనులున్. **468**

**ప్రతి :** పామరజనులున్= అజ్ఞానులు; ధరన్= భూమిపై; శునకభోగ్యమునున్= కుక్కలుతినదగింది; ఇహపరదూరమును+ఐన= ఈ లోకానికి, పరలోకానికి కూడ దూరమైన; తనువు= శరీరం; ఉపాదేయముగాన్= ఉత్తమమైనదిగా; నెఱిన్= బాగా; నమ్మి= విశ్వసించి; వస్త్ర= బట్టలు; మాల్య= దండలు; ఆభరణంబులు= నగలు; ఈ మూడింటిని అలంకరించున్= ధరించును...

**తా :** లోకంలో అవివేకులు కుక్కలు తినదగింది, మరియు ఇహపరాలకు దూరమైన శరీరం ఉత్తమమైనదని అనుకొంటున్నారు. దానికి దుస్తులు, మాలలు, ఆభరణాలు అలంకరిస్తున్నారు.

**క. ఘననిర్భాగ్యులుగా మదిఁ, గను మని యీ రీతిఁ బ్రియకుఁ గశ్యపుఁడెఱిఁగిం**
**చిన దితి గ్రమ్మఱఁ బలికెను, మనసిజసాయకవిభిన్నమానస యగుచున్. 469**

**ప్రతి :** (పామరజనుల్ని) ఘననిర్భాగ్యులుగాన్= గొప్పదౌర్భాగ్యులైనవారినిగా; కనుము= చూడుము; అని; ఈ రీతిన్= ఈ విధంగా; కశ్యపుఁడు= మారీచుడు; ప్రియకున్= తన భార్యకు; ఎఱింగించినన్= తెల్పగా; దితి; క్రమ్మఱన్= మరల; మనసిజ= మనస్సులో పుట్టే మన్మథుని యొక్క; సాయక= బాణములచే; విభిన్న= చెదరగొట్టబడిన; మానస+అగుచున్= మనస్సు గలదై (దితి); పలికెను= (భర్తతో) అన్నది.

**తా :** "ఓ మానినీ! శరీరమే ఆత్మయని దానికి పైపై మెరుగులు దిద్దుకొనే వారందరు గొప్ప దౌర్భాగ్యులని తెలిసికో" అని కశ్యపుడు దితితో అన్నాడు. కాని ఆమె మనస్సులో మదనబాణాలు గాఢంగా నాటుకొన్నదై భర్తతో ఇలా అంది.

**క. మునుకొని లజ్జావనత వ, దనయై ప్రాణేశు కొంగుఁదాలిమి దూలం**
**బెనఁగొనియె వారకామిని, యనువున వినిషిద్ధకర్మమందభిముఖియై. 470**

**ప్రతి :** (దితి) మునుకొని= ముందుపడి; లజ్జా= సిగ్గుచే; అవనతవదన+ఐ= వంచినతలగలదై; వారకామిని+అనువునన్= సానిదానివలె; వినిషిద్ధకర్మమందున్= (ఆ సమయమందు) మిక్కిలిగా నిషేధింపబడిన (రతి) కర్మయందు; అభిముఖి+ఐ= మరులుగొన్నదై; తాలిమి+తూలన్= ఓర్పు నశించగా; ప్రాణ+ఈశున్= భర్తను; పెన+గొనియెన్= గట్టిగా కౌగిలించుకొన్నది.

**తా :** భర్త తానెంతగా వారించినా వినక దితి సిగ్గుతో తలవాల్చి, ఆ సంధ్యాసమయాన నిషిద్ధమైన రతి కర్మయందే ఆసక్తి గలదై వారవనితలాగా మగణ్ణి గాఢంగా కౌగిలించుకొంది.

**వ. ఇట్లు చేసిన భార్యానిర్బంధంబునకుం దొలంగ నేరక యీశ్వరునకు నమస్కారం బొనరించి యేకాంతంబున నిజకాంతా సంగమంబును జేసి విరజంబును సనాతనంబునునైన బ్రహ్మగాయత్రి జపియించె నంత. 471**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; చేసిన= కావించిన; భార్యా నిర్బంధమునకున్= భార్య ఒత్తిడికి; తొలంగన్+నేరక= తప్పించుకోజాలక; ఈశ్వరునకున్= పరమశివునికి; నమస్కారంబు+ఒనరించి= నమస్కరించి; ఏకాంతంబునన్= రహస్యంగా; నిజకాంతా= తన భార్యతోడి; సంగమంబును= కలయికను; చేసి= కావించి; అంతన్= ఆ తర్వాత (కామక్రీడ ముగిసిన తర్వాత); విరజంబును= రజోగుణము లేనిది (సాత్త్వికమైనది); సనాతనంబునున్= శాశ్వతమైనది; ఐన= అయినటువంటి; బ్రహ్మగాయత్రిన్= వైదికమైన గాయత్రీమంత్రాన్ని; జపియించెన్= పఠించాడు.

**తా :** అలా దితి చేసిన ఒత్తిడికి తలొగ్గి కశ్యపమహర్షి పరమేశ్వరునికి దండంపెట్టి, రహస్యంగా ఆమెతో సంగమించాడు. తర్వాత సత్త్వగుణోపేతమూ, సనాతనమూ అయిన గాయత్రీ మంత్రాన్ని జపించాడు.

**క. దితియును నిషిద్ధకర్మ, స్థితికై మదిలోన సిగ్గు చిట్టాడఁగ నా**
**నతవదన యగుచు నా పశు, పతివలన భయంబు గల్గి పరమప్రీతిన్. 472**

**ప్రతి :** దితియును= దితిదేవి కూడ; నిషిద్ధకర్మస్థితికై= అనుచితమైన రతిక్రియ జరిగినందుకు; మదిలోనన్= మనస్సులో; సిగ్గు= బిడియం; చిట్టాడఁగన్= సోకగా లేక ప్రసరింపగా; ఆనతవదన+అగుచున్= వంచిన తలగలదై; ఆ పశుపతివలనన్= ఆ పరమశివునివల్ల; భయంబు+కల్గి= భీతి చెంది; పరమప్రీతిన్= మిక్కిలి ప్రేమభావంతో...

**తా :** చేయకూడని పని చేసినందుకు సిగ్గుపడుతూ తల దించుకుని పరమేశ్వరుని వల్ల ఏ ఉపద్రవం కల్గుతుందో అని భయపడుతూ ప్రియమార - ఇలా అంది.

**వ. కశ్యపుం గనుంగొని యిట్లనియె; సమస్త భూతపతియైన పరమేశ్వరుండు నా చేసిన యపరాధంబు సహించి మద్గర్భపరిపాలనంబు సేయుంగాక! రుద్రుండును మహాత్ముండును స్వయంప్రకాశుండును నలంఘ్యుండును సకామజన ఫల ప్రాపకుండును నిష్కామజన మోక్షప్రదుండును న్యస్తదండుండును ధృతదండుండును దుష్ట శిక్షకుండును బరమాత్ముండును జగదంతర్యామియు నిర్గుణుండును నిష్కాముండును భక్తసులభుండును భగవంతుండును నగు న ప్పరమేశ్వరునకు నమస్కరించెద. మఱియు షడ్గుణైశ్వర్య సంపన్నుండును జగద్భర్తయు మహానుగ్రహశీలుండును నిర్ణయ పరిపాల్య వధూరక్షకుండును సతీదేవీపతియు నైన యా సర్వేశ్వరుండు నన్ను రక్షించుంగాత మని సన్నుతించి. 473**

**ప్రతి :** (దితి) కశ్యపున్+కనుంగొని= మారీచుని (మరీచిపుత్రుడు) చూచి; ఇట్లు+అనియెన్= ఈ క్రింది విధంగా చెప్పింది; సమస్తభూతపతి+ఐన= చరాచరప్రాణి కోటికి నాథుడైన; పరమ+ఈశ్వరుండు= పరమశివుడు; నా+చేసిన= నేను చేసినట్టి; అపరాధంబు= తప్పిదాన్ని; సహించి= మన్నించి; మత్+గర్భ= నా గర్భముయొక్క; పరిపాలనంబు= రక్షణ లేక కాపాడుట; చేయున్+గాక= తప్పక చేయును సుమా!; రుద్రుండును= దుఃఖాన్ని నివారించేవాడును; మహా+ఆత్ముండును= గొప్పహృదయంగలవాడును; స్వయంప్రకాశుండును= తనంతతాను వెలుగొందేవాడును; అలంఘ్యుండును= దాటుటకు సాధ్యపడనివాడును (ఆయన్ని మించలేమని అర్థం); సకామజన= కోర్కెలుకోరే ప్రజలకు; (సగుణారాధకులకు); ఫలప్రాపకుండును= ఫలితములిచ్చేవాడును; నిస్+కామజన= ఏకోర్కెలు కోరని ప్రజలకు; మోక్షప్రదుండును= పరమపదవిని ఇచ్చేవాడును (నిర్గుణారాధకులకు); న్యస్తదండుండును= వదలినదండన గలవాడును; (శిక్షించనివాడు), ధృతదండుండును= శిక్షాదండమునెత్తినవాడును; (మాన్యుల్ని దండించడు, దుర్మార్గుల్ని దండిస్తాడని తాత్పర్యం); దుష్టశిక్షకుండును= దుష్టుల్ని శిక్షించేవాడును; పరమ+ఆత్ముండును= మహాత్ముడును; జగత్+అంతస్+యామియున్= జగాలలోపలా వ్యాపించినవాడు; నిర్గుణుండును= సత్త్వరజస్తమోగుణాలు లేనివాడును (వీటికి అతీతుడు); నిస్+కాముండును= ఏ కోర్కెలు లేనివాడును; భక్తసులభుండును= భక్తులకు సులభంగా లభించేవాడును; భగవంతుండును= సర్వశుభాల నొసంగేవాడును; అగు= అయిన; ఆ+పరమేశ్వరునకున్= ఆ దేవాదిదేవుడైన శివునకు; నమస్కరించెదన్= మోకరిల్లుతాను; మఱియున్= అంతేగాదు; షట్+గుణ= ఆరుగుణాలనెడి; (సమగ్రమగు ఐశ్వర్యం, వీర్యం, యశస్సు, సంపద, జ్ఞానం, విజ్ఞానం); ఐశ్వర్య= సంపదలచే; సంపన్నుండును= కూడినవాడును; జగత్+భర్తయు= జగత్తును భరించేవాడును; మహా+అనుగ్రహ= గొప్పగా కాపాడుటయే; శీలుండును= నడవడికగాకలవాడును; నిర్ణయపరిపాల్య= తన ఆదేశాలను పాటించే; వధూ రక్షకుండును= స్త్రీలను కాపాడేవాడును; సతీదేవిపతియున్+ఐన= సతీదేవికి భర్తయైనవాడును అగు; ఆ సర్వ+ఈశ్వరుండు= విశ్వేశ్వరుడు (శివుడు); నన్నున్= నన్ను (దితిని); రక్షించున్+కాతన్= కాపాడుగాక; అని= అంటూ; సన్నుతించి= కొనియాడి...

**తా :** దితి కశ్యపునితో ఈ విధంగా అంది.

"స్వామీ! చరాచరప్రాణికోటికి ప్రభువు పరమేశ్వరుడు. ఆయన నేను చేసిన తప్పును మన్నించి, నా గర్భాన్ని కాపాడుగాక. ఆయన ప్రాణుల దుఃఖాన్ని నివారించేవాడు. ఆయన మహాత్ముడు. తనంతతాను వెలిగేవాడు. ఆయన ఆజ్ఞ దాటరానిది. సగుణారాధకులకు కోర్కెల్ని పండిస్తాడు. నిర్గుణోపాసకులకు మోక్షమిస్తాడు. అవసరమనుకుంటే త్రిశూల మెత్తుతాడు.

అవసరం లేదంటే శూలాన్ని ఆవలపెట్టుతాడు. దుర్మార్గుల్ని శిక్షిస్తాడు. ఆయన పరమాత్ముడు. ఆయన సర్వాంతర్యామి. త్రిగుణాతీతుడు. ఏ కోర్కెలు లేనివాడు. భక్తులపాలిటి కొంగుబంగారం. భగవంతుడు – అన్ని శుభగుణాలు గల ఆ దేవునికి నమస్కరిస్తున్నా. ఆయన ఆరు సంపదలు గలవాడు. లోకాలకు ప్రభువు. దయాదాక్షిణ్యాలు గలవాడు. తన ఆదేశాలను పాటించే స్త్రీలను కాపాడేవాడు. పైపెచ్చు మాసోదరి సతీదేవికి మగడు. ఆయన నన్ను రక్షించాలి అని ఆమె పరమశివుని ప్రార్థించింది.

**క. అర్భకులు లేని దగుటను, గర్భము నిజనాథువలనఁ గమలానన కా**
**విర్భూతమైనఁ గర్మ వి, నిర్భరపరితోష మాత్మ నెలకొని యుండెన్. 474**

**ప్రతి :** అర్భకులు= పిల్లలు (సంతానం); లేనిది+అగుటను= లేనిది కాబట్టి; కమల+ఆననకున్= కమలమువంటి ముఖముగల దితికి; గర్భము= కడుపు; నిజనాథువలనన్= తన భర్తవల్ల (కశ్యపునివలన); ఆవిర్భూతము+ఐనన్= కలుగగా; కర్మ= సంతానకాంక్షచే నైన కార్యమువల్ల; వినిర్భర= అతిశయమైన; పరితోషము= సంతోషం; ఆత్మన్= ఎదయందు; నెలకొని+ఉండెన్= పదిలమై ఉండింది.

**తా :** ఇంతదాక దితికి సంతానం లేదు. ఇప్పుడు తన భర్తవల్ల కడుపు పండింది. ఆమెకు కల్గిన సంతోషానికి మేరయే లేదు.

**వ. అంతఁగశ్యపుండు దత్కాలసముచితసంధ్యావందనంబులు దీర్చి. 475**

**ప్రతి :** అంతన్= (సంగమం జరిగిన) తర్వాత; కశ్యపుండు= కశ్యపమహర్షి; తద్+కాల= ఆ సమయానికి; సమ్+ఉచిత= బాగా అనువైన; సంధ్యావందనంబులు= సాయంకాలం చేసే వందనాది విధులు; తీర్చి= కావించి...

**తా :** కశ్యపుడు వెంటనే ఆ నాటి సాయంకాలం యథావిధిగా సంధ్యా వందనం నిర్వహించినాడు.

**క. ఆ చెలికి గర్భచిహ్నము, లేచినఁబరితోష మాత్మ నేపారక మా**
**రీచుండు నిజతలోదరిఁ, జూచి యకర్మమున కాత్మ స్రుక్కుచుఁబలికెన్. 476**

**ప్రతి :** మారీచుండు= మరీచిమహర్షి పుత్రుడైన కశ్యపుడు; ఆ చెలికిన్= తన ప్రియురాలైన దితికి; గర్భచిహ్నములు= గర్భాన్ని ధరించిన పొలకువలు; ఏచినన్= పొడసూపగా; పరితోషము= సంతోషం; ఆత్మన్= తన యెదలో; ఏపు+ఆరక= అతిశయింపకపోగా; నిజ= తన; తలోదరిన్= భార్యను (దితిని); చూచి= కాంచి; అకర్మమునకున్= అకాలంలో జరిగినపనికి (సాయంసంధ్యాసంగమానికి); ఆత్మన్= మనస్సులో; స్రుక్కుచున్= బాధపడుతూ; పలికెన్= ఇట్లన్నాడు.

**తా :** తన ఇల్లాలు గర్భవతి అయ్యిందని మారీచుడు సంతోషపడలేదు. పైపెచ్చు అకాలరతికార్యానికి నొచ్చుకొని ఆమెతో ఇట్లన్నాడు.

**మ. సతి! నీ వే గతి నింద కోడక మనోజాతేక్షుకోదండ ని**
**ర్గతనారాచపరంపరాహతవిశీర్ణస్వాంతవై పాపసం**
**గతి లజ్జాభయధర్మముల్ విడిచి దుష్కాలంబునందే రమిం**
**చితి బల్మిన్ వెలయాలికైవడిని దుశ్శీలక్రియాలోలతన్. 477**

**ప్రతి :** సతి= ఓ పతివ్రతా! (సాభిప్రాయసంబోధన); నీవు= (దితియనుట); ఏ గతిన్= ఏ తీరుగానైనా; నిందకున్= మచ్చకు; ఓడక= శంకించకుండా; మనస్+జాత= మనస్సులోనే పుట్టే మన్మథుని; ఇక్షుకోదండ= చెరకువింటినుండి; నిర్గత= వెడలినట్టి; నారాచ, పరంపరా+ఆహత= బాణాలగుంపుచే కొట్టబడినందున; విశీర్ణస్వాంతవు+ఐ= చెదరిన మనస్సుగలదానివై; పాపసంగతిన్= దుష్టసాంగత్యమందు; లజ్జాభయధర్మముల్= సిగ్గను, భీతిని, ధర్మాన్ని (మూడింటిని); విడిచి= వదలి; దుస్+శీలక్రియాలోలతన్= అనుచితకార్యమందు ఆసక్తితో; బల్మిన్= బలవంతంగా; వెలయాలికైవడిని= వేశ్యవలె; దుస్+కాలంబునందు+ఏ= చెడ్డ సమయంలోనే (సాయంవేళ); రమించితి= భోగించావు.

**తా :** ఓ మహాపతివ్రతా! దితీ! ఇది అనుచితకార్యమనే జంకు నీ కేమాత్రం లేదు. మదనుడు చెరకు విల్లెక్కుపెట్టి వదలిన సమ్మోహనాస్త్రాలకు నీ మనస్సు చెదిరింది. విచక్షణ కోల్పోయి సిగ్గువిడిచి, నిర్భయంగా ధర్మవిరుద్ధమైన పాపక్రీడకు వేళకాని వేళ ఒక వేశ్యలాగా పాల్పడ్డావు. దుశ్చర్యయందాసక్తి గల్గి సంగమించావు. (ఇది నీ దౌర్భాగ్యమని నింద)

**వ. అట్లగుటం జేసి. 478**

**ప్రతి :** అట్లు+అగుటన్+చేసి= ఆ విధంగా జరిగినందువల్ల

**తా :** అలా జరిగినందువల్ల.

**క. సతి! విను భూతగణ ప్రే, రితులై రుద్రానుచరుల పృథుశక్తిసమ**
**న్వితు లుగ్రకర్ము లతిశౌ, ర్యతములు భద్రానుభద్రు లను నామములన్. 479**

**ప్రతి :** సతి= ఓ సాధ్వీ; విను= ఆలకించు; రుద్ర+అనుచరుల= రుద్రుని భృత్యుల; పృథుశక్తి= బలమైనశక్తితో; సమన్వితులు= కూడినవారును; ఉగ్రకర్ములు= భయంకరమైన పనులుచేసేవారు; అతిశౌర్యతములు= మిక్కిలి గొప్ప పరాక్రమంగలవారు; (అయిన) భద్ర+అనుభద్రులు+అను= భద్రుడు, అనుభద్రుడు అనే; నామములన్= పేర్లతో; భూతగణప్రేరితులు+ఐ= పిశాచగణంచేత ఉసికొల్పబడ్డవారై...

**తా :** ఓ సాధ్వీ! ప్రమథులశక్తితో కూడుకొన్నవారు, భయంకరమైన పనులుచేసేవారు, మహాపరాక్రమవంతులు, మరియు పిశాచగణంచేత ప్రేరింపబడ్డవారు 'భద్రుడు–అనుభద్రుడు' అనే పేర్లుగల ఇద్దరు పుత్రులు కలుగుతారని అన్నాడు.

**క. పరఁగిన దర్పోద్ధతు లి, ద్దఱు కొడుకులు నీకుఁ బుట్టి ధరణికి వ్రేఁగై**
**నిరతము బుధజనపీడా, పరులై వర్తింతు రాత్మబలగర్వమునన్. 480**

**ప్రతి :** పరఁగిన= (భద్రానుభద్రులనే పేర్లతో) ప్రశస్తులైనట్టి; దర్ప+ఉద్ధతులు= పొగరుబోతులు; ఇద్దఱు కొడుకులు; నీకున్= నీకు (దితికి); పుట్టి= జన్మించి; ధరణికిన్= భూమికి; వ్రేఁగు+ఐ= బరువై; నిరతము= ఎల్లప్పుడు; ఆత్మబలగర్వమునన్= తమదైన బలంవల్ల కల్గిన పొగరుతో; బుధజనపీడాపరులు+ఐ= ఉత్తముల్ని బాధించుటయందు ఆసక్తిగలవారై; వర్తింతురు= సంచరిస్తారు.

**తా :** భద్రుడు, అనుభద్రుడనే వారిద్దరు నీకు కొడుకులుగా పుడతారు. వారు పొగరుబోతులై మంచివారిని ఎల్లప్పుడూ పీడిస్తారు. భూమికి భారంగా ఉంటారు.

**తే. అట్టి దుష్కర్ములకును మహాత్ము లలిగి, విశ్వవిదుఁడైన హరికిని విన్నవింప**
**నతఁడు కోపించి హరి కులిశాయుధమున, గిరుల నఱకినగతి వారి ధరణిఁ గూల్చు. 481**

**ప్రతి :** మహా+ఆత్ములు= గొప్పమనసుగల మహానుభావులు; అట్టిదుస్+కర్ములకును= అలాంటి గొప్పదుర్మార్గులకు; అలిగి= కోపించి; విశ్వవిదుఁడు+ఐన= సమస్తం తెలిసినవాడైన; హరికిని= విష్ణువుకు; విన్నవింపన్= మొరపెట్టుకోగా; అతఁడు= ఆ శ్రీహరి; కోపించి= మండిపడి; కులిశ+ఆయుధమునన్= వజ్రాయుధంచేత; హరి= ఇంద్రుడు; గిరులన్= కొండల్ని; నఱకినగతిన్= ఖండించినట్లు; వారిన్= ఆ భద్రానుభద్రులిద్దరిని; ధరణిన్+కూల్చున్= నేలపై రాలుస్తాడు.

**తా :** ఆ ఇర్వురి దుశ్చర్యలకు తాళలేక మహాత్ములు అన్నీ తెలిసిన శ్రీమహావిష్ణువుకు మొర పెట్టుకొంటారు. ఆ స్వామి వజ్రాయుధంతో ఇంద్రుడు కొండలరెక్కల్ని ముక్కలు చేసినట్లు వారిని నేల కూలుస్తాడు.

**క. అని కశ్యపుఁ డెఱిఁగించిన, విని దితి భయమంది చాల విహ్వలమతియై**
**తన హృదయేశు ముఖాబ్జముఁ, గనుఁగొని యిట్లనియె విగతకౌతుక యగుచున్. 482**

**ప్రతి :** అని= పైన చెప్పినట్లు; కశ్యపుఁడు= మారీచుడు; ఎఱిఁగించినన్= తెల్పగా; దితి= భార్యదితి; విని= ఆలకించి; భయము+అంది= భయపడి; చాల= మిక్కిలి; విహ్వలమతి+ఐ= చలించిన బుద్ధిగలదై; తన; హృదయ+ఈశు= మగని; ముఖ+అబ్జమున్= మోముదామరను; కనుఁగొని= చూచి; విగతకౌతుక+అగుచున్= గతించిన సంతోషం గలదై; ఇట్లు+అనియెన్= ఇలా అంది...

**తా :** శ్రీహరి నీ ఇర్వురి కుమారుల్ని చంపేస్తాడని భర్త చెప్పగానే దితి భయంతో చలించి పోయింది. మనస్సులో దిగులు చెందింది. భర్తమొగం చూచి ఇలా అంది.

**చ. ధర సుజనాపరాధులగు తామసచిత్తుల కెందు నాయువున్**
**సిరియు నశించిపోవు; మృతి సేకుఱు శత్రులచేత; నింతయౌ**
**నరయఁగ నిక్కువంబు భవదాత్మజు లార్యుల కెగ్గుసేయ భూ**
**సురుల క్రుధాగ్నిపాల్పడక శోభనమౌ హరిచేతి పంచతన్. 483**

**ప్రతి :** ధరన్= భూమిపై; సుజన+అపరాధులు+అగు= మంచివారికి చేటు చేసేవారైన; తామసచిత్తులకున్= దుష్టబుద్ధి కలవారికి; ఎందున్= ఎక్కడైననూ; ఆయువున్= ప్రాణము; సిరియున్= సంపదయును; నశించిపోవున్= అడుగంటుతుంది; శత్రులచేతన్= వైరులచేత; మృతి= చావు; చేకుఱున్= కల్గుతుంది; అరయఁగన్= ఆలోచిస్తే; నిక్కువంబు= నిజం; ఇంత+ఔన్= ఇదే అవుతుంది; భవత్+ఆత్మజులు= నీ కుమారులు; ఆర్యులకున్= గొప్పవారికి; ఎగ్గు+చేయన్= కీడు చేయగా; భూసురుల= భూదేవులైనబ్రాహ్మణుల; క్రుధా+అగ్ని పాల్+పడక= కోపాగ్నికి పాలు కాకుండ; హరిచేతి పంచతన్= విష్ణువుచేతి చావుచే; శోభనము+ఔన్= శుభకరమవుతుంది.

**తా :** "లోకంలో సజ్జనులను అవమానించేవారు లేదా వారికి అపకారం తలపెట్టేవారు దుష్టులు. అలాంటి వారి జీవితం, సంపదలు నశిస్తాయి. శత్రువులవల్ల వారు చస్తారు. ఇది నిజం. నీ కుమారులు మహాత్ములకు అపకారం చేసి బ్రాహ్మణుల కోపాగ్ని కెరగాకుండ, శ్రీహరిచే చావుకు గురిగావటం మంచిది" అని దితి భర్తతో అంది.

**చ. అనవుడుఁ గశ్యపుండు గమలానన కిట్లను నింతి! నీవు చే**
**సిన విపరీతకర్మమునఁజేకుఱె నిట్టి యవస్థ; దీనికిన్**
**మనమునఁదాప మొందకుము! మాధవు పాదసరోజయుగ్మచిం**
**తనమునఁ జేసియున్ నను ముదంబునఁగొల్చుటఁజేసియుండగన్. 484**

**ప్రతి :** అనవుడున్= దితి అట్లనగా; కశ్యపుండు= మారీచుడు; కమల+ఆననకున్= కమలంవంటి ముఖం కలిగిన దితితో; ఇట్లు+అనున్= ఇలా అన్నాడు; ఇంతి= ఓ మగువా!; నీవుచేసిన= నీవు కావించిన; విపరీత కర్మమునన్= విద్దూరమైన సాంగత్యం వల్లనే; ఇట్టి+అవస్థ= ఇలాంటి దశ; చేకుఱెన్= కల్గింది; దీనికిన్= ఈ సిత్థికి; మనమునన్= మనస్సునందు; తాపము+ఒందకుము= బాధపడవద్దు; తగన్= యోగ్యముగా; మాధవు= లక్ష్మీపతియొక్క; పాద సరోజయుగ్మ= పాద పద్మములజంటయొక్క; చింతనమునన్= ధ్యానించుటను; చేసియున్= చేయుటవల్లనూ; ననున్= (కశ్యపుని) భర్తనైన నన్ను; ముదంబునన్= సంతోషంతో; కొల్చుటన్+చేసియున్= ఆరాధించుట వల్లనూ...

**తా :** శ్రీహరి చేత చచ్చుటే తగునని దితి అన్నది. అప్పుడు కశ్యపుడు ఆమెతో నారీమణీ! నీవు చేసిన విద్దూరపుకర్మ (అకాలసురతక్రీడ) వల్లనే ఈ దురవస్థ ఎదురైంది. దీనికై నీవు పరితపించవద్దు. నీవు శ్రీమన్నారాయణుని పాదపద్మాలను కొల్చటంవల్ల నైతేనేమి, సంతోషంతో నన్నారాధించటంవల్ల నైతేనేమి – నీకు మంచి జరుగబోతుందని పై కథతో అన్వయం.

**తే. రమణి! నీ సుతులందు హిరణ్యకశిపు, వలన నుదయించు వారిలోపల ముకుంద**
**పదసరోజాతవిన్యస్తభావుఁడైన, తనయుఁడుదయింపఁగలఁడతిధార్మికుండు. 485**

**ప్రతి :** రమణి= ఓలలనా!; నీ సుతులందున్= నీ కుమారులలో; హిరణ్యకశిపువలనన్= ఈ పేరు గల నీ కుమారునివల్ల; ఉదయించు= జన్మించే; వారిలోపలన్= వారిలో; ముకుంద= శ్రీహరి; పదసరోజాత= పాదపద్మాలయందు; విన్యస్త= ఉంచబడిన; భావుఁడు= మనస్సుగలవాడు; ఐన తనయుఁడు= అయినట్టి కుమారుడు; అతిధార్మికుండు= గొప్పయోగ్యుడు; ఉదయింపన్+కలఁడు= జన్మిస్తాడు.

**తా :** దేవీ! నీ కొడుకులలో హిరణ్యకశిపునికి పుట్టేవారిలో మహాధర్మాత్ముడు. శ్రీహరి పాదపద్మాల్ని నిరంతరం సేవించేవాడు జన్మిస్తాడు.

**వ. మఱియును 486**

**ప్రతి :** మఱియును= ఇంకా,

**తా :** అంతేగాక, ఇంకా.

(ఉదయించబోయే ఆ కుమారుని గుణగుణాల్ని మరింతగా వర్ణించబోతున్నాడు.)

**క. ఘనపుణ్యుండన్వయ పా, వనుఁడగు న ప్పుణ్యతముని వరకీర్తిలతల్**
**వనజభవాండోదర మె, ల్లను నిండఁగఁ బర్వు బుధలలాముండగుటన్. 487**

**ప్రతి :** ఘనపుణ్యుండు= గొప్పపుణ్యం చేసినవాడును; బుధలలాముండు= జ్ఞానుల్లో ఉత్తముడు; అగుటన్= అయినందు వల్ల; అన్వయపావనుఁడు+అగున్= కులాన్ని పవిత్రంచేసే వాడవుతాడు; ఆ+పుణ్యతముని= ఆ పుణ్యాత్ముని; వరకీర్తిలతల్=

ఉత్కృష్టమైన పేరుప్రతిష్ఠలనే తీగెలు; వనజభవ+అండ+ఉదరము+ఎల్లను= బ్రహ్మాండ మండలి మధ్యభాగమంతా; నిండఁగన్+పర్వున్= నిండునట్లుగా వ్యాపిస్తాయి.

**తా :** ఆ హిరణ్యకశిపుని కుమారుడు మహాపుణ్యాత్ముడు మరియు మహాబుద్ధిమంతుడు అవుతాడు. ఆ పుణ్యాత్ముని కీర్తిలతలు బ్రహ్మాండపర్యంతం ప్రాకుతాయి. అతడు కులాన్ని పవిత్రం చేయగలవాడు.

**తే. వామలోచన! వినుము దుర్వర్ణ హేమ, మగ్నిపుటమునఁ బరిశుద్ధ మై వెలుంగు**
**నట్లు, దుష్టాత్మసంభవుఁడయ్యు వంశ, పావనుండగు హరిపాదభక్తుఁడగుట. 488**

**ప్రతి :** వామలోచన= చక్కనికన్నులుగలదానా (దితీ)!; వినుము= ఆలకించుము; దుష్ట+ఆత్మసంభవుఁడు= దుర్మార్గుడైన హిరణ్యకశిపునికి కల్గినవాడు; అయ్యున్= అయినప్పటికి; హరిపాదభక్తుఁడు= విష్ణు పాదదాసుడు; అగుటన్= అయినందువల్ల; దుర్+వర్ణహేమము= మసకపట్టిన బంగారం; అగ్నిపుటమునన్= అగ్నిసంస్కారంవల్ల; పరిశుద్ధము+ఐ= స్వచ్ఛమై; వెలుంగున్+అట్లు= ప్రకాశిస్తున్నట్లు; వంశపావనుండు+అగున్= కులాన్ని పవిత్రీకరించేవాడవుతాడు.

**తా :** "సులోచనా! విను. నీ మనుమడు దుర్మార్గుని (హిరణ్యకశిపుని) కడుపున పుట్టిన బిడ్డడే అయినా, శ్రీహరి పాదసేవకుడైన భక్తుడు కాబట్టి అగ్నిశుద్ధివల్ల మసక తొలగి బంగారం స్వచ్ఛంగా వెల్గినట్లు రాక్షసవంశాన్ని పవిత్రం చేస్తాడు" అని కశ్యపుడు ఆమెను ఆశ్వాసించాడు.

**తే. అంచితాష్టాంగయోగ క్రియాకలాపు, లైన యోగీశ్వరులు న మ్మహానుభావు**
**నతులశీలస్వభావవిజ్ఞానసరణిఁ, దాముఁజరియింప నాత్మలఁదలఁతు రెపుడు. 489**

**ప్రతి :** అంచిత= ఒప్పిదమైన; అష్ట+అంగ= ఎనిమిది విభాగాలతోడి; యోగక్రియాకలాపులు+ఐన= యోగకార్యకలాపం గలవారైన; యోగి+ఈశ్వరులు= యోగమును ఉపాసించే మునిశ్రేష్ఠులు; ఆ+మహానుభావున్= ఆ గొప్ప ఆశయాలుగల పురుషుని; అతుల= సాటిలేని; శీలస్వభావ= మంచి నడవడికయే స్వభావంగాగల; విజ్ఞాన సరణిన్= వైజ్ఞానిక పద్ధతియందే; తామున్= మునులుకూడ; చరియింపన్= ఆ దారిలోనడవాలనే; ఆత్మలన్= తమహృదయాలలో; ఎపుడు= ఎల్లప్పుడు; తలఁతురు= భావిస్తారు.

**తా :** నిరంతరం అష్టాంగయోగాన్ని సాధనచేసే మునీశ్వరులు సైతం నీ మనుమడు నడిచే ఉత్తమ మార్గంలోనే నడవాలని భావిస్తారు. (ఆతని శీల సంపద ఉదాత్తమైనదే గాక ఆదర్శప్రాయమైనదని అభిప్రాయం).

**విశే :** అష్టాంగయోగ క్రియలు: ఇవి ఎనిమిది రకాలు 1. యమం 2. నియమం 3. ఆసనం 4. ప్రాణాయామం 5. ప్రత్యాహారం 6. ధ్యానం 7. ధారణ 8. సమాధి

**1. యమం :** అహింస, సత్యం, అస్తేయం, బ్రహ్మచర్యం, అపరిగ్రహం అనే ఐదింటిని యమమంటారు.

**2. నియమం :** శౌచం, సంతోషం, తపస్సు, స్వాధ్యాయం, ఈశ్వరప్రణిధానం అనేవి నియమంగా గుర్తింపు పొందాయి.

**3. ఆసనం :** స్థిరసుఖమాసనం–చలనం లేనిది, సుఖమైంది ఆసనం. ఇవి చాల రకాలు–పద్మాసనం, వజ్రాసనం వగైరా.

**4. ప్రాణాయామం :** రక్తశుద్ధికి ప్రాణాయామం ప్రాణాపానగతుల్ని నిరోధించే కార్యక్రమం.

**5. ప్రత్యాహారం :** చంచలమైన మనస్సును ఎక్కడెక్కడో సంచరింప నీయకుండా ఆత్మయందు నిల్పటం.

**6. ధారణ :** మనస్సును ఆత్మాయత్తం చేసిన తర్వాత దేన్నీ స్మరించకుండటం.

**7. ధ్యానం :** ఆత్మవిశుద్ధికొరకు ఆసనమందుండటం. 'ధ్యానేనాత్మని పశ్యంతి' అని గీత.

**8. సమాధి :** 'యోగపరిపూర్ణత' అకల్మషమైన బ్రహ్మానందానుభూతి.

చిత్తవృత్తులను నిరోధించే ఈ క్రియను అష్టాంగ యోగమని మునులు నిర్వచించారు.

**ఉ. ఆ మహితాత్మకుండు సుగుణాంబుధి భాగవతోత్తముండు, ల**
**క్ష్మీమహిళాధినాథుఁ దులసీదళదాముఁబరేశు నాత్మహృ**
**త్తామరసంబునందుఁ బ్రమదంబున నిల్పి తదన్యవస్తువుం**
**దా మదిలో హసించు హరిదాస్యవిహారవినిశ్చితాత్ముఁడై. 490**

**ప్రతి :** ఆ, మహిత+ఆత్మకుండు= గొప్పహృదయంగలవాడు; సుగుణ+అంబుధి= సుగుణాలకు సముద్రమంతవాడు; భాగవత+ఉత్తముండు= భక్తులలోశ్రేష్ఠుడు; హరిదాస్య= విష్ణుసేవయనెడి; విహార= సంచారమందు; వినిశ్చిత+ఆత్ముఁడు+ఐ= నిర్ణయించుకొన్న మనస్సుగలవాడై; తులసీదళదామున్= తులసిదళాలహారంగలవాడును; పర+ఈశున్= మోక్షమునకధిపతియైనవాడు (అగు); లక్ష్మీమహిళా+అధినాథున్= శ్రీదేవి భర్తయగు విష్ణుమూర్తిని; ఆత్మహృద్+తామరసంబునందున్= తన హృదయమనే పద్మమందు; ప్రమదంబునన్= మహానందంతో; నిల్పి= ఉంచి; తద్+అన్యవస్తువున్= ఆ విష్ణువుకంటె వేరైన పదార్థాన్ని; తాన్= ఆ భక్తుడు; మదిలోన్= మనస్సునందు; హసించున్= పరిహసిస్తాడు.

**తా :** ఓ దితీ! నీ మనుమడు భక్తుల్లో మేటి. మహానుభావుడు. సుగుణాలరాశి. ఆయన విష్ణుసేవయందే మనస్సును లగ్నంచేసి, తులసీమాల ధరించినవాడునూ, మోక్షాధినాథుడునూ అయిన ఆ సిరిమగణ్ణి ధ్యానిస్తూ మరో వస్తువంటే పరిహసిస్తాడు – త్రోసిపుచ్చుతాడు. (విష్ణువు తప్ప తక్కిందేదీ కూడ ఆయన మనస్సుకు పట్టదు).

**వ. అట్టి నీ పౌత్రుండు. 491**

**ప్రతి :** అట్టి= (శ్రీహరి తప్ప తక్కిందేది పట్టనివాడైన), నీ పౌత్రుండు= (దితి) నీమనుమడు, (క్రింది పద్యంతో అన్వయం).

**తా :** ఓ దితీ! అట్టి నీ మనుమడు.

**సీ. మహితదేహాద్యభిమానంబు దిగనాడి చిరతరాలంపటశీలుఁడగుచుఁ**
**బరసమృద్ధికి నాత్మఁబరితోష మందుచుఁ బరదుఃఖమునకుఁ దాపమును బొందు**
**నీ విశ్వమంతయు నే విభుమయ మని యెవ్వని కరుణచే నెఱుఁగనయ్యె**
**నట్టి యీశ్వరునిఁ దా నాత్మసాక్షిగ మోద మదరంగఁజూచు ననన్యదృష్టి**

**తే. నతినిదాఘోగ్రసమయంబునందు నిఖిల, జంతుసంతాప మడఁగించు చంద్రుమాడ్కి**
**నఖిలజగముల దుఃఖంబు లపనయించు, రూఢి నాతఁ దజాతవిరోధి యగుచు. 492**

**ప్రతి :** మహిత= కొనియాడబడిన; దేహ+ఆది+అభిమానంబు= శరీరం మరియు మనస్సు మొదలైన భౌతికాదుల్లో గల ఆసక్తిని; దిగనాడి= వదలి; చిరతర= చిరకాలంగా; అలంపట= ఆసక్తిలేని; శీలుఁడు+అగుచున్= నడవడిక కలవాడవుతూ;

పరసమృద్ధికిన్= ఇతరుల అభివృద్ధికొరకు; ఆత్మన్= తన ఎదలో; పరితోషము+అందుచున్= మిక్కిలిసంతోషపడుతూ; పర దుఃఖమునకున్= ఇతరులకు బాధకల్గితే; తాపమును+పొందున్= తాను నొప్పిపడును; ఎవ్వనికరుణచేన్= ఏ పరమేశ్వరుని దయచేత; ఈ విశ్వము+అంతయున్= ఈ జగత్తంతా; ఏ విభుమయము+అని= ఏ విశ్వేశ్వరుని రూపమని; ఎఱుఁగన్+అయ్యెన్= తెలియబడెనో; అట్టి= అలాంటి; ఈశ్వరునిన్= పరమేశ్వరుణ్ణి; తాన్= స్వయంగా; ఆత్మసాక్షి+కన్= మనస్సాక్షిగా; మోదము+అడరంగన్= సంతోషమతిశయించునట్లు; న+అన్యదృష్టిన్= ఇతర చింతలేని చూపుతో; చూచున్= కాంచును; అతి= మిక్కిలి; నిదాఘ+ఉగ్రసమయంబునందున్= భయంకరమైన వేసవికాలములో; చంద్రుమాడ్కిన్= చంద్రునిలాగ; జంతుసంతాపము= ప్రాణికోటి ఆర్తిని; అడఁగించున్= తీర్చును; రూఢిన్= నిక్కముగా; ఆతఁడు= ఆ నీ మనుమడు; అజాతవిరోధి+అగుచున్= పుట్టబడని శత్రువులు కలవాడౌతూ – విరోధులు లేనివాడగుచు; అఖిలజగముల= సమస్తలోకాల; దుఃఖంబులు= బాధలు; అపనయించున్= తొలగిస్తాడు.

**తా :** “దితీ! నీ మనుమడు జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాల పట్ల మక్కువ లేనివాడు. తాపత్రయం లేనివాడు. ఇతరులు బాగుంటే సంతోషిస్తాడు. వారు బాధపడితే తాను బాధపడతాడు. ఈ జగత్తుకంతటికి ఆయనే ప్రభువు అని తెలిసికొని ఆ విశ్వనాథుణ్ణి మనసార తదేక దృష్టితో దర్శిస్తాడు. వేసవి కాలంలో తాపానికి గురి అయ్యేవారికి ఆయన వెన్నెల సోకినట్లు హాయి గొల్పుతాడు. అన్ని లోకాలబాధలు తొలగిస్తాడు. అతనికి శత్రువులే లేరు” అని కశ్యపుడు భార్యను అనునయించాడు.

**వ. మఱియు హరిధ్యాననిష్ఠాగరిష్ఠుండగు న మ్మహాభాగవతాగ్రగణ్యుండు. 493**

**ప్రతి :** మఱియున్= అంతేకాక; హరిధ్యాన= విష్ణుమూర్తిని కొల్చుట లేదా స్మరించుట అనే; నిష్ఠా= స్థిరమైన ఉనికి యందు; గరిష్ఠుండు= శ్రేష్ఠుడు; అగున్= అయినట్టి; ఆ+మహాభాగవత= మహాభక్తులందు; అగ్రగణ్యుండు= మొదట లెక్కింపదగినవాడు (దితిమనుమడు).

**తా :** ఎల్లప్పుడు నీ మనుమడు శ్రీహరిధ్యానమందే మనస్సును నిల్పినవాడు. అంతేగాదు భగవద్భక్తుల్లో అగ్రగణ్యుడు కూడ.

**క. విమలాంతరంగబహిరం, గములను స్వేచ్ఛానురూపకలితుండగు నా**
**కమలాధీశ్వరు కుండల, రమణీయముఖంబుఁజూచుఁబ్రమదంబెసఁగన్. 494**

**ప్రతి :** విమల+అంతరంగ= స్వచ్ఛమైన హృదయము; బహిస్+అంగములను= బాహ్యదేహం అనే రెండింటియందును; స్వ+ఇచ్ఛా= తన కోర్కెకు; అనురూపకలితుండు= తగినట్లు నడుచుకునే వాడు; అగున్= అగును; ఆ; కమలా+అధి+ఈశ్వరు= శ్రీదేవిభర్తయైన విష్ణువుయొక్క; కుండల= చెవిపోగులచే; రమణీయ= అందమైన; ముఖంబున్= మోమును; ప్రమదంబు= ఆనందం; ఎసఁగన్= అతిశయించునట్లు; చూచున్= కాంచును.

**తా :** అంతేకాదు. నీ మనుమడు స్వచ్ఛమైన అంతరింద్రియాల్లో, బాహ్యేంద్రియాల్లో, కుండలాలతో అందాన్ని సంతరించుకొన్న ఆ లక్ష్మీపతి ముఖాన్ని ఆనందాతిశయంతో తన ఇచ్చివచ్చినట్లు చూస్తూ ఉంటాడు.

**విశే : అంతరంగబహిరంగములు:** దేహంలో ‘అంతరంగాలు, బహిరంగాలు అనేవి రెండు భాగాలు. అంతరంగమనగా బయటికి కన్పించనివి. మనస్సు, బుద్ధి, చిత్తం అనే సామగ్రి. బహిరంగమనగా బయటికి కన్పించే అవయవాలు. ఇవి కూడ రెండు రకాలు.

**1) కర్మేంద్రియాలు :** వాక్కు, పాణి (చేతులు), పాద (కాళ్ళు), పాయువు (విసర్జకావయవం), ఉపస్థ–జననేంద్రియం. ఇవి అయిదు.

**2) జ్ఞానేంద్రియాలు :** త్వక్ (చర్మం), చక్షువు (కన్నులు), శ్రోత్రం (చెవులు), రసన (నాలుక), ఘ్రాణం (ముక్కు).

**తే. మఱియు నీ విశ్వ మా హరిమయము గాఁగ, మనములోపలఁదలఁచు నమ్మనునిభుండు**
**మనుమహాత్ములలోన నీ మనుమఁ డధికుఁ, డనఁగ నుతికెక్కు నంచుఁ గశ్యపుఁడు పలుక. 495**

**ప్రతి :** మఱియున్= (శ్రీహరిముఖాన్ని చూడటమే గాదు) ఇంకను; ఈ విశ్వము= ఈ సమస్తజగత్తు; ఆ హరిమయము+ కాఁగన్= ఆ విష్ణుస్వరూపమే అని; మనము లోపలన్= మదిలో; ఆ+మనునిభుండు= ఆ మనువుతో సమానమైనవాడు; (నీ పౌత్రుడు); తలచున్= భావించును; మనుమహా+ఆత్ములలోనన్= మనువంశీకులైన గొప్పవారిలో; నీ మనుమఁడు= నీ కొడుకుకొడుకు; అధికుఁడు+అనఁగన్= అందరికంటె గొప్పవాడని; నుతికిన్+ఎక్కున్= పొగడ్తల నొందును; అంచున్= అంచు; కశ్యపుఁడు; పలుకన్= చెప్పగా...

**తా :** మనువుతో సమానుడైన నీ మనుమడు తన మనస్సులో ఈ విశ్వమంతా విష్ణుమయమని భావిస్తాడు. మహాత్ములైన మనువుల్లో నీ మనుమడు గొప్పవాడుగా పొగడ్తలందుకొంటాడు అని కశ్యపుడు చెప్పాడు.

**క. విని తన తనయులు మధుసూ, దనుచే హతు లగుదు రనుచుఁ దన మనుమఁడు స**
**జ్జననుతభాగవతుండగు, ననుచు మదింజాల దుఃఖహర్షము లొదవన్. 496**

**ప్రతి :** విని= (కశ్యపుడు తన మనుమని మహిమలు చెప్పగా) ఆలకించి (దితి); తన తనయులు= తనకుమారులైన భద్రుడు, అనుభద్రుడు అనువారు, (హిరణ్యాక్ష హిరణ్యకశిపులు); మధుసూదనుచేన్= మధువను రాక్షసుణ్ణి మట్టుపెట్టిన శ్రీహరిచేత; హతులు+అగుదురు= చనిపోతారు; అనుచున్= అనుకొంటూ, (అలాగే); తన మనుమఁడు= పుట్టబోయే పౌత్రుడు (ప్రహ్లాదుడు); సత్+జన= ఉత్తములైన వారిచే; నుత= కొనియాడదగిన; భాగవతుండు+అగున్= శ్రీహరిభక్తుడవుతాడని; అనుచున్= అనుకొంటూ; మదిన్= మనస్సులో; చాల= మిక్కిలి; దుఃఖహర్షములు= సంతాపం మరియు సంతోషం; ఒదవన్= కలుగగా...

**తా :** కశ్యపుడు అలా మనుమని గొప్పదనాన్ని గూర్చిచెప్పగా విని దితి తన మదిలో నా కుమారులిర్వురు మాధవునిచేత చస్తారనీ, నా మనుమడు అందరూ మెచ్చుకోదగ్గ హరిభక్తుడవుతాడని విని ఒకవైపు దుఃఖంతో, మరోవైపు సంతోషంతో మథనపడింది.

**వ. ఉండునంత నా దితియుఁ గశ్యపవీర్య సంభృతంబైన గర్భంబు దుర్భర తేజోభిరామంబును నన్యతేజో విరామంబును దినదినప్రవర్ధమానంబును నై నివ్వటిల్ల నిజోదరస్థితులైన కుమారు లమరదమనులై వర్తింపఁ గల రని చింతించుచు గర్భంబు శతవర్షంబులు ధరియించి యున్న యనంతరంబ. 497**

**ప్రతి :** ఉండు+అంతన్= అట్లుండగా; ఆ దితియున్= ఆ దితికూడ; కశ్యప వీర్యసంభృతంబు+ఐన= కశ్యపుని వీర్యమును ధరించుటవల్ల కల్గిన; గర్భంబున్= కడుపును; దుర్+భర= మోయశక్యంగాని; తేజస్+అభిరామంబునున్= తేజస్సుచే ఒప్పారునదియు; అన్యతేజస్+విరామంబును= ఇతరకాంతిని అణచేదియు; దినదినప్రవర్ధమానంబునున్+ఐ= రోజు రోజుకు

పెంపొందేది అయి; నివ్వటిల్లన్= అతిశయించగా; నిజ+ఉదరస్థితులు+ఐన= తన కడుపులో నున్నట్టి; కుమారులు= కొడుకులు; అమరదమనులు+ఐ= దేవతలను అణచేవారై; వర్తింపన్+కలరు+అని= ప్రవర్తిస్తారని; చింతించుచున్= ఆలోచిస్తూ; గర్భంబున్= కడుపును; శత వర్షంబులు= నూరేండ్లు; ధరియించి+ఉన్న+అనంతరంబ= మోస్తున్న తరువాత...

**తా :** దుఃఖం-సంతోషం రెండింటితో ఉక్కిరిబిక్కిరి అవుతున్నది దితి. కశ్యపునివల్లనైన తన గర్భం తేజస్సుతో వెలుగుతోంది, అంతేగాక అన్యతేజస్సులను నిర్వీర్యం చేస్తున్నది; రోజు రోజుకు పెరుగుతున్నది. ఆమె తనకడుపున పుట్టబోయే కుమారులు దేవతలను మట్టుపెడతారని ఆలోచిస్తున్నది. అలా ఆ గర్భాన్ని ఆమె నూరేళ్ళు మోసింది.

**ఉ. ఆ దితిగర్భమందు రుచిరాకృతితో నొకతేజ మన్య తే**
**జో దమలీల వెల్వడి వసుంధరయున్ గగనంబు నిండి సం**
**ఛాదితపద్మబాంధవనిశాకరదీప్తులు గల్గి సూచికా**
**భేదమహోగ్రసంతమసభీషణమైన భయాకులాత్ములై. 498**

**ప్రతి :** ఆ దితిగర్భమందున్= ఆ దితికడుపున; ఒక తేజము= ఒక వెలుగు; రుచిర+ఆకృతితోన్= దేదీప్యమానమైన ఆకారంతో; అన్యతేజస్+దమలీలన్= ఇతరకాంతులన్నింటిని అణచివేస్తున్నదో అన్నట్లు; వెల్వడి= బయటపడి; వసుంధరయున్= నేలయు; గగనంబు= నింగి; నిండి= వ్యాపించి; సంఛాదిత= కప్పబడిన; పద్మబాంధవ= తామరలబంధువైన సూర్యునియొక్కయు; నిశాకర= చంద్రునియొక్కయు; దీప్తులు+కల్గి= వెల్గులు కల్గి; సూచికా+అభేద= సూదితో భేదించుటకు సాధ్యం కాని; మహా+ఉగ్ర= మిక్కిలి భయంకరమైన; సంతమస= చీకట్లచే; భీషణము+ఐనన్= భయాన్ని కల్గించేది కాగా; భయ= భీతిచే; ఆకుల= కలతచెందిన; ఆత్ములు+ఐ= మనస్సులు గలవారై...

**తా :** దితి గర్భంనుండి ఇతరశక్తులన్నింటిని కాలరాచే ఒక మహాతేజస్సు రూపమెత్తి బయటికి వచ్చింది. ఆ తేజస్సు భూమ్యాకాశాల్ని ఆక్రమించింది. సూర్యచంద్రుల కాంతుల్ని దిగమింగింది. సూదితో గుచ్చితే కూడ దిగనంత పెద్దచీకటి ఆవరించింది. (కన్నులు పొడుచుకున్నా కానరాని కటికచీకటి) దానితో దేవతలు భయంతో కలతచెందిన మనస్సులు కలవారైరి.

**చ. అమరగణంబు లెల్లఁ గమలాసనుపాలికి నేగి తత్పదా**
**బ్జములకు మ్రొక్కి యంజలులు ఫాలములం గదియంగఁజేర్చి చి**
**త్తముల భయంబు సంభ్రమముఁ దార్కొన నిట్లని విన్నవించి రో**
**యమరకులాగ్రగణ్య! దురితార్ణవతారణ! సృష్టికారణా! 499**

**ప్రతి :** ఓ; అమరకుల= దేవతలజాతియందు; అగ్రగణ్య= మొదటగుర్తింపదగినవాడా!; దురిత= పాపములనెడి; అర్ణవతారణ= సముద్రాన్ని దాటించువాడా!; సృష్టి కారణా!= జీవరాశిపుట్టుకకు కారణమైనవాడా!; ఓ దేవా!; అంటూ; అమరగణంబులు+ ఎల్లన్= దేవతలెల్లరు; కమల+ఆసనుపాలికిన్= బ్రహ్మదేవునిచెంతకు; ఏగి= పోయి; తద్+పద+అబ్జములకున్= ఆయన తామరలవంటి అడుగులకు; మ్రొక్కి= నమస్కరించి; అంజలులు= దోసిళ్ళు; ఫాలములన్= నొసళ్ళకు; కదియంగన్= తాకునట్లు; చేర్చి= కూర్చి; చిత్తములన్= మనస్సుల్లో; భయంబు= భీతియును; సంభ్రమమున్= తొట్రుపాటును; తార్కొనన్= ఆవేశింపగా; ఇట్లు+అని= ఈ కింది విధంగా; విన్నవించిరి= తెల్పుకొనిరి...

**తా :** దేవతలందరు బ్రహ్మచెంతకు పోయి దేవతలకెల్లరికి 'ఆద్యుడా! పాపాలనే సముద్రాన్ని తరింపజేయువాడా! సృష్టికి మూలకారకుడా! స్వామీ!' అని ఆయన పాదపద్మాలకు మొక్కి, రెండుచేతుల్ని నొసటజేర్చి మనస్సులో భయం, తొట్రుపాటు ముప్పిరిగొనగా ఇలా విన్నవించారు.

**ఉ.** **నీవు చరాచరప్రచయనేతవు ధాతవు సర్వలోకపా**
**లావళి మౌళిభూషణుఁడ వంచితమూర్తివి దేవదేవ! వా**
**ణీవర! యీ యజాండమున నీవు నెఱుంగని యర్థ మున్నదే**
**భావమునం దలంపుము విపన్నుల మమ్ము భవత్ప్రపన్నులన్.** **500**

**ప్రతి :** దేవదేవ= దేవతలకు దేవుడవైన; వాణీవర= సరస్వతీదేవి భర్తా!; నీవు (బ్రహ్మవు); చర+అచరప్రచయ= స్థావరజంగమరూపమైన సమూహానికి; నేతవు= అధిపతివి; ధాతవు= సృజనభారాన్నిమోసేవాడవు; సర్వ= సమస్తమైన; లోకపాల+ఆవళి= దిక్పాలుర సమూహం యొక్క; మౌళి= తలలకు; భూషణుఁడవు= అలంకారమైనవాడవు; అంచితమూర్తివి= ఒప్పిదమైన స్వరూపంగలవాడవు; ఈ అజ+అండమునన్= ఈ బ్రహ్మాండమందు; నీవున్= (సృష్టికర్తవైన) నీవు (బ్రహ్మవు); ఎఱుంగని= తెలియని; అర్థము+ఉన్నదే= వస్తువు ఉందా? (లేదు); విపన్నులన్= ఆపదలందు చిక్కుకొన్నవారమైన; భవత్+ప్రపన్నులన్= నీ శరణుజొచ్చిన వారమైన; మమ్మున్= మమ్మల్ని గూర్చి; (దేవతల్ని); భావమునన్= మనస్సులో; తలంపుము= ఆలోచించుము.

**తా :** 'ఓ దేవా! శారదాపతీ! స్థావరజంగమాత్మకమైన ఈ విశ్వానికి నీవే ప్రభువు. అన్నింటిని భరించేవాడివి నీవే. లోకపాలు లెల్లరికి తలమానికం లాంటివాడవు. నీ రూపం మెచ్చదగింది. ఈ బ్రహ్మాండంలో నీకు తెలియని దేమీ లేదు. మేము ఆపదల్లో చిక్కి నీ శరణు జొచ్చాము. మమ్మల్ని గూర్చి కొంచెం ఆలోచించు' అని దేవతలు బ్రహ్మను ప్రార్థించారు.

**వ.** **"దేవా! కార్యరూపంబగు చేతనాచేతనాత్మక ప్రపంచంబునకుఁ గారణుండవైన నీచేత సమస్త భువనంబులును సృజియింపఁబడియె, నీవు సర్వ భూతాత్మభావవిదుండవు, లోకనాథశిఖామణి భూతుండవు, విజ్ఞానవీర్యుండ, వవిద్యంజేసి యిట్టి స్రష్టృ రూపంబు నొందితి, గృహీతరజోగుణుండవు, నీయందుఁ బ్రపంచంబు లీనంబై యుండు, సుపక్వయోగంబు నొంది నిష్కాములై ధ్యానంబున నిన్నరయుచు నిర్జితశ్వాసేంద్రియాత్ములై భవత్ప్రసాదంబు వడసిన వారలకుం బరాభవంబు లెక్కడివి? ఎవ్వని వాగ్జాలంబులచేఁ బాశబద్ధంబులైన పశువుల చందంబున నిఖిల జీవులు వర్తింతు రట్టి నీకు నమస్కరించెద, మహోరాత్ర విభాగాభావంబున లుప్తకర్మంబులగు లోకంబులకు సేమంబు గావింపుము, శరణాగతులమైన మమ్ము నతిశయకరుణారస పరిపూర్ణంబులగు కటాక్షంబుల వీక్షించి రక్షింపుము. కశ్యపు వీర్యంబు దితి గర్భంబుననుండి సకల దిగ్వలయంబు నాక్రమించి దారువందు వహ్ని చందంబున లీనంబై ప్రవృద్ధం బగుచున్న" దని విన్నవించిన బృందారక సందోహంబులకు నానందంబు గందళింప నరవిందనందనుం డిట్లనియె.** **501**

**ప్రతి :** దేవా= ప్రభూ!; సమస్తభువనంబులును= అన్నిలోకాలు; కార్యరూపంబు+అగు= క్రియాత్మకమైన; చేతన+అచేతన= కదలిక కలది, కదలిక లేనిది (స్థావరజంగమాత్మకం); అయిన; ఆత్మక= స్వరూపంగల; ప్రపంచంబునకున్= జగత్తుకు;

కారణుండవు+ఐన= కారకుడవైన; నీ చేతన్; (బ్రహ్మచేత); సృజియింపన్+పడియెన్= పుట్టింపబడ్డాయి; నీవు (బ్రహ్మ); సర్వభూత+ఆత్మభావ= సమస్త ప్రాణికోట్ల ఆత్మలయందున్నభావమును; విదుండవు= తెలిసినవాడవు; లోకనాథ శిఖామణి భూతుండవు= జగత్తు నేలేవారిలో శ్రేష్ఠుడవైనవాడవు; విజ్ఞానవీర్యుండవు= లోకజ్ఞానమే బలముగా కలవాడవు; అవిద్యన్+చేసి= మాయవల్లనే; ఇట్టి= ఇలాంటి; స్రష్ట రూపంబున్= సృష్టికర్త రూపాన్ని; ఒందితి= పొందావు; గృహీత= గ్రహింపబడిన; రజస్+గుణుండవు= రజోగుణం కలవాడవు (బ్రహ్మరజోగుణాధిపతియనుట); నీ+అందున్= నీలోననే; ప్రపంచంబు= విశ్వమంతా; లీనంబు+అయి+ఉండున్= దాగి ఉండును; సుపక్వయోగంబున్= పరిణతిచెందిన యోగాన్ని; (యోగ సాధనలోపటుత్వం) ఒంది= పొంది; నిస్+కాములు+ఐ= ఏ కోర్కెలు లేనివారై; నిన్నున్+అరయుచున్= నిన్నే (బ్రహ్మనే) వెదుకుతూ; నిర్జితశ్వాస+ఇంద్రియాత్ములు+ఐ= జయింపబడిన లేక స్వాధీన పరచుకొన్న ఊపిరి అనే ఇంద్రియంగలవారై (శ్వాసక్రియని అదుపులోనుంచిన యోగులు); భవత్+ప్రసాదంబు= మీ అనుగ్రహాన్ని; పడసిన వారలకున్= పొందిన వారికి; పరాభవంబులు= అవమానాలు లేదా అపజయాలు; ఎక్కడివి?= ఎక్కడ ఉన్నాయి? (లేవు); నిఖిలజీవులు= ఎల్లప్రాణులు; ఎవ్వని= ఏ మహాత్ముని; వాక్+జాలంబులచేన్= (శాసనరూపమైన) మాటలసమూహంచేత; పాశబద్ధంబులు+ఐన= త్రాళ్ళచే బంధింపబడ్డ; పశువులచందంబునన్= పసులవలె; వర్తింతురు= నడుచుకుంటారో; అట్టి= అలాంటి; నీకున్= బ్రహ్మకు; నమస్కరించెదము= మోకరిల్లుతాము; అహస్+రాత్ర= పగలు, రేయి అనెడి; విభాగ+అభావంబునన్= విభజనలేమిచేత; లుప్తకర్మంబులు+అగు= లోపించినకర్మలుగల (కర్మలోపం); లోకంబులకున్= లోకాలకు; సేమంబు= మేలు; కావింపుము= చేయుము; శరణ+ఆగతులము+ఐన= నీ ఆశ్రయం కోరివచ్చినవారమైన; మమ్మున్ (దేవతల్ని); అతిశయ= మిక్కుటమైన; కరుణారస= దయారసం చేత; పరిపూర్ణంబులు+అగు= నిండినట్టి; కటాక్షంబులన్= కడగంటి చూపులతో; వీక్షించి= చూచి; రక్షింపుము= కాపాడుము; కశ్యపువీర్యంబు= మారీచుని తేజస్సు; దితి గర్భంబునన్+ఉండి= దితి కడుపులోనుండి; సకల= సమస్తమైన; దిక్+వలయంబున్= దెసలన్నింటిని; ఆక్రమించి= వ్యాపించి; దారువు+అందున్= కర్రలోని (అరణి); వహ్నిచందంబునన్= అగ్గివలె; లీనంబు+ఐ= దాగినదై; ప్రవృద్ధంబు+ఐ= మిక్కిలిగా పెరిగినదై; ఉన్నది= ఉంది; అని= చెప్పి; విన్నవించిన= నివేదించినట్టి; బృందారక= దేవతల; సందోహంబులకున్= గుంపులకు; ఆనందంబు= సమూహములకు; కందళింపన్= ఉబుకునట్లు; అరవిందనందనుండు= పద్మమునందు పుట్టిన బ్రహ్మ; ఇట్లు+అనియెన్= ఈ క్రిందివిధంగా అన్నాడు...

**తా :** "స్వామీ! స్థావరజంగమరూపమై క్రియాత్మకంగా ఉన్న ఈ విశ్వానికి నీవే కారణుడవు. ఈ లోకాలన్నింటిని నీవే సృజించావు. ఈ ప్రాణికోట్ల ఆత్మస్వరూపం తెలిసినవాడవు నీవే. జగన్నాథుల్లో నీవే అగ్రగామివి. అనుభవజ్ఞుడవు. మాయవల్లనే నీవు విశ్వస్రష్టవైనావు. నీవు త్రిగుణాల్లో రజోగుణాధిపతివి. ఈ సమస్తలోకాలు నీలోనే దాగి ఉన్నాయి. యోగక్రియలో ఆరితేరినవారై ఏ కోర్కెలు లేనివారుగా ముద్రపడిన యోగులు ధ్యానం ద్వారా నిన్ను అన్వేషిస్తారు. శ్వాసక్రియను అదుపులో ఉంచిన కారణంచేత నీ అనుగ్రహానికి పాత్రులైన ఆ యోగులకు ఓటమి లేదు. ఈ జీవులెల్లరు తాళ్ళచే కట్టబడ్డ పశువుల్లాగ నీ మాటకు కట్టుబడి ఉంటారు. నీకు మొక్కుతున్నాము. రాత్రింబవళ్ళు అనే విభజన తెలియక, ఏ పనిచేయాలో బోధపడని ఈ జీవులను కాపాడే వాడివి నీవే. నీ శరణుజొచ్చిన మమ్ము దయార్ద్రబుద్ధితో కాపాడు. అరణిలో అగ్గిలాగా కశ్యపప్రజాపతి వీర్యశక్తి దితి గర్భంలో దాగి రోజు రోజుకు పెరుగుతూ ఉంది. అది దిక్కులన్నింటికి ప్రాకుతూ ఉంది. అని దేవతలెల్లరు మొరపెట్టుకోగా విని బ్రహ్మ వారందరిని ఆశ్వాసిస్తూ ఇలా అన్నాడు.

## ❖ సనక సనందనాదులు వైకుంఠమున కరుగుట ❖

**క. గీర్వాణులార! యుష్మ, త్పూర్వజు లాత్మీయసుతులు పుణ్యులు విచర**
**న్నిర్వాణులు సనకాదులు, సర్వంకష శేముషీ విచక్షణు లెందున్. 502**

**ప్రతి :** గీర్+వాణులార= దేవతలారా!; యుష్మద్= మీ; పూర్వజులు= పెద్దలు; ఆత్మీయసుతులు= మాకు కుమారులును; పుణ్యులు= సుకృతం చేసుకొన్నవారు; విచరత్+నిర్వాణులు= ఎల్లప్పుడు సంచారం చేసే దేవతలును లేదా ముక్తినొందినవారు; (అయిన) సనక+ఆదులు= సనకుడు మొదలైనవారు; ఎందున్= ఎక్కడైనా; సర్వంకష= ఎదురులేని; శేముషీవిచక్షణులు= బుద్ధిమంతులు.

**తా :** దేవతలారా! మీకు పూర్వీకులైన సనకాదిమునులు నా కుమారులే. వారు గొప్ప పుణ్యాత్ములు-సంచారం చేసే దేవుళ్ళు. వారు తమ అపారమైన బుద్ధివిశేషంచేత మంచిచెడ్డలను గుర్తిస్తారు.

**విశే :** సనకాదులు సనకుడు మొదలైన వీరు నల్గురు.

1. సనకుడు, 2. సనందనుడు, 3. సనత్సుజాతుడు, 4. సనత్కుమారుడు.

**క. వారలు నిస్పృహు లగుచు న, వారణ భువనంబు లెల్ల వడిఁగ్రుమ్మరుచున్**
**ధీరు లొకనాఁడు భక్తిన్, శ్రీరమణీశ్వరపదాబ్జసేవానిరతిన్. 503**

**ప్రతి :** ధీరులు= ధైర్యంగలవారలైన; వారలు= ఆ సనకాదులు; నిస్+స్పృహులు+అగుచున్= ఎలాంటి ఆశలులేనివారై; అవారణ= అడ్డులేకుండ; భువనంబులు+ఎల్లన్= లోకాలన్నింటిని; వడిన్= వేగంగా; క్రుమ్మరుచున్= తిరుగుతూ; ఒకనాడు= ఒకదినం; భక్తిన్= భక్తితో; శ్రీరమణీ+ఈశ్వర= శ్రీదేవిభర్తయైనహరియొక్క; పద+అబ్జ= పాదపద్మాల; సేవానిరతిన్= సేవయందాసక్తితో...

**తా :** సనకాదులు ధైర్యశాలులు. ఏ కోర్కెలు లేనివాళ్ళు. ఒకరోజు భక్తితో 'శ్రీహరి పాదసేవచేయా'లనే ఆసక్తితో లోకాలన్నింట యథేచ్ఛగా సంచరిస్తూ వెళ్ళారు.

**చ. చని చని కాంచి రంత బుధసత్తము లంచిత నిత్యదివ్యశో**
**భన విభవాభిరామముఁ బ్రపన్నజనస్తవనీయనామమున్**
**జననవిరామమున్ సుజనసన్నుతభూమము భక్తలోకపా**
**లనగుణధామముం బురలలామముఁజారువికుంఠధామమున్. 504**

**ప్రతి :** అంతన్= పిదప; చనిచని= పోయిపోయి; బుధసత్తములు= బుద్ధిమంతులైన సనకాదులు; అంచిత= ఒప్పిదమైనట్టి; నిత్యదివ్య= ఎల్లప్పుడు పవిత్రమైనట్టి; శోభనవిభవ= మంగళకరమైన సంపదచేత; అభిరామమున్= మనోజ్ఞమైనదియు; ప్రపన్నజన= భక్త జనులచే; స్తవనీయ= కొనియాడదగినట్టి; నామమున్= పేరుగలదియు; జననవిరామమున్= జన్మకు విశ్రాంతి నొసంగునదియు (వైకుంఠప్రాప్తిగల జీవులకు పునర్జన్మ లేదు); సుజన= సజ్జనులచేత; సన్నుత= మిక్కిలి కొనియాడబడిన; భూమమున్= చోటుగలది; భక్తలోక= భక్తులసమూహాన్ని; పాలనగుణ= కాపాడునట్టి గుణానికి; ధామమున్=

నెలవైనట్టిదియు; పురలలామమున్= పురములలో శ్రేష్ఠమైనదియునగు; చారు= సుందరమైన; వికుంఠధామమున్= విష్ణుదేవుని నివాసం (వైకుంఠం)ను; కాంచిరి= చూచారు.

**తా :** మహాజ్ఞానులైన ఆ సనకాదులు లోకసంచారం చేస్తూ పోయి పోయి వైకుంఠాన్ని చూచారు. ఆ వైకుంఠం నిత్యమంగళకరమైన సంపదతో అలరారుతుంది. దాన్ని దర్శించిన భక్తజనం ఆ నగరవైభవాన్ని ప్రస్తుతిస్తారు. అందులో ప్రవేశించిన వాళ్ళకు ఇక పునర్జన్మ లేదు. అది సుజనులు ప్రశంసించే ప్రదేశం. భక్తకోటిని ఆ నగరం ఎప్పుడూ కాపాడుతూ ఉంటుంది. అది శ్రేష్ఠమైన నగరం.

**విశే : వికుంఠధామం :** విగతకుంఠమే వికుంఠం. ఎక్కడ శాంతికి భంగం కల్గదో ఆ స్థానమే వికుంఠ ధామం. దీన్నే వేదాంతులు 'వైకుంఠం, మోక్షం, శాంతిధామం, నిర్వాణం, పరమపదం అని అనేక నామాలతో పేర్కొంటారు.

**ఉ. ఆ మహనీయపట్టణమునందు వసించెడివార లాత్మ ని**
**ష్కామఫలంబె సత్ఫలముగాఁదలపోసి ముముక్షుధర్ములై**
**శ్రీమహిళాధిపాంఘ్రిసరసీరుహపూజ లొనర్చుచున్ మహో**
**ద్దామతదీయరూపములఁదాల్చి సుఖించుచు నుందు రెప్పుడున్. 505**

**ప్రతి :** ఆ, మహనీయ= మహిమగల; పట్టణమునందున్= పురమందు (వైకుంఠంలో); వసియించెడివారలు= నివసించే భక్తులు; ఆత్మనిష్కామఫలంబు+ఎ= తమకు ఏ కోర్కెలు లేని ఫలితాన్నే; సత్+ఫలముగాన్= ఉత్తమమైన ఫలమని; తలపోసి= అనుకొని; ఎప్పుడున్= అన్నివేళల; ముముక్షుధర్ములు+ఐ= మోక్షాన్ని కోరేవారి ధర్మాలను పాటించువారై (ముముక్షు స్వభావం కలవారు); శ్రీమహిళా+అధిప= లక్ష్మీదేవి మగడైన శ్రీమహావిష్ణువుయొక్క; అంఘ్రిసరసీరుహ= పాదపద్మాల; పూజలు= సేవలు; ఒనర్చుచున్= చేస్తూ; మహా+ఉద్దామ= మిక్కిలిప్రకాశవంతమైన; తదీయరూపములన్= ఆ వైకుంఠమూర్తులనే; తాల్చి= ధరించి; సుఖించుచున్+ఉందురు= సుఖపడుతుంటారు.

**తా :** ఆ వైకుంఠపురంలో నివసించేవారు తమకు కర్మఫలత్యాగమే మహాఫలమని భావిస్తారు. మోక్షమే తమపాలిటి ధర్మంగా భావించి, వైకుంఠస్వరూపులై శ్రీహరి పాదపద్మాల్ని సేవిస్తూ సంతోషిస్తుంటారు.

**విశే : నిష్కామఫలం :** సకామఫలం, నిష్కామఫలం అని ఫలితం రెండు రకాలు. చేసే కర్మకు ఫలితం ఆశిస్తే అది 'సకామఫలం' అవుతుంది. ఇది సగుణోపాసకుల ధర్మం. చేసేకర్మకు ఏ ఫలితాన్ని ఆశించనట్లయితే దాన్ని 'నిష్కామఫలం' అంటాం. ఇది నిర్గుణోపాసకుల ధర్మం.

**చ. విగతరజస్తమోగుణుఁడు విశ్రుతచారుయశుండు శుద్ధ స**
**త్త్వగుణుఁడజుండనాది భగవంతుఁడనంతుఁడనంతశక్తియున్**
**నిగమచయాంతవేద్యుఁడు వినిశ్చలనిర్మలధర్మమూర్తియు**
**న్నగు హరిపేరఁ బెంపెసఁగు నన్నగరోపవనమ్ము లిమ్ములన్. 506**

**ప్రతి :** ఆ+నగర= ఆ వైకుంఠ పురమందలి; ఉపవనమ్ములు= ఉద్యానవనాలు; ఇమ్ములన్= ఇంపుగా; విగత= అంతరించినట్టి; రజస్+తమస్+గుణుఁడు= రజోగుణం మరియు తమోగుణం కలవాడును; విశ్రుత= ప్రసిద్ధికెక్కిన; చారు= ఒప్పిదమైన;

యశుండు= కీర్తి గలవాడును; శుద్ధసత్త్వగుణుఁడు= స్వచ్ఛమైన సాత్త్వికగుణం గలవాడును; అజుండు= పుట్టుక లేనివాడును (పరబ్రహ్మస్వరూపుడనిభావం); న+ఆది= మొదలు లేనివాడును (తుదిలేనివాడనేది అధ్యాహారం); భగవంతుఁడు= సుఖమిచ్చువాడును; న+అంతుడు= అంతం లేనివాడును; న+అంతశక్తియున్= అంతులేని తేజస్సు కలవాడును; నిగమచయ+అంతవేద్యుఁడు= వేదాంతాల సమూహంచే తెలియబడువాడును, వినిశ్చల= ఏమాత్రం కదలికలేని, నిర్+మల= స్వచ్ఛమైన, ధర్మమూర్తియున్= ధర్మమే ఆకారమైనవాడును, అగు= అయినట్టి, హరిపేరన్= శ్రీమహావిష్ణువు పేరుతో, పెంపు+ ఎసఁగున్= వృద్ధిగలవై ఒప్పారును.

**తా :** ఆ వైకుంఠంలో నివాసమున్న స్వామి శ్రీమన్నారాయణుడు. ఆయన రజోగుణతమోగుణాలకు దూరమైనవాడు. విస్తారమైన పేరుప్రతిష్ఠలు గలవాడు. సత్త్వగుణోపేతుడు. ఆయనకు చావుపుట్టుకలు లేవు. సమస్తసుఖాలు ఇచ్చేవాడు. తుదిమొదలు లేనివాడు. మహాశక్తిమంతుడు. వేదవేద్యుడు. పొరపొచ్చాలు లేని ధర్మమూర్తి. ఆ నగరమందలి ఉద్యానవనాలన్నీ ఆ భగవంతుని పేర చెలామణి అవుతున్నాయి.

**వ. మఱియుఁ గైవల్యంబు మూర్తీభవించిన తెఱంగునం బొలుపారుచు "నైశ్శ్రేయస" నామంబున నభిరామంబై సతతంబును సకలర్తుధర్మంబులు గలిగి యర్థిజనంబుల మనంబుల ఘనంబులుగ నీరిక లెత్తిన కోరికలు సారికలు గొన నొసంగుచు నితర తరురహితంబులును గామదోహన సహితంబులును బుష్పఫల భరితంబులునై తనర్చు సంతానవన సంతానంబులును, సమంచిత వసంత సమయ సౌభాగ్య సంపదభిశోభిత వాసంతికాకుసుమ విసర పరిమళ మిళిత గళిత మకరంద లలితామోద ముదిత హృదయులై, యఖండతేజోనిధి యగు పుండరీకాక్షు చరిత్రంబు లుగ్గడింపలేక ఖండితజ్ఞానులయ్యును నిరతిశయ విషయసుఖానుభవ కారణం బగుట నిందిరాసుందరీరమణ చరణ సేవా విరమణ కారియై యున్నదని తలంచి తద్గంధ ప్రాపక గంధవహునిం దిరస్కరించి నారాయణ భజనపరాయణులై చరియించు సుందరీ యుక్తులైన వైమానికులును, వైమానిక మానసోత్సేకంబుగం బారావత హంస సారస శుక పిక చాతక తిత్తిరి మయూర రథాంగ ముఖ్య విహంగ కోలాహల విరామంబుగా నరవిందనయన కథాగానంబు లనూనంబులుగా మొరయ మదవదిందిందిర సందోహకలిత పుష్పవల్లీమతల్లికలును, నకుంఠిత చరిత్రుండైన వికుంఠనిలయుని కంఠంబునం దేజరిల్లు విలసిత తులసీదామంబుం గనుంగొని యీ తులసీదామంబు హరి మంగళగళవిలగ్నంబై యుండు సౌభాగ్యంబు వడయుట కేమి తపంబు గావించెనో యని బహూకరించు చందంబున నొప్పు చందన మందార కుందారవింద పున్నాగ నాగ వకుళాశోక కురవకోత్పల పారిజాతాది ప్రసూనమంజరులును, మంజరీ పుంజ రంజిత నికుంజంబులయందు నుత్తుంగ పీన కుచ భారాకంపిత మధ్యంబులుఁ గటితట ఘటిత కనకమేఖలా కలాప నినదోపలాలిత నీల దుకూల శోభిత పృథునితంబభరాలసయాన హసిత కలహంస మయూర గమనంబులు, నసమశర కుసుమశర విలసితంబు నపహసించు నయన కమలంబులుం గలిగిన సుందరీ సందోహంబులం దగిలి కందర్ప కేళీ విహారంబుల నానందంబు నొందక ముకుంద చరణారవింద సేవాపరిలబ్ధ మరకత వైడూర్య హేమమయ విమానారూఢులై హరిదాసులు విహరించు పుణ్యప్రదేశంబులును, నిందిరాసుందరి త్రైలోక్య సౌందర్యఖని యైన మనోహరమూర్తి**

**ధరియించి రమణీయ రణిత మణి నూపుర చరణారవిందయై నిజహృదయేశ్వరుండైన సర్వేశ్వరుని మందిరంబునం జాంచల్య దోష రాహిత్యంబుగ వర్తింపం గరకమల భ్రమణీకృత లీలాంబుజాతయై తన నీడ కాంచన స్ఫటికమయ కుడ్యప్రదేశంబులం బ్రతిఫలింప శ్రీనికేతనుని నికేతన సమ్మార్జన కైంకర్యంబు పరమధర్మంబని తెలుపు చందంబునం జూపట్టుచు నిజవనంబునం దనరు సౌరభాభిరామంబులగు తులసీదళదామంబుల నాత్మనాయకుని చరణారవిందంబుల నర్చించుచు నొసలి మృగమదపుటసలున మసలుకొని తుంపెసలాడు కురులును, లలిత తిలప్రసూన రుచిరాభ నాసం దనరు మోముఁదామర విమల సలిలంబులఁ బ్రతిబింబింప నిజమనోనాయకుచేతం జుంబితంబగుటగాఁ దలంచి లజ్జావనతవదన యై యుండంజేయు ప్రవాళలతికాకులంబులైన కూలంబులు గల నడబావులును గలిగి పుణ్యంబునకు శరణ్యంబును, ధర్మంబునకు నిర్మలస్థానంబును, సుకృతమూలంబునకు నాలవాలంబునునయి పొలుపొందుచుండు.** **507**

**ప్రతి :** మఱియున్= (హరిపేరుతో ఒప్పుటయేగాక) ఇంకా; కైవల్యంబు= మోక్షం; మూర్తీభవించిన= రూపుకట్టినట్టి; తెఱంగునన్= విధంగా; పొలుపారుచున్= ఒప్పారుచు; 'నైశ్రేయస'= (మోక్షప్రదాయకము) ఈ పేరుగలవనం; నామంబునన్= పేరుతో; అభిరామంబు+ఐ= మనోజ్ఞమై; సతతంబును= ఎల్లప్పుడు; సకల+ఋతుధర్మంబులు= ఆ యా ఋతువుల స్వభావం; కలిగి; అర్థిజనంబుల= యాచకుల; మనంబులన్= ఎదలయందు; ఘనంబులుగన్= గొప్పగా; ఈరికలు+ఎత్తిన= మొలకెత్తిన; కోరికలు= కోర్కెలు, (కాంక్షలు); సారికలు+కొనన్= విస్తరింపగా; ఒసంగుచున్= ఇస్తూ; ఇతరతరు= వేరే చెట్లు; రహితంబులును= లేనివియు; కామదోహనసహితంబులును= కోర్కెలను పిండుటతోకూడినవి; పుష్పఫలభరితంబులును+ఐ= పూలతో, పండ్లతోకూడినవై; తనర్చు= ఒప్పారుచున్న; సంతానవన= కల్పవనాల; సంతానంబులును= గుంపును; సమ్+అంచిత= మిక్కిలి ఇంపైన; వసంతసమయ= వసంతకాలంలో; సౌభాగ్యసంపద్= ఆహ్లాదంగొల్పే సంపదచేత; అభిశోభిత= కాంతిమంతమైన; వాసంతికాకుసుమ= వసంతఋతువులో పూచే పూల; విసరపరిమళ= ప్రసరించిన వాసనచే; మిళిత= కూడినట్టిదై; గళిత= స్రవించిన; మకరంద= తేనెవలని; లలిత+ఆమోద= ప్రియమైన వాసనచేత; ముదితహృదయులు+ఐ= సంతోషించిన హృదయం గలవారై; అఖండ తేజస్+నిధి+అగు= మొక్కవోని చైతన్యానికి ఆధారమైనట్టి; పుండరీక+అక్షు= తెల్లదామరలవంటి కన్నులుగల శ్రీహరి; చరిత్రంబులు= కథలు; ఉగ్గడింపలేక= వాకొనజాలక; ఖండితజ్ఞానులు+అయ్యున్= మొక్కవోయిన జ్ఞానంకలవారైనప్పటికి; నిర్+అతిశయ= మిక్కిలి అధికమైన; విషయసుఖ+అనుభవ= ఇంద్రియ సుఖాలవల్ల కల్గిన అనుభూతియే; కారణంబు+అగుటన్= హేతువైనందువల్ల; ఇందిరాసుందరీ= అందగత్తె అయిన శ్రీదేవి; రమణ= భర్తయైన శ్రీహరి; చరణసేవా= పాద సేవనుండి; విరమణకారి+ఐ= తప్పుకొనేట్టు చేసేదై; ఉన్నది+ అని తలంచి= ఉందనిభావించి; తద్+గంధ= ఆ పూల వాసనను; ప్రాపక= కల్గించేటటువంటి; గంధవహునిన్= గాలిని; తిరస్కరించి= పోద్రోచి; నారాయణభజన= విష్ణువునుకొల్చుటయందు; పరాయణులు+ఐ= ఆసక్తిగలవారై; చరియించు= సంచరిస్తున్న; సుందరీయుక్తులు+ఐన= తమ భార్యలతో కలిసినవారైన; వైమానికులును= విమాన మెక్కి సంచరించే గంధర్వులును; వైమానిక= విమానయానంచేసేవారి; మానస+ఉత్+సేకంబుగన్= మనస్సులకు ఉల్లాసం కలిగేట్లు; పారావత= పావురాలు; హంస= అంచలు; సారస= బెగ్గురుపక్షులు; శుక= చిలుకలు; పిక= కోయిలలు; చాతక= వానకోయిలలు; తిత్తిరి= తీతువుపిట్టలు; మయూర= నెమళ్ళు; రథాంగ= చక్రవాకాలు; ముఖ్య= ఈ మొదలైన;

విహంగ= పక్షుల; కోలాహల= కిలకిల ధ్వనులకు; విరామంబుగాన్= విశ్రాంతిగొల్పునదిగా; అరవిందనయన= తామరలవంటికన్నులవాడైన మహావిష్ణువు; కథాగానంబులు= కథలను పాడుటలు; న+నూనంబులుగాన్= వెలితిలేకుండ (అవిశ్రాంతంగా); మొరయన్= మారుమ్రోగగా; మదవత్= మత్తెక్కిన; ఇందిందిర= తేనెటీగల; సందోహ= గుంపుచే; కలిత= కూడిన; పుష్పవల్లీమతల్లికలును= శ్రేష్ఠమైన పూలతీగెలును; అకుంఠిత= మొక్కవోని; చరిత్రుండు+ఐన= కథాగతికలవాడైనట్టి; వికుంఠనిలయుని= వైకుంఠమే నివాసంగా గల శ్రీమన్నారాయణుని; కంఠంబునన్= మెడయందు; తేజరిల్లు= కాంతిని వెదజల్లుచున్న; విలసిత= విలాసవంతమైన; తులసీదామంబున్= తులసిమాలను; కనుంగొని= చూచి; ఈ తులసీదామంబు= ఈ తులసిదండ; హరి= విష్ణువు; మంగళ= పవిత్రమైన; గళ= కంఠమందు; విలగ్నంబు+ఐ= వ్రేలాడేదై; ఉండు సౌభాగ్యంబు= ఉండే పుణ్యం; పడయుటకున్= పొందేందుకు; ఏమితపంబు= ఎలాటి తపస్సు; కావించెన్+ఓ+అని= చేసికొందో అని; బహూకరించుచందంబునన్= మన్నించటానికో అన్నట్లు; ఒప్పు= కనువిందుగొల్పే; చందన= గంధంచెట్లు; మందార= కల్పవృక్షాలు; కుంద= మల్లెచెట్లు; అరవింద= తామరలు; పున్నాగ= పొన్నలు; నాగ= గన్నేరు; వకుళ= పొగడలు; ఉత్పల= నల్లకలువలు; పారిజాత= దేవదారువులు; ఆది= మొదలైన; ప్రసూనమంజరులును= పూగుత్తులును; మంజరీపుంజ= పూలగుత్తులగుంపుచే; రంజిత= ఒప్పారుచున్న; నికుంజంబుల+అందున్= పొదరిళ్ళలో; ఉత్+తుంగ= మిక్కిలి ఉబ్బిన; పీన= బలసిన; కుచభార= చన్నుల బరువుచే; ఆకంపిత= ఇటునటు కదలింపబడిన; మధ్యంబులున్= నడుములుగలవారును; కటితట= ఒడ్డైనమొలపై; ఘటిత= కట్టబడిన; కనకమేఖలాకలాప= బంగారు మొలనూలి ఒడ్డాణపు; నినద= ధ్వనిచే; ఉపలాలిత= జోకొట్టబడిన; నీలదుకూల= నల్లనిపట్టుబట్టలచే; శోభిత= సింగారింపబడిన; పృథు= పెద్దవైన; నితంబభర= పిరుదుల బరువుచే; అలసయాన= మందగమనంగలస్త్రీలచేత; హసిత= ఎగతాళి చేయబడిన; కలహంసమయూరగమనంబులును= రాయంచలు మరియు నెమళ్ళ నడకలవంటి నడకలును (ఆ కాంతలు రాజహంసల్లా నెమళ్ళలా నడుస్తారని భావం); అసమశర= బేసిసంఖ్యగల బాణాలవాడైన (పంచబాణుడు) మన్మథుని; కుసుమశర= పూలబాణాల; విలసితంబున్= విలాసాన్ని; అపహసించు= పరిహసించే; నయనకమలంబులున్= నేత్రపద్మాలు; కలిగిన; సుందరీసందోహంబులన్= అందగత్తెల సమూహాలను; తగిలి= ఒరసుకొని; కందర్పకేళీ విహారంబులన్= మన్మథక్రీడల సయ్యాటలచే; ఆనందంబు= సంతోషాన్ని; ఒందక= పొందకుండా; ముకుంద= ముక్తిదాయకుడైన దామోదరునియొక్క; చరణ+అరవింద= పాదపద్మాల; సేవా= సేవచేత; పరిలబ్ధ= పొందబడిన; మరకత= పచ్చరాళ్ళు, (గరుడపచ్చలు); వైడూర్య= విదూరదేశపు రత్నాలుగల; కనకమయ= బంగారపు; విమాన+ఆరూఢులు+ఐ= విమానాల్ని ఎక్కినవారై; హరిదాసులు= విష్ణుభక్తులు; విహరించు= తిరుగుతున్న; పుణ్యప్రదేశంబులును= పవిత్రమైన స్థలాలును; ఇందిరాసుందరి= సౌందర్యవతియైన లక్ష్మీదేవి; త్రైలోక్య సౌందర్యఖని+ఐన= ముల్లోకాల్లో అందచందాలకు గని అయిన; మనోహరమూర్తిన్= ఆకర్షణీయమైన రూపాన్ని; ధరియించి= తాల్చి; రమణీయ= మదికింపైనట్టి; రణిత= మ్రోతగల; మణి= రత్నాలుతాపిన; నూపుర= అందెలతోడి; చరణ+అరవింద+ఐ= పాదపద్మాలు గలదై; నిజహృదయ+ఈశ్వరుండు+ అయిన= తన భర్తయైన; సర్వ+ఈశ్వరుని= అంతటికి ప్రభువగు ఆ నారాయణుని; మందిరంబునన్= ఇంటిలో; చాంచల్యదోషరాహిత్యంబుగన్= చపలత్వమనే దోషంలేనిదిగా; వర్తింపన్= నడయాడగా; కరకమల= తామరలవంటి చేతులచే; భ్రమణీకృత= త్రిప్పబడిన; లీలా+అంబుజాత+ఐ= విలాసపద్మం గలదై; తననీడ= తనఛాయ; కాంచన= బంగారు; స్ఫటిక= పటికపురాళ్ళతో కూడిన; కుడ్యప్రదేశంబులన్= గోడలుగల స్థలాలయందు; ప్రతిఫలింపన్= అచ్చుపడగా; శ్రీనికేతనుని= లక్ష్మీధవుని; నికేతనసమ్మార్జన= మందిరాన్ని శుభ్రం చేయుట అనే; కైంకర్యంబు= సేవ; పరమధర్మంబు+అని= గొప్పపనియని; తెలుపు చందంబునన్= తెలియజేయునట్లు; చూపట్టుచున్= కన్పిస్తూ; నిజవనంబునన్= తనవనమందు;

తనరు= విలసిల్లునట్టి; సౌరభ= సువాసనలచే; అభిరామంబులు+అగు= ఆహ్లాదంగొల్పేవైన; తులసీదళదామంబులన్= తులసిదళాల మాలలచేత; ఆత్మనాయకుని= తనమగడైన శ్రీహరియొక్క; చరణ+అరవిందంబులన్= పాదపద్మాలను; అర్చించుచున్= సేవిస్తూ; నొసలి= నుదుటియందలి; మృగమదము+అసలున= కస్తూరిద్రవమందు; మసలుకొని= తడిసి; తుంపెసలాడు= చలిస్తున్న; కురులును= వెంట్రుకలును; లలిత= సుందరమైన; తిల ప్రసూన= నువ్వుపువ్వుల; రుచిర+ఆభ= అందమైన కాంతిగల; నాసన్= నాసికతో; తనరు= ఒప్పారునట్టి; మోముఁదామర= ముఖకమలం; విమలసలిలంబులన్= స్వచ్ఛమైన నీటియందు; ప్రతిబింబింపన్= అచ్చుపడగా; నిజమనోనాయకునిచేతన్= తనమగని చేత; చుంబితంబు+అగుటగాన్= ముద్దాడుటగా; తలంచి= భావించి; లజ్జ= సిగ్గుచేత; అవనతవదన+ఐ= వంచినతలగలదై, (సిగ్గుతో తలదించుకొన్నదై); ఉండన్+చేయు= ఉండేటట్లుచేసే; ప్రవాళలతికాకులంబులు+ఐన= పగడపు తీగెల సమూహం గలవైన; కూలంబులు= గట్టులు; కల= కల్గిన; నడబావులును= దిగుడుబావులును; కలిగి= కూడి; పుణ్యంబునకున్= పుణ్యమునకు; శరణ్యంబును= రక్షకమైనదియు; ధర్మంబునకున్= ధర్మానికి; నిర్మలస్థానంబును= స్వచ్ఛమైన తావైనదియు; సుకృతమూలంబునకున్= పుణ్యం అనే వేరుకు; ఆలవాలంబును+అయి= పాదు అయి; పొలుపు+ఒందుచున్+ఉండున్= ఒప్పారుచుండును.

**తా :** అది పరాత్పరుడైన శ్రీమన్నారాయణుని నివాసం వైకుంఠం. అక్కడ నివసించేవాళ్ళు నిష్కాములై శ్రీహరిని సేవిస్తారు. శుద్ధసత్త్వమూర్తియైన విష్ణుమూర్తి భక్తుల కానందాన్ని కూరుస్తాడు. అక్కడ "నిశ్శ్రేయస"మనే పరమార్థస్వరూపమైన ఒక వనముంది. ఆ వనంలో అన్ని ఋతువుల్లో పూలు పూచి, కాయలు కాచే కల్పవృక్షాలు కోకొల్లలుగా ఉన్నాయి. గంధర్వులు విమానాల్లో తమ ప్రియురాండ్రతో అక్కడికి వచ్చి భగవంతుని కథల్ని గానం చేస్తారు. ఆ సరోవరానికి దగ్గర ఒక మాధవీ లత ఉంది. దాని మధురవాసనతో కూడిన పిల్లగాలి మనసులకు హాయి గొల్పుతుంది. అందర్నీ ఆకర్షిస్తుంది. అయినా భక్తుల మనస్సులు మాధవీలతలకంటెకూడ మనోజ్ఞమైన హరికథలపైననే ఉంటాయి. ఆ వనమందలి తుమ్మెదలు ఝమ్మని ఝుంకారాలు చేస్తూ విష్ణుకథలు గానం చేస్తుంటే పావురాలు, కోయిలలు బెగ్గురుపిట్టలు, చకోరాలు, రాయంచలు, తిత్తిరిపక్షులు, నెమళ్ళు అల్లరిచేయటం మానుకొని తుమ్మెదలు గానం చేసే విష్ణుకథలనే వింటూ తలలూపి ఆనందిస్తున్నాయి. విష్ణుదేవునికి తులసి అంటె చాలప్రీతి. కాబట్టి వనంలో ఉన్న మందారాలు, మల్లెలు, సంపెంగలు, గోరంటలు, కలువలు, తామరలు, పున్నాగాలు, నాగకేసరాలు, పారిజాతాలు మంచి పరిమళం గలవే అయినా తులసి చేసిన తపస్సే గొప్పదని దాని సౌభాగ్యాన్ని మెచ్చుకుంటాయి.

ఇక లక్ష్మీదేవి గొప్ప అందగత్తె. ఆమెది చంచలస్వభావం. ఎవ్వరిదగ్గర చాలాకాలం కాపురం ఉండదు. కాని ఆమె తన స్వభావానికి స్వస్తి చెప్పి విష్ణుమందిరంలో స్థిరంగా కాపురముంటోంది. పాదపద్మాల అందెలు ఘల్లుఘల్లు మనేట్లు వైడూర్యమణులు తాపిన బంగారుగోడలతో నిర్మించిన సుందరభవనంలో నడుస్తున్నప్పుడు ఆమె దివ్యసుందరవిగ్రహం వైడూర్యమణులపై ప్రతిఫలిస్తుంది. శ్రీదేవి నిశ్శ్రేయసవనంలో పగడపుపావంచలుగల్గి అమృతతుల్యమైన నీరుగల సరస్సులందు విహరిస్తూ వాటిలో దంతక్షతమైన తన నెమ్మోవి ప్రతిఫలిస్తే చూచి 'ఇలా తననాథుని ప్రసాదం పొందగల్గా'నని మనసులో ఉప్పొంగిపోతుంది. ఆ వనం పుణ్యానికి శరణ్యమైంది. ధర్మానికి నెలవైంది. సుకృతానికి ఆలవాలమైంది.

**చ. హరివిముఖాత్ము లన్యవిషయాదృతచిత్తులుఁబాపవర్తులున్**
**నిరయనిపాతహేతువును నింద్యచరిత్రము నైన దుష్కథా**
**నిరతిఁజరించువారలును నేరరు పొందఁగ నిందిరామనో**
**హరచరణారవిందభజనాత్మకు లుండెడు గొంది నారయన్. 508**

**ప్రతి :** ఆరయన్= ఆలోచించినట్లయితే; హరివిముఖ+ఆత్ములు= హరికి వ్యతిరేకమైన మనస్సుగలవారు; అన్యవిషయ= (విష్ణుపరం కాని) ఇతర విషయాలయందు; ఆదృత= తగుల్కొన్న; చిత్తులున్= మనస్సుగలవారును; పాపవర్తులున్= పాపవృత్తితో జీవించేవారును; నిరయనిపాత= నరక కూపంలో కూరుకుపోవటానికి; హేతువును= కారణమైనదియు; నింద్యచరిత్రమున్= గర్హింపదగ్గనదవడి గలదియు; ఐన= అయినట్టి; దుస్+కథానిరతిన్= చెడుకథలయందు ఆసక్తితో; చరించు వారలును= నడిచేటటువంటి వ్యక్తులును; ఇందిరా మనోహర= లక్ష్మీదేవిభర్తయైనవిష్ణుమూర్తి; చరణ+అరవింద= పాదపద్మాల్ని; భజన+ఆత్మకులు= సేవించే హృదయం గలవారు; ఉండెడుగొందిన్= నివసించే మూలను (వైకుంఠమూలమని అర్థం); పొందఁగన్= పొందుటకు; నేరరు= తగరు (అనర్హులు).

**తా :** మాధవుడంటే గిట్టనివాళ్ళు, అన్యదేవతా విషయాల్లో ఆసక్తిగలవాళ్ళు, పాపం మూటగట్టుకొన్నవాళ్ళు, నరకానికి దారితీసేవి, అందరిచే ఈసడింపబడేవి అయిన చెడ్డకథల్లో ఆసక్తి కల్గినవాళ్లు, ఆ శ్రీనాథుని పాదపద్మాలను ఎల్లప్పుడు కొలిచే భక్తుల నివాసాన్ని (వైకుంఠం) చేరుకోలేరు.

**వ. వెండియు. 509**

**ప్రతి :** వెండియున్= మఱియు

**తా :** ఇంతేగాక, ఇంకా.

**చ. హరిఁబరమేశుఁగేశవు ననంతు భజింపఁగ ధర్మతత్త్వ ధీ**
**పరిణతిసాధనంబగు స్వభావముఁదాల్చినయట్టి మర్త్యు లా**
**సరసిజనేత్రు మాయను భృశంబుగ మోహితులై తదంఘ్రి పం**
**కరుహము లర్థిమైఁ గొలువఁగానమిఁబొందరు తత్పదంబునన్. 510**

**ప్రతి :** పరమ+ఈశున్= మోక్షానికి ప్రభువైనవాడును; (మీదికి అధిపతి) కేశవున్= నిగనిగలాడే జుట్టుగలవాడును; అనంతున్= అంతము (తుది) లేనివాడును; (అగు); హరిన్= విష్ణుమూర్తిని; భజింపఁగన్= కొల్చుటకై; ధర్మతత్త్వధీ= ధర్మతత్త్వముతో కూడిన బుద్ధియొక్క; పరిణతి= పరిపక్వతకు; సాధనంబు+అగు= ఆధారమైన; స్వభావమున్= స్వభావాన్ని; తాల్చిన+అట్టి= కల్గినటువంటి; మర్త్యులు= నరులు; సరసిజనేత్రు= తామరలవంటి కన్నులుకలవాడైన ఆ ముకుందుని; మాయను= మాయచేత (వైష్ణవమాయ); భృశంబుగన్= మిక్కిలిగా; మోహితులు+ఐ= మూర్ఛితులై; తద్+పదంబునన్= ఆ మార్గములో (మోక్షమార్గంలో); అర్థిమైన్= కోర్కెతో; కొలువన్+కానమిన్= ఆరాధించనందువల్ల; తద్+అంఘ్రి= ఆ విశ్వనాథుని పాదములనెడి; పంకరుహములు= కమలములు; పొందరు= పడయలేరు.

**తా :** మోక్షాధీశ్వరుడును, నిగనిగలాడే జుట్టుగలవాడును, మొదలుతుది లేనివాడును అయిన శ్రీమన్నారాయణుణ్ణి ధర్మతత్త్వజ్ఞులై, కొంత అనుభవం కూడగట్టిన కొందరు మానవులు (ఆయన్ని) సేవించాలనుకొని, ఆ సర్వేశ్వరుని మాయవల్ల వైకుంఠంలో స్వామి పాదాల్ని పొందలేకపోతున్నారు.

**చ. మఱియు సరోరుహోదరుని మంగళదివ్యకథానులాపని**
**ర్భరపరితోషబాష్పకణబంధురచారుకపోలగద్గద**

**స్వరపులకీకృతాంగు లగువారలు నిస్స్పృహచిత్తు లత్యహం**
**కరణవిదూరు లుందురు సుకర్ముల యుండెడి పుణ్యభూములన్. 511**

**ప్రతి :** మఱియున్=అంతేకాక; సరస్+రుహ+ఉదరుని= కమలం గర్భమందున్నవాడగు హరియొక్క; మంగళ= శుభంకరమైన; దివ్య= పవిత్రమైన; కథా+అనులాప= కథల్ని మాటిమాటికి స్మరించుటవల్ల కల్గిన; నిర్భర= అడ్డుకొన శక్యంకాని; పరితోషబాష్పకణ= సంతోషంచే కల్గిన కన్నీటి బిందువులచే; బంధుర= దట్టమైన; చారు= అందమైన; కపోల= చెక్కిళ్ళుగల్గి; గద్గదస్వర= బొంగురుపోయిన గొంతుకతో; పులకీకృత+అంగులు+అగువారలు= గగుర్పొడిచిన అవయవాలు గల్గిన వారును; నిస్స్పృహచిత్తులు= మనస్సునందు ఎలాంటికోర్కెలు లేనివారును; అతి+అహంకరణ విదూరులు= మిక్కిలి అహంకారానికి చాలా దూరంగా ఉండేవారలును; సుకర్ముల= పుణ్యకార్యాలు చేసేవారు; ఉండెడి= నివసించే; పుణ్యభూములన్= పుణ్యస్థలాలలో; ఉందురు= ఉంటారు.

**తా :** మంచిపనులు చేసి సుకృతాత్ములనిపించుకొనే భక్తులు వైకుంఠపు పుణ్యస్థలంలో నివసిస్తారు. ఆ పుణ్యభూముల్లో నివసించేవారు శ్రీమన్నారాయణుని పవిత్రగాథల్ని వింటూ సంతోషంతో ఉప్పొంగిన కన్నీళ్లు కారడంవల్ల వాళ్ల చెక్కిళ్లు అందంగా ఉంటాయి. బొంగురుపోయిన కంఠంతో శరీరంపై పులకలు రేగి ఉంటారు. వారికి ఏ విధమైన కోర్కెలుండవు. అహంకారం వారిలో మచ్చుకైనా కన్పించదు. (ఈ లక్షణాలు గలవాళ్ళే ఆ పుణ్యభూముల్లో ఉండటానికి అర్హులని పిండితార్థం).

**వ. అందు. 512**

**ప్రతి :** అందు= ఆ వైకుంఠమందు

**తా :** ఆ వైకుంఠ ధామంలో

**మ. వరవైకుంఠము సారసాకరము, దివ్యస్వర్ణశాలాంక గో**
**పురహర్మ్యావృతమైన తద్భవన మంభోజంబు, దన్మందిరాం**
**తరవిభ్రాజితభోగికర్ణిక, తదుద్యద్భోగపర్యంకమం**
**దిరవొందన్ వసియించు మాధవుఁడు దా నేపారు భృంగాకృతిన్. 513**

**ప్రతి :** వరవైకుంఠము= శ్రేష్ఠమైన ఆ వైకుంఠనగరం; సారస+ఆకరము= పద్మాకరం (సరోవరమనిఅర్థం); దివ్య= పవిత్రమైన; స్వర్ణశాలా+అంక= బంగారుశాలకు సమీపమందున్న (శాల అనగా ఇంటి ముందున్న ఖాళీస్థలం); గోపుర= గోపురములుగల; హర్మ్య+ఆవృతము= మేడతో కూడినది; ఐన= ఐనట్టి; తద్+భవనము= ఆ స్వామి ఇల్లు; అంభోజంబు= తామర; తద్+మందిర+అంతర= ఆ ఇంటి మధ్యభాగమందు; విభ్రాజిత= వెలుగుచున్న; భోగి= పాము (అనంతుడు); కర్ణిక= తామరదుద్దు; తద్= ఆ నగరాన; ఉద్యత్= గొప్పదైన; భోగపర్యంకమందున్= సుఖశయ్యపైన (అనంతుని శరీరమనే పడక అనికూడ); మాధవుఁడు= లక్ష్మీవల్లభుడైన హరి; తాన్= స్వయంగా; భృంగ+ఆకృతిన్= తుమ్మెదవలె; ఇరవు+ఒందన్= స్థానంగా చేసుకుని; వసియించున్= నివసిస్తాడు.

**తా :** ఆ వైకుంఠ ధామం ఒక సరోవరం. అక్కడొక బంగారుశాల. దాని చెంత గోపురంతోడి మేడ. ఆ మేడ కల్గిన భవనం ఒక పద్మం. ఆ మందిరంలో ధగధగమెరుస్తున్న అనంతనామక సర్పమే తామరదుద్దు. అక్కడే అనంతశయనం. దానిపైన ఆ సిరిమగడు జుంటీగలా నివసిస్తాడు.

**వ. అంత. 514**

**ప్రతి :** అంతన్= అంతట, లేక ఆ సమయంలో

**మ. హరిచేఁబాలితమైన కాంచనవిమానారూఢ మైనట్టి స**
**త్పురుషానీకముచేఁదనర్చి విభవాపూర్ణప్రభావోన్నతిం**
**గర మొప్పారు తదీయధామము జగత్కల్యాణమూర్తుల్ మునీ**
**శ్వరు లర్థిన్ నిజయోగశక్తిఁ బరితుష్టస్వాంతులై చెచ్చెరన్. 515**

**ప్రతి :** హరిచేన్= విష్ణుదేవునిచే; పాలితము+అయిన= పరిపాలింపబడునట్టిదై; (తదీయధామముతో అన్వయం); కాంచనవిమాన+ఆరూఢము+ఐనట్టి= బంగారు గోపురం కలిగినట్టిది; సత్+పురుష+అనీకముచేన్= యోగ్యులైన మానవుల సమూహంచేత; తనర్చి= ఒప్పి; విభవ+ఆపూర్ణ= వైభవముచే నిండిన; ప్రభావ+ఉన్నతిన్= అతిశయమైన కాంతితో; కరము= మిక్కిలి; ఒప్పారు= వెలుగొందు; తదీయధామమున్= ఆహరివాసమును; జగత్+కళ్యాణమూర్తుల్= లోకశ్రేయస్సును కోరేవారైన; ముని+ఈశ్వరులు= యతీశ్వరులు (సనకాదులు); నిజయోగశక్తిన్= తమదైన యోగబలంతో; పరితుష్టస్వాంతులు+ఐ= మిక్కిలి సంతోషించిన మనస్సుగలవారై; అర్థిన్= కోర్కెతో; చెచ్చెరన్– చెర+చెరన్= వేగంగా...

**తా :** శ్రీహరిచే పాలింపబడునది, బంగారు గోపురంకలది, సత్పురుషుల సమూహంచే ఒప్పినట్టిది, అతిశయమైన మహిమనే ప్రకాశించునది అయిన శ్రీహరి సౌధానికి, లోకశ్రేయస్సు కోరే మునీశ్వరులు సనకసనందనాదులు సంతృప్తిమనస్కులై యోగబలంతో వడివడిగా కోరివచ్చారు.

**వ. డాయంజని. 516**

**ప్రతి :** డాయన్+చని= (ఆసౌధాన్ని) సమీపించి,

**తా :** మునులు హరివాసం దగ్గరికి వచ్చారు.

**చ. మరకతరత్నతోరణసమంచిత కుడ్యకవాటదేహళీ**
**విరచితషట్సుకక్ష్య లరవిందదళాక్షవిలోకనోత్సవా**
**దరమతి నన్యముం గనక దాఁటి యనంతరకక్ష్య యందు ని**
**ద్దఱను దదీయపాలుర నుదారసమానవయోవిశేషులన్. 517**

**ప్రతి :** (ఆ మునులు) అరవిందదళ+అక్ష= తామరరేకులవంటి కన్నులుగలవాడైన విష్ణుదేవుని; విలోకన= చూచుట అనే; ఉత్సవ= వేడుకయందు; ఆదరమతిన్= ఆసక్తిగలబుద్ధితో; అన్యమున్+కనక= ఇతరచింత లేకుండ; మరకతరత్న= పచ్చరాళ్ళమణులు పొదిగిన; తోరణ= సరాలచేత; సమ్+అంచిత= మిక్కిలి ఒప్పిదమైన; కుడ్య= గోడలు; కవాట= తలుపులు; దేహళీ= కడప మొదలగువానిచే; విరచిత= చేయబడిన; షట్+సుకక్ష్యలు= ఆరులోగిళ్ళు; దాటి= ముందుకువెళ్ళి; అనంతరకక్ష్య+అందున్= తర్వాతి ఏడవలోగిట్లో; ఉదార= తిన్నదనం గల్గిన; సమాన= సమానమైన; వయస్+విశేషులన్= యౌవన ప్రాయంగలవారిని; తదీయపాలురన్= ఆ హరివాసపు కావలికాండ్రను; ఇద్దఱన్= ఇద్దరిని...

**తా :** ఆ ఋషులు అన్యచింతన మానుకొని కేవలం ఆ కమలాక్షుని చూడాలనే ఉత్సాహం గలవారై పచ్చరాళ్ళమణులు పొదిగిన ద్వార తోరణాలతో వెలిగిపోతున్న గోడలు, తలుపులు, గడపలు గల ఆరు లోగిళ్ళు దాటి ఏడవకక్ష్యలో సమానమైన ఈడుగల ఇద్దరు హరివాసపు కావలికాండ్రను చూచారు.

**విశే : షట్ సుకక్ష్యలు :** ఆరు మంచిలోగిళ్ళు ఇక్కడ అంతరార్థముంది. ఆధ్యాత్మికప్రతీకలు ఈ లోగిళ్ళు. దేహం షట్చక్రశోభితమనీ, ఆ ఆరింటికి పైన శిరోమధ్యభాగంలో సహస్రారమనే ఏడవ చక్రముందని యోగులు చెపుతారు.

**ఆరుచక్రాలు :** 1) మూలాధారం – గుదస్థానం, 2) స్వాధిష్ఠానం – పొత్తికడుపు 3) మణిపూరం – నాభినుండిపైకి 4) అనాహతం – వక్షోభాగం, 5) విశుద్ధి – కంఠభాగం, 6) ఆజ్ఞాచక్రం – ఫాలభాగం 7) సహస్రారం – మధ్యశీర్షం. దీనికి బ్రహ్మరంధ్రమని పేరు.

**సీ. కాంచననవరత్నకటకాంగులీయక, హారకేయూరమంజీరధరులఁ**
**గమనీయసౌరభాగతమత్తమధుకర, కలితసద్వనమాలికావిరాజి**
**తోరస్థ్సలుల గదాయుతులను ఘనచతు, ర్బాహుల నున్నతోత్సాహమతుల**
**నారూఢరోషానలారుణితాక్షుల, భ్రూలతాకౌటిల్యఫాలతలుల**

**తే. వేత్రదండాభిరాముల వెలయు నమ్ము, కుందశుద్ధాంతమందిరాళిందభూమి**
**నున్న యిద్దఱ సనకాదియోగివరులు, సూచుచును వృద్ధులయ్యు నా సుభగమతులు. 518**

**ప్రతి :** కాంచన= బంగారుతోను; నవరత్న= మరకతంమొదలైన తొమ్మిది మణులతోనూ పొదిగిన; కటక= కడియాలు; అంగులీయక= ఉంగరాలు; హార= హారాలు; కేయూర= భుజకీర్తులు; మంజీర= నూపురాలు; ధరులున్= తాల్చినవారును; కమనీయ= ఇంపైన; సౌరభ= వాసనకై; ఆగత= వచ్చిన లేక మూగినట్టి; మధుకర= తుమ్మెదలచే; కలిత= కూడుకొన్న; సత్+వనమాలికా= మంచితోమాలలచే; విరాజమాన= వెలుగొందుచున్న; ఉరస్+స్థలులన్= రొమ్ముభాగములు గలవారును; గదా+యుతులన్= గదలతోకూడిన వారును; ఘన= గొప్పవైన; చతుస్+బాహులన్= నాల్గు భుజాలు గలవారును; ఉన్నత= అతిశయమైన; ఉత్సాహమతులన్= ఉత్సాహం మనసునందుగలవారును; ఆరూఢ= ఎగిసిన; రోష+అనల= కోపమనెడు అగ్నిచేత; అరుణిత+అక్షులన్= ఎరుపెక్కిన కళ్ళుగలవారును; భ్రూలతా కౌటిల్యఫాలతలులన్= బొమముడితో వంకరలు తిరిగిన నొసళ్ళుగలవారును; వేత్రదండ+అభిరాములన్= చేతిబెత్తాలచే చూడ సొబగైనవారును; (ఐ) వెలయున్= ఒప్పారుచున్న; ఆ+ముకుంద= ఆ శ్రీహరి; శుద్ధాంతమందిర= ఏకాంత (అంతఃపురం) మందిరమందలి; అళిందభూమిన్= చిన్నగది ముందుభాగంలో; ఉన్న= కావలికాస్తున్న; ఇద్దఱన్= ఇర్వురిని; సనక+ఆది= సనకుడు మొదలైన; యోగివరులు= శ్రేష్ఠులైన యోగులు (నల్వురు); చూచుచున్= చూస్తూ; ఆ సుభగమతులు= ఆ (వివేకంచేత), సుందరమైన బుద్ధిగలవారు; వృద్ధులు+అయ్యున్= ముసలివారైనను...

**తా :** సనక సనందన సనత్కుమార సనత్సుజాతులు నల్గురు యోగులు వైకుంఠమునకేగి అక్కడ విష్ణుమూర్తి యొక్క మందిరం ముందు నిల్చున్న ఇర్వురు ద్వార పాలకులను చూచారు. ఆ ఇద్దరు నవరత్నాలు పొదిగిన బంగారు కడియాలు, ఉంగరాలు, హారాలు, భుజకీర్తులు, కాళ్ళ అందెలు ధరించి ఉన్నారు. వారు ఎదపై ధరించిన సువాసనగల తోమాలలగంధానికి ఆకర్షింపబడి తుమ్మెదలు మూగుతున్నాయి. చేతుల్లో గదలు తాల్చి ఉన్నారు. వారికి నాల్గేసి భుజాలున్నాయి. చాలా

ఉత్సాహంగా కన్పిస్తున్నారు. కళ్ళల్లో కోపాగ్ని జ్వలిస్తోంది నొసళ్ళపై ముడుతలు వంకర దిరిగి ఉన్నాయి. చేతుల్లో బెత్తాలున్నాయి. మునులు మహాబుద్ధిమంతులు మరియు గొప్ప జ్ఞానవృద్ధులు. కంటికి చాలా చిన్నవారుగా కన్పిస్తారు.

**క. ధీరతఁబంచాబ్దముల కు, మారకులై కానఁబడుచు మనమున శంకం**
**గూరక చతురాత్మకు లని, వారితగమనమున డాయ వచ్చిన నెదురన్. 519**

**ప్రతి :** ధీరతన్= ధైర్యముతో; పంచ+అబ్దముల= అయిదేండ్ల పాటి; కుమారకులు+ఐ= బాలకులై; కానన్+పడుచున్= కన్పిస్తూ; మనమునన్= ఎదయందు; శంకన్= సందేహాన్ని; కూరక= కలుగకుండా; చతుర్+ఆత్మకులు= ఆత్మస్వరూపులైన నలుగురు (సనకాదులు); న+నివారిత= అడ్డుపెట్టబడని; గమనమునన్= నడకలతో; డాయన్+వచ్చినన్= సమీపించగా; ఎదురన్= తమ ఎదుట...

**తా :** ఎంతో వృద్ధులైనప్పటికి ఆత్మతత్త్వజ్ఞులైన సనకాదులు నల్వురు చూచుటకు అయిదేండ్లప్రాయంగలవాళ్ళలా కనిపిస్తూ మనస్సులో జంకుకొంకు లేకుండ చకచక నడుస్తూ శ్రీహరిద్వారం చేరబోయారు.

**క. శ్రీలలనేశ్వరదర్శన, లాలసులై యేగు బుధలలాముల నతి దు**
**శ్శీలతఁ దద్వచనప్రతి, కూలమతింబోవకుండఁగుటిలాత్మకులై. 520**

**ప్రతి :** కుటిల+ఆత్మకులు+ఐ= వక్రబుద్ధికల్గిన వారై (ద్వారపాలురు); దుస్+శీలతన్= చెడ్డనడవడికతో; తద్+వచనప్రతికూలమతిన్= తమ ఆజ్ఞని తిరస్కరించే బుద్ధితో; పోవక+ఉండన్= వెళ్ళకుండా; శ్రీలలనా+ఈశ్వర= శ్రీదేవి భర్తయైనవిష్ణువుయొక్క; దర్శన లాలసులు+ఐ= దర్శనమందాసక్తిగలవారై; ఏగు= వెళ్ళుచున్న; బుధలలాములన్= జ్ఞానశ్రేష్ఠులైన సనకాదులను...

**తా :** జ్ఞానశ్రేష్ఠులైన సనకాదిమునులు నల్వురు శ్రీమన్నారాయణుణ్ణి చూడాలనే కోర్కెతో ముందుకు వచ్చారు. ఇంతలో ఆ ఇద్దరు వేత్రహస్తులు తమ ఆజ్ఞను జవదాటకుండా వాళ్ళని ముందుకు సాగనివ్వలేదు.

**క. వారించిన వారలు బృం, దారకు లీక్షించుచుండ దారుణపటు రో**
**షారుణితాంబకులై రొద, వారించుచు వారు నచటివారును వినఁగన్ 521**

**ప్రతి :** వారించినన్= వేత్రహస్తులు అడ్డుపెట్టగా; వారలు= సనకాది మునులు; బృందారకులు= దేవతలు; ఈక్షించుచున్+ఉండన్= చూస్తుండగా; దారుణ= భయంకరమైన; పటురోష= తిరుగులేని కోపంచేత; అరుణిత= ఎర్రబడిన; అంబకులు+ఐ= కన్నులుగలవారై; రొద= కలకలమనే ధ్వనిని; వారించుచున్= అడ్డుకొనుచు; వారును= వేత్రహస్తులు; అచటివారును= అక్కడ మూగిన దేవతాదులును; వినఁగన్= వినేటట్లు.

**తా :** వేత్రహస్తులు లోపలికి వెళ్ళకుండా అడ్డుకొన్నారు. అక్కడ చేరిన దేవతలు చూస్తున్నారు. అప్పుడు సనకాదులు కోపంతో ఎర్రబారిన చూపులు గలవారై వాదోపవాదాలను నివారించి, ఆ ద్వారపాలకులు, మరియు అచ్చట మూగిన దేవతలు వినేటట్లు ఇలా అన్నారు.

**వ. ఇట్లనిరి. 522**

**ప్రతి :** ఇట్లు+అనిరి= ఈ దిగువరీతి అన్నారు...

**తా :** ద్వారపాలకులు ఈ విధంగా పలికారు.

**చ. పరము ననంతు భక్తపరిపాలు సుహృత్తము నిష్టు నీశ్వరే**
**శ్వరు భజియింపఁగోరి యనివారణ నిం దరుదేర నిచ్చలున్**
**భరితముదాత్ములై కొలువఁ బాయక తద్భజనాంతరాయత**
**త్పరమతి మాకు నిప్పు డరిపడ్డ దురాత్ముల నేఁడు గంటిరే? 523**

**ప్రతి :** పరమున్= పరమాత్ముడును; అనంతున్= తుదిలేనివాడును; భక్తపరిపాలున్= భక్తుల్ని కాపాడువాడును; సుహృత్+తమున్= చెలికాండ్రలో ఉత్తముడును; ఈశ్వర+ఈశ్వరున్= దేవదేవుడును; అయిన; ఇష్టున్= మిక్కిలి ప్రియుడైన శ్రీహరిని; నిచ్చలున్= ఎల్లప్పుడు; భజియింపన్= సేవించాలని; కోరి= తలంచి; న+నివారణన్= అడ్డులేకుండ; ఇందున్= ఈ వైకుంఠమునకు; అరుదేరన్= రాగా; భరితముద్+ఆత్ములు+ఐ= నిండైన సంతోషం మనస్సులందు కలవారై; కొలువన్+పాయక= స్వామి కొలువును వదలకుండా ఉండే; తద్+భజన= ఆ స్వామి సేవకు; అంతరాయ తత్పరమతిన్= అడ్డుపెట్టటానికి ఆసక్తిగలబుద్ధితో; మాకున్ =మాబోటివాళ్లకు; ఇప్పుడు= ఈ సమయంలో; అరిపడ్డ= అడ్డుతగిలిన; దుర్+ఆత్ములన్= దుర్మార్గుల్ని; నేఁడు= ఈ దినం; కంటిరి+ఏ= చూచారుగదా! (చూచినవారు దేవతలు).

**తా :** మునులు దేవతలనుద్దేశించి అంటున్నారు –

"పరమాత్ముడును, భక్తుల్ని పాలించేవాడును, చెలికాడును, దేవాధిదేవుడునునైన శ్రీమన్నారాయణుణ్ణి నిరంతరం సేవించాలని ఏ ఆటంకం లేకుండా ఇచ్చటికి వచ్చాం. మా సేవకు ఇప్పుడు అడ్డుతగులుతూ, మహోత్సాహంతో కాపలా కాస్తున్న ఈ దుర్మార్గులను మీరు చూచారు గదా!"

**వ. అని మఱియు సనకసనందనాదులు జయవిజయులం జూచి యిట్లనిరి, మీ మనంబుల స్వామిహితార్థంబై నిష్కపటవర్తనులమైన మాబోఁటులఁ గుహక వృత్తింగల యితరజనంబులు భగవత్సదనంబుఁ బ్రవేశింతురో యను శంకం జేసి కొందఱం బ్రవేశింపం జేయుటయుఁ, గొందఱ వారించుటయు దౌవారికస్వభావంబని వారింపఁ దలంచితిరేనిఁ బ్రశాంత దివ్యమంగళ విగ్రహుండును, గతవిగ్రహుండును, భగవంతుండును, విశ్వగర్భుండును నైన యీశ్వరుండు ప్రాప్యంబును, ప్రాపకంబును, బ్రాప్తియు నను భేదశూన్యుండు గావున మహాకాశంబునందు ఘటపటాద్యాకాశంబులు వేఱులేక యేకంబై తోఁచు చందంబున విద్వాంసులగు వా రమ్మహాత్ముని సకలాత్మభేదరహితునింగాఁ బొడగందు రదియునుంగాక లోకంబు నందు రాజులు సాపరాధులైన కింకర జనంబుల నాజ్ఞాపించుచందంబున నీశ్వరుండు దండించునో యను భయంబునంజేసి వారించితిమని తలంచితిరేని భూసుర వేషధారులమైన మాకును వైకుంఠనాయకుండైన సర్వేశ్వరునకును భేదంబు లేకుండుటం జేసి శంక సేయం బనిలేదు. ఇట్లగుట యెఱింగి మందబుద్ధులరై మమ్ము వారించిన యనుచితకర్ములగు మీరలు మదీయశాపార్హు లగుదురు గావున భూలోకంబునం గామక్రోధలోభంబులను శత్రువులు బాధింపం బుట్టుండని పలికిన. 524**

**ప్రతి :** అని= అని చెప్పి; మఱియున్= ఇంకా; సనకసనందన+ఆదులు= ఆ నల్వురు సనకాది మునులు; జయవిజయులన్= జయుడు, విజయుడు అనే ద్వారపాలురను; చూచి= కాంచి; ఇట్లు+అనిరి= ఈ విధంగా అన్నారు; స్వామిహిత+అర్థంబు+ఐ=

దేవుని మేలుకోరటం కోసం; నిస్+కపటవర్తనులము= మోసంలేని నడవడి కలవాళ్ళం; అయిన మాబోటులన్= అయినట్టి మావంటివారిని; కొందఱన్= కొందరిని; ప్రవేశింపన్+చేయుటయున్= లోనికి అనుమతించుటయు; కుహకవృత్తిన్+కల= మోసపునడవడి కల్గిన; ఇతరజనంబులు= అన్యులు (స్వామి ద్రోహులనిభావం); భగవత్+సదనంబున్= భగవంతుని మందిరాన్ని; ప్రవేశింతురు+ఓ= ప్రవేశిస్తారేమో; అను శంకన్+చేసి= అనే సందేహంతో; కొందఱన్= అన్యులైన కొందర్ని; వారించుటయున్= తిరస్కరించుటయు; మీ మానంబులన్= మీ మనస్సులలో; దౌవారిక స్వభావంబు+అని= కాపలా కాచేవారి నైజమని; వారింపన్= మమ్మల్ని అడ్డుకోవటానికి; తలంచితిరి+ఏనిన్= తలపెట్టినవారైనట్లయితే; ప్రశాంత= మిక్కిలి నెమ్మదియైన; దివ్య= ప్రకాశవంతమైన; మంగళ= శుభకరమైన; విగ్రహుండును= స్వరూపంగలవాడును (పరంజ్యోతి); గతవిగ్రహుండును= రూపం లేనివాడును, (రూపరహితుడనుట); భగవంతుండును= ఐశ్వర్యంగలవాడును (మోక్షప్రదాత అనికూడ); విశ్వగర్భుండును= చరాచరభువనాల్ని తనలో ఇముడ్చుకొన్నవాడును (మత్స్థాని సర్వభూతాని); అయిన ఈశ్వరుండు= పై విశేషణాలతో కూడిన స్వామి; ప్రాప్యంబును= పొందదగినదియు; ప్రాపకంబును= పొందించేదియు; ప్రాప్తి= పొందటం; అను భేదశూన్యుండు= అనే మూడింటి యందు భేదభావం లేనివాడు; కావునన్= అయినందు వల్ల; ఘట= కుండ; పట= వస్త్రం; ఆది= మొదలైన వానిలోని; ఆకాశంబులు= శూన్యభాగాలు (ఘటాకాశం, పటాకాశం వగైరాలు); వేఱులేక= తేడాలేనివై; ఏకంబు+ఐ= ఒక్కటై; తోచు చందంబునన్= కన్పిస్తున్నట్లు; విద్వాంసులు+అగువారలు= జ్ఞానులు; ఆ+మహా+ఆత్మునిన్= ఆ మహానుభావుడైన దామోదరుణ్ణి; సకల+ఆత్మ= అన్నింటి హృదయాలలో; భేదరహితునిన్+కాన్= తేడాలులేనివాణ్ణిగా; పొడఁగందురు= చూస్తారు; అదియున్+కాక= అంతే కాదు; లోకంబునందున్= జగత్తులో; రాజులు= ప్రభువులు; స+అపరాధులు+ఐన= తప్పులుచేసినట్టి; కింకరజనంబులన్= ఊడిగంచేసేవారిని; ఆజ్ఞాపించుచందంబునన్= కట్టడిచేసేరీతిగా; ఈశ్వరుండు= ప్రభువు; దండించున్+ఓ+అనుభయంబు నన్+చేసి= శిక్షస్తాడేమో అనే భీతితో; వారించితిమి+అని= అడ్డుపెట్టామని; తలంతురు+ఏనిన్= ఆలోచించారనుకొన్నా; భూసురవేషధారులము+ఐన+ మాకును= బ్రాహ్మణవేషాన్ని తాల్చిన మాకునూ; వైకుంఠ నాయకుండు+ఐన= వైకుంఠపతియైన; సర్వ+ఈశ్వరునకును= విశ్వవిభుడగు విష్ణుమూర్తికిని; భేదంబు= తేడా; లేక+ఉండుటన్+చేసి= లేనికారణంగా; శంక= సందేహం; చేయన్+ పనిలేదు= పడవలసిన అవసరంలేదు; ఇట్లు+అగుట+ఎఱింగి= ఇలా అని తెలిసికూడా; మందబుద్ధులరు+ఐ= తెలివిలేనివారై; మమ్మున్= (సనకాదుల్ని); వారించిన= అడ్డుకొన్నట్టి; న+ఉచితకర్ములు= తప్పుపని చేసినవారు; అగుమీరలు= అయినట్టి మీరు (జయవిజయులు); మదీయశాప= మా శాపానికి; అర్హులు= తగినవారు; అగుదురు= అవుతారు; కావునన్= కాబట్టి; భూలోకంబునన్= నేలపైన; కామక్రోధలోభంబులు= ఇచ్ఛ, కోపం, పిసినితనం; అను శత్రువులు= అనే విరోధులు; బాధింపన్= నొప్పించేటట్లు; పుట్టుండు= జన్మించండి; అని పలికినన్= అని శపించగా...

**తా :** సనకాదిమునులు జయవిజయులతో ఇట్లన్నారు –

"స్వామి హితాన్ని కోరే మావంటి నిష్కపటుల్ని మందిరంలోనికి అనుమతించడమూ, మోసగాండ్రను లోనికి వెళ్ళకుండా అడ్డుపడటం అనే ఈ రెండు ప్రవృత్తులు వేత్రహస్తుల విహితలక్షణాలని భావించి మీరు మమ్మల్ని లోనికి వెళ్ళకుండా నివారించారు. వినండి. శ్రీమన్నారాయణుడు దివ్యశక్తితో విరాజిల్లువాడు. రూపనామాలు లేనివాడు ఈ చరాచరప్రపంచమంతా ఆయన కడుపులో దాగి ఉంది. ఆయన భగవంతుడు. ఆయన పొందదగింది (ప్రాప్యం), పొందించేది (ప్రాపకం), పొందటం (ప్రాప్తి) అనే ఈ త్రిపుటియందు ఏలాటి భేదం లేనివాడు. జ్ఞానులు ఆయన్ను మహాకాశంలో ఘటాకాశపటాకాశాలు విలీనమైవున్నట్లే సమస్తమైన ఆత్మలలో దాగి ఉన్నాడని భావిస్తారు. అంతేగాక లోకంలో రాజులు తప్పుచేసిన భృత్యుల్ని

దండిస్తున్నట్లే, స్వామికూడ తమ్ము దండిస్తాడు గదా అనే సందేహంతో మమ్ముల అడ్డుకొన్నట్లు అనుకొంటారేమో? అలా భావించవద్దు. ఎందుకంటే బ్రాహ్మణవేషం తాల్చిన (బ్రహ్మతత్త్వజ్ఞులు) మాకు, వైకుంఠవాసుడైన హరికి భేదం లేదు. మమ్మల్ని శంకించవద్దు. ఇదంతా తెలిసికూడ మీరు తెలివిలేనివారై మాయెడ అనుచితంగా ప్రవర్తించారు. కాబట్టి మిమ్మల్ని శపిస్తున్నాం. భూలోకంలో పుట్టండి. మిమ్మల్ని 'కామం, క్రోధం, లోభం అనే శత్రువులు పట్టి పీడిస్తాయి' అని మునులు ఆ జయవిజయుల్ని శపించారు.

**క. వారలు విని తమ మనముల, భూరిస్ఫుటచండకాండపూగంబులచే**
**వారింపరాని భూసుర, దారుణవాక్యముల కులికి తల్లడపడుచున్. 525**

**ప్రతి :** వారలు= జయ విజయులు, విని= శాపవచనం విని, తమమనములన్= తమ మనస్సులందు, భూరి= గొప్పగా స్ఫుట= పొడమినట్టి, కాండపూగంబులచేన్= బాణాలసమూహంచేత (కూడ), వారింపరాని= అడ్డుపెట్టశక్యంకాని, భూసుర= బ్రహ్మణ్యుల (సనకాదుల), దారుణ= భయంకరమైన, వాక్యములకున్= శాపవచనాలకు, ఉలికి= బెదిరి, తల్లడపడుచున్= వణికిపోతూ.

**తా :** జయవిజయులు సనకాదుల శాపవచనాలు విని ఉలికిపడ్డారు. బ్రాహ్మణుల శాపం వాడియైన బాణాలచేతకూడ నివారింప శక్యం కానిది కావడంవల్ల వాళ్లు తల్లడిల్లి పోయారు.

**క. పరితాపంబును బొందుచు, సరసిజలోచనుని భటులు సనకాదిమునీ**
**శ్వరుల పదాంబుజములకుం, గర మర్థిన్ మ్రొక్కి నిటలఘటితాంజలులై. 526**

**ప్రతి :** సరసిజలోచనుని= కమలములవంటికన్నులుగల విష్ణుమూర్తి; భటులు= వేత్రహస్తులైన జయ విజయులు; పరితాపంబును= దుఃఖాన్ని; పొందుచున్= పొందుతూ; సనక+ఆది= సనకుడు మొదలైన నల్వురు; ముని+ఈశ్వరుల= ఋషిపుంగవుల; పద+అంబుజములకున్= అడుగు తామరలకు; మ్రొక్కి= నమస్కరించి; నిటల= నొసళ్ళపై; ఘటిత= కూర్పబడిన; అంజలులు+ఐ= దోసిళ్ళుగలవారై...

**తా :** శ్రీహరి ద్వారపాలకులిర్వురు తమపై పడిన శాపానికి బాధపడుతూ సనకాదుల పాదాలపై సాగిలపడ్డారు. అనంతరం తమ నొసటిపై దోసిలొగ్గారు.

**వ. ఇట్లనిరి. 527**

**ప్రతి :** ఇట్లు+అనిరి= ఈ విధంగా అన్నారు.

**తా :** ద్వారపాలకులు ఈ విధంగా మొరపెట్టుకున్నారు.

**మ. వరయోగీశ్వరులార! మమ్ము మది నొవ్వన్ మీరలిట్లన్న ని**
**ష్ఠురవాక్యంబుల కింక మా మనములన్ శోకింపఁగారాదు, స**
**త్పురుషశ్రేణిఁబరాభవించిన వృథాభూతాత్ములన్ మమ్ము మా**
**దురితంబింతకుఁదెచ్చె, మీఁద శుభముం దూఁకొందు మే మారయన్. 528**

**ప్రతి :** వర= శ్రేష్ఠులైన; యోగి+ఈశ్వరులారా= ఋషీశ్వరులారా!; మమ్మున్= (జయవిజయులను) మా ఇద్దరిని; మదిన్+నొవ్వన్= మనస్సు నొప్పిపడునట్లు; మీరలు; (సనకాదులు); ఇట్లు+అన్న= ఈ విధంగా శపించినట్టి; నిష్ఠురవాక్యంబులకున్= కఠినమైన మాటలకు; ఇంకన్= ఇక మీదట; మా మనములన్= మా మనస్సుల్లో; శోకింపఁ గాన్+రాదు= ఏడువకూడదు; సత్+పురుషశ్రేణిన్= ఉత్తములైన మునిబృందాన్ని; పరాభవించిన= అవమానించినట్టి; వృథాభూత+ఆత్ములన్= వ్యర్థమైపోయిన బుద్ధిగల వారమైన; మమ్మున్= మా ఇద్దరిని; మా దురితంబు= మా పాపం; ఇంతకున్+తెచ్చెన్= ఈ స్థితికి తెచ్చింది (శాపగ్రస్తుల్నిచేసిందని భావం); ఏము= మేము; ఆరయన్= ఆలోచింపగా; మీఁదన్= ఇకపైన; శుభమున్= మేలును; తూఁకొందుము= పొందగలం.

**తా :** "ఓ మహాయోగీశ్వరులారా! మీరు మమ్మల్ని యిలా చాలా కఠినంగా శపించారు. ఇక అందుకు బాధపడి ప్రయోజనం లేదు. మేము అజ్ఞానులం. మీ వంటి ఉత్తములను అవమానించినందువల్లే మాకు ఈ దుర్దశ కల్గింది. అయినా మాకు మేలే జరుగుతుంది" అని జయవిజయులు మునులతో అన్నారు.

**వ. అది యెట్లంటిరేని. 529**

**ప్రతి :** అది= మేము పొందదగ్గ శుభం; ఎట్లు+అంటిరి+ఏన్= ఏ విధమైందని అంటారా!

**ఉ. మీ కరుణావలోకనసమేతులుగా మముఁజేయఁజిత్తముల్**
**దూఁకొనెనేని మా చనవుఁద్రోయక యీఁదగు, లోభమోహముల్**
**గైకొని పుట్టుచోట నవకంజదళాక్షుని నామవిస్మృతిం**
**బై కొనకుండ దాననె శుభంబగు మీఁది మదీయజన్మముల్. 530**

**ప్రతి :** మీ= మీయొక్క (సనకాదులు); కరుణా+అవలోకన= దయగలచూపులతో; సమేతులుగాన్= కూడిన వారినిగా; మమున్= జయవిజయులమైన మమ్ములను; చేయన్= చేయుటకు; చిత్తముల్= మనస్సులు; తూకొనెన్+ఏనిన్= పొందుపడినట్లయితే; లోభమోహముల్= దురాశ మరియు వ్యామోహం; (మానవీయలక్షణాలు); కై కొని= గ్రహించి; పుట్టుచోటన్= జన్మమెత్తే భూలోకంలో; నవ= కొంగ్రొత్తనైన; కంజదళ+అక్షుని= తామరరేకుల కన్నులవంటికన్నులుగల శ్రీహరి; నామవిస్మృతిన్= నామోచ్చారణను మరచిపోవటం; పైకొనక+ఉండన్= పెచ్చరిల్ల కుండునట్లు; మా చనవున్= మా కోరికను; త్రోయక= తిరస్కరించకుండ; ఈన్+తగున్= అనుగ్రహిందగును; దానన్+ఎ= దానివల్లనే; మీఁది= ముందటి; మదీయజన్మముల్= మా పుట్టుకలు; శుభంబు+అగున్= మేలవుతాయి.

**తా :** "మహాత్ములారా! మీరు మాపై దయగలవారైతే మా కోర్కె ఒక్కటే. మేము లోభమోహాలతో కూడిన జన్మ ఎత్త బోతున్నాం. ఆ కాలంలో శ్రీమన్నారాయణుని నామోచ్చారణ మరువకుండా అనుగ్రహించండి. అందువల్ల మేము మున్ముందు ఎత్తబోయే జన్మలు తరిస్తాయి" అని జయ విజయులు మునులకు మొరపెట్టుకొన్నారు.

**వ. అను సమయంబున. 531**

**ప్రతి :** అను సమయంబునన్= ఆ విధంగా ద్వారపాలురు వేడుకొనే సమయంలో...

**తా :** అలా వాళ్ళు ఆ సమయంలో వేడుకొన్నారు.

**మ. హరి సర్వేశుఁ డనంతుఁ డా కలకలం బాలించి పద్మాలయా**
**సరసాలాపవినోదసౌఖ్యరచనల్ సాలించి శుద్ధాంత మం**
**దిరమాణిక్యసుదేహళుల్ గడచి యేతెంచెం బ్రపన్నార్తిసం**
**హరుఁడై నిత్యవిభూతిశోభనకరుండై మానితాకారుఁడై. 532**

**ప్రతి :** సర్వ+ఈశుఁడు= విశ్వానికంతటికి ప్రభువైనవాడును; అనంతుఁడు= తుదిలేనివాడును (అయిన); హరి= విష్ణువు; ఆ కలకలంబు= ఆ ధ్వని; ఆలించి= విని; పద్మ+ఆలయా= లక్ష్మీదేవితోడి; సరస+ఆలాప= రసవంతమైనప్రసంగాలచే కల్గు; వినోద= వేడుకవల్ల; సౌఖ్యరచనల్= సుఖవంతమైన వ్యవహారాలు; చాలించి= మానివేసి; శుద్ధాంత మందిర= అంతఃపురమందలి; మాణిక్య= మణులు తాపిన; సుదేహళుల్= మంచికడపలను; కడచి= దాటి; ప్రపన్న+ఆర్తి= శరణుజొచ్చిన వారి బాధను; సంహరుఁడు+ఐ= తొలగించేవాడై; నిత్యవిభూతి= శాశ్వతమైన సంపదలు; శోభన= సుఖాలు; కరుండు+ఐ= కలిగించేవాడై; మానిత+ఆకారుఁడు+ఐ= కొనియాడదగ్గమూర్తి గలవాడై; ఏతెంచెన్= వచ్చాడు.

**తా :** జగన్నాయకుడును, ఆదిమధ్యాంతాలు లేనివాడును అయిన ఆ శ్రీహరి అక్కడ సనకాదులకు, వేత్రహస్తులకు మధ్య సాగుతున్న గొడవ విని భక్తుల బాధను తొలగించాలనీ, వారికి సంతోషం కల్గించాలనీ భావించి, తన అంతఃపురంలోని లోగిళ్ళు దాటి వచ్చాడు.

**వ. మఱియును. 533**

**ప్రతి :** మఱియునున్= ఇంకా...

**తా :** ఇంతేకాక, ఇంకా

**చ. శరనిధికన్యకామణియు సంభ్రమ మొప్పఁగఁ దోడరా మనో**
**హరనిజలీలమైఁ బరమహంస మునీశ్వరవంద్యపాద పం**
**కరుహములన్ వినూత్నమణికాంచననూపుర మంజుఘోషముల్**
**వరుసఁజెలంగ నార్యజనవంద్యుఁడు యోగిజనైకసేవ్యుఁడై, 534**

**అవ :** ఈ పద్యం నుండి 539 వరకు శ్రీమన్నారాయణుని దివ్యవర్ణన చోటు చేసుకొంది.

**ప్రతి :** మనస్+హర= మనస్సుకు ఇంపైన; నిజ= తన; లీలమైన్= విలాసంతో; శరనిధికన్యకామణియున్= సముద్రుని కూతురైన శ్రీదేవియు; సంభ్రమము= తొట్రుపాటు; ఒప్పఁగన్= కల్గునట్లు; తోడన్‌రాన్= (శ్రీహరి) వెంటరాగా; పరమహంస= పరబ్రహ్మస్వరూపులైన; ముని+ఈశ్వర= ఋషులచేత; వంద్య= కొనియాడ దగిన; పాదపంకరుహములన్= పాదపద్మాలలో; వినూత్న= సరికొత్తవైన; మణి= రత్నాలు పొదివినట్టి; కాంచననూపుర= బంగారు అందెల; మంజుఘోషముల్= శ్రావ్యమైన ధ్వనులు; వరుసన్= క్రమంగా; చెలంగన్= మ్రోగగా; ఆర్యజనవంద్యుఁడు= సజ్జనులచే కొనయాడదగిన వాడగు శ్రీహరి; యోగిజన+ఏకసేవ్యుఁడు+ఐ= యోగీశ్వరులకు ముఖ్యంగా సేవింపదగినవాడై.

**తా :** లక్ష్మీదేవికూడా తొట్రుపాటుతో విష్ణువువెంట వచ్చింది. పరమహంసలైన మునీశ్వరులకు వందనీయాలైన పదారవిందాల యందలి నూతనమైన మణులు పొదిగిన బంగారు అందెలు శ్రావ్యమైన శబ్దం చేస్తూ ఉండగా ఆయన నడచి వచ్చాడు. మహానుభావులు, యోగివరేణ్యులు సేవిస్తుండగా స్వామి దర్శనమిచ్చాడు.

**చ. కరమణిహేమకంకణనికాయఝుణంకృతు లుల్లసిల్ల న**
**చ్చర లిడు హంసపక్షసితచామరగంధవహోచ్చలత్సుధా**
**కరరుచిరాతపత్రసుభగప్రవిలంబిత హారవల్లరీ**
**సరసగళత్తుషారకణజాలవిరాజితమంగళాంగుఁడై. 535**

**ప్రతి :** కర= చేతులందలి; మణిహేమకంకణ= మణులుతాపిన బంగారు కడియాల; నికాయ= సమూహం; ఝుణంకృతులు= గణగణమనే ధ్వనులు; ఉల్లసిల్లన్= సంతోషంకొల్పగా; అచ్చరలు= గంధర్వకాంతలు; ఇడు= పట్టినట్టి; హంసపక్ష= రాయంచరెక్కలవంటి; సిత= తెల్లని; చామర= వింజామరలవల్లనైన; గంధవహ= గాలిచేత; ఉత్+చలత్= మిక్కిలి కదులుతున్న; సుధాకర రుచిర= చంద్రునివలె కాంతిమంతమైన; ఆతపత్ర= గొడుగుల యందు; సుభగప్రవిలంబిత= చూడముచ్చటగా వ్రేలాడుతున్న; హారవల్లరీ= తీగెల్ని బోలిన పేరులనుండి; సరస= సొగసుగా; గళత్= స్రవిస్తున్న; తుషారకణజాల= తుంపుళ్ల సమూహంచేత; విరాజిత= వెలుగొందునట్లు చేయబడిన; మంగళ+అంగుఁడు+ఐ= శుభాలనొసగు అవయవాలు గలవాడై; (హరి)...

**తా :** శ్రీహరియొక్క ముంజేతికి తొడిగిన బంగారు రత్నకంకణాలు గల్లుగల్లుమంటున్నాయి. అప్సరసలు రాయంచరెక్కలవంటి తెల్లని వింజామరలతో వీస్తున్నారు. వాటి గాలికి గొడుగుల అంచులలో వ్రేలాడుతున్న ముత్యాలహారాలు కదలాడుతుంటే ఆ హారాలనుండి స్రవించిన జలబిందువులు స్వామి శరీరంపై పడి నిగనిగలాడుతున్నాయి-

**వ. మఱియును. 536**

**ప్రతి :** మఱియునున్= ఇంకా;

**తా :** ఆ తర్వాత ఇంకా.

**సీ. నిఖిలమునీంద్రవర్ణితసస్మితప్ర స, న్నాననాంబుజముచే నలరువాఁడు**
**విశ్రుతస్నేహార్ద్రవీక్షణ నిజభక్త, జనగుహాశయుఁడనఁదనరువాఁడు**
**మానితశ్యామాయమానవక్షమున నం, చిత వైజయంతి రాజిల్లువాఁడు**
**నతజనావనకృపామృతతరంగితములై, భాసిల్లు లోచనాబ్జములవాఁడు**

**తే. నఖిల యోగీంద్రజనసేవ్యుఁడైనవాఁడు, సాధుజనముల రక్షింపఁజాలువాఁడు**
**భువనచూడావిభూషణ భూరిమహిమ, మించు వైకుంఠపురము భూషించువాఁడు. 537**

**ప్రతి :** నిఖిలముని+ఇంద్ర= అందరు మునిశ్రేష్ఠులచేత; వర్ణిత= పొగడబడిన; సస్మిత= చిరునవ్వుతోకూడిన; ప్రసన్న= నిర్మలమైన (అనుగ్రహపాత్రమైన); ఆనన+అంబుజముచేన్= ముఖపద్మముచేత; అలరువాఁడు= ఒప్పారు వాడును; (విష్ణువు) విశ్రుత= విస్తారమైన; స్నేహ+ఆర్ద్ర వీక్షణ= ప్రేమతో తడిసిన చూపులుగల్గి; భక్తజన= తననికొలిచేవారి; గుహా+ఆశయుఁడు+అనన్= హృదయాన్ని నివాసంగా కల్గినవాడనునట్లు; తనరువాఁడు= వెలుగొందువాడును; మానిత= మెచ్చుకోదగిన; శ్యామాయమాన= నీలపువన్నెగల; వక్షమునన్= రొమ్ముపై; అంచిత= ఒప్పిదమైన; వైజయంతి= ఈ పేరుగల మాలికచేత, (విష్ణుమాలిక); రాజిల్లువాఁడు= ప్రకాశించువాడును; నతజన= తలలొగ్గిన, భక్తజనాల; అవన= సంరక్షణవల్లనైన;

కృపా+అమృత= దయామృతంచే; తరంగితములు+ఐ= అలలుగా చేయబడినవై; భాసిల్లు= వెల్గుతున్న; లోచన+అబ్జ ములవాఁడు= తామరలవంటి కన్నులుకలవాడును; అఖిలయోగి+ఇంద్ర= ఎల్ల ఋషివర్యులచేతను; జన= ప్రజలచేతను; సేవ్యుఁడు+ఐనవాఁడు= పూజింపదగినవాడును; సాధుజనములన్= మంచివారిని; రక్షింపన్+చాలువాఁడు= కాపాడగలవాడును; భువన= లోకాల కన్నింటికి; చూడావిభూషణ= తలమానికమైన; భూరిమహిమన్= గొప్పవైభవంతో; మించు= అతిశయించినట్టి; వైకుంఠపురమున్= ఈ పేరుగల నగరాన్ని; భూషించువాఁడు= అలంకరించినవాడును...

**తా :** ఆ శ్రీమహావిష్ణువు వైకుంఠనగరానికే అలంకారంగా ఉన్నాడు. ఆ నగరం సమస్తలోకాలకు మకుటంగా విరాజిల్లుతోంది. ఇక ఆ స్వామి చుట్టు చేరిన ఋషీశ్వరులు పొగడుతుంటే ఆయన ముఖపద్మం చిరునవ్వుతో వెలిగిపోతోంది. చల్లని చూపులతో తన్పుతూ ఆ దైవం భక్తులహృదయాల్లో నివసిస్తున్నాడా అన్పిస్తుంది. ఆయన నిగనిగలాడే రొమ్ముపై విష్ణుమాలిక వ్రేలాడుతోంది. భక్తులను సంరక్షించాలనే దయార్ద్రదృష్టి ఆయన కన్నుల్లో తొణికిసలాడుతోంది. ఋషీంద్రులాయన్ని సేవిస్తున్నారు. ఆయన సత్పురుషుల్ని కాపాడగల దేవుడు.

**సీ. కటివిరాజితపీతకౌశేయశాటితో వితతకాంచీగుణద్యుతి నటింప**
**నాలంబికంఠహారావళి ప్రభలతోఁ గౌస్తుభరోచులు గ్రందుకొనఁగ**
**నిజకాంతిజితతటిద్వ్రజకర్ణకుండలరుచులు గండద్యుతుల్ ప్రోదిసేయ**
**మహనీయనవరత్నమయకిరీటప్రభా నిచయంబు దిక్కుల నిండఁ బర్వ**

**తే. వైనతేయాంసవిన్యస్తవామహస్త, కలితకేయూరవలయకంకణము లొప్ప**
**నన్యకరతలభ్రమణీకృతానుమోద, సుందరాకార లీలారవింద మమర. 538**

**ప్రతి :** కటి= నడుమునందు, విరాజిత= ప్రకాశిస్తున్న; పీతకౌశేయశాటితోన్= పసుపుపచ్చని పట్టుపుట్టముతో; కాంచీగుణద్యుతి= మొలనూలికాంతి; నటింపన్= నాట్యమాడగా; ఆలంబి= వ్రేలాడుతున్న; కంఠహార+ఆవళి= మెడలోని హారాల సమూహం; ప్రభలతోన్= కాంతులతో; కౌస్తుభరోచులు= రొమ్మున తాల్చిన మణికాంతులు; క్రందుకొనఁగన్= అతిశయింపగా; నిజకాంతి= తన వెలుగుచేత; జిత= జయింపబడిన; తటిత్+వ్రజ= మెరుపులగుంపుగల; కర్ణకుండల= చెవిపోగుల; రుచులు= కాంతులు; గండద్యుతుల్= చెక్కిళ్ళ వెలుగులను; ప్రోది+చేయన్= ఇనుమడింపగా; మహనీయ= కొనియాడదగిన; నవరత్నమయ= తొమ్మిదిమణులు తాపిన; కిరీట= కిరీటపు, (రాజులతలపైనున్నపాగ); ప్రభానిచయంబు= కాంతిసమూహం; దిక్కులనిండన్= దిక్కులలో నిండునట్లు; పర్వన్= వ్యాపించగా; వైనతేయ= వినతకొడుకైన గరుత్మంతుని; హంస= మూపుపైన; విన్యస్త= ఉంచబడిన; వామహస్త= ఎడమ చేతియందు; కలిత= కూడుకొన్న; కేయూరవలయ కంకణములు= బాహుపురులు, (రెట్టలకు చుట్టుకొన్న గుండ్రని ఆభరణాలు); ఒప్పన్= ప్రకాశింపగా; అన్య కరతల= మరొక (కుడి) చేతిచేత; భ్రమణీ కృత= త్రిప్పబడుచున్న; అనుమోద= సంతోషాన్ని కొల్పే; సుందర+ఆకార= అందమైన రూపుగల; లీలా+అరవిందము= విలాసకమలం; అమరన్= ఒప్పుచుండగా...

**తా :** శ్రీహరి తాను మొలకు కట్టుకొన్న పసుపుపచ్చని పట్టుపుట్టం వల్ల మొలనూలి కాంతి జిగేలు మంటున్నది. మెడకు తాల్చిన హారకాంతులవల్ల కౌస్తుభమణికాంతులు అతిశయించాయి. మెరపు తీగెల జిగిని సైతం తిరస్కరించే చెవిపోగుల తళతళలు చెక్కిళ్ళ సోయగాన్ని ఇనుమడింపజేస్తున్నాయి. స్వామి ధరించిన నవరత్నాల కిరీటప్రభలు దిక్కులన్నింట వ్యాపించాయి.

గరుత్మంతుని వీపుపై మోపిన ఎడమచేతికి చుట్టుకొన్న బాహుపురులు శోభిల్లుతున్నాయి. ఆయన కుడిచేత అందమైన విలాసపద్మం తిరుగుతోంది.

**వ. మఱియుఁ జరణారవింద మంజు కింజల్క పుంజ ప్రభారంజిత తులసీ మరంద బంధుర గంధానుబంధ సుగంధి గంధవహాస్వాద కలిత సేవా తత్పరులై చనుదెంచు యోగీంద్రులకు మానసానందకారియు, బహిః కరణాంతఃకరణ పరితోష ప్రకీర్ణ రోమాంచ రుచిదాయకంబును, ప్రభాపూర్తి యుక్తంబును నగు మూర్తితోడ నిజ సౌందర్య వర కళా వినిర్జిత శ్రీరమణీ సౌందర్య భాసమానుం డగుచుఁ బాదచారియై యఖిల విశ్వగురుం డైన సర్వేశ్వరుండు వేంచేసె నప్పుడు. 539**

**ప్రతి :** మఱియున్= ఇంకా; చరణ+అరవింద= పాదపద్మాల (సేవతో అన్వయం); మంజు= మనోజ్ఞమైన; కింజల్కపుంజ= కేసరాల సమూహపు; ప్రభా= కాంతిచేత; రంజిత= చూడముచ్చటైన; తులసీమరంద= తులసితేనెచే; బంధుర= అతిశయమైన; గంధ+అనుబంధ= వాసనతో కూడిన; సుగంధిగంధవహ= మంచిగాలిని; ఆస్వాద= పీల్చుటచే; కలిత= కల్గిన; సేవాతత్పరులు+ఐ= సేవయందాసక్తి గలవారై; చనుదెంచు= ఎదురుగావస్తున్న; యోగి+ఇంద్రులకున్= మునీశ్వరులకు; మానస+ఆనందకారియున్= మనస్సులకు సంతోషం కల్గించేవాడును; బహిస్+కరణ= బాహ్యావయవములయు; అంతస్+కరణ= అంతరింద్రియాలైన మనోబుద్ధిచిత్తాదులయు; పరితోష= ఆనందంచేత; ప్రకీర్ణ= విరిసినట్టి; రోమాంచ= గగుర్పొడిచిన వెంట్రుకల (పులకలు)తో; రుచిదాయకమును= ఆకర్షణీయమైనది; ప్రభాపూర్తియుక్తంబును= నిండు కాంతితో కూడినది; అగు= అయినట్టి; మూర్తితోడన్= స్వరూపంతో; నిజసౌందర్య= తన అందమైన; వరకళా= పురుషోత్తమకళచే; వినిర్జిత= జయింపబడిన; శ్రీరమణీసౌందర్య= రమాదేవిఅందంచే; భాసమానుండు= ప్రకాశించువాడు (పురుషోత్తముని అందం లక్ష్మీదేవి అందాన్ని మించిపోయిందని భావం); అగుచున్= అయి; పాదచారి+ఐ= కాలినడకగలవాడై; విశ్వగురుండు+ఐన= సమస్త లోకాలకు పెద్దయైన; సర్వ+ఈశ్వరుండు= భగవంతుడగు శ్రీహరి; అప్పుడు= ఆ సమయంలో; వేంచేసెను= (అక్కడికి) వచ్చాడు.

**తా :** పాదపద్మాల మనోహర కింజల్కసమూహకాంతిచేత చూడముచ్చటగా ఒకింత ఎరుపెక్కిన తులసిమాల మకరంద సువాసనతో కూడిన గాలిని పీలుస్తూ, తనకు సేవచెయ్యాలని ఎదురుగా వస్తున్న సనకసనందనాదులకు మానసికానందాన్ని కలిగించేవాడై, బాహ్యేంద్రియ అంతరింద్రియాల్లో పూర్తిగా నిండిన సంతోషంచేత గగుర్పొడిచిన వెంట్రుకలు కలవాడై, ఆకర్షకం, కాంతిమంతం అయిన స్వరూపంతో రమాదేవి అందం క్రిందగునట్లు ప్రకాశిస్తూ సర్వేశ్వరుండైన శ్రీహరి పాదచారియై వచ్చాడు.

**చ. స్థిరశుభలీల నట్లరుగుదెంచిన య వ్విభు విద్రుమారుణా**
**ధర నవపల్లవస్ఫురదుదంచిత కుందరుచిస్మితైకసుం**
**దరవదనారవిందము ముదంబునఁదప్పక చూచియున్ మునీ**
**శ్వరులు నిజాత్మలం దనివి సాలక వెండియుఁజూచి రిమ్ములన్. 540**

**ప్రతి :** స్థిరశుభలీలన్= శాశ్వతమై మంగళకరమైన విలాసంతో; అట్లు= పైన చెప్పిన రీతిగ; అరుగు+తెంచిన= వచ్చినట్టి; ఆ+విభు= ఆ ప్రభువైన విష్ణువుయొక్క; విద్రుమ+అరుణ= పగడం వన్నెగల ఎర్రని; అధర= క్రింది పెదవితో; నవపల్లవ=

కొత్తచివుళ్ళచే; స్ఫురత్= కాంతిమంతమైన; ఉత్+అంచిత= మిక్కిలి ఒప్పిదమైన; కుందరుచి= మొల్లకాంతినిబోలిన; స్మిత+ఏక= చిరునవ్వే ముఖ్యంగా గల; సుందర= అందమైన; వదన+అరవిందమున్= పద్మంవంటి మోమును; ముదంబునన్= మహానందంతో; తప్పక= వదలక; చూచియున్= చూచికూడ; ముని+ఈశ్వరులు= సనకాదిమునిశ్రేష్ఠులు; నిజ+ఆత్మలన్= తమ హృదయాలయందు; తనివి+చాలక= తృప్తి పడక; ఇమ్ములన్= ప్రీతితో; వెండియున్= మరల; చూచిరి= కాంచిరి (తదేకంగా చూచారని భావం).

**తా :** ఆ స్వామి మహావైభవంగా మునులచెంతకు పాదచారియై వచ్చాడు. ఆయన కిందిపెదవి పగడపువన్నె గలదై ఎఱ్ఱని కాంతితో ఒప్పారగా, విచ్చిన మొల్లమొగ్గలను బోలిన చిరునవ్వు మోముపై తాండవిస్తుంటే సనకాదులు చూచారు. ఆ చూపుతో వారు సంతృప్తి చెందజాలక ఆ దేవుని ముఖసౌందర్యాన్ని తదేకంగా మరల మరల అలా చూస్తూ ఉండిపోయారు.

**చ. సునిశితభక్తిఁదన్ముఖముఁజూచిన చూడ్కులు ద్రిప్పలేకయుం**
**గనుఁగొని రెట్టకేలకు నకల్మషభక్తవిధూతఖేదముల్**
**మునిజనచిత్తమోదములు ముక్తినివాసకవాట భేదముల్**
**వినుతవినూత్ననూపురితవేదము లమ్మహనీయు పాదముల్. 541**

**ప్రతి :** ఎట్టకేలకున్= చిట్టచివర; (సనకాదులు); తద్+ముఖమున్= ఆ హరి మోమును; చూచినచూడ్కులు= చూస్తున్న చూపులను; త్రిప్పన్+లేకయున్= మరల్చ లేకపోయినా; సునిశితభక్తిన్= మిక్కిలి భక్తితో; న+కల్మష= దోషంలేని; భక్త= భక్తుల; విధూతఖేదముల్= ఎగురగొట్టబడిన దుఃఖం గలవియు (భక్తుల దుఃఖాల్ని నివారింపగలవి); మునిజనచిత్త= ఋషుల మనస్సునకు; మోదములు= హాయిగొల్పునట్టియు; ముక్తినివాస= ముక్తిధామమైన వైకుంఠంయొక్క; కవాట= వాకిళ్ళను; భేదముల్= తెరచగలవియును; వినుత= కొనియాడదగిన; వినూత్న= సరికొత్త; నూపురిత= కాలి అందెలుగా చేయబడిన; వేదములు= వేదాలు గలవియు అయిన; ఆ+మహనీయ= ఆ మహానుభావుడైన విష్ణువుయొక్క; పాదముల్= అడుగులను; కనుగొనిరి= చూచారు.

**తా :** సనకాదిమునులు అలా భగవంతుడు తమకు ఎదురుపడగానే ఆ రూపాన్ని తనివిదీరా చూస్తూ తమ చూపులను మరల్చుకోలేకపోయారు. ఎలాగో చివరకు మళ్ళించి స్వామిపాదాలను చూచారు. ఆ పాదాలు పాపరహితులైన భక్తులబాధలను నివారించగలవు. మునీశ్వరులకు హృదయానందాన్ని ప్రసాదించగలవు. వైకుంఠపువాకిలిని తెరిచి ఉంచగలవు. వాటి అందెలమ్రోతలు వేదాలకు సరికొత్త భాష్యం చెప్పగలవు. (అంతటి మహిమలు గల పాదాలను మునులు చూచారని తాత్పర్యం)

**చ. కని నఖపద్మరాగమణికాంతివిభాసితపాదపద్మముల్**
**మనములయందుఁ గీల్కొలిపి లబ్ధమనోరథయుక్తులై పునః**
**పునరభివందనంబులు విభూతి దలిర్ప నొనర్చి యోగ మా**
**ర్గ నిరతచిత్తులున్ వెదకి కానఁగలేని మహానుభావునిన్. 542**

**ప్రతి :** కని= (స్వామి పాదపద్మాలను) చూచి; నఖ= గోళ్ళనెడి; పద్మరాగమణి= పద్మరాగాలనే మణుల; కాంతి= ప్రకాశంచేత; విభాసిత= వెలిగింపబడిన; పాదపద్మముల్= అడుగుదామరలను; మనములయందున్= తమ ఎదలలో;

కీలు+కొల్పి= నిల్పి; లబ్ధ= సమకూరిన; మనోరథయుక్తులు+ఐ= కోర్కెలతో కూడినవారై; విభూతి= ఐశ్వర్యం; తలిర్పన్= ఒప్పారునట్లు; పునర్+పునర్= సారెసారెకు; అభివందనంబులు= నమస్కారాలు; ఒనర్చి= చేసి; యోగమార్గ= యోగమార్గమందు; నిరతచిత్తులన్= ఎడబాయని మనస్సుగలవారుసైతం; వెదకి; కానఁగలేని= పొందలేనట్టి; మహా+అనుభావునిన్= గొప్ప మహిమగలవాణ్ణి (విష్ణువుని).

**తా :** మునులు శ్రీహరి పాదాలను చూచిన తర్వాత వాటిని తమయెదలో భద్రపరుచుకొన్నారు. ఆ పాదాలకు గోళ్ళు పద్మరాగమణికాంతులు గలవై మెరిసిపోతున్నాయి. తమ కోర్కెలీడేరునట్లు ఆ స్వామిపాదాలకు ఆ మునులు సారె సారెకు నమస్కరించారు. ఆ మహాత్ముడు యోగులకుసైతం చిక్కడు.

**క. మానసమున నిలిపిరి త, ద్ధ్యానాస్పదుఁడైనవానిఁ దత్త్వజ్ఞులకుం**
**గాన నగువాని భక్తజ, నానందకరైకమూర్తి నలరినవానిన్. 543**

**ప్రతి :** (మునులు) తద్=ఆ; ధ్యాన+ఆస్పదుఁడు+ఐనవానిన్= ధ్యానానికి నెలవైనట్టి వాడును; తత్త్వజ్ఞులకున్= తత్త్వవేత్తలకు; కానన్+అగువానికిన్= కన్పించగలవాడును; భక్తజన= కొలుచువారికి; ఆనందకర= సంతోషాన్ని గొల్పే; ఏకమూర్తిన్= ముఖ్యమైన ఆకారంతో; అలరినవానిన్= ఒప్పారు వాడును అయిన శ్రీమన్నారాయణుని; మానసమునన్= తమ ఎదలలో; నిల్పిరి= కీల్కొల్పినారు.

**తా :** ఆ శ్రీహరి ధ్యానగమ్యుడు. తత్త్వజ్ఞులు మాత్రమే ఆయన్ని చూడగలరు. ఆయనది భక్తజనాలకు ఆనందాన్నిచ్చేరూపం. సనకాదులు మహిమగల ఆ రూపాన్ని తమ మనస్సుల్లో నిలుపుకొన్నారు.

**వ. మఱియుం జక్షురింద్రియ గ్రాహ్యంబగు దివ్య మంగళ విగ్రహంబు ధరియించి యున్న పురుషోత్తము నుదాత్తతేజోనిధింజూచి సనకాదు లిట్లని స్తుతియించిరి. 544**

**ప్రతి :** మఱియున్= అంతేగాక; చక్షుస్+ఇంద్రియ= కన్నులనే జ్ఞానేంద్రియంచేత; గ్రాహ్యంబు+అగు= తెలిసికోదగినదైన; దివ్యమంగళవిగ్రహంబున్= దైవసంబంధమూ, శుభకరమునైన రూపాన్ని; ధరియించి+ఉన్న= తాల్చినట్టి; పురుష+ఉత్తమున్= పురుషశ్రేష్ఠుని; ఉదాత్తతేజస్+నిధిన్= మహత్తరమైన ప్రకాశానికి స్థానమైనవానిని; (ఆ శ్రీహరిని); చూచి= కాంచి; సనక+ఆదులు= సనకుడు మొదలైన నల్గురు ఋషులు; ఇట్లు+అని= ఈ విధంగా; స్తుతియించిరి= పొగడిరి.

**తా :** తమ ఎదుట కన్పిస్తున్న దివ్యస్వరూపుడు మహాతేజోనిధియైన శ్రీహరిని చూచి సనకాదులిట్లు ప్రస్తుతించారు.

## ✤ సనకాదులు నారాయణుని స్తుతించుట ✤

**చ. వనజదళాక్ష! భక్తజనవత్సల! దేవ! భవత్సుతుండు మ**
**జ్జనకుఁడునైన పంకరుహజాతుఁడు మాకు రహస్య మొప్పఁ జె**
**ప్పిన భవదీయమంగళగభీరపరిగ్రహవిగ్రహంబు మే**
**మనయముఁజూడఁగంటిమి కృతార్థులమై తగమంటి మీశ్వరా! 545**

**ప్రతి :** వనజదళ+అక్ష!= కమలంవంటి కన్నులు గలవాడా!; భక్తజనవత్సల= భక్తులయెడ ప్రేమగలవాడా; దేవ= ప్రభూ; ఈశ్వరా!= ఐశ్వర్యంగలస్వామీ!; (శ్రీహరి); భవత్+సుతుండు= మీకు కుమారుడైన; మత్+జనకుఁడు= మాకు తండ్రియు;

ఐన= అయినట్టి; పంకరుహజాతుఁడు= తామర పుష్పంలో పుట్టిన వాడైన బ్రహ్మ; మాకున్= సనకాదులమైన మాకు; రహస్యము= దాపరికం; ఒప్పన్+చెప్పినన్= అప్పగింపగా; మేము; భవదీయ= మీ (విష్ణువుయొక్క); మంగళ= శుభప్రదమైన; గభీర= లోతైన (అందరికి సులభంగా తెలియని); పరిగ్రహవిగ్రహంబు= (ప్రియంగా) గ్రహించదగ్గ రూపాన్ని; అనయమున్= ఎల్లప్పుడు; చూడన్+కంటిమి= చూడగల్గితిమి; తగన్= చక్కగా; కృత+అర్థులము+ఐ= ధన్యులమై; మంటిమి= జీవించాము.

**తా :** "తామరలవంటి కన్నులవాడా!, భక్తులపట్ల దయగలవాడా! ప్రభూ! ఓ స్వామీ! మీకు కుమారుడును మాకు తండ్రియునైన బ్రహ్మదేవుడు మిమ్మల్ని ఎల్లప్పుడు దర్శించే మహారహస్యం చెప్పాడు. దాన్ని ఆసరాగా గ్రహించి నీ మనోజ్ఞమైన సుందరాకారాన్ని చూచి తరించాం. ధన్యులమైనాం" అని సనకాదులు విష్ణుమూర్తిని స్తుతించారు.

**సీ. దేవ! దుర్జనులకు భావింప హృదయసంగతుఁడవై యుండియుఁ గానఁబడవు**
**కడఁగి నీ దివ్యమంగళవిగ్రహంబునఁ జేసి సమంచితాశ్రితుల నెల్లఁ**
**జేకొని సంప్రీతచిత్తులఁగాఁజేయు దతిశయకారుణ్యమతిఁ దనర్చి**
**కమలాక్ష! సర్వలోకైక నాయక! భవత్సందర్శనాభిలాషానులాప**

**తే. విదితదృఢభక్తియోగప్రవీణు లగుచు, నర్థిమై వీతరాగులైనట్టి యోగి**
**జనమనఃపంకజాతనిషణ్ణమూర్తి, వని యెఱుంగుదురయ్య, నిన్నాత్మవిదులు. 546**

**ప్రతి :** దేవ= ప్రభూ!; సర్వలోక+ఏకనాయక= సమస్తలోకాలకు ఒకే నాయకుడవైన వాడా!; కమల+అక్ష= తామరలవంటి కన్నులుగలవాడా! (శ్రీహరీ); భావింపన్= ఆలోచింపగా; హృదయసంగతుఁడవు= ఎదలో తగుల్కొన్నవాడవు; ఐ+ఉండియున్= అయినప్పటికి; దుర్జనులకున్= చెడ్డవారికి; కానన్+పడవు= కన్పించవు; కడఁగి= ప్రయత్నించి; అతిశయ= మిక్కుటమైన; కారుణ్యమతిన్= దయగల మనస్సుతో; సమ్+అంచిత= మిక్కిలిగా నిన్నంటియున్న; ఆశ్రితులన్+ఎల్లన్= భక్తులందరిని; నీ= నీయొక్క; దివ్య= పవిత్రమైనట్టి; మంగళ= శుభాన్ని ఒసగే; విగ్రహంబునన్+చేసి= సాక్షాత్కారరూపంచేత; చేకొని= కైకొని; సంప్రీతచిత్తులన్+కాన్= సంతసించిన మనస్సులుగలవారినిగా; చేయుదు= చేసెదవు; అయ్య= ఓ స్వామీ!; నిన్నున్= (శ్రీహరిని); ఆత్మవిదులు= ఆత్మతత్త్వంతెలిసిన జ్ఞానులు; భవత్= నీ యొక్క; సందర్శన+అభిలాష= దర్శనాభిలాషచేత; అనులాప= స్మరించుటచేత; విదిత= తెలియబడిన; దృఢ= గాఢమైన; భక్తియోగ= ప్రపత్తియోగమందు; ప్రవీణులు= దిట్టలు; అగుచున్= అయినవారై; అర్థిమైన్= కోర్కెతో; వీతరాగులు+ఐన+అట్టి= తొలగిన రజోగుణం గలవారైనట్టి; యోగిజన= యోగుల; మనస్+పంకజాత= హృదయపద్మాలందు; నిషణ్ణ= కూర్చొన్న; మూర్తివి+అని= విగ్రహం గలవాడవు; అని; ఎఱుంగుదురు= తెలిసికొంటారు.

**తా :** "ఓ ప్రభూ! నీవు సర్వాంతర్యామివి. దుష్టుల హృదయంలో కూడా ఉంటావు. అయితే వారికి కన్పించవు. కాని నీవు కనికరంతో నీ భక్తులెల్లరికి దివ్యమంగళరూప సాక్షాత్కారం కల్గించి ఆదుకొంటావు. ఓ పద్మాక్ష! లోకనాయక! నిన్ను చూడాలనే కోర్కెతో, నిన్నే స్మరించే రజోగుణవిముక్తులైన భక్తుల హృదయాల్లో నీవు పాదుకొని ఉంటావని జ్ఞానులు చెపుతారు–" అని మునులు ప్రస్తుతించారు.

**క. యుక్తిందలఁప భవద్వ్యతి, రిక్తములై నట్టి యితర దృఢ కర్మంబుల్**
**ముక్తిదము లయిన నీ పద, భక్తులు దత్కర్మములను బాటింప రిలన్. 547**

**ప్రతి :** ఇలన్= ఈ ప్రపంచమందు; యుక్తిన్= లోతుగా; తలఁపన్= ఆలోచింపగా; భవత్+వ్యతిరిక్తములు+ఐనట్టి= నీకు విరుద్ధమైనట్టి; ఇతరదృఢకర్మంబుల్= అన్యమైన గట్టిపనులు; ముక్తిదములు+అయినన్= మోక్షమిచ్చేవైనప్పటికి; నీ పదభక్తులు= నీ పాదసేవకులైనవారు; తద్+కర్మములను= ఆ కర్మలను; పాటింపరు= చేయరు (అనుసరించరు).

**తా :** 'ఓ స్వామీ! నిన్నుద్దేశించి కాక అన్యచింతనతో చేసే పనులవి ఎంత గొప్పవైనా, లేక ముక్తినొసంగేవైనా, నీ పాదసేవకులైన భక్తులు వాటిని ఒల్లరు' (ఇష్టపడరని భావం).

**ఉ. కావునఁగీర్తనీయగతకల్మషమంగళతీర్థకీర్తి సు**
**శ్రీవిభవప్రశస్తసుచరిత్రుఁడ వైన భవత్పదాబ్జ సే**
**వా విమలాంతరంగబుధవర్గ మనర్గళభంగి నన్యమున్**
**భావమునం దలంచునె కృపాగుణభూషణ! పాపశోషణా! 548**

**ప్రతి :** కృపాగుణ= దయాస్వభావమే; భూషణ= ఆభరణంగా కలవాడా!; పాపశోషణా= పాపాలను మటుమాయం చేయగలవాడా!; కావునన్= కాబట్టి; కీర్తనీయ= కొని యాడదగినట్టి; గతకల్మష= తొలగిన పాపాలుగలవారును; మంగళ తీర్థ= శుభప్రదమును, పుణ్యప్రదమును అయిన; కీర్తిసుశ్రీవిభవ= కీర్తియనెడు గొప్పసంపదచేత; ప్రశస్త= ప్రశంసనీయమైన; సుచరిత్రుఁడవు= చక్కని చరిత్ర గలవాడవు; ఐన= అయినట్టి; భవత్= నీయొక్క; పద+అబ్జసేవా= పాదపద్మాల్ని కొలుచుటచే; విమల+అంతరంగ= స్వచ్ఛమైన హృదయాలు గల్గిన; బుధవర్గము= జ్ఞానులసమూహము; న+అర్గళభంగిన్= తిరుగులేని వైఖరితో; అన్యమున్= ఇతరకర్మలను; భావమునన్= మనస్సులో; తలంచును+ఎ= భావించునా? (భావింపదని భావం).

**తా :** ఓ స్వామీ! నీవు దయాభరణుడవు. భక్తుల పాపాలను పటాపంచలు చేయగలవాడవు. నీ చరిత్ర కొనియాడదగింది. దోషరహితమైంది. శుభకరమైంది. పుణ్యప్రదమైంది. సత్కీర్తి శోభితమై ప్రశస్తి కెక్కినట్టిది. హృదయంలో ఏ కల్మషం లేని నీ పాదసేవకులు ఇతర కర్మల జోలికిపోరు. అన్యదేవతలను కొలవరు.

**చ. పరమతపోవిధూతభవపాపులమై చరియించు మాకు నేఁ**
**డరయ భవత్పదాశ్రితుల కల్గి శపించిన భూరిదుష్కృత**
**స్ఫురణ నసత్పథైకపరిభూతులమై నిజధర్మహానిఁగా**
**నిరయము నొందఁగా వలసె నేరము వెట్టక మమ్ముఁగావవే! 549**

**ప్రతి :** పరమ= ఉత్కృష్టమైన; తపస్+విధూత= తపోబలంచేత ఎగురగొట్టబడిన; భవపాపులము+ఐ= జన్మసంబంధమైన పాపాలు గలవారమై (తపోబలంచేత జన్మను పాపరహితం చేసినవారు మునులు); చరియించుమాకున్= నడచుకొనే మాకు; నేఁడు= ఈ దినం; అరయన్= ఆలోచిస్తే; భవత్= మీ; పద+ఆశ్రితులకున్= పాదదాసులైన ద్వారపాలురకు; అల్గి= కోపగించి; శపించిన= శాపమిచ్చినట్టి; భూరి= గొప్ప; దుస్+కృత స్ఫురణన్= చెడ్డపని అనే తలంపుతో; అసత్+పథ= చెడ్డదారిత్రొక్కుటచే; ఏక= ముఖ్యంగా; పరిభూతులము+ఐ= అవమానింపబడ్డవారమై; నిజధర్మహానిఁగాన్= తమధర్మానికి చేటు కల్గినందువల్ల; నిరయమున్= దుర్గతిని; ఒందఁగా వలసెన్= పొంద వలసి వచ్చింది; నేరము+పెట్టక= శిక్షగావించకుండ; మమ్మున్= మమ్ముల (సనకాదుల్ని); కావవు+ఏ= రక్షింపుమా! (ప్రార్థన).

**తా :** దేవా! మేము తపోబలంచేత జన్మసంబంధమైన పాపాలను తుదముట్టించిన వారం. కాని ఈ రోజు మీ పాదదాసులైన కావలికాండ్రని (జయ విజయుల్ని) శపించి దారితప్పినాం. అవమానానికి గురి అయ్యాం. మా ధర్మానికి హాని కల్గింది. అందుకు మమ్ముల శిక్షించకుండా కాపాడండి” అని మునులు ప్రార్థించారు.

**చ. కర మనురక్తిషట్పదము క్రమసుగంధమరందవాంఛచేఁ**
**దరమిడి శాతకంటకవృతస్ఫుటనవ్యతరప్రసూన మం**
**జరులను డాయుపోల్కిని భృశంబగు విఘ్నములన్ జయించి నీ**
**చరణసరోజముల్ గొలువ సమ్మతి వచ్చితిమయ్య, కేశవా! 550**

**ప్రతి :** కేశవా= ఓ గోవిందా!; షట్పదము= తుమ్మెద; కరము= మిక్కిలి; అనురక్తిన్= ప్రీతితో; క్రమ= ఇంపైన; సుగంధ= మంచి వాసనగల; మరంద వాంఛచేన్= తేనెయందలి మక్కువతో; తరము+ఇడి= క్రమంతప్పి; శాత= వాడియైన; కంటకవృత= ముండ్లచే అల్లుకొనబడిన; స్ఫుట= విచ్చిన; నవ్యతర= కొంగొత్త; ప్రసూనమంజరులను= పూలగుత్తులను; డాయుపోల్కిని= సమీపించినట్లు; భృశంబు+అగు= అతిశయమైన; విఘ్నములన్= ఆటంకాలను; జయించి= దాటుకొని; నీ చరణసరోజముల్= నీ పాదపద్మాలను; సమ్మతిన్= బుద్ధిపూర్వకంగా; కొలువన్= సేవించుటకు; వచ్చితిమి+అయ్య= వేంచేశాము తండ్రీ!

**తా :** “ఓ తండ్రీ! గోవిందా! తుమ్మెద కమ్మని తేనెను క్రోలడానికి ఉత్సాహంతో వాడియైన ముళ్ళతో కూడిన పూగుత్తులను ఆశ్రయించినట్లే మేముకూడ ఆటంకాలను ఛేదించి నీ పాదపద్మాలను సేవించాలని వచ్చాము” అని సనకాదులన్నారు.

**చ. అలరు భవత్పదాంబుజయుగార్పితమై పొలుపొందునట్టి యా**
**తులసి పవిత్రమైన గతిఁ దోయజనాభ! భవత్కథాసుధా**
**కలితములైన వాక్కుల నకల్మషయుక్తిని విన్నఁగర్ణముల్**
**విలసితలీలమై భువిఁబవిత్రములై విలసిల్లు మాధవా! 551**

**ప్రతి :** మాధవా= ఓ లక్ష్మీనాథా!; అలరు= ఒప్పారునట్టి; భవత్= నీ; పద+అంబుజ= పాద పద్మాల; యుగ+అర్పితము+ఐ= జంటయందుంచబడినదై; పొలుపు+ఒందు+అట్టి= ఒప్పుచున్నట్టి; ఈ తులసి= ఈ తులసిదళం; పవిత్రము+ఐనగతిన్= పరిశుద్ధమైనట్లే; తోయజనాభ= కమలం నాభియందుగల దేవా!; భవత్= నీ; కథాసుధా= కథలనెడి అమృతంచే; కలితములు+ ఐన= కూడినవైన; వాక్కులన్= మాటలను; న+కల్మషయుక్తినిన్= ఏ దోషమంటనితీరుగా; విన్నన్= విన్నచో; కర్ణముల్= చెవులు; విలసితలీలమైన్=ఒప్పిదమైనలీలతో; భువిన్=లోకంలో; పవిత్రములు+ఐ= పుణ్యప్రదాలై; విలసిల్లున్= ప్రకాశించును.

**తా :** ఓ లక్ష్మీనాథా! నీ పాదపద్మాలను సోకి, ఈ తులసి పవిత్రమై రాణించినట్లే, నీ కథామృతంతో కలిసిన మాటలను వింటే చెవులు పవిత్రమైతాయి.

**చ. మహితయశోవిలాసగుణమండన! సర్వశరణ్య! యింద్రియ**
**స్పృహులకుఁగానరాక యతసీకుసుమద్యుతి నొప్పుచున్న నీ**
**సహజశరీర మిప్పుడు భృశంబుగఁజూచి మదీయదృక్కు లిం**
**దహహ! కృతార్థతంబొరసె నచ్యుత! మ్రొక్కెద మాదరింపవే! 552**

**ప్రతి :** మహిత= కొనియాడదగిన; యశస్+విలాసగుణ= కీర్తి కారణమైన గుణవైభవం గలవాడా!; సర్వశరణ్య= అందరికి రక్షయైనవాడా!; ఇంద్రియస్పృహులకున్= ఇంద్రియాలమీద ఆసక్తి గలవారికి; కానరాక= కన్పించకుండా; అతసీకుసుమ= అగిసె (నూనెఅగిసె) పువ్వు వంటి; ద్యుతిన్= కాంతితో; (నీలపువన్నె); ఒప్పుచున్+ఉన్న= ప్రకాశిస్తున్న; నీ సహజ శరీరము= నీ అసలైన దేహాన్ని; ఇప్పుడు; భృశంబుగన్= మిక్కిలిగా; చూచి= కాంచి; అచ్యుత= శ్రీహరీ!; మదీయదృక్కులు= మా చూపులు; ఇందున్= ఇచ్చోట; అహ+అహ!= అబ్బో; కృతార్థతన్= ప్రయోజనాన్ని (సార్థకత); పొరసెన్= పొందాయి; మ్రొక్కెదము= నీకు నమస్కరిస్తాము; ఆదరింపుము+ఏ= కాపాడుమా! (ప్రార్థన).

**తా :** "కీర్తిదాయకమైన గుణగణాలు గలవాడా!, అందరికీ దిక్కైనవాడా! ఓ మాధవా! నీ రూపం ఇంద్రియాపేక్షగల సామాన్యులకు కన్పించదు. అది అగిసెపువ్వులాంటి నీలం వన్నె గల్గిన సహజశరీరం. దాన్ని దర్శించి మా చూపులు ధన్యమయ్యాయి. నీకు నమస్కరిస్తున్నాం. మమ్ములను ఆదుకో స్వామీ!" అని మునులు ప్రార్థించారు.

**క. అని సనకాదులు దత్పద, వనజములకు మ్రొక్కి భక్తివశమానసులై**
**వినుతించిన గోవిందుఁడు, మునివరులంజూచి పలికె ముదితాత్ముండై. 553**

**ప్రతి :** అని= ఆవిధంగా చెప్పి; సనక+ఆదులు= సనకుడు మొదలైన మునులు; భక్తి వశమానసులు+ఐ= భక్తికి వశమైన మనస్సులుగలవారై; తద్+పద వనజములకున్= ఆ స్వామి పాదపద్మాలకు; మ్రొక్కి= నమస్కరించి; వినుతించినన్= పొగడగా; గోవిందుఁడు= గోవులను ఆనందింపజేసే శ్రీహరి; ముదిత+ఆత్ముండు+ఐ= సంతోషించిన మనస్సుగలవాడై; మునివరులన్= మునిశ్రేష్ఠులను; చూచి; పలికెన్= అన్నాడు...

**తా :** "స్వామీ! మీ దర్శనంవల్ల మా చూడ్కులు సార్థకమయ్యా"యని సనకాదులు స్తుతించారు. మాధవుడు మహానందం చెంది మునుల నుద్దేశించి యిలా అన్నాడు.

**వ. ఈ యిరువురు జయవిజయాభిధానంబులు గల మదీయ ద్వారపాలకులు, వీరు మిమ్ముం గైకొనక మదీయాజ్ఞాతిక్రమణులయి చేసిన యపరాధంబునకుఁ దగిన దండంబు గావించితిరి, అది నాకు నభిమతం బయ్యె, నదియునుం గాక భృత్యవర్గంబు సేయు నపరాధంబు స్వామిదియ, కాన యీ తప్పునకు మాననీయుండనైన నన్ను మన్నించి ప్రసన్ను లగుదురుగాక యని వెండియు నిట్లనియె. 554**

**ప్రతి :** ఈ+ఇరువురు= ఈ ఇద్దఱు (శాపగ్రస్తులు); జయవిజయ+అభిధానంబులు= జయుడు; విజయుడు అనుపేర్లు; కల= కల్గినట్టి; మదీయ= నాదైన; ద్వారపాలకులు= ద్వారం దగ్గర కాపలాగా ఉండేవారు; వీరు= ఈ ఇరువురు; మిమ్మున్= మిమ్ములను; కైకొనక= ఆదరింపక; మదీయ= నాదైన; ఆజ్ఞా= కట్టడిని; అతిక్రమణులు+అయి= ఉల్లంఘించినవారలు; ఐ; చేసిన+అపరాధంబునకున్= చేసిన తప్పిదానికి; తగినదండంబు= అనువైన శిక్షను; కావించితిరి= చేశారు; అది= ఆ శిక్ష (శాపం); నాకున్= నాకు; (విష్ణుదేవునికి); అభిమతంబు+అయ్యెన్= నచ్చింది; అదియునున్+కాక= అంతమాత్రమేగాదు; భృత్యవర్గంబు= సేవకులగుంపు; చేయు+అపరాధంబు= చేసేతప్పు; స్వామిది+అ= ప్రభువుదే; కానన్= కాబట్టి; ఈ తప్పునకున్= నాభృత్యులు చేసిన తప్పిదానికి; మాననీయుండను+ఐన= గౌరవభాజనుడనైన; నన్నున్= హరినైన నున్న; మన్నించి= క్షమించి; ప్రసన్నులు= అనుగ్రహించువారు; అగుదురు+కాక= అయ్యెదరుగాక; అని= అంటూ; వెండియున్= మరియు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు...

**తా :** జయుడు, విజయుడు అనే పేర్లుగల ఈ ఇద్దరు నా కావలికాండ్రు. వీరు నా ఆజ్ఞను ఉల్లంఘించి, మిమ్మల్ని సరకు చేయకుండా అవమానించారు. మీరు వారు చేసిన తప్పిదానికి తగినశిక్ష విధించారు. అది నాకు సమ్మతమే. అంతేగాదు– సేవకులు చేసే అపరాధానికి యజమానియే బాధ్యుడు. అందువల్ల ఈ ఇర్వురు చేసిన తప్పునకు నన్ను మన్నించి అనుగ్రహించండని శ్రీహరి ప్రార్థించాడు.

**చ. తనువునఁబుట్టినట్టి బెడిదంబగు కుష్ఠమహాగదంబుచే**
**వనరి తదీయచర్మము వివర్ణత నొందినరీతి భృత్యు లొ**
**ప్పని పని సేసినన్ విభులు బంధురచారుయశంబుఁబేరుఁబెం**
**పును జెడిపోయి దుర్యశముఁబొందుచు నుందురు విష్టపంబులన్. 555**

**ప్రతి :** భృత్యులు= సేవకులు; ఒప్పనిపని= చేయరాని; చేసినన్= చేస్తే; విభులు= యజమానులు; తనువునన్= దేహమందు; పుట్టిన+అట్టి= పొడసూపినట్టి; బెడిదంబు= భరింపరానిది; అగు= అయిన; కుష్ఠమహా గదంబుచేన్= పెద్దకుష్ఠువ్యాధిచేత; వనరి= శోకించి; తదీయచర్మము= ఆ రోగి చర్మం; వివర్ణతన్= రంగుమార్పిడిని; ఒందినరీతిన్= పొందిన తీరుగా; బంధుర= దృఢమైన; చారుయశంబున్= ఒప్పిదమైన కీర్తిని; పేరున్= పేరును; పెంపునున్= వృద్ధియు; చెడిపోయి= పాడయిపోయి; విష్టపంబులన్= లోకాలందు; దుర్+యశమున్= చెడ్డకీర్తిని; పొందుచున్+ఉందురు= పొందుతారు.

**తా :** శరీరంలో పుట్టిన కుష్ఠరోగంవల్ల రోగి చర్మం కళతప్పినట్లే సేవకులు ఏదైనా తప్పుపని చేస్తే, ప్రభువులు కీర్తిని, పేరుప్రతిష్ఠలను కోల్పోయి లోకంలో అపకీర్తి పాలవుతారు.

**చ. అలవడ నాకు మీవలన నబ్బిన తీర్థసుకీర్తనీయ స**
**ల్లలితవినిర్మలామృతవిలాసయశోవిభవాభిరామమై**
**వెలయు వికుంఠనామ మపవిత్రమనశ్శ్వపచాధమాది లో**
**కుల చెవి సోఁకఁ దత్క్షణమ కోరి పునీతులఁజేయు వారలన్. 556**

**ప్రతి :** నాకున్= నాకు; అలవడన్= తగురీతి; మీవలనన్= మీరుకారణంగా; అబ్బిన= చేకూరినట్టి; తీర్థ= పుణ్యప్రదమైన; సుకీర్తనీయ= మిక్కిలి పొగడదగిన; సత్+లలిత= మిక్కిలి ఒప్పిదమైన; వినిర్మల= స్వచ్ఛమైన; అమృతవిలాస= తరగనిసింగారంకల్గిన; యశస్+విభవ= కీర్తిఅనే సంపదచే; అభిరామము+ఐ= ఆహ్లాదాన్ని కొల్పేదై; వెలయు= ప్రకాశించుచున్న; వికుంఠ నామము= వైకుంఠమనే పేరు; అపవిత్ర= మలినమైన; మనస్= మనస్సుగల్గిన; శ్వపచ+ అధమ+ఆది= నీచచండాలురు మొదలైన; లోకుల= ప్రజల; చెవిసోకన్= చెవిలో పడగా(వైకుంఠనామం); తత్+క్షణము+అ= వెంటనే; వారలన్= చండాలాదులను; కోరి= బుద్ధిపూర్వకంగా; పునీతులన్+చేయున్= పవిత్రుల్ని చేస్తుంది.

**తా :** మునీంద్రులారా! మీవంటి మహానుభావులవల్ల లోకమంతా మెచ్చదగ్గ పుణ్యకీర్తి నాకు దక్కింది. అమృతతుల్యమైన నా కీర్తివైభవంచేత ఈ వైకుంఠనగరం విరాజిల్లుతోంది. ఈ నగరంపేరు వింటేచాలు దుష్టులైన చండాలజాతులవారు కూడ పుణ్యాత్ములవుతారు.

**తే. అట్టి నేను దలంప మీ యట్టిసాధు, జనుల కపకార మర్థిఁజేసిన మదీయ**
**బాహుసములైనఁద్రుంతు నుత్సాహలీల, నన్న నితరుల మీ మ్రోల నెన్ననేల? 557**

**ప్రతి :** తలంపన్= ఆలోచింపగా; అట్టినేను= అంతటి కీర్తి గడించిన నేను, (విష్ణువు); మీ+అట్టి= మీ వంటి (సనకాదులవంటి); జనులకున్; అపకారము= ద్రోహం; అర్థిన్= కోర్కెతో; చేసిన= కావించినట్టి; మదీయబాహుసములు+ఐనన్= నా భుజసమానులను కూడ; ఉత్సాహలీలన్= ప్రయత్నంతో; త్రుంతున్= మట్టుపెడతాను; అన్నన్= అన్నచో; మీ మ్రోలన్= మీ ఎదుట; ఇతరులన్+ఎన్నన్+ఏల= అన్యులను లెక్కించుటెందులకు? (లెక్కించరాదని భావం).

**తా :** అంతటి కీర్తిగడించిన నేను, మీ వంటి మహాత్ములకు అపకారం చేసేవారెంతటివారైనా, లేక వారు నాకు భుజసమానులైనా సరే వారిని మట్టుపెడతాను. అయినప్పుడు ఇతరులను గూర్చి మీ ముందు చెప్పాలా? (చెప్పవలసిన పనిలేదు).

**క. ధరణి సురోత్తమసేవా, పరిలబ్ధంబయిన యట్టి పాతకనాశం**
**కర నిఖిలభువనపూత, స్ఫురితాంఘ్రిసరోజతోయములు గల నన్నున్. 558**

**ప్రతి :** ధరణిసుర+ఉత్తమ= భూలోకంలో ఉత్తమదేవతలైన బ్రాహ్మణుల; సేవా= పూజచేత; పరిలబ్ధంబు+అయిన= పొందబడిన; అట్టి; పాతకనాశంకర= పాపాలను తుడిచిపెట్టే; నిఖిలభువన= సమస్తలోకాలను; పూత= పవిత్రంచేయగల; స్ఫురిత+అంఘ్రిసరోజ= ప్రకటితములైన పాదపద్మాల; తోయములు= జలం; కల నన్నున్= కల్గిన నన్ను (విష్ణువుని)...

**తా :** "లోకంలో ఉత్తములైన బ్రాహ్మణులు నా పాదపూజ చేస్తారు. వారిచ్చిన పాద్యం అతిపవిత్రమైంది. దాని వల్ల లోకుల పాపాలన్నీ పటాపంచలవుతాయి. పవిత్రమైన అర్ఘ్యపాద్యాలు పొందిన పాదాలు నావి.

**క. అలఘుమతి విరక్తునిఁగాఁ, దలఁపక నిజ శుభకటాక్షదామకకలితా**
**ఖిలసంపద్విభవ శ్రీ, లలనారత్నంబురస్థలంబును జెందెన్. 559**

**ప్రతి :** నిజ= తన; శుభకటాక్ష= శ్రేయోదాయకములైన కడగంటి చూపులనెడి; దామక= హారంచేత; కలిత= కూడినట్టి; అఖిలసంపత్= సమస్తమైన భాగ్యాల; విభవ= వైభవంగల; శ్రీలలనారత్నంబు= శ్రేష్ఠురాలైన లక్ష్మీదేవి; న+లఘుమతిన్= గొప్పబుద్ధితో; (నన్నున్); విరక్తునిన్+కాన్= విరాగిగా; తలఁపక= భావించకుండ; ఉరస్+స్థలంబును= నా రొమ్మును; చెందెన్= ఆశ్రయించింది.

**తా :** మంచిమనస్సుగల శ్రీదేవి తన కడగంటిచూపులనే హారంతో నన్నాకర్షించి, నన్ను విరాగిగా తలంచక నా ఎదపై వాలింది. (వక్షఃస్థలాన్ని ఆశ్రయించిందని భావం).

**చ. క్రతువులు సేయుచో శిఖిముఖంబున వేలుచునట్టి తద్ఘృత**
**ప్లుతచరుభక్షణన్ ముదముఁబొందదు నిస్పృహధర్మమార్గ సం**
**గతుఁడగు భూసురోత్తము ముఖంబున వేడ్క భుజించు నయ్యవి**
**స్తృతకబళంబునన్ మనము తృప్తి వహించినరీతి నిచ్చలున్. 560**

**ప్రతి :** మనము= మనస్సు; నిస్+స్పృహ= ఏ కోర్కెలు లేనట్టి; ధర్మమార్గసంగతుఁడు= సంప్రదాయ మార్గంలో సంచరిస్తున్నవాడు; అగుభూసుర+ఉత్తము= అయిన బ్రాహ్మణశ్రేష్ఠుని; ముఖంబునన్= నోటితో; వేడ్కన్= ఉల్లాసంగా; భుజించు= ఆరగించే; ఆ+అవిస్తృత= ఆ అతిస్వల్పమైన; కబళంబునన్= ముద్దతో; తృప్తి వహించినరీతిన్= సంతోషాన్ని పొందిన విధంగా; క్రతువులు= యజ్ఞాలు; చేయుచోన్= చేసేటప్పుడు; శిఖిముఖంబునన్= అగ్నిముఖంగా; వేలుచు+అట్టి= ధారపోసేటటువంటి;

తద్+ఘృత= యజ్ఞంలోని నేతిచేత; ప్లుత= తడిసిన; చరుభక్షణన్= హవ్యము నారగించుటచేత; నిచ్చలున్= సదా; ముదమున్+పొందదు= సంతోషించదు.

**తా :** మహాత్ములారా! యజ్ఞంలో అగ్నిముఖంగా వ్రేల్వబడిన, నేతితో తడిసిన హవ్యం నా మనస్సుకు ఇంపుగొల్పదు. (నచ్చదు). కర్మఫలకాంక్షలులేని బ్రాహ్మణోత్తముడు భుజించే అల్పాహారమే నాకు ప్రియమైంది.

**సీ. సతతంబు నప్రతిహతయోగమాయా విభూతిచేఁబ్రఖ్యాతిఁబొందు నేను**
**నే మహీసురుల సమిద్ధనిర్మలపాద నళినరజోవితానములు భక్తి**
**హాటకనవరత్నకోటీరమునఁ దాల్తు నట్టి నా చరణాంబుజాంబువులను**
**దవిలి ధరించి సద్యః పునీతాత్ములై రర్థిఁ జంద్రావతంసాదిదేవ**

**తే. చయము, లెవ్వాఁడు బ్రాహ్మణజనులు దమకు, నపకృతుల్ సేసిరేని మాఱలుగఁడతఁడు**
**విప్రులను నన్నుఁగాఁగ భావించు నతఁడు, ధర్మపద్ధతి నా ప్రియతముఁడు వాఁడు. 561**

**ప్రతి :** సతతంబున్= ఎల్లప్పుడు; న+ప్రతిహత= అడ్డుపెట్ట శక్యంకాని; యోగమాయా= యోగమాయాసంబంధమైన, (ఆత్మకు-పరమాత్మకు నడుమనున్నతెర); విభూతిచేన్= వైభవంచేత; ప్రఖ్యాతిన్= పేరును; పొందు నేనున్= పడసిన నేను (శ్రీహరిని); భక్తిన్= భక్తితో; ఏ మహీసురుల= ఏ బ్రాహ్మణుల; సమ్+ఇద్ధ= మిక్కిలి వెలుగొందే; నిర్మల= స్వచ్ఛమైన; పాదనళిన= కలువలవంటి అడుగుల; రజస్+వితానములు= ధూళికణాల సమూహాలను; హాటక= బంగారుతోడి; నవరత్న= తొమ్మిది మణులు తాపిన; కోటీరమునన్= కిరీటమందు; తాల్తున్= ధరిస్తానో; అట్టి= అలా ధరించునట్టి; నా=నా (శ్రీహరియొక్క); చరణ+అంబుజ= పాదపద్మాల; అంబువులను= నీటిని; తవిలి= ఆసక్తినంది; ధరించి= తలపై చల్లుకొని; చంద్ర+అవతంస= చంద్రుని శిరస్సున ధరించిన పరమేశ్వరుడు; ఆది= మొదలైన; దేవచయములు= దేవతలగుంపులు; అర్థిన్= కోర్కెతో; సద్యస్= వెంటనే (ఆ నీరు సోకినంతటనే); పునీత+ఆత్ములు+ఐరి= పవిత్రమైన మనస్సులుగలవారైరో; ఏ+వాఁడు= ఎవడు; బ్రాహ్మణజనులు= బ్రాహ్మణులు; తమకున్= తమకు; అపకృతుల్= అపకారాలు; చేసిరి+ఏన్= చేసినప్పటికీ; మాఱు+అలుగఁడు+అతఁడు= తిరిగికోపింపనివాడును; విప్రులను= ఆ బ్రాహ్మణులను; నన్నున్+గాఁగన్= నాతోసమానులైన వారినిగా (విష్ణుతుల్యులుగా); భావించున్+అతఁడు= తలంచేవాడును; ధర్మపద్ధతిన్= ధర్మమార్గంలో; వాఁడు= ఆ మానవుడు; నా ప్రియతముఁడు= నాకు బాగా నచ్చినవాడు - (విష్ణుప్రీతిని చూరగొన్న వాడనిభావం).

**తా :** "మునీశ్వరులారా! నేను ఎల్లప్పుడు యోగమాయావైభవంతో ప్రకాశిస్తుంటాను. ధరణీసురులుగా వాసికెక్కిన బ్రాహ్మణుల పవిత్రమైన పాదధూళిని నవరత్నాలు పొదివిన నా బంగారు కిరీటంపైన ధరిస్తాను. నా పాదపద్మాలనుండి పుట్టిన గంగాజలాన్ని స్పృశించి తలపై చల్లుకొని పరమేశ్వరుడు మొదలైన దేవతలు పుణ్యాత్ములయ్యారు. బ్రాహ్మణులవల్ల ఎవరికైనా అపకారం జరిగితే, వారిపై కోపపడనివారునూ, ఆ బ్రాహ్మణులు నాతో సమానులని భావించేవారును నాకు చాలా ప్రియమైనవారు సుమా!" అన్నాడు విష్ణుమూర్తి.

**ఉ. గోవితతిన్ ధరాదివిజకోటిని నన్నును దీనవర్గమున్**
**వావిరి భేదబుద్ధిఁగనువార లధోగతిఁబొంద, నందు నా**
**శీవిషరోషవిస్ఫురణఁ జెంది కృతాంతభటుల్ మహోగ్ర గృ**
**ధ్రావలివోలెఁ జంచువుల నంగము లుద్ధతిఁజింతు రెప్పుడున్. 562**

**ప్రతి :** గోవితతిన్= ఆలమందను; ధరాదివిజకోటినిన్= బ్రాహ్మణులసమూహాన్ని; నన్నును= (శ్రీహరిని) నన్నూ; దీనవర్గమున్= దరిద్రులను; వావిరిన్= వరుసగా; భేదబుద్ధిన్= భేదభావంతో; కనువారలు= చూచేవాళ్ళు; అధోగతిన్+పొందన్= నీచమైన గతికి చేరునట్లు; అందున్= ఆ విషయంలో; కృత+అంతభటుల్= యమభటులు; ఆశీవిష= పామువంటి; రోషవిస్ఫురణన్= కోపావేశాన్ని; చెంది= పొంది; మహా+ఉగ్ర= మిక్కిలి భయంకరమైన; గృధ్ర+ఆవళి+పోలెన్= గద్దలగుంపులాగ; చంచువులన్= ముక్కులతో; ఎప్పుడున్= ఎల్లప్పుడు; ఉద్ధతిన్= గర్వముతో; చింతురు= ముక్కలు చేస్తారు.

**తా :** మునులారా! ఆవులను, బ్రాహ్మణులను, నన్ను, దీనులను ఎవరు భేదభావంతో చూస్తారో వారు తప్పక అధోగతి పాలవుతారు. యమభటులు అలాంటివారిని పాముపగ వంటి పగతో విజృంభించి పెద్దగద్దలు ముక్కుతో పొడిచినట్లు పొడిచి ముక్కలు చేస్తారు.

**చ. ధరణిసురోత్తముల్ బహువిధంబులఁదమ్ముఁబరాభవించినన్**
**దరహసితాస్యులై యతిముదంబున నిచ్చలుఁబూజ సేయుచున్**
**సరసవచోవిలాసముల సన్నుతి సేయుచుఁదండ్రి నాత్మజుల్**
**గర మనుర క్తిఁబిల్చుగతిఁ గైకొని పిల్చినవారు నా సముల్. 563**

**ప్రతి :** ధరణిసుర+ఉత్తముల్= బ్రాహ్మణులలో శ్రేష్ఠులు; బహువిధంబులన్= పెక్కురీతులుగా; తమ్మున్= తమను; పరాభవించినన్= అవమానిస్తే; దరహసిత= చిరునవ్వుతో కూడిన; ఆస్యులు+ఐ= మోములు గలవారై (అవమానితులనుట); నిచ్చలున్= ఎల్లప్పుడు; అతిముదంబునన్= మిక్కిలి సంతోషంతో; పూజ+చేయుచున్= సేవిస్తూ (బ్రాహ్మణుల్ని); సరస= వినోదంతోకూడిన; వచస్+విలాసములన్= చక్కని మాటలతో; సత్+నుతి+చేయుచున్= బాగాపొగడుతూ; ఆత్మజుల్= కొడుకులు; తండ్రిన్= తమతండ్రిని; కరము+అనురక్తిన్= మిక్కిలిప్రేమతో; పిల్చుగతిన్= పిలుస్తున్నట్లే; కైకొని= గ్రహించి; పిల్చినవారు= పిలిచేవారు; నా సముల్= నాకు (హరికి) దీటైనవారు.

**తా :** 'లోకంలో బ్రాహ్మణులు ఎవరినైనా అవమానిస్తే, అలా అవమానానికి గురియైనవారు ఆ బ్రాహ్మణులను చిరునవ్వులతో, మహానందభరితులై పూజిస్తే, మంచిమాటలతో వారిని స్తుతిస్తే, కొడుకులు తండ్రిని ప్రేమతో పల్కరించినట్లు పల్కరిస్తే అలాంటివారు నాకు సమానులు' అన్నాడు హరి.

**క. వినుఁడయ్యనఘచరిత్రుల, కనయముఁబ్రియతముఁడ నగుచుఁ నమ్ముడువోదున్**
**మును నన్ను భృగువు దన్నినఁ, గనలక పరితోషవృత్తిఁ గైకొంటిఁ గదే. 564**

**ప్రతి :** వినుఁడు= వినండి; ఆ+అనఘచరిత్రులకున్= గొప్పనడవడికగల్గిన ఆ మహానుభావులకు (బ్రాహ్మణులకు); అనయమున్= ఎల్లవేళలందు; ప్రియతముఁడన్+అగుచున్= మిక్కిలి కూర్చువాడనై; అమ్ముడు+పోదున్= దాసుడనవుతాను; మును= పూర్వం; నన్నున్= నన్ను; (శ్రీహరిని); భృగువు= ఈ పేరుగల మహర్షి; తన్నినన్= కాలితోతన్నగా; కనలక= కోపపడకుండా; పరితోషవృత్తిన్= సంతోషంగా ఉండుటను; కైకొంటిన్+కద+ఏ= అలవర్చుకొన్నానుగదా!.

**తా :** మహాత్ములారా! వినండి. అంత గొప్పచరిత్రగల్గిన మహానుభావులకు నేనెప్పుడూ సేవకుడుగానే ఉంటాను. అలనాడు భృగుమహర్షి నన్ను కాలితో తన్నితే సంతోషించాను.

**సీ. పొలుచు నా మానసాంభోజాతభావంబుఁ దెలియంగలేక యుద్వృత్తు లగుచుఁ**
**గడఁగి మీ యానతిఁగడచినఁదద్దోష ఫలము వీరలకు సంప్రాప్తమయ్యె,**
**మునులార! నా చిత్తమున నున్న రీతియు నిట్టిద, భూమిపైఁబుట్టి వీర**
**లచిరకాలమున నా యంతికంబున కోలి నరుదెంచునట్లుగా ననుమతింప**

**తే. వలయునని య ముకుందుండు వలుకుటయును, విని మనంబున సనకాదిమునివరేణ్యు**
**లమ్మహాత్ముని మృదులభాషామృతంబుఁ, దవిలి క్రోలియు రోషసందష్టు లగుచు. 565**

**ప్రతి :** మునులారా= యతీశ్వరులారా!; పొలుచు= ఒప్పిదమైన; నా= స్వీయమగు (శ్రీహరిదగు); మానస+అంభస్+జాత= పద్మంలాంటి మనస్సులోని; భావంబున్= తాత్పర్యాన్ని (అభిప్రాయాన్ని); తెలియంగన్+లేక= తెలిసికోజాలక; ఉద్+వృత్తులు+అగుచున్= గర్వించినవారై; కడఁగి= ప్రయత్నించి; మీ+ఆనతిన్= (మునుల) మీ ఆజ్ఞను; కడచినన్= అతిక్రమించినందువల్ల; తద్+దోషఫలము= ఆ తప్పిదానికి ఫలితం; వీరలకున్= ఈ ఇద్దరికి (జయవిజయులకు); సంప్రాప్తము+అయ్యెన్= చేకూరింది; నా చిత్తమునన్= నా బుద్ధియందు (శ్రీహరిమనస్సులో); ఉన్నరీతియున్= ఉన్నట్టి తీరుకూడ; ఇట్టిది+అ= ఇదే (మీరిచ్చిన శాపమే); వీరలు= ఈ ఇద్దరు; భూమిపైన్= భూలోకమందు పుట్టి; అచిరకాలమునన్= తొందరగా; నా+అంతికంబునకున్= నా చెంతకు; ఓలిన్= క్రమంగా; అరుదెంచు+అట్లు+కాన్= వచ్చేటట్లు; అనుమతింపన్+వలయున్= అంగీకరించాలి; అని; ఆ+ముకుందుండు= మోక్షాన్ని ప్రసాదించే ఆ నారాయణుడు; పలుకుటయును= చెప్పగా; సనక+ఆది= సనకుడు మొదలైన; మునివరేణ్యులు= మునిశ్రేష్ఠులు; విని= శ్రద్ధగా విని; ఆ+మహా+ఆత్ముని= ఆ మహానుభావుడైన విష్ణువు; మృదుల= ఇంపైన; భాషా+అమృతంబున్= అమృతంవంటి మాటలు; మనంబునన్= తమయెదలో; తవిలి= సోకి; క్రోలియున్= ఆస్వాదించిన వారై కూడ; రోషసందష్టులు+అగుచున్= కోపం కాటుపడినవారై, (కోపమే పామైవారిని కరిచిందని భావం).

**తా :** "ఓ మునులారా! నా మనసులోని ఆంతర్యం తెలియక, ఈ ఇర్వురు మీ ఆజ్ఞని జవదాటారు. అందుకు తగిన ఫలితాన్ని చవిచూశారు. అంతేగాదు నిజానికి నా మనసులో ఉన్నది కూడ ఇదే. వీరు భూలోకంలో రాక్షసులై పుట్టి త్వరగా నా చెంతకు చేరేటట్లు వీరిని అనుమతించండి" అని శ్రీహరి ప్రార్థించగా మునులు ఆ స్వామి తియ్యని పల్కులు విన్నారు. ఆ పల్కుల అమృతాన్ని తనివి దీర ఆస్వాదించినా, వారిలో కోపం కాటువేస్తూనే ఉంది.

**సీ. మునివరుల్ తమ చిత్తములఁదృప్తిఁ బొందక పంకజాతాక్షుఁడు పలికినట్టి**
**పరిమితగంభీరబహుళార్థ దురవగాహములును విస్ఫురదమృతతుల్య**
**మాధుర్యసుగుణసమన్వితమ్ములు వినిర్గతశబ్దదోషనికాయములును**
**నైన వాక్యములకు నాత్మలఁబరితోష మంది యిట్లనిరి నెయ్యమున మనల**

**తే. నొడయఁడిప్పుడు నందించియో, తలంప, నర్థి నిందించియో, మత్కృతైకదండ**
**మునకు సంకోచ మందియో, యనుచు సంశ, యాత్ము లగుచు వివేకించి యంతలోన. 566**

**ప్రతి :** మునివరుల్= సనకాదిమునులు; తమ చిత్తములన్= తమ యెదలో; తృప్తిన్+పొందక= సంతోషపడకుండా; పంకజాత+అక్షుఁడు= పద్మముల వంటి కన్నులుగల హరి; పలికిన+అట్టి= చెప్పినటువంటి; పరిమిత= కొద్దిపాటి;

గంభీర= లోతైన; బహుళ+అర్థ= గొప్పభావంగల్గి; దుర్+అవగాహములును= తెలిసికోవటానికి తేలికకానివియును; విస్ఫురత్= బాగాస్ఫురించిన; అమృతతుల్య= అమృతంతో సమానమైన; మాధుర్య= తీపితోడి; సుగుణసమన్వితమ్ములు= మంచిగుణాలతో కూడినవియు; వినిర్గత= తొలగినట్టి; శబ్దదోషనికాయములును= దోషముగల మాటలసమూహం గల్గినట్టివియు; అయిన వాక్యములకున్= అలాంటిమాటలకు; ఆత్మలన్= తమ మనస్సులందు; పరితోషమున్= సంతోషాన్ని; అంది= పొంది; ఇట్లు+అనిరి= ఈ విధంగా అన్నారు; ఒడయఁడు= ప్రభువైన విష్ణువు; ఇప్పుడు= ప్రస్తుతం; నెయ్యమునన్= స్నేహభావంతో; మనలన్; (మునుల్ని); నందించియో= పొగడియో; తలంపన్= ఆలోచిస్తే; అర్థిన్= కోర్కెతో; నిందించియో= చీకొట్టియో; మత్+కృత= మాచేనైనట్టి; ఏక= ముఖ్యమైన; దండమునకున్= శిక్షకు (శాపానికి); సంకోచము+అందియో= సందేహం పొందో; అనుచున్; సంశయ+ఆత్ములు= సందేహించిన మనస్సుగలవారు; అగుచున్= ఐ; వివేకించి= మళ్ళీ ఆలోచించి; అంతలోనన్= తక్షణమే.

**తా :** సనకాదిమునులు జయవిజయులు చేసిన పరాభవాన్ని సహించలేక పోయారు. అయితే శ్రీహరి మృదుమధురమైన పల్కులకు హృదయానందాన్ని పొందారు. శ్రీహరి మాటలు గంభీరమై లోతైన అర్థం కలవగుటచేత తేలికగా బోధపడేవి గావు. అమృతంతో సమానమైన తియ్యదనం గలవి, శబ్ద దోషం లేనివి. అలాంటి పల్కులు విని ఆ మునులు సంతోషించి 'తమలో దాము' ఇప్పుడు ప్రభువు మనలను అభినందించో లేక నిందించో అదికాకపోతే 'మన శాపానికి వెరచియో' ఏదో మరి మనల్ని సందేహానికి గురిచేశాడు" అని అనుకొన్నారు. అంతలో మళ్ళీ పునరాలోచనలో పడ్డారు.

**క. నలినాక్షుఁడు దమదెసఁ గృప, గలిగిన భావంబుఁదెలిసి కౌతుక మొలయం**
**బులకీకృతాంగులై యు, త్కలికన్ హర్షించి నిటలఘటితాంజలులై. 567**

**ప్రతి :** నలిన+అక్షుఁడు= కలువకన్నులవాడైన విష్ణుమూర్తి; తమదెసన్= తమ పట్ల (మునులయెడ); కృపన్+కలిగిన= దయగల; భావంబున్= ఉద్దేశ్యం; తెలిసి; కౌతుకము+ఒలయన్= సంతోషం అతిశయింపగా; పులకీకృత+అంగులు+ఐ= గగుర్పాటు చెందిన అవయవాలుగలవారై; ఉత్కలికన్= ఉత్కంఠతో; హర్షించి= ఆనందించి; నిటల= నొసటిపై; ఘటిత= కూర్పబడిన; అంజలులు+ఐ= దోసిలి గలవారై...

**తా :** కలువలవంటి కన్నులుగల శ్రీహరి తమను దయతో చూచాడ'ని మనసులో సంతోషపడి, మునులు పులకరించిపోయారు. ఉత్కంఠతో రెండుచేతులెత్తి నమస్కరిస్తూ ఇలా అన్నారు.

**క. భరితనిజయోగమాయా, స్ఫురణందనరారు నతివిభూతియు బలము**
**బరమోత్కర్షముఁ గల యీ, శ్వరునకు నిట్లనిరి మునులు సద్వినయమునన్. 568**

**ప్రతి :** మునులు= సనకాదులు; సత్+వినయమునన్= చక్కని ఒదుగుదలతో; భరిత= తాల్చినట్టి, (భరించినట్టి); నిజయోగమాయా= తనదైన యోగమాయ; స్ఫురణన్= జ్ఞానంచేత; తనరారున్= ఒప్పారునట్టి; అతివిభూతియున్= గొప్పవైభవం; బలమున్= చేవ; పరమ+ఉత్కర్షమున్= మిక్కిలి ఉత్సాహం; కల= కల్గిన; ఈశ్వరునకున్= విష్ణుమూర్తికి; ఇట్లు+అనిరి= ఈ విధంగా విన్నవించారు.

**తా :** సనకాదిమునులు యోగమాయావిలాసుడైన శ్రీహరి ఐశ్వర్యాన్ని, బలాన్ని, మహోత్సాహాన్ని గమనించి వినయంతో ఇలా అన్నారు.

**తే.** **పొలుపు దీపింప నిత్యవిభూతి నాయ కుఁడవు, భగవంతుఁడవు, ననఘుఁడవు, నీవు**
**మత్కృతం బప్డు నీ కభిమత మటంటి, వీశ! భవదీయచారిత్ర మెఱుఁగఁ దరమె?** **569**

**ప్రతి :** ఈశ= ప్రభూ!; నీవు (శ్రీహరివి); పొలుపు= ఒప్పుదల; దీపింపన్= వెల్గునట్లు; నిత్యవిభూతినాయకుఁడవు= ఎల్లప్పుడు ఐశ్వర్యంచే నొప్పెడు ఒడయనివి; భగవంతుఁడవు= పూజ్యుడవు; అనఘుఁడవు= పాపరహితుడవు; అప్డు= ఆ సమయంలో (జయవిజయుల్ని తాము శపించినప్పుడు); మత్+కృతంబు= మేముచేసినపని (శాపమిచ్చుట); నీకున్ (హరికి); అభిమతము+అట+అంటివి= ఇష్టమే అని అన్నావు; భవదీయచారిత్రము= మీ చరిత్ర; ఎఱుఁగన్+తరము+ఎ= తెలియుటకు సాధ్యమా? (కాదని అర్థం).

**తా :** 'ప్రభూ! నీవు గొప్ప ఐశ్వర్యవంతుడివి, పాపరహితుడివి, పరమపూజ్యుడవు, జయవిజయుల్ని మేము శపించటం నీ కిష్టమని చెప్పావు. నీ చరిత్రని తెలిసికోవటం మాకు సాధ్యం కాదు.

**ఉ.** **దేవగణాళి కెల్లఁబరదేవతలై తనరారునట్టి వి**
**ప్రావళి కాత్మనాయకుఁడవై పెనుపొందిన నీకు నీ ధరా**
**దేవత లెల్ల నెన్న నధిదేవతలై రఁట, యెట్టి చోద్యమో**
**దేవ! సమస్తపావన! సుధీజనతావన! విశ్వభావనా!** **570**

**ప్రతి :** సమస్తపావన!= విశ్వమంతటిని పవిత్రంచేయగలవాడా!; సుధీజనతా+అవన= జ్ఞానంగల జనాన్ని సంరక్షించేవాడా!; విశ్వభావనా= విశాలమైన హృదయం గలవాడా!; దేవ= స్వామీ!; ఎల్లన్= సమస్తమైన; దేవగణ+ఆవళికిన్= దేవతల గుంపునకు; పరదేవతలు+ఐ= సాటివచ్చుదేవుళ్ళయి (భూదేవులై); తనరారు+అట్టి= ఒప్పారునటువంటి; విప్ర+ఆవళికిన్= బ్రాహ్మణుల సమూహానికి; ఆత్మనాయకుఁడవు+ఐ= అధిదేవతవై; పెనుపొందిననీకున్= ఒప్పిన నీకు (శ్రీహరికనుట); ఈ ధరా దేవతలు+ఎల్లన్= ఈ బ్రాహ్మణులెల్లరు; ఎన్నన్= పరామర్శించగా; అధిదేవతలు= ప్రభువులు; ఐరి+అఁట= అయ్యారంట (ఇది హరి అన్నమాట); ఎట్టి చోద్యము+ఓ= ఎంత విచిత్రమైందో (చాల ఆశ్చర్యాన్ని కొల్పేమాట అని మునులు అన్నారు).

**తా :** లోకాలను పవిత్రంచేయగల వాడా! ప్రాజ్ఞులను రక్షించేవాడా! సమభావంగల ఓ ప్రభూ! దేవతలకు దీటుగా పరదేవతలని కీర్తి వడసిన ఈ బ్రాహ్మణులకు నిజంగా నీవే అధిపతివి. అంత గొప్ప స్వామివైన నీకు ఆ బ్రాహ్మణులు నాయకులా? ఇది చాల విచిత్రం సుమా! అని మునులన్నారు.

**చ.** **కమలదళాక్ష! నీవలనఁగల్గిన ధర్మము తావకావతా**
**రముల సురక్షితంబగుఁ, దిరంబగు, నీశ్వరనిర్వికార త**
**త్త్వమునఁదనర్చు నిన్నరయఁదత్ఫలరూపముఁదత్ప్రధాన గో**
**ప్యము నని పల్కుచుందురు కృపామయలోచన! పాపమోచనా!** **571**

**ప్రతి :** కృపామయలోచన= దయతోడిచూపులుగలవాడా!; పాపమోచనా= పాపాలనుండి గట్టెక్కించువాడా!; కమలదళ+అక్ష= తామరలబోలిన కన్నులు గలవాడా!; ఈశ్వర= దేవా!; నీవలనన్= నీవల్ల; కల్గినధర్మము= చేకూరిన వేదోక్తవిధి (లోకోద్ధరణ);

తావక+అవతారములన్= నీవెత్తిన అవతారాలవల్ల; సురక్షితంబు+అగున్= చక్కగా కాపాడబడుతుంది; తిరంబు+అగున్= దృఢంగా ఉంటుంది; అరయన్= ఆలోచించగా; నిర్+వికార= ఎలాంటి చలనంలేనట్టి; తత్త్వమునన్= స్వభావంతో; తనర్చు నిన్నున్= వెల్గొందుతున్న నిన్ను (శ్రీహరిని); తద్+ఫలరూపమున్= ఆ నీ అవతారానికి ఫలము; తద్+ప్రధానగోప్యమున్= ఆ అవతారంలోని రహస్యమూ; అని పల్కుచుందురు=అని చెపుతారు (తత్త్వవిదులని భావం).

**తా :** ఓ దయార్ద్రమూర్తీ, పాపనాశక! కమలలోచన! దేవా! నీవు ఎన్నో అవతారాలెత్తి నీ ధర్మాన్ని నిర్వహిస్తున్నావు. అందుకే లోకం ఏ ఉపద్రవాలు లేకుండా ఉంది. చెక్కుచెదరకుండా ఉంది. నీవు వికారాలు లేనివాడివి. నీది అచలరూపం. నీ అవతారాలఫలితాలను, అందలి రహస్యాలను తత్త్వజ్ఞులు చెపుతుంటారు.

**విశే :** శ్రీమన్నారాయణుని అవతార రహస్యం ఈ పద్యంలో వివరింపబడింది. సాధారణంగా 'దశావతారాలు' అంటారు. అంటే విష్ణువెత్తిన అవతారాల్లో పది అవతారాలు చాల ముఖ్యమైనవి. భాగవతం చెప్పిన అవతారాలు 23 అవి 1. యజ్ఞవరాహం, 2. సుయజ్ఞుడు, 3. కపిలుడు, 4. దత్తాత్రేయుడు, 5. సనకాదులు, 6. నరనారాయణులు (మునులు), 7. పృథువు, 8. పుష్కరుడు, 9. ధ్రువుడు, 10. హయగ్రీవుడు, 11. మత్స్యావతారుడు, 12. కూర్మావతారుడు, 13. నరసింహుడు, 14. నారాయణుడు (గజేంద్రుని రక్షించినస్వామి), 15. వామనుడు, 16. హంసుడు, 17. మనువు, 18. ధన్వంతరి (ఆయుర్వేదప్రచారకుడు), 19. పరశురాముడు, 20. శ్రీరాముడు, 21. శ్రీకృష్ణుడు, 22. బుద్ధుడు, 23. కల్కి.

**చ. మహిఁదలపోయ నెవ్వని సమగ్రపరిగ్రహమున్ లభింప ని**
**స్స్పృహమతులై మునీశ్వరులు మృత్యుభయంబునఁబాతు,రట్టి స**
**న్మహితవివేకశాలి! గుణమండన! నీ కిల నన్యసత్పరి**
**గ్రహ మది, యెట్టి చోద్యము? జగత్పరిపాలన! నిత్యఖేలనా! 572**

**ప్రతి :** మహితవివేకశాలి= గొప్పజ్ఞానంచేత ప్రకాశించువాడా!; గుణమండన= ఐశ్వర్యం మొదలైన గుణాలు ఆభరణాలుగా గలవాడా!; జగత్+పరిపాలన= లోకపాలనం గలవాడా!; నిత్యఖేలనా= ఎల్లప్పుడు విశ్రాంతిలేని క్రీడగలవాడా!; మహిన్= లోకంలో; తలపోయన్= ఆలోచింపగా; ఎవ్వని= ఏ మహామహుని; సమగ్రపరిగ్రహమున్= గొప్పదైన కూటమి; లభింపన్= చేకూరగా; ముని+ఈశ్వరులు= మునులలో శ్రేష్ఠులు; నిస్+స్పృహమతులు+ఐ= కోర్కెలు ఉడిగిన మనస్సులు గలవారై; మృత్యుభయంబునన్= మరణభయమును; పాతురు= పాయుదురో; అట్టి నీకున్= మరణభీతిని నివారించే నీకు (విష్ణునకు); ఇలన్= ఈ విశ్వమందు; అన్యసత్+పరిగ్రహము= ఇతరులకు కైవసమగుట; అది; ఎట్టిచోద్యము= ఎంత విచిత్రమోగదా!

**తా :** "దయార్ద్రమూర్తీ! లోకపాలక! గొప్పవివేకం గల స్వామీ! ఈ విశ్వమంతా నీ అధీనంలోనే ఉంది. అందువల్లనే మా వంటి మునులం మృత్యుభయంనుండి విడివడ్డాం. వాస్తవమిట్లుండగా 'నీవు ఇతరుల స్వాధీనంలో ఉన్నా'నని అంటున్నావు. ఇది చాల విచిత్రమైన సంగతి" అన్నారు సనకాదులు.

**సీ. సతతంబు నర్థార్థిజనశిరోఽలంకార పదరేణువులు గల పద్మ నేఁడు**
**జలజకింజల్కనిష్యందమరందలోభాగత భ్రమరనాయకుని పగిది**
**ధన్యజనార్పితోదంచిత తులసికాదామంబునకు నిజధామ మగుచు**
**భాసిల్లు భవదీయపాదారవిందముల్ విలసితభక్తి సేవింపుచుండ**

**తే. కమలనయన! కృపావలోకనము లొలయ, నర్థిఁజూడవు భాగవతానురక్తిఁ**
**జేసి భవదీయమహిమంబు చిత్ర మరయఁ, జిరశుభాకార! యిందిరాచిత్తచోర! 573**

**ప్రతి :** కమలనయన= తామరలవంటి కన్నులవాడా!; చిరశుభ+ఆకారా!= నిత్యం మంగళకరమైన స్వరూపంగలవాడా!; ఇందిరాచిత్తచోర!= సిరి ఎదను కైవసం చేసుకొన్నవాడా! శ్రీహరీ!; సతతంబు= ఎల్లప్పుడూ; అర్థ+అర్థిజన= ప్రయోజనాపేక్ష గల యాచకుల; శిరస్+అలంకార= తలలకు అలంకారాలైన; పదరేణువులు= పాదధూళులు (లక్ష్మీదేవివి); కలపద్మ= కల్గిన లక్ష్మీదేవి (ఆమె పాదధూళి యాచకుల తలలకలంకారమని భావం); నేఁడు= ఈ రోజు; జలజ= నీటబుట్టిన తామరల; కింజల్క= దుద్దులనుండి; నిష్యంద= వెలువడుతున్న; మరంద= తేనెయందలి; లోభ= ఆసక్తితో; ఆగత= వచ్చిన; భ్రమరనాయకునిపగిదిన్= జుంటీగవలె; ధన్యజన= పుణ్యభాగులచేత; అర్పిత= సమర్పింపబడిన; ఉత్+అంచిత= మిక్కిలి ఒప్పిదమైన; తులసికాదామంబునకున్= తులసిమాలకు; నిజధామము+అగుచున్= ఉనికియై; భాసిల్లు= ప్రకాశించునట్టి; భవదీయ= మీ (విష్ణువుయొక్క); పాద+అరవిందముల్= పాదపద్మాలను; విలసితభక్తిన్= ఒప్పారుతున్న భక్తితో; సేవింపుచున్+ఉండన్= అర్చిస్తుండగా (శ్రీదేవి సేవిస్తుండగా); భాగవత+అనురక్తిన్+చేసి= భక్తులయందు ప్రేమ కలవాడవగుట చేత; కృపా+అవలోకనములు= కనికరంతో కూడిన చూపులు; ఒలయన్= ఒప్పునట్లు; అర్థిన్= కోరికతో; చూడవు= కాంచవు; అరయన్= ఆలోచింపగా; భవదీయమహిమంబు= మీ గొప్పదనం; చిత్రము= ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది.

**తా :** ప్రతినిత్యం యాచకులు వచ్చి లక్ష్మీదేవి పాదాలను సాగిలపడి మ్రొక్కినపుడు వాటి ధూళి తమ తలల కలంకారంగా ఉంటుంది. తామరపూలనుండి స్రవించిన తేనెను ఆస్వాదించడానికి వచ్చే జుంటీగ వంటి భక్తులు తులసిమాలగల నీ పాదపద్మాలను మహాభక్తితో కొలుస్తున్నారు. ఆ భక్తులయెడ ప్రేమాతిశయంగల ఓ స్వామీ! నీవు శ్రీదేవిని దయతో మన్నించకున్నావు. నిజానికి నీ మహిమ చాల విచిత్రం గదా! నీవు తామరలవంటి కన్నుల వాడవు. నీ రూపం శుభప్రదమైంది. అంతేగాదు – శ్రీదేవిహృదయాన్ని దోచుకొన్నవాడవు కూడ–

**మ. చిరభాగ్యోదయ! దేవదేవ! లలితశ్రీవత్సలక్ష్మాంగ! యీ**
**వరవిప్రానుపదైకపుణ్యరజమే వర్ణింప నీ మేని కా**
**భరణంబంటివి, సర్వలోకులకు విప్రశ్రేణి మాహాత్మ్య మీ**
**వెఱుఁగంజెప్పుటకై ధరించితి గదా యెన్నంబవిత్రాకృతిన్. 574**

**ప్రతి :** చిరభాగ్య+ఉదయ= శాశ్వతమైన సంపదకు నెలవైనవాడా; దేవదేవ= దేవతలకు కూడ ప్రభువైన స్వామీ!; లలిత= ఇంపైన; శ్రీవత్సలక్ష్మ+అంగ= శ్రీవత్సమనే పేరుగల మచ్చ రొమ్మున తాల్చిన వాడా!; వర్ణింపన్= పొగడగా; ఈ; వర= శ్రేష్ఠులైన; విప్ర= బ్రాహ్మణుల; అనుపద+ఏక= పాదాలనంటిన ముఖ్యమగు; పుణ్యరజమే= పవిత్రమైన ధూళియే; నీ మేనికిన్= నీశరీరానికి; ఆభరణంబు+అంటివి= అలంకారమని చెప్పావు; ఎన్నన్= ఆలోచిస్తే; సర్వలోకులకున్= ఎల్లరికి; ఈవు= నీవు; విప్రశ్రేణి మాహాత్మ్యము= బ్రాహ్మణులగొప్పదనాన్ని; ఎఱుఁగన్= తెలియునట్లు; చెప్పుటకై= చెప్పాలని; పవిత్ర+ఆకృతిన్= శుభదాయకమైన రూపాన్ని; ధరించితి+కదా= ఎత్తినావు గదా!,

**తా :** భాగ్యాలకు నెలవైన దేవా! శ్రీవత్సాన్ని రొమ్మున తాల్చిన స్వామీ! ఈ బ్రహ్మవేత్తల పాదధూళియే నీ శరీరానికి అలంకారమని అన్నావు. సమస్తలోకాలకు బ్రాహ్మణుల మహిమను చాటాలని నీవు ఈ పవిత్రాకారాన్ని ధరించావు.

**వ. అదియునుంగాక. 575**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేగాదు...

**తా :** బ్రాహ్మణమహిమని లోకానికి చాటటానికే గాదు

**సీ. ధర్మమూర్తివి జగత్కర్తవు నగు నీవు ప్రోవంగఁదగువారిఁబ్రోవవేని**
**నవిరళవేదోక్తమగు ధర్మమార్గ మసన్మార్గ మగుఁ, గాన, సత్త్వగుణ వి**
**శిష్టుండ వగుచు నీ జీవసంఘము సేమ మరసి రక్షింతు నీదైన శక్తి**
**చేతను ధర్మవిఘాతుల దండించు నీకు నంచితమైన నిగమధర్మ**

**తే. మార్గనాశకవిధములు మదికి నింపు, గావు, విప్రులయందు సత్కరుణ మెఱసి**
**ఘనతఁబలికిన వినయవాక్యములు నీకు, యుక్తమగుచుండు సతతంబు భక్తవరద! 576**

**ప్రతి :** భక్తవరద= భక్తులకు వరముల నొసంగువాడా!; సతతంబు= ఎల్లప్పుడు; ధర్మమూర్తివి= ధర్మమే ఆకారంగాగలవాడవు; జగత్+కర్తవున్= లోకాలన్నింటికి అధిపతివి; అగునీవు= అయినట్టి నీవు (విష్ణువు); తగువారిన్= యోగ్యుల్ని; ప్రోవంగన్= రక్షింపవలసియుండగా; ప్రోవవు+ఏనిన్= రక్షింపనివాడవైనచో; అవిరళ= తక్కువకాని; వేద+ఉక్తము+అగు= వేదాల్లో చెప్పబడినట్టిదైన; ధర్మమార్గము= ఆ ధర్మపద్ధతి; అసత్+మార్గము+అగున్= చెడు పద్ధతి అవుతుంది; కానన్= అందువల్ల; సత్త్వగుణ= సాత్త్విక స్వభావంతో; విశిష్టుండవు+అగుచున్= కూడిన వాడవై; ఈ; జీవసంఘముసేమము= ఈ ప్రాణికోటి మేలు; అరసి= తెలిసి; రక్షింతు= కాపాడెదవు; నీది+ఐన= నీ పరమైనట్టి; శక్తిచేతను= బలంచేత; ధర్మవిఘాతులన్= ధర్మాన్ని నాశనం చేసేవారిని; దండించునీకున్= శిక్షింపగలనీకు (శ్రీహరికి); అంచితము+ఐన= ఒప్పిదమైన; నిగమధర్మమార్గ= వేదధర్మపద్ధతులను; నాశకవిధములు= పాడుచేసేవైఖరులు; మదికిన్= మనస్సునకు; ఇంపు+కావు= ప్రియమైనవికావు; విప్రులయందున్= బ్రాహ్మణులయందు; సత్+కరుణన్+మెఱసి= దయమెండుగానై; ఘనతన్= గొప్పదనంతో; పలికిన= చెప్పినట్టి; వినయవాక్యములు= మంచిపలుకులు; నీకున్= (విష్ణునికి); యుక్తము+అగుచున్+ఉండున్= తగియుండును.

**తా :** భక్తుల పాలిటి కొంగుబంగారమైన ఓ దేవా! నీవు ఎల్లప్పుడు ధర్మం తప్పని వాడవు. లోకనాయకుడవు. అలాంటినీవు రక్షింపదగిన వారిని రక్షింపకున్నచో వేదధర్మం దారితప్పుతుంది. కావున నీవు సత్త్వగుణుడవై ఈ జీవకోటిని కాపాడుతున్నావు. నీవు స్వశక్తిచేతనే అధర్మపరుల్ని దండిస్తావు. వేదధర్మాన్ని ఉల్లంఘించే పద్ధతులు నీకు నచ్చవు. బ్రాహ్మణులపట్ల నీవు దయగలవాడవు. వారిని వినయంగా పల్కరించటమే నీకు తగును.

**వ. అట్లయినం బరులయెడ వినయంబులు వలికినఁ బ్రాభవహాని యగు నని తలంచితివేని. 577**

**ప్రతి :** అట్లు+అయినన్= అలాగైతే; పరుల+ఎడన్= ఇతరులను గురించి; వినయంబులు= విధేయతతో కూడిన పల్కులు; పలికినన్= మాట్లాడితే; ప్రాభవహాని= మహిమకు లోటు; అగున్+అని= కల్గుతుందని; తలంచితివి+ఏనిన్= భావించినవాడవైతే...

**తా :** అన్యుల నుద్దేశించి వినయంగా మాట్లాడితే నీ మహిమకు చేటని భావిస్తావేమో! అదేమీ కాదని మునులంటున్నారు.

**తే. విశ్వమునకెల్లc గర్తవు విశ్వనిధివి, విశ్వసంరక్షకుండవై వెలయు నీకుc**
**గడcగి ప్రాభవహాని యెక్కడిది? దలcప, వినయములు నీకు లీలలై వెలయుcగాన. 578**

**ప్రతి :** తలcపన్= ఆలోచించగా; వినయములు= ఒదుగుటలు; నీకున్= (హరికి); లీలలు+ఐ= విలాసాలై; వెలయున్= ఒప్పారును; కానన్= అందువల్ల; విశ్వమునకు+ఎల్లన్= సమస్తలోకాలకు; కర్తవు= సృష్టించినవాడవు; విశ్వనిధివి= విశ్వానికి కేంద్రానివి; విశ్వసంరక్షకుcడవు+ఐ= సమస్తాన్నికాపాడేవాడవుగా; వెలయునీకున్= వెల్గొందునీకు (విష్ణునకు); కడcగి; ప్రాభవహాని= గొప్పదనానికిలోకువ; ఎక్కడిది= ఎక్కడ ఉంటుంది? (లేదని భావం).

**తా :** స్వామీ! వినయంగా మాట్లాడటం నీకొక లీలకాగా ఈ విశ్వానికి కర్తవు, ఆధారుడవు, పోషించేవాడవైన నీకుగాని నీ వైభవానికి గాని హాని ఎక్కడుంటుంది? ఉండదు.

**తే. మునులమగు మమ్ము నతిమోదమునను నీవు, సత్కరించుట లెల్ల సజ్జనపరిగ్ర**
**హార్థమై యుండుcగాదె, మహాత్మ! యొకటి, విన్నవించెద మీ జయవిజయులకును. 579**

**ప్రతి :** మహా+ఆత్మ= గొప్పహృదయంగలదేవా!; నీవు= (హరివి); మునులము+అగుమమ్మున్= మునులమైన మమ్మల్ని; అతిమోదమునను= మిక్కిలిసంతోషంతో; సత్కరించుట+ఎల్లన్= అన్నిరీతుల పూజించుటలు; సత్+జన+పరిగ్రహ+ అర్థము+ఐ= మంచివారిని చేరదీయుటకొరకే; ఉండున్+కాదు+ఏ= ఉంటుంది కదా!; ఈ జయవిజయులకును= ఈ జయునికి విజయునికి; ఒకటి= ఒక సంగతి; విన్నవించెదము= తెలియజేస్తాము.

**తా :** మహానుభావా! మేము మునులం. మమ్మల్ని నీవు మహానందంతో గౌరవిస్తున్నావంటె అది ఉత్తముల్ని చేరదీయటమే కదా! ఈ జయవిజయుల గూర్చి ఒక్కమాట చెప్పాలని ఉంది.

**తే. అలిగి మేము శపించితి మంతకంటె, బెడిద మగు నాజ్ఞ సేయ నభీష్టమేనిc**
**జేయు, మదిగాక సమధికశ్రీ దనర్పc, జేసి రక్షించెదేని రక్షింపు మీశ! 580**

**ప్రతి :** ఈశ= దేవా; మేము= సనకాదులము; అలిగి= ఈ ఇద్దరిపై కోపగించి; శపించితిమి= రక్కసులుకండని శపించాము; అంతకంటెన్= మేమిచ్చిన శాపానికంటె కూడ; బెడిదము+అగున్+ఆజ్ఞ= కఠోరమైన విధిని; చేయన్= చేయటానికి; అభి+ఇష్టము+ఏనిన్= నీకు సమ్మతమైతే; చేయుము= కావింపుము; అది+కాక= అలా అంగీకారం కాకపోతే; సమ్+అధికశ్రీ= మిక్కిలి ఎక్కువ సంపద; తనర్పన్+చేసి= పెంపొందునట్లు కావించి; రక్షించెదు+ఏనిన్= కాపాడాలని ఉంటే; రక్షింపుము= కాపాడుము.

**తా :** "స్వామీ! మేము కావలికాండ్రని శపించాం. ఇంతకంటె కూడ పెద్దశిక్ష విధించాలని మీరనుకొంటే అలాగే చేయండి. లేదా వీరికి ఇతోధికమైనమేలు కల్గించాలనుకొంటే వీరిని కాపాడండి" అని మునులు హరితో అన్నారు.

**వ. అట్లయిన మాకుం బ్రియం బగుం గావున ననపరాధులు నతినిర్మలాంతఃకరణులు నైన వీరలకు ననృతంబులు వలికితి మేని మమ్మయినం జిత్తంబు కొలంది నాజ్ఞాపింపు మని కరకమలంబులు మొగిచి కృతాంజలులై యున్న మునులం గరుణార్ద్రదృష్టిం గనుంగొని. 581**

**ప్రతి :** అట్లు+అయినన్= మీరు జయవిజయుల్ని రక్షించేటట్లయితే; మాకున్= (సనకాదులకు); ప్రియంబు+అగున్= ఇష్టమే అవుతుంది; కావునన్= అందువల్ల; న+అపరాధులు= తప్పుచేయనివారును; అతి= మిక్కిలి; నిర్మల+అంతఃకరణులు= స్వచ్ఛమైన మనస్సులు గలవారలును; ఐనవీరలకున్= అయినట్టి ఈ ద్వారపాలురకు; అనృతంబులు= అబద్ధాలు; పలికితిమి+ఏనిన్= పలికినట్లయినచో; మమ్ము+అయినన్= మా నల్గురినికూడ; చిత్తంబుకొలది= మీ బుద్ధికి తోచినట్లు; ఆజ్ఞాపింపుము= ఆనతిందు; అని; కరకమలంబులు= చేతులనెడి పద్మాల్ని; మొగిచి= ముడిచి; కృత+అంజలులు+ఐ= చేయబడిన దోసిళ్ళుగలవారై; (నమస్కరించినవారై); ఉన్న; మునులన్= సనకాదులను; కరుణా+ఆర్ద్రదృష్టిన్= కనికరపు చూపుతో; కనుంగొని= చూచి...

**తా :** ఓ స్వామీ! వారిద్దరిని మీరు రక్షిస్తే మాకు సంతోషమే. ఒక వేళ ఏ తప్పు చేయనివారు, హృదయంలో ఎలాంటి కల్మషం లేనివారును అయిన జయవిజయుల్ని మేము నిష్కారణంగా శపించివుంటే మాకు మీరే శిక్ష విధించినా సమ్మతమే అని సనకాదులు దోసిలొగ్గి హరిని ప్రార్థించారు. అప్పుడా శ్రీహరి మునులను దయతో చూస్తూ ఇలా అన్నాడు.

**క. అనఘుఁడు భగవంతుం డి, ట్లనియెన్ మునులార! వీర లలరన్ భువికిం**
**జని యచట నసురయోనిన్, జనియింతురు లోభమోహసంగతు లగుచున్. 582**

**ప్రతి :** అనఘుఁడు= పాపరహితుడైన; భగవంతుండు= దేవుడు (శ్రీహరి); ఇట్లు+అనియెన్= చెప్పబోవురీతిగా అన్నాడు; మునులార= మునీశ్వరులారా!; వీరలు= ఈ జయవిజయులు; అలరన్= ఒప్పిదముగా; భువికిన్= భూలోకానికి; చని= వెళ్ళి; అచటన్= ఆ నేలపై; లోభమోహసంగతులు+అగుచున్= పిసినారితనం; మరియు వ్యామోహం అనే గుణాలతో కూడినవారై; అసురయోనిన్= రాక్షసుల కడుపున; జనియింతురు= పుట్టుదురు.

**తా :** 'ఓ మునీశ్వరులారా! ఈ జయ విజయులు భూలోకానికి వెళ్ళి అక్కడ లోభమోహ పరాయణులై రాక్షసుల కడుపున జన్మిస్తారు' అని భగవంతుడు సనకాదులతో అన్నాడు.

**క. దేవ జనావళి కుపహతిఁ, గావించుచు నిఖిలభువనకంటకవృత్తిన్**
**జీవించుచు నా యెడ సం, భావిత వైరానుబంధభావులు నగుచున్. 583**

**ప్రతి :** దేవ= దేవతలకును; జన+ఆవళికిన్= ప్రజల సమూహానికి; ఉపహతిన్= ప్రమాదం; కావించుచున్= చేస్తూ; నిఖిల= సమస్తమైన; భువన= లోకాలకు; కంటకవృత్తిన్= ముల్లువలె గ్రుచ్చుకొనేస్థితితో; జీవించుచున్= బ్రతుకుతూ; నా+ఎడన్= నాపట్ల; సంభావిత= కల్పించుకొన్న; వైర+అనుబంధభావులు= శత్రుత్వభావనకలవారుగా; అగుచున్= అయి...

**తా :** రక్కసులైన వారిరువురు దేవతలకు, ప్రజలకు హాని కల్పిస్తారు. సమస్త లోకాలను నొప్పించే పనులే చేస్తారు. నా పట్ల విరోధాన్ని పెంచుకొంటారు.

**క. ఆహవముఖమున నను నతి, సాహసమున నెదిరి పోరి చక్రనిశిత ధా,**
**రాహతిఁ దెగి వచ్చెద రు, త్సాహ మెలర్పంగ నాదు సన్నిధి కంతన్. 584**

**ప్రతి :** అతిసాహసమునన్= మిక్కిలి ధైర్యంతో; ఆహవముఖమునన్= యుద్ధరంగమందు; ననున్= నన్ను; ఎదిరిపోరి= ఎదిరించి పోరుసల్పి; చక్ర= సుదర్శనమనే నా చక్రముయొక్క; నిశిత= వాడియైన; ధారాహతిన్= అంచు సోకుట చేత;

తెగి= చచ్చి; అంతన్= ఆ తర్వాత; ఉత్సాహము= సంరంభం; ఎలర్పన్= ఒప్పారగా; నాదుసన్నిధికిన్= నా చెంతకు; వచ్చెదరు= వస్తారు.

**తా :** ఆ ఇర్వురు యుద్ధరంగంలో నాతో తలపడి, సుదర్శనచక్రపు తాకిడిచే కూలి, తిరిగి మహోత్సాహంతో నా సన్నిధికి వస్తారు (వారికి వైకుంఠప్రాప్తి అవుతుందని భావం).

**వ. అదియునుంగాక. 585**

**ప్రతి :** అదియునున్+గాక= అంతేగాక.

**తా :** నా సన్నిధికి రావటమేగాక, ఇంకా...

**క. నను వైరంబుననైనను, మనమునఁదలఁచుటను నా సమక్షమున మదా**
**నన మీక్షించుచు నీల్గుట, ననఘాత్మకులై వసింతు రస్మత్పదవిన్. 586**

**ప్రతి :** ననున్= నన్ను (విష్ణువుని); వైరంబునన్+అయిననున్= విరోధముతోనైనా; మనమునన్= తమమనస్సులో; తలఁచుటను= భావించుటవలననూ; నా సమక్షమునన్= నాయెదుట; మత్+ఆననము= నా మోము; ఈక్షించుచున్= చూస్తూ; ఈల్గుటన్= చచ్చుట వల్లను; అస్మద్+పదవిన్= నా స్థానమందు (వైకుంఠమున); అనఘ+ఆత్ములు+ఐ= పాపంలేని మనస్సులు గలవారై; వసింతురు= నివసిస్తారు.

**తా :** ఈ జయవిజయులిద్దరు భూలోకమున రాక్షసులై పుట్టి నాతో తలపడాలని బుద్ధిపుట్టి, నా ఎదుట నన్నే చూస్తూ చస్తారు. తర్వాత తమ పాపాల నుండి విడివడినవారై వైకుంఠంలో నివసిస్తారు.

**క. వినుఁడిలమీఁద నిఁకెన్నఁటి, కిని బుట్టువు లేదు వీరికిన్, మీరలు వ**
**ల్కిన యట్ల నాదు చిత్తము, నను దలఁతుంగాన మీ మనంబుల నింకన్. 587**

**ప్రతి :** వినుఁడు= వినండి (సనకాదులనుద్దేశించిన సంబోధన); వీరికిన్= ఈ జయవిజయులకు; ఇలమీఁదన్= భూమిపై; ఇఁకన్= తర్వాత; ఎన్నఁటికిన్= ఎప్పటికి కూడ; పుట్టువులేదు= పుట్టటం ఉండదు; మీరు పల్కిన+అట్ల= మీరుకోరినట్లే; నాదు చిత్తమునను= నా మనస్సులోకూడ; తలఁతున్+కాన= అనుకొంటున్నానుకాబట్టి; ఇంకన్= ఇకపైన; మీ మనంబులన్= మీ మనస్సుల్లో...

**తా :** "ఈ జయ విజయులకు తర్వాత మరెప్పటికి భూలోకంలో పునర్జన్మ ఉండదు. మీ కోర్కెప్రకారం నేను కూడ మనస్సులో సమాధాన పడతాను" అని హరి సనకాదులతో అన్నాడు.

**ఉ. "దీనికిఁజింతఁదక్కుఁడు, సుధీజనపుంగవు"ల న్నఁ బ్రీతులై**
**యా నలినాసనాత్మజు లనంతుని భావము దా మెఱింగి పెం**
**పూనిన వేడ్కఁదేలి తెలివొందిన చిత్తములన్ నుతించి రం**
**భోనిధిశాయి నార్తజనపోషణభూషణుఁబాపశోషణున్. 588**

**ప్రతి :** సుధీజనపుంగవులు= శ్రేష్ఠులైన బుద్ధిమంతులారా!; దీనికిన్= ఈ పరిస్థితికి; చింతన్+తక్కుఁడు= విచారపడవద్దు; అన్నన్= అని విష్ణువనగా; ఆ నలిన+ఆసన+ఆత్మజులు= తామరనుండిపుట్టిన ఆ బ్రహ్మ కుమారులు (సనకాదులు); ప్రీతులు+ఐ= సంతోషించినవారై; తాము= స్వయముగా; అనంతుని భావము= అంతములేనివాడగు నారాయణుని మనస్సు; ఎఱింగి= తెలిసి; పెంపు+ఊనినవేడ్కన్= అతిశయించిన ఉల్లాసంలో; తేలి= ఉబ్బి; తెలివి+ఒందిన= వికాసంగల; చిత్తములన్= మనస్సులతో; ఆర్తజనపోషణ= దీనులను రక్షించుట; భూషణున్= ఆభరణముగా కలవాడును; పాపశోషణున్= పాపాల్ని మటుమాయంచేసేవాడును (అయిన); అంభోనిధిశాయిన్= నీటికినెలవైన సముద్రమందు నిదురించునట్టి విష్ణువును; నుతింతిరి= పొగడినారు.

**తా :** 'మునీశ్వరులారా! ఇక ఈ విషయాన్ని గూర్చి విచారపడవద్దు' అని హరి సనకాదులతో అన్నాడు. వారు స్వామివారి మనస్సులోని ఆంతర్యం తెలిసికొని "దీనజన రక్షకుడును, పాపాల్ని హరించేవాడును, సముద్రంలో శయనించువాడును అయిన విష్ణుమూర్తిని మహోత్సాహంతో వేనోళ్ళ కొనియాడారు.

**వ. మఱియును.** **589**

**ప్రతి :** మఱియునున్= ఇంకా...

**తా :** సనకాదులు తర్వాత స్వామితో ఇంకేదో అనబోతున్నారు.

**ఉ. ఆ సనకాదు లంతఁబులకాంకురముల్ ననలొత్త బాష్పధా**
**రాసుభగాక్షులై మునిశరణ్యవరేణ్యు నగణ్యు దేవతా**
**గ్రేసరు దివ్యమంగళశరీరముఁ జారుతదీయధామమున్**
**భాసురలీలఁజూచి నవపద్మదళాక్షునకున్ వినమ్రులై.** **590**

**ప్రతి :** అంతన్= తర్వాత; ఆ సనక+ఆదులు= సనకుడు మొదలైన ఆ మునులు; పులక+అంకురముల్= గగుర్పాటు మొలకలు; ననలు+ఒత్తన్= మొలకెత్తగా; బాష్పధారా= కన్నీటి ధారలతో కూడిన; సుభగ+అక్షులు+ఐ= ముచ్చటైన చూపులుగలవారై; మునిశరణ్యవరేణ్యున్= మునీశ్వరుల్ని కాపాడుటలో మొదటివాడును; న+గణ్యున్= లెక్కింప నలవి కానివాడును; దేవతా+అగ్రేసరు= దేవతలలో మొదట చెప్పదగినవాడైన శ్రీమహావిష్ణువుయొక్క; దివ్యమంగళశరీరమున్= దైవికమును, శుభదాయకము నగుదేహమును; చారుతదీయధామమున్= సుందరమైన ఆస్వామి నివాసమును; చూచి= కాంచి; నవ= కొంగ్రొత్త; పద్మదళ+అక్షునకున్= తామరరేకులబోలిన కన్నులుగల విష్ణుమూర్తికి; వినమ్రులు+ఐ= తలలు వంచినవారై (సనకాదులు)...

**తా :** జరిగిన సంఘటనకు విచారపడవద్దని విష్ణువు సనకాదులకు చెప్పాడు. ఆ మాటకు వారు పులకించిపోయారు. కన్నులు చెమ్మగిల్లాయి. అంత నా మునులు మునిజనులను కాపాడే వాడును, దేవతలకు అధిపతియు, ఇంతటి వాడని చెప్పసాధ్యం కానివాడునునైన ఆ విష్ణువు దేహాన్ని, ఆయన నివాసాన్ని కన్నులార కాంచి కమలాక్షుని యెదుట తలలు వంచారు.

**క. తమ పలికిన భాషణములు, గమలోదరు భాషణములుగాఁ దలఁచుచు నె**
**య్యమునన్ వైష్ణవలక్ష్మిం, బ్రమదంబునఁబ్రస్తుతించి పరమేశ్వరుచేన్** **591**

**ప్రతి :** (సనకాదులు) తమపలికిన= తాముచెప్పినట్టి; భాషణములు= మాటలు; కమల+ఉదరు= కమలము కడుపులోగల విష్ణువు; భాషణములుగాన్= మాటలుగా; తలచుచున్= భావిస్తూ; నెయ్యమునన్= ప్రీతితో; వైష్ణవలక్ష్మిన్= వైకుంఠవైభవాన్ని; ప్రమదంబునన్= మిక్కిలి ఉత్సాహంతో; ప్రస్తుతించి= పొగడి; పరమ+ఈశ్వరుచేన్= పరమాత్మయగువిష్ణువుచే...

**తా :** ఇంతవరకు తాము పల్కిన పల్కులు (శాపాదులు) భగవంతుడైన విష్ణువు పల్కించినవిగా భావించి మునులు మహోత్సాహంతో వైకుంఠపుర వైభవాన్ని పొగడుతూ శ్రీహరిచే... (అనుమతిబడసినవారై వెళ్ళారు).

**విశే :** 'జయ విజయులను శాపగ్రస్తులను చేసిన విషయంలో తాము కేవలం నిమిత్తమాత్రులమే – అంతా ఆ విష్ణువే చేయించాడు' అని సనకాదులు గుర్తించారు. సమస్తం సర్వేశ్వరుని అధీనమే. ఆయన ఆజ్ఞలేనిది చీమైనా కదలాడదనే భావం ఈ పద్యంలో కానవస్తుంది.

**క. ఆమంత్రితులై తగ నిజ, ధామములకుఁజనిరి వారు, దడయక లక్ష్మీ**
**కాముఁడు జయవిజయుల నభి, రామంబుగఁజూచి పలికె రయ మొప్పారన్. 592**

**ప్రతి :** వారు= సనకాదులు; తగన్= తగినట్లు; ఆమంత్రితులు+ఐ= స్వామివారి అనుమతి గైకొన్నవారై; నిజధామములకున్= తమ విడుదులకు; తడయక= ఆలసింపక; చనిరి= వెళ్ళిరి; రయము+ఒప్పారన్= ఆ తర్వాత వెంటనే వేగంగా; లక్ష్మీకాముఁడు= సిరిమగడైనశ్రీహరి; జయవిజయులన్= ద్వారపాలకులను; అభిరామంబుగన్= ఆదరంతో; చూచి= కాంచి; పలికెన్= ఇట్లన్నాడు.

**తా :** మునులు శ్రీహరి అనుజ్ఞ గైకొని అక్కడనుండి తమ నివాసాలకు వెళ్ళిపోయారు. వెంటనే శ్రీమహావిష్ణువు జయవిజయుల్ని చూచి సాదరంగా ఇలా అన్నాడు.

**క. మీ రసురయోనియం దని, వారితులై జనన మందవలసెను, నే దు**
**ర్వారబలాఢ్యుఁడ నయ్యును, వారింపఁగనోప విప్రవచనము లెందున్. 593**

**ప్రతి :** మీరు= మీరిద్దరు (జయ విజయులు); న+నివారితులు+ఐ= అడ్డుపెట్టబడనివారై; అసురయోనియందున్= రక్కసిగర్భమునందు; జననము+అందవలసెను= పుట్టవలసివచ్చింది; నేన్= నేను (శ్రీహరిని); దుర్వార= వారింపరానట్టి; బల+ఆఢ్యుఁడన్= గొప్పబలంగలవాడను; అయ్యును= అయికూడ; ఎందున్= ఎక్కడైనను; విప్రవచనములు= బ్రాహ్మణులపల్కులను; వారింపఁగన్+ఓపన్= నివారించుటకు శక్తుని గాను.

**తా :** జయ విజయులారా! విధిలేక మీరు రక్కసి కడుపున పుట్టవలసివచ్చింది. నేను గొప్పబలం కలవాడనైనా బ్రాహ్మణవాక్కును తిరస్కరించలేను.

**క. అది గాన దనుజయోనిం, బదపడి జనియించి మద్విపక్షులరై మీ**
**మది నెపుడు నన్నె తలఁచుచు, వదలక నాచేతఁ జచ్చి వచ్చెద రిటకున్. 594**

**ప్రతి :** అది+కానన్= అట్లగుట నిజం కాబట్టి; పదపడి= పిమ్మట; దనుజయోనిన్= రాక్షసగర్భాన; జనియించి= మీరు పుట్టి; మద్+విపక్షులరు+ఐ= నాకుశత్రువులై; మీ మదిన్= మీ మనస్సులో; నన్నె; తలఁచుచున్= స్మరిస్తూ; వదలక= విడువక; నాచేతన్= నావల్ల; చచ్చి; ఇటకున్= వైకుంఠానికి; వచ్చెదరు= వస్తారు.

**తా :** బ్రాహ్మణ వాక్కును నేను తిరస్కరించను కాబట్టి, వారి శాపం ప్రకారం మీరు రాక్షసులై పుట్టండి. నాకు శత్రువులై నాతో పోరు సల్పి నన్నే ధ్యానిస్తూ నాచే చచ్చి తిరిగి వైకుంఠం చేరగలరు.

**ఉ. పొండని యానతిచ్చి హరి ఫుల్లసరోరుహపత్రనేత్రుఁ డా**
**ఖండలముఖ్యదిగ్వరనికాయకిరీటలసన్మణిప్రభా**
**మండితపాదపీఠుఁడు రమారమణీమణి దోడ నేఁగుదే**
**నిండిన వేడ్క నేఁగె నిజనిర్మలపుణ్యనివాసభూమికిన్. 595**

**ప్రతి :** ఫుల్ల= విరిసిన; సరస్+రుహ= పద్మం వంటి; నేత్రుఁడు= కన్నులుకలవాడును; ఆఖండలముఖ్య= ఇంద్రుడు మొదలైన; దిక్+వరనికాయ= దిక్పతుల సమూహంయొక్క; కిరీట= కిరీటాలందలి; లసత్= వెల్గుచున్న; మణిప్రభా= మణులకాంతిచేత; మండిత= అలంకరింపబడిన; పాదపీఠుఁడు= అడుగులుగల వాడును; (అగు); హరి= విష్ణువు; పొందు+అని= వెళ్ళండి అని; ఆనతి+ఇచ్చి= జయవిజయులను ఆజ్ఞాపించి; రమారమణీమణి= కాంతామణియైన లక్ష్మీదేవి; తోడన్= తనవెంట; ఏఁగు+తేన్= రాగా; నిండినవేడ్కన్= గొప్పవేడుకతో; నిజ= తన; నిర్మల= స్వచ్ఛమైన; పుణ్యనివాసభూమికిన్= పుణ్యానికి నెలవైన ఉనికికి (వైకుంఠానికి); ఏఁగెన్= వెళ్ళెను.

**తా :** వికసించిన తామరరేకులవంటి కన్నులు గలవాడును, దేవేంద్రుడు మొదలైన దేవతల కిరీటాల మణికాంతులు సోకుటచే మెరుస్తున్న పాదాలు గలవాడును నగు శ్రీహరి భూలోకంలో రాక్షసులై పుట్టండి వెళ్లండి అని జయవిజయుల్ని ఆదేశించి లక్ష్మీదేవి తన వెంటరాగా శాంతిధామం, పుణ్యప్రదమైన తన నివాసం వైకుంఠానికి వెళ్ళాడు.

**వ. అంత. 596**

**ప్రతి :** అంతన్= అంతలో,

**తా :** ఆ తర్వాత విషయం ఏమనగా.

**క. నిజతేజోహానిగ జయ, విజయులు ధరఁగూలి రపుడు విహ్వలు లగుచుం**
**ద్రిజగముల సురవిమాన, వ్రజముల హాహారవంబు గ్రందుగఁజెలఁగన్. 597**

**ప్రతి :** అపుడు= శ్రీహరివెళ్ళిపోగా; జయవిజయులు= ఈ ఇద్దఱు; విహ్వలులు+అగుచున్= స్వాధీనతను కోల్పోయినవారై (భయగ్రస్తులై); నిజతేజస్+హానిగన్= తమ కాంతి తరిగిపోగా; త్రిజగములన్= ముల్లోకాలలో; సురవిమానవ్రజములన్= దేవతల విమానాల గుంపులందు; హాహారవంబులు= హాహా అనే శబ్దాలు; క్రందుగన్= మిక్కిలిగా; చెలఁగన్= వ్యాపింపగా; ధరన్= భూమిపై; కూలిరి= పడిపోయారు.

**తా :** విష్ణుమూర్తి భార్యాసమేతుడై లోపలికి వెళ్ళగానే, భయగ్రస్తులైన జయ విజయులు దిగులుపడి, కాంతి తరిగి భూలోకం లోనికి కూలిపోయారు. ఆకాశంలో దేవతల విమానధ్వనులు మూడులోకాల్లో ప్రతిధ్వనించాయి.

**క. వారలె యా దితిగర్భా, గారంబున నున్నవారు గడఁగి తదీయో**
**దారఘనతేజ మిపు డని, వారణ మీ తేజ మెల్ల వమ్ముగఁ జేసెన్. 598**

**ప్రతి :** వారలె= ఆ జయవిజయులే; ఆ దితిగర్భ+అగారంబునన్= ఆ దితి గర్భం అనే గుహవంటి ప్రదేశంలో; ఉన్నవారు= ఉన్నారు; కడఁగి= అతిశయించి; తదీయ= వారిరువురి; ఉదార= దొడ్డదైన; ఘనతేజము= గొప్పకాంతి; ఇపుడు= ఈ

సమయంలో; అని వారణన్= అడ్డుపెట్టరానిదై; మీ తేజము+ఎల్లన్= మీ దేవతల కాంతిని లేక శక్తిని; వమ్మగన్+చేసెన్= వెలవెలపోవునట్లు చేసింది.

**తా :** "ఆ జయ విజయులే ఇప్పుడు దితిగర్భంలో ఉన్నారు. వారి శక్తియే మహాతేజస్సుగా అయి, మీ శక్తిని హరించి వేసింది" అని బ్రహ్మ దేవతలతో చెప్పాడు.

**ఉ. ఇంతకు మూల మా హరి, రమేశ్వరుఁడర్థి నొనర్చు కార్యముల్**
**వింతలె? సర్వభూత భవవృద్ధివినాశనహేతుభూతుఁ డా**
**ద్యంతవికారశూన్యుఁడు దయానిధి మీ యెడ మేలు సేయు నీ**
**చింతఁదొఱంగి వే చనుఁడు, చేకుఱు మీకు మనోరథార్థముల్. 599**

**ప్రతి :** ఇంతకున్= ఈ పరిణామాలన్నింటికి; మూలము= ప్రధానకారణం; రమా+ఈశ్వరుఁడు= లక్ష్మీదేవిమగడైన; ఆహరి= ఆ విష్ణువు; అర్థిన్= కోరికతో; ఒనర్చుకార్యముల్= చేసేపనులు; వింతలె= ఆశ్చర్యాన్ని గొల్పేవే గదా!; సర్వభూత= అన్ని ప్రాణుల; భవ= పుట్టుకకు; వృద్ధి= స్థితికి; వినాశన= ప్రళయానికి; హేతుభూతుఁడు= కారకుడును; ఆది+అంత= మొదలు, తుది అనే; వికారశూన్యుఁడు= వికారాలు లేనివాడును; దయానిధి= దయకు నెలవైనవాడగు హరియే; మీ+ఎడన్= మీ విషయంలో; మేలు+చేయున్= మంచిచేస్తాడు; ఈ చింతన్= ఈ విచారాన్ని; తొఱంగి= వదలి; వే= వెంటనే; చనుఁడు= వెళ్ళండి; మీకున్= (దేవతలకు); మనస్+రథ+అర్థముల్= మనస్సులోని మీ ప్రయోజనాలు; చేకుఱున్= నెరవేరతాయి.

**తా :** 'దేవతలారా! ఇంతకు ఈ పరిస్థితులకు శ్రీమహావిష్ణువే మూలకారకుడు. ఈ జగత్తు సృష్టి, స్థితి లయాలకు కారకుడు, తుది మొదలు లేనివాడు, కారుణ్యమూర్తి ఆయనే. మీకు ఆయన మేలు చేస్తాడు. చీకుచింతలు మాని వెళ్ళండి. మీ కోర్కెలు నెరవేరుతాయి' అని బ్రహ్మ వారితో అన్నాడు–

**క. అని వనజాసనుఁడాడిన, విని తద్వృత్తాంత మెఱిఁగి విబుధులు నాకం**
**బున కేగిరి, దితి నిజ నా, థుని మాటలు తలఁచి యపరితోషము తోడన్. 600**

**ప్రతి :** అని= ఇట్లు; వనజ+ఆసనుఁడు= పద్మం ఆసనం అయిన బ్రహ్మ; ఆడిగినన్= చెప్పగా; విని= ఆలకించి; తద్+వృత్తాంతము= ఆ కథ; ఎఱిఁగి= తెలిసి; విబుధులు= దేవతలు; నాకంబునకున్= దేవలోకానికి; ఏగిరి= వెళ్ళారు; దితి; నిజనాథుని= తన భర్తయైన కశ్యపుని; మాటలు= పల్కులు; తలఁచి= స్మరించుకొని; న+పరితోషముతోడన్= దుఃఖంతో...

**తా :** బ్రహ్మ అలా చెప్పగానే దేవతలు అసలు కథ తెలిసికొన్నవారై దేవలోకానికి వెళ్ళారు. కశ్యపుని మాటలు విని దితి కూడ అంతగా సంతోషం లేనిదయింది.

## ✤ జయవిజయులు దితియందు హిరణ్యాక్షహిరణ్యకశిపులై పుట్టుట ✤

**తే. ఇంతి దన సుతుల్ సురలఁగారింతు రనుచుఁ, దలఁచుచుండంగ నంత వత్సరశతంబు**
**సనఁగ నఁటమీఁదఁగనియెఁ గశ్యపుని దేవి, యఖిల లోకైకకంటకు లైన సుతుల. 601**

**ప్రతి :** తన సుతుల్= తన కుమారులు; సురలన్= దేవతలను, కారింతురు= బాధిస్తారు; అనుచున్= అనుకొంటూ; తలంచుచున్+ఉండగన్= ఆలోచిస్తుండగా; అంతన్= అంతలో; వత్సరశతంబు= నూరుసంవత్సరాలు, చనఁగన్= జరుగగా; అంటమీఁదన్= ఆ పైన; ఇంతి= మహిళయైన; కశ్యపుదేవి= కశ్యపునిభార్యయైన దితి; అఖిలలోక+ఏక కంటకులు= అన్నిలోకాలను మిక్కిలి పీడించేవారు; అయిన సుతులన్= అయినట్టి కొడుకులను; కనియెన్= కనింది.

**తా :** కశ్యపుని భార్యయైన దితి తనకు కలుగబోయే కొడుకులు దేవతల్ని ముప్పుతిప్పలు పెట్టగలరని అనుకొంటుండగానే నూరుసంవత్సరాలు గడిచాయి. తర్వాత ఆమెకు సమస్తలోకాల్ని విధ్వంసం చేయగల కుమారులు పుట్టారు.

**వ. అయ్యవసరంబున. 602**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో,

**తా :** దితి పుత్రులను పొందిన ఆ సమయంలో

**తే. ధరణి గంపించెఁ, గులపర్వతములు వడఁకె, జలధులు గలంగెఁ, దారకావళులు డుల్లె**
**గగన మగలెను, బ్రొగ్గె దిక్కరులు, దిశల, మిడుఁగుఱు లెగసెఁ, బిడుగులు పుడమిఁబడియె. 603**

**ప్రతి :** ధరణి= భూమి; కంపించెన్= వణికింది; కులపర్వతములు= ప్రధానమైన కొండలు; వడఁకెన్= వణికాయి; జలధులు= సముద్రాలు; కలంగెన్= కలత చెందాయి; తారక+ఆవళులు= నక్షత్రాలగుంపులు; డుల్లెన్= రాలాయి; గగనము= ఆకాశం; అగలెను= బ్రద్దలైంది; దిక్+కరులు= దిక్కులందలి ఏనుగులు; మ్రొగ్గెన్= వంగినాయి; దిశలన్= దిక్కులందు; మిడుఁగుఱులు= మెరుపులు; ఎగసెన్= మెరిసాయి; పిడుగులు; పుడమిన్+పడియెన్= భూమిపై రాలాయి.

**తా :** దితికి లోకద్రోహులైన కొడుకులు పుట్టగానే భూమి కదిలింది. కులాచలాలు వణికాయి. సముద్రాలు అల్లకల్లోలమయ్యాయి. నక్షత్రాలు రాలాయి. ఆకాశం బద్దలైంది. దిగ్గజాలు కిందికి వంగిపోయాయి. మెరుపులు తళుక్కుమన్నాయి. పిడుగులు భూమిపై పడ్డాయి.

**విశే :** మహేంద్రం, మలయం, సహ్యం, శుక్తిమంతం, గంధమాదనం, వింధ్యం, పారియాత్రం– అని ఈ ఏడింటికి కులపర్వతములని వ్యవహారం.

**సీ. హోమానలంబుల ధూమంబు లడరెను బ్రతికూలవాయువుల్ బలసి వీచెఁ**
**దరువు లెల్లెడ విటతాటంబులై కూలె గ్రహతారకావళి కాంతి మాసె,**
**బెరసి మొగిళ్లు నెత్తురువాన గురిసెను మెఱుఁగులు దెసల మిర్మిట్లుగొలిపె**
**స్వర్భానుఁడొగి నపర్వమున భానునిఁ బట్టెఁ గైకొని చిమ్మచీఁకట్లు పర్వె,**

**తే. మొనసి కుక్కలు మొఱిఁగెను మోర లెత్తి, పగలు నక్కలు వాపోయె, ఖగము లార్త**
**రవము లిచ్చెను, దేవతాప్రతిమ లొరగెఁ, గన్నులను నశ్రుకణములు గ్రందుకొనఁగ. 604**

**ప్రతి :** హోమ+అనలంబులన్= హోమాగ్నులందు; ధూమంబులు= పొగలు; అడరెను= వ్యాపించాయి; ప్రతికూలవాయువులు= ఎదురుగాలులు; బలసి= అతిశయించి; వీచెన్= వీచాయి; ఎల్ల+ఎడన్= అన్నివైపుల; తరువులు=

చెట్లు; విటతాటంబులు+ఐ= తారుమారై; కూలెన్= కూలాయి; గ్రహతారక+ఆవళి= గ్రహాల తారకల సమూహం; కాంతిమాసెన్= కళతప్పింది; మొగిళ్ళు= మబ్బులు; బెరసి= వ్యాపించి; నెత్తురువాన= రక్తవర్షం; కురిసెను= కురిసింది; మెఱుఁగులు= మెరుపులు; దెసలన్= దిక్కులందు; మిర్మిట్లు+కొలిపెను= తళతళమెరిశాయి; స్వర్భానుఁడు= రాహువు; ఒగిన్= ఒక్కపెట్టున; అపర్వమునన్= రవిసంక్రాంతి కానివేళలో (పండుగకాని సమయం); భానునిన్= సూర్యుని; పట్టెన్= కబళించాడు; కై+కొని= పైకొని; చిమ్మచీఁకట్లు= కటిక చీకట్లు; పర్వెన్= వ్యాపించాయి; మొనసి= పూని, కుక్కలు; మోరలు+ఎత్తి= గొంతెత్తి; మొఱిఁగెను= భౌ భౌ అన్నాయి, పగలు, నక్కలు; వాపోయెన్= అరిచాయి; ఖగములు= పక్షులు; కన్నులను= కళ్ళలో; అశ్రుకణములు= కన్నీళ్ళు; క్రందుకొనఁగన్= అతిశయింపగా; ఆర్తరవములు+ఇచ్చెను= బాధతో కూడిన కూతలు పెట్టాయి; దేవతాప్రతిమలు= దేవుళ్ళవిగ్రహాలు; ఒరసెన్= కూలాయి.

**తా :** హోమాగ్నులు పొగ చూరాయి. ఎదురు గాలులు వీచాయి. చెట్లన్నీ అడ్డదిడ్డంగా కూలిపడ్డాయి. గ్రహాలు, తారలు కాంతి విహీనమయ్యాయి. మబ్బులు నెత్తురు కురిశాయి. మెరుపులు మిరుమిట్లు గొల్పాయి. రాహువు అకాలంలో సూర్యుని చెరబట్టాడు. చిమ్మచీకట్లు ప్రబలాయి. కుక్కలు గొంతెత్తి అరచాయి. పట్టపగలే నక్కలు కూశాయి. పులుగులు బాధతో కూతలు పెట్టాయి. కన్నుల్లో నీరుగ్రమ్మగా దేవతా విగ్రహాలు కూలిపడ్డాయి.

**క. మొదవులు నెత్తురుఁజీమును, బిదికెన్, గార్దభరవంబు భీషణ మయ్యెన్**
**మద ముడిగెఁగరుల కటములఁ, బొదివెఁదురంగముల వాలముల నిప్పు లొగిన్. 605**

**ప్రతి :** మొదవులు= ఆవులు; నెత్తురున్= రక్తమును; చీమును= రసియు; పితికెన్= స్రవించాయి; గార్ధభరవంబు= గాడిదల ఓంఢ్రపెట్టుట; భీషణము+అయ్యెన్= భీకరమైంది; కరులకీటములన్= ఏనుగుల గండస్థలాలలో; మదము= చెక్కిలి దానము; (ఒకవిధమగు కొవ్వు); ఉడిగెన్= అణగింది; ఒగిన్= క్రమంగా; తురంగముల= గుర్రాల; వాలములన్= తోకలందు; నిప్పులు= అగ్నులు; ఒదవెన్= చూపట్టెను.

**తా :** ఆవుల పొదుగుల్లో రక్తం, చీము కారింది. గాడిదలు బోరున ఓంఢ్ర పెట్టాయి. ఏనుగుల చెక్కిళ్ళలో మదముడిగింది. గుర్రాల తోకల్లో నిప్పులు చూపట్టాయి.

**క. గుహలు రొదలిచ్చెఁ, బాప, గ్రహమిత్రతఁజెంది వక్రగతులను సౌమ్య**
**గ్రహములు వర్తించెను, దు, స్సహతేజోదితితనూజసంభవవేళన్. 606**

**ప్రతి :** దుస్సహ= భరింప సాధ్యంకాని; తేజస్= శక్తిగల; దితితనూజ= దితికుమారుల; సంభవవేళన్= పుట్టుక సమయంలో; గుహలు; రొదలు+ఇచ్చెన్= ప్రతిధ్వనించాయి; సౌమ్యగ్రహములు= ప్రశాంతమైన గ్రహాలు (నవగ్రహాలు); పాపగ్రహ మిత్రతన్+చెంది= దుష్టగ్రహాలతో కలిసినవై; వక్రగతులను= అడ్డదారులలో; వర్తించెను= సంచరించాయి.

**తా :** దితి కడుపున శక్తిమంతమైన కుమారులు కల్గిన సమయంలో గుహలు మారుమ్రోగాయి. శుభ గ్రహాలు దుష్టగ్రహాలతో కలిసి అడ్డదారులు త్రొక్కి భ్రమించాయి. (గ్రహగతి మారటం అశుభసూచకం).

**మ. భయదప్రక్రియ నట్లు దోఁచిన మహోత్పాతమ్ము వీక్షించి సం**
**క్షయకాలం బని కాని, సాధుహననోగ్రక్రూరదేవాహితో**

**దయసంక్షోభముగా నెఱుంగక సమస్తప్రాణిసంఘాతముల్,**
**భయమందెన్ సనకాదియోగిజనముల్ దక్కన్ బుధేంద్రోత్తమా! 607**

**ప్రతి :** బుధ+ఇంద్ర+ఉత్తమా!= బుద్ధిమంతులలో శ్రేష్ఠుడవైనవాడా!; విదురా!= విదుర మహాశయా!; సనక+ఆది= సనకుడు మొదలైన; యోగిజనముల్+తక్కన్= మునులు తప్ప తక్కిన; సమస్త= అన్నివిధాలైన; ప్రాణిసంఘాతముల్= ప్రాణికోట్లు; భయదప్రక్రియన్= భయాన్ని కొల్పే విధానంతో; అట్లు= ఆ విధంగా; తోఁచిన= కన్పించినట్టి; మహా+ఉత్పాతమ్ములు= గొప్ప ఉపద్రవాలు; ఈక్షించి= చూచి; సంక్షయకాలంబు+ అనికాని= వినాశకాలమో కాక; సాధు= సజ్జనుల; హనన= వధకై; ఉగ్ర= భయాన్నికొల్పే; క్రూర= కఠోరులైన; దేవ+అహిత+ఉదయ= దేవతలకుహానిగొల్పే రాక్షసుల పుట్టుక వల్లనైన; సంక్షోభము+కాన్= అల్లకల్లోలమో; ఎఱుంగక= తెలియక; భయము+అందెన్= భీతిచెందింది.

**తా :** ఓ బుద్ధిమంతుడవైన విదురా! ఒక్క సనకాదిమునులు తప్ప తక్కిన ప్రాణికోట్లన్నీ వెరపుగొల్పే ఉత్పాతాలను చూచి "ఇది ప్రళయకాలమా? కాక సత్పురుషులను హింసించడానికి అవతరించిన రక్కసుల ఆగడమా?" ఏదో తెలియక భయగ్రస్తమయ్యాయి.

**వ. అట్లావిర్భవించిన యనంతరంబ. 608**

**ప్రతి :** అట్లు= ఈ విధంగా; ఆవిర్భవించిన= ఆ ఇద్దరు పుట్టిన; అనంతరంబు+అ= తర్వాత...

**తా :** అంత భయంకరంగా జయ విజయులు రాక్షసులై పుట్టారు.

**మ. కులశైలాభ శరీరముల్ దనర రక్షోనాథు లత్యుగ్ర దో**
**ర్బల మొప్పం బదఘట్టనన్ ధర చలింపన్ రత్న కేయూర కుం**
**డల కాంచీ కటకాంగులీయక కిరీటస్వర్ణమంజీర ని**
**ర్మలకాంతుల్ దులకింప నాత్మరుచిచే మందీకృతార్కాంశులై. 609**

**ప్రతి :** రక్షస్+నాథులు= రక్కసజట్టీలిర్వురు; కులశైల+ఆభ= కులపర్వతాలతో సమానమైన; శరీరముల్= దేహాలు; తనరన్= ఒప్పారుగా; అతి+ఉగ్ర= మిక్కిలి వెరపుగొల్పెడి; దోస్+బలము= భుజబలము; ఒప్పన్= బయల్పడగా; పదఘట్టనన్= కాలిరాపిడిచేత; ధర= భూమి; చలింపన్= కదలగా; రత్నకేయూర= రత్నాలు తాపిన భుజకీర్తుల; కుండల= చెవిపోగుల; కాంచి= మొలనూలి; కటక= కడియాల; అంగులీయక= వ్రేలఉంగరాల; కిరీట= తలమానికముయొక్క; స్వర్ణమంజీర= బంగారుగజ్జెల; నిర్మలకాంతుల్= స్వచ్ఛమైన వెలుగులు; తులకింపన్= జిగేలుమనగా; ఆత్మరుచిచేన్= తమప్రకాశంచేత; మందీకృత= కొడిగట్టునట్లు చేయబడిన; అర్క+అంశులు+ఐ= సూర్యకాంతిగలవారై.

**తా :** అంతభయంకరంగా జన్మించిన ఆ రక్కసు లిర్వురు కులపర్వతాలను పోలి ఉన్నారు. వారి బాహుబలం చెప్పనలవి కానిది. వారు తమ అడుగులతో చరచినప్పుడు నేల గడగడలాడింది. తాము ధరించిన రత్నాల భుజకీర్తులు, చెవిపోగులు, మొలనూళ్ళు, కడియాలు, ఉంగరాలు, కిరీటాలు, బంగారు గజ్జెలు మొదలైన ఆభరణాల నిగనిగలు జిగేలుమన్నాయి. ఆ ఇర్వురి దేహకాంతి సూర్యరశ్మిని వెలవెలబోయేట్లు చేసింది.

**వ. ఉన్న సమయంబునం గశ్యపుండు నిజతనూభవులఁ జూడం దలంచి దితిమందిరంబునకుఁ జనుదెంచి సుతులం గనుంగొని వారలకు నామకరణంబు సేయం దలంచి. 610**

**ప్రతి :** ఉన్న సమయంబునన్= ఇర్వురు మహాతేజస్సుగల వారై పుట్టిన సమయంలో; కశ్యపుండు= కశ్యపప్రజాపతి; నిజతనూభవులన్= తన కుమారులను; చూడన్+తలంచి= చూడాలనికోరి; దితి మందిరంబునకున్= దితి ఇంటికి; చనుదెంచి= వచ్చి; సుతులన్+కనుంగొని= కుమారులను చూచి; వారలకున్= ఆ యిద్దరికి; నామకరణంబు= పేర్లుపెట్టడం; చేయన్+తలంచిన్= చేయాలనుకొని

**తా :** రాక్షస కుమారులిర్వురు మహాతేజోధనులై వెల్గుతున్న సమయంలో వారి తండ్రియైన కశ్యపుడు దితి ఇంటికి వచ్చి, బాలురను చూచి వారికి పేర్లు పెట్టాలనుకొన్నాడు.

**మ. దితిజఠరంబునందుఁదన తేజము మున్నిడినట్టి పుత్త్రు న**
**ద్భుత చరితున్ "హిరణ్యకశిపుం"దనుపేరఁ, బ్రసూతివేళ నా**
**దితి మును గన్న పట్టి రవితేజునిఁ"గాంచనలోచనుండు" నా**
**హితమతిఁబేరు వెట్టి చనియెన్ నిజనిర్మలపుణ్యభూమికిన్. 611**

**ప్రతి :** దితిజఠరంబునందున్= దితి కడుపునందు; తన తేజమున్= తన (కశ్యపునియొక్క) వీర్యాన్ని; మున్ను+ఇడిన+అట్టి= ముందు ఉంచినటువంటి; పుత్రున్= కుమారుణ్ణి; అద్భుత చరితున్= గొప్పచరిత్ర గలవానిని; 'హిరణ్యకశిపుండు'+అను పేరన్= హిరణ్యకశిపుడు అనే పేరుతోను; ప్రసూతి వేళన్= పుట్టినప్పుడు; ఆ దితి= ఆ దైత్యుల తల్లి; మును+కన్న+అట్టి= హిరణ్యకశిపునికంటె ముందు కన్నట్టి; రవితేజునిన్= సూర్యసమానుడైన ప్రకాశం గలవాణ్ణి; కాంచనలోచనుండు= బంగారు కళ్ళుగలవాడును; నాన్= అనే; పేరు+పెట్టి= పేరుంచి; హితమతిన్= మంచిమనస్సుతో; నిజ= తన; నిర్మల= ప్రశాంతమైన; పుణ్యభూమికిన్= పవిత్రప్రదేశానికి; చనియెన్= వెళ్ళాడు.

**తా :** ఆ కశ్యపబ్రహ్మ గర్భాధాన సమయంలో దితికడుపున తానుంచిన తొలి వీర్యంవల్ల కల్గిన కుమారునికి 'హిరణ్యకశిపుడు' అనే పేరుపెట్టాడు. దితిగర్భంనుండి ముందు పుట్టిన కుమారునికి 'కాంచనలోచనుడు' (అనగా హిరణ్యాక్షుడు) అనే పేరుపెట్టాడు. తర్వాత నిజపుణ్యభూమికి తరలిపోయాడు–

**విశే :** రాక్షసులుగా జన్మించిన ఈ బాలుర ప్రసవగాథ విచిత్రమైంది. కశ్యపుడు దితిగర్భాన మొదటనుంచిన వీర్య శిశువు 'హిరణ్యకశిపుడు'. ప్రసవసమయంలో ముందు పుట్టిన కుమారుడు 'హిరణ్యాక్షుడు'.

దితిగర్భపుష్పంలో నిక్షిప్తమైన కశ్యపుని వీర్యం రెండుగా విభజింపబడ్డప్పుడు మొదటి బీజం గర్భంలో వెనుకగాను, రెండవబీజం ముందుభాగంలోను ఉండటం జరిగింది. ప్రసవసమయంలో రెండవ బీజం తొలుతగా, మొదటిబీజం రెండవదిగా బహిర్గతమైనట్లు వివరణ చెపుతున్నది–

తొలుత పుట్టిన బిడ్డ 'హిరణ్యాక్షుడు'. బంగారుకళ్ళవాడు – మలివిడత పుట్టిన బిడ్డ 'హిరణ్యకశిపుడు' బంగారుసింహాసనం కలవాడు అని కశ్యపుడు వారికి నామధేయం చేశాడు.

కవలలలో ముందు పుట్టినవాడు తమ్ముడు, వెనుక పుట్టినవాడు అన్నగా పరిగణించటం ఉన్నది.

**వ. అయ్యవసరంబున నతుల తేజో విరాజితుండైన హిరణ్యకశిపుండు హిరణ్యగర్భ వరదాన గర్వంబునను, దుర్వార పరిపంథి గర్వ నిర్వాపణాఖర్వ భుజావిజృంభణంబునను నిఖిలలోక పాలాదుల జయించి స్వవశం**

**బొనర్చి సంతుష్టాంతరంగుండై యెందునుం దనకు మృత్యుభయంబు లేక నిర్భయుండై సుఖంబుండె, తత్సోదరుండైన హిరణ్యాక్షుండు ప్రతిదివసంబుఁ జండ వేదండ శుండాదండ మండిత భుజాదండంబున గదాదండంబు ధరియించి తన్ను నెదిరి కదనంబు సేయంజాలిన యరివీరునిం గానక భూలోకం బెల్లం గ్రుమ్మరి దివంబునకు దాడివెట్టి యందు సమరవిముఖులైన బర్హిర్ముఖులం గనుంగొని వనజాసన వరప్రదానంబు జింతించి హితులు సెలంగ నహితులు గలంగ మహిత వైజయంతికాదామం బభిరామంబై వెలుంగం జరణంబుల మణినూపురంబులు మొరయ నిజదేహద్యుతి దిక్కులం బిక్కటిల్లం జనుదెంచువానిం గని భీతచిత్తులయి దేవతాగణంబులు గరుడునిం గని పఱచు నురగంబులుంబోలె నిజనివాసంబు లర్కనివాసంబులుం గాంచనావాసంబులుంగా నొనర్చి యెక్కడికేనిం జనిన. 612**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఇర్వురు కుమారులు పుట్టిన సమయంలో వారికి పేర్లుపెట్టి కశ్యపుడు వెళ్ళిపోగా; అతుల= సాటిలేని; తేజస్+విరాజితుండు+ఐన= చైతన్యశక్తిచే ప్రకాశిస్తున్న; హిరణ్యకశిపుండు= హిరణ్యకశిపుడు; హిరణ్యగర్భ= కడుపులో బంగారం కల్గిన బ్రహ్మ; వరదానగర్వంబునను= వరమొసంగుటవల్ల కల్గిన పొగరుబోతుతనంతోను; దుర్వార= అడ్డుపెట్ట శక్యంకాని; పరిపంథి= విరోధుల; గర్వ= పొగరును; నిర్వాపణ= తొలగింపగల్గిన; న+ఖర్వ= మొక్కవోని; భుజావిజృంభణంబునను= రెట్టల బిగువువల్లను; నిఖిల= సమస్తమైన; లోకపాల+ఆదులన్= దిక్పతులు మొదలైన వారిని; జయించి= గెలిచి; స్వవశంబు= తన అదుపులో; ఒనర్చి= ఉండేటట్లు చేసి; సంతుష్ట= సంతోషించిన; అంతరంగుండు+ఐ= మనస్సుగలవాడై; ఎందునున్= ఏ ప్రదేశంలోనూ; తనకున్ (హిరణ్యకశిపునికి); మృత్యుభయంబులేక= చావువలని భీతి లేకుండ; నిర్+భయుండు+ఐ= జంకులేనివాడై; సుఖంబు+ఉండెన్= సంతోషంగా ఉండినాడు; తద్+సోదరుండు+ఐన= ఆ హిరణ్యకశిపుని అన్నయైన; హిరణ్యాక్షుండు= బంగారుకన్నులవాఁడు; ప్రతిదివసంబున్= దినదినమూ; చండ= తీక్ష్ణమైన; వేదండ= ఏనుగు; శుండాదండ= కఱ్ఱవంటి తొండం వంటి; మండిత= కొనియాడదగిన; భుజాదండంబునన్= దండాన్నిపోలిన భుజాలచేత; గదాదండంబున్= గద పిడిభాగాన్ని; ధరియించి= తాల్చి; తన్నున్= తనను (హిరణ్యాక్షుని); ఎదిరి= పోటొడ్డి; కదనంబు= పోరు; చేయన్+చాలిన= సలుపగల్గినట్టి; అరివీరునిన్= వీరుడైన పగతుని; కానక= చూడక; భూలోకంబు+ఎల్లన్= నేల అంతటిని; క్రుమ్మరి= తిరిగి, (గాలించి); దివంబునకున్= ఆకాశానికి లేదా స్వర్గానికి; దాడి+పెట్టి= దండెత్తి; పోయి; అందున్= ఆ స్వర్గంలో; సమరవిముఖులు+ఐన= కయ్యానికి మొగం చాటుచేసి కొన్నవారైన; బర్హిస్+ముఖులన్= దేవతలను; కనుఁగొని= చూచి; వనజ+ఆసన= బ్రహ్మ; వరప్రదానంబున్= వరాన్నిపొందటం; చింతించి= కోరి; హితులు+చెలంగన్= తనమేలుకోరువారు పైకొనునట్లును; అహితులు= శత్రువులు; కలంగన్= కలతచెందునట్లును; మహిత= కొనియాడదగిన; వైజయంతికాదామంబు= విష్ణుమాలిక; అభిరామంబు+ఐ= ఇంపుగొల్పునదై; వెలుంగన్= ప్రకాశింపగా; చరణంబుల= కాళ్ళయందలి; మణినూపురంబులు= రత్నాలు పొదిగిన గజ్జెలు; మొరయన్= నాదం చేస్తూ ఉండగా; నిజదేహద్యుతి= తనశరీరకాంతి; దిక్కులన్= అన్ని వైపుల; పిక్కటిల్లన్= వ్యాపించగా; చనుదెంచువానిన్= ఎదురుగా వస్తున్న వాణ్ణి; కని= చూచి; దేవతాగణంబులు= వేల్పుల గుంపులు; భీతచిత్తులు+అయి= భయంతో కూడిన మనస్సులు గలవారై; గరుడునిన్= గరుత్మంతుని (గద్దని); కని= చూచి; పఱచు= పరిగిడునట్టి; ఉరగంబులున్+పోలెన్= పాములవలె; నిజనివాసంబులు= తమయిండ్లను; అర్కనివాసంబులున్= జిల్లేడుచెట్లకు నిలయంగా; కాంచన+ఆవాసంబులుగాన్= ఉమ్మెత్తచెట్లకు నివాసాలుగా; ఒనర్చి= చేసి; ఎక్కడికిన్+ఏన్= ఎక్కడికో; చనినన్= వెళ్ళగా.

**తా :** కుమారులకు పేర్లుపెట్టి కశ్యపుడు వెళ్ళిన తర్వాత, హిరణ్యకశిపుడు బ్రహ్మవల్లపొందిన వరగర్వంతో శత్రువుల భుజగర్వాన్ని అణచి దిక్పాలురందరిని జయించి, తనకెవ్వరు ఎదురులేకుండ చేసికొని మహాసంతోషంతో మెలిగాడు. అతని తమ్ముడు హిరణ్యాక్షుడు. వాడు మదించిన ఏనుగుతొండంతో దీటైన గదను చేత దాల్చి తన్నెరించగలపగవారు లేనందువల్ల సగర్వంగా భూలోక సంచారం చేసేవాడు. తర్వాత స్వర్గానికి పోయి అక్కడ కూడ తనతో యుద్ధం చేయడానికి సాహసించని దేవతలను చులకనచేసి, బ్రహ్మవలన వరంపొంది హితులతో కలిసి, శత్రువులను కలతపరిచేవాడు. మెడలో విష్ణుమాలిక ధరించి, కాళ్ళగజ్జెలు గల్లుగల్లు మంటుంటే, తనదేహకాంతితో దిక్కులన్నింటిని వెల్గిస్తూ ఉండేవాడు. వాని దాటికాగలేక దేవతలు తమ ఇండ్లను వదలి ఎక్కడికో పారిపోయారు. దేవతలు వదిలిపెట్టిన ఇండ్లు జిల్లేడు, ఉమ్మెత్త చెట్లకు నెలవులుగా మారిపోయాయి.

**ఉ. శౌర్యము వోవఁదట్టి, నిజసాధనముల్ దిగనాడి, విక్రమౌ**
**దార్యపరాక్రమక్రమము దప్పఁగ భీతిలి పాఱి రక్కటా,**
**కార్యముఁదప్పి నాకు లని గైకొని యార్చి సుమేరుపర్వత**
**స్థైర్యుఁడు వార్ధిఁజొచ్చె నతిదర్పితభూరిభుజావిజృంభియై. 613**

**ప్రతి :** అక్కటా= ఆహా!; నాకులు= దేవతలు; శౌర్యము+పోవన్= పరాక్రమం ఉడిగిపోగా; తట్టి= చూపట్టి; నిజసాధనముల్= తమ సాధనములను; దిగన్+ఆడి= వదలిపెట్టి; విక్రమ= సాహసం; ఔదార్య= తెంపు; పరాక్రమ= ఎదిరింపగల దక్షత మొదలైనవాటి; క్రమమున్= వరుస; తప్పఁగన్= వశముతప్పగా; కార్యమున్+తప్పి= చేతలుడిగి; భీతిలి= భయపడి; పాఱిరి= పరుగెత్తిపోయారు; అని, కైకొని= పైకొని; ఆర్చి= పెడబొబ్బపెట్టి; సుమేరుపర్వతస్థైర్యుఁడు= మేరుపర్వతంవంటి స్థిరత్వంగల ఆ హిరణ్యాక్షుడు; అతిదర్పిత= మిక్కిలి గర్వించిన; భూరి= గొప్ప; భుజా= రెట్టలచే; విజృంభి+ఐ= పోటెత్తిన వాడై; వార్ధిన్= సముద్రాన్ని; చొచ్చెన్= ప్రవేశించాడు.

**తా :** "అయ్యో! ఈ దేవతలు పరాక్రమహీనులై, తమ ఉపకరణాలను వదలిపెట్టి, విక్రమింపలేక, ఏంచేయాలో తోచక భయగ్రస్తులై పారిపోయారే!" అనుకొని ఆ మేరుపర్వతమంతధైర్యశాలి హిరణ్యాక్షుడు భుజదర్పంతో విర్రవీగి సముద్రంలో దూకాడు–

**వ. ఇట్లు సొచ్చిన. 614**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా, చొచ్చినన్= సంద్రంలో దూకగా, (హిరణ్యాక్షుడు).

**తా :** దేవతల దైన్యస్థితిని తలపోస్తూ హిరణ్యాక్షుడు సముద్రంలో దూకగా.

**క. వరుణుని బలములు దనుజే, శ్వరుతేజముఁ దేఱిచూడఁజాలక శౌర్య**
**స్ఫురణము సెడి యెందేనియుఁ, బఱచెం దజ్జలధిమధ్యభాగమునందున్. 615**

**ప్రతి :** వరుణుని= వరుణుని; బలములు= సైనికులైన జలచరాలు; దనుజ+ఈశ్వరు= రాక్షసనాయకుని; తేజమున్= వికాసాన్ని; తేఱిచూడన్+చాలక= నిగాగా చూడలేక; శౌర్యస్ఫురణము= పరాక్రమస్ఫూర్తి; చెడి= దిగజారి; తద్+జలధి= ఆ సముద్రం; మధ్యభాగమునందున్= నట్టనడుమ; ఎందు+ఏనియున్= ఎక్కడో; పఱచెన్= పరుగెత్తాయి.

**తా :** వరుణదేవుని బలాలైన జలచరాలన్నీ హిరణ్యాక్షుని ఉరవడికి తట్టుకోలేక సాహసాన్ని కోల్పోయి, ఆ సముద్ర మధ్యభాగాన ఎక్కడో దాక్కున్నాయి.

**క. అమరారి విపులనిశ్వా, సములం బ్రభవించినట్టి జలనిధి కల్లో**
**లములను విపులగదా దం, డమునంబోనడఁచె నతిదృఢంబగు శక్తిన్. 616**

**ప్రతి :** అమర+అరి= దేవతల శత్రువైన హిరణ్యాక్షుడు; విపుల= విస్తారమైన; నిస్+శ్వాసములన్= నిట్టూర్పులనుండి; ప్రభవించిన+అట్టి= పుట్టినటువంటి; జలనిధి= సముద్రపు; కల్లోలములను= అలలను; విపులగదా దండమునన్= పెద్దదైన గదచేత; అతిదృఢంబు+అగుశక్తిన్= మిక్కిలి దట్టమైన శక్తితో; పోన్+అడఁచెన్= కనబడకుండ చేశాడు.

**తా :** దేవవైరియగు హిరణ్యాక్షుడు జలచరాల నిట్టూర్పులవల్ల సంచలించిన అలలను తన గదతో దట్టించి రూపుమాపాడు.

**చ. మఱియును న మ్మహాజలధి మధ్యమునన్ సురవైరి పెక్కు వ**
**త్సరములు గ్రీడ సల్పి రిపుసైన్యవిదారణశౌర్యఖేలనా**
**పరతఁజరించి య వ్వరుణపాలితమైన లసద్విభావరీ**
**పురమున కేఁగి యందుఁబరిపూర్ణత నున్న పయోధినాథునిన్. 617**

**ప్రతి :** మఱియును= ఇంకా; సురవైరి= అమరులశత్రువైన హిరణ్యాక్షుడు; ఆ+మహాజలధి= ఆ గొప్ప సముద్రం; మధ్యమునన్= నడుమభాగాన; పెక్కువత్సరములు= పెక్కేండ్లు; క్రీడ సల్పి= విహరించి; రిపుసైన్య= శత్రుసేనని; విదారణ= చెండాడుట అనే; శౌర్యఖేలనా= పరాక్రమక్రీడయందలి; పరతన్= ఆసక్తితో; చరించి= కలయదిరిగి; ఆ+వరుణ= ఆ వరుణునిచే; పాలితము+అయిన= పరిపాలింపబడినట్టిదైన; లసత్= ఒప్పారుచున్న; విభావరీపురమునకున్= విభావరి అనుపేరుగల నగరానికి; ఏఁగి= పోయి; అందున్= ఆ నగరంలో; పరిపూర్ణతన్+ఉన్న= నెమ్మదిగా నున్నట్టి; పయస్+అధినాథునిన్= సింధునాథుడైనవానిని...

**తా :** అంతేగాక ఆ హిరణ్యాక్షుడు పెక్కేండ్లు సంద్రం నడుమనే యథేచ్ఛగా సంచరించాడు. శత్రువుని మట్టుపెట్టే క్రీడతో స్వైరవిహారం చేశాడు. తర్వాత జలధినాయకుడైన వరుణుని విభావరినగరం వెళ్ళి అక్కడ హాయిగా కాలం గడుపుతున్న వరుణుని చూశాడు.

**వ. మఱియును. 618**

**ప్రతి :** మఱియును= ఇంకా

**తా :** ఆ తర్వాత

**సీ. యాదోగణాధీశుఁడగుచుఁబాతాళభువనపరిపాలుఁడై తనరుచున్న**
**వరుణునిఁగనుఁగొని పరిహసితోక్తుల నిట్లను, విశ్వమం దెన్నఁగలుగు**
**సకలలోకైకపాలకులలో నతిబలాధికుఁడని జగము నుతింపఁదగిన**
**శూరుండ విపుడు నీ పౌరుష మొప్పంగఁ గదనరంగమున న న్నెదిరి చూడు,**

**తే. నీ భుజావిక్రమంబును బ్రాభవంబు, నడఁతు నని పల్కుటయు విని యబ్ధివిభుఁడు**
**పగతు జయమును వృద్ధియు బలము నాత్మ, బలముఁదలపోసి దనుజుతో బవరమునకు. 619**

ప్రతి : యాదస్+గణ= జలచరాలకు; అధి+ఈశుఁడు+అగుచున్= నాయకుడై; పాతాళభువనపరిపాలుఁడు+ఐ= పాతాళలోకాన్ని ఏలేవాడై; తనరుచున్+ఉన్న= ఒప్పారుచున్నట్టి; వరుణునిన్= వరుణదేవుని; కనుఁగొని= చూచి; (హిరణ్యాక్షుడు); పరిహసిత+ఉక్తులన్= గేలిచేయుమాటలతో; ఇట్లు+అనున్= ఈ రీతిగా అన్నాడు; విశ్వమందున్= ప్రపంచంలో; ఎన్నన్+కలుగు= గుర్తింపదగిన; సకలలోక= ఎల్లలోకములందు; ఏక= ముఖ్యులైన; పాలకులలోన్= ప్రభువులందు (దిక్పాలురందు); అతిబల+అధికుఁడు+అని= పరాక్రమంగల వారిలో మేటివని; జగము= ప్రపంచం; నుతింపన్+తగిన= మెచ్చుకోదగిన; శూరుండవు= వీరుడవు; ఇపుడు= ఇప్పుడే; నీపౌరుషము= నీమగటిమి; ఒప్పంగన్= ప్రకాశమగునట్లు; నన్నున్= నన్ను; కదనరంగమునన్= యుద్ధరంగమందు; ఎదిరిచూడు= పోటొడ్డి చూడుము; నీ= నీదైన; భుజావిక్రమంబునున్= రెట్టలవాడిమిని; ప్రాభవంబున్= గొప్పదనాన్ని; అడఁతున్= అణచివేస్తాను; అని; పల్కుటయును= చెప్పగా; అబ్ధివిభుఁడు= సముద్రాధిపతియైన వరుణుడు; విని= ఆలకించి; పగతుజయమును= శత్రువైన హిరణ్యాక్షుని గెలుపును; వృద్ధియున్= అతిశయాన్ని; బలమున్= పరాక్రమాన్ని; ఆత్మబలమున్= తనపరాక్రమాన్ని; తలపోసి= పోల్చుకొని; దనుజుతోన్= రక్కసునితో; బవరమునకున్= కయ్యానికి...

**తా :** సాగరాధిపతియు, పాతాళలోకపాలకుడునైన వరుణుని చూచి హిరణ్యాక్షుడు “ఓయీ! ఈ లోకంలో దిక్పతులందరికంటె నీవే మొనగాడవని, లోకం మెచ్చుకోదగిన పోటుమగాడవని అంటారు. అంతగొప్ప వీరుడవైతే ఇపుడు నాతో తలపడు. నీ భుజబలాన్ని, నీ ప్రతాపాన్ని ఇప్పుడే అణచివేస్తా” అని పరిహసించాడు. అప్పుడు వరుణుడు రక్కసుని గెలుపు, బలం, పరాక్రమాలతో, తన బలాన్ని పోల్చుకొని వానితో యుద్ధం చేయడానికి పూనక.

**క. సమయము గాదని తన చి, త్తమునంగల రోషవహ్నిఁదాలిమియను తో**
**యములందగ నార్చుచు నుప, శమితోక్తులఁబలికె దనుజసత్తముతోడన్. 620**

ప్రతి : సమయము+కాదు= రక్కసునితో పెనుగుటకు తగిన తరిగాదు; అని; తన చిత్తమునన్= తన మనస్సునందు; కల రోషవహ్నిన్= కల్గిన కోపాగ్నిని; తాలిమి= ఓర్పు; అనుతోయములన్= అనేనీటిచేత; తగన్= బాగుగా; ఆర్పుచున్= అణచివేస్తూ; ఉపశమిత+ఉక్తులన్= శాంతించిన మాటలతో; దనుజసత్తముతోడన్= రాక్షసుని ఉద్దేశించి; పలికెన్= అన్నాడు–

**తా :** రక్కసునితో పోరుసల్పుటకిది తగిన సమయం కాదని తలంచి వరుణుడు ఓర్పు అనే నీటితో తనలో రగులుతున్న కోపాగ్నిని ఆర్పి, మెత్తగా ఆ హిరణ్యాక్షుని ఉద్దేశించి ఇట్లన్నాడు.

**చ. మనమున శాంతిఁబూని, నియమంబున సంగర ముజ్జగించి యే**
**ననయము నున్నవాఁడ, నిపు డాహవకేళిఁ జరింపరాదు, నీ**
**ఘనభుజవిక్రమస్ఫురితగాఢవిజృంభణమున్ జయింపఁజా**
**లిన ప్రతివీరు లెవ్వరును లేరు, ముకుందుఁడు దక్క నెక్కడన్. 621**

ప్రతి : ఏన్= నేను, మనమునన్= మనస్సునందు; శాంతిన్+పూని= నెమ్మదిగల్గి; అనయమున్= ఎల్లప్పుడును; నియమంబునన్= ఒక కట్టుబాటుతో; సంగరము= కయ్యం; ఉజ్జగించి= వదలి; ఉన్నవాఁడన్= ఉన్నాను; ఇపుడు; ఆహవకేళిన్=

యుద్ధక్రీడయందు; చరింపన్+రాదు= తిరుగ కూడదు, (కయ్యమనే ఆట ఆడరాదనిభావం); ఎక్కడన్= ఎచ్చటనైన; ముకుందుఁడు= విష్ణువు; తక్కన్= కాక; నీ= నీ; ఘన= గొప్పవైన; భుజవిక్రమ= భుజములపరాక్రమంచేత; స్ఫురిత= వ్యక్తమైన; గాఢ= దృఢమైన; విజృంభణమున్= మిడిసిపాటును; జయింపన్= జయించుటకు; చాలిన ప్రతివీరులు= తగిన విరోధులు; ఎవ్వరును లేరు= ఒక్కడైనను లేడు–

**తా :** ప్రసుత్తం నేను మనశ్శాంతి గల్గి ఉన్నాను. యుద్ధం చేయరాదని నియమం పెట్టుకొన్నాను. కాబట్టి యుద్ధక్రీడకు నేను ఉత్సహించను. ఇప్పుడు నీ భుజబలాన్ని ఎదుర్కొని నిలువగల్గినవాడు 'ఒక్క విష్ణుమూర్తి తప్ప తక్కిన వారెవ్వరు ఎక్కడ కూడలేరు' అని వరుణుడు హిరణ్యాక్షుని ఉద్దేశించి అన్నాడు.

**చ. గొనకొని య మ్మహాత్ముఁడు వికుంఠపురంబున నున్నవాఁడు దా**
**నని మొనఁబెక్కుమాఱు లభియాతుల నోలి జయించి శక్తి పెం**
**పున సడిసన్న వీరుఁడని భూజనకోటి నుతించు, నందు వే**
**చను, మతఁడిచ్చు నీకు నని, సర్వముఁదీఱెడు నంతమీఁదటన్. 622**

**ప్రతి :** ఆ+మహా+ఆత్ముఁడు= మహానుభావుడైన ఆ మురారి; వికుంఠపురంబునన్= వైకుంఠమందు; ఉన్నవాఁడు= ఉన్నాడు; తాన్= ఆ స్వామి; గొనకొని= ప్రయత్నించి; అనిమొనన్= పోలికలనియందు; పెక్కుమాఱులు= చాలపర్యాయాలు; ఓలిన్= వరుసగా; అభియాతులన్= పగతురను; జయించి= గెలిచి; శక్తిపెంపునన్= పరాక్రమాతిశయంతో; సడి+చన్నవీరుఁడు+అని= నిందలేని పరాక్రమశాలియని; భూజనకోటి= ప్రపంచంలోని జనసమూహం; నుతించున్= కొనియాడుతున్నది; అందున్= ఆ వైకుంఠానికి; వే= తొందరగా; చనుము= వెళ్ళుము; అతఁడు= ఆ విష్ణువు; నీకున్= నీతో; అని+ఇచ్చును= యుద్ధంలో తలపడగలడు; అంతమీఁదటన్= ఆ తర్వాత; సర్వమున్= అంతయు; తీఱెడున్= ముగియగలదు.

**తా :** ఆ మహావిష్ణువు వైకుంఠంలోఁఉన్నాడు. ఆయన సాహసంతో యుద్ధం చేసి ఎందరో శత్రువుల్ని మట్టుపెట్టిన వీరుడని, అనిందితచరిత్రుడని జనం వేనోళ్ళ స్తుతిస్తోంది. నీతో పోరుసల్పగలడాయన. అంతటితో నీ కథ ముగుస్తుంది.

**ఉ. నిందకు నోర్చి యాజిమొన నిల్వఁగ నోపక వీఁగి పాఱు నీ**
**పందల వెంటఁబడ్డ మగపంతమె? సర్వశరణ్యుఁడైన గో**
**విందుఁడు దీర్చు నీ పని వివేకవిహీన! చనంగ నోపుదే**
**నందుల కేఁగు, మాతఁడమరారులఁబోర జయించు నిచ్చలున్. 623**

**ప్రతి :** వివేకవిహీన= తెలివిలేనివాడా! (వివేకం నశించినవాడా!); నిందకున్= సడికి; ఓర్చి= సహించి; ఆజిమొనన్= యుద్ధరంగమునందు; నిల్వఁగన్= నిలబడగల్గుటకు; ఓపక= సహించలేక; వీఁగిపాఱు= నివ్వెఱపోయి పరుగెత్తునట్టి; ఈ పందలవెంటన్= ఈ పిరికివారి వెంబడి; పడ్డన్= పడినచో; మగపంతమె?= పౌరుషమా?; సర్వశరణ్యుఁడు+ఐన= అందరికి రక్షకుడైన; గోవిందుఁడు= శ్రీమన్నారాయణుడు; నీ పనిన్= నీ కార్యాన్ని (యుద్ధోన్మాదాన్ని); తీర్చున్= చక్కబెట్టగలడు; చనంగన్+ఓపుదు+ఏనిన్= వెళ్ళాలని కోరికవుంటే; అందులకున్= అక్కడికి (హరివాసానికి); ఏఁగుము= వెళ్ళుము; ఆతఁడు= ఆ శ్రీహరి; నిచ్చలున్= నిత్యమూ; అమర+అరులన్= దేవతలవిరోధులైన రక్కసులను; పోరన్= కయ్యమందు; జయించున్= గెలుస్తాడు.

**తా :** ఓరి బుద్ధిహీనుడా! యుద్ధరంగంలో పలాయనం చేయటం అపకీర్తి గదా అని అనుకోకుండా 'కాలికి బుద్ధి' చెప్పే పిరికిపందల నెదుర్కోవటం పౌరుషమవుతుందా? అదో ఆ వైకుంఠవాసుడు నీ పని చక్కపెట్టగలడు. ఆయనతో తలపడాలని ఉంటే వైకుంఠానికి పో. ఆ స్వామి నిరంతరం రక్కసులతో పెనగి విజేతగా ఉన్నాడు.

**వ. అదియునుంగాక. 624**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేగాదు...

**తా :** అంతేగాక, ఇంకా.

**క. పురుషాకృతిఁబ్రతియుగమునఁ, బురుషోత్తముఁడవతరించి భూరిభుజావి**
**స్ఫురణన్ దుష్టనిశాటుల, హరియించుచు నుండు మునిగణార్చితపదుఁడై. 625**

**ప్రతి :** పురుష+ఉత్తముఁడు= పురుషశ్రేష్ఠుడైన ఆహరి; మునిగణ= మునుల సమూహంచేత; అర్చితపదుఁడు+ఐ= పూజింపబడిన పాదముల గలవాడై; ప్రతియుగమునన్= కృతత్రేతాద్వాపర కలియుగాలలో; పురుష+ఆకృతిన్= మానవాకారంతో; అవతరించి= పుట్టి; భూరి= గొప్ప; భుజావిస్ఫురణన్= భుజముల ఆటోపంతో; దుష్ట= దుర్మార్గులైన; నిశాటులన్= రాత్రి చరించు రక్కసులను; హరియించుచున్+ఉండున్= అంతమొందిస్తాడు.

**తా :** మహర్షులచే కొనియాడబడుతున్న ఆ శ్రీహరి నాల్గు యుగాలలో అవసరమైనప్పుడు మానవాకృతి ధరించి, భుజబలంతో దుష్టరాక్షసుల్ని మట్టుపెడుతుంటాడు.

**విశే :** యుగములు : ఇవి నాల్గు. కృతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం, కలియుగం.

1. కృతయుగం : ధర్మం నాల్గుపాదాలతో నడుస్తుంది
   కాలపరిమాణం : 17,28,000 మానవసంవత్సరాలు

2. త్రేతాయుగం : ధర్మం మూడుపాదాలతో ఉంటుంది
   కాలపరిమాణం : 12,96,000 మానవసంవత్సరాలు

3. ద్వాపరయుగం : ధర్మం రెండుపాదాలతో ఉంటుంది
   కాలపరిమాణం : 8,64,000 మానవసంవత్సరాలు

4. కలియుగం : ధర్మం ఒకేపాదంతో ఉంటుంది
   కాలపరిమాణం : 4,32,000 మానవసంవత్సరాలు

**ఉ. కావున నా విభుందొడరి కయ్యము దయ్య మెఱుంగఁజేసి ర**
**క్షోవర! నీ భుజాబలము సొంపతి మేదినిఁగూలి సారమే**
**యావళి కాశ్రయం బగుదు, వచ్చుటి కిప్పుడ యేగుదేని నీ**
**చేవయు లావు నేర్పడును, జెప్పఁగనేటికి మీఁది కార్యముల్. 626**

**ప్రతి :** రక్షస్+వర= ఓ రక్కసుడా!; కావునన్= ఆ స్వామి దుష్టరాక్షసులను మట్టుపెట్టును కాబట్టి; ఆ విభున్= ఆ ప్రభువును; తొడరి= ఎదిరించి; కయ్యము= యుద్ధం; దయ్యము+ఎఱుంగన్+చేసి= దైవవశం చేసి; నీ భుజాబలము= నీ బాహు పరాక్రమం; సొంపు+అఱి= మేల్మిచెడి; మేదినిన్+కూలి= నేలరాలి; సారమేయ+ఆవళికిన్= కుక్కలదండుకు; ఆశ్రయంబు= వశం; అగుదువు= అవుతావు; అచ్చటికిన్= ఆ వైకుంఠానికి; ఇప్పుడు+అ= ఇప్పుడే; ఏగుదు+ఏనిన్= పోయినచో; నీ చేవయున్= నీ గట్టిదనము; లావునున్= బలం; ఏర్పడును= బయటపడతాయి; మీఁది కార్యముల్= తర్వాతి పనులు; లేదా నీ పాట్లు; చెప్పఁగన్+ఏటికిన్= వాకొన నేల?

**తా :** ఓరీ రాక్షసా! నీవు ఆ నారాయణుణ్ణి ఎదుర్కొన్నావో కయ్యం సంగతి దేవుడెరుగును. నీ భుజబలం కాస్త సన్నగిల్లి నేలరాలిపోతావు. తర్వాత కుక్కల పాలవుతావు. ఇప్పుడు వెంటనే నీవు వైకుంఠానికి వెళ్ళితే, నీ సత్తా ఏమిటో తేలిపోతుంది. తర్వాత ఏమి జరుగుతుందో చెప్పటం దేనికి? (నీ చావు తప్పదని భావం).

**చ. అని వరుణుండు వల్కిన దురాగ్రహ మెత్తి హిరణ్యలోచనుం**
**డనయము మానసంబున భయం బొకయింతయు లేక, సంగరా**
**వని నెదిరింతు నేఁ డమరవర్ధను దుష్టవిమర్దనున్ జనా**
**ర్దను ననుచున్ వికుంఠనగరస్ఫుటసంచితమార్గవర్తియై. 627**

**ప్రతి :** అని= నీకు ముప్పు తప్పదని; వరుణుండు; పల్కినన్= చెప్పగా; హిరణ్యలోచనుండు= బంగారుకన్నులవాడైన హిరణ్యాక్షుడు; దుర్+ఆగ్రహము= చెడ్డ కోపం; ఎత్తి= పూని; అనయము= వెంటనే; మానసంబునన్= ఎదలో; భయంబు= వెరపు; ఒక+ఇంతయున్+లేక= కొంచెమైనా లేకుండ; నేఁడు= ఈ దినమే; అమర వర్ధనున్= దేవతల్ని రక్షించువాడును; దుష్టవిమర్దనున్= దుష్టుల్ని మట్టుపెట్టేవాడును; అయిన; జనార్దనున్= విష్ణువుని; సంగర+అవనిన్= యుద్ధరంగమందు; ఎదిరింతున్= అడ్డుకొంటాను; అనుచున్= అంటూ; వికుంఠనగర= వైకుంఠపు; స్ఫుట= స్పష్టమైన; సంచిత= ఏర్పాటు చేయబడిన; మార్గ= దారియందు; వర్తి+ఐ= ఉన్నవాడై.

**తా :** విష్ణువునెదుర్కొన పొమ్మని వరణుడు చెప్పగానే హిరణ్యాక్షుడు మహాకోపంతో మనస్సులో ఏ మాత్రం జంకులేకుండా ఆ దేవరక్షకుడు, దుర్మార్గుల నాశనం చేసేవాడైన విష్ణువుని తప్పక యుద్ధంలో ఎదిరిస్తానని పల్కి, వైకుంఠ మార్గం పట్టాడు.

**క. చను నవసరమున నారద, మునివరుఁడెదు రేగుదెంచి ముదము దలిర్పన్**
**దనుజేంద్ర, యెందుఁబోయెద, వని యడిగిన నారదునకు నతఁడిట్లనియెన్. 628**

**ప్రతి :** చను+అవసరమునన్= ఆ రాక్షసుడు వైకుంఠ మార్గంలో పోయేటప్పుడు; నారదమునివరుఁడు= శ్రేష్ఠుడైన మునియగు నారదుడు; ఎదురు+ఏగుదెంచి= ఎదురుగా వచ్చి; ముదము+తలిర్పన్= సంతోషం కలుగగా; దనుజ+ఇంద్ర= ఓ రాక్షసశ్రేష్ఠా!; ఎందున్+పోయెదవు+అని= ఎక్కడికి పోతున్నావు అని; అడిగినన్= అడుగగా; అతఁడు= ఆ హిరణ్యాక్షుడు; నారదునకున్= నారదునితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు

**తా :** వైకుంఠ మార్గంలో పోతున్న హిరణ్యాక్షునికి నారదుడు కన్పించి “ఓ రాక్షసా! ఎక్కడికి పోతున్నావు?” అని అడిగాడు. అప్పుడా రాక్షసుడు ఆయనతో ఇట్లన్నాడు.

చ. సరసిరుహోదరుం దొడరి సంగర మే నొనరించి యిందిరా
వరుని ననంతుఁ ద్రుంచి సురవైరికులంబుల కెల్ల మోద వి
స్ఫురణ ఘటింపఁజేయుటకుఁ బూని వికుంఠపురానువర్తినై
యరిగెద నన్న న మ్మునికులాగ్రణి దానవనేత కిట్లనున్. **629**

**ప్రతి :** ఏన్= నేను; సరసిరుహ+ఉదరున్= తామరబొడ్డునందుగలవాడును; అనంతున్= తుది లేనివాడును; అయిన; ఇందిరావరునిన్= లక్ష్మీ దేవిభర్తయైన విష్ణువును; తొడరి= ఎదిరించి; సంగరము= కయ్యం; ఒనరించి= చేసి; త్రుంచి= కడతేర్చి; సురవైరి కులంబునకున్+ఎల్లన్= దేవతలకు శత్రువులైన రాక్షసులందరికి; మోదవిస్ఫురణ= అతిశయమైన సంతోషాన్ని; ఘటింపన్+చేయుటకున్= చేకూర్చటానికి; పూని= దండెత్తి; వికుంఠపుర= వైకుంఠనగరాన్ని; అనువర్తిని= అనుసరించినవాడను అయి; అరిగెదన్= పోతున్నాను; అన్నన్= హిరణ్యాక్షుడనగా; ఆ+మునికుల+అగ్రణి= మునిశ్రేష్ఠుడైన ఆ నారదుడు; దానవనేతకున్= రాక్షసనాయకునికి; ఇట్లు+అనున్= క్రిందివిధంగా అన్నాడు…

**తా :** "నేను బొడ్డుదామరవాడును, అంతం లేనివాడును అగు లక్ష్మీధవుణ్ణి, యుద్ధరంగంలో ఎదుర్కొని అతణ్ణి చంపి నా రాక్షసకులానికి సంతోషం కల్గించాలని వైకుంఠనగరాభిముఖంగా సాగిపోతున్నా"నని హిరణ్యాక్షుడు నారదునితో అన్నాడు. ఆ నారదుడు వానితో ఇలా అన్నాడు–

**విశే : అనంతుఁడు :** శ్రీహరి అనంతుడు. అనగా అంతం లేనివాడని అర్థం.

చ. గురుభుజుఁ డమ్మహాత్ముఁడు వికుంఠపురంబున నేఁడు లేఁడు, భూ
భరము వహింప నాదికిటిభావముఁ దాల్చి రసాతలంబునం
దిరవుగ నున్నవాఁ, డచటి కేఁగఁగ నోపుదువేని నేగు మం
దరయఁగఁ గల్గు నీకు నసురాంతకుతోడి రణం బవశ్యమున్. **630**

**ప్రతి :** గురుభుజుఁడు= గొప్పబాహువులు గలవాడైన; ఆ+మహా+ఆత్ముఁడు= ఆ మహానుభావుడైనవిష్ణువు; వికుంఠపురంబునన్= వైకుంఠ నగరంలో; నేఁడు= ఇప్పుడు; లేడు; భూభరము= భూదేవి భారాన్ని; వహింపన్= ధరించడానికి; ఆదికిటి భావమున్= ఆది వరాహరూపాన్ని; తాల్చి= పూని; రసాతలంబునన్= పాతాళమందు; తిరవు+కన్= స్థిరంగా; ఉన్నవాఁడు= ఉన్నాడు; అచటికిన్= ఆ పాతాళానికి; ఏగఁగన్= వెళ్ళటానికి; ఓపుదువు+ఏనిన్= చాలినవాడవైతే; ఏగుము= వెళ్ళుము; అందున్= అక్కడ; అవశ్యమున్= తప్పక; అసుర+అంతకుతోడి= రాక్షసుల్ని మట్టుపెట్టే శ్రీహరితో; రణంబు= కయ్యము; అరయఁగన్= ఆలోచించితివేని; నీకున్+కల్గున్= నీకవుతుంది,

**తా :** "భుజపరాక్రమం కలవాడైన ఆ నారాయణుడు ఇప్పుడు వైకుంఠంలో లేడు. ఆయన భూమిని ఉద్ధరించాలని ఆదివరాహావతార మెత్తి పాతాళలోకంలో మోహరించి ఉన్నాడు. ఆయన్ని ఎదిరించే సాహసముంటే అక్కడికే పో. అక్కడే యుద్ధం చేయి" అని నారదుడు చెప్పాడు.

### ❖ హిరణ్యాక్షుఁడు యజ్ఞవరాహంబగు హరి నెదిరించి పోరుట ❖

చ. అనవుడు దానవేంద్రుఁడు హుతాశనుకైవడి మండి పద్మలో
చను నెదిరించు వేడుకలు సందడిఁ గొల్ప ననల్పతేజుఁడై

**ఘనగదఁగేలఁబూని త్రిజగద్భయదాకృతిఁదాల్చి వ్రేల్మిడిం**
**జనియె రసాతలంబునకుఁజండభుజాబలదర్ప మేర్పడన్.** **631**

**ప్రతి :** అనవుడున్= అని నారదుడు చెప్పగా; దానవ+ఇంద్రుఁడు= రాక్షసులలో గొప్పవాడైన హిరణ్యాక్షుడు; హుతాశునికైవడిన్= అగ్నివలె; మండి= రేగి; పద్మలోచనున్= తామరలవంటి కన్నులవాడైన విష్ణువుని; ఎదిరించువేడుకలు= ఎదుర్కోవాలనే వేడ్కలు; సందడిన్+కొల్పన్= అతిశయింపగా; అనల్పతేజుఁడు+ఐ= అతిశయమైన శక్తిగలవాడై; ఘనగదన్= పెద్దగదను; కేలన్+పూని= చేత తాల్చి; త్రిజగత్= ముల్లోకాలకు; భయద= భీతిని కల్గించే; ఆకృతిన్= ఆకారాన్ని; తాల్చి= ధరించి; చండ= తీక్ష్ణమైన; భుజాబలదర్పము= రెట్టల బిగువువల్ల కల్గిన పొగరు; ఏర్పడన్= కలుగగా; రసాతలంబునకున్= పాతాళలోకానికి; వ్రేల్మిడిన్= చిటికెపాటులో; చనియెన్= వెళ్ళాడు.

**తా :** నారదుడు పాతాళానికి పొమ్మని చెప్పగానే హిరణ్యాక్షుడు అగ్గిలాగ మండి పడ్డాడు. విష్ణువుతో తలపడి తీరాలని భావించి పెద్దగద నొకదాన్ని చేత తాల్చాడు. తన భుజబలాన్ని ప్రదర్శించాలని విర్రవీగుతూ భీకరరూపంతో పాతాళానికి వెళ్ళాడు.

**వ. చని జలమధ్యంబున.** **632**

**ప్రతి :** చని= పాతాళానికి వెళ్ళి; జలమధ్యంబునన్= నీటినడుమ...

**తా :** హిరణ్యాక్షుడు పాతాళం ప్రవేశించి నీటి మధ్య

**క. దివిజారి యెదురఁదగఁగనె, నవిరళదంష్ట్రాభిరాము నమరలలామున్**
**గువలయభరణోద్దామున్, సవనమయస్తబ్ధరోము జలదశ్యామున్.** **633**

**ప్రతి :** దివిజ+అరి= దేవవిరోధియైన హిరణ్యాక్షుడు; ఎదురన్= తనముందు; అవిరళ= విస్తారమైన; దంష్ట్రా= కోరలతో; అభిరామున్= చూడముచ్చటైన వాడును; అమరలలామున్= దేవతలలో శ్రేష్ఠుడైన వాడును; కువలయ= భూమిని; భరణ= భరించుటచే; ఉద్దామున్= ప్రచండమైనవాడును; జలదశ్యామున్= మేఘాన్నిపోలిన నల్లనివన్నెగలవాడును; అయిన; సవనమయ= యజ్ఞరూపధారియైన; స్తబ్ధరోమున్= వరాహరూపుణ్ణి; తగన్+కనెన్= తేరిపార చూచాడు.

**తా :** సురవైరియగు హిరణ్యాక్షుడు పాతాళంలో స్వామిని నిగాగా చూచాడు. ఆయన విస్తారమైన కోరలతో వెల్గుతున్నాడు. భూమిని ఉద్ధరించటానికి పూని ఉన్నాడు. మొయిలువన్నెతో నిక్కపొడుచుకున్న రోమాలతో యజ్ఞవరాహరూపాన్ని ధరించిన దేవవిభుణ్ణి చూశాడు.

**వ. అ య్యవసరంబున సూకరాకారుండైన హరియు.** **634**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; సూకర+ఆకారుండు+ఐన= వరాహావతారమెత్తినవాడైనట్టి; హరియున్= విష్ణువు కూడ...

**తా :** హిరణ్యాక్షుడలా ఎత్తి వచ్చిన సందర్భంలో 'సూకరాకృతిధరించిన' శ్రీహరి కూడా

**క. వనజరుచిసన్నిభములగు, తన లోచనయుగళదీప్తిఁదనరఁదదాలో**
**కనముల దనుజాధీశుని, తనుకాంతి హరింపఁజేసెఁ దత్ క్షణమాత్రన్.** **635**

**ప్రతి :** (శ్రీహరి) వనజరుచి= కమలములకాంతితో; సన్నిభములు= సమానములు; అగు= అయినట్టి; తనలోచనయుగళదీప్తి= తన రెండుకన్నులకాంతి; తనరన్= ఒప్పారగా; తద్+క్షణమాత్రన్= ఒక్కక్షణకాలంలో; తద్+ఆలోకనములన్= ఆ కాంతిమంతమైన చూపులతో (శ్రీహరి); దనుజ+అధి+ఈశుని= రాక్షసనాయకుని; తనుకాంతిన్= దేహచ్ఛాయను; హరింపన్+ చేసెన్= అణచివేశాడు.

**తా :** మహావిష్ణువు తామరకాంతిని గుత్త బుచ్చుకొన్న తన చూపుల తీవ్రతచేత రక్కసుని శారీరకవిజృంభణాన్ని ఒక్కపెట్టున మటుమాయం చేశాడు.

**వ. మఱియు న య్యాదివరాహం బవార్యశౌర్యంబున మాఱులేని విహారంబునం జరియించునట్టి యెడ. 636**

**ప్రతి :** మఱియున్= ఇంకా; ఆ+ఆదివరాహంబు= ఆ యజ్ఞవరాహస్వామి; న+వార్య= అడ్డుకోవటానికి సాధ్యంకాని; శౌర్యంబునన్= పరాక్రమంతో; మాఱులేని= తిరుగులేనట్టి; విహారంబునన్= సంచారంతో; చరియించున్+అట్టి+ఎడన్= చక్కర్లు కొట్టేటప్పుడు –

**తా :** అప్పుడా యజ్ఞవరాహస్వామి అపారవిక్రమంతో విచ్చలవిడిగా చక్రభ్రమణం చేస్తున్నాడు. ఆ విహారం ఎదురులేనిది.

**సీ. తుదమొదళ్లకుఁ జిక్కి తునిసి పాఱఁగ మోరఁ గులశైలములఁజిమ్ముఁగొంత తడవు,**
**బ్రహ్మాండభాండంబు పగిలి చిల్లులు వోవఁ గొమ్ములఁదాటించుఁగొంత తడవు,**
**జలధు లేడును బంకసంకులంబై యింక ఖురముల మట్టాడుఁ గొంత తడవు,**
**ఉడురాజు సూర్యుండు నొక్క మూలకుఁ బోవఁ గుఱుచ వాలము ద్రిప్పుఁ గొంత తడవు,**

**తే. గునియుఁ గుప్పించు లంఘించుఁ గొప్పరించు, నెగయు ధరఁ ద్రవ్వు బొఱియఁగా నేపు రేఁగి**
**దానవేంద్రుని గుండెలు దల్లడిల్లఁ, బంది మెల్లన రణపరిస్పంది యగుచు. 637**

**ప్రతి :** పంది= ఆదివరాహం; మెల్లన= తిన్నగా; రణపరిస్పంది+అగుచున్= పోరుకు సిద్ధమగుచు; దానవ+ఇంద్రుని= రక్కసుని, గుండెలు= ఎదలు; తల్లడిల్లన్= అదరగా; కొంతతడవు= కొంతసేపు; తుదమొదళ్ళకున్+చిక్కి= చివరిభాగాలు; దిగువభాగాలతో చిక్కుకొని, (కుప్పకూలి అని భావం); తునిసి= తునాతునకలై; పాఱఁగన్= పరుగెత్తునట్లు; కులశైలములన్= కులపర్వతాలను; చిమ్మున్= ఎగమీటుతుంది; కొంతతడవు= మరికొంతసేపు; బ్రహ్మ+అండభాండంబు= బ్రహ్మాండాలనే పెద్ద బానలు; పగిలి= బ్రద్దలై; చిల్లులు+పోవన్= బొరకలుపడేటట్లు; కొమ్ములన్= మోరతో; తాటించున్= కొట్టుకుంది (ఆస్ఫోటనం); కొంతతడవు= మరికొంత సమయం; జలధులు+ఏడును= సప్తసముద్రాలు; పంకసంకులంబు+ఐ= బురదతో గజిబిజియై; ఇంకన్= వట్టిపోగా; ఖురములన్= గిట్టలతో; మట్టాడున్= గోకుతుంది; కొంతతడవు= ఒక్కమాటు; ఉడురాజు= తారలకధిపతియైన చంద్రుడు; సూర్యుండున్= సూర్యుడును; ఒక్కమూలకున్= ఒక్కదిశకు; పోవన్= పోవునట్లు; కుఱుచవాలమున్= పొట్టితోకను; త్రిప్పున్= కదలిస్తుంది; కునియున్= తూగిపడుతుంది; కుప్పించున్= ఊపిరిబిగబట్టిదూకుతుంది; లంఘించున్= ఊపుగా దాటుతుంది; కొప్పరించున్= విజృంభిస్తుంది; ఎగయున్= పైకొంటుంది; ధరన్= భూమిని; బొరియఁగాన్= చిల్లులుపడేట్లు; రేఁగి= అతిశయించి; త్రవ్వున్= తవ్వుతుంది.

**తా :** ఆ ఆదివరాహం రాక్షసుని గుండెలు గుభేలు మనేట్లు యుద్ధోత్సాహంతో కొంతసేపు ముట్టెతో అంచులు మూలాన్ని సోకేటట్లు కులపర్వతాల్ని చిమ్మింది. బ్రహ్మాండభాండం పగిలి చిల్లులు పడేట్లు కొమ్ములతో జీరాడింది. సప్తసాగరాలు బురదలాగ గజిబిజి అయ్యేట్టు తనగిట్టలతో ఇంకిపోయేట్లు గోకుతుంది. తన తోకను తిప్పుతూ చంద్రుణ్ణీ సూర్యుణ్ణీ ఒక మూలకు నెట్టివేస్తున్నది. గునగున నడుస్తుంది. ఊపిరి బిగబట్టి ఎగిసిపడుతుంది. ఎగిరి దాటుతుంది. విజృంభిస్తుంది. పైకొంటుంది. బొరకలుపడేట్లు నేలని బరుకుతుంది.

**వ. మఱియును, 638**

**ప్రతి :** మఱియును= తర్వాత,

**తా :** ఆ తర్వాత ఇంకా,

**క. కనుఁగవ నిప్పులు రాలఁగ, సునిశితదంష్ట్రాగ్రయుతవసుంధరుఁ డగుచుం**
**దన కెదురేతేఁగని య, వ్వనచర మే రీతి నిపుడు వనచర మయ్యేన్. 639**

**ప్రతి :** కనుఁగవన్= రెండుకళ్ళల్లో; నిప్పులు రాలఁగన్= మంట లెగయగా; సునిశిత= వాడియైన; దంష్ట్రా+అగ్రయుత= కోరలకొనపై కూడిన; వసుంధరుఁడు= భూమిగలవాడు; అగుచున్= అయి; తనకున్= అసురకు; ఎదురు+ఏతేన్= ఎదురుగా రాగా; కని= వరాహాన్ని చూచి; ఆ వనచరము= అడవిలో తిరిగే ఆ జంతువు; ఇపుడు= ఈ సమయంలో; ఏ రీతిన్= ఎట్లు; వనచరము+అయ్యేన్= జలచరమైంది? (ఆశ్చర్యాన్ని అభినయించే పల్కు)...

**తా :** ముట్టెపై భూమిని ధరించి కళ్ళల్లో నిప్పులు చెరుగుతూ ఆ యజ్ఞవరాహం రక్కసునికి ఎదురుపడింది. ఆ రక్కసుడు దాన్ని చూచి 'ఇది అడవిజంతువు గదా జలచర మెట్లైందో' అనుకొన్నాడు.

**క. అని యాశ్చర్యభయంబులు, దన మనమునఁదొంగలింప దనుజాధిపుఁ డి**
**ట్టనియెన్ భీకరసూకర, తనుఁబొంది చరించు దనుజదర్పాపహుతోన్. 640**

**ప్రతి :** అని= అట్లని; దనుజ+అధిపుఁడు= రాక్షసాధిపతి (హిరణ్యాక్షుడు); తనమనమునన్= తనమదిలో; ఆశ్చర్యభయంబులు= అచ్చెరువూ భీతీ; తొంగలింపన్= కలుగగా; భీకర= భయమునుగొల్పు; సూకరతనువు= వరాహరూపం; ఒంది= పొంది; చరించు= తిరుగుతున్న; దనుజ= రాక్షసుని; దర్ప+అపహుతోన్= పొగరణచునట్టి వానితో (వరాహ స్వామితో); ఇట్టు+అనియెన్= ఈ రీతిగా అన్నాడు.

**తా :** 'వనచరం జలచరమైందే' అని సంభ్రమాశ్చర్యాలు పొందిన హిరణ్యాక్షుడు, రాక్షసులపొగరు అణచగల ఆ యజ్ఞవరాహరూప మెత్తిన విష్ణువుతో ఇట్లన్నాడు.

**క. ఘనసూకర! మూఢాత్మక!, వనరుహసంభూతదత్తవరదానమునం**
**గనిన రసాతలగతభువి, యనయంబును నా యధీనమై వర్తించున్. 641**

**ప్రతి :** ఘనసూకర= ఓ పెద్దవరాహమా!; మూఢ+ఆత్మక= అజ్ఞానీ!; వనరుహ= నీటబుట్టిన తామరయందు; సంభూత= పుట్టినవాడైన బ్రహ్మచేత; దత్త= ఈయబడిన; వరదానమునన్= శ్రేష్ఠమైన వరదానంచేత; కనిన= పొందినట్టి; రసాతలగతభువి= పాతాళాన్ని చొచ్చిన యీ నేల; అనయంబున్= ఎల్లప్పుడు; నా+అధీనము+ఐ= నాకు చెందిందిగా; వర్తించున్= ఉంటుంది.

**తా :** ఓ తెలివిలేని వరాహమా! నేను బ్రహ్మవల్ల రసాతలగతమైన ఈ భూమిని వరదానంగా పొందాను. ఇది ఎప్పటికైనా నాదే. అని రాక్షసుడు విష్ణువుతో అన్నాడు.

**క. గొనకొని నీ వీ ధరణిం, గొని పోకుము, విడుము కాక కొని పోయెద వేఁ**
**గొనియెద నీ ప్రాణముఁ గై, కొను నా వచనములు చలముగొన నేమిటికిన్? 642**

**ప్రతి :** గొనకొని= ప్రయత్నించి; నీవు; ఈ ధరణిన్= భూమిని; కొనిపోకుము= తీసికొనిపోవద్దు; విడుము= దీన్ని వదలిపెట్టు; కాక= నా మాటకాదని; కొనిపోయెదవు+ఏన్= తీసుకొనివెళ్ళాలనుకుంటే; నీ ప్రాణమున్= నీ ఉసురును; కొనియెదన్= తీసుకొంటాను; నా వచనములు= నా మాటలు; కైకొను= గ్రహించుము; చలము+కొనన్+ ఏమిటికిన్= పట్టుదలపూనటం దేనికి? (మొండి చేయవద్దని అనటం).

**తా :** ఓయీ! నీవు భూమిని లేపుకొని పోవద్దు. ఇక్కడే వదలిపెట్టు. కాదు కూడదని పెకలించి తీసికొని పోవాలని ప్రయత్నిస్తే నీ ప్రాణం తీస్తాను. నా మాట విను. ఎందుకు నీ కంత పట్టుదల?

**క. మాయావి వగుచు నిప్పుడు, పాయక యీ పుడమిఁ జోరభావంబున నీ**
**వీ యెడఁ గొనిపోఁజూతునె, యాయతభుజబలముచేత నడఁపక యనుచున్. 643**

**ప్రతి :** ఇప్పుడు= ఇప్పుడే; మాయావి+అగుచున్= మోసగాడవై; పాయక= వదలక; ఈ పుడమిన్= ఈ భూమిని; చోరభావంబునన్= దొంగబుద్ధితో; ఈవు= నీవు; ఈ+ఎడన్= ఈ సందర్భంలో; కొనిపోన్= ఎత్తుకొనిపోవగా; చూతును+ఎ= చూస్తూఉంటానా?; ఆయతభుజబలముచేతన్= నిడుపాటి భుజబలంతో; అడఁపక= నిన్నణచకుండా; అనుచున్= అంటూ.

**తా :** ఏదో నీ మోసబుద్ధితో ఇప్పుడు ఈ భూమిని దొంగిలించుకొని పోవాలనుకున్నావేమో, దాన్ని చూస్తూ ఊరుకోను. నా భుజబలంతో నిన్ను అణచి మట్టుపెడతాను అన్నాడు అసురుడు.

**సీ. అవిరళయోగమాయాబలంబునఁజేసి యల్పపౌరుషమున నలరు నిన్ను**
**నర్థి సంస్థాపించి యస్మత్సుహృద్భృత్య కులుల కెల్లను మోద మొలయఁ జేయఁ**
**జెలువేది మద్గదాశీర్ణుఁడవగు నిన్నుఁ గనుఁగొని దేవతాగణము లెల్ల**
**నిర్మూలులై చాల నెఱి నశించెద రన్న విని యజ్ఞపోత్రియై వెలయుచున్న**

**తే. హరి సరోజాతభవముఖామరుల కెల్ల, వచ్చు దురవస్థ కాత్మలో వంత నొంది**
**నిశితదంష్ట్రాగ్రలసితయై నెగడు ధరణి, దేవితో నొప్పె నా దేవదేవుఁ డంత. 644**

**ప్రతి :** అవిరళ= అతిశయమైన; యోగమాయాబలంబునన్+చేసి= యోగమాయ ఊపుతో; అల్పపౌరుషమునన్= కొంచెం పొగరువల్ల; అలరునిన్నున్= ఒప్పారుతున్న నిన్ను (హరిని); అర్థిన్= కోరికతో; సంస్థాపించి= బాగా అణచి; అస్మత్= మాయొక్క; సుహృత్= స్నేహితుల; భృత్య= సేవకుల; కులులకు+ఎల్లను= రాక్షసకులాని కంతటికి; మోదము= సంతోషము; ఒలయన్+చేయన్= కల్గించగా; చెలువు+ఏది= శౌర్యముడిగి; మద్+గదా+శీర్ణుఁడవు= నా గదచే చీల్చబడినవాడవు; అగు నిన్నున్= అయిన నిన్ను; కనుఁగొని= చూచి; దేవతాగణములు+ఎల్లన్= గుంపులుగానయిన దేవతలందరూ; నిర్+

మూలులు+ఐ= ఆధారం కోల్పోయినవారై; చాలన్= మిక్కిలి; నెఱిన్= బాగా; నశించెదరు= చచ్చిపోతారు; అన్నన్= అని రక్కసుడనగా; విని= ఆలకించి; యజ్ఞపోత్రి+ఐ= యజ్ఞవరాహుడై; వెలయుచున్+ఉన్న= ప్రకాశిస్తున్న; హరి= విష్ణువు; సరస్+జాతభవ= పద్మమునుండి పుట్టినవాడైన బ్రహ్మ; ముఖ= మొదలైన; అమరులకున్+ఎల్లన్= దేవత లెల్లరికి; వచ్చు, దుర్+అవస్థకున్= ఎదురయ్యే చెడుకి; ఆత్మలోన్= ఎదలో; వంతన్+ఒంది= బాధపడి; ఆ దేవదేవుఁడు= ఆ స్వామి; అంతన్= తర్వాత; నిశిత= వాడియైన; దంష్ట్రా+అగ్ర= కోరకొనతో; లసిత+ఐ= విలసిల్లునదై; నెగడు= ఒప్పారుతున్న; ధరణిదేవితోన్= భూదేవితో; ఒప్పెన్= ప్రకాశించెను.

**తా :** ఓరీ! యోగమాయవల్ల దక్కిన మగతనం నీది. ఒక్కపెట్టున నీ బలాన్ని అణచివేసి, మా సంగడికాండ్రకు, సేవకులకు, మా కులానికంతటికి సంతోషం గొల్పుతాను. నీ బలం ఉడిగి నా గదదెబ్బ రుచి చూచిన నీ దేవతలెల్లరు బిక్కుమంటారు. చచ్చి చెడతారు అని ఇట్లు వదరుతున్న రక్కసుని మాటలు విని ఆ యజ్ఞవరాహస్వామి బ్రహ్మాదిసురలకు రాబోయే ఉపద్రవాన్ని పసిగట్టి, అప్పుడా భూదేవిని తన వాడికోరపై మోపి విలసిల్లాడు.

**క. సురరిపు వాక్యాంకుశముల, గురుకుపితస్వాంతుఁడగుచుఁగొమరారె వసుం**
**ధరతోడ భీతి నొందిన, కరిణింగల కరికులేంద్రుకరణింబెలుచన్. 645**

**ప్రతి :** పెలుచన్= అవలీలగా; భీతిన్+ఒందిన= భయగ్రస్తమైన; కరిణిన్+కల= ఆడుఏన్నుగల; కరికుల+ఇంద్రుకరణిన్= గజరాజువలె; సురరిపు= దేవతలవిరోధియైన; రక్కసుని వాక్య+అంశములన్= మాటల తీరుతో; గురు= గొప్పగా; కుపిత= కోపగించిన; స్వాంతుఁడు+అగుచున్= మనస్సు గలవాడై (వరాహస్వామి); వసుంధరతోడన్= భూదేవితో; కొమరారెన్= వెల్గాడు.

**తా :** వరాహస్వామి రక్కసుని దుందుడుకు మాటలకు రెచ్చిపోయి 'గజరాజు భయభ్రాంతమైన తన ఆడఏనుగును పొదువుకొన్నట్లు' భూమిని ముట్టెపై నిల్పి విలసిల్లాడు.

**తే. నిశితసితదంతరోచులు నింగిఁ బర్వఁ, గంధి వెడలి భయంకరాకారలీల**
**నరుగు భీషణ మఖవరాహావతార, మొనరఁ దాల్చిన పద్మలోచనుని వెనుక 646**

**ప్రతి :** నిశిత= వాడియైన; సిత= తెల్లని; దంతరోచులు= పండ్లకాంతులు; నింగిన్+పర్వన్= ఆకాశాన్ని అంటగా; కంధిన్= నీటికి నెలవైన సంద్రం నుండి; వెడలి= బయటపడి; భయంకర= వెరపుగొల్పు; ఆకారలీలన్= ఆకృతివిలాసంతో; అరుగు= వెళ్తున్న; భీషణ= భయంకరమైన; మఖవరాహ= యజ్ఞవరాహం; అవతారము= రూపాన్ని; ఒనరన్= ఒప్పిదంగా; తాల్చిన= ధరించినట్టి; పద్మలోచనునివెనుక= తామరలవంటి కన్నులవాడైన శ్రీహరి వెనుక భాగంలో...

**తా :** వరాహస్వామి దంతకాంతులు ఆకాశాన్ని వెల్గిస్తున్నాయి. అప్పుడాయన పాతాళంనుండి బయలుదేరాడు. అంతభయంకరా కృతి ధరించిన ఆ విష్ణుమూర్తి వెనుక – రాక్షసుడు వస్తూ –

**క. కరివెనుకఁదగులు నక్రము, కరణింజని దైత్యవిభుఁడు గదిసి యిటు లనున్**
**దురితపయోనిధితరికిం, గిరికిన్ ఖురదళితమేరుగిరికిన్ హరికిన్. 647**

**ప్రతి :** దైత్యవిభుఁడు= రాక్షసనేత (హిరణ్యాక్షుడు); కరివెనుకన్= ఏనుగు వెనుక; తగులు= పట్టుకొన్న; నక్రము కరణిన్= మొసలివలె; జని= వెళ్ళి; దురిత= దాట శక్యంకాని; పయోనిధిన్= సముద్రానికి; తరికిన్= ఓడలయినవాడును; ఖురవిదళిత=

గిట్టలచే చీల్చబడిన; మేరుగిరికిన్= మేరుపర్వతంగలవాడును; (అయిన); కిరికిన్= వరాహావతారాన్ని ఎత్తినవాడును అగు; హరికిన్= విష్ణువుని; కదిసి= వెన్కతగిలి; ఇటులు+అనున్= ఈ విధంగా అన్నాడు.

**తా :** గజరాజును పట్టుకోబోయే మొసలిలాగ ఆ రక్కసుడు శ్రీమన్నారాయణుని వెంటబడ్డాడు. ఆ స్వామి సముద్రాన్ని తరించివస్తున్నాడు. గిట్టల్తో మేరునగాన్ని సైతం ఎగురమీటగలసత్తువగలవాడు. వరాహరూపాన్ని ఎత్తివున్నాడు.

**క. నిందకు రోయక లజ్జం, జెందక వంచనను రణము సేసి జయంబుం**
**బొందెద నని తలంచుచు నిటు, పందగతింబాఱ బంటుపంతమె? నీకున్. 648**

**ప్రతి :** నిందకున్= అవమానానికి; రోయక= వెరవకుండ; లజ్జన్+చెందక= సిగ్గు పడకుండ; వంచనను= మోసముతో; రణము+చేసి= కయ్యమొనర్చి; జయంబున్= విజయాన్ని; పొందెదన్+అని= పొందగలనని; తలంచుచున్= ఊహిస్తూ; ఇటు= ఈ రీతిగా నిచ్చట; పందగతిన్= పిరికివానివలె; పారన్= పారిపోవుట; నీకున్= నీకు (హరికి); బంటుపంతము+ఎ= శూరుని పద్ధతియా?

**తా :** ఇది అవమానమే అనుకోకుండ, సిగ్గువిడిచి, మోసంతో యుద్ధం చేసి, విజయాన్ని కైవసం చేసుకోవాలనుకొన్నావు. ఇక్కడేమో పిరికివానిలాగ కాలికి బుద్ధి చెప్పావు. ఇది వీరలక్షణమా? (కాదనిభావం).

**వ. అని యాక్షేపించినం బుండరీకాక్షుండు గోపోద్దీపితమానసుండై. 649**

**ప్రతి :** అని; ఆక్షేపించినన్= నిలువరింపగా; పుండరీక+అక్షుండు= పద్మనయనుడైన విష్ణుమూర్తి; కోప+ఉత్+దీపిత= కోపంచేత చెలరేగిన; మానసుండు+ఐ= మనస్సుగలవాడై

**తా :** హిరణ్యాక్షు డిలా ఎదిరించి మాట్లాడగా, శ్రీహరి మనసు కోపంతో ఉడికిపోతూ,

**క. తోయములమీఁద భూమి న, నాయాసత నిల్పి దాని కాధారముగాఁ**
**దోయజనాభుఁడు దన బల, మాయతమతిఁ బెట్టె సురలు హర్షము నొందన్. 650**

**ప్రతి :** తోయజనాభుఁడు= కమలం బొడ్డునందుగల హరి; భూమిన్= నేలపైన; తోయములమీఁదన్= నీటిపైన; అనాయాసతన్= ఆయాసం లేకుండ (అవలీలగా); నిల్పి= నిలబెట్టి; దానికిన్= ఆ భూమికి; ఆధారము+కాన్= ఊతమగునట్లు; తన బలము= తన శక్తిని; ఆయతమతిన్= దూరబుద్ధిగలవాడై; సురలు= దేవతలు; హర్షమున్+ఒందన్= సంతోషపడునట్లు; పెట్టెన్= జోడించాడు.

**తా :** అప్పుడా వరాహస్వామి నీటిపై భూమిని నిల్పి దానికి ఊతగా, తనబలాన్ని అడ్డుపెట్టాడు. దేవతలు ఆనందించారు.

**తే. కుసుమముల వృష్టి బోరనఁగురిసె, నంత, విభవ మొప్పార దేవదుందుభులు మొరసెఁ,**
**గడఁక వీతెంచె గంధర్వగానరవము, నందితములయ్యె నప్సరోనర్తనములు. 651**

**ప్రతి :** అంతన్= తర్వాత; కుసుమములవృష్టి= పూలవాన; బోరనన్= బోరుమనే శబ్దంతో; కురిసెన్= కురిసింది; దేవదుందుభులు= దేవతల భేరులు; విభవము+ఒప్పారన్= వైభవం అతిశయించేటట్లు; మొరసెన్= మ్రోగాయి;

గంధర్వగానరవము= గంధర్వుల పాటల సవ్వడి; కడcకన్= అతిశయంగా; వీతెంచెన్= విన్పించింది; అప్సరస్+నర్తనములు= అచ్చరల నాట్యాలు; నందితములు+అయ్యెన్= ఆనందింపచేశాయి.

**తా :** అప్పుడు బోరుమని పూలవాన కురిసింది. వైభవంగా సురభేరులు మ్రోగాయి. గంధర్వుల పాటలు విన్పించాయి. అచ్చరలేమలు ఆనందంగా నాట్యమాడారు.

**వ. అయ్యవసరంబున నయ్యజ్ఞవరాహమూర్తిధరుండైన కమలలోచనుండు గనక కుండల కేయూర గ్రైవేయకటకాంగుళీయకభూషణరోచులు నింగిcబర్వ సమరసన్నద్ధుండై. 652**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; ఆ+యజ్ఞవరాహమూర్తిధరుండు+ఐన= యజ్ఞవరాహావతారాన్ని తాల్చిన (ఆస్వామి); కమలలోచనుండు= తామరలవంటి కన్నులవాడు శ్రీవిష్ణువు; కనకకుండల= బంగారుపోగులు; కేయూర= భుజకీర్తులు; గ్రైవేయక= దండలు (హారాలు); కటక= కడియాలు; అంగుళీయక= ఉంగరాలు మొదలైన; భూషణరోచులు= ఆభరణాల కాంతులు; నింగిన్+పర్వన్= ఆకాశమంటగా; సమరసన్నద్ధుండు+ఐ= పోరుసల్పడానికి సిద్ధపడినవాడై.

**తా :** యజ్ఞవరాహావతారుడైన ఆ శ్రీమన్నారాయణుడు బంగారుపోగులు, భుజకీర్తులు, హారాలు, కాళ్ళకు కడియాలు, వేళ్ళకు ఉంగరాలు మొదలైన ఆభరణాలు ధరించి అసురునితో తలపడడానికి సిద్ధమైనాడు.

**చ. ఘనగదcగేలcబూని మణికాంచననవ్యవిచిత్రవర్మ మిం**
**పొనరcగc దాల్చి దానవనియుక్తదురుక్తనిశాతబాణముల్**
**దన ఘనమర్మముల్ గలcప దానవహంత నితాంతశౌర్యుcడై**
**కనలుచు వచ్చు న ద్దనుజుcగన్గొని రోషవిభీషణాకృతిన్. 653**

**ప్రతి :** ఘనగదన్= గొప్పగదను; కేలన్+పూని= చేతతాల్చి; మణికాంచన= మణులు పొదివిన బంగారుతోడి; నవ్య= కొత్తదియు; విచిత్ర= చూడముచ్చటైనదియు నగు; వర్మమున్= కవచాన్ని; ఇంపు+ఒనరన్+కన్= కనువిందుగా; తాల్చి= ధరించి; దానవ= రక్కసునిచే; నియుక్త= ప్రయోగింపబడిన; దుర్+ఉక్త= చెప్పనలవికాని; నిశాత= వాడియైన; బాణముల్= అమ్ములు; తన= స్వామి; ఘనమర్మముల్= గొప్ప ఆయువుపట్టులను; కలcపన్= బాధించగా; దానవహంత= రాక్షసాంతకుడు; నితాంతశౌర్యుcడు+ఐ= మిక్కిలి పరాక్రమం గలవాడై; కనలుచున్= మండిపడుతూ; వచ్చు= ఎదురేతెంచు; ఆ+దనుజున్= ఆ రాక్షసుణ్ణి (హిరణ్యాక్షుణ్ణి); కన్గొని= చూచి; రోషవిభీషణ+ఆకృతిన్= కోపంచేత భయంకరరూపాన్ని ఎత్తినవిగ్రహంతో...

**తా :** చేతబుచ్చుకొని మణులు తాపిన సరికొత్త బంగారుకవచం ధరించిన రాక్షసుడు ప్రయోగించిన వాడిబాణాలు స్వామివారి అంతరింద్రియాల్ని సోకుతున్నాయి. వాడు చెలరేగి ముందుకువస్తుంటే, ఆయన కోపావిష్టుడయ్యాడు.

**వ. ఒప్పియు నగుచు నిట్లనియె. 654**

**ప్రతి :** ఒప్పియున్= కోపావేశంతో విజృంచినప్పటికి, నగుచున్= నవ్వుతూ (పరిహాససూచకం), ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు...

**తా :** రాక్షసుని దురుసుమాటలకు, వేసిన వాడిబాణాలకు స్వామికి కోపం కల్గింది. కాని ఆయన నవ్వుతూ ఇలా అన్నాడు.

మ. వినరా యోరి యమంగళాచరణ! యుద్వృత్తిన్ ననున్ నీమది
న్ననయంబున్ వనగోచరంబగు మృగంబంచుందలంతౌర, నే
నెనయన్ వన్యమృగంబ యౌదు, బలిమి న్నేతెంచు నీబోఁటి యీ
శునకశ్రేణి వధింతు నేఁ డనిమొనన్ సోఁకోర్చి వర్తించినన్. 655

**ప్రతి :** ఓరి అమంగళ+ఆచరణ!= నీచమైన నడవడిగల ఓ రక్కసుడా!; ఉత్+వృత్తిన్= పొగరుపోతుతనంతో; ననున్= నన్ను (హరిని); అనయంబున్= ఎల్లప్పుడు; నీమదిన్= నీ మనస్సులో (రక్కసుని); వనగోచరంబు+అగు= అడవిలో తిరుగు నట్టిదైన; మృగంబు+అంచున్= జంతువని; తలంతు+ఔరా!= అనుకొంటావు గదురా? (నీచసంబోధన); నేను= నేను; ఎనయన్= లెక్కించగా; వన్యమృగంబు+అ= అడవిమెకమే; ఔదున్= అవుతాను (నీవన్నట్లే); నేడు= ఈ దినం; అనిమొనన్ సోఁకున్= యుద్ధరంగమునందలి తాకిడిని; ఓర్చి= సహించి; వర్తించినన్= నిల్చినచో; బలిమిన్= బలిమితో; ఏతెంచు= వచ్చు; నీబోఁటి= నీవంటి; ఈ శునకశ్రేణిన్= ఈ కుక్కలదండును; వధింతున్= చంపుతాను.

**తా :** ఓరి దుష్టుడా! నీవు మహా దురహంకారివై నన్ను ఎల్లప్పుడు 'అడవిజంతువా!' అని కారుకూతలు కూస్తుంటావు. నీవన్నట్లే నేను అడవిమెకాన్నే. అయితే పొలికలని (యుద్ధభూమి)లో నా ధాటికి ఆగి నిల్చిన నీవంటి కుక్కల్ని ఈ రోజే మట్టుపెడతా.

క. బలిమి గలదేని నాతోఁ, గలనను నెదిరించి పోరఁగడఁగుము, నీ కో
ర్కులు నేఁడు దీర్తు, నూరక, తలపోయ వికత్థనంబు దగదు దురాత్మా! 656

**ప్రతి :** దుర్+ఆత్మా= ఓరీ దుష్టబుద్ధీ!; బలిమి= బలం; కలదు+ఏనిన్= నీ కుంటే; నాతోన్= నా తోడ; కలనను= కయ్యమందు; ఎదిరించి= మార్కొని; పోరన్= యుద్ధం చేయటానికి; కడఁగుము= సాహసింపుము; నేఁడు= ఈరోజు; నీ కోర్కులు= నీ కోర్కెలు; తీర్తున్= నెరవేరుస్తాను; ఊరక= అనవసరంగా; వికత్థనంబు= నీ గొప్పలు చాటు కోవటం; తలపోయన్= చక్కగా ఆలోచిస్తే; తగదు= కూడదు.

**తా :** ఓరీ దుర్మార్గుడా! నీకు సత్తావుంటే నాతో పోటాడ్డి యుద్ధానికి సిద్ధపడు. నేటితో నీ కోర్కెను నెరవేరుస్తాను. అంతేగాని మాటిమాటికి నీ గొప్పలెందుకు చెప్పుకుంటావు?

చ. విను, మది గాక సంగరవివేకవిశారదులైన యట్టి స
జ్జనములు మృత్యుపాశములఁజాల నిబద్ధులు నయ్యు నీవలెన్
గొనకొని యాత్మసంస్తుతులకున్ ముద మందిరె? యేల యీ విక
త్థనములు బంటుపంతములె దైత్యకులాధమ! యెన్ని చూడఁగన్. 657

**ప్రతి :** దైత్యకుల+అధమ!= రాక్షసకులంలో నీచుడవైన ఓరీ!; అది+కాక= నీవు చెప్పేది ప్రక్కనబెట్టి; విను= వినుము, సంగరవివేక= యుద్ధసంబంధమైన తెలివితేటలలో; విశారదులు= నేర్పరులు; ఐన+అట్టి= ఐనటువంటి; సత్+జనములు= ఉత్తములు; మృత్యుపాశములన్= మిత్తి యొక్క వురితాళ్ళలో; చాలన్= మిక్కిలి; నిబద్ధులును+అయ్యున్= చిక్కుకొన్న వారైనను; గొనకొని= ప్రయత్నించి; నీవలెన్= నీ మాదిరి; ఆత్మసంస్తుతులకున్= తమ గొప్పలు చెప్పుకోవటంతో;

ముదము+అందిరి+ఎ= ఆనందించారా? (లేదు); ఈ వికత్థనములు+ఏల= ఈ పొగడ్తలెందుకు?; ఎన్నిచూడఁగన్= ఆలోచించి చూస్తే; ఇవిబంటుపంతములె= ఇవన్నీ వీరుని ప్రతిజ్ఞలవుతాయా? (కావు)

**తా :** ఓరీ రాక్షసాధమా! ఆ మాటలన్నీ కట్టిపెట్టి విను. యుద్ధకోవిదులైన ఎందరో మహాత్ములు మిత్తికోరల్లో చిక్కిన వారైనను నీ మాదిరి ఇలాగా తమగొప్పలు చెప్పుకోరు. ఎందుకు నీకీ సొంతపొగడ్తలు? అది వీరుల ప్రజ్ఞలవుతాయా? (కావని భావం)

**మ. ధృతిఁబాతాళమునందు నీవనెడి సందీప్తోగ్ర నిక్షేప మే**
**నతిదర్పంబునఁగొందుఁ,జూడు మిదె దేవారాతి! నన్నెన్నె దౌ**
**గతలజ్జుండన దాఁగి యుండి రణముంగావింతు, యుష్మద్గదా**
**వితతద్రావితుఁడన్న న న్నెదురుమా, వే తీర్తు నీ కోరికల్. 658**

**ప్రతి :** దేవ+అరాతి= దేవతలవిరోధివైన రాక్షసా!; ధృతిన్= ధైర్యముతో; నీవు+అనెడి= నీవు చెప్పే; సందీప్త= మిక్కిలిప్రకాశిస్తున్న; ఉగ్రనిక్షేపము= పెద్దనిధిని(భూమిని); ఏన్= నేను; అతిదర్పంబునన్= మిక్కిలి పరాక్రమంతో; కొందున్= గ్రహిస్తాను; ఇదె చూడుము= ఇదో చూడుము; నన్నున్= నన్నూ (వరాహాన్ని); ఎన్నెదు= లెక్కగొన్నావు; ఔన్= నిజం; గతలజ్జుండు+అనన్= పోయిన సిగ్గుగలవాడో అన్నట్లు; దాఁగి+ఉండి= చాటున మాటువేసి; రణమున్= యుద్ధాన్ని; కావింతున్= చేస్తాను; యుష్మద్= నీ; గదా= గదచేత; వితత= విరివిగా; ద్రావితుఁడు= పలాయనం చిత్తగించినాడు; అన్న= అనేపేరుగల; నన్నున్= నాతో (హరిని); ఎదురుమా= (సమరంలో) ఎదురొడ్డుము; నీ కోరికల్= నీ కోర్కెల్ని; వేన్= వేగముగా; తీర్తున్= నెరవేరుస్తాను.

**తా :** అరె దేవ విరోధీ! ఇదిగో చూడు. పాతాళంలో వుందంటున్నావే – ఆ నిధిని మహాపరాక్రమంతో కైవసం చేసుకొంటాను. నన్నేదో సిగ్గులేని వానిగా నీ వంటున్నావు. కానిమ్ము. దాక్కొని నీతో కయ్యమాడుతాను. నీ గదను చూచి పరుగెత్తానంటున్నావు గదూ! సరే నన్నెదిరించి చూడు– నీ కోర్కె వేగంగా నెరవేరుతుంది.

**ఉ. ఎన్నఁబదాతియూథముల కెల్ల విభుండవు, పోటుబంటవై**
**నన్ను రణోర్వి నేఁడెదిరినన్ భవదీయబలంబు నాయువున్**
**మిన్నక కొందుఁజూడు, మిది మేరగ మేదిని వీతదైత్యమై**
**వన్నెకు నెక్కఁజేసెద నవార్యపరాక్రమవిక్రమంబునన్. 659**

**ప్రతి :** ఎన్నన్= పరిగణించగా; పదాతియూథములకున్+ఎల్లన్= కాల్బంటుల దళానికంతటికి; విభుండవు= నాయకుడివి; నేఁడు= ఈనాడు; రణ+ఉర్విన్= యుద్ధభూమియందు; పోటుబంటవు+ఐ= మేటిమొనగాడవై; నన్నున్= (శ్రీవరాహస్వామిని); ఎదిరినన్= ఎదిరించినచో; చూడుము= కనుగొనుము; భవదీయబలంబున్= నీ మగటిమిని; ఆయువున్= ఉసురును; మిన్నక= అవలీలగా; కొందున్= కైకొంటాను; ఇది మేర+కన్= ఇదే ప్రతిజ్ఞగా; న+వార్య= అడ్డుపెట్టశక్యంకాని; పరాక్రమవిక్రమంబునన్= పరాక్రమ పొంగుతో; మేదినిన్= భూతలాన్ని; వీతదైత్యము+ఐ= వీడినరక్కసులుగలదై (రాక్షసులు లేనిదై); వన్నెకున్+ఎక్కన్+చేసెదన్= పేరుప్రతిష్ఠలు గలదాన్ని చేస్తాను–

**తా :** ఓ రాక్షసా! నీవీ కాల్బంట్లకు నాయకుడవు. ఈ యుద్ధరంగంలో పోటుమగాడవై నన్నెదిరిస్తే తప్పక నీ ఉసురు తీస్తాను. నీ బలాన్ని అణచి వేస్తాను. నా పరాక్రమంతో నిన్ను హతమార్చి 'భూమిలో రక్కసులు లేకుండా చేస్తాను. ఇదే నా ప్రతిజ్ఞ' అన్నాడు వరాహస్వామి.

**చ. నను నెదురంగఁజాలిన ఘనంబగు శౌర్యము ధైర్యమున్ బలం**
**బును గలదేని నిల్వు రణభూమిని, నీ హితులైన వారికిం**
**గనుఁగవ బాష్పపూరములు గ్రమ్మఁగ మాన్పఁగ నోపుదేనిఁ జ**
**య్యనఁజనుదెమ్ము దానవకులాధమ! యూరక రజ్జు లేటికిన్? 660**

**ప్రతి :** దానవకుల+అధమ= రాక్షసకులంలోని నీచుడా!; రణభూమినిన్= యుద్ధభూమియందు; ననున్= (వరాహస్వామిని); ఎదురన్+కన్= ఎదిరించటానికి; చాలిన= తగినంత; ఘనంబు+అగు= గొప్పదైన; శౌర్యము= పరాక్రమం; ధైర్యమున్= ధీరత్వం; బలంబునున్= లావు; కలదు+ఏనిన్= ఉంటే; నిల్వు= నిలబడు; నీ= నీ; (రాక్షసునియొక్క); హితులు+ఐనవారికిన్= స్నేహితులైనవారికి; కనుగవన్= కన్నుల్లో; బాష్పపూరములు= కన్నీళ్ళు; క్రమ్మఁగన్= పొటమరించగా; మాన్పఁగన్= తుడువటానికి; ఓపుదు+ఏనిన్= చాలినవాడవయితే; చయ్యనన్= వెంటనే; చనుదెమ్ము= రమ్ము; ఊరక= అనవసరంగా; రజ్జులు+ఏటికిన్= ప్రేలాపనలెందుకు? (వ్యర్థపు మాటలు వద్దని భావం).

**తా :** రక్కసికులంలో అధముడైన ఓరీ! యుద్ధరంగంలో నన్నెదిరించే మొనగాడవైతే రా. నీ పరాక్రమం, ధైర్యం, బలిమి ఉంటే ప్రదర్శించు. నీ స్నేహితుల కన్నీళ్ళు తుడవగల పోటు మానిసివైతే రా. నాతో తలపడు- ఈ వ్యర్థపు మాటలు ఎందుకు? (వదరుబోతు కూతలు మాని నాతో కయ్యానికి దిగుమని వరాహస్వామి రక్కసుని గద్దించాడు).

**క. నను నిట సంస్థాపించెద, నని పలికితి, వంతవాఁడ వౌదువు, నీకున్**
**నెనరైన చుట్టములఁ బొడ, గని రా యిదె యముని పురికిఁ గాఁపుర మరుగన్. 661**

**ప్రతి :** ననున్= నన్నే (వరాహస్వామిని), ఇటన్= ఇచ్చట, సంస్థాపించెదన్= పాతిపెడతాను, అని (అన్నవాడు రక్కసుడు), పలికితి= అన్నావు, అంతవాఁడవు+ఔదువు= అబ్బో నీ వంతటి వాడివే (వేళాకోళంమాట), ఇదె= ఇదో, నీకున్= నీకెంతో, నెనరు+ఐన= ప్రీతి పాత్రులైన, చుట్టములన్+పొడన్+కని= బంధువుల్ని చూచి, యముని పురికిన్= నరకలోకానికి, కాఁపురము+అరుగన్= నివాసముండటానికి, రా= రమ్ము-

**తా :** 'నిన్నిక్కడే పాతిపెడతా' నన్నావు. నిజంగా నీ వంతటివాడవే. నా! ముందుగానీవు నీ ప్రియమైన బంధువులందరిని చూచిరా. యమలోకానికి కాపురం చేయటానికి పోవలసి ఉంటుంది. నీ ప్రియమైన బంధువులందరిని చూచిరా అని వరాహస్వామి రాక్షసుణ్ణి గేలి చేశాడు.

**మ. అని యిబ్భంగి సరోరుహాక్షుఁడు హిరణ్యాక్షున్ విడంబించి ప**
**ల్కిన హాసోక్తుల కుల్కి రోషమదసంగీభూతచేతస్కుఁడై**
**కనుఁగ్రేవన్ మిడుఁగుర్లు సాలఁ బొడమంగాఁగిన్కమైఁదోఁక ద్రొ**
**క్కిన కృష్ణోరగరాజుమాడ్కి మదిలోఁగీడ్పాటు వాటిల్లఁగన్. 662**

**ప్రతి :** అని= యమపురికి వెళ్ళవలసివస్తుందని; ఈ+భంగిన్= ఈ విధంగా; సరస్+రుహ+అక్షుండు= పద్మములవంటి కన్నులుగల శ్రీమహావిష్ణువు (వరాహరూపధారి); హిరణ్య+అక్షున్= హిరణ్యాక్షుని; విడంబించి= గేలిచేసి; పల్కినన్= వాకొనగా; హాస+ఉక్తులకున్= ఆ స్వామి పరిహాసపు మాటలకు; ఉల్కి= అదరిపడి; రోష= కోపం; మద= అహంకారం; ఈ రెండింటిచే; సంగీభూత= కలిసిన; చేతస్కుండు+ఐ= మనస్సుగలవాడై; కనును+క్రేవన్= రెండుకళ్ళల్లో; మిడుంగుర్లు= మెరుపులు; చాలన్= మిక్కిలి; పొడమంగాన్= కలుగగా; కిన్కమైన్= కోపావేశంతో; తోంక+త్రొక్కిన= తోకను త్రొక్కగా; (ఎగిసిపడే); కృష్ణ+ఉరగరాజు మాడ్కిన్= నల్లత్రాచులాగా; మదిలోన్= మనస్సునందు; కీడ్పాటు= చేటు; వాటిల్లంగన్= కలుగగా...

**తా :** పద్మలోచనుడైన వరాహస్వామి 'యమపురి కేగుటకు సిద్ధంగా ఉండ'మని గేలిచేయగానే ఆ రక్కసుడు కోపోద్రేకంతో రేగిన మనస్సుగలవాడై తోకద్రొక్కిన సర్పరాజులాగా మండి పడ్డాడు.

**క. చలితేంద్రియుండై నిట్టూ, ర్పులు నిగిడించుచును బొమలు ముడివడ రోషా**
**కులమానసుండై గదంగొని, జలజాక్షున కెదురు నడచె సాహస మొప్పన్. 663**

**ప్రతి :** (హిరణ్యాక్షుడు) చలిత+ఇంద్రియుండు+ఐ= ఊగిపోతున్న ఇంద్రియాలు కలవాడై; నిడు+ఊర్పులు= ఉచ్ఛ్వాసనిశ్వాసాలు; నిగిడించుచును= వ్యాపింపజేస్తూ; రోష+ఆకుల మానసుండు+ఐ= కోపంచేత వ్యాకులత చెందిన మనస్సుగలవాడై; బొమలు= కను రెప్పలు; ముడివడన్= సుళ్ళుతిరుగగా; గదన్+గొని= గదచేబూని; సాహసము+ఒప్పన్= తొందరతనం అతిశయింపగా; జలజ+అక్షునకున్= తామరలవంటి కన్నులుగలవాడైన హరికి; ఎదురునడచెన్= ముందు ఎదురుగా నడిచాడు–

**తా :** వరాహస్వామి పల్కులకు హిరణ్యాక్షుని అవయవాలన్నీ జలదరించాయి. వాడు బుసకొడుతూ, కోపావేశంతో రెప్పలు ముడివడిగా సాహసించి హరి నెదుర్కోడానికి ముందుకు వచ్చాడు.

**వ. అత్తఱి హిరణ్యాక్షుండతిభయంకరాకారుండై. 664**

**ప్రతి :** ఆ+తఱిన్= ఆ సమయంలో; హిరణ్య+అక్షుండు= హిరణ్యాక్షుడు (రాక్షసుడు); అతి= మిక్కిలి; భయంకర= వెరపుగొల్పునట్టి; ఆకారుండు+ఐ= రూపుతాల్చినవాడై...

**తా :** ఆలాంటి వేళలో హిరణ్యాక్షుడు అతి భీకరాకారంతో

**మ. గద సారించి మదాసురేంద్రుండు సమగ్రక్రోధుండై మాధవున్**
**గుదియన్ వేసిన వ్రేటు గై కొనక రక్షోహంత శౌర్యోన్నతిన్**
**గదంగేలన్ ధరియించి దానిందునుకల్ గావించినన్ దైత్యుండు**
**న్మదుండై యొండు గదన్ రమావిభుని భీమప్రక్రియన్ వ్రేసినన్. 665**

**ప్రతి :** మద+అసుర+ఇంద్రుండు= మదించిన రాక్షసరాజు; సమగ్రక్రోధుండు+ఐ= నిండైన కోపం కలవాడై; గదసారించి= గదనుచాపి; మాధవున్= సిరినాథుని; కుదియన్+వేసినన్= కుప్పకూల్చాలని వేయగా; రక్షస్+హంత= రక్కసులను మట్టు పెట్టే హరి; వ్రేటు+కైకొనక= దెబ్బసోకకుండ; శౌర్య+ఉన్నతిన్= పరాక్రమాతిశయంతో; గదన్= గదను; కేలన్+ధరియించి= చేతపుచ్చుకొని; దానిన్= రక్కసుని గదని; తునుకల్+కావించినన్= ముక్కలు చేయగా; దైత్యుండు= రక్కసుడు (దితికుమారుడు);

ఉత్+మదుఁడు+ఐ= మిక్కిలి మదించినవాడై (ఒడలు తెలియనివాడై); ఒందుగదన్= వేరొకగదతో; భీమప్రక్రియన్= భయంకరమైన విధంగా; రమావిభునిన్= సిరిమగడైన శ్రీహరిని; వ్రేసినన్= వేయగా...

**తా :** ఆ హిరణ్యాక్షుడు కోపంతో గదని ఝుళిపించి శ్రీహరిని కొట్టబోయాడు. హరి ఆ గద వేటుని తప్పించుకొని తన గదతో వాని గదను తుత్తునియలు చేశాడు. అప్పుడా రక్కసుడు దుర్మదుడై వేరొక గదతో స్వామిపై విజృంభించాడు.

**చ. అది దనుఁదాఁకకుండ దనుజారి గదారణకోవిదక్రియా**
**స్పదకరలాఘవక్రమముఁబైకొని చూపి విరోధి పేరురం**
**బదరఁగ వేయ వాఁడు వివశాకులభావము నొంది యంతలో**
**మదిఁదెలివొంది వ్రేసె రిపుమానవిమర్దను నా జనార్దనున్. 666**

**ప్రతి :** అది= రాక్షసుని గద; తనున్= వరాహస్వామిని; తాకక+ఉండన్= తగులకుండునట్లు; దనుజ+అరి= రాక్షసులను మట్టుపెట్టు శ్రీహరి; గదారణ= గదాయుద్ధపు; కోవిద క్రియా= నేర్పరితనానికి; ఆస్పద=నెలవైన; కర= చేతి; లాఘవక్రమమున్= నైపుణ్యాన్ని; పైకొని చూపి= వానిపైప్రయోగించి; విరోధి= శత్రువు; (హిరణ్యాక్షునియొక్క); పేరు+ఉరంబు= నిడుపాటి రొమ్ము; అదరఁగన్= పగులునట్లు; వేయన్= కొట్టగా; వాఁడు= ఆ రక్కసుడు; వివశ= వశం తప్పినందువల్ల; ఆకులభావమున్= సొమ్మసిల్లినవైనం; ఒంది= పొంది; అంతలోన్= ఆ క్షణమే; మదిన్= మనస్సులో; తెలివి+ఒంది= స్పృహలోనికి వచ్చి; రిపుమానవిమర్దనున్= శత్రువులపొగరణచగల్గిన; జనార్దనున్= విష్ణువును; వేసెన్= దెబ్బకొట్టెను.

**తా :** హిరణ్యాక్షుడు ప్రయోగించిన గద వేటును తప్పించుకొన్నాడు వరాహస్వామి. తర్వాత తన గదాయుద్ధకౌశలంతో ఆ రాక్షసుని రొమ్ముపై ఒక్క బలమైన దెబ్బకొట్టాడు. ఆ గద తాకిడికి వాడు కొంతసేపు మతిదప్పిపడి, అంతలోనే తేరుకొని శత్రుహంతయైన శ్రీహరిపై తన గదను సారించాడు.

**వ. ఇట్లు దలపడి యన్యోన్యజయకాంక్షల నితరేతరతుంగ తరంగ తాడితంబులగు దక్షిణోత్తర సముద్రంబుల రౌద్రంబునఁ బరస్పర శుండాదండ ఘట్టితమదాంధ గంధ సింధుర యుగంబు చందంబున రోషభీషణాటోపంబులం దలపడు బెబ్బులుల గబ్బున, నతిదర్పాతిరేకంబున నెదిర్చి ఱంకెలు వైచు మదవృషభంబుల రభసంబున, నసహ్య సింహపరాక్రమంబున విక్రమించి పోరునెడ హిరణ్యాక్షుండు సవ్యమండల భ్రమణంబునం బరివేష్టించినం బుండరీకాక్షుండు దక్షిణ మండల భ్రమణంబునం దిరిగి విపక్షు వక్షం బశనిసంకాశంబగు గదాదండంబునం బగిల్చిన వాఁడు దెప్పిఱి తెలివొంది లేచి దనుజపరిపంథి ఫాలంబు నొప్పించె, నప్పు డమ్మేటి వీరులు శోణితసిక్తాంగులై పుష్పితాశోకంబులఁ బురుడించుచుం బాయుచు డాయుచు వ్రేయుచు రోయుచు నొండొరుల రుధిరంబు లాఘ్రాణించుచుఁ దిరస్కార పరిహాసోక్తుల నిచ్చుచుఁ బోరు సమయంబున న మ్మహాబలుల సమరంబుఁ జూచు వేడ్కఁ బద్మసంభవుండు నిఖిల మునీంద్రసిద్ధసాధ్య దేవగణంబుల తోడఁ జనుదెంచి ధరిత్రీనిమిత్తం బసురవరునితోడం బోరు యజ్ఞవరాహున కిట్లనియె. 667**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా గదాయుద్ధంలో; తలపడి= ఎదుర్కొని; అన్య+అన్య= పరస్పరం; జయకాంక్షలన్= గెలుపుకోర్కెలతో; ఇతర+ఇతర= వేరువేరు; తుంగ= ఉవ్వెత్తయిన; తరంగ= అలలచే; తాడితంబులు+అగు= కొట్టుకొనేవైన;

దక్షిణ+ఉత్తరసముద్రంబుల= కుడి ఎడమల సముద్రాల; రౌద్రంబునన్= మిడిసిపాటువలెను; పరస్పర= ఒండొంటి; శుండాదండ= దండాన్ని పోలిన తొండాలచే; ఘట్టిత= కొట్టబడిన; మద+అంధ= మదంచేకళ్ళు గప్పిన; గంధసింధురయుగంబుచందంబునన్= మదించిన రెండు ఏన్గులవలెను; రోష= కోపంయొక్క; భీషణ= భయంకరమైన; ఆటోపంబునన్= మిడిసిపాటుతో; తలపడు= కబళించు; బెబ్బులుల= పెద్దపులుల; గబ్బునన్= గర్వంవలెను; అతి= మిక్కిలి; దర్ప+అతిరేకంబునన్= అతిశయించిన పొగరుతో; ఎదిర్చి= ఎదిరించి; ఱంకెలు+వైచు= శబ్దించే; మదవృషభంబుల= మదించిన ఎడ్ల; రభసంబునన్= రచ్చలాగా; న+సహ్య= సహింపరాని; సింహపరాక్రమంబునన్= సింహాలవంటిశౌర్యంతో; విక్రమించి= ఎదురొడ్డి; పోరు+ఎడన్= కయ్యంచేసేటప్పుడు; హిరణ్యాక్షుండు; సవ్యమండల= ఎడమదిశకు; భ్రమణంబునన్= చుట్టుకొనుటతో (ఎడమవైపు కబలించుట); పరివేష్టించినన్= ఆవేశించగా; పుండరీక+అక్షుండు= కమలాలవంటికన్నులుగల శ్రీహరి; దక్షిణమండల= కుడిదిశ; భ్రమణంబునన్=చుట్టుటతో; తిరిగి; విపక్షువక్షంబు= విరోధి రొమ్మును; అశనిసంకాశంబు+అగు= పిడుగుపాటు వంటి; గదాదండంబునన్= కౌమోదకిచే; పగిల్చినన్= చీల్చగా; వాఁడు= హిరణ్యాక్షుడు; తెప్పిఱి= తేరుకొని; తెలివి+ఒంది= మేల్కొని; లేచి= నిలబడి; దనుజ= రాక్షసుల; పరిపంథి= శత్రువైన హరి; ఫాలంబున్= నొసటిని; నొప్పించెన్= బాధించాడు, (హరినొసటిపై కొట్టాడు); అప్పుడు; ఆ+మేటివీరులు= వీరుడైన ఆ స్వామి, మరియు రక్కసుడు, ఇర్వురు; శోణిత= నెత్తుటిచేత; సిక్త+అంగులు+ఐ= తడిసిన అవయవాలుగలవారై; పుష్పితాశోకంబులన్= విచ్చిన అశోకవృక్షాల్ని; పురుడించుచున్= పోలుతూ; పాయుచున్= పరుగెత్తుతూ; డాయుచున్= సమీపిస్తూ; వ్రేయుచున్= విసరుతూ; రోయుచున్= రొప్పుతూ; ఒండొరుల= ఒకరొకరి; రుధిరంబులు= నెత్తుర్లు; ఆఘ్రాణించుచున్= వాసన చూస్తూ; తిరస్కార= నిందా గర్భితమైన; పరిహాస= ఎగతాళితోడి; ఉక్తులన్= మాటల్ని; ఇచ్చుచున్= ప్రయోగిస్తూ; పోరుసమయంబునన్= కయ్యంచేసేటప్పుడు; ఆ+మహాబలుల= ఆ గొప్పబలశాలుల; సమరంబున్= యుద్ధాన్ని; చూచువేడ్కన్= చూడాలనే ఉత్సాహంతో; పద్మసంభవుండు= తామరలోపుట్టిన బ్రహ్మ; నిఖిల= సమస్తమైన; ముని+ఇంద్ర= ఋషులు; సిద్ధ= సిద్ధులు; సాధ్య= సాధ్యులు; మొదలైన; దేవగణంబులతోడన్= దేవతల సమూహాలతో; చనుదెంచి= వచ్చి; ధరిత్రీనిమిత్తంబు= భూమికోసమై; అసురవరునితోడన్= రాక్షసనాయకునితో; పోరు= యుద్ధం చేస్తున్న; యజ్ఞవరాహునకున్= యజ్ఞవరాహస్వామితో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు –

**తా :** వరాహస్వామి హిరణ్యాక్షు లిర్వురు విజయేచ్ఛతో యుద్ధానికి సన్నద్ధులయ్యారు. వారిర్వురి కయ్యం ఉవ్వెత్తుగా లేచిన అలలతో కూడిన ఉత్తర దక్షిణ సముద్రాలు ఢీకొన్నట్లుంది. రెండు మదపుటేనుగులు తమ తొండాలతో తాడించుకొన్నట్లుంది. కోపావేశంతో రెండు పెద్దపులులు తలపడినట్లుంది. పోతరించిన రెండు ఎడ్లు రంకెలువేస్తూ కుమ్ములాడినట్లుంది. ఆ వీరులిర్వురు సింహాలవలె విజృభించి పోరు సల్పుతున్నారు. హిరణ్యాక్షుడు ఎడమనుండి చుట్టుకొని రాగా, వరాహస్వామి కుడినుండి చుట్టి, పిడుగుపాటును పోలిన కౌమోదకితో వాని రొమ్ముపై బలంగా కొట్టాడు. ఆ రాక్షసుడు దెబ్బసోకి స్పృహనుండి కోలుకొని శ్రీహరి నొసటిని గట్టిగా గాయపరిచాడు. ఇట్లా ఇరువురు నెత్తురు చిమ్మే శరీరాలతో పుష్పించిన అశోకవృక్షాల్ని తలపించారు. ఒకరిపై నొకరు మిడిసిపడుతూ, రోజుతూ, రొప్పుతూ, కొట్టుకుంటూ, ఒండొరుల రక్తం వాసన చూస్తూ, తిట్టుకొంటూ, గేలిచేస్తూ యుద్ధం చేస్తున్న సమయంలో, ఆ వేడుక చూడాలని బ్రహ్మ మునుల్ని, సిద్ధ సాధ్యుల్ని, తక్కిన దేవతల్ని వెంటబెట్టుకొని అక్కడికి వచ్చాడు. భూమాతకొరకై రక్కసునితో తలపడుతున్న యజ్ఞవరాహస్వామితో ఇట్లన్నాడు.

**ఉ. అంచితదివ్యమూర్తి! పరమాత్మక! యీ కలుషాత్ముఁడైన న**
**క్తంచరుఁడస్మదీయవరగర్వమునన్ భువనంబు లెల్లఁ గా**
**రించు మదించి యిట్టి విపరీతచరిత్రునిఁ ద్రుంప కిట్లుపే**
**క్షించుట గాదు, వీని బలిసేయు వసుంధరకున్ శుభంబగున్. 668**

**ప్రతి :** అంచిత= ఒప్పిదమైన; దివ్యమూర్తి= మంగళకరమైన రూపంగలవాడా!; పరమ+ఆత్మక= గొప్పహృదయంగల ఓ దేవా!; ఈ; కలుష+ఆత్ముఁడు+ఐన= పాపాత్ముడైనట్టి; నక్తంచరుఁడు= రాత్రి సంచారంగల యీ రక్కసుడు; అస్మదీయ= మా (మేమిచ్చిన); వరగర్వమునన్= వరమువలని పొగరుచే; మదించి= విజృంభించి; భువనంబులు+ఎల్లన్= లోకాలన్నింటిని; కారించున్= బాధిస్తాడు; ఇట్టి= ఇలాంటి; విపరీతచరిత్రునిన్= విద్ధూరపునడవడిగల ఈ రక్కసుని; త్రుంపక= నాశనం చేయకుండ; ఇట్లు= ఈ విధంగా; ఉపేక్షించుట= వదలుట; కాదు= తగదు; వీనిన్= ఈ రాక్షసుణ్ణి; బలి+చేయు= పొలివెట్టుము; వసుంధరకున్= భూమికి; శుభంబు+అగున్= మేలగును.

**తా :** 'ఓ దివ్యమంగళమూర్తీ! పరమాత్మా! ఈ దుర్మార్గుడైన రాక్షసుడు మేమిచ్చిన వరగర్వంతో లోకుల్ని బాధిస్తున్నాడు. ఇలాంటి దుశ్చరిత్రుని మట్టుపెట్టకుండ వదలటం మంచిది గాదు. వీనిని భూదేవికి శుభం కలిగించు' అని బ్రహ్మ శ్రీవరాహస్వామిని వేడుకొన్నాడు.

**క. బాలుఁడు గరమున నుగ్ర, వ్యాళము ధరియించి యాడువడువున రక్షః**
**పాలునిఁ ద్రుంపక యూరక, పాలార్చుట నీతియే శుభప్రద! యింకన్. 669**

**ప్రతి :** శుభప్రద= శుభముల నొసంగువాడా! స్వామీ!; ఇంకన్= ఇకపై; బాలుఁడు= చిన్నపిల్లవాడు; కరమునన్= చేతియందు; ఉగ్రవ్యాళమున్= భయంకరమైన పామును; ధరియించి= తాల్చి; ఆడువడువునన్= ఆటాడునట్లు; రక్షస్+పాలునిన్= రాక్షసవీరుని; త్రుంపక= ఖండించకుండ; ఊరక, పాలార్చుట= ఉపేక్షించుట; నీతి+ఏ= హితమా? (కాదనుట)

**తా :** 'కళ్యాణదాయకా! పరమాత్మా! చిన్నపిల్లవాడు భయంకరమైన పాముని చేతపట్టి ఆడినట్లు, ఈ రక్కసుణ్ణి ఇంకా చంపకుండా ఉపేక్షించటం తగునా?" అని బ్రహ్మ అన్నాడు.

**వ. అదియునుంగాక. 670**

**ప్రతి :** అదియునున్+గాక= అంతేకాక,

**తా :** అంతేగాక, ఇంకా,

**మ. అనఘా! యీ యభిజిన్ముహూర్తమున దేవారాతి మర్దింపవే**
**ననయంబున్ మఱి దైత్యవేళ యగు సంధ్యాకాల మేతెంచినన్**
**ఘనమాయా బలశాలియైన దనుజున్ ఖండింపఁగా రాదు గా**
**వున నీ వేళన త్రుంపు సజ్జనహితప్రోద్యోగరక్తుండవై. 671**

**ప్రతి :** అనఘా= ఓ పాపరహితుడా!; ఈ; అభిజిత్+ముహూర్తమునన్= పగలు పదునాల్గు గడియలమీద రెండుగడియల మంచి కాలములో; దేవ+అరాతిన్= దేవతలపగవాడైన రక్కసుని; మర్దింపవు+ఏన్= చంపకున్నచో; మఱి= తర్వాత; అనయంబున్= అశుభమైన; దైత్యవేళ+అగు= రాక్షససమయమైన; సంధ్యాకాలము= సాయంసంధ్య; ఏతెంచినన్= వస్తే; ఘన= గొప్ప; మాయాబలశాలి= మోసపు బలంచేత ప్రకాశించే; దనుజున్= రాక్షసుని; ఖండింపన్+కా రాదు= చంపుటకు సాధ్యపడదు; కావునన్= అందువల్ల; ఈవేళన= ఈ క్షణమందే; సత్+జన= ఉత్తములైనవారికి; హిత= మేలుగూర్చెదు; ప్ర+ఉద్యోగ= ఉత్కృష్టప్రయత్నమందు; రక్తుండవు+ఐ= ఆసక్తి గలవాడవై; త్రుంపు= చంపుము.

**తా :** మహాత్మా! 'అభిజిత్తు' అనే పేరుగల యీ కాలంలోనే ఈ దైత్యుని మట్టు పెట్టండి. ఈ ముహూర్తం తప్పితే అసుర సంధ్యాసమయం వస్తుంది. అప్పుడు మాయాబలశాలియైన వీనిని చంపటం తేలిక కాదు. అందువల్ల మంచివారిని కాపాడుట యందాసక్తిగల మీరు వీనిని యిప్పుడే మట్టుపెట్టండి.

**విశే :** అభిజిత్తు : ఒక నక్షత్రం, రోహిణికి ప్రక్కనే ఉంటుంది. దక్షుని కూతురు. చంద్రునికి భార్య. అందరికంటెతానే చంద్రునికి అతి ప్రియమైన భార్యకావాలని తలంచి తపస్సుచేసింది. ఆ సమయంలో ఆమె స్థానంలో కుమారస్వామి 'అగ్నిదైవత్య'మనే వేరొక నక్షత్రాన్ని నిల్పాడు. 'అభిజిత్తు'ను శుభలగ్నంగా వైదికులు భావిస్తారు.

పగలు పదునాల్గు గడియలమీద రెండుగడియల కాలాన్ని అభిజిత్తు అంటారు. (శ.ర). సహజంగా నక్షత్రాల సంఖ్య 27. అశ్విన్యాదులు. కాని కార్తాంతికులు 'అభిజిత్తు'ను 28వ నక్షత్రంగా గుర్తిస్తారు.

**క. అని సరసిజగర్భుఁడు వ, ల్కిన వచనము లర్థి విని, నిలింపులు గుంపుల్**
**గొని చూడ సస్మితానన, వనజము చెలువొంద నసురవరు కభిముఖుఁడై. 672**

**ప్రతి :** అని= రక్కసుని ఖండింపుమని; సరసిజగర్భుఁడు= కమలమున బుట్టిన బ్రహ్మ; పల్కినన్= చెప్పగా; వచనములు= ఆయన మాటలు; అర్థిన్+విని= కోరికతో ఆలకించి; నిలింపులు= దేవతలు; గుంపుల్+కొని= సమూహంగా నేర్పడి; చూడన్= చూస్తుండగా; సస్మిత= చిరునవ్వుతోడి; ఆనన= మోమనెడు; వనజము= పద్మము; చెలువు+ఒందన్= వికసింపగా; అసురవరుకున్= రాక్షసనాథునికి; అభిముఖుఁడు+ఐ= ఎదురుపడ్డవాడై...

**తా :** బ్రహ్మ 'స్వామీ! అభిజిల్లగ్నంలోనే వీనిని చంప'మని చెప్పగానే అక్కడ మూగిన దేవతలు విని ఆనందించారు. అప్పుడా స్వామి ముఖపద్మం వికసించింది. ఆయన రక్కసుని కెదురై నిలిచాడు.

**తే. పుండరీకాక్షుఁడయ్యును భూరిరోష, నిరతిఁదరుణారుణాంభోజనేత్రుఁడగుచు**
**ఘనగదాదండ మెత్తి రాక్షసుని హనువు, నుగ్రగతి మొత్తె వాఁడును నోసరించె. 673**

**ప్రతి :** పుండరీక+అక్షుఁడు+అయ్యును= తెల్లదామరల బోలిన కన్నులు గల్గిన వాడైనప్పటికి (విష్ణువు); భూరి= గొప్ప; రోషనిరతిన్= కోపావేశంచేత; తరుణ= అప్పుడే విచ్చిన; అరుణ= ఎఱ్ఱని; అంభోజనేత్రుఁడు= పద్మమునుబోలిన కన్నులు గలవాడు; అగుచున్= అయి; ఘనగదాదండము+ఎత్తి= గొప్పదైన గదను ఎత్తి; ఉగ్రగతిన్= మిక్కిలివేగంతో; రాక్షసునిహనువున్= హిరణ్యాక్షుని చెక్కిలిని; మొత్తెన్= కొట్టాడు; వాఁడునున్= ఆ రాక్షసుడుకూడ; ఓసరించెన్= ప్రక్కకు తిరిగాడు.

**తా :** సహజంగా శ్రీమన్నారాయణుని కళ్ళు తెల్లదామరల్ని పోలి ఉంటాయి. కాని ఇప్పుడు కోపావేశం చేత కొత్తగా విచ్చిన ఎర్రదామరలను పోలివున్నాయి. ఆ స్వామి గొప్పగదతో రక్కసుని చెక్కిలిపై ఒక్క దెబ్బ కొట్టాడు. వాడు ప్రక్కకు తొలగిపోయాడు.

**క. పరువడి దితిసుతుఁడతి భీ, కరగదఁ జేఁబూని చిత్రగతులను బద్మో**
**దరు డాసి చేతిగద సా, గరమునఁ బడ నడిచె బాహుగర్వ మెలర్పన్. 674**

**ప్రతి :** దితిసుతుఁడు= దితికుమారుడైన హిరణ్యాక్షుడు; పరువడిన్= మిక్కిలి వేగంగా; అతిభీకర గదన్= మిక్కిలి భయంకరమైన గదను; చేన్+పూని= చేతబట్టి; చిత్రగతులన్= చిత్రమైన రీతులతో; పద్మ+ఉదరున్= కమలం కడుపునగలవాడగు హరిని; డాసి= సమీపించి; బాహుగర్వము= భుజగర్వం; ఎలర్పన్= బయల్పడునట్లు; చేతిగదన్= స్వామిచేతనున్న గదను; సాగరమునన్= సంద్రమందు; పడన్= పడునట్లు; అడిచెన్= పొడిచాడు.

**తా :** అప్పుడా దితిబిడ్డడైన హిరణ్యాక్షుడు పరుగెత్తిపోయి ఒక భయంకరమైన గదతో తన భుజబలాన్ని ప్రదర్శిస్తూ శ్రీహరి గదను మొత్తాడు– అది పోయి సముద్రంలో పడింది.

**వ. అంత. 675**

**ప్రతి :** అంత= అంతలో.

**తా :** అంతలో ఏమిజరిగిందనగా...

**తే. హరి నిరాయుధుఁడైన, సురారి సమర, ధర్మమాత్మను దలఁచి యుద్ధంబు దక్కి**
**నిలిచి చూచుచునుండెను, నింగి యమర, వరుల హాహారవంబుల భరిత మయ్యె. 676**

**ప్రతి :** హరి= వరాహస్వామి; నిర్+ఆయుధుఁడు+ఐనన్= ఆయుధం లేనివాడు కాగా; సుర+అరి= దేవతాశత్రువు హిరణ్యాక్షుడు; సమరధర్మము= యుద్ధనీతిని; ఆత్మన్= తన యెదలో; తలఁచి= భావించి; యుద్ధంబు+తక్కి= కయ్యం చేయటం మానుకొని; నిలిచిచూచుచున్+ఉండెను= నిలబడి ఊరక చూస్తున్నాడు; నింగి= ఆకాశం; అమరవరుల= దేవతల; హా హా రవంబులన్= ఆర్తనాదాలచే; భరితము+అయ్యెన్= నిండింది–

**తా :** తన గదతాకిడికి వరాహస్వామిగద సంద్రంలో పడింది. స్వామి నిరాయుధుడయ్యాడు. రాక్షసుడు యుద్ధనీతిని స్మృతికి దెచ్చుకొని స్వామితో పోరాడటం మానుకొన్నాడు. అప్పుడాకాశంలో దేవతల ఆర్తనాదాలు బోరుమన్నాయి.

**క. సరసిజనేత్రుఁడు దనుజే, శ్వరు సంగరధర్మమునకు సమధికశౌర్య**
**స్ఫురణకుఁ దన చిత్తంబునఁ, గర మాశ్చర్యంబు నొంది కడఁక దలిర్పన్. 677**

**ప్రతి :** సరసిజనేత్రుఁడు= పద్మముల బోలిన కన్నులుగల యజ్ఞవరాహస్వామి; దనుజ+ఈశ్వరున్= రాక్షసనాయకుని; సంగరధర్మమునకున్= యుద్ధనీతికిని; సమ్+అధిక= మిక్కిలి ఎక్కువైన; శౌర్యస్ఫురణకున్= అతిశయమైన పరాక్రమానికిని; తనచిత్తంబునన్= తనమదిలో; కరము= మిక్కిలి; ఆశ్చర్యంబున్= అచ్చెరువును; ఒంది= పొంది; కడఁక= పూనిక; తలిర్పన్= పైకొనగా.

**తా :** ఆ రక్కసుని యుద్ధనీతికిని, వాని ప్రతాపాతిశయానికి వరాహస్వామి ఆశ్చర్యం చెందాడు. ఆయనలోకూడ ఉత్సాహం అతిశయించింది.

**మ. కుతలోద్ధర్త మనంబునందలఁచె రక్షోరాడ్వధార్థంబుగా**
**దితిసంతానకులాటవీమహితసందీప్తప్రభాశుక్రమున్,**
**సతతోద్యజ్జయశబ్దసమ్ముఖరభాస్వచ్చక్రమున్, సంతతా**
**శ్రితనిర్వక్రముఁ, బాలితప్రకటధాత్రీచక్రముం జక్రమున్. 678**

**ప్రతి :** కుతల+ఉత్+ధర్త= భూతలాన్నిపైకెత్తిన వరాహావతారుడు; దితిసంతానకుల= దితి బిడ్డల వంశమనే (రక్కసుల); అటవీ= అడవికి; మహిత= గొప్ప; సందీప్త= మిక్కిలి వెలుగుతున్న; ప్రభాశుక్రమున్= కాంతి అనే రేతః పుంజం గల్గినదియు (చక్రానికి విశేషణం); సతత= ఎడతెగని; ఉద్యత్= పైకెగసిన; జయశబ్ద= జయనినాదంచేత; సత్+ముఖర= మిక్కిలి ప్రతిధ్వనించే; భాస్వత్+చక్రమున్= కాంతిమంతంగా ప్రకాశిస్తున్న చక్రమును; సంతత= ఎల్లప్పుడు; ఆశ్రిత= శరణార్థులకు; నిర్వక్రమున్= తిరుగులేనిది (అంటే వారిని రక్షింపక వెనుకకు తిరుగనిది అని భావం); పాలిత= రక్షింపబడిన; ప్రకట= వెల్లడియైన; ధాత్రీచక్రమున్= భూమి అనెడి చక్రం కలది; అయిన; చక్రమున్= సుదర్శనచక్రాన్ని; మనంబునన్= మదిలో; రక్షస్+రాట్= రాక్షసేశ్వరుని; వధ+అర్థంబుగాన్= చావునిమిత్తం; తలఁచెన్= సంకల్పించాడు.

**తా :** యజ్ఞవరాహస్వామి భూమిని ఉద్ధరించినవాడు. ఇక రక్కసునిపై సుదర్శన చక్రాన్ని ప్రయోగించాలనుకొన్నాడు. ఆ చక్రం దితి సంతానమనే అడవిని కాల్చివేయగల కాంతిగలది. చూపరుల జయ నాదంతో ప్రతిధ్వనించే సూర్యమండల సదృశమైంది. నిరంతరం శరణుజొచ్చిన వారిని కాపాడగలది. విశ్వమంతటికి రక్షణ నివ్వగలది.

**వ. అదియునుం బ్రచండ మార్తాండ మండల ప్రభాపటల చటుల విద్యోతమానంబును, బటునట జ్వాలి కాపాస్త సమస్త కుపితారాతి బలాఖర్వ దుర్వార బాహాగర్వాంధకారంబును, నసహ్యకహ కహ నినదాధరీకృత సాగర ఘోషంబును, సకల దేవతాగణ జేగీయమానంబును, ననంత తేజో విరాజితంబును, నిజప్రభాపటల పూరిత బ్రహ్మాండ కటాహంబుననై రయంబునం జనుదెంచి, దనుజారి దక్షిణకర సరోజంబు నలంకరించిన నా శుభాంగుండు రథాంగపాణియై దివంబున నమరగణంబులు జయజయ శబ్దంబులు వలుక నసురవిభున కెదురు నడచిన. 679**

**ప్రతి :** ఆదియునున్= ఆ చక్రం కూడ; ప్రచండ= మిక్కిలి తీక్ష్ణమైన; మార్తాండమండల= సూర్యమండలంవంటి; ప్రభాపటల= కాంతిపుంజంచేత; చటుల= భయంకరమైన; విద్యోతమానంబును= ప్రకాశంగలదియు (మెరుపువలె మిరుమిట్లు గొల్పునదియు); పటు= మిక్కిలి; నటత్= ఎగిసిపడుతున్న; జ్వాలికా= మంటలచే; అపాస్త= తొలగింపబడిన; సమస్త= మొత్తం; కుపిత+అరాతి= కోపగించిన శత్రువుల; బల= పరాక్రమంగల; అఖర్వ= మొక్కవోని; దుర్+వార= అడ్డుపెట్టశక్యంకాని; బాహాగర్వ+అంధకారంబును= భుజగర్వమనే చీకటిగలదియు (చక్రమనుట); అసహ్య= సహింపరాని; కహకహనినద= కహకహ అనే ధ్వనిచేత; అధరీకృత= అణచబడిన; సాగరఘోషంబును= సముద్ర ధ్వని గలదియు; సకల= సమస్తమైన; దేవతాగణ= దేవతలసమూహంచేత; జేగీయమానంబును= 'జయ జయ' అని కొనియాడ బడినదియు; న+అంత= అంతులేని; తేజస్+విరాజితంబును= కాంతిచే వెల్గుచున్నదియును; నిజ= తన; ప్రభాపటల= కాంతి పుంజంచేత; పూరిత= నింపబడిన; బ్రహ్మ+అండ= బ్రహ్మాండమనెడి; కటాహంబునున్+ఐ= కుండగలది అయి; రయంబునన్= వేగంగా; చనుదెంచి= వచ్చి; దక్షిణకరసరోజంబును= పద్మంవంటి కుడిచేతిని; అలంకరించినన్= అలంకరించగా (చేరగా); ఆ; శుభ+అంగుండు=

మంగళకరమైన అవయవాలు గల వరాహస్వామి; రథాంగపాణి+ఐ= చక్రపాణియై; దివంబునన్= స్వర్గమందు; అమరగణంబులు= దేవగణాలు; జయ జయ శబ్దంబులు= జయముపొందు; జయముపొందు అనే నినాదాలు; పలుకన్= పలుకగా; అసురవిభునకున్= రక్షోనాథునికి (హిరణ్యాక్షునికి); ఎదురునడచినన్= ఎదురునడువగా.

**తా :** ఆ వరాహస్వామి ఎత్తిన సుదర్శన చక్రం మధ్యాహ్న సూర్యమండలకాంతివంటి కాంతితో మిరుమిట్లుగొల్పింది. దాని నుండి ఎగిసిన మంటలతాకిడికి మదించిన శత్రువుల పరాక్రమమనే చీకట్లు పటాపంచలయ్యాయి. సహింప నలవికాని దాని 'కహ కహ' శబ్దం సముద్రఘోషనే అణచినట్లయింది.

దాని వైభవాన్ని దేవతలెల్లరు ప్రస్తుతించారు. దాని కాంతి యింతింత అని చెప్పలేము. దాని తేజస్సు రోదసినంతటిని ఆవరించింది. అది అతి వేగంగా వచ్చి ఆ యజ్ఞవరాహస్వామి కుడిభుజాన్ని అలంకరించింది. అప్పుడాయన చక్రధారియై దేవతలెల్లరు 'జయశబ్దం' చేస్తుంటే రక్కసునికి ఎదురు నడిచాడు.

**క. పొడగని దనుజుఁడు పెదవులు, దడుపుచుఁబొలివోని బంటుతనమున బీరం**
**బుడుగక భీషణగదఁగొని, యడిచెన్ మఖమయవరాహు నమితోత్సాహున్. 680**

**ప్రతి :** దనుజుఁడు= రాక్షసుడు; పొడగని= వరాహరూపుని ఎదురుగా చూచి; పెదవులు తడుపుచున్= పెదవులను తడుపుకుంటూ; పొలి+పోని= ఉడుగనట్టి; బంటు తనమునన్= విజృంభణతో; బీరంబు= పరాక్రమాన్ని; ఉడుగక= వదలక; భీషణగదన్= భయాన్నిగొల్పేగదను; కొని= తీసికొని; అమిత+ఉత్సాహున్= మిక్కిలి ఉత్సాహంగలవాడైన; మఖమయవరాహున్= యజ్ఞవరాహాన్ని; అడిచెన్= కొట్టాడు.

**తా :** హిరణ్యాక్షుడు తనకెదురుగా వస్తున్న చక్రధారిని చూచి, వీరభటుని లాగ ఎదిరించి నిలిచి, ఒక పెద్దగదతో ఆ స్వామిని కొట్టాడు.

**క. త్రిదశారి దన్ను వ్రేసిన, గదఁ బదమునఁబోవఁదన్ని కమలాక్షుఁడు పెం**
**పొదవఁగ మనమున మోదము, గదురఁగ లేనగవు వదనకమలముఁబొదువన్. 681**

**ప్రతి :** త్రిదశ+అరి= సురవైరియగు రక్కసుడు; తన్నువ్రేసినగదన్= తనపై సారించిన గదను; కమల+అక్షుఁడు= తామరలవంటి కన్నులవాడైన శ్రీహరి; పదమునన్= కాలితో; పోవన్+తన్ని= తొలిగేట్టు తన్ని; పెంపు+ఒదవఁగన్= అతిశయం కల్గునట్లుగా; మనమునన్= మనస్సులో; మోదము= ఆనందం; కదురన్+కన్= ఉప్పతిల్లగా; లేనగవు= చిరునవ్వు; వదనకమలమున్= ముఖపద్మాన్ని; పొదువన్= అలంకరింపగా...

**తా :** హిరణ్యాక్షుడు సారించిన గదను వరాహస్వామి ఒక్కకాలితాపుతో పక్కకు నెట్టాడు. ఆయనలో ఆనందం పెల్లుబికింది. మొగంపై చిర్నగవు తాండవించింది.

**వ. ఇ వ్విధంబున గదఁబోవందన్ని యసురవిభునితో నిట్లనియె. 682**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ రీతిగా; గదన్= గదను; పోవన్+తన్ని= ప్రక్కకుతన్ని; అసురవిభునితోన్= రక్కసునితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** రక్కసుని గదను అలవోకగా కాలితో తన్ని వరాహస్వామి వానితో ఇలాగ అన్నాడు.

**చ. ఘనగదఁగేలఁబూని భుజగర్వ మెలర్పఁగ నన్ను సంగరా**
**వని నెదిరింతు రార! యనివారణ దైత్యకులేశ్వరాధమా!**
**యనవుడు వాఁడు నుబ్బి గద నంబుజనాభుని వ్రేసె,వ్రేసినం**
**దనుజవిభేది వట్టికొనెఁ దార్క్ష్యుఁడహీంద్రునిఁబట్టుకైవడిన్. 683**

ప్రతి : న+నివారణ= అడ్డుపెట్టరాని; దైత్యకుల+ఈశ్వర+అధమా= నీచరాక్షసుడా!; ఘనగదన్= గొప్పగదను; కేలన్+పూని= చేత తాల్చి; భుజగర్వము= భుజబల అహంకారం; ఎలర్పఁగన్= ఒప్పారునట్లుగా; సంగర+అవనిన్= యుద్ధభూమియందు; నన్నున్= నన్ను; ఎదిరింతు= ఎదుర్కొందువు; రార!= రా రమ్ము ఓరీ (నీచార్థకం); అనవుడు= అని స్వామి పిలువగా; వాఁడును= ఆ రాక్షసుడు కూడ; ఉబ్బి= ఉత్సాహపడి; గదన్= గదచేత; అంబుజనాభునిన్= బొడ్డునందు కమలం గల శ్రీహరిని; వ్రేసెన్= కొట్టెను; వ్రేసినన్= కొట్టగా; దనుజవిభేది= రక్కసులనణచే స్వామి; తార్క్ష్యుఁడు= గరుత్మంతుడు; అహి+ఇంద్రునిన్= సర్పరాజును; పట్టుకైవడిన్= పట్టుకొనే విధంగా; పట్టికొనెన్= పట్టుకొన్నాడు.

**తా :** "ఓరీ నీచరాక్షసా! గద చేతబుచ్చుకొని యుద్ధరంగంలో నన్నెదిరింప రారా?" అని వరాహస్వామి రక్కసుని పిలిచాడు. వా డా మాటకు తెగ గర్వించి తన గదని స్వామిపై ప్రయోగించాడు. అప్పుడా హరి గరుత్మంతుడు పామును పట్టుకొన్నట్లు పట్టుకొన్నాడు.

**క. దితిజుఁడు దన బల మప్రతి, హతతేజుండగు సరోరుహాక్షుని శౌర్యో**
**న్నతిమీఁదఁ బెట్టకుండుట, మతి నెఱిఁగియుఁ బెనఁగె దురభిమానము పేర్మిన్. 684**

ప్రతి : దితిజుఁడు= దితికొడుకైన హిరణ్యాక్షుడు; తనబలము= తన పరాక్రమం; న+ప్రతిహత= ఎదుర్కొన వీలుకాని; తేజుండు+అగు= తేజస్సుగలవాడైన; సరోరుహ+అక్షుని= పద్మనయనుడైన శ్రీహరియొక్క; శౌర్య+ఉన్నతిమీఁదన్= పరాక్రమాతిశయంపైన; పెట్టక+ఉండుట= మోపకుండటం ఎదిరించలేకపోవడం; మతిన్= తన మనస్సులో; ఎఱిఁగియున్= తెలిసికూడ; దుర్+అభిమానముపేర్మిన్= పనికిమాలిన గర్వంతో; పెనఁగెన్= కలబడ్డాడు.

**తా :** దితికుమారుడైన హిరణ్యాక్షునికి బలాఢ్యుడైన వరాహస్వామిని ఎదిరించడం సాధ్యం కాదని తెలుసు. అయినా వాడు గర్వంతో స్వామి నెదుర్కొన్నాడు.

**వ. అంత. 685**

ప్రతి : అంతన్= తర్వాత...

**తా :** అంతలో

**సీ. కాలానలజ్వలజ్జ్వాలా విలోల క, రాళమై పెంపొందు శూల మంది**
**సురవైరి యజ్ఞసూకరరూపధరుఁడైన, వనజనాభునిమీఁద వైవ నదియు**
**సద్ద్విజోత్తముమీఁదఁజపలతఁగావించు, నభిచారకర్మంబునట్ల బెండు**
**పడి పఱతేఁ గని పద్మోదరుఁడు దానిఁ, జక్రధారాహతిఁజండవిక్ర**

**తే. మమున నడుమన వడిఁద్రుంచె, నమరభర్త, మహితదంభోళిచే గరుత్మంతు పక్ష**
**మతిరయంబునఁద్రుంచిన గతిఁజెలంగి, సురలు మోదింప నసురులు సొంపు డింప. 686**

**ప్రతి :** సురవైరి= దేవతల విరోధియైన హిరణ్యాక్షుడు; కాల+అనల= ప్రళయకాలంనాటి అగ్గివలె; జ్వలత్= మండుతున్న; జ్వాలా= మంటలచే; విలోల= మిక్కిలి చలిస్తున్నదియు; కరాళము+ఐ= భయంకరమైనదియునై; పెంపు+ఒందు= అతిశయిస్తున్న; శూలము+అంది= ముమ్మొనవాలును పుచ్చుకొని; యజ్ఞసూకరరూపధరుఁడు+ఐన= యజ్ఞవరాహరూపాన్ని తాల్చిన వాడైన; వనజనాభుని మీఁదన్= పద్మం బొడ్డునగల శ్రీహరిపై; వైవన్= వేయగా; అదియున్= ఆ ఆయుధం; సత్+ద్విజ+ఉత్తముమీఁదన్= ఉత్తముడైన బ్రాహ్మణునిపైన; చపలతన్= చాపల్యంతో; కావించు= చేసేటటువంటి; అభిచారకర్మంబున్+అట్ల= హింసార్థమైన హోమకర్మవలె; బెండుపడి= నిస్సారమై, (చచ్చువడి); పఱతేన్= రాగా; పద్మ+ఉదరుఁడు= బొడ్డున తామరగల విష్ణువు; కని= చూచి; దానిన్= రక్కసునిశూలాన్ని; చండవిక్రమమునన్= భీకరమైన పరాక్రమంతో; చక్రధారాహతిన్= సుదర్శనచక్రపు వాదరదెబ్బతో; వడిన్= వేగంగా; నడుమనన్= మధ్యలోనే; అమరభర్త= దేవేంద్రుడు; మహితదంభోళిచేన్= మహిమగల వజ్రాయుధంచేత; అతిరయంబునన్= మిక్కిలివేగంగా; గరుత్మంతుపక్షము= గరుడుని రెక్కని; త్రుంచినగతిన్= ఖండించినట్లు; చెలంగి= చెలరేగి; సురలు= దేవతలు; మోదింపన్= సంతోషపడునట్లు; అసురులు= రక్కసులు; సొంపుడింపన్= వైభవం కోల్పోవునట్లుగా; త్రుంచెన్= ముక్కలు చేశాడు (హరి).

**తా :** అప్పుడా రక్కసుడు ప్రళయకాలాగ్నిజ్వాలవలె ధగధగ మెరుస్తున్న ఒక శూలం చేబూని యజ్ఞవరాహావతారుడైన శ్రీమహావిష్ణువుపై విసిరాడు – అది బ్రహ్మజ్ఞుడైన సద్బ్రాహ్మణునిపై ప్రయోగించే హింసాకర్మ యోగంవలె వ్యర్థమైపోయింది. అలా చచ్చుబడి వస్తున్న ఆ శూలాన్ని స్వామి 'ఇంద్రుడు వజ్రాయుధంచేత గరుడుని రెక్కల్ని ఛేదించినట్లు' ఒక్కవ్రేటున తన చక్రాయుధంచేత తుత్తునియలు చేశాడు.

**వ. అయ్యవసరంబున నయ్యసుర దనశూలంబు చక్రంబుచేత నిహతం బగుటంగని. 687**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; ఆ+అసుర= ఆ రక్కసుదు; తన శూలంబు= తన ముమ్మొనవాలు; చక్రంబుచేతన్= సుదర్శనంచేత; నిహతంబు+అగుటన్= పడిపోవుట; కని= చూచి...

**తా :** ఆ సమయంలో తనశూలం సుదర్శన చక్రంచేత పతనమైంది. రాక్షసుడది చూచాడు

**క. దితిజుఁడు రోషోద్ధతుఁడై, యతినిష్ఠురముష్టిఁబొడిచె హరి, నా లోకో**
**న్నతుఁ డొప్పెఁ గుసుమమాలా, హతి దిగ్గజరాజుఁబోలె నతిదర్పితుఁడై. 688**

**ప్రతి :** దితిజుఁడు= దితికుమారుడైన హిరణ్యాక్షుడు; రోష+ఉద్ధతుఁడు+ఐ= కోపంచే మిక్కిలి భయంకరుడై; హరిన్= విష్ణువును; అతి= మిక్కిలి; నిష్ఠుర= కఠినమైన; ముష్టిన్= పిడికిటిచేత; పొడిచెన్= కుమ్మాడు; ఆలోక+ఉన్నతుఁడు= ఆలోకేశ్వరుడైన ఆ హరి; అతిదర్పితుఁడు+ఐ= మిక్కిలి ఉద్రేకించినవాడై; కుసుమమాలాహతిన్= పూలమాలతాకిడిచేత; దిక్+గజరాజున్+పోలెన్= దిక్కరివలె; ఒప్పెన్= ప్రకాశించాడు.

**తా :** అప్పుడా హిరణ్యాక్షుడు కోపావేశంతో శ్రీహరిని ఒక్క పిడికిటిపోటు పొడిచాడు. పూలమాల తాకిడివల్ల గజరాజులా వరాహమూర్తి కలతచెందక విరాజిల్లాడు.

**మ. హరిమీఁదన్ దితిసంభవుండు ఘనమాయాకోట్లు పుట్టించినన్**
**ధరణీచక్రము భూరిపాంసుపటలధ్వాంతంబునంగప్పె, భీ**
**కరపాషాణపురీషమూత్రఘనదుర్గంధాస్థిరక్తావళుల్**
**గురిసెన్ మేఘము లభ్రవీథిని మహాక్షోభక్రియాలోలమై. 689**

**ప్రతి :** దితిసంభవుండు= దితికుమారుడగు హిరణ్యాక్షుడు; హరిమీఁదన్= శ్రీమహావిష్ణువుపైన; ఘనమాయాకోట్లు= గొప్పవైన కోటిమాయలు; పుట్టించినన్= కల్గింపగా; ధరణీచక్రమున్= భూచక్రాన్ని; భూరి= గొప్ప; పాంసుపటల= ధూళికణముల కుప్ప అనెడు; ధ్వాంతంబునన్= చీకటిచే; కప్పెన్= వ్యాపించింది; మేఘములు= మొయిళ్లు; అభ్రవీథిని= ఆకాశమార్గంలో; మహా= మిక్కిలి; క్షోభక్రియా= ఉపద్రవాన్ని కల్గించే పనియందు; లోలము+ఐ= ఆసక్తిగలదై; భీకర= భయంకరమైన; పాషాణ= రాళ్ళయొక్కయు; పురీష= పెంటకుప్పలయొక్కయు; మూత్ర= మూత్రముయొక్కయు; ఘనదుర్గంధ= చెడ్డవాసనలతోడి; అస్థి= ఎముకలయొక్కయు; రక్త= నెత్తుటియొక్కయు; ఆవళుల్= గుంపులు; కురిసెన్= వర్షించాయి.

**తా :** హిరణ్యాక్షుడు శ్రీయజ్ఞవరాహస్వామిపైన వేలకొలది మాయలు పన్నాడు. భూమినుండి లేచిన దుమ్ము చీకట్లు కమ్మినట్లయింది. ఆకసం నుండి మేఘాలు పెద్దపెద్దబండలు, పెంటప్రోవులు, మూత్రం, గబ్బుకొట్టే ఎముకలు, నెత్తురులను కురిపించాయి. అప్పుడు గొప్ప ఉపద్రవసూచకమైంది.

**వ. మఱియును. 690**

**ప్రతి :** మఱియునున్= ఇంకా

**తా :** ఇంతేకాదు.

**చ. తవిలి విముక్త కేశపరిధానము లుగ్రకరాళదంత తా**
**లువులును రక్తలోచనములుంగల భూతపిశాచడాకినీ**
**నివహము లంతరిక్షమున నిల్చి నిజాయుధపాణులై మహా**
**రవముగ యక్షదైత్యచతురంగబలంబులఁగూడి తోఁచినన్. 691**

**ప్రతి :** విముక్త= విరబోసుకొన్న; కేశ= వెంట్రుకలు; పరిధానములు= కట్టువస్త్రాలు; ఉగ్ర= వెరపు గొల్పే; కరాళ= భీకరమైన; దంత తాలువులును= పండ్లు మరియు దవడలును; రక్తలోచనములున్= ఎర్రనినెత్తురుకారుతున్న చూపులు; కల= కల్గినట్టి; భూత= భూతాలు; పిశాచ= దయ్యాలు; డాకినీ= స్త్రీపిశాచాలు; వీటి; నివహములు= గుంపులు; అంతరిక్షమునన్= ఆకాశమందు; నిల్చి= నిలబడి; నిజ= తమ; ఆయుధపాణులు+ఐ= శస్త్రాస్త్రాలు చేత బట్టినవారై; మహారవముగన్= పెడబొబ్బలతో; యక్ష= జక్కులు; దైత్య= రక్కసులు; చతుర్+అంగబలంబులన్= రథగజతురగపదాతులనే నాల్గు బలాలతో; కూడి= కలిసి; తోఁచినన్= కన్పించగా...

**తా :** ఆకాశంలో నిలబడిన భూతాలు, దయ్యాలు, స్త్రీ పిశాచాలు జుట్లు విరబోసుకొని, దిసమొలతో, కరకుకోరలతో, దవడలతో, ఎర్రని కండ్లతో దవళ్ళు తెరచుకొని శస్త్రాస్త్రాలు తాల్చివున్నారు. యక్షదైత్య చతురంగబలాలతో కూడి పెడబొబ్బలు పెడుతున్నారు.

**వ. అంత.** **692**

**ప్రతి :** అంతన్= అంతలో...

**తా :** ఆ తర్వాత

**క. త్రిసవనపాదుండగు నా, బిసరుహనేత్రుండు లోకభీకరమగు నా**
**యసురాధిపు మాయావి ని, రసనకరంబైన శస్త్రరాజముఁబనిచెన్.** **693**

**ప్రతి :** త్రిసవనపాదుండు= ప్రాతస్సవనము; మధ్యందినసవనము; సాయంసవనము అనే మూడు కాలాలలో యజ్ఞపాదుడు; అగు+ఆ బిసరుహనేత్రుండు= అయినట్టి ఆ పద్మనేత్రుడైన విష్ణువు; లోకభీకరము+అగున్= జగానికి భయాన్నిగొల్పే; ఆ; అసుర+అధిపున్= ఆ రక్కసుణ్ణి; మాయావిన్= మాయలుచేసేవానిని; నిరసనకరంబు+ఐన= తొలగింపదగిన; శస్త్రరాజమున్= శ్రేష్ఠమైన అస్త్రాన్ని; పనిచెన్= పంపాడు.

**తా :** ఆ వరాహేశ్వరుడు మూడు వేళల – (అనగా ఉదయ మధ్యాహ్న సాయం సంధ్యలలో) యజ్ఞపాదుడు. జగానికంతటికి భీతిని గొల్పే ఆ రక్కసుని మాయచేష్టల్ని అంతమొందించే ఒక అస్త్రాన్ని వానిపై విసిరాడు.

**క. ఆ చక్రభానుదీప్తి ధ, రా చక్రమునందు నిండి రయమున నమ్మా**
**యాచక్రము నడఁగించెను, నీచక్రముఁడైన యామినీచరు నెదురన్.** **694**

**ప్రతి :** ఆ, చక్రభానుదీప్తి= చక్రమనే సూర్యకాంతి; ధరాచక్రమునందున్= భూమండలమందు; నిండి= వ్యాపించి; రయమునన్= మిక్కిలి వేగంగా; నీచక్రముఁడు+ఐన= నీచప్రవృత్తిగలవాడైన; యామినీచరు+ఎదురన్= రాత్రివేళల సంచరించే రక్కసుని ఎదుట; ఆ+మాయాచక్రమున్= వాడు పన్నిన జిత్తులన్నింటిని; అడఁగించెను= అణచివేసింది (మాయని మాయం చేశాడని తాత్పర్యం).

**తా :** సూర్యకాంతివంటి కాంతి గల చక్రం భూమండలమంతా వ్యాపించి ఒక్కపెట్టున ఆ రాక్షసుడు పన్నిన మాయలన్నింటిని వాడు చూస్తుండగానే పటాపంచలు చేసింది.

**విశే :** ఈ పద్యంలో విష్ణుమాయా మహిమ అభివర్ణింపబడింది. దాన్నే యోగమాయ అంటారు. అది అనంతశక్తిసంపన్నమైంది. ఇతరమాయలేవీ దాని ముందు నిలువజాలవు. అది జీవాత్మ–పరమాత్మల మధ్యనున్న ఒకపొర. దాన్ని అనన్యభక్తిగల విష్ణుభక్తులు మాత్రమే ఛేదించగలరు. దాని ముందు రాక్షసమాయ లేవీ నిలువజాలవు.

**వ. అంత నిక్కడ.** **695**

**ప్రతి :** అంతన్= అనంతరం; ఇక్కడన్= ఈ లోకంలో...

**తా :** తర్వాత ఇక్కడ దితి ఇంట ఏమి జరిగిందో చెపుతున్నాడు.

**క. దితి తన విభువాక్యంబుల, గతి దప్పద యనుచుఁ దలఁపఁగాఁ జన్నుల శో**
**ణితధార లొలికె రక్షః, పతి యగు కనకాక్షు పతన భావము దోఁపన్.** **696**

**ప్రతి :** దితి= కశ్యపునిభార్య అయిన దితి; తన విభువాక్యంబుల= తన భర్తమాటల; గతి= తీరు; తప్పదు+అ= పొలివోదు; అనుచున్= అనుకొంటూ; తలఁపన్+కాన్= ఆలోచింపగా; రక్షస్+పతి+అగు= రాక్షసాధిపుడైన; కనక+అక్షున్= బంగారుకన్నుల (హిరణ్యాక్షుని) వాని; పతనభావము= చావు; తోఁపన్= కలుగగా; చన్నులన్= వక్షోజాలనుండి; శోణితధారలు= రక్తధారలు; ఒలికెన్= స్రవించాయి.

**తా :** ఇక్కడ దితి తన భర్తయైన కశ్యపుని పల్కులు స్మృతికి దెచ్చుకొంది. తన కుమారుడైన హిరణ్యాక్షుని చావు ఆమె కళ్ళకు కట్టినట్లయింది. అప్పుడామె పయోధరాల నుండి నెత్తుటి చారికలు స్రవించాయి. (కన్నీటికి మారు, లేదా పాలకు బదులు– నెత్తురు స్రవించిందని భావం. (ఇది దితి దుఃఖాన్ని ప్రతిబింబించింది).

**వ. అయ్యవసరంబున నసురవిభుండు దన చేసిన మాయాశతంబులు గృతఘ్నునకుం గావించిన యుపకారంబులుంబోలె హరిమీఁదఁ బనిసేయక విఫలంబు లయినం బొలివోవని బంటుతనంబునఁ బుండరీకాక్షుఁ జేరం జనుదెంచి బాహుయుగళంబు సాఁచి పూఁచి పొడిచి రక్షోవైరివక్షంబుఁ బీడించిన నయ్యధోక్షజుండు దప్పించుకొని తలంగినం జెలంగి దైత్యుండు నిష్ఠురంబగు ముష్టింబొడిచిన నసురాంతకుండు మిసిమింతుండు గాక రోషభీషణాకారంబున వాసవుండు వృత్రాసురుం దెగటార్చిన చందంబున వజ్రివజ్రసన్నిభంబగు నఱచేతం గఱకుటసురకటితటంబుఁ జటులగతి వ్రేసిన నా హిరణ్యాక్షుండు దిర్దిరందిరిగి యుదస్తలోచనుండై సోలి యెట్టకేలకు నెదుర నిలువంబడె, నంత. 697**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= దితి రొమ్ముపై నెత్తురు చారికలు కట్టిన సమయంలో; అసురవిభుండు= రాక్షసనాయకుడు; తన+చేసిన= స్వయంగా తానుకావించినట్టి; మాయాశతంబులు= నూర్లకొలది మోసాలు; కృతఘ్నునకున్= చేసిన మేలుమరచేవానికి; కావించిన= చేసిన; ఉపకారంబులున్+పోలెన్= ఉపకారాలవలె; హరిమీఁదన్= విష్ణువుపైన; పని+చేయక= ఉపయోగపడక; విఫలంబులు+ఐనన్= ఫలితం లేనివి కాగా; పొలి+పోవని= వీగిపోనట్టి; బంటుతనంబునన్= వీరసైనికునివలె; పుండరీక+అక్షున్= తెల్లదామరలవంటి కన్నులుగల హరిని; చేరన్+చనుదెంచి= దగ్గరకు వచ్చి; బాహుయుగళంబు= చేతులజంటను; చాఁచి= చాపి; పూఁచి= యత్నించి; పొడిచి= క్రుమ్మి; రక్షస్+వైరి= దనుజుల శత్రువైన శ్రీహరి; వక్షంబున్= రొమ్మును; పీడించినన్= నొప్పింపగా; ఆ+అధోక్షజుండు= ఆ హరి; తప్పించుకొని= వ్రేటుపడకుండ; తలంగినన్= ప్రక్కకు పోగా; చెలంగి= విజృంభించి; దైత్యుండు= రక్కసుడు; నిష్ఠురంబు+అగు= కఠినమైన; ముష్టిన్= పిడికిలిచే; పొడిచినన్= పొడవగా; అసుర+అంతకుండు= రాక్షసులపాలిటి యముడైన శ్రీహరి; మిసిమింతుండు= అలసిపోయినవాడు; కాక= కాకుండ; రోష= కోపంచేత, భీషణ= వెరపుగొల్పు; ఆకారంబునన్= స్వరూపంతో; వాసవుండు= ఇంద్రుడు; వృత్ర+అసురన్= వృత్రుడు అనే రక్కసుణ్ణి; తెగటార్చిన చందంబునన్= నరికినట్లు; వజ్రి= ఇంద్రుని; వజ్రసన్నిభంబు+అగు= వ్రజాయుధంతో సమానమైన; అఱచేతన్= పిడికిలితో; కఱకు+అసుర= కఠినుడైన రాక్షసుని; కటితటంబున్= మొలభాగాన్ని; చటులగతిన్= మిక్కిలివేగంతో; వ్రేసినన్= కొట్టగా; ఆ, హిరణ్య+అక్షుండు= బంగారుచూపుల వాడైన రక్కసుడు; దిర్దిరన్= గిరగిరమని; తిరిగి= చుట్టి; ఉదస్తలోచనుండు+ఐ= తొలగింపబడిన కన్నులుగలవాడై; సోలి= తూలి; ఎట్టకేలకున్= చివరికి; ఎదురున్= స్వామిసన్నిధిలో; నిలువన్+పడెన్= నిల్చుకొన్నాడు; అంతన్= ఆ తర్వాత...

**తా :** ఆ సమయంలో హిరణ్యాక్షుడు ప్రయోగించిన వందలకొలది మాయలు, చేసిన మేలు మరిచే వానికి చేసిన ఉపకారాలవలె శ్రీహరి పైన పనిచేయలేదు. నిష్ఫలమయ్యాయి. అయినప్పటికి ఆ అసుర పట్టువీడని వీరయోధునిలా

హరిచెంతకు వచ్చి రెండుచేతులు సాచి ఆయన రొమ్ముమీద గుద్దాడు. అయితే ఆయన తప్పించుకొని ప్రక్కకు పోగా ఆ రక్కసుడు ఒక్క పిడిగుద్దు గుద్దాడు. కాని ఆ దనుజవైరి అలకచెందక భయంకరరూపంతో వజ్రతుల్యమైన తన అరచేత వాని మొలపై ఒక చరపు చరిచాడు. అంతట వాడు గిరగిర తిరిగి చూపుకోల్పోయి సోలిపడబోయాడు. ఎట్లో తేరుకొని చివరకు స్వామి ఎదుట నిలబడ్డాడు.

**క. దిట చెడి లోఁబడె దైత్యుఁడు, సటికిన్, దంష్ట్రావిభిన్నశత్రుమహోర**
**స్తటికిన్, ఖరఖురపుటికిం, గటితటహతకమలజాండఘటికిం, గిటికిన్. 698**

**ప్రతి :** దైత్యుఁడు= దితి సంతానం-హిరణ్యాక్షుడు; దిట= దిట్టతనం; చెడి= ఉడిగి; దంష్ట్రా= కోరచేత; విభిన్న= చీల్చబడిన; శత్రు= విరోధి; మహా+ఉరస్+తటికిన్= ఒడ్డువంటి గొప్ప రొమ్ముగలవాడును; ఖర= వాడియైన; ఖురపుటికిన్= దొప్పవంటి గిట్టలుగలవాడును; కటితట= మొలనూలియందు; హత= కొట్టబడిన; కమలజ+అండ= బ్రహ్మాండమనే కుండగలవాడును; సటికిన్= జూలు గలవాడును; నైన; కిటికిన్= పందికి (యజ్ఞవరాహస్వామికి); లోన్+పడెన్= లోబడినాడు.

**తా :** తనకోరలతో హిరణ్యాక్షుని రొమ్మును చీల్చినవాడును, వాడియైన గిట్టలుగలవాడును, బ్రహ్మాండమనే కుండను బ్రద్దలు కొట్టగలవాడును, జూలు గలవాడునునైన ఆ వరాహావతారునికి బలముడిగిన రక్కసుడు లొంగిపోయాడు.

**వ. ఇట్లు లోఁబడిన. 699**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా రక్కసుడు; లోన్+పడినన్= లొంగిపోగా

**తా :** ఇలా హిరణ్యాక్షుడు వరాహస్వామికి లొంగిపోగా.

**అవ :** అలా ఆ దైత్యుడు లొంగిపోయిన తర్వాత

**మ. దివి నింద్రాదులు సంతసింప హరి మొత్తెం గర్ణమూలంబునం**
**బవిసంకాశకఠోరహస్తమున శుంభల్లీలమై దాన దా**
**నవలోకేశుఁ డుదస్తనేత్రుఁ డగుచున్ దైన్యంబు వాటిల్లఁగా**
**భువిమీఁదన్ వడిఁగూలె మారుతహతోన్మూలావనీజాకృతిన్. 700**

**ప్రతి :** దివిన్= ఆకాశాన; ఇంద్ర+ఆదులు= ఇంద్రుడుమున్నగు దేవతలు; సంతసింపన్= సంతోషపడునట్లు, హరి= శ్రీమహావిష్ణువు; శుంభత్+లీలమైన్= ప్రకటితమైన విలాసంతో; పవిసంకాశ= వజ్రాయుధంతో సమానమైన; కఠోరహస్తమునన్= కఠినమైన చేతితో; కర్ణమూలంబునన్= గూబపైన; మొత్తెన్= గ్రుద్దాడు; దానన్= అందువల్ల (మొత్తటంవల్ల); దానవలోక+ఈశుఁడు= రాక్షసకుల నాయకుడు; దైన్యంబు+వాటిల్లఁగాన్= అలత కలుగగా; ఉదస్తనేత్రుఁడు+అగుచున్= కోల్పోయిన చూపులుగలవాడై; మారుత= గాలిచేత; హత= కొట్టబడి; ఉత్+మూల= పెళ్లగించబడిన; అవనీజ+ఆకృతిన్= చెట్టు మాదిరి; భువిమీఁదన్= నేలపైన; వడిన్= వేగంగా; కూలెన్= పడ్డాడు.

**తా :** శ్రీహరి తన వజ్రతుల్యమైన చేతితో రక్కసుని గూబ అదరగొట్టాడు. అది చూచి ఇంద్రాదులు సంతోషించారు. అప్పుడా హిరణ్యాక్షుడు కండ్లు తేలవేసి దీనుడై పెనుగాలి తాకిడికి కూకటివ్రేళ్ళతో కుప్పకూలే చెట్టులాగ నేలపై రాలిపడ్డాడు.

**విశే :** యజ్ఞవరాహావతారక్రియ ఇంతటితో ముగిసింది. సనకాదులచే శాపగ్రస్తులైన జయ విజయులు భూలోకంలో రాక్షసులై జన్మించవలసి వచ్చింది. శ్రీహరి అనుగ్రహంవల్ల ఆ యిర్వురు ఆయనకు విరోధులుగా మూడు జన్మలెత్తి పోరు సలపాలి. హిరణ్యాక్ష, హిరణ్యకశిపుల వధతో ఒక రాక్షస జన్మ ముగిసిపోతుంది. స్వామి వరాహావతారమెత్తి హిరణ్యాక్షుని వధించాడు. ఇక నరసింహాకృతి తాల్చి హిరణ్యకశిపుని చంపవలసి ఉంది– అంతటితో జయ విజయులకు ఒక్క రాక్షసజన్మ సమాప్తమౌతుంది.

**క. బుడ బుడ నెత్తురు గ్రక్కుచు, వెదరూపము దాల్చి గ్రుడ్లు వెలి కుఱుక, నిలం**
**బడి పండ్లు గీటుకొనుచును, విడిచెంబ్రాణములు దైత్యవీరుండంతన్. 701**

**ప్రతి :** అంతన్= ఆ తర్వాత; దైత్యవీరుండు= పరాక్రమశాలియైన రాక్షసుడు; బుడబుడ= ఈ విధమైన ధ్వనితో; నెత్తురు+క్రక్కుచున్= రక్తం కారుతుండగా; వెదరూపము= వికారమైన ఆకారాన్ని; తాల్చి= ధరించి; గ్రుడ్లు= కళ్ళు; వెలికిన్+ ఉఱుకన్= బయటకు ఉబికి కనపడగా; నిలంబడి= నిల్చికొని; పండ్లు= దంతాలు; గీటుకొనుచును= పటపటకొరుకుతూ; ప్రాణములు= అసువులు; విడిచెన్= పాసెను.

**తా :** తర్వాత హిరణ్యాక్షుడు హరిదెబ్బకు నెత్తురు కారుతుంటే, వికారరూప మెత్తి, కనుగ్రుడ్లు పైకి ఉబికి కనపడగా, నిలబడి పండ్లు పటపట కొరుకుతూ పడి చచ్చాడు.

**తే. పడిన దనుజేశ్వరునిఁజూచి పద్మసంభ, వాది దివిజులు వెఱఁగంది రాత్మలందు**
**నితఁడు వొందుట యెట్లొకో యీ యవస్థ, నని తలంచుచు మఱియు నిట్లనిరి వరుస. 702**

**ప్రతి :** పద్మసంభవ= కమలమందు పుట్టిన బ్రహ్మ; ఆది= మొదలైన; దివిజులు= దేవతలు; పడిన= నేలకూలిన; దనుజ+ఈశ్వరునిన్= రాక్షసేంద్రుని; చూచి= కని; ఇతఁడు= ఈ హిరణ్యాక్షుడు; ఈ+అవస్థన్= ఈ దుర్దశను పొందుట; ఎట్లు+ఒకో= ఎట్లాయెనో గదా; అనితలంచుచున్= అనుకొంటూ; ఆత్మలందున్= మనసుల్లో; వెఱగు+అందిరి= అచ్చెరువందారు; వరుసన్= క్రమంగా; మఱియున్= ఇంకా; ఇట్లు+అనిరి= ఈ విధంగా అన్నారు.

**తా :** నేలపైకూలిన హిరణ్యాక్షుని చూచి బ్రహ్మాదిదేవతలు 'వీనికి ఏమి యీ దురవస్థ?' అని తలంచి ఆశ్చర్యపడ్డారు. తర్వాత ఇలా అన్నారు.

**మ. వరయోగీంద్రులు యోగమార్గముల నెవ్వానిన్ మనోవీథి సు**
**స్థిరతన్ లింగశరీరభంగమునకై చింతింతు, రా పంకజో**
**దరు పాణ్యాహతిఁదన్ముఖాంబురుహమున్ దర్శించుచుంజచ్చె దు**
**ర్భరితోత్తంసుని దైత్యవల్లభుని సౌభాగ్యంబు దా నెట్టిదో. 703**

**ప్రతి :** వరయోగి+ఇంద్రులు= శ్రేష్ఠులైన ఋషులు; యోగమార్గములన్= యోగరీతులతో; ఏ+వానిన్= ఏ స్వామిని; సుస్థిరతన్= దృఢంగా; మనస్+వీథిన్= డెందమందు; లింగశరీరభంగమునకై= భౌతిక శరీరం త్యజించడానికి; చింతింతురు= ఆలోచిస్తారో; ఆ; పంకజ+ఉదరు= పద్మం కడుపునందుగల శ్రీహరి; పాణి+ఆహతిన్= చేతిదెబ్బతో; తద్+ముఖ+ అంబురుహమున్= ఆ స్వామి ముఖపద్మాన్ని; దర్శించుచున్= చూస్తూ; చచ్చెన్= చనిపోయాడు; దుర్+భరిత= భరింపశక్యం

కాని; ఉత్తంసుని= గొప్పవాడైన; దైత్యవల్లభుని= రాక్షసేంద్రుని; సౌభాగ్యము= వైభవం; తాన్= స్వయంగా; ఎట్టిది+ఓ= ఎలాంటిదో గదా! (గొప్ప అదృష్టం గలదని తాత్పర్యం)

**తా :** పరమయోగులు యోగమార్గంలో తమ పాంచభౌతికదేహాన్ని ఆ శ్రీమన్నారాయణుని స్మరిస్తూ పరిత్యజించాలని భావిస్తారు. అయితే ఇక్కడ ఈ రక్కసుడు ఆ స్వామి పిడికిటి దెబ్బతో చచ్చి ఆయన ముఖసందర్శన చేస్తూ ప్రాణత్యాగం చేశాడు. ఆతని మహిమ ఎంత గొప్పదో అని బ్రహ్మాదులు ఆశ్చర్యపడ్డారు.

**చ. సమమతి వీరు దైత్యకులశాసను పారిషదుల్, మునీంద్ర శా**
**పమున నికృష్టజన్మమునఁబైకొని పుట్టియు నేఁడు విష్ణుచే**
**సమయుటఁ జేసి మీఁదనగు జన్మమునన్ జలజాక్షు నిత్య వా**
**సమున వసింతు రెన్నఁటికిఁజావును బుట్టువు లేవు వీరికిన్. 704**

**ప్రతి :** సమమతిన్= ఎల్లరియెడ సమానమైన బుద్ధితో; వీరు= ఈ రాక్షసులు; దైత్యకులశాసను= రక్కసులను శాసించే విష్ణువుయొక్క; పారిషదుల్= (వైకుంఠ) సభలోనివారు; ముని+ఇంద్ర= సనకాదిమునీశ్వరుల; శాపమునన్= శాపముచేత; నికృష్టజన్మమునన్= నీచమైన జన్మయందు; పైకొని= పెనగొని; పుట్టియున్= జన్మించికూడ; నేఁడు= ఈదినం; విష్ణుచేన్= శ్రీహరిచేతనే; సమయుటన్+చేసి= చంపబడుటవల్లనే; మీఁదన్= ఇకపైన; అగుజన్మమునన్= కాబోయే పుట్టుక యందు; జలజ+అక్షు= పద్మనయనుడైన శ్రీమహావిష్ణువుయొక్క; నిత్యవాసమునన్= నిరంతరనివాసమందే (వైకుంఠమందు); వసింతురు= నివసిస్తారు; ఎన్నఁటికిన్= మరెప్పటికైనను; చావును+పుట్టువును= జననమరణాలు; వీరికిన్= ఈ రాక్షసులకు; లేవు= ఉండవు.

**తా :** ఆశ్చర్యంతో దేవతలిలా అనుకొన్నారు –

ఈ రక్కసులు మనస్సులో సమభావం గలవారు. సనకాదుల శాపంవల్ల ఇలా దౌర్భాగ్యజన్మని ఎత్తారు. ఇప్పుడు విష్ణువువల్ల వీరికి చావు కల్గింది. తర్వాతి జన్మల్లో వీరు నిరంతరం ఆ శ్రీహరి నిత్యవాసమైన వైకుంఠంలోనే ఉంటారు. ఇక వీరికి చావుపుట్టుక లుండవు.

**క. అని వెఱఁగు నొంది పావన, తనువొందిన యట్టి వికచతామరసాక్షు**
**న్ననిమిష ముని యోగిజనా, వనదక్షున్ దనుజకరటి వరహర్యక్షున్. 705**

**ప్రతి :** అని= యోగులట్లా అనుకొని; వెఱఁగున్+ఒంది= ఆశ్చర్యపడి; పావనతనువు= పవిత్రమైన శరీరం; ఒందిన+అట్టి= పొందినట్టి; వికచ= విచ్చిన; తామరస= కమలంవంటి; అక్షున్= కన్నులుగలవాడును; అనిమిష= రెప్పపాటులేనివారైన దేవతలు; ముని= మునులు; యోగిజన= యోగీశ్వరులు మొదలగువారి; అవన= సంరక్షణయందు; దక్షున్= సమర్థుడైన వాడును; దనుజకరటి= రక్కసులనే ఏనుగులకు; వర= శ్రేష్ఠమైన; హర్యక్షున్= సింహం వంటివాడు అయిన శ్రీమహావిష్ణువును...

**తా :** ఆ యోగీంద్రులు అలా రక్కసుని అదృష్టాన్ని గాంచి ఆశ్చర్యచకితులయ్యారు. తర్వాత పవిత్రదేహం ధరించినవాడును, వికసించిన కమలాలవంటి కన్నులు గలవాడును, దేవతలు, మునులు, యోగులు మొదలైన వారిని రక్షించేవాడును, రక్కసులనే ఏన్గులకు సింహసమానుడును నైన శ్రీమన్నారాయణుని చూచారు.

**వ. కనుంగొని.** **706**

**ప్రతి :** కనుంగొని= హరినిచూచి...

**తా :** హిరణ్యాక్ష వధను చేసిన శ్రీహరిని చూచి,

**చ. వనజదళాక్ష! యీ జగతివారల మర్మము లీ వెఱింగి యీ**
**సునఁబగఁబట్టు నీ దివిజసూదనుఁజంపితి గాన యింక శో**
**భన మగునంచు హస్తములు ఫాలములంగదియించి యందఱున్**
**వినమితులై నుతించిరి వివేకవిశాలునిఁబుణ్యశీలునిన్.** **707**

**ప్రతి :** వనజదళ+అక్ష= కమలములవంటికన్నులుగలస్వామీ!; ఈ, జగతివారల= భూలోకవాసుల; మర్మములు= రహస్యాలు; ఈవు= నీవు; ఎఱింగి= తెలిసి; ఈసునన్= అసూయతో; పగన్+పట్టున్= విరోధించినట్టి; ఈ దివిజసూదనున్= ఈ సురవైరిని; చంపితి= చంపావు; కానన్= అందువల్ల; ఇంకన్= ఇకమీదట; శోభనము= శుభం; అగున్+అంచున్= కాగలదనుచు; అందఱున్= ఎల్లరు; హస్తములు= చేతులు; ఫాలములన్= నొసళ్ళపై; కదియించి= చేర్చి; వివేకవిశాలునిన్= గొప్పజ్ఞానం గలవాడైన; పుణ్యశీలునిన్= పవిత్రమైన నడవడిగల శ్రీహరిని; వినమితులు+ఐ= తలలు వంచినవారై; నుతించిరి= స్తుతించారు.

**తా :** "పద్మాక్షా! ఈ భూలోకవాసుల మాయామర్మాలు నీకు బాగా తెలుసు. అసూయతో పగబట్టిన ఈ హిరణ్యాక్షుణ్ణి చంపావు. ఇకమీదట అందరికీ శుభం కలుగుతుంది." అని దేవతలందరు తమ నొసళ్ళపై చేతులుంచి గొప్పజ్ఞానంకలవాడు మరియు పుణ్యాత్ముడు అయిన శ్రీమన్నారాయణుని వినయంతో స్తుతించారు.

**వ. అంత.** **708**

**ప్రతి :** అంతన్= అటు తర్వాత...

**తా :** ఎల్లదేవతలు, మునులు, ఋషులు హరిని సుతించిన తర్వాత

**చ. సవనవరాహమూర్తి సురశాత్రవుఁద్రుంచినమీఁద భారతీ**
**ధవముఖదేవతామునికదంబము దన్ను నుతించునట్టి సం**
**స్తవమున కాత్మలోనఁబ్రమదంబును బొంది సమగ్రమంగళో**
**త్సవము దలిర్ప నందఱఁబ్రసాదవిలోకనమొప్పఁజూచుచున్.** **709**

**ప్రతి :** సవనవరాహమూర్తి= యజ్ఞవరాహరూపధారియైన శ్రీమహావిష్ణువు; సురశాత్రవున్= దేవతల శత్రువును (హిరణ్యాక్షుని); త్రుంచినమీఁదన్= చంపినతర్వాత; భారతీధవ= సరస్వతీదేవిభర్తయైన బ్రహ్మ; ముఖ= మొదలైన; దేవతా= దేవతల; ముని= మౌనుల; కదంబము= సమూహం; తన్నున్= శ్రీహరిని; నుతించున్+అట్టి= పొగడుచున్నట్టి; సంస్తవమునకున్= స్తోత్రానికి; ఆత్మలోనన్= మనస్సులో; ప్రమదంబును+పొంది= సంతోషాన్ని పొంది; సమగ్ర= కొరతలేని; మంగళ= శుభకరమైన; ఉత్సవము= వేడుక; తలిర్పన్= ఒప్పగా; అందఱన్= అక్కడ చేరిన వారెల్లరిని; ప్రసాదవిలోకనము= అనుగ్రహంతో కూడిన చూపు; ఒప్పన్= ఒప్పారునట్లు; చూచుచున్= కనుగొంటూ...

**తా :** యజ్ఞవరాహరూపధారియైన శ్రీహరి రక్కసుని చంపాక, బ్రహ్మ, మొదలైన దేవతలు, మునులు ఆయన్ని ప్రస్తుతిస్తుంటే తన మనస్సులో ఆయన మహానంద మొందాడు. అందరికి ఉల్లాసం కల్గేట్లు అనుగ్రహంతో చూశాడు.

**చ. అరిగె వికుంఠధామమున క మ్మహితోత్సవసూచకంబుగా**
**మొరసె సుపర్వదుందుభు లమోఘములై, ధరణీతలంబునం**
**గురిసెఁ బ్రసూనవృష్టి, శిఖికుండము లెల్లెడఁ దేజరిల్లె, భా**
**స్కరశశిమండలంబులు నిజద్యుతితో వెలుఁగొందె నత్తఱిన్. 710**

**ప్రతి :** ఆ+తఱిన్= ఆ సమయంలో; శ్రీమహావిష్ణువు; ఆ మహిత+ఉత్సవ= ఆ గొప్పవేడుకకు; సూచకంబుగాన్= గుర్తుగా; వికుంఠధామమునకున్= వైకుంఠస్థానానికి; అరిగెన్= వెళ్ళాడు; సుపర్వదుందుభులు= దేవతలభేరీధ్వనులు; అమోఘములు+ఐ= మొక్కవోకుండా; మొరసెన్= మ్రోగాయి; ప్రసూనవృష్టి= పూలవాన; ధరణీతలంబునన్= నేలపై; కురిసెన్= కురిసింది; ఎల్లెడన్= అంతట; శిఖికుండములు= అగ్నిగుండాలు; తేజరిల్లెన్= వెలిగాయి; భాస్కర= సూర్యుని; శశి= చంద్రుని; మండలంబులు= గోళాలు; నిజద్యుతితోన్= సహజ కాంతితో; వెలుఁగు+ఒందెన్= ప్రకాశించాయి.

**తా :** అదొక గొప్పవేడుక. దానికి గుర్తుగా అప్పుడు విష్ణువు వైకుంఠపురానికి తరలి వెళ్ళాడు. దేవతలభేరులు మున్మరంగా మ్రోగాయి. నేలపై పూలజల్లు కురిసింది. అగ్నిగుండాలు ధగధగ వెల్గాయి. సూర్యచంద్రమండలాలు దేదీప్యమానంగా ప్రకాశించాయి.

**క. అని యీ పుణ్యచరిత్రము, వనరుహసంభవుఁడు త్రిదివవాసులకుం జె**
**ప్పిన యది మైత్రేయుఁడు విదు, రున కెఱిఁగించిన విధంబు రూఢము గాఁగన్. 711**

**ప్రతి :** అని= ఇట్లు చెప్పి; ఈ, పుణ్యచరిత్రము= పవిత్రమైన వృత్తాంతం; వనరుహసంభవుఁడు= పద్మోద్భవుడైన బ్రహ్మ; త్రిదివవాసులకున్= స్వర్గవాసులైన దేవతలకు; చెప్పిన+అది= చెప్పినట్టికథ; మైత్రేయుఁడు= ఈ పేరుగల మహర్షి; విదురునకున్= విదురునికి; ఎఱింగించిన= తెల్పినట్టి; విధంబు= వైఖరి; రూఢము+కాఁగన్= స్పష్టంకాగా...

**తా :** ఇది పవిత్రమైన కథ. బ్రహ్మ దీన్ని దేవతలకు చెప్పాడు. అదే కథని మైత్రేయుడు విదురునికి చెప్పటంవల్ల ప్రఖ్యాతమైంది.

**క. శుకయోగి పరీక్షిత్తున, కకుటిలమతి నెఱుఁగఁజెప్పె నని సూతుఁడు శౌ**
**నకముఖ్యులైన మునివరు, లకుఁ దెలియఁగఁ జెప్పె మఱియు లాలన మొప్పన్. 712**

**ప్రతి :** శుకయోగి= శుకుడనే యోగి; పరీక్షిత్తునకున్= పరీక్షిన్నరేంద్రునికి; న+కుటిలమతిన్= పవిత్రమైన మనస్సుతో; ఎఱుఁగన్+చెప్పెన్+అని= తెలియజేశాడు అని; సూతుఁడు= ఈ పేరుగలకథకుడు; శౌనకముఖ్యులు+ఐన= శౌనకుడు మొదలైనట్టి; మునివరులకున్= ఋషులకు, మఱియున్= ఇంకా; లాలనము+ఒప్పన్= మిక్కిలికుతూహలం కల్గేట్టు; తెలియఁగన్= తెలిసేట్లు; చెప్పెన్= చెప్పాడు.

**తా :** ఈ కథను శుకమహర్షి మంచిమనస్సుతో పరీక్షిన్మహారాజుకు చెప్పాడు. సూతుడనే పౌరాణికుడు శౌనకాది మునులకు ఇదే కథని మనోజ్ఞంగా విన్పించాడు.

**విశే : శుకుఁడు :** వ్యాసుడు అగ్నిహోత్రం చేయటానికి 'అరణి' మథిస్తుండగా 'ఘృతాచి' ఆయన కంట పడింది. ఆయన కామగోచరత్వం పసిగట్టి ఆమె భయపడి పరుగెత్తింది. ఒక శుకమై అక్కడే నిరీక్షిస్తుండింది. మోహాయత్తుడైన వ్యాసునికి ఇంద్రియస్ఖలనమైంది. శుక్లం జారి అరణిపై పడింది. అందుండి ఒక బాలుడు పుట్టాడు. వ్యాసుడు మోహితుడై ఆ శుకాన్ని చూస్తుండగా రేతస్సు జారిపడింది కాబట్టి ఆ బాలునికి కొంత శుకత్వమేర్పడింది – అతడు 'శుకుడ'య్యాడు.

అలా జన్మించిన శుకునికి ఆకాశంనుండి దండకమండలాలు వచ్చాయి. ఈతడు తండ్రి వద్ద వేదశాస్త్రాలు చదివాడు. తండ్రి ఆదేశంపై 'ముక్తిమార్గం' తెలుసుకోవటానికి జనకమహారాజు నాశ్రయించాడు. ఆయన వద్ద కొంత కాలం విద్య నభ్యసించాడు. నారదుడు కూడ శుకునికి కొంత బోధచేశాడు. శుకుడు ముక్తసంగుడు. నిత్యదిగంబరుడు, విగతవస్త్రలై జలకాలాడుతున్న సుందరులను చూచినప్పటికి ఆయన చలించడు.

**వ. ఇవ్విధంబున మైత్రేయుండు సెప్పిన విని విదురుండు సంతసిల్లె నని. 713**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ రీతిగా; మైత్రేయుండు= ఈ పేరుగలముని; చెప్పినన్= కథచెప్పగా; విని= ఆలకించి; విదురుండు= విదురుడు; సంతసిల్లెన్= ఆనందించాడు; అని...

**తా :** ఆ విధంగా మైత్రేయముని విదురునికి కథను చెప్పగా విని ఆయన సంతోషించాడు.

**క. అనఘంబగు నీ చరితము, వినినఁబఠించిన లభించు విశ్రుతకీర్తుల్**
**వనజోదరు పదభ క్తియుఁ, మునుకొని యిహపరసుసౌఖ్యములు జనములకున్. 714**

**ప్రతి :** అనఘంబు+అగున్= పాపరహితమైన; ఈ చరితము= ఈ కథ, వినినన్= విన్నా; పఠించినన్= చదివినా, జనములకున్= ప్రజలకు; ముని+కొని= ముందుగా; వనజ+ఉదరు= పద్మం గర్భమందుగల శ్రీవిష్ణుమూర్తి; పదభక్తియున్= పాదములమీది భక్తి; ఇహపర సుసౌఖ్యములు= ఈ లోకంలోనివి; పరలోకంలోనివి అయిన మంచి సుఖాలు; విశ్రుతకీర్తుల్= అతిశయమైన పేరు ప్రఖ్యాతులు; లభించున్= సమకూరును.

**తా :** పుణ్యప్రదమైన ఈ చరిత్రను విన్నా, చదివినా ప్రజలందరికి శ్రీహరి పాదసేవ, ఇహలోక పరలోకసౌఖ్యాలు, మరియు గొప్పపేరుప్రతిష్ఠలు చేకూరుతాయి.

**వ. అని చెప్పి వెండియు సూతుండు మహర్షుల కిట్లనియె. నట్లు పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రుం గనుంగొని "మునీంద్రా, హిరణ్యాక్ష వధానంతరంబున వసుంధర సమస్థితిం బొందిన విధంబును, స్వాయంభువ మనువుం బుట్టించిన యనంతరంబున విరించి దిర్యగ్జాతిజంతు సృష్టినిమిత్తంబులైన మార్గంబు లెన్ని సృజించె, మహాభాగవతోత్తముండయిన విదురుండు గృష్ణున కపకారంబు దలంచిన పాపవర్తనులగు ధృతరాష్ట్ర పుత్రులం బాసి జనకుండగు కృష్ణద్వైపాయనునకు సముండగుచుఁ దన మనోవాక్కాయకర్మంబులు గృష్ణునంద చేర్చి భాగవతజనోపాసకుండై పుణ్యతీర్థ సేవా సమాలబ్ధయశో విగత కల్మషుండగుచు మైత్రేయ మహాముని నేమి ప్రశ్నంబు లడిగె? నవి యెల్లం దెలియ నానతి" మ్మనిన రాజేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె. 715**

**ప్రతి :** అని; చెప్పి= పుణ్యకథావైభవాన్ని అలా వివరించి; సూతుండు= కథకుడు; మహర్షులకున్= శౌనకాది మునులకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; అట్లు= ఆ రకంగా; పరీక్షిత్+నర+ఇంద్రుండు= పరీక్షిత్తు అనే రాజు;

శుకయోగి+ఇంద్రున్= శుకమహర్షిని; కనుంగొని= చూచి; ముని+ఇంద్రా= ఋషీశ్వరా!; హిరణ్య+అక్ష= హిరణ్యాక్షుడనే రాక్షసుని; వధ+అనంతరంబునన్= చావుతర్వాత; వసుంధర= భూమి; సమస్థితిన్+పొందిన= ఒడుదుడుకులు లేని స్థితిని పొందినట్టి; విధంబును= వైఖరియు; స్వాయంభువమనువున్= స్వాయంభువుడను మనువును; పుట్టించిన+అనంతరంబునన్= పుట్టించిన తర్వాత; విరించి= బ్రహ్మ; తిర్యక్+జాతిజంతు= వక్రంగా సంచరించే వర్గానికి చెందిన జంతువుల; సృష్టినిమిత్తంబులు= పుట్టుకకు కారణాలు; ఐన మార్గంబులు= ఐనట్టి పద్ధతులు; ఎన్ని సృజించెన్= ఎన్నింటిని సృష్టించాడు; మహాభాగవత+ఉత్తముండు+ఐన= భగవద్భక్తులలో శ్రేష్ఠుడైన; విదురుండు= విదురుడు; కృష్ణునకున్= శ్రీకృష్ణునికి; అపకారంబున్= హానిని; తలంచిన= చేయనెంచినట్టి; పాపవర్తనులు+అగు= దుష్టచరిత్రగలవారైన; ధృత రాష్ట్రపుత్రులన్= ధృతరాష్ట్రుని కొడుకులైన కౌరవులను; పాసి= విడిచి; జనకుండు+అగు= తండ్రి అయిన; కృష్ణద్వైపాయనునకున్= వేదవ్యాసునికి; సముండు+అగుచున్= సమానుడవుతూ; తన= తనయొక్క; మనస్= బుద్ధి; వాక్= పల్కు; కాయ= దేహం వీటికి సంబంధించిన; కర్మంబులు= పనులు; కృష్ణునందు+అ= శ్రీకృష్ణునియందే; చేర్చి= ఉంచి; భాగవతజన= భగవంతుని భక్తులచే; ఉపాసకుండు+ఐ= సేవింపబడ్డవాడై; పుణ్యతీర్థ= పవిత్రమైన తీర్థముల; సేవ= సేవచే; సమ్+ఆలబ్ధ= బాగా పొందబడిన; యశస్= కీర్తిచేత; విగత= పోయిన (నశించిన); కల్మషుండు= పాపాలుగలవాడు; అగుచున్= అవుతూ; మైత్రేయమహామునిన్= మైత్రేయుడనే మునిని; ఏమి ప్రశ్నంబులు= ఏ ప్రశ్నల్ని; అడిగెన్= అడిగాడు; అవిఎల్లన్+తెలియన్= వాటిని అన్నింటిని తెలిసేటట్లు; ఆనతిన్= ఆజ్ఞని; ఇమ్ము= దయసేయుము; అనినన్= అని అడగగా; రాజ+ఇంద్రునకున్= రాజశ్రేష్ఠుడైన పరీక్షిత్తుకు; శుకయోగి+ఇంద్రుండు= శుకమహర్షి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తా :** మళ్ళీ సూతుడు శౌనకాదులతో ఇలా అన్నాడు.

"పరీక్షిత్తు శుకమహర్షిని చూచి మునీంద్రా! హిరణ్యాక్షుడు చనిపోయాక భూదేవి నిలకడను పొందిన విధాన్ని, స్వాయంభువమనువును పుట్టించిన తరువాత బ్రహ్మ సమస్తమైన పశుపక్ష్యాదుల్ని, మానవుల్ని సృష్టించడానికి అనుసరించిన పద్ధతుల్ని, మహాభక్తుడైన విదురుడు, శ్రీకృష్ణునకు అపకారం తలంచిన పాపాత్ములైన కౌరవులను వదలి వెళ్ళిపోయి, తన తండ్రియైన వేద వ్యాసునంతవాడై మనస్సు, వాక్కు, శరీరం అనే త్రికరణాల్ని శ్రీకృష్ణపరమాత్మవశంచేసి, భక్తులుసేవిస్తుండగా పుణ్యతీర్థాటనవల్ల సమస్తపాపాలనుండి విముక్తుడై మైత్రేయమునిని ఏ యే ప్రశ్నలు అడిగాడో అవన్నీ తెలిసేట్లు వివరించ"మని పరీక్షిన్మహారాజు శుకమహర్షిని ప్రార్థించాడు.

**సీ.** **విమలాత్ముఁడైన య వ్విదురుండు మైత్రేయమునివరుఁ జూచి యిట్లనియెఁ బ్రీతిఁ**
**జతురాత్మ! సకలప్రజాపతియైనట్టి జలజగర్భుఁడు ప్రజాసర్గమందు**
**మును ప్రజాపతులను బుట్టించి వెండియుఁ జిత్తమందేమి సృజింపఁదలఁచె?**
**మును సృజించినయట్టి మును లమ్మరీచ్యాదు లబ్జజునాదేశ మాత్మ నిలిపి**

**తే.** **యర్థి నెట్లు సృజించిరి యఖిలజగము?, మెఱసి మఱి వారు భార్యాసమేతు లగుచు**
**నేమి సృజియించి? రదిగాక కామినులను, బాసి యేమి సృజించి రా భద్రయశులు? 716**

**ప్రతి :** విమల+ఆత్ముఁడు+ఐన= స్వచ్ఛమైన మనస్సుగలవాడైనట్టి; ఆ+విదురుండు= విదురుడు; మైత్రేయమునివరున్= మైత్రేయుడనే మునిశ్రేష్ఠుణ్ణి; చూచి= కాంచి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు; ప్రీతిన్= ప్రేమతో; చతుర+ఆత్మ=

వాక్చాతుర్యంగల మహాత్మా; సకలప్రజాపతి+ఐన+అట్టి= ఎల్లజీవుల సమూహానికి ప్రభువైన; జలజగర్భుఁడు= పద్మము నుండి పుట్టిన బ్రహ్మ; ప్రజాసర్గమందున్= ప్రజల సృష్టియందు; మును= ముందు; ప్రజాపతులను= ప్రజా నాయకులైన మనువులను, పుట్టించి; వెండియున్= మరల; చిత్తమందున్= మనస్సులో; ఏమి సృజింపన్= ఇంకేమి సృష్టించాలని; తలఁచెన్= భావించాడు; మును= ఇంతకుముందు; సృజించిన+అట్టి= పుట్టింపబడినవారైన; ఆ+మరీచి+ఆదులు= ఆ మరీచిమొదలైనవారు; అబ్జజు+ఆదేశము= బ్రహ్మఆజ్ఞను; ఆత్మన్= మనసులో; నిలిపి= ఉంచి; అర్థిన్= ఇష్టపడి; అఖిలజగమున్= ఈ విశ్వమంతటిని; ఎట్లు= ఏ విధంగా; సృజించిరి= సృష్టించారు?; మెఱసి= ఒప్పి; మఱి= ఇంకా; వారు= మరీచ్యాదులు; భార్యాసమేతులు+అగుచున్= భార్యలతో కూడిన వారై; ఏమి సృజించిరి= ఏమి పుట్టించారు?; అది+కాక= అదికాకుండా; కామినులను+పాసి= భార్యలను వదలి; ఆ భద్రయశులు= శుభకీర్తిగల ఆ మరీచ్యాదులు; ఏమి సృజించిరి= ఏమి పుట్టించారు?

**తా :** "వాక్చాతుర్యం గల మహాత్మా! సకల సృష్టికి మూలపురుషుడైన బ్రహ్మ ప్రజలను సృష్టించే మనువుల్ని పుట్టించాక ఇంకేమి సృజించాలనుకొన్నాడు? బ్రహ్మ సృష్టించిన మరీచి మొదలైనవారు బ్రహ్మదేవుని ఆజ్ఞానుసారంగా ఈ విశ్వసృష్టి ఎలా చేశారు? వారు భార్యాసమేతులై ఎలాంటి సృష్టిచేశారు? భార్యా రహితులై ఎలాంటి సృష్టిచేశారు?" అని పవిత్రమైన మనస్సుగల విదురుడు మైత్రేయుని అడిగాడు.

**క. అందఱుఁదమలో నైక్యముఁ, జెందినచో నేమిఁదగ సృజించిరి? కరుణా**
**కందళితహృదయ! యిన్నియుఁ, బొందుగ నెఱిఁగింపుమయ్య బుధనుత! నాకున్. 717**

**ప్రతి :** అయ్య= అయ్యా!; కరుణా= దయచేత; కందళిత= అర్ద్రమైన; హృదయ= ఎదగలస్వామీ!; బుధనుత= పండితులచే కొనియాడబడినవాడా!; అందఱున్= ఎల్లరు; తమలోన్= ఒకరిలోనొకరు; ఐక్యమున్+చెందినచోన్= కలిసిపోతే; తగన్= తగినట్లు; ఏమిన్ సృజించిరి?= దేన్నికల్గించారు?; ఇన్నియున్= వీటన్నిటిని; నాకున్= నాకు; పొందుగన్= వివరంగా; ఎఱిఁగింపుము= తెలుపుము.

**తా :** "ఓ కరుణార్ద్ర హృదయా! వివేకజనస్తుత! మైత్రేయా! అందరూ తమలో తామైక్యం చెంది దేనిని, దేనిని సృష్టించారు? ఇవన్నీ మాకు వివరించి చెప్పండి" అని ప్రార్థించాడు.

### ✤ చతుర్ముఖుండొనర్చు యక్షాదిదేవతాగణ సృష్టి దెలుపుట ✤

**సీ. అనిన మునీంద్రుఁ డిట్లనియె జీవాదృష్టపరుఁడు మాయాయుక్తపురుషవరుఁడుఁ**
**గాలాత్మకుఁడు నను కారణంబున నిర్వికారుఁ డైనట్టి జగన్నివాసుఁ**
**డాదిజాతక్షోభుఁడయ్యె, నమ్మేటివలనను గుణత్రయంబును జనించె;**
**నా గుణత్రయమునందయ్యె మహత్తత్త్వ, మది రజోగుణహేతువైన దాని**

**తే. యందహంకార మొగిఁ ద్రిగుణాత్మకమునఁ, బొడమె, మఱి దానివలనఁ బ్రభూత మయ్యెఁ**
**బంచతన్మాత్ర, లందు సంభవము నొందె, భూతపంచక మీ సృష్టిహేతు వగుచు. 718**

**ప్రతి :** అనినన్= అనిప్రశ్నించగా; మునీంద్రుఁడు= మహర్షిశ్రేష్ఠుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు; జీవ= జీవులకు; అదృష్టపరుఁడు= కానరానివాడు; మాయాయుక్త= మాయతోకూడిన; పురుషవరుఁడు= పురుషోత్తముడు; కాల+ఆత్మకుఁడు= కాలస్వరూపుడు; నిర్వికారుఁడు= ఎలాంటి వికారములకు లోనుకానివాడు; ఐన+అట్టి= అయినటువంటి జగత్+నివాసుడు= జగత్తులకు నిలయమైనవాడు; ఆదిజాత క్షోభుఁడు+అయ్యెన్= మొదట జీవులను పుట్టించడంలో లేదా సృష్టించడంలో కలతపడినవాడయ్యాడు; ఆ+మేటి వలనను= ఆ ప్రభువు (భగవంతుడు)వల్ల; గుణత్రయంబును= సత్త్వరజస్తమస్సులనే మూడు గుణాలు; జనించెన్= పుట్టాయి; ఆ గుణత్రయంబునందు= ఆ మూడుగుణాలనుండి; మహత్తత్త్వము= మహత్తు అనే తత్త్వం; అయ్యెన్= ఏర్పడ్డది; అది= ఆ మహత్తత్త్వం; రజోగుణహేతువు+ఐనన్= రజోగుణానికి సంబంధించినది కావడంచేత; దానియందున్= దానినుండి; మొగిన్= ముందుగా; త్రిగుణాత్మకమునన్= మూడుగుణాల అంశలుకలదై; అహంకారము= అహంకారం అనే తత్త్వం; పొడమెన్= పుట్టింది; మఱి= తరువాత; దానివలనన్= అహంకారంనుండి; పంచతన్మాత్రలు= పంచతన్మాత్రలనగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు; ప్రభూతము+అయ్యెన్= పుట్టినాయి; అందున్= పంచతన్మాత్రలనుండి; ఈ సృష్టిహేతువు+అగుచున్= సమస్త సృష్టికి కారణమవుతూన్న; భూతపంచకము= పంచభూతాలు; సంభవమును+ఒందెన్= పుట్టినాయి.

**తా :** అని ప్రశ్నించగా మైత్రేయమహర్షి ఇలా చెప్పాడు. జగత్తునంతా తనలోనే ఉంచుకొన్నవాడైన భగవంతుడు జీవులకు అగోచరుడు. ఆ పురుషోత్తముడు యోగమాయా సమేతుడు. కాలస్వరూపుడు. ఎలాంటివికారాలకు లోనుకానివాడు. అలాంటి భగవంతుడు మొదట జీవులను ఎలా సృష్టించాలని కలతపడినాడు. జగత్తుకు ప్రభువైన ఆ భగవంతునినుండి సత్త్వం, రజస్సు, తపస్సు అనే మూడుగుణాలు పుట్టాయి. ఆ త్రిగుణాలనుండి మహత్తత్త్వం పుట్టింది. ఆ మహత్తత్త్వం రజోగుణసంబంధి కావడంచేత ముందుగా దానినుండి మూడుగుణాల అంశలు కలిగిన అహంకారం పుట్టింది. తరువాత అహంకారం నుండి పంచతన్మాత్రలు పుట్టాయి. పంచతన్మాత్రలనుండి సమస్త సృష్టికి కారణమవుతున్న పంచభూతాలు పుట్టాయి.

**విశే :** భగవంతుడు సృష్టిని ఉద్భవింపజేసిన క్రమాన్ని పై పద్యం తెలియజేస్తున్నది. జగన్నివాసత్వం భగవత్తత్త్వమే. సృష్టి అంతటా నిండినవాడు, సృష్టి అంతటిని తనలో ఉంచుకొన్నవాడు భగవంతుడు. వాసుదేవ తత్త్వమన్నా ఇదే. భగవంతుడు యోగమాయాయుక్తుడు. యోగమాయ అంటే విష్ణుమాయ అని అర్థం. బాలింతగా ఉండిన దేవకి చేతులనుండి లాక్కొని కంసుడు నేలమీదికి విసరికొట్టినపుడు కిందపడకుండా ఆకాశంలోకి ఎగిరి మణిహారాద్యలంకారాలతో, శంఖచక్రాలతో, ఎనిమిది చేతులతో దర్శనం ఇచ్చిన దేవి విష్ణుమాయ. ఆ దేవి భూమిమీద అనేక ప్రదేశాలలో, అనేక నామాలతో చరించినట్లు భాగవతంలోనే శ్రీకృష్ణావతారఘట్టంలో పోతన వర్ణించాడు.

**గుణత్రయంబు :** జీవులకు ఉన్న గుణాలు మూడు. సత్త్వగుణం, రజోగుణం, తమోగుణం. ఈ గుణాల హెచ్చుతగ్గులవలననే జీవులు ఉత్తమ, మధ్యమ, అధములుగా కనిపిస్తారు.

**మహత్తత్త్వం :** మహత్, తత్త్వం అనే రెండు మాటలతో ఏర్పడిన ఈ పదానికి గొప్పతత్త్వం లేదా పవిత్రమైన తత్త్వం అని అర్థం. జీవాత్మ, పరమాత్మలను గురించి చేసే చర్చలలో మహత్తత్త్వం అనే పదం తరచుగా వస్తూ ఉంటుంది. జ్ఞానేంద్రియాలతో కూడిన సమష్టి తత్త్వమే మహత్తత్త్వం. దీనికి కర్తృత్వ లక్షణముంటుంది. సాంఖ్యవేదాంతంలో చెప్పే పంచవింశతి తత్త్వాలలో రెండవది మహత్తత్త్వం.

**అహంకారం :** అహమ్ అంటే నేను అని అర్థం. అలా భావించడమే అహంకారం. నాది, నావి అనే దేహాది ఉపాధులతో కలవకుండా భావించినపుడు అహంకారం ఆత్మస్వరూపం అవుతుంది.

**పంచతన్మాత్రలు :** శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు అనే ఐదూ పంచతన్మాత్రలు.

**పంచభూతాలు :** పృథివి, ఆపస్సు (నీరు), తేజస్సు, వాయువు, ఆకాశం అనే ఐదూ పంచభూతాలు. సమస్త సృష్టి పంచభూతాత్మకంగా ఉంటుంది.

**వ. అవియును దమలోనఁ బ్రత్యేకంబ భువన నిర్మాణ కర్మంబునకు సమర్థంబులు గాక యన్నింటి సంఘాతంబునఁ బాంచభౌతికంబైన హిరణ్మయాండంబు సృజియించె, నదియును జలాంతర్వర్తియై వృద్ధిఁ బొందుచుండె నంత. 719**

**ప్రతి :** అవియునున్= అవి కూడా అంటే సృష్టికి కారణభూతాలైన పంచభూతాలు; తమలోనన్= తమలో; ప్రత్యేకంబు+అ= విడివిడిగా; భువన నిర్మాణ కర్మంబునకున్= లోకాన్ని సృష్టించే కార్యానికి; సమర్థంబులు+కాక= తగినవి కాకపోవడం వల్ల; అన్నింటి= అన్నిటి; సంఘాతంబునన్= సమూహంలో; పాంచ భౌతికంబు+ఐన= పంచభూతాత్మకమైన; హిరణ్మయ+ అండంబున్= బంగారు గుడ్డును; సృజియించెన్= సృష్టించాయి; అదియునున్= ఆ గుడ్డుకూడా; జల+అంతర్+వర్తి+ఐ= నీటిలోపల ఉంటున్నదై; వృద్ధిన్+పొందుచుండెన్= వృద్ధిపొందుతూ ఉండినది; అంతన్= అంతలో...

**తా :** సృష్టికి కారణమైన ఆ పంచభూతాలు కూడా విడివిడిగా ఏ ఒక్కదానికీ లోకాన్ని సృష్టించడం చేతకాలేదు. పంచభూతాలు అన్నీ సమష్టిగా కలిసి పాంచభౌతికమైన ఒక బంగారు గుడ్డును సృష్టించాయి. ఆ గుడ్డు నీటిలోపల ఉంటూ వృద్ధి పొందుతూ ఉండినది.

**విశే :** పాంచభౌతికమంటే నేల, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం అనే ఐదు ప్రకృతులకు సంబంధించినదని అర్థం. ఈ ఐదూ కలిసి ఏర్పడేదే సృష్టి. ఈ పంచప్రకృతులు బంగారు గుడ్డులో కలిసిపోయి ఉన్నాయి. ఆ బంగారు గుడ్డునుండి సృష్టి ఏర్పడబోతున్నది కాబట్టి సృష్టి పాంచభౌతికం అవుతుంది.

**సీ. నారాయణాఖ్యు నున్నతి నొప్పు బ్రహ్మంబు సాహస్రదివ్యవర్షంబు లోలి**
**వసియించి యుండె, నా వాసుదేవుని నాభియందు సహస్రసూర్యప్రదీప్తిఁ**
**దనరుచు సకలజీవనికాయయుత మగు పంకజాతంబు సంభవము నొందెఁ,**
**బరఁగంగ నందులో భగవదధిష్ఠితుండై స్వరాట్టగు చతురాననుండు**

**తే. జనన మందెను తత్పద్మసంభవుండు, నామరూపగుణాదిసంజ్ఞాసమేతుఁ**
**దగుచు నిర్మాణ మొనరించె నఖిలజగము, వనజజుండు నిజచ్ఛాయవలన మఱియు. 720**

**ప్రతి :** నారాయణ+ఆఖ్యున్= నారాయణుడు అనే పేరుతో; ఉన్నతిన్+ఒప్పు= గొప్పగా ప్రకాశించే; బ్రహ్మంబు= పరమాత్మ లేదా పరబ్రహ్మం; సాహస్రదివ్య వర్షంబులు= వెయ్యి దివ్యసంవత్సరాలు; ఓలి= క్రమంగా; వసియించి+ఉండెన్= (హిరణ్మయమైన అండాన్ని) అధిష్ఠించి ఉన్నాడు; ఆ వాసుదేవుని= వాసుదేవుడనే పేరుగల అతని; నాభియందున్= బొడ్డునుండి; సహస్ర సూర్యప్రదీప్తిన్= వేయి సూర్యులకాంతితో; తనరుచున్= ప్రకాశిస్తూ; సకలజీవనికాయయుతము+అగు=

సమస్తప్రాణులతో కూడినదైన; పంకజాతంబు= (ఒక) పద్మం; సంభవమును+ఒందెన్= పుట్టింది; పరఁగంగన్= (అలా) ప్రవర్తిలుతూ ఉండగా; అందులోన్= ఆ పద్మంలో; భగవత్+అధిష్ఠితుండు+ఐ= భగవంతుని ఆశ్రయంగా చేసుకొన్నవాడై; స్వరాట్టు+అగు= స్వయంగా ప్రకాశించే; చతుర్+ఆననుండు= నాలుగు ముఖాలుగల బ్రహ్మ; జననము+అందెను= జన్మించాడు; తద్+పద్మసంభవుండు= ఆ బ్రహ్మదేవుడు; నామ= నామములు; రూప= ఆకారాలు; గుణ+ఆది= గుణములు మొదలైన; సంజ్ఞా= గుర్తులతో; సమేతుఁడు+అగుచున్= కూడినవాడై; అఖిలజగమున్= సమస్తజగత్తులను; నిర్మాణము+ ఒనరించెన్= నిర్మించాడు (సృష్టించాడు); మఱియున్= ఇంకా; వనజజుండు= పద్మంనుండి పుట్టిన బ్రహ్మ; నిజచ్ఛాయవలనన్= తన నీడవలన...

**తా :** నారాయణుడు అనే పేరుతో గొప్పగా ప్రకాశించే పరబ్రహ్మ (భగవంతుడు) ఆ హిరణ్మయమైన అండాన్ని క్రమంగా వెయ్యి దివ్య సంవత్సరాలు అధిష్ఠించి ఉన్నాడు. ఆ వాసుదేవుని (శ్రీమన్నారాయణుని) బొడ్డునుండి వేయి సూర్యులకాంతితో ప్రకాశిస్తూ సమస్తప్రాణులతో కూడినదైన (సమస్త ప్రాణులకు ఆశ్రయమైన) ఒక పద్మం పుట్టింది. ఆ పద్మంలో భగవంతుని ఆశ్రయంగా చేసుకొని స్వయంప్రకాశంగల బ్రహ్మ జన్మించాడు. ఆ బ్రహ్మదేవుడు నామం, రూపం, గుణం మొదలైన సంకేతాలు (గుర్తులు) కలవాడై సమస్తజగాలను సృష్టించాడు. ఇంకా తన నీడతో-

**విశే :** పరమాత్మ బ్రహ్మదేవునిద్వారా సృష్టినిర్మాణం జరిపే అంశాన్ని ఈ పద్యం వివరిస్తున్నది. 'భగవదధిష్ఠితుండై' అనడంవల్ల బ్రహ్మకు స్వయంగా సృష్టి చేయగల శక్తి లేదని, భగవదంశతో జన్మించినవాడు కావడంవల్ల భగవంతుని ఇచ్ఛానుసారం వర్తిస్తూ సమస్త సృష్టిని చేశాడని అర్థమవుతూ ఉంది.

దివ్యవర్షంబు - 360 మానవ సంవత్సరాలు ఒక దివ్య సంవత్సరం. సృష్టికి సంబంధించిన విషయం సత్త్వరజస్తమ స్స్వరూపమైన ప్రధానం లేదా ప్రకృతి నిర్వికారావస్థలో ఉండింది. ఊహింపనలవి కాని దైవం అంటే జీవుని అదృష్టం, ప్రకృతి కధిష్ఠాత అయిన మహాపురుషుడు, కాలం అనే వాటిచే ప్రకృతి క్షుభితం కాగా దాని నుండి మహత్తత్త్వం ఉత్పన్నమైంది. దైవప్రేరితం, రజోగుణప్రధానం అయిన ఈ మహత్తత్త్వంనుండి త్రిగుణాలు, అహంకారం ఉత్పన్నమైనాయి. రజోగుణ ప్రధానమైన ఈ మహత్తత్త్వంనుండి ఈశ్వరుని ప్రేరణవలన అహంకార తత్త్వ ముత్పన్నమైంది. మహత్తత్త్వం స్వయంగా సత్త్వగుణప్రధానమైనా అహంకారోత్పత్తి కాలంలో కార్యానురూపమగు రజః ప్రధానమవుతుంది. ఆ యహంకారం గుణత్రయ స్వరూపమవుతుంది. ఈ యహంకారం ఇంకా ఐదైదుగా జేసి ఆకాశాదులను సృష్టించింది. దానినుండి పంచతన్మాత్రలు, పంచమహాభూతాలు, పంచజ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, వాటికి అధిష్ఠాన దేవతలయిదుగురు జన్మించారు. పంచతన్మాత్రాదులు ఒక్కొక్కటి స్వతంత్రంగా సృష్టిచేయ జాలక పోవుటవల్ల అవి ఈశ్వరుని శక్తితో కలసి భౌతికమగు ఒక సువర్ణాండమును సృష్టించాయి. ఆ యండకోశం సమష్టిజీవుని మేలుకొలుపలేక పోవుటచే అచేతనమై ఒక వెయ్యిసంవత్సరాలకాలం కారణార్ణవజలంలో ఉండింది. తరువాత భగవంతుడు ఆ యండకోశాన్ని గర్భోదశాయి రూపంతో అధిష్ఠించాడు. అప్పుడాయన నాభిప్రదేశం నుండి ఒక పద్మం ఉదయించింది. వేయిమంది సూర్యులవలె తీక్ష్ణమైన కిరణాలతో కూడిన ఆ పద్మమే సర్వజీవులకు అధిష్ఠానస్వరూపమై ఉండడంవల్ల దానినుండి బ్రహ్మ జన్మించాడు. సలిలంలో శయనించిన విష్ణువుచే అధిష్ఠితుడై ఆ బ్రహ్మ నామరూపాది క్రమంతో వెనుకటి కల్పంవలె లోకాలను సృష్టించాడు.

**సీ. తామిస్రమును నంధతామిస్రమును దమమును మోహనము మహామోహనంబు**
**నను పంచమోహరూపాత్మకమైన యవిద్యఁ బుట్టించి యవ్వేళఁ దనకు**

**నది తమోమయదేహ మని ధాత రోసి తత్తనువు విసర్జించె, ధాతృముక్త**
**దేహంబు సతత క్షుత్తృష్ణల కావాసమును రాత్రిమయము నయ్యెను దలంప,**

**తే. నందులో యక్షరక్షస్సు లనన జనింప, వారి కప్పుడు క్షుత్తృషల్ వఱలఁగొంద**
**ఱా చతుర్ముఖు భక్షింత మనిరి, కొందఱతని రక్షింత మని తగ నాడి రంత. 721**

**ప్రతి :** తామిస్రమునున్= చీకటితో నిండినది; అంధతామిస్రమును= గుడ్డితనం అనే చీకటితో నిండినది; తమమును= చీకటి అనే పదార్థం; మోహనము= ప్రజ్ఞను మరగుపరుచునది; మహామోహనంబు= తన అంతర్యామిత్వాన్ని మరుగుపరచునది; అను= అనే; పంచమోహరూప+ఆత్మకము+ఐన= ఐదు విధాలుగా మరుగుపరచునట్టి రూపాలు తానే అయిన; అవిద్యన్+పుట్టించి= తెలియకపోవుటను పుట్టించి; ఆ+వేళన్= ఆ సమయంలో, తనకున్; అది; తమస్+మయదేహము+అని= చీకటితో నిండిన శరీరమని భావించి; ధాత= బ్రహ్మదేవుడు; రోసి= ఏవగించుకొని; తద్+తనువున్= ఆ శరీరాన్ని; విసర్జించెన్= వదలిపెట్టాడు; ధాతృ= బ్రహ్మచేత; ముక్త= వదలివేయబడిన; దేహంబు= శరీరం; తలంపన్= ఆలోచించగా; సతత= ఎడతెగని; క్షుత్+తృష్ణలకున్= ఆకలిదప్పులకు; ఆవాసమును= స్థానమూ; రాత్రిమయమును= రాత్రిమయమూ; అయ్యెను= అయింది; అందులోన్= ఆ శరీరంలో; యక్షరక్షస్సులు+అనన్= యక్షులు, పిశాచాలు అనబడేవారు; జనింపన్= పుట్టగా; వారికి; అప్పుడు; క్షుత్+తృషల్= ఆకలిదప్పులు; వఱలన్= అతిశయించగా; కొందఱు= యక్ష పిశాచాలలో కొంతమంది; చతుర్ముఖున్= బ్రహ్మదేవుని; భక్షింతము+అనిరి= తిందామన్నారు; కొందఱు= మరికొందరు; అతనిన్= ఆ బ్రహ్మదేవుని; రక్షింతము+అని= రక్షిద్దామని; తగన్= వారివారికి తగినట్లు; ఆడిరి= మాట్లాడారు; అంతన్= అంతలో...

**తా :** బ్రహ్మదేవుడు తన ఛాయ(నీడ)తో తామిస్రము, అంధతామిస్రము, తమము, మోహనము, మహామోహనము అనే ఐదు మోహరూపాలతో అవిద్యను పుట్టించాడు. ఆ సమయంలో తన కది తమోమయమైన శరీరమనే భావన కలిగింది. అందువల్ల బ్రహ్మ ఆ శరీరాన్ని వదలివేశాడు. అలా వదలి పెట్టిన శరీరం ఆకలిదప్పులకు స్థానం, రాత్రిమయం అయింది. ఆ శరీరంనుండి యక్షులు పిశాచాలు పుట్టారు. వాళ్లకు ఆకలిదప్పులు అధికమైనాయి. ఆ యక్షపిశాచాలలో కొందరు బ్రహ్మను తిందామన్నారు. కొందరు బ్రహ్మను రక్షిద్దామన్నారు.

**విశే :** అవిద్య అంటే అజ్ఞానం. విమనస్కుడు కావడం మోహం. చేతనత్వాన్ని మూఢత్వం కప్పివేయడం అజ్ఞానం. దీనినే మోహం అని కూడా అంటారు. విపరీత జ్ఞానం అవిద్య. తామిస్రం, అంధతామిస్రం, తమం, మోహనం, మహామోహనం అనే ఈ పంచమోహాలు అవిద్యలో భాగాలు. మొట్టమొదటి పాంచభౌతికమైన సప్తధాతుమయశరీరం వ్యుత్పత్తి ఈ పద్యంలో వివరింపబడింది. తన నుండి భౌతికదేహం ఉద్భవింపగా అది మోహరూపాన వ్యక్తమైంది. జీవకణాలు, అణువులు, పరమాణువులు, అందు పనిచేయు ప్రజ్ఞలైన దేవతలు చేరినచో భౌతికదేహమవుతుంది. వారందరి అస్తిత్వం కనిపించకుండా అది మొత్తం ఒక దేహంగా కనిపించుటయే మోహం. ఉన్నది కనిపించక లేనిది కనిపించటం మోహమనబడుతుంది. ఏ ద్రవ్యమైనా ఉన్నట్లు కనిపిస్తుందే కాని దానికి అస్తిత్వముండదు. అందలి అంతర్భాగాలకే అస్తిత్వముంటుంది. కనుక భౌతిక దేహదృష్టి మోహరూపంగా చెప్పబడింది. దానియందు తన ప్రజ్ఞ పనిచేయక అందు తానుండుటవలన జడపదార్థంవలె కనిపిస్తుంది. దానికి సంబంధించినవే తామిస్రము మొదలైన స్థితులు. ధరింపబడిన భౌతిక దేహమునకు విడవడం తప్పనిసరి అవుతుంది కాబట్టి బ్రహ్మ ఆ దేహాన్ని విడిచాడని చెప్పబడింది.

**వ. ఇట్లు వలుకుచు భక్షించువారలయి ధాత సన్నిధికిం జనిన నతండు భయవిహ్వలుండై యేను మీ జనకుండను, మీరలు మత్పుత్త్రులరు, నన్ను హింసింపకుండనుచు "మా మా జక్షత", "రక్షత" యను శబ్దంబులు వలుకం దన్నిమిత్తంబున వారలకుం గ్రమంబున యక్షరక్షోనామంబులు ప్రకటంబు లయ్యె, వెండియుం బ్రభావిభాసితంబైన యొక్క కాయంబు ధరించి సత్త్వగుణ గరిష్ఠులుం బ్రభావంతులు నగు సుపర్వులం బ్రముఖులుంగా సృజియించి తత్ప్రభామయగాత్ర విసర్జనంబు సేసిననది యహోరూపంబై దేవతావళికి నాశ్రయంబయ్యె, మఱియు జఘనంబువలన నతిలోలుపులైన యసురులం బుట్టింప వార లతికాముకు లగుటంజేసి యయ్యజునిం జీరి మిథున కర్మం బపేక్షించిన విరించి నగుచు నిర్లజ్జులయిన యసురులు దనవెంటం దగులం బఱచి ప్రపన్నార్తిహరుండును, భక్త జనానురూప సందర్శనుండును నైన నారాయణుం జేరి తత్పాదంబులకుంబ్రణమిల్లి యిట్లనియె. 722**

**ప్రతి :** ఇట్లు+పలుకుచున్= ఇలా మాట్లాడుకొంటూ (ఆ యక్షపిశాచాలు); భక్షించువారలు+అయి= తినడానికి సిద్ధపడినవాళ్లై; ధాత సన్నిధికిన్+చనినన్= బ్రహ్మసమీపానికి వెళ్లగా; అతండు= బ్రహ్మ; భయవిహ్వలుండు+ఐ= భయంతో వ్యాకులత చెందినవాడై; ఏను= నేను; మీ జనకుండను= మీ తండ్రిని; మీరలు= మీరు; మత్+పుత్త్రులరు= నా కుమారులు, నన్ను; హింసింపకుండు+అనుచున్= హింసించవద్దు అంటూ; మా మా జక్షత= వద్దు తినవద్దు; రక్షత= రక్షించండి; అను శబ్దంబులు= అనే మాటలు; పలుకన్= పలకగా; తద్+నిమిత్తంబునన్= ఆ కారణంగా; వారలకున్= యక్షపిశాచాలకు; క్రమంబునన్= క్రమంగా; యక్షరక్షస్ నామంబులు= యక్షులు, రక్షసులు (పిశాచాలు) అనే పేర్లు; ప్రకటంబులు+అయ్యెన్= ప్రకటితములైనాయి (ప్రసిద్ధమైనాయి); వెండియున్= మరల; ప్రభావిభాసితంబు+ఐన= కాంతితో విరాజిల్లునదియైన; ఒక్కకాయంబు= ఒక శరీరం, ధరించి; సత్త్వగుణగరిష్ఠులును= సాత్వికగుణశ్రేష్ఠులు; ప్రభావంతులును+అగు= కాంతిమంతులు అయిన; సుపర్వులన్= దేవతలను; ప్రముఖులులన్+కాన్= ముఖ్యమైనవారుగా; సృజియించి= సృష్టించి; తద్+ప్రభామయ= ఆ కాంతిమంతమైన; గాత్ర= శరీరాన్ని; విసర్జనంబు+చేసినన్= వదలివేయగా; అది= ఆ శరీరం; అహస్+రూపంబు+ఐ= పగలుగా రూపొంది; దేవతా+ఆవళికిన్= దేవతల సమూహానికి; ఆశ్రయంబు+అయ్యెన్= ఆశ్రయమైంది; మఱియున్= ఇంకా; జఘనంబువలనన్= కటిభాగంనుండి; అతిలోలుపులు+ఐన= మిక్కిలి చంచలచిత్తులైన; అసురులన్= రాక్షసులను; పుట్టింపన్= సృష్టించగా; వారలు= ఆ రాక్షసులు; అతికాముకులు+అగుటన్+చేసి= ఎక్కువగా కామదృష్టికలవారు కావడంతో; ఆ+అజునిన్= ఆ బ్రహ్మదేవుని; చీరి= పిలిచి; మిథునకర్మంబు+అపేక్షించినన్= రతిక్రియను కోరగా; విరించి= బ్రహ్మ; నగుచున్= నవ్వుతూ; నిర్+లజ్జులు+అయిన= సిగ్గులేనివారైన; అసురులు= రాక్షసులు; తనవెంటన్+తగులన్= తనవెంటపడగా; పఱచి= పరుగెత్తి; ప్రపన్న+ఆర్తిహరుండును= శరణాగతుల బాధలను పోగొట్టేవాడూ; భక్తజన+అనురూప= భక్తులకు ఇష్టమైన రూపంతో; సందర్శకుండును= దర్శింపబడేవాడూ; ఐన; నారాయణున్+చేరి= శ్రీమన్నారాయణుని దగ్గరకు వెళ్లి; తద్+పాదంబులకున్= ఆయన పాదాలకు; ప్రణమిల్లి= నమస్కరించి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఇలా మాట్లాడుకొంటూ ఆ యక్షరక్షస్సులు బ్రహ్మ సమీపానికి వచ్చారు. బ్రహ్మ భయంతో వ్యాకులత చెంది. 'నేను మీ తండ్రిని. మీరు నా కుమారులు. నన్ను హింసించవద్దు' రక్షించండి అంటూ "మా మాజక్షత", "రక్షత" అనే మాటలు అన్నాడు. ఆ కారణంగా వాళ్లకు యక్షులు, రాక్షసులు అనే పేర్లు ఏర్పడినాయి. తరువాత బ్రహ్మ తేజోమయమైన మరొక శరీరం ధరించాడు. సత్వగుణశ్రేష్ఠులు, కాంతిమంతులు అయిన దేవతలను ముఖ్యమైనవారుగా సృష్టించాడు. అనంతరం

బ్రహ్మ ఆ తేజోమయమైన శరీరాన్ని వదలిపెట్టాడు. అలా వదలిపెట్టబడిన శరీరం పగలుగా రూపొంది దేవతలకందరికీ ఆశ్రయమైంది. తరువాత బ్రహ్మ తన కటిప్రదేశంనుండి మిక్కిలి చంచల స్వభావులైన రాక్షసులను పుట్టించాడు. వాళ్లు ఎక్కువగా కామదృష్టి కలవారయ్యారు. తమను పుట్టించిన బ్రహ్మనే పిలిచి రతిక్రియను కోరారు. సిగ్గువిడిచిన రాక్షసులు తనవెంటపడగా బ్రహ్మ నవ్వుతూ పరుగెత్తాడు. అలా పరుగెత్తి శరణాగతుల బాధలను తీర్చేవాడూ, భక్తులకు ఇష్టమైన రూపంలో కనిపించేవాడూ అయిన శ్రీమన్నారాయణుని దగ్గరకు వెళ్లాడు. ఆయన పాదాలకు నమస్కరించి ఇలా అన్నాడు.

**విశే :** ఈ వచనంలో దేవతలను, రాక్షసులను సృష్టించిన విషయం ఉంది. దేవతల, రాక్షసుల స్వభావం వివరింపబడింది. అతికాముకత్వం రాక్షసలక్షణంగా చెప్పబడింది. ఆలుమగల ద్వంద్వానికి మిథునం అని పేరు. మిథునం అనేమాటకు సంగమం, రతి అని కూడా అర్థాలున్నాయి. మిథునానికి సంబంధించినది మైథునం. మైథునం అన్నా రతి అనే అర్థం. అయితే ఈ రతి ఆలుమగల మధ్యగల సంగమంగా ఉండాలి. దేవతలకు పగలు ఆశ్రయమైతే రాక్షసులకు రాత్రి ఆశ్రయమనే చెప్పాలి. అందుకే రాక్షసులకు రాత్రించరులు అని పేరు వచ్చింది.

**క. రక్షింపుము రక్షింపు ము, పేక్షింపక వినుత నిఖిల బృందారక వి**
**శ్వక్షేమంకర విను మిటు, దక్షత నీ యాజ్ఞ నేను దల నిడి వరుసన్. 723**

**ప్రతి :** వినుత= స్తుతింపబడిన; నిఖిల= సమస్తమైన; బృందారక= దేవతలు గలవాడా!; విశ్వ= లోకానికి; క్షేమంకర= కుశలాన్ని కూర్చేవాడా; ఉపేక్షింపక= నిర్లక్ష్యంచేయకుండా; రక్షింపుము రక్షింపుము= రక్షించు రక్షించు; వినుము+ఇటు= ఇటువిను; నీ+ఆజ్ఞన్= నీ ఆనతిని; తలన్+ఇడి= ఔదల ధరించి; నేను; దక్షతన్= సమర్థతతో; వరుసన్= క్రమంగా.

**తా :** దేవతలచేత స్తుతింపబడువాడా! లోకాన్ని రక్షించేవాడా! ఉపేక్ష చేయకుండా నన్ను రక్షించు. ఈ మాట విను. నీ ఆనతిని పాటించి సమర్థతతో నేను క్రమంగా–

**తే. ఈ ప్రజాసృష్టి కల్పనం బే నొనర్ప, నందుఁ బాపాత్ములైన యీ యసురు లిపుడు**
**నను రమింపఁగ డాయ వచ్చినఁ గలంగి, యిటకు వచ్చితి, ననుఁగావు మిద్ధచరిత! 724**

**ప్రతి :** ఏను= నేను; ఈ ప్రజాసృష్టికల్పనంబు= ఈ ప్రజలను సృష్టించే ఏర్పాటును; ఒనర్పన్= చేయగా; అందున్= ఆ సృష్టిలో; పాపాత్ములు+ఐన= పాపస్వభావులైన; ఈ+అసురులు= ఈ రాక్షసులు; ఇపుడు; ననున్= నన్ను; రమింపఁగన్= రమించడానికి; డాయవచ్చినన్= దగ్గరకు రాగా; కలంగి= కలతపడి; ఇటకున్ వచ్చితిన్= ఇక్కడికి వచ్చాను; ఇద్ధచరిత= ప్రకాశించే చరిత్ర కలవాడా!; ననున్+కావుము= నన్ను రక్షించు.

**తా :** నేను ప్రజలను సృష్టించే ఏర్పాటును చేశాను. అలా సృష్టింపబడిన వారిలో పాపస్వభావులైన రాక్షసులు ఇప్పుడు నన్ను రమించాలనే దుష్టబుద్ధితో దగ్గరకు వస్తున్నారు. కలతచెంది ఇక్కడికి వచ్చాను. ఓ సుచరిత్రా! నన్ను రక్షించు.

**వ. అదియునుంగాక లోకంబువారలకుం గ్లేశంబు లొనరింపను, గ్లేశంబునం బొందిన వారల క్లేశంబు లపనయింపను నీవ కాక యితరులు గలరే? యని స్తుతియించినఁ బద్మజు కార్పణ్యం బెఱుంగ నవధరించి వివిక్తాధ్యాత్మదర్శనుం డగుచుఁ గమల సంభవ! భవద్ఘోరతనుత్యాగంబు సేయు మని యానతిచ్చిన నతండు నట్ల చేసెనంత నదియును. 725**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేకాకుండా; లోకంబువారలకున్= లోకంలో ఉండేవారికి; క్లేశంబులు+ఒనరింపను= కష్టాలు కలిగించడానికి; క్లేశంబునన్+పొందినవారల= కష్టాలపాలైనవారి; క్లేశంబులు+అపనయింపను= కష్టాలను తొలగించడానికి; నీవకాక= నీవు కాకుండా; ఇతరులు+కలరే= ఇతరులు ఉన్నారా?; అని; స్తుతియించినన్= స్తోత్రంచేయగా; పద్మజు= బ్రహ్మయొక్క; కార్పణ్యంబు+ఎఱుంగన్= దైన్యం తెలిసేటట్లుగా; అవధరించి= విని; వివిక్త+అధ్యాత్మ దర్శనుండు+అగుచున్= (అందరి) హృదయాలను లోతుగా సందర్శిస్తూ; కమలసంభవ= బ్రహ్మదేవా!; భవత్+ఘోరతను= ఘోరమైన నీ శరీరాన్ని; త్యాగంబు+చేయుము= వదలిపెట్టు; అని; ఆనతిచ్చినన్= ఆజ్ఞఇవ్వగా, సెలవీయగా; అతండును= బ్రహ్మకూడా; అట్లు+అ+చేసెన్= అలాగే చేశాడు; అదియును= అదికూడా.

**తా :** అంతేగాక లోకులకు కష్టాలను కలిగించడానికి, కష్టాలు పడేవాళ్ల కష్టాలను దూరంచేయడానికి నీవు కాకుండా సమర్థులైన ఇతరులున్నారా? అని స్తోత్రం చేయగా బ్రహ్మదేవుని దైన్యాన్ని పూర్తిగా తెలుసుకొని అందరి హృదయాలను లోతుగా సందర్శింపగల శ్రీహరి 'ఓ బ్రహ్మదేవా! ఘోరమైన ఈ నీ శరీరాన్ని వదలిపెట్టు' అని ఆనతిచ్చాడు. బ్రహ్మదేవుడు అలాగేనని తన శరీరాన్ని వదలి వేశాడు.

**సీ. నవ్యకాంచనరణన్మణినూపురారావ విలసితపాదారవిందయుగళ**
**కాంచీకలాపసంకలితదుకూల వస్త్రస్ఫారపులిననితంబబింబ**
**రాజితాన్యోన్యకర్కశ పీనకరికుంభ పృథుకుచభారకంపితవలగ్న**
**మదిరారసాస్వాద మదవిఘూర్ణిత చారు సితనవవికచరాజీవనయన**

**తే. యపరపక్షాష్టమీ శశాంకాభ నిటల, మదవదలికులరుచిరోపమానచికుర**
**లలితచంపకకుసుమవిలాసనాస, హాసలీలావలోకన యబ్జపాణి. 726**

**ప్రతి :** నవ్య= కొత్తదైన; కాంచన= బంగారుతో చేసిన; రణత్= శబ్దిస్తున్న; మణినూపుర+ఆరావ= మణులు పొదిగిన అందెల శబ్దంతో; విలసిత= ఒప్పుచున్న; పాద+అరవిందయుగళ= పాదపద్మాల జంటకలదీ; కాంచీకలాప= మొలనూలుతో; సంకలిత= కూడిన; దుకూలవస్త్రస్ఫార= పట్టువస్త్రాల సమృద్ధిగల; పృథు= విరివియైన; పులిన నితంబబింబ= ఇసుకతిన్నెలను పోలిన పిరుదులు కలది; రాజిత= ప్రకాశించే; అన్యోన్యకర్కశ= ఒకదానితో ఒకటి ఒరసికొంటున్న; పీన= బలిసిన; కురికుంభ= ఏనుగు కుంభస్థలములను పోలిన; పృథు= పెద్దవైన; కుచభార= కుచముల బరువుతో; కంపిత= చలిస్తున్న; వలగ్న= నడుము కలది; మదిరారస+ఆస్వాద= మద్యపానం చేయడంవల్ల కలిగిన; మద= మత్తుతో; విఘూర్ణిత= చలించిన; చారు= అందమైన; సిత= తెల్లనై; నవ= నూతనంగా; వికచ= వికసించిన; రాజీవనయన= అరవిందాలవంటి కనుదోయి కలది; అపరపక్ష= కృష్ణపక్షమందలి; అష్టమీ= అష్టమినాటి; శశ+అంక+ఆభ= చంద్రునిపోలిన; నిటల= పాలభాగం కలది; మదవత్= మదముతో కూడిన; అలికుల= తుమ్మెదల సమూహంతో; రుచిర+ఉపమాన= అందమైన సాదృశ్యంకల; చికుర= శిరోజాలు కలది; లలిత= మృదువైన; చంపకకుసుమ= సంపెంగపుష్పంయొక్క; విలాస= అందంకల; నాస= ముక్కుకలది; హాసలీలా+అవలోకన= చిరునవ్వు చిందే చూపులు కలది; అబ్జపాణి= తామరలవంటి చేతులు కలది.

**తా :** కొత్తబంగారంలో మణులు పొదిగిన అందెలు శబ్దిస్తున్న పాదపద్మాలు కలది, పట్టుచీరపై మొలనూలుకలది, ఇసుక తిన్నెలను పోలిన గొప్పపిరుదులుకలది; ఒకదానితో ఒకటి ఒరసికొంటూ ప్రకాశించే ఏనుగుకుంభస్థలములను పోలిన

పెద్ద కుచముల భారంతో చలిస్తున్న నడుముకలది, మద్యపానం కలిగించిన మత్తుతో చలిస్తూ అప్పుడే వికసించిన అరవిందాలవంటి కనుదోయి కలది, కృష్ణపక్షం అష్టమినాటి చంద్రుని పోలిన ఫాలభాగం కలది, మదించిన తుమ్మెదలను పోలిన శిరోజాలు కలది, మృదువైన సంపెంగ పుష్పానికి సాటివచ్చే అందమైన ముక్కుకలది, చిరునవ్వులు చిందే చూపులుకలది, తామరలవంటి చేతులుకలది.

**క. అనఁదగి సంధ్యారూపం, బున లలనారత్న మపుడు పుట్టిన దానిం**
**గనుఁగొని దానవు లుపగూ, హన మొగిఁ గావించి పలికి రందఱుఁ దమలోన్. 727**

**ప్రతి :** అనన్= అనటానికి; తగి= ఒప్పి; సంధ్యారూపంబునన్= సంధ్యారూపంతో; లలనారత్నము= విలాసవతి; అపుడు; పుట్టినన్= సాక్షాత్కరించగా; దానిన్+కనుగొని= ఆమెను చూచి; దానవులు= రాక్షసులు; ఒగిన్= వెంటనే; ఉపగూహనము+ కావించి= కౌగిలించుకొని; అందఱున్= రాక్షసులందరూ; తమలోనన్= తమలో తాము; పలికిరి= మాట్లాడుకొన్నారు.

**తా :** అలా అనదగిన సంధ్యారూపంతో ఒక విలాసవతి సాక్షాత్కరించింది. అప్పుడా రాక్షసులందరూ ఆమెను చూచి వెంటనే కౌగిలించుకొని తమలో తాము ఇలా మాట్లాడుకొన్నారు.

**విశే :** రాత్రికి పగటికి మధ్యకాలం సంధ్య. సూర్యాస్తమయానికి పూర్వం మూడు గడియల కాలం, సూర్యోదయానికి ముందు ఐదు గడియలకాలం సంధ్యాకాలంగా చెప్పబడింది. మధ్యాహ్నసంధ్య కూడా ఉంది. త్రిసంధ్యలలో ధ్యానం చేయడం కనిపిస్తుంది. 'అహోరాత్రాభ్యామితి వా సంధ్యా' అనడంవల్ల అహోరాత్రాలచే సంధింపబడునది సంధ్య. పైపద్యంలో 'సంధ్యారూపంబు' అనే మాట సౌందర్యరూపం అనే అర్థంలో వాడబడినట్లుంది.

**క. ఈ సౌకుమార్య మీ వయ, సీ సౌందర్యక్రమంబు, నీ ధైర్యంబు,**
**న్నీ సౌభాగ్య విశేషము, నే సతులకుఁగలదు చూడ నిది చిత్ర మగున్. 728**

**ప్రతి :** ఈ సౌకుమార్యము= ఈ సుకుమారత్వం; ఈ వయసు= ఈ యౌవనం; ఈ సౌందర్యక్రమంబు= ఈ సౌందర్యంతీరూ; ఈ ధైర్యంబున్= ఈ గుండె దిటవూ; ఈ సౌభాగ్య విశేషమున్= ఈ వైభవవిశేషమూ; చూడన్= పరికింపగా; ఏ సతులకున్+కలదు= ఏ స్త్రీలకు ఉంది?; ఇది చిత్రము+అగున్= ఇది వింతగా ఉంది.

**తా :** ఈ సుకుమారత్వం, ఈ యౌవనం, ఈ సౌందర్యవిధం, ఈ గాంభీర్యం, ఈ వైభవవిశేషం ఆలోచించి చూస్తే ఏ స్త్రీలకు ఉంటుంది? ఉండదు. ఇది చిత్రంగా ఉంది.

**చ. అని వెఱఁగంది య ద్దనుజు లందఱు నిట్లని రీ తలోదరిం**
**గని మన మంతనుండియును గాముకవృత్తిఁ జరించుచుండఁగా**
**మనయెడ దీని చిత్తమున మక్కువ లేమికి నేమి హేతువో?**
**యని బహుభంగులంబలికి యా ప్రమదాకృతియైన సంధ్యతోన్. 729**

**ప్రతి :** అని; వెఱఁగు+అంది= ఆశ్చర్యపడి; ఆ+దనుజులు+అందఱు= ఆ రాక్షసులందరు; ఇట్లు+అనిరి= ఇలా అనుకొన్నారు; ఈ+తలోదరిన్= సన్నని పొట్టగల ఈ స్త్రీని; కని= చూచి; మనము; అంతనుండియును= అప్పటినుండి; కాముకవృత్తిన్= కామభావంతో; చరించుచు+ఉండఁగాన్= మెలగుతూ ఉండగా; మనయెడన్= మనవిషయంలో; దీని చిత్తమునన్= ఈమె

మనస్సులో; మక్కువలేమికిన్= ఇష్టంలేక పోవడానికి; ఏమి హేతువు+ఓ= కారణం ఏమై ఉంటుంది?; అని; బహుభంగులన్+పలికి= అనేకవిధాలుగా అనుకొంటూ; ఆ ప్రమదా+ఆకృతి+ఐన= స్త్రీరూపంధరించిన; సంధ్యతోన్= సంధ్యాసుందరితో.

**తా :** ఆమెను చూచి ఆ రాక్షసులందరూ ఇలా అనుకొన్నారు. "ఈ అందగత్తెను చూచినప్పటినుండి మనం కామభావంతో తన చుట్టూ తిరుగుతూ ఉండగా ఈమె మనస్సులో మన మీద ఇష్టం లేకపోవడానికి కారణం ఏమై ఉంటుంది?" అని అనేకవిధాలుగా అనుకొంటూ ఆ సంధ్యాసుందరితో–

**వ. ఇట్లనిరి. 730**

**ప్రతి :** ఇట్లు+అనిరి= ఇలా అన్నారు.

**తా :** ఇలా అన్నారు.

**క. ఓ కదళీస్తంభోరువ!, యే కుల? మే జాడదాన? వెవ్వరి సుత? వి**
**ట్లేకాంతంబున నిచ్చట, నే కారణమునఁ జరించె? దెఱిఁగింపు తగన్. 731**

**ప్రతి :** ఓ కదళీస్తంభ+ఊరువు+అ= ఓ అరటి బోదెలవంటి తొడలు కలదానా!; ఏ కులము= నీ కులం ఏది?; ఏ జాడదానవు= ఏ ప్రాంతానికి చెందినదానవు?; (నీ ఊరేది?); ఎవ్వరిసుతవు= ఎవరి కొమార్తెవు?; ఇట్లు+ఏకాంతంబునన్= ఇలా ఒంటరిగా; ఇచ్చటన్= ఇక్కడ; ఏ కారణమునన్+చరించెదు= ఏ కారణంగా తిరుగుతూ ఉన్నావు?; తగన్= తెలిసేటట్లు; ఎఱిగింపు= తెలియజేయి.

**తా :** ఓ అరటిబోదెలవంటి ఊరువులు కలదానా! నీ కులమేది? ఊరేది? ఎవరి కొమార్తెవు? ఇక్కడ ఇలా ఏకాంతంగా ఎందుకు తిరుగుతున్నావు? మాకు తెలియజెప్పు.

**క. భవదీయచారురూప, ద్రవిణలసత్పుణ్యభూమిఁ దగు మోహమునం**
**దవిలిన దుర్భరులను మముఁ, గవయవు పుష్పాస్త్రబాధ ఘనమయ్యెఁ గదే! 732**

**ప్రతి :** భవదీయ= నీయొక్క; చారు= అందమైన; రూప= ఆకార; ద్రవిణ= సంపదతో; లసత్= ఒప్పుచున్న; పుణ్యభూమిన్= పుణ్యభూమిలో; తగుమోహమునన్= మిక్కుటమైన వలపులో; తవిలిన= బంధింపబడిన; దుర్భరులను= భరించలేనివారమైన; మమున్= మమ్మల్ని; కవయవు= కూడవు; పుష్ప+అస్త్రబాధ= మన్మథతాపం; ఘనమయ్యెన్+కదే= ఎక్కువయిందికదే!

**తా :** అందమైన నీ రూపసంపదతో ఒప్పుచున్న పుణ్యభూమిలో నీ వలపులో బంధింపబడి భరించలేని వారమైనాము. అలాంటి మమ్మల్ని నీవు ఎందుకు దగ్గర తీసుకోవడంలేదు? మాకు మన్మథబాధ ఎక్కువయిందికదే!

**విశే :** ప్రమదాకృతి ధరించిన ఆ సంధ్య (సంధ్యాసుందరి) సౌందర్య సంపదతో ఈ భూమి ఎంతో పుణ్యం చేసుకొన్నది. అంటే ఆమె ఈ భూమిపై ప్రభవించడంవల్ల భూమి ఎంతో పుణ్యవంతమైందని భావం.

పుష్పాస్త్రుడు= పువ్వులు బాణములుగా కలవాడు మన్మథుడు.

మన్మథుడికి పంచబాణుడని మరొకపేరుంది. అంటే ఐదురకాల పుష్పాలు బాణాలుగా కలవాడని అర్థం. అరవిందం, అశోకం, చూతం, నవమల్లిక, నీలోత్పలం– అనేవి ఆ ఐదుపుష్పాలు.

**వ. మఱియుఁ దదీయ సౌందర్యంబుగ్గడింప నలవిగాక చింతించుచు. 733**

**ప్రతి :** మఱియున్= ఇంకనూ; తదీయసౌందర్యంబు+ఉగ్గడింపన్= ఆమె అందాన్ని వర్ణించడానికి; అలవిగాక= సాధ్యంకాక, చింతించుచున్= ఆలోచిస్తూ.

**తా :** ఇంకా వాళ్లు ఆమె అందాన్ని వర్ణించడానికి అలవిగాక అంటే మాటలురాక ఆలోచిస్తూ –

**సీ. గురుకుచభారసంకుచితావలగ్నంబు దనరారు నాకాశతలము గాఁగ**
**లలితపల్లవపాణితలమునఁ జెన్నొందు చెండు పతత్పతంగుండు గాఁగ**
**సలలితనీలపేశలపృథుధమ్మిల్లబంధంబు ఘనతమఃపటలి గాఁగఁ**
**ప్రవిమలతరకాంతభావవిలోకన జాలంబు దారకాసమితి గాఁగఁ**

**తే. గడఁగి మైపూఁత సాంధ్యరాగంబు గాఁగ, నంగనాకృతి నొప్పు సంధ్యావధూటిఁ**
**గదిసి మనముల మోహంబు గడలుకొనఁగ, నసురు లందఱుఁ గూడి యిట్టనిరి మఱియు. 734**

**ప్రతి :** గురు= పెద్దవైన; కుచభార= చన్నుల బరువువల్ల; సంకుచిత= సంకోచించిన; అవలగ్నంబు= నడుము; తనరారు= శోభించే; ఆకాశతలము+కాఁగన్= ఆకాశ ప్రదేశంకాగా; లలిత= మృదువైన; పల్లవ= చిగురుటాకువంటి; పాణితలమునన్= చేతియందు; చెన్ను+ఒందు= ప్రకాశించే; చెండు= పూలచెండు; పతత్= పడుతున్న లేక అస్తమిస్తున్న; పతంగుండు+ కాఁగన్= సూర్యుడుకాగా; సలలిత= మృదువైన; నీలపేశల= నల్లని మృదువైన; పృథు= గొప్పదైన; ధమ్మిల్ల బంధంబు= కొప్పుముడి; ఘన= గొప్ప; తమః+పటలి+కాఁగన్= చీకట్లగుంపుకాగా; ప్రవిమలతర= స్వచ్ఛమైన; కాంత= ఇంపైన; భావ= భావాలతో కూడిన; విలోకనజాలంబు= చూపుల సముదాయం; తారకాసమితి+కాఁగన్= నక్షత్రసమూహంకాగా; కడఁగి= పూనికతో పూసుకొన్న; మైపూఁత= అంగరాగం; సాంధ్యరాగంబు+కాఁగన్= సంధ్యాకాలపు అరుణిమ కాగా; అంగనాకృతి+ఒప్పు= స్త్రీ రూపంతో అందగించే; సంధ్యావధూటిన్= సంధ్యాసుందరిని; కదిసి= సమీపించి; మనములన్= మనస్సులలో; మోహంబు= వలపు; కడలుకొనఁగన్= ఎక్కువకాగా; అసురులు+అందఱున్= రాక్షసులందరూ; కూడి= ఆమెను చుట్టుముట్టి; మఱియున్= మరల; ఇట్లు+అనిరి= ఇలా అన్నారు.

**తా :** పెద్దవైన కుచాలభారంవల్ల సంకోచించిన నడుము ఆకాశంకాగా; మృదువైన చిగురాకువంటి చేతిలో ప్రకాశించే పూలచెండు అస్తమించే సూర్యబింబంకాగా; మృదువై నల్లగా మెరుస్తున్న విరివియైన కొప్పుముడి చీకటిగుంపుకాగా, స్వచ్ఛమైన, ఇంపైన భావాలను స్ఫురింపజేసే చూపులు నక్షత్ర సమూహంకాగా; శరీరంపై పూసుకొన్న అంగరాగం అనగా మంచిగంధం సంధ్యారాగం కాగా; స్త్రీరూపం ధరించిన ఆ సంధ్యా సుందరిని మనస్సులలో మోహావేశం ఎక్కువైన ఆ రాక్షసులందరూ చుట్టుముట్టి మళ్లీ ఇలా అన్నారు.

**క. వెలయఁగఁ బద్మంబేక, స్థలముననే యొప్పుఁగాని త్వత్పదపద్మం**
**బిల బహుగతుల ననేక, స్థలములఁ దనరారుఁ గాదె తరుణాబ్జముఖీ! 735**

**ప్రతి :** తరుణ+అబ్జముఖీ= కొత్తగా వికసించిన తామరపువ్వువంటి ముఖం కలదానా!; వెలయఁగన్= ప్రసిద్ధిగా; పద్మంబు= పద్మం; ఏకస్థలమునన్+ఏ+ఒప్పున్= ఒకే స్థలంలోనే ఉంటుంది; కాని; త్వత్+పదపద్మంబు= నీ పాదమనే పద్మం;

ఇలన్= భూమిపై; బహుగతులన్= పలురీతుల; అనేకస్థలములన్= అనేక ప్రదేశాలలో; తనరారున్+కాదు+ఎ= ప్రకాశిస్తున్నాయి కదా!

**తా :** నూతనంగా వికసించిన తామరపువ్వువంటి ముఖం కల ఓ సంధ్యా సుందరీ! పద్మం ఒకే స్థలంలో ఉంటుంది. అది ప్రసిద్ధంగా తెలిసినవిషయం. కానీ నీపాదాలనే పద్మాలు భూమిపై అనేకస్థలాలలో ప్రకాశిస్తున్నాయి కదా!

**విశే :** ఆమె పాదపద్మాలు అనేక ప్రదేశాల్లో కనిపిస్తున్నాయి అంటే ఆమె అనేక ప్రాంతాల్లో సంచరిస్తూ ఉన్నదని అర్థం. ఆమె పాదాలే పద్మాలుగా మారినట్లు చెప్పడంలో ఆమె అతిలోకసౌందర్యం ద్యోతకమవుతున్నది.

**క. అని దనుజులు దమ మనముల, ననురాగము లుప్పతిల్ల నందఱు నా సం**
**ధ్యను బట్టికొనిరి, వనజా, సనుఁ డప్పుడు హృదయమందు సంతస మందెన్. 736**

**ప్రతి :** అని= అని అంటూ; దనుజులు= రాక్షసులు; తమ మనములన్= తమ మనస్సులలో; అనురాగములు+ఉప్పతిల్లన్= ప్రేమలు ఉద్భవించగా; అందఱున్= ఆ రాక్షసులందరూ; ఆ సంధ్యను+పట్టికొనిరి= ఆ సంధ్యా సుందరిని పట్టుకొన్నారు; అప్పుడు; వనజ+ఆసనుఁడు= బ్రహ్మ; హృదయమందున్= మనస్సులో; సంతసము+అందెన్= సంతోషపడినాడు.

**తా :** అని అంటూ మనస్సులలో ప్రేమలు అధికంగా కలగగా ఆ రాక్షసులందరూ ఆ సంధ్యాసుందరిని పట్టుకొన్నారు. ఆ దృశ్యం చూచిన బ్రహ్మ మనస్సులో ఎంతో సంతోషపడినాడు.

**క. సరసిజభవుఁ డయ్యెడఁ దన, కర మాఘ్రాణింప నపుడు గంధర్వులు న**
**ప్సరసలుఁ బుట్టిరి, ధాతయుఁ, బరువడి నాత్మీయతనువుఁ బాసిన నదియున్. 737**

**ప్రతి :** ఆ+ఎడన్= ఆ చోటులో; సరసిజభవుఁడు= పద్మసంభవుడు అనగా బ్రహ్మ; తన కరము+ఆఘ్రాణింపన్= తన చేతిని వాసనచూడగా; అపుడు= ఆ సమయంలో; గంధర్వులున్; అప్సరసలున్+పుట్టిరి= గంధర్వులు, అప్సరసలు పుట్టినారు; ధాతయున్= బ్రహ్మకూడా; పరువడిన్= వెంటనే; ఆత్మీయతనువున్+పాసినన్= తన శరీరాన్ని వదలివేయగా; అదియున్= ఆ శరీరమూ.

**తా :** అక్కడ బ్రహ్మ తన చేతిని వాసన చూశాడు. అప్పుడు గంధర్వులు, అప్సరసలు పుట్టారు. వెంటనే బ్రహ్మకూడా తన శరీరాన్ని వదలివేశాడు. ఆ శరీరం–

**విశే :** గంధర్వులను, అప్సరస్త్రీలను దేవతాభేదాలుగా అమరకోశం పేర్కొన్నది.

**విద్యాధరోప్సరో యక్షరక్షోగంధర్వకిన్నరాః**
**పిశాచో గుహ్యకస్సిద్ధో భూతో౽మీ దేవయోనయః**

సువాసనను పొందినవారు గంధర్వులు (సౌరభం గంధం అర్వన్తి గంధర్వాః), నీటిలో పుట్టినారు అప్సరసలు (అద్భ్యఃసరన్తీతి అప్సరసః), రంభామేనకాదులు అప్సరసలు.

**వ. చంద్రికారూపంబైన, తద్గాత్రంబు విశ్వావసు పురోగములగు గంధర్వాప్సరోగణంబులు గైకొనిరి. వెండియుం గమలగర్భుండు తంద్రోన్మాద జృంభికా నిద్రా రూపంబైన శరీరంబు దాల్చి పిశాచ గుహ్యక**

**సిద్ధ భూత గణంబులం బుట్టించిన వారలు దిగంబరులు, ముక్తకేశులు నయినం జూచి ధాత లోచనంబులు ముకుళించి తద్గాత్రంబు విసర్జనంబు గావించిన నది వారలు గైకొనిరి, వెండియు నజుండు దన్ను నన్నవంతునింగాఁ జింతించి యదృశ్యదేహుం డగుచుం బితృ సాధ్యగణంబులం బుట్టించిన వారలు దమ్ముఁ బుట్టించిన యదృశ్య శరీరంబునకుం గార్యంబగు దేవభాగంబుఁ గైకొనినం దత్కారణంబునం బితృసాధ్యగణంబుల నుద్దేశించి శ్రాద్ధంబుల హవ్యకవ్యంబు లాచరింతురు, మఱియును. 738**

**ప్రతి :** చంద్రికారూపంబు+ఐనన్= (బ్రహ్మ వదలివేసిన శరీరం) వెన్నెలరూపం పొందగా; తద్+గాత్రంబున్= ఆ శరీరాన్ని; విశ్వావసు= విశ్వావసువు; పురోగములు+అగు= అగ్రేసరుడుగాగల–విశ్వావసువు మొదలుగాగల; గంధర్వ+అప్సరస్+గణంబులు= గంధర్వులు, అప్సరసలు వీరి సమూహాలు; కైకొనిరి= గ్రహించారు; వెండియున్= మరల; కమలగర్భుండు= బ్రహ్మ; తంద్రా= కునుకుపాటు; ఉన్మాద= ఉన్మాదం; జృంభికా= ఆవులింత; నిద్రా= నిద్ర; రూపంబు+ఐన= ఆకృతిగల; శరీరంబు+తాల్చి= శరీరం ధరించి; పిశాచ; గుహ్యక; సిద్ధ; భూత; గణంబులన్= పిశాచాలూ, యక్షులూ, సిద్ధులూ, భూతాలూ అనేవారి సమూహాలను; పుట్టించినన్= పుట్టించగా; వారలు; దిగంబరులు= దెసమొలవారు; ముక్తకేశులున్= వెంద్రుకలు విరబోసుకొన్నవారు; అయినన్+చూచి= కాగావారిని చూచి; ధాత= బ్రహ్మ; లోచనంబులు= కన్నులు; ముకుళించి= మూసుకొని; తద్+గాత్రంబున్= ఆ శరీరాన్ని; విసర్జనంబు+కావించినన్= వదలి వేయగా; అది= ఆ శరీరం; వారలు= పిశాచాదులు; కైకొనిరి= తీసుకున్నారు; వెండియున్= మరల; అజుండు= బ్రహ్మ; తన్నున్= తనను; అన్నవంతునిన్+కాన్+చింతించి= అన్నవంతునిగా భావించి; అదృశ్యదేహుండు+అగుచున్= అదృశ్యశరీరుడై; పితృసాధ్యగణంబులన్= పితృదేవతల, సాధ్యుల సమూహాలను; పుట్టించినన్= జనింపజేయగా; వారలు= ఆ పితృదేవతాదులు; తమ్మున్+పుట్టించిన= తమను జన్మింపజేసిన; అదృశ్యశరీరంబునకున్= కానరానిది దేహానికి; కార్యంబు+అగు= కార్యమైన; దేవభాగంబున్= దేవభాగాన్ని; కైకొనినన్= తీసుకోగా; తద్+కారణంబునన్= ఆ కారణంవల్ల; పితృసాధ్యగణంబులన్; ఉద్దేశించి; శ్రాద్ధంబులన్= శ్రాద్ధములలో; హవ్యకవ్యంబులు+ఆచరింతురు= హవ్యకవ్యాలను సమర్పిస్తారు; మఱియునున్= ఇంకనూ;

**తా :** వెన్నెలరూపం పొందిన ఆ శరీరాన్ని విశ్వావసువు మొదలగు అగ్రేసరులైన గంధర్వులు, అప్సరసలు గ్రహించారు. మరలా బ్రహ్మ కునుకుపాటు, ఉన్మాదం, ఆవులింత, నిద్రలతో కూడిన శరీరం ధరించి పిశాచ గుహ్యక సిద్ధభూత సమూహాలను పుట్టించాడు. వాళ్లు దిగంబరులై వెంద్రుకలు విరబోసుకొని ఉండడం చూచి బ్రహ్మ కన్నులు మూసుకొని ఆ శరీరాన్ని వదలివేశాడు. అలా వదలివేయబడిన శరీరాన్ని పిశాచ గుహ్యకాదులు తీసుకొన్నారు. తరువాత బ్రహ్మ తనను అన్నవంతుడుగా భావించి అదృశ్యశరీరుడై పితృదేవతల సాధ్యుల సమూహాలను పుట్టించాడు. వాళ్లు తమను పుట్టించిన అదృశ్యశరీరానికి కార్యమైన దేవభావాన్ని గ్రహించారు. ఆ కారణం చేత పితృగణాలను, సాధ్యగణాలను ఉద్దేశించి హవ్యకవ్యాలను సమర్పిస్తారు.

**విశే :** బ్రహ్మ తనను అన్నవంతునిగా భావించాడు అంటే జ్ఞానవంతునిగా అనుకొన్నాడని అర్థం. అంటే లోకజ్ఞానమంతా పొందినవాడని అర్థం. బ్రహ్మ సృష్టిక్రమాన్ని ఏర్పరచే పనిలో ఉన్నాడు కాబట్టి ఆయనకు లోకజ్ఞానం అవసరం. సృష్టిలో ఏయే ప్రాణులను ఎలా యెలా సృష్టించాలో తెలియడం లోకజ్ఞానం. 'అన్నం' అంటే దేనిని తిని ప్రాణిబ్రతుకుతుందో అది. ఆహారం అని సాధారణార్థం. అనాత్మ ప్రపంచమని విశేషార్థం. దీనివల్లనే జ్ఞానం కలుగుతుంది. అందువల్ల జ్ఞేయప్రపంచమంతా 'అన్నం' అనే మాటద్వారా వ్యక్తమవుతుంది.

**శ్రాద్ధం –** శాస్త్రోక్తంగా నిర్వహించే పితృకర్మ శ్రాద్ధం. ఆబ్దికం అని కూడా దీనికి పేరు. మృతులైన పితరులకు పిండప్రదానాలు చేయడం శ్రాద్ధక్రియ.

**హవ్యం –** దేవతలకు సమర్పించే అన్నం. అంటే దేవతలను ఉద్దేశించి అగ్నిలో సమర్పించే అన్నమని అర్థం.

**కవ్యం –** పితృదేవతలకు సమర్పించే అన్నం.

'హవ్యకవ్యే దైవపైత్రే అన్నే' – అని అమరకోశం చెపుతున్నది. దేవతలకు, పితృదేవతలకు సమర్పించే అన్నానికి హవ్యమని, కవ్యమని పేర్లు.

**సీ. సజ్జనస్తుత!, విను చతురతఁ బంకజాసనుఁడు దిరోధానశక్తివలన**
**నరసిద్ధవిబుధకిన్నరులను బుట్టించి తవిలి వారికిఁ దిరోధాననామ**
**ధేయ మైనట్టి యా దేహంబు నిచ్చెను వెండియు భారతీవిభుఁడు దనకుఁ**
**బ్రతిబింబ మగు శరీరమునఁ గిన్నరులఁ గింపురుషులఁ బుట్టింపఁ బూని వారు**

**తే. ధాతృప్రతిబింబదేహముల్ దాల్చి వరుస, నిద్ద ఱిద్దఱు గవగూడి యింపులొదవ**
**బ్రహ్మపరమైన గీతముల్ పాడుచుండి, రంతఁ బంకజసంభవుఁ డాత్మలోన. 739**

**ప్రతి :** సజ్జనస్తుత= మంచివారిచేత స్తుతింపబడే ఓ పరీక్షిన్మహారాజా!; విను= వినండి; పంకజాసనుఁడు= బ్రహ్మ; చతురతన్= నేర్పుతో; తిరోధానశక్తివలనన్= అదృశ్యశక్తివల్ల; నరసిద్ధ విబుధ కిన్నరులను+పుట్టించి= నరులను, సిద్ధులను, దేవతలను, కిన్నరులను పుట్టించి; తవిలి= యత్నించి; వారికిన్= నరసిద్ధాదులకు; తిరోధాననామధేయము+ఐనట్టి= తిరోధానము అనే పేరుగల; ఆ దేహంబును+ఇచ్చెను= ఆ శరీరాన్ని ఇచ్చాడు; వెండియున్= తరువాత; భారతీవిభుఁడు= సరస్వతీదేవిభర్త అనగాబ్రహ్మ; తనకున్= తనకు; ప్రతిబింబము+అగు= ప్రతిబింబమైన; శరీరమునన్= శరీరమునుండి; కిన్నరులన్+కింపురుషులన్= కిన్నరులను, కింపురుషులను; పుట్టింపన్= పుట్టించగా; వారు= కిన్నరాదులు; పూని= పనిబూని; వరుసన్= వరుసగా; ఇద్దఱు+ఇద్దఱు= ఇద్దరిద్దరు; కవగూడి= జతగూడి; ఇంపులు+ఒదవన్= ఎంతో ఆసక్తితో; బ్రహ్మపరము+ఐన= బ్రహ్మకు సంబంధించిన; గీతముల్= పాటలు; పాడుచుండిరి= గానంచేస్తూ ఉన్నారు; అంతన్= తరువాత; పంకజసంభవుండు= పద్మగర్భుడు అనగా బ్రహ్మ; ఆత్మలోన్= ఆత్మలో.

**తా :** సజ్జనస్తుతుడవైన ఓ పరీక్షిన్మహారాజా! విను. బ్రహ్మ నేర్పుతో అదృశ్యశక్తివల్ల నరులను, సిద్ధులను, విబుధులను, కిన్నరులను పుట్టించాడు. వాళ్లకు తిరోధానము అనే పేరుగల శరీరాలను ఇచ్చాడు. తరువాత బ్రహ్మ తనకు ప్రతిబింబమైన శరీరంనుండి కిన్నరులను, కింపురుషులను పుట్టించాడు. వాళ్లు బ్రహ్మదేవుని ప్రతిబింబాలైన శరీరాలను ధరించి ఇద్దరిద్దరు జతగూడి బ్రహ్మదేవునికి సంబంధించిన గీతాలను గానం చేస్తూ ఉన్నారు. తరువాత బ్రహ్మ ఆత్మలో–

**విశే :** మాయమైపోవడం, అంతర్ధానమైపోవడం అనేది ఒక శక్తి. ఈ శక్తి దేవతలకు ఉంటుంది. ఇలా మాయంకాగలిగిన శక్తికి తిరోధానశక్తి అనిపేరు. బ్రహ్మతనకు ప్రతిబింబంగా ఉన్న శరీరం నుండి కిన్నరులను కింపురుషులను సృష్టించడంవల్ల దేవతలతోపాటు వీళ్లకూ తిరోధానశక్తి ఉంటుంది.

అశ్వముఖం కలిగినవారు కిన్నరులు. 'కించిత్పురుషః కింపురుషః' అనే వ్యుత్పత్తిని బట్టి కొద్దిగా పురుషాకృతి కలిగినవారు కింపురుషులు. విశేషంగా తెలిసినవారు విబుధులు.

**క. తన సృష్టి వృద్ధి లేమికిఁ, గనలుచు శయనించి చింతఁ గరచరణాదుల్**
**గొనకొని కదలింపఁగ రా, లిన రోమము లుగ్రకుండలివ్రజ మయ్యెన్. 740**

**ప్రతి :** తనసృష్టి= తానుచేసిన సృష్టి; వృద్ధిలేమికిన్= వృద్ధి పొందకుండా ఉండడానికి; కనలుచున్= కోపపడుతూ; శయనించి= పండుకొని; చింతన్= బాధతో; కరచరణ+ఆదుల్= కాళ్లూ చేతులూ; గొనకొని= పూనుకొని; కదలింపఁగన్= చలింపజేయగా, రాలిన; రోమములు= వెంట్రుకలు; ఉగ్ర= భయంకరమైన; కుండలివ్రజము+అయ్యెన్= పాముల సమూహంగా మారాయి.

**తా :** బ్రహ్మ తాను చేసిన సృష్టి వృద్ధి చెందకపోవడంవల్ల కోపపడినాడు. ఎంతో బాధపడినాడు. తన కాళ్లూ చేతులూ గట్టిగా విదిలించాడు. అలా విదిలించడంవల్ల రాలిన వెంట్రుకలన్నీ సర్పాలుగా మారినాయి.

**క. వనజజుఁడు దన్నుఁ గృత కృ, త్యునిఁగా భావించి యాత్మఁ దుష్టి వహింపన్**
**మనమున నిఖిలజగత్పా, వను లగు మనులం ద్రిలోకవరుల సృజించెన్. 741**

**ప్రతి :** వనజజుఁడు= బ్రహ్మ; తన్నున్= తనను; కృతకృత్యునిన్+కాన్= పనినెరవేరినవానిగా; భావించి= తలచి; ఆత్మన్= ఆత్మలో; తుష్టివహింపన్= సంతోషపడగా; మనమునన్= మనస్సునుండి; నిఖిలజగత్+పావనులు+అగు= సమస్తలోకాలలో పవిత్రులగు; త్రిలోకవరులన్= ముల్లోకాలలో శ్రేష్ఠులైన; మనులన్= మనువులను; సృజించెన్= సృష్టించాడు.

**తా :** బ్రహ్మ తన పని నెరవేరినట్లు భావించాడు. తన ఆత్మలో సంతోషపడి సమస్తలోకాలలో పవిత్రులైనవారు, త్రిలోకాలలో శ్రేష్ఠులైనవారు అయిన మనువులను సృష్టించాడు.

**విశే :** మన్వంతరాలు ఎవరి పేరుమీద ఏర్పడ్డాయోవారు మనువులు, బ్రహ్మ లోకపాలనకోసం మనువులను సృష్టించాడు.

**సీ. పుట్టించి వారికిఁ బురుషరూపంబైన తన దేహ మిచ్చినఁ దగిలి వారు**
**గనుఁగొని మున్ను పుట్టినవారిఁ గూడి యా వనజసంభవున కిట్టనిరి, దేవ!**
**యఖిలజగత్స్రష్టవైన నీచేతఁ గావింపంగఁబడిన యీ వితతసుకృత**
**మాశ్చర్యకరము, యజ్ఞాదిక్రియాకాండ మీ మనుసర్గమం దీడ్య మయ్యెఁ**

**తే. దద్ధవిర్భాగములు మాకుఁ దవిలి జిహ్వ, లందు నాస్వాదనములు సేయంగఁ గలిగె**
**ననుచు మనముల హర్షంబు లతిశయిల్ల, వినుతి సేసిరి భారతీవిభుని మఱియు. 742**

**ప్రతి :** పుట్టించి= అలా మనువులను పుట్టించి; వారికిన్= ఆ మనువులకు; పురుషరూపంబు+ఐన= మగవాని రూపంగల; తనదేహము+ఇచ్చినన్= తన శరీరం ఇవ్వగా; తగిలి= లేచి; వారు; కనుఁగొని= చూచి; మున్ను= తమకంటె ముందుగా; పుట్టినవారిన్+కూడి= సృష్టింపబడినవాళ్లతో కలిసి; ఆ వనజసంభవునకున్= ఆ బ్రహ్మతో; ఇట్లు+అనిరి= ఇలా అన్నారు; దేవ= బ్రహ్మదేవా!; అఖిలజగత్+స్రష్టవు+ఐన= సకలలోకాలకు సృష్టికర్తవైన; నీ చేతన్= నీ చేత; కావింపంగన్+పడిన= చేయబడిన; ఈ వితత సుకృతము= విపులమైన మంగళకార్యం, అనగా విస్తారంగాచేసిన సృష్టి; ఆశ్చర్యకరము= మిక్కిలి అచ్చెరువు గొలుపుతూ ఉంది; యజ్ఞ+ఆది+క్రియాకాండము= యజ్ఞాలు మొదలైన క్రియలన్నీ; ఈ మనుసర్గమందున్= ఈ మనువులను సృష్టించడంలో; ఈడ్యము+అయ్యెన్= ప్రశంసనీయమైంది; తద్+హవిర్భాగములు= ఆ యజ్ఞ క్రియలలో సమర్పింపబడే హోమద్రవ్యభాగాలు; మాకున్+తవిలి= మమ్మల్ని అంటుకొని; జిహ్వలందున్= నాలుకలలో; ఆస్వాదనములు=

చవిచూచుటలు; చేయంగన్+కలిగెన్= చేయడం సాధ్యమైంది; అనుచున్= అంటూ; హర్షంబులు+అతిశయిల్లన్= సంతోషాలు అధికమవుతూ ఉండగా; భారతీ విభునిన్= సరస్వతీపతిని అనగా బ్రహ్మను; మఱియున్= ఇంకనూ; వినుతి+చేసిరి= స్తుతిచేశారు.

**తా :** అలా మనువులను పుట్టించి బ్రహ్మ వాళ్లకు పురుషరూపమైన తన శరీరాన్ని ఇచ్చాడు. ఆ మనువులు తమకంటె ముందుగా సృష్టింపబడిన వాళ్లతో కలిసి బ్రహ్మతో ఇలా అన్నారు. 'ఓ బ్రహ్మదేవా! సకలలోకాలకూ సృష్టికర్తవైన నీవు చేసిన ఈ విశాలమైన, మంగళకరమైన సృష్టి ఎంతో ఆశ్చర్యకరంగా ఉంది. యజ్ఞాది క్రియలన్నీ మనువులను సృష్టించడంవల్ల ప్రశంసనీయమైనాయి. యజ్ఞక్రియలలో సమర్పింపబడే హోమద్రవ్య భాగాలను నాలుకలతో చవిచూచే అవకాశం మాకు కలిగింది' అంటూ అధికమైన సంతోషం పొందుతూ బ్రహ్మదేవుని ప్రస్తుతించారు.

**విశే :** మనువు మొదటి పాలకుడు. మనువుకు ప్రజాపతి అని కూడా పేరు. ఒక మనువు పాలనాకాలానికి మన్వంతరం అనిపేరు. 71 మహాయుగాలు ఒక మన్వంతరం. మనువులు 14 మంది ఉన్నారు. ప్రతి మనువు పేరుమీద మన్వంతరం ఏర్పడుతుంది. స్వాయంభువుడు, స్వారోచిషుడు, ఉత్తముడు, తామసుడు, రైవతుడు, చాక్షుషుడు, వైవస్వతుడు, సూర్యసావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, రుద్రసావర్ణి, ధర్మసావర్ణి, ఇంద్రసావర్ణి, భౌమ్యసావర్ణి – అని పదునలుగురు మనువులు. ఆరు మన్వంతరాలు గడిచిపోయాయి. ప్రస్తుతం ఏడవ మన్వంతరమైన వైవస్వత మన్వంతరం జరుగుతూ ఉంది. వైవస్వత మన్వంతరంలో 27 మహాయుగాలు గడచిపోయాయి. ప్రస్తుతం కలియుగం ప్రథమపాదం నడుస్తున్నది. పదునాలుగు మన్వంతరాల కాలం బ్రహ్మకు ఒకరోజుతో సమానమవుతుంది.

**వ. వరతపోయోగ విద్యా సమాధి యుక్తం బగుచు ఋషివేషధరుండును, హృషీకాత్ముండునునై ఋషిగణంబులం బుట్టించి సమాధి యోగైశ్వర్య తపో విద్యా విరక్తి యుక్తంబగు నాత్మీయ శరీరాంశంబు వారికిం గ్రమంబున నొక్కొక్కనికి నిచ్చెనని మైత్రేయుండు సెప్పిన విని విదురుండు పరమానందంబునం బొంది గోవిందు చరణారవిందంబులు డెందంబునందలంచి వెండియు మైత్రేయునింజూచి యిట్లనియె. 743**

**ప్రతి :** వర= శ్రేష్ఠమైన; తపస్+యోగ= తపస్సు యోగము; విద్యా= విద్య; సమాధియుక్తంబు+అగుచున్= సమాధితో కూడినదైన; ఋషివేషధరుండును= ఋషివేషం ధరించినవాడూ; హృషీక+ఆత్ముండును+ఐ= ఇంద్రియాలతో కూడిన ఆత్మస్వరూపుడునూ ఐ; ఋషిగణంబులన్+పుట్టించి= ఋషుల సమూహాన్ని సృష్టించి; సమాధి; యోగ+ఐశ్వర్య= యోగం ఐశ్వర్యం; తపస్= తపస్సు; విద్యా= విద్య; విరక్తియుక్తంబు+అగు= వైరాగ్యాలతో కూడిన; ఆత్మీయ= తన దైన; శరీర+అంశంబు= శరీరభాగాన్ని; వారికిన్= ఆ ఋషులకు; క్రమంబునన్= వరుసగా; ఒక్కొక్కనికిన్= ఒక్కొక్కరికి వేరువేరుగా; ఇచ్చెను+అని= ఇచ్చాడని; మైత్రేయుండు= మైత్రేయమహర్షి; చెప్పినన్+విని= చెప్పగా విని; విదురుండు= విదురుడు; పరమ+ఆనందంబునన్= మిక్కిలి సంతోషాన్ని; పొంది= ఆ విషయాలన్నీ తెలుసుకొని; గోవిందు= గోవిందుని; చరణ+అరవిందంబులు= పద్మాలను పోలిన పాదాలను; డెందంబునన్= మనస్సులో; తలంచి= స్మరించి; వెండియున్= మరల; మైత్రేయునిన్+చూచి= మైత్రేయమహర్షిని కనుగొని; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** మనువులను సృష్టించిన తరువాత బ్రహ్మ శ్రేష్ఠమైన తపస్సు, యోగం, విద్య, సమాధులతో కూడిన ఋషివేషం ధరించి, ఇంద్రియాలతో కూడిన ఆత్మస్వరూపుడై ఋషుల సముదాయాన్ని సృష్టించాడు. వాళ్లకు తన శరీరాంశాలైన సమాధి,

యోగం, ఐశ్వర్యం, తపస్సు, విద్య వైరాగ్యం అనే వాటిని క్రమంగా ఒక్కొక్కఋషికి ప్రదానం చేశాడు అని మైత్రేయమహర్షి తెలియజేయగా ఆ విషయాలను పరమానందంతో అందుకొన్న విదురుడు గోవిందుని పాదారవిందాలను మనస్సులో స్మరించి మళ్లీ మైత్రేయుని చూచి ఇలా అన్నాడు.

**విశే :** తపస్సు, యోగం, విద్య, సమాధి ఇత్యాదులన్నీ ఆర్ష లక్షణాలు. ఈ లక్షణాలున్నవాడే ఋషి.

**హృషీకాత్ముండు –** ఇంద్రియాలతో కూడిన ఆత్మస్వరూపుడు. స్వకర్మ ఫలాన్ని అనుభవించేది ఆత్మ. ఇంద్రియాల మూలంగా శరీరం చేసే కర్మలద్వారా ఏర్పడే ఫలానికి భోక్త ఆత్మ. ఇంద్రియాలు మూడు విధాలు.

**1. కర్మేంద్రియాలు –** వాక్కు, పాణి, పాదం, పాయువు (మలద్వారం), ఉపస్థ అనేవి.

**2. జ్ఞానేంద్రియాలు –** త్వక్కు (చర్మం), చక్షువు, శ్రోత్రం, జిహ్వ, ఘ్రాణం అనేవి.

**3. అంతరింద్రియాలు –** మనోబుద్ధి చిత్త అహంకారాలు.

**యోగం –** 'యోగశ్చిత్తవృత్తి నిరోధః' అనే పాతంజలసూత్రాన్ననుసరించి చిత్తవృత్తులను నిరోధించడం యోగం.

**విద్య –** ఆధ్యాత్మికవిద్యే విద్య. లౌకికంగా చతుర్దశవిద్యలు, అష్టాదశవిద్యలు ఉన్నాయి.

**సమాధి –** యమ నియమాది అష్టాంగాలలో చివరిది సమాధి. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులు అష్టాంగాలు. ఇంద్రియాలను జయించడం, అదుపులో ఉంచడం, అహింసను పాటించడం మొదలైనవి అష్టాంగాలలో ముఖ్యమైనవి.

సమాధి అంటే చక్కగా నిలపడం అని అర్థం. స్థిరమైన మనోగతి సమాధి. మనస్సును ఆత్మరూపంతో ఏకంచేసి అందులోనే నిలిపి ఉంచడం సమాధి.

**సీ. వరగుణస్వాయంభువమనువంశంబిలఁ బరమసమ్మతము, దప్పదు, తలంపఁ**
**గొనకొని తద్వంశమున మిథునక్రియఁ జేసి ప్రజావృద్ధిఁ జెప్పి తీవు,**
**అదియునుగాక స్వాయంభువమనువుకుఁ బూని ప్రియవ్రతోత్తానపాదు**
**లను నందనులు గల రంటివి, వారు సప్తద్వీపవతియైన ధాత్రి నెల్ల**

**తే. ధర్మమార్గంబు లేమియుఁ దప్పకుండ, ననఘులై యెట్లు పాలించిరయ్య? వారి**
**చరిత యెల్లను సత్కృపానిరతబుద్ధి, నెఱుఁగ వినిపింపు నాకు మునీంద్రచంద్ర! 744**

**ప్రతి :** వరగుణ= ఉత్తమ గుణాలుగల మైత్రేయమహర్షీ!; ఇలన్= భూమిమీద; స్వాయంభువ మనువంశంబు= స్వాయంభువమనువువంశం; తలంపన్= ఆలోచించగా; పరమసమ్మతము= మిక్కిలి అంగీకరింపబడినది అనగా సంప్రదాయబద్ధంగా ధర్మబద్ధంగా నడచుకొనేది; తప్పదు= ధర్మమార్గం వీడదు; నీవు= నీవు (మైత్రేయుడు); కొనకొని= యత్నించి; తద్+వంశమునన్= ఆ స్వాయంభువ మనువంశంలో; మిథునక్రియన్+చేసి= సాంసారిక వ్యవస్థతో (స్త్రీ పురుషసంయోగంతో); ప్రజావృద్ధిన్+చెప్పితివి= సంతానం వృద్ధి పొందిందని చెప్పావు; అదియును+కాక= అంతేకాక; స్వాయంభువమనువునకున్+పూని= స్వాయంభువమనువుకు; ప్రియవ్రత+ఉత్తానపాదులు+అను= ప్రియవ్రతుడు,

ఉత్తానపాదుడు అనే; నందనులు= కుమారులు, కలరు+అంటివి= ఉన్నారని అన్నావు; వారు= ఆ ప్రియవ్రత ఉత్తానపాదులు; సప్తద్వీపవతి+ఐన= ఏడుదీవులతో కూడిన; ధాత్రిని+ఎల్లన్= భూమినంతటినీ; ధర్మమార్గంబులు+ఏమియున్= ధర్మమార్గాలలో ఏ మాత్రమూ; తప్పకుండన్= తప్పకుండా; న+అఘులు+ఐ= పుణ్యప్రవర్తకులై; ఎట్లు= ఏ విధంగా; పాలించిరి+అయ్య= పరిపాలన చేశారయ్యా?; వారిచరిత+ఎల్లను= ప్రియవ్రత ఉత్తానపాదుల చరిత్రంతా; ముని+ఇంద్రచంద్ర= శ్రేష్ఠమునిచంద్రమా!; సత్+కృపానిరత+బుద్ధిన్= మంచి దయతో కూడిన బుద్ధితో; నాకు; ఎఱుంగన్= తెలిసేటట్లు; వినిపింపు= చెప్పు.

**తా :** సుగుణ సంపదగల ఓ మైత్రేయమహర్షీ! భువిలో స్వాయంభువమనువంశం సంప్రదాయాన్నీ, ధర్మాన్నీ తప్పకుండా నడచుకొనేదని, ఆ వంశంలో సాంసారికవ్యవస్థతో అనగా స్త్రీపురుషసంయోగంతో సంతానం వృద్ధి పొందిందని చెప్పావు. అంతేగాక స్వాయంభువమనువుకు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే ఇద్దరు కుమారులు ఉన్నారనీ అన్నావు. ఆ ఇరువురు ఏడుదీవులతో కూడిన భూమినంతటినీ ధర్మమార్గాలు ఏమాత్రం తప్పకుండా పుణ్యప్రవర్తకులై ఎలా పాలించారు? ఓ మునీంద్రచంద్రమా! వాళ్ల చరిత్రనంతటినీ దయార్ద్రబుద్ధితో నాకు అర్థమయేటట్లు చెప్పు.

**విశే :** మిథునక్రియ అంటే స్త్రీపురుష సంయోగం. 'స్త్రీ పుంసౌ మిథునం ద్వంద్వం' అని అమరకోశం చెపుతుంది. దీన్ని బట్టి స్త్రీ పురుషుల జంట మిథునం. మిథునానికి సంబంధించినది మైథునం. ఈ మాటకు స్త్రీసంగమని అర్థం. మైథునమే మిథునక్రియ. మిథునమంటే స్త్రీ పురుషుల జంట అని చెప్పినపుడు ఆ స్త్రీ పురుషులు ఎవరో ఎవరో కాకూడదు. వాళ్లు భార్యాభర్తలుగానే ఉండాలి. భార్యాభర్తలనే మిథునమనాలి. భార్యాభర్తలైనవారి సంగమంవల్లనే వంశవృద్ధి జరగాలని శాస్త్రవిధి. భారతీయ వివాహవ్యవస్థ సత్సంతానం కోసమే ఏర్పాటైంది. దీనివల్ల వంశవృద్ధి, తద్వారా ప్రపంచవృద్ధి జరుగుతుంది. సత్సంతానం ఉత్తమ పౌరులుగా వంశాభివృద్ధికి కారణమవుతుంది. అందువల్ల మిథునక్రియ భారతీయ వివాహవ్యవస్థలో ఒక పవిత్రకార్యం. మిథునేతర సంయోగం అవాంఛనీయం, పాప పంకిలం.

సప్తద్వీపాలు – చుట్టూనీళ్లు ఉన్న భూమిని 'ద్వీపం' అంటారు. విశ్వంలో అలాంటి ద్వీపాలు ఏడు ఉన్నాయి. 1. జంబూద్వీపం, 2. ప్లక్షద్వీపం, 3. శాల్మలీద్వీపం, 4. కుశద్వీపం, 5. క్రౌంచద్వీపం, 6. శాకద్వీపం, 7. పుష్కరద్వీపం ఈ ఏడుద్వీపాలలో భారతదేశం జంబూద్వీపంలో ఉంది.

**వ. అదియునుంగాక తన్మనుపుత్రియు యోగలక్షణ సమేతయు నగు దేవహూతి యను కన్యకారత్నంబును స్వాయంభువుండు గర్దమునకు నే విధంబునం బెండ్లి చేసె? నా దేవహూతి యందు మహాయోగి యయిన కర్దముండు ప్రజల నేలాగునం బుట్టించె? నదియునుం గాక కర్దముండు రుచి యను కన్యను దక్షప్రజాపతి కిచ్చె నని చెప్పితివి, ఆ రుచియందు నమ్మహాత్ముం డీ సృష్టి యేలాగునం బుట్టించె? నవి యన్నియుం దెలియ నానతీయ వలయునని యడిగిన విదురునకు మైత్రేయుండిట్లనియె. 745**

**ప్రతి :** అదియున్+కాక= అంతేగాకుండా; తద్+మనుపుత్రియున్= ఆ మనువు కుమార్తె; యోగలక్షణ సమేతయును+అగున్= అదృష్టజాతక లక్షణాలతో కూడినది అయిన; దేవహూతి+అను= దేవహూతి అనే పేరుగల; కన్యకారత్నంబును= కన్యారత్నాన్ని; స్వాయంభువుండు= స్వాయంభువమనువు; కర్దమునకున్= కర్దమ ప్రజాపతికిచ్చి, ఏ విధంబునన్= ఏ రీతిగా; పెండ్లి+చేసెన్= వివాహంచేశాడు; ఆ దేవహూతియందున్= ఆ దేవహూతి అనే మనువుకుమార్తె వలన; మహాయోగి+అయిన= యోగీశ్వరుడైన;

కర్దముండు= కర్దమ ప్రజాపతి; ప్రజలన్= బిడ్డలను (సంతానాన్ని); ఏలాగునన్+పుట్టించెన్= ఎలా కన్నాడు?; అదియున్+కాక= అంతేకాక; కర్దముండు; రుచి+అను= రుచి అనే పేరుగల; కన్యను; దక్షప్రజాపతికి; ఇచ్చెను+అని= ఇచ్చి వివాహం జరిపించాడని; చెప్పితివి= నుడివితివి; ఆ రుచియందు; ఆ+మహాత్ముండు= మహాత్ముడైన ఆ దక్షప్రజాపతి; ఈ సృష్టి= ఈ ప్రజాసృష్టిని (ప్రజలను); ఏలాగునన్+పుట్టించెన్= ఎలా జన్మింపజేశాడు?; అవి+అన్నియున్= ఆ విషయాలన్నీ; తెలియన్= అర్థమయ్యేటట్లు; ఆనతీయవలయును+అని= వివరంగా తెలుపుమని; అడిగినన్= అడుగగా; విదురునకున్= విదురునితో; మైత్రేయుండు= మైత్రేయమహర్షి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు (చెప్పాడు).

**తా :** అంతేకాకుండా ఆ స్వాయంభువ మనువు అదృష్టజాతక లక్షణాలతో కూడిన తన కొమార్తె దేవహూతి అనే కన్యారత్నాన్ని కర్దముడనే ప్రజాపతికి ఇచ్చి ఏ విధంగా వివాహం చేశాడు? ఆ దేవహుతివలన మహాయోగీశ్వరుడైన కర్దమప్రజాపతి ఎలా సంతానాన్ని పొందాడు? అదీగాక ఆ కర్దమప్రజాపతి తన పుత్రిక రుచి అనే కన్యను దక్షప్రజాపతికిచ్చి వివాహం చేశాడని చెప్పావు. ఆ రుచియందు దక్షప్రజాపతి ప్రజలను ఎలా సృష్టించాడు. ఈ విషయాలన్నీ అర్థమయ్యేటట్లు వివరంగా తెలియజేయుమని విదురుడు మైత్రేయుని అడిగాడు. అపుడు మైత్రేయుడు ఇలా అన్నాడు.

**విశే :** స్రష్టా ప్రజాపతి ర్వేధా విధాతా విశ్వసృడ్విధిః అని అమరకోశంలో బ్రహ్మకు పలు పేర్లున్నాయి. ఈ పేర్లలో ప్రజాపతి ఒకటి. ప్రజలకు పతి అని ఆ మాటకర్థం (ప్రజానాం పతిః). బ్రహ్మ ముందు మరీచి, అత్రి, అంగీరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వశిష్ఠుడు, దక్షుడు, భృగువు, నారదుడు అనే పదిమందిని సృష్టించి వారిద్వారా ప్రజాసంతతిని వృద్ధిచేసినట్లు పురాణాలు చెపుతాయి. వీళ్లను బ్రహ్మ లేక ప్రజాపతి అని కూడా అనడం ఉంది. వీళ్లలో దక్షప్రజాపతి ఒకడు.

## ✤ కర్దముఁడు భగవదనుజ్ఞ వడసి దేవహూతిని బెండ్లియాడుట ✤

**క. విను మనఘ!, కృతయుగంబున, మునినాథుండయిన కర్దముఁడు ప్రజల సృజిం**
**పను వనజసంభవునిచే, త నియుక్తుండగుచు మది ముదము సంధిల్లన్. 746**

**ప్రతి :** అనఘ= పుణ్యాత్ముడైన విదురా!; విను= ఆలకించు; కృతయుగంబునన్= కృతయుగంలో; మునినాథుండు+అయిన= మునీశ్వరుడైన; కర్దముఁడు= కర్దముడనేముని; ప్రజలన్= ప్రజలను; సృజియింపను= సృష్టించడానికి; వనజసంభవునిచేతన్= పద్మభవుడైన బ్రహ్మచేత; నియుక్తుండు+అగుచున్= నియమింపబడి; మదిన్= మనస్సులో; ముదము= సంతోషం; సంధిల్లన్= కలిగినవాడై.

**తా :** పుణ్యాత్ముడైన విదురా! విను. కృతయుగంలో బ్రహ్మదేవుడు ప్రజలను సృష్టించడానికి కర్దమమునీశ్వరుని నియమించాడు. కర్దముడు మనస్సులో సంతోషం కలిగినవాడై.

**తే. ధీరగుణుఁడు సరస్వతీతీరమందుఁ, దవిలి పదివేలదివ్యవత్సరము లోలిఁ**
**దపము సేయుచు నొకనాఁడు జపసమాధి, నుండి యేకాగ్రచిత్తుఁడై నిండు వేడ్క. 747**

**ప్రతి :** ధీరగుణుఁడు= ధీరగుణాలుకల కర్దమమహాముని; సరస్వతీతీరమందున్= సరస్వతీ నదీతీరంలో; తవిలి= పూని; పదివేలదివ్యవత్సరములు= పదివేల దివ్యసంవత్సరాలు; ఓలిన్= క్రమంగా; తపము+చేయుచున్= తపస్సుకావిస్తూ;

ఒకనాఁడు= ఒకదినం; జపసమాధిన్+ఉండి= జపంయొక్క నిష్ఠలో ఉండి; ఏక+అగ్రచిత్తుఁడై= ఒకే విషయంమీద మనస్సును లగ్నంచేసి; నిండువేడ్కన్= మిక్కిలి సంతోషంతో...

**తా :** ధీరగుణాలుగల కర్దమమహాముని సరస్వతీ నదీతీరంలో పట్టుదలతో పదివేల దివ్యసంవత్సరాలు క్రమంగా తపస్సు చేశాడు. ఒకదినం తపోనిష్ఠలో ఉండి ఏకాగ్రచిత్తుడై అత్యంత సంతోషంతో –

**క. వరదుఁ బ్రసన్నుమనోరథ, వరదానసుశీలు నమరవంద్యు రమేశున్**
**దురితవిదూరు సుదర్శన, కరుఁ బూజించిన నతండు కరుణాకరుఁడై. 748**

**ప్రతి :** వరదున్= వరములిచ్చువాడునూ; ప్రసన్ను= అనుగ్రహశీలుడూ; మనోరథ= కోరిన కోర్కెలు నెరవేరడానికి; వరదాన సుశీలున్= వరాలు ఇచ్చే మంచి స్వభావం గలవాడునూ; అమరవంద్యున్= దేవతలచే స్తుతింపబడేవాడునూ; దురితవిదూరున్= పాపములకు దవ్వైనవాడునూ, అనగా పాపాలు లేనివాడునూ; సుదర్శనకరున్= చేతియందు సుదర్శన చక్రంకలవాడునూ అయిన; రమా+ఈశున్= లక్ష్మీవల్లభుని; పూజించినన్= ఆరాధించగా; అతండు= ఆ లక్ష్మీవల్లభుడు అనగా విష్ణువు; కరుణా+ఆకరుఁడు+ఐ= దయకు స్థానమైనవాడై.

**తా :** అత్యంత సంతోషంతో కర్దమమహాముని వరదుడూ, దయగలవాడూ, కోరిన కోర్కెలు నెరవేర్చడానికి వరాలు ఇచ్చే మంచి స్వభావంగలవాడూ, దురిత విదూరుడూ, చేతియందు సుదర్శన చక్రంగలవాడూ, లక్ష్మీవల్లభుడూ అయిన విష్ణువును ఆరాధించాడు. విష్ణువు దయగలవాడై

**వ. అంతరిక్షంబునం బ్రత్యక్షంబైన. 749**

**ప్రతి :** అంతరిక్షంబునన్= ఆకాశంలో; ప్రత్యక్షంబు+ఐనన్= ప్రత్యక్షంకాగా

**తా :** విష్ణువు ఆకాశంలో ప్రత్యక్షమయ్యాడు.

**సీ. తరణిసుధాకరకిరణసమంచితసరసీరుహోత్పలస్రగ్విలాసుఁ**
**గంకణనూపురగ్రైవేయముద్రికాహారకుండలకిరీటాభిరాముఁ**
**గమనీయసాగరకన్యకాకౌస్తుభ మణిభూషణోద్భాసమానవక్షు**
**సలలితదరహాసచంద్రికాధవళిత చారుదర్పణవిరాజత్కపోలు**

**తే. శంఖచక్రగదాపద్మచారుహస్తు, నలికులాలకరుచి భాస్వదలికఫలకుఁ**
**బీతకౌశేయవాసుఁ గృపాతరంగి, త స్మితేక్షణుఁ బంకజోదరుని హరిని. 750**

**ప్రతి :** తరణి= సూర్యుని; సుధాకర= చంద్రుని; కిరణ= కిరణములచేత; సమంచిత= వికసించి ఒప్పిదమైన; సరసీరుహ+ఉత్పల= తామరపూలతో కలువపూలతో కట్టిన; స్రక్+విలాసున్= పూమాలలు ధరించిన అందగానిని; కంకణ= చేతులకడియాలతోను; నూపుర= పాదాలకు ధరించిన అందెలతోను; గ్రైవేయ= మెడలో ధరించిన ఆభరణాలతోను; ముద్రికా= అంగుళీయకాలతోను; హార= స్వర్ణహారాలతోను; కుండల= చెవులకు పెట్టుకొన్న మకరకుండలాలతోను; కిరీట= మకుటంతోను; అభిరామున్= మనోజ్ఞుని; కమనీయ= మనోహరయైన (సౌందర్యవతియైన); సాగరకన్యకా= సముద్రుని

కొమార్తెయైన లక్ష్మీదేవితో; కౌస్తుభమణి= కౌస్తుభమణితో; భూషణ= ఆభరణాలతో; ఉద్భాసమాన= ధగధగమెరిసే; వక్షున్= వక్షఃస్థలం కలిగినవానిని; సలలిత= సొగసైన; దరహాసచంద్రికా= చిరునవ్వువెన్నెలతో; ధవళిత= తెల్లగాచేయబడిన; చారు= అందమైన; దర్పణ= అద్దాలవలె; విరాజిత్= ప్రకాశించే; కపోలున్= చెక్కిళ్లు గలవానిని; శంఖ చక్ర గదా పద్మ= శంఖం, చక్రం, గద, పద్మం ధరించిన; చారుహస్తున్= అందమైన చేతులు గలవానిని; అలికుల+అలక= తుమ్మెదలవంటి ముంగురులయొక్క; రుచి= కాంతితో; భాస్వత్+అలిక ఫలకున్= ప్రకాశించే పలకవంటి నుదురుగలవానిని; పీత= పసుపుపచ్చని; కౌశేయవాసున్= పట్టువస్త్రం ధరించినవానిని; కృపాతరంగిత= కరుణతో పొంగిపొరలే; స్మిత+ఈక్షణున్= మందహాసంతో కూడిన కటాక్షవీక్షణాలు గలవానిని; పంకజ+ఉదరునిన్= తామర పొక్కిలియందు గలవానిని; హరినిన్= విష్ణువును...

**తా :** సూర్యకిరణాలు సోకి వికసించిన తామరపూలతోను, చంద్రకిరణాలు సోకి వికసించిన కలువపూలతోను కట్టిన పూలమాలలు ధరించిన విలాసుడు; చేతులకు కంకణాలు, పాదాలకు అందెలు, కంఠాభరణాలు, అంగుళీయకాలు, స్వర్ణహారాలు, మకరకుండలాలు, కిరీటం ధరించి మనోజ్ఞంగా ఉన్నవాడు; సౌందర్యవతియైన లక్ష్మీదేవితో, కౌస్తుభమణితో, ఆభరణాలతో ధగధగమెరిసే వక్షఃస్థలం కలవాడు; సొగసైన చిరునవ్వువెన్నెలతో ధవళితం చేయబడిన ముద్దులొలికే చెక్కుటద్దాలతో ప్రకాశించేవాడు; శంఖం, చక్రం, గద, పద్మం నాలుగు చేతులలో ధరించినవాడు; తుమ్మెదలవంటి నల్లనిముంగురులతో ప్రకాశించే ఫాలతలం కలవాడు; పసుపుపచ్చని పట్టువస్త్రం ధరించినవాడు; కరుణాతరంగితమైన మందహాసంతో కూడిన కటాక్ష వీక్షణాలు కలవాడు; పొక్కిలి యందు పద్మం కలవాడు అయిన విష్ణువును –

**వ. మఱియు శబ్దబ్రహ్మ శరీరవంతుండును, సదాత్మకుండును, జ్ఞానైక వేద్యుండును, వైనతేయాంస విన్యస్త చరణారవిందుండును నయిన గోవిందునిఁ గనుంగొని సంజాత హర్ష లహరీ పరవశుండును, లబ్ధమనోరథుండును నగుచు సాష్టాంగదండప్రణామంబు లాచరించి తదనంతరంబ. 751**

**ప్రతి :** మఱియును= అంతేకాకుండా; శబ్దబ్రహ్మ= శబ్దబ్రహ్మమే; శరీరవంతుడును= శరీరంగా కలవాడునూ; సత్+ ఆత్మకుండును= సత్స్వరూపుడు అనగా అస్తిత్వమే ఆత్మగా కలవాడునూ; జ్ఞాన+ఏకవేద్యుండును= ఒక్క జ్ఞానంచేత మాత్రమే తెలుసుకోదగినవాడునూ; వైనతేయ+అంస= వినతకొడుకైన గరుత్మంతుని మూపుమీద; విన్యస్త= మోపిన; చరణ+అరవిందుండునున్= పాదపద్మాలు గలవాడూ; అయిన; గోవిందునిన్+కనుంగొని= జనార్దనుని చూచి; సంజాత= పుట్టిన (కలిగిన); హర్షలహరీ= ఆనందతరంగాలలో; పరవశుండును= ఒడలుమరచినవాడూ; లబ్ధ= పొందిన; మనస్+ రథుండునున్= కోరికలుగలవాడూ; అగుచు; స+అష్ట+అంగదండప్రమాణంబులు= ఎనిమిది శరీరావయవాలు తగిలేటట్లు దండమువలె నేలమీద సాగిలపడి చేసే నమస్కారాలు; ఆచరించి= చేసి; తద్+అనంతరంబు+అ= ఆ తరువాత–

**తా :** శబ్దబ్రహ్మమే శరీరంగాను, అస్తిత్వమే ఆత్మగాను కలిగి ఒక్క జ్ఞానం చేతనే తెలుసుకోదగినవాడై; గరుత్మంతుని మూపుపై పాదపద్మాలు మోపి ఉన్న జనార్దనుని చూచి కర్దమమహాముని ఆనందతరంగాలు పొంగులెత్తగా నెరవేరిన కోరికలు గలవాడవుతూ ఆ స్వామికి సాష్టాంగనమస్కారాలు సలిపాడు. ఆ తరువాత –

**విశే :** శబ్దం ఆకాశానికి గుణం. ఆకాశం పరమాత్మనుండి వచ్చిన మొదటి భూతం. కాబట్టి అదికూడా బ్రహ్మమువలె కొలతలకు అందనిది.

**క. ముకుళితకరకమలుండయి, యకుటిలసద్భక్తిపరవశాత్మకుఁ డగుచున్**
**వికచాంభోరుహలోచను, నకు నిట్లనియెం దదాననముఁ గనుఁగొనుచున్. 752**

**ప్రతి :** ముకుళిత= మోడ్చిన; కరకమలుండు+అయి= పద్మాలవంటి చేతులు గలవాడై; న+కుటిల= కుటిలముకాని అనగా నిర్మలమైన; సత్+భక్తిన్= నిండైనభక్తిభావంతో; పరవశాత్మకుఁడు+అగుచున్= తన్నుతాను మరచినవాడవుతూ; వికచ= వికసించిన; అంబురుహ+లోచనునకున్= అరవిందాలవంటి కన్నులుగల విష్ణువుతో; తద్+ఆననమున్= ఆయన ముఖాన్ని; కనుఁగొనుచున్= అవలోకిస్తూ; ఇట్లు+అనియెన్= ఇలా విన్నవించాడు.

**తా :** కరకమలాలు మోడ్చి నిర్మలమైన భక్తి భావంతో తన్నుతాను మరచిన వాడవుతూ, వికసించిన పద్మములవంటి కన్నులుగల విష్ణువు ముఖాన్ని అవలోకిస్తూ ఆయనతో కర్దమమహాముని ఇలా విన్నవించాడు.

**విశే :** పై సీసపద్యంలో 'తరణిసుధాకర కిరణ సమంచిత సరసీరుహోత్పల స్రగ్విలాసు' అనడంలో క్రమాలంకారం ఉంది. తరణి – సరసీరుహ; సుధాకర – ఉత్పల అనేవి రెండు జంటలు. తరణి (సూర్య) కిరణాలుసోకి తామర వికసిస్తుంది. సుధాకరకిరణస్పర్శతో కలువ వికసిస్తుంది.

**కౌస్తుభమణి –** దేవదానవులు క్షీరాబ్ధిని చిలికినపుడు పుట్టిన మణి ఇది. ఈ మణిని విష్ణువు తన వక్షఃస్థలంమీద అలంకరించుకొన్నాడు. 'కౌస్తుభో మణిః' అని అమరం, 'కౌస్తుభః కుంస్తో భవ ఇతి కుస్తుభో హరిః, తస్యాయం కౌస్తుభః' అని వ్యుత్పత్తి. భూమిని నిలిపిన విష్ణువుకు సంబంధమైనదని అర్థం. అందువల్ల విష్ణువు ధరించిన మణిపేరు కౌస్తుభం.

**శబ్దబ్రహ్మ –** శబ్దం అంటే ధ్వని. శాస్త్రం కూడా శబ్దమే. శబ్దం విశ్వమంతా నిండి ఉంటుంది. అందువల్ల శబ్దమంటే వేదం. చెప్పేది శబ్దం. చెప్పబడేది అర్థం. ఆ యర్థం మానసికమైనదీ కావచ్చు లేక వాగ్వ్యాపారమూ కావచ్చు. విశ్వమంతా శబ్దమైనపుడు ఆ శబ్దం చెప్పే అర్థం పరమాత్మ. ఆ పరమాత్మే శబ్దబ్రహ్మ. భగవంతునికి శబ్దబ్రహ్మమే శరీరం.

**సీ. అబ్జాక్ష! సకలభూతాంతరాత్ముఁడ వనఁ దనరుచుండెడి నీదు దర్శనంబుఁ**
**దలకొని సుకృతసత్ఫలభరితంబు లైనట్టి యనేకజన్మానుసరణి**
**ప్రకటయోగక్రియాభ్యాసనిరూఢు లైనట్టి యోగీశ్వరు లాత్మఁగోరి**
**యెంతురు యోగీశ్వరేశ్వర! యే భవత్పాదారవిందసందర్శనంబుఁ**

**తే. గంటి, భవవార్ధిఁ గడవంగఁ గంటి మంటిఁ, గడఁగి నా లోచనంబుల కలిమి నేఁడు**
**దవిలి సఫలత నొందె మాధవ! ముకుంద! చిరదయాకార! నిత్యలక్ష్మీవిహార! 753**

**ప్రతి :** అబ్జ+అక్ష= ఓ పుండరీకాక్షా!; సకల= సమస్తమైన; భూత+అంతరాత్ముఁడవు+అనన్= ప్రాణుల అంతరాత్మవుగా; తనరుచున్+ఉండెడి= ఒప్పుతూ ఉండే, నీదు= నీయొక్క; దర్శనంబున్= దర్శనాన్ని (నిన్ను చూడడం); సుకృత= పుణ్యకార్యాల; సత్+ఫల= మంచిఫలాలతో; భరితంబులు+ఐనట్టి= నిండినట్టి; అనేక= పెక్కులగు; జన్మ+అనుసరణిన్= జన్మలను అనుసరించి; ప్రకట= తెలియబడిన; యోగక్రియా+అభ్యాస= యోగానుష్ఠానంలో; నిరూఢులు+ఐనట్టి= ప్రసిద్ధి కెక్కినవారైన; యోగి+ఈశ్వరులు= గొప్పయోగులు; ఆత్మన్+కోరి= మనస్సులో కాంక్షించి; ఎంతురు= తలపోస్తూ ఉంటారు; యోగి+ఈశ్వర+ఈశ్వర= యోగీశ్వరులకే ఈశ్వరుడవైన పరమాత్మా!; ఏన్= నేను (కర్దమమహాముని); భవత్= నీయొక్క;

పాద+అరవింద= పాదపద్మాల; సందర్శనంబున్+కంటిన్= దర్శనాన్ని పొందాను (దర్శించుకొన్నాను); భవవార్ధిన్= సంసారసముద్రాన్ని; కడవంగన్+కంటిన్= దాట గలిగాను; మంటిన్= ధన్యుడనయ్యాను; మాధవ= లక్ష్మీనాథా!; ముకుంద= మోక్షప్రదాతవైన శ్రీహరీ!; చిరదయా+ఆకార= ఎల్లప్పుడూ కారుణ్యమే ఆకారంగా కలవాడా! నిత్యలక్ష్మీవిహార= అనవరతం లక్ష్మీదేవితో విహరించువాడా! అనగా లక్ష్మీరమణా!; కడఁగి= ప్రయత్నించి; నాలోచనంబులకలిమి= నాకు కన్నులు గలిగినందుకు ఫలంగా; తవిలి= చిక్కుకొని; సఫలతన్+ఒందెన్= సాఫల్యమును పొందింది.

**తా :** ఓ పుండరీకాక్షా! నీవు సమస్త ప్రాణుల అంతరాత్మవుగా ప్రసిద్ధుడివి. అలాంటి నీ దర్శనంకోసం అనేక జన్మలలో పుణ్యకార్యాలు చేసి పొందిన ఫలాలతో నిరంతర యోగాభ్యాస నిపుణులైన యోగీశ్వరులు మనస్సులలో పరితపిస్తూ ఉంటారు. యోగీశ్వరులకే ఈశ్వరుడవైన నీ పాదపద్మాల దర్శనం నేను పొందగలిగాను. సంసార సముద్రాన్ని దాటగలిగాను. ధన్యుడనైనాను. మాధవా! ముకుందా! దయార్ద్రహృదయా! లక్ష్మీరమణా! నాకు కన్నులున్నందుకు ఫలం లభించింది.

**విశే :** తరువాత రాబోయే వచనంలో – కర్దముడు గుణసంపన్నురాలైన వధువును వివాహమాడాలనే కోరికతో పరమాత్మను సేవించినట్లుంది. ఈ సీసపద్యంలో 'భవవార్ధిఁగడవంగఁగంటి'ని అన్నట్లుంది. భవవార్ధి అంటే సంసార సాగరం కాబట్టి సంసారసాగరాన్ని దాటినట్లు తెలుస్తున్నది. అయితే వివాహం కాకముందే సంసారసాగరాన్ని దాటడం ఎలా? అనిపిస్తుంది. కర్దముడు అరిషడ్వర్గాలను జయించిన మహానుభావుడు. ఆయనకు జగత్తు (సంసారం)లోని అనిత్యత తెలుసు. సంసారం క్షణభంగురమనీ తెలుసు. ఆలుబిడ్డల బంధంలో చిక్కుకోవడం ఒక్కటేకాదు, ప్రాపంచిక వ్యవస్థలో జీవించడం కూడా సంసారమే. ప్రాపంచిక వ్యవస్థను దాటి వెళ్లి పరమపదం చేరడం ముక్తి. అది పరమాత్మ పాదారవిందసందర్శనం వల్లనే సాధ్యమవుతుంది.

అయినా ప్రతిప్రాణి ముఖ్యంగా మానవుడు పురుషార్థ సాధనకు వివాహం చేసుకోవలసిన అవసరముంది. వివాహంతోనే జీవితానికి సంపూర్ణత్వం సిద్ధిస్తుంది. సృష్టి దైవకార్యం. ఈ కార్యంలో స్త్రీ పురుషుల పాత్ర ఉంది. పుట్టినందుకు వంశాన్ని వృద్ధిచేయాలనేది భారతీయ సంప్రదాయం. అందువల్ల సృష్టిని వృద్ధిచేయడానికే వివాహం చేసుకోవాలనుకొంటున్నానని కేవలం కామంకోసం కాదని కర్దముడు చెపుతున్నాడు.

మాధవ – మా= లక్ష్మియొక్క, ధవ= భర్త. లక్ష్మీదేవిభర్త మాధవుడు. అనగా విష్ణువు.

ముకుంద – మోక్షమిచ్చువాడు ముకుందుడు.

**వ. అదియునుం గాక దేవా,! భవదీయ మాయావిమోహితులై హతమేధస్కులై సంసార పారావారోత్తారకంబులైన భవదీయ పాదారవిందంబులు దుచ్ఛవృత్తికాములయి సేవించి నిరయగతులైన వారికిం దత్కామ యోగ్యంబు లగు మనోరథంబుల నిత్తు, వట్టి సకాము లైనవారి నిందించు నేనును గృహమేధధేనువు నశేష మూలమును ద్రివర్గకారణమును సమాన శీలయు నయిన భార్యం బరిణయంబుగా నపేక్షించి కల్పతరుమూల సదృశంబులైన భవదీయ పాదారవిందంబులు సేవించితి, నయిన నొక్క విశేషంబు గలదు, విన్నవించెద నవధరింపుము, బ్రహ్మాత్మకుండ వయిన నీదు వచస్తంతు నిబద్ధులై లోకులు కామహతులైరఁట, యేనును వారల ననుసరించినవాఁడ. కాలాత్మకుండవైన నీకు నభిమతం బగునట్లుగాఁ గర్మ మయంబైన భవదాజ్ఞా చక్రంబు ననుసరించుటకుఁగాని మదీయ కామంబు కొఱకుఁగాదు. భవదీయ**

**మాయావినిర్మితంబును, గాలాత్మక భూరివేగ సమాయుక్తంబును, నక్షరంబును నైన బ్రహ్మంబునందు భ్రమణశీలంబును, నధిమాససమేత త్రయోదశ మాసారంబును, షష్ట్యుత్తర శతత్రయాహోరాత్రమయ పర్వంబును, ఋతుషట్క సమాకలిత నేమియుం, జాతుర్మాస్యత్రయ విరాజిత నాభియు, నపరిమిత క్షణలవాది పరికల్పిత పత్రశోభితంబునుం, గాలాత్మక భూరివేగ సమాయుక్తంబును నైన కాలచక్రంబు సకల జీవనికరాయుర్గ్రసనతత్పరం బగుం గాని కామాభిభూత జనానుగత పశుప్రాయులగు లోకుల విడిచి భవపరితాప నివారణ కారణం బయిన భవదీయ చరణాతపత్రచ్ఛాయా సమాశ్రయులై, తావకీన గుణకథన సుధాస్వాదన రుచిరలహరీ నిరసిత సకల దేహధర్ములైన భగవద్భక్త జనాయుర్హరణసమర్థంబు గాకుండు నని వెండియు. 754**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేగాక; దేవా!; భవదీయ= నీ యొక్క; మాయావిమోహితులు+ఐ= మాయవల్ల అజ్ఞానులై; హతమేధస్కులు+ఐ= చెడిన బుద్ధిగలవారై; సంసారపారావార+ఉత్తారకంబులు+ఐన= సంసారసముద్రాన్ని దాటించునవి అయిన; భవదీయ పాద+అరవిందంబులు= నీ చరణ కమలాలను; తుచ్ఛవృత్తి కాములు+అయి= నీచమైన కోరికలుగలిగినవారై; సేవించి= ఆరాధించి; నిరయగతులు+ఐనవారికిన్= నరకానికి వెళ్లేవారికి; తద్+కామయోగ్యంబులు+అగు= వాళ్లకు అనుభవయోగ్యమైన; మనోరథంబులన్= కోరికలను; ఇత్తువు= ఇస్తూ ఉంటావు; అట్టి= అలాంటి; సకాములు+ఐనవారిన్= కోరికలుగలవాళ్లను; నిందించే నేనును= దూషించే నేనుకూడా; గృహమేధధేనువును= గృహయజ్ఞ నిర్వహణలో (కామ) ధేనువువలె ఉపకరించేది; అశేషమూలమును= అన్నిటికి మూలమైనది; త్రివర్గ కారణమును= ధర్మ అర్థ కామాలను అనుష్ఠించడంలో సహాయపడేది; సమానశీలయున్+అయిన= నా నడవడికతో సమానమైన నడవడికగలది; ఐన–భార్యన్= పత్నిని; పరిణయంబు+కాన్+అపేక్షించి= వివాహంచేసుకోవాలని కోరి; కల్పతరుమూల= కల్పవృక్షమూలాలకు; సదృశంబులు+ఐన= సమానాలైన; భవదీయ= నీ; పాద+అరవిందంబులు= పాదపద్మాలను; సేవించితిని= ఆరాధించాను; అయినను= అయినా; ఒక్క విశేషంబు= ఒక విశేషం; కలదు= ఉన్నది; విన్నవించెదను= మనవి చేస్తాను; అవధరింపుము= చిత్తగించండి; బ్రహ్మ+ఆత్మకుండవు+అయిన= పరబ్రహ్మ స్వరూపుడవైన; నీదు= నీయొక్క; వచస్+తంతు= మాటలనే తాళ్లతో; లోకులు= లోకంలోని ప్రజలు; నిబద్ధులు+ఐ= బంధింపబడి; కామహతులు+ఐరఁట= కామంచేత కొట్టబడిన వారైనారట (కామంలో చిక్కినారట); ఏనును= నేను కూడా; వారలన్= అలా కామంలో చిక్కుకొన్న వాళ్లను; అనుసరించినవాఁడన్= అనుసరించినవాడనే; కాల+ఆత్మకుండవు+ఐన= కాలస్వరూపుడవైన; నీకు; అభిమతంబు+అగునట్లుగాన్= ఇష్టమైనట్లు; కర్మమయంబు+ఐన= కర్మతో కూడినదైన; భవత్+ఆజ్ఞాచక్రంబున్= నీ ఆజ్ఞాచక్రాన్ని; అనుసరించుటకున్+కాని= అనుసరించుటకేతప్ప; కామంబుకొఱకున్+కాదు= కామతృష్ణతీర్చుకోవడానికి కాదు; భవదీయ= నీయొక్క; మాయావినిర్మితంబును= మాయచేత నిర్మితమైనది; కాల+ఆత్మక= కాలాత్మకమైన; భూరివేగ= మిక్కిలి వేగంతో; సమాయుక్తంబును= కూడినదియును; న+క్షరంబునున్+ఐన= శాశ్వతమైనది అయిన; బ్రహ్మంబునందున్= పరబ్రహ్మంలో; భ్రమణశీలంబును= తిరిగే స్వభావం గలది; అధిమాస సమేత= అధికమాసంతోకూడి; త్రయోదశమాస+అరంబును= పదమూడునెలలు అనే ఆకులుగలది; షష్టి+ఉత్తర శతత్రయ= మూడువందల అరవై; అహస్+రాత్రమయ= అహోరాత్రాలు అనే; పర్వంబును= కణుపులు కలది; ఋతుషట్క= ఆరు ఋతువులతో; సమాకలిత= కూడిన; నేమియున్= బండిచక్రపు కమ్మి గలది; చాతుర్+మాస్యత్రయ= మూడు చాతుర్మాస్యాలతో; విరాజిత= ఒప్పుతున్న;

నాభియున్= నడిమి బొడ్డుగలది; న+పరిమిత= అధికమైన; క్షణలవ+ఆది= సూక్ష్మమైన క్షణాలతో; పరికల్పిత= ఏర్పాటైన; పత్రశోభితంబునున్= ఆకులతో విరాజిల్లునది; కాల+ఆత్మక, భూరి, వేగ= కాలాత్మకమై మిక్కిలి వేగంతో; సమాయుక్తంబునున్+ఐన= కూడినదైన; కాలచక్రంబు= కాలచక్రం; సకల జీవనికర= సమస్త జీవుల సమూహంయొక్క; ఆయుస్+గ్రసన తత్పరంబు+అగున్= ఆయుస్సును మింగడానికి ఆసక్తి కలిగి ఉంటుంది; కాని; కామ+అభిభూత= కామానికి లొంగిపోయిన; జన+అనుగత= జనులను అనుసరించే; పశుప్రాయులు+అగు= పశువులతో సమానమైన; లోకులన్= జనులను; విడిచి= పరిత్యజించి; భవపరితాప= సంసారతాపానికి; నివారణకారణంబు+అయిన= పోగొట్టడానికి కారణమైన; భవదీయ= నీయొక్క; చరణ+ఆతపత్ర+ఛాయా= పాదాలనే గొడుగుల నీడల; సమాశ్రయులు+ఐ= ఆశ్రయం కలవారై; తావకీన= నీ; గుణకథన= గుణవర్ణనమనే; సుధా+ఆస్వాదన= అమృతరసంగ్రోలుట అనే; రుచిరలహరీ= వైభవాల ప్రవాహాలలో ఉంటూ; నిరసిత= తిరస్కరించిన (లెక్కచేయని); సకల= సమస్తమైన; దేహధర్ములు+ఐన= శరీరధర్మాలు గలవారైన; భగవత్+భక్తజన= భగవంతుని భక్తులైన జనంయొక్క; ఆయుస్+హరణ= ఆయువును హరించడానికి; సమర్థంబుకాక+ఉండున్+అని= శక్తిచాలనిదై ఉండును అనిచెప్పి; వెండియున్= మరల.

**తా :** అదీగాక దేవా! నీ మాయవల్ల అజ్ఞానులై, బుద్ధి నశించి నీచమైన కోరికలను నెరవేర్చుకోవడంకోసం సంసార సముద్రాన్ని దాటించేవి అయిన నీ చరణకమలాలను ఆరాధించే నరకగాములైన కాముకుల కోరికలను కూడా తీరుస్తూ ఉంటావు. అలాంటివాళ్లను గర్హించే నేనుకూడా పెండ్లి చేసుకోవాలనే కోరికతో ఉన్నాను. గృహయజ్ఞనిర్వహణలో గోవువలె ఉపకరించేది, అన్నిటికి మూలమైనది, ధర్మార్థకామాలను అనుష్ఠించడంలో సహాయపడేది, నాప్రవర్తనకు అనుగుణమైన ప్రవర్తన కలదీ అయిన వధువును వివాహమాడాలనే కోరికతో కల్పవృక్షమూలాలకు సమానమైన నీ పాదపద్మాలను సేవించాను.

అయినా ఒక విశేషముంది. మనవి చేస్తాను అవధరించు. పరబ్రహ్మమే ఆత్మగా కలవాడవైన నీ మాటలు అనే తాళ్లతో బంధింపబడి లోకంలోని ప్రజలు కామానికి వశులైనారట. నేనుకూడా అలాంటి కాముకులను అనుసరించినవాడనే. కాలాత్మకుడవైన నీకు ఇష్టమైనట్లు కర్మమయమైన నీ ఆజ్ఞాచక్రాన్ని అనుసరించి (సృష్టిని వృద్ధిచేయటానికి) నడచుకోవటానికే నాకు వివాహం. కామతృష్ణతీర్చుకోవటానికి మాత్రంకాదు.

నీవు మాయతో నిర్మించిన కాలాత్మకమైన చక్రం మహావేగం కలది. శాశ్వతమైన భ్రమణం కలిగి పరబ్రహ్మను అనుసరించి తిరుగుతుంది. అధికమాసంతో కలిపి ఆ కాలచక్రం పదమూడు నెలలు అనే ఆకులుగలది. మూడువందల అరవై అహోరాత్రాలు (పగళ్లు, రాత్రులు) అనే కణుపులు కలది. ఆరు ఋతువులు అనే చక్రంచుట్టూ పట్టాగలది. మూడు చాతుర్మాస్యాలు అనే నడిమిబొడ్డు కలది. అపరిమితమైన సూక్ష్మ క్షణాలు అనే ఆకులతో విరాజిల్లేది.

కాలాత్మకమై మిక్కిలి వేగంతో కూడిన ఆ కాలచక్రం సమస్త జీవుల ఆయుస్సును మింగడానికి ఆసక్తి కలదై ఉంటుంది. అయినా కామానికి లోబడినవారిని అనుసరించే పశుస్వభావం గలవారైన లోకులను మాత్రమే ఆ కాలచక్రం పరిత్యజిస్తుంది (చీకాకు పరుస్తుంది). సంసారతాపాన్ని శాంతింపజేసే నీ పాదాలనే గొడుగునీడలను ఆశ్రయించినవారు, నీ గుణవర్ణనమనే అమృతరసాస్వాదన వైభవలహరులలో ఉంటున్నవారు, సమస్త శారీరక ధర్మాలను లెక్క చేయనివారు అయిన భగవద్భక్తజనం యొక్క ఆయువును హరించడానికి ఆ కాలచక్రం సమర్థంకాదు అని కర్దమమహాముని భగవంతునితో చెప్పాడు. ఇంకా అలా అన్నాడు.

**విశే :** ఈ వచనంలో కాలచక్రానికి సంబంధించిన విషయాలున్నాయి. సంవత్సరానికి పన్నెండే మాసాలు. కాని 360 అరలుగల చక్రాన 365 1/3 అహోరాత్రములుంటాయి. తిథులనుబట్టి పన్నెండు మాసాల పరిధులు ఒక సంవత్సరంగా తిరుగుతాయి. సంవత్సరానికి పది తిథుల చొప్పున ఎక్కువగా మిగిలిపోగా మూడు సంవత్సరాలకు ముప్పదితిథులు మిగిలి అధికమాసం ఏర్పడుతుంది. దానితో కలసి పదమూడు విభాగాలు ఏర్పడుతున్నాయి. సూర్యుని చుట్టూ తిరిగి రావడానికి భూమికి కావలసిన కాలాన్ని సౌరసంవత్సరమంటారు. ఇది 365 1/3 అహోరాత్రాలు గలది. ఇదిగాక 360 అహోరాత్రాలలో సంవత్సరం కొలత మరొకటుంది. దీనికి సావన సంవత్సరమని పేరు. ఇదిగాక పన్నెండు పూర్ణిమలు, పన్నెండు అమావాస్యలతో మరొక సంవత్సరమానముంది. దీనికి చాంద్రమాన సంవత్సరమని పేరు. దీన్ని సౌరసంవత్సరంతో సరిపెట్టడానికి మూడు సంవత్సరాల కొకసారి అధికమాసం కలపాలి.

కాల స్వరూపంలో వేగం పుడుతుంది. అందులో కేంద్రం ఏర్పడి దాని చుట్టూ పరిధులు తిరుగుతూ ఉంటాయి. ఆ పరిధులలో పదమూడు విభాగాలు కనిపిస్తాయి. అదే సంవత్సరాత్మకమైన కాలచక్రం.

లోకాన్ని అనుసరిస్తూ కాలాత్మకుడైన భగవంతుని పూజిస్తూ భార్యను అడగడానికి కారణం కామవాంఛతో కాదు. దేవఋషి పితృ ఋణాలనుండి విముక్తి కోసం పుత్రకళత్రాదుల అవసరం ఉంది. అందుకే అలాంటి కోరిక కోరుతున్నానని కర్దముని అభిప్రాయం.

**మ. అనఘా! యొక్కఁడవయ్యు నాత్మకృతమాయాజాతసత్త్వాది శ**
**క్తి నికాయస్థితి నీ జగజ్జననవృద్ధిక్షోభహేతుప్రభా**
**వ నిరూఢిందగు దూర్ణనాభిగతి విశ్వస్తుత్య! సర్వేశ! నీ**
**ఘనలీలామహిమార్ణవంబు గడవంగా వచ్చునే యేరికిన్? 755**

**ప్రతి :** అనఘా= పాపరహితుడవైన ఓ పరమాత్మా!; విశ్వస్తుత్య= ప్రపంచంచేత ప్రస్తుతింపదగినవాడా!; సర్వ+ఈశ= సర్వేశ్వరా!; ఒక్కఁడవు+అయ్యున్= నీవు ఒక్కడవే అయినా; ఆత్మకృతమాయా= నీవు చేసిన మాయవల్ల; జాత= కలిగిన (పుట్టిన); సత్త్వ+ఆది= సత్త్వం మొదలైన; శక్తినికాయస్థితిన్= శక్తుల సముదాయ స్థితితో; ఈ; జగత్+జనన= జగత్తు పుట్టడానికీ; వృద్ధి= వృద్ధి పొందడానికీ; క్షోభ= నశించి పోవడానికీ; హేతు= కారణమైన; ప్రభావ= మహిమతోకూడిన; నిరూఢిన్= నిర్ధారణయందు; ఊర్ణనాభిగతిన్= సాలెపురుగువలె (తననుండియే దారాలను తీసి తనకన్నా వేరుగా తన నివాసం ఏర్పరచుకొన్నట్లు); తగుదు= ఒప్పెదవు; నీఘనలీలా= గొప్పదైన నీక్రీడయొక్క; మహిమ+అర్ణవంబు= మహిమ అనే సముద్రాన్ని; గడవంగాన్= దాటడానికి; ఏరికిన్= ఎవరికైనా; వచ్చును+ఏ= శక్యమవుతుందా? (కాదని భావం).

**తా :** పుణ్యాత్ముడవైన పరమాత్మా! విశ్వవంద్యా! సర్వేశ్వరా! ఒక్కడవే అయినా నీవు నిర్మించిన మాయవల్ల కలిగిన సత్త్వం మొదలైన శక్తులకు ఉనికి ఏర్పడుతున్నది. ఆ శక్తుల ద్వారా నీవు సాలెపురుగు సాలెగూడును తయారుచేసి మళ్లీ తనలోనే లీనం చేసుకొన్నట్లు జగత్తు పుట్టడానికి, వృద్ధి కావడానికి, నాశనం కావడానికి కారణమైన మాయామహిమతో కూడి ఉంటావు. అలాంటి గొప్పదైన నీ లీలా విలాసమనే సముద్రాన్ని దాటడానికి ఎవరికైనా సాధ్యమవుతుందా? సాధ్యంకాదని భావం.

**విశే :** ఓ పుణ్యపురుషా! నీవు ఒక్కడవే అయినా నీ మాయచేత త్రిగుణరూపాలైన మూడు శక్తులుగా ప్రవర్తిస్తావు. రజోగుణంతో బ్రహ్మవై లోకాలను పుట్టిస్తావు. సత్త్వ గుణంతో విష్ణుడవై లోకాలను కాపాడుతావు. తమోగుణంతో రుద్రుడవై

లోకాలను నశింపజేస్తావు. కాని ఈ పనులకు నీవు అంటకుండా ఉంటావు. సాలెపురుగు తన శరీరంనుండే దారాలు తీసి వేరుగా తనకొక ఇల్లు ఏర్పరచుకొంటుంది. అదే విధంగా నీవు ఇన్ని రూపాలను నీ నుండే నీకన్నా వేరుగా కల్పిస్తున్నావు. అలాంటి నిన్నుగాక లోకం మరెవ్వరని స్తుతిస్తుంది? సాలెగూడు సాలెపురుగుపై ఆధారపడినట్లు ఈ లోకాలన్నీ నీపైనే ఆధారపడి ఉన్నాయి. సృష్టి రహస్యాన్ని బోధించడానికి ఉపమానంగా గ్రహించిన ఊర్ణనాభిగతి (సాలెపురుగుపద్ధతి)లో –

**వ. దేవా! శబ్దాది విషయ సుఖకరంబగు రూపంబు విస్తరింపఁ జేయుటెల్ల నస్మదనుగ్రహార్థంబు గాని నీ కొఱకుం గా, దాత్మీయ మాయా పరివర్తితలోక తంత్రంబు గలిగి మదీయ మనోరథ సుధాప్రవర్షివైన నీకు నమస్కరించెద. 756**

**ప్రతి :** దేవా!; శబ్ద+ఆది= శబ్దం మొదలైన; విషయ= విషయాలచే; సుఖకరంబు+అగు= సుఖమును కలగించునదైన; రూపంబు= సృష్టి స్వరూపాన్ని; విస్తరింపన్+చేయుట+ఎల్లన్= సంపూర్ణంగా వృద్ధి చేయడమనేదంతా; అస్మద్+అనుగ్రహ+ అర్థంబు= మమ్ములను అనుగ్రహించడానికే; కాని= తప్ప; నీ కొఱకున్+కాదు= నీ కోసంకాదు; ఆత్మీయమాయా= నీదైనమాయవల్ల; పరివర్తిత= త్రిప్పబడుతున్న; లోకతంత్రంబు= లోకవ్యాపారం; కలిగి= లభించి; మదీయ= మాయొక్క; మనోరథసుధా= కోరికలనే అమృతాన్ని; ప్రవర్షివి+ఐన= నిండుగా వర్షించేవాడవైన; నీకున్= నీకు; నమస్కరించెదన్= నమస్కరిస్తున్నాను.

**తా :** దేవా! శబ్దాది విషయాలచే సుఖం కలిగించేదైన సృష్టి స్వరూపాన్ని సంపూర్ణంగా అభివృద్ధి చేయడమనేదంతా మమ్ములను అనుగ్రహించడానికే గాని నీకోసం కాదు. నీ మాయవల్ల ప్రవర్తితం అవుతున్న లోకవ్యాపారం కలిగి మా కోరికలనే అమృతాన్ని నిండుగా వర్షించేవాడవైన నీకు నమస్కరిస్తున్నానని కర్దమమహాముని భగవంతునితో చెప్పాడు.

**విశే :** సృష్టి పంచభూతాత్మకం. అలాగే ప్రాణి శరీరం కూడా పంచభూతాత్మకమే. భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం పంచభూతాలు. పంచభూతాత్మకమైన ప్రాణికి కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలద్వారా సుఖదుఃఖాలు కలుగుతాయి. చెవి, చర్మం, కన్ను, నోరు, ముక్కు అనే జ్ఞానేంద్రియాలతో తెలుసుకొనేవి తన్మాత్రలు. తత్ అంటే పరమాత్మ. మాత్ర అంటే కొలమానం. అంటే పరమాత్మను తెలుసుకోడానికి ఆధారమైనవి తన్మాత్రలు. చెవి మొదలైన జ్ఞానేంద్రియాలకు తన్మాత్రలు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు. శబ్దాది విషయాలంటే ఇవే. సృష్టిలోని ప్రాణులకు సుఖాన్ని కలిగించేవి శబ్దాది విషయాలే.

లోకవ్యాపారమంటే సృష్టి స్థితిలయాలతో కూడిన విషయం. లోకవ్యాపారాలన్నీ పరమాత్మ మాయవల్ల ప్రవర్తిస్తూ ఉంటాయి. ఆత్మకూ పరమాత్మకూ మధ్యగల సంబంధం సరిగా అర్థంకాకపోవడమే మాయ.

**మ. అని యిబ్భంగి నుతించినన్ విని సరోజాక్షుండు మోదంబునన్**
**వినతానందనకంధరోపరిచరద్విభ్రాజమానాంగుఁడై**
**యనురాగస్మితచంద్రికాకలితశోభాలోకుఁడై య మ్మునీం**
**ద్రునిఁ గారుణ్య మెలర్పఁజూచి పలికెన్ రోచిష్ణుఁడై వ్రేల్మిడిన్. 757**

**ప్రతి :** అని; ఈ+భంగిన్= ఈ విధంగా; నుతించినన్+విని= స్తోత్రం చేయగా ఆలకించి; మోదంబునన్= సంతోషంతో; సరోజ+అక్షుండు= తామరలవంటి కన్నులుగల విష్ణుదేవుడు; వినతానందన= వినత కుమారుడైన గరుత్మంతుని;

కంధర+ఉపరిచరత్= మెడమీద తిరుగుతున్న; విభ్రాజమాన+అంగుఁడు+ఐ= ప్రకాశించే అవయవాలు కలవాడై; (గరుత్మంతుని మూపుపై ఒయ్యారంగా కూర్చోడంవల్ల అందంగా కనిపిస్తున్న దేహంకలవాడై); అనురాగ స్మిత= ప్రేమతో కూడిన చిరునవ్వు అనే; చంద్రికా= వెన్నెలతో; కలిత= కూడిన; శోభా+ఆలోకుఁడు+ఐ= అందమైన చూపులుకలవాడై; కారుణ్యము+ఎలర్పన్= అతిశయమైన దయతో; ఆ+ముని+ఇంద్రునిన్= ఆ మునీశ్వరుడైన కర్దముని; చూచి= అవలోకించి; రోచిష్ణుఁడు+ఐ= ప్రకాశిలుచున్నవాడై; వ్రేల్మిడిన్= వెంటనే; పలికెన్= చెప్పాడు.

**తా :** అని ఈ విధంగా కర్దమముని స్తుతించగా సరోజాక్షుడైన విష్ణుదేవుడు విన్నాడు. గరుత్మంతుని మూపుపై ఒయ్యారంగా కూర్చొని అందంగా కనిపించే ఆ స్వామి ప్రేమతో కూడిన చిరునవ్వువెన్నెలలు వెల్లివిరిసే చూపులతో, అతిశయమైన దయతో మునీశ్వరుడైన కర్దముని అవలోకించి సొగసు అతిశయిస్తూ ఉండగా ఇలా చెప్పాడు.

**క. మునివర! యే కోరిక నీ, మనమునఁ గామించి నను సమంచితభక్తిన్**
**నెనరునఁ బూజించితి? నీ, కనయము నా కోర్కి సఫల మయ్యెడుఁ జుమ్మీ! 758**

**ప్రతి :** మునివర= మునీంద్ర!; నీ మనమునన్= నీ చిత్తంలో; ఏ కోరిక= ఏ వాంఛ; కామించి= కోరి; ననున్= నన్ను; సమంచిత భక్తిన్= ఒప్పిదమైనభక్తితో; నెనరునన్= శ్రద్ధతో; పూజించితి= ఆరాధించావో; అనయము= తప్పకుండా; నీకున్= నీకు; ఆ కోర్కి= ఆ అభీష్టము; సఫలము+అయ్యెడున్+చుమ్మీ= నెరవేరుతుంది సుమా!

**తా :** కర్దమమునీంద్రా! మనస్సులో ఏ కోరిక కోరి నీవు గొప్ప భక్తి శ్రద్ధలతో నన్ను ఆరాధించావో నీకు ఆ కోరిక తప్పకుండా నెరవేరుతుంది సుమా!

**వ. అని యానతిచ్చి ప్రజాపతి పుత్త్రుండును, సమ్రాట్టును నైన స్వాయంభువ మనువు బ్రహ్మావర్త దేశంబునందు సప్తార్ణవ మేఖలామండిత మహీమండలంబుఁ బరిపాలించుచున్నవాఁ, డమ్మహాత్ముం డపరదివసంబున నిందులకు శతరూపయను భార్యా సమేతుండై భర్తృకామ యగు కూతుం దోడ్కొని భవదీయ సన్నిధికిం జనుదెంచి నీకు ననురూప వయశ్శీల సంకల్ప గుణాకరయైన తన పుత్త్రిం బరిణయంబు గావించు, భవదీయ మనోరథంబు సిద్ధించు, ననుం జిత్తంబున సంస్మరించుచుండు, నమ్మనుకన్యక నిను వరించి భవద్వీర్యంబువలన నతి సౌందర్యవతు లయిన కన్యలం దొమ్మండ్రం గను, నా కన్యకా నవకంబునందు మునీంద్రులు పుత్త్రోత్పాదనంబులు సేయం గలరు, నీవు మదీయశాసనంబును ధరియించి మదర్పితాశేషకర్ముండ వగుచు నైకాంతిక స్వాంతంబున భూతాభయ దాన దయాచరితజ్ఞానివై నాయందు జగంబులు గల వనియు, నీ యందు నేఁ గల ననియు నెఱింగి సేవింపుము, చరమకాలంబున ననుం బొందఁ గలవు, భవదీయ వీర్యంబువలన నేను నీ భార్యా గర్భంబునఁ బ్రవేశించి మత్కళాంశంబున బుత్త్రుండనై సంభవించి నీకుం దత్త్వసంహిత నుపన్యసింతు నని జనార్దనుండు కర్దమున కెఱింగించి యతండు గనుంగొనుచుండ నంతర్హితుండై. 759**

**ప్రతి :** అని+ఆనతి+ఇచ్చి= అని మాట ఇచ్చి; ప్రజాపతి పుత్రుండును= బ్రహ్మదేవుని కుమారుడూ; సమ్రాట్టును+ఐన= రాజాధిరాజు అయిన; స్వాయంభువమనువు; బ్రహ్మావర్తదేశంబునందున్= బ్రహ్మావర్తదేశంలో (బ్రహ్మవిద్య ప్రచారమైన

దేశంలో); సప్త+అర్ణవమేఖలా= ఏడుసముద్రాలనే ఒడ్డాణంతో; మండిత= అలంకరింపబడిన; మహీమండలంబున్= భూమండలాన్ని; (అనగా బ్రహ్మావర్త దేశం ప్రధానంగా ఏడుసముద్రాల మధ్యలోగల భూమినంతా అని అర్థం); పరిపాలించుచున్నవాఁడు= పరిపాలిస్తున్నాడు; ఆ+మహాత్ముండు= ఆ పుణ్యాత్ముడు; అపరదివసంబునన్= రేపటి రోజున; శతరూప+అను= శతరూప అనే పేరుగల; భార్యాసమేతుండు+ఐ= భార్యతోకూడినవాడై; భర్తృకామ+అగు= భర్తను కోరుచున్నదైన (పెండ్లి కావలసిన); కూతున్+తోడ్కొని= కొమార్తెను వెంటబెట్టుకొని; ఇందులకున్= ఈ కారణంగా; భవదీయసన్నిధికిన్+చనుదెంచి= నీ చెంతకు వచ్చి; నీకున్; అనురూప= తగినటువంటి; వయస్+శీల= ప్రాయమూ, నడవడి; సంకల్ప= తలంపు; గుణ+ఆకరయైన= సద్గుణాలకు స్థానమైన; తనపుత్రిన్= తన కొమార్తెను; పరిణయంబు+ కావించున్= వివాహం చేస్తాడు; భవదీయ= నీయొక్క; మనోరథంబు= కోరిక; సిద్ధించున్= నెరవేరుతుంది; ననున్= నన్ను (భగవంతుని); చిత్తంబునన్= మనస్సులో; సంస్మరించుచున్+ఉండు= నిత్యం స్మరిస్తూ ఉండే; ఆ+మనుకన్యక= ఆ మనుపుత్రిక; నినున్‌వరించి= నిన్ను పెండ్లాడి; భవత్+వీర్యంబువలనన్= నీ తేజస్సువల్ల, శుక్లంవల్ల; అతిసౌందర్యవతులు+అయిన= ఎంతో అందగత్తెలైన; కన్యలన్= కూతుళ్లను; తొమ్మండ్రన్+కనున్= తొమ్మిది మందిని ప్రసవిస్తుంది; ఆ కన్యకా నవకంబు+అందున్= ఆ తొమ్మిదిమంది కన్నియలందు; ముని+ఇంద్రులు= మునిశ్రేష్ఠులు; పుత్ర+ఉత్పాదనంబులు= పుత్రులను కలిగించుటలు; చేయన్+కలరు= కావిస్తారు; నీవు (కర్దముడు); మదీయ= నా; శాసనంబును= ఆజ్ఞను; ధరియించి= తలదాల్చి, పాటించి; మత్+అర్పిత= నాకు అర్పింపబడిన; అశేష కర్ముండవు+అగుచున్= సమస్త కర్మలు కలవాడవవుతూ (నీవు చేసే సమస్త కర్మల ఫలాలను నాకే అర్పిస్తూ); ఐకాంతిక= ఏకాగ్రమైన; స్వాంతంబునన్= మనస్సుతో; భూత= ప్రాణులకు; అభయ= అభయమిస్తూ; దాన= దానాలుచేస్తూ; దయాచరిత జ్ఞానివి+ఐ= కరుణామూర్తివైన సుజ్ఞానివి అయి; నాయందున్= నాయందే; జగంబులు+కలవు+అనియున్= లోకాలు ఉన్నాయని; నీయందున్= నీలో (కర్దమునిలో); నేన్+కలను+అనియున్= పరమాత్మనైన నేను ఉన్నానని; ఎఱింగి= గ్రహించి; సేవింపుము= నన్ను ఆరాధించు; చరమకాలంబునన్= అంత్య దశలో; ననున్= నన్ను; పొందన్+కలవు= చేరుకొంటావు; భవదీయ= నీయొక్క; వీర్యంబువలనన్= తేజస్సుతో; నేను (పరమాత్మను); నీ భార్యాగర్భంబునన్= నీ భార్య గర్భంలో; ప్రవేశించి= చేరి; మత్+కళా+అంశంబునన్= నా కళాంశతో; పుత్రుండను+ఐ= కుమారుడనై; సంభవించి= జన్మించి; నీకున్= నీకు (కర్దమునికి); తత్త్వసంహితన్= ఆత్మతత్త్వాన్ని తెలిపే విద్యను; ఉపన్యసింతున్= బోధిస్తాను; అని= అంటూ; జనార్దనుండు= విష్ణుదేవుడు; కర్దమునకున్+ ఎఱింగించి= కర్దమమహామునికి తెలియజేసి; అతండు= ఆ కర్దమమహాముని; కనుంగొనుచుండన్= చూస్తూ ఉండగానే; అంతర్హితుండు+ఐ= అదృశ్యుడై, మరుగుపడినవాడై...

**తా :** కోరిన కోరిక తప్పక నెరవేరుతుందని చెప్పి విష్ణుదేవుడు కర్దమునితో ఇంకా ఇలా అన్నాడు. బ్రహ్మదేవుని కుమారుడు, రాజాధిరాజు అయిన స్వాయంభువమనువు బ్రహ్మావర్తదేశం ప్రధానంగా ఏడుసముద్రాల మధ్యలోగల భూమండలాన్ని పరిపాలిస్తున్నాడు. పుణ్యాత్ముడైన ఆ మనువు శతరూప అనే తన భార్యతో కలసి పెండ్లి కావలసిన పుత్రికను వెంటబెట్టుకొని రేపు నీ చెంతకు వస్తాడు. వయస్సులో, శీలంలో, సంకల్పంలో, సుగుణాలలో నీకు తగినటువంటి తన కొమార్తెను నీకిచ్చి వివాహం చేస్తాడు. ఆ వివాహం వల్ల నీ కోరిక సఫలమవుతుంది. నన్ను మనస్సులో నిత్యం స్మరిస్తూ ఉండే ఆ మనువు కూతురు నిన్ను పెండ్లాడి నీ తేజస్సును ధరించి ఎంతో అందగత్తెలైన తొమ్మిదిమంది తనయలను కంటుంది. ఆ తొమ్మిదిమందికి మునీశ్వరులవల్ల ఉత్తములైన కొడుకులు పుడతారు. నీవు నా ఆజ్ఞను పాటించి నీవు చేసే సమస్త కర్మఫలాలను నాకే అర్పిస్తూ ఉండు. ఏకాగ్రమైన మనస్సుతో ప్రాణులకు అభయమిస్తూ, దానాలుచేస్తూ, కరుణామూర్తివి సుజ్ఞానివి అయి

లోకాలన్నీ నాలోనే ఉన్నాయని, నీలో నేను ఉన్నానని తెలుసుకొని నన్ను ఆరాధిస్తూ ఉండు. అంత్యకాలంలో నన్ను చేరుకొంటావు. నేను నీ తేజస్సుతో, నా కళాంశతో నీ భార్య గర్భంలో ప్రవేశించి నీకు పుత్రుడుగా జన్మిస్తాను. నీకు తత్త్వవిద్యను బోధిస్తాను. అని తెలియజేసి కర్దమమహాముని చూస్తూ ఉండగానే విష్ణుదేవుడు అంతర్ధానమయ్యాడు.

**విశే :** బ్రహ్మావర్తదేశం – ఎక్కడ బ్రహ్మవిద్య ప్రభవించి విస్తరించిందో ఆ దేశం. బ్రహ్మవిద్య అంటే వేదవిద్యే. ఈ ప్రాంతంలోనే వేదవిద్య పుట్టి వికసించింది. వేదఋషులు బ్రహ్మవిద్యను ఇక్కడనుండే ప్రచారం చేశారు. ప్రస్తుతం ఢిల్లీ నగరానికి వాయవ్య దిశగా ఉన్న ప్రాంతం అప్పటి బ్రహ్మావర్తదేశం. తత్త్వ సంహిత – అంటే తత్త్వజ్ఞానం లేక తత్త్వవిద్య. ఈ విద్యను గురించి చెప్పేది తత్త్వశాస్త్రం. మనం చూస్తూ ఉన్నలోక స్వభావం ఎలా ఉంటుందో లోతుకు దిగి విచారణ చేస్తూ పోతే ఏర్పడే యథార్థమైన జ్ఞానమే తత్త్వజ్ఞానం. తత్ అంటే అది అనగా పరబ్రహ్మ అని అర్థం. నామరూపాత్మకంగా కనిపిస్తున్నలోకం అలా భాసిస్తుందేగాని నిజానికి లోకమంతా సచ్చిదాత్మకమైన పరబ్రహ్మస్వరూపమే అని తెలుసుకోవడమే తత్త్వజ్ఞానం. ఇంకా సులువుగా చెప్పాలంటే ఆత్మ, పరమాత్మ, ప్రకృతి అనే మూడింటి సంబంధాన్ని చెప్పేదే తత్త్వజ్ఞానం.

**చ. అతులసరస్వతీసరిదుదంచితబాలరసాలసాల శో**
**భితతటతుంగరంగమగు బిందుసరంబు వినిర్గమించి యం**
**చిత గరుడాధిరోహణము సేసి తదీయగరుత్ప్రభూత రు**
**క్ప్రతతివిలక్షణక్రమవిరాజితసామము వించు మోదియై. 760**

**ప్రతి :** అతుల= సాటిలేని; సరస్వతీ సరిత్= సరస్వతీ నది జలంతో; ఉద్+అంచిత= పెంపొందిన; బాలరసాలసాల= గున్నమామిడి చెట్లతో; శోభిత= అందగించే; తటతుంగరంగము+అగు= ఎత్తైన గట్టు గలదైన; బిందుసరంబున్= బిందుసరోవరంనుండి; వినిర్గమించి= బయలుదేరి; అంచిత= అలంకృతమైన; గరుడ+అధిరోహణము+చేసి= గరుత్మంతుని అధిరోహించి; తదీయ= ఆ గరుత్మంతుని; గరుత్+ప్రభూత= ఉన్నతమైన రెక్కల; రుక్+ప్రతీతి= కాంతుల ఆధిక్యంతో; విలక్షణక్రమ= విలక్షణమైన పద్ధతితో; విరాజిత= ఒప్పారుతూ ఉన్న; సామము= సామగానం (గరుత్మంతుని రెక్కలు కదలుతూ ఉండడంవల్ల పుట్టిన చప్పుళ్లు సామవేదగానంవలె ఉన్నవని భావం); వించున్= ఆలకిస్తూ; మోది+ఐ= సంతోషించినవాడై

**తా :** పవిత్రమైన సరస్వతీనదీజలంతో పెంపొందిన గున్నమామిడి చెట్లతో అందగిస్తున్న ఎత్తైన గట్లతో కూడిన బిందుసరోవరంనుండి బయలుదేరి (విష్ణుదేవుడు) ఒప్పుచున్న గరుత్మంతుని అధిరోహించి, అతని ఉన్నతమైన రెక్కల కదలికలచే పుట్టిన చప్పుళ్లు సలక్షణమైన సామవేదగానంగా ఒప్పుతూ ఉండగా పరవశత్వంతో వింటూ –

**విశే :** గరుడుడు వేదస్వరూపుడు. 'వేదాత్మా విహగేశ్వరః'. గరుత్మంతుడు, సుపర్ణుడు అని కూడా గరుడునికి పేర్లు. ఈ రెండు పేర్లు ఇతని రెక్కల శక్తిని తెలుపుతాయి. ఇంద్రుని వజ్రాయుధం దెబ్బకు కూడా చలింపనివీ రెక్కలు. సుపర్ణుడనే శబ్దానికి అలాంటి చలింపని రెక్కలని అర్థం. మహావిష్ణువుకు వాహనమైన గరుడుడు ఆకాశాన ఎగురుతూ ఉంటే కదులుతూ ఉన్న రెక్కలనుండి పుట్టిన గాలి చేసే శబ్దం వేదగానంగా వినిపిస్తున్నది.

**చ. అరిగె వికుంఠధామమున కంత సకామనుఁడైన కర్దముం**
**దరయ విమోహియై మనమునందును ముందట వచ్చు కోరికల్**

**పిరిగొనుచుండఁదత్క్షణమ బిందుసరంబున కేగి యిందిరా**
**వరుఁదలపోయుచుండె జనవంద్యుఁడు భక్తినితాంతచిత్తుఁడై. 761**

**ప్రతి :** వికుంఠధామమునకున్= వైకుంఠస్థానానికి అనగా వైకుంఠానికి; అరిగెన్= (విష్ణుదేవుడు) వెళ్లాడు; అంతన్= తరువాత; సకామనుఁడు+ఐన= కోరికలతో కూడిన; జనవంద్యుఁడు= జనులచే స్తుతింపబడువాడైన; కర్దముండు= కర్దమమహాముని; అరయన్= విచారించగా; విమోహి+ఐ= మోహావేశం కలవాడై; మనమునందును= మనస్సులో; ముందటన్ వచ్చు= రాబోయే; కోరికల్= కాంక్షలు; పిరిగొనుచు+ఉండన్= పెనగొంటూ ఉండగా (అధికమవుతూ ఉండగా); తద్+క్షణము+అ= వెంటనే; బిందుసరంబునకున్+ఏగి= బిందు సరోవరానికి వెళ్లి; భక్తినితాంత= భక్తి నిండుగాగల; చిత్తుఁడు+ఐ= మనస్సుగలవాడై; ఇందిరావరున్= లక్ష్మీనాథుడైన శ్రీహరిని; తలపోయుచు+ఉండెన్= స్మరిస్తూ ఉన్నాడు.

**తా :** శ్రీహరి వైకుంఠానికి వెళ్లిన తరువాత కోరికలతో కూడినవాడు, జనవంద్యుడు అయిన కర్దమముని మోహావేశంతో ఫలించబోయే కోరికలు మనస్సులో అధికమవుతూ ఉండగా వెంటనే బిందుసరోవరానికి వెళ్లాడు. అక్కడ భక్త్యతిశయమైన మనస్సుతో లక్ష్మీనాథుడైన శ్రీహరిని స్మరిస్తూ ఉన్నాడు.

**విశే :** కర్దమముని దైవకార్యమైన సృష్టిని వృద్ధిచేయటానికి వివాహమాడాలని నిర్ణయించుకొన్నాడు. శ్రీహరిని ఆరాధించాడు. శ్రీహరి ప్రత్యక్షమై కోరిక నెరవేరుతుందని ఆశీర్వదించాడు. స్వాయంభువమనువు తన కొమార్తెను వెంటబెట్టుకొని రేపు నీవద్దకు వచ్చి ఆమెనిచ్చి నీకు వివాహం చేస్తాడని కూడా చెప్పాడు. ఇప్పుడు కర్దమముని తనకు కాబోయే భార్యకోసం ప్రతీక్షిస్తున్నాడు. ఆమె వస్తుంది తనకు వివాహం అవుతుంది అని తెలియడంవల్ల మనస్సు ఆనందంలో తేలిపోతూ ఉంది. 'ముందటవచ్చు కోరికల్ పిరిగొనుచుండన్' అంటే కాబోయే భార్యను, జరగబోయే వివాహాన్ని గురించి ఆలోచించినపుడు మనస్సులో కోరికలు అధికం కావడమని భావం.

**వ. అంత స్వాయంభువుండు గనకరథారూఢుం డగుచు నిజభార్యా సమేతుండై భర్తృవాంఛాపరయైన పుత్త్రికం దోడ్కొనుచు నిజతనూజకుం దగిన వరు నన్వేషించుచు భువనంబులు గలయం గ్రుమ్మరి యెందునుం గానక వచ్చి వచ్చి. 762**

**ప్రతి :** అంతన్= తరువాత; స్వాయంభువుండు= స్వాయంభువమనువు; నిజభార్యాసమేతుండు+ఐ= తనభార్యతో కలసి; కనకరథ+ఆరూఢుండు+అగుచున్= బంగారుతేరు ఎక్కినవాడై; భర్తృవాంఛాపర+ఐన= భర్తయందు కోరికగలదైన; పుత్రికన్= కొమార్తెను; తోడ్కొనుచున్= వెంటబెట్టుకొని; నిజతనూజకున్= తన పుత్రికకు; తగిన= అర్హుడైన; వరున్= వరుని (పెండ్లి కుమారుని); అన్వేషించుచున్= వెదకుతూ; భువనంబులు+కలయన్+క్రుమ్మరి= లోకాలన్నీ కలయదిరిగి; ఎందునున్+కానక= అలాంటి వరుడు ఎక్కడా కనబడక; వచ్చివచ్చి= తిరిగి తిరిగి.

**తా :** తరువాత స్వాయంభువమనువు భార్యతో కలసి బంగారు రథం ఎక్కి భర్తయందు కోరికగలదైన అనగా పెండ్లివయస్సులో ఉన్న తనయను వెంటబెట్టుకొని ఆమెకు అర్హుడైన వరుని వెదకుతూ లోకాలన్నీ కలయదిరిగాడు. కాని అలాంటి వరుడు ఎక్కడా కనపడలేదు. తిరిగి తిరిగి వచ్చి.

**ఉ. ముందటఁ గాంచె నంత బుధముఖ్యుఁడు విష్ణుఁడు గర్దమున్ దయా**
**నంద మెలర్పఁజూడ నయనంబుల రాలిన బాష్పముల్ ధరన్**

**బిందువులై వెసందొరఁగి పేర్చి సరస్వతిఁజుట్టి పాఱుటన్**
**బిందుసరోవరంబనెడి పేరఁ దనర్చిన పుణ్యతీర్థమున్. 763**

**ప్రతి :** విష్ణుఁడు= విష్ణుదేవుడు; కర్దమున్= కర్దమమహాముని; దయా+ఆనందము+ఎలర్పన్= దయతో నిండిన ఆనందం పెంపొందగా; చూడన్= వీక్షించగా; నయనంబుల రాలిన= కర్దముని కన్నులనుండి రాలిన; బాష్పముల్= ఆనందాశ్రువులు; ధరన్= భూమిపై; బిందువులు+ఐ= చుక్కలై; వెసన్+తొరఁగి= వెంటనే వెలువడి; పేర్చి= ఆ కన్నీటిచుక్కలన్నీ కలసి పెంపై; సరస్వతిన్+చుట్టి= సరస్వతీనదిని చుట్టుకొని; పాఱుటన్= ప్రవహించడంవల్ల; బిందుసరోవరంబు+అనెడి= బిందుసరోవరం అనే; పేరన్+తనర్చిన= పేరుతో వర్ధిల్లిన; పుణ్యతీర్థమున్= పావనతీర్థాన్ని; అంతన్= అనంతరం; బుధముఖ్యుఁడు= పండితోత్తముడైన స్వాయంభువమనువు; ముందటన్+కాంచెన్= తన కన్నుల ఎదుట దర్శించాడు.

**తా :** విష్ణుదేవుడు కర్దమమహామునిని కారుణ్యానందాతిశయంతో వీక్షించినపుడు కర్దముని కన్నులనుండి రాలిన ఆనందాశ్రువులు నేలపైపడి ఒక ప్రవాహమై సరస్వతీనదిని చుట్టుకొని ప్రవహించి బిందుసరోవరం అనే పేరుతో వర్ధిల్లింది. ఆ పుణ్యతీర్థాన్ని పండితోత్తముడైన స్వాయంభువమనువు తన కన్నుల ఎదురుగా దర్శించాడు.

**విశే :** కర్దమమహామునిని శ్రీహరి ఆనందం కరుణ కలిసిన దృక్కులతో వీక్షించాడు. కర్దముడు శ్రీహరిని ఆరాధించి వివాహం చేసుకోవాలని, దైవకార్యమైన సృష్టిని అభివృద్ధి చేయాలని కోరుకోవడం శ్రీహరికి ఆనందదాయకమైంది. అదే ఆయన కర్దమునిపై కారుణ్యం వర్షించడానికి కారణమైంది. కర్దమునికి దేవహూతికి తాను కపిలుడుగా జన్మించి తత్త్వోపదేశం చేయవలసి ఉంది. కర్దముడు శ్రీహరికి తండ్రి కాబోతున్నాడు. అది ఆయన సంతోషానికి మరొక కారణం. కర్దముని కన్నులనుండి రాలిన ఆనందాశ్రువులు బిందువులుగా నేలపై పడి ప్రవాహంగా మారి సరస్వతీనది చుట్టూ ప్రవహించి ఒక సరస్సుగా రూపొందడంవల్ల బిందు సరోవరమని పేరు ప్రఖ్యాతమైంది.

**ఉ. అందుఁ దమాల సాలవకుళార్జుననింబకదంబపాటలీ**
**చందననారికేళఘనసారశిరీషలవంగలుంగమా**
**కందకుచందనక్రముకకాంచనబిల్వకపిత్థమల్లికా**
**కుందమధూకమంజులనికుంజములందనరారి వెండియున్. 764**

**ప్రతి :** అందున్= ఆ బిందుసరోవరం పక్కనే ఉన్న కర్దముని తపోవనంలో; తమాల= కానుగచెట్లు; సాల= మద్దిచెట్లు; వకుళ= పొగడచెట్లు; అర్జున= ఏరుమద్దిచెట్లు; నింబ= వేపచెట్లు; కదంబ= కడిమిచెట్లు; పాటలీ= కలిగొట్టుచెట్లు; చందన= చందనవృక్షాలు; నారికేళ= కొబ్బరిచెట్లు; ఘనసార= కర్పూరవృక్షాలు; శిరీష= దిరిసెనపుచెట్లు; లవంగ= లవంగలతలు; మాకంద= మామిడిచెట్లు; కుచందన= ఎర్రగంధపుచెట్లు; క్రముక= పోకచెట్లు; కాంచన= సంపెంగచెట్లు; బిల్వ= మారేడుచెట్లు; కపిత్థ= వెలగచెట్లు; మల్లికా= మల్లెపొదలు; కుంద= మొల్లపొదలు; మధూక= ఇప్పచెట్లు; మంజుల= చక్కని; నికుంజములన్= పొదరిండ్లతో; తనరారి= అతిశయించి; వెండియున్= ఇంకా.

**తా :** ఆ బిందుసరోవరం పక్కనే కర్దముని తపోవనం ఉన్నది. ఆ వనంలో కానుగచెట్లు, మద్దిచెట్లు, పొగడచెట్లు, ఏరుమద్దిచెట్లు, వేపచెట్లు, కడిమిచెట్లు, కలిగొట్టుచెట్లు, చందనవృక్షాలు, కొబ్బరిచెట్లు, కర్పూరవృక్షాలు, దిరిసెనపుచెట్లు,

మామిడిచెట్లు, ఎర్రగంధపుచెట్లు, పోకచెట్లు, సంపెంగచెట్లు, మారేడుచెట్లు, వెలగచెట్లు, ఇప్పచెట్లు ఉన్నాయి. లవంగలతలు, మల్లెపొదలు, మొల్లపొదలు మొదలైన చక్కని పొదరిండ్లతో ఆశ్రమవాటిక అందంగా కనిపిస్తున్నది.

**క. పరిపక్వఫలభరానత, తరుశాఖానికరనివసితస్ఫుటవిహగో**
**త్కరబహుకోలాహలరవ, భరితదిగంతములు గలిగి భవ్యం బగుచున్. 765**

**ప్రతి :** పరిపక్వ= బాగాపండిన; ఫలభర+ఆనత= పండ్లబరువుతో వంగిన; తరుశాఖా నికర= చెట్ల కొమ్మల సముదాయంమీద; నివసిత= నివసించే; స్ఫుట= స్పష్టంగా కనిపించే; విహగ+ఉత్కర= పక్షుల సమూహం యొక్క; బహు= అధికమైన; కోలాహలరవ= కలకలధ్వనులతో; భరిత దిగంతములు= నిండిన దిగంతాలు; కలిగి; భవ్యంబు+అగుచున్= దర్శనార్హమువుతూ.

**తా :** ఆ యాశ్రమంలో బాగా పండిన పండ్లబరువుతో చెట్ల కొమ్మలు కిందికి వంగి ఉన్నాయి. ఆ కొమ్మలమీద నివసించే పక్షులగుంపుల కలకలధ్వనులతో దిగంతాలు ప్రతిధ్వనిస్తున్నాయి. ఆ దృశ్యం చూడడానికి ఆహ్లాదకరంగా ఉంది.

**క. అతినిశితచంచుదళన, క్షతనిర్గతపక్వఫలరసాస్వాదన మో**
**దిత రాజశుకవచోఽర్థ, శ్రుతిఘోషము సెలఁగె శ్రవణ సుఖదం బగుచున్. 766**

**ప్రతి :** అతి నిశిత= మిక్కిలి వాడిగానున్న; చంచు= ముక్కులతో; దళన= పొడిచినందువల్ల; క్షత= పడిన ముక్కలయిన భాగాలనుండి; నిర్గత= కారుతూ ఉన్న (బయటకు వస్తున్న); పక్వఫల= పండినపండ్ల; రస+ఆస్వాదన= రసాన్ని ఆస్వాదించడంవల్ల; మోదిత= సంతోషపడుతున్న; రాజశుక= రాచిలుకల; వచస్+అర్థ= రుచిరార్థంతో కూడిన మాటలనే; శ్రుతిఘోషము= వేదగానం; శ్రవణ= చెవులకు; సుఖదంబు+అగుచున్= శ్రావ్యతను కలిగిస్తూ; చెలఁగెన్= వ్యాపించింది.

**తా :** పండినపండ్లను మిక్కిలి వాడిగా ఉన్న తమముక్కులతో పొడిచి ఆ సందులనుండి కారుతూ ఉన్న ఫలరసాన్ని తాగి రాచిలుకలు సంతోషంతో చేస్తున్న రుచిరార్థంతో కూడిన వేదవాక్యములరవళి వీనులవిందుగా వినిపిస్తున్నది.

**క. లలితసహకారపల్లవ, కలితాస్వాదనకషాయకంఠవిరాజ**
**త్కలకంఠపంచమస్వర, కలనాదము లుల్లసిల్లఁ గడు రమ్యములై. 767**

**ప్రతి :** లలిత= లేతయైన; సహకారపల్లవ= మామిడి చిగుళ్లను; కలిత+ఆస్వాదన= తెగమెక్కడంవల్ల; కషాయకంఠ= వగరెక్కిన గొంతులతో; విరాజత్+కలకంఠ= ప్రకాశించే కోకిలలయొక్క; పంచమస్వర= పంచమస్వరంతోకూడిన; కలనాదములు= అవ్యక్త మధురమైన శబ్దములు; కడురమ్యములు+ఐ= ఎంతో మాధుర్యం నింపుకొన్నవై; ఉల్లసిల్లెన్= విలసిల్లినవి.

**తా :** లేత మామిడి చిగుళ్లను మెక్కి వగరెక్కిన గొంతులతో కోయిలలు ఎంతో రమ్యంగా అవ్యక్తమధురంగా కూస్తున్నాయి.

**క. అతులతమాలమహీజ, ప్రతతీక్షణజాతజలదపరిశంకాంగీ**
**కృతతాండవఖేలనవిల, సితపింఛవిభాసమానశిఖిసేవ్యంబై. 768**

**ప్రతి :** అతుల= సాటిలేని; తమాలమహీజప్రతతి= కానుగ చెట్లగుంపును; ఈక్షణజాత= చూడడంవల్ల కలిగిన; జలద= మేఘాలనే; పరిశంకా+అంగీకృత= భ్రాంతిచేత చేయటానికి పూనుకొన్న; తాండవఖేలన= ఉద్ధతమైన నృత్యక్రీడలో; విలసిత= ఒప్పిన; పింఛవిభాసమాన= పురులతో మిక్కిలి ప్రకాశించే; శిఖిసేవ్యంబు+ఐ= నెమళ్లచే సేవింపబడుచున్నదై.

**తా :** ఆ యాశ్రమంలో దట్టంగా ఉండిన కానుగచెట్లను చూచి మేఘాలుగా భ్రాంతిపడి నెమళ్లు పురులు విప్పి చూడముచ్చటగా నృత్యం చేస్తున్నాయి.

**క. కారండవ జలకుక్కుట, సారసబకచక్రవాకషట్పదహంసాం**
**భోరుహ కైరవ నవ క, ల్హారవిరాజితసరోరుహాకరయుతమై. 769**

**ప్రతి :** కారండవ= కన్నెలేళ్లతో; జలకుక్కుట= నీటికోళ్లతో; సారస= బెగ్గురుపక్షులతో; బక= కొంగలతో; చక్రవాక= చక్రవాకాలతో; షట్పద= గండుతుమ్మెదలతో; హంస= కలహంసలతో; అంభస్+రుహ= కమలాలతో; కైరవ= తెల్లకలువలతో; నవకల్హార= అప్పుడే వికసించిన ఎఱ్ఱకలువలతో; విరాజిత= ప్రకాశించే; సరోరుహ+ఆకరయుతము+ఐ= సరోవరాలతో కూడినదై;

**తా :** కన్నెలేళ్లతో, నీటికోళ్లతో, బెగ్గురు పక్షులతో, కొంగలతో, చక్రవాకాలతో, గండుతుమ్మెదలతో, కలహంసలతో, కమలాలతో, తెల్లకలువలతో, ఎఱ్ఱకలువలతో విరాజిల్లే సరోవరాలు గల ఆశ్రమం ఎంతో రమ్యంగా ఉంది.

**క. కరిపుండరీకవృక కా, సరశశభల్లూకహరిణచమరీహరి సూ**
**కరఖడ్గగవయవలిముఖ, శరభప్రముఖోగ్రవన్యసత్త్వాశ్రయమై. 770**

**ప్రతి :** కరి= ఏనుగులు; పుండరీక= పెద్దపులులు; వృక= తోడేళ్లు; కాసర= అడవిదున్నలు; శశ= కుందేళ్లు; భల్లూక= ఎలుగుబంట్లు; హరిణ= జింకలు; చమరీ= చమరీమృగాలు; హరి= సింహాలు; సూకర= వరాహాలు; ఖడ్గ= ఖడ్గమృగాలు; గవయ= గురుపోతులు; వలిముఖ= కోతులు; శరభ= ఒంటెలు; ప్రముఖ= మొదలైన; వన్యసత్త్వ= అడవి మృగాలకు; ఆశ్రయము+ఐ= నిలయమై;

**తా :** ఆ ఆశ్రమ పరిసరాల్లో ఏనుగులు, పెద్దపులులు, తోడేళ్లు, అడవి దున్నలు, కుందేళ్లు, ఎలుగుబంట్లు, చమరీమృగాలు, సింహాలు, వరాహాలు, ఖడ్గమృగాలు, గురుపోతులు, కోతులు, ఒంటెలు మొదలైన అడవిమృగాలు సంచరిస్తున్నాయి.

**విశే :** పై పద్యంలో కనిపించే అడవి జంతువుల్లో జింకలు, కుందేళ్ల వంటి సాధుజంతువులు కూడా ఉన్నాయి. సాధుజంతువులు, క్రూరజంతువులు కలసిమెలసి ఆశ్రమపరిసరాల్లో సంచరిస్తున్నాయి. మహర్షుల తపోమహిమవల్ల ఆశ్రమవాతావరణంలో శాంతి నెలకొని అక్కడి ప్రాణులలోగల సహజ క్రూరత్వం, వైరం అణగి పోతాయి. పెద్దజంతువులు చిన్నజంతువులను, క్రూరజంతువులు సాధుజంతువులను బాధించకుండా స్నేహంతో, ప్రేమతో కలసిమెలసి సంచరిస్తూ ఉంటాయి.

**వ. ఒప్పు నప్పరమతాపసోత్తముని యాశ్రమంబుంగనుంగొని మితపరిజనంబులతోడంజొచ్చి యందు. 771**

**ప్రతి :** ఒప్పు= అలా పక్షులతో, రాచిలుకలతో, కోయిలలతో, నెమళ్లతో, సరోవరాలతో, వన్యమృగాలతో విలసిల్లే; ఆ+పరమ= ఆ గొప్పవాడైన; తాపస+ఉత్తముని= మహామునీంద్రుని; ఆశ్రమంబున్= తపోవనాన్ని; కనుంగొని= దర్శించి; మిత= కొద్దిపాటి; పరిజనంబులతోడన్= పరివారంతో; చొచ్చి= ఆశ్రమంలోనికి ప్రవేశించి; అందున్= ఆశ్రమంలో.

**తా :** అలాంటి కర్దమముని తపోవనం దర్శించి స్వాయంభువమనువు కొద్దిపాటి పరివారంతో ఆశ్రమంలోకి ప్రవేశించాడు.

**సీ. అంచితబ్రహ్మచర్యవ్రతయోగ్యమై విలసిల్లు ఘనతపోవృత్తిచేత**
**దేహంబు రుచిరసందీప్తమై చెలువొందఁ గడుఁ గృశీభూతాత్మకాయుఁడయ్యు**
**నలినోదరాలాపనవసుధాపూరంబు శ్రోత్రాంజలులఁ ద్రావి చొక్కియున్న**
**కతనఁ గృశీభూతకాయుండు గాక జటావల్కలాజినశ్రీ వెలుంగఁ**

**తే. గమలపత్రవిశాలనేత్రములు దనర, నలి నసంస్కారసంచితానర్ఘ్యనూత్న**
**రత్నమును బోలియున్న కర్దమునిఁ జూచి, భక్తి మ్రొక్కెను మనువు తత్పాదములకు. 772**

**ప్రతి :** అంచిత= పవిత్రమైన; బ్రహ్మచర్యవ్రతయోగ్యము+ఐ= బ్రహ్మచర్య వ్రతానికి తగినదై; విలసిల్లు= శోభించే; ఘనతపస్+వృత్తిచేతన్= గొప్పదైన తపస్సు అనే ప్రవర్తనచేత; దేహంబు= ఒడలు; రుచిర= చక్కగా; సందీప్తము+ఐ= ప్రకాశవంతమై; చెలువు+ఒందన్= ఒప్పారగా; కడున్= మిక్కిలి; కృశీభూత= చిక్కిపోయిన, శుష్కించిన; ఆత్మకాయుఁడు+అయ్యున్= తన శరీరం కలవాడైనా; నలిన+ఉదర= ఉదరంనందు పద్మం కలవాడైన శ్రీహరియొక్క; ఆలాప= సంకీర్తన అనే; నవసుధాపూరంబు= అప్పటికప్పుడు కొత్తదవుతున్న అమృత ప్రవాహాన్ని; శ్రోత్ర+అంజలులన్= చెవులనే దోసిళ్ళతో; త్రావి= ఆస్వాదించి; చొక్కి+ఉన్నకతనన్= పారవశ్యం చెంది ఉన్న కారణంగా; కృశీభూతకాయుండు+కాక= కృశింపని దేహంకలవాడై; జటా= జడలూ; వల్కల= నారబట్టలూ; అజిన= జింకచర్మమూ–వీటి శోభ; వెలుంగన్= ప్రకాశిస్తుండగా; కమలపత్ర= తామరరేకులవంటి; విశాలనేత్రములు= వెడదలైన కన్నులతో; తనరన్= ఒప్పుతూ; అసంస్కార= సంస్కారంచేయబడని (సానబట్టని); సంచిత+అనర్ఘ్య= వెలకట్టలేని; నూత్నరత్నమును= కొత్తరత్నాన్ని; పోలి+ఉన్న= పోలినటువంటి; కర్దమునిన్+చూచి= కర్దమమహామునిని దర్శించి; మనువు= స్వాయంభువమనువు; తద్+పాదములకున్= కర్దముని చరణాలకు; భక్తిన్= భక్తితో; మ్రొక్కెను= నమస్కరించాడు.

**తా :** ఆశ్రమంలో ప్రవేశించిన మనువు కర్దమమునిని దర్శించాడు. పవిత్రమైన బ్రహ్మచర్యవ్రతానికి తగిన తపః ప్రవృత్తిచేత కర్దముని శరీరం చక్కగా ప్రకాశిస్తున్నది. దేహం మిక్కిలి కృశించిపోయినప్పటికి శ్రీహరి సంకీర్తనమనే అమృతరసాన్ని చెవులనే దోసిళ్ళతో ఆస్వాదించి ఆ మాధుర్యానికి పారవశ్యం చెంది ఉండిన కారణంగా ఆ కృశత్వం కనపడలేదు. ఆయన జడలూ, నారచీరలూ, జింకచర్మమూ ధరించి విశాలమైన నేత్రాలతో కనిపిస్తున్నాడు. సానబట్టని, వెలకట్టలేని నూతన రత్నంవలె ఉన్నాడు. అలా కనిపిస్తున్న కర్దముని పాదాలకు స్వాయంభువమనువు భక్తితో నమస్కరించాడు.

**విశే :** కర్దమముని కృశీభూతాంగుడైనా శ్రీహరి సంకీర్తనమనే అమృతరసాన్ని ఆస్వాదించడంవల్ల శరీర కృశత్వం కనిపించక పోవడానికి అతడు గొప్పభక్తుడు కావడం కారణం. భగవంతుడు అతనిని వాత్సల్యంతో చూడడం కూడా ఇందుకు హేతువు. కర్దముని ఈ లక్షణమే తనకూతురికి ఆయన తగిన భర్త అని మనువు అనుకొనేటట్లు చేసింది. కర్దముడు సానబట్టని, వెలకట్టలేని రత్నంవలె వెలిగిపోతున్నాడని చెప్పడంలో అతని నిగూఢమైన భక్తి తత్పరత దాగి ఉంది.

**"కన్యా వరయతే రూపం మాతా విత్తం పితా శ్రుతమ్**
**బాన్ధవాః కులమిచ్ఛన్తి మృష్టాన్నమితరే జనాః"**

'వరునిలో కన్యరూపాన్ని కోరుకుంటుంది. తల్లి సంపదను, తండ్రి విద్యావైభవాన్ని, బంధువులు కులమర్యాదను, తక్కినవారు తృప్తి కలిగించే భోజనాన్నీ కోరుకుంటారు' అనే శ్లోకాన్నిబట్టి ఈ పద్యంలో ఇంచుమించు అవన్నీ ఉన్నాయనే

అర్థాన్ని కవి ధ్వనిమార్గంలో తెలియజేస్తున్నాడు. రూపవర్ణన ఉంది. తపస్సంపద కానవస్తున్నది. తండ్రి ఆయన పాదాలకు నమస్కరించటం విద్యాదీప్తీ, కులమర్యాదా అభివ్యక్తం అవుతున్నాయి.

**వ. ఇట్లు వందనంబు గావించినం గర్దముండు దన గృహంబునకు విందై చనుదెంచిన య మ్మనువు నాదరించి యర్ఘ్య పాద్యాది విధులం బరితుష్టునిం గావించి పూర్వోక్తంబైన భగవదాదేశంబు సంస్మరించి స్వాయంభువున కిట్లనియె. 773**

**ప్రతి :** ఇట్లు= ఇలా; వందనంబు= నమస్కారం; కావించినన్= చేయగా; కర్దముండు= కర్దమమహాముని; తన; గృహంబునకున్= ఇంటికి; విందు+ఐ= అతిథిగా; చనుదెంచిన= వచ్చిన; ఆ+మనువును= ఆ స్వాయంభువమనువును; ఆదరించి= గౌరవించి; అర్ఘ్యపాద్య+ఆది= పూజకు తగినపదార్థాలు కూర్చటం, పాదప్రక్షాళనానికి తగినజలం ఇవ్వటం మొదలైన; విధులన్= చేయవలసిన కృత్యాలతో; పరితుష్టునిన్+కావించి= సంతృప్తిపరచి; పూర్వ+ఉక్తంబు+ఐన= విష్ణుదేవుడు ముందుగా మనువు కొమార్తెను తీసుకొని నీ దగ్గరకు వస్తాడని చెప్పినదైన; భగవత్+ఆదేశంబు= భగవంతుని ఆదేశాన్ని; సంస్మరించి= తలచుకొని, స్వాయంభువునకు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఇలా నమస్కరించిన స్వాయంభువమనువును కర్దమమహాముని తన ఇంటికి వచ్చిన అతిథిగా గౌరవించాడు. పూజాద్రవ్యాలు, పాదప్రక్షాళానికి జలం సమర్పించి ఆనందింపజేశాడు. ముందు విష్ణుదేవుడు ఆదేశించి ఉండిన విషయాన్ని గుర్తుకు తెచ్చుకొని స్వాయంభువమనువుతో ఇలా అన్నాడు.

**విశే :** పూజనీయులైన పెద్దవాళ్లు వచ్చినప్పుడు అర్ఘ్యం సమర్పించడం ఒక సంప్రదాయం. తేనె, పెరుగు, నెయ్యి, అక్షతలు, గరిక, నువ్వులు, పువ్వులు, దర్భ, పుష్పం – అన్నీ కలిపి అర్ఘ్యం అవుతుంది. ఇవన్నీ కలిపిన పూజాద్రవ్యంతో అర్చిస్తారు.

**సీ. వరగుణాకర! భగవద్భక్తియుక్తుండ వైన త్వదీయపర్యటన మెల్ల**
**శిష్టపరిగ్రహదుష్టనిగ్రహముల కొఱకుఁ గదా పుణ్యపురుష! మఱియు**
**వనజహితాహితవహ్నిసమీరవైవస్వతవార్ధిపవాసవాత్మ**
**కుఁడవు హరిస్వరూపుఁడ వైన నీకును మానితభక్తి నమస్కరింతు**

**తే. ననఘ! నీ విప్పుడే నేమి యఖిలలోక, జైత్రమగు హేమమణిమయస్యందనంబు**
**నెక్కి కోదండపాణివై యిద్ధసైన్య, పదవిఘట్టనచే భూమిభాగ మగల. 774**

**ప్రతి :** వరగుణ+ఆకర= శ్రేష్ఠమైన గుణాలకు స్థానమైనవాడా!; భగవత్+భక్తియుక్తుండవు+ఐన= భగవంతుని యెడల భక్తితోకూడినవాడవైన; త్వదీయ= నీయొక్క; పర్యటనము+ఎల్లన్= కార్యార్థం తిరగడమంతా; శిష్టపరిగ్రహ= మంచివారిని ప్రియంతో దగ్గరతీయడం (శిష్టులను రక్షించడంకోసం); దుష్టనిగ్రహముల కొఱకున్= దుష్టులను దండించడం కోసం (శిక్షించడం కోసం); కదా!; మఱియున్= ఇంకా; పుణ్యపురుష= పుణ్యాత్ముడా!; వనజహిత+అహిత= కమలానికి హితుడైన సూర్యుడు, అహితుడైన చంద్రుడు; వహ్ని= అగ్ని; సమీర= వాయువు; వైవస్వత= వివస్వంతుని కుమారుడైన యముడు; వార్ధిప= సముద్రాల అధిపతియైన వరుణుడు; వాసవ= ఇంద్రుడు; ఆత్మకుఁడవు= మొదలైనవారి అంశలుకలవాడవు; హరిస్వరూపుఁడవు= విష్ణుస్వరూపుడవు; ఐన= అయినటువంటి; నీకును= నీకు; మానితభక్తిన్= పరమభక్తితో; నమస్కరింతున్= నమస్కరిస్తున్నాను; అనఘ= పాపరహితుడా!; నీవు; ఎప్పుడేన్= ఎల్లప్పుడూ; అఖిలలోక= సమస్తలోకాలను; జైత్రము+అగు=

జయించగలదైన; నేమి= బండికంటి కడకమ్మిగల; హేమమణిమయ= బంగారుమయమై మణులుతాపిన; స్యందనంబున్+ఎక్కి= రథాన్ని అధిరోహించి; కోదండపాణివి+ఐ= చేత విల్లు ధరించినవాడవై; ఇద్ధ= విరాజిల్లుతున్న; సైన్య= సైనికుల; పద= పాదాల; విఘట్టనచేన్= రాపిడిచేత; భూమిభాగము= భూభాగం; అగలన్= దద్దరిల్లగా.

**తా :** శ్రేష్ఠమైన గుణాలకు స్థానమైనవాడా! భగవంతునియెడల భక్తిగలవాడవైన నీవు సజ్జనులను రక్షించడానికి, దుర్జనులను శిక్షించడానికి లోకమంతా పర్యటిస్తూ ఉంటావు గదా! ఓ పుణ్యపురుషా! సూర్య, చంద్ర, వాయు, యమ, వరుణ, ఇంద్రుల అంశలు కలవాడవు. విష్ణుస్వరూపుడవు. అలాంటి నీకు నేను పరమభక్తితో నమస్కరిస్తున్నాను. పాపరహితా! నీవు ఎప్పుడూ సమస్తలోకాలను జయించగలదైన నేమిగల మణులుతాపిన బంగారుమయమైన రథాన్ని అధిరోహించి, చేత విల్లుధరించి అడ్డూ ఆపులేని సైనికుల పాదాల రాపిడిచేత భూమి దద్దరిల్లగా (జైత్రయాత్ర) సాగిస్తూ ఉంటావు.

**మ. తరణింబోలి చరింపకున్న ఘననిద్రంబొంది యెందేని భూ**
**వర! పద్మోదరకల్పితంబులగు నీ వర్ణాశ్రమోదార వి**
**స్తరపాథోనిధి సేతుభూతమహిమాచారక్రియల్ దప్పి సం**
**కరమై చోరభయంబునన్ నిఖిలలోకంబుల్ నశించుంజుమీ! 775**

**ప్రతి :** భూవర= ఓ రాజా! (నీవు); తరణిన్+పోలి= సూర్యునివలె; చరింపక+ఉన్నన్= సంచరించకపోతే; నిఖిలలోకంబుల్= లోకాలన్నీ; ఘననిద్రన్+పొంది= గాఢ నిద్రను చెంది; పద్మ+ఉదర= పద్మగర్భుడైన బ్రహ్మచేత; కల్పితంబులు+అగు= నిర్మింపబడిన; ఈ; వర్ణ= బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్ర అనే నాలుగు కులాలకు సంబంధించిన; ఆశ్రమ= బ్రహ్మచర్యం, గృహస్థం, వానప్రస్థం, సన్యాసం అనే నాలుగు ఆశ్రమాలకు సంబంధించిన; ఉదార= గొప్పదైన; విస్తర= విస్తృతమైన; పాథస్+నిధి= నీటికి స్థానమైన సముద్రానికి; సేతుభూత= చెలియలికట్టయైన; మహిమాచారక్రియల్= సదాచార క్రియలనుండి; తప్పి= తొలగి; సంకరము+ఐ= జాతిసంకరమై (వర్ణభేదం తెలియకుండా కలిసిపోయి); చోరభయంబునన్= దొంగలభయంవల్ల; ఎందు+ఏని= ఎక్కడనో; నశించున్+చుమీ= నశించిపోతాయి కదా!

**తా :** రాజా! నీవు సూర్యునివలె నిరంతరం సంచరించకపోతే లోకాలన్నీ గాఢనిద్రలో మునిగిపోతాయి బ్రహ్మచే కల్పించబడిన (సృష్టింపబడిన) వర్ణాశ్రమాలు, గొప్ప సముద్రానికి చెలియలికట్టవంటి సదాచారక్రియలు భ్రష్టమై, జాతిసంకరమేర్పడి దొంగలభయంవల్ల లోకాలన్నీ ఎక్కడనో నశించిపోతాయి గదా!

**విశే :** ఈ పద్యంలో మనువు ఒక రాజుగా సూర్యునితో పోల్చబడినాడు. సూర్యుని వెలుగు లోకమంతా ప్రసరించినట్లు రాజు దృష్టికూడా అతని రాజ్యమంతా ప్రసరించాలి. అలా ప్రసరించినప్పుడే లోకంలోని మంచి చెడ్డలను గ్రహించగలుగుతాడు. లోకమంటే జనం. వర్ణాలు, ఆశ్రమాలు వాళ్లకు సంబంధించినవే. ఆ వర్ణాశ్రమాలు సాంకర్యదోషం పాలుకాకుండా చూడవలసిన బాధ్యత రాజుది. సూర్యుడు లేకపోతే ఉదయమే లేకపోవడంవల్ల లోకులు నిద్రలోనే ఉండిపోతారు. అలాగే రాజు నిరంతరం తన బాధ్యతను నిర్వర్తిస్తూ ఉండకపోతే వర్ణాశ్రమ సాంకర్యం ఏర్పడుతుంది. వర్ణాలు ఆశ్రమాలు గొప్పవి, విస్తృతమైనవి. అందువల్లనే అవి పాథోనిధితో పోల్చబడినాయి. సదాచార సంపత్తి పాథోనిధికి చెలియలికట్ట వంటిది.

**వ. అని పలికి భవదాగమనంబునకు నిమిత్తం బెయ్యది? యనవుడు సమాహిత నిత్యకర్మానుష్ఠానుండైన మునీంద్రునకు స్వాయంభువుం డిట్లనియె. 776**

**ప్రతి :** అని పలికి= అని చెప్పి; భవత్+ఆగమనంబునకున్= నీ రాకకు; నిమిత్తంబు+ఎయ్యది= కారణం ఏమిటి?; అనవుడు= అని అడుగగా; సమాహిత= యథావిధిగా; నిత్యకర్మ+అనుష్ఠానుండు+ఐన= నిత్యమూ వైదికాచారాలను నిర్వర్తించేవాడైన; ముని+ఇంద్రునకున్= కర్దమమహామునితో, స్వాయంభువుండు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అని చెప్పి కర్దమముని 'నీ రాకకు కారణం ఏమిటి?' అని స్వాయంభువుని అడుగగా యథావిధిగా నిత్యమూ వైదికాచారాలను నిర్వర్తించేవాడైన కర్దమ మునీంద్రునితో స్వాయంభువమనువు ఇలా అన్నాడు.

**విశే :** మానవులకు నిత్యములు, నైమిత్తికములు, కామ్యములు అని మూడువిధాలైన కర్మములు విధ్యుక్తములై ఉన్నాయి. అందులో సంధ్యావందనం మొదలైనవి నిత్యకర్మములు, పూర్ణిమ, అమావాస్య మొదలైన పర్వదినాలలో చేయవలసినవి నైమిత్తికములు. పుత్రకామేష్టి మొదలైనవి కామ్యములు.

**క. సరసిజగర్భుఁడు దనచే, విరచిత మైనట్టి వేదవితతుల నెల్లన్**
**ధర వెలయించుటకై బుధ, వర! మిమ్ముందన ముఖంబువలన సృజించెన్. 777**

**ప్రతి :** బుధవర= మునివరేణ్యా!; సరసిజగర్భుఁడు= పద్మంనుండి పుట్టిన బ్రహ్మదేవుడు; తనచేన్= తనవల్ల; విరచితము+ఐన+అట్టి= రచింపబడిన; వేదవితతులను+ఎల్లన్= వేదాలను అన్నింటినీ; ధరన్= భూమిమీద; వెలయించుటకై= బయలుపరచుటకు; మిమ్మున్= మిమ్ములను (కర్దమమునిని); తన; ముఖంబువలనన్= మోమునుండి, వదనంనుంచి; సృజించెన్= సృష్టించాడు.

**తా :** మునివరేణ్యా! బ్రహ్మదేవుడు తాను రచించిన వేదాలన్నిటిని ఈ భూమిమీద బయలుపరచడానికి మిమ్ములను తన ముఖంనుండి సృష్టించాడు.

**విశే :** వేదాలు అపౌరుషేయాలన్నారు గదా! మరి బ్రహ్మ రచించినట్లు చెప్పడం ఎలా? వేదాలు పరమాత్మ నుండి లోకంలోకి వచ్చినట్లు ఒక సంప్రదాయం చెపుతున్నది. సమస్త సృష్టికి, స్థితికి, లయానికి పరమాత్మే కారణమైనప్పటికి సృష్టిచేసే అధికారం బ్రహ్మదేవుని కిచ్చి ఆయనచేతనే సృష్టికార్యం చేయించాడు. అందువల్ల బ్రహ్మకే సృష్టికర్తగా పేరొచ్చింది. అలాగే వేదాల ఆవిర్భావానికి కూడా బ్రహ్మదేవుడే కర్త అని చెప్పే సంప్రదాయం ఉంది. అంతేగాక విశ్వంలోని ప్రతిదాని ఆవిర్భావమూ బ్రహ్మద్వారానే జరిగిందని చెప్పడమూ ఉంది.

**క. దురితస్వరూపపాట, చ్చరపీడంబొందకుండ సకలక్షోణిం**
**బరిపాలించుటకై మము, నరవిందభవుండు భుజములందు సృజించెన్. 778**

**ప్రతి :** దురితస్వరూప= పాపమే రూపంగాకల (పాపాత్ములైన); పాటచ్చర= దొంగల; పీడన్= బాధను; పొందకుండన్= అనుభవించకుండా (బాధలకు గురికాకుండా); సకలక్షోణిన్= సమస్తభూమిని; పరిపాలించుటకై= పరిపాలించడానికి; అరవిందభవుండు= పద్మభవుడైన బ్రహ్మదేవుడు; మమున్= మమ్ములను (స్వాయంభువమనువును); భుజముల+అందున్= భుజాల (బాహువుల)నుండి; సృజించెన్= సృష్టించాడు.

**తా :** పాపస్వరూపులైన దొంగలు కలిగించే బాధలకు గురికాకుండా సమస్తభూమినీ పరిపాలించడానికి మమ్ములను తన భుజాలనుండి బ్రహ్మ సృష్టించాడు.

**క. నెఱి నట్టి జలజభవునకుఁ, గర మంతఃకరణగాత్రకములై వరుసం**
**బఱఁగిన బ్రహ్మక్షత్త్రము, లరయ రమాధీశ్వరునకు నవనీయంబుల్. 779**

**ప్రతి :** జలజభవునకున్= బ్రహ్మదేవునికి; కరము= తప్పకుండా; అంతఃకరణగాత్రకములు+ఐ= మనసు, శరీరాలై; వరుసన్= క్రమంగా; పఱఁగిన= ఒప్పిన; బ్రహ్మక్షత్రములు= బ్రాహ్మణులు, క్షత్రియులు; అరయన్= విచారించగా; నెఱిన్= స్పష్టంగా; రమా+అధి+ఈశ్వరునకున్= లక్ష్మీపెనిమిటియైన శ్రీహరికి; అవనీయంబుల్= రక్షింపదగినవి.

**తా :** బ్రహ్మదేవునికి బ్రాహ్మణులు అంతఃకరణంగా, క్షత్రియులు శరీరంగా ప్రసిద్ధులైనారు. శ్రీహరికి ఈ రెండు జాతులవాళ్లు అవశ్యం రక్షింపదగిన వాళ్లు.

**వ. కావున హరిస్వరూపుండవై దుర్జనదుర్దర్శనుండ వయిన నినుం గనుట మదీయ భాగ్యంబున సిద్ధించె, భవత్పాదకంజ కింజల్క పుంజ రంజితంబైన మదీయ మస్తకంబును దావక వచనసుధా పూరితంబులైన శ్రవణంబులును మంగళకరత్వంబున సాఫల్యంబునం బొందె, నేను గృతార్థుండ నయితి దుహితృ స్నేహజదుఃఖ పరిక్లిన్నాంతఃకరణుండనై సకల దేశ పరిభ్రమణ ఖిన్నుండ నయిన నా విన్నపంబవధరింపు మని యిట్లనియె. 780**

**ప్రతి :** కావునన్= అందువల్ల; హరిస్వరూపుండవు+ఐ= విష్ణుస్వరూపుడవై; దుర్జన= దుష్టులకు; దుర్+దర్శనుండవు= శక్యముకాని దర్శనం కలవాడవు అనగా కనపడనివాడవు; అయిన; నినున్= నిన్ను; కనుట= దర్శించగలగడం; మదీయ= నాయొక్క; భాగ్యంబునన్= అదృష్టంవల్ల; సిద్ధించెన్= ప్రాప్తించింది; భవత్= నీయొక్క; పాదకంజ= పాదపద్మాలలోని; కింజల్కపుంజ= కేసరాలవల్ల; రంజితంబు+ఐన= ఎర్రనైన, అలంకృతమైన; మదీయ= నా; మస్తకంబును= శిరస్సూ; తావక= నీయొక్క; వచనసుధా= మాటలనే అమృతంతో; పూరితంబులు+ఐన= నిండిన; శ్రవణంబులును= చెవులూ; మంగలకరత్వంబునన్= శుభంకరత్వంవలన; సాఫల్యంబునన్+పొందెన్= సఫలత్వాన్ని పొందాయి; నేను; కృత+అర్థుండను= ధన్యుడను; అయితిన్= ఐనాను; దుహితృ= కొమార్తెపైగల; స్నేహజ= వాత్సల్యంవలన కలిగిన; దుఃఖ= దుఃఖంతో; పరిక్లిన్న= ఆందోళనపడుతున్న; అంతఃకరణుండను+ఐ= మనస్సుకలవాడనై; సకలదేశ= సమస్తదేశాలు; పరిభ్రమణ= తిరగడంవల్ల; ఖిన్నుండను+అయిన= అలసిపోయిన వాడనైన; నా; విన్నపంబు= ప్రార్థనను; అవధరింపుము+అని= ఆలకించుమని; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అందువల్ల విష్ణుస్వరూపుడవు, దుర్జనులకు కనపడనివాడవు అయిన నిన్ను దర్శించగలగడం నా అదృష్టంవల్ల ప్రాప్తించింది. నీ పాదపద్మాలలోని కేసరాలవల్ల ఎర్రనయిన నా తలా, నీ మాటలనే అమృతంతో నిండిన నా చెవులూ శుభాలకు స్థానాలై సఫలత్వాన్ని పొందాయి. నేను ధన్యుడనయ్యాను. కొమార్తెపైగల వాత్సల్యంవల్ల కలిగిన దుఃఖంతో మనస్సులో ఆందోళనపడుతూ దేశాలన్నీ (పెండ్లికొడుకు కోసం) తిరిగి అలసిపోయాను. నా ప్రార్థనను ఆలకించు అని మనువు కర్దమమహామునితో మరలా ఇలా అన్నాడు.

**మ. వరయోగీశ్వర! దేవహూతి యను నీ వామాక్షి మత్పుత్త్రి, దా**
**వరలావణ్యగుణాఢ్యులన్ వినియు నెవ్వారిన్ మదింగోర, కా**
**తురయై నారదుపంపునన్ మిము వరింతు న్నంచు నేతెంచె, నీ**
**తరుణీభిక్షఁ బరిగ్రహింపుము శుభోదాత్తక్రియాలోలతన్. 781**

**ప్రతి :** వరయోగి+ఈశ్వర= మహాయోగీశ్వరా!; దేవహూతి+అను= దేవహూతిఅనే; ఈ; వామ+అక్షి= అందమైన కనులుగల స్త్రీ; మత్+పుత్రి= నా కొమార్తె; తాన్= ఈమె; వర= శ్రేష్ఠమైన; లావణ్య= సౌందర్యంలోను; గుణ= గుణాలలోను; ఆఢ్యులన్= శ్రేష్ఠులను గురించి; వినియున్= విని; ఎవ్వారిన్= ఎవ్వరినీ; మదిన్+కోరదు= మనస్సులో ఇష్టపడదు; ఆతుర+ఐ= తొందరగలదై; నారదుపంపునన్= నారదమహర్షి ఆనతిమీద; మిమున్= మిమ్ములను (కర్దముని); వరింతున్+అంచున్= వరిస్తానని (పెండ్లాడుతానని); ఏ తెంచెన్= వచ్చింది; ఈ; తరుణీభిక్షన్= కన్యాదానాన్ని; శుభ+ఉదాత్త= శుభగౌరవంతో; క్రియాలోలతన్= స్థిరమైన సంకల్పంతో; పరిగ్రహింపుము= స్వీకరించు

**తా :** మహా యోగీశ్వరుడవైన కర్దమా! దేవహూతి అనే పేరుగల ఈ అందగత్తె నా కొమార్తె. ఈమె మిక్కిలి సౌందర్యవంతులు, గుణశ్రేష్ఠులు అయిన పురుషులను ఎవరినీ వివాహమాడడానికి అంగీకరించడంలేదు. ఇప్పుడు తొందరతో నారదమహర్షి పంపించడంవల్ల మిమ్ములను (కర్దమమునిని) వివాహమాడాలని ఇక్కడకు వచ్చింది. నీవు ఈ శుభకార్యాన్ని అంగీకరించి, స్థిరమైన సంకల్పంతో ఈ కన్యాదానాన్ని స్వీకరించు.

**క. అమలినగృహమేధిక క, ర్మములకు ననురూపగుణవిరాజితశీల**
**క్రమములఁ దనరిన తరుణిం, బ్రమదమున వరింపుమయ్య భవ్యచరిత్రా! 782**

**ప్రతి :** భవ్యచరిత్రా= శుభచరిత్ర కలవాడా!; అమలిన= నిర్మలమైన; గృహమేధిక= గృహస్థాశ్రమ; కర్మములకున్= కృత్యాలకు; అనురూప= తగిన; గుణవిరాజిత= గుణాలతో ప్రకాశిస్తున్న; శీలక్రమములన్= మంచిస్వభావరీతులతో; తనరిన= ఒప్పిన; తరుణిన్= కన్యను; ప్రమదమునన్= సంతోషంతో; వరింపుము+అయ్య= భార్యగా అంగీకరించు.

**తా :** శుభస్వభావంగల కర్దమ మహామునీ! పవిత్రమైన గృహస్థాశ్రమ కృత్యాలకు తగిన సుగుణాలతో, మంచి స్వభావరీతులతో కూడి ఒప్పుతున్న ఈ కన్యను సంతోషంతో భార్యగా స్వీకరించు.

**విశే :** గృహస్థాశ్రమం నాలుగాశ్రమాలలో అతిముఖ్యమైంది. మిగిలిన మూడు ఆశ్రమాలు గృహస్థాశ్రమం మీదనే ఆధారపడతాయి. గృహస్థాశ్రమానికి వివాహవ్యవస్థ మొదటిదశ. వివాహమై భార్యాభర్తలైన తరువాత సాగించే సంసారం గృహస్థాశ్రమధర్మాలపై ఆధారపడి సాగుతుంది. సక్రమంగా భార్యాభర్తలు గృహస్థాశ్రమధర్మాలను నిర్వర్తించాలంటే ఆ భార్యాభర్తల మధ్య చక్కని ఆనురూప్యం ఉండాలి. భర్త రూపానికి, గుణశీలాలకు తగినట్లు భార్య ఉండాలి. అలాగే భార్యరూపానికి, గుణశీలాలకు తగినట్లు భర్త ఉండాలి. ఇలా ఉన్నప్పుడే ఆ భార్యాభర్తలను చూచినవారు 'వీళ్లమధ్య ఈడూజోడూ కుదిరింది. అనుకూలమైన దాంపత్యం' అని ప్రశంసిస్తారు.

**క. అనఘ! విరక్తులకైనం, దనయంత లభించు సౌఖ్యతతి వర్జింపం**
**జనదఁట, కాముకులకు న, బ్బిన మానుదురే లభించు ప్రియసౌఖ్యంబుల్. 783**

**ప్రతి :** అనఘ= పుణ్యాత్ముడవైన ఓ కర్దమమునీంద్రా!; విరక్తులకు+ఐనన్= అనురాగంలేనివారికైనా; తన+అంతన్= తనంతతానుగా (అయాచితంగా); లభించు= చేకూరు; సౌఖ్యతతిన్= సుఖపరంపరను; వర్జింపన్= వదలిపెట్టడం; చనదు+ అఁట= కూడదట; కాముకులకున్= కోరికగలవారికి; అబ్బినన్= లభిస్తే; లభించు= అనుకోకుండా సమకూడే; ప్రియసౌఖ్యంబుల్= ఇష్టమైన సుఖాలను; మానుదురు+ఏ= వదలుకొంటారా?

**తా :** పుణ్యాత్ముడైన ఓ కర్దమ మునీంద్రా! అనురాగం లేనివారికైనా అయాచితంగా తమంతతామే లభించిన సుఖాలను వదలిపెట్ట కూడదన్నారు పెద్దలు. అలాంటప్పుడు అనుకోకుండా లభించిన ఇష్టమైన సుఖాలను కోరికలుగలవారు వదలుకొంటారా? వదలుకోరు.

**క. వినుము, ఫలారంభుఁడు గృప, ణుని నడిగినఁ దనయశంబునుందగు మానం**
**బును జెడుఁ గావునఁ దగ నీ, వెనయ వివాహేచ్ఛఁ దగులు టెఱిఁగి యిచటికిన్. 784**

**ప్రతి :** వినుము; ఫల+ఆరంభుఁడు= ఒక ప్రయోజనాన్ని ఆశించి పనిచేయడానికి పూనుకొన్నవాడు; కృపణునిన్= లోభిని; అడిగినన్= ఆ పనిలో సాయం చేయుమని అడిగితే; తన యశంబునున్= అడిగినవాని కీర్తి; తగుమానంబునున్= తగినంత అభిమానమూ; చెడున్= భంగపడతాయి; కావునన్= కాబట్టి; తగన్= తగినట్లు; నీవు; ఎనయన్= సాటియైన; వివాహ+ఇచ్ఛన్= వివాహమాడాలనే కోరికతో; తగులుట+ఎఱిఁగి= ఉండడం తెలుసుకొని; ఇచటికిన్= ఇక్కడికి...

**తా :** కర్దమమునీ! ఒక ప్రయోజనాన్ని ఆశించి పనిచేయడానికి పూనుకొన్నవాడు ఆ పనికోసం ఒకలోభి సాయం కోరితే అలా కోరినవాని కీర్తి, అభిమానమూ రెంటికీ భంగం కలుగుతుంది. నీవు వివాహం చేసుకోవాలనే కోరికతో ఉన్నావని తెలుసుకొని ఇక్కడికి (వచ్చాం).

**విశే :** కార్యనిర్వహణలో లోభి సహకారం కోరితే కార్యం చెడడమే కాకుండా కోరినవారి అభిమానమూ చెడుతుంది. ఇది అందరూ తెలుసుకోవలసిన నీతి. మనువు తన పుత్రికను కర్దమునికిచ్చి పెండ్లి చేయాలనే తలంపుతో వచ్చాడు. కర్దముడు కాదంటే తనపని నెరవేరకపోవడడమేగాక తన అభిమానం దెబ్బతింటుంది. కర్దముడు వివాహేచ్ఛతో శ్రీహరిని ఆరాధించిన విషయం మనువుకు తెలుసు. కొమార్తెను తీసుకొని కర్దముని ఆశ్రమానికి వెళితే ఆమె వివాహం కర్దమునితో జరుగుతుందనే నమ్మకంతో వచ్చాడు మనువు. కార్యం జరగకపోవడం, తన కీర్త్యభిమానాలకు భంగం కలగడం ఉండవని తెలిసే ఆయన వచ్చాడు.

**క. చనుదెంచితి, యస్మత్ప్రా, ర్థనఁ గైకొని మత్తనూజఁదగ వరియింపుం**
**డని ముని స్వాయంభువునిం, గనుఁగొని మరలంగఁ బలికెఁ గడుమోదమునన్. 785**

**ప్రతి :** చనుదెంచితిన్= నీవు వివాహేచ్ఛతో ఉన్నావని తెలిసి ఇక్కడికి వచ్చాను; అస్మత్= నా; ప్రార్థనన్= విన్నపాన్ని; కైకొని= అంగీకరించి; మత్+తనూజన్= నా సుతను; తగన్= అనుకూలంగా (ఇష్టంగా); వరియింపుడు= వరించండి (భార్యగా చేసుకోండి); అనన్= అనగా; ముని= కర్దమమహాముని; స్వాయంభువునిన్= స్వాయంభువుని; కనుఁగొని= చూచి; మరలంగన్= తన వైపు మరల్చుకొని; కడుమోదమునన్= మిక్కిలిసంతోషంతో; పలికెన్= చెప్పాడు.

**తా :** ఇక్కడికి నేను వచ్చిన సంగతి విన్నవించాను. నా విన్నపాన్ని అంగీకరించి నా కొమార్తెను ఇష్టంగా భార్యగా అంగీకరించండి అన్నాడు మనువు. ఆ మాటలు వినిన కర్దమమహాముని స్వాయంభువమనువును తన వైపుకు తిప్పుకొని మిక్కిలి సంతోషంతో ఇలా చెప్పాడు.

**సీ. అనఘ! నీ చేత ననన్యదత్తముగఁ బ్రతిష్ఠితంబైన యీ తీవఁబోఁడి**
**కమనీయరూపరేఖావిలాసంబుల మానితలక్ష్మీసమానయగుచు**

**నొకనాఁటి రాత్రియందుడురాజచంద్రికాధవళితనిజసౌధతలమునందు**
**మహితహిరణ్మయమంజీరశోభితచరణయై నిజసఖీసహిత యగుచుఁ**

**తే. గందుకక్రీడఁజరియింపఁ గగనమందు, వర విమానస్థుఁ డగుచు విశ్వావసుండు**
**నాఁగఁ దనరిన గంధర్వనాయకుండు, తరుణిఁ జూచి విమోహియై ధరణిఁ బడియె. 786**

**ప్రతి :** అనఘ= పుణ్యాత్ముడా! నీచేత; న+అన్యదత్తముగన్= ఇతరులకెవరికీ ఇవ్వబడకుండా; ప్రతిష్ఠితంబు+ఐన= నిలిపినదైన (నా కోసం నిలుపుకొని తీసుకొనివచ్చిన); ఈ; తీవఁబోఁడి= తీగవలె మనోజ్ఞురాలైన స్త్రీ; కమనీయ= మనోహరమైన; రూప= ఆకారం; రేఖా= సౌందర్యం; విలాసంబులన్= హొయలలోను; మానిత= పవిత్రురాలైన; లక్ష్మీసమాన+అగుచున్= లక్ష్మీదేవితో సమానురాలవుతూ; ఒకనాఁటి; రాత్రి+అందున్= నిశాసమయాన; ఉడురాజ= నక్షత్రాలకు నాథుడైన చంద్రుని; చంద్రికా= వెన్నెలచేత; ధవళిత= తెల్లగా చేయబడిన; నిజ= తన; సౌధతలమునందున్= మేడ పైభాగాన; మహిత= గొప్ప; హిరణ్మయ= బంగారుమయమైన (బంగారుతో చేసిన); మంజీరశోభిత= అందెలచే అలంకరింపబడిన; చరణ+ఐ= పాదాలు కలదై; నిజసఖీ= తన చెలికత్తెలతో; సహిత+అగుచున్= కూడినదై; కందుకక్రీడన్= బంతియాటతో; చరియింపన్= తిరుగుచుండగా (బంతియాట ఆడుతుండగా); గగనము+అందున్= ఆకాశంలో; వరవిమానస్థుఁడు+అగుచున్= శ్రేష్ఠమైన విమానంలో కూర్చొన్నవాడవుతూ (విమానంలో వెళుతూ); విశ్వావసుండు= విశ్వావసుడు; నాఁగన్+తనరిన= అని ప్రసిద్ధిపొందిన; గంధర్వనాయకుండు= గంధర్వరాజు; తరుణిన్+చూచి= ఈ యౌవనవతిని కనుగొని; విమోహి+ఐ= మిక్కిలి వ్యామోహం కలిగినవాడై; ధరణిన్+పడియెన్= భూమిపై పడినాడు.

**తా :** ఓ పుణ్యాత్ముడా! ఇతరుల నందరినీ కాదని నీవు నాకోసం తీసుకొనివచ్చిన ఈ లతాంగి రూపరేఖావిలాసాలలో మనోహరమైనది. పవిత్రురాలైన లక్ష్మీదేవితో సమానురాలు. ఒకనాటి రాత్రి వెన్నెలలో తెల్లగా కనిపిస్తున్న తన మేడపై ఈమె పాదాలకు బంగారుఅందెలు అలంకరించుకొని తన చెలికత్తెలతో బంతియాట ఆడుతున్నది. ఆ సమయంలో విమానంలో వెళుతున్న విశ్వావసుడు అనే గంధర్వరాజు ఈ తరుణీమణి సౌందర్యాన్ని తిలకించి మోహంతో శరీరస్పృహ లేకుండా విమానంనుండి తూలి భూమి మీద పడ్డాడు.

**విశే :** విశ్వావసుడు : ఒక గంధర్వుడు. ఇతడు దేవహూతిని చూచి మోహించాడు. ఆ పాపంతో తన స్థానంనుండి తప్పి కిందపడిపోయాడు. ఇది భాగవతంలోని విషయం.

భారతంలో ఇతడొక గంధర్వరాజు. ఇతనికి మేనకవలన ప్రమద్వర అనే కూతురు కలుగుతుంది. తరువాత తల్లిదండ్రులిద్దరూ ఆ బిడ్డను వదలి వెళ్లిపోతారు.

విశ్వావసుడు వివాహానికి అధిదేవతగా శాస్త్రాలలో చెప్పబడ్డాడు. ఏ కన్యనైనా అతడు మొదట వరించి భూమిపై పడిన తరువాత భర్త కాబోయేవాడు వరించునని వేదమంత్రాలు చెపుతున్నాయి. విశ్వావసువనగా పురుషుల సంపదయగు యౌవనమధురభావం. అతడు వరించనిదే ఏ కన్యనూ ఎవరూ వరించలేరు.

**తే. పుండరీకాక్షు నెఱుఁగని పురుషపశువు, లీ తలోదరిఁ బొడగాన రేమి సెప్ప?**
**నట్టి కొమరాలు భాగ్యోదయమునఁ దాన, వచ్చి కామింప నొల్లనివాఁడు గలఁడె? 787**

**ప్రతి :** పుండరీక+అక్షున్= తెల్లతామరలవంటి కనులుగల విష్ణుదేవుని; ఎఱుఁగని= తెలియని; పురుషపశువులు= నరాధములు; ఈ తల+ఉదరిన్= ఈ కాంతను (కృశించిన ఉదరంగల స్త్రీని); పొడ+కానరు= జాడ తెలుసుకోలేరు; ఏమి+చెప్పన్= ఏమి చెప్పగలం?; అట్టి= అలాంటి; కొమరాలు= అందగత్తె; భాగ్య+ఉదయమునన్= అదృష్టవశాన; తాను+అ= తనంతతానే; వచ్చి; కామింపన్= వరించగా; ఒల్లనివాఁడు= ఇష్టపడనివాడు; కలఁడు+ఎ= ఉంటాడా?

**తా :** పుండరీకాక్షుడైన శ్రీహరిని ఎరుగని నరాధములు ఈ అందగత్తె జాడ తెలుసుకోలేరు. అటువంటి కాంతాలలామ అదృష్టవశాన తనంతతానుగా వచ్చి వరించినపుడు అంగీకరింపనివాడు ఎవడైనా ఉంటాడా? ఉండడు.

**క. ఈ కన్యారత్నమునకు, నాకును గుణరూపవర్తనంబులయెడ నా**
**లోకింప సమమ కావునఁ, గైకొని వరియింతు విగతకల్మషవృత్తిన్. 788**

**ప్రతి :** ఈ; కన్యారత్నమునకున్= కన్యామణికి; నాకును= నాకూ (కర్దమునికి); గుణరూప= సద్గుణ, ఆకార; వర్తనంబులయెడన్= నడవడుల విషయంలో; ఆలోకింపన్= పరిశీలించి చూస్తే; సమమ= సమానం అనిపిస్తున్నది; కావునన్= అందువల్ల; విగత= నశించిన; కల్మషవృత్తిన్= పాపపునడవడితో (పుణ్యకార్యంగా భావించి); కైకొని= స్వీకరించి; వరియింతున్= వరిస్తాను (భార్యగా స్వీకరిస్తాను).

**తా :** గుణం, రూపం, నడవడి విషయంలో ఈ కన్యామణికి నాకూ సమానత్వం కనిపిస్తున్నది. అందువల్ల ఇది పుణ్యకార్యంగా భావించి ఈమెను నేను భార్యగా స్వీకరిస్తాను.

**విశే :** తనకూ (కర్దమునికి) కన్యారత్నానికి (దేవహూతికి) గుణరూపవర్తనలలో సమానత్వముందని కర్దమమహామునే చెప్పడం ఇక్కడ గమనింపదగి ఉంది. ఆయన మహర్షి కాబట్టి భార్యాభర్తలమధ్య వివాహానికి కావలసిన అంశాలేవో ఆయనకు తెలుసు. 782వ పద్యానికి చెప్పిన విశేషాంశవివరణ ఈ సందర్భానికీ సరిపోతుంది.

**క. విమలాత్మ! దీని కొక సమ, యము గల దెఱిఁగింతు విను గుణాకర యగు నీ**
**రమణికి నపత్యపర్యం, తము వర్తింపుదు గృహస్థధర్మక్రియలన్. 789**

**ప్రతి :** విమల+ఆత్మ= స్వచ్ఛమైన ఆత్మగలవాడా! (పుణ్యాత్ముడా!); దీనికిన్= ఈ వివాహం జరగడానికి; ఒక; సమయము= నియమం; కలదు= ఉంది; ఎఱిఁగింతున్= తెలియజేస్తాను; విను= ఆలకించుము; గుణ+ఆకర+అగు= ఉత్తమగుణములకు నిలయమయిన; ఈ; రమణికిన్= స్త్రీకి; అపత్యపర్యంతము= సంతానం కలిగే వరకు; గృహస్థధర్మ= సాంసారిక ధర్మ; క్రియలన్= విధులను; వర్తింపుదున్= నిర్వర్తిస్తాను.

**తా :** ఓ పుణ్యాత్ముడా! మాకు వివాహం జరగడానికి ఒక నియమం ఉంది. ఆ ఒడంబడిక ఏదో తెలియజేస్తాను విను. ఉత్తమ గుణాస్పద అయిన ఈమెకు సంతానం కలిగేవరకు సాంసారికధర్మాన్ని నిర్వర్తిస్తాను.

**విశే :** "ప్రజాతన్తుం మవ్యవచ్ఛేత్సీః"–సంతానమనే తంతువును త్రెంపివేయవద్దు. అని వేదానుశాసనం. దాంపత్యానికి సంతానమే ముఖ్యఫలం. కర్దముడు ఆ ధర్మాన్ని మనస్సులో ఉంచుకొని ఈ నియమాన్ని ప్రకటిస్తున్నాడు.

**ఆ. అంతమీఁద విష్ణు నాజ్ఞ యౌఁదలఁ దాల్చి, శమదమాది యోగసరణిఁ బొంది**
**సన్న్యసించువాఁడ జలజనేత్రుని వాక్య, కారణమునఁజేసి ధీరచరిత! 790**

**ప్రతి :** ధీరచరిత= జ్ఞానముతో కూడిన నడవడి గలవాడా!; అంతమీఁదన్= అటుతరువాత; జలజనేత్రుని= పద్మాలనుపోలిన కన్నులుగల శ్రీహరియొక్క; వాక్య= మాట (ఆజ్ఞ); కారణమునన్+చేసి= హేతువువల్ల; విష్ణు+ఆజ్ఞ= విష్ణువుయొక్క ఆనతిని; ఔఁదలన్+తాల్చి= శిరస్సున ధరించి, తలదాల్చి; శమదమ+ఆది= అంతరింద్రియ బహిరింద్రియ నిగ్రహములతో కూడిన; యోగసరణిన్+పొంది= యోగమార్గాన్ని అవలంబించి; సన్న్యసించువాఁడన్= సన్యాసం స్వీకరిస్తాను.

**తా :** జ్ఞానచరితా! అటు తరువాత శ్రీహరి ఆజ్ఞ ప్రకారం ఆయన ఆనతిని తలదాల్చి శమదమాదులతో కూడిన యోగమార్గాన్ని అవలంబించి సన్యాసం స్వీకరిస్తాను.

**విశే : ధీరచరిత –** అనేది సాభిప్రాయ సంబోధన. ఒకవిధంగా ఇది కన్యతండ్రికి అధైర్యాన్ని కలిగిస్తుంది. వద్దని ముందుగా చేస్తున్న హెచ్చరిక.

**క. శ్రీవిభునివలన నీ లో, కావళి యుదయించుఁ బెరుఁగు నడఁగును విను రా**
**జీవభవాదుల కతఁడే, భూవర! నిర్మాణహేతుభూతుం డరయన్. 791**

**ప్రతి :** శ్రీవిభునివలనన్= లక్ష్మీవల్లభునివల్లనే; ఈ లోక+ఆవళి= ఈ జగముల సముదాయం; ఉదయించున్= ఆవిర్భవిస్తుంది; పెరుగున్= వృద్ధి పొందుతుంది; అడఁగును= నశిస్తుంది; విను= ఆలకించు; రాజీవభవ+ఆదులకున్= పద్మగర్భుడైన బ్రహ్మమొదలైనవారికి; భూవర= ఓ రాజా!; అరయన్= ఆలోచించగా; నిర్మాణ= అభ్యుదయానికి; హేతుభూతుండు= కారణభూతుడు; అతఁడు+ఏ= ఆ మహావిష్ణువే.

**తా :** ఓ రాజా! ఆ రమాకాంతునివల్లనే ఈ ఎల్లలోకాలు ఆవిర్భవిస్తాయి. వృద్ధిపొందుతాయి. నశిస్తాయి. బ్రహ్మాదుల అభ్యుదయానికి ఆయనే కారణభూతుడై ఉన్నాడు.

**వ. అది గావున న మ్మహాత్ముని యాజ్ఞోల్లంఘనంబు సేయరాదని కర్దముండు వలికిన విని స్వాయంభువుండు నిజభార్యయైన శతరూప తలంపును బుత్త్రియైన దేవహూతి చిత్తంబును నెఱింగినవాఁడై ముని సమయంబున కియ్యకొని ప్రహృష్ట హృదయుం డగుచు సమంచిత గుణగణాఢ్యుం డయిన కర్దమునకు దేవహూతిని విధ్యుక్తప్రకారంబున వివాహంబు సేయించెఁ, దదనంతరంబ శతరూపయును బారిబర్హ సంజ్ఞికంబులైన వివాహోచిత దివ్యాంబరాభరణంబులు దేవహూతి కర్దముల కొసంగె, నవ్విధంబున నిజకులాచార సరణిం బరిణయంబు గావించి విగత చింతాభరుండై స్వాయంభువుండు దుహితృ వియోగ వ్యాకులిత స్వాంతుండై కూఁతుం గౌఁగిలించుకొని, చుబుకంబుఁ బుడుకుచుఁ, జెక్కిలి ముద్దుగొని, శిరంబు మూర్కొని, ప్రేమాతిరేకంబున బాష్పధారాసిక్తమస్తకంజేసి తల్లీ! పోయి వచ్చెద నని చెప్పి కర్దమునిచేత నామంత్రితుండై నిజభార్యా సమేతంబుగ రథం బెక్కి సపరివారుండై. 792**

**ప్రతి :** అది+కావునన్= శ్రీహరి ఆనతి అలా ఉన్నది గనుక; ఆ+మహా+ఆత్మున= ఆ దేవదేవుని; ఆజ్ఞా+ఉల్లంఘనంబు= ఆజ్ఞను అతిక్రమించడం; చేయరాదు+అని= చేయకూడదని; కర్దముండు; పలికినన్= చెప్పగా; విని; స్వాయంభువుండు; నిజభార్య+ఐన= తన ఇల్లాలైన; శతరూప; తలంపును= అభిప్రాయాన్ని (పుత్రిని కర్దమునికే ఇచ్చి పెండ్లి చేయాలనే తలంపును); పుత్త్రి+ఐన= కూతురైన, దేవహూతి; చిత్తంబునున్= మనస్సును, (కర్దమునే పెండ్లాడవలెనన్న మనస్సు);

ఎఱింగినవాఁడు+ఐ= తెలుసుకొన్నవాడై; ముని= కర్దమమహర్షి; సమయంబునకున్+ఇయ్యకొని= నియమానికి ఒప్పుకొని; ప్రహృష్ట= సంతోషంతో కూడిన; హృదయుండు+అగుచున్= చిత్తము గలవాడవుతూ; సమంచిత= ఉత్తమ; గుణగణ+ఆఢ్యుండు+అయిన= గుణసంపన్నుడైన, కర్దమునకు; దేవహూతిని; విధి+ఉక్తప్రకారంబునన్= శాస్త్రోక్త పద్ధతి ననుసరించి; వివాహంబు= పెండ్లి; చేయించెన్= జరిపించాడు; తద్+అనంతరంబు+అ= ఆ పిమ్మట; శతరూపయును= మనువు భార్యయైన శతరూప కూడా; పారిబర్హసంజ్ఞకంబులు+ఐన= పారిబర్హం అనే పేర్లుగల (అరణం పేరుతో చలామణిలో ఉన్న); వివాహ+ఉచిత= పరిణయ సందర్భానికి తగిన; దివ్య+అంబర+ఆభరణంబులు= మేలివస్త్రాలనూ, మేటినగలనూ; దేవహూతి కర్దములకున్; ఒసంగెన్= బహూకరించింది; ఆ+విధంబునన్= ఆ ప్రకారంగా; నిజకుల+ఆచారసరణిన్= తన కులాచారపద్ధతి ననుసరించి; పరిణయంబు+కావించి= పెండ్లి జరిపించి; విగత= పోయిన; చింతాభరుండు+ఐ= దుఃఖభారంకలవాడై; స్వాయంభువుండు; దుహితృ= తనయవలన కలిగిన; వియోగ= ఎడబాటుచే; వ్యాకులిత= కలతపడిన; స్వాంతుండు+ఐ= హృదయముగలవాడై; కూఁతున్= కొమార్తెను; కౌఁగిలించుకొని= ఆలింగనంచేసుకుని; చుబుకంబున్= గడ్డమును; పుడుకుచున్= వాత్సల్యంతో స్పృశిస్తూ; చెక్కిలి= బుగ్గను, చెంపను; ముద్దు+కొని= ముద్దాడి; శిరంబు= తలను; మూర్కొని= ఆఘ్రాణించి; ప్రేమ+అతిరేకంబునన్= ప్రేమాతిశయంతో; బాష్పధారాసిక్త= కన్నీటి జాలుతో తడిసిన; మస్తకన్+చేసి= తలగలదానినిగా చేసి; తల్లీ= బిడ్డా!; పోయివచ్చెదన్= వెళ్లివస్తాను; అని చెప్పి; కర్దమునిచేతన్= అల్లుడైన కర్దమమహామునిచేత; ఆమంత్రితుండు+ఐ= వీడ్కోలు చేయబడినవాడై; నిజభార్యాసమేతంబుగన్= తన పత్నితోకలసి; రథంబు+ఎక్కి= తేరును అధిరోహించి; సపరివారుండు+ఐ= పరిజనంతోకూడినవాడై.

**తా :** అలా ఉన్నదికాబట్టి ఆ దేవదేవుని ఆజ్ఞ అతిక్రమించరానిది అన్నాడు కర్దమమహాముని. ఆ మాటలు వినిన స్వాయంభువమనువు తన సుతను కర్దమునికి ఇవ్వాలని అనుకొంటున్న భార్య శతరూపయొక్క అభిప్రాయాన్ని, కర్దమునే వివాహమాడాలనుకొంటున్న కొమార్తె దేవహూతి అభిప్రాయాన్ని తెలుసుకొన్నాడు. కర్దమమునీంద్రుని నియమానికి ఒప్పుకొన్నాడు. ఎంతో సంతోషంతో ఉత్తమగుణసంపన్నుడైన ఆ కర్దమునికి దేవహూతినిచ్చి వేదశాస్త్రోక్త పద్ధతిననుసరించి వివాహం జరిపించాడు. ఆ తరువాత శతరూప పారిబర్హములనే పేరుగల (అరణంపేరుతో చలామణిలో ఉన్న) వివాహ సందర్భానికి తగిన దివ్యవస్త్రాలనూ, దివ్యాభరణాలనూ దేవహూతీ కర్దములకు బహూకరించింది. ఆ ప్రకారంగా తన కులాచార పద్ధతి ననుసరించి వివాహం జరిపించి బరువు బాధ్యతలు తీర్చుకొన్నాడు మనువు. కుమార్తెను వదలి వెళ్లవలసి రావడంతో ఆమె ఎడబాటు ఆయనకు ఎంతో కలతను కలిగించింది. కుమార్తెను కౌగిలించుకొన్నాడు. వాత్సల్యంతో గడ్డం నిమిరాడు. చెంపను ముద్దాడి తలను స్పృశించాడు. ప్రేమాతిశయంతో ఉబికిన కన్నీళ్లతో ఆమె శిరస్సును తడుపుతూ తల్లీ! వెళ్లివస్తానన్నాడు. అల్లుడైన కర్దముని వీడ్కోలు అందుకొని తన భార్యతో కలసి రథం అధిరోహించి పరిజనంతో కూడి బయలుదేరాడు.

**చ. తరళతరంగవీచిసముదంచితబిందుసరస్సరస్వతీ**
**సరిదరవిందతుందిలలసత్తరుతీరనివాససన్మునీ**
**శ్వరనికరాశ్రమాకలితసంపదలం గనుఁగొంచు వేడ్క ము**
**ప్పిరిఁగొన నేఁగె నాత్మపుటభేదనవిస్ఫుటమార్గవర్తియై. 793**

**ప్రతి :** తరళ= చలిస్తున్న; తరంగవీచి= అలల పంక్తులతో; సమ్+ఉదంచిత= ఎగురుతూ అందంగా ఉన్న; బిందుసరస్= బిందుసరస్సు; సరస్వతీసరిత్= సరస్వతీనదిలోని; అరవింద= పద్మాల; తుందిల= ఎక్కువ తనంతో; లసత్+తరు= ప్రకాశిస్తున్న

వృక్షాలుగల; తీర= బిందుసరస్సు, సరస్వతీనది తీరప్రాంతాలలో; నివాస= నివాసముకల; సత్+ముని+ఈశ్వర, నికర= మహనీయులైన మునిశ్రేష్ఠుల సముదాయంయొక్క; ఆశ్రమ+ఆకలిత= ఆశ్రమాలలో చక్కగా కూడబెట్టుకొన్న; సంపదలన్+ కనుఁగొంచున్= వైభవాలను దర్శిస్తూ; వేడ్క= ఆనందం; ముప్పిరి+కొనన్ (మూడు+పిరి)= ముప్పేట గొనగా (అతిశయించగా); ఆత్మపుటభేదన= తన పట్టణానికిపోవు; విస్ఫుట= స్పష్టమైన; మార్గవర్తి+ఐ= బాటను అనుసరించినవాడై; (స్వాయంభువమనువు); ఏఁగెన్= వెళ్లాడు.

**తా :** చలిస్తున్న అలలపంక్తులతో ఎగురుతూ అందంగా కనిపిస్తున్న బిందుసరస్సు, సరస్వతీ నదులలో పద్మాలు అధికంగా ఉన్నాయి. పక్కనే ఆశ్రమవృక్షాలు అందంగా అమరి ఉన్నాయి. బిందుసరస్సు, సరస్వతీనదుల తీరప్రాంతాలలో మహనీయులైన మునిశ్రేష్ఠులు నివాసముండే ఆశ్రమాలు చాలా ఉన్నాయి. స్వాయంభువమనువు ఆ యాశ్రమాల వైభవాలను దర్శిస్తూ ముప్పిరిగొన్న ఆనందంతో తన పట్టణమార్గాన్నిబట్టి వెళ్లాడు.

**వ. ఇట్లు సని చని బ్రహ్మావర్తదేశంబునందు. 794**

**ప్రతి :** ఇట్లు= ఇలా; చనిచని= వెళ్లివెళ్లి; బ్రహ్మావర్తదేశంబునందు...

**తా :** ఇలా వెళ్ళి వెళ్ళి బ్రహ్మావర్త దేశంలో

**విశే :** మనువు బ్రహ్మావర్తదేశానికి సమ్రాట్టుగా ఉండినట్లు చెప్పబడింది. పురాణప్రమాణాలనుబట్టి బ్రహ్మావర్త దేశమంటే సరస్వతి–దృషద్వతి అనే రెండునదుల నడిమి ప్రదేశం. అక్కడ రురువు అనే పేరుతో నల్లజింకలు సంచరిస్తూ ఉంటాయి. అందువల్ల ఆ ప్రదేశమంతా యజ్ఞయాగాది క్రతువులతో శ్రేష్ఠమైన బ్రహ్మజ్ఞానాన్ని, మోక్షాన్ని ప్రసాదిస్తుంది. స్థూలంగా ఈ ప్రదేశమిప్పుడు ఉత్తరభారతదేశంలో హిమాలయాలకు దిగువను, వింధ్య పర్వతాలకు పైనను ఉంది. మొట్టమొదట మానవజాతి భూగోళంపై అవతరించి ప్రదేశమిదేనని చెపుతారు.

**సీ. ఎందేనిఁదొల్లి లక్ష్మీశుండు యజ్ఞసూకరమూర్తిఁగైకొని సరభసముగ**
**నొడలు జాడించినఁబుడమిపై రాలిన రోమజాలంబులు రుచిరహరిత**
**వర్ణమై పొలుపార వరకుశకాశమయంబును యజ్ఞక్రియాకలాప**
**యోగ్యంబునై చాల నొప్పారి బర్హిస్సు సంభవించిన దాన సకలఋషులుఁ**

**తే. గ్రతువు లొనరించి తద్విఘ్నకారులైన, యసురులను ద్రుంచి రట్ల స్వాయంభువుండు**
**విష్ణుపరముగ మఖము గావించి రుచిర, మేధ సెలువొంది నట్టి యాత్మీయపురము. 795**

**ప్రతి :** ఎందు+ఏనిన్= ఎక్కడైతే; తొల్లి= పూర్వం; లక్ష్మీ+ఈశుండు= లక్ష్మీదేవిభర్తయైన శ్రీహరి; యజ్ఞసూకరమూర్తిన్+కైకొని= యజ్ఞవరాహరూపం ధరించి; సరభసముగన్= వేగంగా (గట్టిగా); ఒడలు= శరీరం; జాడించినన్= విదిలించగా; పుడమిపైన్ రాలిన= భూమిమీద పడిన; రోమజాలంబులు= వెంట్రుకలు; రుచిర= ఒప్పిదమైన; హరితవర్ణము+ఐ= ఆకుపచ్చనిరంగుతో; పొలుపు+ఆరన్= ఒప్పారగా; వర= శ్రేష్ఠమైన; కుశ, కాశ, మయంబును= దర్భలూ, రెల్లుగడ్డి అనేవానితో నిండిపోయినదీ; యజ్ఞక్రియా కలాపయోగ్యంబును+ఐ= యజ్ఞకార్యాలు చేయడానికి అర్హమై; చాలన్+ఒప్పారి= బాగా కుదిరి; బర్హిస్సు= అగ్ని; సంభవించినన్= పుట్టగా; దానన్= ఆ అగ్నితో; సకలఋషులున్= ఋషులందరూ; క్రతువులు+ఒనరించి= యజ్ఞాలు

నిర్వహించి; తద్+విఘ్నకారులు+ఐన= ఆ యజ్ఞాలకు ఆటంకాలు కలిగిస్తున్న; అసురులన్= రాక్షసులను; త్రుంచిరి= తుదముట్టించారు; అట్లు+అ= అలాగే; స్వాయంభువుండు; విష్ణుపరముగన్= విష్ణువునుద్దేశించి; మఖము+కావించి= యజ్ఞంచేసి; రుచిరమేధ= గొప్ప ప్రజ్ఞ; చెలువు+ఒందిన+అట్టి= విరాజిల్లినట్టి; ఆత్మీయపురము= తన పట్టణం...

**తా :** అలా ప్రయాణం చేసి మనువు బ్రహ్మావర్తదేశం చేరాడు. బ్రహ్మావర్తదేశంలో అతని నగరం ఉంది. అక్కడ పూర్వం శ్రీహరి యజ్ఞవరాహరూపం ధరించి శరీరాన్ని గట్టిగా విదిలించగా ఆయన శరీరంపై గల వెంట్రుకలు ఆ ప్రదేశంలో రాలాయి. ఆకుపచ్చని రంగుతో కనిపించిన ఆ వెంట్రుకల నుండి శ్రేష్ఠమైన దర్భలు, రెల్లుగడ్డి, యజ్ఞకార్యాలు చేయడానికి తగిన అగ్ని పుట్టాయి. వాటితో ఋషులందరూ యజ్ఞాలు నిర్వహించారు. యజ్ఞాలకు ఆటంకాలు కలిగిస్తున్న రాక్షసులను తుదముట్టించారు. ఆ ఋషులవలె స్వాయంభువమనువు కూడా అక్కడ విష్ణువునుద్దేశించి యజ్ఞం చేసి గొప్పప్రజ్ఞతో విరాజిల్లాడు. అటువంటి తన పట్టణాన్ని (ఆయన సమీపించాడు).

**విశే :** వైదిక కర్మకాండలో అంటే యజ్ఞ నిర్వహణలో దర్భలకు, రెల్లుగడ్డికి ప్రాధాన్యం ఉంది. దర్భ రెల్లుగడ్డి జాతికి చెందిన తృణం. పదిరకాల దర్భలున్నాయి. కుశం, కాశం, యవం, దూర్వం, విశ్వామిత్రం, ఉశీరం, కుందురం, గోధూమం, వ్రీహి, ముంజం అనేవి ఆ పదిరకాలు. దర్భలను కృష్ణపక్షమందలి పాడ్యమినాడు మంత్రపఠనం చేస్తూ సేకరిస్తారు. దర్భలు మంత్రాలను శక్తిమంతం చేస్తాయి. యజ్ఞసమయంలో, యోగసాధన సమయంలో ఆసనంగా వాడే చాప దర్భాసనం. ఈ చాపను రెల్లుగడ్డితో తయారుచేస్తారు. యజ్ఞదీక్షలో ఉన్నవారు దర్భ ఉంగరాలను ధరిస్తారు.

**క. డాయంజనఁ బురజనము లు, పాయనములు దెచ్చి యిచ్చి బహుగతుల నతుల్**
**సేయఁగ మంగళతూర్యము, లాయతగతి మ్రోయఁజొచ్చె నంతఃపురమున్. 796**

**ప్రతి :** డాయన్+చనన్= పట్టణాన్ని సమీపించగా; పురజనులు= పట్టణపౌరులు; ఉపాయనములు= కానుకలు; తెచ్చియిచ్చి; బహుగతులన్= అనేకవిధాలుగా; నతుల్+చేయఁగన్= స్తుతులు సల్పగా; అంతఃపురమునన్= అంతిపురంలో; మంగళతూర్యములు= మంగళవాద్యాలు; ఆయతగతిన్= కోలాహలంగా; మ్రోయన్+చొచ్చెన్= ధ్వనింపసాగాయి.

**తా :** స్వాయంభువమనువు పట్టణంలో ప్రవేశించగానే పౌరులు కానుకలు సమర్పించి అనేక విధాలుగా స్తుతించారు. మంగళవాద్యాలు కోలాహలంగా ధ్వనిస్తూ ఉండగా ఆయన అంతఃపురంలో ప్రవేశించాడు.

**వ. ఇట్లు ప్రవేశించి తాపత్రయోపశమనం బగు భగవద్భక్తి వృద్ధిఁ బొందించుచుఁ బుత్త్రమిత్ర సుహృద్బాంధవ సహితుండై పరమానందంబున. 797**

**ప్రతి :** ఇట్లు ప్రవేశించి= ఇలా అంతఃపురంలో ప్రవేశించి; తాపత్రయ+ఉపశమనంబు+అగు= ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవికాలనే తాపాలనుండి శాంతి కలిగించునదగు; భగవత్+భక్తిన్= భగవంతునందలి భక్తిని; వృద్ధిన్+పొందించుచున్= పెంపొందించుకొంటూ; పుత్త్ర= కొడుకులు; మిత్ర= స్నేహితులు; సుహృత్= ప్రతిఫలమాసింపని చెలికాండ్రతో; బాంధవ= చుట్టాలతో; సహితుండు+ఐ= కూడినవాడై; పరమ+ఆనందంబునన్= ఎంతో సంతోషంతో (ఉన్నాడు).

**తా :** ఇలా అంతఃపురంలో ప్రవేశించి స్వాయంభువమనువు ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవికాలనే మూడు తాపాలనూ శాంతపరచే భగవద్భక్తిని పెంపొందించుకొంటూ పుత్ర మిత్ర ఆప్తబాంధవులతో కూడి పరమానందంగా ఉన్నాడు.

తాపత్రయము – ఆధ్యాత్మికము– దేహసంబంధమైనరోగాదులు. ఆధిభౌతికము– ఇతర ప్రాణులవల్ల కలిగే ఆపదలు. ఆధిదైవికము– భూకంపాలు, గాలివానలు మొదలైనవి.

**మ. అతిభక్తింప్రతివాసరంబును హరివ్యాసంగుఁడై మాధవాం**
**కితగంధర్వవిపంచికాకలితసంగీతప్రబంధానుమో**
**దితుఁడై యిష్టవిభూతులందు ననురక్తింబొంద కే ప్రొద్దు న**
**చ్యుతసేవైకపరాయణుండగుచు నస్తోకప్రభావోన్నతిన్. 798**

**ప్రతి :** ప్రతివాసరంబును= ప్రతిదినమూ; అతిభక్తిన్= మిక్కిలి భక్తితో; హరివ్యాసంగుఁడు+ఐ= శ్రీహరియందు ఎంతో శ్రద్ధగలవాడై; మాధవ+అంకిత= లక్ష్మికి భర్తయైన శ్రీహరికి అంకితంగా (గుర్తుగా); విపంచికా+ఆకలిత= వీణావాద్యముతో మేళవించిన; సంగీత ప్రబంధ= గానయుక్తమైన పాటలచే; అనుమోదితుఁడు+ఐ= ఆనందిస్తున్నవాడై; ఇష్టవిభూతుల+అందున్= భోగభాగ్యాలమీద; అనురక్తిన్+పొందక= ఆసక్తిలేక; ఏప్రొద్దున్= ఏ రోజైనా (ప్రతిరోజూ, సర్వదా); అచ్యుతసేవా+ ఏకపరాయణుండు+అగుచున్= నారాయణుని సేవయందే ముఖ్యమైన ఆసక్తి గలవాడవుతూ; అస్తోక= అనంతమైన; ప్రభావ+ఉన్నతిన్= గొప్పమహిమతో...

**తా :** స్వాయంభువమనువు ప్రతిదినమూ అతిశయించిన భక్తితో శ్రీహరియందే మనస్సునిల్పి వీణను మేళవించి శ్రీహరికంకితంగా సంగీతయుక్తమైన భక్తిగీతాలు పాడుకొంటూ ఆనందంతో భోగభాగ్యాలమీద ఆసక్తి లేనివాడై, నారాయణుని సేవయందే ముఖ్యాసక్తి కలిగి అనంత మహిమతో... (ఉన్నాడు).

**విశే :** ప్రాచీనకాలంలో విద్య లయబద్ధమైన గీతాలద్వారా నేర్పబడుతూ ఉండేది. గీతాలద్వారా నేర్చుకొంటే లయజ్ఞానం ద్వారా నేర్చుకొన్న అంశాలు స్మృతిలో ఉంటాయి. సంగీత విద్యకు గాంధర్వవేదమనిపేరు. వాల్మీకిమహర్షి విరచిత శ్రీమద్రామాయణకావ్యం లవకుశులు మొదట్లో పాడడంద్వారానే ప్రచారమైనట్లు పాఠ్యే గేయే చ మధురం అని ప్రసిద్ధి పొందింది. రచింపబడినవన్నీ సంగీత ప్రబంధాలే. ఇక్కడ ప్రబంధమంటే ఒక కావ్యమని కాదు. సంగీతాత్మకమైన ఒక గీతం కూడా ప్రబంధమే.

**మ. హరిపాదాంబురుహద్వయార్పితతులస్యామోదముంగొంచుఁ ద**
**చ్చరితంబుల్ దలపోయుచుం బొగడుచుం జర్చించుచున్ వించుఁ ద**
**త్పరిచర్యావ్యతిరిక్తసంసరణసద్ధర్మార్థకామంబులం**
**బరిభూతంబులు సేసి మోక్షపదసంప్రాప్తిక్రియారంభుఁడై. 799**

**ప్రతి :** హరి= నారాయణునియొక్క; పాద+అంబురుహద్వయ= పాదపద్మ యుగళంపై; అర్పిత= సమర్పింపబడిన; తులసీ+ఆమోదమున్= తులసీదళాల పరిమళాన్ని; కొంచున్= పరిగ్రహిస్తూ (ఆఘ్రాణిస్తూ); తత్+చరితంబుల్= ఆ మాధవుని కథలను; తలపోయుచున్= స్మరిస్తూ; పొగడుచున్= స్తుతిస్తూ; చర్చించుచున్= పరామర్శిస్తూ; వించున్= ఆలకిస్తూ; తద్+పరిచర్యా= ఆ దేవుని సేవలకు; వ్యతిరిక్త= ఆటంకాలైన; సంసరణ= సంసారబంధాలైన; సత్+ధర్మ+అర్థ, కామంబులన్= ధర్మార్థకామపురుషార్థాలను; పరిభూతంబులు+చేసి= తిరస్కరించి; మోక్షపదసంప్రాప్తి= మోక్షస్థానమును పొందడానికి కావలసిన; క్రియా+ఆరంభుఁడై= కార్యాలను చేయడం ప్రారంభించి, (ప్రారంభించాడు).

**తా :** స్వాయంభువమనువు శ్రీహరి పాదపద్మాలపై సమర్పింపబడిన తులసీదళాల పరిమళాన్ని ఆఘ్రాణిస్తూ, ఆ భగవంతుని కథలను స్మరిస్తూ, స్తుతిస్తూ, పరామర్శిస్తూ, ఆలకిస్తూ, ఆ దేవుని సేవలకు ఆటంకాలై సంసారబంధాలైన ధర్మార్థకామాలను తిరస్కరించి మోక్ష పదవి పొందడానికి కావలసిన కార్యాలు చేయడం ప్రారంభించాడు.

**విశే :** ధర్మార్థకామమోక్షాలు చతుర్విధ పురుషార్థాలు. పురుషుడు సాధించవలసినవి పురుషార్థాలు. ఈ నాలుగింటిలో ధర్మం మొదటిది, ముఖ్యమైనది. అర్థకామాలు ధర్మబద్ధంగా ఉండాలని సూచించడానికే ధర్మం మొదటనే కనిపిస్తున్నది. ధర్మార్థకామాలు మానవుని లౌకిక జీవితానికి, మోక్షం అలౌకిక జీవితానికి సంబంధించినవి. ధర్మార్థకామాలను చక్కగా అనుష్ఠించగలిగితే మానవజీవితం శాంతిధామమవుతుంది. మోక్షమంటే ముక్తి. ప్రాపంచిక జీవితంనుండి విడుదల పొందడమే మోక్షం.

**క. నిగమార్థగోచరుండనఁ, దగు హరిచరితప్రసంగతత్పరచిత్తుం**
**డగు నతనికి స్వాంతరగము, లగు యామము లొగి నయాతయామము లయ్యేన్. 800**

**ప్రతి :** నిగమ+అర్థ= వేదార్థాలకు మాత్రమే; గోచరుండు+అనన్+తగు= అగపడువాడు అనదగు; హరి= శ్రీమన్నారాయణుని యొక్క; చరిత= కథలను; ప్రసంగ= ప్రస్తావించడంలో; తద్+పరచిత్తుండు+అగు= ఆసక్తిగల మనస్సువాడగు; అతనికిన్= ఆ స్వాయంభువమనువుకు; స్వ+అంతరగములు+అగు= తనలోనికి ప్రవేశించునవైన; యామములు= జాములు; ఒగిన్= క్రమంగా; అయాత= వెళ్లని; యామములు= జాములు; అయ్యేన్= ఐనవి. అనగా ఎన్ని జాములు గడచినా గడవనట్లే అయింది.

**తా :** వేదార్థాలకు మాత్రమే అగపడువాడనదగు శ్రీహరియొక్క కథలను ప్రస్తావించడంలో ఆసక్తిగల ఆ స్వాయంభువమనువుకు ఎన్ని జాములు గడచినా గడవనట్లుగా ఉంది.

**విశే :** శ్రీహరి కథా ప్రస్తావనలో మునిగిన మనువుకు కాలం గడచిపోతున్న విషయమే తెలియడంలేదు. ఒక జాము గడచిపోయి మరొక జాము వస్తున్నట్లు తెలుస్తున్నదేగాని తెల్లవారినట్లు తెలియడం లేదు. అతనికి కాలం గడుస్తున్న విషయమే తెలియలేదని భావం. అతని ధ్యాస అంతా శ్రీహరి చరితంమీదనే ఉంది. మూడుగంటలకాలం ఒక జాము. ఒక రాత్రికి నాలుగు జాములు.

**సీ. వెండియు నమ్మేటి విష్ణుమంగళ కథా కర్ణన ధ్యానానుగాన నుతులు**
**సలుపుచుఁ స్వస్వప్న జాగ్రత్సుషుప్తులఁ దలఁగించి యీ పుణ్యతముఁడు దాను**
**జక్రిదాసుఁడు గాన శారీర మానస దివ్యమానుష భౌతిక వ్యథలను**
**దగులక సన్మునీంద్రశ్రేణికిం దగఁ, దనరు వర్ణాశ్రమ ధర్మగతులు**

**తే. దప్పకుండంగ నడుపుచుఁ దగిలి సర్వ, భూతహితవృత్తి నతులవిఖ్యాతలీల**
**నేకసప్తతియుగము లస్తోకచరితుఁ, డగుచు వర్తించె సమ్మోద మతిశయిల్ల. 801**

**ప్రతి :** వెండియున్= ఇంకా; ఆ+మేటి= గొప్పవాడైన స్వాయంభువమనువు; విష్ణు= విష్ణువుయొక్క; మంగళ కథా= పవిత్ర వృత్తాంతాలను; ఆకర్ణన= వింటూ; ధ్యాన= మనస్సులో తలపోస్తూ; అనుగాన= అనుసరించి పాడుతూ; నుతులు=

స్తోత్రాలు; సలుపుచున్= చేస్తూ; తాన్= తాను; స్వస్వప్న= తనయొక్క కల; జాగ్రత్= మెలకువ; సుషుప్తులన్= గాఢనిద్రలను; తలఁగించి= తొలగించి;(స్వప్నజాగ్రత్సుషుప్తులను పాటించకుండా, ఆ యవస్థలకు అతీతంగా); ఈ పుణ్యతముఁడు= ఈ పుణ్యాత్ముడైన మనువు; తాను= అతడు; చక్రిదాసుఁడు+కానన్= సుదర్శనచక్రం ధరించిన విష్ణుభక్తుడు కాబట్టి; శారీర= దేహానికి; మానస= మనస్సుకు సంబంధించిన; దివ్య= దైవశక్తులవల్ల; మానుష= మానవ చేష్టలవల్ల; భౌతిక= భూతసంబంధమైన (పంచభూతాల) వాటివల్ల కలిగే; వ్యథలను= కష్టాలను; తగులక= పొందక; సత్+ముని+ఇంద్రశ్రేణికిన్= ఉత్తములైన మునీశ్వరులకు; తగన్= తగినట్లుగా; తనరు= ఒప్పు; వర్ణ+ఆశ్రమ= నాలుగు వర్ణాలకు, నాలుగు ఆశ్రమాలకు సంబంధించిన; ధర్మగతులు= ధర్మపద్ధతులు; తప్పకుండంగన్= తప్పకుండా; నడుపుచున్= సాగిస్తూ; తగిలి= ఆ ధర్మాలతో సంబంధం కలిగి; భూతహితవృత్తిన్= ప్రాణులకు మేలుచేయడమే నడవడిగా; అతుల= సాటిలేని; విఖ్యాతలీలన్= ప్రఖ్యాతి పొందే విధంగా; ఏకసప్తతి యుగములు= డెబ్బదియొక్క యుగాలు; అస్తోకచరితుఁడు+అగుచున్= గొప్ప సచ్చరిత్ర గలవాడగుచూ; సమ్మోదము+అతిశయిల్లన్= ఆనందమతిశయించునట్లు; వర్తించెన్= ప్రవర్తించాడు, మెలిగాడు.

**తా :** స్వాయంభువమనువు పవిత్రమైన శ్రీహరి కథలను వింటూ, ఆయన స్వరూపాన్ని మనస్సులో నిలుపుకొంటూ, ఆయన గుణనామాలను పాడుకొంటూ, ఆయనను ఆరాధిస్తూ, తన స్వప్న జాగ్రత్ సుషుప్తి అవస్థలకు అతీతంగా ప్రవర్తించాడు. పుణ్యాత్ముడైన మనువు విష్ణుదేవుని భక్తుడు కాబట్టి దేహానికీ, మనసుకూ చెందిన బాధలు పొందలేదు. దైవశక్తులవల్ల, మానవచేష్టలవల్ల, పంచభూతాలవల్ల కలిగే కష్టాలలో చిక్కుకోలేదు. ఉత్తమ మునీశ్వరుల ఆశయాలకు తగినట్లుగా వర్ణాశ్రమ ధర్మపద్ధతులను తప్పకుండా నడుపుతూ ఆధర్మాలతో సంబంధం కలిగి, ప్రాణులకు మేలుచేయడమే నడవడిగా, సాటిలేనివిధంగా ప్రఖ్యాతి పొందుతూ, ఆనందాతిశయంతో డెబ్బదియొక్కయుగాలు పాలించి సచ్చరిత్రుడై విరాజిల్లాడు.

**విశే :** శ్రీహరి దివ్యమంగళ కథాకర్ణన ధ్యానాను గానాలలో మునిగిన మనువుకు స్వప్నజాగ్రత్సుషుప్తులు లేవని చెప్పడం వల్ల ఆయన నిరంతరం ఇతర చింతలన్నిటిని వదలి తదేక ధ్యానంలో ఉన్నాడని, అందువల్లనే ఆయనకు ఎలాంటి బాధలు కలగలేదని అర్థమవుతున్నది. తన్నే నమ్మి శరణాగతి చేసిన ఎలాంటి భక్తునికైనా శ్రీహరి ఎలాంటి చింతలను దరిచేరనివ్వడనడానికి మనువుకథ ఒక ఉదాహరణం.

భగవదాజ్ఞతో మనువు భూమిని పరిపాలిస్తాడు. పరిపాలకుడైనవాడు వర్ణాశ్రమ ధర్మాలను కాపాడాలని ధర్మశాస్త్రాలు చెపుతాయి. అలాకాకుంటే సమాజం సాంకర్యదోషంతో చెడిపోతుంది. ఆ దోషం పరిపాలకునికి చెందుతుంది. అందువల్ల ప్రాచీన శాస్త్ర సాహిత్యం ఈ విషయాన్ని వివరంగా పేర్కొన్నది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర– నామాలతో వర్ణాలు నాలుగు. గుణకర్మలనుబట్టి చేయబడిన విభాగమిది. బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసములనే పేర్లతో ఆశ్రమాలు నాలుగు. ఒక్కొక్క వర్ణంవారికి ఆశ్రమధర్మాలు ఒక్కొక్క విధంగా ఉంటాయి. డెబ్బైయొక్క యుగాల కాలాన్ని మన్వంతరం అంటారు.

**క. అని య మ్మనుచరితము విదు, రున కమ్మైత్రేయమునివరుఁడు దయతోడన్**
**వినిపించి కర్దముని కథ, దనరఁగ నెఱిఁగింతు నని ముదంబునఁ బలికెన్. 802**

**ప్రతి :** అని= అలా జరిగిందని; ఆ+మనుచరితము= ఆ మనువుయొక్క గాథ; ఆ+మైత్రేయమునివరుఁడు= ఆ మైత్రేయమహర్షి; దయతోడన్= కృపతో; విదురునకున్; వినిపించి= తెలియజేసి; కర్దమునికథ= కర్దమమహాముని చరిత్రను; తనరఁగన్= ఒప్పిదముగా; ఎఱిఁగింతును+అని= తెలియజేస్తానని; ముదంబునన్= సంతోషంతో; పలికెన్= చెప్పాడు.

**తా :** అలా జరిగిందని ఆ మనువుచరిత్రను మైత్రేయమహర్షి దయతో విదురునికి తెలియజేశాడు. తరువాత కర్దమమహాముని చరిత్రను తెలియజేస్తాను వినుమని సంతోషంతో అన్నాడు.

## ✤ కర్దమప్రజాపతి యోగప్రభావంబుచే విమానంబు గల్పించి భార్యతోఁగూడి విహరించుట ✤

**వ. ఇట్లు స్వాయంభువుండు దేవహూతిం గర్దమునికి వివాహంబుసేసి మరలి చనినం దదనంతరంబ దేవహూతియుఁ బతిభక్తి గలిగి భవునికి భవాని పరిచర్య సేయు తెఱంగునఁ బతియ తనకు నేడుగడయుంగా నెఱింగి య మ్మునీంద్రుని చిత్తవృత్తికొలఁది దినదినంబునకు భక్తి తాత్పర్య స్నేహంబులు రెట్టింపం బ్రియ శుశ్రూషణంబులు గావించుచు ననూనతేజోవిరాజిత యగుచుఁ గామ క్రోధ దంభ లోభాది గుణవిరహితయై శరీరశుద్ధి వహించి చతుర సౌహార్ద స్నేహంబులు గలిగి పతియ దైవంబుగా భావించి మృదు మధుర వచన రచనయై పతిభక్తి యేమఱక వర్తింప దైవయోగంబు నైననుం దప్పింప సమర్థుండైన కర్దముండు నిజసేవాయాస కృశీభూతదేహయై యున్న దేవహూతిం గరుణాతరంగితాపాంగుండై కనుంగొని మంజుభాషణంబుల నిట్లనియె. 803**

**ప్రతి :** ఇట్లు= ఇలా; స్వాయంభువుండు; దేవహూతిన్= మనువు పుత్రి అయిన దేవహూతిని; కర్దమునికిన్= కర్దమమహామునికిచ్చి; వివాహంబు+చేసి= పెండ్లిజరిపించి; మరలిచనినన్= తిరిగి వెళ్లగా; తద్+అనంతరంబు+అ= అటు తరువాత; దేవహూతియున్= దేవహూతికూడా; పతిభక్తి+కలిగి= భర్తమీద భక్తితో; భవునికిన్= సర్వమూ తానే అగువాడైన శివునికి; భవాని= శివుని పత్నియైన పార్వతి; పరిచర్య+చేయుతెఱంగునన్= సేవ చేసిన విధంగా; పతియ= భర్తే; తనకున్= దేవహూతికి; ఏడుగడయున్+కాన్= సప్తవిధ రక్షకమని, దిక్కు అని; ఎఱింగి= తెలుసుకొని; ఆ+ముని+ ఇంద్రుని= ఆ మునీశ్వరుడైన కర్దముని; చిత్తవృత్తికొలఁదిన్= మనస్సులోని భావాలకు అనుగుణంగా; దినదినంబునకున్= రోజురోజుకు; భక్తి తాత్పర్య స్నేహంబులు= భక్తి, ఆత్మసమర్పణ, ప్రేమభావాలు; రెట్టింపన్= రెండురెట్లు కాగా; ప్రియ= ప్రేమమయమైన; శుశ్రూషణంబులు= సేవలు; కావించుచున్= చేస్తూ; అనూన= తక్కువకాని; తేజస్+విరాజిత+అగుచున్= తేజస్సుతో ప్రకాశిస్తూ; కామ, క్రోధ, దంభ, లోభ+ఆది= కామం క్రోధం కపటం లోభం మొదలైన; గుణవిరహిత+ఐ= దుర్గుణాలు లేనిదై; శరీరశుద్ధి= దేహాన్ని పరిశుభ్రంగా ఉంచుకోవడం; వహించి= పూని; (దేహాన్ని పవిత్రంగా ఉంచుకోవడం); చతుర= చాతుర్యం; సౌహార్ద= మంచిఆదరణ; స్నేహంబు+కలిగి= ప్రేమలు కలిగి; పతి+అ= భర్తయే; దైవంబుగాన్= భగవంతుడుగా; భావించి= తలచి; మృదు= కోమలమైన; మధుర= తియ్యనైన; వచనరచన+ఐ= పలుకులతీరు గలదై; పతిభక్తి; ఏమఱక= ఉపేక్షచేయకుండా; వర్తింపన్= మెలగుతుండగా; దైవయోగంబును+ఐననున్= దైవేచ్ఛనుసైతము; తప్పింపన్= తొలగింప; సమర్థుండు+ఐన= నేర్పరియైన; కర్దముండు; నిజ= తనకు; సేవా+ఆయాస= సేవలు చేయడంవల్ల కలిగిన శ్రమతో; కృశీభూతదేహ+ఐ= చిక్కిపోయిన శరీరం కలదై; ఉన్న; దేవహూతిన్= దేవహూతిని; కరుణాతరంగిత+ అపాంగుండు+ఐ= కరుణారసం పొంగిపొరలే కడకన్నులతో; కనుంగొని= చూచి; మంజు= శ్రావ్యమైన; భాషణంబులన్= మాటలతో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా స్వాయంభువమనువు తన కుమార్తె దేవహూతిని కర్దమమునికిచ్చి పెండ్లి జరిపించి తిరిగి తన నగరానికి వెళ్లిపోయాడు. అటు తరువాత దేవహూతి పతిభక్తితో పార్వతీదేవి పరమేశ్వరునికి పరిచర్య చేసినట్లు భర్తయైన కర్దమునికి

సేయచేయనారంభించింది. భర్తయే తనకు దిక్కు అని భావించింది. భర్త మనస్సులోని అభిప్రాయాలకు అనుగుణంగా రోజురోజుకు ద్విగుణీకృతయైన భక్తి శ్రద్ధలతో, అనురాగంతో మిక్కుటమైన తేజస్సుతో ప్రకాశిస్తూ పతిని సేవిస్తున్నది. కామం క్రోధం కపటం లోభం మొదలైన దుర్గుణాలు లేకుండా శరీరాన్ని పరిశుభ్రంగా, సౌందర్యవంతంగా ఉంచుకొంటూ, చాతుర్యంతో ఆదరణతో ప్రేమతో భర్తనే భగవంతుడుగా భావించి మృదువుగా మధురంగా ఆయనతో మాట్లాడుతూ సేవలో ఎలాంటి ఉపేక్ష లేకుండా ప్రవరిస్తూ ఉన్నది. దైవేచ్ఛను సైతం తప్పింప సమర్థుడైన కర్దమముని తనను సేవించడంలో కలిగిన కష్టంతో చిక్కిపోయిన శరీరంగల దేవహూతిని కరుణారసం పొంగిపొరలే కడకన్నులతో చూచి శ్రావ్యమైన మాటలతో ఇలా అన్నాడు.

**ఉ. మానితధర్మమార్గమహిమస్ఫుటభూరితపస్సమాధి వి**
**ద్యానిభృతాత్మయోగసముపార్జితవిష్ణుకటాక్షలబ్ధ శో**
**భానఘదివ్యభోగబహుభద్రవితానము లస్మదీయ సే**
**వానిరతిన్ లభించు ననివారణ నిత్తును దివ్యదృష్టియున్. 804**

**ప్రతి :** మానిత= మన్ననపొందిన; ధర్మమార్గ= ధర్మమార్గంవలని; మహిమస్ఫుట= మహిమచే వికసించిన; భూరితపస్సమాధి= గొప్ప తపస్సు, ఏకాగ్రత; విద్యానిభృత+ఆత్మయోగసముపార్జిత= తపస్సు జ్ఞాన చిత్తైకాగ్రతలవల్ల సాధింపబడిన ఆత్మయోగంతో సంక్రమించిన; విష్ణుకటాక్ష= విష్ణువు అనుగ్రహించే; లబ్ధ= పొందబడిన; శోభా= శోభచే; అనఘ= దోషరహితమైన; దివ్యభోగ= గొప్పఐశ్వర్యాలతో కూడిన; బహుభద్ర వితానములు= అనంతాలైన శుభ పరంపరలు; అస్మదీయ= నాయొక్క; సేవానిరతిన్= సేవయందలి ఆసక్తితో; లభించును= నీకు సమకూడుతాయి; అనివారణన్= తిరుగులేని విధంగా; దివ్యదృష్టియున్= దివ్యదృష్టిని కూడా; ఇత్తును= అనుగ్రహిస్తాను.

**తా :** తనకు శుశ్రూష చేసిన భార్యపై దయతో కర్దముడు ఇలా అంటున్నాడు. దేవహూతీ! మాననీయమైన ధర్మమార్గం వల్ల మహిమ కలుగుతుంది. ఆ మహిమాతిశయంవల్ల గొప్పతపస్సు, దానివల్ల ఏకాగ్రత కలుగుతాయి. వాటివల్ల ఆత్మజ్ఞానం లభిస్తుంది. దానివల్ల ఆత్మయోగం సిద్ధిస్తుంది. ఆత్మయోగంతో భగవత్కటాక్షం సమకూడుంది. ఆ కారణంగా పాపరహితమై విరాజిల్లే గొప్ప ఐశ్వర్యాలతో కూడిన అనంతాలైన శుభపరంపరలు సంప్రాప్తిస్తాయి. ఈ విధంగా నాకు సమకూడిన ఐశ్వర్యపరంపరలు నన్ను భక్తితో సేవించిన నీకు సంక్రమిస్తాయి. అంతేగాక నీకు తిరుగులేని దివ్యదృష్టిని కూడా అనుగ్రహిస్తున్నాను.

**విశే :** కర్దముని వర్ణాశ్రమధర్మాలకు ఏ లోపమూ రానీకుండా నియమానుసారంగా దేవహూతి ఆయనను సేవించింది. దానితో కర్దముడు ధ్యాన ఉపాసనాదులు సక్రమంగా అనుష్ఠించడానికి వీలైంది. ఆ ఉపాసనాదులవల్ల ఆయనకు భగవత్ప్రసాదం, దానివల్ల అనంతాలైన శుభాలు, సంపదలు చేకూరినాయి. ఆయనను సర్వాత్మనా సేవించడంవల్ల అవన్నీ ఆమెకు కూడా లభించాయి. ఆ సిద్ధులన్నిటినీ ప్రత్యక్షంగా చూడడానికి కావలసిన దివ్యదృష్టిని ప్రసాదిస్తానంటున్నాడు కర్దముడు.

భవభవానీ దాంపత్య ఉపమానంవలన వారు అర్ధనారీశ్వర తత్త్వానుసంధానం కలవారయ్యారుకనుక తపస్సు మొదలైనవాని ఫలాన్ని ఏకరూపంగా పొందారు.

**తే. నెలఁత! తద్దివ్యదృష్టి నన్నియును నీకుఁ, గానవచ్చు, విలోకింపు, కమలపత్ర**
**నయను బొమముడి మాత్రాన నాశమందు, నితరమగు తుచ్ఛభోగంబు లేమి సెప్ప. 805**

**ప్రతి :** నెలఁత= సుందరీ!; తద్+దివ్యదృష్టిన్= ఆ దివ్యదృష్టివల్ల; నీకున్= నీకు; అన్నియున్= సర్వమూ; కానవచ్చున్= కనిపిస్తుంది; విలోకింపు= చూడు; ఇతరము+అగు= భగవద్దత్తములు కాని ఇతరములైన; తుచ్ఛభోగంబులు= నీచమైన ఐశ్వర్యాలు; కమలపత్రనయను= తామరరేకులను పోలిన కనులుగల విష్ణుదేవుని; బొమముడి మాత్రాన= కనుబొమలు చిట్లించినంత మాత్రాన; నాశమందున్= నశించిపోతాయి; చెప్పన్+ఏమి= ఇక చెప్పడానికేముంది?

**తా :** ఓ సుందరీ! నేనిచ్చిన ఆ దివ్యదృష్టివల్ల సర్వమూ నీకు కనిపిస్తుంది చూడు. భగవద్దత్తాలుకాని ఇతర నీచమైన ఐశ్వర్యాలు విష్ణుదేవుడు కనుబొమలు చిట్లించినంత మాత్రాననే నశించిపోతాయి. ఇక ఇతర విషయాలను గురించి వేరే చెప్పడమెందుకు?

**విశే :** ఇంద్రియాలకు గోచరించనివాటిని కూడా చూడగలిగేశక్తి దివ్యదృష్టి. ఇది దైవసంబంధమైన శక్తి. ఇలాంటి శక్తిగలవారు దివ్యులు. సృష్టి సమస్తం శ్రియః పతి ఆజ్ఞాబద్ధమై ఉంటుందని, ఆయన ఆజ్ఞ లేనిది తృణమైనా చలించదని 'కమలపత్రనయను బొమముడి మాత్రాన నాశమందు' అనడంవల్ల దృఢమవుతున్నది.

**సీ.** **అనుపమరాజ్యదర్పాంధచేతస్కులై పాపవర్తనులైన పార్థివులకు**
**ధృతిఁబొందరాని యీ దివ్యభోగంబులు నీదు పాతివ్రత్యనిష్ఠఁజేసి**
**సంప్రాప్తములు నయ్యె, సమత భోగింపుము కార్యసిద్ధియు నగుఁగాక నీకు**
**ననుటయు నతివయు ననుపమయోగ మాయావిచక్షణశాలియైన కర్ద**

**తే.** **మునిఁ గనుంగొని విగతాధియును నపాంగ, కలితలజ్జానతాస్యపంకజయు నగుచు**
**వినయసౌహార్దములఁజేసి విహ్వలంబు, లయిన పలుకులఁ బతికి నిట్లనియెఁ బ్రీతి.** **806**

**ప్రతి :** అనుపమ= సాటిలేని; రాజ్య= రాజ్యవైభవాలతో; దర్ప+అంధ= గర్వంతో కనులు మూసుకుపోయిన; చేతస్కులు+ఐ= మనస్సులు కలవారైన (మనస్సులు కూడా గుడ్డివైనవారు); పాపవర్తనులు+ఐన= పాపపు నడవడిగలవారైన; పార్థివులకున్= పృథివీపతులకు (రాజులకు); ధృతిన్+పొందరాని= ధైర్యంగా పొందలేని; ఈ; దివ్యభోగంబులు= దివ్యసౌఖ్యాలు; నీదు= నీయొక్క; పాతివ్రత్యనిష్ఠన్+చేసి= పాతివ్రత్య మహిమవల్ల; సంప్రాప్తములును+అయ్యెన్= లభించాయి; సమతన్= సమబుద్ధితో; భోగింపుము= అనుభవించు; నీకు; కార్యసిద్ధియును= పనులునెరవేరడం కూడా; అగున్+కాక= కలుగునుగాక!; అనుటయున్= అనగా; అనుపమ= సాటిలేని; యోగమాయా విచక్షణశాలి+ఐన= యోగమాయలందు గొప్ప వివేకంకల; కర్దమునిన్= కర్దమమునిని; అతివయును= దేవహూతి; కనుంగొని= చూచి; విగత+ఆధియును= తొలగిన మనోవ్యథగలది; అపాంగ= కడకన్నులలో; కలిత= కూడిన; లజ్జా+ఆనత= సిగ్గుచేత వంగిన; ఆస్యపంకజయు+అగుచున్= ముఖకమలం గలదగుచు; వినయసౌహార్దములన్+చేసి= వినయస్నేహభావాలతో; విహ్వలంబులు+అయిన= పారవశ్యంతో కూడిన; పలుకులన్= మాటలతో; ప్రీతిన్= సంతోషంగా; పతికిన్= భర్తకు (భర్తతో); ఇట్లు+అనియెన్= ఇలా అన్నది.

**తా :** 'సాటిలేని రాజ్యవైభవాలతో గర్వంతో కనులుమూసుకుపోయి పాప మార్గాలలో పయనించే రాజులు పొందలేని ఈ దివ్యభోగాలు నీ పాతివ్రత్య మహిమవల్ల నీకు లభించాయి. వాటిని సమబుద్ధితో అనుభవించు. నీకు కార్యసిద్ధికూడా కలుగుతుంది' అని యోగమాయలందు సమర్థుడైన కర్దముడు చెప్పగా దేవహూతి తన భర్తను తిలకించింది. ఆమె మనోవ్యథ తొలగిపోయింది. కడకన్నులతో, పొడమిన సిగ్గుతో మోము వంచుకొంది. వినయంతో చనువుతో పారవశ్యంతో ముద్దుముద్దుగా తన భర్తతో ఇలా అన్నది.

**విశే :** వస్తుతః లేనిదానిని ఉన్నట్లుగా చూపడం మాయ.

**వ. అనఘా!, యమోఘ యోగమాయా విభుండవు, సమర్థుండవు నయిన నీయందు నీ యనుపమ దివ్యభోగంబులు గలుగుట నిక్కం బని యెఱుంగుదు, భవత్సంగతి నన్నియు నాకుం గలుగు, నయినను దేవా! నీ వానతిచ్చిన సంతాన పర్యంతంబైన శరీర సంగమ సమయంబు చిత్తంబునం దలంచి భవదంగ సంగమంబుఁ గృపసేసి మన్నింపుము, భవదీయ సంయోగవాంఛా పరతం గృశీభూతం బయిన యీ దేహం బే విధంబున మజ్జన భోజన పాన సుఖంబులం బరితుష్టిం బొందు నట్టి మన్మనోరథంబుఁ దీర్ప రతి రహస్య ప్రకాశకంబగు కామశాస్త్ర ప్రకారం బుపశిక్షించి యందులకు నుచితంబు లయిన వివిధాంబరాభరణ మాల్యానులేపన మందిరారామ ప్రముఖ నిఖిల వస్తువిస్తారంబు గావించి నన్నుం గరుణింపు మనిన న మ్మహాత్ముండు నిజయోగమాయా బలంబునం దత్క్షణంబ 807**

**ప్రతి :** అనఘా= పుణ్యస్వరూపా!; (నీవు); అమోఘ= సఫలమైన; యోగమాయా విభుండవు= యోగమాయకు అధిపతివి; సమర్థుండవు= అన్నిటియందు నేర్పరివి; నీ+అందున్= నీయందు; ఈ; అనుపమ= సాటిలేని; దివ్యభోగంబులు; కలుగుట; నిక్కంబు+అని= సత్యమని; ఎఱుంగుదున్= నాకు తెలియుదును; భవత్+సంగతిన్= నీ సాంగత్యంవల్ల, కలయికవల్ల; నాకున్= నాకు; అన్నియున్= అన్నీ; కలుగును= లభిస్తాయి; అయినను= అయినప్పటికి; దేవా; నీవు+ఆనతి+ఇచ్చిన= నీవు సెలవిచ్చిన; సంతాన పర్యంతంబు+ఐన= సంతానం కలుగునంతవరకే అయిన; సంగమ సమయంబు= శరీర సంగమ నియమం; చిత్తంబునన్+తలంచి= మనస్సులో స్మరించుకొని; భవత్+అంగసంగమంబున్= నీ శరీర సాంగత్యమును; కృప+చేసి= అనుగ్రహించి; మన్నింపుము= ఆదరించుము; భవదీయ= నీ; సంయోగవాంఛాపరతన్= సంయోగాభిలాషయందలి ఆసక్తితో; కృశీభూతంబు+అయిన= చిక్కిపోయిన, శుష్కించిన; ఈ దేహంబు= ఈ తనువు; ఏ విధంబునన్= ఏ విధంగా; మజ్జన= స్నాన; భోజన= ఆహార; పాన= నీటిని గ్రహించటం మొదలైన; సుఖంబులన్= సుఖాలతో; పరితుష్టిన్+పొందున్= తృప్తిచెందుతుందో; అట్టి= అటువంటి; మత్+మనస్+రథంబున్= నా కోరికను; తీర్పన్= నెరవేర్చడానికి; రతిరహస్య= స్త్రీపురుషులమధ్య జరిగే సంగమ రహస్యాలను; ప్రకాశకంబు+అగు= తెలియజేసే; కామశాస్త్ర ప్రకారంబు= కామశాస్త్రంలో చెప్పబడిన పద్ధతులను; ఉపశిక్షించి= బాగా నేర్పి; అందులకున్= అందుకు; ఉచితంబులు+అయిన= తగినవైన; వివిధ= పెక్కువిధాలైన; అంబర+ఆభరణ= వస్త్రాలు, నగలు; మాల్య= పూలదండలు, అనులేపన= మైపూతలు; మందిర= భవనాలు; ఆరామ= ఉద్యానవనాలు; ప్రముఖ= మొదలైన; నిఖిల= సమస్త; వస్తువిస్తారంబు+కావించి= వస్తువులను విరివిగా సమకూర్చి; నన్నున్= నన్ను; కరుణింపుము+అనినన్= దయచూడుమనగా; ఆ+మహాత్ముండు= గొప్పవాడైన ఆ కర్దముడు; నిజ= తన; యోగమాయాబలంబునన్= యోగమాయాశక్తితో; తద్+క్షణంబు+అ= ఆ క్షణంలోనే...

**తా :** 'ఓ పుణ్యస్వరూపా! నీవు అమోఘమైన యోగమాయలకు అధిపతివి. సర్వసమర్థుడవు. నీయందు సాటిలేని దివ్య భోగాలుండడం సత్యం. అది నాకు తెలుసు. నీ సాంగత్యంవల్ల ఆ భోగాలన్నీ నాకు లభిస్తాయి. అయినప్పటికీ దేవా! నీవు సంతానం కలిగేవరకే నాతో శరీరసంగమం కలిగి ఉంటానని ఆనాడు ఒక నియమం ఏర్పరచావు. ఆ నియమాన్ని జ్ఞప్తికి తెచ్చుకొని నీ సాంగత్యాన్ని నాకు దయతో అనుగ్రహించు. నీ సంయోగాభిలాషతో చిక్కిపోయిన ఈ తనువు స్నానపాన భోజనాలవల్ల ఎలా తుష్టిపొందుతుందో. అలాంటి నా కోరికను తీర్చడానికి రతిరహస్యాలను తెలియజేసే కామశాస్త్రపద్ధతులను

నాకు బాగా నేర్పు. అందుకు తగిన అనేకవిధాలైన వస్త్రాలు, ఆభరణాలు, పూలదండలు, మైపూతలు, శయనమందిరాలు, ఉద్యానవనాలు మొదలైన ముఖ్యవస్తువులను విరివిగా సమకూర్చి నన్ను దయచూడు' అని పలికిన దేవహూతి మాటలు విని గొప్పవాడైన ఆ కర్దముడు తన యోగమాయాబలంతో ఆ క్షణంలోనే (ఒక దివ్యవిమానాన్ని సృష్టించాడు).

**సీ. దివ్యమణిస్తంభదీప్తిఁ జెన్నొందుచు మరకతస్థలముల మహిమ దనర**
**వరవజ్రకుడ్యకవాటశోభితములై విద్రుమదేహళీవీథు లమరఁ**
**గొమరొప్ప నవశాతకుంభకుంభములపై, హరినీలశకలవిస్ఫురణ మెఱయఁ**
**దగఁ బద్మరాగంపు మొగడలఁ జెలువొందు వైదూర్యవలభులు వన్నెఁజూపఁ**

**తే. దరళతరధూతకేతుపతాక లొలయ, మంజుశింజత్సమంచితమధుపకలిత**
**సురుచిరాలంబమానప్రసూనరాజి, మాలికల నొప్పు వివిధగృహాళిఁ దనరి. 808**

**ప్రతి :** దివ్యమణి స్తంభదీప్తిన్= దివ్యమైన మణులు పొదిగిన స్తంభములకాంతులతో; చెన్ను+ఒందుచున్= అందంగా కనిపిస్తూ; మరకతస్థలముల= గరుడపచ్చలు పొదిగిన నడవలతో; మహిమ+తనరన్= గొప్పతనం అతిశయించగా; వరవజ్ర= మంచిరకం వజ్రాలు తాపిన; కుడ్యకవాట శోభితములు+ఐ= గోడలు తలుపులతో ప్రకాశవంతాలై; విద్రుమ= పగడాలమయమైన; దేహళీవీథులు+అమరన్= గడపలుగల వీథులు అమరగా; కొమరు+ఒప్పన్= అందం అతిశయించగా; నవశాతకుంభ= శతకుంభపర్వతంలో పుట్టిన మేలిమి బంగారుతో నిర్మితమైన; కుంభములపైన్= కలశాలపై; హరినీలశకల= ఇంద్రనీలమణుల ముక్కలు పొదగడంవల్ల; విస్ఫురణమెఱయన్= ధగధగమని మెరుస్తూ ఉండగా; తగన్= తగినట్లుగా; పద్మరాగంపు= పద్మరాగాల; మొగడలన్= మొగ్గలతో; చెలువు+ఒందు= అందగించు; వైదూర్య వలభులు= వైదూర్యాలు తాపిన చూరులు; వన్నెన్+చూపన్= సొగసును కనిపింపజేయగా; తరళతర= గాలికి రెపరెపలాడుతున్న; ధూతకేతు= కదిలే గుర్తులుగల; పతాకలు+ఒలయన్= జెండాలు అమరియుండగా; మంజు= చెవికింపైన; శింజత్+సమంచిత= ఝుంకారాలతో కూడిన; మధుపకలిత= తుమ్మెదలతోకూడి; సురుచిర+ఆలంబమాన= అందంగా వ్రేలాడుతున్న; ప్రసూనరాజి మాలికలన్= పంక్తులు పంక్తులుగాగల పూలదండలతోరణాలతో; ఒప్పు= మనోహరంగా కనిపించే; గృహ+ఆళిన్+తనరి= మందిరసమూహంతో అతిశయిస్తూ...

**తా :** ఆ విమానంలో అందమైన వివిధ మందిరాలు ఉన్నాయి. ఆ మందిరాలన్నీ మణిమయ స్తంభాల కాంతులతో విలసిల్లుతూ ఉన్నాయి. గరుడపచ్చలు పొదిగిన నడవలతో, మంచిరకం వజ్రాలుతాపిన గోడలు తలుపులతో, పగడాలు తాపిన గడపలుగల వీథులతో చూడముచ్చటగా ఉన్నాయి. ఆ మందిరాలపై ఇంద్రనీలమణుల శకలాలు పొదుగబడి మేలిమిబంగారుతో నిర్మితమైన కలశాలు అమర్చబడి ఉన్నాయి. ఆ కలశాలు ధగధగమని మెరుస్తూ ఉన్నాయి. ఆ మెరుపులకు తగినట్లు పద్మరాగాల మొగ్గలు చెక్కిన వైదూర్యపు చూరులు సొగసుగా ఉన్నాయి. మందిరాలపై గాలికి రెపరెపలాడుతూ జెండాలు అమరి ఉన్నాయి. కర్ణపేయంగా ఝుంకారం చేసే తుమ్మెదల బృందంతో కూడి వ్రేలాడుతున్న పూలదండల తోరణాలతో ఆ మందిరాలు మనోహరంగా అలరారుతున్నాయి.

**విశే :** కర్దమమహాముని క్షణంలోనే సృష్టించిన దివ్యవిమానంలో అందమైన మందిరాలున్నాయి. ఆ మందిర నిర్మాణంలో వాడబడినవి – మణులు, మరకతాలు, వజ్రాలు, విద్రుమాలు, హరినీలాలు, పద్మరాగాలు, వైదూర్యాలు. ఇవన్నీ ఎంతో

విలువైన రత్నాలు. ఇవి నవరత్నాలలోనివి. ఆ మందిరాల నిర్మాణంలో వాడినవి నవరత్నాలలో ఏడుమాత్రమే. ఇక మిగిలిన రెండు – కెంపులు, గోమేధికాలు. భార్య కోరిక మేరకు సృష్టింపబడిన మందిరాలు ఎంత అందంగా ఉంటే ఆమెకంత సంతోషంగా ఉంటుందని భావించి కర్దముడు చేసిన అపూర్వ సృష్టి ఇది.

**క. మఱియును దుకూలచీనాం, బర కౌశేయాదివివిధపట పరివృత మం**
**దిర సుభగాకారంబై, యరుదార విచిత్రపట్టికాలంకృతమై. 809**

**ప్రతి :** మఱియును= ఇంకా; దుకూల= జిలుగు వస్త్రాలు; చీనాంబర= చీనాంబరాలు (చీనాదేశపు పట్టువస్త్రాలు); కౌశేయ+ఆది= పట్టుచీరలు మొదలైన; వివిధ= పలురకాలైన; పట= వస్త్రాలతో; పరివృత= కూడిన; మందిర= మందిరాలచే; సుభగ+ఆకారంబు+ఐ= అందమైన స్వరూపంకలదై; అరుదారన్= ఆశ్చర్యకరంగా; విచిత్ర= రంగురంగుల; పట్టికా= పట్టెమంచాలతో; అలంకృతము+ఐ= అలంకరింపబడి (ఉన్నాయి మందిరాలు).

**తా :** ఆ విమానంలోగల మందిరాలలోని గదులలో జిలుగువస్త్రాలు, చీనాదేశపు పట్టువస్త్రాలు, పట్టు చీరలు, పలురకాలైన వస్త్రాలు అందంగా కనిపిస్తున్నాయి. ఆశ్చర్యకరమైన రంగురంగుల పట్టెమంచాలు అమర్చబడి ఉన్నాయి.

**విశే :** చీనాంబరమంటే సాధారణంగా పట్టువస్త్రమని అర్థం. చీనా (చైనా) దేశంలో తయారైనది కావడంవల్లనే చీనాంబరమని పేరేర్పడింది. ప్రాచీనకాలంలో తూర్పు ప్రాచ్యదేశాలనుండి అరుదైన వస్తువులను దిగుమతి చేసుకొనేవారు. అలాంటి వస్తువులలో చీనాంబరం ముఖ్యమైంది. ప్రాచీన సాహిత్యంలో చీనాంబరాల ప్రస్తావన కనిపిస్తున్నది.

**మ. లలితోద్యానవనాంతసంచరణలీలాలోలహంసాళి కో**
**కిలపారావతచక్రవాకశుకకేకివ్యూహ మంచత్సము**
**త్కలికంగృత్రిమపక్షులన్ నిజవిహంగశ్రేణి యంచుం గుతూ**
**హలియై పల్కుచు నాడుచుండుఁ బ్రతిశాఖారోహణ వ్యాప్తులన్. 810**

**ప్రతి :** లలిత+ఉద్యానవన+అంత= సుందరమైన ఉద్యాన వనాలలో; సంచరణలీలా= విహరించే వినోదంలో; లోల= ఆసక్తిగల; హంస+ఆళి= రాజహంసల సమూహం; కోకిల= కోయిలలు; పారావత= పావురాళ్లు; చక్రవాక= జక్కవపిట్టలు; శుక= చిలుకలు; కేకి= నెమళ్లు, అనువానియొక్క; వ్యూహము= సమూహం, అంచత్= ఒప్పుచున్న; సమ్+ఉత్కలికన్= మిక్కిలి వేగిరపాటుతో; కృత్రిమపక్షులన్= కల్పిత పక్షులను; నిజ= ప్రాణంగల; విహంగశ్రేణి+అంచున్= పక్షిసముదాయమే అని భావిస్తూ; కుతూహలి+ఐ= ఉత్కంఠ కలిగినదై; పల్కుచున్= పలుకరిస్తూ; ప్రతిశాఖా+ఆరోహణ= అక్కడగల చెట్ల కొమ్మలపై ఎక్కి; వ్యాప్తులన్= ఒక కొమ్మనుండి మరొక కొమ్మమీదికి వాలుతూ; ఆడుచు+ఉండున్= కేరింతలు కొడుతూ ఆడుతూ ఉంటాయి.

**తా :** అక్కడ సుందరమైన ఉద్యానవనాలలో విలాసంగా విహరిస్తున్న రాజహంసలు, కోయిలలు, పావురాళ్లు, జక్కవపిట్టలు, నెమళ్లు మొదలైన పక్షులు మందిరాల గోడలమీద చెక్కబడిన కృత్రిమపక్షులను చూచి తమ జాతికి చెందిన నిజమైన పక్షులుగానే భావించి ఎంతో ఉత్కంఠతో వాటిని పలుకరిస్తూ అక్కడగల చెట్లకొమ్మలపై అటూ ఇటూ దాటుతూ కేరింతలు కొడుతూ ఆడుతూ ఉంటాయి.

**విశే :** మూలంలో హంసలు, పావురాళ్లు మాత్రమే చెప్పబడగా పోతన ఇంకా కోయిలలను, చక్రవాకాలను, చిలుకలను, నెమళ్లను కూడా చేర్చి చెప్పడంవల్ల ఆ పక్షులన్నింటి కృత్రిమ రూపాలను గోడలమీద చెక్కినట్లు అర్థమవుతుంది. అందువల్ల మందిరాలగోడలు అందంగా కనిపించాయి. మూలంలో 'వికూజితం' అని ఒకేమాటలో పక్షులు శబ్దం చేస్తున్నాయని వ్యక్తం చేయబడగా పోతన 'కుతూహలియై పల్కుచు నాడుచుండున్' అని వ్యాఖ్యానప్రాయంగా వ్రాశాడు.

**వ. వెండియు. 811**

**ప్రతి :** వెండియున్= ఇంకా ఆ విమానం

**క. ఘనసౌంధాంతరశయ్యా, సనకేళీగేహకృతకజగతీధరశో**
**భన చంద్రకాంతచారు భ, వన ఫలభరితావనీజవంతము నగుచున్. 812**

**ప్రతి :** ఘన= పెద్దవైన; సౌధ+అంతర= విమానంలో ఉన్న; శయ్యా+ఆసన= శయ్యలతో, గద్దెలతో; కేళీగేహ= క్రీడా గృహాలతో; కృతక= కల్పితమైన; జగతీధర= పర్వతాలతో; శోభన= అందగిస్తూ ఉన్న; చంద్రకాంత= చలువరాళ్లు (పాలరాళ్లు) పొదిగిన; చారుభవన= అందమైన భవనాలతో; ఫలభరిత= పండ్లతో నిండిన; అవనీజవంతమున్= చెట్లుగలది; అగుచున్= అవుతూ...

**తా :** ఇంకా ఆ విమానంలోపలి భవనాలు శయ్యలతో, గద్దెలతో, క్రీడాగృహాలతో, కల్పితమైన క్రీడాపర్వతాలతో, పాలరాతిభవనాలతో ఫలవృక్షాల వనాలతో కూడి (ఉన్నవి).

**క. సకలర్తుశోభితంబును, సకలశుభావహము సకలసంపత్కరమున్**
**సకలోపభోగయోగ్యము, సకలేప్సితకామదంబు సదలంకృతమున్. 813**

**ప్రతి :** సకల+ఋతు= సమస్తఋతువులచే; శోభితంబును= శోభించునది; సకల= సమస్త; శుభ+ఆవహము= శుభాలను కలిగించునది; సకల= సమస్త; సంపత్+కరమున్= సంపదలను కలిగించునది; సకల= సమస్త; ఉపభోగయోగ్యము= సుఖాలు అనుభవించడానికి యోగ్యమైనది; సకల= సమస్తమైన; ఈప్సిత కామదంబు= కోరిన కోరికలను ఇచ్చునది; సత్+అలంకృతమున్= చక్కగా అలంకరింపబడినది.

**తా :** సమస్తఋతువులశోభలతో, సకలసుఖాలతో, సర్వసంపదలతో సమస్త సుఖాలు అనుభవించడానికి యోగ్యమై, ఎల్ల కోరికలను నెరవేర్చగలదై, అందమైన అలంకారాలతో ఒప్పుతున్నది.

**వ. అగుచు నొప్పు దివ్యవిమానంబుఁ గల్పించి తదీయ సుషమా విశేషచిత్రంబులు నిర్మించిన తానునుం దెలియం జాలని యద్భుత కర్మంబయిన విమానంబు దేవహూతికిం జూపినం జూచి య మ్ముద్దియ సంతసింపకుండుట యెఱింగి సర్వభూతాంతరాశయాభిజ్ఞుండును, సంతుష్టాంత రంగుండును నైన కర్దముం డిట్లనియె. 814**

**ప్రతి :** అగుచున్+ఒప్పు= అలాంటి సర్వసంపదలతో అలంకారాలతో ఒప్పుతున్న; దివ్యవిమానంబున్+కల్పించి= మహిమాన్వితమైన విమానాన్ని సృష్టించి; తదీయ= దాని; సుషమా విశేషచిత్రంబులు= చిత్రచిత్రపు శోభా విశేషాలు;

నిర్మించిన= నిర్మాణంచేసిన; తానునున్= తానుకూడా; తెలియన్+చాలని= తెలుసుకోలేనంతటి; అద్భుతకర్మంబు+అయిన= ఆశ్చర్యకరమైన నిర్మాణం కలిగిన; విమానంబున్= విమానాన్ని; దేవహూతికిన్= భార్యయైన దేవహూతికి; చూపినన్= కనబరచగా; చూచి= దర్శించి; ఆ+ముద్దియ= ముగ్ధయైన ఆ దేవహూతి; సంతసింపకుండుట+ఎఱింగి= సంతోషపడక పోవటం తెలుసుకొని; సర్వభూత+అంతర+ఆశయ+అభిజ్ఞుండును= సమస్త ప్రాణుల అంతరంగాలలోగల అభిప్రాయాలను తెలుసుకోగలవాడూ; సంతుష్ట+అంతరంగుండును+ఐన= మిక్కిలి తుష్టిపొందిన హృదయంకలవాడూ అయిన; కర్దముండు; ఇట్లు+అనియెన్= భార్యతో ఇలా అన్నాడు.

**తా :** అలాంటి సర్వసంపదలతో, అలంకారాలతో ఒప్పుతున్న మహిమాన్వితమైన విమానాన్ని సృష్టించిన కర్దమమహాముని అందులో కంటికింపైన చిత్రచిత్రపు శోభావిశేషాలను నిర్మాణం చేసిన తానుకూడా తెలుసుకోలేనంతటి ఆశ్చర్యకరమై నిర్మాణపు పనితనం గలిగిన ఆ విమానాన్ని తనభార్య దేవహూతికి చూపించాడు. ముగ్ధయైన దేవహూతి ఆ విమానాన్ని చూచి సంతోషపడలేదు. ఆ విషయం తెలిసి సమస్తప్రాణుల అంతరంగాలలోగల అభిప్రాయాలను గ్రహించగలవాడూ, సంతోష హృదయుడూ అయిన కర్దమమహాముని దేవహూతితో ఇలా అన్నాడు.

**తే. అతివ, భగవత్కృతంబును నఖిల మంగ, ళాకరంబును నగు నీ జలాశయమునఁ**
**దవిలి గ్రుంకిన జంతువితానములకుఁ, గామ్యఫలసిద్ధి సేకుఱుఁగాన నీవు. 815**

**ప్రతి :** అతివ= ఓ సుందరీ!; భగవత్+కృతంబునున్= భగవంతుడు నిర్మించినది; అఖిల= సమస్త; మంగళ+ఆకరంబునున్= శుభాలకు ఆకరమైనది; అగు= అయిన; ఈ జలాశయమునన్= బిందుసరోవరమనే ఈ సరస్సులో; తవిలి+క్రుంకినన్= ఆసక్తి కలిగి స్నానం చేసిన; జంతువితానములకున్= ప్రాణుల సమూహాలకు; కామ్యఫలసిద్ధి= కోరినకోరికలకు ఫలం నెరవేరటం; చేకుఱున్ కాన= కావున; నీవు= నీవు కూడా...

**తా :** ఓ సుందరీ! భగవంతుడు నిర్మించినది, సమస్తశుభాలకు ఆకరమైనది అయిన ఈ జలాశయం బిందుసరోవరమనే సరస్సు. ఆసక్తితో ఈ సరస్సులో స్నానం చేసిన ప్రాణులకు కోరిన కోరికలు నెరవేరుతాయి. కావున నీవు కూడా.

**క. ఇజ్జలముల నతిభక్తి ని, మజ్జన మొనరించి యీ విమానము వేడ్కన్**
**లజ్జావతి! యెక్కవె యని, బుజ్జవ మొనరంగఁ గర్దముఁడు వల్కుటయున్. 816**

**ప్రతి :** ఈ+జలములన్= ఈ సరస్సు నీళ్లలో; అతిభక్తిని= ఎంతోభక్తితో; మజ్జనము+ఒనరించి= స్నానంచేసి; వేడ్కన్= సంతోషంతో; ఈ విమానము; లజ్జావతి= ఓ సిగ్గరీ!; ఎక్కవె+అని= అధిరోహించవే అని; కర్దముఁడు; బుజ్జవము+ఒనరంగన్= బుజ్జగిస్తూ; పల్కుటయున్= పలుకగా...

**తా :** 'దేవహూతీ! సిగ్గుపడకు. నీవు ఈ సరస్సు నీళ్లలో ఎంతో భక్తితో స్నానంచేసి సంతోషంగా ఈ విమానాన్ని అధిరోహించు' అని కర్దమమహాముని బుజ్జగిస్తూ పలికాడు.

**వ. విని యా కువలయాక్షి పతిసేవాయాస మలినాంబరయు, వేణీ భూతశిరోజయు, ధూళి ధూసరితాతి కృశీభూతాంగియు, శబల స్తనయునై భర్తృ నియోగంబున సరస్వతీ సలిల సంభూత జలచరాశ్రయం బగు బిందుసరోవరంబుఁ బ్రవేశించి తజ్జలంబులఁ గ్రుంకులిడు సమయంబునఁ దద్వాఃపూర మధ్యంబున రుచిర**

**సూక్ష్మాంశుక ధారిణులుఁ, గిశోరవయః పరిపాకశోభితలు, నుత్పల గంధులు నగు కన్యాసహస్రంబులు దేవహూతిం గనుంగొని యిట్లనిరి. 817**

**ప్రతి :** విని= భర్తపలుకులు ఆకర్ణించి; ఆ కువలయ+అక్షి= కలువరేకులవంటి కనులుగల దేవహూతి; పతిసేవా+ఆయాస= పతిని సేవించడంలో కలిగిన శ్రమవల్ల; మలిన+అంబరయున్= మాసిపోయిన చీరగలదై; వేణీభూత శిరోజయున్= జడలు కట్టిన తలవెంట్రుకలుకలదై; ధూళిధూసరిత= ధూళితో బూడిదరంగుగలదై; అతికృశీభూత+అంగియున్= ఎంతగానో చిక్కిపోయిన శరీరం కలదై; శబలస్తనయును+ఐ= వక్షఃస్థలం వివర్ణమైపోయినదై (ఎండిపోయిన ఎద కలదై); భర్తృనియోగంబునన్= భర్త ఆజ్ఞననుసరించి; సరస్వతీ సలిల= సరస్వతీ నది నీళ్లలో; సంభూత= పుట్టిన; జలచర+ఆశ్రయంబు+అగు= జలచరాలకు నిలయమగు; బిందుసరోవరంబునన్= బిందుసరస్సులో; ప్రవేశించి= దిగి; తద్+జలంబులన్= ఆ సరోవరజలంలో; క్రుంకులు+ఇడు= మునుకలువేసే (మునిగే); సమయంబునన్= వేళలో; తద్+వాః పూరమధ్యంబునన్= ఆ నీటిప్రవాహం మధ్యలో; రుచిర= అందమైన; సూక్ష్మ+అంశుక ధారిణులున్= సన్నని వస్త్రాలుకట్టుకున్నవారూ; కిశోరవయః పరిపాకశోభితలున్= నవయౌవన పరిపాకంతో శోభితలూ; ఉత్పలగంధులును+అగు= కలువపూల పరిమళం కలవారూ అగు; కన్యాసహస్రంబులు= వేలమంది కన్యలు; దేవహూతిన్+కనుంగొని= దేవహూతిని చూచి; ఇట్లు+అనిరి= ఇలా అన్నారు.

**తా :** కలువరేకులవంటి కనులుగల దేవహూతి భర్తమాటలు విన్నది. ఆమె పతిని సేవించడంలో అలసిపోయింది. చీరమాసిపోయి ఉంది. వెంట్రుకలు జడలు కట్టినాయి. శరీరం ధూళిధూసరితమై కృశించింది. వక్షస్థలం వివర్ణమైపోయింది (ఎండిపోయినట్లయింది). తన భర్త ఆజ్ఞననుసరించి ఆమె సరస్వతీనది జలాలతోను, జలచరాలతోను నిండిన బిందుసరోవరంలో స్నానం చెయ్యడానికి దిగింది. ఆ సమయంలో ఆ జలప్రవాహంలో అందమైన వలిపములు కట్టుకొన్నవారూ, నవయౌవనంలో ఉన్నవారూ, కలువపూల పరిమళం కలవారూ అయిన కన్యలు వేలమంది దేవహూతిని చూచి ఆమెతో ఇలా అన్నారు.

**క. తరుణీ! సంచితధర్మా, చరణల మగు మేము నీకు సదమలభక్తిం**
**బరిచర్య సేయనేర్తుము, కరుణాకలితేక్షణములఁ గనుఁగొను మమ్మున్. 818**

**ప్రతి :** తరుణీ= ఓ యువతీ!; సంచిత= కూడబెట్టబడిన; ధర్మ+ఆచరణలము+అగు= ధర్మకార్యాచరణం కల మేము, నీకు; సదమలభక్తిన్= నిర్మలమైన భక్తితో; పరిచర్య+చేయన్‌నేర్తుము= సేవచేయగలం; మమ్మున్= మమ్ములను; కరుణాకలిత+ఈక్షణములన్= దయతో కూడిన చూపులతో; కనుఁగొను= చూడు.

**తా :** ఓ యువతీ! మేము ధర్మకార్యాలను ఆచరిస్తూ ఉంటాం. నీకు నిర్మలమైన భక్తితో సేవ చేయగలం. మమ్ములను దయతో కూడిన చూపులతో వీక్షించు.

**విశే :** వేలమంది కన్యలు పరిచారికలుగా దేవహూతికి సేవలు చేస్తామన్నారు. ఆ సేవకూడా ధర్మాచరణే. వాళ్లదగ్గర సంచిత ధర్మముంది. ఎప్పుడూ ధర్మాచరణ చేస్తూ ఉంటారు కాబట్టి ధర్మం వాళ్లదగ్గర మిగిలే ఉంటుంది. అలా మిగిలిన ధర్మం సంచిత (కూడబెట్టుకొన్న) ధర్మంగా ఉంటుంది.

**సీ. అని పల్కి డాసి యయ్యతివకు నభ్యంజ నోద్వర్తనములు పెంపొనరఁ జేసి**
**మలయజకర్పూరమహితవాసిత హేమకలశోదకంబుల జలకమార్చి**

**ధవళవస్త్రంబులఁ దడియొత్తి సర్వాంగ ధూపంబులొసఁగి కస్తూరి యలఁది**
**మంజుశింజన్మణిమంజీర కింకిణీ కలరావకలితమేఖలలు రత్న**

**తే. ఖచితతాటంకముద్రికాకంకణాది, సముచితానర్ఘహేమభూషణము లొసఁగి**
**భవ్యమాల్యానులేపనాంబరము లిచ్చి, షడ్రసోపేతవివిధాన్నసమితిఁ దనిపి. 819**

**ప్రతి :** అని పల్కి= దేవహూతికి సేవలు చేస్తామని చెప్పి ఆ కన్యలు; డాసి= దగ్గరకువెళ్లి; ఆ+అతివకున్= ఆ దేవహూతికి; అభ్యంజన+ఉద్వర్తనములు= నలుగులు, తలంటుస్నానం; పెంపు+ఒనరన్+చేసి= గొప్పగా పొందికగా చేసి (చేయించి); మలయజ కర్పూర= చందన కర్పూరాలతో; మహితవాసిత= గొప్పగా పరిమళించు; హేమకలశ= బంగారు గిండియలలోని; ఉదకంబులన్= నీళ్లతో; జలకము+అర్చి= స్నానం చేయించి; ధవళ వస్త్రంబులన్= తెల్లని వస్త్రాలతో; తడి+ఒత్తి= శరీరంమీది తేమను తుడిచి; సర్వ+అంగ= శరీరమంతా; ధూపంబులు+ఒసఁగి= అగరుద్రవ్యంతో పొగనువేసి; కస్తూరి+అలఁది= కస్తూరి పంకంతో పూతలు పూసి; మంజు= మధురంగా; శింజత్= ధ్వనించే; మణిమంజీర= మణులుగల కాలి అందెలు; కింకిణీ కలరావ కలిత= చిరుగంటల సవ్వడితో కూడిన; మేఖలలు= ఒడ్డాణాలు; రత్నఖచిత= రత్నాలు తాపిన; తాటంక= చెవి కమ్మలూ; ముద్రికా= అంగుళీయక; కంకణ+ఆది= కంకణాలు మొదలైన; సముచిత= తగిన; అనర్ఘ= విలువైన; హేమభూషణములు+ఒసఁగి= బంగారు నగలొసగి; భవ్య= శుభసూచకమైన; మాల్య= పూలమాలలు; అనులేపన+అంబరములు= మైపూతలు (శరీరంపై అలదుకొనే చందనపంకం), విలువైన వస్త్రాలు; ఇచ్చి; షడ్రస+ఉపేత= ఆరు రుచులతో కూడిన; వివిధ అన్నసమితిన్= పలురకాల భోజనంతో; తనిపి= సంతృప్తిపరచి.

**తా :** సేవలు చేస్తామని చెప్పిన కన్యలు దేవహూతి వద్దకు వెళ్లారు. ఆమెకు నలుగు పెట్టారు. బంగారు బిందెలలో నింపిన చందన కర్పూర పరిమళాలు వెదజల్లే నీళ్లతో ఆమెకు స్నానం చేయించారు. శరీరంమీద తడిని తెల్లని వస్త్రాలతో తుడిచారు. అగరు ధూపం వేశారు. కస్తూరి పంకంతో ఒడలికి పూతలు పూశారు. మధురంగా ధ్వనించే మణిమంజీరాలు పాదాలకు తొడిగారు. చిరుగంటల సవ్వడితో కూడిన ఒడ్డాణం నడుముకు అలంకరించాడు. రత్నాలు తాపిన ఆభరణాలను చెవులకు అలంకరించారు. ఉంగరాలు, కంకణాలు మొదలైన సముచితమైన విలువైన బంగారు ఆభరణాలను కైసేశారు. మంగళప్రదమైన పూలమాలలు సమర్పించారు. మైపూతలు, విలువైన వస్త్రాలు ఇచ్చారు. షడ్రసోపేతమైన పలురకాల భోజనంతో సంతృప్తి పరిచారు.

**వ. మఱియుం గనక పాత్రరచితంబు లయిన కర్పూర నీరాజనంబుల నివాళించి రుచిరాసనంబునఁ గూర్చుండఁబెట్టి దర్పణంబు సేతి కిచ్చినం దత్ప్రతిఫలిత నిజదేహంబుఁ గనుంగొని కర్దముని మనంబునం దలంచిన నతండునుం గన్యకాసహస్రంబును దత్క్షణంబునఁ దనసన్నిధి నుండుటం జూచి నిజభర్తృ యోగ మాయా ప్రభావంబునకు నద్భుతంబు నొందె, నంతఁ గర్దముండు గృతస్నానయైన దేవహూతిం గనుంగొని వివాహంబునకు ముందట నేచందంబునఁ దనరుచుండె నా చందంబునఁ జెన్నొందు చుండుటకు నానంద భరితుండై భార్యా సహితంబుగఁ దత్కన్యకా సహస్రంబు గొలువ నిజ విమానారూఢుండై తారాగణ పరివృత రోహిణీయుక్తుండగు సుధాకరుండునుంబోలె నొప్పుచుం దదనంతరంబ. 820**

**ప్రతి :** మఱియున్= ఇంకా; కనకపాత్ర= బంగారు పళ్లెరాలలో; రచితంబులు+అయిన= సమకూర్చబడినవైన; కర్పూర నీరాజనంబులన్= వెలుగుతున్న కర్పూరంతో; నివాళించి= హారతి ఇచ్చి; రుచిర+ఆసనంబునన్= మనోహరమైన పీఠంమీద; కూర్చుండన్+పెట్టి= ఆసీననుచేసి; దర్పణంబున్= అద్దాన్ని; చేతికి+ఇచ్చినన్= చేతికివ్వగా; తద్+ప్రతిఫలిత= ఆ అద్దంలో ప్రతిబింబించిన; నిజదేహంబున్= తనశరీరాన్ని; కనుంగొని= చూచుకొని; కర్దముని= భర్తయైన కర్దమమునిని; మనంబునన్= చిత్తములో; తలంచినన్= భావించగా; అతండునున్= అతడూ; కన్యకా సహస్రంబునున్= వేయిమంది కన్యలూ; తత్‌క్షణంబునన్= ఆ క్షణంలోనే; తనసన్నిధిన్= తన చెంతనే; ఉండుటన్+చూచి= సాక్షాత్కరించడం కనుగొని; నిజభర్తృ= తన పతియొక్క; యోగమాయా ప్రభావంబునకున్= యోగమాయామహిమకు; అద్భుతంబున్+ఒందెన్= ఆశ్చర్యం పొందింది; అంతన్= తరువాత; కర్దముండు; కృతస్నాన+ఐన= స్నానంచేసి ఉన్న; దేవహూతిన్+కనుంగొని= దేవహూతిని చూచి; వివాహంబునకున్= పెండ్లికి; ముందటన్= ముందు; ఏ చందంబునన్= ఆమె ఏ విధంగా; తనరుచున్+ఉండెన్= ఒప్పుతూ ఉండినదో; ఆ చందంబునన్= అదే విధంగా; చెన్ను+ఒందుచుండుటకున్= చక్కదనంతో ఉన్నందుకు; ఆనందభరితుండు+ఐ= ఆనందంతో నిండినవాడై; తద్+కన్యకాసహస్రంబు= ఆ వేయిమంది కన్యలు; భార్యా సహితంబుగన్= భార్యతోకూడ; కొలువన్+తనను= సేవిస్తూ ఉండగా; నిజవిమాన+ఆరూఢుండు+ఐ= సతీసమేతుడై తన విమానం ఎక్కి; తారాగణ= చుక్కల గుంపుచే; పరివృత= చుట్టబడిన; రోహిణీయుక్తుండు+అగు= రోహిణీ సహితుడైన; సుధాకరుండునున్+పోలెన్+ఒప్పుచున్= అమృత కిరణుడైన చంద్రునివలె ప్రకాశిస్తూ; తద్+అనంతరంబ= అటు పిమ్మట.

**తా :** షడ్రసోపేత భోజనంతో దేవహూతిని సంతృప్తిపరిచి ఆ కన్యలు ఆమెకు బంగారు పళ్లెరాలలో శాంత్యుదకాలు నింపి అందులో కర్పూరం వెలిగించి హారతులు పట్టారు. మనోహరమైన పీఠంమీద కూర్చుండబెట్టి అద్దం చేతికిచ్చారు. దేవహూతి ఆ అద్దంలో ప్రతిఫలించిన తన రూపం చూచుకొని భర్తయైన కర్దముని మనస్సులో భావించింది. ఆ క్షణంలోనే కర్దముడూ, వేల కన్యలూ ఆమెముందు సాక్షాత్కరించారు. తన భర్త యోగమాయా ప్రభావానికి ఆమెకు ఆశ్చర్యం కలిగింది. అప్పుడు కర్దముడు స్నానం చేసి ఉన్న దేవహూతిని చూచాడు. పెండ్లికి ముందు ఆమె ఏ విధంగా ఉండినదో ఇప్పుడూ అలాగే చక్కదనంతో ఉన్నందుకు కర్దముడు ఆనందభరితుడయ్యాడు. కన్యలందరూ భార్యనూ, తననూ సేవిస్తూ ఉండగా సతీసమేతుడై తన విమానం ఎక్కి చుక్కలతో చుట్టబడిన రోహిణీ సహితుడైన చంద్రుని వలె ప్రకాశించాడు. ఆ తరువాత–

**విశే :** అశ్వనీ భరణీత్యాది ఇరవైఏడు నక్షత్రాలూ చంద్రుని భార్యలని చెపుతారు. ఈ నక్షత్రాలలో రోహిణి కూడా ఒక నక్షత్రం. రోహిణిని చంద్రునికి ప్రియమైన భార్యగా చెపుతారు.

**చ.** **చిరశుభమూర్తి య మ్ముని యశేషదిగీశవిహారయోగ్యమున్,**
**సురుచిరమందగంధవహశోభితమున్, నికటప్రధాతు ని**
**ర్ఝరసరిదంబుశీతలతుషారమునై తనరారు మేరు కం**
**దరమున కేగి దేవవనితాయుతుఁడైన కుబేరుచాడ్పునన్.** **821**

**ప్రతి :** చిరశుభమూర్తి= నిత్యమంగళస్వరూపుడైన; ఆ+ముని= ఆ కర్దమముని; అశేష= సమస్త; దిక్+ఈశ= దిక్పాలుర; విహార= విహారములకు; యోగ్యమున్= తగినదీ; సురుచిర= మనోహరంగా; మంద= మెల్లగా వీచే; గంధవహ= పరిమళాలను తెచ్చే గాలితో; శోభితమున్= ప్రకాశించేదీ; నికట= సమీపంలోని; ప్రధాతు= గైరికాది ధాతుమయములైన; నిర్ఝర= సెలయేళ్ల; సరిత్= ప్రవహించే నదుల; అంబు= నీళ్లతోనూ; శీతల= చల్లని; తుషారమును+ఐ= మంచుగలదై; తనరారు=

ఒప్పునట్టి; మేరుకందరమునకు+ఏగి= మేరుపర్వత గుహకు వెళ్లి; దేవవనితాయుతుఁడు+ఐన= సురసుందరీ సమేతుడైన; కుబేరుచాడ్పునన్= కుబేరునివలె.

**తా :** నిత్య మంగళస్వరూపుడైన ఆ కర్దమముని సమస్త దిక్పాలురూ విహరించడానికి యోగ్యమైనది, మనోహరంగా వీచే మందమారుతంతో శోభించేది, సమీపంలో గైరికాది ధాతుమయములైన సెలయేళ్ల నీళ్లతో ప్రవహించే నీళ్లతోనూ, చల్లని మంచుతోనూ ఒప్పునట్టి మేరుపర్వత గుహకు వెళ్లి దేవవనితలతో కూడిన కుబేరునివలె విహరించాడు.

**విశే :** కుబేరుడు యక్షరాజు. యక్షుడు అంటే పూజింపబడువాడు. ఇతనికి ధనాధిపుడని మరొకపేరు. ధనాధిపుడంటే ధనాన్ని రక్షించువాడని అర్థం. పైగా శివుని సఖుడు. అందువల్లనే కర్దముడు కుబేరునివలె విహరించాడని చెప్పబడింది.

**ప్రధాతునిర్ఝర –** సెలయేరు కొండలపై నుండి గైరికాది ధాతువులను తనలో కలుపుకొని క్రిందికి ప్రవహిస్తుంది. గిరౌ భవం గైరికం (పర్వతమున పుట్టినది) అని గైరిక శబ్దానికి వ్యుత్పత్తి. హరిదళం, గంధకం మొదలైన శిలావికారాలు ధాతువులు. హరిదళం ఎరుపుగా, గంధకం పసుపుపచ్చగా ఉంటాయి కాబట్టి గైరికాది ధాతువులంటే పర్వతాలమీద గల ఎర్రని పసుపుపచ్చని మట్టి విశేషాలని చెప్పవచ్చు.

**వ. మఱియును. 822**

**ప్రతి :** మఱియును= ఇంకా

**మ. అమరోద్యానవనప్రదేశములు, నవ్యారామభూముల్, దళ**
**త్కుముదాంభోజవిభాసి మానససరఃకూలంబులున్, మంజు కుం**
**జములుం, జైత్రరథంబు విస్ఫురితవిస్రంభంబునంజూచె నె**
**య్యమునం గర్దమయోగి కామగ విమానారూఢుఁడై చెచ్చెరన్. 823**

**ప్రతి :** కర్దమయోగి= కర్దమమహాముని; కామగ= కామగమనంకల; విమాన+ఆరూఢుఁడు+ఐ= విమానం ఎక్కినవాడై; అమర+ఉద్యానవన ప్రదేశములు= దేవతల ఉద్యానవన భూములు; నవ్య+ఆరామభూముల్= కొత్త పూదోటలున్న ప్రదేశాలు; దళత్+కుముద+అంభోజవిభాసి= వికసించిన కలువలతో; పద్మాలతో విరాజిల్లుతూ ఉన్న; మానససరస్+ కూలంబులున్= మానససరోవర తీరాలను; మంజు= మనోహరమైన; కుంజములన్= పొదరిండ్లను; చైత్రరథంబున్= చైత్రరథం అనే పేరుగల కుబేరుని ఉద్యానవనాన్ని; విస్ఫురిత= అధికమైన; విస్రంభంబునన్= విశ్వాసంతో; నెయ్యమునన్= ప్రీతితో; చెచ్చెరన్= శీఘ్రంగా; చూచెన్= చూచాడు.

**తా :** కర్దమమహాముని భార్యాసమేతుడై కామగమనంగల విమానం ఎక్కి దేవతల ఉద్యానవన భూములను తిలకించాడు. కొత్త పూదోటలున్న ప్రదేశాలు సందర్శించాడు. వికసించిన కలువలతో పద్మాలతో విరాజిల్లుతూ ఉన్న మానససరోవర తీరాలను చూచాడు. మదికింపైన పొదరిండ్లను అవలోకించాడు. కుబేరుని ఉద్యానవనమైన చైత్రరథాన్ని సంతోషంతో దర్శించాడు.

**విశే :** దేవతల ఉద్యానవనం నందనవనం. నందనవనం దేవేంద్రుని స్వాధీనంలో ఉంటుంది. ఈ వనంలోకి వెళితే ఆనందం కలుగుతుంది. అందుకని దీనికి నందన (నందయతీతి నందనం= సంతోషింపజేయునట్టిది) వనమనిపేరు. ఈ

పద్యంలో చెప్పబడినవన్నీ విహారానికి అనువైన ఆరామాలు, పూపొదరిండ్లు, సరోవరతీరాలు. భర్తతో కలసి విహరించాలనే కోరికగల దేవహూతిని ఈ విహారయోగ్యమైన ప్రదేశాలకే కర్దముడు తీసుకొని వచ్చాడు. విస్రంభంతో, నెయ్యంతో చూచాడనడం ఎందుకంటే తొందరలేకుండా, ఎవరి బెదిరింపు లేకుండా సావకాశంగా తిలకించాడని చెప్పడానికి.

**వ. ఇవ్విధంబున సమస్త భూభాగంబును వాయు వేగంబునం గలయం గ్రుమ్మరి నిఖిల వైమానికలోకంబు నతిశయించి లోకంబులం జరించె, మోక్షదాయకుండుఁ, దీర్థపాదుండు నగు పుండరీకాక్షుని సన్నుతించి సేవించు పుణ్యాత్ములకుం బొందరాని పదార్థంబులు గలవే? యిట్లు కర్దముఁడు దేవహూతికి నిఖిల ధరాచక్రం బంతయుం జూపి మరల నిజనివాసంబునకుం జనుదెంచి, కామకేళీ వినోదాత్మికయై యున్న భార్య నుపలక్షించి రతిప్రసంగ వ్యాసంగంబు గైకొని బహువిధంబు లయిన యిష్టోపభోగంబుల బహువత్సరంబు లొక్కముహూర్తంబుగా జరుపుచు నన్యోన్యసర సావలోకనంబుల సముచితాలింగన సంభాషణంబులం గాలనిరూపణంబు సేయనేరక శతవత్సరంబులు గడపి తదనంతరంబ. 824**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ తీరున, సమస్త, భూభాగంబును; వాయువేగంబునన్= వాయువేగంతో; కలయన్+క్రుమ్మరి= కలయతిరిగి; నిఖిల= సమస్త; వైమానికలోకంబున్= విమానమెక్కి సంచరించే వాళ్లందరిని; అతిశయించి= మించి; లోకంబులన్= జగములన్నిటా; చరించెన్= సంచరించాడు; మోక్షదాయకుండును= మోక్షప్రదాతా; తీర్థపాదుండును+అగు= పరమపూజ్యుడూ అయిన; పుండరీక+అక్షునిన్= తెల్లతామరలను పోలిన కన్నులుగల విష్ణుదేవుని; సన్నుతించి= స్తుతించి; సేవించు= కొలిచే; పుణ్యాత్ములకున్= పవిత్రమైన హృదయాలు కలవారికి; పొందరాని= పడయజాలని; పదార్థంబులు= వస్తువులు; కలవు+ఏ= ఉంటాయా?; ఇట్లు= ఇలా; కర్దముఁడు= కర్దమముని; దేవహూతికి; నిఖిల= సమస్త; ధరాచక్రంబు+అంతయున్= భూమండలమంతా; చూపి= కనబరచి; మరల; నిజనివాసంబునకున్= తన గృహమునకు; చనుదెంచి= వచ్చి; కామకేళీ వినోద+ఆత్మిక+ఐ+ఉన్న= శృంగారక్రీడా విలాసాలకు మక్కువ కలిగి ఉన్న; భార్యన్= పత్నిని; ఉపలక్షించి= కునుగొని, ఉద్దేశించి; రతిప్రసంగ వ్యాసంగంబున్= రతివిషయంలో శ్రద్ధను; కైకొని= వహించి; బహువిధంబులు+అయిన= పలుతెరగులైన; ఇష్ట+ఉపభోగంబులన్= అభీష్టసుఖభోగాలను; బహువత్సరంబులు= పెక్కు సంవత్సరాలు; ఒక్కముహూర్తంబుగాన్= ఒక్కక్షణంగా; జరుపుచున్= గడుపుతూ; అన్యోన్య సరస+అవలోకనంబులన్= ఒకరినొకరు సరసయుక్తమైన చూపులతో; సముచిత+ఆలింగన= తగిన కౌగిలింతలతో; సంభాషణంబులన్= సల్లాపములతో; కాలనిరూపణంబు= ఇది పగలు ఇది రాత్రి అని; చేయనేరక= గమనించకుండా; శతవత్సరంబులు= నూరేండ్లు; గడిపి; తద్+అనంతరంబ= తరువాత

**తా :** ఈ విధంగా కర్దముడు భార్యతో కలసి విమానంమీద వాయువేగంతో, కలయదిరిగి విమానమెక్కి సంచరించేవాళ్లందరిని మించి లోకాలన్నీ సంచరించాడు. మోక్షప్రదాత, పరమపూజ్యుడు అయిన విష్ణుదేవుని స్తుతించి సేవించే పుణ్యాత్ములకు పొందరాని వస్తువులుంటాయా? ఇలా కర్దముడు దేవహూతికి సమస్త భూమండలం చూపించి మరల తన నివాసానికి తీసుకొని వచ్చాడు. తనభార్య కామకేళీ వినోదానికి ఇష్టపడుతున్నట్లు గుర్తించాడు. రతిక్రీడాపరాయణుడైనాడు. ఆ దంపతులు పలువిధాలైన సుఖభోగాలను అనుభవిస్తూ అనేక సంవత్సరాలు క్షణాలవలె గడిపారు. సరసమైన చూపులతో, తగిన కౌగిలింతలతో, సంభాషణలతో, కాలం గడవడమే తెలియకుండా వారు నూరేండ్లు గడిపారు.

**విశే :** ధర్మకామం గ్రాహ్యమే. కనుక కవి దీనిని సమగ్రంగా వర్ణించాడు.

**క. మునివరుఁడొకనాఁడిమ్ములఁ, దన నిజదేహంబు నవవిధంబులు గావిం**
**చి నయంబునఁ దద్వీర్యము, దన సతిగర్భమున నవవిధంబుల నిలిపెన్. 825**

**ప్రతి :** ఒకనాఁడు; మునివరుఁడు= కర్దమముని; ఇమ్ములన్= కుతూహలంతో; తన; నిజదేహంబున్= స్వశరీరాన్ని; నవవిధంబులు= తొమ్మిది విధాలు; కావించి= చేసి అనగా తొమ్మిది దేహాలుగా విభజించి; నయంబునన్= ఆసక్తితో; తద్+వీర్యమున్= తనదైన ఆ రేతస్సును; తన; సతి; గర్భమునన్= గర్భంలో; నవవిధంబులన్= తొమ్మిది విధాలుగా; నిలిపెన్= నిలిచేటట్లు చేశాడు.

**తా :** ఒకనాడు కర్దమముని కుతూహలంతో తనదేహాన్ని తొమ్మిది దేహాలుగా చేసుకొని క్రమంగా తన వీర్యాన్ని తన భార్య దేవహూతి గర్భంలో తొమ్మిది విధాలుగా నిలిచేటట్లు చేశాడు.

**క. అది కారణంబుగాఁ బెం, పొదవిన మునివలన దేవహూతియుఁ గూఁతుల్**
**ముదమునఁ గనెఁ దొమ్మండ్రన్, ముదితయు మది సంతసించె, మునివరుఁ డంతన్. 826**

**ప్రతి :** అదికారణముగాన్= ఆ కారణంవల్ల; పెంపు+ఒదవిన= వృద్ధిని కలుగజేసిన; మునివలనన్= కర్దమమునివల్ల; దేవహూతియున్= దేవహూతికూడా; ముదమునన్= హర్షంతో; కూఁతుల్= పుత్రికలను; తొమ్మండ్రన్= తొమ్మిదిమందిని; కనెన్= కన్నది; మదిన్= మనస్సులో; ముదితయును= దేవహూతి; సంతసించెన్= సంతోషించింది; అంతన్= తరువాత; మునివరుఁడు= కర్దముడు...

**తా :** ఆ కారణంగా కర్దమమునివల్ల దేవహూతి తొమ్మిదిమంది కూతుండ్రను కన్నది. ఆమె తనమనస్సులో ఎంతో సంతోషించింది. తరువాత కర్దమముని –

**తే. సన్న్యసింపంగఁగోరిన సతి యెఱింగి, యాత్మఁ బొడమిన సంతాప మగ్గలింపఁ**
**జింత వాటిల్లఁ జెక్కిటఁజేయి సేర్చి, పదములను నేల వ్రాయుచుఁ బలికెఁ బతికి. 827**

**ప్రతి :** సన్న్యసింపంగన్= సన్యసించాలని; కోరినన్= కోరగా; సతి= దేవహూతి; ఎఱింగి= తెలుసుకొని; ఆత్మన్= మనస్సులో; పొడమిన= పుట్టిన; సంతాపము+అగ్గలింపన్= ఆ వేదన అధికంకాగా; చింతవాటిల్లన్= దిగులు కలుగగా; చెక్కిటన్+చేయి+చేర్చి= చెక్కిలిపై చేయిచేర్చి; పదములను= పాదాలతో (పాదాలవ్రేళ్లతో); నేలన్ వ్రాయుచున్= నేలపై రాస్తూ; పతికిన్= భర్తతో; పలికెన్= చెప్పింది.

**తా :** దేవహూతి తొమ్మండుగురు కూతుళ్లను కన్నతరువాత కర్దమముని సన్యాసం తీసుకోవాలనుకొన్నాడు. ఆ విషయం తెలుసుకొన్న దేవహూతికి మనస్సులో ఆవేదన అధికమైంది. చింత కలిగింది. చెక్కిలిమీద చేయిచేర్చి కాలివేళ్లతో నేలపై రాస్తూ భర్తతో ఇలా అన్నది.

**విశే :** చెక్కిలిమీది చేయిచేర్చటం, కాలివ్రేళ్ళతో నేలను రాయటం మొదలైనవి సాత్త్వికభావాలు.

**సీ. అనఘ! సంతానపర్యంతంబు ననుఁగూడి, వర్తింతు ననుచుఁ బూర్వమునఁ బలికి**
**కూఁతుల నిచ్చితి కొమరార, నిప్పు డీ, తరుణులు పతులను దమకుఁ దార**

**యరసి వర్తింతురో యని భీతి నొందెదఁ, గావున నీ పుత్త్రికలకుఁ దగిన**
**వరుల సంపాదించి, పరిణయంబులు సేసి, తత్త్వసంహిత నాకుఁ దవిలి తెలుపు**

**తే. సుతునిఁ గృపసేసి ననుఁ గావు సుజనవినుత! యర్థి సంసారదుఃఖంబు నపనయింప**
**నర్హుఁడవు నీవ, కామమోహమున నింత, కాల మూరక పోయె నే గతియు లేక. 828**

**ప్రతి :** అనఘ= పుణ్యాత్ముడా!; సంతానపర్యంతంబు= సంతానం కలిగేవరకు; ననున్+కూడి= నాతోకలసి; వర్తింతును+ అనుచున్= మెలగుతాను అని; పూర్వమునన్+పలికి= మునుపు నీవు చెప్పి; కొమరారన్= ఒప్పుదలగా; కూతులన్+ఇచ్చితి= కొమార్తెలను ఇచ్చావు; ఇప్పుడు; ఈ తరుణులు= ఈ యువతులు; పతులను= భర్తలను; తమకున్+తార= తమకుతామే; అరసి= వెదకుకొని; వర్తింతురు+ఓ+అని= ఉండగలరా (పెండ్లాడగలరా)?; అని; భీతిన్+ఒందెదన్= భయపడుతున్నాను; కావున; నీ పుత్త్రికలకున్= నీ కుమార్తెలకు; తగిన= అర్హమైన; వరులన్= పెండ్లికుమారులను; సంపాదించి= వెదకిపెట్టి; పరిణయంబులు+చేసి= వివాహాలు సల్పి; తత్త్వసంహితన్= తత్త్వజ్ఞానాన్ని; నాకున్= నాకు; తవిలి= ప్రయత్నించి; తెలుపు= తెలియజేయు; సుతునిన్= కుమారుని; కృప+చేసి= ప్రసాదించి (ఇచ్చి); సుజనవినుత= సాధుజనస్తవనీయా!; అర్థిన్= నా కోరకమేరకు; సంసారదుఃఖంబున్= సంసారదుఃఖాన్ని; అపనయింపన్= తొలగించడానికి; నీవు+అ= నీవే; అర్హుడవు= సమర్థుడవు; ఇంతకాలము= గడచిన కాలమంతా; కామమోహమునన్= కామసుఖంమీది మోహంతో; ఏ గతియున్= ఏ మార్గమూ; లేక; ఊరక= వ్యర్థంగా; పోయెన్= గడచిపోయింది.

**తా :** అనఘా! సంతానం కలిగేవరకు నాతో కలసి ఉంటానని ముందు నీవు చెప్పావు. కొమార్తెలను ప్రసాదించావు. ఇప్పుడు ఈ యువతులు తమకు తామే భర్తలను ఎలా వెదకుకోగలరని భయపడుతున్నాను. కావున ఈ పుత్త్రికలకు తగిన పెండ్లికొడుకులను వెదకి వాళ్లకు పెండ్లిండ్లు చేసి, నాకు తత్త్వవిషయాలు తెలియజేయగల కుమారుని ప్రసాదించు. సాధుజనస్తవనీయా! సంసారదుఃఖాన్ని తొలగించడానికి సమర్థుడవు నీవే. గడచిన కాలమంతా కామసుఖంపైగల మోహంతో ముక్తిమార్గాన్ని గురించి ఆలోచించకుండా వ్యర్థంగా గడచిపోయింది.

**చ. ఉపరతి పుట్టె నైహికసుఖోపగతానుభవంబులందు, నేఁ**
**జపలతఁ గామభోగరతి సంగముఁ గోరి మహాత్మ! నిన్ను న**
**చ్చుపుఁదలఁపొప్పఁగాఁ దెలియఁజాలక యే వరియించుటన్ భవ**
**త్కృప ఫలియించె, ముక్తి నినుఁ గేవలభక్తి భజింపఁగల్గదే? 829**

**ప్రతి :** మహా+ఆత్మ= మహానుభావా!, ఐహిక+సుఖ= ఈ లోక సుఖాలలో; ఉపగత+అనుభవంబుల+అందున్= ప్రాప్తించిన సుఖానుభవాలలో; ఉపరతి+పుట్టెన్= ఉపేక్షాబుద్ధి కలిగింది (ఆసక్తి నశించింది); నేన్= నేను; చపలతన్= చంచలభావంతో; కామభోగరతి సంగమున్+కోరి= రతి సాంగత్యాన్ని అపేక్షించి; నిన్నున్= నిన్ను; అచ్చమున్+తలఁపు+ఒప్పగాన్= స్వచ్ఛమైన భావాన్ని స్పష్టంగా; తెలియన్+చాలక+ఏ= తెలుసుకోలేకనే; వరియించుటన్= కోరడంవల్ల; భవత్+కృప= నీ అనుగ్రహం; ఫలియించెన్= సఫలమైంది; ముక్తి= మోక్షం; నినున్= నిన్ను; కేవలభక్తిన్= అచ్చపు భక్తితో; భజింపన్= సేవించడంవల్ల; కల్గదు+ఏ= కలుగదా (లభించదా)?; లభిస్తుందని భావం.

**తా :** మహాత్మా! నాకు ఈ లోకసంబంధాలైన సుఖానుభవాలలో ఆసక్తి నశించింది. ముందు నేను చంచలభావంతో నీతో రతిసాంగత్యాన్ని అపేక్షించి స్వచ్ఛమైన నీ భావాన్ని తెలుసుకోలేక ఏ వేవో కోరాను. ఆ కోరికలను తీర్చావు. నిన్ను నిర్మలమైన భక్తితో సేవిస్తే ముక్తి లభించదా? తప్పక లభిస్తుంది.

**విశే :** 'అచ్చపుఁదలఁపు' అంటే కర్దముని యోగమాయాతత్త్వం. దాన్ని పూర్తిగా తెలుసుకోవడం. అన్ని సంవత్సరాలు కర్దమునితో కలసిఉన్నా దేవహూతికి ఆయన మహత్తు పూర్తిగా తెలియలేదు. దానికి కారణం ఆమెకుగల కామభోగాసక్తత. ఆయనను కామదృష్టితోనే ఇన్నాళ్లూ చూచింది. ఇప్పుడామెకు భోగదృష్టి పోయింది. అనుభవించాలనే ఆసక్తి నశించింది. ఆమె మనోనేత్రం మేలుకొంది. గడచినకాలం ఎంత వృథాగా పోయిందో అర్థమైంది. అప్పుడామెకున్నది చంచలస్వభావం. ఇప్పుడు ముక్తిని గురించి ఆలోచించే స్థిరచిత్తంతో ఉంది. కర్దముడే ముక్తి నివ్వగల మహత్తు కలవాడని గ్రహించగలిగింది.

**వ. అదియునుం గాక 830**

**ప్రతి :** అదియునున్+కాక= అంతే గాకుండా

**చ. సమమతి నొప్పు సత్పురుషసఖ్యము సద్గతికారణంబు, నీ**
**చమతి విలోలదుష్పురుషసఖ్యము దుర్గతిహేతు వంచుఁ జి**
**త్తమునఁ దలంచి యోగిజనతానుత! మిమ్ము భజింతుఁ, బ్రాణి సం**
**గమమునఁ బుణ్యపాపములు గైకొని పొందవె యెట్టి వారలన్? 831**

**ప్రతి :** సమమతిన్+ఒప్పు= అందరియెడల సమానమైన బుద్ధితో ప్రవర్తించే; సత్+పురుషసఖ్యము= సజ్జనుల మైత్రి; సత్+గతికారణంబు= ఉత్తమగతికి హేతువు అవుతుంది; నీచమతి= అల్పబుద్ధితో; విలోల= చలించునట్టి; దుస్+పురుషసఖ్యము= దుష్టులైన పురుషులతోడి చెలిమి; దుస్+గతిహేతువు+అంచున్= దుర్గతికి కారణమవుతుందని; చిత్తమునన్+తలంచి= మనస్సులో భావించి; యోగిజనతానుత= యోగులచే కొనియాడుబడువాడా!; మిమ్ము; భజింతున్= సేవిస్తాను; ప్రాణిసంగమమునన్= ప్రాణులతో కలవడం వల్లనే; ఎట్టివారలన్= ఎట్టివారికైనా; పుణ్యపాపములు; కైకొని= గ్రహించి; పొందవు+ఏ= ప్రాప్తించవా?

**తా :** అంతేగాక అందరియెడల సమానబుద్ధితో ప్రవర్తించే సజ్జనులమైత్రి ఉత్తమగతికి కారణమవుతుంది. అల్పబుద్ధిగల చంచలచిత్తులైన దుష్టపురుషుల మైత్రి దుర్గతికి కారణమవుతుంది. యోగిజనసన్నుతా! ఈ విషయాన్ని మనస్సులో భావించి నిన్ను నేను సేవిస్తాను. ప్రాణుల సమాగమంవల్లనే ఎట్టివారికైనా పుణ్యాలో పాపాలో ప్రాప్తిస్తాయి.

**విశే :** ఈ పద్యంలో దేవహూతి వైరాగ్యభావంతో మాట్లాడుతూ ఉంది. సజ్జనులతో సాంగత్యం కలిగి ఉంటే అది పుణ్యహేతువు అవుతుంది. అంటే- సంసార క్లేశనివారణ హేతువవుతుంది. అదే అసజ్జనులతో సాంగత్యం ఏర్పరచుకొంటే ఆ సంబంధం పాపానికి దారితీస్తుంది. అంటే – సంసార దుఃఖం కలుగుతుంది. అందరి దుఃఖాన్ని నిశ్శేషంగా నశింపజేసి వారికి ఆనందాన్ని ఇవ్వగల సమర్థుడు కర్దముడు. ఇన్నాళ్లూ ఆయనతో కలసి ఉండినా ముక్తిని గురించి మాట్లాడక పోవడం ఎంతో దుఃఖం కలిగించే విషయమని దేవహూతి బాధపడుతూ ఉంది.

**క. అని యిట్లు వేదనాభర, మున మునుకుచుఁ బలుకఁ గర్దముఁడు మనుపుత్త్రిం**
**గనుఁగొని సరసిజనయను వ, చనములు మది సంస్మరించి సతి కిట్లనియెన్. 832**

**ప్రతి :** అని; ఇట్లు; వేదనాభరమునన్= మిక్కిలి బాధతో; మునుకుచున్= పరితపిస్తూ; పలుకన్= పలుకగా; కర్దముఁడు; మనుపుత్రిన్+కనుఁగొని= దేవహూతిని చూచి; సరసిజనయను= పద్మాలవంటి కన్నులుగల శ్రీహరి; వచనములు= మాటలు; మదిన్= మనస్సులో; సంస్మరించి= గుర్తుకు తెచ్చుకొని; సతికిన్= ఆమెతో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఇలా మిక్కిలి బాధతో పరితపిస్తూ పలికిన దేవహూతిని చూచి శ్రీహరి మాటలు తలపుకు తెచ్చుకొని కర్దముడు ఆమెతో ఇలా అన్నాడు.

**క. మనుసుత! నీ మది దుఃఖం, బును బొందకు, మచిరకాలమున భగవంతుం**
**డనఘుం డక్షరుఁడు జనా, ర్దనుఁడు భవద్గర్భమందుఁ దగ వసియించున్. 833**

**ప్రతి :** మనుసుత= స్వాయంభువ మనువు కొమార్తెవైన దేవహూతీ!; నీ మదిన్= నీ మనస్సులో; దుఃఖంబును+పొందకుము= దుఃఖించవద్దు; అచిరకాలమునన్= కొద్దికాలంలోనే; భగవంతుండును; అనఘుండు= పాపరహితుడు; అక్షరుఁడు= శాశ్వతుడు; జనార్దనుఁడు అయిన శ్రీహరి; తగన్; భవత్+గర్భమందున్= నీ గర్భంలో; వసియించున్= నివసిస్తాడు (ప్రవేశిస్తాడు).

**తా :** దేవహూతీ! నీవు మనస్సులో దుఃఖించవద్దు. భగవంతుడు, అనఘుడు, అక్షరుడు, జనార్దనుడు అయిన శ్రీహరి అచిరకాలంలోనే తప్పక నీ గర్భంలో ప్రవేశిస్తాడు.

**విశే :** తన కాలమంతా వృథాగా గడచిపోయిందని, ముక్తిమార్గాన్ని గురించి తెలుసుకొనే అవకాశాన్ని ఉపయోగించుకోలేక పోయానని పరితపిస్తూ ఉన్న దేవహూతికి కర్దముడు కలిగించిన సాంత్వనమిది. ఆమె తనకు తత్త్వబోధ చేయగల కొడుకును ప్రసాదించమన్నది. శ్రీహరే ఆమెకు కుమారుడుగా అవతరించబోతున్నాడని చెప్పి కర్దముడు ఆమెను సంతోషపరిచాడు.

**క. వరనియమవ్రతనిష్ఠా, చరణనియుక్తాంతరంగసమధికవై సం**
**భరితతపోధన దాన, స్ఫురితశ్రద్ధానుభక్తిపూర్వము గాఁగన్. 834**

**ప్రతి :** వరనియమ= ఉత్తమనియమాలు; వ్రత= వ్రతాలు; నిష్ఠా= నియమాలు వీటిని; ఆచరణ= అనుష్ఠించడంచేత; నియుక్త= ప్రేరేపించబడిన; అంతరంగ+సమధికవు+ఐ= హృదయముచే ఉత్తమురాలివై; సంభరిత= నిండైన; తపస్= తపస్సు; ధన దానం= ధనాన్ని ధానం చేయటం; స్ఫురిత= స్ఫురిస్తున్న; శ్రద్ధానుభక్తిపూర్వము+కాఁగన్= శ్రద్ధాభక్తులతో కూడి...

**తా :** నీవు ఉత్తమనియమాలు, వ్రతాలు, నిష్ఠలు – ఇవన్నీ ఆచరించు. గొప్ప నిగ్రహంతో కూడిన మనస్సు కలదానివై నిండైన తపస్సు, ధనత్యాగం, దానం చేస్తూ శ్రద్ధాభక్తులతో కూడినది కాగా.

**విశే :** తపోధన – అన్నపుడు తపోధనం అని అర్థం చెప్పవచ్చు. ఇలా చెప్పడమే సమంజసంగా కూడా ఉంటుంది. అయితే మూలంలో 'తపోద్రవిణదానైశ్చ' అని తపస్సు, ధనం (ద్రవిణం) దానం వేరువేరుగా స్ఫురింపజేయడంవల్ల ప్రతిపదార్థంలో తపస్సు, ధనం వేరువేరుగా చూపబడినాయి. ఇవన్నీ 'నియుక్త అంతరంగంతో' నిర్వర్తించుమని ఉండడంవల్ల ధనం సంగ్రహించుకోవడం కాకుండా ఉన్నధనాన్ని కూడా వదిలించుకోవలసిన అవసరముంది. బాహ్యేంద్రియ నియమం, ఆంతరికమైన నియమం కలసి నియుక్త అంతరంగం. ఇలాంటి అంతరంగాన్ని సాధించాలంటే ధనత్యాగం చేయాలి. అందుకని 'ధన'కు ధనత్యాగం అని అర్థవివరణ చేయబడింది.

**మ. మతి నారాయణు పాదపద్మములు సమ్యగ్భక్తిఁ బూజించు త**
**త్పురుషశ్రేష్ఠుఁడు మానసంబున భవత్పూజాసుసంప్రీతుఁడై**
**కర మర్థిం దరుణీశిరోమణి! భవద్గర్భస్థుఁడై యుండి తాఁ**
**గరుణంజేయు భవన్మనోజనితశంకాగ్రంథివిచ్ఛేదమున్. 835**

**ప్రతి :** తరుణీశిరోమణీ!= స్త్రీలలో శ్రేష్ఠురాలా! మతి; నారాయణు= శ్రీమన్నారాయణుని; పాదపద్మములు; సమ్యక్+భక్తిన్= నిండైన భక్తితో; పూజించు= అర్చించుము; తద్+పురుషశ్రేష్ఠుఁడు= ఆ భగవంతుడు; మానసంబునన్= మనస్సులో; భవత్+పూజా= నీ పూజకు; సుసంప్రీతుఁడు+ఐ= మిక్కిలి సంతసించినవాడై; కరము+అర్థిన్= మిక్కిలి ఇష్టంతో; భవత్= నీ; గర్భస్థుఁడు+ఐ= నీ కడుపులో పడ్డవాడై; ఉండి; తాన్= తాను (భగవంతుడు); భవత్+మనస్+జనిత= నీ మనస్సునందు ఏర్పడిన; శంకాగ్రంథి= సందేహమనే ముడియొక్క; విచ్ఛేదమున్= ఛేదించుటను; కరుణన్= దయతో; చేయున్= చేస్తాడు.

**తా :** శ్రీమన్నారాయణుని పాద పద్మాలను నిండైన భక్తితో పూజించు పురుషోత్తముడైన ఆ భగవంతుడు మనస్సులో నీ పూజకు సంతృప్తిచెంది నీ గర్భంలో నివసించి (నీ పుత్రుడుగాపుట్టి) నీ మనస్సులో ఏర్పడిన సందేహాల ముడులను ఛేదిస్తాడు.

**విశే :** ఆధ్యాత్మిక విషయాలు తెలుసుకొని ముక్తిమార్గానుగాములైన వాళ్లకు మనస్సులో అనేక సందేహాలుంటాయి. ప్రతి సందేహమూ ఒక ముడిలాంటిదే. ఒక సందేహంతీరితే మరొక సందేహం కలుగుతుంది. అందుకే శంకాగ్రంథిని సందేహాలముడులు అనడం.

## ❖ దేవహూతి గర్భంబున విష్ణుండు గపిలాచార్యుండుగా నుదయించుట ❖

**చ. అనవుడు దేవహూతి హృదయంబున సంతసమంది య మ్మునీం**
**ద్రుని వచన క్రమంబునఁ బరున్ భగవంతు ననంతుఁ బద్మలో**
**చను హరి విష్ణు నర్చనము సల్పుచు నుండఁగఁ గొన్ని యబ్దముల్**
**సనునెడ దానవాంతకుఁడు సమ్మతిఁ గార్దమమైన తేజమున్. 836**

**ప్రతి :** అనవుడు= అని కర్దముడు చెప్పగా; దేవహూతి; హృదయంబునన్= మనస్సులో; సంతసము+అంది= సంతోషపడి; ఆ+ముని+ఇంద్రుని= ఆ మునివరుని; వచనక్రమంబునన్= మాటల ప్రకారం; పరున్= వైకుంఠుని; భగవంతున్= భగవంతుని; అనంతున్= అంతములేనివానిని; పద్మలోచనున్= తామరలవంటి కన్నులు గలవానిని, హరిన్, విష్ణున్; అర్చనముసల్పుచున్= ఇన్ని పేర్లతో ప్రసిద్ధుడైన శ్రీహరిని పూజిస్తూ; ఉండఁగన్= ఉండగా; కొన్ని అబ్దముల్= కొన్ని సంవత్సరాలు; చనునెడన్= గడచిన తరువాత; దానవ+అంతకుఁడు= రాక్షస సంహారకుడైన శ్రీహరి; కార్దమము+ఐన తేజమున్= కర్దమునిదైన తేజస్సును.

**తా :** అని కర్దముడు చెప్పగా వినిన దేవహూతి మనస్సులో సంతోషపడింది. ఆ మునివరుని మాటల ప్రకారం పరుడు, అనంతుడు, పద్మలోచనుడు, హరి, విష్ణువు అయిన భగవంతుని పూజిస్తూ ఉండగా కొన్ని సంవత్సరాలు గడచిపోయాయి. తరువాత దానవాంతకుడైన శ్రీహరి కర్దముని తేజస్సును–

క. ధరియించి య మ్మునీంద్రుని, తరుణీ గర్భంబువలన దనుజారి శమీ
తరు కోటరమున వైశ్వా, నరుఁ డుదయించిన విధంబునన్ జనియించెన్. 837

**ప్రతి :** ధరియించి= ధరించి; ఆ+మునీంద్రుని= ఆ మునీంద్రునియొక్క; తరుణీ గర్భంబువలనన్= భార్యగర్భంనుండి; దనుజ+అరి= రాక్షసులకు శత్రువైన శ్రీహరి; శమీతరు= జమ్మిచెట్టుయొక్క; కోటరమునన్= తొర్రలో; వైశ్వానరుఁడు= అగ్ని; ఉదయించిన= పుట్టిన; విధంబునన్= తీరున; జనియించెన్= ఆవిర్భవించాడు.

**తా :** కర్దమముని తేజస్సును ధరించి దనుజారి అయిన శ్రీహరి జమ్మిచెట్టు తొర్రనుండి అగ్ని పుట్టిన విధంగా దేవహూతి గర్భంనుండి ఆవిర్భవించాడు.

**విశే :** శమీవృక్షం వృక్షాలలో పవిత్రమైంది. 'శమయతి దోషాన్ శమీ' అని వ్యుత్పత్తి. దోషాలను పోగొట్టి శాంతిని కలుగజేసేది శమీవృక్షం. దోషాలను పోగొట్టడంవల్ల శమీవృక్షం శుభస్వరూపమైనదిగా భావిస్తారు. శమీవృక్షం అనగా జమ్మిచెట్టు ఎంత పవిత్రమైనదో దేవహూతి గర్భంకూడా అంత పవిత్రమైనది. శమీవృక్షం నుండి ఉదయించిన అగ్ని ఊర్ధ్వముఖంగా ప్రసరించి అశుభాలను దగ్ధంచేసినట్లు దేవహూతి గర్భంనుండి పుట్టిన శ్రీహరి ఆమె శంకాగ్రంథులను విచ్ఛేదించి ఆమెకు తత్త్వజ్ఞానాన్ని ప్రసాదిస్తాడు. అరణియందు అగ్నివలె ఆమె గర్భం నుండి జన్మించెను అని మూలం. అరణి అంటే అగ్నిని పుట్టించడానికి మరొక కర్రతో మథింప యోగ్యమైన దారువు. ఇక్కడ అరణి శమీతరువు. అరణిలో అగ్ని ఎప్పుడూ ఉంటుంది. మథించినపుడు బయటకు వస్తుంది. అలాగే భగవంతుడు కర్దమ తేజస్సులో ప్రవేశించెనని చెప్పడంవల్ల అంతకుముందు లేడని సందేహపడకూడదు. భగవంతుడు సర్వవస్తువులలో సర్వకాలాలలో నిండి ఉంటాడు. అయితే నిర్వికారుడుగా ఉంటాడు. భక్తులను అనుగ్రహించడానికి కరుణతో బాహ్యంగా ఒక స్వరూపం ధరించి అవతరిస్తాడు. తల్లి అయినా దేవహూతి స్వామికి భక్తురాలు. ఆమెను ఉద్ధరించడానికి ఆమెకే పుత్రుడుగా జన్మించడం ఆమె అదృష్టవిశేషం.

సీ. అయ్యవసరమున నాకాశమున దేవ తూర్య ఘోషంబులు తుముల మయ్యె,
నందిత దేవతాబృందంబు లందంద, కురిసిరి మందారకుసుమవృష్టి,
గంధర్వకిన్నరగానంబు వీతెంచె నప్సరోగణముల యాట లొప్పె,
వావిరి దిక్కులఁ గావిరి విరిసెను దవిలి వార్ధుల కలంకువలు మానె,

తే. సాధుజనముల మనములు సంతసిల్లె, హోమవహ్నులు ప్రభలఁ జెన్నొంది వెలిఁగెఁ
గుసుమఫలభారముల నొప్పెఁ గుజములెల్ల, సర్వసస్యాళి చెన్నొందె జగతిలోన. 838

**ప్రతి :** ఆ+అవసరమునన్= ఆ సమయంలో; ఆకాశమునన్= ఆకాశంలో; దేవతూర్య ఘోషంబులు= దివ్యమంగళవాద్యాలు; తుములము+అయ్యెన్= సంకులంగా మ్రోగాయి; నందిత= సంతోషపడిన; దేవతాబృందంబులు= దేవతా సమూహాలు; మందార కుసుమవృష్టి= మందార పుష్పవర్షం; అందు+అందన్= అక్కడే; కురిసిరి= కురిపించారు; గంధర్వకిన్నర గానంబు= గంధర్వుల కిన్నరులగానం; వీతెంచెన్= వీచింది (గంధర్వ కిన్నర గానం సాగింది); అప్సరోగణముల= అప్సరసబృందాల; ఆటలు+ఒప్పెన్= నృత్యాలు సాగాయి; వావిరి= క్రమంగా; దిక్కులన్= దిక్కులలో; కావిరి= నలుపుతనం; విరిసెను= చెదరిపోయింది; తవిలి; వార్ధుల= సముద్రాల; కలంకువలు= క్షోభలు; మానెన్= ఆగిపోయాయి; సాధుజనముల= సజ్జనుల; మనములు= మనస్సులు; సంతసిల్లెన్= సంతోషపడినాయి; హోమవహ్నులు= హోమాగ్నులు; ప్రభలన్= తేజస్సుతో;

చెన్ను+ఒంది= అతిశయించి; వెలిఁగెన్= ప్రకాశించాయి; కుజములెల్లన్= చెట్లన్నీ; కుసుమఫలభారములన్+ఒప్పెన్= పుష్ప ఫలభరితాలైనాయి; జగతిలోనన్= లోకంలో; సర్వసస్య+ఆళి= అన్నిరకాలైన పైరులు; చెన్ను+ఒందెన్= అతిశయించాయి (బాగా పండాయి).

**తా :** భగవంతుడు కపిలాచార్యుడుగా జన్మించిన సమయంలో ఆకాశంలో దివ్యమంగళవాద్యాలు సందడిగా ధ్వనించాయి. ఆనందపడిన దేవతల సమూహాలు మందారపుష్పవర్షం కురిపించారు. గంధర్వులూ కిన్నరులూ పాటలుపాడారు. అప్సరసలు నృత్యంచేశారు. క్రమంగా దిక్కులన్నీ ప్రసన్నమైనాయి. సముద్రాలు ప్రశాంతమైనాయి. సజ్జనుల మనస్సులు సంతోషపడినాయి. హోమాగ్నులు తేజస్సుతో అతిశయంగా వెలిగాయి. చెట్లన్నీ పుష్పఫలభరితాలైనాయి. లోకంలో (పొలాలలో) అన్నిరకాలపైరులు అతిశయంగా పండాయి.

**వ. ఇట్టి మహోత్సవంబున దేవహూతికిం దత్త్వబోధంబుఁ గావించుకొఱకుఁ దదీయగర్భంబున నుదయించిన పరబ్రహ్మ స్వరూపుండైన నారాయణుని దర్శించుకొఱకు మరీచి ప్రముఖ మునిగణ సమేతుండై చతుర్ముఖుండు సనుదెంచి యమ్మహాత్ముని దర్శించి కర్దమదేవహూతులం గనుంగొని యిట్లనియె. 839**

**ప్రతి :** ఇట్టి= ఇలాంటి; మహా+ఉత్సవంబునన్= గొప్ప ఉత్సవ సమయంలో; దేవహూతికిన్; తత్త్వబోధంబు+ కావించుకొఱకున్= తత్త్వజ్ఞానాన్ని బోధించడంకోసం; తదీయగర్భంబునన్= ఆమె గర్భంలో; ఉదయించినన్= ఆవిర్భవించగా; పరబ్రహ్మస్వరూపుండు+ఐన= పరబ్రహ్మ స్వరూపుడైన; నారాయణునిన్= శ్రీమన్నారాయణుని; దర్శించుకొఱకున్= దర్శించడం కోసం; మరీచి ప్రముఖ= మరీచి మొదలైన; మునిగణసమేతుండు+ఐ= మునుల సమూహంతో కూడి; చతుర్ముఖుండు= బ్రహ్మదేవుడు; చనుదెంచి= విచ్చేసి; ఆ+మహాత్మునిన్= ఆ మహాత్ముడైన కపిలుని; దర్శించి; కర్దమదేవహూతులన్ కనుంగొని= చూచి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** కపిలుడు ఆవిర్భవించిన ఆ మహోత్సవ సమయంలో దేవహూతికి తత్త్వజ్ఞానాన్ని బోధించడానికి ఆమె గర్భంలో జన్మించిన పరబ్రహ్మస్వరూపుడైన శ్రీమన్నారాయణుని దర్శించడంకోసం మరీచి మొదలైన మునిగణాలతో కూడి బ్రహ్మదేవుడు వచ్చాడు. కపిలుని దర్శనంచేసి కర్దమదేవహూతులను చూచి ఇలా అన్నాడు.

**క. నుతచరితులార! మీరలు, కృతకృత్యులు, విష్ణుపూజఁ గేవలభక్తిన్**
**మతి నిష్కపటులరై చే, సితిరి తదర్చన ఫలంబు సేకుఱె మీకున్. 840**

**ప్రతి :** నుతచరితులార= స్తోత్రార్హమైన చరిత్రగల దంపతులారా!; మీరలు= మీరిద్దరు; కృతకృత్యులు= కృతార్థులు, ధన్యులు; కేవలభక్తిన్= నిజమైన భక్తితో; మతి నిష్కపటులరు+ఐ= మదిలో కపటంలేని వారై; విష్ణుపూజన్= విష్ణుపూజను; చేసితిరి= చేశారు; మీకున్= మీకు; తద్+అర్చనఫలంబు= ఆ పూజకు తగినఫలం; చేకుఱెన్= లభించింది.

**తా :** స్తోత్రార్హమైన చరిత్రగల ఓ దంపతులారా! మీరిద్దరు కృతార్థులయ్యారు. నిజమైన భక్తితో మదిలో కపటం లేకుండా విష్ణుపూజ చేశారు. ఆ పూజకు తగిన ఫలం మీకు చేకూరింది.

**క. శ్రిత భయహరణుఁడు, మునిజన, నుత చరితుఁడు, పరుఁడు, మీ మనోరథసిద్ధిన్**
**వితతంబుగఁ గావించుటఁ, జతురత మీ జన్మ మింక సఫలతఁ బొందెన్. 841**

**ప్రతి :** శ్రిత= ఆశ్రయించినవారి; భయ= భయాన్ని; హరణుఁడు= పోగొట్టేవాడు; మునిజన= మునులచే; నుత= స్తుతింపబడే; చరితుఁడు= చరిత్రకలవాడు; పరుఁడు= పరమాత్ముడు; మీ; మనోరథసిద్ధిన్= కోరిక నెరవేరటం; వితతంబుగన్= చక్కగా; కావించుటన్= చేయుటవలన; చతురత= నేర్పుగా; మీజన్మము; ఇంక; సఫలతన్+పొందెన్= సార్థకతను పొందింది.

**తా :** ఆశ్రయించినవారి భయాన్ని పోగొట్టేవాడు, మునులచే స్తుతింపబడేవాడు, పరమాత్ముడు అయిన భగవంతుడు మీ కోర్కెను చక్కగా నెరవేర్చినాడు. మీ జన్మసార్థకమైంది.

**క. వినుఁడు సకాములునై హరి, ననుపమభక్తిన్ భజించునదె ముక్తికిఁ జా**
**లును, మీ పుణ్యం బే మని, కొనియాడఁగ వచ్చు నీతికోవిదులారా! 842**

**ప్రతి :** నీతికోవిదులారా= నీతియందు ఆరితేరిన దంపతులారా!; వినుఁడు= వినండి; సకాములును+ఐ= ఇచ్ఛగలవారై; అనుపమభక్తిన్= సాటిలేని భక్తితో; హరిన్= శ్రీహరిని; భజించు+అదె= పూజించటమే; ముక్తికిన్= మోక్షానికి; చాలును; మీ పుణ్యంబు; ఏమని; కొనియాడఁగన్వచ్చున్= పొగడవచ్చును

**తా :** నీతి పారంగతులైన దంపతులారా! వినండి. ఇచ్ఛతో, అద్వితీయమైన భక్తితో శ్రీహరిని పూజిస్తే ఆ పూజే మోక్షసంపాదనకు సరిపోతుంది. మీపుణ్యాన్ని ఏమని పొగడగలను?

**వ. అని వెండియుం గర్దమునిం గనుంగొని యిట్లను, "భవదీయ తనూభవలం బ్రకటశీలవ్రతాచార సంపన్నులైన మునివరేణ్యులకుం బెండ్లిసేయు, మట్లయిన వారివలనం బ్రజాసృష్టి బహువిధంబుల వృద్ధిం బొందు"నని చెప్పి మఱియు నిట్లనియె. 843**

**ప్రతి :** అని= అనిచెప్పి; వెండియున్= మరల; కర్దమునిన్+కనుంగొని= కర్దముని చూచి; ఇట్లు+అనున్= బ్రహ్మ ఇలా అన్నాడు; భవదీయ= నీ; తనూభవలన్= కొమార్తెలను; ప్రకట= పేరొందిన; శీలవ్రత+ఆచార సంపన్నులు+ఐన= మంచినడవడి, వ్రతానుష్ఠానము, సదాచారాలతో కూడిన; మునివరేణ్యులకున్= మునిశ్రేష్ఠులకు; పెండ్లి+చేయుము= ఇచ్చి వివాహాలు చెయ్యి; అట్లు+అయినన్= అలా అయితే; వారివలనన్= వారివల్ల; ప్రజాసృష్టి= ప్రజలను సృజించడం; బహువిధంబులన్= అనేకవిధాలుగా; వృద్ధిన్+పొందును= అభివృద్ధి పొందుతుంది; అని చెప్పి; మఱియును; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అని చెప్పి మళ్ళీ కర్దముని చూచి బ్రహ్మ ఇలా అన్నాడు. "మునీంద్రా! నీ పుత్రికలను పేరొందిన ఉత్తమ స్వభావులూ, సదాచారసంపన్నులూ అయిన మునిశ్రేష్ఠులకు ఇచ్చి వివాహం చెయ్యి. అలా అయితే వారివల్ల బిడ్డలను సృజించడం అనేక విధాలుగా అభివృద్ధి పొందుతుంది". అని చెప్పి మళ్ళీ ఇలా అన్నాడు.

**చ. అనఘ! భవత్సుతుండు సముదంచిత తేజుఁడు నైన యిమ్మహా**
**త్మునిఁ బరమేశు నీశు నజితున్ నళినాక్షు నమేయు నచ్యుతున్**
**ఘనుని ననంతు నాద్యు నవికారుని నక్షరుఁగాఁ దలంపు, మీ**
**ఘనుఁడు సమస్త చేతన నికాయహృదీప్సితదాయి గావునన్. 844**

**ప్రతి :** అనఘ= ఓ పుణ్యాత్ముడా!; ఈ ఘనుఁడు= ఈ గొప్పవాడు; సమస్త చేతన నికాయ= సకల ప్రాణుల సముదాయము యొక్క; హృత్= హృదయాలలోని; ఈప్సితదాయి= కోరికలను నెరవేర్చేవాడు; కావునన్= అందువల్ల; భవత్+సుతుండు=

నీకుమారుడు; సమ్+ఉదంచితతేజుఁడున్+ఐన= మహాతేజోవిరాజితుడు అయిన; ఈ+మహాత్మునిన్= ఈ మహాత్ముని; పరమ+ఈశున్= పరమేశ్వరుడుగా; ఈశున్= ఈశుడుగా (ప్రభువుగా); అజితున్= జయింపబడనివాడుగా; నలిన+అక్షున్= తామరలవంటి కనులుగల పురుషోత్తముడుగా; అమేయున్= పరిమితిలేనివాడుగా; అచ్యుతున్= జారుపాటులేనివాడుగా; ఘనునిన్= గొప్పవాడుగా; అనంతున్= అంతంలేనివాడుగా; ఆద్యున్= మొదటివాడుగా; అవికారునిన్= ఎలాంటి మార్పులు లేనివాడుగా; అక్షరున్+కాన్= శాశ్వతుడుగా; తలంపుము= స్మరించుము, భావింపుము.

**తా :** ఓ పుణ్యాత్ముడవైన కర్దమా! ఈ ఘనుడు సమస్త ప్రాణుల హృదయాలలోని కోరికలను నెరవేర్చేవాడు కావున ఘనుడైన ఈ నీ కుమారుడు మహాతేజోవిరాజితుడు. ఈ మహాత్ముని పరమేశ్వరుడుగా, ప్రభువుగా, జయింపరానివాడుగా, నలినాక్షుడైన పురుషోత్తముడుగా, పరిమితిలేనివాడుగా, చ్యుతి లేనివాడుగా, గొప్పవాడుగా, అంతంలేనివాడుగా, మొదటివాడుగా, షడ్విధ పరిణామములు లేనివాడుగా, శాశ్వతుడుగా తలంచు.

**విశే :** శ్రీహరి దేవహూతీ కర్దములకు కపిలనామధేయంతో పుట్టిన విషయం కర్దమునికి తెలుసు. తాను పుడుతున్న విషయం శ్రీహరి కర్దమునికి స్వయంగానే చెప్పాడు. అయినా బ్రహ్మదేవుడు మరల ఈ విషయం కర్దమునికి చెప్పి ఆ పుట్టినది శ్రీహరి అంశతో ఉన్న కపిలుడని తెలిపాడు. ఆయనను ఆద్యంతాలులేని అచ్యుతుడైన మహాపురుషుడుగా భావించుమన్నాడు.

అజిత, అమేయ, అచ్యుత, అనంత, ఆద్య, అవికార, అక్షర మొదలైన పదాలన్నీ విష్ణువును తెలిపేవే. 'అచ్యుత' అనేమాట శ్రీకృష్ణునికి రూఢిగా వాడబడేమాట. 'నాస్తిచ్యుతం స్ఖలనం స్వపదా ద్యస్యసః' అని దీని వ్యుత్పత్తి. తన చోటునుండి భ్రంశము పొందనివాడని అర్థం.

**సీ. మానిత జ్ఞాన విజ్ఞాన యోగంబులు నను నుపాయంబుల నొనరఁ జేసి**
**యలవుమైఁ గర్మజీవుల నుద్ధరించుటకొఱకు నమ్మహితాత్మకుఁడు సమగ్ర**
**హాటకరుచి జటాజూటుండు నుత్ఫుల్ల పంకజనేత్రుండు పద్మపత్ర**
**హల కులిశాంకుశ లలిత రేఖాంకిత చరణతలుండును సత్త్వగుణుఁడు**

**తే. నగుచు నిప్పుడు సరసీరుహాక్షి, నీదు, గర్భమం దుదయించెను ఘనుఁడు, నీకుఁ**
**దత్త్వబోధంబుఁ గావించుఁ, దావకీన, హృదయ సంగత సంశయ మెల్లఁ బాపు. 845**

**ప్రతి :** సరసీరుహ+అక్షి= పద్మాలను పోలిన కన్నులుగల దేవహూతీ!; మానిత= ఆదరణీయమైన; జ్ఞాన, విజ్ఞాన యోగంబులు+అను= జ్ఞానము, విజ్ఞానము అను యోగాలనే; ఉపాయంబులన్= ఉపాయాలచే; ఒనరన్+చేసి= పొసగజేసి; అలవుమైన్= అభ్యాసపాటవంతో, శ్రమతో; కర్మజీవులన్= కర్మజీవులను; ఉద్ధరించుటకొఱకున్; ఆ+మహిత+ ఆత్మకుఁడు= గొప్పవాడైన ఆ భగవంతుడు; సమగ్ర= సంపూర్ణమైన; హాటకరుచి= బంగారు రంగుగల; జటాజూటుండును= జటాజూటం (వెంట్రుకలముడి) కలవాడూ; ఉత్ఫుల్ల= వికసించిన; పంకజనేత్రుండు= కమలాలవంటి కన్నులుకలవాడూ; లలిత= మనోజ్ఞమైన; పద్మపత్ర, హల, కులిశ+అంకుశ= పద్మదళం, హలం (నాగలి), వజ్రాయుధం, ఏనుగును తోలే ఆయుధం; రేఖా+అంకిత= ఆ రేఖల ముద్రలుగల; చరణతలుండును= అరికాళ్లతో కూడిన వాడునూ; సత్త్వగుణుఁడును= సత్త్వగుణ సంపన్నుడూ; అగుచున్= అయి; ఇప్పుడు; నీదుగర్భము+అందున్= నీ గర్భంలో; ఉదయించెను= జన్మించాడు;

ఘనుఁడు= అలాంటి మహాత్ముడు; నీకున్= నీకు; తత్త్వబోధంబున్+కావించున్= తత్త్వబోధచేస్తాడు; తావకీన= నీ; హృదయసంగత= హృదయంలో చేరిన; సంశయము+ఎల్లన్= సందేహాలన్నీ; పాపున్= పోగొడతాడు.

**తా :** దేవహూతీ! మాననీయమైన జ్ఞానవిజ్ఞాన యోగాలనే ఉపాయాలచే కర్మజీవులను ఉద్ధరించడానికి శ్రీహరి నీ కడుపున పుడతాడు. బంగారురంగు తలవెంట్రుకలు కలవాడు, వికసించిన కమలాలవంటి కన్నులు కలవాడు, మనోజ్ఞమైన పద్మం, హలం, వజ్రాయుధం, అంకుశం రేఖలు గల అరికాళ్లతో కూడినవాడు, సత్త్వగుణసంపన్నుడు అయి ఇప్పుడు నీగర్భంలో ఉదయించిన అలాంటి మహాత్ముడు నీకు తత్త్వబోధచేస్తాడు. నీ మనస్సులోని సందేహాలన్నింటిని పోగొడతాడు.

**విశే :** జ్ఞానమంటే తత్త్వజ్ఞానం. మోక్షవిషయకమైన బుద్ధి. విజ్ఞానమంటే విశేషజ్ఞానం, శాస్త్రసంబంధమైన జ్ఞానం.'తత్త్వం' అనే మాటకు అనేకార్థాలున్నాయి. ఈ మాట వేదాంత పరిభాషలో తరచుగా వినబడే మాట. బ్రహ్మం అనేది ఒక ప్రధానార్థం. ఈ మాటకు అద్వైతులు బ్రహ్మం అని అర్థం చెపితే, ద్వైతులు స్వతంత్రమని అస్వతంత్రమని అర్థం చెప్పారు. చిత్తు, అచిత్తు, ఈశ్వర రూపాలన్నారు విశిష్టాద్వైతులు. ఈ మూడింటి మధ్యగల సంబంధమే వీళ్ల దృష్టిలో తత్త్వజ్ఞానం. తత్త్వబోధ చేయడమంటే ఈ మూడింటిని గురించి వివరించడమే.

**వ. మఱియును. 846**

**ప్రతి :** మఱియును= అంతేకాకుండా.

**క. నుతికెక్కి సిద్ధగణ సే, వితుఁడై ఘనసాంఖ్యయోగ విలసిత తత్త్వ**
**స్థితి నిరతుఁ డగుచుఁ గపిలా, ఖ్యతఁ దనరి చరించు నీ జగత్త్రయ మెల్లన్. 847**

**ప్రతి :** నుతికిన్+ఎక్కి= పేరుపొంది; సిద్ధగణసేవితుఁడు+ఐ= సిద్ధపురుషులచే సేవింపబడినవాడై; ఘన= మహనీయమైన; సాంఖ్యయోగ విలసిత= సాంఖ్యయోగంతో ప్రకాశించే; తత్త్వస్థితి నిరతుఁడు+అగుచున్= పరతత్త్వమందు సుస్థిరుడై; కపిల+ఆఖ్యతన్+తనరి= కపిలుడు అనే పేరుతో ప్రసిద్ధుడై; ఈ జగత్+త్రయము+ఎల్లన్= ఈ మూడులోకాలలోనూ; చరించున్= సంచరిస్తాడు.

**తా :** మీరు కన్న ఇతడు పేరుపొందినవాడై, సిద్ధపురుషులచే సేవింపబడుతూ, మహనీయమైన సాంఖ్యయోగంతో విరాజిల్లే పరతత్త్వమందు సుస్థిరుడై, కపిలుడనే పేరుతో ప్రసిద్ధుడై ఈ మూడులోకాలలోనూ సంచరిస్తాడు.

**విశే :** అణిమాది సిద్ధిగలవారు సిద్ధులు. అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వం, వశిత్వం – ఇవి ఎనిమిదీ అణిమాదులు. సాధారణవ్యక్తులకు లేని అతీంద్రియశక్తులు గలవారు సిద్ధులు. ఈ సిద్ధులు ఐదురకాలని పతంజలియోగశాస్త్రంలో చెప్పబడింది. పూర్వజన్మలో సాధనవల్ల కలిగేవి, దేవతలకు జన్మచేతనే కలిగేవి జన్మసిద్ధులు. కొన్ని మంత్రాలవల్ల కలిగేవి మంత్రసిద్ధులు. తపస్సులవల్ల కలిగే సిద్ధులు నాలుగోరకం. సమాధిస్థితివల్ల కలిగేవి సమాధిసిద్ధులు. మానవులలో కూడా ఇలాంటి సిద్ధులు కలవారు కొందరు కనపడుతూ ఉంటారు. నవనాథసిద్ధులు ఇలాంటివాళ్లే. సిద్ధపురుషులచేత సేవింపబడడంవల్ల కపిలుడు దైవస్వరూపుడనే విషయం విదితమవుతూ ఉంది.

సాంఖ్యయోగం – సంఖ్యతో కూడినది సాంఖ్యయోగం. సాంఖ్యమంటే జ్ఞానం. జ్ఞానవిచారణలో అనాత్మవస్తువులను లెక్కించునపుడు సంఖ్యను ఆశ్రయించవలసి వస్తుంది కనుక అది సాంఖ్యమనబడింది. ప్రకృతి యందుగల 24 తత్త్వాలను,

లేక 96 తత్త్వాలను లెస్సగా శోధించి, అవి అనాత్మరూపాలని త్యజించి వాటికి సాక్షిగా ఉన్న పరమాత్మను గ్రహించుటే సాంఖ్యవిద్య. ఆత్మానాత్మవివేక రూపమగు విజ్ఞానమే సాంఖ్యం. సాంఖ్యవేదాంత తత్త్వపద్ధతిని నెలకొల్పినవాడు కపిలుడు. ఇతడు విష్ణ్వంశతో జన్మించినవాడు.

**క. అని పలికి య మ్మరీచిం, గని యుద్వాహార్థ మునిచి కమలజుఁ డంతం**
**దన నందను లగు నారద, సనకాదులఁ గూడి యాత్మ సదనము కరిగెన్. 848**

**ప్రతి :** అని పలికి= కపిలుని గురించి అలాచెప్పి; ఆ+మరీచిన్+కని= మరీచి మహర్షిని చూచి; ఉద్వాహ+అర్థము= వివాహనిమిత్తం; ఉనిచి= అక్కడే నిలిపి; కమలజుఁడు= పద్మయోనియైన బ్రహ్మదేవుడు; అంతన్= వెంటనే; తననందనులు+ అగు= తన కుమారులైన; నారదసనకాదులన్+కూడి= నారదుడు, సనకుడు మొదలైనవారితో కలసి; ఆత్మసదనముకున్+ అరిగెన్= తన భవనానికి వెళ్లాడు.

**తా :** అలా కపిలుని గురించి చెప్పి, వివాహనిమిత్తం మరీచిమహర్షిని అక్కడే ఉండమని బ్రహ్మదేవుడు తన కుమారులైన నారదుడు సనకుడు మొదలైన వారితో కలసి తన నివాసస్థానానికి వెళ్లాడు.

**వ. అంత నా కర్దముండు గమలసంభవచోదితుం డగుచుఁ యథోచితంబుగా నాత్మీయ దుహితల వివాహంబు సేయందలంచి మరీచికిం గళయను కన్యకను, నత్రికి ననసూయను, నంగిరసునకు శ్రద్ధను, బులస్త్యునకు హవిర్భువును, బులహునకు గతినిఁ, గ్రతువునకుఁ గ్రియను, భృగునకు ఖ్యాతిని, వసిష్ఠునకు నరుంధతిని, నథర్వునకు శాంతినింగా నిజకులాచారసరణిం బరిణయంబు గావించిన వారును గృతదారపరిగ్రహులును, గర్దమ కృతసంభావనా సంభావితులును నగుచు నతనిచేత ననుజ్ఞాతులై జాయాసహితు లగుచు నిజాశ్రమ భూములకుం జనిరి. అనంతరంబు కర్దముండు దేవోత్తముండగు విష్ణుండు దన మందిరంబున నవతరించి వసించియుంటం దన చిత్తంబున నెఱింగి వివిక్త స్థలంబునకుం జని యచ్చటఁ గపిలునికి వందనం బాచరించి యిట్లనియె. 849**

**ప్రతి :** అంతన్= బ్రహ్మదేవుడు వెళ్లినతరువాత; ఆ కర్దముండు; కమలసంభవచోదితుండు+అగుచున్= కమలంనుండి పుట్టిన బ్రహ్మదేవునిచే ఆజ్ఞాపింపబడినవాడై; యథా+ఉచితంబుగాన్= యోగ్యతకు తగినట్లుగా; ఆత్మీయ= తన; దుహితల= కుమార్తెల; వివాహంబు+చేయన్+తలంచి= పెండ్లిండ్లు చేయాలనుకొని; మరీచికిన్= మరీచిమహర్షికి; కళ+అనుకన్యకను= కళ అనే పేరుగల కన్యను; అత్రికిన్= అత్రిమహర్షికి; అనసూయను= అనసూయ అనే కన్యను; అంగిరసునకున్= అంగిరసమహర్షికి; శ్రద్ధను= శ్రద్ధ అనే కన్యను; పులస్త్యునకున్= పులస్త్యమహర్షికి; హవిర్భువును= హవిర్భువు అనే కన్యను; పులహునకున్= పులహమహర్షికి; గతినిన్= గతి అనే కన్యను; క్రతువునకున్= క్రతువు అనే మహర్షికి; క్రియను= క్రియ అనే కన్యను; భృగువునకున్= భృగుమహర్షికి; ఖ్యాతిని= ఖ్యాతి అనే కన్యను; వశిష్ఠునకున్= వశిష్ఠమహర్షికి; అరుంధతినిన్= అరుంధతిని; అధర్వునకున్= అధర్వునకు; శాంతినిన్+కాన్= శాంతి అనే కన్యనుగా; నిజకుల+ఆచారసరణిన్= తన కులాచార ప్రకారం; పరిణయంబు+కావించినన్= వివాహాలు చేయగా; వారును= ఆ మహర్షులు; కృతదారపరిగ్రహులు= భార్యలను గ్రహించినవారు; కర్దమకృత= కర్దమునిచే ఒసగబడిన; సంభావనా సంభావితులును= కానుకలతో గౌరవింపబడినవారు; అగుచున్= అవుతూ; అతనిచేతన్+అనుజ్ఞాతులు+ఐ= ఆయనచే అనుమతింపబడినవారై;

జాయాసహితులు+అగుచున్= భార్యలతో కలసి; నిజ+ఆశ్రమభూములకున్= తమ తమ ఆశ్రమ ప్రదేశాలకు; చనిరి= వెళ్లారు; అనంతరంబు= తరువాత; కర్దముండు; దేవ+ఉత్తముండు+అగు= దేవతలలో ఉత్తముడైన; విష్ణుండు; తనమందిరంబునన్= తన గృహంలో; అవతరించి= పుట్టి; వసించి+ఉంటన్= పెరుగుతూ ఉన్న విషయం; తన చిత్తంబునన్= తన మనస్సులో; ఎఱింగి= తెలుసుకొని; వివిక్త స్థలంబునకున్+చని= ఏకాంత ప్రదేశానికి వెళ్లి; అచ్చటన్= అక్కడ; కపిలునికి; వందనంబు+ఆచరించి= నమస్కరించి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు...

**తా :** బ్రహ్మదేవుడు వెళ్లినతరువాత కర్దముడు బ్రహ్మదేవుని ఆజ్ఞానుసారం తన యోగ్యతకు తగినట్లుగా తన కుమార్తెలకు పెండ్లిండ్లు చేయాలని నిర్ణయించాడు. తన కుమార్తెలలో కళను మరీచిమహర్షికి, అనసూయను అత్రిమహర్షికి, శ్రద్ధను అంగిరసమహర్షికి, హవిర్భువును పులస్త్యమహర్షికి, గతిని పులహమహర్షికి, క్రియను క్రతువు అనే మహర్షికి, ఖ్యాతిని భృగుమహర్షికి, అరుంధతిని వశిష్ఠమహర్షికి, శాంతిని అథర్వుడు అనే మహర్షికి ఇచ్చి తన కులాచారం ప్రకారం తన తొమ్మండుగురు కొమార్తెల పెండిండ్లు యథావిధిగా జరిపించాడు. ఆ తొమ్మండుగురు మహర్షులు భార్యలను గ్రహించి, కర్దముడు సమర్పించిన కానుకలను అందుకొని ఆయన అనుమతితో భార్యలతో కలసి తమతమ ఆశ్రమ ప్రాంతాలకు వెళ్లారు. తరువాత కర్దముడు దేవాధిదేవుడైన విష్ణువు తన గృహంలో పుట్టి పెరుగుతూ ఉన్న విషయం తెలుసుకొన్నాడు. ఏకాంత ప్రదేశానికి వెళ్లి అక్కడ కపిలావతారంలో ఉన్న శ్రీహరికి నమస్కరించి ఇలా అన్నాడు.

**సీ. చతురాత్మ! విను మాత్మకృతము లైనట్టి యమంగళ భూత కర్మంబు లనెడి**
**దావాగ్ని శిఖలచే దందహ్యమానులై నట్టి జీవులు దుదముట్ట లేక**
**పాయక సంసారబద్ధులై యుందురు బహుళ కాలమ్మిట్లు పరఁగుచుండ**
**సకల దేవతలు బ్రసన్నత నొందఁగ బహుజన్మ పరిచయ ప్రాప్తయోగ**

**తే. చిరసమాధి తపోనిష్ఠచే వివిక్త, దేశముల యోగిజనములు ధృతుల నే మ**
**హానుభావు విలోకింతు రట్టి దివ్య, పురుషరత్నంబ నా యింటఁ బుట్టి తీవు. 850**

**ప్రతి :** చతుర+ఆత్మ= ప్రజ్ఞగలమహాత్మా!; వినుము; ఆత్మకృతములు+ఐనట్టి= తాము చేసినటువంటి; అమంగళభూత కర్మంబులు+అనెడి= అశుభకరాలైన పనులు అనే; దావాగ్ని శిఖలచేన్= కార్చిచ్చు జ్వాలలచే; దందహ్యమానులు+ఐనట్టి= మిక్కిలి దహింపబడుతున్నవారైన; జీవులు= ప్రాణులందరూ; తుదముట్టన్+లేక= పూర్తిగా బైటపడలేక; పాయక= మానక; సంసారబద్ధులు+ఐ= సంసారబంధాలలో బంధింపబడినవారై; ఉందురు; బహుళకాలమ్ము= ఎంతోకాలం; ఇట్లు= ఇలా; పరఁగుచున్+ఉండన్= గడచిపోతూ ఉండగా; సకలదేవతలు= దేవతలందరు; ప్రసన్నతన్+ఒందగన్= ప్రసన్నులుకాగా; బహుజన్మ= అనేక జన్మలలో; పరిచయప్రాప్త= పరిచయంవల్ల ప్రాప్తించిన; యోగచిరసమాధి= దీర్ఘమైనయోగ సమాధికి చెందిన; తపోనిష్ఠచేన్= తపోనిష్ఠతో; వివిక్తదేశములన్= ఒంటరి ప్రదేశాలలో; యోగి జనములు= యోగీశ్వరులు; ధృతులన్= ధైర్యాలతో; ఏ మహా+అనుభావున్= ఏ మహానుభావుని; విలోకింతురు= దర్శిస్తారో; అట్టి= అటువంటి; దివ్య పురుషరత్నంబు+అ= పరమ పురుషరత్నమా!; ఈవు= నీవు; నా ఇంటన్= నా గృహంలో; పుట్టితి= జన్మించావు.

**తా :** ప్రజ్ఞగల ఓ మహాత్మా! వినండి. తాముచేసిన అశుభకరాలైన పనులు అనే కార్చిచ్చు మంటల్లో ఎక్కువగా దహింపబడుతున్నవారైన ప్రాణులందరూ పూర్తిగా బయటపడలేక ఎడతెగని సంసారబంధాలలో బంధింపబడినవారై

ఉంటారు. ఎంతోకాలం ఇలా గడచిపోతూ ఉంది. సకలదేవతల అనుగ్రహంవల్ల, అనేక జన్మలలో ఏర్పడిన పరిచయంవల్ల ప్రాప్తించిన దీర్ఘమైన సమాధియోగముయొక్క, తపోనిష్ఠతో ఒంటరి ప్రదేశాలలో యోగీశ్వరులు ధైర్యంతో ఏమరక ఏ మహానుభావుని దర్శిస్తారో అటువంటి దివ్యపురుషరత్నమైన దేవాధిదేవా! నీవు నా గృహంలో జన్మించావు.

**వ. మఱియు సంసారచక్ర పరిభ్రామ్యమాణుల మగుచు గ్రామ్యుల మయిన మా వర్తనంబులను గణింపక మదీయ గృహంబునం బూర్వంబునం బ్రతిశ్రుతంబు లయిన భవదీయ వాక్యంబులు దప్పకుండ ననుగ్రహింప నుదయించి తని వెండియు నిట్లనియె. 851**

**ప్రతి :** మఱియున్, సంసారచక్ర= సంసారచక్రంలో; పరిభ్రామ్యమాణులము+అగుచున్= గిరగిర తిప్పబడుతున్న వారమవుతూ; గ్రామ్యులము+అయిన= పామరులమైన; మావర్తనంబులను= మాప్రవర్తనలను; గణింపక= లెక్కించక; మదీయ గృహంబునన్= మా ఇంటిలో; పూర్వంబునన్= మొదట; ప్రతిశ్రుతంబులు+అయిన= ప్రతిజ్ఞచేయబడినవైన; భవదీయవాక్యంబులు= నీ మాటలను; తప్పకుండన్= విడువకుండా; అనుగ్రహింపన్= అనుగ్రహించడానికి; ఉదయించితి+ అని= పుట్టితివని; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు...

**తా :** సంసారచక్రంలో నిలువనీక గిరగిర తిప్పబడుతూ పామరులుగా ఉన్న మాప్రవర్తనలను లెక్కించకుండా మొదట ప్రతిజ్ఞచేయబడినవైన నీ మాటలను తప్పకుండా మమ్ము అనుగ్రహించటానికి మా ఇంటిలో పుట్టావని చెప్పి కర్దముడు మళ్ళీ ఇలా అన్నాడు.

**విశే :** పై వచనంలోని విషయం కర్దముడు కపిలావతారంలో ఉన్న శ్రీహరికి చెప్పినది. 'ప్రతిశ్రుతంబులయిన భవదీయవాక్యంబులు' ముందెప్పుడో శ్రీహరి కర్దమునికి చెప్పినవి. తరువాత జరగబోయే విషయాన్ని శ్రీహరి ఆనాడు కర్దమునికి చెప్పాడు. ఆ విషయం తప్పకుండా జరిగి తీరాలి కనుక ఆ విషయాన్ని వ్యక్తం చేసిన మాటలు ప్రతిజ్ఞాపూర్వకంగా చెప్పినవే. ఈ స్కంధంలోనే 759వ వచనంలో శ్రీహరి కర్దమునికి ఇలా చెప్పాడు. "స్వయంభువమనువు తన కూతురు దేవహూతిని తోడ్కొని నీ ఆశ్రమానికి వచ్చి ఆమెతో నీకు వివాహం జరిపిస్తాడు. ఆమె ద్వారా నీకు తొమ్మండుగురు పుత్రికలు పుడతారు. నా ఆజ్ఞానుసారం నీవు చేసే సమస్తకార్యాలు నాకే సమర్పిస్తూ ఉండు. నాలోనే లోకాలన్నీ ఉన్నాయని, నీలో నేనున్నానని తెలుసుకొని నన్ను ఆరాధిస్తూ ఉండు. చివర నీవు నా సన్నిధికి చేరగలవు. నీ తేజస్సువల్ల నేను నీ భార్య కడుపులో ప్రవేశించి నా కళాంశతో నీకు కుమారుడనై జన్మిస్తాను" అని చెప్పినమాట శ్రీహరి తప్పకుండా ఈనాడు నెరవేర్చాడు. ఈ విషయాన్ని కర్దముడు భక్తితో తలచుకొంటున్నాడు.

**క. తలపోయఁగ నప్రాకృత, బలయుక్త చతుర్భుజాది భవదవతారం**
**బులు నీ కనురూపములై, పొలుపొందుం గాదె పరమపురుష! మహాత్మా! 852**

**ప్రతి :** పరమపురుష= పురుషోత్తముడా!; మహా+ఆత్మా!= మహానుభావా!; తలపోయఁగన్= ఆలోచించగా; అప్రాకృత= ప్రకృతి సంబంధంకాని; బలయుక్త= బలంతో కూడిన; చతుస్+భుజ+ఆది= నాల్గుభుజాలు మొదలైనవిగల; భవత్+ అవతారంబులు= నీ అవతారాలు; నీకు; అనురూపములు+ఐ= తగినవై; పొలుపొందున్+కాదు+ఏ= అలరాలుతూ ఉన్నాయి కాదా!

**తా :** ఓ పరమపురుషా! మహాత్మా! ప్రకృతికి సంబంధించని బలంతోకూడిన నాల్గుబాహువులు మొదలైనవిగల నీ అవతారాలు నీకు తగినవైనవిగా అలరాలుతూ ఉన్నాయి.

**విశే :** చతుర్భుజుడంటే నాలుగు చేతులు గలవాడైన శ్రీమహావిష్ణువు. మూలమూర్తి అయిన శ్రీమన్నారాయణుడు. నిత్యవిభూతికి చెందిన శ్రీవైకుంఠంలో నిత్యులకు, ముక్తులకు దర్శనం ప్రసాదిస్తూ ఉంటాడు. వివిధ ప్రయోజనాలకోసం మూలమూర్తి అనేక అవతారాలు ధరిస్తూ వచ్చినప్పుడు ఒక్కొక్క అవతారానికి ఒక్కొక్క ప్రత్యేకత కనిపిస్తూ ఉంటుంది. ఆయా కాలాలు కూడా వేరువేరు ధర్మాలతో కూడి ఉంటాయి. అవతారమూర్తులందరూ లీలా విభూతికి చెందినవారు. ఒక్కొక్క అవతారమూర్తి ఏయే లోకధర్మ రక్షణకోసం వచ్చాడో ఆయన ఆ ధర్మాన్ని రక్షించడంకోసం అనేక కార్యాలు చేపట్టవలసి వస్తుంది. అవతార ధర్మాన్ని కూడా మరుగు పరచవలసి వస్తుంది. అవతారకాలంలో అవసరం ఏర్పడినప్పుడు మూలమూర్తి స్వరూపాన్ని గ్రహించినపుడు చతుర్భుజాలు గోచరిస్తాయి. దీనికి శ్రీకృష్ణావతారం మంచి ఉదాహరణం. మూలమూర్తికున్న చతుర్భుజాలు ఆవతారమూర్తులకు కూడా అనురూపాలుగా ఒప్పారుతూ ఉంటాయి. శ్రీహరిని స్తుతించడంలో భాగంగా కర్దముడు చెప్పిన విషయమిది.

**వ. అదియునుం గాక. 853**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేగాక.

**క. అనయము భవదీయాశ్రిత, జన సంరక్షణముకొఱకు సమ్మతితోఁ దా**
**ల్చిన మానవ రూపంబులు, ననురూపము లగును గాదె హరి! నీ కెపుడున్. 854**

**ప్రతి :** హరి= నారాయణా!; అనయము= ఎల్లప్పుడు; భవదీయ+ఆశ్రిత= నీవారై నిన్నాశ్రయించిన; జన= జనులయొక్క; సంరక్షణముకొఱకున్= రక్షించడంకోసం; సమ్మతితోన్= అంగీకారంతో; తాల్చిన= ధరించిన; మానవరూపంబులు= మనుష్యరూపాలు; నీకు+ఎపుడున్= నీ కెప్పుడూ; అనురూపములు+అగును+కాదు+ఎ= అనుగుణమైన ఆకారాలే అవుతాయి కదా!

**తా :** ఓ శ్రీహరీ! అనవరతమూ నిన్ను ఆశ్రయించే ఆర్తజనరక్షణకోసం అంగీకారంతో నీవు ధరించే మానవరూపాలు నీ కెప్పుడూ అనుగుణమైన రూపాలే అవుతాయికదా!

**క. సుమహిత తత్త్వజ్ఞానా, ర్థము విద్వజ్జనగణంబు దవిలి నమస్కా**
**రము లోలిఁ జేయు పదపీ, ఠము గల నినుఁ బొగడ వశమె! ఠవణిల్లంగన్. 855**

**ప్రతి :** సుమహిత= గొప్పదైన; తత్త్వజ్ఞాన+అర్థము= తత్త్వాల నిజస్వరూపాన్ని గురించిన జ్ఞానంకోసం; విద్వత్+జనగణంబులు= అనుభవజ్ఞానుల సమూహం; తవిలి= ప్రయత్నించి; నమస్కారములు+ఓలిన్+చేయు= క్రమంగా నమస్కారాలు చేసే; పదపీఠము+కల= పాదపీఠంగల; నినున్= నిన్ను; పొగడన్= స్తుతించడానికి; ఠవణిల్లంగన్= వివరించడానికి; వశము+ఎ= సాధ్యమా?

**తా :** గొప్ప తత్త్వాల నిజస్వరూపాన్ని గురించిన జ్ఞానంకోసం అనుభవజ్ఞానులు ప్రయత్నపూర్వకంగా నమస్కరించే పాదపీఠంగల నిన్ను స్తుతించడానికి, నిన్ను గురించి వివరించడానికి ఎవరికి శక్యం?

**సీ. సమధిక షడ్గుణైశ్వర్య కారణుఁడవు పరమేశ్వరుండవు, ప్రకృతి పురుష**
**మహదహంకార తన్మాత్ర తత్క్షోభక హేతు కాలాత్మ విఖ్యాత ధృతివి,**

జగదాత్మకుఁడవు చిచ్ఛక్తివి నాత్మీయ జఠర నిక్షిప్త విశ్వప్రపంచ
మును గల సర్వజ్ఞ మూర్తివి, స్వచ్ఛంద శక్తియుక్తుండవు, సర్వసాక్షి

**తే.** వగుచుఁ గపిలాఖ్యఁ దనరారు నట్టి నీకు, ననఘ! మ్రొక్కెదఁ, బుత్త్రుండ వగుచు నీవు
నాకుఁ బుట్టిన కతన ఋణత్రయంబు, వలనఁ బాసితి, నిఁక భక్తవరద! నేను. **856**

**ప్రతి :** భక్తవరద= భక్తులకు వరములిచ్చువాడా!; సమధిక= అపారమైన; షడ్గుణ+ఐశ్వర్య= జ్ఞానబలాదులు ఆరువిధాలైన ఐశ్వర్యాలకు; కారణుఁడవు= హేతు భూతుడైనవాడవు; పరమ+ఈశ్వరుండవు= ఈశ్వరులకు ఈశ్వరుడవు; ప్రకృతిపురుష= ప్రకృతి, పురుషుడు; మహత్+అహంకార= మహత్తత్త్వం, అహంకారతత్త్వం; తత్+మాత్ర= శబ్దస్పర్శరూప రసగంధాలు; తత్క్షోభక= మహత్తత్త్వం యొక్క సామ్యస్థితిని క్షోభింప జేసే అహంకార తత్త్వానికి; హేతు= కారణమైన; కాల+ఆత్మ= కాలస్వరూపుడనే; విఖ్యాత ధృతివి= ప్రసిద్ధమైన పట్టుగొమ్మవు; జగత్+ఆత్మకుఁడవు= ప్రపంచం స్వ స్వరూపమైన వాడవు; చిత్+శక్తిని= జ్ఞాన స్వరూపుడవు; జఠరనిక్షిప్త= ఉదరంలో ఉంచుకొన్న; విశ్వప్రపంచమునుగల= సమస్త ప్రపంచాన్ని కలిగినట్టి; సర్వజ్ఞమూర్తివి= సర్వమూ తెలిసినవాడవు; స్వచ్ఛంద= స్వతంత్రమైన; శక్తియుక్తుండవు= శక్తితో కూడినవాడవు; సర్వసాక్షివి= అన్నిటికీ సాక్షీభూతుడవు; అగుచున్= అవుతూ; కపిల+ఆఖ్యన్= కపిలుడు అనే పేరుతో; తనరారునట్టి= ఒప్పునట్టి; నీకున్= నీకు; అనఘ= పుణ్యుడా!; మ్రొక్కెదన్= నమస్కరిస్తున్నాను; నీవు; నాకున్= నాకు; పుత్త్రుండవు+అగుచున్= కుమారుడవై; పుట్టిన కతనన్= జన్మించిన కారణంగా; ఇఁక= ఇంక; ఋణత్రయంబువలనన్= దేవ ఋషి మానవ ఋణాలనుండి; పాసితిన్= విముక్తి పొందాను.

**తా :** భక్తవరదా! అపారమైన షడ్గుణాలైన జ్ఞానబల ఐశ్వర్యవీర్య తేజశ్శక్తులకు నీవు కారణభూతుడవు. పరమేశ్వరుడవు. ప్రకృతి పురుషుడు, మహత్తత్త్వం, అహంకారత్తత్త్వం, పంచతన్మాత్రలు నీవే. వీటిని క్షోభింప చేయడానికి కారణమైన కాలస్వరూపం కూడా నీవే. అంతేకాదు ఈ అన్నింటికీ నీవు ప్రసిద్ధమైన పట్టుగొమ్మవు. ప్రపంచమే నీ స్వరూపం. నీవే జ్ఞాన స్వరూపుడవు. పొట్టలో సర్వప్రపంచాన్ని ఉంచుకొన్న సర్వజ్ఞుడవు. స్వతంత్రమైన శక్తితో కూడినవాడవు. సర్వసాక్షివి. అటువంటి నీవు 'కపిలుడు' అనే పేరుతో ప్రకాశిస్తున్నావు. ఓ మహానుభావా! నీకు నమస్కరిస్తున్నాను. నీవు నాకు కొడుకుగా పుట్టడంవల్ల నేను దేవ ఋషి పితృఋణాల నుండి విముక్తి పొందాను.

**విశే :** జ్ఞానబలైశ్వర్యాదులు భగవంతుని షడ్గుణాలు. ఈ గుణాలే భగవంతుని ఐశ్వర్యాలుకూడా. ఈ గుణాలన్నీ ప్రకృతిలో ఉన్నవే. అయితే ఇవి ముందు శ్రీహరివి. ఆయన నుండి లోకానికి ప్రసరించినవి. ప్రకృతిలోని సమస్త ఐశ్వర్యం భగవంతునిదే. 'భగం' అంటే ఐశ్వర్యం. అది కలవాడు భగవంతుడు. ఇవి షడ్గుణాలు. ఇవన్నీ ప్రకృతిలో ఉన్నా ఏ ప్రాణిలోనూ సమగ్రంగా ఉండవు. కొన్నిగుణాలు లోపించే ఉంటాయి. ఇవి సమగ్రంగా ఉండేది భగవంతునిలోనే. అందుకే ఆయన 'సమధిక షడ్గుణైశ్వర్యవంతుడు'. ఐశ్వర్యం, వైరాగ్యం, యశస్సు, పరిపూర్ణజ్ఞానం, వీర్యం, తేజస్సులు షడ్గుణైశ్వర్యాలని కొందరు చెపుతారు. ఇవన్నీ కలిస్తే భగవత్ స్వరూపం ఏర్పడుతుంది. ప్రకృతికి ప్రధానమని మరొకపేరు. ప్రధానమే భగవంతుని శరీరం. ప్రకృతిని నియమించే పురుషుడు కూడా పరమాత్మయే. అహంకారం ఈశ్వరరూపం. ప్రధానమైన ప్రకృతిని అహంకారం క్షోభింపజేస్తుంది. జ్ఞాన స్వరూపుడు కాబట్టి భగవంతుడు సమస్త ప్రపంచాన్ని తనలో ఉంచుకొని ప్రకృతి క్షోభలను నియమిస్తూ ఉంటాడు.

**ఋణత్రయం –** మనిషికి పుట్టుకతోనే మూడు ఋణాలు ఉంటాయని శాస్త్రవచనం. ఇవి మూడు.

**1. ఋషిఋణం –** మానవాళి శ్రేయస్సుకోసం శాస్త్రాది గ్రంథాలను ప్రసాదించిన ఋషులఋణం అధ్యయనంవల్ల అధ్యాపనంవల్ల తర్పణాదులవల్ల తీరుతుంది.

**2. దేవఋణం –** దేవతలు మనకు చేసే అనేక ఉపకారాలవల్ల ఏర్పడే ఋణమిది. ఇది యజ్ఞయాగాదుల నిర్వహణవల్ల తీరుతుంది.

**3. పితృ (మానవ) ఋణం –** జన్మనిచ్చి పెంచి పెద్దచేసిన తల్లిదండ్రులకు సేవ చేయడంవల్ల, సంతానాన్ని కని వంశం కొనసాగడానికి దోహదపడినందువల్ల ఈ ఋణం తీరుతుంది.

**తే. మానితవ్రత యోగసమాధి నియతిఁ, జెంది భవదీయ పాదారవింద యుగము**
**డెందమునఁ జేర్చి శోకంబులందుఁ దొలఁగి, సంచరించెద నంచితస్థలములందు. 857**

**ప్రతి :** మానిత= ఉత్తమమైన; వ్రత= వ్రతాలు; యోగ= యోగాలు; వీటితో ఏర్పడిన; సమాధి= సమాధిస్థితిలో; నియతిన్+ చెంది= నిలుకడ కలవాడినై; భవదీయ= నీ; పాద+అరవిందయుగము= చరణపద్మాల జంటను; డెందమునన్+చేర్చి= మనస్సులో నిలుపుకొని; శోకంబులందున్= దుఃఖాలనుండి; తొలఁగి= విడివడినవాడినై; అంచితస్థలముల+అందున్= ప్రసిద్ధ తీర్థాలలో; సంచరించెదన్= సంచారం చేస్తాను.

**తా :** ఉత్తమమైన వ్రతాలు, యోగాలు – వీటితో ఏర్పడిన సమాధిస్థితిలో నిలుకడ కలవాడినై, నీ పాదాలను మనస్సులో నిలుపుకొని శోకాలను దూరం చేసుకొని ప్రసిద్ధ తీర్థాలలో సంచరిస్తాను.

**క. అని యిట్లు విన్నవించిన, మునిపుంగవుఁ డైన కర్దముని వచనంబుల్**
**విని భగవంతుం డగు న, య్యనఘుఁడు గపిలుండు పలికె నర్మిలి దోఁపన్. 858**

**ప్రతి :** అని; ఇట్లు; విన్నవించిన= మనవి చేసిన; మునిపుంగవుఁడు+ఐన= మునిశ్రేష్ఠుడైన; కర్దముని; వచనంబుల్= మాటలు; విని; భగవంతుండు+అగు= భగవంతుడైన; ఆ+అనఘుఁడు= ఆ పుణ్యాత్ముడు; కపిలుండు= కపిలుడు; అర్మిలి+ తోఁపన్= ప్రీతితో గోచరింపగా; పలికెన్= మాట్లాడినాడు.

**తా :** ప్రసిద్ధ తీర్థాలలో సంచరిస్తానని మనవి చేశాడు కర్దముడు. ఆయన మాటలు విని భగవంతుడు, మహాత్ముడు అయిన కపిలుడు ప్రీతితో ఇలా చెప్పాడు.

**సీ. నా చేతఁ బూర్వంబునం బ్రతిశ్రుతమైన వచనముల్ దప్పక వరమునీంద్ర!**
**నీ యింటఁ బుట్టితి, నిర్హేతుకస్థితి భూరిదయా గుణంబున నవాప్త**
**సకలకాముఁడ, నేను సన్మునివేషంబు ధరియించుటెల్ల నాకొఱకుఁ గాదు,**
**విను మహాత్మకులైన మునులకుఁ బరమాత్మ, గురు సద్వివేకంబు నరసి చూపు**

**తే. తత్త్వబోధంబుకొఱకును దాల్పఁబడిన, యంచిత వ్యక్తమార్గ మైనట్టి దేహ**
**మని తలంపుము, మత్పదధ్యాన భక్తి, ధీపరాయణ మహిమంబు దేజరిల్ల. 859**

**ప్రతి :** వరముని+ఇంద్ర= మునిశ్రేష్ఠుడవైన కర్దమా!; నాచేతన్= నా వల్ల; పూర్వంబునన్= మునుపు; ప్రతిశ్రుతము+ఐన= వినిపింపబడినవైన; వచనముల్= మాటలను; తప్పక= అతిక్రమించకుండా; నిర్+హేతుకస్థితిన్= కారణం లేకుండానే, అవ్యాజంగానే; భూరిదయాగుణంబునన్= గొప్ప దయాగుణంచేత; నీఇంటన్+పుట్టితిన్= నీ గృహంలో జన్మించాను; అవాప్త= పొందిన; సకలకాముఁడన్= సమస్తమైన కోరికలు కలవాడను; నేను; సత్+మునివేషంబున్= మంచి తపసివేషాన్ని; ధరించుట+ఎల్లన్= ధరించడమంతా; నా కొఱకున్+కాదు= నా కోసం కాదు; విను= ఆలకించు; మహా+ఆత్మకులు+ఐన= మహాత్ములైన; మునులకున్= తాపసులకు; పరమాత్మ= పరమాత్మునకు సంబంధించిన; గురు= గొప్పదైన; సత్+వివేకంబున్= పరమవివేకాన్ని; అరసి చూపు= వివరణాత్మకంగా చూపే; తత్త్వబోధంబుకొఱకును= అధ్యాత్మజ్ఞానంకోసం; తాల్పఁబడిన= ధరించిన; అంచిత= పూజార్హమైన; వ్యక్తమార్గము+ఐన+అట్టి= తెలియ బడిన మార్గమైనట్టి; దేహము+అని= శరీరమని; తలంపుము= ఆలోచించు (తెలుసుకో); మత్+పదధ్యాన= నా పాదాలను ధ్యానించడం; భక్తి= నా యెడల భక్తి; ధీపరాయణ మహిమంబున్= బుద్ధివికాసంతో కూడిన మహత్తు; తేజరిల్లన్= విరాజిల్లగా.

**తా :** కర్దమ మునిశ్రేష్ఠా! నేను నీకు ముందు చెప్పిన ప్రతిజ్ఞాపూర్వకమైన మాటలను అతిక్రమించకుండా కారణం లేకుండానే గొప్ప దయతో నీ గృహంలో జన్మించాను. అవాప్త కాముడనైన నాకు కోరికలంటూ ఏవీ లేవు. నేనీ మునివేషం ధరించడం నాకోసం కాదు. చెపుతాను విను. మహాత్ములైన మునులకు పరమాత్మ సంబంధమైన గొప్ప పరమవివేకాన్ని వివరణాత్మకంగా తెలియజేసే తత్త్వబోధ చేయడంకోసం పవిత్రమైన వ్యక్తమార్గంగా ధరించిన శరీరమిది అని తెలుసుకో. భక్తితో నాపాదాలను ధ్యానించు. మహిమతో విరాజిల్లే నీ బుద్ధిని నాయందు లగ్నంచెయ్యి.

**క. సమధిక నిష్ఠం గృతయో, గమునన్ సన్న్యస్త సకల కర్ముఁడవై మో**
**హముఁ బాసి భక్తిచే మో, క్షముకై భజియింపు నను వికారరహితుఁడై, 860**

**ప్రతి :** సమధికనిష్ఠన్= అధికమైన నిలకడతో; కృతయోగమునన్= సాధింపబడినయోగంతో; సన్న్యస్త= వదలిపెట్టబడిన; సకలకర్ముఁడవు+ఐ= సమస్త కర్మలుకలవాడవై; మోహమున్+పాసి= అజ్ఞానాన్ని విడిచి; భక్తిచేన్= భక్తితో; మోక్షముకై= ముక్తికోసం; వికారరహితుఁడు+ఐ= ఏ వికారాలు లేనివాడవై; ననున్= నన్ను; భజియింపు= సేవించు.

**తా :** నీవు అధికమైన నిష్ఠకలవాడవై యోగమార్గాన్ని అనుసరించు. సమస్త కర్మలను నాకే వదలిపెట్టు. మోహాన్ని విడిచిపెట్టు. ముక్తికోసం భక్తితో నన్ను సేవించు.

**క. ననుఁ బరమేశుఁ బరంజ్యో, తిని ననఘు ననంతు దేవదేవు సకలభూ**
**తనికాయ గుహాశయు నా, ద్యుని నజు నాద్యంతశూన్యు దురితవిదూరున్. 861**

**ప్రతి :** ననున్= నన్ను; పరమ+ఈశున్= పరమేశ్వరుని; పరంజ్యోతినిన్= పరంజ్యోతిని; అనఘున్= పుణ్యాత్ముని; అనంతున్= అంతం లేనివానిని; దేవదేవున్= దేవాదిదేవుని; సకలభూత నికాయ= సమస్త ప్రాణుల సమూహంయొక్క; గుహాశయున్= హృదయ గుహలలో (హృదయాంతరాలలో); నివసించువానిని; ఆద్యునిన్= మొదటివానిని; అజున్= జన్మరహితుని; ఆది+అంత శూన్యున్= మొదలు చివరలేనివానిని; దురితవిదూరున్= పాపాలకు దవ్వైన వానిని...

**తా :** పరమేశ్వరుడు, పరంజ్యోతి, అనఘుడు, అనంతుడు, దేవదేవుడు సకలప్రాణుల హృదయాలలో ఉండేవాడు, ఆద్యుడు, అజుడు, ఆద్యంతశూన్యుడు, దురిత విదూరుడు అయిన నన్ను –

**క. తిరముగ భవదీయాంతః, కరణ సరోజాత కర్ణికాతలమున సు**
**స్థిరుఁ జేసి యింద్రియంబుల, నిరసించి మనోఽంబకమున నెఱిఁ గను మనఘా! 862**

**ప్రతి :** అనఘా= పుణ్యాత్ముడా!; తిరముగన్= స్థిరంగా; భవదీయ+అంతఃకరణ= నీ మనస్సు అనే; సరస్+జాత= పద్మంయొక్క; కర్ణికాతలమునన్= దుద్దుమీద; సుస్థిరున్+చేసి= (నన్ను) కదలకుండా నిలిపి; ఇంద్రియంబులన్= నీ ఇంద్రియాలను; నిరసించి= తిరస్కరించి – అనగా ఇంద్రియాలను జయించి; నెఱిన్= క్రమంగా; మనస్+అంబకమునన్= మనో నేత్రంతో; కనుము= నన్ను దర్శించు.

**తా :** అనఘా! నీ మనస్సు అనే పద్మమధ్యంలో నన్ను (పరమాత్మను – కపిలుని) స్థిరంగా నిలిపి జితేంద్రియుడవై క్రమంగా మనోనేత్రంతో నన్ను దర్శించు.

**వ. అట్లేని. 863**

**ప్రతి :** అట్లు+ఏని= అలా చేస్తే

**క. తనరిన మోక్షము నొందెద, వని పలికినఁ గర్దముండు నమ్మునికులచం**
**ద్రుని వలగొని వందనములు, ఘనముగ నతిభక్తిఁ జేసి కౌతుక మలరన్. 864**

**ప్రతి :** తనరిన= ఒప్పిదమైన; మోక్షమున్+ఒందెదవు= ముక్తిని పొందెదవు; అని; పలికినన్= చెప్పగా; కర్దముండున్= కర్దమముని కూడా; ఆ+మునికులచంద్రునిన్= ఆ మునికులానికి చంద్రుడైన (మునికుల తిలకుడైన) కపిలుని; వలగొని= ప్రదక్షిణంచేసి; ఘనముగన్= గొప్పగా; అతిభక్తిన్= మిక్కిలి భక్తితో; వందనములు+చేసి= నమస్కారాలు సమర్పించి; కౌతుకము+అలరన్= ఉత్కంఠ అతిశయిల్లగా.

**తా :** జితేంద్రియుడవై క్రమంగా నన్ను నీ మనోనేత్రంతో దర్శిస్తూ ఉంటే ముక్తిని పొందగలవని కపిలుడు కర్దమునికి చెప్పాడు. కర్దముడు ఆ మునికుల తిలకుడైన కపిలునికి ప్రదక్షిణం చేసి మిక్కిలి భక్తితో నమస్కారాలు సమర్పించాడు. ఎంతో ఉత్సుకత కలవాడైనాడు.

**క. మునిగణ సేవిత మగు వన, మునకుం జని యందు మౌనమున నిస్సంగుం**
**డును వహ్నిరహితుఁ డనికే, తనుఁడై యాత్మైక శరణ తత్పరుఁ డగుచున్. 865**

**ప్రతి :** మునిగణసేవితము+అగు= మునుల సముదాయంచే సేవింపబడినదైన; వనమునకున్+చని= అడవికి వెళ్లి; అందున్= ఆ అడవిలో; మౌనమునన్= మౌనంతో (మాట్లాడకుండా); నిస్+సంగుఁడును= లోకసంబంధాలను త్యజించినవాడు; వహ్నిరహితుఁడు= అగ్నిలేనివాడు అనగా హోమాది అగ్నికార్యాలు విడిచినవాడు; అనికేతనుఁడు+ఐ= ఇల్లూవాకిలీ లేనివాడు అనగా ఒకచోట నిలువక అంతా తిరుగువాడు అయి; ఆత్మ+ఏక= ఆత్మనే అనగా తనలోని పరమాత్మనే; శరణ తత్పరుఁడు+అగుచున్= శరణుజొచ్చినవాడవుతూ.

**తా :** కర్దముడు మునులు సేవిస్తున్న అరణ్యానికి వెళ్లాడు. అక్కడ మౌనంతో లోకసంబంధాలన్నీ త్యజించాడు. హోమాది అగ్నికార్యాలు విడిచిపెట్టాడు. ఒకచోట నిలువకుండా అంతటా తిరుగుతూ తనలోని పరమాత్మనే శరణుజొచ్చాడు.

**వ. పరబ్రహ్మంబుఁ జిత్తంబున నిల్పి యహంకారంబు విడిచి మమత్వంబు నిరసించి దయాగుణంబునం జేసి సకల భూతంబులందు సమత్వంబు భజియించి శాంత శేముషీగరిష్ఠుం డగుచు నిస్తరంగంబగు వార్ధి చందంబున ధీరుండై నిఖిల ప్రపంచంబును వాసుదేవమయంబుఁగాఁ దలంచుచు భక్తి యోగంబున భాగవతగతిం బొందె నని చెప్పి వెండియు మైత్రేయుండు విదురునిం గనుంగొని కర్దముండు వనంబునకుం జనిన యనంతరంబ మాతృవత్సలుం డయిన కపిలుండు బిందుసరంబున వసియించి యుండ దేవహూతి తత్త్వమార్గాగ్రదర్శకుం డయిన సుతునిం గనుంగొని బ్రహ్మవచనంబులు దలంచుచు నిట్లనియె. 866**

**ప్రతి :** పరబ్రహ్మంబున్= పరబ్రహ్మాన్ని; చిత్తంబునన్+నిల్పి= మనస్సులో నిలుపుకొని; అహంకారంబు విడిచి= నేను అనే భావం వదలిపెట్టి; మమత్వంబు నిరసించి= నాది అనే భావాన్ని విడచి; దయాగుణంబునన్+చేసి= ఇతరుల యెడల దయగలకారణంగా; సకలభూతంబుల+అందున్= సమస్త ప్రాణుల విషయంలో; సమత్వంబు= సమానత్వాన్ని; భజియించి= వహించి, భావించి; శాంతశేముషీ గరిష్ఠుండు+అగుచున్= శాంతియుతమైన బుద్ధితో అధికుడు అవుతూ; నిస్తరంగంబు+అగు= అలలులేని; వార్ధిచందంబునన్= సముద్రంవలె; ధీరుండు+ఐ= చాంచల్యరహితుడై, స్థిరత్వంగలవాడై; నిఖిల= సమస్త; ప్రపంచమును; వాసుదేవమయంబు+కాన్= విష్ణుమయంగా; తలంచుచున్= భావిస్తూ; భక్తియోగంబునన్= భక్తియోగంతో; భాగవతగతిన్+పొందెను+అని= భాగవతులు (విష్ణుభక్తులు) పొందే గతిని అనగా పరమపదాన్ని అందుకొన్నాడని; చెప్పి; వెండియున్= మరల; మైత్రేయుండు= మైత్రేయమహర్షి; విదురునిన్+కనుంగొని= విదురుని చూచి, కర్దముండు; వనంబునకున్+చనిన= అడవికి వెళ్లిన; అనంతరంబు+అ= తరువాత; మాతృవత్సలుండు+అయిన= తల్లిమీద దయగలవాడైన; కపిలుండు; బిందుసరంబునన్= బిందుసరోవరం దగ్గర; వసియించి+ఉండన్= నివసించి ఉండగా; దేవహూతి; తత్త్వమార్గ+అగ్రదర్శకుండు+అయిన= తత్త్వమార్గాన్ని దర్శింప జేసేవాళ్లలో అగ్రగణ్యుడైన; సుతునిన్= కుమారుడైన కపిలుని; కనుంగొని= దర్శించి; బ్రహ్మవచనంబులు= ముందు బ్రహ్మదేవుడు చెప్పిన మాటలు; తలంచుచున్= జ్ఞప్తికి తెచ్చుకొంటూ; ఇట్లు+అనియెన్= ఇలా అన్నది...

**తా :** కర్దముడు మునిజన నివాసయోగ్యమైన అరణ్యానికి వెళ్లాడు. అక్కడ పరబ్రహ్మమునే మనస్సులో నిలుపుకొని నేను నాది అనే భావాన్ని వదలి వేశాడు. దయామయ హృదయంతో సకల ప్రాణులను సమానంగా చూస్తూ ప్రశాంత స్వభావం కలవాడైనాడు. అలలు లేని సముద్రంవలె చాంచల్యరహితుడై సమస్త ప్రపంచాన్నీ వాసుదేవమయంగా భావిస్తూ భక్తియోగంతో విష్ణుభక్తులు పొందే పరమపదాన్ని అందుకొన్నాడు. ఈ విషయం చెప్పిన మైత్రేయమహర్షి విదురునితో ఇంకా ఇలా అన్నాడు "కర్దముడు అడవికి వెళ్లిన తరువాత మాతృవాత్సల్యం కల కపిలుడు బిందుసరోవరం దగ్గర నివసించి ఉండగా దేవహూతి తత్త్వమార్గాన్ని దర్శింపజేయగలవాడైన కుమారుని చూచి ముందు బ్రహ్మ చెప్పిన మాటలు జ్ఞప్తికి తెచ్చుకొంటూ ఇలా అన్నది".

## ✤ దేవహూతి పుత్త్రుఁడైన కపిలాచార్యుని వలన తత్త్వజ్ఞానంబు వడయుట ✤

**క. అసదింద్రియ ఘర్షణమున, వసుమతి నిర్విణ్ణ నగుచు వనరెడి నా కీ**
**యసదృశ మోహ తమో విని, రసనం బనఘాత్మ! యే వెరవున ఘటించున్? 867**

**ప్రతి :** అనఘ+ఆత్మ= పుణ్యాత్మా!; అసత్+ఇంద్రియ ఘర్షణమునన్= దుష్టమార్గాలలో ప్రవర్తించే ఇంద్రియాల పోరాటంచేత, ఒరపిడిచేత; వసుమతిన్= భూమిపై; నిర్విణ్ణను+అగుచున్= ఖిన్నురాలను అవుతూ; వనరెడినాకున్= దుఃఖపడుతున్న నాకు; ఈ అసదృశ= ఈ సాటిలేని; (ఎక్కువైన); మోహతమోవినిరసనంబు= మోహం అనే చీకటియొక్క నాశనం; ఏ వెరవునన్= ఏ ఉపాయంతో; ఘటించున్= ఏర్పడును.

**తా :** ఓ పుణ్యాత్ముడవైన కపిలమునీ! దుర్మార్గాలలో ప్రవర్తిస్తున్న ఇంద్రియాల పోరాటంచేత ఖిన్నురాలనై కుమిలిపోతున్న నాకు ఈ సాటిలేని మోహం అనే చీకటి నశించిపోవడం ఎలా కలుగుతుంది?

**విశే :** ఇంద్రియాలు అసత్తులు. అవి కలిగించే సుఖాలు నిజమైన సుఖాలుగా భ్రాంతిపడుతూ ఉంటారు. సుఖాలను అనుభవించే కొద్దీ ఇంకా అనుభవించాలనే కోరిక కలుగుతూనే ఉంటుంది. ఇంద్రియ సుఖాలను గురించి ఆలోచించడం తోనే ఆయుస్సంతా గడచిపోతుంది. దీనిని గురించి తెలుసుకోలేకపోవడమే మోహం అదే అజ్ఞానం. ఇప్పుడు దేవహూతి ఆ మోహాంధకారాన్ని లేదా ఆ అజ్ఞానాన్ని పోగొట్టుకొనే ఉపాయాన్ని అన్వేషిస్తూ ఉంది.

**క. పటు ఘన నీరంధ్ర తమః, పటల పరీవృత జగత్ప్రపంచమునకు నె**
**క్కటి లోచనమై మహితో, త్కటరుచి వెలుఁగుదువు భానుకైవడి ననఘా! 868**

**ప్రతి :** అనఘా= పుణ్యాత్ముడా!; పటు= ధృఢమైన; ఘన= అధికమైన; నీరంధ్ర= నిబిడమైన, (దట్టమైన, సందులేని); తమస్+పటల= కటిక చీకట్లతో; పరీవృత= ఆవరింపబడిన; జగత్+ప్రపంచమునకున్= మహాప్రపంచానికి; ఎక్కటిలోచనము+ఐ= ఒకేఒక్క నేత్రమై; మహిత+ఉత్కటరుచిన్= గొప్ప తీక్ష్ణమైన కాంతితో; భానుకైవడిన్= సూర్యునివలె; వెలుఁగుదువు= విరాజిల్లుతూ ఉంటావు.

**తా :** పుణ్యాత్ముడవైన కపిలమునీ! దట్టమైన సందులేని కటిక చీకట్లతో ఆవరింపబడిన ఈ మహాప్రపంచానికి నీవు ఒక్కడవే ఒకేఒక్క నేత్రమై తీక్ష్ణమైన కాంతితో సూర్యునివలె విరాజిల్లుతూ ఉంటావు.

**విశే :** చీకటి అజ్ఞానంతో పోల్చబడుతూ ఉంటుంది. చీకటి పోవడానికి వెలుగుకావాలి. అజ్ఞానం పోవడానికి తత్త్వజ్ఞానం కావాలి. ఈ పద్యంలో అజ్ఞానం దేవహూతిది. తత్త్వజ్ఞాన ప్రదాత కపిలముని. ఆమె అజ్ఞానమనే చీకటిని కపిలముని సూర్యునివలె తన వెలుగు అనే జ్ఞానంతో పోగొడతాడని భావం. 'పటు ఘననీరంధ్ర తమః పటల... వెలుఁగుదువు భానుకైవడి' అనేది ఉపమాలంకారాన్వితంగా ఉంది.

**ఉ. భూరి మదీయ మోహతమముం బెడఁబాప సమర్థులన్యు లె**
**వ్వారలు నీవ కాక? నిరవద్య! నిరంజన! నిర్వికార! సం**
**సారలతా లవిత్ర! బుధ సత్తమ! సర్వశరణ్య! ధర్మ వి**
**స్తారక! సర్వలోక శుభదాయక! నిత్యవిభూతి నాయకా! 869**

**ప్రతి :** నిరవద్య= దోషంలేనివాడా; నిరంజన= నిర్మలమైనవాడా; నిర్వికార= వికారం లేనివాడా; సంసారలతా= సంసారమనే తీగకు; లవిత్ర= కొడవలివంటివాడా; బుధసత్తమ= పండిత శ్రేష్ఠుడా!; సర్వశరణ్య= అందరికీ రక్షకమైనవాడా!; ధర్మవిస్తారక= ధర్మాన్ని విస్తరింపజేసేవాడా; సర్వలోక= లోకాలన్నిటికి; శుభదాయక= శుభాలు కలిగించువాడా; నిత్యవిభూతి నాయకా=

నిత్యవిభూతి అయిన వైకుంఠానికి నాయకుడైన వాడా; భూరి= ఎక్కువైన; మదీయ= నాకు సంబంధించిన; మోహతమమున్= అజ్ఞానమనే చీకటిని; పెడఁబాపన్= పోగొట్టుటకు; సమర్థులు= దక్షులు; నీవు కాక= నీవు కాకుండా; అన్యులు+ఎవ్వారలు= ఇతరులు ఎవరున్నారు?

**తా :** దోషంలేనివాడా, నిర్మలమైనవాడా, ఎలాంటి వికారాలు (మార్పులు) లేనివాడా, సంసారమనే తీగకు కొడవలివంటివాడా, పండితవరేణ్యా!, సర్వులకూ శరణ్యమైనవాడా, ధర్మాన్ని విస్తరింపజేసేవాడా!, లోకాలన్నిటికి శుభాలు కలిగించువాడా, నిత్యవిభూతి అయిన వైకుంఠానికి నాయకుడైనవాడా ఓ కపిలమునీ! నా మోహమనే చీకటిని పోగొట్టడానికి సమర్థులు నీవు కాక అన్యులెవరున్నారు? లేరు.

**విశే :** పై పద్యంలోగల నిరవద్య, నిరంజనాది పదాలన్నీ శ్రీహరి స్వభావాన్ని తెలిపేవే. శ్రీహరిని గుర్తుచేసే ఈ పదాలు కపిలముని స్వభావాన్ని చెప్పడానికి కూడా వాడబడ్డాయి కాబట్టి ఆయన శ్రీమన్నారాయణుని మరొక అవతారమని అర్థమవుతుంది. దేవహూతి కపిలుని కేవలం తన కుమారుడని అనుకోవడం లేదు. సాక్షాత్తు భగవంతుడుగానే భావించి అలా స్తుతించింది. నిత్య= శాశ్వతమైన; విభూతి= ఐశ్వర్యం. లౌకిక జగత్తులో ఐశ్వర్యంగాని సంపదగాని ఎప్పటికీ శాశ్వతం కాదు. ఎవరూ ఎప్పుడూ ఐశ్వర్య వంతులు కారు. దేశాన్ని పాలించే రాజులుకూడా బతినంతకాలం ఐశ్వర్యంతో ఉంటారని చెప్పడానికి వీలుగాదు. శ్రీహరి షడ్గుణాలలో ఎప్పుడూ ఐశ్వర్యం కలిగి ఉండడం ఒక గుణం. ఆయన వైకుంఠనాయకుడు కాబట్టి, ఆయనతో లక్ష్మి అనపాయినిగా ఉంటుంది కాబట్టి వైకుంఠం నిత్య ఐశ్వర్యయుక్తంగా ఉంటుంది. అయితే ఈ ఐశ్వర్యం లౌకికం కాదు. అలౌకికం. అక్కడికి చేరుకొన్న నిత్యసూరులు, ముక్తులు స్వామివారి దివ్యమంగళ రూపాన్ని దర్శిస్తూ అనవరతం ఆనందిస్తూ ఉంటారు. అందుకే వైకుంఠాన్ని నిత్యవిభూతి అని వైష్ణవులు విశ్వసిస్తారు.

**చ. నిను శరణంబు సొచ్చెద ననింద్యతపోనిధి! నన్నుఁ గావవే**
**యని తను దేవహూతి వినయంబున సన్నుతిసేసి వేఁడఁగా**
**ననుపమ సత్కృపాకలితుఁడై కపిలుం డనురాగ మొప్ప స**
**జ్జన నిచయాపవర్గ ఫలసాధనమై తగు తల్లి వాక్యముల్. 870**

**ప్రతి :** నినున్= నిన్ను (కపిలుని); శరణంబున్+చొచ్చెదన్= శరణువేడుతున్నాను, రక్షకుడుగా ఆశ్రయిస్తున్నాను; అనింద్యతపస్+నిధి= దోషంలేని తపస్సుకు నిధివంటివాడా; నన్నున్+కావవు+ఏ= నన్నుకాపాడు; అని; తనున్= తనను (ఆయనను); దేవహూతి; వినయంబునన్= నమ్రంగా, విధేయురాలై; సన్నుతి+చేసి= స్తుతించి; వేఁడగాన్= ప్రార్థించగా; అనుపమ= సాటిలేని; సత్+కృపాకలితుఁడు+ఐ= దయతో కూడినవాడై; కపిలుండు= కపిలముని; అనురాగము+ఒప్పన్= ప్రేమ తొణికిసలాడుతుండగా; సత్+జననిచయ= సజ్జనుల గుంపుయొక్క; అపవర్గ ఫలసాధనము+ఐ= మోక్షం అనే ఫలాన్ని సాధించడానికి; తగు= యోగ్యమైన; తల్లివాక్యముల్= అమ్మమాటలను...

**తా :** 'ఓ నిష్కళంకమైన తపస్సుకు నిధివంటివాడా కపిలమునీ! నిన్ను శరణువేడుతున్నాను. నన్ను కాపాడు' అని దేవహూతి వినయంగా స్తుతించి కపిలుని ప్రార్థించింది. ఆయన సాటిలేని దయతో కారుణ్యం తొణికిసలాడుతుండగా సజ్జనులకు మోక్షం అనే ఫలాన్ని ఇవ్వడానికి తగిన తల్లిమాటలను ఆలకించాడు.

**విశే :** జీవిత క్లేశాలు అనుభవించే వాళ్లకు తన్నివారకమైన మోక్షేచ్ఛ తీవ్రంగా ఏర్పడుతుంది. దేవహూతి ఇప్పుడు మోక్షానికి సాధనమైన తత్త్వజ్ఞానాన్ని కపిలుని వద్ద తెలుసుకోవాలనుకొంటున్నది. తదనుగుణమైన మాటలే మాట్లాడింది. కపిలునికి

ఆమె ముందే శరణాగతి చేసింది. ఆమె దృష్టిలో ఆయన భగవంతుడే. తత్త్వజ్ఞానం పొందాలనుకొనేవాళ్లకు శరణాగతి చేయడమే మొదటి మెట్టు. ఆమె మాట్లాడిన మాటలు సజ్జనులకందరికి మోక్షమార్గాన్ని చూపగలవిగా అనిపించాయి కపిలునికి. ఆమె తెలుసుకోగోరిన విషయాలను వివరిస్తే ఆ వివరణలు ఆమెకేగాక మోక్షకాములందరికి కూడా బాగా ఉపయోగ పడతాయని పించింది. అందువల్లనే తల్లిమాటలను ఎంతో శ్రద్ధగా విన్నాడు.

**క. విని మందస్మిత లలితా, నన కమలుం డగుచు నెమ్మనమునఁ బ్రమోదం**
**బనయంబుఁ గడలుకొన నిజ, జననికి నిట్లనియెఁ బరమశాంతుం డగుచున్. 871**

**ప్రతి :** విని= దేవహూతి మాటలు విని; మందస్మిత= చిరునవ్వుచే; లలిత+ఆననకమలుండు+అగుచున్= సుందరమైన వదనారవిందం కలవాడై; నెఱ+మనమునన్= నిండు మనస్సులో; ప్రమోదంబు= సంతోషం; అనయంబున్= ఎక్కువగా; కడలుకొనన్= అతిశయించగా; పరమశాంతుండు+అగుచున్= పరమశాంతుడవుతూ; నిజ జననికిన్= తన కన్నతల్లితో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** మాటలు విని కపిలముని మందహాస సుందరవదనారవిందుడై మనస్సులో సంతోషం అతిశయించగా, పరమశాంతుడై తన కన్నతల్లితో ఇలా అన్నాడు.

**క. విను జీవుని చిత్తము దా, ఘన భవబంధాపవర్గ కారణ, మది యే**
**చినఁ ద్రిగుణాసక్తం బయి, నను సంసృతి బంధకారణం బగు, మఱియున్. 872**

**ప్రతి :** జీవుని చిత్తము= ప్రాణి మనస్సు; తాన్= అది; ఘన= గొప్పదైన; భవబంధ+అపవర్గకారణము= సంసారబంధానికి, మోక్షానికి కారణమైంది; అది= ఆ మనస్సు; ఏచినన్= అతిశయిస్తే; త్రిగుణ+ఆసక్తంబయినను= సత్త్వరజస్తమస్సులు అనే మూడుగుణాలతో సంబంధం కలదైతే; సంసృతి= సంసారమనే; బంధకారణంబు+అగున్= బంధానికి హేతువవుతుంది; మఱియున్= ఇంకా.

**తా :** అమ్మా! గొప్పవైన సంసారబంధానికి, మోక్షానికి మానవుని మనస్సే కారణం. ఆ మనస్సు అతిశయించి సత్త్వరజస్తమస్సులనే మూడు గుణాలతో సంబంధం కలదైతే సంసారబంధానికి హేతువవుతుంది.

**విశే :** అపవర్గమంటే మోక్షము. దుఃఖాదులను వర్జించడం మోక్షం. మోక్షస్థితిలో దుఃఖాదులుండవు. సంసారంలో పడడం బంధం. సంసారం నుండి విడివడడం మోక్షం. ఒకటి సంకల్పం. మరొకటి వికల్పం. రెంటికీ మనస్సే కారణం. సంసారంలో ఉంటూనే అందులో మునిగిపోకుండా 'పద్మపత్రమివాంభసా' అన్నట్లు ఉండేవారు ఉంటారు. తామరాకు మీద ఉన్న నీటి బిందువు ఆకుకు తగలకుండా స్వతంత్రంగా ఎలా ఉండ గలుగుతుందో అలా ఉండేవాడే నిజమైన యోగి.

దృశ్య ప్రపంచమంతా త్రిగుణాలతోనే కూడి ఉంటుంది. త్రిగుణాలు అశాశ్వతాలు. వీటితో సంబంధం పెట్టుకొంటే మనిషి బంధాలలో చిక్కుకొంటాడు. ఆత్మ ఒక్కటే త్రిగుణాతీతం, సర్వోత్తమం. భగవద్గీత (2-45) త్రిగుణాలను త్యజించి సుఖదుఃఖాది ద్వంద్వాలు లేనివాడవు కమ్మని ప్రబోధించింది.

**తే. అదియు నారాయణాసక్త మయ్యె నేని, మోక్షకారణ మగు నని మునికులాబ్ధి**
**చంద్రుఁ దన నొప్పు కపిలుండు జననితోడ, నర్థి వినఁ జెప్పి మఱియు నిట్లనియెఁ బ్రీతి. 873**

**ప్రతి :** అదియున్= ఆ మనస్సు; నారాయణ+ఆసక్తము+అయ్యెన్+ఏని= నారాయణునియందు లంకె గలదైతే; మోక్షకారణము+అగును+అని= ముక్తికి కారణం అవుతుందని; మునికుల+అబ్ధి= మునికులం అనే సముద్రానికి; చంద్రుఁడు+అనన్+ఒప్పు= చంద్రుడన్నట్లు ప్రకాశించే; కపిలుండు; జననితోడన్= తల్లితో; అర్థి వినన్+చెప్పి= శ్రద్ధగా వినగా చెప్పి; ప్రీతిన్= సంతోషంతో; మఱియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఆ మనస్సు శ్రీమన్నారాయణునిమీద సంసక్తమైనపుడు మోక్షానికి కారణమవుతుంది. అని మునికులం అనే సముద్రానికి చంద్రుడుగా ప్రకాశించే కపిలముని తల్లికి చెప్పి మళ్లీ సంతోషంతో ఇలా అన్నాడు.

**వ. మఱియుఁ జిత్తం బహంకార మమకార రూపాభిమాన జాతంబులగు కామలోభాది కలుషవ్రాతంబుల చేత నెప్పుడు విముక్తంబై పరిశుద్ధం బగు నప్పుడు సుఖదుఃఖ వివర్జితంబు నేకరూపంబునై ప్రకృతికంటెఁ బరుండును బరమపురుషుండును నిర్భేద్యుండును స్వయంజ్యోతియు సూక్ష్మస్వరూపుండును నితర వస్త్వంత రాపరిచ్ఛిన్నుండును నుదాసీనుండును నైన పరమాత్మునిం దన్మయంబును హతౌజస్కంబునునైన ప్రపంచంబును జ్ఞాన వైరాగ్య భక్తి యుక్తంబగు మనంబుచేఁ బొడగాంచి యోగిజనులు పరతత్త్వ సిద్ధికొఱకు నిఖిలాత్మకుండైన నారాయణునందు సంయుజ్యమానంబయిన భక్తిభావంబువలన నుదయించిన మార్గంబునకు నితర మార్గంబులు సరి గావండ్రు; విద్వాంసులు సంగం బింద్రియార్థాద్యసద్విషయంబుగ నొనరింపంబడి జీవునకు నశిథిలంబగు బంధంబునకుఁ గారణం బగుననియు, నదియె సద్విషయంబైన నంతఃకరణ సంయమన హేతుభూతం బగుచు సాధుజనులకు ననర్గళ మోక్షద్వారం బగుననియుఁ దెలియుదురు; సహనశీలురును, సమస్త శరీరధారులకు సుహృత్తులును, బరమశాంతులును, గారుణికులునునై మదర్థంబుగాఁ బరిత్యక్త కర్మఫల స్వభావులును విసృష్టస్వజన బంధు జనులును నై మత్పదాశ్రయులును మద్గుణధ్యానపారీణులును మత్కథా ప్రసంగ సంభరిత శ్రవణానందులును నగుచు మదీయ కథల నొడువుచు వినుచు నుండు పరమభాగవతోత్తముల నాధ్యాత్మికాది తాపత్రయంబు దపింపఁజేయంజాల; దట్టి సర్వసంగ వివర్జితులగు పరమభాగవత జనుల సంగం బపేక్షణీయం; బది సకల దోషనివారకం బగు; నట్టి సత్సంగంబున సర్వప్రాణి హృత్కర్ణ రసాయనంబులగు మదీయ కథా ప్రసంగంబులు గలుగు; మద్గుణాకర్ణనంబునంజేసి శీఘ్రంబుగఁ గ్రమంబునం గైవల్య మార్గదంబులగు శ్రద్ధాభక్తు లుదయించు; నదియునుం గాక యే పురుషుండైన నేమి, మద్విరచిత జగత్కల్పనాది విహార చింతచే నుదయించిన భక్తింజేసి యింద్రియ సుఖంబుల వలనను దృష్టశ్రుతంబులైన యైహికాముష్మికంబులవలనను విముక్తుం డగుచుఁ జిత్త గ్రహణార్థంబు ఋజువులైన యోగమార్గంబులచే సంయుక్తుం డగు నట్టి యోగి ప్రకృతి గుణసేవనంబుచేత వైరాగ్య గుణవిజృంభితంబైన జ్ఞానయోగంబుచేతను మదర్పిత భక్తియోగంబుచేతను బ్రత్యగాత్మకుండనైన నన్ను నంతఃకరణ నియుక్తునిం గావించు నని చెప్పిన విని దేవహూతి కపిలున కిట్లనియె. 874**

**ప్రతి :** మఱియున్; చిత్తంబు= మనస్సు; అహంకారమమకార రూప+అభిమాన= నేను నాది అనే అహంకార మమకార రూపమైన ఆత్మభావనవల్ల; జాతంబులు+అగు= పుట్టినవైన; కామలోభ+ఆది= కామం, లోభం మొదలైన;

కలుషవ్రాతంబులచేతన్= దోష సమూహాలచేత; ఎప్పుడు; విముక్తంబు+ఐ= విడివడినదై; పరిశుద్ధంబు+అగున్= మిక్కిలి శుద్ధి పొందుతుందో, మాలిన్యరహితమవుతుందో; అప్పుడు; సుఖ+దుఃఖ+వివర్జితంబును= సుఖదుఃఖాలచే విడువబడినదై; ఏక రూపంబును+ఐ= స్థిరమైనది అయి; ప్రకృతికంటెన్= ప్రకృతికంటె; పరుండును= వేరైనవాడును; పరమపురుషుండును= పరమపురుషుడైన పరమాత్మ; నిర్భేద్యుండును= వేరుగా దర్శింపరానివాడు; స్వయంజ్యోతియున్= స్వయంప్రకాశుడు; సూక్ష్మస్వరూపుడును= సూక్ష్మమైన ఆకారంకలవాడునూ; ఇతర వస్తు+అంతర= ఇతర వస్తువులకంటె భిన్నుడై అపరిచ్ఛిన్నుండును= పుట్టుట, పెరుగుట, నశించుట అను త్రివిధములైన విభాగాలు లేనివాడును; ఉదాసీనుండును= నిరాసక్తుడు; ఐన; పరమాత్మునిన్= పురుషోత్తముని; తన్మయంబును= తాదాత్మ్యాన్ని; హత+ఓజస్కంబును+ఐన= నశించిన ఓజస్సుగల; ప్రపంచంబును= ప్రపంచాన్ని; జ్ఞాన; వైరాగ్య; భక్తి; యుక్తంబు+అగు= జ్ఞానం, విరక్తి, భక్తి – వీటిచే కూడినదైన; మనంబుచేన్= మనస్సుతో; పొడగాంచి= దర్శించి; యోగిజనులు; పరతత్త్వసిద్ధికొఱకున్= మోక్షప్రాప్తికోసం; నిఖిల+ఆత్మకుండు+ఐన= సర్వాంతర్యామి అయిన; నారాయణునందున్; సంయుజ్యమానంబు+అయిన= సమర్పింపబడిన; భక్తిభావంబువలనన్= భక్తిభావంతో; ఉదయించిన= పుట్టిన; మార్గంబునకున్= మార్గానికి; ఇతర మార్గంబులు= భక్తికంటె వేరైన మార్గాలు; సరికావు+అంద్రు= సాటికావని అంటారు; విద్వాంసులు= పండితులు; సంగంబు= సంబంధం; ఇంద్రియ+అర్థ+ఆది+అసత్+విషయంబుగన్= ఇంద్రియార్థాలైన శబ్ద స్పర్శరూపరస గంధాలు మున్నగు చెడ్డవాటి విషయమై; ఒనరింపన్+పడి= చేయబడి; జీవునకున్= ప్రాణికి; అశిథిలంబు+అగు= పట్టు సడలని; బంధంబునకున్= కట్టుబాటునకు; కారణంబు= హేతువు; అగును+అనియున్= అవుతుందని; అది+ఎ= ఆ సంబంధమే; సత్+విషయంబు+ఐన= మంచి విషయంతో కూడినపుడు; అంతఃకరణ= మనస్సుయొక్క; సంయమన హేతుభూతంబు+అగుచున్= సంయమనమునకు కారణమవుతూ; సాధుజనులకున్= సజ్జనులకు; అనర్గళ= తెరచిన (ఆటంకంలేని); మోక్షద్వారంబు= ముక్తితెరువు; అగున్+అనియును= అవుతుందని; తెలియుదురు= తెలుసుకొంటారు; సహనశీలురును= క్షమా స్వభావంకలవారు, ఓర్పుగలవారు; సమస్త శరీరధారులకున్= శరీరధారులైన అందరికీ; సుహృత్తులును= స్నేహితులు; పరమశాంతులును= మిక్కిలి శాంతగుణం కలవారును; కారుణికులును+ఐ= దయగలవారై; మత్+అర్థంబుగాన్= నా కొరకుగా; పరిత్యక్త= విడిచి పెట్టిన; కర్మఫల స్వభావులును= కర్మఫలాలు గలవారు; విసృష్ట= విడువబడిన; స్వజన= తనవారు; బంధుజనులును+ఐ= బంధువులునై; మత్+పద+ఆశ్రయులును= నా పాదాలను ఆశ్రయించినవారు; మత్+గుణ= నా గుణాలను; ధ్యాన పారీణులును= ధ్యానించడంలో పారము ముట్టినవారు; మత్+కథాప్రసంగ సంభరిత= నా కథల వివరణలతో నిండిన విషయాలను; శ్రవణ+ఆనందులును+అగుచున్= వీనులవిందుగా విని ఆనందించే వారవుతూ; మదీయకథలన్= నా కథలను; నొడువుచున్= చెపుతూ; వినుచున్= వింటూ; ఉందు= ఉండే; పరమభాగవత+ఉత్తములన్= గొప్ప విష్ణుభక్తులలో శ్రేష్ఠులను; ఆధ్యాత్మిక+ఆది= ఆధ్యాత్మికం మొదలైన; తాపత్రయంబు= మూడురకాల బాధ; తపింపన్+చేయన్+చాలదు= నొప్పింపలేదు; అట్టి= అలాంటి; సర్వసంగ వివర్జితులు+అగు= సంబంధాలన్నిటిని వదలి పెట్టినవారైన; పరమభాగవతజనుల= పరమభాగవతుల; సంగంబు= సంబంధం; అపేక్షణీయంబు= కోరదగింది; అది= ఆ సంబంధం; సకల= అన్ని; దోషనివారకంబు+అగున్= దోషాలను తొలగించే దవుతుంది; అట్టి; సత్+సంగంబునన్= మంచి సంబంధంతో; సర్వప్రాణి= సర్వప్రాణుల; హృత్+కర్ణ= హృదయాలలో, చెవులలో; రసాయనంబులు+అగు= సుధారసం చిందించే; మదీయ= నా; కథాప్రసంగంబులు= కథాచర్చలు; కలుగున్= కలుగుతాయి; మత్+గుణ+ఆకర్ణనంబునన్+చేసి= నాగుణాలు వినడంవల్ల; క్రమంబునన్= క్రమంగా; శీఘ్రంబుగన్= వేగంగా; కైవల్య= మోక్ష; మార్గదంబులు+అగు= మార్గాలను ప్రసాదించే; శ్రద్ధాభక్తులు; ఉదయించున్= ఉద్భవిస్తాయి; అదియునున్+కాక= అంతేకాక; ఏ పురుషుండు+ఐనన్+ఏమి= ఏ పురుషుడైతేనేమి;

మత్+విరచిత= నాచే కావింపబడిన; జగత్+కల్పన+ఆది= విశ్వసృష్టిమొదలైన; విహారచింతచేన్= లీలావిహారాలను తలపోస్తూ; ఉదయించిన= ప్రభవించిన; భక్తిన్+చేసి= భక్తిచేత; ఇంద్రియ సుఖంబులవలనను= ఇంద్రియ సుఖాలకు; దృష్టశ్రుతంబులు+ఐన= కనిపించేవి, వినిపించేవి అయిన; ఐహిక+ఆముష్మికంబులవలనను= ఇహలోక పరలోక సుఖాలనుండి; విముక్తుండు+అగుచున్= విమోచనం పొందినవాడవుతూ; చిత్త గ్రహణ+అర్థంబు= మనోనిగ్రహము కొరకు; ఋజువులు+ఐన= సూటి అయిన; యోగమార్గంబులచేన్= యోగమార్గాలతో; సంయుక్తుండు+అగునట్టి= కూడినట్టి; యోగి; ప్రకృతి గుణసేవనంబుచేతన్= ప్రకృతి గుణాలను సేవించడంచేత; వైరాగ్యమనే; గుణవిజృంభితంబు+ఐన= గుణాలచే పెంపొందించబడిన; జ్ఞానయోగంబుచేతను; మత్+అర్పిత= నాకు సమర్పితమైన; భక్తియోగంబుచేతను; ప్రత్యగాత్మకుండను+ఐన= ఆత్మ స్వరూపం కలవాడనైన; నన్నున్= నన్ను; అంతఃకరణ నియుక్తునిన్+కావించును= హృదయాంతరంలో నిల్పుకొన్నవానినిగా చేయునని చెప్పగా విని; కపిలునకున్= కపిలమునితో; దేవహూతి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నది.

**తా :** నేను, నాది అనే అహంకారమమకారరూపమైన అభిమానంవల్ల కామం, లోభం మొదలైన దోషసమూహాలు ఆవిర్భవిస్తాయి. చిత్తం వాటికి లోనుగాకుండా విడివడినప్పుడు పరిశుద్ధమవుతుంది. చిత్తం పరిశుద్ధమైనపుడు సుఖం దుఃఖం పొందక ఒకే రూపంగా వెలుగొందుతుంది. ఏకరూపమైన అటువంటి చిత్తంలోనే పరమాత్మ సాక్షాత్కరిస్తాడు. ఆ పరమాత్మ ప్రకృతికంటే అతీతుడు, అభేద్యుడు, స్వయంప్రకాశమానుడు, సూక్ష్మరూపుడు, అపరిచ్ఛిన్నుడు, ఉదాసీనుడు. అటువంటి పరమాత్మను, ఆ పరమాత్మ తేజస్సుముందు నిస్తేజమైన ప్రపంచాన్ని యోగులు భక్తి జ్ఞానవైరాగ్యయుక్తమైన చిత్తంతో దర్శించి మోక్షప్రాప్తికి సర్వాంతర్యామి అయిన శ్రీమన్నారాయణునియందు సమర్పింపబడిన భక్తిమార్గమే ఉత్తమోత్తమమైనదని, ఇతర మార్గాలు దానికి సాటిరావని చెప్పారు.

ఇంద్రియార్థాలైన శబ్ద స్పర్శరూప రసగంధాలతో కూడిన సంబంధం పనికిరాని విషయమై దృఢమైన బంధానికి కారణమవుతుంది. ఆ సంబంధమే భగవంతుని సంబంధమై మంచి విషయమైనపుడు మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం అనే అంతఃకరణాల సంయమనానికి హేతుభూతమై సత్పురుషులకు తెరచిన మోక్షద్వారం అవుతుంది అని తెలుసుకొంటారు. సహన స్వభావం కలిగి అఖిలజీవులకూ స్నేహితులై, శాంతమూర్తులై, కరుణార్ద్రహృదయులై కర్మఫలాలను పరిత్యజించి, తనవారు, బంధువులు అనే అభిమానం విడిచి నా పాదాలను చక్కగా ఆశ్రయించినవారై, నా గుణగణాలను ధ్యానిస్తూ, నా కథల వివరణలతో నిండిన విషయాలను వీనులవిందుగా విని ఆనందిస్తూ, నా కథలనే చెప్పుకొంటూ, వింటూ, ఉండేవారు పరమభాగవతోత్తములు. అటువంటి వారిని ఆధ్యాత్మికం, ఆధిదైవకం, ఆధిభౌతికం అనే తాపత్రయాలు ఏమీ చేయలేవు. అటువంటి సర్వసంగపరిత్యాగులైన పరమభాగవతుల సాంగత్యం మాత్రమే కోరదగింది. ఆ సాంగత్యం సకల దోషాలను నివారిస్తుంది.

అట్టివాళ్ల సాంగత్యంతో సర్వప్రాణుల హృదయాలలో, చెవులలో సుధారసం చిందించే నా కథా చర్చలు వినిపిస్తాయి. నాగుణగానాలు వినడంవల్ల క్రమమార్గంలో శీఘ్రంగా మోక్షమార్గాలను ప్రసాదించే శ్రద్ధాభక్తులు ఉద్భవిస్తాయి. అంతేగాక ఎవడైనా నేను కావించిన ఈ విశ్వసృష్టినీ, నాలీలావిహారాలను తలపోస్తూ అందువలన ప్రభవించిన భక్తిచేత ఇంద్రియసుఖాలకు; కనిపించేవి వినిపించేవి అయిన ఇహలోక పరలోక సుఖాలకు లోనుకాకుండా, మనోనిశ్చలత్వం కోసం చక్కని యోగమార్గాన్ని అవలంబిస్తాడో అతడు యోగి అని చెప్పబడతాడు. అటువంటి యోగి ప్రకృతి గుణాలను సేవించడం వల్లను వైరాగ్యగుణాలను పెంపొందించే జ్ఞానయోగం వల్లను ఆత్మార్పణ రూపమైన భక్తియోగంవల్లను సాక్షాత్కరించుకొన్న ఆత్మస్వరూపంగల నన్ను తన హృదయంలో నిలుపుకొంటాడు అని చెప్పగా విని కపిలమునితో దేవహూతి ఇట్లా అన్నది.

**విశే :** ఇంద్రియాలు మనిషికి కలిగించే సుఖాలు దృష్ట-శ్రుతాలు అని రెండురకాలు – చూడగలిగేవి, వినగలిగేవి. ఐహికం అంటే ఈ లోకానికి సంబంధించిన సుఖాలు దృష్టాలు. ఆముష్మికం అంటే పరలోకం అంటే స్వర్గాది లోకసుఖాలు శ్రుతాలు. స్వయంజ్యోతి – స్వయంగా వెలిగే జ్యోతి. సృష్టిలోని సమస్త పదార్థాలు ఆ జ్యోతివలననే ప్రకాశిస్తాయి. ఆ జ్యోతి లేకుండా వీటికి ప్రకాశముండదు.

**క. ఏ భక్తి భవద్గుణపర, మై భవపాపప్రణాశమై ముక్తి శ్రీ**
**లాభము రయమునఁజేయునొ, యా భక్తి విధంబుఁ దెలియ నానతి యీవే! 875**

**ప్రతి :** ఏ భక్తి; భవత్+గుణపరము+ఐ= నీ గుణగణాలయందు ఆసక్తిగలదై ఉంటుందో; ఏ భక్తి; భవపాప= సాంసారికమైన పాపాలను; ప్రణాశము+ఐ= నశింపజేసేదై; రయమునన్= శీఘ్రంగా; ముక్తిశ్రీలాభము= మోక్షలక్ష్మీప్రాప్తిని; చేయునో= కల్గిస్తుందో; ఆ భక్తి; విధంబున్= ప్రకారమును లేక స్వరూపాన్ని; తెలియన్= తెలిసేటట్లు; ఆనతి+ఈవే= సెలవిమ్ము; దయచేసి చెప్పు.

**తా :** ఏ భక్తి నీగుణగణాలయందు ఆసక్తి కలిగి ఉంటుందో, ఏ భక్తి సాంసారికమైన పాపాలను నశింపజేసి శీఘ్రంగా మోక్షలక్ష్మీప్రాప్తిని కలిగిస్తుందో, ఆ భక్తివిధానం నాకు తెలిసేటట్లు దయచేసి చెప్పు అని దేవహూతి కపిలమునిని అడిగింది.

**విశే :** పరమాత్మను గురించిన అనుభవం యోగంతో లభిస్తుంది. యోగాంగాలలో ప్రధానమైనది భక్తి. భక్తి సత్సంగంతో లభిస్తుంది. ఈ విషయాన్ని దేవహూతి కపిలముని నుండి విన్నది. ఆమెకు భక్తి స్వరూప విశేషాలను సమగ్రంగా తెలుసుకోవాలనే శ్రద్ధకలిగి కపిలుని ప్రశ్నించింది. ప్రశ్న సారాంశమేమిటంటే – ఎలాంటి భక్తి ముక్తిని సాధిస్తుంది? స్త్రీ అయిన ఆమెకు అనుష్ఠించడానికి తగిన భక్తిమార్గం ఏది? అనే విషయం ఆమెకు తెలియాలి. కపిలముని దేవహూతి నెపంగా లోకానికి భక్తి స్వరూపాన్ని గురించి వివరించడానికి ఆమె వేసిన ప్రశ్న ప్రధాన కారణం.

**వ. అదియునుం గాక భవదుదితంబయిన యోగంబును దదంగంబులును తద్గత తత్త్వావబోధంబును ససాకల్యంబుగ మందబుద్ధినైన నాకు స్ఫుటంబుగాఁ దెలియ నానతిమ్మనినఁ గపిలుం డిట్లనియె. 876**

**ప్రతి :** అదియునున్+కాక= అంతే కాకుండా; భవత్+ఉదితంబు+అయిన= నీచే చెప్పబడిన; యోగంబును= యోగవిద్యను; తద్+గత= అందులోగల; తత్త్వ+అవబోధంబును= తత్త్వాల తెలివిని; ససాకల్యంబుగన్= సంపూర్ణంగా; మందబుద్ధిని+ఐన= మందమైన బుద్ధిగల దాననైన నాకు; స్ఫుటంబుగాన్= స్పష్టంగా; తెలియన్= తెలిసేటట్లు; ఆనతి+ఇమ్మనినన్= దయతో చెప్పుమనగా; కపిలుండు= కపిలముని; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అంతేకాకుండా నీచే చెప్పబడిన యోగవిద్యను, అందులోని విభాగాలను, అందులోగల తత్త్వాల ఉపదేశాన్ని సంపూర్ణంగా, మొద్దుబుద్ధిగల నాకు స్పష్టంగా తెలిసేటట్లు దయతో చెప్పుమని దేవహూతి అడుగగా కపిలముని ఇలా అన్నాడు.

**సీ. జనయిత్రి! విను, మఱి సకల పదార్థ పరిజ్ఞాన తత్త్వపారీణ మగుచు**
**నామ్నాయ విహిత కర్మాచారములు గల్గి తివుటమై వర్తించు దేవగణము**

**పూని నైసర్గికంబైన నిర్హేతుక మగు భగవత్సేవ మిగుల ముక్తి**
**కంటె గరిష్ఠంబు, గావున నదియు భుక్తాన్నంబు జీర్ణంబు నందఁజేయు**

**తే. దీప్తజఠరాగ్ని గతి లింగదేహ నాశ, కంబు గావించు, నదియును గాక విష్ణు**
**భక్తి వైభవములఁ దేటపఱతు, వినుము, సద్గుణవ్రాత! యోగలక్షణ సమేత! 877**

**ప్రతి :** జనయిత్రి= మాతా!; సద్గుణవ్రాత= మంచిగుణముల సమూహముగలదానా!; యోగలక్షణ సమేత= యోగలక్షణాలతో కూడిన దానా!; విను= వినుము; మఱి; సకల= సమస్త; పదార్థ= పదార్థాలయొక్క; పరిజ్ఞాన= పరిపూర్ణజ్ఞానంతో కూడిన; తత్త్వపారీణము+అగుచున్= తత్త్వం చక్కగా తెలిసిన దగుచూ; ఆమ్నాయవిహిత= వేదాలకు అనుకూలమైన; కర్మాచారములు= కర్మలయొక్క అనుష్ఠానములు; కల్గి= కలిగి; తివుటమై= శ్రద్ధతో; దేవగణము= దేవతల సమూహం; వర్తించున్= ప్రవర్తిస్తుంది; పూని= ప్రయత్నించి; నైసర్గికంబు+ఐన= సహజమైన; నిర్హేతుకము+అగు= కారణంలేనిదైన; భగవత్+సేవ= భగవంతునికి చేసే పరిచర్య; ముక్తికంటెన్= మోక్షం కంటే; గరిష్ఠంబు= గొప్పది; కావునన్= కాబట్టి; అదియున్= ఆ భగవత్సేవ; భుక్త+అన్నంబు= తిన్న అన్నాన్ని; జీర్ణంబున్+అందన్+చేయు= జీర్ణంచేసే; దీప్తజఠర+అగ్నిగతిన్= ఉదరమందు జ్వలించే అగ్నివలె; లింగదేహ= సూక్ష్మశరీరాన్ని; నాశకంబు+కావించున్= నాశనం చేస్తుంది; అదియును+కాక= అంతేకాక; విష్ణుభక్తి వైభవములన్= విష్ణుభక్తివైభవాలను; తేటపఱతున్= స్పష్టంగా వివరిస్తాను; వినుము.

**తా :** 'మాతా! పలు మంచిగుణాలు గలదానా! యోగలక్షణసమేతా! విను. సమస్త పదార్థాలకు సంబంధించిన పరిపూర్ణజ్ఞానంతో కూడి, తత్త్వం చక్కగా తెలిసి వేదాలలో చెప్పబడిన సకలకర్మలు కలిగి దేవతల సమూహం శ్రద్ధతో ప్రవర్తిస్తుంది. సహజమైన, కారణరహితమైన భగవత్సేవ మోక్షం కంటే గొప్పది. కావున తిన్న అన్నాన్ని జీర్ణంచేసే జఠరాగ్ని వలె ఆ భగవత్సేవ సూక్ష్మశరీరాన్ని నాశనం చేస్తుంది' అని తల్లికి చెప్పి ఇంకా విష్ణుభక్తి వైభవాలను స్పష్టంగా వివరిస్తాను వినుమన్నాడు కపిలముని.

**చ. అమలిన భక్తిఁ గొందఱు మహాత్ములు మచ్చరణారవింద యు**
**గ్మము హృదయంబునన్ నిలిపి కౌతుకులై యితరేతరానులా**
**పముల మదీయదివ్యతను పౌరుషముల్ గొనియాడుచుండి మో**
**క్షము మదిఁ గోర నొల్ల రనిశంబు మదర్పిత సర్వకర్ములై. 878**

**ప్రతి :** కొందఱు మహాత్ములు= కొందరు మహానుభావులు; అమలిన భక్తిన్= నిర్మలమైన భక్తిభావంతో; మత్+చరణ+అరవింద యుగ్మమున్= నా పాదపద్మాల జంటను; హృదయంబునన్= తమ మనస్సులలో; నిలిపి= ఉంచి; కౌతుకులు+ఐ= కుతూహలం గలవారై; ఇతర+ఇతర+అనులాపములన్= పరస్పర సంభాషణలలో; మదీయ దివ్యతను= నా అప్రాకృత శరీరాన్ని; పౌరుషముల్= అతిమానుషములైన కార్యాలను లేదా లీలా విశేషాలను; కొనియాడుచుండి= కీర్తిస్తూ ఉండి; అనిశంబు= సర్వదా; మత్+అర్పిత= నాకు సమర్పించబడిన; సర్వకర్ములు+ఐ= సమస్త కర్మలు కలవారై; మోక్షము; మదిన్= మనస్సులో; కోరన్+ఒల్లరు= వాంఛింపరు.

**తా :** కొందరు మహాత్ములు నిర్మలమైన భక్తిభావంతో నా పాదపద్మాలను తమ హృదయాలలో నిలుపుకొని ఎంతో కుతూహలంతో పరస్పరం సంభాషించుకొంటూ ఆ సంభాషణల్లో నా దివ్యస్వరూపాన్ని, నా క్రియా కలాపాలనూ కీర్తిస్తూ ఉంటారు. వాళ్లు సర్వదా తమ సమస్త కర్మఫలాలను నాకే సమర్పించి భక్తి పరవశులై మోక్షాన్ని కూడా మదిలో కోరరు.

**సీ. పరికింపఁ గొందఱు భాగవతోత్తముల్ ఘనత కెక్కిన పురాతనములైన**
**చారు ప్రసన్న వక్త్రారుణ లోచనములు గల్గి వరదాన కలితములుగఁ**
**దనరు మద్దివ్యావతార వైభవములు మది నొప్పఁ దమయోగమహిమఁ జేసి**
**యనుభవించుచుఁ దదీయాలాపముల సన్నుతించుచుఁ దివుటఁ దద్దివ్యవిలస**

**తే. దవయవోదార సుందర నవ విలాస, మందహాస మనోహర మధుర వచన**
**రచనచే నపహృత మనః ప్రాణు లగుచు, నెలమి నుందురు నిశ్శ్రేయసేచ్ఛ లేక. 879**

**ప్రతి :** పరికింపన్= పరిశీలించగా; కొందరు; భాగవత+ఉత్తముల్= ఉత్తములైన భగవద్భక్తులు; ఘనతకు+ఎక్కిన= ప్రసిద్ధిచెందిన; పురాతనములు+ఐన= ప్రాచీనాలైన; చారు= అందమైన; వక్త్ర= ముఖం; ప్రసన్న= కరుణనిండిన; అరుణలోచనములు= ఎఱ్ఱని కన్నులు; కల్గి= కలిగి; వరదాన కలితములుగన్= వరదానాలు కల్గినవిగా; తనరు= అతిశయించు; మత్+దివ్య+అవతార వైభవములు= నా పవిత్రమైన అవతారాల వైభవ విశేషాలు; మదిన్+ఒప్పన్= మనస్సులో ప్రకాశిపగా; తమ= వాళ్ల; యోగమహిమన్+చేసి= భక్తియోగ మహత్త్వ ప్రభావంతో; అనుభవించుచున్= అనుభవిస్తూ; తదీయ= అప్పటి నా అవతారములయొక్క; ఆలాపములన్= సంలాపాలను; సన్నుతించుచున్= కొనియాడుతూ; తివుటన్= శ్రద్ధతో; తద్+దివ్య= ఆ పవిత్రమైన; విలసత్= శోభించే; అవయవ+ఉదారసుందర= అవయవాల గొప్ప సౌందర్యంతో గూడిన; నవవిలాస= కొత్త లీలలతోనే; మందహాస= చిరునవ్వుతో; మనోహర= మనోహరమైన; మధుర వచనరచనచేన్= తియ్యని మాటలచే; అపహృత= అపహరించబడిన; మనస్+ప్రాణులు+అగుచున్= మనస్సులు, ప్రాణాలు కలవారగుచు; నిశ్శ్రేయస+ఇచ్ఛలేక= మోక్షంమీద అపేక్షలేకుండా; ఎలమిన్+ఉందురు= సంతోషంతో ఉంటారు.

**తా :** పరిశీలిస్తే ఉత్తములైన కొందరు భాగవతులు ప్రసిద్ధి కెక్కిన నా ప్రాచీన అవతారవిశేషాలను స్మరిస్తూ ఉంటారు. అందమైన ముఖం, కరుణనిండిన అరుణనేత్రాలు కలిగి భక్తులకు వరాలు ప్రసాదించే నా పవిత్రమైన అవతారాలనూ, వైభవవిశేషాలను మనస్సులో నిలుపుకొంటారు. తమ భక్తియోగమహత్త్వంవల్ల అప్పటి నా సంలాపాలను స్మరించుకొని కొనియాడుతూ ఉంటారు. నవనవోన్మేషమైన నా అవయవ సౌభాగ్యాన్ని, సుందరమైన నా మందహాసాన్ని, మనోహరాలైన నా మధుర వాక్కులనూ మననం చేసుకొంటూ, మనస్సును ప్రాణాన్ని లెక్కచేయకుండా మోక్షంమీద అపేక్షలేకుండా ఉంటారు.

**మ. కణఁకన్ వారలు వెండి మోక్షనిరపేక్షస్వాంతులై యుండి తా**
**మణిమాద్యష్ట విభూతి సేవితము నిత్యానంద సంధాయియున్**
**గణనాతీతము నప్రమేయము సమగ్రశ్రీకమున్ సర్వ ల**
**క్షణ సంయుక్త వికుంఠలోక పదవిం గైకొందు రత్యున్నతిన్. 880**

**ప్రతి :** కణఁకన్= ప్రయత్నంతో; వారలు= ఆ పరమభాగవతులు; వెండి= మరియు; మోక్షనిరపేక్షస్వాంతులు+ఐ= మోక్షం విషయంలో ఆసక్తి లేని మనస్సులు కలవారై; ఉండి; తాము= వాళ్లు; అణిమ+ఆది+అష్టవిభూతి= ఎనిమిదైన అణిమాది విభూతులచేత; సేవితము= సేవింపబడినది; నిత్య+ఆనంద= శాశ్వతమైన ఆనందాన్ని; సంధాయియున్= సమకూర్చేది; గణన+అతీతమును= లెక్కించుటకు శక్యముగానిది; అప్రమేయము= మితిలేనిది; సమగ్ర= సంపూర్ణమైన; శ్రీకమున్=

సిరితో కూడినది; సర్వలక్షణ సంయుక్త= సకల సల్లక్షణాలతో కూడిన; వికుంఠలోక పదవిన్= వైకుంఠలోకమనే స్థానమును; అతి+ఉన్నతిన్= ఎంతో గొప్పగా; కైకొందురు= అందుకొంటారు.

**తా :** పిమ్మట ఆ పరమభాగవతులు ప్రయత్నంతో మోక్షం విషయంలో ఆసక్తి లేకుండా అణిమాది అష్టవిభూతులచే సేవింపబడేది, శాశ్వతమైన ఆనందాన్ని కూర్చేది, గణించడానికి వీలుకానిది, మితిలేనిది, సంపూర్ణవైభవోపేతము, సకల సల్లక్షణాలతో కూడినది, అయిన వైకుంఠ లోకమనే పదవిని ఎంతో గొప్పగా అందుకొంటారు.

**విశే :** ఈ పద్యంలో వైకుంఠంయొక్క గొప్పతనం చెప్పబడింది. వైకుంఠం ఎనిమిది విధాలైన విభూతులతో కూడి ఉంటుంది. విభూతి అంటే ఐశ్వర్యం. ఈశ్వరభావం ఐశ్వర్యం. ఐశ్వర్యయుక్తుడు ఈశ్వరుడు. ప్రభుత్వం కలవాడు. కావున ఈశ్వరుడంటే ప్రభువు. విశ్వంలోని సర్వప్రాణులకు ఈశ్వరుడే. ఎనిమిది విభూతులు – అణిమ (సూక్ష్మమైనది), మహిమ (మహత్త్వం), గరిమ (గురుత్వం), లఘిమ (లఘుత్వం), ప్రాప్తి (ఇష్టప్రాప్తి), ప్రాకామ్యం (అడ్డులేని ఇచ్ఛ); ఈశత్వం (సర్వాతిశయత్వం), వశిత్వం (స్వాధీన ఇంద్రియత్వం).

వైకుంఠం నిత్యవిభూతి గలది. అక్కడ దుఃఖాదులుండవు. శాశ్వతంగా ఆనందమే ఉంటుంది. లౌకిక జగత్తులో అంటే లీలావిభూతిలో దుఃఖాదులుంటాయి. గణన అనే మాటకు అర్థం లెక్కించడమేకాక వర్ణించడం అని కూడా. వైకుంఠధామాన్ని వర్ణించడం సాధ్యంకాదు. లక్ష్మి అక్కడే స్వామితో కలసి ఉంటుంది కాబట్టి వైకుంఠం సంపూర్ణ వైభవాలతో కూడి ఉంటుంది. సర్వలక్షణాలంటే ఎన్ని సల్లక్షణాలుంటే అవన్నీ. ఇలాంటి వైకుంఠ ధామాన్ని పొందడానికి పరమభాగవతులు ఎంతగానో భక్తియోగ సాధన చేయాలి.

**వ. ఇట్లు వొంది. 881**

**ప్రతి :** ఇట్లు+పొంది= ఈ విధంగా వైకుంఠధామాన్ని పొంది.

**క. తనరుదు రప్పుణ్యాత్ములు, జనయిత్రి! మదీయ కాలచక్ర గ్రసనం**
**బును నొందక నిత్యం బగు, ననుపమ సుఖవృత్తి నుందు, రది యెట్లన్నన్. 882**

**ప్రతి :** జనయిత్రి= తల్లీ!; ఆ+పుణ్యాత్ములు= ఆ పుణ్యాత్ములైన పరమభాగవతులు; మదీయకాలచక్ర= నాకాలచక్రానికి; గ్రసనంబును ఒందక= మింగుడుపడక; తనరుదురు= వైకుంఠంలో ప్రకాశిస్తూ ఉంటారు; నిత్యంబు+అగు= శాశ్వతమైన; అనుపమ= సాటిలేని; సుఖవృత్తిన్+ఉందురు= సుఖాలను అనుభవించే వర్తనంలో ఉంటారు; అది; ఎట్లు+అన్నన్= అది ఎలా అంటే

**తా :** తల్లీ! వైకుంఠధామాన్ని పొందిన ఆ పుణ్యాత్ములైన భాగవతులు నాకాలచక్రానికి మింగుడు పడనివారై నిరుపమానమైన శాశ్వతమైన సుఖాలతో ఆలరాలుతూ ఉంటారు. అది ఎలాగంటే –

**మ. సమతన్ స్నేహముచే సుతత్వమును, విశ్వాసంబుచేతన్ సఖి**
**త్వముఁ, జాలన్ హితవృత్తిచేతను సుహృత్త్వంబున్, సుమంత్రోపదే**
**శముచేతన్ నిజదేశికుం దనఁగ నిచ్చల్ పూజ్యుఁడౌ నిష్ట దై**
**వమనై వారికిఁ గాలచక్రభయముల్ వారింపుదుం గావునన్. 883**

**ప్రతి :** సమతన్= సమభావంతో; స్నేహముచేన్= వారితో స్నేహంవల్ల; సుతత్వమును= కుమారునివలె; విశ్వాసంబుచేతన్= వారిపై విశ్వాసంవల్ల; సఖిత్వమున్= చెలికానివలె; చాలన్= ఎంతో; హితవృత్తిచేతను= వారికి హితం బోధిస్తూ; సుహృత్త్వంబున్= ఆత్మీయునివలె; సుమంత్ర+ఉపదేశముచేతన్= వారికి చక్కని రహస్యాలు ఉపదేశంచేస్తూ; నిజదేశికుండు+అనఁగన్= వాళ్ల ఆచార్యునివలె; నిచ్చల్= ఎల్లప్పుడూ; పూజ్యుఁడు+ఔ= పూజింపదగిన; ఇష్టదైవమును+ఐ= ఇలువేల్పునై; వారికిన్= వాళ్లకు; కాలచక్రభయముల్= కాలచక్రంవల్ల కలిగే భయాలను; వారింపుదున్= నివారిస్తాను; కావునన్= కాబట్టి.

**తా :** సమభావంతో నేను వాళ్లతో స్నేహంవల్ల కుమారునివలె ప్రవర్తిస్తాను. వాళ్లపై విశ్వాసంతో స్నేహితుడువలె, వాళ్లకు హితం చెపుతూ నిస్స్వార్థపరుడైన హితునివలె, మంత్రం ఉపదేశించడంవల్ల ఆచార్యునివలె మెలగుతూ ఉంటాను. నిత్యం వాళ్లకు పూజింపదగిన ఇష్టదైవాన్నై, కాలచక్రంవల్ల కలిగే భయాలను నివారించి వాళ్లను కాపాడుతూ ఉంటాను. అందువల్ల నా ఆయుధమైన కాలచక్రం వాళ్లను స్పృశింపలేదు.

**వ. అని యిట్లు దెలుపుచు మఱియు నిట్లనియె. 884**

**ప్రతి :** అని; ఇట్లు+తెలుపుచున్= ఇలా చెప్పి; మఱియున్= మరల; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తా :** అని ఈ విధంగా చెప్పి కపిలముని దేవహూతిలో మళ్లీ ఇట్లా అన్నాడు.

**చ. విను మది గాక యీ భువి దివిం బలుమాఱుఁ జరించు నాత్మఁ దా**
**ధన పశు పుత్త్ర మిత్ర వనితాతతి పైఁ దగులంబు మాని న**
**న్ననఘుని విశ్వతోముఖు ననన్యగతిన్ భజియించెనేని వా**
**నిని ఘనమృత్యురూప భవనీరధి నేఁ దరియింపఁ జేయుదున్. 885**

**ప్రతి :** వినుము; అది+కాక= ఇంతేగాక; ఆత్మ; ఈ; భువిన్= భూలోకంలోను; దివిన్= స్వర్గలోకంలోను; పలుమాఱున్= పెక్కుసార్లు; చరించున్= తిరుగుతూ ఉంటుంది; తాన్= తాను అంటే మానవుడు; ధన= ధనం; పశు= పశువులు; పుత్త్ర= పుత్రులు; మిత్ర= మిత్రులు; వనితాతతిపైన్= మగువలు మొదలైనవారిపై; తగులంబుమాని= కోరిక వదలుకొని; నన్ను+అనఘుని= పాపాలంటనట్టి నన్ను; విశ్వతోముఖున్= ప్రపంచమంతా వ్యాపించి ఉన్నవానిని; న+అన్యగతిన్= వేరొక దిక్కులేకుండా నేనేగతిగా; భజియించెన్+ఏని= ఆరాధించినట్లయితే; వానిని= అతనిని; ఘన= గొప్ప; మృత్యురూప= మృత్యుమయమైన; భవనీరధిన్= సంసార సముద్రంనుండి; నేన్= నేను; తరియింపన్+చేయుదున్= దరిచేరుస్తాను; దాటిస్తాను.

**తా :** అమ్మా! వినుము. ఆత్మ పలుమార్లు భువికీ దివికీ మధ్య పరిభ్రమిస్తూనే ఉంటుంది. మానవుడు ధనం, పశువులు, పుత్రులు, మిత్రులు మగువలు అనువానిపై కోరికలను విడిచిపెట్టి, పాపాలంటనివాడను, ప్రపంచమంతటా వ్యాపించినవాడను అయిన నన్ను అనన్యచిత్తంతో ఆరాధించినట్లయితే వానిని మృత్యుమయమైన సంసార సముద్రంనుండి నేను దరికి చేరుస్తాను.

**విశే :** భువిదివులు అంటే ఇహం పరం అని అర్థం చేసుకోవాలి. భూమి ఆకాశం అని కూడా చెప్పవచ్చు. ఈ రెండిటిమధ్య ఆత్మ తిరుగుతుంది అంటే ఆత్మతో కూడిన శరీరం తిరుగుతుందని అర్థం. ఇహపరాలలో ఉన్న సుఖభోగాలు ఆ రెండు లోకాలలో సంచరించే స్థూలసూక్ష్మ దేహాలు. వాటిపై ఉండే మమతలను, స్థూలదేహాన్ని అనుసరించి ఉండే ధన పశు

పుత్రమిత్ర వనితాదులలోను, ఇతర ద్రవ్యాలలోను మమతలు వదలాలి. అలా మమతలు వదలిన తరువాతనే భగవత్పరమైన ఆలోచనలు వస్తాయి. అలాంటి సందర్భంలో ఇతరు లెవ్వరినీ ఆశ్రయించకుండా పరమాత్మను ఏకాగ్రచిత్తంతో ఆరాధించాలి. అలాంటి పరమభాగవతులను జననమరణ రూపమైన సాంసారికవ్యవస్థనుండి గడ్డకెక్కిస్తానని పరమాత్మ నిర్ద్వంద్వంగా ప్రకటిస్తున్నాడు. భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ సర్వధర్మాలను పరిత్యజించి నన్నే శరణు పొందితే మిమ్మల్ని (భక్తులను) సర్వపాపాలనుండి విముక్తులను చేస్తానని ప్రకటించిన విషయం ఈ సందర్భంలో గుర్తు చేసుకోవాలి.

**సీ. రూఢిఁ బ్రధాన పూరుష నాయకుండను, భగవంతుఁడను, జగత్ప్రభుఁడ నైన,**
**నా కంటె నన్యులఁ గైకొని తగిలిన, యాత్మలు భవభయం బందు నెపుడుఁ**
**గావున నా యాజ్ఞఁ గడవంగ నోడుటఁ, జేసి వాయువు వీచు, శిఖి వెలుంగు,**
**నినుఁడు దపించుఁ, దా నింద్రుండు వర్షించు, భయమంది మృత్యువు పరువువెట్టుఁ,**

**తే. గాన విజ్ఞాన వైరాగ్య కలిత మైన, భక్తియోగంబునం జేసి పరమపదము**
**కొఱకు న య్యోగివరులు మచ్చరణభజను, లగుచుఁ జరియింపుదురు నిర్భయాత్ము లగుచు. 886**

**ప్రతి :** రూఢిన్= నిశ్చయంగా; ప్రధాన పూరుషనాయకుండను= ప్రధానమనబడే ప్రకృతికి అధినాథుడైన పురుషుడను; భగవంతుఁడను= దేవుడను; జగత్+ప్రభుఁడను= జగదీశ్వరుడను; ఐన= అయిన; నాకంటెన్= నన్నుకాక; అన్యులన్+కైకొని= ఇతర దేవతలను ఎన్నుకొని; తగిలినన్= ఆశ్రయిస్తే; ఎపుడున్= ఎప్పుడూ; ఆత్మలు= అలా ఆశ్రయించిన వాళ్ల ఆత్మలు; భవభయంబు+అందున్= సంసారభయాలు పొందుతాయి; కావునన్= కనుక; నా+ఆజ్ఞన్= నా ఆనతిని; కడవంగన్= దాటడానికి; ఓడుటన్+చేసి= భయపడడంవల్ల; వాయువు= గాలి; వీచున్= వీస్తుంది; శిఖి= అగ్ని; వెలుంగున్= మండుతుంది; ఇనుఁడు= సూర్యుడు; తపించున్= ఎండకాస్తాడు; ఇంద్రుండు= ఇంద్రుండు; తాన్= తాను; వర్షించున్= వర్షిస్తాడు; మృత్యువు= మృత్యుదేవత; భయము+అంది= భీతిచెంది; పరువు+పెట్టున్= పారిపోతుంది; కానన్= కాబట్టి; విజ్ఞానవైరాగ్యకలితము+ఐన= జ్ఞాన వైరాగ్యాలతో కూడిన; భక్తియోగంబునన్+చేసి= భక్తియోగంతో; ఆ+యోగివరులు= ఆ యోగీంద్రులు; పరమపదముకొఱకున్= వైకుంఠంకోసం; మత్+చరణ భజనులు+అగుచున్= నా పాదాలను భజిస్తూ; నిర్+భయ+ఆత్ములు+అగుచున్= భయంలేని వారవుతూ; చరియింపుదురు= ప్రవర్తిస్తారు.

**తా :** నిశ్చయంగా ప్రధానమనబడే ప్రకృతికి అధినాథుడైన పురుషుడను, భగవంతుడను, జగదీశ్వరుడను అయిన నన్నుగాక ఇతర దేవతలను ఆశ్రయిస్తే సంసారభయంలో పడిపోతారు. నా ఆనతిని అతిక్రమించడానికి భయపడడంవల్లనే గాలి వీస్తుంది. అగ్ని జ్వలిస్తుంది. సూర్యుడు వేడిని పుట్టిస్తాడు. ఇంద్రుడు వర్షిస్తాడు. మృత్యువు భయపడి పారిపోతుంది. కావున జ్ఞానవైరాగ్యాలతో కూడిన భక్తియోగంతో ఆ యోగీంద్రులు వైకుంఠంకోసం నా పాదాలను భజిస్తూ భయంలేనివారై ప్రవర్తిస్తారు.

**విశే :** ప్రకృతి పురుషులను నియమించువాడు పరమాత్మే. సర్వభూతాలలో అంతర్యామిగా వర్తించేవాడూ పరమాత్మే. ప్రకృతి త్రైగుణ్యం అంటే సత్వరజస్తమోగుణ సంయుక్తం. ప్రకృతికి ప్రధానమని మరొక పేరుంది. ప్రకృతి తనపాటికి తానే ప్రపంచసృష్టి చేస్తున్నదని వాదించేవారు దీనికీ పేరు పెట్టారు. ప్రధానానికి నాయకుడు భగవంతుడు. ఆయన జగత్తుకు ప్రభువు. ఇహపరాలలో ఆయన అనుజ్ఞ లేనిదే ఏ కార్యమూ జరుగదు. దేవతలందరూ ఆయన ఆజ్ఞ ప్రకారమే నడుచుకొంటారు.

అలా నడుచుకోకపోతే శిక్ష ఉంటుందని వాళ్లకు భయం. అందుకే గాలి అగ్ని మొదలైనభూతాలు చేయాల్సిన పనులు సక్రమంగా చేస్తున్నాయి. ఇలా సర్వ ప్రకృతికి ప్రభువు శ్రీహరి. ఆయనకే మోక్షమిచ్చే శక్తి ఉంది. ఇతర దేవతలకు లేదు.

**క. గురుభక్తిం జిత్తము మ, త్పరమై విలసిల్లు నంత పర్యంతము స**
**త్పురుషుల కిహలోకంబునఁ, జిరతర మోక్షోదయంబు సేకుఱుచుండున్. 887**

**ప్రతి :** చిత్తము= మనస్సు; గురుభక్తిన్= పెద్దలపట్ల భక్తితోకూడి; మత్+పరము+ఐ= నాయందు తగుల్కొన్నదై; విలసిల్లున్+అంతపర్యంతము= ఒప్పారునంతదాక; ఇహలోకంబునన్= ఈ భూలోకమందు; సత్+పురుషులకున్= ఉత్తములైన మానవులకు; చిరతర= శాశ్వతమైనట్టి; మోక్ష+ఉదయంబు= మోక్షప్రాప్తి; చేకుఱుచున్+ఉండున్= దక్కుతుంటుంది

**తా :** తల్లీ! మనస్సు భక్తితో నన్ను సేవిస్తుంటే, ఈ ప్రపంచంలో సజ్జనులకు శాశ్వతమైన ముక్తి సమకూరుతుంది.

**విశే :** ఉత్తములైనవారికి భవబంధవిముక్తి ఎట్లా ఒనగూడుతుందో కపిలమహర్షి తల్లికి నివేదిస్తున్నాడు. భక్తిభావమే మోక్షప్రాప్తికి అసలైన కుదురు. భక్తి లేక ఆరాధన సగుణమని నిర్గుణమని రెండురకాలు. ప్రారంభంలో భక్తిగలవారు దేవుణ్ణి పత్రఫలపుష్పాదులతో సేవిస్తారు. దీన్ని సగుణమంటారు. కాని చిత్తం వికాసదశను చేరుకోగానే క్రమక్రమంగా భక్తుడు సర్వాంతర్యామియైన పరమాత్మను మనఃపుష్పంచేతనే పూజిస్తాడు. దీన్నే నిర్గుణారాధన అంటారు. ఈ పద్యంలో కపిలమహర్షి తల్లికి బోధించినభక్తి 'నిర్గుణభక్తి'యని గుర్తించాలి.

**క. అని యిట్లు స న్మునీంద్రుఁడు, జననికి హరిభక్తి యోగ సంగతి నెల్లన్**
**వినిపించి వెండియును ని, ట్లనియెన్ సమ్మోదచిత్తుఁ డగుచుఁ గడంకన్. 888**

**ప్రతి :** సత్+ముని+ఇంద్రుఁడు= శ్రేష్ఠుడైన ఆ కపిలమహర్షి; ఇట్లు= పైన చెప్పినట్లుగా; అని= పల్కి; జననికిన్= తల్లియైన దేవహూతికి; హరిభక్తియోగ= విష్ణువుకు సంబంధించిన భక్తియోగంయొక్క; సంగతిన్= విధానాన్ని; ఎల్లన్= సమస్తం; వినిపించి= చెప్పి; వెండియున్= మరల; సం+మోదచిత్తుఁడు= బాగుగా సంతోషించిన మనస్సుగలవాడు; అగుచున్= అవుతూ; కడంకన్= పూనికతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు...

**తా :** కపిలమహర్షి తల్లికి భక్తియే మోక్షప్రాప్తికి కుదురు అని బోధించి, విష్ణుభక్తియోగాన్ని బాగా పూసగ్రుచ్చినట్లు తెల్పి, మహాసంతోషంతో మరల ఇట్లన్నాడు.

**వ. అవ్వా! యివ్విధంబున భక్తియోగ ప్రకారంబు సెప్పితి, నింకఁ దత్త్వలక్షణంబు వేఱు వేఱ యెఱింగింతు ఏ తత్త్వగుణంబుల నెఱింగి నరులు ప్రకృతి గుణంబుల వలన విముక్తు లగుదురు, హృదయగ్రంథి విచ్ఛేదకంబు నాత్మదర్శన రూపంబు నగు నా జ్ఞానం బాత్మనిశ్శ్రేయస కారణంబు; గావున దాని నెఱింగింతు, నందు నాత్మస్వరూపం బెట్టి దనిన ననాదియుఁ బురుషుండును సత్త్వాదిగుణ శూన్యుండును బ్రకృతి గుణవిలక్షణుండును బ్రత్యక్స్వరూపుండును స్వయంప్రకాశుండును నెవ్వండు? మఱియు నెవ్వనితోడ నీ విశ్వంబు సమన్వితం బగు నతండు గుణత్రయాత్మకత్వంబు నవ్యక్తంబును భగవత్సంబంధియు నగు ప్రకృతియందు యదృచ్ఛచే లీలావశంబునం బ్రవేశించిన నా ప్రకృతి గుణత్రయమయంబై సరూపం బయిన**

**ప్రజాసర్గంబుఁ జేయం గనుంగొని యప్పుడు మోహితుండయి విజ్ఞాన తిరోధానంబునం జేసి గుణత్రయాత్మకం బయిన ప్రకృత్యధ్యాసంబున నన్యోన్యమేళనం బగుటయు నంతం బ్రకృతిగుణంబుఁ దనయందు నారోపించుకొని క్రియమాణంబులగు కార్యంబులవలనం గర్తృత్వంబు గలిగి సంసారబద్ధుండై పారతంత్ర్యంబు గలిగియుండుఁ, గర్తృత్వశూన్యుండగు నీశ్వరుండు సాక్షి యగుటం జేసి యాత్మకుం గార్యకారణ కర్తృత్వంబులు ప్రకృత్యధీనంబులనియు, సుఖ దుఃఖ భోక్తృత్వంబులు ప్రకృతి విలక్షణుం డయిన పురుషుని వనియు నెఱుంగుదు,రని చెప్పిన విని దేవహూతి గపిలున కిట్లనియెఁ, బురుషోత్తమా! ప్రకృతి పురుషులు సదసదాత్మక ప్రపంచంబునకుఁ గారణభూతులు గావున వాని లక్షణంబు సదసద్వివేక పూర్వకంబుగా నానతిమ్మనిన భగవంతుం డైన కపిలుం డిట్లనియె. 889**

**అవ :** కపిలుడు తల్లికి భక్తియోగతత్త్వ లక్షణాన్ని విశదీకరిస్తున్నాడు.

**ప్రతి :** అవ్వా!= అమ్మా! ఈ+విధంబునన్= ఈ రీతిగా; భక్తియోగప్రకారంబు= భక్తియోగం తీరును; చెప్పితిన్= వివరించాను; ఇంకన్= తర్వాత; వేఱువేఱన్= విడివిడిగా; తత్త్వలక్షణంబున్= పరమాత్మ ఆత్మసంబంధమైన లక్షణాల్ని; ఎఱింగింతున్= తెల్పుతాను; నరులు= మానవులు; ఏ తత్త్వగుణంబులన్= ఏ తాత్త్వికగుణాల్ని; ఎఱింగి= తెలిసి; ప్రకృతి గుణంబులవలనన్= బాహ్యప్రపంచగుణాలనుండి; విముక్తులు= విడివడినవారు; అగుదురు= కాగలరో; హృదయగ్రంథి= (హృదయమాలిన్యం) గుండెముడిని; విచ్ఛేదకంబును= విప్పగల్గినదియు; ఆత్మదర్శనరూపంబును= ఆత్మను చూపగల్గినట్టిదియు; అగు= అయినట్టి; ఆ జ్ఞానంబు= ఆ ఆత్మాలోకనజ్ఞానం; ఆత్మ= మనస్సునకు; నిస్+శ్రేయసకారణంబు= సుఖాన్ని కల్గించేది; కావునన్= అందువల్ల; దానిన్= ఆ ఆత్మదర్శనాన్ని; ఎఱింగింతున్= తెల్పుతాను; అందున్= జ్ఞానవిషయంలో; ఆత్మస్వరూపంబు= ఆత్మ విధము; ఎట్టిది= ఏ విధమైనది; అనినన్= అనగా; న+ఆదియున్= మొదలులేనిది; పురుషుండును= ఉత్పత్తికి కారణమైనవాడునూ; సత్త్వ+ఆది= సత్త్వం, రజస్సు, తమస్సు, మున్నగు; గుణ= గుణాలచే; శూన్యుండును= విడువబడ్డవాడును; ప్రకృతిగుణ= ప్రాకృతిక గుణాలకంటె; విలక్షణుండును= వేరైనవాడును; ప్రత్యక్+స్వరూపుండున్= పరిశుద్ధమైన స్వరూపంగలవాడును; స్వయంప్రకాశుండును= తనంత దానే వెలుగొందువాడును; (అయినవాడు); ఎవ్వండు= ఎవ్వడో; మఱియున్= ఇంకా; ఎవ్వనితోడన్= ఎవరితో; ఈ+విశ్వంబు= ఈ లోకం; సమన్వితంబు+అగున్= బాగా కూడుకొనివుందో; అతండు= ఆ పరమేశ్వరుడు; గుణత్రయ+ఆత్మకత్వంబును= సత్త్వరజస్తమోగుణాలు మూడింటిచే కూడినదియు; అవ్యక్తంబును= తెలియబడనిదియు; భగవత్+సంబంధియున్= భగవంతునికి చెందినదియు; అగుప్రకృతియందున్= అయినట్టి ప్రకృతియందు; యదృచ్ఛచేన్= అప్రయత్నంగా (అలవోకగా); లీలావశంబునన్= విలాసానికి లోనై; ప్రవేశించినన్= లోనప్రవేశించగా; ఆ+ప్రకృతిగుణత్రయమయంబు+ఐ= ఆ ప్రకృతి మూడు గుణాలతో కూడినదై; సరూపంబు+అయిన= ఆకృతిగొన్నట్టి; ప్రజాసర్గంబున్= ప్రజల సృష్టిని; చేయన్= చేయగా; అప్పుడు; కనుంగొని= చూచి; మోహితుండు+ఐ= (ప్రకృతి) వ్యామోహంలో పడినవాడై; విజ్ఞానతిరోధానంబునన్+చేసి= విజ్ఞానం మరుగుపడుటచేత; గుణత్రయ+ఆత్మకంబు+అయిన= త్రిగుణాలతో కలిసినట్టి; ప్రకృతి+అధ్యాసంబునన్= ప్రకృతితోడి తాదాత్మ్యముచే; అన్యోన్య మేళనంబు= పరస్పరం కలయిక, అగుటయున్ కాగా; అంతన్= ఆపై; ప్రకృతి గుణంబు= ప్రకృతియొక్క స్వభావమును; తనయందున్= తనలో (పురుషునియందు); ఆరోపించుకొని= మోపుకొని; క్రియమాణంబులు+అగు= చేయబడునవైన; కార్యంబులవలనన్= పనులవల్ల; కర్తృత్వంబు+కలిగి= కర్తనన్న భావంకలిగి; సంసారబద్ధుండు+ఐ= సంసారముచే కట్టబడినవాడై, సంసారమునకు

లోబడినవాడై; పారతంత్ర్యంబు= అస్వతంత్రత; కలిగి+ఉండున్= కలవాడైయుంటాడు; కర్తృత్వశూన్యుండు+అగు= కర్తనన్న భావం లేనివాడు; ఈశ్వరుండు= భగవంతుడు; సాక్షి+అగుటన్+చేసి= సాక్షిమాత్రుడుగా ఉండుటవల్ల; ఆత్మకున్= ఆత్మకు; కార్యకారణ కర్తృత్వంబులు= చేయవలసినపని; దాని కారణం; దాని నిర్వహణ (బాధ్యత); ప్రకృతి+అధీనంబులు+అనియున్= ప్రకృతికి లోబడినవనియు (స్వాధీనమైనవి; సుఖదుఃఖభోక్తృత్వంబులు= సుఖం, దుఃఖం, వీటి అనుభవం; ప్రకృతివిలక్షణుండు+అయిన= ప్రకృతికి వ్యతిరేకియైన; పురుషునివి+అనియున్= భగవంతునికి చెందినవని; ఎఱుంగుదురు= తెలియుదురు; అని; చెప్పినన్= ఇట్లు (కపిలుడు) చెప్పగా; విని దేవహూతి= దేవహూతి; కపిలునకున్= కపిలునితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది; పురుష+ఉత్తమా!= పురుషశ్రేష్ఠుడా!; ప్రకృతి పురుషులు= ప్రకృతియు, పురుషుదును; సత్+అసత్+ఆత్మక= సత్యమైనదియు, అసత్యమైనదియునగు; ప్రపంచమునకున్= జగత్తుకు; కారణభూతులు= హేతువైన వారలు (గురువులు); వాని లక్షణంబు= వాని తత్త్వాన్ని; సత్+అసత్+వివేకపూర్వకంబు+కాన్= సత్యాసత్యవిజ్ఞానంతో; ఆనతి+ఇమ్ము= వివరించుము; అనినన్= అనగా; భగవంతుండు+ఐన= పరమాత్మయైన; కపిలుండు= కపిలమహర్షి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు –

**తా :** భక్తియోగాన్ని గూర్చి వివరించిన తర్వాత కపిలమహర్షి తల్లియైన దేవహూతికి తాత్త్వికలక్షణాల్ని గూర్చి విశదీకరిస్తున్నాడు. తత్త్వశబ్దాన్ని విభజిస్తే 'తద్+త్వమ్' అవుతుంది. తత్ అంటే 'ఆ పరమాత్మ' అనీ, త్వం అనగా 'నీవు' అనీ అర్థం. పరమాత్మయే జీవులందు ఆత్మరూపుడై వున్నాడని పిండితార్థం. తత్త్వరహస్యం తెలిసికొంటే, మానవులు సంసారబంధంనుండి విడివడుతారు. ఆత్మావలోకనంవల్ల హృదయంలో చిక్కుముళ్ళుగా ఉండే సందేహాలు తెగి ముక్తిలభిస్తుంది. భగవంతుడికి 'తుదిమొదళ్ళు' లేవు. ఆయన సత్యస్వరూపుడు. స్వయంజ్యోతిస్స్వరూపుడు. ఆయన్ని 'పురుషుడు' అంటారు. ఆయన ఈ విశ్వమంతటిని ఆవరించియున్నాడు. ఆ పరమాత్మ ఆత్మరూపుడై త్రిగుణాలకు వశమైనట్టిది, తెలియబడనిది, భగవంతునికి వశమైనది అయిన ప్రకృతియందు అలవోకగాను, విలాసంగాను ప్రవేశించటంవల్ల, ఆ ప్రకృతి త్రిగుణాలకు వశమై ప్రజాసృష్టికి కారణమైనాడు.

అప్పుడా పురుషుడు ప్రకృతితో కలియటంవల్ల తనలో విజ్ఞానం నశించి ప్రాకృతిక లక్షణాలకు వశుడయ్యాడు. తర్వాత జరుగవలసిన జగత్కార్యాలకు తానే కర్తృత్వం వహించి, సంసారంలో తగుల్కొని అస్వతంత్రుడయ్యాడు. కాని యీ సందర్భంలో భగవంతుడు దేనికీ బాధ్యుడు కాడు. తన ప్రమేయమేమియు లేదు. ఆయన విశ్వసృష్టికి పర్యవేక్షకుడు మాత్రమే. ఏమైనా ఈ సృష్టికార్యం, కారణం, వీటి బాధ్యత అనేవి మూడున్నూ కేవలం ప్రకృతికి వశమై ఉంటాయి. సుఖం, దుఃఖం వీటి అనుభవం అనేది పురుషుని వశంలో ఉంటుంది. ఇది తత్త్వలక్షణమని కపిలుడు చెప్పగా, దేవహూతి "స్వామీ! ప్రకృతి మరియు పురుషుడు ఈ ఇర్వురు సత్యమైనట్టియు, మిథ్యయైనట్టియునగు జగత్తుకు మూలకారకులుగదా! వారి లక్షణాల్ని సదసద్విజ్ఞానంతో సహా వివరించండి. అని అడిగింది. కపిలుడు తర్వాత ఉపదేశానికి పూనుకొన్నాడు.

**విశే :** ఈ గద్యంలో వ్యాసమహర్షి 'ప్రకృతి – పురుష' లక్షణాల్ని వివరించాడు. 'తత్త్వమసి' అనే మహావాక్యానికి వ్యాఖ్యాన ప్రాయంగా ఉన్న గద్యమిది. ఆ పరమాత్మయే నీవై వున్నావు. అని ఆ మహావాక్యానికి తాత్పర్యం. 'పరమాత్మయే ఆత్మ' అనే రహస్యం తెలిస్తే మానవులు సంసారబంధంనుండి విడివడి కైవల్యపదాన్ని చేరుకొంటారనేది ఆధ్యాత్మికబోధ. తత్త్వమసి అనే మహావాక్యం 'అద్వైతసిద్ధాంతానికి' ఆయువు పట్టు. 'ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి' అనేది గీతావాక్యం. ప్రకృతి మరియు పురుషుడు ఈ ఇర్వురికి 'ఆది' లేదు. ఇక్కడ పురుషుడు అనే శబ్దాన్ని – 'ఆత్మ' యని 'పరమాత్మ'యని సందర్భాన్నిబట్టి అర్థం చేసికోవాలి. ప్రకృతి మాయ. దీనికి మొదలేదో ఎవ్వరు చెప్పలేరు. రాత్రి నిద్రించిన తర్వాత జరిగే

స్వప్నమెప్పుడు ప్రారంభింపబడిందో చెప్పజాలనట్లే ఈ 'మాయ'కు (ప్రకృతి) మొదలేదో చెప్పలేము. కాని 'అంతం' ఎప్పుడో చెప్పగలం. కాబట్టి ప్రకృతి 'అనాది' కాని 'అనంతం' కాదు. అలాగే 'పురుషుడు' నిత్యశుద్ధుడు. అతడుకూడ 'అనాది'యే కాని ఆయనకి 'అంతం' లేదు. అందువల్ల పురుషుడు (జీవుడు – లేదా పరమాత్మ) 'అనంతుడు'.

ప్రకృతిని మాయ యని బంధమని పేర్కొంటాము. మానవునికి జ్ఞానోదయం కాగానే 'మాయ' లేదా బంధం విడిపోతుంది. "వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్" అన్నది గీత. నిజానికి 'పురుషుడు' (ఆత్మ) ఏ విధమైన వికారాలు లేనివాడు. పరిశుద్ధుడు కూడ. అయితే అతనికి కామం, క్రోధం, సుఖం, దుఃఖం, వ్యామోహం వంటి వికారాలు ప్రకృతి సాంగత్యం వల్లనే కల్గుతున్నాయి. ఈ ఆత్మ వికారాలనుండి తప్పించుకొని నిర్వికారమైన పరమపురుషుని చేరటానికి గొప్పప్రయత్నం చేయాలి. జీవుడు తనకు దుఃఖంగాని మనోవికారం కాని కల్గితే 'అవి' ప్రకృతికి సంబంధించినవే కాని తనవి కావని దృఢనిశ్చయం గలవాడై వుండాలి. సంసారబంధం, మనోవికారాలు పీడిస్తున్నంతదాక అతడు బద్ధుడై, అస్వతంత్రుడై వుంటాడు.

ఈ గద్యంలో "కార్యకారణ కర్తృత్వంబులు ప్రకృత్యధీనంబులు సుఖదుఃఖభోక్తృత్వంబులు ప్రకృతి విలక్షణుండైన పురుషునివి" అనే వాక్యముంది.

ఇక్కడ కార్యమంటే శరీరమని, కారణమంటే మనస్సు, బుద్ధి, అహంకారం, పంచభూతాలు, శబ్దాదులు అని గ్రహించాలి. వీటిని కల్గించేది ప్రకృతి. పురుషుడు చిద్రూపుడు మరియు అసంగుడు. కాబట్టి వాస్తవంగానైతే అతనికి సుఖదుఃఖాద్యనుభవం ఉండదు. అయితే ప్రకృతి సాంగత్యంవల్ల ఆ యా సుఖదుఃఖాల్ని అనుభవిస్తున్నట్లు తోస్తున్నాడు". అని మహర్షి దేవహూతికి తత్త్వోపదేశం చేశాడు.

**క. క్రమమునఁ ద్రిగుణము నవ్య, క్తము నిత్యము సదసదాత్మకము మఱియుఁ బ్రధా**
**నము ననఁగాఁ బ్రకృతి విశే, షము లదియు విశిష్ట మనిరి సద్విదు లెలమిన్. 890**

**ప్రతి :** ప్రకృతివిశేషములు= ప్రాకృతికగుణాలు; క్రమమునన్= వరుసగా; త్రిగుణమున్= సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడుగుణాలు; అవ్యక్తము= బయల్పడనిది; నిత్యము= ఎల్లప్పుడు ఉండేది; సత్+అసత్+ఆత్మకము= సత్యం, మిథ్య అనే రెండుగా ఉండేది; మఱియున్= ఇంకా; ప్రధానము= ముఖ్యమైనది (పరమాత్మస్వరూపం); అనన్+కాన్= అనగా; ప్రకృతి విశేషములు= ప్రకృతికి సంబంధించిన విశేషాలు కలవు; అదియున్= ఆ ప్రకృతిని; సత్+విదులు= సత్యమెరిగినవారు; ఎలమిన్= సంతోషంతో; విశిష్టము+అనిరి= చాల ప్రశస్తమైనదని (పై విశేషాలతో కూడినదని) అన్నారు.

**తా :** ప్రకృతి అంటే సత్త్వరజస్తమోగుణాలు కలది. అది చావు లేనిది. అదే సత్యం. అదే మిథ్య. అభౌతికం కూడ. అది చాల ప్రశస్తమైందని తత్త్వజ్ఞులన్నారు.

**వ. అందుఁ బ్రకృతి చతుర్వింశతి తత్త్వాత్మకంబై యుండు, నది యెట్లనినం బంచమహాభూతంబులును, బంచతన్మాత్రలును, జ్ఞానకర్మాత్మకంబు లయిన త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులును, వాక్పాణి పాద పాయూపస్థంబులు నను దశేంద్రియంబులును, మనోబుద్ధి చిత్తాహంకారంబులను నంతఃకరణ చతుష్టయంబును నను చతుర్వింశతి తత్త్వాత్మకంబునునై సగుణ బ్రహ్మసంస్థానంబు సెప్పితి, నిటమీఁదఁ గాలం బను పంచవింశక తత్త్వంబు సెప్పెద, నది గొందఱు పురుషశబ్ద వాచ్యుండైన యీశ్వరుని పౌరుషంబు గాల శబ్దంబునఁ జెప్పంబడునందు,**

**రందు నహంకార మోహితుండై ప్రకృతి నొందు జీవుండు భయంబుఁ జెందుఁ, బ్రకృతి గుణసామ్యంబునం జేసి వర్తించు నిర్విశేషుం డగు భగవంతుని చేష్టా విశేషంబు దేనివలన నుత్పన్నం బగు నదియ కాలం బని చెప్పంబడు నదియు జీవరాశ్యంతర్గతం బగుటం జేసి పురుషుండనియు, వాని బహిర్భాగవ్యాప్తింజేసి కాలం బనియుఁ జెప్పంబడు, నాత్మ మాయం జేసి తత్త్వాంతర్గతుం డయిన జీవునివలన క్షుభితంబయి జగత్కారణం బగు ప్రకృతియందుఁ బరమపురుషుండు దన వీర్యంబు వెట్టిన నా ప్రకృతి హిరణ్మయంబైన మహత్తత్త్వంబు పుట్టించె, నంత సకల ప్రపంచ బీజభూతుండును, లయవిక్షేప శూన్యుండును నగు నీశ్వరుండు దన సూక్ష్మవిగ్రహంబునందు నాత్మగతంబైన మహదాది ప్రపంచంబుల వెలిఁగించుచు స్వతేజోవిపత్తింజేసి యాత్మప్రస్వాపనంబు సేయునట్టి తమంబును గ్రసించెనని చెప్పి వెండియు నిట్లనియె.** **891**

**ప్రతి :** అందున్= వానిలో, ప్రకృతి పురుషుడు అనే రెండింటిలో; ప్రకృతి= ఆ ప్రకృతి; చతుస్+వింశతి= ఇరువది నాలుగైన; తత్త్వ+ఆత్మకంబు+ఐ= తత్త్వాల స్వరూపం గలదై; ఉండున్= ఉంటుంది; అది= ఆ తత్త్వం; ఎట్లు+అనినన్= ఎలాంటిదంటే; పంచమహాభూతంబులును= భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశం అనే అయిదు భూతాలు; పంచ తద్+మాత్రలు= గంధం, రసం, రూపం, స్పర్శ, శబ్దం అనే అయిదు తన్మాత్రలును; జ్ఞానకర్మ= జ్ఞానం, కర్మ అనే; రూప+ఆత్మకంబులు+అయిన= స్వరూపంగలవైనట్టి; త్వక్= చర్మం; చక్షుస్= కన్నులు; శ్రోత్ర= చెవులు; జిహ్వా= నాలుక; ఘ్రాణంబులును= ముక్కు (జ్ఞానేంద్రియాలు); వాక్= పలుకు; పాణి= చేతులు; పాద= కాళ్ళు; పాయు= గుదం (పురీషనాళం); ఉపస్థంబులు= యోని, మేఢ్రం (జననేంద్రియం); అను= ఈ పేర్లుగల; దశ+ఇంద్రియంబులును= పది ఇంద్రియాలును (5+5); మనస్= సకల కలాత్మకమైన మనస్సు; బుద్ధి= నిశ్చయాత్మకమైనది; చిత్త= చింతనాత్మకమైన చిత్తం; అహంకారంబులును= 'నేను' అనబడే ఆత్మ (4)యును; అను= ఈ పేరుగల; అంతస్+కరణచతుష్టయంబును= నాల్గు అంతరింద్రియాలు; అను= అనబడే; చతుస్+వింశతి= ఇర్వదినాల్గు; తత్త్వ+ఆత్మకంబునున్+ఐ= తత్త్వములతో కూడినదై; (ఉన్నట్టి); సగుణబ్రహ్మసంస్థానంబున్= సగుణబ్రహ్మ ఉనికిని; చెప్పితిని= వివరించాను; ఇటమీఁదన్= మున్ముందు; కాలంబు+అను= కాలమనే పేరుగల; పంచవింశకతత్త్వంబున్= ఇర్వదియైదవ తత్త్వాన్నిగూర్చి; చెప్పెదన్= చెపుతాను; కొందఱు= కొంతమంది; అది= ఇర్వదియైదవ తత్త్వం; పురుషశబ్దవాచ్యుండు+ఐన= 'పురుషుడు' అని చెప్పబడినట్టి; ఈశ్వరుని= పరమాత్మయొక్క; పౌరుషంబు= పురుషకారం; కాలశబ్దంబునన్= కాలం అనే పదంతో; చెప్పంబడును+అందురు= చెప్పబడుతుంది అని అంటారు; అందున్= దానిలో; అహంకార= 'నేను' అనే పేరుతో; మోహితుండు+ఐ= తగుల్కొన్నవాడై; ప్రకృతిన్+ఒందు= ప్రకృతితో కలిసిన; జీవుండు= ఆత్మ; భయంబున్+చెందున్= భీతికి గురియౌతాడు (మనోవికారానికి వశుడు); ప్రకృతి, గుణసామ్యంబునన్+చేసి= మూడు గుణాలతో కలియుటవల్ల; వర్తించున్= ఉంటుంది; నిర్+విశేషుండు+అగు= దేనితోను తగులం లేనట్టి; భగవంతుని= పరమాత్ముని; విశేషంబు= ప్రత్యేకత; దేనివలనన్= దేనిచేత; ఉత్పన్నంబు+అగున్= పుట్టిందో; అది+అ= అదే; కాలంబు+అని= కాలమని; చెప్పంబడున్= చెప్పబడుతుంది; అదియున్= ఆ విశేషమే; జీవరాశి+ అంతర్గతంబు+అగుటన్+చేసి= ప్రాణికోటి లోపలదాగి ఉన్నందువల్ల; పురుషుండు+అనియున్= ఆత్మయనియు; వాని= ఆ ఆత్ముని; బహిస్+భాగవ్యాప్తిన్+చేసి= బయటఅంతట వ్యాపించినందువల్ల; కాలంబు+అనియున్= కాలమని; చెప్పంబడున్= చెప్పబడుతుంది; ఆత్మ మాయన్+చేసి= మాయ (బంధం)వల్లను; తత్త్వ+అంతర్గతుండు+అయిన జీవునివల్ల= తత్త్వంలో తగుల్కొన్న జీవునివల్ల; క్షుభితంబు+అయి= కలతచెంది; జగత్+కారణంబు+అగు= విశ్వం ఏర్పడడానికి హేతువైన;

ప్రకృతి+అందున్= ప్రకృతిలో; పరమపురుషుండు= పురుషోత్తముడు; తనవీర్యంబు= తన ఇంద్రియాన్ని; పెట్టన్+కాన్= ఉంచగా; ఆ ప్రకృతి; హిరణ్మయంబు+ఐన= బంగారు వన్నెకల్గినట్టి; మహత్+తత్త్వంబున్= 'మహత్తు' అనే తత్త్వాన్ని; పుట్టించెన్= ఏర్పరచింది; అంతన్= తర్వాత; సకలప్రపంచ= సమస్తమైన జగత్తులకు; బీజభూతుండును=రేతస్సు అయినవాడును; అగు= అయినట్టి; ఈశ్వరుండు= భగవంతుడు; తనసూక్ష్మవిగ్రహంబునందున్= తనదైన చిన్నరూపమునందు; ఆత్మగతంబు+ఐన= ఆత్మలో దాగినట్టి; మహత్+ఆది= మహత్తు మొదలైన; ప్రపంచంబులన్= జగత్తుల్ని; వెలిఁగించుచున్= ప్రకాశపరుస్తూ; స్వ= తనదైన; తేజస్+విపత్తిన్+చేసి= ప్రకాశాన్ని అణచుటవల్ల; ఆత్మప్రస్వాపనంబు= ఆత్మని కప్పిపుచ్చుట; చేయు+అట్టి= చేయగల్గిన; తమంబును= చీకటిని; గ్రసించెన్= మ్రింగెను; అని; చెప్పి, వెండియున్= మరల; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** ప్రకృతి ఇరవైనాల్గు తత్త్వాలతో కూడినది. అవి అయిదుభూతాలు, అయిదు తన్మాత్రలు, అయిదు జ్ఞానేంద్రియాలు, అయిదు కర్మేంద్రియాలు. నాల్గు అంతరంగవిభాగాలు అన్ని కలిస్తే 24 అవుతున్నాయి. దీనినే సగుణ బ్రహ్మతత్త్వమంటారు. ఇక మరొకటి వుంది. దానినే 'పంచవింశకుడు' అంటారు. అంటే ఇరువదియైదవ తత్త్వమని తెలియాలి. కొందఱు దీన్ని పురుషుడని పిలువబడే ఆత్మయని, మరికొందఱు 'కాల'మని పేర్కొంటారు. ఆత్మ అనే జీవుడు ప్రకృతికి చిక్కి భయగ్రస్తుడవుతాడు. అతనికి ప్రకృతి గుణాలు అంటుతాయి.

భగవంతుని చేష్టని కాలమంటారు. అది జీవకోటిలో లోన దాగివుండటంచేత పురుషుడని, దాని వెలుపలివ్యాప్తి 'కాల'మని నిర్వచించటం జరిగింది. ఈ సమస్త జగత్తుకు మూలకారణం ప్రకృతియే. పరమపురుషుడు తన వీర్యాన్ని ప్రకృతియందు నిక్షేపించినందువల్ల. ఆ ప్రకృతి బంగారువన్నెగల (హిరణ్మయం) 'మహత్తు'ని కనింది. ఆ మహత్తే జగత్తు ఆవిర్భవించటానికి మూలహేతువు. సమస్త విశ్వసృష్టికి పరమేశ్వరుని రేతస్సే మూలం. ఈ విశ్వంలో ఆ పరమపురుషుడు ఆత్మరూపంతో వెలుగొందుతూ, ఆత్మని తనతేజస్సుతో కప్పి పుచ్చడానికి ప్రయత్నించే చీకటిని హరిస్తున్నాడు అనగా పరమపురుషుడు 'తమోహంత' అని తెలియాలి.

**విశే :** ఈ గద్యంలో 'సాంఖ్యతత్త్వం' అభివర్ణింపబడింది. సంఖ్యతో కూడింది సాంఖ్యం. సాంఖ్యమంటే జ్ఞానమని అర్థం. జ్ఞానవిచారణలో అనాత్మ వస్తువుల్ని లెక్కించేటప్పుడు సంఖ్యని ఆశ్రయించవలసివస్తుంది. అందుకే దీన్ని సాంఖ్యమన్నారు. ప్రకృతియందున్న 24 లేదా 96 తత్త్వాల్ని బాగా శోధించి, ఆధ్యాత్మికవేత్తలు వాటిని 'అనాత్మరూపాలు' అని విభజించారు. వాటికి సాక్షిగా ఉన్న పరమాత్మను గ్రహించటమే సాంఖ్యవిద్య. ఆత్మానాత్మరూపమైన విజ్ఞానమే 'సాంఖ్య'మని పాఠకులు గుర్తించాలి.

**1) అనాత్మపదార్థాలు:**

**1) పంచభూతాలు :** భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశం: 5
(పృథివ్యప్తేజోవాయ్వాకాశాలు)

**2) పంచతన్మాత్రలు :** గంధం, రసం, రూపం, స్పర్శ, శబ్దం: 5
(శబ్దస్పర్శరూప రసగంధాలు)

**3) జ్ఞానేంద్రియాలు :** చర్మం, కన్నులు, చెవులు, నాలుక, ముక్కు: 5
(త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణేంద్రియాలు)

**4) కర్మేంద్రియాలు :** చేతులు, కాళ్ళు, వాక్కు – గుదం – పాయువు (యోని/మేఢ్రం) :5
(వాక్పాణిపాదపాయూపస్థలు)

**5) అంతరింద్రియాలు :** మనస్సు – బుద్ధి – చిత్తం – అహంకారం – 4
దీన్ని చతుర్వింశతి అన్నారు. 24

**2) ఆత్మ :** పైన చెప్పిన ఇరువది నాల్గుతత్త్వాలకు సాక్షిభూతంగా ఉన్న పురుషుడే ఆత్మ. దీన్ని 'పంచవింశకుడు' అన్నారు. అనగా ఇరువదియైదవ తత్త్వమని గుర్తించాలి. కొందఱు వేదాంతులు 25వ తత్త్వానికి కాలమని పేరుపెట్టారు. విశ్వగర్భంలో దాగినశక్తి పురుషుడని, బాహ్యంగా కన్పిస్తున్నది కాలమని వర్గీకరించటం జరిగింది.

**3) విశ్వసృష్టి :** పరమపురుషుడు (పంచవింశకుడు) తన ఇంద్రియాన్ని ప్రకృతియందు (చతుర్వింశతి) నిక్షేపించగా అందుండి హిరణ్మయమైన 'మహత్తు' ఉదయించింది. ఆ మహత్తునుండి 'భౌతికం – అభౌతికం' అయిన విశ్వం ఆవిర్భవించింది. ఈ 'విశ్వసృష్టికి' పరమేశ్వరుని 'బీజమే కారణం'. అని వేదాంతులన్నారు.

**క. దివ్యమగు వాసుదేవా, ది వ్యూహ చతుష్టయంబు త్రిజగములందున్**
**సేవ్యం బని చెప్పంబడు, భవ్యగుణా! దాని నెఱుఁగఁ బలికెద నీకున్. 892**

**ప్రతి :** భవ్యగుణా!= పవిత్రమైన గుణాలుగల ఓ మాతా!; దివ్యము+అగు= మంగళకరమైనట్టి; వాసుదేవ+ఆది= వాసుదేవం మొదలైన; వ్యూహచతుష్టయంబు= నాల్గువ్యూహాలు; త్రిజగములందున్= ముల్లోకాలలో; సేవ్యంబు+అని= సేవింపదగినదని; చెప్పన్+పడున్= చెప్పబడింది; దానిన్= ఆ వ్యూహాన్ని; ఎఱుఁగన్= తెలిసేట్టు; నీకున్; పలికెదన్= నీకు చెపుతాను.

**తా :** 'పూజ్యురాలా'! మూడులోకాలలో పవిత్రమైనట్టిది, తప్పక ఆచరించదగినట్టిదైన 'భగవంతుని రూపవైభవాన్ని చెపుతాను' ఆ రూపం నాల్గువ్యూహాలతో కూడివుంది.

**విశే :** ఈ పద్యంలో 'వ్యూహచతుష్టయం' అనే పదం ఉంది. వ్యూహమనగా భగవంతుని రూపాన్ని కొలిచేపద్ధతి. అది నాల్గురకాలు.

**1) వాసుదేవం :** వసతి, దీవ్యతి ఇతి వాసుదేవం. ఏది సర్వకాల, సర్వావస్థల్లో ఉంటుందో, ఏది ఎల్లప్పుడు వెల్గుతూవుంటుందో అది వాసుదేవం. దీనినే అధిదైవం రూపం అంటారు. వసుదేవుని కుమారుడు వాసుదేవుడు శ్రీకృష్ణుడు. వాసుదేవం అంటే 'అధిదైవం' అని నిర్వచనం. శ్రీధరీయ వ్యాఖ్యలో దీనికి అధిభూతం అనగా 'లోకాధిష్ఠానరూపం' అని వివరణ వుంది. రోటికి కట్టివేయబడిన స్వామి అని అర్థం. అంతరంగచతుష్టయంలో దీన్ని ఆధ్యాత్మిక దృష్టితో 'చిత్తం'గా గ్రహించాలి.

**2) ప్రద్యుమ్నం :** ఇది వ్యూహచతుష్టయంలో రెండవది. దీన్ని ప్రద్యుమ్నమంటారు. దీనికి అధిష్ఠాత బ్రహ్మ. అంతరంగచతుష్టయంలో ఇది బుద్ధికి పర్యాయం.

**3) అనిరుద్ధం :** మనస్సుతో చేసే ఉపాసన 'అనిరుద్ధం'. దీని అధిష్ఠాత చంద్రుడు. కావున అంతరంగచతుష్టయంలో దీన్ని మానసికోపాసన అంటారు.

**4) సంకర్షణం :** దీనికి 'రుద్రుడు' అధిష్ఠాత. అంతరంగ చతుష్టయంలో ఇది అహంకారోపాసనగా గుర్తింపబడింది.

పైనాల్గు మనోబుద్ధిచిత్తాహంకారాలుగా విభజింపబడ్డాయని గ్రహించాలి.

సీ. సత్త్వ ప్రధానమై స్వచ్ఛమై శాంతమై యూర్మిషట్కంబుల నోసరించి
సురుచిర షాడ్గుణ్య పరిపూర్ణమై నిత్యమై భక్తజన సేవ్యమై తనర్చి
వలనొప్పుచుండు న వ్వాసుదేవ వ్యూహ మంత మహత్తత్త్వమందు నోలి
రూఢిఁ గ్రియాశక్తి రూపంబు గల్గు నహంకార ముత్పన్నమయ్యె, నదియు

తే. సరవి వైకారికంబుఁ దైజసముఁ దామ, సంబు నా మూఁడు దెఱఁగుల జరుగు, నందుఁ
దనరు వైకారికము మనస్సునకు నింద్రి, యములకును గగనముఖ భూతముల కరయ. **893**

**ప్రతి :** ఆ+వాసుదేవవ్యూహము= ఉపాసనావిధానాలలో మొదటిదైన వాసుదేవ వ్యూహం; సత్త్వప్రధానము+ఐ= సత్త్వగుణమే ముఖ్యంగా కల్గినదై; స్వచ్ఛము+ఐ= మరకలేనిదై; శాంతము+ఐ= చలించనిదై; ఊర్మిషట్కంబులన్= బుభుక్ష, తృష్ణ, శోకం, మోహం, జర, మరణం అనే ఆరు 'ఊర్మ్యు'లను; ఓసరించి= ప్రక్కకుపెట్టి; సురుచిర= మిక్కిలి కాంతిమంతమైన; షాట్+గుణ్య= వాత్సల్యం, భవశోషణ, ఉదారత్వం, అభయప్రదానం, ఆపత్కాలరక్షణ, అక్షయపదం అనే ఆరుగుణాలచే; పరిపూర్ణము+ఐ= నిండినదై; నిత్యము+ఐ= ఎల్లప్పుడు ఉండేదై; భక్తజనసేవ్యము+ఐ= భక్తులచే కొనియాడబడేదై; తనర్చి= ఒప్పారి; అంతన్= తర్వాత; మహత్+తత్త్వము+అందున్= 'మహత్తు' అనే తత్త్వంలో, ఓలిన్= క్రమంగా; వలను+ఒప్పుచున్+ఉండున్= చక్కగా విలసిల్లుతూ వుంటుంది; రూఢిన్= దృఢంగా; క్రియాశక్తిరూపంబు+కల్గు= 'క్రియాశక్తి' రూపం కల్గినట్టి; అహంకారము= అహంభావం; ఉత్పన్నము+అయ్యెన్= పుట్టింది; అదియున్= ఆ అహంకారంకూడ; సరవిన్= వరుసగా; వైకారికంబున్= సంకల్పం, వికల్పం అనే వికారాలుగలదియు; తైజసం= కాంతిమంతమైనదియు; తామసంబు= అలసత్వలక్షణంగలదియు; నాన్= అన్నట్లు; మూఁడుతెఱఁగులన్= మూడు రీతులుగా; జరుగున్= సాగుతుంది; అందున్= ఆ మూడింటిలో; అరయన్= ఆలోచింపగా; వైకారికము= సంకల్పవికల్పరూపం; మనస్సునకున్= మనస్సుకు; ఇంద్రియములకున్= జ్ఞానేంద్రియకర్మేంద్రియాలైన పదింటికి; గగనముఖ= ఆకాశం మొదలైన; భూతములకున్= నేల, నీరు, నిప్పు, గాలి, ఆకాశం అనే భూతాలకు; తనరున్= సంబంధియై ఒప్పును.

**తా :** 'మహత్తు'లో దాగిన వాసుదేవవ్యూహం సాత్త్వికగుణంగలది. మాలిన్యంలేనిది. కలతలేనిది. ఆకలి (బుభుక్ష), కోరిక, ఏడ్పు, ఆసక్తి, ముసలితనం, చావు అనే ఆరింటిని జయించినది. వాత్సల్యం మొదలైన ఆరు మంచిగుణాలతో ఒప్పారునది వెలితిలేనిది. శాశ్వతమైనది. భక్తులచే కొనియాడబడునది. ఆ 'మహత్తు' నందే క్రియాశక్తి అనే 'అహంకారం' పుట్టింది. అది వైకారికం, తైజసం, తామసం అని మూడురకాలు. ఈ మూడింటిలో వైకారికమనేది మనస్సుకు, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాలకు, పంచభూతాలకు సంబంధించినట్టిది.

**విశే : సాత్త్వికప్రధానం:** వాసుదేవం త్రిగుణాలలో 'సత్త్వగుణప్రధాన'మైంది. అందుకే అది నిర్మలమైందని, శాంతమైందని చెప్పటం జరిగింది. అది నిత్యసత్యమైన శోభగలది. భక్తజనులకు పూజనీయమైంది. మహత్తులో క్రియాశక్తి పుడుతుంది. క్రియాశక్తి అంటే అహంకారమని అర్థం. ఈ అహంకారం మూడురకాలు.

**1) వైకారికం:** ఇది వికారసంబంధి. మార్పుకు గురియౌతుంది. ఆ మార్పు సంకల్పమని వికల్పమని రెండు విధాలు. సంకల్పం సృష్టికి, వికల్పం ప్రళయానికి హేతువులు. దీనికి కామమే మూలం.

**"యస్సంకల్పవికల్పాభ్యాం వర్తతేకామసంభవః,**
**యద్విదుర్హ్యనిరుద్ధాఖ్యం హృషీకాణామధీశ్వరమ్ –** అని మూలశ్లోకం వివరిస్తోంది.

ఇంద్రియాలకు అధిష్ఠాతయైన అనిరుద్ధమే వైకారికమని మూలశ్లోకం వివరిస్తోంది.

**2) తైజసం:** ఇది 'మహత్తు'లోని రెండవలక్షణం. అనగా అహంకారంలోని రెండోదశ. ఇంద్రియాలలో దాగిన ప్రాణశక్తియే తైజసమని చెప్పబడుతుంది. తేజస్సుతో కూడింది తైజసం. ఈ తేజస్సు మిథ్యాజ్ఞానం (విపర్యయం), ప్రయాణజ్ఞానం (నిశ్చయం); నిద్రాజ్ఞానం (స్వాపం); స్మృతిజ్ఞానం (మేలుకొనుట) అనే నాల్గింటితో కూడివుంటుంది.

**3) తామసం:** తమో గుణసంబంధమైనది. ఇది భగవద్భక్తిచే ప్రేరేపింపబడినది. ఈ తామసాహంకారంవల్ల శబ్దమనే తన్మాత్ర ఉదయించింది. దానిచే ఆకాశం, దానివల్ల శ్రోత్రేంద్రియం జనించాయి.

**వ. అది దేవతారూపంబున నుండుఁ, దైజసాహంకారంబు బుద్ధి ప్రాణంబులుం గలిగి యుండుఁ, దామసాహంకారం బింద్రియ మేళనంబున నర్థమాత్రంబై యుండు మఱియును. 894**

**ప్రతి :** అది= వైకారికమనే అహంకారం; దేవతారూపంబునన్+ఉండున్= దైవరూపంగలదై వుంటుంది; తైజస+ అహంకారంబు= తైజసమనే అహంకారం; బుద్ధి ప్రాణంబులున్= బుద్ధి, మరియు ప్రాణాలైదింటిని; కలిగి+ఉండున్= కల్గివుంటుంది; తామస+అహంకారంబు= తామసమనే మూడవ అహంకారం; ఇంద్రియమేళనంబునన్= ఇంద్రియాల కూడికతో; అర్థమాత్రంబు+ఐ+ఉండున్= నిధిలాంటిదై వుంటుంది.

**తా :** వైకారికమనే అహంకారం భగవంతుని స్వరూపం. తైజసమనే అహంకారం నిశ్చయజ్ఞానంతోను, ప్రాణం, అపానం, సమానం, ఉదానం, వ్యానం అనే అయిదు ప్రాణాలతో కూడి వుంటుంది. తామసాహంకారం జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలతో ముడివడి, ఇంద్రియజ్ఞానం గలదై వుంటుంది.

**సీ. అట్టి యహంకారమం దధిష్ఠించి సాహస్ర ఫణామండలాభిరాముఁ**
**డై తనరారు ననంతుఁడు సంకర్షణుం డనఁ దగు పురుషుండు ఘనుఁడు,**
**మహిత భూతేంద్రియ మానస మయుఁడు నై కర్తృత్వ కార్యత్వ కారణత్వ**
**ప్రకట శాంతత్వ ఘోరత్వ మూఢత్వాది లక్షణ లక్షితోల్లాసి యగుచు**

**తే. నుండు నమ్మేటి రెండవ వ్యూహ మనఁగ, ఘన వికారంబుఁ బొందు వైకారికంబు**
**వలన వినుము మనస్తత్త్వ మెలమిఁ బుట్టె, మఱియు వైకారికంబును మాత! వినుము. 895**

**ప్రతి :** అట్టి= మూడురకాలైన; అహంకారమందున్= అహంకారంలో; ఉదయించి= పుట్టి; సాహస్ర= వేయి; ఫణామండల= పడగలగుంపుచే; అభిరాముండు+ఐ= ముచ్చటగొల్పువాడై; తనరారు= ఒప్పారునట్టి; అనంతుండు= ఈ పేరుగలవాడు; సంకర్షణుండు+అనన్+తగు= బలరాముడనదగిన; పురుషుండు= పురుషుడు; ఘనుఁడు= దిట్ట; మహిత= గొప్ప; భూత= పంచభూతాలు; ఇంద్రియ= కర్మేంద్రియ జ్ఞానేంద్రియాలనే పది; మానస= మనస్సుతో; మయుఁడు= కూడినవాడు ఐ; కర్తృత్వం= కర్త అన్న భావం; కార్యత్వం= కార్యభావం; కారణత్వ= పైరెండింటికి హేతువగుట; ప్రకటశాంతత్వ= స్పష్టమైనశాంతం; ఘోరత్వ= అశాంతి; మూఢత్వ= అజ్ఞానం; ఆది= మొదలగు; లక్షణ= లక్షణాలచే; లక్షిత= గుర్తింపబడి; ఉల్లాసి+అగుచున్= సంతోషించినవాడై; ఉండు= ఉన్నట్టి; ఆ+మేటి= ఆ మహాత్ముని; రెండవవ్యూహము= రెండో ఎత్తుగడ; అనన్+కన్= ఏమీ అన్నట్లు; ఘనవికారంబున్= గొప్ప భిన్నరూపాన్ని; పొందు= ధరించునట్టి; వైకారికంబువలనన్=

వైకారికమనే అహంకారంవల్ల; ఎలమిన్= ప్రీతితో; మనస్+తత్త్వము= అంతరంగ స్వరూపం; పుట్టెన్= కల్గింది; మాత! = అమ్మా; మఱియును= ఇంకా; వైకారికంబును= ఈ అహంకారాన్ని; వినుము= ఆలకించుము.

**తా :** మహత్తునుండి, అహంకార ముదయించింది. అహంకారం వైకారికం, తైజసం, తామసమని మూడురకాలు పంచభూతాలు, మనస్సు, కర్మేంద్రియజ్ఞానేంద్రియాలు వైకారికసంబంధులు కాగా బుద్ధి, మరియు పంచప్రాణాలు తైజససంబంధులు సత్త్వరజస్తమోగుణాలు మూడు తామస సంబంధులు.

ఈ అహంకారంనుండి పురుషుడు పుట్టాడు. ఆయన్ను వేయిపడగలతో విలసిల్లే అనంతుడని, సంకర్షణుడని అన్నారు. పంచభూతాలతో, పది ఇంద్రియాలతో, మానసేంద్రియంతో కూడిన రూపమాయనది. కర్త, కర్మ, కారణం, శాంతి, అశాంతి, మౌఢ్యం మొదలైన లక్షణాలతో విలసిల్లేవాడాయన. ఆయన రెండో వ్యూహం వైకారికంవల్ల గొప్ప వికారంగా పరిణతి చెందుతుంది. తత్కారణంగా 'అంతరంగ' చతుష్టయమేర్పడింది.

**అవ :** కపిలుడు తన తల్లి దేవహూతికి జ్ఞానోపదేశం చేసిన ఘట్టం. ఈ విశ్వం ప్రకృతి పురుషుల సంయోగంవల్ల పుట్టింది. పురుషుడు తన వీర్యాన్ని ప్రకృతి గర్భంలో నిక్షేపించినపుడు 'బంగారువన్నె'లో మహత్తు ఆవిర్భవించిందని, దానినుండి అహంకార ముదయించిందని, అది వైకారికం, తైజసం, తామసం అని మూడు విభాగాలని మహర్షి తల్లికి నివేదించాడు. తర్వాత ఆయన సృష్టిరహస్యాల్ని, వాసుదేవుని రెండవ వ్యూహమైన 'వైకారికాన్ని' గూర్చి వివరిస్తున్నాడు.

**వ. అది యెట్టు లంటేని సామాన్యచింతయు విశేషచింతయు ననం దగు సంకల్ప వికల్పంబులం జేసి కామసంభవం బనంబడు నెద్ది యనిరుద్ధాఖ్యం బయిన వ్యూహం; బదియ హృషీకంబులకు నధీశ్వరంబయి సకల యోగీంద్ర సేవ్యం బగుచు శరదిందీవరశ్యామం బయి యుండు; వెండియుం దైజసంబువలన బుద్ధి తత్త్వంబు పుట్టె; దాని లక్షణంబులు ద్రవ్య ప్రకాశకంబైన జ్ఞానంబును, నింద్రియానుగ్రహంబును, సంశయంబును, మిథ్యాజ్ఞానంబును, నింద్రియ నిశ్చయంబును, స్మృతియు ననం దగియుండు; మఱియుఁ దైజసాహంకారంబువలన జ్ఞానేంద్రియ కర్మేంద్రియంబులును, గ్రియాజ్ఞాన సాధనంబులును, గలిగియుండుఁ; బ్రాణంబునకుం గ్రియాశక్తియు బుద్ధికి జ్ఞానశక్తియు నగుటం జేసి యింద్రియంబులకుఁ దైజసత్వంబు గలిగియుండు; భగవద్భక్తి ప్రేరితం బయిన తామసాహంకారంబువలన శబ్దతన్మాత్రంబు పుట్టె; దానివలన నాకాశంబును, నాకాశంబువలన శ్రోత్రేంద్రియంబును బుట్టె; శ్రోత్రంబు శబ్దగ్రాహి యయ్యె; శబ్దం బర్థంబునకు నాశ్రయంబై శ్రోతకు జ్ఞానజనకం బయ్యె; మఱియు శబ్దతన్మాత్రంబువలన నాకాశం బయి యా యాకాశంబు భూతంబులకు బాహ్యాభ్యంతరంబుల నవకాశం బిచ్చుటయు, నాత్మ ప్రాణేంద్రియాదులకు నాశ్రయం బగుటయు నను లక్షణంబులు గలిగియుండుఁ; గాలగతిచే వికారంబు నొందు; శబ్ద తన్మాత్ర లక్షణంబగు నభంబువలన స్పర్శంబును, స్పర్శంబువలన వాయువును, వాయువుచే స్పర్శ గ్రాహియైన త్వగింద్రియంబును బుట్టె; మృదుత్వంబును, గఠినత్వంబును, శైత్యంబును, నుష్ణత్వంబును నననివి స్పర్శంబునకు స్పర్శత్వం బని చెప్పంబడు; మఱియు వాయువునకుఁ జాలనంబును పరస్పర విభాగకరణంబును దన్మేళనంబును ద్రవ్యశబ్ద నేతృత్వంబును నగు; నందు గంధవంతంబగు ద్రవ్యంబును ఘ్రాణేంద్రియంబు నొందించుట ద్రవ్యనేతృత్వంబు;**

దూరస్థం బగు శబ్దంబును శ్రోత్రేంద్రియ గ్రాహ్యమగు నట్లొనరించుట శబ్ద నేతృత్వంబు, సర్వేంద్రియాత్మకత్వంబు ననునివి లక్షణంబులై యుండు; దైవ ప్రేరితంబై స్పర్శతన్మాత్ర గుణకంబగు వాయువువలన రూపంబును, దానివలనఁ దేజంబును బుట్టె; రూపంబు నేత్రేంద్రియ గ్రాహకం బయ్యె; నేత్రగతంబయిన రూపంబునకు నుపలంభకత్వంబును ద్రవ్యాకార సమత్వంబును ద్రవ్యంబునకు నుపసర్జనం బగుటయు ద్రవ్యపరిణామ ప్రతీతియు నివి రూపవృత్తు లనంబడు; దైజసంబునకు సాధారణంబులగు ధర్మంబులు ద్యోతనం బనం బ్రకాశంబు, పచనంబనఁ దండులాదుల పాకంబు, పిపాసానిమిత్తంబైన పానంబు, క్షున్నిమిత్తంబైన యోదనంబు, హిమమర్దనంబగు శోషణంబు నను నివి వృత్తులై యుండు; రూపతన్మాత్రంబువలన దైవచోదితంబై వికారంబు నొందు తేజస్సువలన రసతన్మాత్రంబు వుట్టె; రసతన్మాత్రంబువలన జలంబు వుట్టె, జిహ్వ యను రసనేంద్రియంబు రసగ్రాహకం బయ్యె, నా రసం బేకంబై యుండియు భూతవికారంబునంజేసి కషాయ తిక్త కట్వామ్ల మధురాది భేదంబుల ననేక విధంబయ్యె; వెండియు సాంసర్గిక ద్రవ్య వికారంబునం జేసి యార్ద్రం బగుటయు, ముద్దగట్టుటయుఁ, దృప్తి దాతృత్వంబును, జీవనంబును, దద్వైక్లబ్యనివర్తనంబును, మృదూకరణంబును, దాపనివారణంబును, గూపగతంబైన జలంబు దివియ మఱియు నుద్గమించుటయు నను నివి జలవృత్తు లనంబడు; రసతన్మాత్రంబు వలన దైవచోదితంబై వికారంబునం బొందిన జలంబువలన గంధతన్మాత్రంబు పుట్టె; దానివలనం బృథ్వియుఁ గలిగె; ఘ్రాణంబు గంధ గ్రాహకం బయ్యె; నందు గంధం బేకంబయ్యు వ్యంజనాది గతంబయి హింగ్వాది నిమిత్తంబయిన మిశ్ర గంధంబును, కరంభంబును, గృంజనాది గతంబైన పూతిగంధంబును, ఘనసారాది నిమిత్తంబైన సుగంధంబును, శతపత్రాది గతంబగు శాంత గంధంబును, లశునాది గతంబైన యుగ్రగంధంబును, బర్యుషితచిత్రాన్నాదిగతం బయిన యామ్లగంధంబును, ద్రవ్యావయవ వైషమ్యంబునం జేసి యనేక విధంబై యుండు; నదియునుంగాక ప్రతిమాది రూపంబులంజేసి సాకారతాపాదనం బగు భావంబును, జలాదివిలక్షణ త్రయాంతర నిరపేక్షంబైన స్థితియు, జలాద్యాధారత యను ధారణంబును, నాకాశా ద్యవచ్ఛేదకత్వంబును, సకల ప్రాణి పుంస్త్వాభివ్యక్తీకరణంబును నను నివి పృథ్వీవృత్తు లనంబడు నని చెప్పి వెండియు నిట్లనియె; నభోఽసాధారణ శబ్ద విశేష గ్రాహకంబు శ్రోత్రంబును, వాయ్వసాధారణ గుణ విశేష గ్రాహకంబు స్పర్శంబును, దేజోఽసాధారణ గుణ విశేష గ్రాహకంబు చక్షురింద్రియంబును, నంభోఽసాధారణ గుణ విశేషగ్రాహకంబు రసనేంద్రియంబును, భూమ్యసాధారణ గుణ విశేషగ్రాహకంబు ఘ్రాణేంద్రియంబును, నాకాశాది గుణంబు లగు శబ్దాదులు కార్యంబు లగు వాయ్వాదులందుఁ గారణాన్వయంబునఁ జూపట్టనన్నిటికిం బృథ్వీ సంబంధంబు గలుగుటం జేసి భూమియందు శబ్ద స్పర్శరూప రసగంధంబులు గలుగు. మహదాది పృథివ్యంతంబులగు నీ యేడు తత్త్వంబులు పరస్పర మిళితంబులై భోగాయతనంబగు పురుషునిం గల్పింప నసమర్థంబులై యున్నం జూచి కాలాదృష్ట సత్త్వాదులం గూడి జగత్కారణుండును, త్రైగుణ్య విశిష్టుండును, నశేష నియామకుండును, నిరంజనాకారుండును నగు సర్వేశ్వరుం డందుఁ బ్రవేశించు నంత నన్యోన్యక్షుభితంబులై మిళితంబులైన మహదాదులవలన నధిష్ఠాతృ చేతనరహితం బగు నొక యండంబు వుట్టె నందు. **896**

**ప్రతి :** సామాన్యచింతయున్= సామాన్యమైన తలంపు; విశేషచింతయున్= విశిష్టమైన తలంపు; అనన్+తగు= అనబడే; సంకల్పవికల్పంబులన్+చేసి= సంకల్పము, వికల్పమనే రెండింటికారణంగా; కామసంభవంబు+అనంబడున్= కోరికలవల్ల పుట్టిందని చెప్పబడు; ఏది= ఏ వికారం; అనిరుద్ధ+ఆఖ్యంబు+ఐన= అనిరుద్ధమనే పేరుగల; వ్యూహము= గొప్ప ఊహయో; అదియ= ఆ ఊహయే; హృషీకంబులకున్= ఇంద్రియాలకు; అధి+ఈశ్వరంబు+ఐ= ప్రభువై; సకల= సమస్తమైన; యోగి+ఇంద్ర= యోగీశ్వరులచే; సేవ్యంబు+అగుచున్= కొనియాడబడినదై; శరత్+ఇందీవర= శరత్కాలమునందలి నల్లగలువవలె; శ్యామంబు+ఐ+ఉండున్= నల్లగా ఉంటుంది; వెండియున్= మఱియు; తైజసంబువలనన్= అహంకారంవల్ల పుట్టిన తేజస్సువల్ల; బుద్ధితత్త్వంబు= బుద్ధిస్వరూపం (నిశ్చయాత్మకతత్త్వం), పుట్టెన్; దాని లక్షణంబులు= ఆ బుద్ధికి గుర్తులు; ద్రవ్యప్రకాశంబు+ఐన= వస్తువుని తెల్పే; జ్ఞానంబును= తెలివియు; ఇంద్రియ+అనుగ్రహంబును= ఇంద్రియపాలనం; సంశయంబును= సందేహమూ; మిథ్యాజ్ఞానంబును= భ్రాంతియున్ (నాస్తికత); నిద్రయున్= సుషుప్తియు; నిశ్చయంబును= నిర్ణయం; స్మృతియున్= స్మరణ; అనన్+తగియుండున్= అని పిలువబడుతాయి; తైజసాహంకారంబువలనన్= తేజస్సుఅనే అహంకారంవల్ల; జ్ఞానేంద్రియకర్మేంద్రియంబులును= ముక్కు, చెవి, కన్ను, నాలుక, చర్మం అనే అయిదు జ్ఞానేంద్రియాలు; వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థలనే అయిదు కర్మేంద్రియాలును; క్రియాజ్ఞానసాధనంబులును= కర్మేంద్రియక్రియలు; జ్ఞానేంద్రియజ్ఞానములకు ఆధారాలుగా; కలిగి+ఉండున్; ప్రాణంబునకున్= ప్రాణానికి; క్రియాశక్తియున్= కార్యశక్తి; బుద్ధికిన్= నిశ్చయసాధనమైన మనశ్శక్తికి; జ్ఞానశక్తియున్= తెలికొనే సామర్థ్యం; అగుటన్+చేసి= ఉన్నందువల్ల; ఇంద్రియంబులకున్= పది ఇంద్రియాలకు; తైజసత్వంబు= తేజస్సు; కలిగి+ఉండున్= స్వాధీనమై ఉంటుంది; భగవత్+భక్తి= దైవభక్తిచేత; ప్రేరితంబు+ఐన= ప్రేరేపించబడినట్టి; తామస+అహంకారంబువలనన్= తామసమనే అహంకారంవల్ల; శబ్దతన్మాత్రంబు= శబ్దమనెడి తన్మాత్ర; పుట్టెన్; దానివలనన్= ఆ శబ్దతన్మాత్రవల్ల; ఆకాశంబును= మిన్ను; ఆకాశంబువలనన్= మింటివల్ల; శ్రోత్ర+ఇంద్రియంబును= చెవి అనే జ్ఞానేంద్రియం; పుట్టెన్= పుట్టెను; శ్రోత్రంబు= చెవి; శబ్దగ్రాహి+అయ్యెన్= శబ్దాన్ని గ్రహించింది; శబ్దంబు= సవ్వడి; అర్థంబునకున్= జ్ఞానానికి; ఆశ్రయంబు+ఐ= ఆధారమై; శ్రోతకున్= వినెడివానికి; జ్ఞానజనకంబు+అయ్యెన్= తెలివిడి కల్గించింది; మఱియున్= ఇంకా; శబ్దతన్మాత్రంబువలనన్= శబ్దరూపతన్మాత్రవల్ల; ఆకాశంబు+అయి= అణురూప ఆకాశమై (దీనినే అధ్యాత్మం అంటారు) ఆ+ఆకాశంబు= ఆ అణురూపాకాశమే; భూతంబులకున్= జీవులకు; జీవేతరులకు; బాహ్య+అభ్యంతరంబులన్= వెలుపల; లోపల (అంతట); అవకాశంబు= వసతి; ఇచ్చుటయున్= కల్పించుటయును; ఆత్మ= ఆత్మ; ప్రాణ+ఇంద్రియాదులకున్= ప్రాణాదులకు; తక్కిన దశేంద్రియాలకు; ఆశ్రయంబు+అగుటయున్= ఆధారమగుట; అను= అనే; లక్షణంబులు= గుర్తులు; కలిగి+ఉండున్; కాలగతిచేన్= కాలగమనంవల్ల; వికారంబు+ఒందున్= మార్పుచెందుతుంది; శబ్దతన్మాత్రలక్షణంబు+అగు= శబ్దమనే తన్మాత్ర గుర్తుగాగల; నభంబువలనన్= ఆకాశంవల్ల; స్పర్శంబును= తాకిడియును; స్పర్శంబువలనన్= తాకుడువల్ల; వాయువును= గాలియు; వాయువుచేన్= గాలిచేత; స్పర్శగ్రాహి+ఐన= స్పర్శనిపొందిన; త్వక్+ఇంద్రియంబును= చర్మ అనే జ్ఞానేంద్రియం; పుట్టెన్= పుట్టింది; మృదుత్వంబున్= మెత్తదనము; కఠినత్వంబును= కాఠిన్యము; శైత్యంబును= చల్లదనము; ఉష్ణత్వంబున్= వేడిమియును; అనునివి= ఈ లక్షణాలు; స్పర్శంబునకున్= తాకిడికి; స్పర్శత్వంబు+అని చెప్పంబడున్= తెల్పబడినవి; మఱియున్= అంతేగాక; వాయువునకున్= గాలికి; చాలనంబును= కదలించుట; తద్+మేళనంబునున్= కూడిక; ద్రవ్యశబ్దనేతృత్వంబును= వస్తుగతమైన శబ్దాధికారము; సర్వ+ఇంద్రియాత్మకత్వంబును= దేహేంద్రియాలన్నింటనుండుట అనునవి; లక్షణంబులు+ఐ+ఉండున్= గుర్తులుగా ఉంటాయి; దైవప్రేరితంబు+ఐ= దైవంచేత ప్రేరేపింపబడినదై; స్పర్శతన్మాత్రగుణకంబు+అగు= స్పర్శ (తాకుట) అనే తన్మాత్రగుణంకల్గినట్టి; వాయువువలనన్= గాలివల్ల; రూపంబును= స్వరూపం; దానివలనన్= ఆ

వాయురూపంచేత; తేజంబును= అగ్నియు, పుట్టెన్; రూపంబు= ఆ రూపము; నేత్ర+ఇంద్రియ= కంటిచే; గ్రాహకంబు+అయ్యెన్= గ్రహింపబడింది; ద్రవ్య+ఆకారసమత్వంబును= వస్తుగతమైన ఏకాకృతియు; ద్రవ్యంబునకున్= పదార్థమును; ఉపసర్జనంబు+అగుటయున్= ప్రాధాన్యం లేకపోవుట; ద్రవ్యపరిమాణప్రతీతియున్= పదార్థపుకొలతలోనిఎఱుక; ఇవి= ఈ మూడున్నూ; రూపవృత్తులు+అనంబడును= ఆకృతియే నడవడికగా గల్గినవి; తైజసంబునకున్= తేజస్సునకు; సాధారణంబులు+అగు= సామాన్యమైనట్టి; ధర్మంబులు= లక్షణాలు; ద్యోతనంబు+అనన్+ప్రకాశంబు= ద్యోతనమనే పేరుగల వెలుగు; (కాంతియనుట) పచనంబు+అనన్= పచనం అనేపేరుగల; పాకంబు= వంట; పిపాసానిమిత్తంబు+ఐన= దప్పిక కారణమైనట్టి; పానంబు= నీరు; క్షుత్+నిమిత్తకంబు+ఐన= ఆకలి కారణమైన; ఓదనంబు= ఆహారం; హిమమర్దనంబు+అగు= చల్లదనాన్ని హరించే; శోషణంబు= ఇంకుడు గుణం (శోషిల్లుట); అను+ఇవి= ఈ ప్రకాశం; పాకం, పానం, అన్నం, శోషణ వగైరా; వృత్తులు+ఐ+ఉండున్= వ్యాపారాలుగా ఉంటాయి; రూపతన్మాత్రంబువలనన్= రూపమనే తన్మాత్రవల్ల; దైవచోదితంబు+ఐ= దైవంచేత ప్రేరేపింపబడినదై; వికారంబున్+ఒందు= మార్పుచెందేటటువంటి; తేజస్సువలనన్= అగ్నివల్ల; రసతన్మాత్రంబు= రసమనే తన్మాత్ర; పుట్టెన్= పుట్టింది; రసతన్మాత్రంబువలనన్= రసతన్మాత్రవల్ల; జలంబు= నీరు; పుట్టెన్= కల్గింది; జిహ్వ+అను= జిహ్వ అనే పేరుగల; రసనా+ఇంద్రియంబు= నాలుక; రసగ్రాహకంబు+అయ్యెన్= జలాన్ని గ్రహించేది అయింది; ఆ రసంబు= ఆ నీరు; ఏకంబు+అయ్యున్= ఒక్కటే అయినప్పటికి; భూతవికారంబునన్+చేసి= భౌతికవికారంచేత; కషాయ= ఒగరు; తిక్త= చేదు; కటు= కారం; ఆమ్ల=పులుపు; మధుర= తీపు; ఆదిభేదంబులన్= మొదలైన తేడాలతో; అనేక విధంబులు+అయ్యెన్= పెక్కు విధాలైనవి; వెండియున్= మఱియు; సాంసర్గిక= కూడికవలని; ద్రవ్యవికారంబునన్+చేసి= ద్రవ్యవిక్రియకారణంగా; ఆర్ద్రంబు+అగుటయున్= తడియుట; ముద్ద+కట్టుటయున్= గట్టిపడుట (ఘనీభావం); తృప్తిదాతృత్వంబును= తనివి; జీవనంబును= బ్రతుకుదెరువు; తత్+వైక్లబ్యనివర్తనంబును= జీవనమునందలి బాధానివృత్తియు; మృదూకరణంబును= మెత్తదనము; తాపనివారణంబును= వేడిమి తొలగుట; కూపగతంబు+ఐన= బావిలో చేరిననీరు; తివియన్= తోడగా; మఱియున్= మిక్కిలిగా; ఉద్గమించుటయును= పైకి ఉబుకుటయు; అను+ఇవి= పైచెప్పినవన్నీ; జలవృత్తులు+అనంబడును= నీటి లక్షణాలుగా ఉన్నాయి; రసతన్మాత్రంబువలనన్= రసమనే తన్మాత్రవల్ల; దైవచోదితంబు+ఐ= విధిచే ప్రేరేపింపబడ్డదై; వికారంబున్+పొందిన= వికృతిపొందిన; జలంబువలనన్= నీటివల్ల; గంధతన్మాత్రంబు= వాసన అనే తన్మాత్ర; పుట్టెన్= కల్గింది; దానివలనన్= గంధతన్మాత్రవల్ల; పృథ్వియున్= భూమి; కలిగెన్= కల్గింది; ఘ్రాణంబు= నాసిక; గంధగ్రాహకంబు+అయ్యెన్= వాసన గ్రహించేదయింది; (అందున్= దానిలో; ఏకంబు= ఒకటి; వ్యంజన+ఆదిగతంబు+ఐ= బయలుపరుపబడినదై (సంస్కరింపబడినది); హింగు+ఆదినిమిత్తంబు+ఐన= ఇంగువ మొదలైనవాటికి హేతువైన; (మిశ్రగంధంబు+అను= రెండింటితో కలిసినవాసన); కరంభంబును= పెరుగుతో కలిపిన పేలపిండియు; (గృంజన+ఆదిగతంబు+ఐన= విషం తిన్న పశుమాంసంతోకూడిన); పూతిగంధంబును= దుర్వాసనయు; ఘనసార+ఆది+గతంబు+ఐన= కర్పూరం వగైరాలలో ఉన్న; సుగంధంబును= సువాసనయు; (శతపత్ర+ఆదిగతంబు+అగు తామర మున్నగువానిలోనున్నట్టి); శాంతగంధంబును= నెమ్మదియైన వాసనయు; (లశున+ఆదిగతంబు+ఐన= వెల్లుల్లితోకూడిన); ఉగ్రగంధంబును= సహించరానివాసనయు; పర్యుషిత+చిత్ర+అన్న+ఆదిగతంబు+ఐన= చద్దికూటితోడిదైన; ఆమ్లగంధంబును= పులుపువాసనయు; ద్రవ్య+అవయవ= పదార్థాలతోకూడిన; వైషమ్యంబునన్+చేసి= విషమత్వంచేత; అనేకవిధంబు+ఐ+ ఉండున్= పెక్కు రకాలుగా ఉంటుంది; అదియున్+కాక= పైనచెప్పబడిందేకాదు; ప్రతిమా+ఆదిరూపంబులన్+చేసి= బొమ్మల ఆకారాలవల్ల; సాకారతా+ఆపాదనంబు+అగు= ఆకృతిని పొందుటఅనే; భావనంబును= ఊహయు; జల+ఆది= నీరు మొదలైన; విలక్షణత్రయ+అంతర+నిరపేక్షంబు+ఐన=

జలం, అగ్ని, వాయువు అనే మూడింటి అపేక్షలేనిది అయిన; స్థితియున్= ఉనికి; జల+ఆది+ఆధారత= జలం మున్నగువానికి ఆధారంగా ఉన్నట్టి; ధారణంబును= పట్టు; ఆకాశ+ఆది= ఆకాశం మొదలైనవాటితో; అవచ్ఛేదకత్వమును= వేరుపడుటయు; సకలప్రాణి= సమస్తజీవులయొక్క; పుంస్త్వ+అభివ్యక్తీకరణంబు= ప్రౌఢత్వాన్ని బయలుపరచుటయు; అను+ఇవి= మొదలైనవి; పృథ్వీవృత్తులు+అనంబడున్= భూమిలక్షణాలని చెప్పబడ్డాయి; అని చెప్పి= ఈ విధంగా చెప్పి; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= కపిలుడు ఈ విధంగా చెప్పాడు; నభస్+గుణవిశేషంబు= ఆకాశగుణం; శ్రోత్రంబును= చెవియు; వాయుగుణవిశేషంబు= గాలి లక్షణం; స్పర్శంబును= తాకుడును; తేజస్+గుణవిశేషంబు= అగ్నిలక్షణం; చక్షుస్+ఇంద్రియంబును= కన్నును; భూమిగుణవిశేషంబు= నేలగుణం; (పృథ్వీ) ఘ్రాణ+ఇంద్రియంబును= నాసికయు (ముక్కు); అగున్= అవుతుంది; ఆకాశ+ఆదిగుణంబులు+అగు= మింటిలక్షణాలుగలవైనట్టి; శబ్ద+ఆదులు= ధ్వని మొదలైనవి; కార్యంబులు+అగు= క్రియారూపమైన; వాయు+ఆదులందు= గాలిమున్నగువాటికి; కారణ+అన్వయంబునన్= కారణంగా, చూపట్టన్= తోపగా; అన్నిటికిన్= పైవానికన్నింటికి; పృథ్వీసంబంధంబు+కలుగుటన్+చేసి= మట్టితో సంబంధం కల్గుటవల్ల; భూమియందున్= మట్టిలో; శబ్ద, స్పర్శ, రూప, రస; గంధంబులు= ధ్వని; తాకుడు; స్వరూపం, పానం, వాసన అనే తన్మాత్రలు; కలుగున్= సంభవిస్తాయి; (మహత్+ఆది= మహత్తు మొదలుకొని; పృథివీ+అంతంబులు+అగు= నేలదాక; ఈ+ఏడుతత్త్వంబులు= సప్తతత్త్వాలు అనగా 'మహత్తు, అహంకారం, పృథివి, అప్, తేజస్సు, వాయువు, ఆకాశం అనేవి) పరస్పరమిళితంబులు+ఐ= ఒండొంటితో ఒరసికొన్నవై; భోగ+ఆయతనంబు+అగు= భోగాలకు నెలవైనట్టి; పురుషునిన్= పురుషుని; కల్పింపన్= పుట్టింపగా) అసమర్థంబులు+ఐ= శక్తిలేనివై; ఉన్నన్+చూచి= ఉండగాతెలిసి; (కాల+అదృష్ట= కాలము అదృష్టము; సత్త్వ+ఆదులన్+కూడి= సత్త్వం, రజస్సు, తమస్సు అనే త్రిగుణాల్నితాల్చి); జగత్+కారణుండును= విశ్వానికి మూలహేతువైనవాడును; త్రైగుణ్యవిశిష్టుండును= సత్త్వరజస్తమోగుణాలనే మూడింటిచే కూడినవాడును; అశేషనియామకుండును= మొత్తాన్ని శాసించేవాడును; నిరంజన+ఆకారుండును= దోషంలేనివాడును (అంట్లుసొంట్లులేని ఆకృతిగలవాడు); అగు= అయినట్టి; సర్వ+ఈశ్వరుండును= విశ్వమంతటికి ప్రభువు; అందున్= ఆ యేడింటిలో; ప్రవేశింపన్= చొరబడగా; అంతన్= తర్వాత; అన్యోన్యక్షుభితంబులు+ఐ= ఒండొంటితో కలతచెంది; మిళితంబులు+ఐ= ఒకదానితో వేరొకటి కలిసిపోయినవై; మహత్+ఆదులవలనన్= మహత్తు మొదలైన ఏడింటివల్ల; అధిష్ఠాతృ= అధిష్ఠాత (ఆరూఢుడు= ఎక్కికూర్చున్నవాడు); చేతనరహితంబు+అగు= చైతన్యంలేనట్టి; ఒక్క+అండంబు= ఒక్క గ్రుడ్డు; పుట్టెన్= పుట్టింది; అందున్= ఆ గ్రుడ్డునందు...

**తా :** కపిలుడు తల్లియైన దేవహూతితో ఇలా అంటున్నాడు –

"అమ్మా! జీవుని ఆలోచనలు పరిమితమైనవి, అపరిమితమైనవి అని రెండు రకాలు. వీటికి జీవుల మనోవృత్తి, భ్రాంతి అనేవి రెండు కారణాలు. ఇవన్ని కోరికలవల్ల కల్గుతాయి. మనసులో పుట్టే వికారాన్ని 'అనిరుద్ధ' మంటారు. అంటే అది ఒక అడ్డుపెట్టరాని ఊహ. అది దేహేంద్రియాలన్నింటిని శాసించే ప్రభువు. పరమయోగులుసైతం దాన్ని మన్నిస్తారు. అది శరత్కాలంలో వికసించే నల్లకలువమాదిరి నీలవర్ణం గలదై వుంటుంది.

అంతేగాదు. తేజస్సువల్ల నిశ్చయాత్మకమైన బుద్ధి జనిస్తుంది. ఆ బుద్ధికి వస్తుజ్ఞానం, ఇంద్రియాల్ని అనుమతించటం; సందేహం, భ్రాంతి, జాగ్రత్త, స్వప్నం, సుషుప్తి అనే త్రివిధదశలు. నిర్ణయశక్తి, జ్ఞాపకశక్తి అనేవి లక్షణాలు. తేజస్సు అనేదొక అహంకారం. దానికి ముక్కు, చెవి, కన్ను, నాలుక, చర్మం అనే అయిదు జ్ఞానేంద్రియాలు. వాక్కు, కాలు, చేయి,

గుదం, జననేంద్రియం అనే అయిదు కర్మేంద్రియాలు, మరియు జ్ఞానేంద్రియక్రియలు, కర్మేంద్రియక్రియలు ఆధారంగా ఉంటాయి. ప్రాణానికి పనితనం, బుద్ధికి తెలివిడి వున్నందువల్ల ఈ పదిఇంద్రియాలు తేజస్సుగల్గి వుంటాయి.

ఇక తామసమనే అహంకారంవల్ల శబ్దమనే తన్మాత్ర పుట్టింది. దానివల్ల ఆకాశం, దానివల్ల శ్రోతమనే జ్ఞానేంద్రియం పుట్టాయి. ఈ శ్రోత్రం (చెవి) శబ్దాన్ని గ్రహించింది. శబ్దానికి అర్థం ఏర్పడింది. అది వినేవాడికి జ్ఞానాన్ని కల్గించింది.

తర్వాత ఈ శబ్దరూపతన్మాత్ర అణురూపాకాశమై విశ్వంలో స్థావరజంగమాత్మకమైన పదార్థాలకు లోపలవెలుపల వసతి కల్పించింది. ఇక మనస్సు ప్రాణానికి, పది ఇంద్రియాలకు ఆశ్రయంగా వుంది. అయితే ఈ మనస్సు కాలగతిని బట్టి వికారానికి లోనవుతూ ఉంటుంది.

శబ్దతన్మాత్ర అనేది ఆకాశానికి లక్షణం. ఆకాశంవల్ల స్పర్శజ్ఞానం, దానివల్ల గాలి, గాలివల్ల చర్మజ్ఞానేంద్రియం పుట్టాయి. మెత్తదనం, చల్లదనం, వేడి, అనేవి స్పర్శలక్షణాలు. అంతేగాదు గాలికి కదలించి కూర్చుట, వస్తుగత శబ్దాధికరణం, ఇంద్రియాలలో స్థిరవాసం అనేవి లక్షణాలు.

గాలి స్పర్శతన్మాత్రలక్షణం గలది. దానివల్ల రూపం, రూపంవల్ల తేజస్సు, పుట్టాయి. కంటితో రూపాన్ని చూడటం జరిగింది. వస్తువులో సమత, పదార్థానికి ప్రాధాన్యము లేకపోవటం, అనే పదార్థంలోని కొలత. అనే మూడూ రూపవృత్తులవుతాయి. తేజస్సుకు ఆకృతియే లక్షణం. ప్రకాశం, వంట, నీరు, ఆకలి అనేవి తేజోవృత్తులు. దైవప్రేరణవల్ల ఏర్పడే రూపతన్మాత్రవల్లనూ, తేజస్సువల్లనూ నీరుపుట్టింది. నాలుక నీటిని గ్రహిస్తుంది. ఆ నీరు వస్తుతః ఏకాకృతిగలదైనప్పటికి భౌతికవికారంవల్ల ఒగరు, చేదు, కారం, పులుపు, తీపు అని పలురకాలవుతుంది. ఇంకా ద్రవ్యవికృతివల్ల తడియుట, గట్టిపడుట (ఘనీభావం), ఇంపుగొల్పుట, బ్రతుకుదెరువు నిచ్చుట, బాధల్ని నివారించుట, మెత్తదనం, వేడిమినిపోగొట్టుట. బావినీరు తోడుట, పైకి ఉబికేటట్లు చేయుట వంటివన్నీ నీటికి లక్షణాలు.

రసతన్మాత్ర వికారంచెందటంవల్ల జలమైంది. జలంవల్ల గంధమనే తన్మాత్ర కల్గింది. దానివల్ల భూమి ఏర్పడింది. నాసిక వాసనని గ్రహించింది. ఆ వాసన ఇంగువ, పేలపిండి, దుర్వాసన, కర్పూరంవంటి సువాసన, ఆహ్లాదకరమైన వాసన; వెల్లుల్లివాసన; చద్దివాసన, పుల్లదనంవంటి పెక్కురకాలుగా మార్పుచెందుతుంది. ఇందుకు పెక్కుపదార్థాల కలయికయే కారణం.

బొమ్మలుగా నేర్పడుట; జలం, అగ్ని, వాయువు అనే మూడింటితో సంబంధం లేనిస్థితి; జలానికి ఆధారమగుట, ఆకాశానికి భిన్నంగా ఉండుట, అన్నిరకాల జీవుల్లోని పురుషలక్షణాన్ని బహిర్గతంచేయుట అనేవి భూమి లక్షణాలు.

ఇంకా ఇలా చెపుతున్నాడు కపిలుడు.

శబ్దగుణం గలది ఆకాశం. స్పర్శగుణం గలది వాయువు. తేజోగుణంగలది అగ్ని. రసగుణంగలది జలం. గంధలక్షణం గలది భూమి. శబ్దానికి చెవి, స్పర్శకు చర్మం (త్వక్); రూపానికి అగ్ని; రసానికి నాలుక; గంధానికి ముక్కు (నాసిక) ఆధారంగా ఉన్నాయి.

**పంచభూతాలు :** పంచతన్మాత్రలు – 1. భూమి – గంధం; 2. నీరు – రసం; 3. అగ్ని – రూపం; 4. గాలి – స్పర్శ; 5. ఆకాశం – శబ్దం.

మహత్తు, అహంకారం, భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశం అనేవి ఏడుతత్త్వాలు. ఇవి ఒకదానితో వేరొకటి సంబంధం కలవై వుంటాయి. భోగాలకు అనువైనవి. వీటివల్ల పురుషాకృతి ఏర్పడటానికి వీలులేకపోవటంవల్ల విశ్వకారకుడును, సత్త్వరజస్తమోగుణాలతో కూడినవాడును, విశ్వశాసకుడును, నిర్దోషియునైన సర్వేశ్వరుడు పై ఏడుతత్త్వాల్లో ప్రవేశించాడు. అప్పుడు మహదాదుల ప్రభావంవల్ల చైతన్యంలేని ఒక్క అండం (గ్రుడ్డు) వాటినుండి పుట్టింది. ఆ గ్రుడ్డులో

**సీ. గురుశక్తితో విరాట్పురుషుండు సంభవం బయ్యె, నయ్యండంబు నర్థిఁ బొదివి**
**యంబు ముఖావరణంబు లొక్కొకటికి దశగుణితంబులై తవిలి యావ**
**రణములై యుండును, గ్రమమున లోకంబులకు "మేలుకట్ల" పోలికఁ దనర్చి**
**పంకజోదరుని రూపము విలసించును, లోలత జలములోఁ దేలుచున్న**

**తే. హేమమయమైన యండంబులో మహాను, భావుఁ డభవుండు హరి దేవదేవుఁ డఖిల**
**జేత నారాయణుఁడు ప్రవేశించి యపుడు, విష్ణుపద భేదనంబు గావించి యందు. 897**

**ప్రతి :** విరాట్+పురుషుండు= ఆదిదేవుడు; గురుశక్తితోన్= గొప్పశక్తితో; అర్థిన్= కోరికగల్గి; ఆ+అండమున్= విచిత్రమైన ఆ గ్రుడ్డును; పొదివి= క్రమ్ముకొని; అంబుముఖ+ఆవరణంబులు= నీరు మొదలైన ఏడు ఆవరణాలు; ఒక్క+ఒక్కటికిన్= ఆ యేడింటిలో ప్రతి ఆవరణానికి; దశగుణితంబులు+ఐ= పదిగా లెక్కింపబడినవై (ఇవి జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలు); తగిలి= ఆవరించి; ఆవరణములు+ఐ+ఉండును= చుట్టుకొనివుంటాయి; క్రమమునన్= వరుసగా; లోకంబులకున్= పదునాల్గు భువనాలకు; మేలుకట్లపోలికన్= మెట్లమాదిరిగా (ఉల్లెడలుగా); తనర్చి= ఒప్పి; పంకజ+ఉదరుని= తామర బొడ్డునందుగల విష్ణువు; రూపము= ఆకారం; విలసించును= ప్రకాశిస్తుంది; లోలతన్= కదలికతో; జలములోన్= నీటిలో; తేలుచున్న= పైకి ఉబుకుతున్నట్టి; హేమమయము+ఐన= బంగారు మయమైన; అండంబులోన్= గ్రుడ్డులో; మహా+అనుభావుఁడు= గొప్ప మహిమగలవాడును; అభవుండు= పుట్టుకలేనివాడును; హరి, దేవదేవుఁడు= దేవతలకు ప్రభువైనవాడును; అఖిలజేత= విశ్వానికి నాయకుడును; (అయిన) నారాయణుఁడు= వైకుంఠుడు; ప్రవేశించి= చొచ్చి; అపుడు; విష్ణుపదభేదనంబు+కావించి= ఆకాశాన్ని తెరిచి; అందున్= దానిలో...

**తా :** ఆ గ్రుడ్డునుండి మహాశక్తిగల విరాట్పురుష దవతరించాడు. ఆ పురుషుణ్ణి ఏడు ఆవరణాలు (మహత్తు, అహంకారం, పృథివి, నీరు, తేజస్సు, వాయువు, ఆకాశం); అందొక్క ఆవరణానికి జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలు పది ఆవరణాలు – చుట్టుకొనివున్నాయి. అవి పదునాల్గులోకాలకు ఉల్లెడపట్టినట్లున్నాయి. అందులో పద్మనాభుని రూపం విరాజిల్లుతున్నది. నీటిలో తేలియాడుతున్న ఆ బంగారుమయమైన గుడ్డులో మహాత్ముడైన నారాయణమూర్తి ప్రవేశించి 'ఆకాశాన్ని తెరిచాడు. అందులో –

**విశే :** ఈ పద్యంలో విరాట్పురుషుని ప్రస్తావనవుంది. ఆ పురుషుడు దివ్యశక్తితో కూడినవాడు. ఆ శక్తిని ఆవరించి సప్తావరణాలున్నాయి – అవి 'మహత్తు, అహంకారం, నీరు, అగ్ని, నేల, గాలి, ఆకసం అనేవి. వీటిలో ఒక్కొక్కటి దశావరణాలు కల్గివున్నాయి. అవి చెవి, కన్ను, ముక్కు, నాలుక, చర్మం అనే జ్ఞానేంద్రియాలతోను, మాట, కాళ్ళు, చేతులు, జననేంద్రియం, గుదం అనేక కర్మేంద్రియాలతోను వెరసి పది ఇంద్రియాలతో ఆవరించివుంది. ఈ ఏడు ఆవరణాలు, పదిఇంద్రియాలు కలిసి విశ్వసృష్టి అనే మేడకు మెట్లు, ఆ బంగారువన్నె గుడ్డులోనికి నారాయణుడు ప్రవేశించి 'బ్రహ్మాండాన్ని' తెరిచాడు. చతుర్దశభువనాలకు ఆధారమైనది ఆకాశమే అనే విశ్వసత్యం ఈ పద్యంలో అభివ్యక్తమైంది.

**విష్ణుపదం :** విష్ణుమూర్తికి పాదపీఠంకాబట్టి ఆకాశానికి ఆ పేరు వచ్చింది. అభవుడు అనగా పుట్టుకలేనివాడు. శ్రీమన్నారాయణుడని అర్థం. భగవంతునికి చావుపుట్టుకలుండవు. ఆయన హేమాండంలోనికి స్వస్వరూపంతోనే ప్రవేశించాడు.

**సీ. కరమొప్పఁగా విరాట్పురుషుండు వెలుఁగొందు నా విరాట్పురుషుని యాననంబు**
**వలనను వాణియు, వాణితో వహ్నియు, నాసంబువలనఁ బ్రాణములఁగూడి**
**ఘ్రాణేంద్రియం బయ్యె, ఘ్రాణంబువలనను వాయువులును బ్రాణవాయువులును**
**నందు నక్షులు చక్షువందు సూర్యుండును, నం దభిధ్యానంబు నర్థిఁ జేయఁ**

**తే. గర్ణములు జాత మయ్యెఁ, దత్కర్ణసమితి, వలన శ్రోత్రేంద్రియంబు దిక్కులును గలిగెఁ,**
**ద్వక్కుచే శ్మశ్రురోమ వితానకములు, నోషధి వ్రాతమును భవ మొందె మఱియు. 898**

**ప్రతి :** కరము= మిక్కిలి; ఒప్పన్+కాన్= ఒప్పిదమగునట్లు; విరాట్పురుషుండు= పరమపురుషుడు; వెలుగొందున్= ప్రకాశిస్తాడు; ఆ విరాట్పురుషుని+ఆననంబు వలనను= ఆ విరాట్ పురుషుని మోమువలన; వాణియున్= వాక్కును; వాణితోన్= వాక్కునుండి; వహ్నియున్= అగ్నియు; నాసంబువలనన్= ముక్కువల్ల; ప్రాణములన్+కూడి= ఉచ్ఛ్వాస నిశ్వాసాలతోకలిసి; ఘ్రాణ+ఇంద్రియంబు= నాసికేంద్రియం; అయ్యెన్= అయింది; ఘ్రాణంబువలనన్= నాసికనుండి; వాయువులు= గాలులు (49 రకాలు); ప్రాణవాయువులును= పంచప్రాణాలైన ప్రాణం, అపానం, వ్యానం, సమానం, ఉదానమనే అయిదు; అందున్= వానిలో; అక్షులు= కన్నులు; అక్షులందున్= కన్నుల్లో; సూర్యుండును; అందున్= సూర్యునియందు; అభిధ్యానంబు= యోగాభ్యాసం; అర్థిన్= కోరికతో; చేయన్= చేయగా; కర్ణములు= చెవులు; జాతంబులు+అయ్యెన్= పుట్టాయి; తద్+కర్ణసమితివలనన్= రెండు చెవులవల్ల; శ్రోత్ర+ఇంద్రియంబు= శ్రోత్రమనే ఇంద్రియం; (మఱియు) దిక్కులును= దిశలుకూడ; కలిగెన్= కలిగాయి; త్వక్కుచేన్= చర్మమువల్ల; శ్మశ్రు= మీసాలు; రోమ= వెంద్రుకలు మున్నగువాని; వితానములు= గుంపు; ఓషధీవ్రాతమును= ఓషధుల సమూహం; భవము+అందెన్= పుట్టాయి; మఱియున్= ఇంకా...

**తా :** ఆ విరాట్పురుషుడు దేదీప్యమానంగా వెల్గుతున్నాడు. ఆయన ముఖంనుండి వాక్కు; వాక్కునుండి అగ్ని; నాసికనుండి ప్రాణాలతోకూడిన ఘ్రాణేంద్రియం ఆవిర్భవించాయి. ఘ్రాణేంద్రియంనుండి వాయువులు, అయిదు ప్రాణవాయువులు; వాటిలో కళ్ళు; కళ్ళనుండి సూర్యుడు, సూర్యుని ధ్యానించగా అందుండి చెవులు; చెవులనుండి శ్రోత్రేంద్రియం, అలాగే దిక్కులు ఏర్పడ్డాయి త్వగింద్రియం (చర్మం) నుండి మీసాలు, తక్కిన వెంద్రుకలు; ఓషధులు పుట్టాయి.

**తే. దానివలనను మేఢ్రంబు గానఁ బడియెఁ, బరఁగ రేతంబువలన నాపంబు వుట్టె**
**గుదమువలన నపానంబు నుదయమయ్యె, దాని వలనను మృత్యువు దగ జనించె. 899**

**ప్రతి :** దానివలనను= త్వగింద్రియంనుండి; మేఢ్రంబు= పురుషుల జననేంద్రియం (శిశ్నం); కానన్+పడియెన్= కన్పించింది; పరఁగన్= తర్వాత; రేతంబువలనన్= ఇంద్రియంవల్ల; ఆపంబు+పుట్టెన్= నీరు ఏర్పడింది; గుదమువలనన్= పురీషంనుండి (ముడ్డి); అపానంబు= దుర్వాసన (కార్బన్) ఉదయము+అయ్యెన్= పుట్టింది; దానివలనను= అపానంవల్లనే; మృత్యువు= మిత్తి (చావు); తగన్= జనించెన్= కల్గింది.

**తా :** రోమరాజిలో శిశ్నం కన్పించింది. దానిలోని ఇంద్రియమే నీరు. పురీషంనుండి అపానం కల్గింది. దానినుండి మృత్యు వేర్పడింది.

**క. కరములవలనను బలమును, నిరవుగ నా రెంటివలన నింద్రుఁడుఁ బాదాం**
**బురుహంబులవలన గతియు, నరుదుగ నా రెంటివలన హరియునుఁ గలిగెన్. 900**

**ప్రతి :** కరములవలనను= చేతులవల్ల; బలమును= శక్తియు; ఇరవుగన్= స్థిరంగా; ఆ రెంటివలనన్= రెండు చేతులవల్ల; ఇంద్రుఁడు= స్వర్గాధిపతి (శక్తికిమూలం); పాద+అంబురుహంబులవలనన్= రెండు పాదపద్మాలవల్ల; గతియున్= నడక (గమనం); అరుదుగన్= విచిత్రంగా; ఆ రెంటివలనన్= రెండుపాదాలవల్ల; హరియునున్= ఉపేంద్రుదును (ఇంద్రుని తమ్ముడు); కలిగెన్= పుట్టాడు.

**తా :** చేతులనుండి శక్తి ఏర్పడింది. వాటినుండి ఇంద్రుడు ఉద్భవించాడు. పాదాలమూలంగా 'గమనక్రియ' ఏర్పడింది. వాటినుండి ఉపేంద్రుడు (హరి) పుట్టాడు.

**క. ఘన నాడీ పుంజమువల, నను రక్తము, దానివలన నదులును జఠరం**
**బున నాఁకలియును దప్పియు, ననయము నా రెంటివలన నబ్ధులు వుట్టెన్. 901**

**ప్రతి :** ఘన= గొప్పదైన; నాడీపుంజమువలనను= నాడులసమూహంద్వారా; రక్తము= నెత్తురు; దానివలనన్= ఆ రక్తంనుండి; నదులును= ఏఱులును; జఠరంబునన్= కడుపులో; ఆఁకలియును దప్పియును= క్షుత్పిపాసలు; ఆ రెంటివలనన్= ఆకలిదప్పులవల్ల; అబ్ధులు= సముద్రాలు; పుట్టెన్= జనించాయి.

**తా :** నాడులవల్ల నెత్తురు, నెత్తురువల్ల నదులు ఏర్పడ్డాయి. కడుపులో ఆకలిదప్పులు పుట్టాయి. ఆ రెండింటి నుండియే సముద్రాలేర్పడ్డాయి.

**క. విను హృదయమువలనను మన, మును, మనమునఁ దుహినకరుఁడు బుద్ధియుఁ జిత్తం**
**బును బ్రహ్మయు క్షేత్రజ్ఞుం, డును గలిగిరి యవ్విరాజుఁడుం బూరుషతన్. 902**

**ప్రతి :** విను= (కపిలుడు తల్లితో) వినుము; హృదయమువలనను= ఎదనుండి; మనమును= మనస్సును; మనమునన్= మనస్సువల్ల; తుహినకరుఁడు= చల్లనికిరణాలవాడు చంద్రుడు; బుద్ధియున్= బుద్ధియు (నిశ్చయాత్మకత); చిత్తంబునన్= చిత్తమువల్ల (జ్ఞానస్థితి); బ్రహ్మయున్= సృష్టికర్త; పూరుషతన్= (అహంకారంనుండి) పౌరుషంనుండి; క్షేత్రజ్ఞుండున్= ఆత్మ; ఆ+విరాజుఁడున్= రుద్రుడును; కలిగిరి= ఏర్పడ్డారు.

**తా :** 'అమ్మా! వినండి. హృదయంనుండి మనస్సు కల్గింది. మనస్సువల్ల చంద్రుడు, బుద్ధి కల్గారు. చిత్తం నుండి బ్రహ్మ మఱియు బుద్ధి ఆవిర్భవించారు. అహంకారంనుండి రుద్రుడు చిత్తం నుండి చైత్యుడు (క్షేత్రజ్ఞుడు) పుట్టారు.

**వ. మఱియు విరాట్పురుషునం దుదయించిన వ్యష్టిరూపంబులగు నాకాశాది భూతంబులును శబ్దంబు మొదలగు భూతతన్మాత్రంబులును వాగాదీంద్రియ జాతంబును దదధిదేవతలును దమంతన సమష్టి రూపుండగు క్షేత్రజ్ఞుం బ్రవృత్తి ప్రవర్తకుంజేయ నసమర్థంబు లయ్యె, నెట్టనిన దేవాధిష్ఠితంబులగు నింద్రియంబులు దాము వేర్వేఱ యయ్యాశ్వరుం బ్రవృత్త్యున్ముఖుం జేయనోపక క్రమంబునం దత్తదధిష్ఠానాదుల నొందె, నందు నగ్ని వాగింద్రియంబుతోడ ముఖంబు నొంది ప్రవర్తించిన విరాట్కార్యంబగు వ్యష్టి శరీరజాతం**

**బనుత్పన్నంబయ్యె, నంత నాసయు ఘ్రాణేంద్రియంబుతోడ వాయువుం గూడిన నట్టిద యయ్యె, నాదిత్యుండు చక్షురింద్రియంబుతోడ నేత్రంబుల నొందిన వృథాభూతంబయ్యె, దిగ్దేవతాకంబగు కర్ణంబు శ్రోత్రేంద్రియంబుతోఁ గూడిన విరాట్కార్య ప్రేరణాయోగ్యంబయ్యె, నోషధులు రోమంబులం ద్వగింద్రియంబుఁ జెంద విఫలం బయ్యె, నద్దైవంబగు మేఢ్రంబు రేతంబు నొందినఁ దత్కార్య కరణాదక్షంబయ్యెఁ, బదంపడి గుదంబు మృత్యువుతోడ నపానేంద్రియంబుఁ జేరిన నది హైన్యంబు నొందె, విష్ణుదేవతాకంబులగు చరణంబులు గతితోఁ గూడిన ననీశ్వరంబు లయ్యెఁ, బాణీంద్రియంబు లింద్రదైవతంబు లగుచు బలంబు నొందిన శక్తి హీనంబు లయ్యె, మఱియు నాడులు సనదీకంబులై లోహితంబు వొందిన నిరర్థకంబు లయ్యె, నుదరంబు సింధువులతోడం జేసి క్షుత్పిపాసలం బొందిన వ్యర్థంబయ్యె, హృదయంబు మనంబుతోడం జంద్రు నొందిన నూరకయుండె, బుద్ధి బ్రహ్మాధిదైవతంబై హృదయంబు నొందిన నిష్ఫలంబయ్యెఁ, జిత్తం బభిమానంబుతో రుద్రునిం జెందిన విరాట్కార్యజాతం బనుద్భూతం బయ్యె, నంతఁ జైత్యుండగు క్షేత్రజ్ఞుండు హృదయాధిష్ఠానంబు నొంది చిత్తంబుతోడం బ్రవేశించిన విరాట్పురుషుండు సలిల కార్యభూత బ్రహ్మాండంబు నొంది ప్రవృత్త్యున్ముఖ క్షముండయ్యె, సుప్తుండగు పురుషునిఁ బ్రాణాదులు దమబలంబుచే భగవదప్రేరితంబు లగుచు నుత్థాపనాసమర్థంబు లగు చందంబున నగ్న్యాదులు స్వాధిష్ఠానభూతంబులగు నింద్రియంబులతోడ దేవాదిశరీరంబుల నొందియు నశక్తంబులయ్యె నని మఱియు నవ్విరాట్పురుషుని ననవరతభక్తింజేసి విరక్తులై యాత్మలయందు వివేకంబు గల మహాత్ములు చింతింపుదు రనియుఁ బ్రకృతి పురుష వివేకంబున మోక్షంబును, బ్రకృతి సంబంధంబున సంసారంబును గలుగు ననియుఁ జెప్పి మఱియు నిట్లనియె. 903**

**ప్రతి :** మఱియున్= ఇంకా; విరాట్+పురుషని+అందున్= అధిపుడైన పురుషుడు విరాట్టునందు; ఉదయించిన= పుట్టినట్టి; వ్యష్టిరూపంబులు+అగు= వేర్వేరు రూపాలుగలవైనట్టి; ఆకాశ+ఆదిభూతంబులును= ఆకాశం మున్నగు అయిదు భూతాలు; శబ్దంబు+మొదలు= శబ్దం మున్నగు; తద్+మాత్రంబులును= అయిదు భూతాల గుణాలను; వాక్+ఆది+ ఇంద్రియజాతంబును= వాక్కు మొదలైన ఇంద్రియాల సమూహం; సమష్టిరూపుండు+అగు= అన్నింటిని తనలో ఇముడ్చుకొన్నవాడైనట్టి; క్షేత్రజ్ఞున్= జీవాత్మను; ప్రవృత్తిప్రవర్తకున్= తన వృత్తిని తాను నిర్వహించువాడుగా; చేయన్= చేయుటకు; అసమర్థంబులు+అయ్యెన్= చాలనివైనాయి; ఎట్లు= అదెట్లనగా (వివరణ); దేవ+అధిష్ఠితంబులు+అగు= దైవంచే కూడినవైన; ఇంద్రియంబులు= ఇంద్రియాలు (10); తాము= స్వయంగా; వేఱు+వేఱన్= విడివిడిగా; ఈశ్వరున్= క్షేత్రజ్ఞుణ్ణి; ప్రవృత్తి+ఉన్ముఖున్= కార్యనిర్వహణకు పూనుకొనేవానిగా; చేయన్= చేయుటకు; ఓపక= సమర్థతలేక; క్రమంబునన్= వరుసగా; తద్+తద్= ఆ యా; అధిష్ఠానాదులన్= తమ తమ అధినాయకుల్ని; పొందెన్= పొందాయి; అందున్= వాటిలో; అగ్ని= తేజస్సు; వాక్+ఇంద్రియంబుతోడన్= వాక్కు అనే ఇంద్రియంతో; ముఖంబున్+ఒంది= మోమునచేరి; ప్రవర్తించిన= చేయదగినట్టి; విరాట్+కార్యంబు+అగు= విరాట్ పురుషుని పనియైన; వ్యష్టిశరీర= భిన్నశరీరంనుండి; జాతంబు= పుట్టినట్టిది; లేక పుట్టవలసినది; అనుత్పన్నంబు+అయ్యెన్= పుట్టనిదయింది; అంతన్= తర్వాత; నాసయున్= ముక్కుకూడ (నాసిక); ఘ్రాణ+ఇంద్రియంబుతోడన్= వాసనను గమనించే ఇంద్రియంతో; వాయువున్= గాలిని; కూడిన+ అట్టిది+అయ్యెన్= కలిసినదైంది; ఆదిత్యుండు= సూర్యుడు; చక్షుస్+ఇంద్రియంబుతోడన్= నేత్రమనే ఇంద్రియంతో; నేత్రములన్+ఒందినన్= కన్నుల్నిచేరగా; వృథాభూతంబు+అయ్యెన్= (విరాట్టునిపని) వ్యర్థమైంది; దిక్+దేవతాకంబు+అగు=

దిశలే అధిపతులుగానున్నట్టి; కర్ణంబులు= చెవులు; శ్రోత్ర+ఇంద్రియంబుతోన్= శ్రోత్రమనే ఇంద్రియంతో; కూడినన్= కలువగా; విరాట్కార్య= విరాట్ పురుషుని పనియందలి; ప్రేరణ= దీక్ష; అయోగ్యంబు+అయ్యెన్= పనికిరానిదైంది; ఓషధులు= చెట్లు లేక ధాతువులు; రోమంబులన్= వెంద్రుకలవల్ల; త్వక్+ఇంద్రియంబున్= చర్మమనే ఇంద్రియాన్ని; చెందన్= పొందగా; విఫలంబు+అయ్యెన్= ఫలితంలేనిదయింది (వ్యర్థమైంది); అప్+దైవంబు= జలదేవత; అయిన= అయినట్టి; మేఢ్రంబు= శిశ్నము; రేతంబున్+ఒందినన్= ఇంద్రియాన్ని పొందగా; తద్+కార్య= దాని పని; కరణ= చేయుటయందు; అదక్షంబు+అయ్యెన్= శక్తిలేనిదయింది (విరాట్టు); పదంపడి= పిదప; గుదంబు= పురీషనాళం, (మూడి); మృత్యువుతోడన్= మిత్తితో; అపాన+ఇంద్రియంబున్= దేహమాలిన్యాలను నెట్టివేసే ఇంద్రియాన్ని; చేరినన్= చేరగా; అది–హైన్యంబు= హీనదశను; ఒందెన్= పొందింది; విష్ణుదేవతాకంబులు+అగు= విష్ణుమూర్తివైన; చరణంబులు= పాదాలు; గతితోన్+కూడినన్= గమనంతో చేరిపోగా; న+ఈశ్వరంబులు+అయ్యెన్= ఏలికలేనివయ్యాయి; పాణి+ఇంద్రియంబులు= కరములనే ఇంద్రియాలు; ఇంద్రదైవంబులు+అగుచున్= ఇంద్రుని దైవంగాకలవై; బలంబున్+ఒందినన్= శక్తిగలవికాగా; శక్తిహీనంబులు+అయ్యెన్= సత్తువలేనివయ్యాయి; మఱియున్= ఇంకా; నాడులు= నాళాలు; సనదీకంబులు+ఐ= నదులతో కూడినవై; లోహితంబున్+ఒందినన్= ఎఱ్ఱదనాన్ని పొందగా; నిర్+అర్థకంబులు+అయ్యెన్= నిష్ఫలమయ్యాయి; ఉదరంబు= కడుపు; సింధువులతోడన్+చేసి= సముద్రాలతో చేరటంవల్ల; క్షుత్+పిపాసలన్+పొందినన్= ఆకలిదప్పుల్ని పొందగా; వ్యర్థంబు+అయ్యెన్= పనికిరానివయ్యాయి; హృదయంబు= ఎడంద; (గుండె); మనంబుతోడన్= మనస్సుతోగూడి; చంద్రున్= చంద్రుని; ఒందినన్= పొందగా; ఊరక+ఉండెన్= క్రియలేనిదయింది; బుద్ధి; బ్రహ్మ+అధిదైవంబు+ఐ= బ్రహ్మని అధిదేవునిగా పొంది; హృదయంబున్+ఒందినన్= గుండెను పొందగా; నిష్ఫలంబు+అయ్యెన్= ఫలితంలేనిదయింది; చిత్తంబు= చిత్తం; అభిమానంబుతోన్= అహంకారంతో; రుద్రునిన్+చెందినన్= పశుపతిని చేరగా; విరాట్+కార్యజాతంబు= విరాట్పురుషుని పనివలని ఫలితం; అనుద్భూతంబు+అయ్యెన్= సంభవించనిదైంది; అంతన్= తర్వాత; చైత్యుడు+అగు= చేతనత్వ ధర్మంగల; క్షేత్రజ్ఞుండు= ఆత్ముడు; హృదయ+అధిష్ఠానంబున్= ఎదలో నెలకొనుట; ఒంది= పొంది; చిత్తంబుతోడన్= చిత్తమనే అంతరంగంతో; ప్రవేశించిన= చొరబడినట్టి; విరాట్+పురుషుండు= అధిదేవుడు; సలిలకార్యభూత= నీరే కార్యరూపందాల్చిన; బ్రహ్మాండంబున్= అండాకృతితోనున్న బ్రహ్మలోకాన్ని; ఒంది= పొంది; ప్రవృత్తి+ఉత్+ముఖక్షముండు= ప్రవృత్తిలోని పూనికకు సమర్థుడు; అయ్యెన్= అయినాడు; సుప్తుండు+అగు= నిద్రావస్థయందున్నట్టి; పురుషునిన్= విరాట్పురుషుని; ప్రాణ+ఆదులు= ప్రాణాలు; ఇంద్రియాలుమొదలైనవి; తమబలంబుచేన్= తమశక్తిచేత; భగవత్+అప్రేరితంబులు= భగవంతునిచే ప్రేరేపింపబడనివి; అగుచున్= అవుతూ; ఉత్థాపన+అసమర్థంబులు= ప్రవర్తించటానికి సత్తువ లేనివానికి; అగుచున్= అవుతూ; అగ్ని+ఆదులు= అగ్ని మొదలైనవి; స్వాధిష్ఠాన భూతంబులు+అగు= తన అధీనంలోనుంచుకొన్న తక్కిన భూతాలుగలవిగా; అగు= ఐనట్టి; ఇంద్రియంబులతోడన్= పది జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలతో; దేవ+ఆదిశరీరంబులన్= దైవిక శరీరాల్ని; ఒందియున్= పొందికూడ; అశక్తంబులు+అయ్యెన్= శక్తిలేనివయ్యాయి; మఱియున్= ఇంకా; ఆ విరాట్పురుషుని= ఆ విరాట్టునియొక్క; అనవరత= ఎడతెగని; భక్తిన్+చేసి= భక్తికారణంగా; విరక్తులు+ఐ= సమస్తాన్ని పరిత్యజించినవారై; వివేకంబు+కల= జ్ఞానంగల్గినట్టి; మహా+ఆత్ములు= ఋషులు; చింతింపుదురు+అనియున్= ఆలోచిస్తారని; ప్రకృతిపురుషవివేకంబునన్= ప్రకృతి మఱియు పురుషునికి సంబంధించిన జ్ఞానంతో; మోక్షంబును= ముక్తియు; ప్రకృతి సంబంధంబునన్= ప్రకృతితోడి తగులంచేత; సంసారంబును= రక్తి (భోగాసక్తి); కల్గున్= ఏర్పడుతాయి; అనియున్= ఇట్లని; చెప్పి; మఱియున్= మరల; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** విరాట్పురుషుడు సమష్టిరూపం. ఆ రూపంనుండి వ్యష్టిరూపాలైన భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశం అనే పంచభూతాలు, శబ్దం, స్పర్శ, రూపం, రసం, గంధం అనే అయిదు తన్మాత్రలు, వాక్కు, కాళ్ళు, చేతులు, గుదం, జననేంద్రియం అనే అయిదు కర్మేంద్రియాలు, చర్మం, కన్నులు, చెవులు, నాలుక, ముక్కు అనే అయిదు జ్ఞానేంద్రియాలు, వాటి అధిదేవతలును సమష్టిరూపుడైన క్షేత్రజ్ఞుణ్ణి తమంతతామే కార్యోన్ముఖుణ్ని చేయజాలవు. (ఆత్మ సమష్టిరూపమైనప్పటికి భూతాదుల ఆసరాలేకుండా ప్రవర్తించదని భావం); భగవంతుని అధీనంలో ఉన్న ఇంద్రియాలు వ్యష్టిగా ఆయన్ని పురికొల్పలేక క్రమంగా తమ అధిష్ఠానాల్ని ఆసరాగా చేసికొన్నాయి, వాటిలో అగ్ని వాక్ అనే కర్మేంద్రియంతో కలిసి ముఖాన్ని చేరింది. ముఖం ద్వారా తన పనిచేయటంవల్ల వ్యష్టిశరీరంలోని 'విరాట్‌కార్యం' స్తబ్ధమైంది. తర్వాత నాసిక (ముక్కు), ఘ్రాణమనే జ్ఞానేంద్రియంతో కలిసి గాలితో కూడుకొనింది. ఆదిత్యుడు (అగ్ని సూర్యుడు) 'చక్షువు' అనే జ్ఞానేంద్రియంతో కన్నుల్ని ప్రవేశించగా దాని భూతశక్తి వ్యర్థమైంది. దిక్కులు దేవతగాకల్గిన చెవులు 'శ్రోత్ర'మనే జ్ఞానేంద్రియంతో కలువగా విరాట్‌కార్యప్రేరణ అంతరించింది. ధాతువులు వెంట్రుకలద్వారా 'త్వక్ (చర్మం) అనే జ్ఞానేంద్రియాన్ని చేరగా ఉడిగిపోయాయి.' 'అప్ (నీరు) దైవమైన జననేంద్రియం (శిశ్నం) ఇంద్రియాన్ని చేరుకోగా జలం తనపనిచేయజాలనిదైంది. తర్వాత గుదం (పురీషరంధ్రం) మిత్తితోకూడి అపానమనే ప్రాణేంద్రియాన్ని చేరగా, అతినీచంగా మారింది. విష్ణుమూర్తి అధీనంలోని 'పాదాలు' గతిధర్మం గల వైనందువల్ల 'అధీశ్వరత్వాన్ని' కోలుపోయాయి. ఇంద్రుని అధీనంలోని చేతులు (పాణీంద్రియాలు) అనే కర్మేంద్రియాలు శక్తిని పుంజుకోగా నిష్ఫలమయ్యాయి. నాడులు నదులతో కలిసి ఎఱుపు – పసుపు వన్నెతో నొప్పి ప్రయోజనం లేనివయ్యాయి. కడుపు సముద్రాలుగా మారి ఆకలిదప్పులుగల దగుటవల్ల వ్యర్థమైంది. గుండె మనస్సుతోపాటు చంద్రుని చేరి శాంతించింది. బ్రహ్మ అధిదేవతగా గల్గిన బుద్ధి హృదయాన్ని చేరి ఫలితం లేనిదైంది. చిత్తం అహంకారంతో రుద్రున్ని చేరగా విరాట్ పురుషుని పని స్తంభించింది. అపుడు చైత్యుడనే పేరుగల క్షేత్రజ్ఞుడు (ఆత్మ) ఎదలో చేరి చిత్తంతో ప్రవేశింపగా విరాట్‌పురుషుడు జలభూతమైన బ్రహ్మాండాన్ని పొంది కార్యోన్ముఖుడయ్యాడు. పంచప్రాణేంద్రియాలు నిద్రగూరిన విరాట్ పురుషుని నిద్రావస్థనుండి మేల్కొల్ప జాలనట్లే, అగ్నిమొదలైన పంచభూతాలు అధిదేవతలుగల ఇంద్రియాలతో సహా దైవికశక్తి గలవైనప్పటికి సత్తువ లేనివవుతాయి.

అయితే ఆత్మజ్ఞులైన ఋషులు సన్న్యసించి, ఎడతెగని భక్తిభావం గలవారై విరాట్ పురుషుణ్ణి కొలుస్తారు. ఈ ప్రకృతి పురుషజ్ఞానం మోక్షాన్ని కల్గిస్తుంది. ప్రకృతి సంబంధంవల్ల సంసారబంధం కల్గుతుంది" అని కపిలుడు తల్లి దేవహూతికి చెప్పి, మళ్ళీ ఇలా అన్నాడు.

**విశే :** శ్రీమద్భాగవతంలో ఈ 'కపిలాచార్యతత్త్వబోధ' భారతీయ సాంఖ్యయోగానికి నిలువుటద్దంగా భాసించే ఘట్టం. కపిలుడు తన తల్లియైన దేవహూతికి తత్త్వజ్ఞానోపదేశం చేయడమే ఈ ఘట్టంలోని ఇతివృత్తం. దీనిలో విశ్వంయొక్క సమష్టి, వ్యష్టిస్వరూపం, భక్తియోగవిశిష్టత, జీవుల పిండోత్పత్తిక్రమం, గర్భస్థశిశువులేకజీవుడు భగవంతుని స్తుతించుట అనే అంశాలు వివరింపబడ్డాయి.

ఈ ఘట్టంలో 887 – 94 మధ్య పద్యాల్లో విశ్వసృష్టికి సంబంధించిన భౌతికస్వరూపం అభివర్ణితమైంది. విశ్వమంతా 'మహత్తు, అహంకారం, పృథివి, జలం, అగ్ని, గాలి, ఆకాశం' అనే ఏడుతత్త్వాలతో కూడి వుంది. ఇవి ఒక్కొక్కటి వ్యష్టిగా పురుషుణ్ణి ఉత్పాదించలేకపోయాయి. అప్పుడు జగత్కారణుడైన సర్వేశ్వరుడు ఆ యేడింటిలో ప్రవేశించినపుడు ఏడుతత్త్వాలు ఒండొంటితో కలియగా చేతనరహితమైన ఒక్క అండం బంగారువన్నెతో పుట్టింది. దానినుండి 'విరాట్‌పురుషుడు' ఆవిర్భవించాడు

అనగా విశ్వస్వరూపమేర్పడింది. విశ్వరూపం పంచభూతాలతో నొప్పింది. అవి ఒక్కొక్కటి పదిఆవరణాలుగా (జ్ఞానేంద్రియకర్మేంద్రియాలు) విభజింపబడ్డాయి. ఈ ఆవరణాలు లోకాలన్నింటికి మెట్లవరసలయ్యాయి. అవన్నీ విష్ణుమయమైన రూపాలే. నీటిలో తేలియాడుతున్న ఆ గ్రుడ్డులో దేవదేవుడైన నారాయణుడు ప్రవేశించి ఆకాశాన్ని తెరిచాడు. అందులో విశ్వస్వరూపం వెలుగొందింది. అది 'పంచభూతాలు, జ్ఞానేంద్రియాలు, తన్మాత్రలు, కర్మేంద్రియాలు, అంతరంగచతుష్టయం అనే ఇరువదినాల్గు (చతుర్వింశతి) సమష్టితత్త్వాలుగా భాసించింది. కాని సమష్టిగా ఉన్న ఈ విశ్వరూపుడు స్వయంగా ప్రవృత్తినిర్వహణ చేయజాలని పరిస్థితి యేర్పడింది.' అప్పుడు పంచభూతాలు, దశేంద్రియాలు వ్యష్టిగా (పృథక్‌భావం) అధిదేవతల సహాయంతో ప్రవృత్తిని ఆరంభించాయి. అనంతరం నారాయణాంశ 'ప్రత్యగాత్మ' రూపంతో ఆ యేదుతత్త్వాలలో ప్రవేశించింది. సత్త్వరజస్తమోగుణాల ప్రేరణతో పురుషుడు ప్రకృతిగర్భంలో బీజావాపం చేశాడు. తత్కారణంగా పిండోత్పత్తియై, అందుండి జీవరూపమేర్పడింది. ఆ జీవరూపం మానవులు, పశుపక్ష్యాదులుగా ఏర్పడింది. రూపం సజీవమని, నిర్జీవమని రెండు రకాలు. మానవులు, పశుపక్ష్యాదులు సజీవరూపాలు కాగా నదులు, సముద్రాలు, పర్వతారణ్యాదులు వగైరా నిర్జీవరూపాలు. ఏ తత్త్వానికి ఏది అధిష్ఠానమో వచన తాత్పర్యంలో వివరించడమైంది.

**తన్మాత్రలు :** తద్+మాత్రలు= తన్మాత్రలు. అంటే 'దానికి మాత్రమే పరిమితమైంది' అని అర్థం. ఆకాశం, వాయువు, తేజస్సు (అగ్ని); నీరు, భూమి అనే పంచభూతాలకు అధిష్ఠానాలు వరుసగా చెవి, చర్మం, కన్ను, నాలుక, ముక్కు అనేవి. వీటియొక్క తన్మాత్రలు వరుసగా శబ్దం, స్పర్శ, రూపం, రసం, గంధం. ఇవి ఒక్కొక్కటి తమపని మాత్రమే చేస్తాయి. ఒకదానిపని మరొకటి చేయదు. అందుకే ఇవి తన్మాత్రలు. ఉదాహరణకు చెవి శబ్దాన్ని గ్రహిస్తుంది. తక్కిన నేత్రాదులు శబ్దగ్రహణం చేయలేవు. ఇట్లే తక్కినవి కూడ. తన్మాత్రలు జ్ఞానేంద్రియాలకు మాత్రమే వర్తిస్తాయి.

**క్షేత్రజ్ఞుడు :** సాంఖ్యయోగాన్ని అనుసరించి 5 భూతాలు, 5 జ్ఞానేంద్రియాలు, 5 కర్మేంద్రియాలు, 5 తన్మాత్రలు, 4 అంతరంగాలు కలిసి ఈ ఇర్వదినాల్గు 'చతుర్వింశతితత్త్వాలు. వీటినే 'క్షేత్రం' అని ఆధ్యాత్మికులంటారు. ఇవి అంతరిస్తాయి. అంతరించనిది, అవినాశియైనది ఇర్వదియైదవతత్త్వం – దానివే 'క్షేత్రజ్ఞుడు' అంటారు. ఇర్వదినాల్గుతత్త్వాలు 'పొలం'కాగా ఇర్వదియైదవతత్త్వం 'పొలంకాపరి' అని సాధారణపరిభాషగా గ్రహించాలి. ఈ క్షేత్రజ్ఞుణ్ణి ఆత్మయని ప్రత్యగాత్మయని, అవినాశియని, పేర్కొంటారు. క్షేత్రాన్ని, ఉపాధియని, శరీరమని, అనాత్మయని, వినాశియని పేర్కొనటం కద్దు. వివరణకోసం భగవద్గీతలోని 13వ అధ్యాయాన్ని పరిశీలించాలి.

ఈ క్షేత్రజ్ఞుడు లేక ఆత్మ పాంచభౌతికమైన ఉపాధిలో 'నిశ్చలంగా నిర్వికారంగా వుంటూ, ఉపాధిచేసే క్రియని, దానిగతిని పర్యవేక్షిస్తూ కాపలాదారుగా ఉంటుందని, ఉపాధి అంతరించగానే, ఆత్మ దాని స్వస్థానమైన పరమాత్మలో విలీనమౌతుందనేది ఆధ్యాత్మిక సిద్ధాంతం.

**అద్వైతం :** ఆత్మ పరమాత్మల ఐక్యమే అద్వైతం (రెండూ ఒకటే). శంకరభగవత్పాదులు ప్రతిపాదించిన సిద్ధాంతమిది. పరమాత్మలోని ఏకాంశం ఆత్మయని, అది భౌతికరూపంలో నిగూఢంగా దాగి, దాని చర్యని పర్యవేక్షిస్తూ వుంటుందని, ఉపాధి అంతరించగానే, ఆ బొందిని వదలి మూలస్థానమైన పరమాత్మలో అంతర్భూతమౌతుందని భగవత్పాదులు సిద్ధాంతీకరించారు. ఆయన ప్రవచించిన సిద్ధాంతం 'అద్వైతంగా' వాసికెక్కింది.

**పంచభూతాలు :** 'ఆకాశా ద్వాయుః', వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః, పృథివీ, పృథివ్యాః ఓషధయః' అని శ్రుతి. ఆకాశంనుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి జలం, జలంనుండి భూమి, భూమినుండి తక్కిన ఓషధులు సంభవించాయని పై శాస్త్రవాక్యానికి అర్థం. పంచభూతాల ఉత్పత్తిక్రమాన్ని చెప్పే వాక్యమది.

**సీ. జననుత! సత్త్వరజ స్తమో గుణమయ మైన ప్రకృతికార్య మగు శరీర**
**గతుఁడయ్యుఁ బురుషుండు గడఁగి ప్రాకృతములు నగు సుఖదుఃఖ మోహములవలనఁ**
**గర మనురక్తుండు గాఁడు, వికార విహీనుఁడు త్రిగుణ రహితుఁడు నగుచు**
**బలసి నిర్మల జల ప్రతిబింబితుండైన దినకరుభంగి వర్తించునట్టి**

**తే. యాత్మ ప్రకృతి గుణంబులయందుఁ దగులు, వడి యహంకార మూఢుఁడై తొడరి యేను**
**గడఁగి నిఖిలంబునకు నెల్ల గర్త నని ప్ర, సంగవశతను బ్రకృతి దోషములఁ బొంది. 904**

**ప్రతి :** జననుత= లోకులచే కొనియాడబడుతున్న ఓ తల్లీ!; పురుషుండు= పరమాత్మ; సత్త్వ= సాత్త్వికగుణం; రజస్= రజోగుణము; తమస్గుణమయము= తమోగుణంతో కూడినదగు; ఐన= అయినట్టి; ప్రకృతికార్యము+అగు= ప్రాకృతికకార్యమైన; శరీరగతుఁడు+అయ్యున్= శరీరంలో ప్రవేశించినవాడైనప్పటికి; కడఁగి= పూని; ప్రాకృతములును+అగు= ప్రకృతి సంబంధంగలవైనట్టి; సుఖదుఃఖమోహములవలనన్= సుఖం, దుఃఖం, మోహం అనే మూడింటివల్ల; కరము= మిక్కిలిగా; అనురక్తుండు+కాఁడు= ఆసక్తికలవాడు కాదు; వికారవిహీనుఁడు= మానసికవికారం, రూపవికారంలేనివాడు; త్రిగుణరహితుఁడు= సత్త్వరజస్తమోగుణాలు మూడు లేనివాడును; అగుచున్= ఐ; బలసి= ఒప్పి; నిర్మల= స్వచ్ఛమైనట్టి; జల= నీటియందు; ప్రతిబింబితుండు+ఐన= ప్రతిమగా నేర్పడిన; దినకరుభంగిన్= సూర్యునిమాదిరి; వర్తించు+అట్టి= ఉండేవాడైన; ఆత్మ= ఆత్ముడు; ప్రకృతి గుణంబులయందున్= అవ్యక్త గుణాలతో; తగులుపడి= చొచ్చి; అహంకార మూఢుఁడు+ఐ= అహంకారంచేత తెలివిమాలినవాడై; తొడరి= విజృంభించి; ఏను= నేను (ఆత్మ); కడఁగి= కడగి; నిఖిలంబునకున్+ఎల్లన్= కంటికి కన్పించే ఈ సమస్త ప్రకృతికి; కర్తన్+అని= అధిపతిననుకొని; ప్రసంగవశతను= ప్రస్తావనకులోనై; ప్రకృతిదోషములన్= 8 ప్రకృతులు; 11 ఇంద్రియాలు, 5 తన్మాత్రలతో కూడిన ప్రాకృతిక దోషాల్ని; పొంది= చెంది...

**తా :** జనంచే పొగడ్తలనొందే ఓ తల్లీ! విను. పరమాత్మ సత్త్వం, రజస్సు, తమస్సు అనే ఈ మూడుగుణాలకు నెలవైన ప్రకృతికి వశుడైనప్పటికి, దాని సుఖదుఃఖాలకు, వ్యామోహానికి ఆకర్షితుడు కాదు. కాని ప్రకృతి వికారాలకు, త్రిగుణాలకు చిక్కకుండా, నీటిపై తేలియాడే సూర్యుని మాదిరి స్వచ్ఛంగా వుండే ఆత్మమాత్రం మహదాదులకు, ఏకాదశేంద్రియాలకు, తన్మాత్రలకు చిక్కి, అహంకారంతో తెలివి తప్పి, 'ఈ సమస్త భౌతిక – భౌతికేతరమైన ప్రకృతికి నేను అధిపతి' నని విజృంభించి ప్రాకృతిక దోషాల్ని మూటగట్టుకొంటాడు.

**విశే :** ఈ పద్యంలో 'పరమాత్మ ఆత్మ' లనే రెండింటికి కొంచెం భేదం ఉన్నట్లు చెప్పబడింది. పరమాత్మ త్రిగుణాతీతుడు. సుఖదుఃఖమోహాలకు అతీతుడు. ప్రకృతిశక్తులన్నింట తానున్నప్పటికి, వాటికి చిక్కడు. ఈ సమస్త పదార్థాలపైన, తత్త్వాలపైన, ప్రాకృతిక శక్తులపైన ఆధిపత్యం కల్గివుంటాడు. పరమాత్మలోని ఏకాంశమైన ఆత్మకూడ మానసిక వికారాలుగాని, త్రిగుణాల బంధంగాని లేనిదే. స్వచ్ఛమైన నీటిపై ప్రతిఫలించే సూర్యునిపోలిందే. కాని దానికి మహదాదులతోను, ఏకాదశేంద్రియాలతోను, తన్మాత్రలతోను అనుబంధమేర్పడ్డకారణంచేత, నేనే సర్వప్రకృతికి నేతను అనే అహంకారంతో కొంతదోషం మూటగట్టుకొంటుంది. ఉపాధిస్పర్శవల్ల ఆత్మఒకింత కలుషితమౌతుందని భాగవతం అంటోంది. ఇది కపిలసాంఖ్యసిద్ధాంతం.

**క. సురతిర్యఙ్మనుజ స్థా, వరరూపము లగుచుఁ గర్మవాసనచేతం**
**బరపైన మిశ్ర యోనులఁ, దిరముగ జనియించి సంసృతిం గైకొని తాన్. 905**

**ప్రతి :** తాన్= ఆ యాత్మ, కర్మవాసనచేతన్; కర్మసంబంధమైన తగులంచేత; సుర= దేవతలు; తిర్యక్= పశుపక్ష్యాదులు; మనుజ= మానవులు; స్థావర= స్థిరమైన (కదలికలేని) పర్వతాదుల; రూపములు= ఆకృతులు; అగుచున్= అవుతూ; తిరముగన్= స్థిరంగా; పరపు+ఐన= విరివియైన; మిశ్రయోనులన్= పెక్కురకాలైన జీవులజననేంద్రియాల్లో, జనియించి= పుట్టి; సంసృతిన్= సంసారాన్ని; కైకొని= పొంది...

**తా :** ఆత్మ కర్మసాంగత్యంవల్ల వివిధజాతులైన దేవతలు, పశుపక్ష్యాదులు, మానవులు, చలనంలేని కొండలు వగైరా రూపాలెత్తి వాటిల్లో పడి సంసారాన్ని తలకెత్తుకుంటుంది.

**క. పూని చరించుచు విషయ, ధ్యానంబునఁ జేసి స్వాప్ని కార్థాగమ సం**
**ధానము రీతి నసత్పథ, మానసుఁ డగుచున్ భ్రమించు మతిలోలుండై. 906**

**ప్రతి :** పూని= ప్రయత్నించి; చరించుచున్= తిరుగుతూ; విషయధ్యానంబునన్+చేసి= ఇంద్రియార్థాల్ని ధ్యానించుటవల్ల; స్వాప్నిక= స్వప్నసంబంధియైన; అర్థ+ఆగమ+సంధానమురీతిన్= నిధి కైవసమైనట్లు; మతిలోలుండు+ఐ= బుద్ధియందు చలించినవాడై; అసత్+పథమానసుఁడు+అగుచున్= చెడ్డదారి పట్టిన మనస్సుగలవాడై; భ్రమించున్= భ్రాంతికి లోనవుతాడు.

**తా :** భ్రాంతికి లోనైనవాడు ఇంద్రియవిషయాల్ని గూర్చి ఆలోచిస్తూ, కలలో కైవసమైన నిధిలాగ భ్రాంతికి లోనై దారితప్పి నడుస్తాడు.

**వ. అట్లు గావున. 907**

**ప్రతి :** అట్లు+కావునన్= అది యథార్థమగుటవల్ల

**తే. పూని మోక్షార్థి యగు వాఁడు దీనిఁ దీవ్ర, భక్తియోగంబుచేత విరక్తిఁ బొంది**
**మనము వశముగఁ జేసి యమ నియమాది, యోగమార్గక్రియాభ్యాసయుక్తిఁ జేసి 908**

**ప్రతి :** మోక్ష+అర్థి+అగువాఁడు= ముక్తిని కోరేవాడు; పూని= ప్రయత్నించి; విరక్తిన్+పొంది= దేనియందు ఆసక్తిలేనివాడై; భక్తియోగంబుచేతన్= భక్తిభావనతో; మనమున్= మనస్సును; వశముగన్= స్వాధీనమైనదానిగా; చేసి= కావించి; యమ= యమము; నియమ= నియమము; ఆది= మొదలైనట్టి; యోగమార్గ= అష్టాంగపద్ధతిలోని; క్రియా+అభ్యాసయుక్తిన్+చేసి= చర్యల్ని అభ్యసించడంవల్ల...

**తా :** మోక్షం కోరేవ్యక్తి అన్నింట ఆసక్తి వదలి, భక్తియోగంద్వారా యమం, నియమం మున్నగు యోగాంగాల అభ్యాసం చేస్తూ, మనస్సును అదుపులో ఉంచుకోవాలి.

**విశే : అష్టాంగయోగాలు :** ఇవి ఎనిమిది. యమం, నియమం, ఆసనం, ప్రాణాయామం, ప్రత్యాహారం, ధ్యానం, ధారణ, సమాధి. ఇవి మనస్సుని అదుపులోనుంచే సాధనాలు. వీటి వివరణ ఇదే స్కంధంలోని 'యజ్ఞవరాహ ఘట్టం'లో చూడవచ్చు.

**భక్తి :** అనురక్తిః పరే తత్త్వే భక్తిరిత్యభిధీయతే।

పరమాత్మయందుగల ఆసక్తియే భక్తియని నిర్వచనం. భగవంతునియం దనురక్తిగలవాడే భక్తుడు. గీతలో 12వ అధ్యాయం భక్తియోగం. ఇందులో ముప్పదియైదు భక్తుని లక్షణాలు చెప్పబడ్డాయి. పాఠకులు భక్తియోగములోని 13వ శ్లోకంనుండి 19వ శ్లోకం వఱకు చెప్పబడిన భక్తుని లక్షణాలు పరిశీలింపగలరు.

**సీ. శ్రద్ధాగరిష్ఠుఁడై సత్యమైనట్టి మద్భావంబు మత్పాదసేవనంబు**
**వర్ణిత మత్కథాకర్ణనంబును సర్వ భూతసమత్వ మజాత వైర**
**మును బ్రహ్మచర్యంబు ఘనమౌన మాదిగాఁ గల నిజధర్మ సంగతులఁ జేసి**
**సంతుష్టుఁడును మితాశనుఁడు నేకాంతియు మననశీలుఁడు వీతమత్సరుండు**

**తే. నగుచు మిత్రత్వమునఁ గృపఁ దగిలి యాత్మ, కలిత విజ్ఞానియై బంధకంబు లైన**
**ఘన శరీర పరిగ్రహోత్కంఠ యందు, నాగ్రహము సేసి వర్తింప నగును మఱియు. 909**

**ప్రతి :** (మోక్షార్థి) శ్రద్ధాగరిష్ఠుఁడు+ఐ= శ్రద్ధయందు నేర్పరియై; సత్యము+ఐన+అట్టి= శాశ్వతమైనటువంటి; మత్+భావంబు= నా స్మరణము; మత్+పాదసేవనంబు= నా అడుగుల్ని సేవించుట; వర్ణిత= కొనియాడదగిన; మత్= నా; కథా+ఆకర్ణనంబును= చరిత్రలను గూర్చివినుట; సర్వభూత= ఎల్లప్రాణులయెడ; సమత్వము= అభేదం; అజాతవైరమును= పగలేమిని; బ్రహ్మచర్యంబు= ఇంద్రియనిగ్రహం; ఘన= గొప్పదైన; మౌనము= మునివృత్తి; ఆది+కాన్+కల= మొదలైనట్టి; నిజధర్మసంగతులన్+చేసి= తన ధర్మాలలో సంబంధంవల్ల; సంతుష్టుఁడును= సంతోషించేవాడు; మిత+అశనుఁడును= అల్పాహారియు; ఏకాంతియున్= ఒంటరివాడును; మననశీలుఁడు= ఎల్లప్పుడు ధ్యానించే స్వభావంకలవాడును; వీతమత్సరుండు= వదలిన ఈర్ష్యగలవాడును, అగుచున్; మిత్రత్వమునన్= స్నేహధర్మంతో; కృపన్+తగిలి= దయగల్గి; ఆత్మ= ఆత్మయందు; కలిత= కూడిన; విజ్ఞాని+ఐ= విశిష్టజ్ఞానం (అనుభవజ్ఞానం) కలవాడై; బంధకంబులు+ఐన= తగులుకొల్పేవైనట్టి; ఘన= గొప్ప; శరీర= దేహముయొక్క; పరిగ్రహ= స్వీకరణమునందలి; ఉత్కంఠ+అందున్= ఔత్సుక్య విషయములో; ఆగ్రహము+చేసి= వైముఖ్యం పొంది; వర్తింపన్+అగును= నడచుకోవాలి; మఱియున్= ఇంకా;

**తా :** మోక్షార్థి శ్రద్ధాళువై ఉండాలి. నన్ను స్మరిస్తుండటం, నా పాదపూజ, నా కథల్ని వినటం, జీవులయెడ సమభావం, పగలేమి, బ్రహ్మచర్యం, గొప్పమౌనం అనేవి ధార్మికపద్ధతులు. వీటితో నిత్యసంబంధం కల్గివుండాలి. ఆలాగ వుండేవాడు ఆనందంగా ఉంటాడు. పరిమితంగా తింటాడు ఒంటరిగా ఉంటాడు ఎల్లప్పుడూ దైవచింత గలవాడుగా విజ్ఞానిగా, ఈర్ష్యాద్వేషాలు లేనివాడుగా వర్తిస్తాడు. శరీర పరిగ్రహమంటే ఆగ్రహిస్తాడు.

**వ. జీవేశ్వర తత్త్వజ్ఞానంబునం జేసి వివృత్తంబయిన బుద్ధి తదవస్థానంబునుం గలిగి దూరీభూతేతర దర్శనుండై జీవాత్మ జ్ఞానంబునం జేసి చక్షురింద్రియంబున సూర్యుని దర్శించు చందంబున; నాత్మనాయకుం డయిన శ్రీమన్నారాయణుని దర్శించి నిరుపాధికంబై మిథ్యాభూతం బగు నహంకారంబున సద్రూపంబుచేఁ బ్రకాశమానం బగుచుఁ బ్రధానకారణంబునకు, నధిష్ఠానంబును, గార్యంబునకుఁ జక్షువుంబోలెఁ బ్రకాశకంబును, సమస్త కార్యకారణానుస్యూతంబును, బరిపూర్ణంబును, సర్వవ్యాపకంబును నగు బ్రహ్మంబుఁ బొందునని చెప్పి వెండియు నిట్లనియె. 910**

**ప్రతి :** జీవ+ఈశ్వర= ప్రాణి పరమేశ్వరుల; తత్త్వజ్ఞానంబునన్+చేసి= స్వరూపజ్ఞానంచేత; బుద్ధి= నిశ్చయజ్ఞానంగల మనస్సు; తద్+అవస్థానంబునున్= ఆ జాగ్రదవస్థను; గలిగి= పొంది; దూరీభూత= తొలగిన; ఇతరదర్శనుండు+ఐ= దర్శనం కలవాడై; జీవ+ఆత్మ= ప్రత్యగాత్మ; జ్ఞానంబునన్+చేసి= తెలివిడిచేత; చక్షుస్+ఇంద్రియంబునన్= నేత్రేంద్రియంచేత; సూర్యున్= రవిని; దర్శించుచందంబునన్= చూచునట్లు; ఆత్మనాయకుండు+ఐన= ఆత్మకు ప్రభువైనట్టి; శ్రీమత్+నారాయణునిన్= శ్రీహరిని; దర్శించి= చూచి; నిర్+ఉపాధికంబు+ఐ= శరీరేంద్రియాల్ని కోల్పోయి; మిథ్యాభూతంబు+అగు= భ్రాంతిరూపమైన లేక అసత్యమైనట్టి; అహంకారంబునన్= గర్వరేఖచే ('నేను' అనే స్వరూపంతో); సత్+రూపంబుచేన్= సత్యస్వరూపంతో; ప్రకాశమానంబు+అగుచున్= వెలుగొందుచు; ప్రధానకారణంబునకున్= ముఖ్యహేతువునకు; అధిష్ఠానంబును= ఆశ్రయమును; కార్యంబునకున్= క్రియకు; చక్షువునున్+పోలి= కన్నుమాదిరి; ప్రకాశంబును= వెలుగును; సమస్త= అన్ని; కార్యకరణ+అనుస్యూతంబును= ఎడతెగక కొనసాగుతున్న కార్యకారణాలు గలదియును; పరిపూర్ణంబును= నిండైనదియు; సర్వవ్యాపకంబును= విశ్వమందంతట వ్యాపించినదియు; అగు= అయినట్టి; బ్రహ్మంబున్= పరబ్రహ్మాన్ని; పొందును; అని చెప్పి; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు...

**తా :** జీవేశ్వరుల తత్త్వం తెలిసిన బుద్ధి (నిశ్చయజ్ఞానంగల అంతరంగం) జాగ్రదవస్థను పొంది; తక్కిన దేన్ని చూడకుండ, ఆత్మజ్ఞానసహాయంతో, కంటితో సూర్యుణ్ణి చూచినట్లు పరమాత్మను చూస్తుంది. ఉపాధికి భిన్నంగా జీవునిలో దాగివున్న ఆ ఆత్మ సత్యస్వరూపుడును, కార్యకరణాలకు అధిష్ఠాతయు, పరిపూర్ణుడును అయిన పరబ్రహ్మాన్ని చేరుకొంటాడు.

**విశే :** ఈ వచనంలో యోగి పరమాత్మనెట్లా దర్శిస్తాడో చెప్పబడింది. సూర్యుడు అధిదేవతగా వున్న కంటితోనే ఆకాశంపై వెలుగుతున్న సూర్యుణ్ణి చూచినట్లే యోగికూడ అహంకారాన్ని వదలి ఆత్మద్వారా పరమాత్ముని చూస్తాడు. చిట్టచివర, శరీరాదుల్ని (ఉపాధిని) విడిచి అహంకారం మొదలైన అసత్యపదార్థాల్లోనే వెలుగుతున్న సత్స్వరూపుడైన పరబ్రహ్మాన్ని పొందుతాడు. ఇది పిండితార్థం.

**సీ. విను మాత్మ వేత్తకు విష్ణుస్వరూపంబు నెఱుఁగంగఁబడు, నది యెట్లటన్న**
**గగనస్థుఁ డగు దినకరు కిరణచ్ఛాయ జలముల గృహకుడ్య జాలకముల**
**వలనఁ దోఁచిన ప్రతిఫలితంబుచేత నూహింపంగఁ బడిన య య్యినుని పగిది**
**నర్థి మనోబుద్ధ్యహంకరణత్రయ నాడీ ప్రకాశమునను నెఱుంగ**

**తే. వచ్చు నాత్మస్వరూపంబు వలఁతి గాఁగఁ, జిత్తమునఁ దోఁచు నంచితశ్రీ దనర్చి**
**య మ్మహామూర్తి సర్వభూతాంత రాత్ముఁ, డగుట నాత్మజ్ఞులకుఁ గాన నగును మఱియు. 911**

**ప్రతి :** ఆత్మవేత్తకున్= ఆత్మజ్ఞానికి; విష్ణుస్వరూపంబు= నారాయణమూర్తి; ఎఱుఁగంగన్+పడున్= తెలియబడును; అది+ఎట్లు+అటన్నన్= అది ఎలా సంభవమౌతుందో; విను= వినుము (చెపుతాను); గగనస్థుఁడు+అగు= ఆకాశమందున్న; దినకరు= సూర్యునియొక్క; కిరణచ్ఛాయ= కిరణాలకాంతి; జలములన్= నీటియందు; గృహ= ఇంటి; కుడ్యజాలకములవలనన్= గోడలందలి కిటికీలవల్ల; తోఁచినన్= కాన్పించిన; ప్రతిఫలితంబుచేతన్= ఆ సూర్యుని ప్రతిబింబంచేత; ఊహింపంగన్+పడిన= తెలిసికోబడ్డ; ఆ+ఇనునిపగిదిన్= ఆ సూర్యునివలెనే; అర్థిన్= కోర్కెతో; మనస్= మనస్సు; బుద్ధి= బుద్ధి; అహంకరణ= అహంకారం అనే; త్రయనాడీ= మూడు కరణాల; ప్రకాశంచేత= వెలుగుచే; లీలన్=

క్రీడగా; ఎఱుంగవచ్చున్= తెలిసికోవచ్చును; చిత్తమునన్= అంతరంగమందు; తోఁచు= చూపట్టునట్టి; అంచితశ్రీన్= ఒప్పిదమైన ప్రకాశంచేత; తనర్చి= ఒప్పి; ఆత్మస్వరూపంబు= ప్రత్యగాత్మరూపం; వలఁతి+కాన్+కన్= సామర్థ్యం గలదగుటవల్ల; ఆ+మహామూర్తి= ఆ నారాయణమూర్తి; సర్వ= సమస్తమైన; భూత= జీవజీవేతరుల; అంతస్+ఆత్ముఁడు= లోనదాగినవాడు; అగుటన్= అయినందువల్ల; ఆత్మజ్ఞులకున్= ఆత్మస్వరూపం తెలిసిన ఋషులకు; కానన్+అగును= కన్పిస్తాడు; మఱియున్= ఇంకా –

**తా :** ఆత్మజ్ఞానులకు నారాయణుని దివ్యరూపం ఎలా కన్పిస్తుందో కపిలుడు తల్లికి నివేదిస్తున్నాడు. ఈ విషయం ఒక దృష్టాంత సహాయంతో చెప్పబడింది. ఆకాశమందున్న సూర్యుని ప్రతిబింబం నీటిలో పడుతుంది. దాని ప్రతిబింబం గోడలందలి కిటికీలద్వారా ఇంటి గోడలపైన పడుతుంది. ఇంట్లోవున్న వాళ్ళు మొదట గోడమీది ప్రతిబింబాన్ని, నీటిలోపడ్డ ప్రతిబింబాన్ని చూసి, ఆ పైన ఆకాశంలో వెల్గుతున్న సూర్యుణ్ణి దర్శిస్తారు. అలాగే యోగులు, పంచభూతాలు, పది ఇంద్రియాలు, అంతరంగ స్వరూపంగా అమరి, త్రిగుణాత్మకమైన అహంకారమందు ప్రతిబింబించిన పరమాత్మస్వరూపాన్ని 'అహంకారం' నుండే చూస్తారు.

**వ. జీవుండు సుషుప్త్యాద్యవస్థలయందుఁ బరమాత్మానుషక్తుండైన భూతాదితత్త్వంబులు లీనంబులై ప్రకృతియందు వాసనామాత్రంబు గలిగి యకార్యకారణంబులై యున్న సుషుప్తి సమయంబునం దాను నిస్తంద్రుం డగుచు నితరంబుచేతఁ గప్పం బడని వాఁడై పరమాత్మానుభవంబు సేయుచుండు నని చెప్పిన విని దేవహూతి యిట్లనియె. 912**

**ప్రతి :** జీవుండు= ప్రాణి; సుషుప్తి+ఆది+అవస్థలయందున్= గాఢనిద్ర మున్నగు దశలలో; పరమాత్మ+ఆనుషక్తుండు+ఐనన్= పరమాత్మయందు తగుల్కోగా; భూత+ఆదితత్త్వంబులు= సూక్ష్మమైన భూతాలు; ఇంద్రియాలు, మనస్సు, బుద్ధిమొదలైన తత్త్వాలు; లీనంబులు+ఐ= లయమై; ప్రకృతియందున్= ప్రకృతిలో; వాసనామాత్రంబు+కల్గి= తత్త్వవాసన మాత్రమే మిగిలి; అకార్యకారణంబులు+ఐ= అకార్యానికి హేతువులై; ఉన్నన్= ఉండగా; సుషుప్తిసమయంబునన్= గాఢనిద్రాసమయంలో; తాన్= జీవుదు; నిస్తంద్రుండు+అగుచున్= సోమరికానివాడగుచు (మేల్కొని); ఇతరంబుచేతన్= భూతాదులచే; కప్పంబడనివాఁడై= మూయబడనివాడై; (భూతశక్తికి లోబడనివాడై); పరమాత్మ+అనుభవంబు= పరమాత్మ సంబంధియైన అనుభూతిని; చేయుచుండున్= పొందుతుంటాడు; అని చెప్పినన్= అని బోధింపగా; విని దేవహూతి= ఆలకించిన దేవహూతి; ఇట్లు+అనియెన్= దిగువరీతి అడిగింది–

**తా :** జీవుని గాఢనిద్రావస్థలోకూడ ఆత్మ మేల్కొనే వుంటుంది. సూక్ష్మభూతాలు, ఏకాదశేంద్రియాలు (11), మనస్సు, బుద్ధి పనిచేయవు. ప్రకృతియందు కేవలం వాటి వాసనలు మాత్రమే మిగిలి వుంటాయి. గాఢ నిద్రావస్థలో కూడ జీవుడు మేల్కొనివుండి, భూతాదులు తన్ను కప్పినప్పటికి, 'పరమాత్మను' చూస్తూనే వుంటాడు అని కపిలుడు చెప్పగా విని దేవహూతి మళ్ళీ యిలా ప్రశ్నించింది.

**విశే : కపిల దేవహూతి ఉపాఖ్యానం**

ఈ ఉపాఖ్యానంలో 887వ వచనంనుండి 903వ వఱకు సాగిన ఇతివృత్తం ప్రధానంగా కపిలసాంఖ్యయోగలక్షణాలతో కూడివుంది. ఇది జటిలమైన భారతీయ వేదాంతరహస్యాలతో ఒప్పుతున్నది. ఈ ఘట్టం పద్యసాహిత్యంతో ముడివడి

ఉన్నందువల్ల సామాన్యపాఠకుడు అలవోకగా దీన్ని చదివి "పూర్వాపరాల్ని సమన్వయించుకోలేడు. అందువల్ల ఈ అంశాల్ని దిగువపట్టిక ద్వారా వివరిస్తే, సులభగ్రాహ్యంగా ఉంటుందని భావించి ఇక్కడ పొందుపరచడమైంది.

ప్రకృతి – పురుషుడు – ఈ ఇర్వురు వేరు వేరు.
ప్రకృతికి మూడుగుణాలు : సత్వం – రజస్సు – తమస్సు.
పురుషుడు పై మూడుగుణాలచే ఆకర్షితుడవుతాడు. సుఖదుఃఖాల్ని అనుభవిస్తుంటాడు.

ప్రకృతి లక్షణాలు త్రిగుణాత్మకం బ్రహ్మం కాదు. అది అవ్యక్తం. నిత్యం – సత్తు – అసత్తులతో కూడుకొనివుంటుంది. కార్యకారణ రూపంకూడ.

**భూతాలు** అయిదు. భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశం.

**తన్మాత్రలు** అయిదు. గంధం, రసం, రూపం, స్పర్శ, శబ్దం.

**కర్మేంద్రియాలు** అయిదు. వాక్కు, పాదాలు, చేతులు, పాయువు, ఉపస్థ. జ్ఞానేంద్రియాలు 5 చర్మం, కన్నులు, చెవులు, ముక్కు, నాలుక.

**అంతఃకరణచతుష్టయం:** మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం.

**చతుర్వింశతి:** 24. పైన తెల్పిన భూతాలు, తన్మాత్రలు, కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు, అంతఃకరణాలు కలిసినట్టిది. ఈ ఇరువది నాల్గింటిని 'ప్రకృతి' అంటారు.

**పంచవింశకుఁడు:** ఇరువదియైదవతత్త్వం. ఇది రెండురకాలు 1) కాలం 2) భగవంతుడు.
పురుషుడు 'చిత్' రూపమైన తనవీర్యాన్ని ప్రకృతి గర్భంలో నిక్షేపిస్తాడు. అపుడు ప్రకృతినుండి 'మహత్తు' మహత్తునుండి 'అహంకారం' ఉదయిస్తాయి.
అహంకారం మూడురకాలు 1. వికారం 2. తైజసం 3. తామసం.
(మనస్తత్త్వం – అనిరుద్ధుడు) (బుద్ధి – ఇంద్రియాలు – ప్రద్యుమ్నుడు)

**తన్మాత్రలు:** 1. శబ్దం: ఆకాశలక్షణం గలది. 'చెవి' అధిష్ఠానం
2. స్పర్శ: మృదుత్వం, కాఠిన్యం, చల్లదనం, వేడిమి దాని లక్షణాలు
(వాయువు) చర్మం అధిష్ఠానం
3. రూపం: (కన్ను) – తేజస్సు – అగ్ని అధిష్ఠానం
4. రసం: (నాలుక) – నీరు – నాలుక అధిష్ఠానం
5. గంధం: (భూమి) ముక్కు అధిష్ఠానం.

శబ్దధర్మాలు వాయువు, భూమి మున్నగు వానిలో కూడ కన్పిస్తాయి.

**మహదాదులు :** ఇవి ఏడు. 1) మహత్తు 2) అహంకారం 3) భూమి 4) నీరు 5) తేజస్సు 6) వాయువు 7) ఆకాశం ఈ యేడూ కలిస్తే పురుషుడు అవుతాడు. భగవంతుడు వాటిలో ప్రవేశించినపుడు అవి క్షోభచెంది వాటినుండి అచేతనమైన ఒక అండం (గ్రుడ్డు) ఏర్పడుతుంది. చాలకాలం నీటిలో వుంటుంది.

**విరాట్పురుషుడు :** గ్రుడ్డునుండి లేచిన మహాశక్తి. ఆ పురుషుని ఇంద్రియాలు – అధిదేవతలు దిగువరీతి ఏర్పడ్డాయి.

1. ముఖం (నోరు) అగ్ని
2. ముక్కురంధ్రాలు : వాయువు
3. నయనాలు (కన్నులు) సూర్యుడు
4. చెవులు (శ్రవణేంద్రియం) దిగ్దేవతలు
5. చర్మం (త్వక్కు) ఓషధులు
6. మేఢ్రం లేదా శిశ్నం (ఉపస్థ) జలం
7. గుదం (అపానేంద్రియం) మృత్యువు (దుర్వాసన)
8. కాళ్ళు (చరణాలు) ఉపేంద్రుడు/
9. చేతులు (పాణీంద్రియాలు) ఇంద్రుడు.
10. నాడులు (రక్తం) నదులు
11. కడుపు= ఆకలిదప్పులు – సముద్రం
12. హృదయం – మనస్సు – చంద్రుడు
13. హృదయం – బుద్ధి – బ్రహ్మ
14. హృదయం అహంకారం – రుద్రుడు
15. హృదయం చిత్తం – క్షేత్రజ్ఞుడు (ప్రత్యగాత్మ)

నీటిలో ప్రతిబింబించే సూర్యునికి నీటిలక్షణాలు సోకనట్లే, ప్రకృతిలో వున్న పురుషునికి ప్రాకృతిక గుణాలు అంటవు. అతడు నిర్గుణుడు. అయినా ప్రకృతి గుణాలతో నిత్యసంబంధం పెట్టుకుంటాడు కాబట్టి అహంకారంచేత ఆకర్షితుడవుతాడు. కర్మదోషకారణంగా అతడు దేవతలు, పశుపక్ష్యాదులు, మానవులు వగైరా జన్మలెత్తి సంసారచక్రంలో తిరుగుతుంటాడు.

**సంసారం:** ఇదొక కలవంటిది. దీనికి అస్తిత్వం లేదు. ఉన్నట్లు అన్పిస్తుంది. కాబట్టి అది భ్రాంతి.

**సీ. విమలాత్మ! యీ పృథివికిని గంధమునకు సలిలంబునకును రసంబునకును**
**నన్యోన్య మగు నవినాభావ సంబంధ మైన సంగతిఁ బ్రకృత్యాత్మలకును**
**సతతంబు నన్యోన్యసంబంధమై యుండు ప్రకృతి దా నయ్యాత్మఁ బాయు టెట్లు?**
**దలపోయ నొకమాటు తత్త్వబోధముచేత భవభయంబుల నెల్లఁ బాయు టెట్లు?**

**తే. చచ్చి క్రమ్మఱఁ బుట్టని జాడ యేది?, యిన్నియుఁ దెలియ నానతి యిచ్చి నన్నుఁ**
**గరుణ రక్షింపవే! దేవగణ సుసేవ్య!, భక్తలోకానుగంతవ్య! పరమపురుష! 913**

**ప్రతి :** విమల+ఆత్మ= స్వచ్ఛమైన మనస్సుగలవాడా!; దేవగణసుసేవ్య= దేవతా బృందాలచే చక్కగ సేవింపదగినవాడా!; భక్తలోక+అనుగంతవ్య!= భక్తజనంచే అనుసరింపదగ్గవాడా!; పరమపురుష= ఓ ఉత్తమపురుషుడా! (ఈ నాల్గు కపిలునికి సంబోధనలు); ఈ పృథ్వికిని= ఈ భూమికి; గంధమునకున్= తన్మాత్రయైన వాసనకు; సలిలంబునకున్= నీటికి;

రసంబునకున్= జలతన్మాత్రయగు రసానికి (విడదీయరాని అని భావన); సంబంధము+ఐన= పొత్తుగల్గిన; సంగతిన్= సాంగత్యంవల్ల; ప్రకృతి+ఆత్మలకును= ప్రకృతి మరియు పురుషులకు; సతతంబున్= ఎల్లప్పుడు; అన్యోన్య= పరస్పరం; సంబంధము+ఐ+ఉండున్= పొత్తుగల్గి వుంటుంది కదా!; తాన్= స్వయంగా; ఆ+ఆత్మ= ఆ పురుషుడు; ప్రకృతిన్= ప్రకృతిని; పాయుట+ఎట్లు= వదలటం ఎట్లవుతుంది? (ప్రశ్న); తలపోయన్= ఆలోచింపగా; ఒకమాటు= ఒకతీరుగా; తత్త్వబోధముచేతన్= తత్త్వజ్ఞానంచేత; భవభయంబులన్+ఎల్లన్= సంసారానికి సంబంధించిన భీతినంతటిని; పాయుట+ఎట్లు= వదలటం ఎట్లవుతుంది? (ప్రశ్న); చచ్చి= చనిపోయి; క్రమ్మఱన్= మరల; పుట్టనిజాడ= జన్మించనిగతి; ఏది= ఎలాంటిది? (ప్రశ్న); ఇన్నియున్= ఈ మూడు ప్రశ్నలకు సమాధానాలు; తెలియన్= తెలిసికొనేట్లు; ఆనతి+ఇచ్చి= సెలవిచ్చి; నన్నున్= జిజ్ఞాస గలదానను అయిన నన్ను; కరుణన్= దయతో; రక్షింపవే= కాపాడుమా!

**తా :** మహాత్మా! ఓ పరమపురుషా! భూమికి గంధంతోనూ, నీటికి రసంతోను విడదీయరాని సాంగత్యమున్నట్లే, ప్రకృతి పురుషులకు కూడ నిత్యసాంగత్యం ఉందిగదా! మరి పురుషుడు ప్రకృతినుండిగాని, ప్రకృతి పురుషునినుండిగాని విడదీయబడటం ఎట్లవుతుంది? తత్త్వజ్ఞానమాత్రంచేత సాంసారిక బాధలు లేదా భయాలు ఎలా తొలగిపోతాయి? చచ్చిన జీవికి పునర్జన్మలేని స్థితి యేది? వివరింపుమని దేవహూతి కుమారుణ్ణి అడిగింది.

**వ. అనిన భగవంతుం డిట్లనియె, అనిమిత్తం బయిన స్వధర్మంబునను నిర్మలాంతఃకరణంబునను సునిశ్చితంబైన మద్భక్తియోగంబునను సత్కథా శ్రవణ సంపాదితంబైన వైరాగ్యంబునను దృష్టప్రకృతి పురుషయాథాత్మ్యంబగు జ్ఞానంబునను బలిష్ఠంబయి కామానభిష్వంగంబగు విరక్తివలనఁ దపోయుక్తంబయిన యోగంబునను సుతీవ్రంబయిన చిత్తైకాగ్రతం జేసి పురుషుని దగుప్రకృతి దందహ్యమానంబై తిరోధానంబును బొందు, నదియునుంగాక యరణిగతంబైన వహ్నిచే నరణి దహింపఁబడు చందంబున, జ్ఞానంబునం దత్త్వ దర్శనంబునంజేసి నిరంతరంబు బలవంతంబును దృష్టదోషంబును నగు ప్రకృతి జీవునిచేత భుక్తభోగయై విడువంబడు నని చెప్పి. 914**

**ప్రతి :** అనిమిత్తంబు+అయిన= కారణంలేని; స్వధర్మంబునను= తన ప్రవృత్తిచేతను; నిర్మల+అంతఃకరణంబునను= స్వచ్ఛమైన బుద్ధ్యాదులతోను; సునిశ్చితంబు+ఐన= మిక్కిలి దృఢమైన; మత్+భక్తియోగంబునను= నాపై భక్తిభావం కల్గివుండుట వల్లను; సత్+కథా= నా మంచి కథలను; శ్రవణ= వినుటవల్ల; సంపాదితంబు+ఐన= పొందినట్టి; వైరాగ్యంబునను= బైరాగితనంవల్లను; దృష్ట= చూడబడిన; ప్రకృతిపురుష= ప్రకృతి మరియు పురుషుని; యాథాత్మ్యంబు+అగు= యథాతథస్థితియైన; జ్ఞానంబునన్= తెలివిడిచే; బలిష్ఠంబు+అయి= దృఢపడినట్టిదై; కామ+అనభిష్వంగంబు+అగు= కోర్కెలనుండి విడివడ్డ; విరక్తివలనన్= వైరాగ్యంవల్లను; తపస్+యుక్తంబు+అయిన= తపస్సుతో కూడిన; యోగంబునను= కూడికవల్లను (తపోయోగమనిభావం)); సుతీవ్రంబు+అయిన= మిక్కిలి గాఢమైనట్టి; చిత్త+ఏకాగ్రతన్+చేసి= చిత్తాన్ని నిలుపుటవల్లను; పురుషునిది+అగు+ప్రకృతి= పురుషుని అధీనమందున్న ప్రకృతి; దందహ్యమానంబు+ఐ= కాల్పబడినదై; తిరోధానంబును= అదృశ్యం అవటాన్ని; పొందున్= పొందుతుంది; అదియునుంగాక= అంతేగాక, అది ఎట్లా జరుగుతుందంటే; "అరణిగతంబు+ఐన= అరణి అనే కర్రలో దాగిన; వహ్నిచేన్= అగ్నిచేత; 'అరణి= కర్ర; దహింపఁబడు చందంబునన్= కాల్చబడినట్లే; జ్ఞానంబునన్= తెలివిడిచేతను; తత్త్వదర్శనంబునన్+చేసి= అభేదతత్త్వం తెలియటంవల్లను; నిరంతరంబు= ఎడతెగనిది; బలవంతంబు= బలీయమైనది; దృష్టదోషంబునున్+అగు= చూడబడిన దోషంగలది అయిన; ప్రకృతి,

జీవునిచేతన్= పురుషునిచేత; భుక్త, భోగ+ఐ= అనుభవింపబడిన భోగంకలదై; విడువంబడును= వదలబడుతుంది; అని చెప్పి= ఇట్లు బోధించి–

**తా :** నిర్నిమిత్తమైన తన ధర్మం స్వచ్ఛమైన అంతరంగం, అనన్యభక్తి, భగవంతుని సత్కథల్ని శ్రవణం చేయటం, వైరాగ్యం, కామంపట్ల అనాసక్తి, ప్రకృతి పురుషతత్త్వం వాస్తవంగా తెలిసివుండటం, తపోయోగం, చిత్తమందు ఏకాగ్రత అనేవి పురుష లక్షణాలు. ఈ గుణాల ఆసరాతో పురుషుడు ప్రకృతిని వదలగలడు. ఎలా? అరణినుండి పుట్టిన అగ్ని అరణిని కాలుస్తుందిగదా! అలాగే పురుషుడుకూడ ప్రకృతిని వశపరచుకొని, భోగభాగ్యాలు అనుభవించి పరిత్యజిస్తాడు.

**క. విను ప్రకృతి నైజమహిమం, బునఁ దనలో నున్నయట్టి పురుషునకు మహే**
**శునకు నశుభ విస్ఫురణం, బనయముఁ గావింపఁజాల, దది యెట్లనినన్. 915**

**ప్రతి :** విను= వినుము; ప్రకృతి= ప్రకృతి; నైజమహిమన్= స్వభావసిద్ధమైన ప్రభావంతో; తనలోన్= తనయందు; ఉన్న+అట్టి= ఉండేటటువంటి; పురుషునకున్= పురుషునికి; మహా+ఈశునకున్= మహేశ్వర స్వరూప మందున్నవానికి, అనగా పురుషునికి; అనయము= ఎల్లప్పుడు; అశుభవిస్ఫురణము= చేటు; కావింపన్+చాలదు= చేయలేదు; అది, ఎట్లు+అనినన్= అది ఏలాగ అని అంటావా? విను,

**తా :** పురుషుడు 'విశ్వనాథుడు' ఆయనకు సహజమైన మహిమవుంది. తనతో నిత్యసాంగత్యం ఉన్నప్పటికి ప్రకృతి పురుషునికి ఎలాంటి అశుభాన్ని కల్గింపజాలదు.

**చ. పురుషుఁడు నిద్రవోఁ గలలఁ బొందు ననర్థకముల్ ప్రబోధమం**
**దరయఁగ మిథ్యలై పురుషునందు ఘటింపని కైవడిం, బరే**
**శ్వరునకు నాత్మనాథునకు సర్వశరీరికిఁ గర్మసాక్షికిం**
**బరువడిఁ బొందవెన్నఁటికిఁ బ్రాకృతదోషము లంగనామణీ! 916**

**ప్రతి :** అంగనామణీ!= ఓ స్త్రీరత్నమా!, పురుషుఁడు; నిద్ర+పోన్= నిద్రపోగా; కలలన్= స్వప్నములందు; పొందు= తానుపొందునట్టి; అనర్థకముల్= ఉపద్రవాలు; ప్రబోధమందున్= మేల్కొనినపుడు (జాగ్రత్తునందు); అరయన్+కన్= ఆలోచిస్తే; మిథ్యలు+ఐ= అసత్యములై; పురుషునందున్= పురుషునిలో; ఘటింపనికైవడిన్= కూడనట్లు; ఆత్మనాథునకున్= ఆత్మకు అధిపతియైనవాడును; సర్వశరీరికిన్= స్థావరజంగమాలు మేనుగాగలవాడును; కర్మసాక్షికిన్= జగత్కర్మలకు సాక్షియైన వాడునునగు; పర+ఈశ్వరునకున్= పరమపురుషునికి; పరువడిన్= క్రమంగా; ఎన్నఁటికిన్= ఎప్పటికైనా; ప్రాకృతదోషములు= ప్రకృతివల్ల అంట్లుసొంట్లు; పొందవు= కలుగవు (అంటవు)

**తా :** నిద్రపోయినవానికి కలలు ఎన్నో అనర్థాలు కల్గిస్తాయి. మేలుకోగానే అవన్నీ వట్టివైపోతాయి. మిథ్యలౌతాయి. అట్లే ప్రకృతి అజ్ఞానికి సాంసారికమైన ఎన్నో ఉపద్రవాల్ని కల్గిస్తుంది. కాని ఆత్మస్వరూపుడును, జగత్కర్తయు, కర్మలకు సాక్షియు, నైన పరమ పురుషుణ్ణి ప్రకృతి యేమియు చేయలేదు.

**వ. అని వెండియు నిట్లనియె. 917**

**ప్రతి :** అని= ఇట్లు చెప్పి; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఇట్లన్నాడు.

**తా :** ప్రకృతివల్ల పురుషుని కేవిధమైన అనర్థాలు కల్గవని అంటూ మళ్ళీ ఇలా అంటున్నాడు కపిలమహర్షి.

**సీ.** **అధ్యాత్మతత్పరుం డగువాఁడు పెక్కు జన్మంబులఁ బెక్కు కాలంబులందు**
**బ్రహ్మపదప్రాప్తి పర్యంతమును బుట్టి సర్వార్థ వైరాగ్యశాలి యగుచుఁ**
**బూని నా భక్తులచే నుపదేశింపఁ బడిన విజ్ఞానసంపత్తి చేతఁ**
**బరఁగఁ బ్రబుద్ధుఁడై బహువారములు భూరి మత్ప్రసాదప్రాప్తిమతిఁ దనర్చు**

**తే.** **నిజ పరిజ్ఞాన విచ్ఛిన్న నిఖిల సంశ, యుండు, నిర్ముక్తలింగదేహుండు నగుచు**
**ననఘ! యోగీంద్రహృద్గేయ మగు మదీయ, దివ్యధామంబు నొందు సందీప్తుఁ డగుచు. 918**

**ప్రతి :** అనఘ= ఓ పాపరహితా!; అధ్యాత్మ (అధి+ఆత్మ)= ఆత్మజ్ఞానమందు; తత్పరుండు+అగువాఁడు= ఆసక్తిగల మానవుడు; పెక్కుజన్మంబులన్= చాల జన్మలలో; పెక్కుకాలంబులందున్= అనేక కాలాలలో; బ్రహ్మపద బ్రహ్మమయమైన పదవిని; ప్రాప్తిపర్యంతమును= పొందేటంతవఱకు; పుట్టున్= జన్మిస్తాడు; సర్వ+అర్థ= అన్ని విధాల వస్తువులయందు; వైరాగ్యశాలి+అగుచున్= వైరాగ్యాన్ని పొందినవాడై; పూని; నాభక్తులచేన్= (నా) హరిభక్తులచేత; ఉపదేశింపన్+పడిన= బోధింపబడ్డ; విజ్ఞానసంపత్తిచేతన్= అనుభవజ్ఞానమనే సంపదచేత; పరఁగన్= క్రమంగా; ప్రబుద్ధుఁడు+ఐ= మేల్కొన్నవాడై; బహువారములు= పెక్కుదినాలు (చిరకాలం); భూరి= మిక్కిలి; మత్= నాదైన; ప్రసాద ప్రాప్తిమతిన్= అనుగ్రహాన్ని పొందిన బుద్ధితో; తనర్చున్= ఒప్పారును, నిజపరిజ్ఞాన= తన జ్ఞానంచేత; విచ్ఛిన్న= పటాపంచలైన; నిఖిల= సమస్తమైన; సంశయుండు= సందేహాలుకలవాడు; నిర్ముక్త= వదలినట్టి; లింగదేహుండును= సూక్ష్మశరీరం కలవాడును; అగుచున్= అవుతూ; (తరువాత); సందీప్తుఁడు+అగుచున్= మిక్కిలి వెల్గిపోతూ; యోగీంద్ర= యోగీశ్వరుల; హృత్= హృదయంచే; గేయము+అగు= కొనయాడబడుతున్న; మదీయ= నాదైన; దివ్యధామంబున్= మంగళకరమైన స్థానమును; (వైకుంఠం) పొందున్= చేరుకొంటాడు.

**తా :** అమ్మా! పుణ్యాత్మురాలా! జ్ఞానియైనవాడు భగవంతునిపై తన చిత్తాన్ని కేంద్రీకరిస్తే, ప్రకృతి అతణ్ణి ఏమీచేయలేదు. కాని కేవలం ఆధ్యాత్మికజ్ఞానంతో అతడు ఆత్మారాముడైనప్పటికి అనేక జన్మలు ఎత్తుతూనే వుంటాడు. అంతవఱకు అతనికి బ్రహ్మలోక ప్రాప్తిమాత్రమే. తర్వాత నా భక్తులప్రబోధంచేత మేల్కొని, నాయందు బద్ధానురాగుడై నా దివ్యసన్నిధికి చేరుకొంటాడు. అతనికి శాశ్వత మోక్షపదవి లభిస్తుంది. అంతటితో అతని లింగ శరీరం అంతరిస్తుంది.

**వ.** **మఱియు నణిమాద్యష్టైశ్వర్యంబులు మోక్షంబున కంతరాయంబులు, కావున వానియందు విగత సంగుండును మదీయచరణ సరోజస్థిత లలితాంతరంగుండును నగువాఁడు మృత్యుదేవత నపహసించి మోక్షంబు నొందు నని చెప్పి వెండియు యోగలక్షణ ప్రకారంబు వినిపింతు విను మని భగవంతుం డైన కపిలుండు నృపాత్మజ కిట్లనియె. 919**

**ప్రతి :** మఱియున్= ఇంకా; అణిమ+ఆది= 'అణిమ' మొదలైన; అష్ట+ఐశ్వర్యంబులు= ఎనిమిదిరకాలైన సంపదలు; మోక్షంబునకున్= ఆ దివ్యపదవికి; అంతరాయంబులు= అడ్డుపడేవి; కావునన్= అయినందువల్ల; వానియందున్= ఆ ఐశ్వర్యాల్లో; విగత సంగుండును= తగులం లేనివాడును; మదీయ= నా; చరణసరోజ= పాదపద్మాలయందు; స్థిత= ఉంచినట్టి; లలిత+అంతరంగుండునున్= ప్రియమైన హృదయం కలవాడును; అగువాఁడు= ఈ లక్షణాలు గలజీవి;

మృత్యుదేవతను= మరణ దేవతను; అపహసించి= పరిహసించి (జయించి); మోక్షంబున్= మోక్షపదవిని; ఒందున్= పొందుతాడు; అని చెప్పి= అని బోధించి; వెండియున్= మరల; యోగలక్షణప్రకారంబు= యోగలక్షణాలవైఖరిని; వినిపింతున్= విన్పిస్తాను; వినుము+అని= ఆలకించుమని; భగవంతుండు+ఐన= భగవంతుడయినట్టి; కపిలుండు= స్వామి; నృప+ఆత్మజకు= స్వాయంభువుడను మనువునకు కూతురైన తన తల్లి దేవహూతితో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అణిమాది అష్టైశ్వర్యాలు మోక్షపదవికి అడ్డు తగులుతాయి. అందువల్ల జ్ఞాని ఆ సంపదలకు చిక్కకుండ, విరాగియై, శ్రీమన్నారాయణుని పవిత్ర పాదపద్మాల్ని స్మరిస్తూ శాశ్వత మోక్షపదవిని అందుకోవాలి. అలాంటివానిని మృత్యుదేవత ఏమీ చేయలేదు అని చెప్పి, ఆ స్వాయంభువపుత్రియైన దేవహూతితో కపిలుడు యోగలక్షణాల గూర్చి చెపుతాను వినుమన్నాడు.

**విశే : అష్టైశ్వర్యాలు:** ఇవి 8 రకాలు. అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశత్వం, వశిత్వం. వీటినే "అష్టసిద్ధులు", "అష్టభూతులు" అని అంటారు.

**క. ధీనిధులై యే యోగ వి, ధానంబునఁ జేసి మనము దగ విమలంబై,**
**మానిత మగు మత్పదముం, బూనుదు, రా యోగ ధర్మముల నెఱిఁగింతున్. 920**

**ప్రతి :** ధీనిధులు= బుద్ధిమంతులు; ఏ యోగవిధానంబునన్+చేసి= ఏ యోగముల నాచరించుటవల్ల; మనము= మనస్సు; తగన్= యుక్తంగా; విమలంబు+ఐ= స్వచ్ఛమైనదై; మానితము+అగు= కొనియాడబడ్డదైన; మత్= నాదైన; పదమున్= స్థానాన్ని (మోక్షపదవి); పూనుదురు= పొందుతారో; ఆ యోగధర్మములన్= యోగాచరణాలను; ఎఱిఁగింతున్= తెల్పుతాను.

**తా :** తల్లీ! యోగాచరణతో మనసు నిర్మల మౌతుందంటారు జ్ఞానులు. మోక్షపదవిని పొందటానికి సాధనమైన ఆ యోగధర్మాల్ని వివరిస్తాను.

**వ. అది యెట్లనిన శక్తికొలఁది స్వధర్మాచరణంబును, శాస్త్రవినిషిద్ధధర్మ కర్మంబులు మానుటయు, దైవికంబై వచ్చిన యర్థంబువలన సంతోషించుటయు, మహాభాగవత శ్రీపాదార్చనంబును, గ్రామ్యధర్మ నివృత్తియు, మోక్షధర్మంబులయందు రతియు, మితంబై శుద్ధంబయిన యాహారసేవయు, విజనంబయి నిర్బాధకం బయిన స్థానంబున నుండుటయు, హింసారాహిత్యంబును, సత్యంబును, నస్తేయంబును దన కెంత యర్థం బుపయోగించు నంత యర్థంబ స్వీకరించుటయు, బ్రహ్మచర్యంబును, దపశ్శౌచంబులును, స్వాధ్యాయపఠనంబును, పరమపురుషుండైన సర్వేశ్వరుని యర్చనంబును, మౌనంబును, ఆసనజయంబును, దానంజేసి స్థైర్యంబును, ప్రాణవాయు స్వవశీకరణంబును, ఇంద్రియ నిగ్రహరూపం బైన ప్రత్యాహారంబును, మనంబుచే నింద్రియంబుల విషయంబులవలన మరలించి హృదయమందు నిలుపుటయు, దేహగతంబైన మూలాధారాది స్థానంబులలో నొక్క స్థానంబునందు హృదయగతంబయిన మనస్సుతోడంగూడఁ బ్రాణధారణంబును, వైకుంఠుం డైన సర్వేశ్వరుండు ప్రవర్తించిన దివ్యలీలా చరిత్ర ధ్యానంబును, మానసైకాగ్రీకరణంబును, బరమాత్మ యగు పద్మనాభుని సమానాకారతయును నివియునుం గాక తక్కిన**

**వ్రతదానాదులం జేసి, మనోదుష్టం బయిన యసన్మార్గంబును బరిహరించి, జితప్రాణుండై మెల్లన యోజించి, శుచియైన దేశంబునం బ్రతిష్ఠించి విజితాసనుండై, యభ్యస్తకుశాజిన చేలోత్తరాసనంబైన యాసనంబు సేసి, ఋజుకాయుండై ప్రాణమార్గంబును గుంభక రేచక పూరకంబులం గోశశోధనంబు సేసి, కుంభక పూరకంబులచేతం బ్రతికూలంబు గావించి, చంచలం బయిన చిత్తంబు సుస్థిరంబు గావించి, తీవ్రంబయిన యమంబునం బ్రతప్తంబయి విగత సమస్త దోషం బగు చామీకరంబు కరణి విరజంబు సేసి జితమారుతుం డగు యోగి క్రమ్మఱం బ్రాణాయామం బను పావకునిచేత వాతపిత్తశ్లేష్మంబులను దోషంబుల భస్మీకరణంబు సేసి ధారణంబుచేతఁ గిల్బిషంబులను బ్రత్యాహారంబుచేత సంసర్గంబులను దహనంబుసేసి, ధ్యానంబుచేత రాగంబుల సత్త్వాది గుణంబులను నివారించి, స్వనాసాగ్రావలోకనంబు సేయుచు. 921**

**ప్రతి :** అది= ఆ యోగధర్మం; ఎట్లు+అనినన్= ఎలాంటిది అంటే వినుము; స్వధర్మ+ఆచరణంబును= తన ధర్మం తాను చేయుట; శాస్త్ర+ఆధారంబులన్= శాస్త్రం చెప్పినరీతిగా; వినిషిద్ధ= నిషేధింపబడినట్టి; కర్మంబులు= పనులు; మానుటయున్= చేయకుండుట; దైవికంబు+ఐ= కర్మఫలరూపంగా; వచ్చిన; అర్థంబువలనన్= సంపదవల్ల; సంతోషించుటయును= ఆనందించుట; మహాభాగవత= గొప్పభగవద్భక్తులయొక్క; శ్రీపాద+అర్చనంబును= మంగళకరములైన చరణములను సేవించుట; గ్రామ్యధర్మ= పామరులనడవడినుండి; నివృత్తియున్= తొలగుటయు (కుసంస్కారం లేకుండుట); మోక్షధర్మంబులయందున్= ముక్తికనువైన నడవడియందు; రతియున్= ఆసక్తియు; మితంబు+ఐ= తగినంత; శుద్ధంబు+అయిన= దోషంలేని; ఆహారసేవయున్= తిండితినుట; విజనంబు+అయి= జనసంచారం లేనిదై; నిర్+బాధకంబు+అయిన= ఏ బాధలులేనట్టి; స్థానంబునన్= చోటున; ఉండుటయున్= నివాసమును; హింసారాహిత్యంబును= హింసలేకుండుట; సత్యంబు= నిజమాడుట; అస్తేయంబును= దొంగతనం లేమియు; తనకున్= తనకు; ఎంత+అర్థంబు= ఎంతసొమ్ము; ఉపయోగించున్= ఉపయోగపడునో; అంత+అర్థంబు= అంత సొమ్మే; స్వీకరించుటయున్= కైకొనుట; బ్రహ్మచర్యంబును= జితేంద్రియత; తపస్+శౌచంబులును= తపము, పారిశుద్ధ్యం; స్వాధ్యాయపఠనంబును= వేదాన్ని చదవటం; పరమపురుషుండు+ఐన= పురుషోత్తముడైనట్టి; సర్వ+ఈశ్వరుని= భగవంతుని; అర్చనంబును= పూజించుట; మౌనంబును= మునివృత్తి (నిశ్శబ్దత), ఆసనజయంబును+చేసి= ధ్యానాదులకు అనువుగా శరీరాన్ని నిలుపగలగటం; దానంజేసి= అందువల్ల; స్థైర్యంబును= కదలనిస్థితి; (స్థిరసుఖావస్థ); ప్రాణవాయు= ప్రాణవాయువుని; స్వవశీకరణంబును= తన వశంలో ఉంచుకోవటం; ఇంద్రియనిగ్రహ= ఇంద్రియాల్ని అదుపులోపెట్టే; రూపంబు+ఐన= ఆ పేరుగల; ప్రత్యాహారంబును= ఈ పేరుగల యోగమును; మనంబుచేన్= మనస్సుచేత; ఇంద్రియంబుల= పదుకొండు ఇంద్రియాల్ని; విషయంబులవలనన్= వాని వాని లక్షణాలనుండి; మరల్చి= తొలగించి; హృదయమందున్= ఎదలో; నిలుపుటయును= ఉంచుటయు; దేహగతంబు+ఐన= శరీరంలో ఉన్న; మూల+ఆధారాది= మూలాధారము మొదలైన 6 చక్రాల; స్థానంబులలోన్= దారులలో; ఒక్క స్థానంబునందున్= ఒక్క ఆధారంలో; హృదయగతంబు+అయిన= హృదయంలో చేరిన; మనస్సుతోడన్+కూడన్= మనస్సుతోపాటు; ప్రాణధారణంబును= పంచప్రాణాల్ని ఒడిసిపట్టుకొనుట; వైకుంఠుండు+ఐన= వైకుంఠంలోనున్న; సర్వ+ఈశ్వరుండు= అంతటికి ప్రభువైన, పరమాత్మ; ప్రవర్తించిన= పాలుపంచుకొన్న; దివ్య= మంగళకరమైన; లీలాచరిత్ర= విలాసయుక్తములైన కథల్ని; ధ్యానంబును= స్మరించుట; మానస+ఏక+ అగ్రీకరణంబును= మనస్సుని ఏకాగ్రం చేయుట; పరమాత్మ+అగు= పరంధాముడైన; పద్మనాభుని= బొడ్డునందు

తామరపువ్వుగలవాడైన హరితో; సమాన+ఆకారతయును= తుల్యమైన రూపమును; ఇవియున్+కాక= పైన చెప్పినవే కాకుండా; తక్కిన= ఇతరాలైన; వ్రతదాన+ఆదులన్+చేసి= వ్రతము, దానం మొదలైనవాటి చేత; మనస్+దుష్టంబు+అయిన= మనస్సులో మలినమైన; అసత్+మార్గంబును= తప్పుదుదారుల్ని; పరిహరించి= పారద్రోలి; జితప్రాణుండు+ఐ= ప్రాణాల్ని జయించినవాడై; మెల్లన= తిన్నగా; యోజించి= ఆలోచించి; శుచి+ఐన= శుభ్రమైన; దేశంబునన్= స్థానమందు; ప్రతిష్ఠించి= కుదురుపఱచి; విజిత+ఆసనుండు+ఐ= స్వాధీనమైన ఆసనముగలవాడై; అభ్యస్త= అలవాటైన; కుశ= దర్భ; అజిన= జింకతోలు; చేల+ఉత్తర+ఆసనంబు= పైన తెల్లని గుడ్డకప్పబడినట్టి; ఆసనంబు+చేసి= పీటనమర్చి; ఋజుకాయుండు+ఐ= నిటారుగానుంచిన మేనుగలవాడై; (నడుం వంచకుండ); ప్రాణమార్గంబును= ప్రాణనాళాన్ని; కుంభక= గాలిని స్తంభించే పద్ధతి; రేచక= ప్రాణవాయువుని వదలుట; పూరకంబులు= గాలిని పీల్చుట అనే మూడింటిచేత; కోశశోధనంబు= ప్రాణాదులైన అయిదు దారులను లేక దుర్గాలను శుద్ధిపరచి; కుంభకపూరకంబులచేతన్= గాలిని, స్తంభించుట, మరియు నింపుటలద్వారా; ప్రతికూలంబు= అడ్డగింపు; కావించి= చేసి; చంచలంబు+అయిన= నిలుకడలేనట్టి; చిత్తంబున్= మనస్సును; సుస్థిరంబు+కావించి= గట్టిగా నిలిపి; తీవ్రంబు+అయిన= దృఢమైన; యమంబునన్= యమము అనే యోగంతో; ప్రతప్తంబు+అయి= మిక్కిలి తపింపబడి; విగత= పోయిన (అంతరించిన); సమస్తదోషంబు+అగు= అన్ని దోషాలు గలదైనట్టి; చామీకరంబు+కరణిన్= బంగారంవలె; విరజంబు+చేసి= రజస్సు లేనిదిగాచేసి; జితమారుతుండు+అగు= జయింపబడిన గాలికలవాడైన; (వాయువుని స్తంభింపగలవాడు); యోగి= యోగంగల మౌని; క్రమ్మఱన్= మరల; ప్రాణాయామంబు+అను= ప్రాణాయామచర్యలనే; పావకునిచేతన్= అగ్నిచేత; వాత+పిత్త+శ్లేష్మంబులు+అను= వాతం, పైత్యం, గల్ల అనే; దోషంబులన్= రోగాల్ని; భస్మీకరణంబు+చేసి= బూడిదపాలు కావించి; ధారణంబుచేతన్= 'ధారణ' అనే యోగంచేత; కిల్బిషంబులను= పాపాల్ని; ప్రత్యాహారంచేతన్= ప్రత్యాహారమనే యోగంచేత; సంసర్గంబులను= సంబంధాల్ని; దహనంబు+చేసి= కాల్చి; ధ్యానంబుచేతన్= ధ్యానయోగంచేత; రాగంబులన్= వాంఛలను; సత్త్వ+ఆదిగుణంబులను= సత్త్వం మున్నగు గుణాల్ని; నివారించి= తొలగించి; స్వ+నాసా+అగ్ర+అవలోకనంబు= తన ముక్కుయొక్క కొనభాగాన్ని చూచుటను (దీనికి చూపు చెదరకుండా నిలపటం అని అర్థం); చేయుచున్= చేస్తూ...

**తా :** యోగి శక్తికొలది స్వధర్మాన్ని పాటించాలి. శాస్త్రం నిషేధించిన కర్మలు చేయరాదు. దైవకృపవల్ల లభించిన ధనంతో తృప్తిపడాలి. భగవద్భక్తుల పాదాల్ని పూజించాలి. సంస్కారంలేని ధర్మాల్ని త్యజించాలి. మోక్షకాంక్ష కల్గివుండాలి. మితాహారిగా ఉండాలి. ఏకాంతవాసం, అహింస, సత్యం, చౌర్యం లేకుండుట, అవసరానికి తగినంత సొమ్ము పరిగ్రహించడం, ఇంద్రియ విజయం, తపస్సు, శుభ్రత, వేదపఠనం, దైవార్చన, మౌనం, స్థైర్యం, ప్రాణవాయువుని అదుపులో నుంచుకొనుట మున్నగునవి అతడు తప్పక పాటించాలి.

ఇంద్రియ విషయాలపట్ల అనాసక్తుడై 'ప్రత్యాహారాన్ని' అభ్యసించాలి. భగవత్కథల్ని వింటుండాలి. మూలాధారం మొదలైన షట్చక్రాల్లో మనస్సుతో కలిసిన హృదయాన్ని ప్రయాణించేటట్లు చేయాలి.

ఈ లక్షణాలే గాదు. తక్కినవికూడ ఆచరించవలసినవి వున్నాయి. వ్రతాలు చేయటం, అర్హులకు దానమివ్వటం, చెడ్డదారుల్లో నడవకుండటం, ప్రాణాలుగ్గబట్టి శుభ్రమైన స్థలంలో దర్భలూ, దానిపై జింకతోలు, దానిపైన, తెల్లని బట్టకప్పి పద్మాసనంలో కూర్చోవాలి. పూరకం, రేచకం, కుంభకం అనే మూడురకాల ప్రాణాయామం నిర్వహించాలి. అందువల్ల అతనికి రక్తశుద్ధి అవుతాయి. యమమనే యోగం పాటించటంవల్ల పుటంబెట్టిన బంగారుకెనయైన శుద్ధసాత్త్వికగుణం కైవసమౌతుంది. ప్రాణాయామంవల్ల వాతం, పిత్తం, శ్లేష్మం అనే మూడురోగాలు నివృత్తమౌతాయి. ప్రత్యాహారాన్ని

పాటించటంవల్ల, సాంగత్యదోషాల్ని నివారించవచ్చును. ధ్యానంవల్ల, రజోగుణాన్ని, తమోగుణాన్ని హతమార్చవచ్చును. ధ్యానసమయంలో యోగి తనదృష్టిని నాసాగ్రంపైన కేంద్రీకరించాలి.

**విశే : అష్టాంగయోగం:-** అష్టాంగ యోగం అంటే ఎనిమిది అంగాలుగల యోగం. అవి 1) యమం 2) నియమం 3) ఆసనం 4) ప్రాణాయామం 5) ప్రత్యాహారం 6) ధారణ 7) ధ్యానం 8) సమాధి. వీటిలో 'యమనియమాలు' చాలా ముఖ్యమైనవి.

**1) యమం :** "అహింసా సత్యమస్తేయం బ్రహ్మచర్యం దయార్జవమ్।
క్షమా, ధృతి ర్మితాహార శ్శౌచం చేతి యమా దశ॥"

హింసింపకుండటం, సత్యం పల్కటం, దొంగలింపకుండటం, ఇంద్రియనిగ్రహం, కరుణ, ఋజువర్తనం, ఓర్పు, స్థిరత్వం, అల్పాహారం తినటం, శుద్ధి, అనే పది యమమనే యోగం లక్షణాలు.

**2) నియమం :** తప స్సంతోష మాస్తిక్యం దాన మీశ్వరపూజనమ్ ।
వేదాంతశ్రవణం చైవ హ్రీర్మతిశ్చ జపో వ్రతమ్ ॥

తపస్సు, ఆత్మతృప్తి, నమ్మకం కల్గివుండటం, దానం, ఈశ్వరార్చన, వేదాంత శ్రవణం, లజ్జ, తెలివి, జపం (మంత్రోపాసన). వ్రతం అనే పది నియమయోగ లక్షణాలు.

**3) ఆసనం :** ఇది అనేకవిధాలు. వాటిలో సిద్ధాసనం, పద్మాసనం శ్రేష్ఠమైనవి. వీటిని ముముక్షువులు తప్పక అభ్యసించాలి. ఇంకా పశ్చిమోత్తానసనం, బ్రహ్మాసనం కూడ మిక్కిలి శ్రేష్ఠమైనవి.

**4) ప్రాణాయామం :** ఇది ప్రధానంగా రేచకం, పూరకం, కుంభకం అని మూడురకాలు. ఊపిరితిత్తులనుండి ప్రాణవాయువును బయటికి వదలుట రేచకం. బయటి వాయువును ముక్కు రంధ్రాలద్వారా లోపలికి తీసుకొనుట పూరకం. నిర్వికారుడై సమస్తవృత్తుల్ని లయపరచి, స్వయం ప్రకాశమే తానని భావించి, గ్రహించిన వాయువును లోపలనే అదిమివుంచుట 'కుంభకం'. అదిమిన గాలి దైహికమైన అన్ని రంధ్రాలనుండి నిర్గమించాలి. ఈ చర్యను సాధకుడు గురుముఖంగా అభ్యసించవలసి వుంటుంది-

**5) ప్రత్యాహారం :** అంతరింద్రియాల్ని స్వాధీనంలో నుంచి, స్వస్వరూపధ్యానం చేయటమే ప్రత్యాహారం.

**6) ధారణ :** పరమాత్మస్వరూపాన్ని హృదయగుహయందు నిక్షేపించుట. ఇందుకు 'ప్రణవనాదం' సహకారిగా వుంటుంది.

**7) ధ్యానం :** ఇతర చింతల్ని మనస్సులోనికి రానీకుండా, స్వబోధ ప్రజ్ఞయైన ఆత్మతో బుద్ధిని లయపరచుట ధ్యానమనబడును.

**8) సమాధి:**ధ్యానం, ధ్యాత, ధ్యేయం అనే త్రిపుటి కన్పించకుండా ఉదయసాయం సంధ్యల్లో, శీతోష్ణాదిగుణాలు, ఆకలిదప్పులు తెలియక బ్రహ్మాకారస్థితిలో నుండుట సమాధి యౌతుంది. ఈ అవస్థయే జీవన్ముక్తి. ఇదే నిజమైన విదేహ కైవల్యం.

ధారణ ధ్యానం, సమాధి అనే మూడూ, మోక్షానికి అంతరంగ సాధనాలు-

సమాధిలక్షణం లేని యోగికి బ్రహ్మానందపదవి లభించదు. వల లేకుండ చేపలు, శస్త్రాస్త్రాలు లేకుండ మృగాలు, ఔషధం లేకుండ రోగాలు, దీపం లేకుండ చీకటి, తిండి లేకుండ ఆకలి, బిగ్గరగా పేరు చెపితే ఎలా లోబడవో అలాగే 'నేను రాజయోగిని - అహం బ్రహ్మాస్మి, శివోఽహం, సోఽహం' అని కోటిసార్లు గొంతెత్తి అరచినా, ఆ అరుపులు నిష్ప్రయోజనాలే. సాధనే ముఖ్యం.

**సీ. దళదరవింద సుందర పత్ర రుచిరాక్షు, సలలిత శ్రీవత్స కలిత వక్షు,**
**నీలనీరదనీల నీలోత్పల శ్యాము, నలికులాకులమాలికాభిరాముఁ,**
**గౌస్తుభరుచిర ముక్తాహార యుతకంఠు, యోగిమానస పంకజోపకంఠు,**
**సతత ప్రసన్న సస్మిత వదనాంభోజు, దినకర కోటిసందీప్త తేజు,**

**తే. సలలితానర్ఘ రత్నకుండల కిరీట, హార కంకణ కటక కేయూర ముద్రి**
**కా తులాకోటిభూషు, భక్తప్రపోషుఁ, గింకిణీయుత మేఖలాకీర్ణజఘను, 922**

**ప్రతి :** దళత్= వికసించిన; అరవింద సుందర పత్ర= అందమైన తామరరేకులవలె; రుచిర= ఇంపైన; అక్షున్= కనులు కలవాడును; సలలిత= చూడముచ్చటైన; శ్రీవత్స= శ్రీవత్సమనే పేరుగల మచ్చతో; కలిత= కూడిన; వక్షున్= ఱొమ్ముకలవాడును; నీలనీరద= నల్లనిమేఘంవలె; నీల= నల్లని; నీల+ఉత్పల= నల్లకలువవలె; శ్యామున్= నల్లగానున్నవాడును; అలికుల= తుమ్మెదపిండుయొక్క; ఆకుల= ముసరుపాటుగల; మాలికా+అభిరామున్= మాలచే ఒప్పారుచున్నవాణ్ణి, (తోమాలెగలవాడు); కౌస్తుభ= వక్షఃస్థలమందున్న మణిచే; రుచిర= మెరుస్తున్న; ముక్తాహార= ముత్యాల దండచేత; యుత= కూడిన; కంఠున్= మెడగలవాడును; యోగిమానస= యోగుల మనస్సనెడి; పంకజ= పద్మానికి; ఉపకంఠున్= దగ్గరయైనవాడును; సతత= ఎల్లప్పుడు; ప్రసన్న= అనుగ్రహపరమైన; సస్మిత= చిరునగవుతోకూడిన; వదన+అంభోజున్= ముఖపద్మంకలవాడును; దినకరకోటి= కోటిసూర్యులమాదిరి; సందీప్త= వెలిగిపోతున్న; తేజున్= ప్రకాశం కలవాడును; సలలిత= మిక్కిలి ఆకర్షణీయమైన; అనర్ఘరత్న= విలువైన రత్నములతోడి; కుండల= చెవిపోగులు; కిరీట= మకుటం; హార= ముత్యాలదండలు; కంకణ= మురుగులు; కటక= కడియాలు; కేయూర= భుజకీర్తులు; ముద్రికా= ముద్దుటుంగరాలు; తులాకోటిభూషు= కాలిఅందెలు అను సొమ్ములు కలవాడును; భక్తప్రపోషున్= భక్తులను పోషించేవాడును; కింకిణీయుత= గజ్జెలతో కూడిన; మేఖలా+ఆకీర్ణజఘునున్= మొలనూలిచే ఆవరించబడిన నడుము గలవాడును అయిన శ్రీమహావిష్ణుని..

**తా :** శ్రీమన్నారాయణుని కళ్ళు తామరరేకుల్లా అందంగా ఉన్నాయి. ఆయన రొమ్ముపై శ్రీవత్సమనే మచ్చ చూడముచ్చటగా వుంది. ఆయన దేహకాంతి నీలమేఘాన్ని, నల్లకలువను పోలివుంది. ఆయన ధరించిన తోమాలెపై గండుతుమ్మెదలు ముసురుతున్నాయి. మెడలో కౌస్తుభమణితో ముత్యాలహారం మెరిసిపోతున్నది. ఆ స్వామి యోగులకు అందుబాటులోనే వుంటాడు. ఆయన ప్రసన్న వదనంలో ఎల్లప్పుడూ చిరునవ్వు తాండవిస్తుంటుంది. ఆయన కోటిసూర్యుల తేజస్సుతో ప్రకాశిస్తుంటాడు. విలువైన రత్నాలు తాపిన చెవిపోగులు, కిరీటం, రత్నహారాలు, ముంజేతికడియాలు, కాళ్ళకడియాలు, భుజకీర్తులు, రత్నాంగుళీయకాలు, ఘలుఘల్లుమనే గజ్జెలు ఆయన ధరించే ఆభరణాలు. ఆయన నడుం గజ్జెలమొలనూలితో రవళిస్తుంది. ఆయన నిత్యవిధి భక్తసంరక్షణ.

**వ. మఱియు. 923**

**ప్రతి :** మఱియును= ఇంకా,

**తా :** ఆ తర్వాత

**సీ. కంజాత కింజల్క పుంజ రంజిత పీత కౌశేయవాసు, జగన్నివాసు,**
**శత్రుభీకర చక్ర శంఖ గదాపద్మ విహిత చతుర్బాహు విగతమోహు,**

**నుత భక్త లోక మనోనేత్ర వర్ధిష్ణు, లాలిత సద్గుణాలంకరిష్ణు,**
**వరకుమారక వయః పరిపాకు, సుశ్లోకు, సుందరాకారు, యశోవిహారు,**

**తే. సకలలోక నమస్కృత చరణ కమలు, భక్తలోక పరిగ్రహ ప్రకట శీలు,**
**దర్శనీయ మనోరథ దాయిఁ, గీర్త, నీయ తీర్థయశో మహనీయమూర్తి. 924**

**ప్రతి :** కంజాత= తామరపువ్వులోని; కింజల్కపుంజ= కేసరముల గుంపువలె; రంజిత= మెరుస్తున్న; లేక ముచ్చటైన; పీతకౌశేయవాసున్= పచ్చని పట్టుపుట్టం కలవాడును; జగత్+నివాసున్= లోకాలన్నింట నివసించేవాడును (వ్యాప్తిరూపంగా); శత్రుభీకర= విరోధులకు భీతినికొల్పే; చక్ర= సుదర్శనచక్రం; శంఖం= సంకువు (వలమురి); గదా= కౌమోదకి అనేగద; పద్మ= పద్మం, వీటిచే; విహిత= కూడిన; చతుర్బాహున్= నాల్గుభుజాలుగలవాడును; విగత= వదలిన; మోహున్= వ్యామోహం గలవాడును; నుత= కొనియాడదగిన; భక్తలోక= భక్తగణం; మనస్+నేత్ర= మనస్సనే నేత్రంలో; వర్ధిష్ణున్= పెరుగుతున్నవాడును; లాలిత= ఇంపైన, సత్+గుణ= ఉత్తమ గుణాలచే; అలంకరిష్ణున్= వెల్గుతున్నవాడును; (సద్గుణాలే ఆయన అలంకారాలు); వర= శ్రేష్ఠమైన; కుమారక= కౌమారదశగల; వయస్+పరిపాకున్= పరిపక్వమైన వయస్సుగలవాడును; సుశ్లోకున్= గొప్పకీర్తిగలవాడును; సుందర+ఆకారున్= అందమైన ఆకారంగలవాడును; యశస్+విహారున్= యశస్సుతో వర్తించేవాడును; సకలలోక= లోకాలన్నింటిచే; నమస్కృత= నమస్కరింపబడిన; చరణకమలున్= పాదపద్మాలు కలవాడును; భక్తలోక= భక్తుల్ని; పరిగ్రహ= కైకొనుటచే; ప్రకటశీలున్= విస్పష్టమైన నడవడిగలవాడును; దర్శనీయున్= చూడముచ్చటైనవాడును; మనోరథదాయిన్= కోర్కెల నెరవేర్చువాడును; కీర్తనీయ= కొనియాడదగిన; తీర్థ= పుణ్యోదకంచేత; యశస్+మహనీయమూర్తి= గొప్పకీర్తిగలవాడు; (దోషరహితమైన విగ్రహంగలవాడని అర్థం)

**తా :** మఱియు ఆ నారాయణుడు తామరపూవు కేసరాల వన్నెతో నిగనిగలాడుతున్న పచ్చని పట్టుపుట్టం ధరిస్తాడు. చతుర్దశభువనాల్లో వ్యాప్తిరూపంలో ఉంటాడు. శత్రువులకు వెఱపు గొల్పే చక్రం, శంఖం, గద, పద్మం ధరించివుంటాడు. మోహం లేనివాడు, భక్తుల హృదయాల్లో, కన్నుల్లో మెదలుతుంటాడు. సద్గుణాలకు నెలవైనవాడు. కౌమారదశలో వెలుగొందుతుంటాడు. గొప్పకీర్తిగలవాడు. సుందరాకారుడు. లోకులెల్లరు ఆయన పాదపద్మాలపై మోకరిల్లుతారు. భక్తుల్ని చేరదీయటం ఆయనకు పెట్టింది పేరు. ఆయనరూపం చూడముచ్చటైంది. ఎల్లకోర్కెల్ని నెరవేర్చగల ప్రభువాయన. ఆయనకీర్తి లోకవిశ్రుతం.

**వ. వెండియు. 925**

**ప్రతి :** వెండియున్= మరల

**తా :** ఇంకా,

**క. అనుపమ గుణ సంపూర్ణుని, ననఘుని సుస్థితుని గతుని నాసీను శయా**
**నుని భక్తహృద్గుహాశయ, ముని సర్వేశ్వరు ననంతు నుతసచ్చరితున్. 926**

**ప్రతి :** అనుపమ= సాటిలేని; గుణ= గుణాలచే; సంపూర్ణునిన్= నిండైనవాడును; అనఘునిన్= పాపరహితుడును; సుస్థితునిన్= స్థిరమైనవాడును; గతునిన్= లోక సంచారగతులుగలవాడును; ఆసీనున్= ఒకచోట కూర్చొని చూస్తున్నవాడును;

శయానునిన్= పడుకపై నిద్రిస్తున్నవాడును; భక్త= భక్తుల; హృత్+గుహా= హృదయమనే గుహలో; శయనునిన్= శయనించినవాడును; అనంతున్= అంతము లేనివాడును; నుత= కీర్తింపతగిన; ఉత్తమచరితున్= మంచి చరిత్రకలవాడైన; సర్వేశ్వరున్= శ్రీహరిని...

**తా :** మఱియు ఆ శ్రీహరి సద్గుణపరిపూర్ణుడు. దోషరహితుడు. స్థిరబుద్ధిగా లోకసంచారిగా, ఒకచోట నిలిచి చూస్తున్నవాడుగా, ఒకచోట పరుండినవాడుగా దర్శనమిస్తాడు. అంతేగాక ఆయన భక్తులహృదయాల్లో తిష్ఠవేసుకొంటాడు. అట్టి అనంతుడైన ఆ సర్వేశ్వరుడు స్తుతింపదగిన మంచి చరిత్ర గలిగినవాడు.

**మ. విమలం బై పరిశుద్ధమై తగు మనోవిజ్ఞాన తత్త్వ ప్రబో**
**ధ మతిన్ నిల్పి తదీయమూర్తి విభవధ్యానంబు గావించి చి**
**త్తము సర్వాంగ విమర్శన క్రియలకుం దార్కొల్పి ప్రత్యంగమున్**
**సుమహాధ్యానము సేయఁగా వలయుఁబో శుద్ధాంతరంగంబునన్. 927**

**ప్రతి :** విమలంబు+ఐ= స్వచ్ఛమై; పరిశుద్ధము+ఐ= మాలిన్యంలేనిదై; తగు= యోగ్యమగు; మనోవిజ్ఞాన= మనస్సంబంధిజ్ఞానం; తత్త్వప్రబోధమతిన్= ఆత్మజ్ఞానంతో కూడిన మనస్సులో; నిల్పి= నారాయణమూర్తిని పాదుకొల్పి; తదీయమూర్తి= ఆ పరమేశ్వరునిమూర్తి; విభవ= సంపదయొక్క; ధ్యానంబు= చింతన; కావించి= చేసి; చిత్తమున్= బుద్ధిని; సర్వ+అంగ= సమస్తమైన అవయవముల; విమర్శన= పరామర్శించే; క్రియలకున్= కార్యకలాపాలకు; తార్కొల్పి= దగ్గఱగాచేర్చి (కదియునట్లు); శుద్ధ+అంతరంగంబునన్= పరిశుద్ధమైన మనస్సునందు; ప్రతి+అంగమున్= స్వామివారి పాదాలనుండి ముఖందాక; సుమహాధ్యానము= గొప్ప నిలుకడగల ధ్యానం; చేయన్+కాన్+వలయున్= చేయాలి.

**తా :** ఆ పరమాత్మను స్వచ్ఛమైన మనోవీథిలోను, ఆత్మలోను పాదుకొల్పి, ఆయన మూర్తిని ధ్యానించాలి. ఆ స్వామివారు చేసే క్రియల్ని పరిశీలించి, ఆయన అవయవాలన్నింటిమీద మనసు లగ్నమైనట్లు తెలిసిన తర్వాత పాదాలనుండి ముఖం వఱకు ధ్యానించాలి.

**వ. అది యెట్టి దనిన. 928**

**ప్రతి :** అది= ఆ ప్రత్యంగం; ఎట్టిది+అనినన్= ఎలాటిదనగా

**తా :** ఆ ఆపాదమస్తకమూర్తి ఎలాంటిదనగా

**సీ. హల కులి శాంకుశ జలజ ధ్వజ చ్ఛత్ర లాలిత లక్షణ లక్షితములు**
**సలలిత నఖ చంద్ర చంద్రికా నిర్ధూత భక్త మానస తమః పటలములును**
**సురుచిరాంగుష్ఠ నిష్ఠ్యూత గంగా తీర్థ మండిత హర జటా మండలములు**
**అంచిత ధ్యాన పరాయణ జన భూరి కలుష పర్వత దీప్త కులిశములును**

**తే. దాసలోక మనోరథ దాయకములుఁ, జారు యోగి మనః పద్మ షట్పదములు**
**ననఁగఁ దనరిన హరిచరణాబ్జములను, నిరుపమ ధ్యానమున మది నిలుపవలయు. 929**

**ప్రతి :** హల= నాగలి; కులిశ= వజ్రం; అంకుశ= ఏనుగుల కుంభస్థలాన్ని పొడిచే ఆయుధం; జలజ= తామరపువ్వు; ఛత్ర= గొడుగు మొదలైన; లాలిత= ఒప్పిదమైన; లక్షణ= గుర్తులచే; లక్షితములు= గుర్తింపబడినవియును; సలలిత= అందమైన; నఖచంద్ర= గోళ్ళు అనే చందురుని; చంద్రికా= వెన్నెలచే; నిర్ధూత= ఎగురగొట్టబడినట్టి; భక్త= భక్తుల; మానస= మనస్సులందలి; తమఃపటలములును= చీకట్లసమూహాలు గలవీ; సురుచిర= మిక్కిలి ప్రకాశవంతమైన; అంగుష్ఠ= కాలిబొటనవ్రేళ్ళనుండి; నిష్ఠ్యూత= స్రవించిన; గంగాతీర్థ= గంగాజలంచేత; మండిత= అలంకరింపబడిన; హర= శివుని; జటామండలములు= జడల సమూహాలు గలవి; అంచిత= ఒప్పిదమైన; ధ్యానపరాయణ= ధ్యానమందు నిమగ్నులైనట్టి; జన= లోకుల; భూరి= గొప్ప; కలుషపర్వత= పాపాలనే కొండలకు; దీప్త= వెలుగుచున్న; కులిశములును= ఖండించే వజ్రాయుధాలవంటివియును; దాసలోక= దాసజనం; మనోరథ= కోర్కెల్ని; దాయకములున్= నెరవేర్చగలవియును; చారు= సుందరమైన; యోగి= యోగుల; మనస్+పద్మ= మనస్సులనే పద్మాలకు; షట్పదములు= తుమ్మెదలవంటివియును; అనన్+కన్= అన్నట్లు; తనరిన= ఒప్పారిన; హరి= శ్రీమహావిష్ణువు; చరణ+అబ్జములను= పాదపద్మాల్ని; మదిన్= ఎదలో; నిరుపమ= సాటిలేని; ధ్యానమునన్= ధ్యానంలో; నిలుపవలయున్= నిల్పాలి.

**తా :** శ్రీహరి పాదపద్మాలు నాగలి, వజ్రం, అంకుశం, పద్మం, ధ్వజం, గొడుగు మొదలైన చిహ్నాలు కలిగివున్నాయి. గోళ్ళు చంద్రవంకలవలె తెల్లగా నుండి, భక్తుల మనోమాలిన్యాన్ని తుడిచి వేస్తున్నట్లున్నాయి. అడుగుల బొటనవ్రేళ్ళనుండి పెల్లుబికిన గంగాజలం శివజటాజూటానికి అలంకారంగా వుంది. ధ్యానమగ్నులైన మనుజుల కలుషపర్వతాల్ని ఛేదించే వజ్రాయుధంలా వున్నాయి ఆ పాదాలు. దాసుల కోర్కెల్ని నెరవేరుస్తాయి. యోగీశ్వరుల హృదయపద్మాలకు తుమ్మెదలవలె వున్నాయి. అంత మహిమగల ఆ పాదపద్మాల్ని అన్యచింత వీడి ధ్యానించాలి.

**చ. కమలజు మాతయై సురనికాయ సమంచిత సేవ్యమానయై**
**కమలదళాభ నేత్రములు గల్గి హృదీశ్వరభక్తి నొప్పు న**
**క్కమల నిజాంక పీఠమునఁ గై కొని యొత్తు పరేశు జాను యు**
**గ్మము హృదయారవిందమున మక్కువఁ జేర్చి భజింపఁగాఁ దగున్. 930**

**ప్రతి :** కమలజు= పద్మమునందు పుట్టిన బ్రహ్మకు; మాత+ఐ= తల్లియై; సురనికాయ= దేవతల సమూహానికి; సమంచిత= ఒప్పిదంగా; సేవ్యమాన+ఐ= పూజింపదగినదై; కమలదళ= తామరరేకుల; ఆభ= సమానమైన; నేత్రములు= కన్నులు కల్గి; హృత్+ఈశ్వర= హృదయప్రభువునందలి; భక్తిన్= భక్తితో; ఒప్పు= ప్రకాశించునట్టి; ఆ+కమల= ఆ లక్ష్మీదేవి; నిజ+అంకపీఠమునన్= తన ఒడిలోనికి; కైకొని= స్వీకరించి; ఒత్తు= పిసుకునట్టి; పర+ఈశు= పరమేశ్వరుడైన శ్రీహరియొక్క; జానుయుగ్మము= మోకాళ్ళజంటను; హృదయ+అరవిందమునన్= హృదయమనే కమలమునందు; మక్కువన్= ప్రీతితో; చేర్చి= కూర్చి; భజింపన్+కాన్+తగున్= స్తోత్రం చేయవలెను

**తా :** శ్రీలక్ష్మి బ్రహ్మదేవునికి తల్లి. ఆమెను దేవతలెల్లరు నిరంతరం కొలుస్తారు. ఆమె కన్నులు తామరరేకుల్ని పోలివుంటాయి. హృదయేశ్వరుడైన శ్రీహరిపై ఆమెకు ఎనలేని భక్తి. ఆ స్వామి పాదపద్మాలను ఆమె తన ఒడిలో ఉంచుకొని ఒత్తుతూ వుంటుంది. అలాంటి స్వామివారి పాదాల్ని భక్తులు నిరంతరం కొలుస్తూవుండాలి.

**ఉ. చారు విహంగవల్లభు భుజంబులమీఁద విరాజమాన సు**
**శ్రీ రుచి నుల్లసిల్లి యతసీకుసుమద్యుతిఁ జాల నొప్పు పం**

**కేరుహనాభు నూరువు లకిల్బిషభక్తి భజించి మానసాం**
**భోరుహమందు నిల్పఁ దగుఁ బో మునికోటికి నంగనామణీ!** 931

**ప్రతి :** అంగనామణీ!= స్త్రీలలో మణివంటి ఓ తల్లీ!; చారు= సుందరమైన; విహంగవల్లభు= పక్షిరాజైన గరుత్మంతుని; భుజంబులమీఁదన్= భుజాలపైన; విరాజమాన= వెలిగిపోతున్న; సుశ్రీరుచిన్= మంగళకరమైనకాంతితో; ఉల్లసిల్లి= ఒప్పారి; అతసీకుసుమ= అవిసెపువ్వుల; ద్యుతిన్= కాంతితో; చాలన్= మిగుల; ఒప్పు= విలసిల్లు; పంకేరుహనాభు= తామరబొడ్డునందుగల శ్రీహరి; ఊరువులు= తొడలు; అకిల్బిష= పాపరహితమైన (ఏ దోషంలేని); భక్తిన్= భక్తితో; భజించి= కొలిచి; మునికోటికిన్= మౌనులకు; మానస+అంభోరుహమందున్= మనస్సు అనే కమలమందు; నిల్పన్+తగున్+పో= నిలపాలిసుమా!

**తా :** అమ్మా! మానినీమణీ! ఆ నారాయణుని తొడలు అందగాడైన ఆ గరుత్మంతుని భుజాలపై వెలుగొందుతుంటాయి. అవి అవిసెపూవన్నెతో మెరుస్తుంటాయి. అలాంటి ఆ స్వామివారి ఊరుద్వయాన్ని మునీశ్వరులు మనసార కొలుస్తారు.

**క. పరిలంబిత మృదు పీతాం, బర కాంచీగుణ నినాద భరితం బగు న**
**ప్పురుషోత్తముని నితంబము, దరుణీ! భజియింపవలయుఁ దద్దయుఁ బ్రీతిన్.** 932

**ప్రతి :** తరుణీ!= యౌవనంగల తల్లీ!; పరిలంబిత= చుట్టబడిన; మృదు= మెత్తని; పీత+అంబర= పట్టువస్త్రంపైనున్న; కాంచీగుణ= మొలనూలియొక్క; నినాద= ధ్వనిచే; భరితంబు+అగున్= నిండినదైన; ఆ+పురుష+ఉత్తముని= పురుషపుంగవుడైన ఆ దేవుని; నితంబము= పృష్ఠభాగం (పిఱుదు); తద్దయున్= మిక్కిలి; ప్రీతిన్= ప్రీతితో; భజింపవలయున్= కొలవాలి.

**తా :** తల్లీ! స్వామి నడుమునకు మెత్తని పట్టువస్త్రం ధరించాడు. దానిపై నున్న మొలనూలి మువ్వలు గల్లుమంటున్నాయి. ఆ పురుషోత్తముని నడుమును ప్రీతితో తప్పక సేవించాలి.

**క. విను భువనాధారత్వం, బునఁ దగి విధి జనన హేతుభూతంబగు న**
**వ్వనజాతముచేఁ గడు మిం, చిన హరినాభీసరస్సుఁ జింతింపఁ దగున్.** 933

**ప్రతి :** విను= అమ్మా! వినండి. భువన= లోకాలకు; ఆధారత్వంబునన్= ఆధారభావంతో; తగి= ఒప్పి; విధిజనన= బ్రహ్మపుట్టుకకు; హేతుభూతంబు+అగున్= కారణమైన; ఆ+వనజాతముచేన్= ఆ తామరచే; కడు= మిక్కిలి; మించిన= కొనియాడదగ్గ; హరి= విష్ణుమూర్తి; నాభీసరస్సున్= సరస్సును పోలినబొడ్డును; చింతింపన్+తగున్= స్మరించాలి.

**తా :** సర్వలోకాల సృష్టికి మూలమైన ఆ బ్రహ్మసృష్టికి కారణమైన తామరపువ్వును ధరించిన శ్రీహరిబొడ్డు మిక్కిలి ధ్యానయోగ్యమైంది.

**తే. దివ్య మరకతరత్న సందీప్త లలిత, కుచములను మౌక్తికావళి రుచులఁ దనరి**
**యిందిరాదేవి సదనమై యెసకమెసఁగు, వక్ష మాత్మను దలపోయ వలయుఁ జుమ్ము,** 934

**ప్రతి :** దివ్య= దేదీప్యమానమైన; మరకతరత్న= పచ్చలనే రత్నాలచే; సందీప్త= మిక్కిలి వెల్గుతున్న; లలిత= సుందరమైన; కుచములను= స్తనములచేతను; మౌక్తిక+ఆవళి= ముత్తెపుగుంపుయొక్క; రుచులన్= కాంతులతోను; తనరి= ఒప్పిన;

ఇందిరాదేవి= లక్ష్మీదేవికి; సదనము+ఐ= నెలవై; ఎసకము+ఎసఁగు= మిక్కిలి చెన్నొందు లేక అతిశయించు; వక్షము= రొమ్మును; ఆత్మలన్= హృదయాలలో; తలపోయవలయున్+చుమ్ము= స్మరించాలి సుమా!

**తా :** స్వామి వక్షఃస్థలం పచ్చరాలు తాపిన ప్రదేశంలాగా వెలిగిపోతున్నది. ముత్యాలహారాల కాంతులతో ఒప్పారుతున్నది. ఇందిరాదేవికి నెలవై యలరారుతున్నది. అటువంటి వక్షఃస్థలాన్ని ధ్యానించాలి.

**మ. నిరతంబున్ భజియించు సజ్జన మనో నేత్రాభిరామైక సు**
**స్థిర దివ్యప్రభ గల్గు కౌస్తుభ రుచిశ్లిష్టంబునై యొప్పు నా**
**వర యోగీశ్వర వంద్యమానుఁడగు సర్వస్వామి లక్ష్మీశు కం**
**ధర మాత్మం గదియించి తద్గుణగణధ్యానంబు సేయం దగున్. 935**

**ప్రతి :** నిరతంబున్= ఎల్లప్పుడు; భజియించు= కొలుచునట్టి; సత్+జన= ఉత్తములైనవారియొక్క; మనస్= మనస్సునకు; నేత్ర= కళ్ళకు; అభిరామ+ఏక= ముఖ్యంగా ఆకర్షణీయమైన; సుస్థిర= ఎడబాయని; దివ్యప్రభ= దివ్యమైనకాంతి; కల్గు= కల్గిన; కౌస్తుభ= ఈ పేరుగలమణియొక్క; రుచి= కాంతిచే; శ్లిష్టంబున్+ఐ= కూడినదై; ఒప్పు= ప్రకాశించునట్టి; ఆ వర= శ్రేష్ఠులైన; యోగి+ఈశ్వరుల= యోగీంద్రులచే; వంద్యమానుఁడు+అగు= కొనయాడబడినవాడైన; సర్వస్వామి= ఎల్లలోకాలకు ప్రభువగు; లక్ష్మీ+ఈశున్= సిరిమగని; కంధరము= మెడ; ఆత్మన్= మనసులో; గదియించి= పాదుకొల్పి; తద్+గుణగణ= ఆ దేవుని గుణసముదాయాన్ని; ధ్యానంబు= చింతన; చేయన్+తగున్= చేయడం మంచిది.

**తా :** ఆ నారాయణుని మెడలో యోగుల మనసులకు నేత్రాలకు ఆహ్లాదాన్ని గొల్పే కౌస్తుభమణి మెరుస్తున్నది. యోగీంద్రులకు నిత్యస్తుతి పాత్రుడైన ఆ స్వామి కంధరాన్ని అనన్యచింతనులై ధ్యానించాలి.

**క. ఘన మందర గిరి పరివ, ర్తన నికషోజ్జ్వలిత కనక రత్నాంగదముల్**
**దనరార లోకపాలకు, లను గలిగిన బాహు శాఖలను దలఁపఁ దగున్. 936**

**ప్రతి :** ఘన= గొప్ప; మందరగిరి= మందర పర్వతాన్ని; పరివర్తన= గిరగిర త్రిప్పగల్గిన; నికష+ఉజ్జ్వలిత= ఒరిపిడిచే వెల్గుతున్న; కనకరత్న= బంగారు మరియు రత్నాలు పొదిగిన; అంగదముల్= భుజకీర్తులు; తనరారన్= విలసిల్లుచుండగా; లోకపాలకులను= ఎనిమిదిమందు దిక్పాలురను; కలిగిన= మోస్తున్న; బాహుశాఖలను= భుజములనెడు కొమ్మలను; తలంపన్+తగున్= ధ్యానించాలి.

**తా :** సానబట్టిన రత్నాలు పొదివిన బంగారు భుజకీర్తులతో, స్వామివారి భుజాలు వెల్గుతున్నాయి. మందరపర్వత ఘర్షణచే ప్రకాశింపజేయబడిన స్వర్ణరత్నాంగదాలు కల్గివున్నాయి. అష్టదిక్పతుల్ని మోయగల్గుతున్నాయి. ఆ భుజాల్ని ధ్యానించాలి.

**వ. మఱియు విమత జనాసహ్యంబులైన సహస్రారంబులు గలుగు సుదర్శనంబును, సరసిజోదర కరసరోరుహంబందు రాజహంస రుచిరంబయిన పాంచజన్యంబును, నరాతిభట శోణిత కర్దమలిప్తాంగంబై భగవత్ప్రీతికారిణి యగు కౌమోదకియును, బంధురసుగంధ గంధానుబంధ మంథర గంధవహాహూయమాన పుష్పంధయ ఝుంకారనాద విరాజితంబైన వైజయంతీ వనమాలికయును, జీవ తత్త్వంబైన కౌస్తుభ మణియును, బ్రత్యేకంబ ధ్యానంబు సేయందగు, వెండియు భక్త సంరక్షణార్థం బంగీకరించు దివ్య మంగళ విగ్రహంబున**

**కనురూపంబును, మకరకుండల మణి నిచయమండిత ముకురోపమాన నిర్మల గండ మండలంబును, సంతత శ్రీనివాసంబు లయిన లోచన పంకజంబులును గలిగి లాలితభ్రూలతాజుష్టంబును, మధుకర సమాన రుచి చికుర విరాజితంబును నైన ముఖకమలంబును ధ్యానంబు గావింపవలయు, మఱియు శరణాగతుల కభయ ప్రదంబు లగుచు నెగడు పాణిపంకేరుహంబుల మనంబునఁ దలఁప వలయు. 937**

**ప్రతి :** మఱియున్= ఇంకా; విమతజన= విరోధులకు; అసహ్యంబులు+ఐన= సహింపశక్యంకాని; సహస్రారంబులు+కలుగు= వేయి అంచులుగలిగిన; సుదర్శనంబును= ఆ పేరుగల చక్రము; సరసిజ+ఉదర= పద్మగర్భుడైన ఆ శ్రీహరి; కరసరోరుహములందున్= కమలములబోలిన చేతులందు; రాజహంసరుచిరంబు+అయిన= రాయంచకాంతివంటిదయిన; పాంచజన్యంబునున్= పాంచజన్యం అనే శంఖమును; అరాతిభట= శత్రుసైనికుల; శోణితకర్దమ= రక్తపు బురదతో; లిప్త= అంటిన; అంగంబు+ఐ= శరీరంగలదై; భగవత్= భగవంతునికి; ప్రీతికారణి+అగు= ప్రియమైనట్టిదైన; కౌమోదకియును= ఈ పేరుగల గదయు; బంధుర= దట్టమైన; సుగంధగంధ= మంచి పరిమళముతో; అనుబంధ= కలిసిన; మంథర= మెల్లగా వీచే; గంధవహ= గాలిచేత; ఆహూయమాన= పిలువబడుచున్న; పుష్పంధయ= తుమ్మెదల; ఝుంకారనాద= జుమ్మనునాదంచేత; విరాజితంబు+ఐన= వెలుగుతున్న; వైజయంతీ= ఈ పేరుగల; వనమాలికయును= మెడహారమును; జీవతత్త్వంబు+ఐన= ఆత్మీయమైన; కౌస్తుభమణియును= కౌస్తుభమనే పేరుగల మణియు; ప్రత్యేకంబు+అ= వేరువేరుగా; ధ్యానంబు+చేయన్+తగున్= చింతన చేయాలి; వెండియున్= మరల; భక్తసంరక్షణ+అర్థంబు= భక్తుల్ని కాపాడటానికై; అంగీకరించు= సమ్మతించునట్టి; దివ్యమంగళ విగ్రహంబునకున్= పవిత్రము మంగళకరమునైన రూపానికి; అనురూపంబును= తగినట్టి; మకరకుండల= చెవిపోగుల; మణినిచయ= కాంతి పుంజంచేత; మండిత= ప్రకాశితమైన; ముకుర= అద్దంతో; ఉపమాన= పోలిన; నిర్మల= స్వచ్ఛమైన; గండమండలంబును= చెక్కిళ్ళును; సంతత= ఎల్లప్పుడు; శ్రీనివాసంబులు+అయిన= సంపదకునెలవైన; లోచన పంకజంబులును+కలిగి= కమలాలవంటి కళ్ళను కలిగి; లాలిత= సుందరమైన; భ్రూలతా= తీవలవంటి కనుబొమలచే; జుష్టంబులును= సేవింపబడినట్టిదియు; మధుకర= తుమ్మెదలతో; సమాన= సాటియైన; రుచి= కాంతిమంతమైన; చికుర= ముంగురులతో; విరాజితంబునున్= వెలుగుతున్నదియు; ఐన= అయినట్టి; ముఖకమలంబును= పద్మమువంటిమోమును; ధ్యానంబు= స్మరణ; కావింపన్+వలయున్= చేయాలి

**తా :** ఇంకా ధ్యానించవలసిన స్వామివారి అవయవాల్ని, సాధనాల్ని కపిలుడు తల్లికి నివేదిస్తున్నాడు.

ఆ స్వామి ధరించిన వేయంచుల సుదర్శనచక్రం వైరులకు బెంబేలు పుట్టిస్తుంది. ఆయన చేతుల్లో రాయంచవన్నె శంఖ ముంది. విరోధుల రక్తమంటిన కౌమోదకి అనే గద వుంది. సువాసనచే ఆకర్షింపబడి జుమ్మని నాదంచేసే తుమ్మెదలు మూగుతున్న వనమాల మెడలో వుంది. ఆత్మతత్త్వానికి మారుపేరైన కౌస్తుభం వక్షస్థలంలో వుంది. వీటిని విడివిడిగా భక్తులు ధ్యానించాలి. భక్తులను సంరక్షించడానికి ఆయన స్వీకరించిన దివ్యమంగళమూర్తికి తగినట్లుగా ఆయన ముఖమండలం ఒప్పుతున్నది. ఆయన చెవులకు ధరించిన మకరకుండలములందలి మణులకాంతితో ప్రకాశించు అద్దాలవంటి నిర్మలమైన చెక్కిళ్ళుగల్గి వున్నాడు. నిరంతర లక్ష్మీ నిలయాలైన నేత్రపద్మాలను కల్గివున్నాడు. సుందరములైన తీవలవంటి కనుబొమలు కల్గివున్నాడు. తుమ్మెదల బారులా నిగనిగలాడే ముంగురులు గల్గివున్నాడు. అలాంటి ఆ దేవదేవుని మోమును ధ్యానించాలి.

**విశే :** పద్యసంఖ్య 920–28 మధ్య సుమారు తొమ్మిది పద్యాలలో శ్రీమన్నారాయణుని మూర్తివైభవధ్యానం అభివర్ణింపబడింది. ఈ వర్ణన విశిష్టాద్వైతసిద్ధాంతపరులైన శరణాగతులకు కొంగుబంగారం పాఠకుల సౌకర్యార్థం శ్రీహరి అవయవాల్ని,

ఆయన తాల్చిన అలంకార సామగ్రిని ఇక్కడ సంక్షిప్తంగా వివరించడం సముచితమని భావిస్తాను. భక్తులు యథోచితంగా, శ్రీ స్వామివారు నిల్చినట్లు, నడుస్తున్నట్లు, పవ్వళించినట్లు ధ్యానించాలి. భగవంతుని అవయవాలన్నింటిపై మనసుంచి, తెలిసి ధ్యానం చేయాలి. ఆయన అవయవాలు పాదాలనుండి ముఖంవరకు–

**1. పాదపద్మాలు :** ధ్వజం, వజ్రం, అంకుశం, మొదలైన చిహ్నాలు గలవై ఉన్నాయి. గోళ్ళు చంద్రవంకల వలె శోభాయమానంగా ఉన్నాయి.

**2. తొడలు :** అవిసెపూల వలె అందమై, దృఢంగా ఉన్నాయి.

**3. పిరుదులు :** పీతాంబరంతో చూడముచ్చట గొల్పుతున్నాయి.

**4. నాభికుహరం :** ఇది బ్రహ్మపుట్టడానికి కారణమైన పద్మమునకు స్థానం.

**5. వక్షస్థలం :** మరకతమణుల్లా వుంది. అది కంటికి ఇంపు గొల్పుతుంది. హృదయానందాన్ని కల్గిస్తుంది. అది లక్ష్మీదేవికి ఆవాసం.

**6. కంఠం :** కౌస్తుభమణిచే కళ కళ లాడుతోంది.

**7. నాల్గు భుజాలు :** ఆ నాల్గుచేతుల్లో సుదర్శనం అనేచక్రం, పాంచజన్యం అనేశంఖం, కౌమోదకి అనే గద, నందకం అనే ఖడ్గం ఉంటాయి.

**8. గళమందు వనమాల :** దాని సువాసనకు గండుతుమ్మెదలు మూగుతూ ఉంటాయి.

**9. కౌస్తుభం :** ఈ మణి, జీవులకు నిర్మలంగా దర్శనమిస్తుంది.

**10. ముఖమండలం :** చెవులకు ధరించిన మకరకుండలాల మణులకాంతిచే ప్రకాశిస్తుంది.

**11. ముంగురులు :** ఉంగరాలుగా ఉండే ముంగురులు తుమ్మెదల్ని పోలివున్నాయి.

**12. కన్నులు :** చేపల మాదిరి వున్నాయి.

**13. మందహాసం :** పూవును పోలివుంది.

**14. కనుబొమల జంట :** ధనుస్సులా ఉంది.

ఈ మనోజ్ఞమూర్తిని భక్తుడు నిరంతరం ధ్యానించాలి.

**క. గురు ఘోర రూపకంబై, పరcగెడు తాపత్రయం బుపశమింపcగ శ్రీ**
**హరిచేత నిసృష్టము లగు, కరుణాలోకములc దలcపcగాc దగు బుద్ధిన్. 938**

**ప్రతి :** గురు= గొప్ప; ఘోరరూపకంబు+ఐ= భయంకరమైన రూపంగలదై; పరcగెడు= సాగుచున్న; తాపత్రయంబు= ఆందోళనను; ఉపశమింపcగన్= శాంతింపగా; శ్రీహరిచేతన్= శ్రీవిష్ణువుచేత; నిసృష్టములు+అగు= వదలబడినవైన; కరుణా+ఆలోకనములన్= కనికరంగల చూపుల్ని; తగుబుద్ధిన్= ఉచితమైన మనస్సుతో; తలcపన్+కాన్+తగున్=స్మరించాలి.

**తా :** భయంకరమైన సాంసారిక బాధల నివృత్తికై, శ్రీహరి కరుణాపూర్ణమైన చూపుల్ని నిర్మలబుద్ధితో స్మరించడం కర్తవ్యం.

**క. ఘనరుచి గల మందస్మిత, మున కనుగుణ మగు ప్రసాదమును జిత్తమున**
**న్నునిచియు ధ్యానము సేయం, జను యోగిజనాళి కెపుడు సౌజన్యనిధీ! 939**

**ప్రతి :** సౌజన్యనిధీ!= మంచితనానికి నెలవైనమాతా!; ఎపుడు= ఎల్లవేళల; ఘనరుచి= గొప్పకాంతిగల; మందస్మితమునకున్= చిరునగవుకు; అనుగుణము+అగు= తగినట్టి; ప్రసాదమును= అనుగ్రహాన్ని; చిత్తమునన్= మనస్సులో; ఉనిచియున్= దాచి; యోగిజన+ఆవళికిన్= యోగుల సమూహానికి; ధ్యానము+చేయన్+చనున్= ధ్యానం చేయుట తగును.

**తా :** మాతా! యోగీశ్వరులు భగవంతుని అనుగ్రహానికి పాత్రులై ఎల్లప్పుడు, ఆయన అనుగ్రహాన్ని మనస్సులో పాదుకొల్పి ధ్యానించాలి.

**తే. పూని నతశిరు లైనట్టి భూజనముల, శోక బాష్పాంబుజలధి సంశోషకంబు**
**నత్యుదారతమము హరి హాస మెపుడుఁ, దలఁపఁగావలె నాత్మలోఁ దవిలి వినుము. 940**

**ప్రతి :** వినుము= ఆలకించుము; పూని= ప్రయత్నించి; నతశిరులు+ఐన+అట్టి= తలలు వంచినవారైన (విధేయులైన); భూజనముల= లోకుల; శోక= దుఃఖంచేకల్గిన; బాష్ప+అంబు= కన్నీటి; జలధి= సముద్రమును; సంశోషకంబున్= మిక్కిలి ఎండింపగలదియు; అతి+ఉదారతమము= మిక్కిలి ఔదార్యం గలదియునైన; హరిహాసము= విష్ణువు చిరునగవును; ఆత్మలోన్+తవిలి= మనస్సులో ఉంచి; తలఁపన్+కాన్+వలెన్= స్మరించాలి.

**తా :** ఆ హరి దరహాసం భక్తుల కన్నీటిని తుడిచి వేయగలదు. అంతేగాక అది ఎంతో అనుగ్రహాన్ని ప్రసాదించేది. భక్తజనం దాన్ని నిరంతరం తలచుకోవాలి.

**సీ. మునులకు మకరకేతనునకు మోహనం బైన స్వకీయమాయా విలాస**
**మున రచితంబైన భ్రూమండలంబును ముని మనఃకుహర సమ్మోదమానుఁ**
**డగు నీశ్వరుని మందహాసంబు నవపల్లవాధరకాంతిచే నరుణమైన**
**మొల్లమొగ్గల కాంతి నుల్లసం బాడెడు దంత పంక్తిని మదిఁ దలఁపవలయు**

**తే. వెలయ నీ రీతి నన్నియు వేఱు వేఱ, సంచితధ్యాన నిర్మల స్థానములుగ**
**మనములోఁ గనుమని చెప్పి మఱియుఁ బలికె, దేవహూతికిఁ గపిలుండు దేటపడఁగ. 941**

**ప్రతి :** మునులకున్= మౌనులకును; మకరకేతనునకున్= మన్మథునికిని; మోహనంబు+ఐన= మోహాన్ని లేదా ఆకర్షణను కల్గించే; స్వకీయ= తనదైన (శ్రీహరిదైన); మాయావిలాసమునన్= విష్ణుమాయావిలాసంచేత; రచితంబు+ఐన= చేయబడిన; భ్రూమండలంబును= బొమముడియు; ముని= మునుల; మనఃకుహర= మనస్సుఅనే గుహకు; సమ్మోదమానుఁడు= మిక్కిలి ఆనందగొల్పేవాడు; అగున్= అయిన; ఈశ్వరుని= పరమేశ్వరుని; మందహాసంబున్= చిర్నగవును; నవ= కొత్త; పల్లవ= చిగురుటాకులాంటి; అధరకాంతిచేన్= పెదవులకాంతిచేత; అరుణము+ఐన= ఎఱ్ఱదైన; మొల్ల= కుంద; మొగ్గలకాంతిన్= పూమొగ్గల కాంతిని; ఉల్లసంబు+ఆడెడు= పరిహసిస్తున్న; దంతపంక్తియున్= పళ్ళవరుసయును; మదిన్= మనస్సులో; తలఁపవలయున్= ధ్యానించాలి; ఈ రీతిన్= ఈ విధంగా; అన్నియున్= అవయవాలు అన్నీ; వేఱువేఱన్= విడివిడిగా; వెలయన్= ఒప్పారగా, వీటిని; అంచిత= ఒప్పిదమైన; ధ్యాన= చింతనకు; నిర్మల= స్వచ్ఛమైన; స్థానములుగన్=

ఆధారాలుగా; మనములోన్= ఎదలో; కనుము= చూడుము; అని చెప్పి= ఈ విధంగా బోధించి, కపిలుండు; మఱియున్= ఇంకా; దేవహూతికిన్; తేటపడన్+కన్= విశదమైనట్లు; పలికెన్= చెప్పాడు.

**తా :** విష్ణుమాయావిలాసంగల శ్రీహరి బొమముడి అటు మునీశ్వరులకు, తన కుమారుడైన మన్మథునికి మోహాన్ని పుట్టింపగలదు. ఆయన చిర్నగవు మౌనుల హృదయాలకు అమితానందాన్ని కల్గిస్తుంది. ఆ పలువరుస క్రొంజిగురును పోలిన పెదవుల ఎఱ్ఱనికాంతి సోకి, మొల్లమొగ్గల్ని పోలివుంది. ఆ స్వామి ఒక్కొక్క అవయవం, ఆ రూపంలోని స్వామి ధరించిన ఆభరణాలన్నీ ధ్యానయోగానికి సాధనాలే అని యిలా చెప్పి, ఇంకా కపిలుడు తల్లితో ఇట్లన్నాడు.

**విశే : విష్ణుమాయావిలాసం :** ఈ సకలసృష్టి విష్ణుమాయా మయమని విశిష్టాద్వైతుల మతం. విశ్వం విష్ణుస్వరూపమని, సృష్టి స్థితిలయములకు కారకుడు ఆయనే అని వైష్ణవుల విశ్వాసం. భగవానుని మాయాశక్తి ఊహకందదు. భగవదనుగ్రహమే దాన్ని అందుకోవటానికి సాధనమౌతుంది. వేరే దారి లేదు. అగోచరమైన వైష్ణవశక్తిని, విష్ణుమాయ యని విష్ణుమాయావిలాసమని భక్తులు పేర్కొన్నారు.

**సీ. ఈ ప్రకారమున సర్వేశ్వరునందును బ్రతిలబ్ధ భావసంపన్నుఁ డగుచుఁ**
**జిరతర సద్భక్తిచేఁ బ్రవృద్ధం బైన యతి మోదమునఁ బులకితశరీరుఁ**
**డగుచు మహోత్కంఠ, నానంద బాష్పముల్ జడిగొనఁ బరితోషజలధిఁ గ్రుంకి**
**భగవత్స్వరూపమై భవగుణగ్రాహక మగుచు మత్సంబంధ మనుకరించి**

**తే. సుమహిత ధ్యానమునఁ బరంజ్యోతి యందు, మనముఁ జాల నియోగించి మహిమఁ దనరు**
**మోక్షపద మాత్మలోన నపేక్షసేయు, ననఘవర్తనుఁడైన మహాత్ముఁడెపుడు. 942**

**ప్రతి :** ఈ ప్రకారమునన్= పైన చెప్పినట్లు; అనఘ= పాపరహితమైన; వర్తనుఁడు+ఐన= నడవడిగలవాడైన; మహా+ఆత్ముఁడు= గొప్పమౌని; ఎపుడు= ఎల్లప్పుడు; సర్వ+ఈశ్వరునందును= విశ్వవిభుడైన శ్రీహరియందు; ప్రతిలబ్ధ= పొందదగిన; భావసంపన్నుఁడు+అగుచున్= ప్రేమ అనే సంపదను పొందినవాడై; చిరతర= చాలకాలంనుండిచేసిన; సత్+భక్తిచేన్= ఉత్తమ భక్తిచేత (అవ్యాజభక్తి); ప్రవృద్ధంబు+ఐన= పెంపొందినట్టి; అతిమోదమునన్= ఎక్కువ సంతోషంచేత; పులకిత= గగుర్పాటుపొందిన; శరీరుఁడు+అగుచున్= దేహంగలవాడవుతూ; మహా+ఉత్కంఠన్= గొప్ప తహ తహతో; ఆనందబాష్పముల్= సంతోషంవల్ల కల్గిన కన్నీరు; జడిగొనన్= ఏకధారగా కురియగా; పరితోష= సంతోషమనెడి; జలధిన్= సాగరమందు; క్రుంకి= మునిగి; భగవత్+స్వరూపము+ఐ= తానుకూడ భగవంతుని ఆకారంగా మారి; భవగుణగ్రాహకము+అగుచున్= సంసార సంబంధమైన గుణాలను లాగి పారవేసేది అవుతూ; మత్+సంబంధము= నాతో తగులం; అనుకరించి= అనుకరణంచేసి; సుమహిత= గొప్పదైన; ధ్యానమునన్= ధ్యానముచేత; పరంజ్యోతియందున్= పరబ్రహ్మమందు; మనమున్= మనస్సును; చాల= మిక్కిలి; నియోగించి= చొనిపి; మహిమన్+తనరు= విభూతితో నొప్పు; మోక్షపదము= కైవల్యపదవిని; ఆత్మలోనన్= తనలో; అపేక్ష+చేయున్= కోరును

**తా :** పాపరహితమైన ప్రవృత్తిగల ఆత్మవేత్త సర్వేశ్వరుడైన శ్రీహరి ప్రేమను చూరగొని, చిరకాలభక్తిచేత పులకితగాత్రుడవుతాడు. అపుడతని కంటినుండి ఆనందబాష్పాలు రాలుతాయి. అంతటితో తాను సంతోషమనే జలధిలో మునిగితేలి, తనకు భగవంతునికి తేడా లేదని భావించి, సంసార లంపటాన్ని లాగిపారవేసేవాడై; ధ్యేయరూపమైన పరబ్రహ్మమందు మనస్సును నిల్పి కైవల్యపదవిని అందుకొంటాడు.

**వ. అది గావున ముక్తి నపేక్షించు మహాత్ముఁడగు వాని చిత్తంబు విముక్తంబైన భగవద్వ్యతిరిక్తాశ్రయంబు గలిగి విషయాంతరశూన్యంబై విరక్తిం బొందుటంజేసి పురుషుండు శరీర భావంబుల ననన్యభావంబగు నిర్వాణపదంబు సూక్ష్మంబగు తేజంబు దనకంటె నధికంబగు తేజంబుతోడి సమానాకారంబగు చందంబున నిచ్ఛగించు వెండియు. 943**

**ప్రతి :** అది+కావునన్= ఆ విషయమంతే కాబట్టి; ముక్తిన్= మోక్షాన్ని; అపేక్షించు= కోరుతున్న; మహా+ఆత్ముఁడు+అగువాని= మహాజ్ఞానియొక్క; చిత్తంబు= మనస్సు; విముక్తంబు+ఐన= విడివడినట్టి; భగవత్= భగవంతునికంటె; వ్యతిరిక్త= భిన్నమైన; ఆశ్రయంబు= శరణు; కలిగి; విషయ+అంతరశూన్యంబు+ఐ= ఇంద్రియ విషయాలనుండి దూరమై (విషయాలు అంతరించి); విరక్తిన్= వైరాగ్యాన్ని; పొందుటన్+చేసి= పొందటంవల్ల; పురుషుండు= మనుజుడు; శరీరభావంబులన్= ఉపాధి భావనల్ని; అనన్యభావంబు+అగు= ఇతరచింతనలేనిదైన; నిర్వాణపదంబు= మోక్షపదవి; సూక్ష్మంబు+అగు= అణువైన; తేజంబు= కాంతి; తనకంటెన్= తనకంటే కూడా; అధికంబు+అగు= హెచ్చుదైన; తేజంబుతోడి= కాంతితో; సమాన+ఆకారంబు+అగు= తుల్యమైన స్వరూపం గలదైన; చందంబునన్= విధంగా; ఇచ్ఛగించున్= ఇష్టపడతాడు; వెండియున్= మఱియు.

**తా :** ఆత్మవేత్త ఇంద్రియవిషయాల బారి పడకుండా, భగవంతునికి వేరైన ఆశ్రయాన్ని వదలిపెట్టి తన మనస్సుని కేవల భగవదాయత్తం చేస్తాడు. అప్పుడతనికి వైరాగ్యభావన కల్గుతుంది. ఇతర చింతలేవి లేకుండా సూక్ష్మతేజం మహాతేజంతో ఏకమైనట్టి మోక్షపదవి నందుకొని అక్కడ పరంజ్యోతి స్వరూపంతో ఐక్యమవుతాడు.

**సీ. పురుషుండు చరమమై భువి నన్యవిషయ నివృత్తమై తగ నివర్తించు చిత్త**
**వృత్త్యాదులను గల్గి వెలయంగ నాత్మీయ మగు మహిమ సునిష్ఠుఁడై లభించు**
**సుఖదుఃఖముల మనస్సునఁ దలంపక యహంకార ధర్మంబులుగాఁ దలంచి**
**యనయంబు సాక్షాత్కృతాత్మ తత్త్వము గల్గు నతఁడు జీవన్ముక్తుఁ డండ్రు ధీరు**

**తే. లతఁడు నే చందమున నుండు ననిన వినుము, తన శరీరంబు నిలుచుటయును జరించు**
**టయును గూర్చుండుటయు నిఁకేమియు నెఱుంగ, కర్థి వర్తించు విను తల్లి, యతఁడు, మఱియు. 944**

**ప్రతి :** తల్లి! = అమ్మా!; పురుషుండు= ఆత్మజ్ఞుడైన మనుజుడు; చరమము+ఐ= కడపట పొందదగినదై; భువిన్= లోకంలో; అన్యవిషయ= ఇతర విషయాలనుండి; నివృత్తము+ఐ= విడివడినదై; తగన్= బాగుగా; నివర్తించు= మరలునట్టి; చిత్తవృత్తి+ఆదులను= మనోవృత్తి మొదలైనవియును; కల్గి, వెలయంగన్= విలసిల్లగా; ఆత్మీయము+అగు= తనస్వాధీనమైన; మహిమన్= విభూతిలో; సునిష్ఠుఁడు+ఐ= పాదుకొన్నవాడై; లభించు= పొందేటటువంటి; సుఖదుఃఖములన్= సుఖాన్ని, బాధని, మనస్సునన్= మనసునందు; తలంపక= స్మరించకుండ; అహంకారధర్మంబులు+కాన్= అవి అహంకార లక్షణాలుగా; తలంచి= భావించి; అనయంబు= ఎల్లప్పుడు; సాక్షాత్+కృత= జ్ఞాననేత్రంతో చూడబడిన; ఆత్మతత్త్వము= ఆత్మభావము; కల్గున్+అతఁడు= స్వాధీనమైన ఆ తత్త్వవేదిని; జీవన్ముక్తుఁడు= బ్రతికి వుండగానే మోక్షగామి యని; ధీరులు= ప్రాజ్ఞులు; అండ్రు= పేర్కొంటారు; అతఁడు= ఆ పురుషుడు; ఏ చందమునన్= ఏ రీతిగా; ఉండును= ఉంటాడు? అనినన్= అని తల్లి అడుగగా; (కపిలుడు); వినుము= విను తల్లీ; తనశరీరంబు= అతనిదేహం; నిలుచుటయును= నిలిచివుండుటగాని;

చరించుటయును= నడయాడుటగాని; కూర్చుండుటయున్= ఆసీనుడగుటగాని; ఇఁక+ఏమియున్+ఎఱుంగక= మరేమీ తెలిసికోకుండా; అర్థిన్= బుద్ధిపూర్వకంగా; వర్తించున్= నివసిస్తాడు; అతఁడు= ఆతడు; మఱియున్= ఇంకా.

**తా :** "అమ్మా! వినండి. ఆత్మజ్ఞాని చరమలక్ష్యాన్ని చెపుతాను. అతడు అన్యవిషయాలపై ఆసక్తిని వదలి మనస్సును భగవద్ధ్యానమందే లగ్నం చేస్తాడు. సుఖదుఃఖాల్ని గూర్చిన చింత అతని కుండదు. వాటిని అహంకార ధర్మాలని భావిస్తాడు. ఆత్మ సాక్షాత్కారమందే నిమగ్నుడవుతాడు. ప్రాజ్ఞు లతణ్ణి జీవన్ముక్తు డంటారు". అతడెలా ఉంటాడంటే 'తల్లీ ఆ జ్ఞాని' నిలవటం, కదలటం, విశ్రమించటం అనే చర్యలుగూడా తెలియని స్థితిలో నిర్వికారుడుగా ఉంటాడని అన్నాడు.

**వ. మదిరాపానంబునం జేసి మత్తుం డగువాఁడు దనకుఁ బరిధానంబగు నంబరంబు మఱచి వర్తించు చందంబునఁ దన శరీరంబు దైవాధీనంబని, నశ్వరంబని, తలంచి యాత్మతత్త్వ నిష్ఠుండై యుపేక్షించు, నదియునుంగాక సమాధియోగంబునం జేసి సాక్షాత్కృతాత్మ తత్త్వంబు గలవాఁడయి స్వాప్నిక శరీరంబు చందంబున యావత్కర్మ ఫలానుభవ పర్యంతంబు పుత్రదార సమేతం బగు ప్రపంచంబు ననుభవించి యటమీఁదఁ బుత్రదారాది సంబంధంబువలనం బాసి వర్తించు. 945**

**ప్రతి :** మదిరాపానంబునన్+చేసి= మద్యాన్ని సేవించటంవల్ల; మత్తుండు+అగువాఁడు= స్పృహకోల్పోయినవాడు; తనకున్, పరిధానంబు+అగున్= తాను చుట్టుకొన్నట్టి; అంబరంబు= వస్త్రం; మఱచి= మరచిపోయి; వర్తించు చందంబునన్= ప్రవర్తించునట్లే; తనశరీరంబు= తనదేహం; దైవ+అధీనంబు+అని= దేవుని స్వాధీనమని; నశ్వరంబు+అని= నశించేది అని; తలంచి= భావించి; ఆత్మతత్త్వ= ఆత్మజ్ఞానమందు; నిష్ఠుండు+ఐ= నిలకడగలవాడై; ఉపేక్షించున్= చులకనచేస్తాడు; అదియునున్+కాక= అంతేగాక; సమాధియోగంబునన్+చేసి= అష్టాంగాలలో చివరిదైన సమాధియందున్నకారణంవల్ల; సాక్షాత్+కృత= ప్రత్యక్షం కాబడిన; ఆత్మతత్త్వంబు= ఆత్మజ్ఞానం; కలవాఁడు+అయి= పొందినవాడై; స్వాప్నికశరీరంబు+ చందంబునన్= కలలో దృశ్యమైన ఉపాధివలె; యావత్= పూర్తిగా; కర్మఫల+అనుభవ= కర్మఫలాన్ని అనుభవించునట్టి; పర్యంతంబు= అంతదాక (వఱకు); పుత్ర= సంతానం; దార= భార్య వీరితో; సమేతంబు+అగు= కూడిన; ప్రపంచంబున్= లోకానుభవాన్ని; అనుభవించి= రుచి చూచి; అటమీఁదన్= ఆ పైన; పుత్రదార+ఆది= సంతానంతో; భార్యతోగల; సంబంధంబువలనన్= తగులంనుండి; పాసి= దూరమై; వర్తించున్= నడచుకొంటాడు

**తా :** జీవన్ముక్తుని లక్షణం ఇంకా వివరిస్తున్నాడు కపిలాచార్యుడు. మద్యం సేవించినవానికి తన ఒడలిమీద బట్ట వుందో లేదో తెలియదు. జీవన్ముక్తుడు కూడ అలాగే తనదేహం దైవాధీనమగుటవల్ల నశ్వరమని భావిస్తాడు. శరీరం (శీర్యతే ఇతి) నశిస్తుంది. కావున యోగి దాన్ని సరకుచేయడు. తన మనస్సును ఆత్మాయత్తం చేస్తాడు. కర్మఫలానుభవం కల్గునంతకాలం స్వప్నంలో కనిపించే శరీరంతో భార్యాపుత్రుల సంబంధంవలె మ్రగ్గి, తర్వాత ఆత్మజ్ఞానసంపన్నుడై పుత్రదారసంబంధంనుండి ముక్తుడవుతాడు.

**సీ. సుతదార మిత్రానుజులకంటె మర్త్యుండు భిన్నుఁడై వర్తించుచున్నరీతి**
**విస్ఫులింగోల్ముక విపుల ధూమములచే హవ్యవాహనుఁడు వేఱయిన రీతి**
**వలనొప్ప దేహంబువలన నీ జీవాత్మ పరికింప భిన్నరూపమున నుండుఁ**
**దవిలి భూతేంద్రియాంతఃకరణంబుల భాసిల్లుచున్న యా ప్రకృతిరూప**

**తే. బ్రహ్మమున కాత్మ దాఁ బృథగ్భావ మగుచు, ద్రష్టయయి బ్రహ్మసంజ్ఞచేఁ దనరు చుండు**
**నఖిల భూరి ప్రపంచంబులందుఁ దన్నుఁ, దవిలి తనయందు నఖిల భూతములఁ గనుచు.946**

**ప్రతి :** సుత= బిడ్డలు; దార= భార్య; మిత్ర= చెలికాండ్రు; అనుజులకంటెన్= సోదరులకంటె; మర్త్యుండు= మనుజుడు; భిన్నుఁడు+ఐ= వేరై; వర్తించుచున్నరీతిన్= ఉన్న విధంగానే; విస్ఫులింగ= అగ్నికణాలు; ఉల్ముక= కొఱవులు; విపుల= విస్తారమైన; ధూమములచేన్= పొగలనుండి; హవ్యవాహనుఁడు= హవ్యాన్ని వహించే అగ్నిదేవుడు; వేఱు+అయినరీతిన్= విడిగా వున్నట్లే; ఈ జీవాత్మ= ఈ ప్రత్యగాత్మ; పరికింపన్= పరిశీలించగా; వలనొప్పన్= ప్రియంగా వెలుగుతున్న; దేహంబువలనన్= శరీరానికంటె; భిన్నరూపమునన్= ప్రత్యేకరూపంతో; ఉండున్= ఉంటుంది; తవిలి= అంటి; భూత= పంచభూతాలు; ఇంద్రియ= పదిజ్ఞానేంద్రియకర్మేంద్రియాలు; అంతఃకరణంబులన్= మనస్సు, బుద్ధి, చిత్త, అహంకారాలతో; భాసిల్లుచున్న= వెల్గుతున్న; ఆ, ప్రకృతిరూపబ్రహ్మమునకున్= ప్రకృతి ఆకారంగా ఉండే దృశ్యబ్రహ్మకు; ఆత్మ= ప్రత్యగాత్మ; తాన్= తాను; పృథక్+భావము+అగుచున్= వేఱుభావనగలదై; అఖిల= సమస్తమైన; భూతప్రపంచంబులందున్= చరాచరభూతాలలో; తన్నున్= తన స్వరూపాన్ని; తవిలి= ప్రవేశపెట్టి; అలాగే, తనయందున్= తనలో; అఖిలభూతములన్= పృథివ్యాదులగు ఇరువది నాలుగు తత్త్వాలను (24 తత్త్వాలు); కనుచున్= చూచుచు; ద్రష్ట+అయి+బ్రహ్మసంజ్ఞచేన్= ద్రష్టరూప బ్రహ్మంగా; తనరుచుండున్= ఒప్పారుతుంటుంది.

**తా :** మానవుడు తన భార్యాపుత్రులు, స్నేహితులు, అన్నదమ్ములు మున్నగు వారికంటె వేఱుగా ఉన్నట్లును, అగ్నిదేవుడు తననుండి పైకి ఎగిసే కణాలు, కొరువులు వగైరాకంటె వేరుగా ఉన్నట్లును, జీవాత్మ తన్నావరించిన శరీరానికంటె భిన్నుడుగా ఉన్నాడు. ద్రష్ట అయిన సమస్త భూతాలలో తానుదాగి, తనలో అంతర్భూతంగా ఉన్న సమస్త భూతజాలాన్ని చూస్తూ ద్రష్ట అయిన బ్రహ్మగా భాసిస్తూవుంటాడు.

**విశే :** 'మానవుడు దారపుత్రాదులకంటె వేరు, అగ్ని విస్ఫులింగాదులకంటె వేరు. కపిలమహర్షి ఆత్మానాత్మ విభాగాన్ని తల్లికి బోధించాడు. 'దృశ్యం, ద్రష్ట, దర్శనం' ఇదొక త్రిపుటి. మన చర్మచక్షువుకు కన్పిస్తున్నదంతా దృశ్యం. దీన్ని దర్శిస్తున్నవాడు ద్రష్ట (ఆత్ముడు). చరాచరవిశ్వానికి ఆవల నేకాకృతితో చూడడమే దర్శనం. ఆత్మ, భూతపంచకం, జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలు, తన్మాత్రలు, అంతరంగచతుష్టయం అనే 24 తత్త్వాలలో అంతర్నిగూఢంగా దాగివుంది. ఈ తత్త్వాలన్నింటిని పర్యవేక్షించే ద్రష్ట ఆయన. ఇర్వదినాల్గు తత్త్వాలతో కూడిన దృశ్యం నశ్వరమైంది. అంటే అంతరిస్తుంది. ఆపైన ద్రష్ట భౌతికకాయాన్ని కలిసిపోతాడని ఆధ్యాత్మిక సిద్ధాంతం.

**వ. వెండియు. 947**

**ప్రతి :** వెండియు= మరియు,

**తా :** ఇంకా,

**సీ. వరుస ననన్యభావంబులఁ జేసి భూతావళియందుఁ దదాత్మకత్వ**
**మునఁ జూచు నాత్మీయఘనతరోపాదానములయందుఁ దవిలి యిమ్ముల వెలుంగు**
**నిట్టి దివ్యజ్యోతి యేక మయ్యును బహుభావంబులను దోఁచు ప్రకృతిగతుఁడు**
**నగుచున్న యాత్మయుఁ బొగడొందు దేవ తిర్యఙ్మనుష్య స్థావరాది వివిధ**

**తే. యోనులను భిన్నభావంబు నొందుటయును, జాలఁ గల్గు నిజగుణ వైషమ్యమునను**
**భిన్నుఁడై వెల్గుఁ గావునఁ బేర్చి యదియు, దేహసంబంధి యగుచు వర్తించుచుండు. 948**

**ప్రతి :** ఇట్టి= ఇలాంటి; దివ్యజ్యోతి= పరంజ్యోతి; వరుసన్= క్రమంగా; న+అన్యభావంబులన్+చేసి= అన్యచింతనలు లేనందువల్ల; (భిన్నభావనలులేక); భూత+ఆవళియందున్= పృథివ్యాదిభూత సమూహమందు; తద్+ఆత్మకత్వమునన్= స్వాత్మభావనతో; చూచున్= చూస్తుంది; ఆత్మీయ= తమవైన; ఘనతర= గొప్ప; ఉపాదానములయందున్= ఇంద్రియ నిరోధాలలో; తవిలి= చొచ్చి; ఇమ్ములన్= ఇంపుగా; వెలుంగున్= ప్రకాశిస్తుంది; ఏకము+అయ్యును= ఒక్కటేయైనను; బహుభావంబులను= పెక్కు భావాలుగలదిగా; తోఁచున్= కన్పిస్తుంది; ప్రకృతిగతుఁడున్= ప్రకృతితో కలిసినవాడు; అగుచున్న= అయినట్టి; ఆత్మయున్= చిదాత్ముడును; పొగడు+ఒందున్= మెప్పునొందును; దేవ= దేవతలు; తిర్యక్= పశుపక్ష్యాదులు; మనుష్య= మానవులు; స్థావర= చలనంలేని స్థిరరూపాలు; ఆది= మొదలైన; వివిధ= పెక్కు; యోనులను= గర్భములందు; భిన్నభావంబున్+ఒందుటయును= వేఱగుటయును; చాలన్+కల్గు= అతిశయమైనట్టి; నిజగుణవైషమ్యమునను= దైహికమైన హ్రస్వదీర్ఘభేదాలకారణంగా; భిన్నుఁడు+ఐ= వేఱైనవాడుగా; వెల్గున్= ప్రకాశిస్తాడు; కావునన్= కనుక; పేర్చి= అతిశయించి; అది= ఆ వైవిధ్యమే (భిన్నత్వమే); దేహసంబంధి+అగుచున్= శరీరసంబంధమైందిగా; వర్తించుచుండున్= ఉంటుంది.

**తా :** స్థావరజంగమాది భూతాలు భిన్నభిన్నమైనవి. వీటిల్లో పరంజ్యోతి స్వరూపమైన ఆత్మకూడ భిన్నరూపాలు గలదిగా తోస్తుంది. కాని అది భిన్నమైంది కాదు. ఒకే స్వరూపమే. దేహాదుల పొడవు – పొట్టి అనే భిన్న ప్రకృతుల్నిబట్టి, ఆత్మ ఒక్కటే అయినప్పటికి పెక్కురకాలైనట్లు తోస్తుంది. భూతాలు, ఇంద్రియాలు, అంతఃకరణాలు నాల్గు అనే జీవసముదాయంకంటె ఆత్మ భిన్నమైంది. అనగా జీవాత్మ వేరు. పరమాత్మ వేరు. అలాగే ప్రకృతి వేరు. దాన్ని నడిపే భగవంతుడు వేరు.

**క. భావింప సదసదాత్మక, మై వెలయుచు దుర్విభావ్య మగుచు స్వకీయం**
**బై వర్తించుచుఁ బ్రకృతిని, భావమునఁ దిరస్కరించు భవ్యస్ఫూర్తిన్. 949**

**ప్రతి :** అ: (ఆత్మ) భావింపన్= ఆలోచింపగా; సత్+అసత్+ఆత్మకము+ఐ= సత్తు, అసత్తు (ఉన్నది–లేనిది)గా; వెలయుచున్= ఒప్పుచూ; దుర్+విభావ్యము= ఊహింపనలవికానిది; అగుచున్= అవుతూ; స్వకీయంబు+ఐ= తనదై; వర్తించుచున్= ఉంటూ; భవ్యస్ఫూర్తిన్= విస్పష్టంగా, ప్రకృతిని; భావమునన్= స్వభావమందు; తిరస్కరించున్= తొలగదోస్తుంది (నిషేధిస్తుంది).

**తా :** ఆత్మ ఉన్నదిగా, లేనిదిగా భాసిస్తుంది. దానికి మాయాశక్తి వుంది. దాని శక్తి ఊహ కందదు. ప్రకృతితో కలిసినట్లే ఉంటుంది. కాని దానికి భిన్నంగానే ఉంటుంది.

**వ. ఈ యాత్మ నిజస్వరూపంబునం జేసి వర్తించునని కపిలుం డెఱింగించిన విని దేవహూతి వెండియు నిట్లనియె, మహాత్మా! మహదాది భూతంబులకుం బ్రకృతి పురుషులకుం గల్గిన పరస్పర లక్షణంబులను దత్స్వరూపంబులను నెఱింగించితి, వింక నీ ప్రకారంబున సాంఖ్యంబునందు నిరూపింపంబడినట్టి ప్రకారంబును, భక్తియోగ మాహాత్మ్యంబును, బురుషుండు భక్తి యోగంబునంజేసి సర్వలోక విరక్తుం డగునట్టి యోగంబును, బ్రాణిలోకంబునకు సంసారం బనేక విధంబయి యుండుఁ గావునఁ బరాపరుండవై కాల స్వరూపివైన నీ స్వరూపంబును, ఏ నీవలని భయంబునం జేసి జనులు పుణ్యకర్మంబులు సేయుచుండుదురు,**

**మిథ్యాభూతం బైన దేహంబునందు నాత్మాభిమానంబు సేయుచు మూఢుండై కర్మంబులందు నాసక్తంబైన బుద్ధింజేసి విభ్రాంతుండై సంసార స్వరూపంబగు మహాంధకారంబునందుఁ జిరకాల ప్రసుప్తుండైన జనునిఁ బ్రబోధించుకొఱకు యోగభాస్కరుండవై యావిర్భవించిన పుణ్యాత్ముండవు గావున నాకు నిన్నియుం దెలియ సవిస్తరంబుగా నానతీయ వలయు ననిన దేవహూతికిఁ గపిలుం డిట్లనియె. 950**

**ప్రతి :** ఈ; ఆత్మ= ఈ జీవుడు; నిజస్వరూపంబునన్+చేసి= తనదైన ప్రత్యేకస్వరూపంచేతనే; వర్తించున్+అని= ప్రవర్తిస్తాడని; కపిలుండు= కపిలమహర్షి; ఎఱింగించినన్= తెలుపగా; విని, దేవహూతి= తల్లి అయిన దేవహూతి విన్న తరువాత; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది; మహా+ఆత్మా= గొప్పహృదయంగలవాడా!; మహత్+ఆది= మహత్తుమొదలైన; భూతంబులకున్= మహత్తు; అహంకారం, పంచభూతాలకు; ప్రకృతి పురుషులకున్= ప్రకృతి, మరియు పురుషునికి; కల్గిన= ఉన్నట్టి; పరస్పర= ఒండొంటి; లక్షణంబులను= స్వభావాల్ని; తద్= వాటి; స్వరూపంబులను= ఆకృతిని; ఎఱింగించితివి= తెలియపరిచావు; ఇంకన్= ఇంకా; ఈ ప్రకారంబునన్= ఈ విధంగానే; సాంఖ్యంబునందున్= సంఖ్యాశాస్త్రమందు; (ఆత్మానాత్మ విభాగం); నిరూపింపన్+పడిన+అట్టి= వివరింపబడునట్టి; ప్రకారంబును= వైఖరిని; భక్తియోగ= భక్తియోగసంబంధమైన; మాహాత్మ్యంబును= మహిమను; పురుషుందు; భక్తియోగంబునన్+చేసి= భక్తియోగంవల్ల; సర్వ= సమస్తమైన; లోక= వ్యవహారాలనుండి; విరక్తుండు+అగు+అట్టి= వైరాగ్యం పొందేటటువంటి; యోగంబును= యోగాన్ని; ప్రాణిలోకంబునకున్= జీవకోటికి; సంసారంబు= తగులం; అనేకవిధంబు+అయి= పెక్కురకాలై; ఉండున్= ఉంటుంది; కావునన్= కాబట్టి; పర+అపరుండవు+ఐ= మీదికి= క్రిందికి (దివికి–భువికి) కారకుడవుగానుండి; కాలస్వరూపివి+ఐన= కాలమే స్వరూపంగాకల్గిన నీవు (కపిలావతారం); ఏ; నీ వలని= నీవల్ల; భయంబునన్+చేసి= భీతివల్ల; జనులు= ప్రజలు; పుణ్యకర్మంబులు= పుణ్యకార్యాలు; చేయుచుండుదురు= చేస్తారో; ఆ+విధంబును= ఆ పద్ధతియు; మిథ్యాభూతంబు+ఐన= అసత్యమైన; దేహంబునందున్= శరీరమందు; ఆత్మ+అభిమానంబు= మక్కువ; చేయుచున్= కల్గియుండి; మూఢుండు+ఐ= అజ్ఞానియై; కర్మంబులందున్= కార్యాలలో; ఆసక్తంబు+అయిన= తగుల్కొన్నట్టి; బుద్ధిన్+చేసి= తెలివితో; విభ్రాంతుండు+ఐ= మిక్కిలి భ్రాంతికి లోనైనవాడై; సంసారస్వరూపంబు+అగు= జన్మజరామరణరూపమైన; మహా+అంధకారంబునందున్= పెద్దచీకటిలో; చిరకాల= చాలకాలం; ప్రసుప్తుండు+ఐన= బాగా నిద్రపోతున్న; జనునిన్= మానవుని; ప్రబోధించుకొఱకున్= మేల్కొల్పడానికి; యోగభాస్కరుండవు+ఐ= యోగ సూర్యుడవై; ఆవిర్భవించిన= జన్మించినట్టి; పుణ్య+ఆత్ముండవు+కావున= పవిత్రచిత్తుడవు కనుక; నాకున్=నాకు; ఇన్నియున్+తెలియన్= పూర్తిగా తెలిసేట్లు; సవిస్తరంబు+కాన్= విపులముగా; ఆనతి+ఈయ వలయున్= తెలియజేయుము; అనినన్= అని అడుగగా; కపిలుండు= కపిలముని; దేవహూతికిన్= తల్లియైన దేవహూతికి; ఇట్లు+అనియెన్= ఈ క్రింది విధంగా చెప్పాడు...

**తా :** ఇట్లా కపిలుడు బోధించిన తర్వాత, దేవహూతి మళ్ళీ అడిగింది. "మహాత్మా! మహత్తు, అహంకారం, భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశం అనే ఏడింటికిగల అన్యోన్యసంబంధం, ప్రకృతి పురుషుల లక్షణాలు, వాటి నిజస్వరూపం మొదలైన అంశాలనుగూర్చి వివరించావు. ఇక సాంఖ్యశాస్త్రం, భక్తియోగ విశిష్టత, పురుషుని విరక్తిభావన, కాలస్వరూపుడవైన నీ నిజస్వరూపం వీటిని గూర్చి నాకు చెప్పు"మని అడిగింది. మరియు ఆమె కుమారునితో 'నీకు భయపడి ప్రజలు ధర్మకార్యాలు చేస్తున్నారు. మానవునికి మిథ్యాభూతమైన శరీరంపై అభిమానముంది. మూర్ఖత్వంతో కర్మాసక్తుడై సంసారమనే చీకటిగుహలోనే మ్రగ్గుతున్నాడు అలాంటి మానవుణ్ణి నిద్రావస్థనుండి మేల్కొల్పడానికి నీవు యోగరూపం దాల్చి పుట్టిన పుణ్యాత్ముడవు. కావున ఈ అన్ని విషయాల్ని నాకు వివరించు' మని కోరింది.

## ✤ కపిలుండు దేవహూతికి భక్తి యోగమును తెలియఁజేయుట ✤

**క. నలినాయతాక్షి! విను జన, ముల ఫల సంకల్ప భేదమునఁ జేసి మదిం**
**గల భక్తియోగ మహిమం, బలవడఁగ ననేకవిధము లనఁదగు నవియున్. 951**

**ప్రతి :** నలిన+ఆయత+అక్షి= పద్మంవంటి విశాలమగు కన్నులుగల ఓ తల్లీ!; విను= ఆలకించుము; జనముల= ప్రజల; ఫలసంకల్ప= ఫలములయెడ ఆసక్తియందు; భేదమునన్+చేసి= తేడావుండటంవల్ల; మదిన్+కల= బుద్ధియందున్న; భక్తియోగమహిమంబు= భక్తియోగమహిమ; అలవడన్+కన్= సమకూరగా; వివిధములు+అనన్+తగున్= పెక్కురకాలని చెప్పవచ్చును; అవియున్= అవికూడా...

**తా :** ప్రజల ఫలాశలు పలురకాలు. కాబట్టి వారి భక్తియోగపు పోకడలుకూడ అనేక విధాలు. చెపుతాను, వినుమన్నాడు కపిలుడు.

**వ. వివరించెదఁ. దామస రాజస సాత్త్విక భేదంబులం ద్రివిధంబై యుండు, నందుఁదామస భక్తి ప్రకారం బెట్టిదనిన. 952**

**ప్రతి :** వివరించెదన్= తెల్పుతాను; తామస= తమస్సు; రాజస= రాజసం; సాత్త్విక= సాత్త్వికం అనే; భేదంబులన్+చేసి= (అనే) తేడాలవల్ల; త్రివిధంబు+ఐ= మూడురకాలై; ఉండున్= ఉంటుంది; అందున్= వాటిలో; తామసభక్తి+ప్రకారంబు= తామస భక్తివిధం; ఎట్టిది+అనినన్= ఎటువంటిదంటావా?

**తా :** 'తామసం, రాజసం, సాత్త్వికం అని భక్తిభేదాలు మూడురకాలు. వాటిలో తామసభక్తి ఎలాంటిదో చెపుతాను'. అన్నాడు కపిలుడు.

**తే. సతత హింసాతి దంభ మాత్సర్య రూప, తమములను జేయుచును భేదదర్శి యగుచుఁ**
**బరఁగ నాయందుఁ గావించు భక్తి దలఁపఁ, దామసం బనఁదగు, వాఁడు తామసుండు, 953**

**ప్రతి :** సతత= ఎల్లప్పుడు; హింసా= బాధించుట; అతిదంభ= మిక్కిలి కపటం; మాత్సర్య= ఈర్ష్య; రూప= ఆకృతిగానున్న; తమములను= చీకట్లను; చేయుచును= కావిస్తూ; భేదదర్శి+అగుచున్= అన్నింట భేదాల్ని చూచేవాడై; పరఁగన్= సాగుతూ; నాయందున్= నాపై; కావించు= చేసే; భక్తిన్= భక్తిని; తలంపన్= ఆలోచిస్తే; తామసంబు= తామస గుణమని; అనన్+తగున్= అనవచ్చు; వాఁడు= ఆ గుణం గలవాడు; తామసుండు= తామసభక్తి గలవాడు.

**తా :** పరులను బాధపెట్టటం, కపటవర్తనం, అసూయవంటి గుణాలుకల్గి, ఎల్లప్పుడు భేదదృష్టిగలవాడై, భగవంతునిపై భక్తిని ప్రదర్శించేవాడు తామసుడు. వాని భక్తి తామసభక్తి.

**క. ఘన విషయ ప్రావీణ్యము, లను సుమహైశ్వర్యయశములను బూజాద్య**
**ర్చని నను నర్థి భజించుట, చను రాజసయోగ మనఁగ సౌజన్యనిధీ! 954**

**ప్రతి :** సౌజన్యనిధీ!= మంచితనానికి నిధియైన మాతా! ఘన= గొప్ప; విషయ= భోగవిషయాలపట్ల; ప్రావీణ్యములను= సామర్థ్యములచేత; సుమహా= మిక్కిలిగొప్ప; ఐశ్వర్య= సంపదలచేత; యశములను= కీర్తిచేత; పూజాది+అర్చనిన్=

పూజాదులకుతగిన; ననున్=నన్ను (శ్రీహరిని); అర్థిన్= కోర్కెతో; భజించుట= కొల్చుట; రాజసయోగము+అనన్+కన్= రాజయోగమనే పేరుతో; చనున్= ఒప్పును.

**తా :** విషయభోగాలలో నైపుణ్యంగల్గి, సంపదకొరకు, కీర్తికొరకు పూజార్హుడనగు నన్ను కొలిచే భక్తుడు రజోగుణంగల రాజసభక్తుడు.

**చ. అనుపమ పాపకర్మ పరిహారముకై భజనీయుఁడైన శో**
**భన చరితుం డితం డనుచు భావమునం దలపోసి భక్తిచే**
**ననితర యోగ్యతన్ భగవదర్పణబుద్ధి నొనర్చి కర్మముల్**
**జనహితకారియై నెగడ సాత్త్వికయోగ మనంగఁ జొప్పడున్. 955**

**ప్రతి :** అనుపమ= సాటిలేని; పాపకర్మ= పాపచర్యల; పరిహారముకై= తొలగించుకొనటానికై; భజనీయుఁడు+ఐన= స్తుతింపదగిన; శోభనచరితుండు+ఇతండు= పవిత్రచరిత్రకలవాడితడు; అనుచున్= అంటూ; భావమునన్= మనస్సులో; తలపోసి= భావించి; భక్తిచేన్= భక్తిచేత; కర్మముల్= చేసేపనులు; అనితరయోగ్యతన్= అసాధారణమైన సామర్థ్యంతో; భగవత్= భగవంతునికి; అర్పణబుద్ధిన్= సమర్పించే మనస్సుతో; ఒనర్చి= చేసి; జనహితకారి+ఐ= ప్రజలకు మేలుచేయువాడై; నెగడన్= పేరొందగా; సాత్త్వికయోగము+అనన్+కన్= (అది) సాత్త్వికయోగముగా; చొప్పడున్= గుర్తింపబడుతుంది.

**తా :** దోషకర్మల్ని నివారిస్తూ 'తన నడవడి లోకానికి ఆదర్శప్రాయమై వుండేటట్లు' నడచుకొంటూ, కర్మల్ని భగవదర్పణంగా చేసే మనుజుడు సాత్త్వికయోగి అవుతాడు. అతని గుణాలు ప్రజాహితంగా వుంటాయి.

**చ. మనుసుత! మద్గుణ శ్రవణమాత్ర లభించినయట్టి భక్తిచే**
**ననఘుఁడ సర్వశోభన గుణాశ్రయుఁడం బరమేశ్వరుండనై**
**తనరిన నన్నుఁ జెందిన యుదాత్తమనోగతు లవ్యయంబులై**
**వననిధిగామి యైన సురవాహినిఁ బోలె ఫలించు నిమ్ములన్. 956**

**ప్రతి :** మనుసుత!= స్వాయంభువ మనుపుత్రీ!; మత్= నాదైన; గుణ= గుణాల్ని; శ్రవణమాత్ర= విన్నంతటనే; లభించిన+అట్టి= చేకూరినటువంటి; భక్తిచేన్= భక్తిచేత; అనఘుఁడన్= పాపరహితుడును; సర్వ= సమస్తమైన; శోభనగుణ= మహనీయమైన గుణాలకు; ఆశ్రయుఁడన్= నెలవైనవాడును; పరమ+ఈశ్వరుండను= భగవంతుడును; ఐ= అయి; తనరిన= నెగడినట్టి; నన్నున్= (కపిలుణ్ణి); చెందిన= చేరినట్టి; ఉదాత్త= మహనీయమైన; మనస్+గతులు= మనోభావాలు; అవ్యయంబులు+ఐ= నష్టపడనివై; ఇమ్ములన్= ప్రీతితో; వననిధిగామి= సముద్రదిశగా నేగుచున్న; సురవాహినిన్+పోలెన్= దేవగంగతో సమానమై; ఫలించున్= నెరవేరుతాయి.

**తా :** అమ్మా! మనుపుత్రీ! నేను పాపభావాలు లేనివాణ్ణి. కళ్యాణగుణాలతో విలసిల్లేవాణ్ణి. అంతేగాదు. పరమాత్మను. నా గుణాల్ని చెవులారా విని, భక్తితో నన్ను కొలిచే భక్తుల మనోభావాలు సముద్రాన్ని చేరే దేవగంగమాదిరి ఫలవంతమవుతాయి.

**క. హేయ గుణ రహితుఁ డనఁగల, నాయందలి భక్తి లక్షణముఁ దెలిపితి, నన్**
**బాయక నిర్హేతుకముగఁ, జేయు మదీయవ్రతైక చిరతర భక్తిన్. 957**

**ప్రతి :** హేయగుణ రహితున్= నీచమైనగుణాలు లేనివాడు; అనన్+కల= అని పేరొందిన; నా+అందలి= నాలోని; భక్తి లక్షణమున్= భక్తిగుణాన్ని; తెలిపితిన్= తెల్పినాను; నన్= నన్ను; పాయక= వదలకుండ; నిర్+హేతుకముగన్= ఏ కారణంలేకుండా (ఫలాశలేనిరీతి); మదీయ= నాదైన; వ్రత= పూజయందలి; ఏక= ముఖ్యమైన; చిరతరభక్తిన్= చిరకాలభక్తిని; చేయు= చేయుము.

**తా :** నేను నీచగుణాలకు దూరంగా ఉంటాను. నాపై ఉండవలసిన భక్తిభావన ఎలాంటిదో చెప్పాను. ఏ ఫలితాన్ని ఆశించకుండ నాయెడ చిరకాల భక్తిభావం గల్గియుండుము.

**వ. నిష్కాములయిన మదీయ భక్తులను నట్టి భక్తి యోగంబు సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యంబులకు సాధనంబు, కావున మహాత్ములగు వారు నిజమనోరథ ఫలదాయకంబు లయినను మదీయ సేవావిరహితంబు లయిన యితర కర్మంబు లాచరింప నొల్లరు, దీని నాత్యంతిక భక్తి యోగంబని చెప్పుదురు, సత్త్వరజస్తమో గుణహీనుం డయిన జనుండు మత్సమానాకారంబుఁ బొందునని చెప్పి మఱియు నిట్లనియె. 958**

**ప్రతి :** నిస్+కాములు+అయిన= ఏ కోర్కెలులేనట్టి; మదీయ= నా, భక్తులకున్= భక్తులకు; అట్టి, భక్తియోగంబు= ఆ భక్తియోగం; సాలోక్య= భగవంతుని దర్శనం; సామీప్య= భగవంతుని చెంతచేరటం; సారూప్య= భగవంతుని రూపాన్ని పోలివుండటం; సాయుజ్యంబులకున్= భగవంతునిలోఐక్యమగుట అనే యీ నాల్గింటికి; సాధనంబు= ఆధారం; కావునన్= కాబట్టి; మహా+ఆత్ములు+అగువారు= గొప్పవారు; నిజ= తమదైన; మనోరథ= కోర్కెలకు; ఫలదాయకంబులు+అయినను= ఫలితాన్ని ఇచ్చేవైనప్పటికి; మదీయ= నా; సేవా= సేవకు; విరహితంబులు+అయిన= దూరమైన; ఇతరకర్మంబులు= అన్యదేవతాసేవవంటి వేరు కర్మలు; ఆచరింపన్= చేయుటకు; ఒల్లరు= ఇష్టపడరు; దీనిన్= ఇట్టి అన్యకర్మనిరాసాన్ని; ఆత్యంతిక= అన్యకాంక్షలేని; భక్తియోగంబు+అని= భక్తియోగమని; చెప్పుదురు= చెప్తారు; సత్త్వరజస్+తమస్+గుణ= సత్త్వం, రజస్సు, తమస్సు అనే గుణములచే; హీనుండు+అయిన= రహితుడైన; జనుండు= మనుజుడు; మత్= నాతో; సమాన= తుల్యమైన; ఆకారంబున్= ఆకృతిని; పొందున్= పొందుతాడు; అని, చెప్పి, మఱియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు (కపిలుడు).

**తా :** నా భక్తులనుసరించే భక్తి నిష్కామభక్తి. వారికి ఫలాపేక్ష ఉండదు. అలాంటివారికి సాలోక్యం, సామీప్యం, సారూప్యం, సాయుజ్యం అనేవి నాల్గు సాధనాలు. కాన నాల్గింటితో వెలసిన భక్తికి ఆత్యంతిక భక్తియనిపేరు. అన్యదేవతల్ని కొలుచుటవల్ల ఏర్పడే ఎలాంటి కోర్కెలనైనా, నన్నే ఆరాధించే నా భక్తులు తిరస్కరిస్తారు. అన్యకర్మల్ని వారు అపేక్షించరు. ఆత్యంతిక భక్తిభావంగల మనుజుడు త్రిగుణాలకతీతుడై 'నా ఆకారాన్ని' పొందగల్గుతాడు.

**విశే :** శరణాగతికి 'భక్తియే' ఆలంబనం. దీని ఆసరాతో విశిష్టాద్వైతులు భగవత్సాయుజ్యాన్ని పొందగలమని విశ్వసిస్తారు. ఈ ఘట్టంలో కపిలాచార్యులు తల్లికి ప్రబోధించిన భక్తిమార్గం అయిదు విధాలుగా ఉంది.

**1) తామస భక్తి:** హింస, దంభం, మచ్చరం వీనివల్ల క్రోధాన్ని భేదదృష్టిని అవలంబించటం.

**2) రాజస భక్తి:** కీర్తి, సంపదలు మున్నగువానికై విగ్రహారాధన చేయటం

**3)** దోషనివారణకు లేదా పాపవిముక్తికై శాస్త్రగతిని అనుసరించి భగవంతుని ప్రీతికొఱకై ప్రయత్నించటం.

**4) నిర్గుణ భక్తి:** ఫలాపేక్షగాని, పైనతెల్పిన మూడుగుణాలతో గాని నిమిత్తంలేని భక్తి.

**5) ఆత్యంతిక భక్తి:** భగవంతుని సేవ తప్ప తక్కిన దేన్నీ కోరని భక్తి.

**సీ. నిత్యనైమిత్తిక నిజధర్మమున గురు శ్రద్ధా గరిష్ఠతఁ జతుర పాంచ**
**రాత్రోక్త హరి సమారాధన క్రియలను నిష్కామనంబున నెఱి మదీయ**
**విగ్రహ దర్శన వినుతి పూజా వందన ధ్యాన సంశ్రవణములఁ గర్మ**
**సంగి గాకుండుట, సజ్జన ప్రకరాభిమానంబు నొందుట, హీనులందుఁ**

**తే. జాల ననుకంపఁ జేయుట, సములయందు, మైత్రి నెఱపుట యమనియమ క్రియాది**
**యైన యోగంబుచేత నాధ్యాత్మికాధి, భౌతికాదులఁ దెలియుట పలుకుటయును. 959**

**ప్రతి :** నిత్య= ఎల్లప్పుడు పాటింపవలసినదియు; నైమిత్తిక= నిమిత్తంగా చేయబడేదియునగు; నిజధర్మమునన్= స్వధర్మాచరణమందు; గురు= గొప్ప; శ్రద్ధాగరిష్ఠతన్= అతిశయమైన దీక్షతో; చతుర= సమర్థమైన; పాంచరాత్ర= పాంచరాత్ర క్రియాయోగమందు; ఉక్త= చెప్పబడిన; హరి= విష్ణుసంబంధమైన; సమారాధన క్రియలను= పూజావిధులను; నిష్కామనంబునన్= కోరికలేని చిత్తముతో; నెఱిన్= బాగుగా; మదీయ= నాదైన; విగ్రహదర్శన= రూపాన్ని దర్శించినప్పటి; వినుతి= స్తోత్రము; పూజ= అర్చించుట; వందన= నమస్కారం; ధ్యాన= చింతనం; సంశ్రవణములన్= వినికిడి మొదలగువాటిచే; కర్మసంగి= కర్మలతో బంధంగలవాడు; కాక+ఉండుట= కాకపోవటం; సత్+జన= ఉత్తమమానవుల; ప్రకర= సమూహమందు; అభిమానంబున్= ప్రేమను; ఒందుట= పొందటం; హీనులందున్= నిరుపేదలందు; అనుకంపన్+ చేయుట= దయగల్గివుండుట; సములయందున్= సమానమైన వారియెడ; మైత్రి+నెఱపుట= స్నేహం గల్గివుండటం; యమనియమ+క్రియా+ఆది+ఐన= నిష్ఠగా చేయదగ్గ యమనియమాదులైన కార్యములు; యోగంబుచేతన్= దీక్షతో; ఆధి+ఆత్మిక= ఆత్మసంబంధియైన; ఆధిభౌతిక= శారీరకములైన; ఆదులన్= మొదలగువానిని; తెలియుట= తెలిసికోవటం; పలుకుటయున్= వాటినిగూర్చి ప్రవచించుటయును

**తా :** సంధ్యావందనాది నిత్యవిధులు, తిథి వారనక్షత్రాదుల ననుసరించి పితృతర్పణాలు, సాంవత్సరికాలు మున్నగు నిజధర్మాల్ని శ్రద్ధతో చేయాలి. పాంచరాత్ర క్రియాయోగంలో చెప్పబడిన శ్రీహరి ఆరాధన క్రియలు నిష్కామదృష్టితో చేయాలి. శ్రీమహావిష్ణుని విగ్రహాన్ని దర్శించి, స్తోత్రం, సాగిలపడటం, నమస్కరించటం, సేవించటం, ధ్యానించటం, శ్రవణం మొదలైన క్రియలు నిష్ఠతో నిర్వహించాలి. కర్మసాంగత్యం లేకుండటం, మంచివారిపట్ల ప్రేమ, దీనులయెడ దయ, తుల్యులైనవారితో స్నేహంగా మసలటం, మున్నగు నియమవిధులతో యోగసాధన కావించాలి. ఆధ్యాత్మికం, ఆధిభౌతికం, ఆధిదైవికం అనే మూడింటిని గూర్చి తెలిసికోవాలి. వాటిని గూర్చి ఇతరులకు ప్రవచించాలి.

**విశే :** ముందటి వచనంలో 'ఆత్యంతికభక్తి' అనే పదముంది "అంతమతిక్రాంతోఽత్యంతః స ఏవాత్యంతికః" అని "ఆత్యంతిక" శబ్దానికి నిర్వచనం. అంతవఱకు ఏ మాత్రం మిగులకుండ నిర్వహించడాన్ని 'ఆత్యంతికం' అంటారు. అంటే భగవంతుని పూజావిధానంలో అనుసరించవలసిన యే విధిని కూడ విస్మరించరాదు. విస్మరిస్తే కర్తకు ఏదోవిధమైన నష్టం కల్గుతుందని శాస్త్రవచనం. దీని పిండితార్థం 'అవినాశి' అని గుర్తుంచుకోవాలి.

**వ. మఱియును. 960**

**ప్రతి :** మఱియును= ఇంకా కపిలుడంటున్నాడు –

**తా :** ఇంకా కపిలుడు (ఇలా అంటున్నాడు)

**క. హరి మంగళ గుణకీర్తన, పరుఁడై తగ నార్జవమున భగవత్పరులం**
**గర మనురక్తి భజించుట, నిరహంకారముగ నుంట నిశ్చలుఁ డగుటన్. 961**

**ప్రతి :** హరి= శ్రీహరియొక్క; మంగళ= పవిత్రమైన; గుణకీర్తన= గుణాల్ని పాడుకొనుటయందు; పరుఁడు+ఐ= ఆసక్తికలవాడై; తగన్= యుక్తంగా; ఆర్జవమునన్= ఋజువర్తనతో; భగవత్+పరులన్= భాగవతుల్ని; కరము= మిక్కిలి; అనురక్తిన్= ప్రేమతో; భజించుట= కొలుచుట; నిర్+అహంకారముగన్+ఉంటన్= పొగరుబోతుతనం లేకుండటం; నిశ్చలుఁడు= శాంతుడు; అగుటన్= అగుట...

**తా :** భక్తుడు శ్రీమన్నారాయణుని గుణకీర్తన చేయాలి. భగవంతుని భక్తుల్ని ప్రేమతో మన్నించాలి. అహంకారం, చాంచల్యం లేకుండా మసలుకోవాలి.

**క. ఇవి మొదలు గాఁగ గలుగు భ, గవదుద్దేశ స్వధర్మ కలితుండై వీ**
**నివలనఁ బరిశుద్ధగతిం, దవిలిన మది గలుగు పుణ్యతముఁ డెయ్యెడలన్. 962**

**ప్రతి :** ఇవి+మొదలు+కాఁగన్= పైనచెప్పినవి మొదలైనవిగా; కలుగు= కల్గిన; భగవత్+ఉద్దేశ= భగవత్భావనగల; స్వధర్మ= తన ధర్మములైన; కలితుండు+ఐ= కూడినవాడై; వీనివలనన్= ధర్మక్రియలవల్ల; పరిశుద్ధ= స్వచ్ఛమైన; గతిన్= నడవడి; తవిలిన మదిన్= సోకినబుద్ధి; కలుగు= ఉన్నట్టి; పుణ్యతముఁడు= పుణ్యాత్ముడు; ఏ+ఎడలన్= ఎట్టి ఆపదలలోనైనను...

**తా :** పైన చెప్పిన దైవారాధనకార్యాలలో నిమగ్నుడై, వానివల్ల ప్రేరణ పొందిన పుణ్యాత్ముడు మంచిమార్గంలో పయనిస్తాడు.

**తే. గురుతరానేక కల్యాణ గుణ విశిష్టుఁ, డనఁగ నొప్పిన ననుఁ బొందు నండ గొనక**
**పవన వశమునఁ బువ్వుల పరిమళంబు, ఘ్రాణమున నావరించిన కరణి మెఱసి. 963**

**ప్రతి :** (ఆ పుణ్యనిధి) అండన్+కొనక= ఇతరాన్ని దేనినీ ఆశ్రయించక; పవనవశమునన్= గాలివల్ల; పువ్వుల పరిమళంబు= పూలవాసన; ఘ్రాణమునన్= ముక్కునందు; ఆవరించినకరణిన్= చొచ్చినట్లు; మెఱసి= ప్రకాశించి; గురుతర= గొప్పవైన; అనేక= పెక్కు; కల్యాణగుణ= శుభగుణములచే; విశిష్టుఁడు= కూడినవాడు; అనన్+కన్+ఒప్పిన= అని పేరొందినట్టి; ననున్= కపిలావతారుడైన శ్రీహరిని; పొందున్= చేరును (సాయుజ్యప్రాప్తి నొందును).

**తా :** స్వామి గుణగణాల్ని నిరంతరం కీర్తించే పుణ్యాత్ముడు 'అన్యాశ్రయుడు' కాకుండ గాలిలో కలిసిన పూలవాసన నాసారంధ్రాల్లో చొచ్చినట్లే కల్యాణగుణశోభితుడనైన నాలో ఐక్యమవుతాడు.

**విశే :** శరణాగతుల చరమలక్ష్యం 'సాయుజ్యప్రాప్తి'. ఆ యంశమే ఈ పద్యంలో దర్శనమిస్తుంది.

**చ. అనిశము సర్వభూత హృదయాంబుజవర్తి యనం దనర్చు నీ**
**శు నను నవజ్ఞ సేసి మనుజుం డొగి మత్ప్రతిమార్చనావిడం**

బనమున మూఢుఁడై యుచిత భక్తిని నన్ను భజింపఁడేని న
మ్మనుజుఁడు భస్మకుండమున మానక వేల్చిన యట్టివాఁ డగున్. 964

ప్రతి : అనిశము= ఎల్లప్పుడు; సర్వ= సమస్తమైన; భూత= ప్రాణులయొక్క; హృదయ+అంబుజ= హృదయమనే పద్మములందు; వర్తి= నివసించువాడు; అనన్= అన్నట్లుగా; తనర్చు= ఒప్పుచున్న; ఈశున్= పరమేశ్వరుడనైన; ననున్= నన్ను; మనుజుండు= మానవుడు; ఒగిన్= క్రమంగా; అవజ్ఞ+చేసి= చులకనగా చూచి; మత్= నాదైన; ప్రతిమా+అర్చనా= (నా) విగ్రహార్చనను; విడంబనమునన్= అనుసరించుటవల్ల; మూఢుఁడు+ఐ= అజ్ఞానియై; ఉచితభక్తిని= యోగ్యమగుభక్తితో; నన్నున్= భగవంతుడనైన నన్ను; భజింపఁడు+ఏనిన్= కొల్వనివాడైతే; ఆ+మనుజుఁడు= ఆ మానవుడు; భస్మకుండమునన్= కాలుతున్న గుండంలో; మానక= వదలక; వేల్చిన+అట్టివాఁడు= హవిస్సు అర్పించినవాడు; అగున్= అవుతాడు

**తా :** చరాచరభూతాల్లో నివసించే నన్ను, ఏ మానవుడు లెక్కచేయకుండ, కేవలం నా విగ్రహాన్ని మాత్రమే కొలుస్తూ, నాపై అనన్యభక్తిని ప్రదర్శింపడో, అలాంటివాడు బూడిదలో హవిస్సు వదలినయట్టి వాడవుతాడు – అనగా వ్యర్థజీవనుడని భావం.

సీ. అబ్జాక్షి! నిఖిల భూతాంతరాత్ముఁడ నైన నాయందు భూతగణంబునందు
నతిభేదదృష్టి మాయావులై సతతంబుఁ బాయక వైరానుబంధ నిరతు
లగు వారి మనములఁ దగులదు శాంతి యెన్నటి కైన నేను నా కుటిల జనుల
మానక యెపుడు సామాన్యాధిక ద్రవ్య సమితిచే మత్పదార్చన మొనర్ప

తే. నర్థి నా చిత్తమున ముదం బందకుండు, ననుచు నెఱిఁగించి మఱియు నిట్లనియెఁ గరుణఁ
గలిత సద్గుణ జటిలుఁ డక్కపిలుఁ డెలమిఁ, దల్లితోడ గుణవతీమతల్లితోడ. 965

ప్రతి : అబ్జ+అక్షి= తామరలవంటి కన్నులదానా!; నిఖిల= సమస్తమైన; భూత= ప్రాణులయొక్క; అంతర+ఆత్ముఁడను+ఐన= లోన ఆత్మరూపంతో ఉన్నట్టి; నా+అందున్= నాలోనను; భూతగణమునందున్= చరాచరభూత సముదాయమందును; అతిభేదదృష్టిన్= మిక్కిలి భేదదృష్టితో; మాయావులు+ఐ= వంచకులై; సతతంబున్= ఎల్లప్పుడు; పాయక= విడువక; వైర+అనుబంధ= వ్యతిరేకతను అనుసరించుటయందే; నిరతులు+అగువారి= ఆసక్తిగలవారి; మనములన్= మనస్సులలో; శాంతి= నిశ్చలత; ఎన్నటికైనన్= ఎప్పటికైనా; తగులదు= పొందుపడదు; నేనున్ (కపిలుడు); ఆ కుటిలజనుల= ఆ మాయావుల; మానక= వదలకుండ; ఎపుడు= ఎల్లప్పుడు; అర్థిన్= కోరికతో; సామాన్య= సాధారణమైనట్టిది; అధిక= అతిశయమైనట్టిది; అగు; ద్రవ్యసమితిచేన్= పూజాద్రవ్యాలసమూహంచేత; మత్= నాదైన; పద+అర్చనము= పద సేవ; ఒనర్పన్= చేయగా; నా చిత్తమునన్= నా మనస్సులో; ముదంబు= సంతోషం; అందక+ఉందున్= పొందను; అనుచున్= ఇట్లని; ఎఱిఁగించి= తెల్పి; మఱియున్= మరల; కరుణన్= దయతో; కలిత= కూడిన; సత్+గుణ జటిలుఁడు= ఉత్తమగుణాలు జడలవలె సాంద్రంగా అల్లుకొన్నవాడు అయిన; ఆ+కపిలుఁడు= ఆ కపిలాచార్యుడు; గుణవతీ= గుణవంతురాంద్రలో; మతల్లితోడన్= శ్రేష్ఠురాలగు; తల్లితోడన్= తనతల్లియైన దేవహూతితో; ఇట్లు+అనియెన్= ఇట్లన్నాడు.

**తా :** "తల్లీ! సమస్తభూతాలలో ఉన్న నాకు ఈ భూతప్రపంచానికి విడదీయరాని సంబంధముంది. కుటిలాత్ములైన జనానికి ఇది తెలీదు. వారికి నాయందు, ఈ భూతాలయందు ఎల్లప్పుడు తేడాయే కన్పిస్తుంది. అలాంటి మాయావులకు ఎప్పటికీ

శాంతి లేదు. వారు సామాన్యద్రవ్యంతో గాని విశేషద్రవ్యంతోగాని నన్ను పూజించినా, నాకు సంతోషం కలుగదు" అని చెప్పి, కపిలుడు గుణవతులలో అగ్రగణ్యయైన తల్లితో ఇంకా ఇలా అన్నాడు.

**సీ. తరళాక్షి! విను మచేతన దేహములకంటెఁ జేతన దేహముల్ శ్రేష్ఠ, మందుఁ**
**బ్రాణవంతంబులై స్పర్శనజ్ఞానంబు గలుగు చైతన్యవృక్షములకంటె**
**ఘనరసజ్ఞాన సంకలిత చేతను లుత్తములు, రసజ్ఞానంబు గలుగువాని**
**కంటె గంధజ్ఞాన కలిత భృంగంబులు గడు శ్రేష్ఠములు, వానికంటె శబ్ద**

**తే. వేదు లగుదురు శ్రేష్ఠులు, వెలయు శబ్ద, విదులకంటెను సద్రూప వేదులైన**
**వాయసాదులు శ్రేష్ఠముల్, వానికంటె, వరుస బహుపాదు లుత్తముల్, వానికంటె. 966**

**ప్రతి :** తరళ+అక్షి= చంచలమైన కన్నులుగల ఓ తల్లీ!; విను= వినుము; అచేతన దేహములకంటెన్= చైతన్యంలేని స్థావరాలకంటె; చేతనదేహముల్= చైతన్యంగల జీవులు; శ్రేష్ఠము= మేలు; అందున్= ఆ చేతన దేహాల్లో; ప్రాణవంతంబులు+ ఐ= ప్రాణాలుగలవై; స్పర్శనజ్ఞానంబు= స్పర్శజ్ఞానం; కలుగు= కలిగినట్టి; చైతన్యవృక్షములకంటెన్= చైతన్యం కలిగిన వృక్షాలకంటే; ఘన= గొప్పదైన; రసజ్ఞాన= రసాస్వాదయోగ్యమైన తెలివితో; సంకలిత= కూడినట్టి; చేతనులు= జీవులు; ఉత్తములు= శ్రేష్ఠులు; రసజ్ఞానంబు= రసాస్వాదయోగ్యమైన జ్ఞానం; కలుగువాని కంటెన్= కలవారికంటె; గంధజ్ఞాన= వాసనాజ్ఞానంచేత; కలిత= కూడినట్టి; భృంగంబులు= తుమ్మెదలు; కడు శ్రేష్ఠములు= మిక్కిలి మేలైనవి; వానికంటెన్= ఆ తుమ్మెదలకంటె; శబ్దవేదులు= శబ్దజ్ఞానం ప్రాణులు; శ్రేష్ఠులు= మేలైనవి; అగుదురు= అగును; వెలయు= ఒప్పుచున్న; శబ్దవిదులకంటెన్= శబ్దవేత్తలకంటె; సద్+రూపవేదులు+ఐన= ఆకృతి జ్ఞానంగల; వాయస+ఆదులు= కాకులు మొదలైనవి; శ్రేష్ఠముల్= మెరుగైనవి; వానికంటెన్= కాకులు మొదలగువానికంటె; వరుసన్= క్రమంగా; బహుపాదులు= పెక్కు పాదాలుగలవి; ఉత్తముల్= మెరుగైనవి; వానికంటెన్= బహుపాదాలుగల వానికంటె...

**తా :** తల్లీ! అచేతన శరీరాలకంటె ప్రాణులు; ఆ ప్రాణుల్లో వృక్షాలకంటె రసవేదులైన జీవులు, వాటికంటె గంధవేదులైన తేనెటీగలు, తేనెటీగలకంటె శబ్దవేదులైన పాములు, వాటికంటె రూపవేదులైన కాకులు, కాకులకంటె పెక్కు పాదాలుగలవి, జీవులు శ్రేష్ఠమైనవి.

**క. తలఁపఁ జతుష్పదు లధికులు, బలకొని మఱి వానికంటెఁ బాదద్వయముం**
**గల మనుజు లలఘుతము లి, మ్ముల వారలయందు వర్ణములు నాల్గరయన్. 967**

**ప్రతి :** తలఁపన్= ఆలోచిస్తే; చతుష్పదులు= నాల్గుకాళ్ళుగలవారు; అధికులు= గొప్పవారు; బలకొని= అతిశయించి; మఱి, వానికంటెన్= చతుష్పదులకంటె; పాదద్వయమున్+కల= రెండుకాళ్ళు గలట్టి; మనుజులు= మానవులు; అలఘుతములు= మిక్కిలి శ్రేష్ఠులు; ఇమ్ములన్= ప్రియంగా; వారలయందున్= వారిలో; అరయన్= ఆలోచిస్తే; వర్ణములు= తెగలు, నాల్గు= నాలుగు.

**తా :** బహుపాదులకంటె, నాల్గుకాళ్ళ జంతువులు, వాటికంటె రెండుకాళ్ళుగల మానవులు మిక్కిలి శ్రేష్ఠులు. మానవుల్లో నాల్గుతెగలవారున్నారు.

**వ. అందు.** **968**

**ప్రతి :** అందున్= అందులో-

**తా :** ఆ తెగలలో

**సీ. తలఁప బ్రాహ్మణ లుత్తములు, వారికంటెను వేదవేత్తలు, వేదవిదులకంటె**
**విలసిత వేదార్థ విదులు, వారలకంటె సమధిక శాస్త్ర సంశయము మాన్పు**
**మీమాంసకులు, మఱి మీమాంసకులకంటె నిజధర్మ విజ్ఞాననిపుణు, లరయ**
**వారికంటెను సంగవర్జిత చిత్తులు దగ వారికంటె సద్ధర్మపరులు,**

**తే. ధార్మికులకంటె నుత్తమోత్తముఁడు వినుము, మత్సమర్పిత సకల కర్మ స్వభావ**
**మహిమములు గల్గి యితర కర్మములు విడిచి, సమత వర్తించు న పుణ్యతముఁడు ఘనుఁడు.** **969**

**ప్రతి :** తలఁపన్= ఆలోచిస్తే; బ్రాహ్మణులు= బ్రాహ్మణులుగా పుట్టినవారు; ఉత్తములు= శ్రేష్ఠులు; వారికంటెను= ఆ బ్రాహ్మణులకంటెకూడ; వేదవేత్తలు= నాల్గువేదాలు తెలిసినవారును; వేదవిదులకంటెన్= వేదజ్ఞులకంటె; విలసిత= ఒప్పిదమైన; వేద+అర్థవిదులు= (ఋక్, యజుస్, సామ, అథర్వణాలనే) వేదాలలోని పరమతత్త్వం తెలిసినవారు; వారలకంటెన్= ఆ అర్థవిదులకంటె; సమ్+అధిక= మిక్కిలి ఎక్కువ; శాస్త్రసంశయమున్= ఆరుశాస్త్రాలలోని సందేహాల్ని; మాన్పు= తీర్చగల; మీమాంసకులు= కర్మబ్రహ్మజ్ఞానంగలవారు; మఱి= ఇంకా; మీమాంసకులకంటెన్= ఈ పేరుగల శాస్త్రజ్ఞులకంటె; నిజ= తమ; ధర్మవిజ్ఞాన= ధర్మజ్ఞానమందు; నిపుణులు= సమర్థులు; అరయన్= ఆలోచింపగా; వారికంటెను= విజ్ఞానధనులకంటె; సంగవర్జితచిత్తులు= సంసారబంధాలనుండి విడివడినవారు; తగన్= ఒప్పుగా; వారికంటెన్= ఆ సంగవర్జితులకంటె; సత్+ధర్మపరులు= ఉత్తమ ధర్మమునందాసక్తిగలవారు, (శ్రేష్ఠులు); ధార్మికులకంటెన్= ధర్మపరాయణులకంటె; ఉత్తమ+ఉత్తముఁడు= శ్రేష్ఠులలో శ్రేష్ఠుడు; వినుము= వినవమ్మా; మత్= నాయందు; సమర్పిత= బాగా అర్పించినట్టి; కర్మస్వభావమహిమములు= కర్మము, స్వభావము, మహిమ; కల్గి, ఇతరకర్మములు= అన్యదేవతాసేవలు; విడిచి= వదలి; సమతన్= భేదబుద్ధిలేకుండ; వర్తించు= నడచుకొనే; ఆ+పుణ్యతముఁడు= ఆ పుణ్యపురుషులలో శ్రేష్ఠుడు; ఘనుఁడు= గొప్పవాడు.

**తా :** మానవుల్లో నాలుగు జాతులు, ఆ జాతుల్లో బ్రాహ్మణులు, వారిలో వేదజ్ఞులు, వారికంటె వేదార్థం తెలిసినవారు, వారికంటె శాస్త్రసందేహాల్ని తీర్చగల మీమాంసకులు, వారికంటె స్వధర్మమెరిగినవారు, వారికంటె అనుభవజ్ఞులు, వారికంటె సంగవిముక్తులు, వారికంటె ఉత్తమధర్మపరాయణులు, వారికంటె కూడ ఎవడు అన్యదేవతారాధనల్ని త్యజించి, తనకర్మలన్నింటిని నన్నుద్దేశించి చేస్తాడో, వాడు ఉత్తమోత్తముడు. వాడే నిజంగా సమభావంతో వర్తించే గొప్పవాడు.

**వ. అట్టివాని.** **970**

**ప్రతి :** అట్టివానిన్= ఆ సమదర్శిని

**తా :** అలా= అన్నింటియందు సమదర్శనం కలవానిని,

**క. కని సకలభూత గణములు, మనమున నానంద జలధి మగ్నము లగుచున్**
**ఘన బహుమాన పురస్సర, మనయముఁ బాటిల్ల వినుతు లర్థిం జేయున్.** **971**

**ప్రతి :** కని= చూచి; సకల= సమస్తమైన; భూతగుణములు= భూతకోటి; మనమునన్= మనస్సునందు; ఆనందజలధి= సంతోషమనే సముద్రమందు; మగ్నములు+అగుచున్= మునుగుతూ; ఘన= గొప్ప; బహుమానపురస్సరము= గౌరవపురస్సరత్వము; అనయమున్= నిరంతరం; పాటిల్లన్= పొసగునట్లు; అర్థిన్= కోర్కెతో; వినుతులు= స్తోత్రాలు; చేయున్= చేస్తుంది.

**తా :** సమదర్శియైన ఆ భక్తునిచూచి, భూతకోటి (సకలజాతులు) ఆనందవార్ధిలో మునిగి, ఆయనను గౌరవపురస్కారంగా వేనోళ్ళ స్తుతిస్తుంది.

**వ. అంత నీశ్వరుండు జీవస్వరూపానుప్రవిష్టుండై యుండు, నట్టి భగవంతుం జూచి భక్తి యోగంబున నేని, యోగంబున నేనిఁ బురుషుండు పరమాత్మం బొందుఁ, బ్రకృతి పురుషాత్మకంబును దద్వ్యతిరిక్తంబును నైన దైవంబునై కర్మవిచేష్టితం బగుచు నుండు, నదియ భగవద్రూపం, బిట్టి భగవద్రూపంబు రూపభేదాస్పదం బగుచు నద్భుత ప్రభావంబు గల కాలం బనియుఁ జెప్పంబడు, నట్టి కాలంబు మహదాది తత్త్వంబులకును మహత్తత్త్వాభిమానులగు జీవులకును భయావహం బగుటంజేసి సకల భూతంబులకు నాశ్రయం బగుచు నంతర్గతంబై భూతంబులచేత భూతంబుల గ్రసించుచు యజ్ఞఫలప్రదాత గావున వశీకృత భూతుండై ప్రభుత్వంబుల భజియించి విష్ణుండు ప్రకాశించుచుండు, నతనికి మిత్రుండును శత్రుండును బంధుండును లేఁ, డట్టి విష్ణుండు సకలజనంబులయం దావేశించి యప్రమత్తుండై ప్రమత్తులయిన జనంబులకు సంహారకుండై యుండు, నతనివలన భయంబునంజేసి వాయువు వీచు, సూర్యుండు దపియించు, నింద్రుండు వర్షించు, నక్షత్రగణంబు వెలుంగుఁ, జంద్రుండు ప్రకాశించుఁ, దత్తత్కాలంబుల వృక్షలతాదు లోషధులతోడం గూడి పుష్పఫల భరితంబు లగు, సరిత్తులు ప్రవహించు, సముద్రంబులు మేరలు దప్పకయుండు, నగ్ని ప్రజ్వలించు, భూమి గిరులతోఁగూడ బరువునఁ గ్రుంగ వెఱచు, నాకాశంబు సకలజనంబులకు నవకాశం బిచ్చు, మహత్తత్త్వంబు జగత్తునకు నంకుర స్వరూపంబు గావున సప్తావరణావృతం బగు లోకం బను స్వదేహంబు విస్తరింపంజేయు గుణాభిమానులగు బ్రహ్మాదులు సర్వేశ్వరునిచేత జగత్సర్గంబునందు నియోగింపంబడి ప్రతిదినంబు నయ్యయి సర్గంబు సేయ నప్రమత్తులై యుండుదురు. పిత్రాదులు పుత్రోత్పత్తిఁ జేయుదురు, కాలుండు మృత్యుసహాయుండై మారకుండై యుండు, చరాచరాత్మకంబగు సకల ప్రపంచంబు భగవదధీనంబై యుండునని చెప్పి కపిలుండు వెండియు నిట్లనియె. 972**

**ప్రతి :** అంతన్= తర్వాత; ఈశ్వరుండు= భగవంతుడు; జీవస్వరూప= ఆత్మస్వరూపమందు అనుప్రవిష్టుండు+ఐ= చొచ్చినవాడై; ఉండున్= ఉండును; అట్టి= ఆత్మరూపుడైనట్టి; భగవంతున్= భగవానుని; చూచి= కాంచి; భక్తియోగంబునన్+ఏనిన్= భక్తియోగం ద్వారా కాని; యోగంబునన్+ఏనిన్= అష్టాంగయోగం ద్వారా కాని; పురుషుండు= మానవుడు; పరమాత్మన్= పరమేశ్వరుని; పొందున్= చేరుకొంటాడు; ప్రకృతిపురుష+ఆత్మకంబును= ప్రకృతి పురుషుల రూపంగాను; తద్+వ్యతిరిక్తంబును= దానికి భిన్నంగాను; ఐన= ఉన్నట్టి; దైవంబున్+ఐ= దేవాత్మయై; కర్మవిచేష్టితంబు+అగుచున్+ఉండున్= విశిష్టకర్మలు చేయుచుండును; అది+అ= అదే; భగవత్+రూపంబు= భగవంతుని స్వరూపం; ఇట్టి= ఈ విధమైన; భగవత్+రూపంబు= భగవంతుని స్వరూపం; రూపభేద+ఆస్పదంబు+అగుచున్= పెక్కురూపాలకు నిలయమై; అద్భుతప్రభావంబు= ఆశ్చర్యకరమైన

మహిమగల; కాలంబు+అనియున్= 'కాలమ'ని కూడ; చెప్పంబడున్= చెప్పబడుతుంది; అట్టి కాలంబు= భగవత్ స్వరూపమైన ఈ కాలమే; మహత్+ఆది= మహత్తు మొదలైన; తత్త్వంబులకును= ఏడు తత్త్వాలకు; మహత్తత్త్వ+అభిమానులు+అగు= పై ఏడు తత్త్వాలలో అభిమానంగల్గిన; జీవులకును= ప్రాణులకును; భయ+ఆవహంబు+అగుటన్+చేసి= భీతికి నెలవైనదగుటవల్ల; సకలభూతంబులకున్= సమస్తమైన భూతకోటికి; ఆశ్రయంబు+అగుచున్= స్థానమై; లేక ఆధారమై; అంతర్గతంబు+ఐ= లోపల దాక్కొని; భూతంబులచేతన్= ప్రాణులచేత; భూతంబులన్= ప్రాణుల్ని; గ్రసించుచున్= మ్రింగుతూ; యజ్ఞఫలప్రదాత= యజ్ఞానికి ఫలితాన్ని ఇచ్చేవాడు; కావునన్= కాబట్టి, వశీకృత= స్వాధీనం చేయబడ్డ; భూతుండు+ఐ= ప్రాణులుగలవాడై; ప్రభుత్వంబులన్= ఆధిపత్యాలను; భజియించి= గుత్తగొని; విష్ణుండు= శ్రీహరి; ప్రకాశింపుచు+ఉండున్= వెలుగుతూవుంటాడు; అతనికిన్= ఆ విష్ణువునకు; మిత్రుండును= చెలికాడు; శత్రుండును= విరోధి; బంధుండును= బంధువు; లేఁడు= లేనేలేడు; అట్టివిష్ణుండు= ఆ విష్ణుదేవుడు; సకల= సమస్తమైన; జనంబులయందున్= ప్రజలయందు; ఆవేశించి= ప్రవేశించి; అప్రమత్తుండు+ఐ= జాగరూకుడై; ప్రమత్తులు= ప్రమాదానికి గురి అయిన; జనంబులకున్= మానవులకు; సంహారకుండు+ఐ= చంపువాడై; ఉండున్= ఉంటాడు; అతనివలనన్= ఆ విష్ణుమూర్తివల్ల; భయంబునన్+చేసి= కలిగే భీతిచేత; వాయువు= గాలి; వీచున్= వీస్తుంది; సూర్యుండు= సూర్యుడు; తపియించున్= మండును; ఇంద్రుండు= దేవేంద్రుడు; వర్షించున్= కురియును; నక్షత్రగణంబులు= తారకలు; వెలుంగున్= ప్రకాశిస్తాయి; చంద్రుండు= చందమామ; ప్రకాశించున్= వెన్నెలకాస్తాడు; తద్+తద్+కాలంబులన్= ఆ యా కాలాలలో; వృక్ష+లతా+ఆదులు= చెట్లు, తీగెలు వగైరా; ఓషధులతోడన్= వృక్షాదులతో; కూడి= కలిసి; పుష్ప= పూలు; ఫల= పండ్లు వీటిచే; భరితంబులు+అగున్= నిండును; సరిత్తులు= నదులు; ప్రవహించున్= పారుతాయి; సముద్రంబులు= సాగరాలు; మేరలు= హద్దులు; తప్పక+ఉండున్= దాటనివై వుంటాయి; అగ్ని= అగ్గి; ప్రజ్వలించున్= మండుతుంది; భూమి= నేల; గిరులతోన్+కూడ= కొండలతోకూడ; బరువునన్= భారముతో; క్రుంగన్= క్రుంగుటకు; వెఱచున్= భయపడుతుంది; ఆకాశంబు= ఆకసం; సకల= ఎల్ల; జనంబులకున్= ప్రాణికోటికి; అవకాశంబు= నెలవు; ఇచ్చున్= ఇచ్చును; మహత్+తత్త్వంబు= మహత్తు అనే తత్త్వం; జగత్తునకున్= విశ్వానికి; అంకురస్వరూపంబు= బీజరూపం; కావునన్= అయినందువల్ల; సప్త= ఏడు; ఆవరణ= (మహత్, అహంకారం, పంచభూతాలు) అనే ఆవరణాలచే; ఆవృతంబు+అగు= చుట్టబడినట్టి; లోకంబు+అను= లోకరూపమైన; స్వదేహంబున్= తను ఉపాధిని; విస్తరింపన్+చేయున్= పెంపొందిస్తుంది; గుణ+అభిమానులు+అగు= సత్త్వరజస్తమోగుణాలయందు ఆసక్తిగలవారైన; బ్రహ్మ+ఆదులు= బ్రహ్మమొదలైనవారు; సర్వేశ్వరునిచేతన్= జగత్కర్తయైన భగవంతుని చేత; జగత్+సర్గంబునందున్= ప్రపంచసృష్టియందు; నియోగింపన్+పడి= నియమింపబడి; ప్రతిదినంబు= నిత్యమూ; ఆ+ఆ= ఆ యా; సర్గంబు= సృష్టి; చేయన్= చేయటానికి; అప్రమత్తులు+ఐ= జాగరూకులై; ఉండుదురు= ఉంటారు; పితృ+ఆదులు= తల్లిదండ్రులు; పుత్ర+ఉత్పత్తిన్+చేయుదురు= బిడ్డల్ని కంటారు; కాలుండు= కాలస్వరూపుడైన యముడు; మృత్యుసహాయుండు+ఐ= మృత్యుదేవతకు తోడై; మారకుండు+ఐ= సంహారకుడుగా; ఉండున్= ఉంటాడు; చర+అచర+ఆత్మకంబు+అగు= జంగమస్థావరరూపమైన; సకల= సమస్తమైన; ప్రపంచంబు= జగత్తు; భగవత్= భగవంతుని; అధీనంబు+ఐ= అదుపులో ఉన్నదై; ఉండున్= ఉంటుంది; అని చెప్పి= ఇట్లు బోధించి; కపిలుండు= కపిలముని; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తా :** జగత్కర్త సకల జీవకోటిలో ఆత్మరూపుడై వుంటాడు. పురుషుడు భక్తియోగంద్వారాగాని, అష్టాంగయోగమార్గంలో గాని, 'పరమాత్మ'ను దర్శిస్తాడు. ప్రకృతి మాత్రం 'పురుషస్వరూపంగా ఒక్కొక్కప్పుడు అందుకు భిన్నంగా ఉన్న దైవస్వరూపాన్ని

పొంది 'క్రియలు' నిర్వర్తిస్తుంది. ఇదే భగవంతుని స్వరూపం. ఈ స్వరూపం వివిధరూపాలతో భాసించే కాలమని చెప్పబడుతుంది. కాలస్వరూపం మహత్తు మొదలైన ఏడుతత్త్వాలకు, వీటియందు తగుల్కొన్న ప్రాణికోటికి భీతిని కల్గిస్తుంది. భూతాలలో దాగి వాటిని నాశనం చేస్తుంది. విష్ణుమూర్తి యజ్ఞఫలాన్ని ఇచ్చేవాడు కాబట్టి, సమస్త విశ్వాన్ని తన గుప్పిట్లో వుంచుకొని అధికారం చెలాయిస్తుంటాడు. ఆయనకు బంధువులు గాని, శత్రుమిత్రులు గాని వుండరు. సకల ప్రాణికోటిలో ఆయన మేల్కొని, నిద్రావస్థలో వున్న ప్రాణుల్ని సంహరిస్తాడు. అతడంటే భయంతో గాలి వీస్తుంది. సూర్యుడు వెల్గుతాడు. ఇంద్రుడు వర్షిస్తాడు. తారకలు వెల్గుతాయి. చంద్రుడు చల్లగా వెన్నెల కురిపిస్తాడు. సముద్రాలు చెలియలికట్ట దాటవు. చెట్లు, తీగెలు ఋతుధర్మం తప్పక కాయలు కాస్తాయి. పూలు పూస్తాయి. నదులు ప్రవహిస్తాయి. అగ్ని మండుతుంది. కొండలతో కూడిన భూమి క్రుంగదు. ఆకాశం ఎల్లజీవులకు నెలవై వుంటుంది. జగత్తుకు మహత్తే బీజం కాబట్టి, అది ఏడు ఆవరణాలతో కూడిన తన ఉపాధిని విస్తరిస్తుంది. త్రిగుణాభిమానులైన బ్రహ్మాదులు సృష్టికార్యమునందు భగవంతునిచే నియోగింపబడి వారి పని వారు జాగ్రత్తగా చేస్తుంటారు. తల్లిదండ్రులు సంతానాన్ని ఉత్పత్తి చేస్తారు. కాలుడు మృత్యువుతో కలిసి ప్రాణికోటిని సంహరిస్తాడు. స్థావర జంగమాత్మకమైన సమస్త జగత్తు భగవంతుని అధీనంలోనే వుంటుంది" అని చెప్పి, కపిలుడు మరల అంటున్నాడు.

**విశే :** భగవంతునికి మరో పేరు కాలం. "కాలః కలయతామహం" అని భగవానుడే గీతలో అన్నాడు. అంటే శుభాశుభాల్ని, వృద్ధి క్షయాల్ని చేస్తున్నవారిలో కాలస్వరూపుడు భగవంతుడే.

**క. నెఱి నిట్టి నిఖిలలోకే, శ్వరుని పరాక్రమముఁ దెలియ సామర్థ్యం బె**
**వ్వరికిని గలుగదు! మేఘము, గరువలి విక్రమముఁ దెలియఁగా లేని గతిన్. 973**

**ప్రతి :** మేఘము= మబ్బు; కరువలి= గాలియొక్క; విక్రమమున్= శక్తిని; తెలియన్+కాన్+లేనిగతిన్= తెలిసికోలేని విధంగానే; నెఱిన్= చక్కగా; ఇట్టి= ఇటువంటి; నిఖిల= సమస్తమైన; లోక+ఈశ్వరుని= జగత్తుకు అధిపతియైనవాని; పరాక్రమమున్= సామర్థ్యాన్ని; తెలియన్= తెలిసికోగల; సామర్థ్యంబు= శక్తి; ఎవ్వరికినిన్+కలుగదు= ఏ వ్యక్తికి కూడ కలుగదు.

**తా :** ప్రభంజనపు తాకిడి ఎలావుంటుందో మేఘానికి తెలియనట్లే, జగత్కర్త బలమెంతటిదో ఎవ్వరికీ బోధపడదు.

**క. మగువా! విను సుఖహేతుక, మగు నర్థము దొరకమికి మహాదుఃఖమునం**
**దగులుదు రిది యంతయు నా, భగవంతుని యాజ్ఞఁజేసి ప్రాణులు మఱియున్. 974**

**ప్రతి :** మగువా! విను= తల్లీ! విను; ప్రాణులు= జీవులు; ఇది+అంతయున్= ఈ లోకవృత్తమంతా; ఆ భగవంతుని= ఆ పరమాత్మునియొక్క; ఆజ్ఞన్+చేసి= ఆజ్ఞకు అధీనమైనందువల్ల; సుఖహేతుకము+అగు= సుఖాన్ని కలిగించే; అర్థము= జ్ఞానసంపద (వస్తువు); దొరకమికిన్= లభించనందువల్ల; మహాదుఃఖమునన్= ఎక్కువ ఆవేదనయందు; తగులుదురు= మజ్జులౌతారు.

**తా :** అమ్మా! ఈ ప్రాణికోటి భగవంతుని మాయకు లోబడినట్టిదే. తమకు సుఖదాయకమైన సంపద చేతికందనందువల్ల ఎప్పుడూ బాధలకు గురియౌతుంటుంది.

**విశే :** 'సుఖహేతుకమగునర్థము' అనే మాట ఈ పద్యంలో వుంది. సుఖదాయకమైన అర్థం (లేదా సొమ్ము) ఏదో కాదు– అది ఆత్మజ్ఞానమే. భౌతిక సుఖం కాదని తెలియాలి. ఆత్మజ్ఞునికి దుఃఖం లేదని భగవంతుడన్నాడు. ఆత్మజ్ఞాన సంపద అక్షయసుఖమని తెలిసికోవాలి.

**సీ. పూని యనిత్యంబులైన గృహక్షేత్ర పశుధనసుత వధూబాంధవాది**
**వివిధ వస్తువులను ధ్రువముగా మది నమ్మి వఱలు దుర్మతి యగువాఁడు జంతు**
**సంఘాత మగు దేహసంబంధమున నిల్చి యర్థి నయ్యై యోనులందుఁ జొరఁగ**
**ననుగమించును వానియందు విరక్తుండు గాక యుండును నరకస్థుఁడైన**

**తే. దేహి యాత్మీయదేహంబు దివిరి వదల, లేక తన కది పరమసౌఖ్యాకరంబు**
**గాఁగ వర్తించు నదియునుగాక యతఁడు, దేవమాయా విమోహిత భావుఁ డగుచు. 975**

**ప్రతి :** పూని= ప్రయత్నించి; అనిత్యంబులు+ఐన= శాశ్వతంగాని వైనట్టి; గృహ= ఇళ్ళు; క్షేత్ర= పొలం; పశు= పసులు; ధన= సొమ్ము; సుత= సంతానం; వధూ= భార్య; బాంధవ= బందుగులు; ఆది= మున్నగు; వివిధ వస్తువులను= పెక్కు పదార్థాలను; ధ్రువము+కాన్= స్థిరమైనవిగా; మదిన్= మనస్సులో; నమ్మి, వఱలు= మసలుకొనే; దుర్+మతి+ అగువాఁడు= దుర్బుద్ధిగలవ్యక్తి; జంతుసంఘాతము+అగు= పశు సమూహానికి సంబంధించినట్టి; దేహసంబంధమునన్+నిల్చి= శరీర బంధంలో నిల్చి; అర్థిన్= కోర్కెతో; ఏ+ఏ యోనులందున్= వివిధ జాతుల గర్భాలలో; చొరన్+కన్= ప్రవేశించుటకు; అనుగమించును= ప్రయాణించునో; వానియందున్= ఆ వివిధ జాతులలో; విరక్తుండు+కాక= విరాగికాకుండ (ఆసక్తుడుగాకుండా); ఉండున్= ఉంటాడు; నరకస్థుఁడు+ఐన= నరకయాతనపడే; దేహి= ప్రాణి; తివిరి= ప్రయత్నించి; ఆత్మీయదేహంబున్= తన శరీరాన్ని; వదలలేక= విడిచిపెట్టలేక; తనకున్+అది= తనకు ఆ దేహం; పరమసౌఖ్య= మిక్కిలి సుఖాలకు; ఆకరంబు= నెలవు; కాన్+కన్= కాగా; అదియున్+కాక= అంతేగాక; అతఁడు= ఆ దేహి; దేవమాయా= విష్ణుమాయచే; విమోహిత= వ్యామోహంచెందిన; భావుఁడు= భావనకలవాడు; అగుచున్= అవుతూ; వర్తించున్= ఉంటాడు–

**తా :** అజ్ఞాని క్షణభంగురాలైన నివాసం, క్షేత్రం, పశుసంపదలు, భార్య, సంతానం, బంధువులు, అన్యపదార్థాలు మున్నగు అనిత్యవస్తువుల్ని నిత్య వస్తువులుగా నమ్మి జీవిస్తాడు. పెక్కు జంతుదేహాలలో ప్రవేశించాలని ఉబలాటపడతాడు. ఆతనికి వైరాగ్యభావన వుండదు. నరకకూపంలాంటి తన దేహాన్ని వదులుకోలేడు. అదే తనకు మిక్కిలి సుఖప్రదమని భావిస్తాడు. అతడు విష్ణుమాయకు లోబడ్డవాడే.

**క. ఘనమగు తనయ వధూ పశు, ధన గృహ రక్షణమునందుఁ దత్తత్క్రియలన్**
**మనమునఁ దలపోయుచు దిన, దినమున్ దందహ్యమాన దేహుం డగుచున్. 976**

**ప్రతి :** ఘనమగు= గొప్పదగు; తనయ= సంతానం; వధూ= భార్య; పశు= పసులు; ధన= సంపద; గృహ= నివాసం మున్నగువాని; రక్షణమునందున్= కాపాడుకొనుటయందును; తద్+తద్+క్రియలన్= ఆ యా ఇతర వ్యాపారాలను; మనమునన్= మనస్సునందు; తలపోయుచున్= స్మరించుకొంటూ; దిన దినమున్= ప్రతిదినం; దందహ్యమాన= మిక్కిలి కాల్చబడుచున్న; దేహుండు+అగుచున్= శరీరంగలవాడవుతూ;

**తా :** భార్య, పిల్లలు, పశువులు, సొమ్ము, ఇల్లు, వాకిలి మొదలైనవాటి రక్షణ, వాటికి సంబంధించిన వ్యాపారాలలో తగుల్కొని, ప్రతినిత్యం దహ్యామానమైన శరీరం కలవాడవుతూ,

**క. అతిమూఢ హృదయుఁ డగుచు దు, రిత కర్మారంభమునఁ జరించుచుఁ దరుణీ**
**కృత గోప్యభాషణములను, సుతలాలన భాషణములఁ జొక్కుచు మఱియున్. 977**

**ప్రతి :** అతిమూఢ= మిక్కిలి తెలివిలేని; హృదయుఁడు+అగుచున్= మనస్సు గలవాడవుతూ; దురితకర్మ= పాపకర్మలు; ఆరంభమునన్= చేయుటచే; చరించుచున్= నడుస్తూ; తరుణీకృత= భార్య తన చెవిలో ఊదినట్టి; గోప్య= రహస్యమైన; భాషణములను= మాటలతోను; సుత= కుమారుల లేక సంతానంయొక్క; లాలన= అవ్యక్తమధురమైన; భాషణములన్= మాటలతో; చొక్కుచున్= పరవశిస్తూ; మఱియున్= ఇంకా...

**తా :** బుద్ధిహీనుడై పాపకర్మల్ని చేస్తూ భార్య చెప్పే రహస్యాలు, పిల్లల తియ్యని పల్కులు విని పరవశించే దౌర్భాగ్యుడవుతాడు (ఇంకా)

**క. విను మింద్రియ పరవశుఁడై, మునుకొని తత్కూట ధర్మములు గల దుఃఖం**
**బనయము సుఖరూపంబుగ, మనమునఁ దలపోసి తదభిమానుం డగుచున్. 978**

**ప్రతి :** వినుము= అమ్మా! ఆలకించు; ఇంద్రియ పరవశుఁడు+ఐ= జ్ఞాన కర్మేంద్రియాలలో తగుల్కొన్నవాడై; మునుకొని= సాహసించి; తద్= ఆ, కూట ధర్మములు+కల= వెకలి చర్యలు గల్గినట్టి; దుఃఖంబు= ఏడ్పు; అనయము= ఎల్లప్పుడు; సుఖరూపంబు+కన్= సుఖాన్ని ఇచ్చేదిగా; మనమునన్= మనసునందు; తలపోసి= భావించి; తద్+అభిమానుండు= దానియందాసక్తికలవాడు; అగుచున్= అవుతూ (ఇంకా)...

**తా :** ఇంద్రియదాసుడైనవాడు వాని వెకలి చర్యలందే ఆసక్తుడవుతాడు. దుఃఖమే అతనికి సుఖంగా తోస్తుంది. వాటియందే అభిమానం కల్గివుంటాడు.

**క. సతతముఁ దమతమ సంపా, దిత మగు నర్థములచేత ధృతిఁ బరులకుఁ గు**
**త్సితమతి హింసలు సేయుచు, నతిమూఢమనస్కు లగుచు నాత్మజనములన్. 979**

**ప్రతి :** సతతము= ఎల్లప్పుడు; తమతమ= స్వకీయమైన; సంపాదితము+అగు= గడించినట్టి; అర్థములచేతన్= సంపదలచేత; ధృతిన్= ధైర్యంతో; పరులకున్= ఇతరులకు; కుత్సితమతిన్= దుర్బుద్ధితో; హింసలు= బాధలు; చేయుచున్= చేస్తూ; అతి= మిక్కిలి; మూఢమనస్కులు+అగుచున్= అవివేకంగల మనస్సుగలవారై; ఆత్మజనములన్= తమవారిని...

**తా :** తాము సంపాదించిన ధనంతో గర్వించేవారు ఇతరులకు ఎల్లప్పుడు బాధలు కల్గిస్తూనే వుంటారు. వారు మహామూర్ఖులు. తమవారిని రక్షించుటే వారికి ముఖ్యం.

**తే. పూని రక్షించుచును వారి భుక్త శేష, మనుభవించుచు నంత జీవనము వోక**
**గడఁకతో నపుడు పరార్థకాముఁ డగుచు, సత్త్వ మెడలి కుటుంబ పోషణమునందు. 980**

**ప్రతి :** పూని= ప్రయత్నించి; రక్షించుచును= తమవారిని రక్షిస్తూ; వారి= ఆ బంధువులయొక్క; భుక్తశేషము= తినగా మిగిలిన ఎంగిలి; అనుభవించుచున్= కుడుస్తూ; అంతన్= ఆపైన; జీవనము+పోక= బ్రతుకు నీడ్వలేక; కడఁకతోన్=

పూనికతో; అపుడు; పర+అర్థకాముఁడు= అన్యులసొత్తు కోరువాడు; అగుచున్= అయి; కుటుంబపోషణమునందున్= కుటుంబాన్ని కాపాడటంలో; సత్త్వము= చేవ; ఎడలి= తగ్గి (ఇంకా)–

**తా :** తమవారిని రక్షింపనెంచే మూర్ఖుడు ఆ పనిలోనే మునుగుతూ, తేలుతూ, వారు తినగా మిగిలినదానితో పొట్టపోసుకుంటూ, జీవితాన్ని సాగదీస్తాడు. వాడు పరభాగ్యోపజీవి. వానికి తన కుటుంబాన్ని పోషించే శక్తికూడ ఉండదు.

**సీ. బలిమి సాలక మందభాగ్యుఁడై కుమతియై పూని యప్పుడు క్రియాహీనుఁ డగుచుఁ**
**దవిలి వృథాప్రయత్నంబులు సేయుచు మూఢుఁడై కార్పణ్యమునఁ జరించు**
**నట్టి యకించనుఁ డగువానిఁ జూచి త ద్దారసుతాదు లాత్మలను వీఁడు**
**గడు నశక్తుఁడు, ప్రోవఁగాఁ జాలఁ, డితఁ డని సెగ్గింతు రర్థిఁ, గృషీవలుండు**

**తే. బడుగు ముసలెద్దు రోసిన పగిది, నంత, నతఁడు నే వెంటలను సుఖం బందలేక**
**తాను పోషించు జనులు దన్ దనరఁ బ్రోవ, బ్రదుకు ముదిమియు మిక్కిలి బాధ పఱుప. 981**

**ప్రతి :** బలిమి= శక్తి; చాలక= లేక; మందభాగ్యుఁడు+ఐ= క్షీణించిన సంపదలుగలవాడై; కుమతి+ఐ= చెడిన బుద్ధిగలవాడై; పూని= ప్రయత్నించి; అప్పుడు= ఆ సమయంలో; క్రియాహీనుఁడు+అగుచున్= ఏమీచేయటానికి తోచనివాడై; తవిలి= పూని; వృథాప్రయత్నంబు= వ్యర్థమైన ప్రయత్నాలు; చేయుచున్= చేస్తూ; మూఢుఁడు+ఐ= అవివేకియై; కార్పణ్యమునన్= దీనత్వంతో; చరించున్+అట్టి= తిరుగునట్టి; అకించనుఁడు+అగువానిన్+చూచి= దరిద్రుణ్ణి చూచి; తద్= వాని; దారసుత+ఆదులు= భార్య మఱియు పిల్లలు మొదలైనవారు; ఆత్మలను= తమ మనస్సులలో; వీఁడు= ఈ వ్యక్తి; కడు= మిక్కిలి; అశక్తుఁడు= దుర్బలుడు; ప్రోవన్+కాన్= రక్షించుటకు; చాలఁడు= తగడు; ఇతఁడు+అని= ఈతడంటూ; అర్థిన్= బుద్ధిపూర్వకంగా; కృషీవలుండు=రైతు; బడుగు= బక్కచిక్కిన; ముసలి+ఎద్దున్= వయసుమళ్ళిన ఎద్దును; రోసినపగిదిన్= ఈసడించుకొన్నట్లు; సెగ్గింతురు= ఈసడిస్తారు; అంతన్= తర్వాత; అతఁడు= ఆ బలహీనుడు; ఏ వెంటలను= ఏ దారిలో కూడ; సుఖంబు= సంతోషం; అందన్‌లేక= పొందజాలక; తాను= అతడు; పోషించు= రక్షించే; జనులు= మానవులు; తన్= తనను; తనరన్= ఒప్పుగా; ప్రోవన్= కాపాడగా; మదిమియున్= ముసలితనం; మిక్కిలిబాధపఱుపన్= ఎక్కువగా బాధించగా; బ్రదుకున్= జీవిస్తాడు.

**తా :** కుటుంబాన్ని రక్షించలేని దరిద్రుడు సిరిసంపదలకు దూరమై, చెడుబుద్ధి గలవాడై ఏ పని చేయజాలక వ్యర్థప్రయత్నాలు చేస్తూ మూఢత్వంతో ప్రవర్తిస్తాడు. కృపణత్వంతో జీవిస్తాడు. అతనిది నిర్దయావస్థ. భార్య, పిల్లలు వాణ్ణి అశక్తుడని, తమని పెంచి పోషించలేని అధముడని నిందిస్తారు. వారు అతణ్ణి రైతు బక్కచిక్కిన ముసలెద్దుని చూచినట్లు చులకనగా చూస్తారు. ఆయనకు ఏ విధమైన సుఖం లేదు. ఒకప్పుడు తాను పోషించినవారే తనకింత పిడచపెడితే కాదనలేక బతుకుని వృద్ధాప్యంలో సాగదీస్తూ బాధలను అనుభవిస్తారు.

**క. వెదరూపుఁ దాల్చి బాంధవు, లడలంగ నిర్యాణమునకు నభిముఖుఁడై యి**
**ల్లెడలంగఁ జాలక శునకము, వడువునఁ గుడుచుచును మేను వడవడ వడఁకన్. 982**

**ప్రతి :** బాంధవులు= చుట్టాలు; అడలన్+కన్= శోకించగా; వెదరూపున్+తాల్చి= వికృతాకారాన్నిపొంది; నిర్యాణమునకున్= చావుకు; అభిముఖుఁడు+ఐ= ఎదురుగా నడచువాడై; ఇల్= స్వగృహాన్ని; ఎడలన్+కన్+చాలక= విడచిపోలేక; శునకము వడువునన్= కుక్కవలె; కుడుచుచును= తింటూ; మేను= దేహం; వడవడన్= గడగడతో; వణకన్= వణుకుతుండగా...

**తా :** ఆ దీనుడు అవసానదశలో వికృతాకారుడై, బంధువులు ఏడుస్తుండగా, చావుకెదురుచూస్తూ, ఇంటిని వదలిపోలేక కుక్కమాదిరి ఎంగిలి కుడుస్తూ, శరీరం గజగజ వణుకుతుంటే (జీవితాన్ని వెళ్ళదీస్తాడని ముగింపు).

**సీ. అతిరోగపీడితుండై మంద మగు జఠరాగ్నిచే మిగుల నల్పాశి యగుచు,**
**మెఱసి వాయువుచేత మీఁదికి నెగసిన కన్నులు, కఫమునఁ గప్పఁబడిన**
**నాళంబులను గంఠనాళంబునను ఘుర ఘుర మను శబ్దంబు దొరయ బంధు**
**జనులమధ్యంబున శయనించి బహువిధములఁ దన్నుఁ బిలువంగఁ బలుకలేక,**

**తే. చటులతర కాలపాశ వశంగతాత్ముఁ, డగుచు బిడ్డలఁ బెండ్లాము నరసి ప్రోచు**
**చింత వికలములైన హృషీకములను, గలిగి విజ్ఞానమును బాసి కష్టుఁ డగుచు. 983**

**ప్రతి :** అతిరోగపీడితుండు+ఐ= మిక్కిలిరోగాలచే బాధింపబడినవాడై; మందము+అగు= స్వల్పమైన; జఠర+అగ్నిచేన్= కడుపులోని అగ్నిచేత; మిగులన్= పూర్తిగా; అల్ప+ఆశి+అగుచున్= కొద్దిగా తింటున్నవాడై; మెఱసి= బయటపడి; వాయువుచేతన్= ప్రాణవాయువుచే; మీఁదికిన్= పైకి; ఎగసిన= లేచిన; కన్నులు; కఫమునన్= కళ్ళెచేత; కప్పన్+పడిన= ఆచ్ఛాదింపబడినట్టి; నాళంబులను= కంఠనాళమును; కంఠనాళంబునన్= గొంతులో; ఘురఘుర+అను= గురగురమనే; శబ్దంబు= ధ్వని; దొరయన్= పెచ్చరిల్లగా; బంధుజనుల మధ్యంబునన్= చుట్టాలనడుమ; శయనించి= పరుండి; బహువిధములన్= పెక్కురీతుల; తన్నున్= తనను; పిలువన్+కన్= హెచ్చరించగా; పలుకలేక= మాటాడజాలక; చటులతర= భయంకరమైన; కాలపాశ= యమపాశమునకు; వశంగత+ఆత్ముఁడు+అగుచున్= చిక్కినవాడవుతూ; బిడ్డలన్= సంతానమును; పెండ్లామున్= భార్యను; అరసి= చూచి; ప్రోచుచింతన్= రక్షించే ఆలోచనయందు; వికలములు+ఐన= పట్టుదప్పిన; హృషీకములను+కలిగి= ఇంద్రియాలను కలిగి; విజ్ఞానమునున్+పాసి= తెలివిదప్పి; కష్టుఁడు+అగుచున్= కష్టాలే మిగిలినవాడై...

**తా :** దీనుడు అవసానదశలో రోగగ్రస్తుడవుతాడు. ఆకలి తగ్గిపోతుంది. ఒక్క ముద్ద కూడ ముట్టలేడు. అస్తమించే సమయానికి కళ్ళు తేలేస్తాడు. గొంతులో కఫం కమ్ముకుంటుంది. గొర గొర శబ్దం ఏర్పడుతుంది. అంతలోనే బంధువులు తన చుట్టుచేరి పిలుస్తుంటే ఉలుకూ పలుకూ ఉండదు. ఆయన్ని కాలపాశం బిగిస్తుంది. భార్యని, పిల్లల్ని పోషించగల పట్టు తప్పుతుంది. ఇంద్రియాలలో నిస్సత్తువ ఆవేశిస్తుంది. తెలివి దప్పిన అతనికి కష్టాలే దిక్కు.

**వ. అంత మరణావస్థం బొందు సమయంబున నతి భయంకరాకారులు సరభసేక్షణులు నగు యమదూత లిద్దఱు దన ముందఱ నిలిచినం జూచి త్రస్తహృదయుండై శకృన్మూత్రంబులు విడుచుచు, యమపాశంబులచే గళంబున బద్ధుండై శరీరంబువలన నిర్గమించి యాతనాశరీరంబు నవలంబించి బలాత్కారంబున దీర్ఘంబై దుర్గమం బగు మార్గంబును బొంది రాజభటులచే నీయమానుం డగుచు దండనంబున కభిముఖుండై చను నపరాధి చందంబునఁ జనుచుండి. 984**

**ప్రతి :** అంతన్= ఆ అవసానదశలో; మరణ+అవస్థన్= మరణస్థితిని; పొందుసమయంబునన్= పొందే తరుణంలో; అతి= మిక్కిలి; భయంకర+ఆకారులును= వెఱపుగొల్పే స్వరూపంగలవారును; సరభస+ఈక్షణులును= తొందరించే చూపులు గలవారును; అగు= అయిన, యమదూతలు+ఇద్దఱు= ఇద్దరు యమభటులు; తనముందఱన్= తనయెదుట; నిలిచినన్=

నిలువగా; చూచి= కాంచి; త్రస్తహృదయుండు+ఐ= భీతిల్లిన గుండెగలవాడై; శకృత్+మూత్రంబులు= మలమూత్రాలు; విడుచుచున్= వదలుతూ; యమపాశంబులచేన్= యముని త్రాళ్ళచేత; గళంబునన్= కుత్తుకయందు; బద్ధుండు+ఐ= కట్టబడినవాడై; శరీరంబువలనన్= దేహంనుండి; నిర్గమించి= వెలువడి; యాతనాశరీరంబున్= తీవ్రబాధలు అనుభవించవలసిన శరీరాన్ని; అవలంబించి= పొంది; బలాత్కారంబునన్= బలవంతంగా; దీర్ఘంబు+ఐ= నిడుపై; దుర్గమంబు+అగు= చొరరానిదైన; మార్గంబును= దారిని; పొంది= అవలంబించి; రాజభటులచేన్= రాజుగారి సేవకులచేత; నీయమానుండు+అగుచున్= కొనిపోవబడినవాడవుతూ; దండంబునకున్= శిక్షకు; అభిముఖుండు+ఐ= ఎదురుగా నిలిచినవాడై; చను= వెళ్ళుచున్న; అపరాధి చందంబునన్= దోషివలె; చనుచుండి= వెళ్ళుతూ;

**తా :** ఆ దీనునికి చావుదగ్గర పడగానే భయంకరమైన ఆకారాలు గలవారును, కొరకొర చూచే చూపులు గలవారును అయిన ఇద్దఱు యమదూతలు తన యెదుట నిలబడతారు. వారిని చూడగానే అతడు భయంతో మలమూత్రాలు విసర్జిస్తాడు. దూతలు యమపాశంతో వాని బొందినుండి ప్రాణం వెలువరిస్తారు. అంతట జీవుడు బాధలనుభవించవలసిన యాతనాశరీరాన్ని ధరిస్తాడు. రాజభటులు దోషిని శిక్షాస్థానానికి గుంజుకొని పోయినట్లు, యమభటులు బలాత్కారంగా అతణ్ణి బహుదూరం, వెళ్ళడానికి కూడా వీలుగాని భయంకరమైన త్రోవలో శిక్ష ననుభవింపజేయడానికి ఈడ్చుకొనిపోతారు.

**చ. అనయము మూర్ఛనొందు శునకావలిచేతను భక్ష్యమాణుఁడై,**
**యనుపమ కాలకింకర భయంకర తర్జన గర్జనంబులన్**
**మనము గలంగ, దేహము సమస్తము గంపము వొందఁ గాఁ, బురా**
**తన భవ పాపకర్మ సముదాయముఁ జిత్తములోఁ దలంచుచున్. 985**

**ప్రతి :** శునక+ఆవలిచేతన్= కుక్కలగుంపుచేత; భక్ష్యమాణుఁడు+ఐ= తినబడుచున్నవాడై; అనుపమ= సాటిలేని; కాలకింకర= యమభటులయొక్క; భయంకర= భీతినిగొల్పే; తర్జనగర్జనంబులన్= చూపుడువ్రేలిని చూపి చేసే బెదరింపులచేత; మనము= మనస్సు; కలంగన్= కలతపడగా; దేహము సమస్తము= శరీరమంతయు; కంపమున్= వణుకును; ఒందన్+కాన్= పొందగా; పురాతన= ముందటి; భవ= జన్మల; పాపకర్మసముదాయము= పాపపుపనుల సంచయం; చిత్తములోన్= మనస్సులో; తలంచుచున్= నెమరువేసుకొంటూ; అనయము= ఎడతెరపి లేకుండ; మూర్ఛన్+ఒందున్= స్పృహతప్పి పడిపోతాడు.

**తా :** యమలోకంలో దీనుని దశ ఎట్లుంటుందో కపిలుడు తల్లికి నివేదిస్తున్నాడు. దీనుని శరీరాన్ని అక్కడి జాగిలాలు పీక్కు తింటాయి. యమభటులు భయంకరంగా పెడబొబ్బలు పెట్టి భయగ్రస్తుణ్ణి చేస్తారు. వాని దేహం భయంతో వణికిపోతుంది. తాను పూర్వజన్మలో చేసిన పాపకార్యాల్ని తలపోసుకొంటూ వాడు స్పృహ కోల్పోతాడు.

**సీ. అనుపమక్షుత్తృష్ణ లంతర్వ్యథలఁ జేయ ఝంఝానిలజ్వలజ్జ్వలన చండ**
**భానుప్రదీప్తితప్తంబైన వాలుకా, మార్గానుగత తప్యమానగాత్రుఁ**
**డై వీఁపుఁ గశలచే నడువంగ వికలాంగుఁ, డగుచు మార్గమునందు నచట నచటఁ**
**జాల మూర్ఛిల్లు చాశ్రయశూన్యమగు నీళ్ల, మునుఁగుచు లేచుచు మొనసి పాప**

**తే. రూప మయిన తమముచే నిరూఢుఁ డగుచు, వెలయఁ దొంబది తొమ్మిదివేల యోజ**
**నముల దూరంబు గల యమనగరమునకుఁ, బూని యమభటుల్ గొంపోవఁ బోవునంత.986**

**ప్రతి :** అనుపమ= సాటిలేని; క్షుత్+తృష్ణలు= ఆకలిదప్పులు; అంతర్+వ్యథలన్+చేయన్= లోపల బాధింపగా; ఝంఝా+అనిల= తీవ్రమైన గాలిచే; జ్వలత్= రేగుచున్న; జ్వలన= అగ్నిచే; చండ= తీవ్రమైన; భానుప్రదీప్తి= సూర్యకాంతిచేత; తప్తంబు+ఐన= కాగినట్టి; వాలుకా= ఇసుకతోడి; మార్గ+అనుగత= దారివెంట నడిచిన; తప్యమాన= మండింపబడిన; గాత్రుఁడు+ఐ= శరీరం కలవాడై; వీఁపున్= పృష్ఠభాగాన్ని; కశలచేన్= చబుకులచేత, కొరడాలతో; అడువన్+కన్= కొట్టగా; వికల+అంగుఁడు+అగుచున్= పట్టుదప్పిన అవయవాలుగల వాడవుతూ; మార్గమునందున్= దారివెంట; అచటన్+అచటన్= అక్కడక్కడ; చాల= మిక్కిలి; మూర్ఛిల్లుచు= స్పృహ తప్పుతూ; ఆశ్రయశూన్యము+అగు= ఆధారం లేనట్టి; నీళ్ళన్= నీటియందు; మునుఁగుచున్= మునకలువేస్తూ; లేచుచున్= తేలుతూ; మొనసి= పూని; పాపరూపము+అయిన= దోషరూపమైనట్టి; తమముచేన్= చీకటిచే; నిరూఢుఁడు+అగుచున్= చిక్కినవాడై (గట్టిపడి); వెలయన్= బాహాటంగా; తొంబది తొమ్మిదివేల= తొంభైతొమ్మిదివేల సంఖ్యగల; యోజనముల= ఆమడల; దూరంబు= దవ్వు; కల= కల్గినట్టి; యమనగరమునకున్= యమపురికి; పూని= ఉద్యమించి; యమభటుల్= యముని కింకరులు; కొంపోవన్= తీసికొనిపోగా; పోవున్= వెళ్ళును; అంతన్= ఆ తర్వాత...

**తా :** ఆ దీనుడు ఆకలిదప్పులతో అలమటిస్తాడు. తుఫాను గాలికి హోరుమని రేగుతూ, ఎండకు మలమలమాడే ఇసుక గల దారిలో నడుస్తూ తపించినవాడౌతాడు. యమభటుల కొరడాదెబ్బలకు వీపు బద్దలవుతుంది. దేహం పట్టుతప్పుతుంది. మార్గమధ్యంలో స్పృహ దప్పినపుడు, నిరాశ్రయమైన నీళ్ళలో మునుకలు వేస్తూ దారిసాగుతాడు. గతంలోని పాపపు చీకట్లు కమ్ముకుంటాయి. తొంభై తొమ్మిదివేల యోజనాలనిడివిగల ఆ యమపుర మార్గంలో భటులు వాణ్ణి ఈడ్చుకొని పోతారు.

### వ. ఇట్లు మహాపాపాత్ముం డైనవాఁడు ముహూర్తత్రయ కాలంబునను సామాన్య దోషి యగువాఁడు ముహూర్తద్వయంబునను నేఁగి యాతనం బొందు నందు. 987

**ప్రతి :** ఇట్లు= పైన చెప్పినరీతి; మహా+పాప+ఆత్ముండు+ఐనవాఁడు= గొప్ప పాపియైనవ్యక్తి; ముహూర్తత్రయ= మూడు ముహూర్తాల; కాలంబునను= సమయంలోను; సామాన్యదోషి= సాధారణపాపి; అగువాఁడు= అయినవాడు; ముహూర్తద్వయంబునను= రెండు ముహూర్తాల కాలంలోను; ఏఁగి= పోయి; యాతనన్+పొందున్= నరకబాధ లనుభవిస్తాడు; అందున్= ఆ నరకంలో–

**తా :** మహాపాపి యమపురిమార్గంలో మూడు ముహూర్తాల కాలంలో సాగిపోగా, సామాన్యపాపి రెండు ముహూర్తాల కాలంలోనే ఆ దారిలో పోయి యమనగరం చేరి నరకబాధ లనుభవిస్తాడు.

### క. పట్టుదురు కొఱవులను వడిఁ, బెట్టుదు రసిపుత్రికలను బెనుమంటలయం
### దొట్టుదురు నొడలు నలియఁగ, మట్టుదు రప్పాపచిత్తు మత్తుం బెలుచన్. 988

**ప్రతి :** మత్తున్= మదించినవాడైన; ఆ+పాపచిత్తున్= పాపబుద్ధియైనవాణ్ణి; పెలుచన్= మిక్కిలిగా; కొఱవులను= మండే కట్టెలతో, కొఱకచ్చుతో; పట్టుదురు= పట్టుకుంటారు; అసిపుత్రికలను= చురకత్తుల చేత; వడిన్+పెట్టుదురు= మిక్కిలి బాధిస్తారు; పెనుమంటల+అందున్= పెద్ద మంటల్లో; ఒట్టుదురు= పడదోస్తారు; ఒడలు= దేహం; నలియన్+కన్= నుగ్గగునట్లు; మట్టుదురు= నల్లగొట్టుతారు.

**తా :** యమభటులు పాపాత్ముల్ని కొఱవుల్తో పట్టుకుంటారు. కత్తివాదఅలకు గురిచేస్తారు. అగ్ని గుండాల్లో పడదోస్తారు. ఒళ్ళు నుగ్గయ్యేట్లు బడియలతో మోదుతారు.

**ఉ. ముంతురు తప్తతోయముల మొత్తుదు రుగ్ర గదాసిధారలన్**
**ద్రెంతురు పొట్టప్రేవులు, వధింతురు, మీఁద నిభేంద్రపంక్తి ఱొ**
**ప్పింతురు, ఘోరభంగిఁ గఱపింతురు పాములచేత, బిట్టు ద్రొ**
**బ్బింతురు మీఁద గుండ్లు, తినిపింతురు దేహము గోసి కండలన్. 989**

**ప్రతి :** (ఆ పాపాత్ముణ్ణి) తప్తతోయములన్= సలసల కాగుతున్న నీటిలో; ముంతురు= ముంచుతారు; ఉగ్ర= భయంకరమైన; గదా= గదలతో; అసి= కత్తుల; ధారలన్= వాదరలతో; మొత్తుదురు= కొడతారు, నరుకుతారు; పొట్టప్రేవులు= కడుపులోని ప్రేగుల్ని; త్రెంతురు= కోసివేస్తారు; వధింతురు= చంపుతారు; మీఁదన్= దేహంపై; ఇభ+ఇంద్ర= గజేంద్రాలయొక్క; పంక్తిన్= వరుసచే; ఱొప్పింతురు= త్రొక్కిస్తారు; ఘోరభంగిన్= భయంకరంగా; పాములచేతన్= సర్పాలతో; కఱపింతురు= కరిపిస్తారు; బిట్టు= శీఘ్రంగా; మీఁదన్= పైన; గుండ్లు= రాళ్ళు; ద్రొబ్బింతురు= పడవేయిస్తారు; దేహము+కోసి= శరీరాన్ని ఖండించి; కండలన్= చియ్యల్ని; తినిపింతురు= వానిచేతనే తినిపిస్తారు.

**తా :** యమభటులు పాపాత్ముణ్ణి కొఱవులతో కాలుస్తారు. సలసల కాగే నీటిలో ముంచుతారు. గదలతో మోది, కత్తులతో చీలుస్తారు. పేగుల్ని తెంచి, చిత్రవధ చేస్తారు. ఏనుగుల్తో త్రొక్కిస్తారు. పాములతో కరపిస్తారు. కాయంమీద గండశిలల్ని దొర్లిస్తారు. వాని కండలు కోసి వాని నోటితోనే తినిపిస్తారు.

**వ. మఱియుఁ గుటుంబపోషణంబునఁ గుక్షింభరుం డగుచు నధర్మపరుండై భూతద్రోహంబున నతిపాపుండై నిరయంబునం బొంది, నిజధనంబులు గోలుపడి మొఱవెట్టు నాపన్నుని చందంబునఁ బరస్పర సంబంధంబునఁ గల్పింపంబడిన తామిస్రాంధతామిస్ర రౌరవాదు లగు నరకంబులం బడి, తీవ్రంబులైన బహుయాతనల ననుభవించి, క్షీణపాపుండై పునర్నరత్వంబునుం బొందు నని చెప్పి వెండియు నిట్లనియె. 990**

**ప్రతి :** మఱియున్= ఇంకా; కుటుంబపోషణంబునన్= కుటుంబం పోషిస్తుంటే; కుక్షింభరుండు+అగుచున్= కడుపునింపుకొంటున్నవాడై; అధర్మపరుండు+ఐ= పాడి తప్పినవాడై; భూతద్రోహంబునన్= ప్రాణులకు ద్రోహం చేయటంవల్ల; అతిపాపుండు+ఐ= మిక్కిలి పాపంచేసినవాడై; నిరయంబునన్+పొంది= నరకంపాలై; నిజధనంబు= తన సొమ్ము; కోలుపడి= పోగొట్టుకొని; మొఱ+పెట్టు= రోదించే; ఆపన్నుని= ఆపదలబాఱి పడ్డవాని; చందంబునన్= వలె; పరస్పర సంబంధంబునన్= అన్యోన్య స్త్రీ పురుష బాంధవ్యముచే; కల్పింపన్+పడిన= చేయబడిన; తామిస్ర= తామిస్రము; అంధతామిస్ర= అంధతామిస్రం; రౌరవ= రౌరవం; ఆదులు+అగు= మొదలైన; నరకంబులన్+పడి= నరకాలలో కూలి; తీవ్రంబులు+ఐన= ఘోరమైన; బహుయాతనలన్= పెక్కుబాధల్ని; అనుభవించి= రుచిచూచి; క్షీణపాపుండు+ఐ= పాపాలన్నీ కరిగినవాడై; పునః= తిరిగి; నరత్వంబునున్= మానవజన్మని; పొందున్= పొందుతాడు; అని చెప్పి= ఇట్లు తెల్పి; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= క్రింది విధంగా చెప్పినాడు.

**తా :** పాపాత్ముడు అవసానదశలో పరివారం పోషిస్తుంటే, వారిచ్చిన తిండితో పొట్ట నింపుకొంటూ, పాడిదప్పి, నరకంలో పడి అలమటిస్తాడు. నిధి కోల్పోయి ఏడ్చే దీనుని మాదిరి, దాంపత్యదోషంవల్ల కల్గిన 'తామిస్రం, అంధతామిస్రం, రౌరవం'

అనే ఘోరనరక కూపాలలో పడిపోతాడు. తర్వాత పాపసంచయం వ్యయమైపోగా మరల మానవజన్మ నెత్తుతాడు అని కపిలుడు తల్లికి పాపాత్ముని చరిత్రను ఏ కరువు పెట్టాడు. మళ్ళీ, తన ప్రవచనం ఇలా కొనసాగించాడు.

### ✣ కపిలుండు దేవహూతికిఁ బిండోత్పత్తి క్రమంబుఁ దెలుపుట ✣

**సీ. కైకొని మఱి పూర్వకర్మానుగుణమున శశ్వత్ప్రకాశకుం డీశ్వరుండు**
**ఘటకుండు గావునఁ గ్రమ్మఱ జీవుండు దేహసంబంధంబుఁ దివిరి తాల్ప**
**దొరకొని పురుష రేతోబిందు సంబంధి యై వధూగర్భంబునందుఁ జొచ్చి**
**కైకొని యొక రాత్రి గలిలంబు పంచరాత్రముల బుద్బుదమును దశమదివస**

**తే. మందుఁ గర్కంధు వంతయౌ నంతమీఁదఁ, బేశియగు నంతమీఁదటఁ బేర్చి యండ**
**కల్పమగు నొక్క నెల మస్తకమును మాస, యమళ మైనను గరచరణములుఁ బొడము. 991**

**ప్రతి :** శశ్వత్= ఎల్లప్పుడు; ప్రకాశకుండు= వెలుగొందుతున్నవాడగు; ఈశ్వరుండు= భగవంతుడు; ఘటకుండు+కావునన్= కూర్చేవాడు కాబట్టి; కైకొని= పూని; మఱి= ఇంకా; పూర్వకర్మ= గతజన్మకు సంబంధించిన; కర్మ= చేతలకు; అనుగుణమునన్= తగినట్లు; క్రమ్మఱన్= మరల; జీవుండు= ప్రాణి; దేహసంబంధంబున్= శారీరకబంధాన్ని; తివిరి= కోరి; తాల్పన్= ధరించుటకు; దొరకొని= ప్రయత్నించి; పురుష= పురుషుని; రేతస్+బిందు= బిందుమాత్రమైన ఇంద్రియానికి; సంబంధి+ఐ= సంబంధించిన రూపంగల్గి; వధూగర్భంబునందున్= స్త్రీ యోనియందు; చొచ్చి= ప్రవేశించి; ఒకరాత్రిన్= ఒక్కరేయి; కలిలంబున్= శుక్రశోణిత మిశ్రమాన్ని; కైకొని= పొంది; పంచరాత్రములన్= అయిదురాత్రులలో; బుద్బుదమును= బుడగరూపాన్ని; దశమదివసమందున్= పదవనాటికి; కర్కంధువు+అంత+ఔ= గంగరేగంతగా అవుతుంది; అంతమీఁదటన్= ఆ పైన; పేర్చి= పెరిగి; అండకల్పము+అగున్= గ్రుడ్డుతో సమానమైనదవుతుంది; ఒక్కనెలన్= నెలదినాలకు; మస్తకమును= తలయు; మాస యమళము+ఐనను= రెండు నెలలైతే (జంటనెలలయితే); కరచరణములున్= కాళ్ళు చేతులు; పొడమున్= ఏర్పడుతాయి.

**తా :** తల్లీ! ఈ పిండోత్పత్తి క్రమాన్ని కూర్చేవాడు ఆ భగవంతుడే. ఆయన శాశ్వతంగా ప్రకాశిస్తుంటాడు. నరకంలో పాపం వ్యయంకాగానే జీవుడు పురుషుడుగా శారీరక బంధాన్ని కోరి తన యింద్రియాన్ని స్త్రీగర్భంలో నిక్షేపిస్తాడు. ఆ యింద్రియం ఒక్కరాత్రి గడవగానే శుక్రశోణిత మిశ్రమంగా ఏర్పడుతుంది. అయిదురోజులకు బుడగగాను, పదవరోజుకు గంగరేగుపండంతగాను, ఆ మీదట అండం అంత మాంసపిండంగాను ఎదుగుతుంది. ఒక్కనెలకు తల, రెండు నెలలకు కాళ్ళుచేతులు ఏర్పడుతాయి.

**వ. మఱియు మాసత్రయంబున నఖ రోమాస్థి చర్మంబులు లింగచ్ఛిద్రంబులును గలిగి నాల్గవమాసంబున సప్త ధాతువులును బంచమ మాసంబున క్షుత్తృష్ణలును గలిగి, షష్ఠమాసంబున మావిచేతం బొదువంబడి తల్లికుక్షిని దక్షిణ భాగంబునం దిరుగుచు, మాతృభుక్తాన్నపానంబులవలనఁ దృప్తిం బొందుచు నేధమాన ధాతువులు గల్గి జంతుసంకీర్ణంబగు విణ్మూత్ర గర్తంబందుఁ దిరుగుచుఁ గ్రిమిభక్షిత శరీరుండై మూర్ఛలం బొందుచుఁ దల్లి భక్షించిన కటుతిక్తోష్ణ లవణ క్షారామ్లాద్యుల్బణంబులైన రసంబులచేతఁ బరితప్తాంగుం డగుచు జరాయువునఁ గప్పంబడి బహిఃప్రదేశంబునందు నాంత్రంబులచేత బద్ధుండై కుక్షియందు శిరంబు**

**మోపికొని భుగ్నంబైన పృష్ఠగ్రీవోదరుండై స్వాంగచలనంబునందు నసమర్థుం డగుచుఁ బంజరంబునందుండు శకుంతంబు చందంబున నుండి దైవకృతంబైన జ్ఞానంబునం బూర్వ జన్మ దుష్కృతంబులం దలంచుచు దీర్ఘోచ్ఛ్వాసంబు సేయుచు నే సుఖలేశంబునుం బొందక వర్తించుచు, నంత నేడవనెల యందు లబ్ధజ్ఞానుండై చేష్టలు గలిగి విట్క్రిమిసోదరుండై యొక్క దిక్కున నుండక సంచరించుచుం బ్రసూతి మారుతంబులచేత నతివేపితుం డగుచు యాచమానుండును, దేహాత్మదర్శియుఁ బునర్గర్భవాసంబునకు భీతుండు నగుచు బంధన భూతంబగు సప్తధాతువులచే బద్ధుండై కృతాంజలిపుటుండు, దీనవదనుండునై జీవుండు దా నెవ్వనిచే నుదరంబున వసియింప నియమింపంబడె నట్టి సర్వేశ్వరుని నిట్లని స్తుతియించు. 992**

**ప్రతి :** మఱియున్= ఇంకా; మాసత్రయంబునన్= మూన్నెల్లలో; నఖ= గోళ్ళు; రోమ= వెంట్రుకలు; అస్థి= ఎముకలు; చర్మంబులు= తోలు; లింగచ్ఛిద్రంబులును= స్త్రీ పురుష జననేంద్రియాలును; నాలవమాసంబునన్= నాల్గవనెలలో; సప్తధాతువులు= రసం, రక్తం, మాంసం, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రం అనే ఏడు పదార్థాలును; పంచమమాసంబునన్= అయిదవనెలలో; క్షుత్+తృష్ణలును+కలిగి= ఆకలి దప్పులు కలిగి; షష్ఠమాసంబునన్= ఆరవనెలలో; మావిచేతన్= జరాయువుచేత; పొదువన్+పడి= చుట్టబడి; తల్లికుక్షిని= తల్లి గర్భంలో; దక్షిణభాగంబునన్= దక్షిణదిశయందు; తిరుగుచున్= భ్రమిస్తూ; మాతృభుక్త= తల్లి ఆరగించినట్టి; అన్నపానంబులవలనన్= అన్నం నీళ్ళతో; తృప్తిన్+పొందుచున్= సంతోషిస్తూ; ఏధమానధాతువులు గల్గి= వర్ధిల్లుచున్న ధాతువులు కలిగి; జంతుసంకీర్ణంబు+అగు= క్రిములతో కూడిన; విట్+మూత్ర= మలమూత్రములయొక్క; గర్తంబందున్= నాళాలలో, గోతిలో; తిరుగుచున్= భ్రమిస్తూ; క్రిమి= పురుగులచే; భక్షిత= తినబడిన; శరీరుండు+ఐ= అవయవాలు గలవాడై; మూర్ఛలన్+పొందుచున్= స్పృహకోల్పోతూ; తల్లి భక్షించిన= అమ్మ ఆరగించినట్టి; కటు= కారం; తిక్త= చేదు; ఉష్ణ= వేడి; లవణ= ఉప్పు; క్షార= కటువైనది; ఆమ్ల= పులుపు; ఆది= మొదలైన; ఉల్బణంబులు+ఐన= అతిశయించిన; రసంబులచేతన్= రసాలతో; పరితప్త= వేగుచున్న; అంగుండు= అవయవాలు గలవాడు; అగుచున్= అవుతూ; జరాయువునన్= మావిచేత; కప్పంబడి= చుట్టబడి; బహిఃప్రదేశమునందున్= వెలుపల, ఆంత్రంబులచేతన్= ప్రేవులచేత; బద్ధుండు+ఐ= బంధింపబడినవాడై; కుక్షియందున్= కడుపునందు; శిరంబు= తల; మోపికొని= ఉంచి; భుగ్నంబు+ఐన= వంకరగానున్న; పృష్ఠగ్రీవ+ఉదరుండు+ఐ= వీపు, మెడ, పొట్టకలవాడై; స్వ+అంగచలనంబునందున్= తన అవయవాల కదలికలందు; అసమర్థుండు+అగుచున్= శక్తిలేనివాడై; పంజరంబునందు+ఉండుశకుంతంబు= బోనులో బంధింపబడిన పక్షి; చందంబునన్= మాదిరి; ఉండి= ఉంటూ; దైవకృతంబు+ఐన= దైవంవల్ల ఏర్పడ్డ; జ్ఞానంబునన్= తెలివితో; పూర్వజన్మ= గతజన్మలోనైనట్టి; దుష్కర్మశతంబులన్= వందలకొలది పాపాల్ని; తలంచుచున్= స్మరించుకొంటూ; దీర్ఘ+ఉచ్ఛ్వాసంబు+చేయుచున్= నిడుదయైన నిట్టూర్పు విడుస్తూ; ఏ సుఖంబును= ఎలాంటి సుఖాన్ని; పొందక, వర్తించుచున్= ఉంటూ; అంతన్= తర్వాత; ఏడవనెలయందు= ఏడోనెలలో; లబ్ధజ్ఞానుండు+ఐ= పొందబడిన తెలివిగలవాడై; చేష్టలు+కలిగి= కదలికలు కలిగి; విట్+క్రిమి= మలక్రిములకు; సోదరుండు+ఐ= సహజాతుడై; ఒకదిక్కునన్= ఒకవైపున; ఉండక= నిలువలేక; సంచరించుచున్= తిరుగుతూ; ప్రసూతి మారుతంబులచేతన్= ప్రసవ సంబంధివాయువులచేత; అతివేపితుండు+అగుచున్= మిక్కిలి కంపింపబడినవాడై; యాచమానుండును= ప్రార్థించువాడును; దేహ+ఆత్మదర్శియున్= దేహము నాత్మగా చూచువాడు; పునః= తిరిగి; గర్భవాసంబునకున్= తల్లి కడుపులో పడుటకు (పునర్జన్మకు); భీతుండును+అగుచున్= భయపడ్డవాడవుతూ; బంధన భూతంబు+అగు= చెరతో సమానమైన; సప్తధాతువులచేన్= ఏడు

ధాతువులతో; బద్ధుండు+ఐ= కప్పబడినవాడై; కృత+అంజలి పుటుండును= జోడించిన దోయిలికలవాడును; దీనవదనుండును+ఐ= దైన్యముతో కూడిన మోముగలవాడయి; జీవుండు= ప్రాణి; తాన్= తాను; ఎవ్వనిచేన్= ఏ ఘటకునిచే; ఉదరంబునన్= కడుపునందు; వసియింపన్= ఉండుటకు; నియమింపన్+పడెన్= కట్టడిచేయబడెనో; అట్టి= అలాంటి; సర్వ+ఈశ్వరున్= అంతటికి ప్రభువైన భగవంతుణ్ణి; ఇట్లు+అని= ఈ విధంగా; స్తుతియించున్= ప్రార్థిస్తాడు.

**తా :** ఆ గర్భపిండంలో మూడునెలలకు వెంట్రుకలు, ఎముకలు, చర్మం, లింగమార్గం, ఏర్పడుతాయి. నాల్గవనెలలో రసం, నెత్తురు, కండలు, మెదడు, ఎముకలు, మూలగ, ఇంద్రియం అనే ఏడు పదార్థాలు ఉత్పన్నమవుతాయి. అయిదవనెలలో ఆకలిదప్పులు, ఆరవనెలలో మావి ఆవేశిస్తాయి. అప్పుడా పిండం తల్లి కడుపులో దక్షిణభాగాన తిరుగుతూ ఉంటుంది. పురుగులతో కూడిన పురీషనాళంలోనూ, మూత్రనాళంలోను సంచరిస్తుంది. మూర్ఛలో మునుగుతుంది. నాళాలలో సంచరించేటప్పుడు క్రిములు కొరుకుతుంటాయి. తల్లి తిన్న ఆహారం కారం, చేదు, వేడి, ఉప్పు, పులుపు మొదలైన రసాదులతో వేగిపోతూ వుంటుంది. మావి సర్వాంగాల్ని, ప్రేవుల్ని చుట్టుకొని వుంటుంది. ఆ పిండం కడుపులో తలదించుకొని, వంకరగా వున్న పృష్ఠభాగం, మెడకల్గి, అవయవాల్ని కదల్చలేక పంజరంలో బంధింపబడిన చిలుక మాదిరి కర్తవ్యం తోచక వుంటుంది. భగవద్దత్తమైన బుద్ధితో గతజన్మలో తాను చేసిన దుష్కర్మల్ని స్మృతికి తెచ్చుకుంటూ నిట్టూర్పులు నిగిడిస్తుంటుంది.

తర్వాత ఏడవనెలలో జ్ఞానం వికసించి, నడయాడుతూ, మలద్వారంలోని క్రిమిసాంగత్యం కల్గి, ఒకేచోట స్థిరంగా వుండలేక, సంచారం చేస్తూ వుంటుంది. తర్వాత గర్భవాయువులచే కంపన గల్గి, దేహమందలి ఆత్మను స్మరిస్తూ, పునర్జన్మకు భయపడుతూ, సప్తధాతువులచే నిర్బంధింపబడి దైవప్రార్థనలో నిమగ్నమవుతాడు జీవుడు.

ఇక చిట్టచివర చేతులు జోడించి తన గర్భవాసానికి కారకుడైన పరమాత్మని ఇలా స్తుతిస్తాడు.

**సప్తధాతువులు :** చర్మము, మాంసము, రక్తము, మజ్జ, అస్థి, వస, శుక్లము.

## ✤ గర్భస్థుం డగు జీవుండు భగవంతుని స్తుతించుట ✤

**క. అనయమును భువనరక్షణ, మునకై స్వేచ్ఛానురూపమునఁ బుట్టెడి వి**
**ష్ణుని భయవిరహిత మగు పద, వనజయుగం బర్థిఁ గొల్తు వారని భక్తిన్. 993**

**ప్రతి :** అనయమును= ఎల్లప్పుడును; భువనరక్షణమునకై= లోకాల్ని రక్షించుటకై; స్వేచ్ఛా+అనురూపమునన్= తన యిష్టమునకు తగినట్లు; పుట్టెడి= అవతరించే, విష్ణుని= శ్రీహరియొక్క; భయవిరహితము+అగు= భీతిలేనిదైన; పదవనజ యుగంబు= పాదపద్మాల జంటను; అర్థిన్= కోర్కెతో; వారని భక్తిన్= ఎడతెగని భక్తిభావంతో; కొల్తున్= స్మరిస్తాను.

**తా :** స్వయంగా లోకరక్షణకై తన ఇచ్ఛమేరకు అవతరిస్తున్న ఆ శ్రీహరి భయరహిత పాదపద్మాల్ని నిరంతరం స్థిరమైన భక్తితో కోరి భజిస్తాను.

**విశే :** భయవిరహితము – భక్తులకు అభయాన్ని ప్రసాదించే అనే అర్థాన్ని గ్రహించాలి.

**వ. అదియునుంగాక పంచభూత విరహితుం డయ్యుం బంచభూత విరచితంబైన శరీరంబునందుఁ గప్పంబడి యింద్రియ గుణార్థ చిదాభాస జ్ఞానుండనైన నేను. 994**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేగాదు; పంచభూత= పృథివ్యాదులైన అయిదు భూతాలచే; విరహితుండు+అయ్యున్= శూన్యుడనై కూడ; పంచభూత= అవే అయిదు భూతాలచే; విరచితంబు+ఐన= నిర్మింపబడినట్టి; శరీరంబునందున్= దేహంలో; కప్పన్+పడి= ఉంచబడి; ఇంద్రియగుణ= దశేంద్రియాలు, త్రిగుణాలతోడను; అర్థ= ప్రయోజనకరమైన; చిత్+ఆభాసజ్ఞానుండను= ఆత్మరూపజ్ఞానముతోడ కూడినవాడను; ఐననేను= ఐనట్టినేను.

**తా :** అంతేగాదు. నేను పృథివ్యాది పంచభూతాలకు అతీతుడను. ఆయనా పంచభూతాలతో నిర్మింపబడినదియు, దశేంద్రియాలతో ఒప్పుచున్నదియునైన భౌతికశరీరంచే చుట్టబడి భాసిస్తున్నాను. అట్టినేను

**సీ.** **ఎవ్వఁడు నిఖిల భూతేంద్రియ మయ మగు మాయావలంబన మహిత కర్మ**
**బద్ధుఁడై వర్తించు పగిది దందహ్యమానంబగు జీవచిత్తంబునందు**
**నవికారమై శుద్ధమై యఖండ జ్ఞానమున నుండు వానికి ముఖ్యచరితు**
**నకు నకుంఠిత శౌర్యునకుఁ బరంజ్యోతికి సర్వజ్ఞునకుఁ గృపాశాంతమతికిఁ**

**తే.** **గడఁగియుఁ బ్రకృతి పురుషులకంటెఁ బరముఁ, డైనవానికి మ్రొక్కెద నస్మదీయ**
**దుర్భరోదగ్ర భీకర గర్భనరక, వేదనలఁ జూచి శాంతిఁ గావించుకొఱకు.** **995**

**ప్రతి :** ఎవ్వఁడు= ఏ పరమాత్మ; నిఖిల= సమస్తమైన; భూత= పృథివ్యాది భూతాలు; ఇంద్రియ= పంచజ్ఞానేంద్రియ పంచకర్మేంద్రియాల; మయము+అగు= రూపంగా కల్గిన; మాయా+అవలంబన= మాయ ఆశ్రయంగాకల; మహితకర్మ= పేర్కొనదగ్గ కర్మలచే; బద్ధుఁడు+ఐ= బంధింపబడినవాడై; వర్తించుపగిదిన్= నడుచుకునేటట్లు; దందహ్యమానంబు+అగు= మిక్కిలి కాల్చబడుతున్న; జీవచిత్తంబునందున్= ప్రాణిమనస్సులో; అవికారము+ఐ= ఏ వికారం లేనిదై; శుద్ధము+ఐ= స్వచ్ఛమైనదై; అఖండ జ్ఞానమునన్= మొక్కవోని ఆత్మజ్ఞాన రూపంగా; ఉండున్= ఉంటాడో; వానికిన్= ఆ పరమాత్మకు; ముఖ్యచరితునకున్= గొప్పనడవడి గల్గినవాడును; అకుంఠిత= మొక్కవోని; శౌర్యునకున్= పరాక్రమం గలవాడును; పరంజ్యోతికిన్= శ్రేష్ఠమైన జ్యోతిస్స్వరూపుడును; సర్వజ్ఞునకున్= అంతయు నెరిగినవాడును; కృపాశాంతమతికిన్= దయచే, శాంతమైన బుద్ధిగలవాడును; కడఁగియున్= పూని; ప్రకృతి పురుషులకంటెన్= ఈ జంటకంటె; పరముఁడు+ఐనవానికిన్= అతీతుడైనవాడును అగు; అస్మదీయ= నాదైన; దుర్భర= భరింపరాని; ఉత్+అగ్ర= మిక్కిలి దారుణమైన; భీకర= భయంకరమైన; గర్భ= గర్భసంబంధియైన; నరకవేదనలన్= యమయాతనలను; చూచి= తిలకించి; శాంతిన్= ప్రశాంతతను; కావించు కొఱకున్= చేయడానికి; మ్రొక్కెదన్= నమస్కరిస్తాను.

**తా :** పాంచభౌతికం, దశేంద్రియమయమైన కర్మలతో కూడినది శరీరం. అందులో మాయామయమైన కర్మవాసనలతో వేగిపోతున్నది మనస్సు. ఇలాంటి పాంచభౌతిక దేహిచిత్తంలో స్వచ్ఛంగా ఆత్మతేజస్సుతో వెలుగుతున్నవాడు, పరమాత్మ. ఆయన చరిత్ర కొనియాడదగింది. ఆయనకు తెలియని దేదీ లేదు. ఆయన పరాక్రమం తిరుగులేనిది. దయా శాంత గుణాలకు ఆయన నెలవు. ఆ స్వామి ప్రకృతి పురుషులకంటె భిన్నమైనవాడు. పరంజ్యోతి స్వరూపుడు. నా యీ నరకతుల్యమైన గర్భబాధలనుండి విముక్తి పొందటానికి నేను ఆయనకు నమస్కరిస్తున్నాను – (జీవుని ఆవేదనతో నిండిన స్తోత్రమిది.)

**సీ.** **అనవుడు సుతునకు జనని యిట్లనుఁ దగ మహితాత్మ! యెవ్వని మాయచేత**
**ఘనమోహులై గుణకర్మ నిమిత్త సాంసారిక మార్గ సంచారములను**

**ధృతి సెడి యలసి యే దిక్కు నెఱుంగక హరి పదధ్యానంబు నాత్మ మఱచి**
**యుండు వారలకు నే యుక్తియు నమ్మహాపురుషు ననుగ్రహ బుద్ధి లేక**

**తే. తద్గుణ ధ్యాన తన్మూర్తి దర్శనములు, గోచరించుట యెట్లు? నాకును బ్రబోధ**
**కలితముగఁ బల్కు మనవుడుఁ గపిలుఁ డనియె, నంబతోడను సుగణకదంబతోడ. 996**

**ప్రతి :** అనవుడు= అని కపిలుడు చెప్పగా; సుతునకున్= కుమారునితో; జనని= దేవహూతి; తగన్= తగినవిధంగా; ఇట్లు+అనున్= ఇలా అన్నది; మహిత+ఆత్మా!= గొప్ప హృదయం గలవాడా!; ఎవ్వని= ఏ పరంధామునియొక్క; మాయచేతన్= మాయచే; ఘనమోహులు+ఐ= గొప్పమోహానికి లోనైనవారై; గుణ= త్రిగుణాలయొక్కయు; కర్మ= చేతలయొక్కయు; నిమిత్త= కారణంచేనైనట్టి; సాంసారిక= సంసార సంబంధమైన; మార్గ= దారిలో; సంచారములనున్= తిరుగుళ్ళతో; ధృతి+చెడి= ధైర్యం కోల్పోయి; అలసి= బడలిక చెంది; ఏ దిక్కును= ఏ దిశకూడ; ఎఱుంగక= తెలియక (దిక్కుతోచక); హరిపదధ్యానంబు= శ్రీ మహావిష్ణుపాదస్మరణం; ఆత్మన్= హృదయంలో; మఱచి= మరచిపోయి; ఉండువారలకున్= జీవిస్తున్న వారికి; ఏ యుక్తియున్= ఏ ఉపాయంకూడ; ఆ+మహాపురుషున్= ఆ దివ్యమూర్తియైనహరియొక్క; అనుగ్రహబుద్ధి= ప్రసాద భావన; లేక= లేకుండ; తద్+గుణ= ఆయన గుణాల్ని; ధ్యాన= స్మరించుట; తద్= ఆ స్వామియొక్క; దర్శనములు= సాక్షాత్కారాలు; గోచరించుట+ఎట్లు?= ఎలాగా?; నాకును= నాకు; ప్రబోధకలితము+కన్= బోధనాపూర్వకంగా; పల్కుము= సెలవిమ్ము; అనవుడున్= అని తల్లి అడుగగా; కపిలుఁడు= కపిలమహర్షి; సుగుణకదంబతోడన్= సద్గుణరాశియైన; అంబతోడను= తల్లితో; అనియెన్= ఇట్లన్నాడు.

**తా :** దేవహూతి కపిలుని అడిగింది– 'మహాత్మా! ఆ సర్వేశ్వరుని మాయకు లోనై, గుణకర్మల జంజాటంతో కూడిన సంసారంలో పడి ధైర్యం కోల్పోయినవారికి, దిక్కు తోచనివారికి, విష్ణుపాదస్మరణ మరచినవారికి ఆ స్వామిఅనుగ్రహం లేకపోతే, ఆయన్ని స్మరించటంగాని, ఆయన సందర్శనంగాని ఎలా చేకూరుతాయి? నాకు వివరంగా తెల్పు" అని అందుకు కపిలుడు మళ్ళీ ఆమెతో ఇలా చెప్పాడు.

**వ. అట్టి యీశ్వరుండు కాలత్రయంబునందును జంగమస్థావరాంతర్యామి యగుటం జేసి జీవ కర్మమార్గంబులం బ్రవర్తించువారు తాపత్రయ నివారణంబుకొఱకు భజియింతురని చెప్పి మఱియు నిట్లనియె. 997**

**ప్రతి :** అట్టి ఈశ్వరుండు= ఆ పరమేశ్వరుడు; కాలత్రయంబునందును= భూతభవిష్యద్వర్తమానాలనే మూడుకాలాలలో కూడ; జంగమ= సంచరించే జీవులు; స్థావర= సంచరించక స్థిరంగా వుండే వృక్షాదులందు; అంతర్యామి= లోపలనున్నవాడు; అగుటన్+చేసి= అయినందువల్ల; జీవకర్మమార్గంబులన్= ప్రాణుల కర్మమార్గంలో; ప్రవర్తించు మానవులు; తాపత్రయ= ఆధిభౌతిక; ఆధ్యాత్మిక, ఆధిదైవికములనే మూడు తాపములయొక్క; నివారణంబు కొఱకున్= పోగొట్టుకోవటానికి; భజియింతురు= కొలుస్తారు; అని, మఱియున్= మరల; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఆ సర్వేశ్వరుడు మూడు కాలాలలో మానవులు, పశుపక్ష్యాదులతోకూడిన ప్రాణికోటియందు, ప్రాణంలేని పర్వతాది స్థావరాలలోను ఉన్నాడు. కర్మమార్గంలో ఉన్న ప్రాణులు ఆధిభౌతికం, ఆధ్యాత్మికం, ఆధిదైవికం అనే తాపత్రయాలనుండి విముక్తి కోరి ఆ భగవంతుని సేవిస్తారు.

**విశే : తాపత్రయం :** మూడు తాపాలు.

**1. ఆధిభౌతిక తాపం :** పాములు, తేళ్ళు మొదలగు ఇతర ప్రాణులచే గల్గు బాధలు.

**2. ఆధ్యాత్మిక తాపం :** తన దేహేంద్రియాలకు కలిగే వ్యాధులచే కల్గుతాపం.

**3. ఆధిదైవిక తాపం :** లోకానికి దైవికంగా సంభవించే అతివృష్టి, అనావృష్టివల్ల భూకంపం ఇత్యాదులచే గల్గు తాపం.

**క. జనయిత్రి! గర్భమందును, ఘన క్రిమివిణ్మూత్ర రక్త గర్తములోనన్**
**మునుఁగుచు జఠరాగ్నిని దిన, దినమును సంతప్యమానదేహుం డగుచున్. 998**

**ప్రతి :** జనయిత్రి= అమ్మా!; గర్భమందును= కడుపులో; ఘన= గొప్ప; క్రిమి= పురుగులతోడి; విట్= మలం; మూత్ర= మూత్రం; రక్త= నెత్తురు కల్గిన; గర్తములోనన్= గోతిలో; మునుఁగుచున్= మునకలు వేస్తూ; జఠర+అగ్నినిన్= కడుపుమంటచే; దినదినమును= ప్రతిదినం; సంతప్యమాన= మిక్కిలి కాల్చబడుచున్న; దేహుండు+అగుచున్= శరీరం కలవాడై;

**తా :** తల్లీ! ఆ ప్రాణి పురుగులు, మలమూత్రాలు, నెత్తురుతో కూడిన గర్భపుసంచిలో మునిగి తేలుతుంటాడు. అంతేగాక జఠరాగ్నితో తపిస్తుంటాడు.

**ఆ. దీనవదనుఁ డగుచు దేహి యీ దేహంబు, వలన నిర్గమింపఁ దలఁచి చనిన**
**నెలల నెన్నుకొనుచు నెలకొని గర్భంబు, వలన వెడలఁ ద్రోయువారు గలరె? 999**

**ప్రతి :** దేహి= శరీరధారియగు జీవుడు; దీనవదనుఁడు+అగుచున్= జాలిపుట్టించే మోముగలవాడగుచు; ఈ దేహంబువలనన్= ఈ శరీరంనుండి; నిర్గమింపన్= బయటపడాలని; తలఁచి= భావించి; చనిన నెలలన్= గడచిన మాసాల్ని; ఎన్నుకొనుచున్= లెక్కపెట్టుకొంటూ; నెలకొని= నిలుకడగా; గర్భంబువలనన్= కడుపునుండి; వెడలన్= బయటపడేట్లు; త్రోయువారు+కలరె= నెట్టగలవారున్నారా? (జీవుని ప్రశ్న)...

**తా :** గర్భస్థజీవుడు దీనుడై గర్భగుహ నుండి బయలు పడాలని, నెలలు లెక్కపెట్టుకొంటాడు. తల్లి కడుపునుండి బయటికి తన్ను త్రోసేవారెవరైనా ఉన్నారా? అని చింతిస్తాడు.

**వ. అని తలంచుచు దీనరక్షకుండయిన పుండరీకాక్షుండు దన్ను గర్భనరకంబువలన విముక్తునిం జేయ నమ్మహాత్మునికిఁ బ్రత్యుపకారంబు సేయలేమికి నంజలి మాత్రంబు సేయందగు నట్టి జీవుండ నైన నేను శమదమాది యుక్తంబైన శరీరంబునందు విజ్ఞాన దీపాంకురంబునం బురాణపురుషు నిరీక్షింతునని మఱియు నిట్లనియె. 1000**

**ప్రతి :** అని, తలంచుచున్= ఆలోచిస్తూ; దీనరక్షకుండు+అయిన= దీనుల్ని కాపాడేవాడైన; పుండరీక+అక్షుండు= పద్మంవంటి కన్నులుగలవాడైనశ్రీహరి; తన్నున్= తనను (దీనుణ్ణి); గర్భనరకంబువలనన్= నరకతుల్యమైన కడుపునుండి; విముక్తునిన్+ చేయన్= బయటపడేవాణ్ణిగా చేయగా; ఆ+మహా+ఆత్మునికిన్= ఆ మహానుభావునికి; ప్రతి+ఉపకారంబు= బదులుగా మేలు; చేయలేమికిన్= చేయజాలనందుకు; అంజలిమాత్రంబు= దోసిలొగ్గి నమస్కరించుట మాత్రమే; చేయన్+తగు+అట్టి=

చేయజాలినట్టి; జీవుండన్+ఐననేను= ప్రాణినైనట్టినేను; శమ= అంతరింద్రియ నిగ్రహం; దమ= బహిరింద్రియ సంబంధియునైన శాంతము; ఆది= మొదలైన గుణాలచే; యుక్తంబు+ఐన= కూడినట్టి; శరీరంబునందున్= బొందియందు; విజ్ఞాన= అనుభవజ్ఞానమనే; దీప+అంకురంబునన్= దీపకళికచేత; పురాణపురుషున్= ఆదిదేవుణ్ణి; నిరీక్షింతున్= ప్రతీక్షిస్తాను; అని; మఱియున్= మరల; ఇట్లు+అనియెన్= ఇట్లన్నాడు.

**తా :** భగవంతుడు దీనజనులను రక్షించేవాడు. నరకతుల్యమైన గర్భంనుండి నన్ను వెలికితీస్తే, అందుకు ప్రతిఫలంగా నేను ఆయనకు చేయగల మేలేమీ లేదు. చేతులు జోడించి ఆయనకు నమస్కరిస్తున్నాను. అంతరింద్రియ నిగ్రహం, బాహ్యేంద్రియ నిగ్రహం (శమం, దమం) గల ఈ దేహమందు వెల్గుతున్న విజ్ఞానదీప ప్రకాశంతో ఆ స్వామికై ఎదురుచూస్తుంటాను అని చెప్పి కపిలుడు మళ్ళీ ఇలా అన్నాడు.

**సీ. నెలకొని బహుదుఃఖములకు నాలయమైన యీ గర్భనరకము నేను వెడలఁ**
**జాల బహిః ప్రదేశమునకు వచ్చిన ననుపమ దేవమాయా విమోహి**
**తాత్ముండనై ఘోరమైనట్టి సంసార చక్రమందును బరిభ్రమణ శీలి**
**నై యుండ వలయుఁ దా, నది గాక గర్భంబు నందుండు శోకంబు నపనయించి.**

**తే. యాత్మ కనయంబు సారథియైన యట్టి, రుచిర విజ్ఞానమునఁ దమోరూపమైన**
**భూరి సంసార సాగరోత్తారణంబు, సేసి యీ యాత్మ నరసి రక్షించుకొందు. 1001**

**ప్రతి :** నెలకొని= నిలుకడగల్గి; బహుదుఃఖములకున్= పెక్కు శోకాలకు; ఆలయము+ఐన= నివాసమైనట్టి; ఈ గర్భనరకమున్= నరకతుల్యమైన ఈ గర్భాన్ని; ఏను= నేను; వెడలన్+చాలన్= నిర్గమించలేకున్నాను; బహిఃప్రదేశమునకున్= బయటిలోకానికి; వచ్చినన్= వస్తే; అనుపమ= సాటిలేని; దేవమాయా= భగవంతుని మాయచేత; విమోహిత= మిక్కిలి మైమరచిన; ఆత్ముండన్+ఐ= మనస్సుగలవాడినయి; ఘోరము+ఐన+అట్టి= భయంకరమైనట్టి; సంసారచక్రమందును= సంసారమనే చక్రంలో; పరిభ్రమణశీలిని+ఐ= తిరుగుతున్నవాడనై; తాన్= తాను; ఉండవలయున్= ఉండక తప్పదు; అది+కాక= ఆ చక్రంలో తిరగటమే కాదు; గర్భంబునందున్+ఉండుశోకంబున్= గర్భంలో పొందిన దుఃఖం; అపనయించి= పోగొట్టి; ఆత్మకున్= మనస్సుకు; అనయంబు= నిరంతరం; సారథి+ఐన+అట్టి= నడిపే సారథియైన; రుచిర విజ్ఞానమునన్= ప్రకాశించే అనుభవజ్ఞానంచేత; తమస్+రూపము+ఐన= చీకటిని బోలిన; భూరి= గొప్ప; సంసార సాగర= సంసారమనే కడలిని; ఉత్+తారణంబు= దాటుట; చేసి= కావించి; ఈ+ఆత్మన్= ఈ ప్రత్యగాత్మను; అరసి= తెలిసి; రక్షించుకొందున్= కాపాడుకొంటాను.

**తా :** తల్లి గర్భవాసం నరక తుల్యమైంది. దీనినుండి నేను బయటపడ జాలకున్నాను. ఒకవేళ బయపడినా, భగవన్మాయకు లోనై మనస్సు కుదుటలేక సంసారచక్రంలో పడి త్రిప్పులుపడుట తప్పదు. ఇకపై, ఈ గర్భశోకంనుండి బయటపడి, విజ్ఞానంతో సంసారబంధాలనుండి విముక్తుణ్ణై, ప్రత్యగాత్మను గ్రహించి నన్ను నేను నిరీక్షిస్తూ కాపాడుకొంటాను.

**వ. మఱియును. 1002**

**ప్రతి :** మఱియును= పైన చెప్పిందేకాదు; ఇంకా...

**చ. పరఁగుచు నున్న దుర్వ్యసనభాజనమై ఘనదుఃఖమూలమై**
**యరయఁగఁ బెక్కు తూట్లు గలదై క్రిమిసంభవ మైనయట్టి దు**
**స్తర బహుగర్భవాసముల సంగతి మాన్పుటకై భజించెదన్**
**సరసిజనాభ భూరి భవ సాగర తారక పాదపద్మముల్. 1003**

**ప్రతి :** సరసిజనాభ= కమలం బొడ్డునందుగల స్వామియొక్క!; భూరి= గొప్ప; భవసాగర= సంసారసాగరమును; తారక= తరింపజేయగల్గిన; పాదపద్మముల్= అడుగుతామరలను (భగవంతునిపాదాలను); పరఁగుచున్+ఉన్న= ఒప్పుతున్న; దుర్+వ్యసన= చెడ్డ అలవాట్లకు; భాజనము+ఐ= నెలవై; ఘన= గొప్ప; దుఃఖమూలము+ఐ= సంకటాలకు నిలయమై; అరయన్+కన్= ఆలోచించగా; పెక్కు తూట్లు= చాలా రంధ్రాలు; కలది+ఐ= కల్గినట్టిదై; క్రిమిసంభవము+ఐన+అట్టి= పురుగుల నుత్పత్తిచేయగల్గినట్టి; దుస్తర= తరింపశక్యంకాని; బహుగర్భ= పెక్కుగర్భాల; వాసముల= నివాసాల (పునర్జన్మల); సంగతిన్= సాంగత్యాన్ని; మాన్పుటకై= పాపుటకై; భజించెదన్= కొలిచెదను

**తా :** గర్భవాసం చెడ్డవ్యసనాలకు స్థావరమైంది. సంకటాన్ని కల్గిస్తుంది. దానికి అన్నీ రంధ్రాలే. క్రిముల్ని ఉత్పత్తి చేస్తుంది. ఇలాంటి గర్భవాసాల్లో మళ్ళీ మళ్ళీ పడకుండా (పునర్జన్మలేకుండ) ఉండాలని, సంసారసముద్రాన్ని తరించడానికి అనువైన కమలనాధుని పాదపద్మాల్ని కొలుస్తూ ఉంటాను.

**క. అని కృతనిశ్చయుఁ డయి యే, చిన విమలజ్ఞాని యగుచు జీవుఁడు గర్భం**
**బున వెడల నొల్లకుండం, జనియెడు నవమాసములును జననీ! యంతన్. 1004**

**ప్రతి :** జననీ!= ఓ తల్లీ!; అని= అంటూ; జీవుఁడు= ప్రాణి; కృతనిశ్చయుఁడు+అయి= దృఢమైన అభిప్రాయం కలవాడై; ఏచిన= అతిశయించినట్టి; విమలజ్ఞాని+అగుచున్= స్వచ్ఛమైన తెలివిగలవాడవుతూ; గర్భంబునన్= కడుపునుండి; వెడలన్= బయటపడడానికి; ఒల్లక+ఉండన్= కోరకముందే; నవమాసములు= తొమ్మిదినెలలు; చనియెడున్= గడిచిపోతాయి.

**తా :** అమ్మా! పైన చెప్పినట్లు జీవునికి కొన్ని దృఢమైన నిర్ణయాలు ఉంటాయి. తాను తల్లిగర్భంనుండి బయటపడటానికి తటపటాయిస్తుండగానే అలా తొమ్మిదినెలలు దాటిపోతాయి.

**వ. దశమ మాసంబున వాని నధోముఖుం గావించిన నుచ్ఛ్వాస నిశ్శ్వాసంబులు లేక ఘనదుఃఖభాజనుండు విగతజ్ఞానుండు రక్తదిగ్ధాంగుండునై విష్ఠాస్థ క్రిమియుంబోలె నేలంబడి యేడ్చుచు జ్ఞానహీనుండై జడుఁ డునుం బోలె నుండి యంత నిజభావనానభిజ్ఞులగు నితరులవలన వృద్ధిం బొందుచు నభిమతార్థంబులం జెప్ప నేరక యనేక కీటసంకులం బయిన పర్యంకంబునందు శయానుండై యవయవంబులు గండూయమానంబు లైన గోఁకనేరక యాసనోత్థాన గమనంబుల నశక్తుండై తన శరీరచర్మంబు మశక మత్కుణ మక్షికాదులు వొడువఁ గ్రిములచే వ్యథంబడు క్రిమియుంబోలె దోదూయమానుండై రోదనంబు సేయుచు విగతజ్ఞానుండై మెలంగుచు శైశవంబునం దత్తత్క్రియానుభవంబు గావించి పౌగండవయస్సునఁ దదనురూపంబులగు నధ్యయనాది దుఃఖంబు లనుభవించి తదనంతరంబ యౌవనంబు ప్రాప్తంబైన నభిమతార్థ ఫలప్రాప్తికి సాహసపూర్వంబు లగు వృథాగ్రహంబులు సేయుచు పంచమహాభూతార్థంబగు దేహంబందుఁ**

**బెక్కుమాఱు లహంకార మమకారంబులం జేయుచుఁ దదర్థంబులైన కర్మంబు లాచరించుచు సంసారబద్ధుం డగుచు దుష్పురుష సంగమంబున శిశ్నోదర పరాయణుండై వర్తించుచు నజ్ఞానంబునం జేసి వర్ధిష్యమాణరోషుఁ డగుచుఁ దత్ఫలంబులగు దుఃఖంబు లనుభవించుచుఁ గాముకుండై నిజనాశంబునకు హేతువులగు కర్మంబులం బ్రవర్తించుచుండు మఱియును. 1005**

**అవ :** జన్మనెత్తిన తర్వాత ప్రాణిపడే అవస్థను ఇక్కడ వర్ణిస్తున్నాడు కవి.

**ప్రతి :** దశమమాసంబునన్= పదవనెలలో; వానిన్= ఆ జీవుణ్ణి; అధస్+ముఖున్= తలక్రిందులుగా ఉండువానినిగా; కావించినన్= చేయగా; ఉచ్ఛ్వాస నిశ్శ్వాసంబులు= ఊర్పులు లేక; ఘన= గొప్ప; దుఃఖభాజనుండును= దుఃఖాలకు పాత్రుడును; విగతజ్ఞానుండును= తెలివిలేనివాడును; రక్తదిగ్ధాంగుండున్+ఐ= నెత్తుటిలో తడిసిన శరీరంకలవాడై; విష్ఠాస్థ= మలంలోనున్న; క్రిమియున్+పోలెన్= పురుగువలె; నేలన్+పడి= భూమిపై పడి; ఏడ్చుచు= రోదిస్తూ; జ్ఞానహీనుండు+ఐ= తెలివిలేనివాడై; జడుఁడునున్+పోలెన్= మందునివలె; ఉండి= ఉంటూ; అంతన్= అటు తర్వాత; నిజభావన+అనభిజ్ఞులు+ అగు= తన భావనను తెలియనివారగు; ఇతరులవలనన్= పరులవల్ల; వృద్ధిన్+పొందుచున్= పెరుగుతూ; అభిమత+ అర్థంబులన్= తన కోర్కెలకు అనువైనవాటిని; చెప్పన్+నేరక= తెలియచేయలేక; అనేక= పెక్కు; కీటసంకులంబు+ఐన= క్రిములు వ్యాపించిన; పర్యంకంబునందున్= పడకయందు; శయానుండు+ఐ= పడుకొన్నవాడై; అవయవంబులు= అంగాలు; కండూయమానంబులు+ఐనన్= దురదగలవైతే; గోఁకన్+నేరక= గీరుకోజాలక; ఆసన= కూర్చొనుట; ఉత్థాన= లేచుట; గమనంబులన్= నడచుటలందు; అశక్తుండు+ఐ= సత్తువలేనివాడై; తన, శరీరచర్మంబు= దేహానికి చెందిన తోలు; మశక= దోమలు; మత్కుణ= నల్లులు; మక్షికా+ఆదులు= ఈగలు మొదలైనవి; పొడువన్= కరుస్తుండగా; క్రిములచేన్= పురుగులచే; వ్యథన్+పడు= వెతచెందే; క్రిమియున్+పోలి= పురుగుమాదిరి; దోదూయమానుండు+ఐ= పీడింపబడినవాడై; రోదనంబు+చేయుచున్= ఏడుస్తూ; విగతజ్ఞానుండు+ఐ= తెలివిలేనివాడై; మెలంగుచున్= ఉంటూ; శైశవంబునన్= బాల్యంలో; తద్+తద్= ఆయా; క్రియా+అనుభవంబు= చేష్టలసాంగత్యాన్ని; కావించి= చేసి; పౌగండ వయస్సునన్= పదేండ్ల ప్రాయమందే, బాల్యమందే; తద్+అనురూపంబులు+అగు= వాటికి తగినట్టి; అధ్యయన+ఆది= చదువుకొనే సమయం మున్నగు; దుః ఖంబులు= బాధలు; అనుభవించి= కుడిచి; తద్+అనంతరంబు= ఆ తర్వాత; యౌవనంబు= కోడెప్రాయం; ప్రాప్తంబు+ఐనన్= ప్రాప్తించగా; అభిమత= తనకు నచ్చిన; అర్థ= ప్రయోజనకరమైన; ఫలప్రాప్తికిన్= ఫలితాన్ని పొందడానికి; సాహసపూర్వంబులు+అగు= తొందరపాటుతో కూడినవైన; వృథా+ఆగ్రహంబులు= పనికిమాలిన పట్టుదలలు; చేయుచున్= వహిస్తూ; పంచమహాభూత+అర్థంబు+అగున్= పంచభూతమయమైన; దేహంబు+అందున్= శరీరంలో; పెక్కుమాఱులు= పలుమారులు; అహంకారమమకారంబులన్+చేయుచున్= నేను, నాది అన్న భావాన్ని కల్గి వుంటూ; తద్+అర్థంబులు+ఐన= వాటికి ఉద్దిష్టమైన; కర్మంబులు= పనులు; ఆచరింపుచున్= చేస్తూ; సంసారబద్ధుండు+అగుచున్= సంసారంలో తగుల్కొన్నవాడవుతూ; దుస్+పురుష= చెడ్డవారితోడి; సంగమంబునన్= కలయికతో; శిశ్న+ఉదర= జననేంద్రియానికి, పొట్టకు; పరాయణుండు+ఐ= వశుడై (రత్యాసక్తి, ఉదరపోషణలు); వర్తింపుచున్= మెలగుతూ; అజ్ఞానంబునన్+చేసి= తెలివిలేమివల్ల; వర్ధిష్యమాణ= పెరుగుతున్న; రోషుండు+అగుచున్= కోపంగలవాడై; తద్+ఫలంబులు+అగు= అందుకు ఫలాలైన; దుఃఖంబులు= కష్టాలు, రోదనలు; అనుభవించుచున్= అనుభవిస్తూ; కాముకుండు+ఐ= వ్యభిచారియై; నిజనాశంబునకున్= తన వినాశానికి; హేతువులు+అగు= కారణాలైన; కర్మంబులన్= పనులచే; ప్రవర్తించుచున్+ఉండున్= మెలగుతూ ఉంటాడు); మఱియును= ఇంకా...

**తా :** ఆ జీవుడు పదవనెల రాగానే గర్భంనుండి వెలికి వస్తాడు. ఊర్పులు ఉడిగి, పెను దుఃఖంతో కూడి, జ్ఞానశూన్యుడై నెత్తురు ముద్దగా నేలపై పడతాడు. పరివారం అతణ్ణి పోషిస్తుంది. తనకేది కావాలో చెప్పలేని అశక్తుడై మంచంపై ఆయాసంతో ఇటునటు దొర్లుతూ వుంటాడు. దోమలు, నల్లులు, ఈగలు అతని దేహంపై మూగి కుడుతుంటాయి. పురుగులవల్ల బాధపడే పెద్ద పురుగులా వుంటాడు. అవి కుడుతూ ఉంటే దిక్కుదోచక ఏడుస్తూ, వుంటాడు. బాల్యావస్థ గడచి యౌవనంలో ప్రవేశిస్తాడు. అనుచితమైన సాహసకార్యాలకు పూనుకొంటాడు. అనవసరమైన ఆవేశాలకు లోనవుతాడు. సంసారంలో తగుల్కొని, చెడ్డవారితో చెలిమి చేస్తూ, రత్యాసక్తి, ఉదరపోషణ ఈ రెండే తనకు ఇంపైనట్లు నడుచుకొంటాడు. తెలివిలేమివల్ల అజ్ఞానియై కోపంతో మసలుకొంటాడు. ఫలితంగా దుఃఖభాజనుడవుతాడు.

**సీ. జనయిత్రి! సత్యంబు శౌచంబు దయయును ధృతియు మౌనంబు బుద్ధియును సిగ్గు,**
**క్షమయును యశమును శమదమ భగములు, మొదలుగాఁగల గుణంబులు నశించు**
**జనుల కసత్సంగమున నని యెఱిఁగించి, వెండియు నిట్లను వినుము మూఢ**
**హృదయులు శాంతివిహీనులు దేహాత్మ, బుద్ధులు నంగనామోహ పాశ**

**తే. బద్ధ కేళీమృగంబుల పగిదిఁ దగిలి, పరవశస్వాంతమున శోచ్యభావులైన**
**వారి సంగతి విడువంగవలయు, నందు, నంగనా సంగమము దోష మండ్రుగాన. 1006**

**ప్రతి :** జనయిత్రి= తల్లీ; సత్యంబు= అబద్ధాలాడకుండుట; శౌచంబు= పారిశుద్ధ్యం; దయయును= కనికరం; ధృతియున్= ధైర్యం; మౌనంబు= మాటలాడకుండుట; బుద్ధియును= జ్ఞానం; సిగ్గు= బిడియం; క్షమయును= ఓర్పు; యశమును= కీర్తియును; శమదమభగములు= లోపలి, వెలుపలి ఇంద్రియనిగ్రహం; మొదలు+కాన్+కల= మొదలైనట్టి; గుణంబులు= నడవడికలు; జనులకున్= మానవులకు; అసత్+సంగమునన్= దుస్సాంగత్యంవల్ల; నశించున్= అడుగంటుతాయి; అని; ఎఱిఁగించి= తెల్పి; వెండియున్= మరల; ఇట్లు+అనున్= ఇలా అన్నాడు; వినుము= అమ్మా! వినండి; మూఢహృదయులు= తెలివిలేనివారు; శాంతివిహీనులు= శాంతికి దూరమైనవారు; దేహ+ఆత్మబుద్ధులు= దేహాన్ని ఆత్మగా తలంచేవారు; అంగనా= స్త్రీల; మోహపాశ= వ్యామోహమనే వాగురులచే; బద్ధ= బంధింపబడిన; కేళీమృగంబుల పగిదిన్= క్రీడా జంతువులవలె; తగిలి= సక్తులై; పరవశ= పరాధీనమైన; స్వాంతమునన్= మనస్సుతో; శోచ్యభావులు= విచారణీయులు; ఐనవారి సంగతిన్= అయినట్టివారల గూర్చిన తగులం; అంగనాసంగమము= స్త్రీలసాంగత్యం; దోషము+అండ్రు= తప్పు అని చెపుతారు; కావునన్= కాబట్టి; విడువంగన్+వలయున్= పరిత్యజించాలి.

**తా :** 'అమ్మా! నిజాన్ని పల్కటం, శుద్ధత, కనికరం, ధైర్యం, మునివృత్తి, తెలివి, సిగ్గు, ఓర్పు, కీర్తి, శమం, దమం, సంపద మొదలైన సద్గుణాలు చెడ్డవారితో చెలిమి చేస్తే నశిస్తాయి! అని చెప్పి, కపిలుడు మళ్ళీ, "అజ్ఞానులు, అశాంతులు, శరీరమే ఆత్మ అనుకునేవారు, స్త్రీ వ్యామోహం గలవారు. ఇలాంటి వారిని గూర్చి ఆలోచించకూడదు. ఎందుకంటే స్త్రీ వ్యామోహం అనుచితమని ప్రాజ్ఞులంటారు" అని చెప్పాడు.

**వ. దీని కొక్క యితిహాసంబు గలదు. తొల్లి యొక్కనాఁడు ప్రజాపతి దన కూఁతురయిన భారతి మృగీరూప ధారిణియై యుండం జూచి తదీయరూపరేఖావిలాసంబులకు నోటువడి వివశీకృతాంతరంగుండును, విగతత్రపుండునునై తానును మృగరూపంబు నొంది తదనుధావనంబు హేయంబని తలంపక ప్రవర్తించె.**

**కావున నంగనా సంగమంబు వలవ దస్మదీయ నాభీ కమల సంజాత చతుర్ముఖ నిర్మిత మరీచ్యాద్యుద్భూత కశ్యపాది కల్పిత దేవమనుష్యాదులందు మాయాబలంబునం గామినీజన మధ్యంబున విఖండిత మనస్కుండు గాకుండఁ బుండరీకాక్షుం డైన నారాయణఋషికిం దక్క నన్యులకు నెవ్వరికిం దీరదని వెండియు నిట్లనియె. 1007**

**ప్రతి :** దీనికిన్= స్త్రీసాంగత్యంవల్ల చెడతారనడానికి; ఒక్క ఇతిహాసంబు= ఒక పూర్వగాథ; కలదు= ఉంది; తొల్లి+ఒక్క నాఁడు= పూర్వం ఒకదినాన; ప్రజాపతి= బ్రహ్మ; తనకూఁతురు+అయిన= తనబిడ్డయైన; భారతి= సరస్వతి; మృగీరూపధారిణి+ ఐ+ఉండన్= ఆడుజింక రూపెత్తి ఉండగా; చూచి= ఆమెను కాంచి; తదీయ= ఆమెయొక్క; రూపరేఖా= అందానికి; విలాసంబులకున్= సొబగులకు; ఓటువడి= వశుడై; వివశీకృత= వశం తప్పిన; అంతరంగుండును= మనస్సుగలవాడును; విగతత్రపుండునున్+ఐ= సిగ్గుమాలినవాడును, అయి; తానును= తానూ; మృగరూపంబున్+ఒంది= మగజింక రూపమెత్తి (బ్రహ్మ); తద్+అనుధావనంబు= ఆ ఆడజింకననుసరించి పరుగిడుట; హేయంబు+అని= నీచమని; తలంపక= ఆలోచించకుండ; ప్రవర్తించెన్= నడుచుకొన్నాడు; కావునన్= అందువల్ల; అంగనాసంగమంబు= స్త్రీ సాంగత్యం; వలవదు= తగదు; అస్మదీయ= నాదైన; నాభీకమల= బొడ్డుదామరయందు; సంజాత= పుట్టినట్టి; చతుర్+ముఖ= నలువచే; నిర్మిత= పుట్టింపబడిన; మరీచి+ఆది+ఉత్+భూత= మరీచి మొదలైనవారినుండి కల్గినట్టియు; కశ్యప+ఆది= కశ్యపుడు మున్నగువారిచే; కల్పిత= సృష్టించబడిన; దేవ= దేవతలు; మనుష్య+ఆదులందున్= మానవులు మున్నగువారియందు; మాయాబలంబునన్= బలమైన మాయచేత; కామినీజన= స్త్రీల; మధ్యంబునన్= నడుమ; విఖండిత= చెదరిన; మనస్కుండు= మనస్సుకలవాడు; కాక+ఉండన్= కాకపోవుటకు; పుండరీక+అక్షుండు+ఐన= పద్మపత్ర నేత్రుడైనట్టి; నారాయణఋషికిన్= నారాయణ మహర్షికి; తక్క= తప్ప; అన్యులకున్= ఇతరులకు; ఎవ్వరికిన్= ఎలాంటివారికైనను; తీరదు+అని= సాధ్యంకాదు; అని; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** స్త్రీ సాంగత్యం తగదనటానికి ఒక పూర్వకథ వుంది. పూర్వం బ్రహ్మ తన కూతురు శారదను కన్నాడు. ఆమె ఆడుజింక రూపమెత్తింది. ఆ రూపాన్ని చూచి బ్రహ్మ వ్యామోహియై, మగజింక రూపమెత్తి, అనాలోచితంగా దాని వెంటబడి రమించాడు. దీనిని బట్టి స్త్రీసాంగత్యం అనుచితమని తెలుస్తుంది. బ్రహ్మ మరీచ్యాదుల్ని, కశ్యపాదుల్ని సృష్టించాడు. వారు దేవతల్ని, మానవుల్ని, పశుపక్ష్యాదుల్ని కన్నారు. ఇంత ప్రాణికోటి నడుమ స్త్రీ వ్యామోహానికి గురికాని మహాత్ముడు ఒక్కనారాయణ మహర్షి మాత్రమే. ఆ జితేంద్రియత ఆయన కొక్కనికే చెల్లింది. ఇతరు లెవ్వరికి సాధ్యపడలేదు" అని కపిలుడన్నాడు.

**విశే : నారాయణఋషి :** నరుడు, నారాయణుడు అనేవారు సనాతన మహర్షులు. ఈ ఇర్వురు జంటఋషులు. పరమాత్మయే ఈ జంటకు మూలపురుషుడు. వీరికి లెక్కలేనన్ని జన్మలు గడిచాయి.

భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ అర్జునునితో "బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున! తాన్యహం వేద సర్వాణి, నత్వం వేత్థ పరంతప!" అంటాడు. అంటే అర్థం. "అర్జునా! నీకు, నాకు ఎన్నో జన్మలు గడిచాయి. అవన్నీ నాకు తెలుసు. నీకు తెలీదు" అని.

ఈ ఇర్వురు ద్వాపరయుగంలో 'నరుడు' నారాయణుడు'గా జన్మించారు.

**తే. రూఢి నా మాయ కామినీ రూపమునను, బురుషులకు నెల్ల మోహంబుఁ బొందఁ జేయుఁ**
**గాన పురుషులు సతుల సంగంబు మాని, యోగవృత్తిఁ జరించుచు నుండవలయు. 1008**

**ప్రతి :** రూఢిన్= దృఢంగా; ఆ+మాయ= దైవమాయ; కామినీరూపమునను= స్త్రీ రూపంతో; పురుషులకున్+ఎల్లన్= పురుషులందరికి; మోహంబు= వ్యామోహాన్ని; పొందన్+చేయున్= కల్గిస్తుంది; కానన్= అందువల్ల; పురుషులు= మగవారు; సతుల= స్త్రీలయొక్క; సంగంబు= పొత్తు; మాని= విడిచి; యోగవృత్తిన్= యోగవ్యాపారమునందు; చరించుచున్= నడుస్తూ; ఉండవలయున్= ఉండాలి.

**తా :** విష్ణుమాయ స్త్రీరూపమెత్తి, పురుషుణ్ణి మోహపరవశుణ్ణి చేస్తుంది. అందువల్ల మగవారు స్త్రీల సాంగత్యంలో చిక్కుకోకుండ యోగవృత్తి నవలంబించాలి.

**క. ధీరతతో మత్పదసర, సీరుహ సేవానురక్తిఁ జెందిన వారల్**
**నారీసంగము నిరయ, ద్వారముగా మనములందుఁ దలఁపుదు రెందున్. 1009**

**ప్రతి :** ధీరతతోన్= ధైర్యముతో; మద్+పద= నా అడుగులనెడు; సరసీరుహ= తామరల; సేవా+అనురక్తిన్= కొలుచుటయందు ఆసక్తిని; చెందినవారలు= పొందిన భక్తులు; నారీసంగమున్= స్త్రీసాంగత్యాన్ని; నిరయద్వారము+కాన్= నరకద్వారంగా; ఎందున్= ఎక్కడైనను; మనములందున్= బుద్ధులందు; తలఁపుదురు= భావిస్తారు.

**తా :** నా పాదపద్మాల్ని నిరంతరం చిత్తశుద్ధితో కొలిచే భక్తులు స్త్రీలపొత్తును నరకద్వారమని భావిస్తారు.

**క. హరిమాయా విరచితమై, తరుణీ రూపంబుఁ దాల్చి ధరఁ బర్విన బం**
**ధురతృణ పరివృతకూపము, కరణి నదియు మృత్యురూపకం బగు మఱియున్. 1010**

**ప్రతి :** హరిమాయా= విష్ణుమాయచే; విరచితము+ఐ= కావింపబడినదై; తరుణీరూపంబున్= స్త్రీరూపాన్ని; తాల్చి= ధరించి; ధరన్= లోకమందు; పర్వినన్= వ్యాపింపగా; అదియున్= ఆ రూపం; బంధుర= దట్టమైన; తృణపరివృత= గడ్డిచే కప్పబడిన; కూపము= బావి; కరణిన్= మాదిరి; మృత్యురూపంబు+అగున్= చావుగా పరిణమిస్తుంది; మఱియున్= ఇంకా...

**తా :** దట్టమైన గడ్డిచే కప్పబడిన బావిలాగా విష్ణుమాయచే కామం స్త్రీరూపం దాల్చి మిత్తిగా పరిణమిస్తుంది.

**చ. ధన పశు పుత్త్ర మిత్ర వనితా గృహ కారణభూతమైన యీ**
**తనువున నున్న జీవుఁడు పదంపడి యెట్టి శరీర మెత్తిన**
**న్ననుగతమైన కర్మఫల మందక పోవఁగరాదు, మింటఁ బ్రా**
**కిన భువిఁ దూఱినన్ దిశల కేగిన నెచ్చటనైన దాఁగినన్. 1011**

**ప్రతి :** ధన= సొమ్ము; పశు= పశువులు; పుత్ర= కొడుకులు; మిత్ర= స్నేహితులు; వనితా= స్త్రీలు; గృహ= ఇండ్లు, వీటికి; కారణభూతము+ఐన= హేతువుగానున్న; ఈ తనువునన్= ఈ శరీరమందు ఉన్న; జీవుఁడు= ప్రాణి; మిన్ను+ప్రాకినన్= ఆకాశమంటినప్పటికి; భువిన్= నేలలో; దూఱినన్= దాక్కొన్నను; దిశలన్= దిక్కుల్లో; ఎచటన్+అయినన్= ఎక్కడైనను; దాఁగినన్= మరుగుచొచ్చినను; పదంపడి= తర్వాత; ఎట్టిశరీరము+ఎత్తినన్= ఏ రకమైన తనువు ధరించినప్పటికి; అనుగతము+ఐన= గతజన్మనుండి అనుసరించివస్తున్న; కర్మఫలము= చేసినపనికి ఫలితాన్ని; అందక= పొందకుండ; పోవన్+కన్+రాదు= తప్పించుకొని పోలేడు–

**తా :** సంపదలు, పశువులు, దార పుత్రాదులు, చెలికాండ్రు, నివాసాలతో తానెంత గొప్పవాడైనా జీవుడు (లేక) ఏ జంతురూపమెత్తినా, కాక ఆకాశాని కెగబ్రాకినా, భూమిలో దాగినా, దిక్కులవెంట పరుగెత్తినా గతజన్మ కర్మఫలితాన్ని అనుభవింపక తప్పదు.

**వ. అట్టి పురుషరూపంబు నొందిన జీవుండు నిరంతర స్త్రీ సంగంబుచే విత్తాపత్య గృహాది ప్రదంబగు స్త్రీత్వంబు నొందు, నీక్రమంబున నంగనారూపుండగు జీవుండు మన్మాయచేఁ బురుష రూపంబు నొంది ధనాది ప్రదుండగు భర్తను నాత్మబంధ కారణంబగు మృత్యువునుగ నెఱుంగవలయు, మఱియు జీవోపాధి భూతంబగు లింగదేహంబుచే స్వావాసభూతలోకంబున నుండి లోకాంతరంబు నొందుచుం బ్రారబ్ధకర్మఫలంబుల ననుభవించుచు మరలఁ గర్మాదులం దాసక్తుం డగుచు మృగయుండు గాననంబున ననుకూల సుఖ ప్రదుండైనను మృగంబునకు మృత్యువగు చందంబున జీవుండు భూతేంద్రియ మనోమయం బైన దేహంబు గలిగి యుండు, నట్టి దేహనిరోధంబె మరణంబు, ఆవిర్భావంబె జన్మంబు, కాన సకల వస్తు విషయజ్ఞానంబు కలుగుటకు జీవునకు సాధనంబు చక్షురింద్రియంబ. ద్రష్టు దర్శనీయ యోగ్యతా ప్రకారంబున జీవునకు జన్మమరణంబులు లేవు గావున భయ కార్పణ్యంబులు విడిచి సంభ్రమంబు మాని జీవప్రకారంబు జ్ఞానంబునం దెలిసి ధీరుండై ముక్తసంగుం డగుచు యోగ్యవైరాగ్య యుక్తంబైన సమ్యగ్జ్ఞానంబున మాయావిరచితంబైన లోకంబున దేహాదులం దాసక్తి మాని వర్తింపవలయు నని చెప్పి వెండియు నిట్లనియె.**
**1012**

**ప్రతి :** అట్టి= పైన చెప్పినవిధంగ; పురుషరూపంబున్= మగరూపు; ఒందిన= పొందిన; జీవుండు= ప్రాణి; నిరంతర= ఎడబాయని; స్త్రీసంగంబుచేన్= స్త్రీతోడికలయికచేత; విత్త= ధనం; అపత్య= సంతానం; గృహ+ఆది= నివాసం మున్నగువానిని; ప్రదంబు+అగు= ఇచ్చునట్టిదైన; స్త్రీత్వంబున్= ఆడతనాన్ని; ఒందున్= పొందుతాడు; ఈ క్రమంబునన్= ఈ వరుసలో; అంగనారూపుండు+అగు= స్త్రీత్వమొందినట్టి; జీవుండు= ప్రాణి; మద్+మాయచేన్= నా (విష్ణు) మాయచేత; పురుషరూపంబున్= మగరూపాన్ని; ఒంది= పొంది; ధన+ఆది= సంపద మున్నగువాని; ప్రదుండు+అగు= ఇచ్చేవాడైన; భర్తను= మగణ్ణి; ఆత్మబంధకారణంబు+అగు= ఆత్మకి గుదిబండయైన (వానినిగా); మృత్యువు+కన్= మిత్తిగా; ఎఱుంగవలయున్= తెలియాలి; మఱియున్= ఇంకా; జీవ= జీవునికి; ఉపాధిభూతంబు+అగు= ఆధారరూపమైన; లింగదేహంబుచేన్= సూక్ష్మశరీరంతో; స్వ+ఆవాస= తన నివాసమైన; భూతలోకంబునన్= పాంచభౌతిక ప్రపంచంలో (భూలోకం); ఉండి= నివసించి; లోక+అంతరంబున్+ఒందుచున్= ఇతరలోకాలకు పోతూ (స్వర్గనరకాలు); ప్రారబ్ధ= ఈ జన్మలో అనుభవానికి వచ్చిన; కర్మ= మంచి చెడు కర్మలకు; ఫలంబు= ఫలితాన్ని; అనుభవింపుచున్= భోగిస్తూ; మరలన్= మళ్ళీ; కర్మ+ఆదులందున్= ఆయాకర్మలందే; ఆసక్తుండు+అగుచున్= తగుల్కొన్నవాడవుతూ; మృగయుండు= వేటకాడు (బోయ); కాననంబునన్= అడవియందు; అనుకూల= తనకు ఇష్టమైన; సుఖప్రదుండు+ఐనను= సౌఖ్యమిచ్చువాడైనప్పటికి; మృగంబునకున్= జింకకు (జంతువు); మృత్యువు+అగు= చందంబునన్= మిత్తియగునట్లు; జీవుండు= ప్రాణి; భూత+ఇంద్రియ+మనస్+మయంబు= శారీరకమైన జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలు; మనస్సు వీటితోకూడిన; దేహంబు= శరీరం; కల్గియుండున్= తాల్చిఉంటాడు; అట్టి= అలాంటి; దేహనిరోధంబు+ఎ= శరీరాన్ని వదలడమే; మరణంబు= చావు; ఆవిర్భావంబు+ఎ= పుట్టుకయే; జన్మంబు=

జన్మ; కానన్= అందువల్ల; సకల= సమస్తమైన; వస్తు= పదార్థములకు; విషయ= సంబంధించిన; జ్ఞానంబు= తెలివి; కలుగుటకున్= ఏర్పడటానికి; జీవునకున్= ప్రాణికి; చక్షుస్+ఇంద్రియంబు+అ= కన్నుమాత్రమే; సాధనంబు= ఆధారం; ద్రష్టృ= చూచేవాడు (ద్రష్టృ); దర్శనీయ= చూడదగింది (దృశ్యం)అనే; యోగ్యతా ప్రకారంబునన్= సామర్థ్యాన్నిబట్టి; జీవునికిన్= ప్రాణికి; జన్మమరణంబులు= పుట్టుట గిట్టుటలు, లేవు; కావునన్= అందువల్ల; భయకార్పణ్యంబులు= భయం, దీనత్వం అనే గుణాలు, విడిచి= వదలి; సంభ్రమంబు= తొట్రుపాటు; మాని= వదలి; జగత్+ప్రకారంబు= లోకపుతీరు; జ్ఞానంబునన్= తెలివితో; తెలిసి= గుర్తించి; ధీరుండు+ఐ= ధైర్యశాలియై; ముక్తసంగుండు+అగుచున్= విడువబడిన బంధంగలవాడై; యోగ= ధ్యానం; వైరాగ్య= త్యాగం ఈ రెండింటిచే; యుక్తంబు+ఐన= కూడినట్టి; సమ్యక్+జ్ఞానంబునన్= మంచి తెలివితో (నిశ్చయబుద్ధితో); మాయావిరచితంబు+ఐన= మాయచే నిర్మితమైన; లోకంబునన్= ప్రపంచమందు; దేహ+ఆదులందున్= శరీరాలపై; ఆసక్తిమాని= ఆసవిడిచి; వర్తింపవలయున్= మెలగుతుండాలి; అని, చెప్పి; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు...

**తా :** జీవుడు ఏ రూపమెత్తినా గతజన్మలో తానుచేసిన కర్మలకు ఫలితం అనుభవించితీరాలి. ఇహలోకంలో పురుషాకృతి తాల్చిన జీవుడు స్త్రీసాంగత్యంవల్ల ధనం, ఇల్లు, వాకిలి అనే భౌతికసంపదల రూపంలో ఉన్న స్త్రీత్వాన్ని పొందుతాడు. స్త్రీ రూపధారియై జన్మించిన జీవుడు, పురుషాకృతి తాల్చి ధనాదిరూపంగానున్న భర్తను మృత్యువని భావించాలి. ఈ మగరూపంలో మృత్యువు మనస్సుకు గుదిబండ వంటిది. లింగదేహధారియైన ఈ జీవుడు స్త్రీయైనా, పురుషుడైనా, జీవనోపాధికై ఏవోకర్మలు చేస్తూ, తత్కారణంగా కర్మఫలాల్ని అనుభవిస్తూ, వేటగాని చేతికి చిక్కిన జింకవలె అనేక కష్టాలకు గురియై మిత్తికి ఎర అవుతూనే వుంటాడు. మనోమయమైన శరీరాన్ని మరల మరల ధరిస్తూనే వుంటాడు. ఈ దేహత్యాగమే మరణం. ఈ దేహధారణయే జననం. ఇది చావుపుట్టుకల క్రమం. పదార్థ పరిజ్ఞానంకొఱకు; జీవునికి సాధనమైంది కన్ను. జీవుడు ద్రష్టృలక్షణంగల్గి, వస్తువును దర్శించగల యోగ్యత గల్గి వుంటే, తనకు చావుపుట్టుకలు లేవు. ఈ దశకు జీవుడు చేరుకోవాలంటే, ఆయనకు భీతిగాని, దైన్యంగాని వుండరాదు. తొట్రుపాటు తగదు. జీవలక్షణం తెలిసినవాడై, ధైర్యశాలియై, బంధముక్తుడు కావాలి. ఇందుకు ప్రధానమైన సాధనాలు ధ్యానం మరియు వైరాగ్యం. వీటి ఆసరాతో, మాయావృతమైన ఉపాధియందు తగుల్కొనకుండా నడుచుకోవాలి అని కపిలుడన్నాడు.

**విశే :** వేటగాడు అడవిలో 'సంగీతం' వినిపించి జింకకు సుఖం కల్గించేవాడైనా చివరికి మరణకారణమవుతాడు. ద్రష్ట అనగా చూచువాడు, సాక్షిభూతుడైన పరమాత్మ. దర్శనీయమైనది మాయావిరచిత జగత్తు. ఈ రెండింటి భేదం తెలిస్తే జీవుడు జననమరణాలు లేనివాడవుతాడు.

**సీ. గృహమందు వర్తించు గృహమేధు లగువారు మహిత ధర్మార్థ కామముల కొఱకు**
**సంప్రీతు లగుచుఁ దత్సాధనానుష్ఠాన నిరతులై వేదనిర్ణీత భూరి**
**భగవత్స్వధర్మ తద్భక్తి పరాఙ్ముఖు లై దేవగణముల ననుదినంబు**
**భజియించుచును భక్తిఁ బైతృక కర్మముల్ సేయుచు నెప్పుడు శిష్టచరితు**

**తే. లగుచుఁ దగ దేవపితృసువ్రతాఢ్యు లయిన, కామ్యచిత్తులు ధూమాదిగతులఁ జంద్ర**
**లోకమును జెంది పుణ్యంబు లుప్త మయిన, మరలి వత్తురు భువికి జన్మంబు నొంద. 1013**

**ప్రతి :** గృహమందున్+వర్తించు= ఇంట నివసించునట్టి; గృహమేధులు+అగువారు= సాంసారికులు; మహిత= కొనియాడదగిన; ధర్మ+అర్థ, కామముల కొఱకున్= ధర్మం, అర్థం, కామం అనే మూడు పురుషార్థాలకై; సంప్రీతులు+అగుచున్= సంతసించినవారై; తద్+సాధన= వాటికి మూలకారణాలైన; అనుష్ఠాన= ఆచరణలందు; నిరతులు+ఐ= ఆసక్తిగలవారై; వేద= వేదాలచే; నిర్ణీత= నిర్ణయింపబడిన, భూరి= గొప్ప; భగవత్= దైవికమైన; సుధర్మ= ధర్మమునకు; తద్= ఆ దైవికమైన; భక్తి= భక్తికిని; పరాక్+ముఖులు+ఐ= వ్యతిరేకులై; దేవగణములన్= అన్యదేవతల్ని; అనుదినంబు= నిత్యం; భజియింపుచును= కొలుస్తూ; భక్తిన్= నిష్ఠతో; పైతృక కర్మముల్= పితృతర్పణాదులు; చేయుచున్= చేస్తూ; ఎప్పుడున్= ఎల్లప్పుడు; శిష్టచరితులు+అగుచున్= సదాచారం పాటించువారై; తగన్= యుక్తంగా; దేవ= దేవతలు; పితృ= తండ్రులు అను వీరియొక్క; సువ్రత+ఆఢ్యులు+అయిన= వ్రతాల్ని చేయటంలో నేర్పుగలవారైనట్టి; కామ్యచిత్తులు= కోర్కెలతోడి మనస్సులుగలవారు; ధూమ+ఆదిగతులన్= పొగచూరిన మార్గాలలో; చంద్రలోకమున్= చంద్రలోకాల్ని; చెంది= పొంది; పుణ్యంబు= తాము చేసిన పుణ్యం; లుప్తము+ఐనన్= అడుగంటగా; జన్మంబున్+ఒందన్= పుట్టుటకు; భువికిన్= భూలోకానికి; మరలివత్తురు= తిరిగివస్తారు.

**తా :** గృహస్థులు పురుషార్థాలైన ధర్మం, అర్థం, కామం అనే మూడింటితో సంతృప్తి చెంది వాటిసాధనలో నిమగ్నులవుతారు. వేదం నిర్దేశించిన ఉత్తమ ధర్మాలపట్ల, భక్తిపట్ల వ్యతిరేకులై, అన్యదేవతల్ని కొలుస్తారు. శ్రద్ధగా పితృక్రియలు చేస్తూ, శిష్టాచారులైయుంటారు. వీరందఱు కామ్యకర్మల యందాసక్తి గలవారు. పొగచూరిన దారుల్లో సాగుతూ చంద్రలోకం చేరి, అక్కడ కొంతకాలానికి తమపూర్వపుణ్యం నశిస్తూనే భూలోకంలో మళ్ళీ జన్మిస్తారు.

**వ. అదియునుంగాక. 1014**

**ప్రతి :** అదియునుంగాక (అదియునున్+కాక)= అంతేగాదు

**తా :** ఇంకా

**తే. ప్రవిమలానంత భోగితల్పంబునందు, యోగనిద్రాళువై హరి యున్నవేళ**
**నఖిల లోకంబులును విలయంబు నొందు, నట్టి సర్వేశ్వరునిఁ గూర్చి యలఘుమతులు 1015**

**ప్రతి :** ప్రవిమల= స్వచ్ఛమైన; అనంతభోగి= అనంతుడనే సర్పరూపమైన; తల్పంబునందున్= పడకపై; యోగనిద్రాళువు+ఐ= యోగనిద్రాశీలుడై; హరి= శ్రీమహావిష్ణువు; ఉన్నవేళన్= ఉన్నసమయంలో; అఖిల= సమస్తమైన; లోకంబులును= భువనాలు; విలయంబున్+ఒందున్= ప్రళయాన్ని పొందతాయి; అట్టి= అటువంటి; సర్వ+ఈశ్వరునిన్+కూర్చి= పరమేశ్వరునుద్దేశించి; అలఘుమతులు= మహాబుద్ధిమంతులు...

**తా :** శ్రీహరి అనంతుడనే పాముని పడకగా చేసికొని యోగనిద్రలో ఉంటాడు. అప్పుడు ప్రళయం జరుగుతుంది. మహాత్ములు విష్ణుమూర్తిని గూర్చి –

**మ. పరికింపన్ నిజభక్తియుక్తి గరిమం బాటిల్లు పంకేరుహో**
**దర విన్యస్త సమస్త ధర్మముల శాంతస్వాంతులై సంగముం**
**బరివర్జించి విశుద్ధచిత్తు లగుచుం బంకేజపత్రేక్షణే**
**తర ధర్మైక నివృత్తులై సతతమున్ దైత్యారిఁ జింతించుచున్. 1016**

**ప్రతి :** పరికింపన్= ఆలోచింపగా; నిజ= తమదైన; భక్తియుక్తి గరిమన్= భక్తియోగ శ్రేష్ఠతచే; పాటిల్లు= విలసిల్లునట్టి; పంకేరుహ+ఉదర= కమలం గర్భమందుగల శ్రీహరియందు; విన్యస్త= ఉంచబడిన; సమస్త ధర్మములన్= సకల ఆచారాలచేత; శాంత+స్వాంతులు+ఐ= శాంతచిత్తులై; సంగమున్= ఇతర సాంగత్యాన్ని; పరివర్జించి= బాగావదలిపెట్టి; విశుద్ధ= మిక్కిలి స్వచ్ఛమైన; చిత్తులు+అగుచున్= మనస్సులుగలవారై; పంకేజపత్ర+ఈక్షణ= తామరలవంటి కన్నులుగలవాడైన విష్ణువుకంటె; ఇతర= భిన్నమైన; ధర్మ+ఏకనివృత్తులు+ఐ= ఆచారాలనుండి తొలగినవారై; సతతమున్= ఎల్లప్పుడు; దైత్య+అరిన్= రాక్షసులకువిరోధియైన శ్రీహరిని; చింతింపుచున్= స్మరిస్తూ...

**తా :** అలఘుమతులైన యోగులు భక్తిపరులై తమ వర్ణాశ్రమాచారాల్ని పాటిస్తూ, వైష్ణవధర్మాల్ని సైతం శాంతంగా అనుసరిస్తూ బంధముక్తులవుతారు. అంతేగాక పరిశుద్ధభావులై, వైష్ణవేతరమైన ధర్మాలపట్ల వైముఖ్యం కల్గి ఎప్పుడూ విష్ణుమూర్తినే ధ్యానిస్తుంటారు.

**సీ. మఱియు నహంకార మమకార శూన్యులై యర్థి వర్తించుచు నర్చిరాది**
**మార్గ గతుండును మహనీయ చరితుండు విశ్వతోముఖుఁడును విమలయశుఁడు**
**జగదుద్భవస్థానసంహార కారణుం డవ్యయుం డజుఁడుఁ బరాపరుండుఁ**
**బురుషోత్తముఁడు నవ పుండరీకాక్షుండు నైన సర్వేశ్వరునందుఁ బొంది**

**తే. మానితాపునరావృత్తిమార్గ మయిన, ప్రవిమలానంద తేజోవిరాజమాన**
**దివ్యపదమున సుఖియించు ధీరమతులు, మరలిరా రెన్నటికిని జన్మముల నొంద. 1017**

**ప్రతి :** మఱియున్= ఇంకా; (అలఘుమతులు); అహంకార= దర్పం; మమకార= ఆత్మీయత, ఈ రెండింటిచే; శూన్యులు+ఐ= విడివడ్డవారై; అర్థిన్= బుద్ధిపుర్వకంగా; వర్తింపుచున్= మసలుకొంటూ; అర్చిః+ఆది= అగ్ని, జ్యోతి మొదలైన; మార్గగతుండును= దారియందున్నట్టియు; మహనీయ చరితుండు= పూజింపదగిన నడవడి గల్గినట్టియు; విశ్వతో ముఖుఁడును= జగత్తునే ఆకారంగా కల్గినట్టియు; విమలయశుఁడు= అచ్చమైన కీర్తిగల్గినట్టియు; జగత్= విశ్వంయొక్క; ఉత్+భవ= పుట్టుకకు; స్థాన= స్థితికి; సంహార= లయానికి; కారణుండు= కారణమైనట్టియు; అవ్యయుండు= నాశనం లేనట్టియు; అజుఁడు= పుట్టుక లేనట్టియు; పర+అపరుండున్= దివికి భువికితానె అయినట్టియు; నవ= కొంగ్రొత్త; పుండరీక= తామరపూవువంటి; అక్షుండున్= కన్నులు కల్గినట్టియు; పురుష+ఉత్తముఁడు= పురుషశ్రేష్ఠుడు; ఐన= ఐనట్టి; సర్వ+ఈశ్వరు+అందున్= జగత్పతియైన శ్రీహరియందు; పొంది= చొచ్చి; మానిత= పూజితమైన; అపునరావృత్తి+ మార్గము+అయిన= తిరిగిరానిదైన, పునర్జన్మరహిత మార్గమగు; ప్రవిమల= మిక్కిలి స్వచ్ఛమైన; ఆనందతేజస్= ఆనందమనే కాంతితో; విరాజమాన= వెల్గుతున్న; దివ్యపదమునన్= దివ్యస్థానమందు; సుఖియించు= సుఖపడుచున్న; ధీరమతులు= బుద్ధిమంతులు; జన్మములన్+ఒందన్= మరలపుట్టుటకు; ఎన్నటికిన్= ఎప్పటికి; మరలిరారు= తిరిగిరారు.

**తా :** ఆ మహాత్ములకు అహంకారంగాని మమకారం కాని ఉండవు. వారు శుక్లమార్గంలో చరించేవాడు, అద్వితీయమైన చరిత్రగలవాడు, విశ్వమూర్తి, విమలకీర్తి, సృష్టి స్థితి లయకారకుడు, అవినాశి, అజుడు, ఇహపరాలుతానే అయినవాడు, పురుషోత్తముడు, క్రొందామరలవంటి కన్నులవాడైన ఆ సర్వేశ్వరునిలో తాదాత్మ్యం చెందుతారు. పునర్జన్మరహితులై, అమందానందాన్ని పొందుతూ వైకుంఠంలోనే నివసిస్తారు. సాయుజ్యం పొందిన ఆ యోగులకు 'పునరావృత్తి' ఉండదు.

**వ. మఱియుఁ బరమేశ్వర దృష్టిచే హిరణ్యగర్భు నుపాసించువారు సత్యలోకంబున ద్విపరార్ధావసానంబగు ప్రళయంబుఁ దనుకఁ బరుండగు చతురాననుం బరమాత్మ రూపంబున ధ్యానంబు సేయుచు నుండి పృథివ్యప్తేజో వాయ్వాకాశమానసేంద్రియ శబ్దాది భూతాదులతోడంగూడ లోకంబును బ్రకృతియందు లీనంబు సేయ సర్వేశ్వరుండు సకల సంహర్తయగు సమయంబున గతాభిమానంబులు గలిగి బ్రహ్మలోకవాసులగు నాత్మలు బ్రహ్మతోడం గూడి పరమానందరూపుండును సర్వోత్కృష్టుండు నగు పురాణపురుషుం బొందుదురు, కావున నీవు సర్వభూతహృదయ పద్మనివాసుండును శ్రుతానుభావుండును నిష్కళంకుండును నిరంజనుండును నిర్ద్వంద్వుండును నగు పురుషుని భావంబుచే శరణంబు నొందు మని చెప్పి మఱియును నిట్లనియె. 1018**

**ప్రతి :** మఱియున్= ఇంకా; పరమేశ్వర దృష్టిచేన్= పరమేశ్వరుడు అనే దృష్టితో; హిరణ్యగర్భున్= సృష్టికర్త అయిన బ్రహ్మదేవుణ్ణి; ఉపాసించువారు= కొలిచేవారు; సత్యలోకంబునన్= సత్యలోకంలో; ద్విపరార్ధ+అవసానంబగు= ద్విపరార్ధకాలముయొక్క చివరిదైన; ప్రళయంబు+తనుకన్= ప్రళయం వచ్చేవరకు; పరుండు+అగు= ప్రకృతికంటె భిన్నుడైన; చతుస్+ఆననున్= నాల్గుమోములుగల బ్రహ్మను; పరమాత్మ రూపంబునన్= భగవంతుడనే రూపంలో; ధ్యానంబు+ చేయుచున్= ధ్యానిస్తూ; ఉండి; పృథివి= భూమి; అప్= నీరు; తేజస్= అగ్ని; వాయు= గాలి; ఆకాశ= ఆకాశం; మానస= మనస్సు; ఇంద్రియ= జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాలు మొదలైన; భూత+ఆదులతోడన్= 16 భూతాలతోకూడ; లోకంబును= లోకాన్ని; ప్రకృతియందున్= విశ్వమందు; లీనంబు+చేయన్= లయమగునట్లు చేయుటకు; సర్వ+ఈశ్వరుండు= జగత్కర్త; సకల= సమస్తానికి; సంహర్త+అగు= వినాశకుడయ్యే; సమయంబునన్= ప్రళయకాలంలో; గత+అభిమానంబులు+కలిగి= మమకారాల్ని వదలి; బ్రహ్మలోక= బ్రహ్మాండమందు; వాసులు= నివసిస్తున్నవారగు; ఆత్మలు= ప్రత్యగాత్ములు; బ్రహ్మతోడన్+కూడి= బ్రహ్మతోకలిసి; పరమ= మిక్కిలి; ఆనందరూపుండును= ఆనందమే స్వరూపంగాకలవాడును; అగు= అయినట్టి; సర్వ+ఉత్కృష్టుండున్+అగు= అందరికంటె ఉన్నతుడు అయిన; పురాణపురుషున్= సనాతనుడైన పరంధాముని; పొందుదురు= చేరుకొంటారు; కావునన్= అందువల్ల; నీవు= (దేవహూతి); సర్వభూత= ఎల్లభూతాల; హృదయపద్మ= హృదయమనే పద్మమందు; నివాసుండును= ఉనికి కల్గినట్టియు; శ్రుత+అనుభావుండును= వినదగిన ప్రభావం గల్గినట్టివాడును; నిష్కళంకుండును= కళంకరహితుడును; నిరంజనుండును= దోషములులేనట్టియు; నిర్+ద్వంద్వుండును= రెండుకానట్టి ఏకాకృతియు; అగు= అయిన; పురుషునిన్= పరమపురుషుని; భావంబునన్= చిత్తముతో; శరణంబున్+ఒందుము= శరణు వేడుకొనుము; అని, చెప్పి= బోధించి; మఱియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** తల్లీ! భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశం అనే పంచభూతాలు, మనస్సు, కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు అనే భూతాలతో కూడిన క్షేత్రాల్ని సర్వేశ్వరుడు ప్రకృతిలో విలీనం చేసే ప్రళయసమయం ఆసన్నమైనప్పుడు బ్రహ్మలోకంలో నివసిస్తున్న ఆత్మలు బ్రహ్మతోసహా శరీరంపై ఆస ఉడిగి పరమేశ్వరుణ్ణి ఆశ్రయిస్తారు. కావున ఓ అమ్మా! నీవుకూడ సర్వభూతాంతర్వర్తియు, ప్రభావశాలియు, నిర్దోషియు, ఏకాకృతియునైన ఆ పరమపురుషుని శరణుకోరుము' అని కపిలుడు బోధించి మళ్ళీ ఇట్లన్నాడు.

**మ. సకలస్థావర జంగమ ప్రతతికిం జర్చింపఁ దా నాద్యుఁడై**
**యకలంకశ్రుతిగర్భుఁడుం బరముఁడు న్నైనట్టి యీశుండు సే**

**వక యోగీంద్ర కుమార సిద్ధముని దేవశ్రేణి యోగ ప్రవ**
**ర్తకమై తన్ను భజింపఁజూపు సగుణ బ్రహ్మంబు లీలాగతిన్. 1019**

**ప్రతి :** సకల= సమస్తమైన; స్థావర= పర్వతాదిస్థిరరూపమైన; జంగమ= నడయాడే మానవపశుపక్ష్యాదిరూపమైన; ప్రతతికిన్= భూతసముదాయానికి; చర్చింపన్= ఆలోచిస్తే; తాన్= ఆ సర్వేశ్వరుడే; ఆఢ్యుఁడు+ఐ= మొదటివాడై; అకలంక= స్వచ్ఛమైన; శ్రుతి= వేదవాఙ్మయాన్ని; గర్భుఁడున్= తనయందిముడ్చుకొన్నట్టియు; పరముఁడున్ను= సర్వశ్రేష్ఠుడూ; ఐన+అట్టి= ఐనటువంటి; ఈశుండు= పరమేశ్వరుడు; సేవక= భక్తులు; యోగీంద్ర= యోగీశ్వరులు; కుమార= సనత్కుమారాదులు; సిద్ధ= గంధర్వజాతులు; ముని= మునులు; దేవ= దేవతలు మున్నగువారి; శ్రేణి= గుంపు; తన్నున్= తనను; భజింపన్= కొల్వగా; లీలాగతిన్= విలాసగమనంతో; సగుణబ్రహ్మంబున్= త్రిగుణాత్మకమైన, వైష్ణవతేజాన్ని; చూపున్= ప్రదర్శిస్తాడు.

**తా :** కదిలేది, కదలని అయిన సమస్త భూతప్రకృతికి ప్రభువు. ఆ సర్వేశ్వరుడే. వేదవాఙ్మయమంతా ఆయన అధీనమైవుంది. భక్తులు, యోగులు, సనత్కుమారాది సిద్ధయోగులు, సిద్ధసాధ్యులు, మునులు, సకలదేవతలు ఎల్లరు యోగదృష్టితో ఆయన్నే కొలుస్తారు. ఆ స్వామి భూతాలకొఱకై ప్రతిమాది సగుణరూపాన్ని ధరించి వైష్ణతేజాన్ని ప్రదర్శిస్తాడు.

**విశే :** ఆరాధన సగుణమని, నిర్గుణమని రెండురకాలు. ఈ ఆరాధనకు మూలస్వరూపమైన బ్రహ్మతేజంకూడ సగుణ నిర్గుణాత్మకమే. నిర్గుణ మనగా త్రిగుణాలకు అతీతమై, వినిర్మలమై ప్రకాశించే చలనంలేని కేవలచైతన్యస్వరూపం. అది చర్మచక్షువునకు అందనిది. చరాచరవిశ్వమందు వ్యాప్తిరూపంగా ఉండే వైష్ణవతేజం. ఆ తేజస్సును జ్ఞానులు ఆంతరచక్షుస్సుతో దర్శిస్తారు. ఇక సగుణబ్రహ్మం అంటే సామాన్యులకొఱకు ఉద్దిష్టమైంది. ఇది సత్త్వరజస్తమస్సులనే త్రిగుణాలతో కూడివుంటుంది. ఇది విగ్రహరూపం లేదా ప్రతిమారూపంతో విలసిల్లే వైష్ణవతేజస్సు. సామాన్య ఉపాసకుల సౌకర్యార్థం ఆ మూలవిరాట్టు గుళ్ళలో, గోపురాలలో ప్రతిమారూపంగా దర్శనమిస్తాడు.

**సీ. అట్టి సర్వేశ్వరుం డయ్యయికాలంబు లందును దద్గుణవ్యతికరమున**
**జనియించుచుండు, నీ చాడ్పున ఋషి దేవ గణములు దమ తమ కర్మ నిర్మి**
**తైశ్వర్య పారమేష్ఠ్యములందుఁ బురుషత్వమునఁ బొంది యధికారములు వహించి**
**వర్తించి క్రమ్మఱ వత్తురు, మఱి కొంద ఱారూఢ కర్మానుసారమైన**

**తే. మనములను జాలఁ గలిగి ధర్మములయందు, శ్రద్ధతోఁ గూడి యప్రతిషిద్ధమైన**
**నిత్యనైమిత్తికాచార నిపుణు లగుచుఁ, దగి రజోగుణ కలిత చిత్తములు గలిగి. 1020**

**ప్రతి :** అట్టి సర్వేశ్వరుండు= ఆ పరమేశ్వరుడు; ఆ+ఆ కాలంబులందున్= వేర్వేరు కాలాలలో; తద్+గుణ వ్యతికరమునన్= ఆ గుణాల కూడికతో; ఈ చాడ్పునన్= ఈ విధంగానే (సగుణ బ్రహ్మరూపంమాదిరి); జనియించుచుండున్= పుట్టుతూ ఉంటాడు; ఋషి= ఋషుల; దేవ= దేవతల; గణములు= సమూహాలు; తమతమ= స్వకీయమైన; కర్మనిర్మిత= కర్మలచే చేయబడిన; ఐశ్వర్య= సంపదలు; పారమేష్ఠ్యములు+అందున్= సమృద్ధియందు; పురుషత్వమునన్+పొంది= పౌరుషాన్ని పొంది; అధికారములు= పెత్తనాలు; వహించి= కైకొని; వర్తించి= మసలుకొని; క్రమ్మఱన్= మరల; వత్తురు= వస్తారు; మఱికొందఱు= వీరుకానివారు కొందరు; ఆరూఢ= పాతుకపోయిన; కర్మ+అనుసారము+ఐన= కర్మలనుసరించునట్టి; మనములను= మనస్సుల్ని; చాలన్+కలిగి= పెక్కింటినిపొంది; ధర్మములయందున్= నడవడికలలో; శ్రద్ధతోన్+కూడి=

శ్రద్ధగలవారై; అప్రతిషిద్ధము+ఐన= నిషేధింపబడనట్టి; నిత్య= తప్పక జరుగవలసిన; నైమిత్తిక= సకారణమైన; ఆచారనిపుణులు= ఆచారంలో నైపుణ్యం గలవారు; అగుచున్= అవుతూ; తగి= ఒప్పి; రజస్+గుణ= రజోగుణంతో; కలిత= కూడిన; చిత్తములు= మనస్సులు; కలిగి= పొంది...

**తా :** ఆ సర్వేశ్వరుడు కాలానుగుణంగా మూలస్వరూపంనుండి విడివడి గుణాల కలయికతో పెక్కు అవతారాలు (సగుణరూపాలు) ఎత్తుతూ ఉంటాడు. ఋషులు దేవతలు వారి కర్మగతి ననుసరించి, స్వర్గాది లోకాలలో పురుషరూపం ధరించి, కొంత పెత్తనం కావించి పురుషులుగా తిరిగివస్తారు. ఇతరులు కర్మానుసారులై ప్రాపంచిక ధర్మాలయెడ శ్రద్ధగల్గి, నిత్యనైమిత్తికకార్యాలలో తగుల్కొని, పితృదేవతలనే ఆరాధిస్తూ, తమయింటినే అంటిపెట్టుకొని జీవిస్తారు. (వీరికి విష్ణుభావన ఉండదని తాత్పర్యం).

**వ. సకాములై యింద్రియ జయంబు లేక పితృగణంబుల నెల్లప్పుడుఁ బూజించుచు గృహంబులయందు వర్తించి హరి పరాఙ్ముఖు లగువారు త్రైవర్గిక పురుషులని చెప్పంబడుదురు. 1021**

**ప్రతి :** (త్రైవర్గికులు); సకాములు+ఐ= కోర్కెలుగలవారై; ఇంద్రియజయంబులేక= ఇంద్రియాలపై అదుపులేక; పితృగణంబులన్= పితృదేవతల్ని; ఎల్లప్పుడు= నిరంతరం; పూజించుచున్= సేవిస్తూ; గృహంబులయందున్= తమ నివాసాలలో; వర్తించి= జీవించి; హరి పరాక్+ముఖులు+అగువారు= హరియందు విముఖులైనవారు; త్రైవర్గిక పురుషులు+అని= త్రివర్గమైన ధర్మార్థకామాలలో ఆసక్తులైన పురుషులని; చెప్పన్+పడుదురు= చెప్పబడతారు.

**తా :** ఈ త్రైవర్గికులకు ఇల్లే సర్వస్వం. వీరికి కోర్కెలు మెండు. కర్మేంద్రియ, జ్ఞానేంద్రియాలలో వీరికి అదుపు ఉండదు. వీరు నిరంతరం పితృదేవతల్ని మాత్రమే ఆరాధిస్తారు. శ్రీహరిని కొల్వరు. వీరిని త్రైవర్గిక పురుషులంటారు.

**చ. వినుత గుణోత్తరుండు నురువిక్రముఁడైన హరిన్ భజించి త**
**న్మనన లసత్కథామృతము మానుగఁ గ్రోలుట మాని దుష్కథల్**
**విని ముద మందుచుందురు, వివేకవిహీనత నూరఁబంది యా**
**త్మను మధురాజ్యభక్ష్యములు మాని పురీషముకేగు చాడ్పునన్. 1022**

**ప్రతి :** (ఈ హరివిముఖులు); వివేకవిహీనతన్= తెలివిలేమిచే; వినుత= స్తుతింపదగిన; గుణ+ఉత్తరుండు= విశిష్టగుణాలు కలవాడును; ఉరువిక్రముఁడు= గొప్పపరాక్రమం కలవాడును; ఐన= ఐనట్టి; హరిన్= విష్ణువును; భజించి= కొలిచి; తద్= ఆస్వామి; మనన= ధ్యానంవల్ల కల్గిన; లసత్= ఒప్పిదమైన; కథా+అమృతము= అమృత తుల్యమైన కథల్ని; మానుగన్= ప్రీతితో; క్రోలుట= ఆస్వాదించుట; మాని= వదలి; దుస్+కథల్= చెడ్డకథలు (అన్యదేవతాసంబంధి), విని; ముదము= సంతోషం; అందుచున్+ఉందురు= పొందుతుంటారు; ఎట్లన; ఊరఁబంది= గ్రామంలోనిపంది; ఆత్మను= బుద్ధియందు; మధుర= ఇంపైన; ఆజ్య= నేతితోడి; భక్ష్యములు= పిండివంటలు; మాని= వదలి; పురీషముకున్= పెంటకు; ఏగుచాడ్పునన్= వెళ్ళునట్లు.

**తా :** ఈ విష్ణుపరాఙ్ముఖులు అవివేకులు. మహాగుణశాలి, పరాక్రమధనుడైన శ్రీహరి కథామృతాన్ని చవిచూడ నిచ్చగించరు. అన్యదేవతా కథలంటే వీరికి చాలయిష్టం. వీరు నేతి పిండివంటలు మాని పీతికై పరుగులెత్తే ఊరబందు ల్లాంటివారు.

**చ. అలవడ ధూమమార్గగతులై పితృలోకముఁ బొంది పుణ్యముం**
**బొలసినవారు దొంటి తమ పుత్త్రులకుం దగఁ దాము పుట్టి వి**
**హ్వలమతి గర్భగోళ పతనాది పరేత ధరాగతాంతమై**
**వెలసిన కర్మ మిం దనుభవింతురు గావున నీవు భామినీ! 1023**

**ప్రతి :** అలవడన్= పొందగునట్లు; ధూమమార్గగతులు+ఐ= చీకటి దారిపట్టినవారై; పితృలోకమున్+పొంది= పితృదేవతల లోకాన్ని; పుణ్యమున్+పొలసినవారు= పుణ్యం నశించినవారు; తొంటి= పూర్వం; తమపుత్త్రులకున్= తమకొడుకులకు; తాము, తగన్+పుట్టి= బాగా జన్మించి; విహ్వలమతిన్= నిలుకడలేని మనస్సుతో; గర్భగోళ= కడుపు అనే సుడిలో; పతన+ఆది= పడుట మొదలుగా; పరేతధరా= శ్మశాన ప్రదేశమునకు; గత+అంతము+ఐ= గమనం చివరిదైన; వెలసిన= స్పష్టమైన; కర్మము= అనుచిత క్రియల్ని; ఇందున్= ఇహలోకమందు; అనుభవింతురు= రుచిచూస్తారు; కావునన్= అందువల్ల; భామినీ!= అమ్మా; నీవు...

**తా :** వివేక భ్రష్టులు చీకటిదారిలో ఊర్ధ్వలోకాలకు వెళ్ళి పితృలోకం పొందినవారు. అక్కడ తాము కూడబెట్టిన కర్మఫలం అంతరించగానే, తిరిగి తమ పుత్రులకే జన్మించగలరు. తల్లిగర్భగోళవాసం మొదలు శ్మశానవాటికా గమనంవరకు శ్మశానవాటి. పెక్కు దుర్భరక్రియల్ని అనుభవిస్తారు. అమ్మా! నీవు మాత్రం ఈ ఊబిలో పడవద్దు. అని చెప్పి కపిలుడు ఆమెకు పునర్జన్మ రాహిత్యాన్ని బోధిస్తున్నాడు.

**విశే :** చీకటి, రాత్రి, ఆరు నెలల దక్షిణాయన మార్గాన్ని 'వేదాంతులు' ధూమయానమన్నారు. మందభాగ్యులు ఆ దారిలో పితృలోకం చేరి పుణ్యం ఖర్చయిపోగా, అదే దారిలో తిరిగి భూలోకం చేరి, తమ సంతానానికే బిడ్డలవుతారు. నరకతుల్యమైన గర్భవాసం మొదలు స్మశానప్రాప్తి పర్యంతం ఈ లోకంలో కర్మానుభావం కల్గి ఉంటారు.

**క. విను సర్వభావములఁ బర, ముని ననఘు ననంతు నీశుఁ బురుషోత్తము స**
**న్మనమున భజియింపుము ముద, మునఁ, బునరావృత్తి లేని ముక్తి లభించున్. 1024**

**ప్రతి :** విను= అమ్మా! ఆలకించు; ముదమునన్= సంతోషంతో; సర్వభావములన్= మనోవృత్తులన్నింట; పరమునిన్= పరబ్రహ్మాయు; అనఘున్= దోషరహితుడును; అనంతున్= తుదిలేనివాడును; ఈశున్= జగత్కర్తయును; అగు, పురుష+ఉత్తమున్= శ్రీమహావిష్ణుమూర్తిని, సత్+మనమున= మంచి మనస్సుతో; భజియింపుము= కొల్వుము; పునస్+ఆవృత్తిలేని= తిరిగిరాని (పునర్జన్మలేని); ముక్తి= మోక్షం; లభించున్= దొరుకుతుంది.

**తా :** 'అమ్మా! నీవు త్రికరణశుద్ధిగా, పరంధాముడు, పాపరహితుడు, ఆదిమధ్యాంతములు లేనివాడు, జగత్కర్తయైన శ్రీమన్నారాయణుని నిరంతరం సేవిస్తూ ఉండు. అంతటితో నీకు పునర్జన్మ రహితమైన మోక్షం (సాయుజ్యప్రాప్తి) లభిస్తుంది.

**వ. అని చెప్పి వెండియు నిట్లనియె: భగవంతుండగు వాసుదేవునియందుం బ్రయుక్తంబగు భక్తియోగంబు బ్రహ్మసాక్షాత్కార సాధనంబు లగు వైరాగ్యజ్ఞానంబులం జేయు, నట్టి భగవద్భక్తి యుక్తంబైన చిత్త బింద్రియ వృత్తులచే సమంబులగు నర్థంబులందు వైషమ్యంబును ప్రియాప్రియంబులును లేక నిస్సంగంబు సమదర్శనంబు హేయోపాదేయ విరహితంబునై యారూఢంబైన యాత్మపదంబు నాత్మచేఁ జూచుచుండు**

**జ్ఞానరూపుండును బరబ్రహ్మంబును బరమాత్ముండును నీశ్వరుండును నగు పరమపురుషుం డేకరూపంబు గలిగి యుండియు దృశ్యద్రష్టృకరణంబులచేతం బృథగ్భావంబును బొందుచుండు, నిదియ యోగికి సమగ్రంబగు యోగంబునం జేసి ప్రాప్యంబగు ఫలంబు, కావున విషయవిముఖంబు లగు నింద్రియంబులచేత జ్ఞానరూపంబును హేయగుణ రహితంబును నగు బ్రహ్మంబు మనోవిభ్రాంతిం జేసి శబ్దాది ధర్మంబగు నర్థరూపంబునం దోఁచు, అది యెట్టు లర్థాకారంబునం దోఁచు నని యడిగితివేని నహంకారంబు గుణరూపంబునం జేసి త్రివిధంబును, భూతరూపంబునం బంచ విధంబును, నింద్రియరూపంబున నేకాదశ విధంబునై యుండు, జీవరూపుం డగు విరాట్పురుషుండు జీవవిగ్రహంబైన యండంబగు జగంబునం దోఁచుచుండు, దీని శ్రద్ధాయుక్తం బయిన భక్తిచేత యోగాభ్యాసంబునం జేసి సమాహిత మనస్కుండై నిస్సంగత్వంబున విరక్తుండైన వాఁడు వొడగను చుండు, నది యంతయు బుధజన పూజనీయ చరిత్రవు గావున నీకుం జెప్పితి, సర్వయోగ సంప్రాప్యుండును నిర్గుణుండును భగవంతుండని చెప్పిన జ్ఞానయోగంబును, మదీయ భక్తి యోగంబును నను రెండు నొక్కటియ, యింద్రియంబులు భిన్నరూపంబులు గావున నేకరూపంబయిన యర్థం బనేక విధంబు లగున ట్లేకం బగు బ్రహ్మం బనేక విధంబులుగఁ దోఁచు, మఱియును. 1025**

**ప్రతి :** అని చెప్పి= పైవిధంగా పునర్జన్మరాహిత్యాన్ని బోధించి; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు; భగవంతుండు+అగు= పరమాత్మయైన; వాసుదేవునియందున్= శ్రీమహావిష్ణువునందు; ప్రయుక్తంబు+అగు= ప్రయోగింపబడిన; భక్తియోగంబు= భక్తియోగం; బ్రహ్మసాక్షాత్కార= భగవంతుని దర్శించడానికి; సాధనంబులు+అగు= ఉపకారణములైన; వైరాగ్యజ్ఞానంబులన్= విరక్తినీ/జ్ఞానాన్ని; చేయున్= కల్గించును; అట్టి, భగవత్+భక్తి= పరమాత్మయందలి భక్తిచే; యుక్తంబు+ఐన= కూడినట్టి; చిత్తంబు= మనస్సు; ఇంద్రియవృత్తులచేన్= ఇంద్రియవ్యాపారాలచేత; సమంబులు+అగు= భేదరహితములగు; అర్థంబులందున్= వస్తువులందు; వైషమ్యంబును= వైరుధ్యమును; ప్రియ+అప్రియంబులును= ఇష్టము; అనిష్టము= ఈ రెండూ; లేక= లేకుండా; నిస్+సంగంబు= సంగరహితము (దేనితోనూ తగుల్కొనకుండుట); సమదర్శనంబు= అన్నింట సమదృష్టి; హేయ+ఉపాదేయ= గ్రహింపరానిది; గ్రహింపదగింది అనే రెండింటిచే; విరహితంబును= విడివడినది (గ్రాహ్యం, అగ్రాహ్యం అనే తేడాలేనిది); ఆరూఢంబు+ఐన= సువ్యవస్థితమైన; ఆత్మపదంబున్= ఆత్మపదవిని; ఆత్మచేన్= బుద్ధిచేత; చూచుచున్+ఉండున్= చూస్తూ వుంటుంది; జ్ఞానరూపుండును= జ్ఞానమే రూపంగా గలవాడును; పరబ్రహ్మంబును= ఉత్కృష్టబ్రహ్మస్వరూపుడును; పరమ+ఆత్ముండును= సర్వోత్తమమైన, ఆత్మయు; ఈశ్వరుండును= సర్వాధిపతియు; అగు= అయినట్టి; పరమపురుషుండు= ఉత్తమపురుషుడైన నారాయణుడు; ఏకరూపంబు= ఒకే ఆకృతి; కలిగి+ఉండియున్= కలవాడైకూడ; దృశ్య= చూడదగిన ప్రకృతి; ద్రష్టృ= చూచేవాడు; కరణంబులచేతన్= సాధనమైన కన్ను అనే మూడింటిచేత (దృక్కు – ద్రష్ట – దృశ్యం); పృథక్+భావంబును= వేర్వేరగుటను; పొందుచున్+ఉండున్= తాల్చుతుంటాడు; ఇది+అ= ఇదే; యోగికిన్= ధ్యాతకు; సమగ్రంబు+అగు= పరిపూర్ణమైన; యోగంబునన్+చేసి= యోగంవల్ల; ప్రాప్యంబు+అగు= పొందదగినట్టి; ఫలంబు= ఫలితం; కావునన్= అందుచేత; విషయవిముఖంబులు+అగు= ఇంద్రియార్థాలకు దూరమైనట్టి; ఇంద్రియములచేతన్= ఇంద్రియాలచేత; జ్ఞానరూపంబు= తెలివియు; హేయగుణరహితంబున్+అగు= విడువదగిన గుణంలేనిదియు (ఉపాదేయగుణం)నైన; బ్రహ్మంబు= పరమాత్మ; మనస్+విభ్రాంతిన్+చేసి= మిథ్యామతిచేత; శబ్ద+ఆదిధర్మంబు+అగున్= శబ్దస్పర్శరూపరసగంధలక్షణాలైన; అర్థరూపంబునన్+తోఁచున్= వస్తురూపంలో కనిపిస్తుంది;

అది= ఆ రూపం; ఎట్టుల= ఏ విధంగా; అర్థ+ఆకారంబునన్= వ్యక్తమైన రూపంతో; తోఁచున్+అని= తోస్తుందని; అడిగితివి+ఏనిన్= అడిగినదానవయ్యావో (చెపుతా విను); అహంకారంబు= అహంకృతి (నేను అనే భావన); గుణరూపంబునన్+చేసి= సత్త్వరజస్తమోగుణాలని; త్రివిధంబును= మూడురకాలు; భూతరూపంబునన్= భూతాకృతితో; పంచవిధంబునున్= నేల, నీరు, అగ్ని, గాలి, ఆకాశమనే అయిదు రకాలును; ఇంద్రియరూపంబునన్= ఇంద్రియాల ఆకారంతో; ఏకాదశవిధంబును+ఐ= మనస్సు, ఐదు కర్మేంద్రియాలు, ఐదు జ్ఞానేంద్రియాలు మొత్తం 11 రకాలుగామారి; ఉండున్= ఉంటాయి; (జీవరూపుండు+అగు= ప్రాణరూపంగా ఉన్నట్టి; విరాట్ పురుషుండు); జీవవిగ్రహంబు+ఐన= జీవశరీరమగు; అండంబు+అగు= గ్రుడ్డురూపంలోనున్న; జగంబునన్= విశ్వంలో; తోఁచుచుండున్= కన్పిస్తుంది; దీనిన్= ఈ రూపాన్ని; శ్రద్ధా= శ్రద్ధతో; యుక్తంబు+ఐన= కూడినట్టి; భక్తిచేతన్= ధ్యానంతో; యోగ+అభ్యాసంబునన్+చేసి= యోగాన్ని పాటించుటచేత; సమ్+ఆహిత= బాగుగా పొందుపడిన; మనస్కుండు+ఐ= మనస్సుకలవాడై; నిస్సంగత్వంబునన్= సాంగత్యంలేకుండ; విరక్తుండు+ఐనవాఁడు= విరాగియైన మానవుడు; పొడ+కనుచుండున్= దైవంయొక్క ఆచూకి తెలిసికోగల్గును; అది+అంతయున్= ఆ వాస్తవాన్ని; బుధజన= పండితులచే; పూజనీయ= కొనియాడబడిన; చరిత్రవు= నడవడి కలదానవు; కావునన్= కాబట్టి; నీకున్= తల్లీ, నీకు (దేవహూతికి); చెప్పితిన్= తెల్పినాను; సర్వ= సమస్తమైన; యోగ= ధ్యానాది యోగాలచే; సంప్రాప్యుండును= పొందదగినవాడును; నిర్+గుణుండును= హేయగుణములు లేనివాడును; భగవంతుండు+అని= పరమేశ్వరుడని; చెప్పిన= చెప్పినట్టి; జ్ఞానయోగంబును; మదీయ= నాదైన; భక్తియోగంబును= భక్తియోగం; అను రెండున్= ఈ రెండు యోగాలు; ఒక్కటి+అ= ఒక్కటే (భేదం లేదు); ఇంద్రియంబులు= ఏకాదశేంద్రియాలు; భిన్నరూపంబులు= వేఱువేఱు; కావునన్= కాబట్టి; ఏకరూపంబు+అయిన= ఒకే ఆకారమైన; అర్థంబు= వస్తువు; అనేక విధంబులు+అగునట్లు= పలువిధాలైనట్లు; ఏకంబు+అగు= ఒక్కటే అయిన; బ్రహ్మంబు= పరమాత్మ; అనేకవిధంబులు+కన్= పలురకాలుగా; తోఁచున్= కన్పడుతుంది; మఱియున్= ఇంకా,

**తా :** భగవంతు నుద్దేశించే భక్తియోగం పరమాత్మసాక్షాత్కారానికి అనువైన వైరాగ్యానికి, జ్ఞానానికి సాధనమైంది. భగవద్భక్తితో కూడిన బుద్ధి ఇష్టానిష్టాలయందును, ఇంద్రియార్థములందును, ఉచితానుచితములందును సమదృష్టి గల్గి ఆత్మాన్వేషణ చేస్తుంది. పరమాత్మ ఎల్లప్పుడు ఒకే స్వరూపం గల్గి, దృశ్యం, ద్రష్ట, దృక్కు అనే త్రిపుటి కారణంగా వేఱైనట్లు తోస్తాడు. యోగి తనయోగరూపంతో భిన్నరూపుడైన భగవంతునియందు అఖండరూపాన్నే దర్శిస్తాడు. అదే అనగా ఆ దర్శనమే ఆయనకు ఫలం. సామాన్యులకు మనోభ్రాంతివల్ల ఆ అఖండరూపం ఖండ ఖండంగా గోచరిస్తుంది. ఈ ఖండస్వరూపం ఎలాంటిదంటావా? అమ్మా! వినండి. అహంకారమనేది గుణస్వభావాన్ని బట్టి మూడురకాలు (సత్త్వం – రజస్సు – తమస్సు)గా; భూతస్వరూపాన్నిబట్టి పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశం అనే పంచభూతాత్మకంగా, ఇంద్రియరూపాన్నిబట్టి మనస్సు, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాలనే పదకొండు ఇంద్రియాలుగా ఖండరూపముంది. విరాట్పురుషుడు అండాకారంగా వున్న జగత్తునందు జీవరూపం తాల్చివున్నాడు. ఈ జగత్సత్యాన్ని నిస్సంగుడైనయోగి భక్తియోగంద్వారా మాత్రమే తెలుసుకోగల్గుతాడు. భగవంతుడు సకల యోగాలకూ వశుడవుతాడు. ఆయన త్రిగుణాతీతుడు. ఆయన్ను పొందడానికి జ్ఞానభక్తి యోగాలు రెండూ సాధనాలే. వీటికి తేడా లేదు. ఇంద్రియాలు వేఱు వేఱు. కాబట్టి ఒకేభావన పలురకాలుగా తోస్తున్నట్లే, బ్రహ్మస్వరూపంకూడ ఒకటే అయినప్పటికి భిన్నంగా తోస్తున్నది.

**సీ. అంబ! నారాయణుం దఖిల శాస్త్రములను సమధికానుష్ఠిత సవనతీర్థ**
**దర్శన జపతపోఽధ్యయన యోగక్రియా దాన కర్మంబులఁ గానఁబడఁడ,**

**యేచిన మనము బాహ్యేంద్రియంబుల గెల్చి సకల కర్మత్యాగ సరణి నొప్పి**
**తలకొని యాత్మ తత్త్వజ్ఞానమున మించి యుడుగక వైరాగ్యయుక్తిఁ దనరి**

**తే. మహిత ఫల సంగరహిత ధర్మమునఁ దనరు, నట్టి పురుషుండు దలపోయ, నఖిల హేయ**
**గుణములను బాసి కల్యాణ గుణవిశిష్టుఁ, డైన హరి నొందుఁ బరమాత్ము నసఘుఁ డగుచు. 1026**

**ప్రతి :** అంబ!= అమ్మా!; నారాయణుండు= శ్రీహరి; అఖిలశాస్త్రములను= సమస్తశాస్త్రాలనధ్యయనం చేయటంవల్లగాని; సమ్+అధిక= మిక్కిలి ఎక్కువగా; అనుష్ఠిత= చేయబడిన; సవన= యజ్ఞాలు; తీర్థదర్శన= పుణ్యతీర్థాల్ని చూచుట; జప= మంత్రజపం; తపస్= తపస్సు; అధ్యయన= వేదం చదువుట (స్వాధ్యాయం); యోగక్రియా= అష్టాంగయోగాలు (యమనియమాదులు); దానకర్మంబులన్= దానాది క్రియలవల్లగాని; కానన్+పడఁడు+అ= కన్పించనే కన్పించదు; ఏచిన మనము= శుద్ధమైన మనసును; బాహ్య+ఇంద్రియంబులన్= జ్ఞానేంద్రియాల్ని; కర్మేంద్రియాల్ని; గెల్చి= జయించి; సకల= సమస్తమైన; కర్మ= కర్మల; త్యాగసరణిన్= వదలిన పద్ధతితో; మించి= అతిశయించి; తలకొని= పూనుకొని; ఆత్మతత్త్వజ్ఞానమునన్= ప్రత్యగాత్మ ఎఱుకచే, మించి, ఉడుగక= విశ్రమించక; వైరాగ్యయుక్తిన్= విరక్తితో; తనరి= ఒప్పి; మహిత= గొప్ప; ఫలసంగరహిత= ఫలాసక్తివీడిన; ధర్మమునన్= క్రియతో; తనరు+అట్టి= ఒప్పారుచున్నట్టి; పురుషుండు= మానవుడు; అనఘుఁడు+అగుచున్= ఏ దోషాలు లేనివాడై; తలపోయన్= ఆలోచింపగా; అఖిల= సమస్తమైన; హేయగుణములను= నీచగుణాల్ని; పాసి= వదలి; కల్యాణగుణ= మంగళకరమైన గుణాలచే; విశిష్టుఁడు+ఐన= కూడినవాడగు; పరమాత్మున్= పరమేశ్వరుణ్ణి; ఒందున్= పొందగలడు.

**తా :** అమ్మా! కేవలం శాస్త్రాలు వల్లె వేసేవారికి, యజ్ఞాలు, చేస్తూ పుణ్యతీర్థాలు, తిరుగుతూ, జపం, తపం, వేదాధ్యయనం, యోగాలు, దానధర్మాలు చేసేవారికి శ్రీమన్నారాయణుని దర్శనం కానే కాదు. మనస్సును, దశేంద్రియాల్ని జయించి, కర్మలన్నింటిని త్యజించి, త్యాగియై, ఆత్మజ్ఞానసంపన్నుడై, విరాగిగా నున్నట్టి, ఫలాసక్తిలేని పురుషునికి కల్యాణగుణాకరుడైన ఆ పరమాత్ముని దర్శనం లభిస్తుంది.

**విశే :** ఇక్కడ కపిలమహర్షి పరమాత్మదర్శనం కావాలంటే 'సర్వకర్మల్ని త్యాగం చేయుమన్నాడు. ఇక్కడ కర్మల్ని వదలటమంటే, కర్మఫలాపేక్ష వదలి నిష్కామంగా కర్మలు చేయాలి అని భావం.

**వ. అది గావున నీకుం జతుర్విధ భక్తియోగ ప్రకారంబుఁ దేటపడ నెఱింగించితి, నదియునుం గాక కాలరూప యగు మదీయ గతి జంతువులయందు నుత్పత్తి వినాశరూపంబుల నుండు, నవిద్యా కర్మ నిర్మితంబులైన జీవుని గతు లనేక ప్రకారంబులై యుండు, నదియు జీవాత్మ వానియందుం బ్రవర్తించి యాత్మగతి యిట్టిదని యెఱుంగక యుండునని చెప్పి మఱియు నిట్లనియె. ఇట్టి యతిరహస్యంబగు సాంఖ్యయోగ ప్రకారంబు ఖలునకు, నవినీతునకు, జడునకు, దురాచారునకు, దాంభికునకు, నింద్రియలోలునకుఁ, బుత్త్ర దారాగారాద్యత్యంతాసక్త చిత్తునకు, భగవద్భక్తిహీనునకు, విష్ణుదాసులయందు ద్వేషపడువానికి నుపదేశింపవలవదు, శ్రద్ధాసంపన్నుండును, భక్తుండును, వినీతుండును, నసూయారహితుండును, సర్వభూతమిత్త్రుండును, శుశ్రూషాభిరతుండును, బాహ్యార్థజాత విరక్తుండును, శాంత చిత్తుండును, నిర్మత్సరుండును, శుద్ధాత్ముండును, భక్తులయందుఁ బ్రేమ గల వాఁడును, నన్యకాంతా విముఖుండును,**

**నిష్కాముండును నగు నధికారికి నుపదేశింప నర్హం బగు. ఈ యుపాఖ్యానం బే పురుషుండేనిఁ బతివ్రత యగు నుత్తమాంగన యేని శ్రద్ధాభక్తులు గలిగి మదర్పిత చిత్తంబున న్వినుఁ బఠియించు నట్టి పుణ్యాత్ములు మదీయ దివ్యస్వరూపంబుం బ్రాపింతు రని చెప్పెనని మైత్రేయుండు విదురునకు వెండియు నిట్టనియె, ఈ ప్రకారంబునం గర్దమదయితయైన దేవహూతి గపిలుని వచనంబుల విని నిర్ముక్త మోహపటల యగుచు సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి తత్త్వ విషయాంకిత సాంఖ్యజ్ఞాన ప్రవర్తకం బగు స్తోత్రంబు సేయ నుపక్రమించి కపిలున కిట్లనియె. 1027**

**ప్రతి :** అది= భగవద్దర్శనం; కావునన్= అలాంటిది కాబట్టి; నీకున్= తల్లీ! నీకు; చతుర్విధ= నాల్గురకాలైన; భక్తియోగప్రకారంబు= భక్తియోగపుతీరు; తేటపడన్= వెల్లడియగనట్లు; ఎఱింగించితిన్= తెల్పినాను; అదియునున్+కాక= అంతేకాకుండా; (కాలరూప+అగు= కాలరూపంగా ఉన్న); మదీయగతి= నా గమనం; జంతువులయందున్= ప్రాణులందు; ఉత్పత్తి= పుట్టుట; వినాశ= గిట్టుట; అనే, రూపంబులన్= రూపాలుగా; ఉండున్= ఉంటాయి; అవిద్యాకర్మ= అజ్ఞాన కర్మలచే; నిర్మితంబులు+ఐన= ఏర్పడినట్టి; జీవునిగతులు= ప్రాణినడకలు; అనేకప్రకారంబులు= పెక్కురకాలుగా; ఐ+ఉండున్= అయివుంటాయి; అదియున్= ఇంకా; జీవ+ఆత్మ= జీవుడు; వానియందున్= ఆ నానావగతులలో; ప్రవర్తించి= నెలకొని; ఆత్మగతి= ఆత్మస్థితి; ఇట్టిది+అని= ఇటువంటిదని; ఎఱుంగక= తెలియకుండా; ఉండున్= ఉంటుంది; అని చెప్పి= ఇట్లని చెప్పి; మఱియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= కపిలుడిట్లన్నాడు; ఇట్టి, అతిరహస్యంబు+అగు= మిక్కిలి దాచుకోదగినట్టి; సాంఖ్యయోగప్రకారంబు= జ్ఞానయోగపద్ధతి (సాంఖ్యం= ఆత్మానాత్మ విచారజ్ఞానం); ఖలునకున్= దుర్మార్గునికి; అవినీతునకున్= నడవడిసరిలేనివానికి; జడునకున్= అజ్ఞానికి; దుర్+ఆచారునకున్= దురాచారపరునికి; దాంభికునకున్= డంబాచారం కలవానికి; ఇంద్రియలోలునకున్= ఇంద్రియచాపల్యం గలవానికి; పుత్ర= కుమారులు; దార= భార్య; ఆగార+ఆది= ఇల్లు మున్నగు; వానియందు; అతి+అంత= మిక్కిలి; ఆసక్తునకున్= ఆసక్తిగలవానికి; భగవత్+భక్తి= భగవంతునియందుభక్తి; హీనునకున్= లేనివానికి; విష్ణుదాసుల+అందున్= విష్ణుభక్తులపై; ద్వేషపడువానికిన్= శత్రుత్వంగలవానికి; ఉపదేశింపన్= బోధపరచుట; వలదు= తగదు; శ్రద్ధాసంపన్నుండు= శ్రద్ధ గలవాడు; భక్తుండును= దైవభక్తుడు; వినీతుండును= నీతిగలవాడు; అసూయారహితుండును= ఈర్ష్యలేనివాడు; సర్వభూత= సమస్తప్రాణులకు; మిత్రుండును= మేలుకోరువాడు; శుశ్రూషా+అభిరతుండును= సేవయందు ఆసక్తి గలవాడును; బాహ్య+అర్థజాత= భౌతికవిజ్ఞానమందు; విరక్తుండును= ఆసక్తిలేనివాడు; శాంతచిత్తుండును= నెమ్మదియైన మనస్సుకలవాడు; నిర్మత్సరుండును= ద్వేషంలేనివాడు; శుద్ధ+ఆత్ముండును= నిర్మలమైన మనస్సుగలవాడు; భక్తుల+అందున్= నా భక్తులపై; ప్రేమగలవాఁడు= అభిమానంగలవాడు; అన్యకాంతా విముఖుండును= పరస్త్రీసాంగత్యంపట్ల ఆసక్తిలేనివాడు; నిష్కాముండునున్= ఏ కోర్కెలు లేనివాడు; అగు= అయినట్టి; అధికారికిన్= యోగ్యునకు; ఉపదేశింపన్= బోధచేయుటకు; అర్హంబు+అగున్= తగును; ఈ ఉపాఖ్యానంబు= ఈ ఉపకథ; ఏ పురుషుండు+ఏనిన్= ఎలాంటిమానవుడైనను; పతివ్రత+అగు= పతిభక్తిగలదైన; ఉత్తమ+అంగన+ఏని= యోగ్యురాలైనను; శ్రద్ధాభక్తులు= దీక్షమరియుభక్తి; కల్గి, మద్+అర్పిత= నా యందుంచిన; చిత్తంబునన్= బుద్ధితో; వినున్= వినునో; పఠియించున్= చదువునో; అట్టి= అలాంటి; పుణ్య+ఆత్ములు= పవిత్రమైన ఆత్మలుగలవారు; మదీయ= నాదైన; దివ్యస్వరూపంబున్= మంగళకరమైన రూపాన్ని; ప్రాపింతురు= పొందినవారవుతారు; అని= ఇట్లు బోధించి; చెప్పెన్+అని= చెప్పాడని; మైత్రేయుండు; విదురునకున్; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు; ఈ ప్రకారంబునన్= ఈ రీతిగా; కర్దమదయిత+అయిన దేవహూతి= కర్దమప్రజాపతి భార్యయైన దేవహూతి; కపిలుని వచనంబులు= కపిలాచార్యుని

పల్కులను; విని; నిర్+ముక్త= పూర్తిగా వదలిన; మోహపటల+అగుచున్= అజ్ఞానం గలదై; స+అష్ట+అంగ= ఎనిమిది అంగాలతో కూడిన; దండప్రణామంబులు= కఱ్ఱలా సాగిలపడి నమస్కరించుటలు; ఆచరించి= చేసి; తత్త్వవిషయ= యథార్థవిజ్ఞానమే; అంకిత= గుర్తుగాగల్గిన; సాంఖ్యజ్ఞాన= సాంఖ్యయోగంచే; ప్రవర్తకంబు+అగు= వెలసినట్టి; స్తోత్రంబున్= స్తుతిని; చేయన్= చేయుటకు; ఉపక్రమించి= ప్రారంభించి; కపిలునకున్= కపిలాచార్యునితో; ఇట్లు+అనియెన్= ఇలా అంది...

**తా :** నిర్మలమైన మనస్సు, ఇంద్రియవిజయం, ఫలనిరపేక్ష, వైరాగ్యం అనేవి భక్తియోగంలోని నాలుగు ముఖ్యాంశాలు. వీటిని తనతల్లికి కపిలుడు చక్కగా బోధించి ఇంకా ఇలా అన్నాడు. "అమ్మా! నేను కాలస్వరూపుణ్ణి. నా గతి ప్రాణికోట్లలో 'పుట్టుట, గిట్టుట' అనే రీతిగా వుంటుంది. అజ్ఞానకర్మలవల్ల జీవుని గమనం రకరకాలుగా ఉంటుంది. ఆ జీవుల్లో జీవాత్మ గుప్తంగా దాగివుంటుంది. దాన్ని తెలిసికోవటం తేలిక కాదు. ఈ సాంఖ్యవిజ్ఞానాన్ని (ఆత్మానాత్మవిచారాన్ని) నీతిమాలినవారికి, జ్ఞానహీనునికి, నడవడిక సరిలేనివానికి, దురహంకారికి, ఇంద్రియగ్లాని కలవానికి, భార్య, పిల్లలు, నివాసం వగైరాలందు ఆసక్తిగలవానికి, దైవభక్తి లేనివానికి, హరి భక్తుల్ని ద్వేషించేవానికి, బోధించరాదు. మరి ఎవరికి బోధించవచ్చో చెపుతున్నాడు స్వామి:

"అమ్మా! శ్రద్ధగలవాడు, ధ్యానించేవాడు. వినయశీలుడు, ఈర్ష్యలేనివాడు, ఎల్లరియందు మైత్రిగలవాడు, గురుసేవాసక్తుడు, ప్రాపంచిక విషయాలపట్ల విరక్తిగలవాడు, నెమ్మదియైనవాడు, ద్వేషం లేనివాడు, పరిశుద్ధమైన అంతరాత్మగలవాడు, నా భక్తులపట్ల ప్రేమగలవాడు, పరస్త్రీ సాంగత్యం కోరనివాడు, కోర్కెలేవియు లేనివాడు ఇలాంటి గుణగణాలు గలవానికి మాత్రమే సాంఖ్యయోగ రహస్యాలు బోధించాలి. ఈ ఉపాఖ్యానాన్ని ఏ స్త్రీపురుషులు శ్రద్ధాభక్తులు కల్గి నా యందే బుద్ధినిల్పి వింటారో లేక చదువుతారో అలాంటి పుణ్యాత్ములకు నేను సాక్షాత్కరిస్తాను" అని కపిలుడు తల్లికి జ్ఞానబోధ చేశాడు" అని మైత్రేయుడు విదురునికి నివేదించాడు.

తర్వాత మైత్రేయుడు విదురునితో 'అయ్యా! కర్దముని భార్యయైన దేవహూతి ప్రసంగమంతా విని, మోహభ్రాంతి తొలగినదై తన కుమారుడైన కపిలునికి సాగిలపడి నమస్కరించి, సాంఖ్యయోగ విజ్ఞానం ధ్వనించే స్తోత్రమిలా చేసింది. మళ్ళీ యిలా అంది–

**విశే :** చెవి యొగ్గి విని, విన్నదాన్ని ఆచరించేవారే జ్ఞానబోధకర్హులు. ఇది సార్వకాలీనమూ, సార్వజనీనమైన సత్యం. అవధానం, అధికారం లేనివారికి నీతులు బోధించటం వ్యర్థం. వానచినుకు ముత్తెపు చిప్పలోపడి ముత్తెమౌతుంది. నీటి చిప్పలోపడి పురుగౌతుందంటారు. అయోగ్యుని గతికూడ ఇలాంటిదే. సత్యం ఎప్పుడూ సార్వకాలీనం అనటానికి ఈ ఉపాఖ్యానం సాక్షి. త్రేతాయుగంలో కపిలుడుగా జన్మించిన శ్రీహరి తల్లిదేవహూతికి జ్ఞానోపదేశం చేశాడు. ఆత్మానాత్మజ్ఞానం, భగవద్భక్తి, జననమరణరహస్యం, కాలప్రభావం అనే తత్త్వవిషయాల్ని పూసగుచ్చినట్లుచెప్పి, ఈ ప్రబోధం ఎవరికి చేయాలో, ఎవరికి చేయకూడదో విశదం చేశాడు.

**సీ. అనయంబు విను మింద్రియార్థ మనోమయంబును భూతచయమయంబును నశేష**
**భూరి జగద్బీజ భూతంబును గుణప్రవాహ కారణమును వలను మెఱయు**
**నారాయణాభిఖ్య నాఁ గల భవదీయ దివ్యమంగళమూర్తిఁ దేజరిల్లు**
**చారు భవద్గర్భ సంజాతుఁ డగునట్టి కమల గర్భుండు సాక్షాత్కరింప**

**తే. లేక మనమునఁ గనియె ననేకశక్తి, వర్గములు గల్గి సుగుణప్రవాహరూప**
**మంది విశ్వంబు దాల్చి సహస్రశక్తి, కలితుఁడై సర్వకార్యముల్ గలుగఁజేయు. 1028**

**ప్రతి :** విను= కుమారా! వినుము; అనయంబు= ఎల్లప్పుడు; ఇంద్రియ+అర్థ= శబ్దాది విషయాలు; మనస్+మయంబును= మనోరూపమూ; భూతచయమయంబునున్= పృథివ్యాది అయిదుభూతాలుగానున్నాదు; అశేష= ఎల్ల; భూరి= గొప్ప; జగత్= లోకాల ఆవిర్భావానికి; బీజభూతంబును= విత్తనమైనదియు; గుణప్రవాహ కారణమును= సత్త్వరజస్తమోగుణములనే ప్రవాహమునకు హేతువైనదియు; వలనుమెఱయు= దిశలందు ప్రకాశించునట్టి; "నారాయణ+అభిఖ్య"+నాన్= 'నారాయణుడు' అనే పేరు; కల= కల్గినట్టి; భవదీయ= నీదైన; దివ్య= దేదీప్యమానమైన; మంగళ= శుభప్రదమైన; మూర్తిన్= స్వరూపమును; తేజరిల్లు= ప్రకాశిస్తున్న; చారు= సుందరమైన; భవత్= నీయొక్క; గర్భ= కడుపునందు; సంజాతుఁడు= పుట్టినవాడు; అగున్+అట్టి= అయినట్టి; కమలగర్భుండు= బ్రహ్మ; సాక్షాత్కరింపన్ లేక= దర్శించజాలక; మనమునన్= మనస్సులో; కనియెన్= దర్శించాడు; అనేక శక్తివర్గములు+కల్గి= పెక్కు శక్తుల సమూహాల్నికల్గి; సుగుణప్రవాహరూపము= సద్గుణాలనే ప్రవాహరూపమును; అంది= పొంది; విశ్వంబు+తాల్చి= ప్రపంచాన్ని ధరించి; సహస్రశక్తి కలితుఁడు+ఐ= వేలకొలది శక్తులతో కూడినవాడై; సర్వకార్యముల్= అన్నిపనుల్ని (విధులు); కలుగన్+చేయున్= చక్కబెట్టును.

**తా :** తల్లి దేవహూతి కపిలునితో అంటున్నది. కుమారా! నీది ప్రపంచంలో దేదీప్యమానమైన స్వరూపం. దాన్ని 'నారాయణుడని' అంటారు. ఆ రూపం శబ్దాది విషయమయం మనోమయం. పృథివ్యాది పంచభూతాలమయం, త్రిగుణాల ఉనికికి హేతువు, అయి దిక్కులన్నింట దేదీప్యమానంగా వెల్గుతున్నది. నీ గర్భకుహరంనుండి బ్రహ్మ పుట్టాడు. అతడు నీ రూపాన్ని సాక్షాత్తుగా దర్శింపలేక కేవలం మనస్సుతో భావించాడు. దానికనేక శక్తులున్నాయి. ఈ విశ్వమంతట నీ సుగుణాలు ప్రవాహరూపంగా వ్యాపించివున్నాయి. సర్వశక్తిమంతమైన నీ రూపం సర్వజగత్కార్యాలను నిర్వహిస్తున్నది.

**వ. అంత. 1029**

**ప్రతి :** అంతన్= అనంతరం.

**తా :** అంతలో.

**తే. అతుల భూరి యుగాంతంబునందుఁ గపట, శిశువవై యొంటి కుక్షి నిక్షిప్త నిఖిల**
**భువన నివహుండవై మహాంభోధి నడుమఁ, జారు వటపత్ర తల్పసంస్థాయి వగుచు. 1030**

**ప్రతి :** అతుల= సాటిలేని; భూరి= గొప్ప; యుగ+అంతంబునందున్= యుగం ముగిసే సమయంలో (ప్రళయకాలంలో); కుక్షి= కడుపునందు; నిక్షిప్త= దాచిన; నిఖిల= సమస్తమైన; భువననివహుండవు+ఐ= లోకాల సమూహంగలవాడవై; మహా+అంభోధినడుమన్= గొప్ప కడలిమధ్య; కపటశిశువవు+ఐ= కృత్రిమమైన బిడ్డవై; ఒంటిన్= ఒక్కడవే; చారు= సుందరమైన; వటపత్రతల్ప= మఱ్ఱియాకు సెజ్జయందు; సంస్థాయివి+అగుచున్= పరున్నవాడవై...

**తా :** ప్రళయకాలాంతంలో నీవు 'సమస్తలోకాల్ని కడుపులో దాచుకొని, కపట శిశువుగా పెద్ద కడలినడుమ 'వటపత్రశాయివి'గా కన్పిస్తావు.

**తే. లీల నాత్మీయ పాదాంగులీ వినిర్గ, తామృతము గ్రోలినట్టి మహాత్మ! నీవు**
**గడఁగి నా పూర్వభాగ్యంబు కతన నిపుడు, పూని నాగర్భమున నేఁడు పుట్టితయ్య! 1031**

**ప్రతి :** మహా+ఆత్మ= గొప్పహృదయంగల ఓ మహానుభావా!; లీలన్= ఒకక్రీడగా; ఆత్మీయ= నీదైన; పాద+అంగులీ= కాలిబొటనవ్రేలినుండి; వినిర్గత= బయల్వెడలిన; అమృతమున్= సుధను; క్రోలిన+అట్టి= ఆస్వాదించినట్టి; నీవు= నీవు; కడఁగి= పూని; ఇపుడు= ప్రస్తుతం; నా పూర్వభాగ్యంబుకతనన్= నా పూర్వజన్మపుణ్యవశాన; నాగర్భమునన్=నా కడుపునందు; నేఁడు= ఇప్పుడు; పుట్టితి+అయ్య= జన్మించినావయ్యా!

**తా :** మహాత్మా! నీ కాలిబొటనవ్రేల బుట్టిన అమృతము సేవించిన మహానుభావుడవు. నా పూర్వజన్మపుణ్యంవల్ల నేటికి నా కడుపున పుట్టావు" అన్నది దేవహూతి.

**విశే :** ఇక్కడొక పౌరాణికగాథవుంది. పూర్వజన్మంలో కర్దముని పుత్రికయైన కళకు మరీచివల్ల ఒక బిడ్డ కల్గింది. ఆమెపేరు పూర్ణిమ. ఈమె వేరొక జన్మలో హరిపాదాల్ని కడిగిన నీటిలో గంగ అనే పేరుతో పుట్టింది. ఈమెకు దేవకుల్య అనేకూతురు, విరజుడు అనే కొడుకు పుట్టారు. కళ ఎవరోకాదు. దేవహూతికి బిడ్డే.

ప్రస్తుత పద్యంలో దేవహూతి హరి అవతారుడైన (భాగవతకథ) కపిలుణ్ణి స్తుతిస్తూంది. ఆమె తన గర్భాన శ్రీహరి అవతారమెత్తి నందుకు ఆశ్చర్యచకితురాలైనట్లు పద్యభావం ఉంది. ఆశ్చర్యమెందుకు? అనేది ప్రశ్న. శ్రీహరి విశ్వమయుడు. పంచభూతాలు, ఏకాదశేంద్రియాలు, పదునాల్గుభువనాలు ఆయన గర్భంలో దాగివున్నాయి. ఇంత గొప్పభారాన్ని మోసే విశ్వమూర్తి తన గర్భంలో ఎలా ఇమిడాడా? అని ఆశ్చర్యపడింది. అయితే ఆమె స్వామిని మాయాశిశువుగా పోల్చుకొంది. తన బొటనవ్రేల పొడమిన గంగాజలాన్ని స్వామి ఆస్వాదిస్తున్నట్లు ఆమె భావించింది. ఇది బాల్యచేష్ట. చిన్నపిల్లలు కాలివ్రేళ్ళు, చేతివ్రేళ్ళు చీకటం సహజమే కదా!

**వ. అట్టి పరమాత్ముండ వయిన నీవు. 1032**

**ప్రతి :** అట్టిపరమాత్ముండవు= అంతటి గొప్పదేవుడవు; అయినన్+నీవు= అయినట్టి నీవు (కపిలుడు).

**తా :** సాక్షాత్తు పరమాత్ముడవు అయిన ఓ కపిల మహాశయా! నీవు,

**సీ. వరుస విగ్రహ పారవశ్యంబునను జేసి రఘురామ కృష్ణ వరాహ నార**
**సింహాది మూర్తు లంచితలీల ధరియించి దుష్టనిగ్రహమును శిష్టపాల**
**నమును గావించుచు నయమున సద్ధర్మ నిరత చిత్తులకు వర్ణింపఁ దగిన**
**చతురాత్మతత్త్వ విజ్ఞాన ప్రదుండవై వర్తింతు వనఘ! భవన్మహత్త్వ**

**తే. మజున కయినను వాక్రువ్వ నలవి గాదు, నిగమ జాతంబు లయిన వర్ణింపలేవ**
**యెటిఁగి సంస్తుతి సేయ నే నెంత దాన?, వినుత గుణశీల! మాటలు వేయు నేల? 1033**

**ప్రతి :** విగ్రహపారవశ్యంబుననున్+చేసి= అవతారమెత్తే ఆతురతతో; వరుసన్= క్రమంగా; రఘురామ= శ్రీరాముడు; కృష్ణ= వాసుదేవుడు; వరాహ= కిటి (పంది); నారసింహ= నరసింహస్వామి; ఆది= మొదలైన; మూర్తులు= అవతారాలు;

అంచితలీలన్= ఒప్పిదమైన విలాసంతో; ధరియించి= తాల్చి; దుష్ట నిగ్రహమును= దుర్మార్గుల్ని మట్టుపెట్టుట; శిష్టపాలనమును= సన్మార్గుల్ని రక్షించుట; కావించుచున్= చేస్తూ; నయమునన్= న్యాయంగా; సత్+ధర్మ= ఉత్తమధర్మకార్యాలలో; నిరత= ఆసక్తిగల; చిత్తులకున్= మనస్సులు కలవారికి; వర్ణింపన్+తగిన= కొనియాడదగినట్టి; చతుస్+ఆత్మతత్త్వ= మనోబుద్ధి చిత్తాహంకారరూపమైన; విజ్ఞానప్రదుండవు+ఐ= జ్ఞానమార్గ ప్రదర్శకుడవు అయి; వర్తింతువు= సంచరిస్తావు; అనఘ= ఓ పాపరహితుడా!; భవత్= నీయొక్క; మహత్త్వంబు= మహిమ; అజునకున్+అయినను= బ్రహ్మకుకూడ; వాక్రువ్వన్= చెప్పడానికి; అలవి కాదు= సాధ్య పడదు; నిగమజాతంబులు+అయినన్= వేదసమూహంకూడ; వర్ణింపన్+లేవు+అ= వివరించజాలవు; ఎఱిఁగి= తెలిసి; సంస్తుతి+చేయన్= కొనియాడుటకు; నేను= నేను; ఎంతదానన్= ఎంతశక్తిగలదాన్ని? (అశక్తురాలనని భావం); వినుత= కొనియాడదగిన; గుణశీల= మంచిగుణాలే నడవడికగా గల ఓ మహాత్మా!; మాటలు; వేయున్+ఏల= పెక్కేల? (మాటలతో పనిలేదని భావం).

**తా :** స్వామీ! నీవు అవతారాలనెత్తే ఆసక్తిగలవాడవు. శ్రీరాముడు, కృష్ణుడు, ఆదివరాహం, నారసింహుడు మొదలైన ఎన్నో అవతారా లెత్తావు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేశావు. ధర్మాత్ములకు ఆత్మవిజ్ఞానమార్గాన్ని నిర్దేశించావు. నీ మహిమను ఆ బ్రహ్మకూడ వర్ణించలేడు. వేదబృందం సైతం వివరించలేదు. వేయిమాటలేల? మరి నిన్ను పొగడటానికి నేనెంతదాన్ని? (స్వామి వర్ణనాతీతుడని భావం).

**వ. అదియునుం గాక. 1034**

**ప్రతి :** అదియునున్+కాక= ఈ చెప్పిందే కాదు.

**తా :** అంతమాత్రమే కాక

**క. ధీమహిత! భవన్మంగళ, నామస్మరణానుకీర్తనము గల హీనుల్**
**శ్రీమంతు లగుదు, రగ్ని, ష్టోమాదికృదాళికంటె శుద్ధులు దలఁపన్. 1035**

**ప్రతి :** ధీమహిత= ఓ బుద్ధివైభవం గలవాడా!; భవత్= నీ; మంగళనామ= శుభనామాన్ని; స్మరణ= స్మరించటం; అనుకీర్తనము= పాడటం; గల= కల్గినట్టి; హీనుల్= అధములు; శ్రీమంతులు+అగుదురు= ధనికులవుతారు; అగ్నిష్టోమ= అగ్నిష్టోమం; ఆది= మొదలైన వాటిని; కృత్+ఆళికంటె= చేయువారికంటె; తలఁపన్= ఆలోచింపగా; శుద్ధులు= ఆ హీనులు పరిశుద్ధులు.

**తా :** మహాత్మా! నీ పవిత్ర నామాన్ని స్మరించేవారు, స్తుతించేవారు ఎంత అధములైననూ, వారు నిజంగా శ్రీమంతులే అవుతారు. అంతేగాదు అగ్నిష్టోమాది క్రతువులు చేసే యజ్ఞకర్తలకంటె కూడ పవిత్రులే.

**వ. అదియునుం గాక. 1036**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేగాదు

**తా :** ఇంకా...

**క. నీ నామస్తుతి శ్వపచుం, డైనను జిహ్వాగ్రమందు ననుసంధింపన్**
**వానికి సరి భూసురుఁడుం, గానేరఁడు చిత్ర మిది జగంబుల నరయన్. 1037**

**ప్రతి :** నీ నామస్తుతిన్= నీ పేరు పేర్కొనుట; శ్వపచుండు+ఐనను= కుక్క మాంసంతినే చండాలుడైనను; జిహ్వా+అగ్రమందున్= నాలుక కొసయందు; అనుసంధింపన్= నూల్కొల్పగా; భూసురుఁడున్= బ్రాహ్మణుడుసైతం (నామస్మరణ లేనివాడైతే); వానికిన్= ఆ చండాలునికి; సరి కానేరఁడు= సమానుడు కాజాలడు; అరయన్= ఆలోచిస్తే; జగంబులన్= లోకాలలో; అది= అట్లగుట; చిత్రము= ఆశ్చర్యకరం.

**తా :** నీ పేరుచ్చరించేవాడు చండాలుడైనను, అతడు బ్రాహ్మణునికంటె కూడ శ్రేష్ఠుడే. ఇది నిజంగా లోకంలో విచిత్రమైన సంగతి.

**ఉ. ఈ విధ మాత్మలం దెలిసి యెప్పుడు సజ్జనసంఘముల్ జగ**
**త్పావనమైన నీ గుణకథామృత మాత్మలఁ గ్రోలి సర్వ తీ**
**ర్థావళిఁ గ్రుంకినట్టి ఫల మందుదు రంచు సమస్త వేదముల్**
**వావిరిఁ బల్కుఁ గావునను వారలు ధన్యులు మాన్యు లుత్తముల్. 1038**

**ప్రతి :** ఎప్పుడు= ఎల్లప్పుడు; సత్+జనసంఘముల్= ఉత్తములైన వారెల్లరు; ఈ విధము= ఈ నీ నామోచ్చారణ విధానం; ఆత్మలన్+తెలిసి= మనస్సులకు ఒంటబట్టించుకొని; జగత్+పావనము+ఐన= లోకాన్ని పవిత్రం చేయజాలిన; నీ; గుణకథా+అమృతమున్= నీ గుణాల్ని తెల్పే కథలనే అమృతాన్ని; ఆత్మలన్= హృదయపూర్వకంగా; క్రోలి= ఆస్వాదించి; సర్వ= ఎల్ల; తీర్థ+ఆవళిన్= పుణ్యతీర్థాలన్నింట; క్రుంకిన+అట్టి= మునకలు వేసినటువంటి; ఫలము= ఫలితాన్ని; అందుదురు= పొందుతారు; అంచున్= అంటూ; సమస్తవేదముల్= నాల్గువేదాలు; వావిరిన్= వరుసగా (పనిగట్టుకొని); పల్కున్= ఘోషిస్తాయి; కావునను= అందువల్ల; వారలు= నీ నామామృతాన్ని పానంచేసినవారలు; ధన్యులు= అదృష్టవంతులు; మాన్యులు= పూజింపఁదగినవారు; ఉత్తముల్= శ్రేష్ఠులు.

**తా :** భగవన్నామస్మరణచేసే చండాలుడుసైతం బ్రాహ్మణునికంటె కూడ శ్రేష్ఠుడనే సత్యం తెలిసినవారు లోకపావనమైన నీ కథామృతపానంవల్ల, ఎల్లతీర్థాల్లో మునిగితే వచ్చే ఫలాన్ని పొందగల్గుతారు. ఈ వాస్తవాన్ని వేదవాఙ్మయం చాటుతోంది. ఆ అమృతాన్ని చవిచూచిన వారే ధన్యులు, వారే పూజ్యులు, వారే సజ్జనులు.

**వ. అది గావునఁ బరబ్రహ్మంబవును, బరమ పురుషుండవును, బ్రత్యఙ్మనోభావ్యుండవును, సమస్త జన పాపనివారక స్వయం ప్రకాశుండవును, వేదగర్భుండవును, శ్రీ మహావిష్ణుండవును నగు నీకు వందనంబు లాచరించెద నని స్తుతియించినం బరమ పురుషుండును. మాతృవత్సలుండును నగు కపిలుండు గరుణారసార్ద్ర హృదయ కమలుండై జనని కిట్లనియె. 1039**

**ప్రతి :** అది కావునన్= ఆ కారణంవల్ల; పరబ్రహ్మంబవును= అక్షర పరబ్రహ్మస్వరూపుడవు; పరమపురుషుండవును= పురుషశ్రేష్ఠుడవు; ప్రత్యక్+మనస్= ప్రత్యగాత్మచేత; భావ్యుండవును= భావింపదగ్గవాడవును; సమస్తజన= ఎల్లజనులయొక్క; పాపనివారక= దోషాల్ని మట్టుపెట్టే; స్వయంప్రకాశుండవును= స్వయంజ్యోతి స్వరూడవూ; వేదగర్భుండవును= వేదములను కడుపులో దాచుకొన్నవాడవూ; శ్రీమహావిష్ణుండవునున్= శ్రీమన్నారాయణుడవు; అగున్= అయినట్టి; నీకున్= (కపిలాచార్యునకు); వందనంబులు= నమస్కారాలు; ఆచరించెదన్+అని= సమర్పింతును అని; స్తుతియించినన్= స్తోత్రం చేయగా; పరమపురుషుండును= ఉత్తమపురుషుడునూ; మాతృవత్సలుండునున్= తల్లిప్రేమను చూరగొన్నవాడును, తల్లియందు

ప్రేమగలవాడును; అగు= అయిన; కపిలుండు= కపిలముని; కరుణారస= దయారసంచేత; ఆర్ద్ర= తడిసిన (మృదువైన); హృదయకమలుండు+ఐ= ఎదతామరగలవాడై; జననికిన్= తల్లితో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** దేవహూతి కుమారుడైన కపిలునుద్దేశించి, 'ఆర్యా! నీవు అక్షర పరబ్రహ్మస్వరూపుడవు, పురుషశ్రేష్ఠుడవు. ప్రత్యగాత్మకు మాత్రమే అందేవాడవు. ఎల్లపాపాల్ని తుదముట్టించగల ప్రకాశం నీ అధీనం. వేదవిజ్ఞానస్వరూపుడవైన సాక్షాత్ శ్రీమన్నారాయణుడవు. నీ కివే నా నమస్కారాలు అని అనగా, మాతృవాత్సల్యం చూరగొన్న ఆయన హృదయం దయారసంతో ఉప్పొంగిపోయింది. తల్లితో అంటున్నాడు.

**తే. తవిలి సుఖరూపమును మోక్షదాయకంబు, నైన యీ యోగమార్గ మే నంబ! నీకు**
**నెఱుఁగ వివరించి చెప్పితి నిది దృఢంబు, గాఁగ భక్తి ననుష్ఠింపు కమలనయన! 1040**

**ప్రతి :** అంబ= అమ్మా!; కమలనయన= తామరలవంటి కన్నులుగల మాతా!; తవిలి= పూని; సుఖరూపమును= సుఖప్రదమైనదియు; మోక్షదాయకంబున్= మోక్షాన్ని ఇచ్చేదియు; ఐన= అయినట్టి; ఈ యోగమార్గము= ఈ యోగవిజ్ఞానాన్ని; ఏన్= నేను; నీకున్+ఎఱుఁగన్= నీకు తెలిసేటట్లు; వివరించి= విడమర్చి; చెప్పితిన్= బోధించాను; ఇది= ఈ విజ్ఞానము; దృఢంబు+కాఁగన్= నీలో పాదుకొనేటట్లు; భక్తిన్= శ్రద్ధతో; అనుష్ఠింపు= ఆచరించుము.

**తా :** తల్లీ! పూజ్యురాలా! సుఖదాయకమూ, మోక్షప్రదమూ అయిన యీ యోగరహస్యాన్ని నీకు విస్తరించి చెప్పాను. ఏమరక భక్తితో నీవు అనుష్ఠించవలసింది.

**క. జీవన్ముక్తి లభించుం, గావున నేమఱక తలఁపు కైకొని దీనిన్**
**వావిరి నొల్లని వారికిఁ, దావల మగు మృత్యుభయము, దవ్వగు సుఖమున్. 1041**

**ప్రతి :** కావునన్= అందువల్ల (అనుష్ఠానంవల్ల); జీవత్+ముక్తి= బ్రతికివుండగానే లభించుమోక్షం; లభించున్= చేకూరుతుంది; ఏమఱక= మరువకుండ; తలఁపు= భావించుము; కైకొని= గ్రహించి; దీనిన్= ఈ అనుష్ఠానాన్ని; వావిరిన్= క్రమం తప్పకుండా; ఒల్లనివారికిన్= అనుష్ఠించనివారికి; మృత్యుభయము= మిత్తిభీతి; తావలము+అగున్= దరి చేరుతుంది; సుఖమున్= సుఖం కూడ; దవ్వు+అగున్= దూరమౌతుంది.

**తా :** 'యోగానుష్ఠానంవల్ల' జీవన్ముక్తి లభిస్తుంది. దీన్ని గ్రహించి ఏమరుపాటు లేకుండా తలంచుము. దీన్ని మనసారా ఆచరించని వారికి మృత్యుభయం వెన్నంటే వుంటుంది. సుఖంకూడ హుళక్కి.

**క. అని యిట్లు దేవహూతికి, మన మలరఁగఁ గపిలుఁ డాత్మ మార్గం బెల్లన్**
**వినిపించి చనియె నని విదు, రునకున్ మైత్రేయమునివరుం డెఱిఁగించెన్. 1042**

**ప్రతి :** అని+ఇట్లు= ఈ విధంగా; కపిలుఁడు= కపిల మహర్షి; దేవహూతికిన్= తల్లియైన దేవహూతికి; మనము+అలరన్+కన్= మనస్సు ఆనందం పొందేవిధంగా; ఆత్మమార్గంబు= ఆత్మజ్ఞానాన్ని (సాంఖ్యం); ఎల్లన్= పూర్తిగా; వినిపించి= చెప్పి; చనియెన్= వెళ్ళిపోయాడు; అని= ఈ విధంగా; మైత్రేయమునివరుండు= మైత్రేయుడనే మునీశ్వరుడు; విదురునకున్= విదురునికి; ఎఱిఁగించెన్= తెల్పాడు.

**తా :** ఇలాగా కపిలుడు తల్లియైన దేవహూతికి సాంఖ్యవిజ్ఞానాన్ని వివరించి చెప్పి అంతర్ధానం చెందాడు అని మైత్రేయ మహాముని విదురునికి చెప్పాడు.

**వ. అట్లు కపిలుం దేగిన పిదప దేవహూతియుం బుత్రుండు సెప్పిన యోగమార్గంబున విజ్ఞానంబు గలిగి యుండియుం బెనిమిటియైన కర్దమునిం దనయుండైన కపిలునిం బాసి నష్టవత్సయగు గోవు చందంబునం దల్లడిల్లుచుఁ గపిలమహామునిం దలంచుచుం గర్దమ తపస్సామర్థ్యంబున నైనయట్టి. 1043**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; కపిలుండు; ఏగినపిదపన్= వెళ్ళిన తర్వాత; దేవహూతియున్= దేవహూతి; పుత్రుండు+చెప్పిన= కుమారుడు బోధించినట్టి; యోగమార్గంబునన్= యోగపద్ధతిద్వారా; విజ్ఞానంబు= అనుభవజ్ఞానాన్ని; కలిగి+ఉండియున్= పొందికూడ; పెనిమిటి+ఐన= భర్తయైన; కర్దమునిన్= కర్దమప్రజాపతిని; తనయుండు+ఐన= కుమారుడైన; కపిలునిన్= కపిలుణ్ణి; పాసి= విడిచి; నష్టవత్స= దూడని కోల్పోయినది; అగు= అయినట్టి; గోవు చందంబునన్= ఆవువలె; తల్లడిల్లుచున్= దుఃఖిస్తూ; కపిలమహామునిన్= కపిలుణ్ణి; తలంచుచున్= స్మరిస్తూ; కర్దమ= తనభర్తయైన కర్దమ మహర్షియొక్క; తపస్+సామర్థ్యంబునన్= తపః ప్రభావంవల్ల; ఐన+అట్టి= పుట్టినటువంటి...

**తా :** కపిలుడు వెళ్ళిపోయాక దేవహూతి కుమారుని యోగమార్గోపదేశంతో విజ్ఞానవతి అయింది. అనంతరం ఆమె తన భర్తయైన కర్దమ ప్రజాపతి, కుమారుడైన కపిలుడు తనని వదలిపోగా, దూడని కోల్పోయిన గోమాతలాగా తల్లడిల్లింది. ఎదలో కపిలుణ్ణి స్మరించుకొంటూ తనభర్త కర్దముని తపోభూమివైపు దృష్టిసారించింది.

**ఉ. మానిత సౌరభప్రసవ మంజుల పక్వ ఫలప్రవాళ భా**
**రానత చూత పోత విటపాగ్ర నికేతన రాజకీర స**
**మ్మాని సుఖానులాప పరిమండిత కర్దమతాపసాశ్రమో**
**ద్యాన వన ప్రదేశ కమలాకర తీర నికుంజ పుంజముల్. 1044**

**ప్రతి :** మానిత= కొనియాడదగిన; సౌరభప్రసవ= వాసనగలపూలచే; మంజుల= ఇంపైన; పక్వఫల= పండిన పండ్లచే; ప్రవాళభార= చిగురాకుల బరువుచే; ఆనత= క్రిందికి వంగిన; చూతపోతవిటప= గున్నమామిడి చెట్ల కొమ్మలయొక్క; అగ్ర= చివరనున్న; నికేతన= గూళ్ళయందలి; రాజకీర= రాచిల్కలయొక్క; సమ్మాని= ఆదరింపదగిన; సుఖ+అనులాప= ఇంపు గలిగించే సల్లాపాలచే; పరిమండిత= ప్రకాశిస్తున్న; కర్దమ= కర్దముని; తాపస+ఆశ్రమ= తపోవనమందలి; ఉద్యానవనప్రదేశ= విహారవనభూమిలోనున్న; కమల+ఆకరతీర= సరోవరపు గట్టులయందలి; నికుంజ పుంజముల్= పొదరిళ్ళ గుంపులు.

**తా :** కర్దముని తపోవనమందు ఏపైన గున్నమామిడిచెట్లున్నాయి. అవి పూచిన పూలతో, పండిన పళ్ళతో, ఎఱ్ఱని చివురుటాకులతో భూమికి వంగి ఉన్నాయి. ఆ చెట్ల కొనల్లో రాచిల్కలు, గూళ్లెక్కి, కర్దమ మహర్షి కీర్తికి నీరాజనాలర్పిస్తున్నవా అన్నట్లు మనోజ్ఞంగా ఆలాపిస్తున్నాయి. ఆ తపోవనమందలి ఉద్యానవనంలో చక్కని సరోవరం. దాని తీరంవెంట పొదరిళ్ళు ఉన్నాయి.

**వ. వెండియు. 1045**

**ప్రతి :** వెండియున్= మఱియు

**తా :** ఇంకా

**సీ. అంచిత స్ఫటిక మయ స్తంభ దీప్తిచేఁ గొమరారు మరకత కుడ్యములను**
**సజ్జాతి వజ్రాల సజ్జాలరుచులచే భాసిల్లు నీల సోపానములను**
**దీపించు చంద్రకాంతోపలవేదుల విద్రుమ గేహళీ విలసితముల**
**హాటక రత్న కవాట శోభితముల నలరిన సౌధశాలాంగణముల**

**తే. వర పయః ఫేన పటల పాండుర కరీంద్ర, దంత నిర్మిత ఖట్వాతి ధవళ పట్ట**
**రచిత శయ్యాళులును జతురంతయాన, కనక పీఠాది వస్తు సంఘముల నెల్ల. 1046**

**ప్రతి :** అంచిత= ఒప్పిదమైన; స్ఫటికమయ= పటికపుఱాలతోడి; స్తంభదీప్తిచేన్= కంబములకాంతిచేత; కొమరారు= అలరారుచున్న; మరకత= పచ్చరాళ్ళుపొదిగిన; కుడ్యములను= గోడలను; సత్+జాతివజ్రాల= ఉత్తమ జాతివజ్రాలయొక్కయు; సత్= చక్కని; జాల= కిటికీల; రుచులచేన్= కాంతులతో; భాసిల్లు= ప్రకాశిస్తున్న; నీల= నీలివన్నెల; సోపానములను= మేడమెట్లను; దీపించు= వెల్గుతున్న; చంద్రకాంత+ఉపల= చలువఱాతి; వేదుల= తిన్నెలతో; విద్రుమ= పగడపు; గేహళీ= గడపలచే; విలసితములన్= ఒప్పారుచున్నవియు; హాటక= బంగారం; రత్న= రత్నాలు పొదివిన; కవాటశోభితములన్= ద్వారబంధాల అలంకారంతో; అలరిన= ఒప్పినట్టి; సౌధశాలా= ఇంటి; అంగణములన్= ముంగిళ్ళతోను; వర= శ్రేష్ఠమైన; పయస్= పాల; ఫేనపటల= నురుగువలె; పాండుర= తెల్లనైన; కరి+ఇంద్ర, దంత= శ్రేష్ఠమైన ఏనుగు దంతంచే; నిర్మిత= చేయబడిన; ఖట్వా= మంచాలపై; అతి ధవళపట్టరచిత= స్వచ్ఛమైన పట్టములచే ఏర్పరిచిన; శయ్యాళులను= పడకల సమూహములను; చతరంతయాన= పల్లకీలు; కనకపీఠ+ఆది= బంగారు పీటలు మొదలైన; వస్తు సంఘములన్+ఎల్ల= వస్తుసమూహములన్నింటిని...

**తా :** కర్దముని తపోవనవాటికలో పటికపురాలచే నిర్మించిన స్తంభాలతో చూడముచ్చటైన పచ్చరాలచే నిర్మింపబడిన గోడలున్నాయి. వజ్రాలు పొదివిన చక్కని కిటికీలతో, విలసిల్లుతున్న నీలివన్నెల మేడమెట్లు, చలువరాతి తిన్నెలతో, పగడాలకాంతిగల గడపలతో వాటిక శోభాయమానంగావుంది. అక్కడి సౌధశాలలకు బంగారుతో తయారై, రతనాలు పొదివిన వాకిళ్ళు అమర్చారు. పాలనురుగువలె తెల్లనైన ఏనుగు దంతాలతో చెక్కబడిన మంచాలు, వాటిపై స్వచ్ఛమైన పట్టాల సెజ్జలు, పల్లకీలు, బంగరుపీటలు వీటితో ఆ వాటిక విలసిల్లుతున్నది.

**వ. మఱియు వికచకమల కుముద సౌగంధిక బంధుర సుగంధానుబంధి గంధవహ శోభితంబును నరవింద నిష్యంద కందళిత మరంద రసపాన మదవదిందిందిర సందోహ ఝుంకార సంకులంబునునై చెలువారు బావులు గలిగి, పురందర సుందరీ నందితంబైన కర్దమాశ్రమంబుఁ బరిత్యజించి కుటిలంబులైన కుంతలంబులు జటిలంబులుగా ధరియించి సరస్వతీ బిందు సరోవరంబులం ద్రిషవణ స్నానంబు గావించుచు నుగ్రతపోభారంబునం గృశీభూత శరీరయై నిజకుమారుండును బ్రసన్నవదనుండును గపిల నామధేయుండును నగు నారాయణుని సమస్త సన్యస్త చింతనలచే ధ్యానంబు సేయుచుఁ బ్రవాహరూపం బైన భక్తి యోగంబునను నధికవైరాగ్యంబునను యుక్తానుష్ఠాన జాతంబై బ్రహ్మత్వాపాదకంబగు జ్ఞానంబును విశుద్ధ మనంబును గలిగి. 1047**

**ప్రతి :** మఱియున్= ఇంకా; వికచ= విచ్చినట్టి; కమల= తామరలు; కుముద= నల్లకలువలు; సౌగంధిక= చెంగల్వలు; వీటిచే; బంధుర= మనోజ్ఞమైన; గంధవహ= గాలిచే; శోభితంబున్= విలసిల్లునదియు; అరవింద= తామరపూవులనుండి;

నిష్యంద= స్రవించుటచే; కందళిత= పొటమరించిన; మరందరస= తేనెను; పాన= త్రాగుటవల్ల; మదవత్= మదించిన (మత్తెక్కిన); ఇందిందిర= తేనెటీగలగుంపుయొక్క; ఝంకార= జుమ్మను నాదంచే; సంకులంబునున్+ఐ= వ్యాపించినదియు అయి; చెలువారు= ఒప్పారుచున్న; బావులు కలిగి= బావులతో; పురందరసుందరీనందితంబు+ఐన= దేవతా స్త్రీలచే కొనియాడబడిన; కర్దమ+ఆశ్రమంబున్= కర్దముని ఆశ్రమమును; పరిత్యజించి= వదలి; కుటిలంబులు+ఐన= వంకరలైన; కుంతలంబులు= తలవెంట్రుకలు; జటిలంబులుగాన్= జడలుగా; ధరియించి= తాల్చి; సరస్వతీబిందు సరోవరంబులన్= సరస్వతి బిందు సరస్సులందు; త్రిషవణ= మూడు వేళల; స్నానంబు+కావింపుచున్= జలకమాడుచు; ఉగ్ర= తీవ్రమైన; తపస్+భారంబునన్= భారమైన తపస్సువల్ల; కృశీభూత= శుష్కించిన; శరీర+ఐ= దేహంగలదై; నిజకుమారుండును= తనకొడుకును; ప్రసన్న= నిర్మలమైన; వదనుండును= మోముగలవాడును; కపిలనామధేయుండును= కపిలుడనే పేరుగలవాడును; అగు= అయినట్టి; నారాయణునిన్= శ్రీహరిని; సమస్త= పూర్తిగా; సన్న్యస్త= విడువబడిన; చింతలచేన్= ఆలోచనలతో అనగా ఎల్లకోర్కెలనుండి విముక్తయై; ధ్యానంబు+చేయుచున్= ధ్యానిస్తూ; ప్రవాహరూపంబు+ఐన= ఎడతెగక సాగుచున్న; భక్తియోగంబునన్= భక్తియోగంచేత; అధిక= అతిశయమైన; వైరాగ్యంబునను= విరక్తి గుణంతో; యుక్త= యోగ్యమైన; అనుష్ఠానజాతంబు+ఐ= ఆచారంవల్ల కల్గినదియు; బ్రహ్మత్వ+ఆపాదకత్వంబున్= బ్రహ్మస్వరూపాన్ని కల్గించగలదియు; అగు= అయినట్టి; జ్ఞానంబును= తెలివిని; విశుద్ధమనంబును= మిక్కిలి దోషంలేని మనస్సును; కలిగి= పొంది...

**తా :** ఇంకా ఆ కర్దమాశ్రమం వికసించిన తామరలు, నల్లకలువలు, చెంగల్వలు మున్నగువాటియొక్క సువాసనల్నిటి గ్రహించి వీస్తున్నగాలులు, తామరపూలనుండి స్రవించే తేనెను ఆస్వాదించి మత్తెక్కిన జుంటీగలు ముసరుతున్న బావులు, కల్గివుంది. ఇంకా చిత్రవిచిత్రమైన ఆభరణాలు, వాసనాద్రవ్యాలు ఎన్నోవున్నాయి. దేవహూతి వాటిన్నింటిని పరిత్యజించింది. సరస్వతి నదిలోను బిందుసరస్సులోను నిత్యం మూడువేళల స్నానంచేస్తూ, ధ్యానంలో మునిగి, తపస్సు చేసి కృశించిన శరీరం గలదయింది. నిర్మలచిత్తముతో భక్తియోగం, వైరాగ్యం ఆసరాగా, ప్రశాంత వదనుడును, తనకుమారుడును, అగు శ్రీమన్నారాయణమూర్తి అవతారం తాల్చిన కపిలుని స్మరిస్తూ బ్రహ్మజ్ఞానం పడసింది.

**విశే :** కర్దమాశ్రమాన్ని మహావైభవం కలదిగా వర్ణించారు. ఆ వర్ణనలో దేవహూతి ప్రలోభ పడకపోవటం అనే మహాగుణాన్ని తెలియజెప్పటం తాత్పర్యం.

**సీ. అనయంబు నాత్మనాయకుఁడును విశ్వతోముఖుఁ డనంతుఁడుఁ బరముఁడు నజుండు**
**చతురుండు నిజపరిజ్ఞాన దీపాంకుర మహిమ నిరస్త సమస్త భూరి**
**మాయాంధకారుఁ డమేయుఁ డీశ్వరుఁ డగు నా పరబ్రహ్మంబునం దవిరత**
**బద్ధతత్త్వ జ్ఞాన పరతచే నిర్ముక్త జీవ భావమున విశిష్టయోగ**

**తే. భవ్యసంప్రాప్త నిర్మల బ్రహ్మభావ, ములను గలిగి సమాధిచే నెలమిఁ దనరు**
**నపునరావృత్త మగు త్రిగుణప్రధాన, తత్త్వముల నొప్పి సంతతోదారనియతి. 1048**

**ప్రతి :** అనయంబున్= ఎల్లప్పుడు; ఆత్మనాయకుఁడును= ఆత్మకు అధిపతియు; విశ్వతస్+ముఖుఁడు= సర్వజగద్వ్యాప్తుడు; పరముఁడు= శ్రేష్ఠుడును; అజుండు= పుట్టుకలేనివాడును; చతురుండు= చాతుర్యంకలవాడును; నిజపరిజ్ఞాన= తన ఎఱుక

అనే; దీప+అంకుర= దీపపుమొలక; మహిమన్= కాంతిచేత; నిరస్త= అంతరించిన; సమస్త= ఎల్ల; భూరి= గొప్ప; మాయా+అంధకారుఁడు= మాయఅనే చీకటిగలవాడును; (ఆ స్వామిస్వరూపజ్ఞానంవల్ల మాయాంధకారం నశిస్తుంది); అమేయుఁడు= మితిలేనివాడును; ఈశ్వరుఁడు= ప్రభువును; అగున్= అయినట్టి; పరబ్రహ్మంబునందున్= అవినాశియైన బ్రహ్మస్వరూపమందు; అవిరత= విశ్రాంతిలేనట్టి; బద్ధ= తగుల్కొన్న; తత్త్వజ్ఞానపరతచేన్= అభేదజ్ఞానమందలి ఆసక్తిచే; నిర్+ముక్త= వదలిపెట్టబడిన; జీవభావమునన్= జీవత్వముచే; విశిష్ట= ప్రశస్తమైన; యోగ= యోగంవలన; భవ్య= దివ్యముగా; సంప్రాప్త= పొందబడిన; నిర్మల= దోషంలేనట్టి; బ్రహ్మభావములను= బ్రహ్మస్మరణలను; కలిగి= పొంది; సమాధిచేన్= నిష్ఠచేత; ఎలమిన్= ప్రీతితో; తనరున్= ఒప్పారునట్టి; నపునరావృత్తము+అగు= తిరిగిరానట్టి (జన్మరాహిత్యం) త్రిగుణప్రధాన= సత్త్వము రజస్సు తమస్సులనే, ముఖ్యమైన; తత్త్వములన్= స్వరూపాలతో; ఒప్పి= వెలసి; సంతత= ఎల్లప్పుడు; ఉదారనియతిన్= క్రమగతమైన ఔదార్యంతో...

**తా :** దేవహూతి ఆత్మజ్ఞాన సాధనతో జీవత్వభ్రాంతి ఆస వీడి, ప్రకృష్టమైన పరబ్రహ్మమందు లీనమైంది. ఆ పరబ్రహ్మస్వరూపం ప్రత్యగాత్మకు మూలరూపం. విశ్వమంతట వ్యాపించినట్టిది. శ్రేష్ఠమైనది. పుట్టుక లేనిది. స్వకీయమైన జ్ఞానదీపంతో మాయాంధకారాన్ని పటాపంచలు చేయగల్గింది. అమేయమైంది. విశ్వమంతటిపై అధికారంగలది. అలాంటి అద్వితీయమైన అక్షరపరబ్రహ్మమందు దేవహూతి దృష్టిని నిలిపి, సమాధిద్వారమున భగవంతునిలో విలీనమై పునర్జన్మ విముక్తిని కోరుతూ ఉంది.

**విశే :** నపునావృత్తము – మరల సంభవించినవి. జ్ఞానం పొందడంవలన దేవహూతి సంసారబంధ నిమిత్తాలైన గుణాదులు తిరిగి కలుగలేదు – అని తాత్పర్యం.

**తే. కలలఁ దోఁచిన వస్తుసంఘముల మేలు, కొని కనుంగొనఁగా లేని మనుజు పోల్కిఁ**
**బొలఁతి తన యాత్మ మఱచి యిమ్ముల సధూమ, మైన పావకుగతి నుండె నంతలోన. 1049**

**ప్రతి :** కలలన్= స్వప్నమందు; తోఁచిన= కన్పించినట్టి; వస్తుసంఘములన్= పదార్థాలను; మేలుకొని= మేల్కొని; కనుంగొనన్+కాన్= లేని, చూడజాలని; మనుజు+పోల్కిన్= మానవునివలె; పొలఁతి= ఆమె; తన+ఆత్మన్= తన శరీరాన్ని; మఱచి= మరచిపోయి; ఇమ్ములన్= శాంతంగా; సధూమము+ఐన= పొగచూరిన; పావకుగతిన్= అగ్నివలె; ఉండెన్= ఉండింది; అంతలోనన్= ఆ లోపల

**తా :** కలలో కన్పించిన వస్తువు మేల్కొగానే కన్పించదు. దేవహూతికూడ ఆత్మతత్త్వ సాక్షాత్కారంకాగా దేహవిస్మరణపొంది పొగచూరిన అగ్నిలా ఉండిపోయింది.

**క. గురుయోగ శక్తిచే నం, బరతలమున కెగసి సత్కృపామయుఁడగు నా**
**పరవాసుదేవు చరణాం, బురుహ యుగన్యస్త చిత్తము గలది యగుచున్. 1050**

**ప్రతి :** గురు= గొప్పదైన; యోగశక్తిచేన్= యోగబలంచేత; అంబర తలమునకున్= ఆకాశ ప్రదేశానికి; ఎగసి= ఎగిరిపోయి; సత్+కృపామయుఁడు+అగున్= మంచి దయామయుడైన; ఆ, పరవాసుదేవు= పరమాత్మయైన శ్రీహరియొక్క; చరణ+అంబురుహ= పాదపద్మాల; యుగ= జంటయందు; న్యస్త= పాదుకొల్పిన; చిత్తము+కలది+అగుచున్= మనస్సుగలదై...

**తా :** యోగశక్తితో ఆ దేవహూతి ఆకాశాని కెగసి, దయాసముద్రుడైన ఆ శ్రీమన్నారాయణుని అడుగుదామరలపై మనసు నిల్పింది.

**వ. ఇట్లు కపిలోక్తమార్గంబున దేవహూతి శ్రీహరియందుఁ గలసె, నయ్యంగనారత్నంబు మోక్షంబునకుం జనిన క్షేత్రంబు "సిద్ధిపదం" బనుపేరం బరఁగి ప్రసిద్ధి వహించె, అంత నక్కడఁ గపిలుండు తల్లిచేత ననుజ్ఞాతుండై సిద్ధ చారణ గంధర్వాప్సరోముని నివహ సంస్తూయమానుం డగుచు సముద్రునిచేత దత్తార్ఘ్య పూజా నికేతనంబులు వడసి సాంఖ్యాచార్యాభిష్టుతంబగు యోగంబు నవలంబించి లోకత్రయ శాంతి కొఱకు సమాహితుండై స్వపిత్రాశ్రమంబు విడిచి యుదగ్భాగంబునకుం జనియె నని మైత్రేయ మహాముని విదురున కిట్లనియెఁ దండ్రీ! యీ యుపాఖ్యానంబును నాకు గోచరించిన రీతి నీకుం జెప్పితి, నిది కపిల "దేవహూతి సంవాదం" బత్యంత పావనంబు, గపిల ప్రణీతంబు నయిన యోగంబు, దీనిం బరమభక్తి యుక్తుండై యెవ్వండు పఠించు, నెవ్వండు విను, నట్టి పుణ్యాత్ములు విగతపాపులై గరుడ ధ్వజుండయిన పుండరీకాక్షుని శ్రీచరణారవిందంబులం బొందుదురని మైత్రేయుండు విదురున కెఱింగించిన విధంబున శుక యోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకుం జెప్పెనని సూతుండు శౌనకాది మహామునులకు నీ కథా వృత్తాంతంబు సెప్పిన విని ప్రహృష్ట హృదయులై మునికులోత్తమా! భవద్వాక్పూరం బగు భగవత్కథామృతంబు గ్రోలుచుండ మా మనంబులం దనివోవ, దింకను దరువాతి వృత్తాంతంబులు మాకు విశదంబులుగ వినిపింప నీవ యర్హుండ వని యడుగుటయు. 1051**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; కపిల+ఉక్త= కపిలునిచే చెప్పబడిన; మార్గంబునన్= పద్ధతితో; దేవహూతి= దేవహూతి; శ్రీహరియందున్= విష్ణుదేవునియందు; కలసెన్= విలీనమైంది; (అనగా 'సాయుజ్యప్రాప్తి' ఆమెకు కల్గింది) ఆ+అంగనారత్నంబు= ఆ స్త్రీరత్నమైన దేవహూతి; మోక్షంబునకున్= వైకుంఠానికి; చనిన= వెళ్ళినట్టి (కారణభూతమైన); క్షేత్రంబు= పుణ్యభూమి; సిద్ధిపదంబు+అను పేరన్= 'సిద్ధిపద' మనేపేరుతో; పరఁగి= ఒప్పి; ప్రసిద్ధిన్= ఖ్యాతిని; వహించెన్= పొందింది; అంతన్, అక్కడన్= ఆ క్షేత్రంలో; తల్లిచేతన్= దేవహూతిచే; అనుజ్ఞాతుండు+ఐ= అనుమతింపబడినవాడై; సిద్ధ= సిద్ధులు; చారణ= చారణులు; గంధర్వ= గంధర్వులు; అప్సరస్= అప్సరసలు; ముని= మునులు మున్నగువారి; నివహ= సమూహముచే; సంస్తూయమానుండు+అగుచున్= కొనియాడబడుచున్నవాడై; సముద్రునిచేతన్= సాగరంచేత; దత్త= ఇవ్వబడిన; అర్ఘ్య, పూజా= అర్ఘ్యము, పూజ, నివాసమునకు వసతి అనువానిని; నికేతంబులు; పడసి= పొంది; సాంఖ్య+ఆచార్య= సాంఖ్యశాస్త్రమెరిగిన గురువులచే; అభిష్టుతంబు+అగు= పొగడబడినట్టి; యోగంబున్= యోగాన్ని; (సాంఖ్యయోగాన్ని); అవలంబించి= ఆశ్రయించి; లోకత్రయ= ముల్లోకాల; శాంతికొఱకున్= శాంతికై; సమాహితుండు+ఐ= పూనుకొన్నవాడై; స్వ= తన; పితృ+ఆశ్రమంబు= తండ్రియైన కర్దముని ఆశ్రమం; విడిచి= వదలి; ఉదక్+భాగంబునకున్= ఉత్తరదిశకు; చనియెన్= వెళ్ళాడు; అని; మైత్రేయమహాముని= గొప్పమునియైన మైత్రేయుడు; విదురునకున్= విదురునితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు; తండ్రీ!= నాయనా!; ఈ+ఉపాఖ్యానంబు= ఈ ఉపకథ; నాకున్= (మైత్రేయునకు); గోచరించినరీతిన్= తెలిసినంతమేర; నీకున్= నీకు (విదురునకు); చెప్పితిన్= వివరించాను; ఇది= ఈ ఉపకథ; కపిలదేవహూతి= కపిలుడు, దేవహూతి అనేవారి; సంవాదంబు= సంభాషణం (ప్రశ్నోత్తరగర్భితమైనది); అతి+అంత=

మిక్కిలి; పావనంబు= పుణ్యప్రదము; కపిల= కపిలాచార్యునిచే; ప్రణీతంబున్+అయిన= రూపుదిద్దుకొన్నట్టి; యోగంబు= యోగం; దీనిన్= ఈ యోగాన్ని; పరమ= మిక్కిలి; భక్తియుక్తుండు+ఐ= భక్తితో కూడినవాడై (ధ్యానియై); ఎవ్వండు= ఏ మానవుడు; పఠించున్= చదువుతాడో; ఎవ్వండు= ఏ ప్రాణి; వినున్= వింటాడో; అట్టిపుణ్య+ఆత్ములు= అలాంటి ధన్యులు; విగతపాపులు+ఐ= పాపాలు తొలగినవారై; గరుడధ్వజుండు+ఐన= గరుడుడు వాహనంగా, ధ్వజంగా కల్గిన; పుండరీక+అక్షుని= పద్మనయనుడైన విష్ణువుని; శ్రీ= మంగళకరమైన; చరణ+అరవిందములన్= అడుగుదామరలను; పొందుదురు+అని= అందుకొంటారని, మైత్రేయుండు= మైత్రేయముని; విదురునకున్; ఎఱింగించిన విధంబున= తెల్పినరీతిగ; అని; శుకయోగి+ఇంద్రుండు= శుకమహాయోగి; పరీక్షిత్+నర+ఇంద్రునకున్= పరీక్షిన్మహారాజు అను పేరు గలవానికి; చెప్పెన్+అని= చెప్పినాడు అని; సూతుండు= కథకుడైన సూతుడు; శౌనక+ఆది= శౌనకుడు మొదలైన; మహామునులకున్= మహర్షులకు; ఈ కథావృత్తాంతంబు= ఈ ఉపాఖ్యానాన్ని; చెప్పినన్= చెప్పగా, విని= విన్న తర్వాత; ప్రహృష్ట హృదయులు+ఐ= సంతృప్తి చెందిన మనస్సుగలవారై; మునికుల+ఉత్తమా= మునుల వంశములో శ్రేష్ఠుడా! ఓ సూతా!; భవత్= తమ; వాక్+పూరంబు+అగు= నీ పల్కులతో నిండినదైన; భగవత్= భగవంతునిదైన; కథా+అమృతంబు= కథ అనే తేనెను; క్రోలుచు+ఉండన్= ఆస్వాదిస్తుండగా; మామనంబులన్= మా మనస్సులో; తని+పోవదు= తృప్తి నొందకున్నది; ఇంకను= మరియు; తర్వాతివృత్తాంతంబులు= తర్వాత జరిగిన సంఘటనలు; మాకున్ (శౌనకాదులకు); విశదంబులుగన్= స్పష్టంగా; వినిపింపన్= చెప్పటానికి; నీవు+అ= నీవే (సూతుడే); అర్హుండవు+అని= యోగ్యుడవని; అడుగుటయున్= ప్రార్థింపగా...

**తా :** దేవహూతి కపిలుడు బోధించిన యోగమార్గంలో పయనించి శ్రీహరి సాయుజ్యం పొందింది. ఆమె వైకుంఠానికేగుట కాస్కారమైన ఆ పుణ్యక్షేత్రం 'సిద్ధిపదం' అనేపేరుతో వాసికెక్కింది. ఇక అక్కడే కపిలుడు తల్లిని వదలి ఆకాశసంచారులైన సిద్ధసాధ్యగంధర్వులు, అప్సరసలు, మునులు ప్రస్తుతిస్తుండగా, సముద్రుడిచ్చిన పూజాదులను పొంది, లోకశాంతి నిమిత్తం ఉత్తరదిక్కుకు వెళ్ళిపోయాడు అని మైత్రేయుడు విదురునికి చెప్పి "తండ్రీ! ఈ ఉపకథ నాకు తెలిసినంతవఱకు నీకు చెప్పాను. ఇది కపిల దేవహూతి సంవాదం. మిక్కిలి పవిత్రమైంది. దీన్ని రచించినవాడు కపిలుడే. ఇదొక యోగం. దీన్ని యే మానవుడు భక్తితో వింటాడో లేక చదువుతాడో వాడు పుణ్యాత్ముడు. సర్వపాపాలనుండి విముక్తుడవుతాడు. భగవంతుడైన శ్రీహరి పాదపద్మాల్ని చూరగొంటాడు" అని చెప్పి ముగించాడు. 'ఈ కథ శ్రీశుకుడు పరీక్షిన్నరేంద్రునికి చెప్పాడని సూతుడనే కథకుడు శౌనకాది మహామునులకు వివరించాడు. అప్పుడా శౌనకాదులు మహానందం చెంది', మహాత్మా! మీ వాగమృతాన్ని రుచిచూస్తుంటే మాకు తనివి తీరదు. ఇంకా తర్వాతి కథలు విన్పించండని ప్రార్థించారు.

**విశే :** దేవహూతికి వైష్ణవతత్త్వంలో ఇమిడిన సాయుజ్యప్రాప్తి ఈ వచనంలో అభివర్ణించబడింది. ఈ ఉపాఖ్యానం శరణాగతితత్త్వానికి శిఖరాయమాణమైనట్టిది. విశిష్టాద్వైతమతానికి ఎత్తిన కరదీపిక ఇది. అత్యంతపుణ్యప్రదమైన కథ అని వ్యాసమహర్షియే ఉగ్గడించాడు.

ప్రధానంగా భాగవతపురాణం విష్ణుమాహాత్మ్యాన్ని లోకానికి చాటడానికి ఏర్పడిన మహోత్కృష్టగ్రంథం. ఇందులోని ప్రధానేతి వృత్తానికి పోషకంగా ఉన్న ఉపాఖ్యానాలన్నీ శ్రీహరి అద్వితీయమహిమను చాటేవే. ఆ ఉపాఖ్యానాలన్నింట 'కపిలదేవహూతి' సంవాదమనే ఉపాఖ్యానం మేల్బంతి.

దేవహూతి పునర్జన్మ రాహిత్యాన్నిపొంది శాశ్వతముక్తి పదవిని అందుకొనింది. భారతీయసాహిత్యంలోగాని, వైదికవిభాగంలోగాని కపిలదేవహూతి సంవాదంవంటి విశిష్టోపాఖ్యానం వేరొకటి కన్పించదు.

**చ. జనకసుతా మనో విమల సారస కోమల చంచరీక! చం**
**దన శరదిందు కుంద హర తార మరాళ పటీర చంద్రికా**
**వినుత యశోవిశాల! రఘువీర! దరస్మిత పద్మపత్ర లో**
**చన! నిటలాంబక ప్రకట చాపవిఖండన! వంశమండనా! 1052**

**ప్రతి :** జనకసుతా= జనకుని కూతురైన సీతాదేవియొక్క; మనస్= మనస్సనే; విమలసారస= స్వచ్ఛమైన పద్మానికి; కోమల= మృదువైన; చంచరీక= తుమ్మెదవంటివాడా!; చందన= శ్రీగంధం; శరత్+ఇందు= శరదృతువులోని చంద్రుడు; కుంద= మొల్ల; హర= పరమశివుడు; తార= నక్షత్రం; మరాళ= హంస; పటీర= చందనం; చంద్రికా= వెన్నెల మున్నగువానివలె; వినుత= కొనియాడబడిన; యశస్+విశాల= స్వచ్ఛమైన కీర్తిగలవాడా!; రఘువీర= రఘువంశానికి చెందిన వీరుడా!; దర= ఇంచుక; స్మిత= చిరునవ్వుగల; పద్మపత్ర= తామరరేకులవంటి; లోచన= కన్నులుగలవాడా!; నిటల+అంబక= నొసటమూడవకన్నుగల పరమేశ్వరుని; ప్రకట= పేరుగాంచిన; చాప= వింటిని; విఖండన= త్రుంచినవాడా!; వంశ= రఘుకులానికి; మండనా= అలంకారమైనవాడా!;

**తా :** "సీతాదేవి హృదయపద్మానికి శ్రీరాముడు తుమ్మెదను పోలినవాడు. ఆ స్వామికీర్తి శ్రీగంధం. శరచ్చంద్రుడు, మొల్లలు, శివుడు, నక్షత్రాలు, హంస, గంధపుచెట్టు, వెన్నెలవలె స్వచ్ఛమైంది. ఆయన రఘువంశవీరుడు. ఆయన కన్నులు విచ్చిన తెల్లదామరరేకుల్ని పోలివున్నాయి. శివధనుర్భంగం కావించినవాడు. రఘువంశానికి అలంకారమైనవాడు.

**తరలము :**

**పరమపావన! విశ్వభావన! బాంధవ ప్రకరావనా!**
**శరధిశోషణ! సత్యభాషణ! సత్కృపామయ భూషణా!**
**దురిత తారణ! సృష్టికారణ! దుష్టలోక విదారణా!**
**ధరణిపాలన! ధర్మశీలన! దైత్యమర్దన ఖేలనా! 1053**

**ప్రతి :** పరమపావన!= మిక్కిలి పవిత్రమైనవాడా!; విశ్వభావన= విశాలమైన భావాలుగలవాడా!; బాంధవప్రకర= బంధుకోటిని; అవనా= రక్షించువాడా!; శరధిశోషణ= సముద్రుని ఇంకించినవాడా!; సత్యభాషణ= సత్యమునే పల్కువాడా!; సత్+కృపామయ భూషణా= ఉత్తమమైన దయారూపమగు ఆభరణంగలవాడా!; దురితతారణ= పాపాలనుండి తరింపజేయువాడా!; సృష్టికారణ= లోకసృష్టికి కారణమైనవాడా!; దుష్టలోక= దుర్మార్గుల్ని; విదారణా!; చెండాడువాడా!; ధరణిపాలన= భూమిని పాలించినవాడా; ధర్మశీలన= ధర్మబద్ధమైన నడవడిగలవాడా!; దైత్యమర్దన= రాక్షసవధయే; ఖేలనా= క్రీడగా గలవాడా!

**తా :** ఆ శ్రీరాముడు మిక్కిలి పవిత్రుడు. ఆయన ఆశయాలు విశాలమైనవి. ఆయన బంధువర్గానికి రక్షకుడు. ఒకప్పుడు బాణం ఎక్కుపెట్టి సముద్రాన్నే ఎండించినవాడు. సత్యవాది, దయాభరణుడు. పాపాల్ని మట్టుపెట్టేవాడు. సృష్టికారకుడు దుష్టసంహారకుడు. ధర్మబద్ధంగా రాజ్యమేలినవాడు. రాక్షసవధ ఆయనకొక క్రీడ.

**విశే :** తరళవృత్తానికి పాదపాదంలో – నభరసజజగ – అనే గణాలున్నాయి. ప్రతిపాదంలో 12వ అక్షరంతో యతిమైత్రి. ప్రాసనియమం గలది.

**మాలిని :**

**దివిజగణవరేణ్యా! దీపితానంతపుణ్యా!**
**ప్రవిమల గుణజాలా! భక్తలోకానుపాలా!**
**భవ తిమిర దినేశా! భానుకోటి ప్రకాశా!**
**కువలయ హితకారీ! ఘోరదైత్య ప్రహారీ!** **1054**

**ప్రతి :** దివిజగణ= దేవతాసమూహంలో; వరేణ్యా!= శ్రేష్ఠుడా!; దీపిత= వెల్గుతున్న; అనంత= విస్తారమైన; పుణ్యా!= పుణ్యంగలవాడా; ప్రవిమల= మలినమేమీలేని; గుణజాలా!= మంచిగుణాల సమూహం గలవాడా; భక్తలోక= భక్తబృందాన్ని; అనుపాలా!= పాలించేవాడా; భవ= సంసారమనే; తిమిర= చీకటికి; దిన+ఈశా!= సూర్యునివంటి వాడా; భానుకోటి= కోటిసూర్యులవంటి; ప్రకాశా= వెలుగు కలవాడా; కువలయ= భూమండలానికి; హితకారీ= మేలు చేయువాడా; ఘోర= భయంకరులైన; దైత్య= రక్షసుల్ని; ప్రహారీ= మట్టుపెట్టువాడా!

**తా :** ఆ రామచంద్రుడు దేవతల్ని రక్షిస్తాడు. ఆయన వెలుగుతున్న నిరవధికమైన పుణ్యం. ఆయన గుణగణాలు మచ్చ లేనవి. భక్తజనపాలకుడు ఆయన. సంసారమనే చీకటికి సూర్యుని వంటివాడు. కోటిసూర్యతేజో విలసితుడు. లోకహితం చేయగలవాడు. రాక్షసుల్ని హతమార్చినవాడు.

**విశే :** న, న, మ, య, య అనే గణాలున్నాయి. ప్రతిపాదంలో 9వ అక్షరంతో యతిమైత్రి గలదు. ప్రాసనియమంగల యీ పద్యం 'మాలిని' అనే పేరుగలది.

**గద్యము : ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర కేసనమంత్రి పుత్త్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతం బయిన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందు విదురనీతియు, విదురుని తీర్థాగమనంబును, నుద్ధవ సందర్శనంబును, గౌరవయాదవ కృష్ణాది నిర్యాణంబును, గంగాద్వారంబున విదురుండు మైత్రేయునిం గనుటయు, విదురమైత్రేయ సంవాదంబును, జగదుత్పత్తి లక్షణంబును, మహదాదుల సంభవ ప్రకారంబును, మహదాదులు నారాయణు నభినందించుటయు, విరాడ్విగ్రహ ప్రకారంబును, శ్రీ మహాభాగవత భక్తి కారణంబగు పద్మ సంభవు జన్మప్రకారంబును, బ్రహ్మతపంబును, బరమేష్ఠికిఁ బుండరీకాక్షుండు బ్రత్యక్షం బగుటయు, బ్రహ్మకృతం బయిన విష్ణు స్తోత్రంబును, గమలసంభవుని మానససర్గంబును, బరమాణువుల పుట్టువును, భూర్భువస్సువరాది లోకవిస్తారంబును, గాల దివస మాస వత్సరాది నిర్ణయంబును, నాయుః పరిమాణంబును, జతుర్యుగ పరిమాణంబును, బద్మసంభవు సృష్టిభేదనంబును, సనకాదుల జన్మంబును, స్వాయంభువమనువు జన్మంబును, శ్రీహరి వరాహావతారంబును, భూమ్యుద్ధరణంబును, సూకరాకారుండైన హరిని విధాత స్తుతియించుటయు, దితి కశ్యప సంవాదంబును, గశ్యపుండు రుద్రునిం బ్రశంసించుటయు, గశ్యపువలన దితి గర్భంబు ధరియించుటయుఁ, దత్ప్రభావంబునకు వెఱచి దేవతలు బ్రహ్మసన్నిధికిం జని దితిగర్భప్రకారంబు విన్నవించుటయు, సనకాదులు వైకుంఠంబున కరుగుటయు, నందు జయవిజయుల కలిగి సనకాదులు శపించుటయు, శ్రీహరి దర్శనంబును, బ్రాహ్మణ ప్రశంసయు, సనకాదులు హరిని**

**నుతించుటయు, హిరణ్యకశిపు హిరణ్యాక్షుల జన్మప్రకారంబును, హిరణ్యాక్షుని దిగ్విజయంబును, సవన వరాహ హిరణ్యాక్షుల యుద్ధంబును, బ్రహ్మస్తవంబును, హిరణ్యాక్ష వధయు, నమర గణంబులు శ్రీహరి నభినందించుటయు, హరి వరాహావతార విసర్జనంబు సేయుటయును, దేవతిర్యఙ్మనుష్యాదుల సంభవంబును, గర్దమ మహాముని తపంబునకు సంతసించి శ్రీహరి ప్రత్యక్షం బగుటయుఁ, గర్దముండు స్వాయంభువ మనుపుత్త్రియైన దేవహూతిం బరిణయం బగుటయు, దేవహూతి పరిచర్యలకు సంతసిల్లి కర్దముండు నిజయోగ కల్పితంబగు విమానంబునందు నిలిచి సహస్రదాసీ పరివృతయైన దేవహూతింగూడి భారతాది వర్షంబులు గలయం గ్రుమ్మరుటయు, దేవహూతి కర్దమునివలన గన్యకానవకంబును గపిలునిం గనుటయుఁ, దత్కన్యకా వివాహంబులును, కర్దముని తపోయాత్రయు, కపిల దేవహూతి సంవాదంబును, శబ్దాది పంచతన్మాత్రల జన్మప్రకారంబును, బ్రహ్మాండోత్పత్తియు, విరాట్పురుష కర్మేంద్రియ పరమాత్మ ప్రకారంబును, బ్రకృతి పురుష వివేకంబును, నారాయణుని సర్వాంగ స్తోత్రంబును, సాంఖ్యయోగంబును, భక్తియోగంబును, జీవునకైన గర్భసంభవ ప్రకారంబును, జంద్రసూర్య మార్గంబును, బితృమార్గంబును, దేవహూతి నిర్యాణంబును, గపిల మహాముని దపంబునకుం జనుటయు నను కథలు గల తృతీయస్కంధము. 1055**

**ప్రతి :** ఇది, శ్రీ పరమ+ఈశ్వర= శ్రీ పరమాత్మునియొక్క; కరుణా= దయచే; కలిత= కలిగిన; కవితావిచిత్ర= కవితచే విచిత్రుడైన; కేసనమంత్రిపుత్ర= కేసనామాత్యుని కుమారుడగు; సహజ పాండిత్య= సహజసిద్ధమైన వైదుష్యంగల; పోతన+ అమాత్య= పోతనామాత్యునిచేత; ప్రణీతంబు+అయిన= రచింపబడిన; శ్రీమహాభాగవతంబు+అను= మహాభాగవతమనే; మహాపురాణంబున+అందున్= గొప్పపురాణంలో; విదురనీతి= విదురునిచే చెప్పబడిన నియమాలు; విదురుని= విదురుని; తీర్థ+అభిగమనంబునున్= తీర్థయాత్ర; ఉద్ధవ సందర్శనంబును= ఉద్ధవుని చూచుట; కౌరవయాదవ కృష్ణ+ఆది నిర్యాణంబును= కౌరవుల; పాండవుల శ్రీకృష్ణాదులమరణం; గంగాద్వారంబునన్= గంగ పుట్టినచోట; విదురుండు; మైత్రేయునిన్+కనుటయున్= మైత్రేయమునిని చూచుట; విదురమైత్రేయ సంవాదంబును= విదుర మైత్రేయుల సంభాషణము; జగత్= లోకాల; ఉత్పత్తి లక్షణంబును= పుట్టుకకు సంబంధించిన వైఖరులు; మహత్+ఆదుల= మహత్తు మొదలైనవాటి; సంభవ ప్రకారంబును= ఆవిర్భావ విధానం; మహత్+ఆదులు= మహత్తుమొదలైనవి; నారాయణున్= శ్రీహరిని; అభినందించుటయున్= కొనియాడుటయు; విరాట్ విగ్రహప్రకారంబున్= విరాట్‌రూపం తీరుతెన్నులు; శ్రీమహాభాగవతభక్తి= మహాభాగవతుల భక్తికి; కారణంబు+అగు= హేతువైన; పద్మసంభవు= బ్రహ్మయొక్క; జన్మప్రకారంబును= జన్మించినతీరు; బ్రహ్మతపంబును= బ్రహ్మచేసిన దీక్ష; పరమేష్ఠికిన్= బ్రహ్మకు; పుండరీక+అక్షుండు= పద్మనేత్రుడైన శ్రీహరి; ప్రత్యక్షంబు+అగుటయున్= సాక్షాత్కరించుట; బ్రహ్మకృతంబు+అయిన= బ్రహ్మచే చేయబడినట్టి; విష్ణుస్తోత్రంబును= శ్రీహరిస్తుతి; కమలసంభవుని= బ్రహ్మదైన; మానససర్గంబును= మానససృష్టి; పరమ+అణువుల= సూక్ష్మశక్తుల; పుట్టువును; భూః= ప్రాణం; భువః= అపానం; సువః= వ్యానం; ఆది= మొదలైన ప్రాణాలచే; లోకవిస్తారంబును= ప్రపంచవ్యాప్తి; కాల, దివస, మాస, వత్సర= కాలసంబంధమైన; దినాలు, నెలలు, సంవత్సరాలు; ఆది= మొదలైన; నిర్ణయంబునున్= విభాగం; ఆయుః= ఆయుస్సుయొక్క; పరిమాణంబును= కొలత; చతుస్+యుగ= కృతత్రేతాద్వాపర కలియుగాల; పరిమాణంబును= నిడివియు; పద్మసంభవు= బ్రహ్మయొక్క; సృష్టిభేదనంబును= సృష్టివైవిధ్యం; సనక+ఆదుల= సనకసనందన సనత్కుమార సనత్సుజాతులనే బ్రహ్మమానసపుత్రులయొక్క; జన్మంబును= పుట్టుకయు; స్వాయంభువమనువు= స్వాయంభువమనువుయొక్క; జన్మంబును=

పుట్టుక; శ్రీహరి వరాహ+అవతారంబును= విష్ణువు వరాహరూపమెత్తుట; భూమి+ఉద్ధరణంబును= భూమిని రక్షించుట; సూకర+ఆకారుండు+ఐన= వరాహరూపమెత్తిన; హరిని= విష్ణువును; విధాత= బ్రహ్మ; స్తుతియించుటయున్= స్తోత్రం చేయటం; దితికశ్యప= దితి కశ్యపుల; సంవాదంబును= సంభాషణ; కశ్యపుఁడు= కశ్యపప్రజాపతి; రుద్రునిన్= పరమేశ్వరుని; ప్రశంసించుటయున్= పొగడుట; కశ్యపువలనన్= కశ్యపునివల్ల; దితి, గర్భంబున్+ధరించుటయున్= గర్భం తాల్చుట; తద్+ప్రభావంబునకున్= ఆ గర్భశక్తికి; వెఱచి= భయపడి; దేవతలు, బ్రహ్మసన్నిధికిన్= బ్రహ్మచెంతకు; చని= పోయి; దితి గర్భప్రకారంబున్= దితి గర్భవిషయాన్ని; విన్నవించుటయున్= నివేదించుట; సనక+ఆదులు= సనకుడు మొదలైన నల్గురు; వైకుంఠమునకున్= వైకుంఠానికి; అరుగుటయున్= వెళ్ళుట; అందున్= ఆ వైకుంఠంలో; జయవిజయులకున్= ఈ పేరుగల ద్వారపాలకులపై; అలిగి= కోపగించి; సనకాదులు= సనకాది మహర్షులు; శపించుటయున్= శాపమిచ్చుట; శ్రీహరిదర్శనంబును= విష్ణుని చూచుట; బ్రాహ్మణప్రశంసయు= బ్రాహ్మణులను స్తుతించుట; సనక+ఆదులు= సనకాదిమునులు; హరిని= విష్ణువును; నుతించుటయున్= పొగడుట; హిరణ్యకశిపు హిరణ్యాక్షుల= ఈ ఇర్వురి; జన్మప్రకారంబును= పుట్టుకయొక్క విధము; హిరణ్యాక్షుని; దిక్+విజయంబును= దిక్కుల్ని జయించుట; సవనవరాహ= యజ్ఞవరాహస్వామి; హిరణ్యాక్షుల= హిరణ్యాక్షులయొక్క; యుద్ధంబును= సమరమూ; బ్రహ్మస్తవంబును= బ్రహ్మస్తోత్రం; హిరణ్యాక్షవధయు= హిరణ్యాక్షునిచావు; అమరగణంబులు= దేవతా సమూహాలు; శ్రీహరిని= విష్ణుమూర్తిని; అభినందించుటయున్= పొగడుట; హరి= విష్ణువు; వరాహ+అవతారంబు= వరాహావతారాన్ని; విసర్జనంబు+చేయుటయున్= వదలివేయుట; దేవ= దేవతలు; తిర్యక్= పశుపక్ష్యాదులు; మనుష్య= మానవులు; ఆది= మొదలైనవారి; సంభవంబును= పుట్టుకయు; కర్దమమహాముని= కర్దముడనే మహాముని; తపంబునకున్= తపస్సుకు; సంతసించి= మెచ్చి; శ్రీహరి; ప్రత్యక్షంబు+అగుటయున్= సాక్షాత్కరించుట; కర్దముండు= కర్దమముని; స్వాయంభువమను= స్వాయంభువుడు అనే మనువుయొక్క; పుత్రిక+ఐన= బిడ్డ అయిన; దేవహూతిన్= దేవహూతి అనే కన్యను; పరిణయంబు+అగుటయున్= పెళ్ళాడుట; దేవహూతి పరిచర్యలకున్= దేవహూతి చేసిన సేవలకు; సంతసిల్లి= మెచ్చుకొని; కర్దముండు; నిజయోగకల్పితంబు+అగు= తన యోగబలంచే నిర్మించినట్టి; విమానంబునందు నిలిచి= విమానంలో నిలబడి; సహస్రదాసీ= వేయిమంది సేవికలతో; పరివృత+ఐన= కూడినట్టి; దేవహూతిన్= దేవహూతిని; కూడి= కలిసి; భారత+ఆదివర్షంబులు= భారతదేశం మొదలుపెక్కుదేశాలు; కలయన్+తిరుగుటయున్= నిండుగా సంచారం చేయుట; దేవహూతి, కర్దమునివలనన్= భర్తవల్ల; కన్యకానవకంబును= తొమ్మిదిమంది కూతుళ్ళను; కపిలునిన్= కపిలుణ్ణి; కనుటయున్= ప్రసవించుట; తద్+కన్యకావివాహంబులును= ఆ తొమ్మండుగురి పెళ్ళిళ్ళు; కర్దమతపస్+యాత్రయున్= తర్వాత కర్దముడు తపస్సుకై ప్రయాణమగుట; కపిలదేవహూతి సంవాదంబును= కపిలునికి, దేవహూతికి మధ్యనడచిన సంభాషణమూ; శబ్ద+ఆది= శబ్దస్పర్శ రూపరసగంధాదులగు; పంచతద్+మాత్రల= అయిదు తన్మాత్రలయొక్క; జన్మప్రకారంబును= పుట్టుక; బ్రహ్మాండ+ఉత్పత్తియున్= బ్రహ్మాండముయొక్క పుట్టుక; విరాట్‌పురుష= విరాట్పురుషునియొక్క; కర్మ+ఇంద్రియ= కరచరణాది ఇంద్రియాలతో; పరమాత్మప్రకారంబును= భగవంతుని తీరుతెన్నులు; ప్రకృతి పురుషవివేకంబును= ప్రకృతి మరియు పురుషుని విజ్ఞానం; నారాయణుని సర్వాంగస్తోత్రంబును= శ్రీహరి ప్రత్యంగస్తుతి; సాంఖ్యయోగంబును= ఆత్మానాత్మవిచారయోగం; భక్తియోగంబును= భక్తియోగం; జీవునకు+ఐన= ప్రాణికి సంబంధించి; గర్భసంభవ= కడుపులో జరిగిన; ప్రకారంబును= పరిస్థితి; చంద్రసూర్య మార్గంబునన్= చంద్రమార్గం, సూర్యమార్గం; పితృమార్గంబునన్= మర్త్యమార్గం; దేవహూతి నిర్యాణంబును= దేవహూతి అవసానదశ (మరణించుట); కపిలమహాముని= కపిలాచార్యుడు; తపంబునకున్=

దీక్షకై; చనుటయున్= వెళ్ళుట; అను కథలుగల= అనే ఉపాఖ్యానములు కల్గినట్టి; తృతీయస్కంధము= మూడవ స్కంధం; సంపూర్ణం= సమాప్తి.

**తా :** పోతన కేసనమంత్రి కుమారుడు. అతనికి 'సహజపాండిత్యుడు' అనేది బిరుదం. ఆయనకు కవిత దైవప్రసాదం. ఆయన రచించిన గ్రంథం. భాగవతమనే పేరుగల ఒక మహాపురాణం. ఈ గ్రంథంలోని కథాంశాలు.

విదురనీతి, విదురుని తీర్థయాత్ర, ఉద్ధవదర్శనం, కౌరవులు, పాండవులు, శ్రీకృష్ణుడు చనిపోవుట, విదురుడు మైత్రేయుని చూచుట. వారిర్వురి సంభాషణ, జగత్తు ఆవిర్భవించుట, మహత్తు, అహంకారాల ఆవిర్భావం, మహదాదులు శ్రీహరిని పొగడుట, విరాట్స్వరూపం, భాగవతులు భక్తిహేతువైన శ్రీహరి పుట్టుక, బ్రహ్మదీక్ష, బ్రహ్మకు శ్రీహరి ప్రత్యక్షమగుట, బ్రహ్మస్తోత్రం, బ్రహ్మదేవుని సృష్టి, పరమాణువుల ఆవిర్భావం, ప్రాణాపానవ్యానాది పంచప్రాణాల విస్తృతి; కాలనిర్ణయం, గాలి ఆకృతి, నాల్గుయుగాల విభజన, బ్రహ్మసృష్టి విధానం, సనకాదులపుట్టుక, స్వాయంభువమనువు జన్మించుట, శ్రీహరి వరాహరూపమెత్తుట, బ్రహ్మ చేసిన వరాహస్తుతి, దితికశ్యపుల సంభాషణ, కశ్యపుని శివస్తుతి, దితి గర్భధారణ, దేవతలు బ్రహ్మచెంతకేగుట, సనకాదులు వైకుంఠమేగుట, జయవిజయులకు కల్గినశాపం, శ్రీహరిసందర్శనం, బ్రాహ్మణ ప్రశంస, సనకాదుల హరిస్తుతి, హిరణ్యకశిపు హిరణ్యాక్షులజన్మ, హిరణ్యాక్షుని దిగ్విజయం; యజ్ఞవరాహహిరణ్యాక్షుల యుద్ధం; బ్రహ్మ చేసిన స్తోత్రం, హిరణ్యాక్షవధ, దేవతలు హరినిస్తుతించుట. హరి వరాహావతారాన్ని విరమించుట, దేవతల, పశుపక్ష్యాదుల మానవుల పుట్టుక, కర్దముని తపస్సు, శ్రీహరి ప్రత్యక్షమగుట, కర్దముడు దేవహూతిని పెళ్ళాడుట, దేవహూతి పరిచర్య, కర్దముడు విమానం సృష్టించుట, దంపతుల విహారయాత్ర, తొమ్మిదిమంది కన్యకలు, కపిలుడు దేవహూతికి కల్గుట, కన్యకలపెళ్ళిళ్ళు, కర్దముని తపోయాత్ర, కపిల దేవహూతుల సంవాదం. శబ్దాదుల ప్రకారం, ప్రకృతి పురుషుల అనుభవజ్ఞానం, నారాయణుని అవయవవర్ణన, చంద్రసూర్యపితృయాణాలస్వరూపం, దేవహూతి సాయుజ్యప్రాప్తి, కపిలుడు తపస్సునకేగుట అనే కథలతో ఈ మూడవస్కంధం పూర్తియైంది.

*:: శ్రీకృష్ణార్పణమస్తు ::*

# పద్యగద్యసూచి

## తృతీయస్కంధము

